# విషయానుక్రమణిక

## 8. అష్టమస్కంధము



## 9. నవమస్కంధము



## 10. దశమస్కంధము - పూర్వభాగము



## దశమ స్కంధము - ఉత్తర భాగము

## 11. ఏకాదశస్కంధము



## 12. ద్వాదశ స్కంధము





# శ్రీమద్భాగవత పరిచయము

శ్రీమద్భాగవతము వేదాంతసారము. ఇందు అనుష్ఠాన వేదాంతము కూడ మిళితమైయున్నది. వేదాంతము వృక్షమైతే భాగవతము దాని యొక్క మధుర ఫలము. ప్రస్థానత్రయము (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత) నందుండే సారము ఈ గ్రంథములో పొందుపరచబడినప్పటికీ, భక్తి, ప్రేమ, తత్త్వాల ద్వారా సగుణోపాసన చేయడానికి వీలుగా, జన సామాన్యానికి సులభగ్రాహ్య మయేటట్లు రచింపబడినది.

శ్రీమద్భాగవతము పురాణాలకు శిరోభూషణము వంటిది. భక్తి జ్ఞాన వైరాగ్యాలు తగు పాళ్లలో మిశ్రితమైన అమృతమిది. సామాన్య భక్తి పరాభక్తిగా పక్వమైనప్పుడు జ్ఞానాంకుర మవుతుంది. సగుణ రూపములో భగవానుని ప్రేమించడం ద్వారా సర్వ సృష్టినీ ప్రేమించిన వాడైన భక్తుడు జ్ఞానియౌతాడు. భగవద్భక్తిని చవిచూచిన భక్తుడు ఇంక దేనియందూ ఆసక్తి చూపలేడు. అతనిలో భక్తి వృద్ధి చెందుతున్న కొద్దీ, విషయానురక్తి, కార్యాసక్తి క్షీణిస్తూ వైరాగ్యము పెరుగుతుంటుంది. భక్తుడు జ్ఞానమయుడౌతాడు.

**సదాసేవ్యా సదాసేవ్యా శ్రీమద్భాగవతా కథా । యస్యాః శ్రవణ మాత్రేణ హరిః చిత్తం సమాశ్రయేత్ ॥**

శ్రీమద్భాగవత కథను సదా సేవిస్తుండాలి. సదాస్మరిస్తుండాలి. దీనిని శ్రవణం చేసినంతనే, శ్రీహరి శ్రోత హృదయంలో విరాజిల్లుతాడు. దేవతలకు సైతము లభ్యము కానిది ఈ భాగవతామృతము.

భాగవత పఠనము (శ్రవణము) యొక్క ప్రత్యక్ష ఫలము, భగవంతుని యందు భక్తి అంకురించడము, ఇది వరకే ఉన్న భక్తి భావము ఇనుమడించి, స్థిరపడడము, పిదప భక్తి పరిపక్వమై జ్ఞానంగా పరిణమించి, మోక్షరూపమైన అంతిమ ఫలము లభించడం, కర్మ, భక్తి, జ్ఞాన మార్గాల గమ్యము ఒక్కటే అయినా, అధికార తారతమ్యాన్ని బట్టి, ఏదో ఒక మార్గమే మొదట సుగమము అవుతుంది. భక్తి మార్గావలంబులకు విద్యాపాండిత్యాల అవసరంలేదు. లింగభేదము లేదు. పశుపక్ష్యాది విచక్షణలేదు. ప్రేమించగలిగే సున్నితమైన కరుణార్ద్ర హృదయముంటే చాలు.

మానవుడు సృష్టిలోని జీవరాసులలో అత్యున్నతస్థానమందు ఉండటానికి కారణము అతనికి ఇవ్వబడిన యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము, బుద్ధికుశలతలే. ఇంద్రియ భోగాల క్షణికత్వము, సంసార వలయం యొక్క దుర్భరత్వములగురించి బాగుగా యోచించిన వాడై మానవుడు మోక్షమార్గాన్ని అన్వేషిస్తాడు. దీనినే ముముక్షుత్వం అంటారు. ముముక్షుత్వం ఉదయించగానే, నన్ను ఉద్ధరించు ప్రభూ! అని పరమేశ్వరుని వేడుకొంటాడు. దయామయుడైన ఆ పరమేశ్వరుడు ఉత్తమ భక్తులను అనేక విధాలుగా ఆదుకొని, అదను రాగానే ముక్తి మార్గాన్ని చూపుతాడు, మోక్షాన్ని అనుగ్రహిస్తాడు.

"కృష్ణస్తు భగవాన్ స్వయం" అనే మూల సూత్రముమీద, శ్రీమద్భాగవత రచన జరిగినది. శ్రీకృష్ణ చరిత్రను ప్రధానముగా తీసుకొని, సృష్టి ఆదినుండి శ్రీకృష్ణావతారము వరకు సంభవించిన, భగవానుని పూర్వ- అవతారగాథలు కూడా సూక్ష్మముగా వివరింపబడినవి.

అవ్యక్త పరమాత్మ, వ్యక్త స్వరూపుడై విశ్వవిరాట్ పురుషునిగా నవతరించి, బ్రహ్మదేవుని ఉద్భవింపజేసి, కొనసాగించిన సృష్టిక్రమము, అంతరిక్షద్యులోకాది చతుర్దశ భువన నిర్మాణము, సప్త సముద్ర వర్ష విభజన, దేవ మానవ దానవ

జంతు పశుపక్షి వృక్షాదులైన జీవ జాతుల సృష్టి, మనువులు, రాజులు, వారి వంశాలు కీర్తించబడినవి. దుష్టశిక్షణ, శిష్ట రక్షణాది కార్యాలను నిర్వహించడానికి, భగవానుడు ధరించిన అవతార విశేషాలూ భగవానుని అనుగ్రహానికి పాత్రులైన సాధు సజ్జన భక్తుల గాథలూ, భాగవతములో చెప్పబడినవి.

వేదాన్ ఉద్ధరతే, జగన్నివహతే భూగోళముద్బిభ్రతే
దైత్యాన్దారయతే, బలిం ఛలయతే, క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే, కారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే, దశాకృతికృతే, కృష్ణాయ తుభ్యం నమః

వేదాలను ఉద్ధరించినవాడు, జగత్తును ధరించినవాడు, భూమండలాన్ని పైకెత్తినవాడు. దైత్యుని చీల్చినవాడు, బలిని అణచినవాడు క్షత్రియులను నశింపజేసిన వాడు. రావణుని జయించిన వాడు. హలము త్రిప్పినవాడు, కరుణను పెంచినవాడు, మ్లేఛ్ఛులను పడగొట్టినవాడు అయిన శ్రీకృష్ణ భగవానునకు నమస్కారములు.

శ్రీకృష్ణుడే శ్రీమద్భాగవతములో నావేశించి, ఆగ్రంథపఠనమాత్రముచేత. శ్రవణమాత్రముచేత కలియుగములో భక్తి ఉదయించి, నిలుచునట్లు అనుగ్రహించినాడు. ఒకనాడు శ్రీకృష్ణభగవానుడు తన ప్రియమైన అనుచరుడైన ఉద్ధవునితో ఇలా చెప్పాడు:

"ఉద్ధవా! నా లీలా గాథలను వింటూ ఉంటే, నీలోని మనోమాలిన్యమంతా ప్రక్షాళితమైపోతుంది. అప్పుడు నీవు నన్ను నీలోనే చూడగలవు. నా భక్తుడు ఎట్టి కోరికలూ లేనివాడై నన్నే ప్రేమిస్తుంటాడు. అట్టి వానికి రసాతలాది లోకాలపై సర్వాధిపత్యము గాని, ఇంద్రపదవిగాని, బ్రహ్మపదవిగాని, అణిమాది సిద్ధులు గాని, మోక్షముగాని, ఇంకేదైనా గాని విలువలేనట్టివే, వాటిని స్వీకరింపడు. నేను తప్ప అతనికి ఇంకేదీ అక్కర్లేదు. అట్టి భక్తుడు నాకు బ్రహ్మరుద్రాదులకంటే, బలరామునికంటే, లక్ష్మీదేవి కంటెను మిక్కిలి ప్రియతముడు." అన్నాడు ఈ వాక్కులనుండి, భక్తునకు భగవంతుడు ఎంతటి స్థానమిచ్చాడో, తెలుస్తుంది.

ఒకనాడు పృథుచక్రవర్తి భగవంతుని ఇలాగ వేడుకొన్నాడు. "ప్రభూ! నాకు మోక్షముకూడా వద్దు. నీ భక్తులు సతతమూ చెప్పుకొనుచుండే నీ యొక్క దివ్యలీలా గాథలను వినడానికి, నాకు ఈ రెండు చెవులూ చాలవు గనుక నాకు వెయ్యి చెవుల వినికిడి శక్తిని ప్రసాదించు" అని ప్రార్థించాడు.

పరీక్షిత్తుతో శ్రీశుకుడు ఇలా చెప్పాడు: "రాజా! ముకుందుడు ఎప్పుడు ఎవరికి ముక్తిని ప్రసాదించాడోయేమోకాని, భక్తిని మాత్రము అనుగ్రహింపడు. భక్తుడే కృషిచేసి సర్వమూ అర్పించుకొని భక్తిని సంపాదించుకోవాలి" అని దీనిని బట్టి ముక్తికంటే భక్తికే ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వబడినట్లు తెలుస్తున్నది.

శ్రీ విష్ణోః శ్రవణే పరీక్షిదభవద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదః స్మరణే, తదంఘ్రి భజనే లక్ష్మీః, పృథుః పూజనే
అక్రూరస్త్వభివందనే, కపిపతిర్దాస్యే, చ సఖ్యేऽర్జునః
సర్వస్వాత్మసమర్పణే బలి రభూత్ కృష్ణాప్తి రేవంవిధా

శ్రీవిష్ణు గాథా శ్రవణముచే పరీక్షిత్తు, కీర్తనచే వ్యాసపుత్రుడైన శుకుడు, స్మరణచే ప్రహ్లాదుడు, పాదసేవచే లక్ష్మీదేవి, పూజలచే పృథు చక్రవర్తి, అభివందనముచే అక్రూరుడు, దాస్యముచే హనుమంతుడు సఖ్యముచే అర్జునుడు సర్వస్వమూ ఆత్మ సమర్పణచేసి బలిచక్రవర్తి, ఈ నవవిధ భక్తులచే కృతార్థులైనారు. శ్రీకృష్ణభక్తి ఇంత గొప్పది.

మానవుని పరిమితమైన భాషా జ్ఞానముతో రచింపబడిన గ్రంథాలకు అతీతమైనవాడు భగవంతుడు. అందుచేతనే ప్రహ్లాదుడు గ్రంథపఠనం విరమించుకొని, భగవానుని పాదపద్మాలనే దృఢముగా పట్టుకొని, ఆయన దివ్య గాథలనే వింటూ, వినిపిస్తూ సంకీర్తనంచేస్తూ, తరించాడు. అదియే పరమానందానుభూతికి సాధనము.

శ్రీమద్భాగవతము పరమాత్మని నుండియే ఉద్భవించినది భగవానుడే బ్రహ్మదేవునితో భాగవత రహస్యాన్ని నాలుగు శ్లోకాల్లో (చతుఃశ్లోకీ భాగవతమును) ఇలాగ చెప్పాడు:

1. **అహమేవాసమేవాఽగ్రే, నాన్యద్యత్ సదసత్పరం ।**
**పశ్చాదహం యదేతచ్చ, యోఽవశిష్యేత సోఽస్మ్య హం ॥**

సృష్టికి పూర్వము నేను ఒక్కడనే ఉంటిని. తరువాతనూ నేనే ఉన్నాను. సకల చరాచర విశ్వాన్ని రచించి వ్యక్త పరచినదీ నేనే, లయము తరువాత మిగిలి యుండు వాడనూ నేనే.

2. **ఋతేఽర్థం యత్ ప్రతీయేత న ప్రతీయేత చాత్మని ।**
**తద్విద్యాత్ ఆత్మనో మాయాం యథాభాసోఽయథాతమః ॥**

నిజానికి లేనట్టిదే అయిననూ, ఆత్మయందు ఏది ప్రతీయమానమూ అప్రతీయమానమూ అవుతుందో (ఉన్నది లేనట్టుగను, లేనిది ఉన్నట్టుగను అనిపించడం, ఈ సృష్టి అంతానానుండియే ఉద్భవించునట్లు చూపడం) అది నా మాయా శక్తియే.

3. **యథా మహాంతి భూతాని, భూతేషూచ్చావచేష్వను ।**
**ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహం ॥**

సృష్టిలోని సకల వస్తు ప్రపంచములోనూ, పంచమహాభూతాలు ప్రవేశించి ఇమిడియున్నను, అవి కనిపించవు. అలాగే నేను కూడ సర్వ భూతాలయందూ ఆత్మ రూపములో ప్రవేశించి, సర్వగతుడనై యున్ననూ, కనిపించకుండా ఉంటాను.

4. **ఏతావదేవ జిజ్ఞాస్యం, తత్త్వ జిజ్ఞాసు నాత్మనః ।**
**అన్వయ వ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా ॥**

సర్వత్రా, సర్వదా, ఏది బోధితమైయుండునో ("ఎరుక" యందు ఉండునో) అట్టి దానిని అన్వయ వ్యతిరేక పద్ధతుల ద్వారా ఆత్మయని గ్రహించుము. (పరమ సత్యరూపమైన నాయొక్క ఈ ఆత్మతత్త్వము, అనాదిగా సర్వత్రా వ్యాపించియున్నది. సర్వంఖల్విదం బ్రహ్మ అనే సత్యాన్ని సువిచారము ద్వారా తెలుసుకొని అనుభూతి చెందాలి.)

ఈ భాగవతతత్త్వాన్ని బ్రహ్మ నారదునికి చెప్పాడు. నారదుడు వ్యాస మహర్షికి చెప్పాడు. వ్యాసుడు దానిని గ్రంథముగ రచించి, శుకునకు చెప్పాడు. శుక మహర్షి శాపగ్రస్తుడైన పాండవ పౌత్రుడు (అభిమన్యుపుత్రుడు) అయిన పరీక్షిత్తునకు సంపూర్ణ భాగవతాన్ని ఏడు దినాల్లో చెప్పగా పరీక్షిత్తు జనన మరణ సంసార వలయం నుండి ముక్తుడైనాడు. ఆదిశేషుడు ఈ భాగవతాన్ని పాతాళ లోకములో వ్యాపింపజేశాడు. దీనిని, బృహస్పతి స్వర్గలోకములోనూ, పరాశరుడు భూలోకములోనూ, సనక సనందాదులు స్వర్గాతీతలోకాల్లోనూ వ్యాపింప జేశారు.

శ్లో॥ నిగమ కల్పతరోర్గళితం ఫలం శుక ముఖాదమృతద్రవ సంయుతం ।
పిబత భాగవతం రసమాలయుం ముహురహో రసికా భువి భావుకాః ॥

వేద కల్పవృక్ష విగళితమై శుక ముఖసుధా ద్రవమున మొనసియున్న ।
భాగవతపురాణఫలరసాస్వాదనపదవి గనుడు రసికభావవిదులు ॥

శ్రీమద్భాగవతము వేదమనే కల్పవృక్షమునుండి ఆవిర్భవించినది. ఇది శుకయోగీంద్రుని ముఖమునుండి ద్రవించిన అమృత ఫలరసము. రసమయమైన ఆ భాగవతాన్ని రసిక భావుకులు ఆస్వాదించి తరింతురు గాక!

హరిః ఓం తత్ సత్

## శ్రీమద్భాగవత మాహాత్మ్యము

శ్రీకృష్ణ భగవానుడు తన అవతారాన్ని చాలించాలని సంకల్పించి, యాదవ శ్రేష్ఠుడూ, తనకు ప్రియతమ అనుచరుడూ అయిన ఉద్ధవునకు జ్ఞానోపదేశము చేశాడు. అప్పుడు ఉద్ధవుడు ఇలాగ వేడుకొన్నాడు.

"ప్రభూ! నీవులేని ఈ లోకము జీవరాశులన్నిటికీ ఒక శూన్యమండలమే అయిపోతుంది. కలికూడ ప్రవేశించనున్నది గనుక కలిప్రభావానికి తట్టుకొనలేక ప్రజలు పీడితులౌతారు. వారికి తరణోపాయమేమిటో సెలవివ్వవలసినది." అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ తన దివ్యతేజస్సును, శక్తులను, శ్రీమద్భాగవతములో ప్రవేశింపజేసి, "నేను ఈ భాగవతములోనే నివసిస్తుంటాను." అని అభయమిచ్చాడు. అందుచేత శ్రీకృష్ణభగవానుడే భాగవతము, భాగవతమే శ్రీకృష్ణ (శ్రీమన్నారాయణ) భగవానుడని తెలుసుకోవాలి.

శ్రీశుకమహర్షి పరీక్షిత్తునకు భాగవతాన్ని వినిపించనున్నాడని తెలుసుకొని, దేవతలు ఒక కలశంతో అమృతాన్ని తీసుకొనిపోయి, భాగవతాన్ని తమకు ఇచ్చి, పరీక్షిత్తునకు అమృతం ఇమ్మని కోరినారట. శ్రీశుకుడు, దేవతల యొక్క కుత్సిత బుద్ధిని గ్రహించి, అందుకు నిరాకరించాడు.

శ్రీమద్భాగవత శ్రవణం చేసి, పరీక్షిత్తు మోక్షమును పొందడం విని, బ్రహ్మదేవుడు త్రాసులో భాగవతాన్ని ఒక వైపునా, సకల వేదశాస్త్రాలనూ, ఇంకొక వైపునా పెట్టి తూచగా భాగవతమే బరువుగా తూగెనట.

## శ్రీమద్భాగవత సప్తాహ మహిమ

1. శ్రీమద్భాగవత పఠన సప్తాహ సంప్రదాయము మొట్టమొదట శ్రీశుకమహర్షి పరీక్షిత్తు మహారాజునకు వినిపింపజేయడంతో ప్రారంభమైనది. శ్రీకృష్ణ నిర్యాణము తరువాత ముప్పది సంవత్సరాలకు కలియుగ ప్రవేశము జరిగిన పిమ్మట, భాద్రపద శుద్ధనవమి నుండి, పౌర్ణమి వరకు భాగవత సప్తాహము జరుపబడెను. దాని ఫలితముగా పరీక్షిత్తు ముక్తిని పొందాడు.

భాగవతాన్ని వినియుండని మనుజుడు జంతుసమానుడన బడుతాడని శ్రీశుకుడు నారదమహర్షితో చెప్పాడు.

2. తుంగభద్రానదీ తీరాన ఒక గ్రామములో ఆత్మదేవుడు దుంధులి అనే బ్రాహ్మణ దంపతులుండిరి. బిడ్డలు లేని చింతతోనున్న ఆత్మదేవునకు, ఒక సన్యాసి ఒక పండునిచ్చి, దానిని భార్యచే తినిపింపుమని చెప్పాడు. కాని ప్రసవ వేదనకూ, బిడ్డను సాకడంలోనుండే కష్టాలకూ భయపడిన దుంధులి ఆపండును తినకుండా దాచివేసినది. ఇంతలో అప్పుడే గర్భము దాల్చిన ఆమె యొక్క సోదరి అచటికి వచ్చినది. అక్కకు సహాయం చెయ్యదలచుకొని, చెల్లెలు అక్కకు ఒక ఉపాయం చెప్పినది : తనకు పుట్టబోయే బిడ్డ అక్కకు పుట్టినట్టుగా ప్రకటించి, తాను అక్కకు

సహాయంగా నుంటూ, బిడ్డను కొన్ని సంవత్సరాలు సాకడానికీ, దానికి ప్రతిగా, అక్క కొంత ధనసహాయం చెల్లెలి భర్తకు చెయ్యడానికీ, ఇద్దరూ, రహస్యంగా అనుకొన్నారు. ఆ విధంగా నిర్ణయించుకొని, దుంధులి, ఆ పండును ఆవుకు తినిపించి, తాను గర్భిణిగానున్నట్టు నటిస్తూ వచ్చినది. కొన్నాళ్లకు, చెల్లెలికి పుట్టిన కుమారుని, తన పుత్రునిగా ప్రకటించి, చెల్లెలి సహాయంతో సాకుతుండేది. బిడ్డడికి దుంధుకారుడు అనే పేరుపెట్టబడినది. అదే సమయంలో, గోవు, మానవ దేహముతోనూ, గోవుచెవులతోనూ, ఒక మగబిడ్డను కన్నది. దానికి గోకర్ణుడనే పేరు పెట్టబడినది. ఆత్మదేవుడు ఇద్దరి బిడ్డల్నీ, సమాన ప్రేమాదరాలతో పెంచేవాడు. గోకర్ణుడు బుద్ధిమంతుడై సకల విద్యాశాస్త్రాలనూ శ్రద్ధాభక్తులతో అభ్యసించాడు. దుంధుకారుడు మాత్రము, దుష్టుడై, దొంగయై, ఆస్తిని అంతముచేసి, ఇంటినుండి, పారిపోయాడు. భ్రష్టుడైన పుత్రుని గురించి చింతిస్తూ తలిదండ్రులు, తీవ్రమైన శోకముతో కృశించి, మరణించారు. గోకర్ణుడు తీర్థయాత్రలకు వెళ్లిపోతాడు. దుంధుకారుడు పట్టణాల్లో తిరుగుతూ, వేశ్యాలోలుడై, దొంగతనాలు చేస్తూ, పట్టుబడుతూ, తప్పించుకొంటూ, చివరకు వేశ్యలచేతనే చంపింపబడి, ప్రేతయై తిరుగుతుంటాడు.

గోకర్ణుడు తీర్థయాత్రలు ముగించుకొని, తిరిగివచ్చి, ఇంటిలో నిద్రిస్తుండగా, ఒకనాడు భయంకరాకారంతో ఈ ప్రేత ప్రవేశించినది. అతడు మంత్రజలాన్ని ఆప్రేతపై జల్లిన వెంటనే, అది ఇలాగ మాట్లాడసాగినది.

"అన్నయ్యా! నేను దుంధుకారుడను. నా యొక్క ఈ దురవస్థను చూడు. మీరందరూ, ఎన్ని బుద్ధులను నేర్పినా, పెడచెవిని బెట్టి, ఇలాగ తయారయ్యాను. నాకు సద్గతి కలిగే మార్గము చూపుము." అని వేడుకొన్నది. గోకర్ణుడు చాలా విచారించి ఇలా అన్నాడు: "సోదరా! నేను వెళ్లిన పుణ్యస్థలాలన్నిటిలోనూ, నీ గురించి తర్పణలు చేశాను. గయలో శ్రాద్ధం కూడా చేశాను. అయినా, నీవు ఇంకా ఈస్థితిలోనే ఉన్నావంటే చాలా ఆశ్చర్యంగానున్నదే!" అని చెప్పిన గోకర్ణునితో ప్రేత ఇలా అన్నది. "అన్నయ్యా! గయలో శ్రాద్ధంచేసినా, నాకు విముక్తి కలుగలేదంటే, నేనెంతటి పాపాత్ముడనో కదా! ఒక వందసార్లు గయలో శ్రాద్ధాలు చేసినా, నాకు నిష్కృతి కలుగదేమో! నీవే ఏదైనా మార్గము చూచి, నన్ను ఉద్ధరించాలి." అని ప్రార్థించినది. సరే, ఒక నెల తరువాత చెప్తాను అని చెప్పి, గోకర్ణుడు సూర్యజపం ప్రారంభిస్తాడు. సూర్యుడు కరుణించి, భాగవత సప్తాహం చేయుమని సూచిస్తాడు.

గోకర్ణుడు భాగవత సప్తాహ నిర్వహణ ప్రారంభించాడు. చాలా ప్రాంతాలనుండి శ్రోతలు వచ్చారు. ఒక పవిత్ర సద్బ్రాహ్మణుని ముఖ్యశ్రోతగా నియోగించి, గోకర్ణుడు శ్రీమద్భాగవతాన్ని పఠించుతాడు. వాయురూపములోనున్న దుంధుకారుని ప్రేత ఒకచోట స్థిరముగా నుండలేదు గనుక అక్కడే ఉన్న ఒక వెదురు చెట్టులో ప్రవేశించి, స్థిరంగా ఉంటూ, తదేకదీక్షతో వినసాగినది. ఆ వెదురు చెట్టునకు ఏడు కణుపులుగలవు. ఒక్కొక్కరోజు శ్రవణం అవగానే ఒక్కొక్క కణుపూ, పెద్ద శబ్దంతో ప్రేలిపోసాగినది. ఏడవ దినము సంపూర్ణశ్రవణముతో, ఏడవ కణుపుకూడ ప్రేలిపోయి దానినుండి అత్యంత మనోహరరూపముతో, నీలమేఘ శ్యాముని వలె మెరిసిపోతున్న మేని ఛాయతో, పీతాంబరధారియై, కిరీటకుండల వనమాలాధారియై, సాక్షాత్తూ శ్రీకృష్ణునివలె దివ్య తేజస్సుతో, ఒక పురుషుడు బైటకు వచ్చి గోకర్ణుని పాదాలపై బడ్డాడు. తనను ప్రేతస్థితి నుండి రక్షించి, సద్గతిని కలిగించినందుకు దుంధుకారుడు గోకర్ణునకు కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. అంతలో విమాన మొకటి వైకుంఠమునుండి దిగివచ్చినది దానినుండి దేవదూతలు దిగివచ్చి, దుంధుకారుని ఆహ్వానించి, విమానంలో కూర్చొనుమన్నారు. అంతా చూస్తూ సంభ్రమాశ్చర్యాలతో మునిగియున్న గోకర్ణుడు విష్ణుదూతలను ఇలా అడిగాడు. "ఓ దివ్య పురుషులారా! భాగవత పురాణాన్ని ఇందరు శ్రవణం చెయ్యగా, ఈ ఒక్కనినే మీరు తీసుకొనివెళ్తున్నారేమి?" అనగా, వారు ఇలాగ

జవాబిచ్చారు. "ఓ పుణ్యాత్ముడా! నీ సందేహము సమంజసమైనదే. కాని, కేవలం శ్రవణ మాత్రమే చాలదు. ఇందరు వినియున్నా, తనుమనఃప్రాణాలను కేంద్రీకరించి తదేకదీక్షతో, ఎందరు విన్నారు? శ్రవణమే కాకుండా మననం కూడా చెయ్యాలి. శ్రీకృష్ణ లీలాతత్త్వములో కలిసిపోవాలి. ఈ ప్రేత ఆ విధంగా చేసి విముక్తినే కాకుండా వైకుంఠ ప్రాప్తిని కూడా పొందినది. అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ. అని ఆత్మార్పణం చేసుకావాలి. నీవు ఇంకొక భాగవత సప్తాహం అనన్యదీక్షతో చేస్తే, నీవలె శ్రద్ధా భక్తులున్న ఇతర శ్రోతలూ వైకుంఠ ప్రాప్తిని పొందగలరు" అని చెప్పి వైకుంఠ దూతలు దుంధుకారుని తీసుకొని వెళ్లిపోయారు.

గోకర్ణుడు విష్ణు దూతలు చెప్పినట్టుగా దీక్షతో మళ్లీ శ్రీభాగవత సప్తాహాన్ని నిర్వహించాడు. ఈసారి సాక్షాత్తు శ్రీహరియే వచ్చి గోకర్ణుని, శ్రద్ధాభక్తులతో శ్రవణం చేసిన ఇతర శ్రోతలను, శ్రీకృష్ణ స్వరూపులుగా మార్చి, తనతోనే వైకుంఠధామానికి తీసుకొనిపోయాడు.

3. కలిప్రవేశం అయినతరువాత నారదమహర్షి రామేశ్వరం, ప్రయాగ, హరిద్వారము, కురుక్షేత్రము మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించి, ప్రజలు స్వార్థపరులై, దురాశా ద్వేషపూరితులై, దుర్మార్గులై యుండడం చూచి ఖిన్నుడై బృందావనం వెళ్లాడు. అక్కడ ఒక యువతి తన ఇద్దరు కుమారులతో కనిపించినది. ఆ బాలురిద్దరూ, ముసలి వారిలాగా కనిపిస్తూ నిద్రమత్తులోనున్నవారి లాగా ఉండిరి. ఆయువతి పేరు భక్తి. బిడ్డల పేర్లు జ్ఞాని, విరాగి. తన బిడ్డల యొక్క అస్వస్థతను పోగొట్టుము అని ఆమె నారదుని వేడుకొన్నది. నారదుడు. తనకు తెలిసిన వేదమంత్రాలను ఆ పిల్లల చెవులలో ఉచ్చరించి వినిపిస్తాడు. అయినా వారిలో ఎలాంటి మార్పూ కనిపించకపోతే చింతాక్రాంతుడై దిక్కుతోచక, దైవధ్యానం చేస్తాడు. "సత్కర్మ చేయుము." అని, ఆకాశం నుండి వినిపిస్తుంది. ఏమిచేస్తే సత్కర్మ అయి, ఆ బిడ్డల రోగ నివారణ మవుతుందో ఊహించలేక నారదుడు బదరీధామం వెళ్లి, అక్కడ సనక సనందాది ఋషులను కలుసుకొని వారిని అడుగగా వారు ఇలాగ బదులు చెప్పారు "నారదా! మరచిపోయావా! నీవే కదా వ్యాసమహర్షికి సలహా ఇచ్చినది. – భగవల్లీలా విశేష గాథలతో భాగవత రచన చేస్తే, అన్ని అశాంతులూ తొలుగుతాయి అని" అని జ్ఞప్తికి తెచ్చి, భాగవత సప్తాహాన్ని నిర్వహించి, అందరినీ తరింప జేయుమని చెప్పారు.

నారదమహర్షి, సనక సనందాదులతో గూడి, హరి ద్వారంలో గంగానదీతీరానున్న ఆనందవనములో భాగవత సప్తాహాన్ని నిర్వహించడానికి వెళ్లాడు. అన్ని ఏర్పాటులు చేయబడినవి. బిడ్డలను తోడ్కొని, భక్తికాంత, అక్కడకు వచ్చినది. భక్తికాంత అతి పారవశ్యముతో – "శ్రీకృష్ణ గోవింద హరే మురారే, హే నాథ నారాయణ వాసుదేవ" అని పాడుకొంటూ, ప్రదక్షిణలు చేస్తూ నామ సంకీర్తన చేయసాగినది. భాగవత పురాణ శ్రవణ ఫలితంగా, ఆమె పుత్రులైన జ్ఞాని, విరాగి, తమ సహజ రూపాలను పొందారు. శుకమహర్షి కూడ, అక్కడకు వచ్చాడు. ఇందరు భక్తులు, మహర్షులూ సమావేశమైయున్న పుణ్యస్థలికి, శ్రీమన్నారాయణుడే స్వయంగా విచ్చేశాడు. ఆయనతోపాటు, మహా భక్తులైన ఉద్ధవ, ప్రహ్లాద, అర్జున, మహాబలి మొదలైన అనేకులు వచ్చారు. శివ పార్వతులు, బ్రహ్మదేవుడు కూడా విచ్చేశారు. భక్తికాంతకూ, జ్ఞానివిరాగులకూ, దివ్య రూపాలివ్వబడినవి. భక్తుల అంతరంగంలో భక్తి సదాసర్వదా, నివసించేటట్టు వరమివ్వబడినది.

ఇందరి ఆనంద సందోహాలను తిలకించిన శ్రీహరి సంతసించి, వరము కోరుకొనుమనగా, అందరు ఏకగ్రీవంగా ఒకే వరాన్ని కోరుకొన్నారు. "శ్రీహరీ! ఈ భాగవత సప్తాహ పురాణ శ్రవణం చేసిన వారందరి హృదయాల్లోనూ నీవు నివసిస్తుండేటట్టు వరము ప్రసాదించాలి ప్రభూ!" అని ప్రార్థించారు. "తథాస్తు" అన్నాడు శ్రీమన్నారాయణుడు

**హరిః ఓం తత్ సత్**

# శ్రీమద్భాగవతములో పేర్కొనబడిన భగవదవతారాలు

1. ఆది పురుషావతారము
2. సనక సనందాదుల అవతారము
3. నారదావతారము
4. వరాహావతారము
5. నరనారాయణావతారము
6. దత్తాత్రేయావతారము
7. హంసావతారము
8. సుయజ్ఞావతారము
9. కపిలావతారము
10. హయగ్రీవావతారము
11. ఋషభావతారము
12. ధ్రువునకు దర్శనమిచ్చిన అవతారము
13. పృథుచక్రవర్తి అవతారము
14. గజేంద్రుని రక్షించిన అవతారము
15. నారసింహావతారము
16. కూర్మావతారము
17. ధన్వంతరి అవతారము
18. మోహినిఅవతారము
19. మత్స్యావతారము
20. పృశ్నిగర్భావతారము
21. వామనావతారము
22. పరశురామావతారము
23. వేదవ్యాసావతారము
24. శ్రీరామావతారము
25. బలరామావతారము
26. శ్రీకృష్ణావతారము
27. బుద్ధావతారము
28. కల్కి అవతారము

**శ్రీకృష్ణావతారమే పరిపూర్ణావతారము**

# శ్రీమద్భాగవతము - పోతనగారి దైవస్తుతి

1. శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు భక్తపాలన కళా సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండ కుంభకు మహా నందాంగనాడింభకున్ ॥

లోకరక్షణ కర్తవ్యాన్ని వహించిన వాడును, భక్త పరిపాలనమే ఒక కళగా చేపట్టి వినోదించేవాడూ, దానవుల ఉధృతిని అరికట్టేవాడును, లీలావలోకనమాత్రము చేతనే (విలాసంగా త్రిప్పే కళ్లలోనుంచి) బ్రహ్మాండాలను ఉద్భవింపజేసేవాడును, అయిన మహానందుని (నందరాజుయొక్క) ఇల్లాలి ముద్దులబిడ్డడిని (బాల కృష్ణుని), శ్రీకైవల్యపదాన్ని పొందే కాంక్షతో నేను ధ్యానిస్తున్నాను.

2. వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మ మయూఖమాలికిన్
బాలశశాంక మౌళికిఁ గపాలికి మన్మథ గర్వపర్వతో
న్మూలికి నారదాదిముని ముఖ్య మనః సరసీరుహాళికిన్ ॥

చేతిలో త్రిశూలమును, మెడలో కపాలమాలను, శిరస్సున నెలవంకనూ, ధరించి, లీలాతాండవలోలుడైన పరమ శివునకు శిరస్సు వంచి, భక్తి పురస్సరంగా ప్రణామము చేస్తున్నాను. కరుణాసాగరుడైన ఆ హరుడు కందర్పదర్పహరుడు, పర్వత రాజ పుత్రి యొక్క ముఖపద్మాన్ని ప్రఫుల్లం కావించే ప్రభాకరుడు. నారదాది ముని సత్తముల చిత్తకమలములలో విహరించే మధుకరుడు.

3. ఉ॥ ఆతతసేవ సేసెద సమస్త చరాచర భూతసృష్టివి
జ్ఞాతకు భారతీ హృదయ సౌఖ్యవిధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికర నేతకుఁ గల్మష జేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల తాపసలోక శుభప్రదాతకున్ ॥

చరాచర ప్రపంచాన్నంతా చక్కగా సృష్టించువాడూ, సరస్వతీదేవి స్వాంతానికి సంతోషం చేకూర్చెడి వాడూ, వేదాలనన్నింటినీ సమర్థంగా సమకూర్చినవాడూ, నాయకుడై దేవతలను ఆదుకొనేవాడూ కల్మషాన్ని జయించిన వాడూ, ఆశ్రితులను ఆదుకొనేవాడు, తపోధనులకు శుభాలను కలిగించువాడు అయిన, బ్రహ్మదేవుని నేను శ్రద్ధాభక్తులతో సేవిస్తున్నాను.

4. ఉ॥ ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జన నందవేదికిన్
మోదకఖాదికిన్ సమద మూషక సాదికి సుప్రసాదికిన్ ॥

హిమగిరి నందిని యొక్క హృదయానురాగాన్ని పొంది, కలిదోషాలను తొలగించి, ప్రపన్నుల నానందింపజేసి, ఆశ్రితుల విఘ్నలతలను ఛేదించి, మధుర భాషణములు చేసి, అశేషజనులనానందింపజేసి, మోదకాలను ఆరగించి, మూషికమును అధిరోహించి, ముదమును కలిగించే వినాయక దేవునకు మ్రొక్కుతున్నాను.

5. ఉ॥ శారద నీరదేందు ఘనసార పటీర మరాళమల్లికా
హారతుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామరసామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానగ నెన్నడు కల్గు భారతీ ॥

శరన్మేఘ మధ్య చంద్ర బింబమూ, కర్పూరమూ, స్ఫటికమూ, రాజ హంసలు, మల్లికలు, మంచు, నురుగు, వెండికొండ, ఆదిశేషువు, కుంద మందారాలు, పాలసముద్రము, పద్మపుష్పము, ఆకాశగంగల వలె స్వచ్ఛమై శుభాకారముతోనున్న నీయొక్క సుందర మూర్తిని మదిలో నెప్పుడు చూడగలనో తల్లీ, భారతీ!

6. ఉ॥ అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలపె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి బుచ్చినయమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్ ॥

అమ్మలందరికీ అమ్మ, ముగ్గురమ్మలకూ మూలమైన అమ్మ, అందరమ్మలకన్నా అధికురాలైన అమ్మ, అసురుల అమ్మ కడుపునకు చిచ్చుపెట్టిన అమ్మ, తన్ను మనస్సులో నమ్ముకొన్న దేవతల తల్లులయొక్క చిత్తములలో నిల్చియుండే అమ్మ, దయాజలనిధి అయిన మాయమ్మ దుర్గాభవాని నాకు మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలనిచ్చుగాక!

7. మ॥ హరికిన్ పట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంబు పెన్నిక్క చం
దురు తోబుట్టువు భారతీగిరిసుతల్ తోనాడు పూబోడి తా
మరలం దుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములు వాపు తల్లి సిరి యిచ్చున్ నిత్య కల్యాణముల్ ॥

శ్రీహరికి పట్టపు దేవియైన శ్రీదేవి, పుణ్యాల దీవి, సిరిసంపదలపెన్నిధి, చంద్రుని సోదరి, వాణీశర్వాణులతో క్రీడించే పూబోణి, అరవింద మందిర, ముల్లోకాల్లోనూ పూజనీయురాలు, వెలుగు వీక్షణముతో దారిద్ర్యాన్ని తొలగించే తల్లియైన శ్రీమహాలక్ష్మి మాకు నిత్య కల్యాణాలను, అనుగ్రహించుగాక!

తే॥ చేతులారంగ శివునిఁ బూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగాదలపడేని
కలుగనేటికి తల్లులకడుపు చేటు

శ్రీమద్భాగవత రచన గురించి

క॥ పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట నే
పలికిన భవహర మగునట
పలికెద వేఱొండు గాథ పలుకగ నేలా

నేను చెప్పబోయేదేమో భాగవతమట, పరమ పవిత్రమైన ఆ మహాపురాణమును నాచేత చెప్పించే విభుడు సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రప్రభువేనట, నేనీ భాగవత గాథనుచెప్తే సంసార బంధం తొలగిపోతుందట, అందుచేత నే నీభాగవతాన్నే చెప్తాను. ఇంకొక గాథను చెప్పడమెందుకు?

ఆ॥ భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపఱుతు ॥

అయితే, చిత్రమేమిటంటే - శివుడే కానీ, బ్రహ్మదేవుడే కానీ, ఈ భాగవత తత్త్వాన్ని చక్కగా, సమగ్రంగా చెప్పడానికి సమర్థులు కానప్పుడు, ఇక నాలాంటి సామాన్య మానవులకు అది సాధ్యపడ్తుందా? అయినా, పెద్దలైన పండితుల నుండి విన్నంత వరకూ, నా మనోనేత్రానికి గోచరించినంతవరకూ, వాటిలో నాకు తెలియవచ్చినంత వరకూ, వివరించడానికి నేను ప్రయత్నిస్తాను.

ఉ॥ రామ గుణాభిరామ దినరాజకులాంబుధిసోమ తోయద
శ్యామ దశాననప్రబలసైన్య విరామ సురారిగోత్ర సు
త్రామ సుబాహు బాహు బలదర్పతమః పటు తీవ్రధామ ని
ష్కామ కుభృల్లలామ గరకంఠ సతీనుత నామ రాఘవా ॥

రామా, గుణాభిరామా! సూర్యవంశ సాగరానికి చంద్రునివంటివాడా! నీలమేఘశ్యామా! రావణసైన్యాంతకా! రాక్షసులనే పర్వతాలను ఖండించే వజ్రాయుధధారీ! సుబాహువనే రాక్షసునియొక్క బలదర్పాంధకారానికి సూర్యునివంటివాడా! కాంక్షలు లేనివాడా! అవనీపతులలోకానికి సూర్యునివంటివాడా! అవనీపతులలో నగ్రగణ్యా! పార్వతిచే నుతింపబడేవాడా! రాఘవా! నీకు వందనములు.

**కృతి సమర్పణ :**

ఉ॥ హారికి నందగోకుల విహారికిఁ జక్ర సమీర దైత్య సం
హారికి భక్త దుఃఖపరిహారికి గోపనితంబినీ మనో
హారికి దుష్ట సంపదపహారికి ఘోషకుటీ పయోఘృతా
హారికి బాలకగ్రహ మహాసుర దుర్వనితా ప్రహారికిన్ ॥

శ్రీరామచంద్రుని సన్నిధానమును కల్పించుకొని, మనోహరమైన హారాలను ధరించిన వాడూ, నంద గోకుల విహారీ, తృణావర్తాసురుని సంహరించినవాడూ, భక్తుల దుఃఖాన్ని పరిహరించువాడూ, గోపకాంతల మనస్సుల నపహరించిన వాడూ, దుష్టసంపదల నపహరించినవాడూ, నంద ఘోషము (గోకులము)లోని గొల్లల ఇండ్లలో, పాలు, నెయ్యి, అపహరించినవాడు, పిల్లలపాలిటి పెనుభూతమైన పూతన రక్కసిని అంతము చేసిన వాడూ అయినట్టి గోపాల కృష్ణ భగవానునకు, సమర్పితముగా నేను ఆంధ్ర భాషలో రచింపబూనిన శ్రీ మహాభాగవత గ్రంథానికి, ప్రారంభమేమిటంటే-

* * *




भगवान् व्यासका पुराण-प्रवचन
Vyāsa discourses on Purāṇas




भगवान् नारायणके नाभि-कमलसे लोकपितामह ब्रह्माकी उत्पत्ति

Brahmā emanates from the navel-lotus of Nārāyaṇa




देवों तथा ऋषिगणोंको भगवान् वराहके दिव्य दर्शन
**Vision of Lord Varāha to Gods and Ṛṣis**




भगवान् श्रीकृष्णके बालचरित्र ( क )
**Childly pranks of Lord Śrī Kṛṣṇa (A)**




भगवान् श्रीकृष्णके बालचरित्र ( ख )
Childly pranks of Lord Śrī Kṛṣṇa (B)




जरासन्धके कारागारसे राजाओंकी मुक्ति

The release of kings from the prison of Jarāsandha



शाल्व-संग्राम

Battle with Śālva



दन्तवक्त्र और विदूरथका उद्धार

Liberation of Dantavaktra and Vidūratha



माता देवकीके मृत पुत्रोंको वापस लाना

Restoration of dead sons of Devakī



यदुकुलके विनाशका शाप

Curse for the annihilation of Yadu dynasty

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము
# ప్రథమస్కంధము

## శౌనకాది ఋషులకు సూతుడు చెప్పిన భగవదవతారగాథ

పూర్వము నైమిశారణ్యమనబడే విష్ణుక్షేత్రములో శౌనకాది ఋషులందరూ చేరి శ్రీహరిసాయుజ్యార్థులై ఒక వెయ్యి సంవత్సరాలు సత్రయాగాన్ని నిర్వహిస్తుండగా, వేదవ్యాసశిష్యుడైన రోమహర్షణునిపుత్రుడగు సూతుడక్కడకు విచ్చేసెను. అతడు ప్రసిద్ధపౌరాణికుడు. అతనినాహ్వానించి, ఋషులందరూ ఇలాగవేడుకొన్నారు :-

"ఓ మహాత్మా! సూతమహాశయా! వ్యాసమునీంద్రాదులు నీతండ్రికి చెప్పిన పురాణాలన్నీ నీకు మనోగతమయియున్నవని మాకు తెలియును. ఈ కలియుగంలో మానవులు మందబుద్ధులై, అల్పాయుష్కులూ, భోగలాలసులూ, సోమరులూ, రోగగ్రస్తులూ, మందభాగ్యులూ, మోక్షాసక్తి లేనివారూ అవటంచేత విస్తృతంగానున్న వేదశాస్త్రాలను అధ్యయనంచేయడానికిగాని, పఠించి, ఆ ధర్మాలను పాటించడానికి గాని, సత్కర్మలనాచరించడానికిగాని, అసమర్థులైయుంటారు. అట్టివారిని తరింపజేయుటకు దేవకీవసుదేవాత్మజుడైన శ్రీకృష్ణపరమాత్మయొక్క దివ్యగాథాశ్రవణమే సులభసాధ్యమైన ఏకైక మార్గమని వినియున్నాము. ఆ భగవానుడు పుణ్యశ్లోకుడు. (కీర్తించిన వారినీ, విన్నవారినీ పునీతం చేయువాడు.) ఆయన యొక్క పుణ్యగాథలను మాకు వినిపింపజేసి, మా జన్మలను సార్థకము చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

**సీ॥ ఎవ్వనియవతార మెల్లభూతములకు సుఖమును వృద్ధియు సొరిది చేయు**
**నెవ్వని శుభనామమేప్రొద్దునుడువంగ సంసారబంధంబు సమసిపోవు**
**నెవ్వని చరితంబు హృదయంబు జేర్చిన భయమొంది మృత్యువు పరువువెట్టు**
**నెవ్వని పదనదినేపారు జలములు సేవింప నైర్మల్య సిద్ధిగలుగు**
**తే॥ తపసులెవ్వని పాదంబు తగిలి శాంతి తెరగుగాంచిరి వసుదేవదేవకులకు**
**నెవ్వడుదయించె తత్కథలెల్ల వినగ నిచ్చపుట్టెడు నెఱిగింపు మిద్ధచరిత. (43)**

కలియుగములో మానవులనేకమైన ఈతిబాధలకులోనౌతారు.అరిషడ్వర్గములచే పీడింపబడుతారు. శ్రీకృష్ణుని అవతారమంతమయిన తరువాత ధర్మము క్షీణించి, ప్రజలు అజ్ఞానాంధకారములో చిక్కుకొంటారు. దీనికి తరణోపాయము చెప్పవలసిందిగా కోరుతున్నాము." అని వేడుకొన్న శౌనకాది ఋషులతో రోమహర్షణుని సుతుడైన ఉగ్రశ్రవుడు (సూతుడు) మిక్కిలి సంతసించిన వాడై ఇలాగ చెప్పనారంభించాడు. సూతుడు, ప్రప్రథమంగా శ్రీశుకదేవునికీ, నరనారాయణ ఋషులకు, పురుషోత్తముడైన శ్రీకృష్ణునకు, సరస్వతీదేవికి, వ్యాసమునీంద్రునకు, బ్రహ్మదేవునకు నమస్కరించి, ఉపక్రమించాడు. "ఓమునీశ్వరులారా! మానవాళికంతటికీ మంగళకరమైనట్టి మీయొక్క కోరిక చాలా ప్రశంసనీయమైనది. శ్రీకృష్ణుని చరితమును వినాలనే సత్సంకల్పము సర్వ శుభదాయకము. ఆయనను కొలవడమే మానవులకు అత్యుత్కృష్టమైన కర్తవ్యము.ఆయనయందు అనన్యభక్తియే జ్ఞానవైరాగ్యాలను ప్రసాదిస్తుంది. మానవులు, శ్రీహరియొక్క దివ్యలీలా గాథలను వింటూ, ఆయననే ఆరాధిస్తూ, కీర్తిస్తూ, ధ్యానిస్తూ, ఉంటే సంసారబంధాలనుండి విముక్తులు కాగలరు. సర్వహృదయాంతర్యామియైన శ్రీకృష్ణుడు, భక్తులు వింటూ ఉండే తనయొక్కగాథలనే వింటూ ఆనందిస్తుంటాడు. వారుగానంచేస్తుండే తన కీర్తనలను వింటూ తన్మయుడౌతాడు. వారిలోని భక్తిపెరుగుతున్నకొద్దీ

కామక్రోధాదులు క్షీణించి, బుద్ధి, శుద్ధమవుతుంది, భగవత్తత్త్వము ప్రకాశిస్తుంది. అద్వితీయమైన అవ్యక్తపరమాత్మ తన మాయాశక్తిచే బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగను, నానాత్వముతో కూడిన జగత్తుగను, వ్యక్తమవుతాడు, ఆ పరమాత్మను దర్శించడమే మానవుని పరమలక్ష్యము. ఆ పరమాత్మయే సకల చరాచర సృష్టిని, దానియొక్క స్థితిలయాలను, నిర్వహిస్తూ, అనేక రూపాలలో అవతరిస్తూ పరిపాలిస్తుంటాడు. ఈ భగవదవతారగాథలసంకలనమైన భాగవతమును విని, మానవుడు తరించగలడు.

## భగవంతుని అవతారాలు

బ్రహ్మదేవుని నుండి గరికదుబ్బువరకు గల సకలజీవరాసులను పరబ్రహ్మ స్వరూపుడైన పరమేశ్వరుడు సృజించినాడు. ఆ సృష్టిలో, దేవతలు మానవులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు), స్థావరాలు (కదలనివి) అనబడే నాలుగు వర్గాల జీవరాసులున్నవి. వాటిలో స్త్రీపురుష(లింగ) భేదములు, సత్త్వరజస్తమోగుణ స్వభావ భేదములు ఏర్పడినవి. మానవజాతి ప్రవర్తనను క్రమబద్ధం చేయడానికి బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములనబడే ఆశ్రమధర్మాలూ, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అనబడే (వర్ణ) విభజనలు చేయబడినవి. వారి మనుగడకు ధర్మార్థ కామ మోక్షములనబడే నాలుగు పురుషార్థాలు నిర్దేశింపబడినవి. ఆ పురుషార్థాలను సాధించడానికి కావలసిన జ్ఞానాన్ని మానవాళికి అందించడానికి చతుర్ముఖబ్రహ్మ ద్వారా, భగవానుడే వేదాలను వెలువరింపజేశాడు. వేదము ముఖ్యంగా రెండు భాగాలు- మొదటిది దుఃఖనివృత్తిని, సుఖప్రాప్తిని, గురించి చేయవలసిన కర్మలను నిర్దేశిస్తుంది. జీవుడు తానెవరో? తనగమ్యమేమిటో? తాను ఆ సచ్చిదానంద స్వరూపుడైన భగవానుని తెలుసుకొని, ఆయన పరంధామాన్ని చేరడానికి ఏమిచెయ్యాలోవాటిని తెలియజేసే జ్ఞానము వేదముయొక్క రెండవ భాగంలోనున్నది. కాని ఆ జ్ఞానాన్ని నేరుగా పొందటానికి సామాన్యులకు అలవికాదుగనుక భగవానుడే బాదరాయణునిగా అవతరించి, వేద విజ్ఞానాన్ని ఒక్కచోట చేర్చి, విభజించి, విపులీకరించనుద్దేశించాడు. కర్మ కాండతో కూడియున్న పూర్వభాగానికి తన శిష్యుడైన జైమినిచే వ్యాఖ్యానం (పూర్వమీమాంస), వ్రాయించి ఉత్తరభాగానికి, (జ్ఞానభాగానికి) తానే స్వయంగా బ్రహ్మసూత్రాల వ్యాఖ్యానం రచించాడు. పూర్వభాగానికి వివరణగా పంచమ వేదమనబడే మహాభారతాన్నీ, ఉత్తరభాగానికి వివరణగా శ్రీమద్భాగవతాన్నీ రచించి, వాటిలో వేదసారాన్నంతా సులభగ్రాహ్యంగా పొందుపరచాడు.

భగవంతుడు, స్వరాట్ అనగా స్వతంత్రుడు- కర్మాధీనుడు కానివాడు, సర్వజ్ఞుడు, అతడు చతుర్ముఖబ్రహ్మకు వేదజ్ఞానాన్ని ప్రసాదించి, అతని ద్వారా వేదరాశిని ప్రకాశింప జేశాడు.

**యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి,**
**యత్ ప్రయంత్యభిసంవిశంతీతి, తద్విజిజ్ఞాసస్వ తత్ బ్రహ్మ (ఉపనిషత్)**

(ఈ కన్పిస్తున్న వివిధ విచిత్ర భూతములన్నీ దేనినుండి పుట్టుతున్నాయో, ఆ పుట్టినవి దేనిచే జీవిస్తున్నవో, దేనిని చేరుతున్నవో, విడువక దేనితో కలిసి ఉంటున్నవో, అది బ్రహ్మము)

బ్రహ్మము జ్ఞానస్వరూపము. దానికి సమానమైనదిగాని అధికమైనట్టిదిగాని ఇంకేదీలేదు, కనుక అది అద్వితీయము. అన్నిటికంటె అతిశయించి యున్నది బ్రహ్మము. (బృహతి ఇతి బ్రహ్మ). జ్ఞానసంకోచము కలిగియున్న జీవులకు వికాసము కలిగించునది బ్రహ్మము (బృహయతి, ఇతి బ్రహ్మ). ఇది జగత్కారణము, సృష్టికి పూర్వమే ఉండినట్టిది.

సకల చేతనాచేతనములందు వ్యాపించి యున్నట్టి తత్త్వమును ఆత్మ(పరమాత్మ) యందురు. జీవాత్మ కూడ ఒక శరీరమందు వ్యాపించి యుంటుందిగాని, జ్ఞాన సంకోచముచే అంతటా వ్యాపించి యుండదు. పరమాత్మ అపరిమితమైన జ్ఞానశక్తిచే నిత్యమూ అంతటా వ్యాపించియుండునట్టివాడు.

భగవానుడు అంటే జ్ఞానము, వీర్యము, శక్తి, బలము, ఐశ్వర్యము, తేజస్సులను కలిగియుంటూ హేయగుణములు లేనివాడు అని అర్థము. సమస్త కల్యాణగుణములు కలవాడు, దోషములు అంటనివాడు, భగవానుడు.

బ్రహ్మము, పరమాత్మ, భగవంతుడు అనుమూడూ ఒకే తత్త్వాన్ని సూచించినా, సృష్టి స్థితి లయాలను నిర్వహిస్తూ జీవులకు మోక్షప్రదానంచేసేది బ్రహ్మమనీ, జీవులలో ప్రవేశించి నియమించేది పరమాత్మ అనీ, దోషరహితమై కల్యాణ గుణాలు కలిగియున్నది భగవానుడు అనీ వ్యవహారంలోకనబడుతున్నది.

సృష్టించాలనే సంకల్పం కలిగినప్పుడు దానికి అనుగుణమైన సమయంలో, పరమాత్మ రజోగుణ ప్రధానమైన బ్రహ్మదేవుని శరీరమందుండే జీవునితో చేరి జగత్తును సృష్టిస్తాడు. అలాగే ఉపసంహారం చేయదలచుకొన్నప్పుడు తమోగుణ ప్రధానమైన శివునియందుండే జీవునితోచేరి, లయం చేస్తాడు. జగత్తు యొక్క రక్షణ పోషణ కార్యాన్ని సత్త్వగుణ ప్రధానమైన విష్ణు స్వరూపంలో నిర్వహిస్తాడు. జగత్కారణుడైన ఈ మహావిష్ణువును భజించినవారికి జ్ఞానం కలుగుతుంది, సంసారబంధం వీడుతుంది, పరంధామం లభిస్తుంది. సత్త్వగుణము ప్రధానంగాగల మూర్తిని ధ్యానించడం వలన, జ్ఞానము, మోక్షము సిద్ధిస్తాయి. వేదాలలో, ప్రధానంగా వాసుదేవారాధనయే నిర్దేశింపబడినది. వాసుదేవుడే సృష్టికి పూర్వమందున్న పరమాత్మ, భగవానుడు. అతడు సమస్తజీవరాసుల యొక్క సమష్టి దశేంద్రియ మనస్సులతోను, పంచభూతములతోను కూడి, విరాట్ పురుషుడుగా వెలసి, అనిరుద్ధుడనబడి, జలమందు యోగనిద్రలో శయనించి, తన నాభిహ్రదము (సరస్సు) నుండి ఒక పద్మమును ఉద్భవింపజేయగా ఆ పద్మమునుండి బ్రహ్మదేవుడావిర్భవించాడు. అనిరుద్ధ భగవానుడు సహస్ర శిరస్సులతో సహస్ర - అవయవాలతో, దివ్యాభరణాలతో ప్రకాశించువాడు. అతనినుండి సనకసనందాదులైన నలుగురు కుమారులుద్భవించారు. ఆ దివ్యదేహమునుండి, దేవమానవాదిరూపాలు ఆవిర్భవించాయి. ఆదేవదేవుడు క్రమముగా కాలానుగుణంగా వరాహ, నారద, నరనారాయణ, కపిల, దత్తాత్రేయ, ఋషభ, మత్స్య, కూర్మ, నారసింహ, వామన, రామకృష్ణాది అనేక - అవతారాలెత్తి దుష్ట శిక్షణ, శిష్టరక్షణ, ధర్మ సంస్థాపన, భక్తపాలనాది - అనేక కార్యాలు నిర్వహించాడు. మంత్రద్రష్టలైన ఋషులు, వ్యాస వశిష్ఠాది మునులు, దక్షాది ప్రజాపతులు, మనువులు, ఇంద్రాది దేవతలు మొదలగువారందరూ ఆ పరమాత్మయొక్క అంశలచే పుట్టినవారే.

శ్రీకృష్ణావతారము మాత్రము పరిపూర్ణావతారము. శ్రీరామావతారముగూడ పూర్ణావతారమే. కాని ఇతర అవతారాలు ఏదో ఒక కార్యార్థమై సంభవించి, ముగించబడినవి. శ్రీకృష్ణావతారములో జ్ఞానము, బలము, శక్తి, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు మొదలైన భగవంతుని దివ్యమంగళ కల్యాణ గుణములన్నీ ప్రకటింపబడి ప్రకాశించినవి. అందుచేతనే "కృష్ణస్తు భగవాన్ స్వయం" అన్నారు.

ఈ స్థూల జగత్తే కాకుండా మనోబుద్ధి - అహంకారాలతో కూడియున్నసూక్ష్మదేహాలు కూడ పరమేశ్వరుని యొక్క మాయాజనితాలే. ఆయన యొక్క అవతారలీలారహస్యాలు పరిమితమైన మానవమేధాశక్తికీ, తర్కచర్చలకూ అంతుబట్టవు. ఆయన యొక్క పాదపద్మాలయందు శరణు వేడిన వారికే మాయతొలగి, మర్మము తెలుస్తుంది. సర్వవేదసారాన్ని, వ్యాసుడు భాగవతంలో పొందుపరచి, తనయుడైన శుకదేవునికి బోధించాడు. శుకుడు పరీక్షిత్తునకూ, అక్కడ సమావేశమైయున్న ఋషులకూ వినిపించాడు. నేనుకూడ అక్కడనుండటం చేత ఈ పరమపవిత్రమైన భాగవతగాథను శ్రవణం చేసే భాగ్యము నాకు కలిగినది. నాశక్తివంచన లేకుండా నేను విన్న దానిని మీ అందరికీ వినిపిస్తాను." అని సూతుడు శౌనకాది ఋషులకు చెప్పాడు.

## వేదవ్యాసుడు

ఉపరిచర వసువు వలన జన్మించిన సత్యవతి యందు పరాశర మునివలన, (నారాయణ) భగవదంశతో వ్యాసుడు జన్మించెను. అతనిని కృష్ణద్వైపాయనుడని, బాదరాయణుడని కూడ అంటారు.

అతడు సకలవేదదర్శి. ప్రకృతి, పురుష, ఈశ్వర తత్త్వముల వాస్తవ స్వరూపాన్ని దర్శించినవాడు. ఒకనాడతడు సరస్వతీనదీతీరాన ధ్యానావస్థలో నుండగా కలియుగప్రవేశము కానవచ్చెను. కలియుగములోని ప్రజల దుస్థితిని అతడు చూడగలిగెను. కలియుగమందు ప్రజలు అల్పవయస్కులుగాను, అల్పమేధస్కులుగాను, శక్తిహీనులుగను,

ధర్మభ్రష్టులుగను ఉంటారని తెలుసుకొన్నాడు. అలాంటి ప్రజలకు సుబోధకంగానుండాలని వేదాలను నాలుగుగా విభజించి, అనేకమైన పురాణేతిహాసాలను రచించాడు. ఋగ్వేదాన్ని శిష్యుడైన పైలునకు, యజుర్వేదాన్ని వైశంపాయనునకు, సామవేదాన్ని జైమినికి, అధర్వవేదాన్ని సుమంతునకు అప్పజెప్పి, వారు తమ శిష్యులకు నేర్పుతూ, వాటిని భద్రపర్చాలని ఆదేశించాడు. పురాణేతిహాసాలను నాతండ్రి అయిన రోమహర్షణునకు అప్పజెప్పాడు. వేదాలను గ్రహించలేనట్టి వారైన పామరులగురించి, స్త్రీలనుగురించి, పంచమవేదమైన మహాభారతాన్ని సులభగ్రాహ్యంగా రచించాడు. దానిలో భగవద్గీతనుకూడ ఇమిడ్చాడు. బ్రహ్మసూత్రాలు రచించాడు.

ఇన్ని అనన్యసాధ్యమైన అద్భుత రచనలు చేసి మానవాళికి జ్ఞానప్రదానము చేసినా ఏ కారణంగానో తెలియని ఒక వెలితి, అసంతృప్తి, అశాంతి, అతనిని వ్యాకులపరచుచుండు తరుణంలో దేవర్షి నారదుడు విచ్చేశాడు. వ్యాసుడు అమితానందంతో నారదుని ఆహ్వానించి పూజించి, సత్కరించాడు.

## భాగవత రచనకు నారదుడు వ్యాసుని ప్రేరేపించుట

విడివిడిగా విస్తరించియున్న వేద భాగాలను సేకరించి సంకలనం చేసి, నాలుగు వేదాలుగా క్రోడీకరించి గ్రంథస్థంచేసి, వేదవ్యాసుడని ప్రసిద్ధికెక్కిన బాదరాయణుడు నారాయణాంశతో జన్మించిన అవతార పురుషుడు. పంచమ వేదమనబడిన మహాభారత గ్రంథాన్ని రచించి, దానిలో ఉపనిషత్తుల సారమైన భగవద్గీతను పొందుపరచి బ్రహ్మసూత్రగ్రంథమును రచించి ఇంకా ఎన్నో లోకోపకార రచనలు చేసిన వేదవ్యాసునకు ఏదో లోపించియున్నట్లు వ్యాకులపాటు పీడిస్తుండగా, దేవర్షియైన నారద మహర్షి యొక్క ఆగమనం అత్యంత - ఆనందం కలుగజేసినది. తనలో ఆవరించియున్న అసంతుష్టికి వ్యాకులపాటునకు కారణమేమైయుండునని అడిగిన వ్యాసునకు నారదుడు ఈవిధంగా వివరించాడు:

"మహాత్మా! బాదరాయణా! నీవు అనేకమైన గ్రంథాలను రచించి, మానవాళికి ఎనలేని సేవచేసితివి. మహాభారతంవంటి బృహద్గ్రంథం రచించడానికి అన్యులకు సాధ్యంకాదు. కాని ఆ గ్రంథంలో ప్రసంగవశాన భగవానుని గుణాలను పేర్కొన్నావేగాని, ప్రధానంగా భగవద్గుణగణాలను కీర్తించలేదుకదా! భగవత్కథను కీర్తిస్తుంటే భగవానుడు సంతుష్టుడౌతాడు. అప్పుడు కీర్తించేవారి మనస్సుకూడ సంతోషంతో నిండిపోతుంది. భగవత్స్వరూపలీలా, గుణ, వైభవాలను నుతించని గ్రంథమెంతగొప్పది అయినా నిస్సారమైనట్టిదే. అట్టిదానిని పరమహంసలైన భాగవతులు ఆదరించరు. భగవానుని దివ్యలీలలను కీర్తించే గ్రంథంలో చిన్నచిన్న శబ్దాలంకారాది లోపాలున్ననూ, భక్తులు ఆదరిస్తారు. చదివి, వినిపించి, ఇతరులను తరింపజేస్తారు. ప్రజలయందు భక్తిని ఉద్దీపింప జేయలేని కర్మకూడ, దుఃఖహేతువేగాని ఫలప్రదముకాదు. భగవద్భక్తిని కలిగించలేని ధర్మార్థ కామ సాధనలు మోక్ష ప్రదాలుకావు. నీవు దైవాంశసంభూతుడవు, వేదద్రష్టవు, సర్వభూతహిత రతుడవు. సత్త్వగుణ సంపన్నులకు భగవద్దర్శనం కలిగించగల జ్ఞానయుతుడవు. త్రిజగన్మోహనుడైన త్రివిక్రమునిదివ్యలీలలను కీర్తించగల సమర్థుడవు. నీవు భగవద్గుణలీలా వైభవ గాథలను కీర్తించే ప్రబంధాన్ని రచిస్తే నీ మనక్లేశము మాయమవుతుంది. అటువంటి గ్రంథాన్ని చదివిన లోకులు అర్థకామాదులయందున్నఆసక్తిని తగ్గించుకొని భగవద్భక్తిని పెంచుకొన ప్రయత్నిస్తారు. శరీరమున్నంత వరకు కర్మాచరణ చేయడంతప్పదు గనుక ఆ కర్మను భగవదర్పణముగ చేయడం శ్రేయస్కరము. భగవదర్పణముగా కాకుండా స్వప్రయోజనం కొరకు చేయబడిన కర్మవలన సుఖసంతోషములు కలుగవు. అట్టి కర్మలు తెచ్చిపెట్టే ఫలము తాత్కాలికము, అనర్థదాయకము. భగవద్భక్తితో చేయబడిన కర్మలు తప్ప ఇతర కర్మలన్నీ దుఃఖ మిశ్రితములు. భగవత్పాదసేవయందు ఒకసారి రుచిని అనుభవించిన వ్యక్తి ఇకముందు జన్మలలో కూడ దానిని విడువ లేడు. భగవద్భక్తిలేని జపతపో మంత్రతంత్ర ధ్యానాధ్యయన జ్ఞాన- ఇత్యాది సాధనలు ఎన్ని చేసినా జన్మసాఫల్యము కలుగదు. కావున ఓమహర్షీ! సర్వవేదశాస్త్రజ్ఞాననిధివైన నీవు ఆ భగవానుని దివ్యలీలా వైభవ గాథలను కీర్తించడానికి సమర్థుడవు. నీ రచనలను చదివినను శ్రవణం చేసినను మానవులు మోక్షపదమునొందగలరు. నీవును పరమశాంతిని పొందగలవు. భగవత్కథాశ్రవణం వలన ఎటువంటి సద్గతి కలుగ గలదో, నాయొక్క చరిత్రయే నిరూపిస్తుంది విను:

## నారదునిపూర్వజన్మవృత్తాంతము

పూర్వజన్మలో నేను ఒక సద్బ్రాహ్మణుల ఇంటపనిచేసే దాసీకుమారుడను. నా చిన్నవయస్సులో ఆఇంటికి వర్షాకాలంలో చాతుర్మాస్యం గడపడానికి కొందరు సన్న్యాసులు వచ్చారు. వారికి సేవలు చేయవలసినదిగా, గృహయజమాని నన్ను నియోగించాడు. నాసేవా శుశ్రూషలకు సత్ప్రవర్తనకు శ్రద్ధాసక్తులకు సంతసించి, వారు చర్చించుచుండు విషయాలను, శ్రీకృష్ణగాథలను, కీర్తనలను, వినడానికినన్ను అనుమతించేవారు. భాగవతుల సేవా శుశ్రూషలు చేయడంచేత వారు విడిచిపెట్టే అన్నప్రసాదం సేవించడంచేత వారుచేసే సత్సంగ వాక్కులను వినడం చేత నాలో శ్రీకృష్ణ భగవానుని యందు అత్యంత భక్తిప్రపత్తులేర్పడినవి. నిరంతరమూ వాసుదేవచింతనమే కలుగుతుండేది. ఆ అతిథులైన మహనీయులు నాయందు వాత్సల్యముతో రహస్యమైన జ్ఞానాన్ని నాకు ఉపదేశించి వెళ్లారు. వైష్ణవ మాయా ప్రభావమును తెలుసుకొంటిని. ఉపాయమూ, ప్రాప్యమూ ఆభగవానుడే అనీ, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, అధిదైవిక దుఃఖాలు కలుగకుండా ఉండాలంటే, మనంచేసే సకలకర్మలూ భగవదర్పితంగా, భగవత్ప్రీతిగురించే, చేయాలనీ తెలుసుకొన్నాను. ధర్మయుతమైన కర్మాచరణ వలన పాపములు తొలగి, భక్తి ఏర్పడుతుంది. అర్థకామాలగురించి చేయబడిన కర్మలు సంసార బంధమేర్పరుచుతాయి. పరమాత్మయే కర్త, భోక్త అని, తాను ఒక పరికరం మాత్రమే అనే విశ్వాసంతో కర్మచేయడం వలన పూర్వకర్మలు వ్యయమయి, బంధములు తొలగడానికి తోడ్పడుతాయి. అట్టి కర్మయోగము ద్వారా జ్ఞానం కలుగుతుంది ఆ జ్ఞానమే భక్తిగా పరిణమిస్తుంది. భక్తిచే భగవద్దర్శనం లభిస్తుంది. స్వధర్మాశ్రమ నియమానుగుణంగా కర్మలనాచరిస్తూ భగవన్నామకీర్తనం చేస్తుంటే భక్తి ఉదయించి వృద్ధి చెందుతుంది. "ఓం నమో భగవతే వాసుదేవాయ, వాసుదేవాయధీమహి, ప్రద్యుమ్నాయ, అనిరుద్ధాయ నమః సంకర్షణాయచ" అని కీర్తిస్తూ ఆదివ్యమూర్తిని ధ్యానిస్తూ భజిస్తుంటే దర్శనం లభిస్తుంది. నేను ఆ విధంగానే ఆచరించి, భక్తిని, భగవద్దర్శనాన్ని పొందితిని.

ఆ బ్రాహ్మణగృహస్థుని ఇంటనుండగా నాతల్లి పాముకాటుచే మరణించినది. ఐదేళ్ల బాలుడనైన నేను దానిని దైవ సంకల్పముగా భావించి, ఇల్లు విడిచి, ఉత్తర దిశగా నడిచివెళ్లి పట్టణాలు, పల్లెలు దాటి, ఒక భీకరారణ్యంలో ప్రవేశించాను. పోయిపోయి, ఆకలిదప్పులతో అలసిపోయి ఒక రావిచెట్టుమొదట కూర్చుంటిని. మహాత్ముల జ్ఞానబోధను స్మరించుకొంటూ నాహృదయ కమలమందున్న పరమాత్మను ధ్యానించుకొంటూ, దర్శనం గురించి తపించి ఏడుస్తుంటే, కొంతసేపటికి నాహృదయంలో శ్రీహరిదివ్యదర్శనం కలిగినది. నేను ఆనందసాగరంలో మునిగిపోయాను. నా ఉనికినే మరచిపోయాను. అంతలోనే ఆ మనోహర దివ్యదర్శనం అదృశ్యమయినది. మళ్లీమళ్లీ ఆ అద్భుత రూపాన్ని చూడాలని నామనస్సు తహతహలాడినది. ఆ రూపాన్నే ధ్యానిస్తూ ఎంతకాలం గడిపానో తెలియదు. కాని, నాకు మళ్లీ ఆ దర్శనం దొరకలేదు. ఒక మధుర స్వరముతో నాకు ఈ వాక్యాలు వినిపించినవి. "బాలకా! నీవు సత్పురుషులకు చేసిన సేవవలన నీకు నాయందు నిశ్చల భక్తి ఏర్పడినది. ఆభక్తి నీయందు ధృఢపడవలెనని నీకు నాదర్శనం ఒక్కసారి ఇవ్వబడినది. మరుజన్మలో నాభక్తుడవు అవుతావు. రాబోవుకల్పంలో, పూర్వ స్మృతితో జన్మించి, నా సేవ చేయగలవు". అని. అప్పటినుండి నేను భగవన్నామకీర్తనం చేసుకొంటూ, సంచరిస్తూ శరీరపతనం గురించి ఎదురుచూస్తూ ఉండేవాడను. తదనంతరం నాజీవుడు బ్రహ్మదేవునియందు ప్రవేశించాడు. సహస్రయుగములతరువాత కల్పాదిలో మరీచి, వశిష్ఠాదులతో సహా నేనును ఉద్భవించితిని. భగవానునిచే నివ్వబడిన ఈ వీణను మ్రోయించుకొంటూ, ఆయన యొక్క లీలలను గానము చేసుకొంటూ, బ్రహ్మచర్యదీక్షను వహించి, ముల్లోకాల్లోనూ సంచరిస్తుంటాను.

## భాగవతరచన

ఓవ్యాసమునీంద్రా! నారాయణ నామకీర్తన చేస్తుంటే, ఆయన దివ్యసుందర రూపమే నాకన్నుల యెదుట ప్రత్యక్షమయిన అనుభూతి నాకు కలుగుతుంది. నేను ఆనంద సాగరంలో తేలియాడుతుంటాను. నీవు వేదములలో కర్మకాండను, ఉపనిషత్తులలో, బ్రహ్మసూత్రాలలో జ్ఞానమార్గాన్ని, మహాభారతంలో కర్మమార్గమును, మానవ ధర్మాలనూ ప్రవచించావు.

ఇప్పుడు భగవంతుని లీలాగుణవైభవ గాథలతో కూడిన భక్తి కావ్యాన్ని రచించితే నీవు పరమశాంతిఆనందాలను, పొందగలవు" అని ఉపదేశించి. నారదుడు నిష్క్రమించాడు.

నారదుడు వెడలిపోయిన తరువాత వ్యాసుడు తన శమ్యాప్రాసమనే ఆశ్రమంలో ధ్యానమగ్నుడై పరమపురుషుని దర్శించాడు. ఆయన అధీనంలోనున్న మాయనుకూడ దర్శించాడు. ఈ మాయను అధిగమించడానికి, భగవదనుగ్రహంపొందడానికి భక్తియే సాధనమని గ్రహించాడు. భాగవతసంహితను రచించడానికి పూనుకొన్నాడు.

ఈ భాగవతగాథను వినువారికి శ్రీకృష్ణ పరమాత్మయందు భక్తి ప్రేమలంకురిస్తాయి, శోక మోహ భయములంతరిస్తాయి, వ్యాసుడు తన పుత్రుడైన శుకునకు ఈ భాగవతగ్రంథాన్ని వినిపించి నేర్పించాడు. మహాజ్ఞానియైన శుకుడు ఈభక్తి ప్రధానగ్రంథాన్ని అతిప్రీతితో స్వీకరించి తరించాడు. అతడు ఈ గ్రంథాన్ని నిత్యమూ పారాయణం చేస్తూ శ్రీకృష్ణునియందు అమితమైన భక్తిని పెంపొందించుకొన్నాడు.

క॥ **ధీరులు నిరపేక్షులు నాత్మారాములు నైన మునులు హరిభజనము ని**
**ష్కారణము చేయుచుందురు నారాయణుడట్టివాడు నవ్యచరిత్రా ॥**

అని, సూతుడు శౌనకాది మునులతో చెప్పెను.

## అశ్వత్థామఘాతుకము

### సూతుడు చెప్పెను :-

ఆనాటితో మహాభారత యుద్ధము ముగిసినది. కౌరవులందరూ మరణించారు. భీముని గదాఘాతముతో తొడలు విరిగి, దుర్యోధనుడు చావసిద్ధముగానుండెను. తన మిత్రుని దురవస్థను చూచి ద్రోణసుతుడైన అశ్వత్థామ మిక్కిలి విచారించి, అతనికి ప్రియము కలిగించడానికి, పాండవవంశనాశనం చేస్తానని ప్రతిన బూని, వడివడిగా, పాండవుల శిబిరానికి పోయి, గాఢనిద్రలోనున్న ఐదుగురు ఉపపాండవుల (ద్రౌపది పుత్రుల) శిరస్సులను ఖండించి, తీసికొనిపోయి, దుర్యోధనునకు చూపించాడు.

ఈ ఘోర వార్తను విని, పాంచాలి శోక విహ్వలయయ్యెను.

ఉ॥ **బాలుర చావు కర్ణముల బడ్డ కలంగి యలంగి యోరువం**
**జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాలనేడ్చి పాం**
**చాలతనూజ నేలబడి జాలిపడంగని యెత్తి మంజు వా**
**చాలత జూపుచుం చికురజాలము దువ్వుచు క్రీడియిట్లనెన్.** 141

మ॥ **ధరణీశాత్మజవీవు నీకు నగవన్ ధర్మంబె తద్ద్రోణి ని**
**ష్కరుణుండై విదళించె బాలకుల మద్గాండీవ నిర్ముక్త భీ**
**కర బాణంబుల నేడు వాని శిరమున్ ఖండించినేతెత్తు త**
**చ్ఛిరమున్ ద్రొక్కి జలంబులాడుమిచటన్ శీతాంశుబింబాననా.** 142

బాలుర చావుగురించి విని కలతజెంది, రోషముతో, కన్నీరు మున్నీరుగానేడ్చుచున్న పాంచాలి నోదార్చుతూ, అర్జునుడీ విధంగా అన్నాడు: ద్రౌపదీ! కరుణలేని కఠినుడైన ఆ బాలహంతకుని శిరస్సును ఖండించి తెస్తాను. దానిని త్రొక్కి స్నానం చేయుము - అని చెప్పి శ్రీకృష్ణుని సారథ్యములో రథమునెక్కి అశ్వత్థామను వెంబడించాడు. పారిపోతున్న అశ్వత్థామ అర్జునుని చూచి, ప్రాణభయంతో అతనిపై బ్రహ్మశీర్షాస్త్రాన్ని ప్రయోగించాడు.

ఆ అస్త్రరాజము ప్రచండ తేజస్సుతో అర్జునునిపైకి దూసుకొనివస్తుంటే ఏమిచెయ్యాలో తోచక అర్జునుడు శ్రీకృష్ణుని ఈవిధంగా స్తుతించాడు :-

సీ॥ పద్మలోచన కృష్ణ భక్తాభయప్రద వినుము సంసారాగ్ని వేగుచున్న
జనుల సంసారంబు సంహరింపగ నీవుదక్క నన్యులు లేరు తలచి చూడ
సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు ప్రకృతికి నవ్వవిప్రభుడవాద్య
నీ పురుషుండవగు బోధము చేవు మాయ నడంతువు నిశ్శ్రేయసాత్మయందు
ఆ॥ మాయయందు మునిగి మనువారలకు కృపజేసి ధర్మముఖ్యచిహ్నమైన
శుభము సేయుచుందు సుజనుల నవనిలో కావ పుట్టుదువు జగన్నివాస. 146

"ఓ జగన్నివాసా! కృష్ణా! భక్తుల కభయమిచ్చు దేవదేవా! అంతటా వ్యాపిస్తూ చుట్టుముట్టుతున్న ఈతేజస్సేమిటో తెలియకున్నది. భయము కలిగిస్తున్నది. దీనినుండి రక్షింపబడే మార్గాన్ని నాకు తెలుపుము" అని ప్రార్థించగా - అది అశ్వత్థామచే ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రమనీ, దానినెదుర్కోవాలంటే వేరొక బ్రహ్మాస్త్రాన్నే ప్రయోగించాలనీ, శ్రీకృష్ణుడు చెప్పడంచేత, అర్జునుడు బ్రహ్మాస్త్రాన్ని విడిచిపెట్టగా, రెండు అస్త్రాలూ భూమ్యాకాశాలను తేజస్సుతో నింపివేస్తూ ప్రళయాగ్నివలె ప్రజ్వలించినవి. శ్రీకృష్ణుని సూచనపై అర్జునుడు రెండు బ్రహ్మాస్త్రాలనూ ఉపసంహరించాడు. నిరస్త్రుడై, శక్తి ఉడిగిన అశ్వత్థామను అర్జునుడు బంధించి తెచ్చాడు . అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో ఇలాగ చెప్పెను.

ఉ॥ మారుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేరనిపిన్నపాపల వధించె నిశీథమునందు క్రూరుడై
పారెడు వీడు పాతకుడు ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం
బారెడు వీనిఁ గావకు కృపామతి నర్జున! పాపవర్జనా! 153
చ॥ వెరచినవాని దైన్యమున వేదురునొందినవాని నిద్ర పై
మరచినవాని సౌఖ్యమున మద్యము త్రావిన వాని భగ్నుడై
పరచినవాని సాధుజడ భావము వానిని, కావుమంచు వా
చరచిన వానిఁ గామినులఁ చంపుట ధర్మము కాదు ఫల్గునా! 154

"ఎదుర్కొనే శక్తిలేని చిన్నపిల్లలను రాత్రివేళ నిద్రిస్తున్న సమయంలో చంపి పారిపోతున్న ఈ బాలహంతకునిపై కరుణచూపదగదర్జునా!" అని చెప్పి, ఒక ధర్మసూక్ష్మాన్నిగూడ శ్రీకృష్ణుడు జ్ఞప్తికి తెస్తాడు - "భయపడినవానిని, దైన్యముతో నణగియున్నవానిని, నిద్రిస్తున్నవానిని, మత్తులోఉన్నవానిని, భంగపాటు చెందినవానిని, సాధువైజడుడైయున్నవానిని, కాపాడుమని ఆర్తిచెందినవానిని, స్త్రీని చంపడం ధర్మము కాదు" అని చెప్పడంలోని శ్రీకృష్ణుని ఆంతర్యమేమిటో అర్జునుడు గ్రహించియేయుంటాడు. అశ్వత్థామ శిరస్సును తెచ్చి నీ పాదాలవద్ద పడవేస్తానని ద్రౌపదికి మాటఇచ్చినా అలాగ చెయ్యకుండా పుత్రశోకముతో కుమిలిపోతున్న ద్రౌపదియే ఎలాగ నిర్ణయిస్తే అలాగ చెయ్యవచ్చునని, అతనిని తీసుకొనివచ్చి ఆమెముందుంచాడు. బాలవధచేసి, పట్టుబడి, కట్టబడి, హతుల తల్లి ఎదుట నిల్చొనియున్న అశ్వత్థామ, అవమానంతో సిగ్గుతో రోషముతో తలవంచుకొని ఉడికిపోతున్నాడు. మహాసాధ్వి అయిన ద్రౌపది, అంతటి ఘోరవిపత్తులో కూడ, తన ధర్మధ్యాసను కోల్పోకుండా, అర్జునునితో ఇలాగ అంటున్నది. "ఆర్యపుత్రా! ఇతడు నీ గురుపుత్రుడు, సోదరునివంటివాడు. ఇతని నీవిధంగా బంధించడం తగదు. కట్లువిప్పి వేయండి" అని కోరి, అశ్వత్థామతో ఆ మాతృమూర్తి ఈ విధంగా అన్నది.

మ॥ పరగన్ మామగవారలందరును మున్ బాణప్రయోగోపసం
హరణా ద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచేనభ్యసిం
చిరి పుత్రాకృతినున్న ద్రోణుడవు నీచిత్తంబులో లేశమున్
కరుణాసంగములేక శిష్యసుతులన్ ఖండింపగా పాడియే? 159

క॥ భూసురుడవు బుద్ధిదయా భాసురుడవు శుద్ధవీరభట సందోహా
గ్రేసరుడవు శిశుమారణమాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ. 160

శా॥ ఉద్రేకంబునరారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును నీకు చేయరు బలోత్సేకంబుతోఁజీకటిన్
భద్రాకారుల చిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింపనకటా నీచేతులెట్లాడెనో? 161

ఉ॥ అక్కట పుత్రశోక జనితాకుల భావ విషణ్ణ చిత్తనై
పొక్కుచునున్న భంగి నిను పోరకిరీటినిబద్ధు జేసి నే
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదా భవదీయమాత నే
డెక్కడ నిట్టి శోకమున నేక్రియనేడ్చుచు పొక్కుచున్నదో? 162

"ఓ బ్రాహ్మణోత్తమా! మా మగవారందరూ, నీ తండ్రియైన ద్రోణాచార్యులవారివద్ద శస్త్రవిద్యలు నేర్చుకొన్నవారే గనుక, నీవుకూడ గురుసమానుడవే అయియుండియు, కొంచెమైనా కరుణలేనివాడవై ఈ విధంగా నీ శిష్యులబిడ్డలను ఖండించడం నీకు తగియున్నదా? నీవుసద్బ్రాహ్మణుడవు, బుద్ధి దయాగుణాలను ప్రకాశింపజేయవలసినవాడవు, వీరాగ్రేసరుడవు, ఈవిధంగా అసురకృత్యమైన శిశుహత్యకు పాల్పడడం నీకు ధర్మసమ్మతమేనా, తండ్రీ! నా బిడ్డలు కోపోద్రేకులై నిన్నెదిరింపరారు, శస్త్రాలు ధరించి యుద్ధభూమిపైలేరు, యుద్ధకుశలురు కారు, నీకేవిధమైన ద్రోహాన్నీ తలపెట్టినవారుకారు, అలాంటి నిరపాయులను, నిద్రలోనున్న వారినీ, అక్కటా! ఇలాగ చంపడానికి నీకు చేతులెలా వచ్చాయి? అయ్యో? నీవు ఈవిధంగా బంధింపబడి, శిక్షింపబడనున్నావని తెలిసి, నీతల్లియైన కృపి. నాలాగుననే పుత్రశోకంతో ఎంతగా కుమిలిపోతున్నదో కదా!" అని. ఆమె, కృష్ణార్జునులతో- బ్రాహ్మణుల ఆగ్రహానికి గురిఅయిన క్షత్రియులవంశాలు నాశనమౌతాయి గనుక ఇతనికి ఏహానీ చేయకుండా విడువవలెనని కోరినది. ధర్మయుతమైన ఆమెమాటలు విని, శ్రీకృష్ణుడు, ధర్మజుడు, సాత్యకి మొదలైన వారంతా ఆమెనభినందించారు గాని భీముడు మాత్రము అంగీకరించక, కోపావేశముతో ఇలాగ అన్నాడు:

చ॥ కొడుకులఁ బట్టి చంపెనని కోపమునొందదు బాలఘాతకున్
విడువు మటంచుఁజెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వాడు విప్రుడే?
విడువగనేల? చంపుడిటు వీనిని మీరలు చంపరేని నా
పిడికిటి పోటునన్ శిరము భిన్నము సేసెద చూడుడిందఱున్. 167

అప్పుడు శ్రీకృష్ణుడిలాగ చెప్పెను. :

ఉ॥ అవ్వడు కాడు వీడు శిశుహంత దురాత్మకుడాతతాయి హం
తవ్యుడు బ్రహ్మబంధుడగు తప్పదు నిక్కము బ్రాహ్మణోవహం
తవ్య యటంచు వేదవిదితంబగు గావున ధర్మదృష్టిఁ గ
ర్తవ్యము వీనిఁ గాచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా! 169

"అర్జునా! వీడు శిశుహంత, ఆతతాయి, చంపదగినవాడు, కాని బ్రాహ్మణుడు చంపరాని వాడు అని వేదవాక్కు. వీటిని సమన్వయపరచి, కర్తవ్యాన్ని నిర్ణయించుకో" అని చెప్పిన శ్రీకృష్ణవాక్కులను గ్రహించిన వాడైన అర్జునుడు, అశ్వత్థామ శిరోభూషణమైన మణిని తీసివేసి, అతని శిరోజాలను గీయించివేసి, పొమ్మన్నాడు. తరువాత, అందరూ, బిడ్డలకు అంత్యసంస్కారాలను చేయించి యుద్ధములో చనిపోయిన వారికి తర్పణములనిచ్చి, గాంధారీధృతరాష్ట్రులనోదార్చివచ్చారు.

## ఉత్తరగర్భరక్షణ

పిమ్మట, శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునకు రాజ్యమిప్పించి అతనిచే అశ్వమేధయాగాలను చేయించి, ఉద్ధవ సాత్యకులతో కలిసి, ద్వారకకు మరలిపోయే సన్నాహంలోనుండగా, అభిమన్యుపత్ని అయిన ఉత్తర భయవిహ్వలయై పరుగుపరుగున వచ్చి ఆయన పాదాలపైబడి, ఇలాగవేడుకొన్నది:

"ఓ కృష్ణా, వాసుదేవా! రక్షించు, రక్షించు. నేనేమైపోయినా నాగర్భస్థ శిశువును మాత్రము రక్షింపుము. నాగర్భము దహించుకొనిపోతున్నది:

క॥ దుర్భర బాణానలమున, గర్భములోనున్న శిశువు ఘనసంతాపా
విర్భావంబును బొందెడి నిర్భర కృపఁగావుమయ్య నిఖిలస్తుత్యా. 178

క॥ చెల్లెలి కోడల నీ మేనల్లుడు శత్రువులచేత హతుడయ్యెను సం
ఫుల్లారవిందలోచన భల్లాగ్ని నణంచి శిశువు బ్రతికింపగదే 179

ఆ॥ గర్భమందు కమలగర్భాండ శతములు నిముడుకొన నటించు నీశ్వరేశ!
నీకు నొక్కమానినీగర్భరక్షణమెంత బరువు నిర్వహింతుగాక!

అని, ప్రార్థింప, శ్రీకృష్ణుడామెను లేవనెత్తి అభయమిచ్చాడు. అది అశ్వత్థామచే, "అపాండవ మగుగాక" అని, ప్రయోగింపబడిన అస్త్రము యొక్క ప్రభావమని గుర్తించిన శ్రీకృష్ణుడు, తానే చక్రహస్తుడై ఉత్తర గర్భమునందు ప్రవేశించి, వైష్ణవ మాయచే నా శిశువు నావరించి, ఆ అస్త్రాన్ని హరించివేశాడు. ఘోరాపద తప్పినందుకు, కుంతీదేవి ఆనందోత్సాహాలతో పాంచాలీ పాండవులతో సహా శ్రీకృష్ణుని సమీపించి, ఈవిధంగా స్తుతించినది.

**కుంతీస్తుతి:-**

కృష్ణాయ వాసుదేవాయ దేవకీ నందనాయ చ
నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః ।
నమః పంకజనాభాయ నమః పంకజమాలినే
నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే ॥

క॥ పురుషుండాద్యుడు ప్రకృతికిఁ బరుడవ్యయుఁ డఖిల భూతబహిరంతర్భా
సురుడు నవలోకనీయుడు పరమేశ్వరుడైన నీకు ప్రణతులగు హరీ! 185

క॥ జననము నైశ్వర్యంబును ధనమును విద్యయును గల మదచ్ఛన్నులకిం
చనగోచరుడగు నిన్నున్ వినుతింపగలేరు నిఖిల విబుధస్తుత్యా 189

క॥ జలరాశిలో మునింగెడి కలముక్రియన్ భూరిభార కర్శితయగు నీ
యిలగావ నజుడు కోరిన కలిగితివని కొందరంద్రు గణనాతీతా 194

తే॥ మరచి యజ్ఞాన కామకర్మముల తిరుగు వేదనాతురులకు తన్నివృత్తి జేయ
శ్రవణచింతన వందనార్చనములిచ్చుకొరకు నుదయించితంద్రు నిన్ గొందఱభవ! 195

మ॥ నినుచింతింపుచు పాడుచుం పొగడుచున్ నీదివ్యచారిత్రముల్
వినుచుంజూతురుగాక లోకులితరాన్వేషంబులం జూతురే!
ఘనదుర్జన్మ పరంపరా హరణదక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ విశ్వంభరా! 196

ఉ॥ యాదవులందు పాండుసుతులందు నధీశ్వర నాకుమోహవి
చ్ఛేదముసేయుమయ్య ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ
పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయగదయ్యయీశ్వరా! 198

శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా నరసఖా శృంగార రత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా లోకేశ్వరా దేవతా
నీక బ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ! 199

ఓ. కృష్ణా! వాసుదేవా! దేవకీనందనా! నందగోపకుమారా! గోవిందా! నీకు అనేక నమస్కృతులు, ఓ పద్మనాభా! పద్మమాలాలంకృతా! పద్మదళనేత్రా, పద్మచరణా! నీకు నమస్కారములు. నీవు ఆది పురుషుడవు, అవ్యయుడవు, ప్రకృతికి పరమైనవాడవు, సకల భూతములలోనా పైనా ప్రకాశించువాడవు, పరమేశ్వరుడవైన నీకు ప్రణామములు. అగోచరుడవైన నీయొక్క దివ్యలీలా వైభవాలను విద్యా ధన ఐశ్వర్య - ఆభిజాత్యాహంకారులు వినుతింపగలరా! బ్రహ్మదేవుని కోరికపై భూభారాన్ని బాపడానికి అవతరించావని కొందరంటారు. కోరికలను తీర్చుకొనే తలంపుతో అజ్ఞానముచే కామ్యకర్మలలో చిక్కుకొని, నిన్ను మరచి, యాతనలు పడుతున్న వారివేదనను నివారించడానికి శ్రవణమనన వందనార్చనాది భక్తి సాధనరీతులననుగ్రహించడానికి అవతరించినావంటారు కొందరు. ఘోరమైన జనన మరణ పరంపరను హరించివేయగలవీ, మహాయోగి వర్యులచే నెల్లప్పుడూ స్తుతింపబడేవీ అయిన నీపాదపద్మాలపై మనస్సు నిలిపి, నిన్ను ధ్యానిస్తూ, నీ కీర్తనలు పాడుతూ నీదివ్య చరిత్రలు వింటూ, పొగడుతూ ఉంటారుగాని, సజ్జనులు అన్యమైన వాటిగురించి అన్వేషిస్తారా శ్రీహరీ! ఓ ఈశ్వరా! నా పుట్టినింటి వారైన యాదవులయందు, మెట్టినింటివారైన పాండవులయందు ఏవిధమైన మోహము పుట్టినా దానిని ఛేదించుమయ్యా! సాగరాన్ని చేరడానికి ఉరకలు వేసుకుంటూ పోయే నదివలె, నామనస్సెప్పుడూ నీ పాదసన్నిధికి చేరుతుండేటట్లు అనుగ్రహించు తండ్రీ! శ్రీకృష్ణా! యదుభూషణా! అర్జునసఖా! లోకకంటకులను నశింపజేసేవాడా! లోకేశ్వరా! సాధువుల ఆర్తిని తొలగించువాడా! మోక్షదాయకా! నిన్ను వేడుకొంటున్నాను - ఈ సంసారబంధాలను త్రెంచివేయవా, దయానిధీ!

కృష్ణా! మాకు పదేపదే ఆపదలు కలుగుతుండాలనే నేను కోరుకొంటాను. ఏలనన! ఆపదలోనున్న వారిని రక్షించడానికి నీవు వస్తుంటావు. నీదర్శన భాగ్యముచేత ఆపదలేకావు, సంసార వహ్నిజ్వాలలే సమసిపోతాయికదా! నీవు సర్వత్రా సమవర్తివి. పక్షపాతము లేని నీవు, వారివారి కర్మఫలాలను వారు అనుభవించేటట్లు చేస్తావు. నీయొక్క దండన కూడా వారిపట్ల నీయొక్క అనుగ్రహమునే సూచిస్తుంది. నీవు మానవుల్లోనే కాకుండా, మృగాలలోనూ, జలచరాలలోనూ, అవతరిస్తూ, ఆర్తులను రక్షిస్తూ, ధర్మాన్ని నిలుపుతూఉంటావు. ఇది నీకు లీలా వినోదము." అని కుంతి చేసిన ప్రార్థనకు కృష్ణుడు సంతసించాడు.

కుంతీదేవి, పాండవులు, తదితరులు ప్రార్థింపగా, శ్రీకృష్ణుడు తన ప్రయాణాన్ని నిలుపుకొని, ఇంక కొన్నాళ్లు హస్తినాపురములో నుండ దలచుకొన్నాడు.

యుద్ధమువలన కలిగిన ప్రాణ నష్టానికి, యుధిష్ఠిరుడు గాఢమైన సంతాపముతో క్రుంగిపోయాడు. ఇది అంతా భగవద్విలాసముచే సంభవించినదని సర్వజ్ఞుడైన వ్యాసుడు చెప్పినా, కాలగతి నెవ్వరూ మార్చలేరని శ్రీకృష్ణ భగవానుడే బోధపరచినా, అతని దుఃఖముపశమించలేదు. ఈ పాపానికి పరిహారమేమిటి? అశ్వమేధయాగముచేసినా జీవహింస జరుగుతుందేగాని, పాపము తరగదుకదా! అని ధర్మజుడు వ్యాకులపాటుచెందాడు.

అని సూతుడు శౌనకాది ఋషులకు చెప్పెను.

# భీష్మనిర్యాణము

శ్రీకృష్ణుడు, నారదుడు, వ్యాసుడు ఎంత సముదాయించినా యుధిష్ఠిరుని శోకసంతప్తమానసము 'చక్కబడకుండెను. అతని నావరించియున్న విరక్తి, వ్యాకులపాటు, విషాదమేఘచ్ఛాయలు పాండవ పరివారములను క్రమ్మివేసెను. అతడు రాజ్యపరిపాలనకూడ సరిగా చేయలేడేమోయని అనిపించుచుండెను.

ఒకనాడు అందరి సమక్షములో శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునితో ఇలాగన్నాడు: "కురుక్షేత్రంలో అంపశయ్య పైనున్న భీష్ముడు నన్ను స్మరిస్తున్నాడు. అతిత్వరలోనే అతడు దేహత్యాగము చేయనున్నాడు. అతనితోపాటే ఇన్ని సంవత్సరాలుగా అతడు సంపాదించికొనియున్న శాస్త్రజ్ఞానము అనుభవజ్ఞానము అంతరించిపోతుంది. నీవు పోయి, అన్ని విషయాలపైనను అతనినుండి కొంత అయినా జ్ఞానమును పొందుము." అని చెప్పగా అందరూ కురుక్షేత్రానికి ప్రయాణమైవెళ్లారు.

భీష్ముడు కూలిపోయిన దేవతామూర్తివలె అంపశయ్యపై పడియున్నాడు. యుధిష్ఠిరాదులంతా ఆయన చుట్టూ నిల్చున్నారు. యుధిష్ఠిరుడు కన్నీరు మున్నీరుగా ఏడ్చుచూ ఇలాగన్నాడు:

"పూజ్యపితామహా! ఈ నీదుస్థితికీ నీమనుమల మరణానికీ నాయొక్క రాజ్యకాంక్షయే కారణముకదా! ఈ నా ఘోరపాపానికి నిష్కృతి ఉంటుందా? నీవైనా నన్ను క్షమించగలవా?" అని భోరున విలపిస్తున్న ధర్మజునితో భీష్ముడిలా అన్నాడు:

"కుంతీకుమారా! నాచావుకు నీవే కారణమనే భావన రానీయకుము. నిజానికి నాకు బంధవిముక్తి కలిగినది. కురుసామ్రాజ్యాన్ని సుస్థిరంగా నెలకొల్పుతానని నాతల్లి సత్యవతికిచ్చిన మాటనేటికి నెరవేరినందుకు సంతసిస్తున్నాను. నీవు విచారింప పనిలేదు. రాజుకు ప్రజలశ్రేయస్సు వినా వేరే ఏ ఆలోచనా ఉండరాదు. పాండుకుమారులారా! మీయొక్క విషాదగాథ నాకు విచారము కలిగిస్తున్నది. మీ తండ్రి మరణం తరువాత తల్లియైన కుంతి ఎన్ని బాధలనో ఎదుర్కొని మిమ్మల్ని సాకుకొంటూవచ్చినది. నాయనలారా! మీరు బ్రాహ్మణోత్తములను, ధర్మాన్నీ, శ్రీహరినీ ఆశ్రయించి, జీవిస్తూ వచ్చారు. అయిననూ మీరు ఆపద పరంపరలనే ఎదుర్కొవలసి వచ్చినది. ఇటువంటి విధివైపరీత్యమెక్కడైనా ఉన్నదా?

ఉ॥ రాజటధర్మజుండు సురరాజసుతుండటధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లట సారథి సర్వభద్ర సం
యోజకుడైన చక్రియట యుగ్రగదాధరుడైన భీముఁడ
య్యాజికిఁ దోడువచ్చునట యాపద గల్గుటిదేమిచోద్యమో? 210

ఆ॥ ఈశ్వరుండు విష్ణుడెవ్వేళ నెవ్వని నేమి సేయుఁ బురుషుడేమి యెఱుగు
నతని మాయలకు మహాత్ములు విద్వాంసు, లణగి మెలగుచుందురంధులగుచు. 211

సాక్షాత్తు ధర్మనందనుడే రాజైయుండగా, అతనిఅండతో గాండీవధారియైన అర్జునుడు, ఉగ్రగదాధారియైన భీముడు, సర్వసంరక్షకుడైన చక్రధారి శ్రీకృష్ణుడునుండగా ఇన్ని ఆపదలకు లోనుగావడం విచిత్రంగాలేదూ? సర్వేశ్వరుడైన విష్ణువు ఎవ్వరికెప్పుడు ఏమిచేస్తాడో మానవుని కెలాగ తెలుస్తుంది? ఆయన యొక్క మాయకు మహాత్ములు, పండితులు కూడ మోహితులౌతారు కదా! ఒక్క శ్రీకృష్ణునకే అంతాతెలుసు. అతడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగదా! నారదుడు, కపిలుడు వంటి బహుకొద్ది మందికే ఈ సత్యము తెలుసు. ఇతనిని నీవు మిత్రునిగాను, మేనమామకొడుకుగాను ఎరుగుదువు. ఈయనను సలహాదారుగాను దూతగాను సారథిగాను ఉపయోగించుకొన్నావు, కాని ఇతడు సర్వాంతర్యామి, సమదర్శి, భక్తవత్సలుడు. నేను స్మరించినంతనే నాకు అంత్యదర్శన మివ్వడానికి వచ్చిన దేవదేవుడు." అని చెపుతున్న పితామహునితో శ్రీకృష్ణుడిలాగన్నాడు: "ఓగాంగేయా! బృహస్పతినుండి, శుక్రాచార్యులనుండి, నీవు అనేక శాస్త్రాలను, ధర్మాలను, నీతులను నేర్చుకొనియుంటివి. అవి, నీతోనే అంతరించిపోకుండా, వాటిని, నీమనుమడైన యుధిష్ఠిరునకు అనుగ్రహింపుము. ఆ జ్ఞానాన్ని పొందడానికి అతనికొక్కనికే అర్హత ఉన్నది." అని చెప్పినంతనే భీష్ముడు 54 రోజులలో,

ధర్మజునకు జ్ఞానబోధ చేశాడు. ఋషులందరి సమక్షమున ఈ జ్ఞాన బోధ జరిగినది. ధర్మజుడు రాజధర్మములు, మోక్షధర్మములు, మొదలైన సకలధర్మములను నేర్చుకొన్నాడు.

ఉత్తరాయణ కాలప్రవేశముతో, స్వచ్ఛంద మరణశక్తిగల భీష్ముడు, తనఎదుటనే శ్రీకృష్ణరూపమున నిలిచియున్న పరమేశ్వరుని తనచిత్తములో ధారణచేయగానే అతని శారీరకబాధలు, మనోమాలిన్యములు, పాపసంచితములు మాయమైనవి. అతడు శ్రీకృష్ణుని ఇలాగ స్తుతించాడు.

## భీష్మస్తుతి:

మదిలోనేవిధమైన విషయవాంఛా సంకల్పాలులేక అనన్య చిత్తముతో లీలా మానుషరూపధారియైన ఆ పురుషోత్తమునే నేను ధ్యానిస్తున్నాను. నీలమేఘచ్ఛాయా సుందరరూపుడూ, పీతాంబరధారీ అయిన ఆ ఈశ్వరునే నేను మదిలోతలుస్తాను. పార్థసారథియై తన చూపులతోనే ప్రతిపక్ష సైనికుల ప్రాణాలను హరించిన స్వామికి నేను నమస్కరిస్తున్నాను. అర్జునునకు గీతోపదేశము చేసిన జగద్గురువును నేనాశ్రయిస్తున్నాను. ఈ అంత్యసమయంలో ఆ ప్రభువును విజయసారథి రూపంలో నేను చూస్తున్నాను. అజుడును (జన్మలేని వాడును), అద్వితీయుడును. అనేక నామరూపాలతో వెలసి, జీవరాసులయొక్క హృదయాంతరాళములయందు నివసిస్తుండే ఆ ఏకైక పరమాత్మనే ధ్యానిస్తున్నాను.

**మ॥ ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పో**
**లికనేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ**
**న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ**
**పకుడై యొప్పుచునుండునట్టి హరినే ప్రార్థింతు శుద్ధుండనై. 225**

ఒకే సూర్యుడు వేర్వేరు జీవులకు వేర్వేరుగా గోచరించునట్లు అందరిహృదయాలలో తానొక్కడే ప్రకాశిస్తున్నా వేర్వేరు ఆత్మలున్నట్లు గోచరింపజేసెడి సర్వాంతర్యామియైన ఆ భగవానుని నేను ప్రార్థిస్తున్నాను." ఇట్లు, శ్రీకృష్ణునియందే చూపును, చిత్తమును నిలిపి ప్రశాంతముగ ప్రాణాలు విడిచినాడు భీష్ముడు. దేవతలు దుందుభులను మ్రోగించుచు, ఆయనపై పుష్పవృష్టిని కురిపించారు. ఋషులు ప్రశంసించి స్వస్తి వచనాలు పలికారు. ధర్మజుడు ఉత్తరక్రియలు జరిపించాడు. అతడు వాసుదేవుని ఆశీస్సులతో రాజ్యభారాన్ని చేపట్టి ధర్మయుతంగా పాలించసాగాడు: అని సూతుడు చెప్పెను.

## పరీక్షిత్తుజననము

పదినెలల ఉత్తరగర్భస్థ శిశువునకు ఒక అపూర్వమైన అనుభవం కలిగినది. "అపాండవముగుగాక" అని అశ్వత్థామచే విడువబడిన అస్త్రజ్వాలలు దహించనున్నవి. శ్రీమహావిష్ణువే వచ్చి రక్షిస్తాడని, తన తల్లి, నాయనమ్మ, చెప్పుకోవడం వినియున్న ఆ బిడ్డడు ఇలాగ తలపోశాడు. "ఏడీ? ఆ రక్షకుడింకారాడేమి? ఈ తాపము దుర్భరమైపోతున్నదే! మా అవ్వచెప్పిన మాట అసత్యమా! ?"

**శా॥ రాడా చూడ సమస్తభూతములలో రాజిల్లు వాడిచ్చటన్**
**లేడా పాఱుని చిచ్చరమ్ము తొలగన్ లీలాగతిన్ ద్రోచి నా**
**కీడా నేడభయప్రదాన మతడూహింపన్ నతత్రాత మున్**
**కాడా ఎందఱఁ గావడేయెడల మత్కర్మంబు తానెట్టిదో? 281**

సమస్త భూతాలలో విరాజిల్లే వాడు నాబాధను నివారించడానికింకా రాడేమి? అసలున్నాడా, ఉంటే నన్ను చూడడేమి? ఈ జ్వాలను తొలగించి, నాకభయమివ్వడా? ఎందరినోకాపాడినవాడు, తలచుకొంటే, నన్ను రక్షించలేడా? ఇంతకూ నాకర్మమెలాగున్నదో! ఈవిధంగా, గతాగత ప్రాణుడై ఆ బిడ్డడు చింతిస్తుండగా;

సీ॥ మేఘంబు మీది క్రొమ్మెఱుగుకైవడి మేనిపైనున్న పచ్చని పటమువాడు
గండభాగంబుల కాంచన మణిమయ మకరకుండల కాంతి మలయువాడు
శరవహ్ని నడగించు సంరంభమున జేసి కన్నుల నునుకెంపు కలుగువాడు
బాలార్కమండల ప్రతిమాన రత్నహాటక విరాజిత కిరీటంబువాడు
తే॥ కంకణాంగద వనమాలికా విరాజమానుడసమానుడంగుష్ఠ మాత్రదేహుఁ
డొక్క గదచేత దాల్చి నేత్రోత్సవముగ విష్ణుడావిర్భవించె నవ్వేళయందు. 283
మ॥ గద చేఁబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబునన్ దుర్భర
ప్రదమైవచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ
సదయుండెవ్వడొకో యటంచు మదిలోఁ జర్చింపుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుడయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా. 285

మెరుపుతీగవంటి శరీరము, బంగారుఛాయవస్త్రము, మణిమయ మకరకుండలాలు, రత్నఖచిత బంగారు కిరీటము ధరించి, అంగుష్ఠ మాత్రపుదేహముతో, గదాధారియైన విష్ణువు కన్నులపండువుగ నావిర్భవించి, తనచుట్టూ గదను త్రిప్పుతూ పరిభ్రమించడాన్ని ఆశిశువు చూచినాడు. ఈదయామయుడైన దివ్యపురుషుడెవ్వరో మళ్లీచూద్దామని పరికించినా కనిపించకుండా అదృశ్యమైనాడు. అస్త్రతాపము పూర్తిగా హరింపబడినది.

ఒక శుభముహూర్తమందు ఉత్తరకు పుత్రుడు జన్మించాడు. కులగురువులను, బ్రాహ్మణులను పిలిపించి, యుధిష్ఠిరుడు జాతకకర్మలను చేయించాడు. సువర్ణ గోదానాది - అనేకమైన దానములనిచ్చాడు. గర్భస్థదశలోనే ప్రమాదమునుండి మహావిష్ణువుచే రక్షింపబడినందున ఈ బిడ్డనికి విష్ణురాతుడనే పేరుతగియుంటుందని నామకరణం చేశారు. అతడు మహాభాగవతుడవుతాడని చెప్పారు. ఇక్ష్వాకునివలె ప్రజారంజకుడై పాలిస్తాడు, శ్రీరామచంద్రునివలె దానశీలుడవుతాడు, తాతఅయిన అర్జునునివలె పరాక్రమశాలిఅయి ధనుర్ధారి అవుతాడు. అగ్నివంటి ప్రచండుడు, సముద్రమువంటి గంభీరుడు, భూమివంటి సహనశీలి అవుతాడు. బ్రహ్మవంటి సమవర్తనుడు, ప్రహ్లాదునివంటి భక్తుడు అవుతాడు, కాని బ్రాహ్మణశాపవశాన మరణము రానున్నదని గ్రహించినవాడై సర్వసంగ పరిత్యాగియై, ముకుందనామరతుడై ఆత్మజ్ఞాన సంపన్నుడై విష్ణుసాయుజ్యం పొందుతాడు. అని దైవజ్ఞులు జెప్పారు.

గర్భస్థశిశువుగానున్నప్పుడు దర్శించిన ఆదివ్యసుందరమూర్తి, మళ్లీ కనిపించవచ్చునేమోయని, పుట్టినదాదిగా ఆబిడ్డడు అందరిముఖాలను పరీక్షగా పరికించి చూస్తుండడంచేత, అతడు "పరీక్షిత్తు" అని పిలువ బడుతూ ఆపేరుతోనే ప్రసిద్ధిచెందాడు. అతడు పెరిగి, సకల విద్యలు నేర్చి, సద్గుణ సంపన్నుడై, శ్రీహరియందు అచంచలభక్తియుక్తుడై పరిపూర్ణుడైనాడు.

అని శౌనకాది ఋషులకు సూతుడు చెప్పెను.

## శ్రీకృష్ణుడు ద్వారకకు మరలివెళ్లుట

శ్రీకృష్ణునిఅభిమతముప్రకారముగా భీష్మునిఉపదేశానుసారముగా యుధిష్ఠిరుడు ధర్మయుతంగా రాజ్యపాలన చేస్తుండెను. అతనికి ప్రజాశ్రేయస్సే ప్రధానకర్తవ్యమైయుండెను. ప్రజలు ఐశ్వర్య - ఆనందాలతో స్వస్థులైయుండిరి. అంతటా శాంతి, సౌభాగ్యాలు తాండవిస్తున్నవి. ప్రియబంధుజనులకోరికను మన్నించి, శ్రీకృష్ణుడు హస్తినాపురములో కొంతకాలంఉండి, ద్వారకకు మరలి వెళ్లాలని సంకల్పించాడు. తాను వెళ్లిపోవడం పాండవసోదరులకు, కుంతి ద్రౌపది సుభద్రలకు, హస్తినాపుర ప్రజలకు ఎంతో వియోగ బాధకలిగిస్తుందని ఆయనకు తెలుసు. వారికి నచ్చజెప్పి, ఒప్పించి, పెద్దలకు ప్రణామాలుచేసి. పిన్నలనాశీర్వదించి, ఆలింగనంచేసుకొని, వీడ్కొన్నాడు. రథమెక్కి వెళ్తుంటే సుభద్ర ద్రౌపది కుంతి గాంధారి ధృతరాష్ట్రుడు విదురుడు యుధిష్ఠిరుడు యుయుత్సుడు కృపాచార్యుడు నకులసహదేవులు భీమసేనుడు ధౌమ్యుడు అతని వియోగాన్ని భరించలేనివారై కొంతవరకు వెంట వెళ్లి - "త్వరలోనే మరలిరమ్మ శ్రీహరీ" - అని కోరుతూ బాష్పధారలు కార్చుకొంటూ హతాశులై అక్కడక్కడా నిలిచిపోయారు.

పురకాంతలు రథముపై పుష్పవృష్టిని కురిపించారు. అర్జునుడు వెండిఛత్రము పట్టుకొనగా, ఉద్ధవ సాత్యకులు చామరాలతో వీచుతుండగా, మంగళ వాద్యాలు మ్రోగుతుండగా, సద్బ్రాహ్మణులు సగుణ నిర్గుణ వర్ణనలతో ఆ పరమపురుషుని స్తుతిస్తుండగా, హస్తినాపురవీధుల గుండా వాసుదేవుడు రథంలో వెళ్తున్నప్పుడు పురజనులు రెండువైపులా బారులు తీర్చి, నిల్చొని స్తుతిస్తూ ఆ దివ్య మోహన సుందరమూర్తిని కన్నులార్పకుండా వీక్షిస్తూ తమలో తాము అనేక విధాల ముచ్చటించుకొనసాగారు:

సీ॥ ఈయుత్తమశ్లోకుడెలమి జన్మించిన యాదవ కులమెల్ల ననఘమయ్యె
ఈపుణ్యావర్తనుడే ప్రొద్దునుండిన మధురాపురముదొడ్డ మహిమగనియె
ఈ పూరుషశ్రేష్ఠు నీక్షించి భక్తితో ద్వారకావాసులు ధన్యులైరి,
ఈ మహాబలశాలి యెఱిగి శాసింపగ, నిష్కంటకమ్మయ్యె నిఖిల భువన
తే॥ మీ జగన్మోహనాకృతి నిచ్చగించి, పంచశరభల్లజాలవిభజ్యమాన
వివశమానసమై వల్లవీసమూహ మితని యధరామృతముగ్రోలు నెల్లప్రొద్దు. 238

"ఈ సత్కీర్తి ధాముడు తమవంశమున అవతరించడంచేత యాదవకులమంతా పునీతమైపోయినది. ఈ పుణ్యమూర్తివలన మధురాపురము ఘనకీర్తిని పొందినది. ఈ పురుషోత్తముని భక్తితో దర్శిస్తూ ద్వారకావాసులు ధన్యులయ్యారు. ఈశక్తిమంతుని చండశాసనంచేత భూమిపై దుండగులు లేకుండా పోయారు. మన్మథ బాణాలకులోనైన గోపికలు ఈ జగన్మోహనుని ప్రేమించి తరించారు." అని ఈవిధంగా ముచ్చటించుకొన్నారు.

శ్రీకృష్ణుడు తనవెంట వస్తున్న పాండవులను, పురజనులను వెనుకకు మరలింపజేసి, తాను ముందుకు సాగిపోయాడు. ద్వారకకు సమీపానున్న ఆనర్తమండలం చేరగానే తనరాకను తెలియజేస్తూ పాంచజన్య శంఖాన్నూదాడు. ఆ శంఖానాదాన్ని విన్న ద్వారకావాసులు పరుగుపరుగున ఎదురు వచ్చారు. కొందరు వీధులను, ద్వారాలను, ఇళ్లను తోరణాలతో నలంకరించారు. స్త్రీలు వీధులను ముగ్గులతో నలంకరించి, హారతులివ్వడానికి సిద్ధమయ్యారు. ఎదురువెళ్లినవారు ఆనంద సందోహాలతో – "కృష్ణా! వాసుదేవా! ఇన్నాళ్లకు మరలివచ్చావా! మాధవా! మా భాగ్యమే మహాభాగ్యము, పాహిమాం ప్రభో!" అంటూ గంతులు వేయసాగారు. మంగళ వాద్యాలతో, జయజయ నాదాలతో, పూలబాటలు వేసి, పురజనులాహ్వానించారు. పుణ్యకాంతలు హారతులిచ్చారు. గృహస్థులు పూజలుచేస్తూ కానుకలిస్తూ ఆరాధించారు. దేవకి, వసుదేవుడు, ఉగ్రసేనుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, బలరాముడు శంఖనాదాలుచేస్తూ వేదమంత్రాలు పఠిస్తూ ఎదురువెళ్లారు. పరమేశ్వరుడు అందరినీ పరామర్శిస్తూ, కొందరికి నమస్కరించి, కొందరిని ఆలింగనంచేసుకొని, కొందరితో ఛలోక్తులాడి, స్త్రీ పురుష బాల వృద్ధులను, పండిత పామరులను, అందరినీ ఉచిత రీతిని ఆదరించి, అందరినీ ఆనంద సాగరంలో ముంచివేశాడు. మొదట దేవకీ వసుదేవులకు ప్రణమిల్లి, ఆరుగురు సవతి తల్లులకు నమస్కరించి, ప్రియాలాపనలు చేసి, తరువాత నిజకాంతల గృహాలకు వెళ్లాడు. విరహాగ్నిచే తపించిపోతూ ఉప్పొంగిపోతున్న ప్రేమాతిశయముతో పరవశలైయున్న పత్నులందరినీ సంతృప్తి పరచి తరింపజేశాడు. ప్రకృతికి పరుడును, మాయాధినాథుడును అయిన పరమేశ్వరుడు, మానవరూపమును ధరించినవాడై, మానవునివలె సకల కార్యకలాపాల్లోనూ పాల్గొంటూ, మానవ సహజమైన ప్రేమాభిమానాలను ప్రదర్శిస్తూ మెలగుతుండేవాడు. ఆపరమేశ్వరుడే లీలామానుష రూపధారియై శ్రీకృష్ణునిగా వెలసి, భక్తుల్ని అనుగ్రహించి తరింపజేశాడు.

అని శౌనకాది ఋషులకు సూతుడుచెప్పెను.

## ధృతరాష్ట్రుని చరమదశ

మహాభారత యుద్ధము జరుగకముందు ఒకనాడు ధృతరాష్ట్రుని కోరికపై కౌరవులశ్రేయస్సును కోరి, విదురుడు కొన్ని సలహాలనిచ్చాడు. ఆ సలహాలు నచ్చక దుర్యోధనుడు మహాత్ముడైన విదురుని నానాదుర్భాషలాడి, నిండుసభలో అవమానించాడు. ఇక తన సలహాలకుగాని, తనకుగాని, ఆకొలువులో తావులేదని గుర్తించిన విదురుడు తన

ధనుర్బాణాలను సభాద్వారమువద్ద విసర్జించి, తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు. మైత్రేయమునివద్ద కర్మయోగాది- అనేక విషయాలలో జ్ఞానాన్ని సంపాదించి, తిరిగి హస్తినాపురి చేరుసరికి మహాభారత యుద్ధము సంభవించి, కౌరవులు నశించి, యుధిష్ఠిరుడు రాజు అయి, గాంధారీ ధృతరాష్ట్రులు, ధర్మజుని పోషణలోనుండడం జరిగినది.

తిరిగివచ్చిన విదురుని యుధిష్ఠిరుడు, ఆయన సోదరులు అమితానందముతో నాహ్వానించి, ఆయనను సకల గౌరవమర్యాదలతో సత్కరించారు. విదురుని ఎడబాటునకు బాధపడ్తున్న వారందరూ అతని రాకకు మిక్కిలి సంతసించారు.

ఆతడు దర్శించిన స్థలాల విశేషాలనూ, ఆయా స్థలాలలోనున్న తమ బంధువుల క్షేమ సమాచారములనుగురించి తెలుపవలసినదిగా యుధిష్ఠిరుడు విదురుని అర్థించాడు. ద్వారకలో సంభవించిన యదువంశనాశము, శ్రీకృష్ణ నిర్యాణములు తప్ప, తక్కిన వివరాలన్నీ విదురుడు తెలియజేశాడు. విదురుడు అక్కడే కొన్నాళ్లుండి, మారుతున్న కాలగతిని గ్రహించియున్నవాడు గనుక ధృతరాష్ట్ర గాంధారులకు శ్రేయోమార్గము చూపాలనుకొన్నాడు.

మాండవ్యమునిశాపమువలన యముడు భూలోకములో దాసీపుత్రుడై విదురునిగా జన్మించాడు. అందుచేత అతనికి జీవులయొక్క మృత్యుకాలము తెలుసు. ధృతరాష్ట్రుని హితము కోరి, అతడొకనాడు ఇలాగ సంభాషిస్తాడు: "ఓ మహారాజా! కాలము అతిశక్తిమంతమైనది. దానిగతినిగాని, చేష్టితాలుగాని ఎవ్వరూ ఆపలేరు, మార్చలేరు. ఒకప్పుడు కౌరవ సామ్రాజ్యము ధన, కనక, వస్తు, పుత్ర సంపదలన్నిటితోనూ తులతూగుతూ ఉండే మీయొక్క స్థితి ఏమయినది? ఎలాగో కేవలం ప్రాణాలతోనుంటే చాలుననుకొనే హీనదశకు మీరు దిగజారిపోయారు. రానున్నవి ఇంకా దుర్భరమైన రోజులు. మార్గాంతరం ఆలోచించవలసిన సమయమాసన్నమైనదని గ్రహించండి.

శా॥ పుట్టంధుండవు పెద్దవాడవు మహాభోగంబులాలేవు నీ
పట్టెల్లం జెడిపోయె దుస్సహ జరాభారంబుపైఁ గప్పె నీ
చుట్టాలెల్లరు పోయిరాలుమగలున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయల పంచనుండ తగవే కౌరవ్యవంశాగ్రణీ? 309

నీకొడుకులు పాండవులనెన్ని బాధలు పెట్టారో నీకు తెలుసుకదా! వారిని చంపించాలని ఇంటికి నిప్పంటించలేదా! వారికి విషాన్నముపెట్టించలేదా! వారి భార్యను నిండుసభలో ఘోరంగానవమానించలేదా! వారిధనాన్ని రాజ్యాన్నీ అపహరించి, వారిని అడవులపాలు చెయ్యలేదా! అలాంటి పాండవులే దయతలచి, మిమ్మల్ని పోషిస్తుంటే, ఓ రాజా! పుట్టుగుడ్డివైయుండి, మహాభోగాలు పోయి, బంధువులంతా చనిపోయి, ముసలితనముపైబడి, ఆలుమగలు దుఃఖమగ్నులైయుండి ఇంకను ప్రాణములయందు ప్రీతిగలిగి దాయాదులను పట్టుకొని వేలాడవలసినంత విలువైనట్టిదా ఈ దేహము?

క॥ బిడ్డలకు బుద్ధిచెప్పని గ్రుడ్డికిఁ పిండంబు వండుకొనిపొండిదె పైఁ
బడ్డాడని భీముండారగొడ్డెములాడంగ కూడు కుడిచెదవధిపా! 311

క॥ దేహమునిత్యము కాదని మోహముఁ దెగగోసి సిద్ధముని వర్తనుఁడై
గేహము వెలువడు నరుడుత్సాహముతో జెందు ముక్తి సంపద నధిపా. 313

పుత్రవ్యామోహముచే బిడ్డలకు బుద్ధిచెప్పకుండా వినాశము తెచ్చుకొన్న గ్రుడ్డివానికి ఇదిగో పిండాకూడు. వండి పొయ్యండి, మామీద వచ్చిపడ్డాడు – అని భీముడు దెప్పి పొడుస్తూ పెట్టిన తిండి తింటావా రాజా! దేహము శాశ్వతము కాదు, నశించునట్టిదని, ఎఱింగి దానియందు మోహాన్ని తొలగించుకొని, సన్న్యసించి ఇల్లు విడిచివెళ్లేవానికి సులువుగా ముక్తి లభిస్తుంది కౌరవరాజా! అందుచేత నీవు ఎవ్వరికీ తెలియకుండా ఇల్లు విడిచి పారిపోవడం మంచిది. రానున్నది హీనమైన కాలము. అది మంచి ఆలోచనలను రానివ్వదు. భగవానునియందు మనస్సు నిలువ నివ్వదు, అని చెప్పిన విదురుని హితవాక్కులను బాగుగా అర్థము చేసుకొని, తన తప్పిదాన్ని గుర్తించి, వైరాగ్యము తెచ్చుకొని, విదురుని సహాయముతో గాంధారి అనుసరించగా హిమాలయానికి వెళ్లిపోయాడు. అక్కడ యోగ నిష్ఠుడై శ్రీహరియందు చిత్తమును నిలిపి, దేహత్యాగము చేశాడు. గాంధారి సహగమనంచేసినది. విదురుడు మళ్లీ తీర్థయాత్రలు చేయసాగాడు.

ప్రతిఉదయమూ పెదతండ్రి, పెద్దమ్మల దర్శనంచేసికొని, నమస్కరించి వచ్చే అలవాటు ప్రకారము, ధర్మజుడు సోదరసమేతముగా, ధృతరాష్ట్రుని వసతిగృహానికి పోయిచూడగా, వారు అక్కడలేరు. విదురుడు కూడ లేనందున ఆందోళనచెంది, అక్కడనే నివసిస్తున్న సంజయుని అడిగాడు. సంజయునికి కూడ వారిజాడ తెలియనందున, ఏమీ పాలుపోక మిక్కిలి దుఃఖముతో కుమిలి పోయాడు. కొద్ది రోజులకు తుంబురునితో సహా నారదుడచ్చటకు విచ్చేసినాడు. యుధిష్ఠిరుడు వారినాహ్వానించి సత్కరించి, తనశోక కారణాన్ని తెలియజేసినాడు. త్రిలోక సంచారియైన దేవర్షి నారదునకు తెలిసియుండవచ్చునని గాంధారీ ధృతరాష్ట్ర విదురుల గురించి అడిగాడు. నారదుడిలాగ బదులు చెప్పాడు.

"ధర్మనందనా! వృద్ధులూ, అంధులూ, నిస్సహాయులూ అయిన గాంధారీ ధృతరాష్ట్రులు నీయొక్క పోషణ, సంరక్షణలకు దూరమై ఎక్కడున్నారో, ఎటువంటి ఇక్కట్లను, ప్రమాదాలనూ ఎదుర్కొంటున్నారో అని శోకింపనేల? వారినీ నిన్నూ సమస్త జీవరాసులనూ పోషించి, సంరక్షించేది ఆశ్రీహరియే. మానవులమధ్య సంయోగ వియోగాలు ఆ పరమేశ్వరుని యొక్క లీలావిలాసాలచేతనే కలుగుతుంటాయి. నీవు చేయగలిగినదేదీలేదు. మానవుడు అజ్ఞానముచే మోహమమకారాలను పెంచుకొని, సంయోగ వియోగాలకు చలించిపోతాడు. నీయొక్క అండలేనిదే నీవారైన ఆ వృద్ధులెలాగ జీవిస్తారని నీవు క్రుంగిపోతున్నావు. ఇది నీకు తగదు. ఈ చేతనాచేతనాత్మకమైన జగత్తంతా తానే అయి, దానిని ధరించి నియమించేవాడు పరమేశ్వరుడు. మీపెద్ద తలిదండ్రులు హిమాలయ దక్షిణ సానువు లోనున్న ఋషుల ఆశ్రమానికి చేరినారు. అచ్చట గంగ సప్తస్రోతమనే పేరుతో ఏడు పాయలైయున్నది. వారు అక్కడ కేవలం జలపానము చేసి ధ్యానమగ్నులైయున్నారు. ఇంద్రియ మనోవ్యాపారాలను నిరోధించి, ప్రాణవాయువును నియమించి సత్త్వరజస్తమోగుణాలకతీతులై శుద్ధ చిత్తముతో నాత్మధ్యానము చేసికొనుచున్నారు. నేటికి ఐదవ దినమున, వారు పరమాత్మను చేరుతారు.యోగాగ్నిలో నీ పెదతండ్రి భస్మమవుతాడు. అతని భార్య ఆ అగ్నియందే ప్రవేశించి భస్మమవుతుంది. వారు పొందిన సద్గతికి విదురుడు సంతసించి, తీర్థయాత్రలకు వెళ్లిపోతాడు." అని చెప్పి, నారదుడు మళ్లీ ఇలాగ అన్నాడు: "కుంతికుమారా! శ్రీహరి ఈ లోకంలో నవతరించిన దైవకార్యము ముగిసినది. ఇక కొలది దినాలలో శ్రీకృష్ణుడు వైకుంఠగమనానికి సిద్ధముగా నున్నాడు. ఆయన నిష్క్రమించిన పిదప మీరంతా ఇక ఈ లోకములోనుండ వలసిన పనిలేదు. కాలగతినెవ్వరూ ఆపలేరుగనుక, నీవు నీ భ్రాంతిని తొలగించుకొని నిశ్చింతగా వేచియుండుము" అని చెప్పి, వెళ్లిపోయాడు.

ధర్మజుడు నారదుని నిష్క్రమణతరువాత ఆయనవాక్కులను మననం చేసుకొన్నాడు. రానున్నవి చెడ్డరోజులని వ్యాకుల పడ్డాడు. భీముని పిలిచి ఇలాగన్నాడు:

"తమ్ముడా! శ్రీకృష్ణుని చూడడానికి అర్జునుడు వెళ్లి ఏడునెలలైనా అక్కడినుండి ఎలాంటి వర్తమానమూలేదు. ఎవరు ఎలాగున్నారోకదా! నారదుడు చెప్పినట్లు అశుభకాలం దాపురించినట్లు సూచనగా ఘోరమైన ఉత్పాతాలు సంభవిస్తున్నవి. అనేకమైన అశుభ శకునాలు, దుర్నిమిత్తాలు కనిపిస్తున్నవి. ప్రజలలో క్రోధము, లోభము, స్వార్థము, క్రౌర్యము, అసత్యము మొదలైన అవగుణాలు పెరిగిపోతున్నవి. భార్యాభర్తల మధ్య విశ్వాసం సడలినట్లూ, తలిదండ్రులకు బిడ్డలకు మధ్య ప్రేమాదరగౌరవాలూ, గురుశిష్యుల మధ్య వాత్సల్య శ్రద్ధా భక్తులూ, న్యాయశాస్త్రాల పట్ల ప్రజల గౌరవ విధేయతలు, ధర్మవర్తనమూ సన్నగిల్లుతున్నట్లు ప్రత్యక్ష నిదర్శనాలు కనిపిస్తున్నవి. విపరీత కాలం దాపురిస్తున్నట్లు తెలుస్తుంది. నారద మహర్షి చెప్పినట్లు బహుశః భూమినుండి శ్రీకృష్ణ భగవానుని పాదస్పర్శా భాగ్యము అంతరించినదేమోయని భయముగా నున్నది. రానున్న కాలం ఎలాగుంటుందో కదా!" అని వాపోయాడు. అప్పుడే ద్వారకనుండి అర్జునుడు మరలివచ్చాడు.

అని శౌనకాది ఋషులకు సూతుడుచెప్పెను.

## అర్జునునివిషాదము- ధర్మజునివైరాగ్యము

ద్వారకనుండి తిరిగి వచ్చిన అర్జునుడు ఖిన్నవదనుడై యుండెను. అతడు యుధిష్ఠిరుని పాదాలపైఁబడి, కన్నీరు మున్నీరుగా నేడ్చుచూ దీనుడై అన్నపాదాలపై వాలిపోయాడు. ధర్మజుడు తమ్ముని లేవనెత్తి కన్నీరు తుడుస్తూ, ఏమిజరిగినదో, విషయం చెప్పుమన్నాడు. ద్వారకలో శూరసేన, ఉగ్రసేన, వసుదేవ, బలరామాది యాదవ ముఖ్యులు క్షేమమేనా అని అడిగాడు. వసుదేవ పత్నులేడుగురూ వారి పుత్రులూ కుశలమేనా అని అడిగాడు. అక్రూర శ్రుతదేవ - ఉద్ధవాది యాదవ సజ్జనులు క్షేమమే కదా అని అడిగాడు. ప్రద్యుమ్నాది శ్రీకృష్ణ పుత్రులు బాగున్నారా అని అడిగాడు. శ్రీకృష్ణపత్నులందరూ ఆదేవదేవుని సేవిస్తూ సంతోషంగానున్నారు కదా! అని అడిగాడు. దేనికీ బదులు చెప్పకుండా ఏడుస్తున్న తమ్మునితో చివరకిలాగన్నాడు:

శా॥ అన్నాఫల్గున! భక్తవత్సలుడు బ్రహ్మణ్యుండు గోవిందుడా
పన్నానీకశరణ్యుడీశుడు జగద్భద్రానుసంధాయి శ్రీ
మన్నవ్యాంబుజ పత్రనేత్రుడు సుధర్మా మధ్య పీఠంబునం
దున్నాడా బలభద్రుగూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్ 348

నాయనా అర్జునా! భక్తవత్సలుడు, ఈశ్వరుడు, జగద్రక్షకుడూ అయిన గోవిందుడు బలభద్రునితో గూడి సుధర్మాసభాస్థలిలో సుఖాసీనుడై యున్నాడుకదా! అని అడిగినా జవాబు రానందున ధర్మజుడు మళ్లీ ఇలాగడిగినాడు. “నాయనా నీవిచారానికి కారణమేమిటి? అవమానింపబడ్డావా, చేయరానిదేమైనా చేశావా?

క॥ ఓడితివో శత్రువులకు, ఆడితివో సాధుదూషణాలాపంబుల్
కూడితివో పరసతులను, వీడితివో మానధనము వీరులనడుమన్॥ 352

క॥ తప్పితివో యిచ్చెదనని, చెప్పితివో కపటసాక్షి చేసినమేలుం
దప్పితివో శరణార్థుల రొప్పితివో ద్విజులపసుల రోగుల సతులన్. 353

క॥ అడచితివో భూసురులను కుడిచితివో బాల వృద్ధ గురువులు వెలిగా
విడిచితివో ఆశ్రితులను ముడిచితివో పరుల విత్తములు లోభమునన్. 354

ఓ విజయుడా! ఏశత్రువు చేతనైనా నీవోడిపోయావా, సాధువులను దూషించావా, పరసతులతో కూడినావా? వీరులమధ్య మానధనాన్ని పోగొట్టుకొన్నావా, ఇస్తానని చెప్పి మాటతప్పావా? అబద్ధపు సాక్ష్యము చెప్పావా? చేసిన మేలుకు దెప్పిపొడిచావా? శరణుజొచ్చిన వారిని, బ్రాహ్మణులను పశువులను, రోగులను, స్త్రీలను తరిమివేశావా? బ్రాహ్మణులను అణగగొట్టావా, పిల్లలను, వృద్ధులను, గురువులను విడిచి, నీవొక్కడవే వేరుగా భోజనం చేశావా? ఆశ్రితులను ఆదుకొనకుండా విడిచిపెట్టేవా? లోభముచే  పరుల సొత్తును కాజేశావా? నాయనా చెప్పు, నిన్నింతగా బాధించిన విషయమేమిటో! అని అడిగిన అగ్రజునితో దుర్భరదుఃఖ భారముతో కుమిలిపోతూ, పెన్నిధిని కోల్పోయిన పేదవలె దీనవదనుడై, అర్జునుడిలాగ విన్నవించాడు.

క॥ మనసారథి మన సచివుడు మనవియ్యము మన సఖుండు మనబాంధవుడున్
మనవిభుడు గురుడు దేవర మనలను దిగనాడి చనియె మనుజాధీశా! 356

అన్నా! వాసుదేవుడు మనలను విడిచి వెళ్లి అన్యాయం చేసినాడు కదా! అతని అనుగ్రహం చేతనేకదా, మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని మనం పొందగలిగితిమి. అతని చేతనే కదా ఇంద్రుని గెలిచి, ఖాండవవనాన్ని దహించి, మయుని చేత అద్భుతమైన భవనాన్ని కట్టించగలిగాము. అతని దయచేతనే కదా భీమసేనుడు జరాసంధుని వధించగలిగినాడు, మనము రాజసూయయాగాన్ని చేయగలిగితిమి. నిండుసభలో ద్రౌపదిని దుశ్శాసనుడు వివస్త్రను చేయబూనుకొని విఫలుడగుట అతని దయవలననే. దుర్యోధనునిచే పంపబడి, పదివేలమంది శిష్యులతో వచ్చిన దుర్వాసముని అతని

దివ్యశక్తిచేతనే కదా సంతృప్తి జెంది, మనల్ని శపించకుండా మరలిపోయాడు. అతని అనుగ్రహం చేతనేకదా నేను పరమశివుని మెప్పించి, పాశుపతాస్త్రాన్ని పొందగలిగాను. అతని ఆశీస్సులచేతనే కదా, నేను ఇంద్రునితో సహా ఇంద్రసింహాసనం పైనికూర్చొనగలిగాను. అతని శక్తిచేతనేకదా దేవతలగురించి నివాతకవచాది అసురులను చంపగలిగాను. అతని అనుగ్రహంచేతనే కదా విరటునిగోవులను కౌరవులపహరించకుండా కాపాడగలిగాను. అతని శక్తిచేతనేకదా కర్ణసైంధవుల తలపాగాలను తెచ్చి, ఉత్తరకు ఇవ్వగలిగాను. అతని కృపా కటాక్షాలచేతనేకదా కురుక్షేత్రంలో మనకు విజయం సిద్ధించినది. నాకు డాలువలె ముందరనుండి, కర్ణ భీష్మ ద్రోణాదులు కురిపించే అస్త్రశస్త్రాలను అడ్డుకొని నన్ను రక్షించుతూ, తన చూపులచే శత్రుసైనికులను నిర్జీవులుగా చేయడం చేతనేకదా మనము విజయం పొందగలిగాము. ఇక నాయెడల అతడు చూపుతుండే ప్రేమాదరాలను నేను వర్ణించలేను.

సీ॥ చెలికాడరమ్మని చీరునన్నొకవేళ మన్నించునొకవేళ మఱదియనుచు
బంధుభావంబున పాటించునొకవేళ దాతయై యొకవేళ ధనములిచ్చు
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు బోధియై యొకవేళ బుద్ధి సెప్పు
సారథ్యమొనరించు చనవిచ్చునొకవేళ క్రీడించునొకవేళ గేలిసేయు
తే॥ ఒక్క శయ్యాసనంబున నుండు కన్నతండ్రికైవడి చేసిన తప్పుగాచు
హస్తములు పట్టి పొత్తున నారగించు మనుజవల్లభ మాధవు మఱపురాదు. 367

నన్ను ప్రేమతో అనేకనామాలతో పిలిచే వాడు, విజయా, ధనంజయా, హనుమద్ధ్వజా, ఫల్గునా, పాండునందనా, అర్జునా, అంటూ, భుజాలు తాకించుచు తిరిగేవాడు. అంతేకాదు ప్రేమాతిశయముతో భార్యలు తమలో తాము వాదులాడుకొంటున్నప్పుడు సమాధాన పరచడానికి నన్ను పంపించేవాడు. ప్రియసతులతో తాను సలుపుతుండు శృంగారచేష్టలను కూడ మర్మము లేకుండా నాతో ముచ్చటించేవాడు. ఇలాంటి ప్రేమమూర్తి అయిన ప్రియసఖుని, హృదయాధి నాథుని, జగదీశ్వరుని, కృష్ణుని విడిచి నేనెలాగుండగలను? అక్కటా! అతని కంటే ముందుగానే పోకుండా నాప్రాణములెందుకు నిలిచియున్నవి? ఇదినాపూర్వజన్మల యొక్క దుష్కర్మఫలమేమో!

ఇప్పుడు నాకు ఆపరమేశ్వరుని అండదండలు లేవుగనుక, నేను శ్రీకృష్ణుని పరివార జనాన్ని ద్వారకనుండి తీసుకొని వస్తుండగా బోయలు చుట్టుముట్టి నన్నోడించారు. ఒక నిస్సహాయ – అబలవలె నేనోడిపోయాను. అనేక యుద్ధాలలో విజయంసాధించిన నా గాండీవమే శక్తిహీనమైపోయినది. నా శౌర్యం అంతరించిపోయినది. ఇదివరకు మెరుపు తీగలవలె పనిచేసికొనియున్న నారథము, గుర్రాలు కూడ నిర్వీర్యమైపోయాయి. ఎందరో రాజులను వీరులను పాదాక్రాంతం చేసియున్న నేను, ఇప్పుడేమీ చేయలేని ఒక భీరువునై పోయాను. ఇప్పుడు నాకు తెలిసినది: నాశక్తి, యుక్తి, శౌర్యము, బలము, విజయము, సర్వస్వమూ ఆ శ్రీకృష్ణపరమాత్మవేగాని నావి కావు," అని.

అన్నా! ప్రభాసములో (ద్వారక సమీపములో) యాదవులంతా బలగర్వమదాంధులై తమలోతాము పోట్లాడుకొని, ఏముగ్గురో నలుగురోతప్ప, అందరూ నశించిపోయారు. అని అర్జునుడు చెప్పగా అందరూ నిశ్చేష్టులై విషాదంతో క్రుంగిపోయారు. కుంతీదేవి నిర్లిప్తయై అంత్యకాలం సమీపించినట్లు తెలుసుకొని, చిత్తాన్ని శ్రీకృష్ణాయత్తము చేసుకొన్నది. అర్జునుడు కురుక్షేత్రములో భగవానుడు చేసిన గీతాబోధను మననంచేసుకొంటూ శాంతిని పొందాడు. వాసుదేవ పదధ్యానముచే నతని చిత్తము శుద్ధమయినది.

క॥ ఏదినమున వైకుంఠుడు మేదినిపై దాల్చినట్టి మేను విడిచి నా
డా దినమున నశుభప్రతిపాదకమగు కలియుగంబు ప్రాప్తంబయ్యెన్. 381

(శ్రీకృష్ణపరమాత్మ ఏరోజైతే అవతారమును చాలించినాడో ఆదినముననే అశుభసూచకమైన కలియుగము ఆరంభమైనది.) యుధిష్ఠిరుడు పరీక్షిత్తునకు రాజ్యపట్టాభిషేకముచేసి విరాగియై సర్వమూ పరిత్యజించి, తమ్ములు, భార్య అనుసరించగా హిమవత్పర్వత ప్రదేశానికి పయనమైనాడు. తరువాత జ్ఞానాగ్నిచే కర్మలు భస్మముకాగా అందరూ మోక్షపదాన్ని పొందారు. విదురుడు ప్రభాసతీర్థంలో హరియందు చిత్తాన్ని నిలిపి, దేహత్యాగము చేసి, తన యమధర్మరాజ పదవిని పొందాడు.

## పరీక్షిత్తుమహారాజు

ఉత్తరాభిమన్యుల పుత్రుడైన పరీక్షిత్తు అనబడే విష్ణురాతుడు యుధిష్ఠిరునిచే పట్టాభిషిక్తుడై మహాభాగవతుడై, ఉత్తమగుణసంపన్నుడై, పరాక్రమశాలియైన మహారాజైనాడు. మేనమామ అయిన ఉత్తరుని కుమార్తె ఐరావతిని వివాహమాడి జనమేజయాదులైన నలుగురు పుత్రులను పొందాడు. కృపాచార్యుల ఆధ్వర్యాన మూడు అశ్వమేధయాగాలను జరిపించగా దేవతలు నిజరూపాల్లోనే వచ్చి హవిస్సుల నందుకొన్నారట.

దిగ్విజయానందంలో దేశాటనం చేస్తుండగా నొకనాడు, రాజవేషధారియైన ఒక అనాగరికుడు ఒంటి కాలితోనున్న ఒక ఎద్దునూ, కన్నీరు కార్చుతున్న ఒక ఆవునూ కాలితోతన్నుతూ అదలిస్తుండడం చూచి, వాడే "కలి" యని గుర్తించి, అతడు వానిని నిగ్రహించాడు. అది ఎలాగ జరిగిందంటే-

పరీక్షిత్తు దిగ్విజయ యాత్రకై బయలుదేరాడు. భద్రాశ్వము, కేతుమాలము, ఇలావృతము, రమ్యకము, హిరణ్మయము, హరివర్షము, కింపురుషము, భారతము మొదలైన దేశాలను జయించినాడు. ఆయాదేశాలలోని ప్రజలు, పండిత పామరులు పఠిస్తుండే పూర్వ రాజుల చరిత్రలను వింటూ, ఆగానకథలద్వారా- పాండవులకు శ్రీకృష్ణుడు చేసిన సారథ్య, సఖ్య, సభాపతిత్వ, సాచివ్య, రచన, వీరాసన, మాతృభావాది సహాయాలను, యాదవపాండవ స్నేహానుబంధాలను, పాండవులకుండే వాసుదేవపదారవింద భక్తి విశేషాలను, తెలుసుకొంటూ, పద్మనాభపదపద్మాంకిత పవిత్రమానసుడై పరవశిస్తుండేవాడు. అలాంటి సమయంలో ఏకపాదముతో సంచరించే వృషభరూపుడైన ధర్మదేవతయూ, కళావిహీనమై కన్నులనుండి దుఃఖాశ్రువులు రాల్చుతూ, లేగలేని గోమాత రూపములోనున్న భూదేవియూ కనిపించారు. వారి సంభాషణను పరీక్షిత్తు విన్నాడు.

### వృషభగోమాతలసంభాషణ:

"ఓ గోమాతా! భూమాతా! నీదుఃఖానికి కారణమేమిటి తల్లీ! మూడుకాళ్లులేని నన్ను హీనులు బంధించి హింసిస్తారనియా? అయోగ్యులు నిన్ను పాలిస్తారనియా? మానవులు యజ్ఞయాగాదులను మానివేసి అమరులకు ఆహారంలేకుండా చేస్తారనియా? పాలకులు పండితుల్ని నిరసించడంచేత, విద్య దుర్మతుల వశమవుతుందనియా? హీనులు రాజులౌతారనియా? బ్రాహ్మణులు వేదాధ్యయనం మానివేసి భ్రష్టులౌతారనియా? స్త్రీలకు రక్షణ ఉండదనియా? భర్తలు భార్యలను, పుత్రులు తలిదండ్రులనూ అలక్ష్యంచేస్తారనియా? మనుజులు అన్నపాన, మైథున, శయన వాహనాది సుఖాలయందాసక్తులై, పరమార్థాన్ని మరచిపోతారనియా? పాపవృద్ధివలన పాడిపంటలు జలాశయాలు క్షీణిస్తాయనియా? నీభారాన్ని తగ్గించడానికవతరించిన శ్రీకృష్ణ భగవానుడు నిన్ను విడిచివెళ్లినాడనియా? ఇకనుండి దుష్టులు నిన్ను హింసిస్తారనియా? చెప్పుతల్లీ" అని అడిగాడు. అప్పుడు భూమాత ఇలాగన్నది.

**భూమాత: "ఓధర్మదేవతా!**

**క॥ ఈలోకంబున పూర్వము నాలుగు పాదముల నీవు నడతువు నేడా**
**శ్రీలలనేశుడు లేమిని కాలముచే నీకు నొంటి కాలయ్యెగదే! 399**

నీ ఊహలన్నీ సరియైనవే. నాదుఃఖానికి కారణాలు నీకు తెలుసు. సకల సద్గుణ నిధియైన శ్రీకృష్ణ పరమాత్మ నిష్క్రమించాడు కదా! ఆదేవదేవుని గుణగణాలను ఎలాగ వర్ణించగలం? అయినా కొన్నింటిని చెప్పుకొందాం:- సత్యము, శౌచము, దయ, క్షమ, త్యాగము, సంతోషము, ఆర్జవము, శాంతి, దాంతి, తపస్సు, సమత్వము, ఓరిమి, వైరాగ్యము, పాండిత్యము, జ్ఞానము, ఐశ్వర్యము, శౌర్యము, తేజస్సు, బలము, స్మృతి, స్వాతంత్ర్యము, కాంతి, ధైర్యము, మార్దవము, ప్రాగల్భ్యము, వినయము, శీలము, ప్రాణశక్తి, శరీరశక్తి, జ్ఞానాది గుణసంపత్తి, గాంభీర్యము, స్థైర్యము, ఆస్తికత్వము, కీర్తి, మానము, నిరహంకారము వంటి గుణములే కాకుండా, బ్రహ్మణ్యత, శరణ్యతలాంటి మహాగుణాలు ఆప్రభువునందు

మెండుగానుండెను. కాని, సమస్త కల్యాణగుణనిధి అయిన ఆ శ్రీనివాసుడు ఇప్పుడు నన్ను విడిచి వెళ్లినాడు. ఘోరకలిప్రభావముచేత పాపగ్రస్తులు, రోగగ్రస్తులూ అవుతున్న ప్రజల గురించి దుఃఖిస్తున్నాను. ఇకనుండి దేవతలకు, పితృదేవతలకు, ఋషులకు, నీకు, నాకు, ధీయుతులకు, నానావర్ణాశ్రమములవారికి, గోవులకు జరుగబోవు అనాదరణ హింసలకు బాధపడ్తున్నాను. శ్రీహరిపాదస్పర్శ నాపైనున్నంతవరకూ, నేను స్థిరంగాను, నిశ్చింతగాను ఉండగలిగితిని. ఆపాదస్పర్శచే నామేను హర్షమోదాలతో పులకితమై శక్తిమంతమై యుండటంచేత సస్యాలు పుష్కలంగా పండి, అంతటా సుభిక్షంగా నుండేది. ఇక మీదనెలాగుంటుందో? అని చింతిస్తున్నాను". అని గోరూపములోనున్న భూమాత చెప్పినది. ఈ సంభాషణను పరీక్షిత్తు మహారాజు విన్నాడు.

ఇంతలో అధమవర్గానికి చెందిన వ్యక్తి ఒకడు రాజవేషముధరించి, అక్కడికివచ్చి, తెల్లని శరీరముగల వృషభరాజాన్ని నిర్దయుడై తన్ని నేల గూల్చాడు. తరువాత కన్నీరు కార్చుతున్న గోమాతను కూడ తన్న నారంభించాడు.

ఈ దృశ్యాన్ని చూచి సహించలేక పరీక్షిత్తు మహారాజు అడ్డము వచ్చి ఇలాగన్నాడు: "ఓయీ నీవెవ్వడవోగాని, రాజవేషము ధరించి, కిరాతకునివలె ప్రవర్తిస్తున్నావు. ఈ వృషభరాజము గోమాత నీకేవిధమైన హానినీ చెయ్యక పోయినా, నిష్కారణముగ నీవేల వాటిని తన్నుతున్నావు? శ్రీకృష్ణార్జునులు నిష్క్రమించారుకదా అని దారుణకృత్యాలు చేయదలచుకొన్న వారిని దండించడానికి, పాండవ పౌత్రుడనైన నేను సిద్ధముగా నున్నాను. నీవు శిక్షార్హుడవు. నిన్ను దండించవలసినదే" అని చెప్పి వృషభముతో ఇలాగన్నాడు:

"ఓవృషభరాజమా! గడ్డిమేసి, నీరు త్రాగి, ఎవ్వరికీ ఏహాని చెయ్యనట్టి నీయొక్క మూడు కాళ్లను తీసివేసిన ఆ కఠినాత్ముడెవ్వడో చెప్పు. నేను వానిని శిక్షిస్తాను." అని, గోమాతతో నిలాగన్నాడు: "తల్లీ గోమాతా! శ్రీహరి ఈ భూమిని విడిచివెళ్లాడని దుఃఖించకు. నీకు ఎట్టి బాధలూ కలుగకుండా నేను కాపాడుతాను.

**క॥ సాధువులగు జంతువులకు, బాధలుగావించు ఖలుల భంజింపని రా**
**జాధముని ఆయుఃస్వర్గ శ్రీధనములు వీడిపోవు సిద్ధము తల్లీ! 420**

**క॥ దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబుఁ జేయుగ నృపులన్**
**స్రష్ట విధించె పురాణ ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ. 421**

"ఓ గోమాతా! సాధుజంతువులకు బాధలు కలిగించే దుష్టులను భంగ పరచని రాజుయొక్క ఆయుస్సు, పుణ్యము, సంపద, ధనము, సర్వమూ అతనిని విడిచిపోతాయి. దుష్టజనుల నడ్డుకోవడము శిష్టజనుల నాదుకోవడము రాజులకు బ్రహ్మచేవిధింపబడిన పరమధర్మములని పూర్వులు చెప్తారు. కనుక నేను నిన్ను రక్షిస్తానమ్మా! విచారించకు" అని చెప్పగా వృషభుడిలాగన్నాడు. "నరేంద్రా! నీవిప్పుడు చెప్పిన మాటలన్నీ ధర్మనందనుని పౌత్రుడవైన నీకు తగియేయున్నవి. మేము ప్రాణులకు దుఃఖహేతువులము కాము. సుఖకారకులము. మనకు సంభవించే కష్టాలు ఇతరుల అధర్మవర్తనము వలన కలిగినట్లు మనం భావించరాదు. ఆ పరమేశ్వరుని వలననే సర్వమూ సంభవిస్తుంది. ఆయన యొక్క కృత్యాలగురించి తర్కించడంగాని, కారణాలు నిర్దేశించడంగాని, చెయ్యరాదు. అవి మనకు గ్రాహ్యాలు కావు. నా యీ స్థితికి కారణం నాకు తెలియదు. నీవే యోచించి చెప్పు." అని వృషభము చెప్పగా, పరీక్షిత్తుడు సత్యాన్ని గ్రహించి ఇలాగ చెప్పాడు: "ఓ వృషభరూప ధర్మమూర్తీ! నీవు ధర్మజ్ఞుడవు. కృతయుగంలో, తపః శౌచ దయా సత్యాలు నాలుగు నీయొక్క నాలుగు పాదాలైయుండెను. క్రమముగా నొక్కొక్క యుగములో నొక్కొక్క పాదమూ లోపించి, కలియుగములో నొక్క పాదమే మిగిలియున్నదని విజ్ఞులు చెప్తారు." అని చెప్పి భూదేవి నూరడించి, మెరుపువలె తన ఖడ్గాన్ని బైటకులాగి, ఝుళిపించి, కలిపురుషునిపైకి లంఘించాడు. అంతట భయ విహ్వలుడైన కలిపురుషుడు రాజవేషాన్ని విడిచిపెట్టి, వాడిన మోముతో పరీక్షిత్తుని పాదాలపైబడి శరణువేడుకొన్నాడు. పరీక్షిత్తు కనికరించి, కలితో నిలాగన్నాడు, "ఓయీ! నీవు పాపబాంధవుడవు. రాజువలె వేషము ధరించావు గాని నీలో అన్నీ నీచప్రవృత్తులే కనిపిస్తున్నవి. అసత్యము, లోభము, చౌర్యము, దౌర్జన్యము,

దురాచారము, కపటము, మాయ, కాలుష్యము, అలక్ష్మీకరము మొదలైన అవగుణాలన్నీ నిన్ను ఆశ్రయించి యున్నవి. నీవలన నాప్రజలు బాధలకు గురిఅవుతారు. అందుచేత నీవునా రాజ్యములో నెక్కడా ఉండరాదని నేను శాసిస్తున్నాను. అని ఆజ్ఞాపించాడు. అప్పుడు కలిపురుషుడిలాగ వేడుకొన్నాడు: "ఓ మహారాజా! ఈ భూమండలంలో నీ అధికారంలేని చోటేలేదు. మరి నేను ఉండగలిగే స్థానమెక్కడుంటుంది? నేను నివసించడానికేదో ఒక స్థలముండాలికదా! నేనెక్కడుండాలో ఆజ్ఞాపించు" అని కోరిన కలిపురుషునితో పరీక్షితుడు కొంచెము యోచించి, ఇలాగన్నాడు. "నీ గురించి ఐదు స్థలాలను కేటాయిస్తున్నాను. వాటిని దాటి నీవు ఇతర స్థలాలలోనికి ప్రవేశించరాదు. నీవు ఉండగల స్థలాలివి. ప్రాణివధ, స్త్రీవ్యసనము, ద్యూతము, మద్యపానము జరుగుతుండే స్థలాలూ, సువర్ణ కాంక్షతో కూడియున్న – అసత్య, మద, కామ, హింస, వైరములు ప్రబలియుండే – ఈ ఐదు ప్రదేశాల్లోనుండ వచ్చును" అని చెప్పి కలిని పంపించివేశాడు. తరువాత వృషభమూర్తికి లోపించిన తపః, శౌచ, దయలు, అనబడే మూడు పాదాలనూ పునరుద్ధరించి, ధరణీతల్లికి ఆనందము కలుగజేసి, కలిపీడలేకుండా రాజ్యము పాలించాడు. పరీక్షిత్తుని రాజ్యకాలంలోనే మీరీయాగాన్ని ప్రారంభించారు. అని సూతుడు శౌనకాది ఋషులతో చెప్పెను.

### శృంగిశాపము:

ఈ విధముగా కలిని నిగ్రహించిన పరీక్షిన్మహారాజు దేశమును జనరంజకముగా చాలాకాలము పాలిస్తుండగా, విధివశాన ఒకనాడొక చిన్న తప్పు పనిచేసి బ్రాహ్మణశాపానికి గురియైనాడు, ఒకవారము దినాలలో ప్రాణము పోనున్నదని తెలుసుకొన్నవాడై, అతడు సర్వసంగ పరిత్యాగియై, శ్రీశుకయోగికి శిష్యుడై, విజ్ఞానయుతుడై గంగా తీరాన దేహత్యాగము చేసి, పరమపదాన్ని పొందాడు. అని చెప్పి, సూతుడు ఇంకా ఇలాగన్నాడు.

క॥ **హరివార్తలెఱుగు వారికి, హరి పదములు తలచువారి కనవరతంబున్**
**హరి కథలు వినెడి వారికి, మరణాగతమోహసంభ్రమము లేదనఘా! 436**

ఓపవిత్రుడా, శౌనక మునీ! హరిలీలలనర్థంచేసుకొనే వారూ, హరిచరిత్రలనాలకించేవారూ, హరిపదములను స్మరించేవారూ, మరణసమయంలోకూడ ఎటువంటి వేదనను ఆవేదనను తొందరపాటును తొట్రుపాటును పొందరు. పరీక్షిత్తుకూడా అలాగే స్థిరచిత్తుడై తన అంతిమఘడియలను హరిచింతనతో నెదుర్కొన్నాడు.

అప్పుడు శౌనకుడు సూతుని ఇలాగ అర్థించాడు:-

"ఓ సూతమహాశయా! వాసుదేవుని కల్యాణ గుణవిశేషాలనూ, పాండవ పౌత్రుడేవిధముగా ఆ నందనందనుని చరణసన్నిధిని పొందినదీ మొదలైన విషయాలను వినడానికి మామనస్సు ఉవ్విళ్లూరుతున్నది:

క॥ **పావనములు దురితలతాలావనములు నిత్యమంగళ ప్రాభవ సం**
**జీవనములు లక్ష్మీసంభావనములు వాసుదేవు పదసేవనముల్. 443**

ఆగోపాలదేవుని శ్రీపాదసేవలు పావనత్వాన్ని ప్రసాదించును, పాపలతలను ఛేదించును, జగతికి నిత్యకల్యాణాన్ని గూర్చును, శ్రీదేవి సేవలను ఆమోదించును, కనుక ఆ పరమభాగవతుడు సద్గతిని పొందినాడు." అనగా సూతుడిలాగ చెప్పాడు. "ఓ ఋషులారా!

సీ॥ **ఎవ్వని గుణజాల మెన్న జిహ్వాలులేక నలిన గర్భాదు లనంతు దంద్రు**
**కోరెడు విబుధేంద్ర కోటి నొల్లక లక్ష్మి ప్రార్థించె నెవ్వని పాదరజము**
**బ్రహ్మఎవ్వని పాదపద్మంబు కడిగిన జలము ధన్యతనిచ్చె జనులకెల్ల**
**భగవంతుడని యెడి భద్ర శబ్దమునకు నెవ్వడర్థాకృతి నేపు మిగులు**
ఆ॥ **నే మహాత్ము నాశ్రయించి శరీరాది సంగకోటినెల్ల సంహరించి**
**ప్రాభవమున మునులు పారమహంస్యంబు నొంది తిరిగిరాక యుందురెలమి. 448**

ఎవ్వని గుణాలను వర్ణించడానికి నాలుకలు చాలక బ్రహ్మాదిదేవతలు "అనంతుడు" అని అన్నారో, తనను కోరిన జ్ఞానికోటిని కాదని, లక్ష్మీదేవి ఎవని పాదపరాగాన్ని పూజించిందో, బ్రహ్మదేవుడెవ్వని పాదపద్మాలను కడుగగా నేర్పడిన నదీజలము లోకులందరికీ ధన్యత నిచ్చిందో, "భగవంతుడు" అనే పవిత్రశబ్దానికి సరియైన అర్థమై ఎవ్వని స్వరూపం వెలుస్తుందో, ఏ మహాత్మునాశ్రయించి మునులు సంగములన్నిటినీ ఛేదించుకొని, తిరిగిరానట్టి పరమహంసపదాన్ని పొందుతారో, ఆ వాసుదేవుని దివ్య చరిత్రమును సమగ్రంగా తెలుసుకోవటానికి ఎవరికి సాధ్యమౌతుంది? అయినా, నామనస్సుకు అందినంతవరకూ చెప్పడానికి ప్రయత్నిస్తాను ఆ కథలవివరాలు ఇలాగున్నవి.

ఒకనాడు పరీక్షిత్తు మహారాజు వేటకై అరణ్యానికి వెళ్ళి ఆకలి దప్పులతో అలసి సొలసి, ఎంత వెదికినా ఒక్క నీటిచుక్కైనా దొరకని స్థితిలో శమీకమహర్షి ఆశ్రమంలో ప్రవేశించాడు. అక్కడ బిగ్గరగా "దాహం, దాహం, కొంచెము నీరివ్వండి" అని ఎంత అరచినా ఎవ్వరూ వినిపించుకొనలేదు. అక్కడే ధ్యానమగ్నుడైయున్న శమీకమహర్షికేమీ వినిపించలేదు. తాను బిగ్గరగా అరచినా ముని కదలడు, చూడడు, మాట్లాడడు. తన గొంతెండిపోయినది. పిపాసతో నాలుక పిడచకట్టినది. ప్రాణాలు పోతున్నట్లున్నవి. ఈ మునికి ఇంత అహంకారమా? మహారాజును ఈ విధంగా అవమానించడమా? అని ఈ విధమైన రోషావేశముతో పరీక్షిత్తు మహారాజు విధివశాన మూఢుడై, బైట చచ్చిపడియున్న ఒక సర్పాన్నితెచ్చి ముని భుజముపై వేసి, వెళ్లిపోయాడు. ఈ దుష్టచర్యను చూస్తున్న ఇతర బాలురు పోయి, ముని పుత్రుడైన శృంగితో చెప్పగా అతడు వచ్చి, సర్వమూ తెలుసుకొని క్రోధావేశపరుడై ఇలాగన్నాడు.

ఉ॥ **ఆడడు తన్ను దూషణములాశ్రమవాసులగాని వైరులం**
**గూడడు, కందమూలములు కూడుగ దించు సమాధిచిత్తుడై**
**వీడడులోని చూడ్కులను విష్ణుని దక్క పరప్రపంచ ముం**
**చూడడు మద్గురుండు ఫణి చుట్టగనేటికి రాచవానికిన్. 464**

ఉ॥ **పోము హిరణ్య దానములు పుచ్చుకొనంగ ధనంబులేమియున్**
**తేము పవంచనంబులుగ దీవెనలిచ్చుచు వేసరింపగా**
**రాము వనంబులన్ గృహవిరాములమై నివసింప చెల్లరే**
**పామును వైవగా దగునె బ్రహ్మమునీంద్రుభుజార్గళంబునన్! 465**

మాతండ్రి అతనిని దూషించలేదే! ఆశ్రమ వాసులతోనేగాని అతనిశత్రువులతో నెప్పుడూ కూడలేదే! కందమూలాలే ఆహారంగా తింటూ సమాధి స్థితిలోనుంటూ అంతర్దృష్టిని వీడడే! నాతండ్రి విష్ణువును తప్ప వేరే ప్రపంచాన్నే చూడడే! అటువంటి మాగురువు మెడలో ఆ రాచవాడెందుకు పామును చుట్టిపోవాలి?

పోనీ మేమైనా ఎన్నడూ సువర్ణ దానాలను పుచ్చుకొనడానికి వెళ్లముకదా! వంచనచే ధనమును ఎవ్వరినుండి తెచ్చుకొనము కదా! దీవనలిస్తాంరండి అని ధనాశతో ఎవ్వరినీ వేధించలేదే! ఇళ్లూ వాకిళ్లూ విడిచి అరణ్యంలో నివసిస్తున్నాముకదా! అటువంటప్పుడు, ఆబ్రహ్మర్షి మెడలోనీవిధంగా పామును వెయ్యడం ఏమైనా తగియున్నదా! అంటూ ఆమునిబాలుడు కోపోద్రిక్తుడై అందరూ వింటుండగా ఇలాగ శపించాడు.

ఉ॥ **ఒడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మారు మా**
**టాడకయున్న మజ్జనకు నంసతలంబున బెట్టి దుర్మద**
**క్రీడ చరించు రాజు హరకేశవులడ్డిననైన చచ్చుఁ బో**
**యేడవనాడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్. 470**

'ఎలాంటి సంకోచమూ లేకుండా, చచ్చిన సర్పాన్ని తీసుకొనివచ్చి, మౌనముద్రలోనున్న మాతండ్రిభుజముపై పడవేసి, దురహంకారముతో వినోదించిన ఆరాజు హరిహరులడ్డుపడినా, నేటికి ఏడవనాడు తక్షక సర్ప విషాగ్ని జ్వాలకు దగ్ధమైపోతాడు,

అని శపించిన శృంగి వచ్చి, ధ్యాన ముద్రలోనున్న తండ్రిని దర్శించాడు. కేకలువేసి అందరినీ రమ్మని ఆ సర్పాన్ని తీసివేయుమన్నాడు. ఈ కలకలం విని, మహాముని ధ్యానము చాలించి కండ్లు తెరచి, విషయం తెలుసుకొనినాడు, ఆరాజు పరీక్షిత్తుడే అని దివ్యదృష్టితో చూచి, కొడుకు తొందరపాటులో శపించినందుకు మిక్కిలి విచారిస్తూ ఇలాగన్నాడు. "నాయనా! ఈ చిన్న తప్పిదానికే నీవు అంతటి కఠోరమైన శాపం పెట్టాలా? తల్లి కడుపులోనే దగ్ధముకావలసియున్న రాజును శ్రీహరియే రక్షించాడు కదా! వాసుదేవుడు నిష్క్రమించిన పిదప అరాచకం ప్రబలిపోకుండా ఈ రాజు దేశాన్ని కాపాడి, సమర్థవంతంగా పరిపాలిస్తున్నాడు కదా, అలాంటి రాజులేకపోతే జరిగే అనర్థాల పాపము మనకు చుట్టుకొనదా! తొందరపాటులో నెంత చెడ్డపని చేశావురా తండ్రీ.

ఉ॥ భారతవంశజుం బరమ భాగవతున్ హయమేధయాజి నా
చారపరున్ మహానయవిశారదు రాజకులైకభూషణున్
నీరముగోరి నేడు మననేలకు వచ్చిన యర్థి భక్తి స
త్కారము సేసి పంపఁ జనుగాక శపింపగ నీకు ధర్మమే! 481

భారతవంశములో పుట్టిన పరమభాగవతుడు, అశ్వమేధయాగం చేసిన వాడు, ఆచారపరుడూ, రాజనీతిజ్ఞుడూ, రాజకులశ్రేష్ఠుడూ అయిన ఆ గొప్ప మహారాజు దాహముతో నీటిగురించి మన వాకిటకు వస్తే ఆదరంతోనతిథిసత్కారాలు చేసి పంపడానికి బదులుగా ఇలాగ శపించడం ఏమైనా ధర్మముగానున్నదా? నాయనా! ఓ పరమేశ్వరా! కృష్ణా! వాసుదేవా! నా పిల్లవాడు బుద్ధి చపలత చేత అనవసరంగా రాజును శపించిన పాపాన్ని తొలగించు ప్రభూ! పుత్రా! కొట్టినా తిట్టినా పరమభాగవతులైన వారు శాంతముగా భరిస్తారేగాని ప్రతీకారంచెయ్యదలచుకొనరు. నీశాపానికి, మహారాజు ప్రతిశాపం ఇవ్వడు. సజ్జనులు ఇతరులు చేసిన ఉపకారానికి పొంగిపోరు. అపకారానికి క్రుంగిపోరు. వారిని సుఖదుఃఖాలు చలింపజేయలేవు" అని చెప్పి, వెంటనే శమీక మహాముని, ఒక ముని పుత్రుని పిలిచి, ఈ శాపవార్తను మహారాజునకు తెలిపి రమ్మన్నాడు. శాపవృత్తాంతం తెలుసుకొన్న పరీక్షిత్తుడిలాగ తలపోశాడు.

ఉ॥ ఏటికి వేటవోయితి మునీంద్రుడు గాఢ సమాధినుండగా
నేటికి తద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి నే
డేటికి పాపసాహసము లీక్రియఁజేసితి దైవయోగమున్
దాటగ రాదు వేగిరమ తథ్యము కీడు జనించు ఘోరమై. 486

అయ్యో! నేనెందుకు వేటకు వెళ్లాను? మునీంద్రుడు గాఢ సమాధిలోనుండగా నేనెందుకాతని భుజంమీద చచ్చిన పామును వెయ్యాలి? ఆ వేళనేనెందు కిలాంటి సాహస పాపకృత్యాన్ని చేశాను? ఇదంతా దైవసంకల్పము. దీనిని నెవ్వరూ తప్పించుకొనలేరు. శీఘ్రముగానే ఘోరమైన కీడు వాటిల్లక తప్పదు. బ్రాహ్మణులకు దేవతలకు గోవులకు బాధను కలిగించిన వానికి శిక్షతప్పదు." అని తర్కించుకొని, తన అంతము సమీపించినదని గ్రహించి, సర్వమూ పరిత్యజించి, నిరాహారదీక్ష నవలంబించి, పవిత్ర గంగానదీతీరాన ప్రాయోపవేశముచేసి, ప్రాణాలు విడువదలచాడు.

క॥ చిత్తము గోవింద పదా యత్తము గావించి మౌనియై తనలో నే
తత్తరములేక భూవరసత్తముడు వసించె ముక్తసంగత్వము నన్. 494

ఆరాజసత్తముడు తన చిత్తాన్ని గోవింద పదాయత్తముచేసి సర్వసంగ పరిత్యాగియై, ఎటువంటి వైకల్యమూ లేకుండా మౌనంగా కూర్చున్నాడు.

ఈ విధముగ పాండవ పౌత్రుడైన పరీక్షిత్తు హరిచరణ సంస్మరణానంద కందళిత హృదయార విందుడై, విష్ణుపది (గంగానది) ఒడ్డున ప్రాయోపవిష్టుడై యున్న విషయము తెలుసుకొని, సకలలోక పావన మూర్తులూ, మహానుభావులూ,

తీర్థాలకే తీర్థత్వాన్నివ్వగల సమర్థులూ అయిన, అత్రి, విశ్వామిత్ర, భృగు, వశిష్ఠ, వ్యాస, భరద్వాజ, పరశురామ, దేవల, మైత్రేయ, కణ్వ, కలశసంభవ, నారద, పర్వతాది బ్రహ్మర్షి రాజర్షి దేవర్షి పుంగవులూ, కాండ ఋషులైన అరుణాదులూ, అనేకులైన ఋషిసత్తములూ శిష్యప్రశిష్యులతో వచ్చారు. పరీక్షిత్తు వారందరికీ దండప్రణామాదులాచరించి, హర్షాశ్రువులు కన్నుల నిండుకొనగా చేతులు జోడించి ఇలాగ విన్నవించుకొన్నాడు:

ఉ॥ ఓపికలేక చచ్చిన మహోరగముం గొనివచ్చి కోపినై
తాపసు మూపుపై నిడిన దారుణచిత్తుడ మత్తుడన్ మహా
పాపుడ మీరు పాపతృణపావకులుత్తములయ్యలార! నా
పాపముఁ బాయుమార్గముఁ గృపాపరులార విధించి చెప్పరే! 497

ఓ దయామయులైన తపోధనులారా! సహనంకోల్పోయి, కోపముతో మునీంద్రుని భుజముపై చచ్చిన పామును వేసిన క్రూరుడను, మదోన్మత్తుడను, మహాపాపుడను, మీరు పాపరాశిని భస్మము చేయగల సమర్థులు. ఉత్తములు, అయ్యలారా! నాపాపం పరిహారమయ్యే మార్గమేమిటో సెలవియ్యండి. మీ పాదరజముసోకగానే నేను ధన్యుడనయ్యాను. ఈ సంసార సాగరంలో మునిగి తేలుతున్న నాకు ఈ విప్రశాపము ఒక వరమే అయినట్లు భావిస్తున్నాను. తక్షకుని విషజ్వాలలకు నా దేహాన్ని సమర్పిస్తాను. ఈశ్వర సంకల్పం అనివార్యం. అయితే రాబోయే ప్రతి జన్మలోనూ నాకు శ్రీకృష్ణ చింతన యందనురక్తీ శ్రీకృష్ణకథాశ్రవణమందాసక్తీ, శ్రీకృష్ణ చరణ కమలాలయందు భక్తీ కలిగేటట్లనుగ్రహించండి.

కం॥ చూడుడు నా కల్యాణము పాడుడు గోవిందుమీదిపాటలు దయతో
నాడుడు హరిభక్తులకథలేడహములలోన ముక్తికేగగ నిచటన్. 502

నా శ్రేయస్సును దృష్టిలోనుంచుకొని, గోవిందుని లీలలు గానం చెయ్యండి. హరిభక్తుల చరిత్రలు వినిపించండి. ఏడుదినములలో నాకు ముక్తి కలిగే మార్గమేదో చూడండి." అని, వేడుకొని, తనయుడైన జనమేజయుని రప్పించి, రాజ్యభారం అప్పగించాడు. ఋషులందరూ పరీక్షిత్తుయొక్క హరిభక్తికి సంతసించి, అతనిని ప్రశంసించారు. ఆ గడువు దినము వరకూ తాము అక్కడనే ఉంటామన్నారు. ఏడుదినములలో ముక్తిని పొందే మార్గమేదైనా ఉన్నదా అని అన్వేషించసాగారు.

ఇంతలో, దైవయోగంచేత, పదహారేళ్ల బాలునివలె కనిపిస్తూ దిగంబరియైన ఒక అవధూతమూర్తి అక్కడికి వచ్చాడు. అతడు మహాయోగివరేణ్యుడూ, వేదవ్యాస తనయుడూ అయిన శుకయోగీంద్రుడని గుర్తించి, అక్కడున్న ఋషులందరూ గౌరవ సూచకంగా నిల్చొని, ఆయనను ఆహ్వానించారు. పరీక్షితుడు ఎదురేగి ప్రణమిల్లి, సత్కరించి, ఉచితాసనంపై కూర్చుండబెట్టి ఇలాగన్నాడు. "ఓ మహాత్మా! నేడెంత సుదినము, ఆ శ్రీకృష్ణ పరమాత్మయే మిమ్మల్నిక్కడకు పంపించియుంటాడని నమ్ముతున్నాను. నా సమస్యకు పరిష్కార మార్గము చూపగలవారు మీరే తప్ప అన్యులుకారు. ఎల్లప్పుడూ మానవుడేమి చేస్తుండాలి? ఏమిటి వింటుండాలి? దేనిని గురించి ఆలోచిస్తుండాలి? మరణమాసన్నమైయున్న నేను ఇప్పుడేమి చెయ్యాలి? దేనిని త్యజించాలి? ఈ ప్రశ్నలకు తగురీతిని సమాధానమిచ్చి, నాకు ఉపదేశమిచ్చి, నన్ను తరింపజేయ ప్రార్థిస్తున్నాను" అని పరీక్షితుడు శ్రీశుకుని వేడుకొన్నాడు.

అని సూతుడు శౌనకాది ఋషులకు చెప్పాడు.

హరిఃఓంతత్సత్- ప్రథమస్కంధము సమాప్తము

ఓం శ్రీకృష్ణార్పణమస్తు

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము
# ద్వితీయస్కంధము

## శ్రీశుకవాణి - ముక్తిమార్గము

### పరీక్షిత్తునకు శ్రీశుకయోగీంద్రుడిలా చెప్పాడు:

దేహాన్ని త్యజించనున్న వ్యక్తి 'మోక్షార్థియై ఏమిచెయ్యాలి'? అని నీవడిగిన ప్రశ్న అత్యుత్తమమైనట్టిది. దీని సమాధానమును అందఱును తెలుసుకొని, తరించవలసినట్టిది. సామాన్య మానవులు ఇల్లూ, ఇల్లాలు, సంతానము, సంపద, ధన కనక వస్తు వాహనాదులయందు మమకార బంధనాలు పెంచుకొని, ఆమాయాజాలంలో చిక్కుకొని కొట్టుమిట్టాడుతారు. ఆత్మ తత్త్వాన్ని తెలుసుకొన లేకున్నారు. జీవితమంతా ధనార్జనతో, ఇంద్రియభోగలాలసతో, నిద్రలతోనే కాలమును వెచ్చించివేసి, చివరకు కన్నుమూసి, మళ్లీ అలాంటి జీవితానికే పునాది వేసికొంటారు. ప్రతిదినమూ తమచుట్టూ ఉన్న వారిలో అనేకులు మరణిస్తున్నా, తమకు మాత్రము మరణం అప్పుడే రాదులే అనే భ్రమలోనుంటారు.

సంసారబంధాలనుండి ముక్తి పొందదలచుకొన్న వ్యక్తి 'భావించడానికి, సేవించడానికి, వర్ణించడానికి, ఆకర్ణించడానికి, సర్వాత్మకుడూ, మహావైభవం కలవాడూ, జగదీశుడూ అయిన, ఆ విష్ణువొక్కడే' అని తెలుసుకోవాలి. సదా భగవంతునే స్మరిస్తూ అంత్యకాలమందు కూడా నారాయణ చింతనలోనుండుటయే సులువైన మార్గము.

నాతండ్రియైన వ్యాసభగవానుడు వేదతుల్యమైన భాగవతాన్ని నాచేత చదివించాడు. భగవంతుని అవతార లీలలు నన్నాకర్షించడంచేత నేను బ్రహ్మతత్పరుడనై, ఆ గ్రంథాన్ని శ్రద్ధగా అధ్యయనం చేశాను. భాగవత శ్రవణం వలన జరామరణాది సంసార భయాలన్నీ సమసిపోయి, మోక్షకాంక్షులకు ముక్తి లభిస్తుంది. వాసుదేవుని నామసంకీర్తనలే యోగి సత్తములకు ఉత్తమవ్రతాలు. అందుచేత పరమ భాగవతుడవైన నీకు నేను ఈ పవిత్ర గాథను వినిపించనున్నాను. ఈ భాగవతాన్ని శ్రద్ధగా శ్రవణంచేసిన వారియందు శ్రీకృష్ణ భక్తి మెండుగా వికసిస్తుంది. బ్రహ్మజ్ఞానులకు కూడ శ్రీకృష్ణనామోచ్చారణయే ఏకైక మార్గమూ లక్ష్యమూ అని చెప్పబడినది.

రాజా! సంసారంలోబడి కొట్టుకొంటుండే అవివేకి ముక్తినెలాగ పొందగలడు? ఒక్క గడియ అయినా హరినామం స్మరిస్తే చాలు, అది ముక్తిని ప్రసాదిస్తుంది. ఉదాహరణగా ఖట్వాంగ చక్రవర్తి ఉదంతం చెప్తాను, విను.

పూర్వము ఇంద్రాదిదేవతలు రాక్షసులను ఓడించలేక, భూలోకంలోనున్న ఖట్వాంగ చక్రవర్తి సహాయమును అర్థించారు. ఖట్వాంగుడు రాక్షసులతో పోరి, వారిని ఓడించాడు. దేవతలు సంతసించి, వరమిస్తామన్నారు. అతడేమీ కోరుకొనకుండా ఇంకా తానెంత కాలం జీవించి యుంటాడో చెప్తే చాలునన్నాడు. అతని ఆయుర్దాయం ఇంకా ఒక్క ముహూర్త కాలము మాత్రమే మిగిలియున్నదని వారు చెప్పగా, నతడు వెంటనే భూలోకానికి వచ్చేసి, తనకున్న సర్వస్వమూ పరిత్యజించి,

క॥ గోవింద నామకీర్తనఁ గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుడు సూర గొనియెను కైవల్యము తొల్లి రెండు గడియల లోనన్. 11

ఈ విధంగా ముక్త సంగుడైన ఖట్వాంగుడు గోవిందనామ సంకీర్తనంచేసి, భయరహితుడై రెండు గడియల్లోనే మోక్షము పొందాడు. రాజా! నీకు ఏడు దినముల సమయమున్నదికదా, చింతఏల? ఇట్టి పరిస్థితిలో దేహధారి

దారాపుత్రాదుల యందుండే వ్యామోహాన్ని కోసి పారవేసి, ఇల్లువిడిచి, పవిత్ర తీర్థ స్థలంలో ఏకాంత ప్రదేశంలో దర్భగడ్డి, జింకచర్మము, వస్త్రము, పరుచుకొని ఓంకార జపము చేస్తూ ప్రాణాయామం చెయ్యాలి. విషయాలవెంటపడకుండా బుద్ధిబలంతో ఇంద్రియాలను నిగ్రహించాలి. కర్మబంధాలలో చిక్కుకొని ఊగిసలాడకుండా చిత్తాన్ని ప్రజ్ఞాబలంచే నిగ్రహించి, దానిని భగవంతుని మీద నిశ్చలంగా నిలపాలి. విషయరహితమైన మనస్సుతో ఆ దేవదేవునికరచరణాదులైన అవయవాలను వరుస క్రమంగా స్మరిస్తూ ధ్యానించాలి. తమోగుణముచే విమూఢతనూ, రజోగుణముచే చాంచల్యమునూ చెందకుండా మనస్సునూ, ఆ గుణాలచే కలిగిన మాలిన్యాలనూ ధారణతో తొలగించి, శుద్ధము చేసికొనాలి. అలాగ చేసినవాడు సర్వోత్కృష్టమైన విష్ణుపదాన్ని పొందుతాడు. అనిచెప్పిన శ్రీశుకునికి - ధారణ అంటే ఏమిటి, దాని ద్వారా చిత్తమాలిన్య మెలాగ తొలగుతుంది - అని అడిగిన పరీక్షిత్తుతో శుకబ్రహ్మ ఇలాగ చెప్పాడు:-

పండితుడైన వాడు వాయువును నియంత్రించి, సర్వసంగములనూ విడిచిన వాడై, ఇంద్రియాలనదుపులోనుంచి, బుద్ధి బలముచే శ్రీహరి విశాల స్వరూపమందు చిత్తమును నిలపాలి.

## శ్రీహరి విరాట్స్వరూపము

ఈ విరాట్స్వరూపములో విశ్వము యొక్క భూత, వర్తమాన, భవిష్యత్తులు అన్నీ గోచరిస్తాయి. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్‌తత్త్వమూ అనబడు ఏడు ఆవరణలు మహాండ కోశమైన విరాట్ పురుషుని శరీరాన్ని ఆవరించియున్నాయి. ధారణ చేయదగిన విరాట్ పురుషుడు ఆశరీరములో ప్రకాశిస్తుంటాడు. ఆ మహాత్మునిపాదముక్రింది భాగమే పాతాళము. అతనికాలిమడమ, కాలిపైభాగము రసాతలము, అతని చీలమండలు మహాతలము, పిక్కలు తలాతలము, అతనిమోకాళ్లు సుతలము, అతని తొడలు వితలమూ, అతలమూ, అతని జఘన భాగము (పొత్తికడుపు) మహీతలము (భూమి), అతని నాభిస్థలము ఆకాశము, అతని వక్షస్థలము నక్షత్రలోకము, అతనిమెడ మహర్లోకము, అతనిముఖము జనోలోకము, అతనిలలాటము తపోలోకము, అతని శిరస్సు సత్యలోకము అతని బాహువులు ఇంద్రాదిదేవతలు, అతని కర్ణాలు దిక్కులు, అతని శ్రోత్రేంద్రియము శబ్దము, అశ్వినీదేవతలు అతని నాశికారంధ్రాలు, గంధము అతని ఘ్రాణేంద్రియము. అగ్ని అతనినోరు, అతని కండ్లు అంతరిక్షము (ద్యులోకము) అతని చక్షురింద్రియము సూర్యుడు. అతని కనురెప్పలు రేయింబవళ్లు, అతని భ్రుకుటి (కనుబొమ్మల మధ్యభాగము) బ్రహ్మ నివాస స్థలము, అతని దవడలు జలము, అతని జిహ్వేంద్రియము రసము, అతని భాషణములు వేదాలు, అతని నోటిలోని కోరలు యముడు, స్నేహకళలు అతని దంతాలు, జనులకు ఉన్మాదము మోహము కలిగించే మాయా విశేషమే అతని నవ్వులు, అతని కటాక్ష వీక్షణాలే అనంత సృష్టులు, సిగ్గు, లోభములు, అతని పెదవులు, అతని రొమ్ము ధర్మము, అతని వెన్ను అధర్మము, అతని పురుషాంగము ప్రజాపతి, వృషణాలు మిత్రావరుణులు, అతని ఉదరము సముద్రము, కొండలు అతని ఎముకలు, నదులు అతని నాడులు, చెట్లు, రోమాలు, వాయువు అతని ఊపిరి, అంతులేని కాలము అతని వయస్సు, నానాజాతి జీవుల సర్గలయాలే అతని కార్యములు, మేఘములే అతని శిరోజాలు, త్రికాలసంధ్యలే అతని వస్త్రాలు, అవ్యక్తము, ప్రధానము అతని హృదయము. మనస్సే చంద్రుడు, మహత్‌తత్త్వము అతని చిత్తము, రుద్రుడు అహంకారము, అశ్వములు, ఏనుగులు, ఒంటెలు లాంటి జంతువులు అతని గోళ్లు, పశుమృగాదులతని కటిప్రదేశము (పిరుదులు), పక్షులు అతని చిత్రవిచిత్ర వాక్చబ్దాలు, మనువు అతని బుద్ధి, పురుషుడు (మానవుడు) అతని నివాసము, గంధర్వులు, విద్యాధరులు, చారణులు, అప్సరసలు, అతని షడ్జాదులైనశబ్ద విశేషాలు. ప్రహ్లాదుడు అతని స్మృతి, దైత్యులు, దానవులు అతని వీర్యము, బ్రాహ్మణులు (వేదాధ్యయన పరులు) అతని ముఖము, క్షత్రియులు అతని భుజములు, వైశ్యులు అతని తొడలు, శూద్రులు అతని పాదములు, వసువులు, రుద్రులు మొదలైన దేవతల

పేర్లే అతని నామములు, హవిర్భాగములే అతని ద్రవ్యము, యజ్ఞప్రయోగములే అతని కర్మలు, ఇటువంటి విశ్వమయుడైన విరాట్పురుషుని రూపాన్ని మోక్షార్థి అయినవాడు తనమనస్సులో సంధానం చేసుకోవాలి.

క॥ హరిమయము విశ్వమంతయు హరివిశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయము కానిద్రవ్యము పరమాణువులేదు వంశపావన వింటే 17

విశ్వమంతా విష్ణుమయము, విష్ణువు విశ్వమయుడు, ఇందులో సందేహములేదు. విష్ణుమయముకాని పదార్థం ఈ విశ్వములో నొక్క పరమాణువైననూలేదు!

సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు ప్రాణుల హృదయాలలోనుంటూ బుద్ధివ్యాపారాలను తెలుసుకొంటాడు. అతడు సత్స్వరూపుడు, ఆనందస్వరూపుడు, విజ్ఞానమూర్తి. అతనిని సేవించడం ద్వారానే తప్ప, ఇతర సేవల వలన ఉన్నతి, కైవల్యము సిద్ధించదు. సంసార బంధము వదలదు.

రాజా! అజ్ఞాని శబ్ద ప్రధానమైన వైదిక కర్మకాండలను నిర్వహిస్తూ నిరర్థకాలైన స్వర్గాది సుఖాలను కాంక్షిస్తూ మోక్ష ప్రాప్తికి దూరమౌతాడు. జ్ఞాని మాత్రము శరీర ధారణకు కావలసినంత మాత్రమే విషయాలను స్వీకరిస్తూ ఇతర భోగాలను తృణీకరిస్తాడు. ఆత్మ స్వరూపుడూ, నిత్యుడూ, సత్యుడూ అయిన వాసుదేవుని సేవించి అవిద్యను బాపుకొంటాడు. గోవింద చరణారవింద మకరందమును గ్రోలడానికి విముఖులైన వారు కర్మబంధాల్లో తగుల్కొంటారు. యమునిచే హింసిపబడుతారు.

ఫలాపేక్షతోనూ, భోగలాలసతోనూ వైదిక కర్మకాండలూ ఇతర కామ్యకర్మలూ చేస్తూ అనేక జన్మలెత్తుతూ, జీవుడు అనేక లోకాలను చుట్టివచ్చినా శాశ్వతమైన ఆనందాన్ని పొందలేక, ఆ అన్వేషణలో కర్మపంకిలంలో ఇంకా కూరుకొనిపోతాడు. కాని జ్ఞానసంపన్నుడు వైదిక కర్మలజోలికి పోకుండా, వేదాంత మార్గాన్ననుసరించి, వస్తు సంగ్రహము, విషయలోలత్వాలను విడిచి, శ్రీహరి యందు చిత్తమును నిలిపి, అత్యంతాత్మానందాన్ని పొందుతాడు.

పూర్వము ఈ కల్పాదియందు బ్రహ్మదేవుడు పరమేశ్వరుని గూర్చి ధ్యానము చేసి, శ్రీహరి అనుగ్రహముచే సృష్టి రచనకు కావలసిన జ్ఞానాన్ని పొందాడు.

ధ్యానము :- రాజా! ధ్యానము చేసే పద్ధతిని తెలుపుతాను. భగవంతుడు జీవుని హృదయ మధ్యస్థ సూక్ష్మ-ఆకాశములో ప్రాదేశమాత్ర దివ్యదేహుడై యుంటాడు. ఆయనను ఈ విధంగా నిలుపుకొని, స్మరించుకోవాలి. చతుర్బాహుడై, శంఖచక్రగదాపద్మహస్తుడై కోటిమన్మథసుందరుడై, చంద్రవదనుడై, పద్మదళనేత్రుడై, పీతాంబరధారియై, కౌస్తుభమణిహార నవరత్నఖచిత కిరీట కుండల ధారియై, వక్షముపై శ్రీవత్స చిహ్నముతో, వైజయంతీ వనమాలా ధారియై, సువర్ణ కంకణ భుజకీర్తులను ధరించి, నీయొక్క వికసించిన హృదయ పద్మ మధ్యస్థ కర్ణికపై నిల్చొని తేనెలొలుకు చిరునవ్వు చిందిస్తూ, ప్రేమలొలుకు ప్రసన్న చూడ్కులను సారిస్తూ, తన దివ్య - అనుగ్రహాశీస్సుల నందుకొనడానికి రమ్మంటూ ఆహ్వానిస్తున్నట్టు మనఃఫలకంపై చిత్రించుకోవాలి. ఆదివ్యమోహన మూర్తినే మరలమరల చూస్తుండాలి.

తరువాత ఆ విశ్వరూపుని పాదపద్మాలపై నీమనస్సును కేంద్రీకరించాలి. క్రమంగా ప్రతి- అంగముపైనా మనోనేత్రాన్ని కేంద్రీకరించి నిలపాలి. అటు పిమ్మట శ్రీదేవితోకూడిన ఆయన వక్షఃస్థలంపై, దివ్యకాంతులీనే ముఖపద్మములపై మనస్సు నిలపాలి. చివరకు ముల్లోకాలనూ మోహింపజేసే ఆ మందహాసాధరాలపై మనస్సును కేంద్రీకరించి ధ్యానంచెయ్యాలి. ఇది ధ్యానము. పూర్తిరూపాన్ని మనస్సులో నిలుపు కోవడం ధారణ అనబడుతుంది. దీనివలన ఇతర భావాలు రావు. బుద్ధి శుద్ధమవుతుంది. ఆభరణాలంకారాలతోకూడియున్న సంపూర్ణ స్వరూపాన్ని ఎడతెగక, మనస్సులో దర్శనమగునట్లు ప్రేమతో స్మరించడమే భక్తి. ఇట్లు, పరిపూర్ణ భక్తియోగాన్ని సాధించిన యోగి ప్రారబ్ధ కర్మనశించగా, దేహత్యాగము

చేయదలచుకొని, అనువైన కాలము, పవిత్ర ప్రదేశము, గురించివేచి యుండకుండా, సుఖాసీనుడై, మనస్సుచే ప్రాణవాయువును నిగ్రహించి, బుద్ధిచే మనోవేగాన్ని అరికట్టి, బుద్ధిని జీవాత్మలోనూ, జీవాత్మను శుద్ధాత్మలోనూ నిలుపుతాడు. శుద్ధాత్మను పరమాత్మలో లీనంచేస్తాడు. పరమశాంతిని పొందినవాడై కర్మత్యాగంచేస్తాడు. ఇది, యోగులు శరీరాన్ని విడిచేక్రమము.

ముక్తి, రెండు విధాలు- సద్యోముక్తి (తత్క్షణముక్తి), క్రమముక్తి. సద్యోముక్తిని కోరుకొనుయోగి, పాదమూలము (మడమ)తో మూలాధార (గుదస్థానము) చక్రాన్ని నొక్కి యుంచి, ప్రాణ వాయువును బిగబట్టి, నాభివద్దనున్న మణిపూరక చక్రానికి తీసుకొని పోతాడు. అక్కడినుండి హృదయ స్థానమందున్న అనాహత చక్రానికీ, అటనుండి వక్షములోనున్న విశుద్ధ చక్రానికి, తాలుమూలానికీ, అక్కడినుండి భ్రుకుటిలోనున్న ఆజ్ఞాచక్రానికీ ప్రాణవాయువును తరలిస్తాడు. ఆపైని సప్తద్వారాలైన - కండ్లు, చెవులు, నాసికను, నోరును మూసుకొని ఏకోరికలు, ఆలోచనలు లేనివాడై, అర్ధ ముహూర్తకాలం ఇంద్రియాలతో నెలాంటి సంపర్కమూ లేకుండా ప్రాణాలను నిగ్రహిస్తాడు. పిమ్మట బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకొని పరబ్రహ్మములో లీనమవుతాడు.

## క్రమముక్తి ఇలాగుంటుంది:

దేహత్యాగసమయమున ఇంద్రియాలతోడి సంగమును విడువలేని యోగి ఇంద్రియాలతో సహా గుణములతో కూడియున్న బ్రహ్మాండములో బ్రహ్మలోకం చేరుతాడు. అది ఖేచరులు, సిద్ధులు విహరించేది, అణిమాది సకలైశ్వర్యాలతో కూడియున్నట్టిది విద్య, తపస్సు, యోగము, సమాధి, భజనములను చేస్తూ, వాయువులో లీనమైన లింగశరీరులైన యోగీశ్వరులు బ్రహ్మాండములోనా, వెలుపలా సంచరించగలరు. కర్మద్వారా ఎవ్వరూ ఇలాంటి గమనశక్తిని పొందలేరు. ఆకాశపథంలో బ్రహ్మలోకగామియైన యోగి, సుషుమ్నానాడివెంట, అగ్నియనే దేవతను జేరి, జ్యోతిర్మయమైన తేజస్సులో నిర్మలుడై, దేనియందూ తగుల్కొనకుండా, నక్షత్రమండలము, సూర్యమండలము, మొదలైన మండలాలన్నీ దాటి, ధ్రువ మండలముదాటి శ్రీహరికి సంబంధించిన శింశుమార చక్రానికి చేరుతాడు. అక్కడ ఒంటరిగా పరమాణుస్వరూపమైన లింగశరీరముతో బ్రహ్మవేత్తలు నివసించే మహర్లోకం ప్రవేశిస్తాడు. మహాకల్పకాలం అక్కడ వినోదిస్తూ, కల్పాంతంతో అనంతుని ముఖజ్వాలలలో దహించుకొనిపోయే త్రిలోకాలను తిలకిస్తూ, ఆవేడిని భరించలేక, బ్రహ్మలోకం ప్రవేశిస్తాడు.

## ఆ బ్రహ్మలోక మెలాంటిదంటే-

పదునల్గురు మనువుల కాలంజరిగితే అక్కడ ఒక్క దినమవుతుంది. మహనీయులైన సిద్ధుల యొక్క విమానాలు ఆలోకంలో సూర్యతేజస్సుతో ప్రకాశిస్తుంటాయి, అక్కడ శోకము, వార్ధక్యము, మృత్యువు, కృశత్వము, భయము, దుఃఖము వంటివి ఉండవు. విష్ణు పాదాలను ధ్యానించాలనే జ్ఞానంలేని వారియొక్క శోకాలను అక్కడినుండి గమనిస్తుండవచ్చు. ఆలోకంలో పరమ సిద్ధయోగుల అమృతవాక్కులను శ్రవణపర్వముగ వింటూ ఉండవచ్చు. అలాంటి బ్రహ్మలోకంలో నివసిస్తున్నవాడు మరల రాడు. ఇంకొక విశేషముకూడా ఉన్నది. పుణ్యాతిశయముచే బ్రహ్మలోకము చేరుకొన్న వారు కల్పాంతమందు తమతమ పుణ్యముల తారతమ్యము ప్రకారము అర్హతలను పొందుతారు. బ్రహ్మాదిదేవతలనారాధించి. అక్కడికి చేరినవారు బ్రహ్మజీవిత కాలమంతా అక్కడనేయుండి ముక్తులౌతారు. నారాయణ చరణకమల భక్తి పరాయణులై వెళ్లినవారు స్వేచ్ఛగా నిరాతంకంగా పురోగమించి, బ్రహ్మాండాన్ని ఛేదించుకొని, వైష్ణవ పదాన్నధిష్ఠించి ప్రకాశిస్తారు.

ఈశ్వరుడధిష్ఠించిన ప్రకృత్యంశతో మహత్తత్త్వం ఉద్భవిస్తుంది. మహత్తత్త్వాంశతో అహంకారమూ, అహంకారాంశతో శబ్దతన్మాత్ర, శబ్దతన్మాత్రాంశతో ఆకాశమూ, ఆకాశాంశతో స్పర్శతన్మాత్ర, స్పర్శతన్మాత్రాంశతో వాయువూ, వాయువుఅంశతో రూపతన్మాత్ర, రూపతన్మాత్రాంశతో తేజస్సు (అగ్ని), తేజస్సుయొక్క అంశతో రసతన్మాత్ర, రసతన్మాత్రాంశతో జలమూ, జలాంశముతో గంధతన్మాత్ర, గంధతన్మాత్రాంశముతో పృథ్వి, పుట్టుతాయి, వాటియొక్క

సంఘాతముచే (సమ్మేళనమునుండి) చతుర్దశ భువనాలతో కూడియున్న విరాట్ రూపముద్భవిస్తుంది. ఆ 'విరాట్' రూపానికి కోటి యోజనాల విశాలమైన అండకటాహము, మొదటి ఆవరణమైన పృథివి అవుతుంది. భూమి ఆవరణం చుట్టూ, దానికి పదిరెట్ల విస్తీర్ణముతో జలమూ, జలముకు పదిరెట్లుగా తేజస్సూ, తేజస్సుకు పదిరెట్లుగా వాయువు, వాయువునకు పదిరెట్లుగా ఆకాశమూ, ఆకాశానికి పదిరెట్లుగా అహంకారమూ, అహంకారానికి పదిరెట్లుగా మహత్తత్త్వమూ ఆవరించి యుంటాయి. ఈ ఏడు ఆవరణలనూ చుట్టి ఎనిమిదవదైన ప్రకృతిఆవరణం గొప్పగా వ్యాపించి యున్నది. ఇదంతా బ్రహ్మాండమనబడుతుంది. ఈ బ్రహ్మాండాన్ని ఛేదించుకొని విష్ణుపదాన్నధిష్ఠించిన వాడు భయరహితుడౌతాడు. అతడు మెల్లగా లింగశరీరముతో పృథివీ తత్త్వం పొందుతాడు. దానితో ఘ్రాణేంద్రియం ద్వారా గంధాన్ని గ్రహిస్తాడు. తేజోరూపుడై నేత్రేంద్రియంతో రూపాన్ని గ్రహిస్తాడు. వాయుస్వరూపుడై త్వగింద్రియంతో స్పర్శను గ్రహిస్తాడు. గగన స్వరూపుడై శ్రోత్రేంద్రియంతో శబ్దాన్ని గ్రహిస్తాడు. వీటన్నింటినీ అతిక్రమించి, ఆయోగి ఆకాశాది పంచభూతాలకూ, సూక్ష్మేంద్రియాలకూ లయ స్థానమైన అహంకారావరణం చేరుకొంటాడు. అక్కడ మనోమయమూ, దేవమయమూ అయిన సాత్త్వికాహంకారముతో, మహత్తత్త్వాన్ని ప్రవేశిస్తాడు. ఆపైని త్రిగుణాలు లయించిన ప్రకృతిని పొందుతాడు. ఆ ప్రకృత్యాత్మకత్వంతో దేహాన్నీ, ఉపాధి పరంపరలంతముకాగా ప్రకృతినీ పరిత్యజించి ఆనందమయుడౌతాడు. ఆ ఆనందంతో పరమాత్మ స్వరూపమైన వాసుదేవ పరబ్రహ్మములో లీనమవుతాడు. రాజా! ఇది, పరమభాగవతులనుసరించే మార్గము. ఈ మార్గాన పయనించిన యోగి వందలాది కల్పాలు గతించినా, మళ్లీ తిరిగి రాడు. ఇందుకు సందేహంలేదు.

నీవడిగిన సద్యోముక్తి, క్రమముక్తిని గురించి చెప్పాను. ఇవి వేద గీతలందు వివరింపబడినవి. పూర్వము భగవానుడే వీటిని బ్రహ్మదేవునకు బోధించాడు. సంసారంలో ప్రవేశించినవానికి తపోయోగాదులయిన అనేకమైన మోక్షమార్గాలున్నవి. అన్నిటికంటె సులభమైనది భక్తిమార్గము.

## భక్తిమార్గము:

పూర్వము బ్రహ్మ, వేదాలను మూడుసార్లు తరచి తరచి విశ్లేషించి నిర్ధారించిన సత్యమేమిటంటే- 'భక్తితో తప్ప, మరో మార్గాన మోక్షము సిద్ధించదు' అని. రాజా!

**సీ॥ అఖిలభూతములందు నాత్మరూపంబున నీశుండు హరియుండు నెల్ల ప్రొద్దు**
**బుద్ధ్యాది లక్షణంబులఁ గానబడును మహాత్మేవనీయు డహర్నిశంబు**
**వందనీయుడు భక్తవత్సలుం డత్యంత నియతుడై సతతంబు నియతబుద్ధి**
**నాత్మరూపకుడగు హరికథామృతమును కర్ణపుటంబుల కాంక్ష దీరఁ**
**తే॥ గ్రోలుచుండెడు ధన్యులు కుటిలబహుళ విషయ మలినీకృతాంగముల్ వేగవిడిచి**
**విష్ణుదేవునిచరణారవిందయుగముకడకుఁ జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర! 36**

జగదీశ్వరుడైన శ్రీహరి సమస్త ప్రాణులలో సదా ఆత్మ రూపముననున్నాడు. బుద్ధ్యాదుల ద్వారా సేవింప దగిన ఆ మహాత్ముడు మనకు గోచరించగలడు. అతడెల్లప్పుడూ నమస్కరించవలసినవాడు. భక్తవత్సలుడు. ఆత్మరూపుడైన ఆయన యొక్క కథామృతాన్ని తనివితీరా చెవులారా గ్రోలేవారు ధన్యులు. వారు నానావిషయాలతో కలుషితమైన కుటిలమైన తమ శరీరాలను త్వరగా త్యజించి, విష్ణుదేవుని పాదపద్మాలను చేరుకొంటారు. ఇది నిజము. మనుష్యులై జన్మించిన వారు, మరణమాసన్నమైనవారూ, మహాజ్ఞానులూ చేయవలసిన కర్తవ్యమిది.

రాజా! మానవుడు తన కోరికలను తీర్చుకొనడానికి ఏయే దేవతల నారాధించాలో చెప్తాను విను. బ్రహ్మ వర్చస్సు కోరేవాడు బ్రహ్మదేవునీ, ఇంద్రియశక్తిని కాంక్షించేవాడు ఇంద్రునీ, సంతానము (ప్రజలు) కావలసినవాడు దక్షాది

ప్రజాపతులనూ, భోజనకాములు అదితినీ, స్వర్గం కోరుకొనేవాడు ఆదిత్యులనూ, రాజ్యాభిలాష కలవాడు విశ్వదేవతలనూ, దేశ ప్రజా ధన కాములు సాధ్యులను, సిరినికోరువాడు దుర్గనూ, తేజస్సునుకోరువాడు అగ్నినీ, ధనాభిలాషి వసువులనూ, వీర్యమును అర్థించేవాడు రుద్రులనూ, ఆయువునుకోరేవాడు అశ్వినీ దేవతలనూ, పుష్టిని కోరువాడు భూమినీ, ప్రతిష్ఠనపేక్షించేవాడు లోకమాతలైన ఆకాశ, భూ దేవతలనూ, సౌందర్యకాముడు గంధర్వులనూ, కామినీ కాముడు ఊర్వశినీ, సర్వాధిపత్యము కోరువాడు బ్రహ్మనూ, కీర్తికాముడు యజ్ఞమూర్తియైన విష్ణువునూ, విత్తము నాశించువాడు ప్రచేతసుని, విద్యనుకోరువాడు ఉమాపతినీ, దాంపత్యసుఖకాముడు పార్వతినీ, ధర్మార్థకాముడు విష్ణుమూర్తినీ, సంతానకాముడు పితృదేవతలనూ, రక్షణకోరేవాడు యక్షులనూ, బలముకోరేవాడు మరుద్గణాలనూ, రాచరికం కావాలనేవాడు మనురూపదేవతలనూ, శత్రుమరణంకోరేవాడు నిర్భతినీ, భోగాలను అభిలషించేవాడు చంద్రుని ఆరాధించాలి. వీరందరూ విభిన్నమైన కోర్కెలను తీర్చుతారు గాని మోక్షాన్నివ్వజాలరు. తత్త్వము తెలిసినవాడు స్వల్పకోరికలను కోరక, హృదయంలో పరమపురుషుని ప్రతిష్ఠించుకొని, భజించి, మోక్షాన్నే కోరుతాడు. విష్ణువును సేవిస్తే విమల జ్ఞానమూ, వైరాగ్యమూ, మోక్షమూ సిద్ధిస్తాయి. కోరికలున్నవారైనా కోరికలు లేనివారైనా ఆశ్రీహరినే ఆరాధిస్తే ఆయనే అన్నీ అనుగ్రహించి, మోక్షాన్ని కూడా ప్రసాదిస్తాడు.

రాజా! వాసుదేవుని యందు భక్తి మహిమనేమని వర్ణించను?

సీ॥ వాసుదేవశ్లోకవార్తలాలించుచు కాల మేపుణ్యుండు గడుపుచుండు
నతని యాయువుఁ దక్క నన్యుల యాయువు నుదయాస్తమయముల నుగ్రకరుడు
వంచించి కొనిపోవు వాడది యెఱుఁగక జీవింతు పెక్కేండ్లు సిద్ధమనుచు
అంగనా పుత్ర గేహారామ విత్తాది సంసార హేతుక సంగ సుఖముఁ
తే॥ దగిలి వర్తింప కాలంబు తఱియెఱింగి దండధర కింకరులు వచ్చితాడనములు
సేసి కొనిపోవ పుణ్యంబు సేయనైతి పాపరతినైతి నని బిట్టు పలవరించు. 47

వాసుదేవుని పుణ్యగాథలనాలకిస్తూ ఏ పుణ్యాత్ముడు కాలంగడుపుతాడో అతని ఆయుస్సును తప్ప ఇతరుల ఆయుస్సును సూర్యుడు ఉదయిస్తూ అస్తమిస్తూ లాక్కొనిపోతుంటాడు. ఆ సంగతిని తెలుసుకొనలేక, మూఢుడు "నేను తప్పకుండా, చాలా ఏళ్ళ బ్రతుకుతాను" అని అనుకొంటూ, భార్య, పుత్ర, గృహ, ఆరామ, ధనధాన్యాది సంసార బంధ కారకాలైన సంగసుఖాల్లో తగుల్కొని, ప్రవర్తిస్తుంటే, సరియైన కాలముచూచి అతనిని యమభటులు దండిస్తూ తీసుకొని పోతుంటే, "అయ్యో! పాపకార్యాలు చెయ్యడానికే ఇష్టపడ్డానుగాని, కొంచెమైనా పుణ్యము చెయ్యలేదే" అని అతడు భోరున ఏడుస్తాడు. వృక్ష, పశు, పక్ష్యాది జీవరాసులు ఆహార నిద్రా భయ మైథునాలకులోనై పుట్టుచూ గిట్టు చుండుటలేదా? పరమేశ్వరుని గూర్చి చింతించని మానవ మృగాలు సూకర గార్దభాలకంటే నికృష్టముగ బ్రతుకుతాయి. విష్ణుగాథలను వినియుండని చెవులు కొండ బిలములవంటివి. చక్రధరుని మీది పద్యాలు చదువని నాలుకలు కప్పనాలుకలు. శ్రీనాథుని దివ్యరూపాన్ని చూడని కన్నులు నెమలి పింఛపు కన్నులే! కమలాక్షునర్చించని చేతులు శవముయొక్క చేతుల వంటివి. శ్రీహరి పాదాలపైనుండే తులసీదళాల పరిమళం ఆఘ్రాణించని ముక్కు పందిముక్కు. అంతేకాదు! ఓరాజా!

సీ॥ నారాయణుని దివ్య నామాక్షరములపై కరుగని మనములు కఠినశిలలు
మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడునియౌదలనున్న కనక కిరీటంబు కట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవుసిరి వనదుర్గచంద్రికావైభవంబు
ఆ॥ కైటభారి భజన కలిగి యుండని వాడు గాలిలోననుండి కదలుశవము
కమలనాభుపదము కనని వానిబ్రతుకు పసిడికాయలోని ప్రాణిబ్రతుకు 51

శ్రీమన్నారాయణుని దివ్యనామాక్షర స్మరణతో కరిగి ప్రవహించని మనస్సులు కఠినశిలలు. విష్ణుదేవుని కథాశ్రవణంతో ఆనంద బాష్పాలు రాలనికన్నులు, రోమాంచము కాని శరీరము దారుసమానం. చక్రధారునకు ప్రణమిల్లని మూఢుని తలమీద బంగారు కిరీటం ఉన్నా అది బరువుచేటు. భగవంతునకు అర్పితంకాని (భగవత్కార్యాలలో వినియోగింపబడని) మానవుని ఐశ్వర్యం అడవినిగాసిన వెన్నెలవంటిదే. వాసుదేవుని సేవలో వినియోగింపబడని శరీరముగలవాడు ప్రాణవాయువుచే కదిలే శవము వంటివాడు. పద్మనాభుని పాదాల నాశ్రయించని వాని బ్రతుకు పట్టుదారపుగూడులోని పురుగు బ్రతుకు.

అని, శ్రీశుకుడు చెప్పగా, పరీక్షిత్తు భార్యా పుత్ర బంధు మిత్ర పరివార రాజ్యసంపదలు సర్వమూ త్యజించి, భగవంతునిపై మనస్సు నిలిపి, మరణ భీతిని నిరాకరించి, ధర్మార్థ కామాలను తిరస్కరించి, శ్రీమన్నారాయణుని లీలా విశేషాలను ఆకర్ణించాలనే కాంక్షతో శ్రీశుకునితో ఇలా అన్నాడు:

"యోగీంద్రోత్తమా! నాలోని భ్రమలన్నీ తొలగిపోయినవి. నామనస్సు సంతోష పరవశమైనది. శ్రీహరియొక్క సృష్టి స్థితిలయ కార్యాలు ఎలాగ నిర్వహింపబడుతున్నవో తెలియజేయవలసినది" అని ప్రార్థించాడు.

పరీక్షిత్తుకోరికను మన్నించి, అతడు, సృష్టిని గురించి, భగవదవతారాలను గురించి అడిగిన అనేక ప్రశ్నలకు జవాబు లిచ్చుటకు ముందుగా శ్రీశుకుడీ విధంగా దైవ ప్రార్థన చేసెను. :-

మ॥ పరుడై యీశ్వరుడై మహామహిముడై ప్రాదుర్భవ స్థాన సం
హరణక్రీడనుడై త్రిశక్తియుతుడై యంతర్గత జ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకున్ ప్రాపింపరాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్॥ 58

ఉ॥ ఏవిభు వందనార్చనము లేవిభుచింతయు నామకీర్తనం
బేవిభు లీలలద్భుతము లెవ్వని సంశ్రవణంబుసేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునంద్రు నే
నావిభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్॥ 60

ఉ॥ ఏ పరమేశు పాదయుగ మెప్పుడు కోరిభజించి నేర్పరుల్
లోపలిబుద్ధితో నుభయలోకములందులసక్తిఁబాసి యే
తాపములేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నాపరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్॥ 61

చ॥ తపములు సేసియైన మఱి దానము లెన్నియుఁ జేసియైన నే
జపములు సేసియైన ఫలసంచయమెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంతవిపదంచితరీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్॥ 62

మ॥ తపముల్ సేసిననో మనోనియతినో దానవ్రతప్రీతినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుండౌనని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతురెవ్వాని న
య్యపవర్గాధిపు డాత్మమూర్తి సులభుండౌగాక నాకెప్పుడున్॥ 64

క॥ శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్రజాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్
భూపతియు యాదవశ్రేణీపతియుం గతియునైన నిపుణు భజింతున్॥ 65

మ॥ అణువో కాక కడున్ మహావిభువుడో యచ్ఛిన్నుడో ఛిన్నుడో
గుణియో నిర్గుణుడో యటంచు విబుధుల్ కుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యే విభుపాదపద్మ భజనోత్కర్షంబులన్ తత్త్వ వీ
క్షణముం జేసెదరట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్మ సేవించెదన్॥ 66

ఉ॥ మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాపి, ముక్తులై
లూనత నొందరట్టి మునిలోకశిఖామణికిన్ విశంకటా
జ్ఞాన తమోనభోమణికి సాధుజనాగ్రణికేను మ్రొక్కెదన్॥ 69

ప్రకృతికీ, జీవునికీ పరుడైనవాడూ, ఈశ్వరుడూ, మహామహిముడూ, సృష్టి స్థితి లయక్రీడను నడిపించువాడూ, సృష్టి స్థితిలయ శక్తులు కలవాడూ, అంతర్జ్యోతి యైనవాడూ, బ్రహ్మాదిదేవతలకు అందుబాటులోలేకుండా దుస్తర మార్గంలో ప్రకాశించేవాడూ అయినట్టి శ్రీహరిని తత్త్వార్థినై ప్రార్థిస్తున్నాను. మరియు, సజ్జనుల పాపాలను హరించేవాడూ, దుర్జన నివారకుడూ, అన్ని రూపాలూ తననే అయిన వాడూ, పరమహంసాశ్రమవాసమునిజన హృదయ కమలములమధ్యలో ప్రకాశించువాడూ, యాదవ శ్రేష్ఠుడూ, సమస్త కల్యాణ గుణోపేతుడూ, భక్త సులభుడూ అయిన పరమేశ్వరునకు ప్రణమిల్లుతున్నాను. ఎవ్వని లీలాగుణ వైభవాలను కీర్తిస్తూ, దివ్యగాథలనాలకిస్తూ, లోకులు దోషాలను పోగొట్టుకొని శుభాలను పొందుతారో, ఆ ప్రభువును నేను కొలుస్తున్నాను. బుద్ధిమంతులు లౌకికాసక్తులను విడిచి, ఎవ్వని పాదపద్మాల నాశ్రయించి, బ్రహ్మపదాన్ని పొందుతున్నారో, ఆ పరమపుణ్యమూర్తిని నేనాశ్రయిస్తున్నాను. జపతపో ధ్యాన దానాదులు చేసి వాటి వల్ల కలిగిన ఫలాలూ, ధనసంపదా ఏ పరమేశ్వరున కర్పించకపోతే అవన్నీ నింద్యాలై ఆపదకారకాలవుతాయో అట్టి పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను. అనేక ప్రవృత్తులతో పొట్ట పోషించుకొంటున్న నిమ్న జన్ములైననూ, ఎవని పాదముల నాశ్రయించి, ఎవని భక్తుల సాంగత్యము చేసి పునీతులవుతారో, ఆపరమపావనునకు ప్రణమిల్లుతాను. తపస్సులు చేసియూ, మనోనియతి చేసియూ, దాన, వ్రత, జప, మంత్ర, శ్రుతి, స్మృతులద్వారానా, ఏవిధంగా పొందవచ్చును? అని ఎవనిని గురించి బ్రహ్మరుద్రాది ప్రముఖులంతా యోచిస్తుంటారో, ఆ ఆత్మమూర్తికి నమస్కృతులు. శ్రీదేవికీ, యజ్ఞాలకూ, ప్రజలకూ, బుద్ధికీ, జగత్తునకూ, భూమికీ యాదవవర్గానికీ, పతియు, గతియు అయిన ప్రభువును నేను సేవిస్తాను. ఆ పరమేశ్వరుడు అణు స్వరూపుడా, లేక విశ్వమంతటా వ్యాపించియున్న మహాస్వరూపుడా? దేశకాలాదులచే పరిచ్ఛిన్నుడా, అపరిచ్ఛిన్నుడా. సగుణుడా నిర్గుణుడా? అని ఈ విధంగా పండితులు వ్యర్థమైన తత్త్వాన్వేషణం చేసి చేసి, చివరకు ఏ భగవంతుని పాదపద్మాల నతిశయంగా భజించడం ద్వారా తత్త్వ స్వరూపాన్ని గుర్తిస్తారో, అట్టి సర్వ వ్యాపకుడూ, సర్వోత్కృష్టుడూ, సర్వాత్మకుడూ అయిన పరాత్పరుని భజిస్తాను. ఎవడు మొదట, బ్రహ్మదేవునకు సృష్టి జ్ఞాన మివ్వదలచి, సరస్వతిని పంపగా నామె ఆ బ్రహ్మనే వరించి అతనికి జ్ఞానము నివ్వగా సృష్టి జరిగినదో, ఆ పరమేశ్వరుని పూజిస్తాను. ఎవడు పంచభూత దశేంద్రియ మనస్సులతో సహా షోడశ తత్త్వాలతో శరీరాలను సృష్టించి వాటియందు ప్రకాశిస్తుంటాడో, ఆ పరమేశ్వరుడు తన గాథలనే చెప్పదలచుకొన్న నాయొక్క వాక్కుసుమమాలికలతో సజ్జనుల హృదయాలను అలరింపజేయుగాక!

మహాత్ములు, మానధనులు, సమాధినిష్ఠులునగు మునిలోకశిఖామణులకు సాక్షాత్తూ వాసుదేవుడే అయినట్టి నాతండ్రి అయిన వేదవ్యాసునకు మ్రొక్కుతున్నాను.

రాజా! ఇప్పుడు నీవడిగిన ప్రశ్ననే నారదమహర్షి బ్రహ్మదేవుని అడిగాడు. బ్రహ్మ తనకు కల్పాదియందు భగవానుడే చెప్పియున్న సృష్టి రహస్యాన్ని నారదునకు చెప్పాడు. అది నీకు వినిపిస్తాను.

# శ్రీశుకవాణి - వాసుదేవుడు, విశ్వసృష్టి

ఒకనాడు నారదమహర్షి బ్రహ్మదేవుని ఇలాగ ప్రశ్నించాడు: తండ్రీ! నీవు సృష్టికర్తవు. వేదాలు నీముఖాలనుండే ప్రకాశితమయ్యాయి. నీకు తెలియని విషయమేదీ ఉండదు. ఈ సృష్టిని ప్రారంభించే జ్ఞానం నీకెలాగ వచ్చినది? సృష్టి నిర్మాణానికి హేతువేమిటి? ప్రయోజనమేమిటి? దీని స్వరూపమేమిటి? నీవే ప్రభువువనీ, నీకంటే అధికులు లేరనీ నేనను కొంటున్నాను. నీవు ఎవరినుద్దేశించి తపస్సు చేశావు? నీకూ ఒక ప్రభువున్నాడా? ఉంటే అతడెవరు? ఆయన స్వరూపమెలాగుంటుంది? భూతభవిష్యద్వర్తమానాలన్నీ తెలిసిన నీకు తెలియనిదంటూ ఏదీ ఉండదు గనుక ఈ ప్రపంచ విధానం నాకు వివరించి చెప్పు'' అని వేడుకొన్న నారదునితో విధాత ఈవిధంగా చెప్పసాగాడు.

నాయనా! నీ సందేహాలు ప్రశంసనీయంగా నున్నవి. నావద్దకు ఎందరో జ్ఞానులు వస్తున్నా ఎవ్వరూ ఇలాంటి మంచి ప్రశ్నవెయ్యలేదు. నాకు తెలిసినదంతా నీకు చెప్తాను విను.

క॥ ఆ యీశుడనంతుడు హరి నాయకుడీ భువనములకు నాకున్ నీకున్
మాయకు ప్రాణివ్రాతముకేయెడలన్ లేద యీశ్వరేతరము సుతా! 85

పుత్రా! ఆపరమేశ్వరుడనంతుడు. ఆశ్రీహరి, ఈలోకాలకు, నీకూ, నాకూ మాయకూ, ప్రాణి సంఘాలకూ ప్రభువు. ఆయనకంటే అన్యమైనదేదీ ఈ జగత్తులోలేనే లేదు, నారదా! ఈ ప్రపంచాన్ని సృజించే జ్ఞానమూ, శక్తీ లేక, నేను తబ్బిబ్బు పడుతున్న స్థితిలో, నాకాప్రభువు, ఎంతో కరుణతో అవసరమైన విజ్ఞానాన్ని అనుగ్రహించాడు. ఆ పరమేశ్వరుని ఆనతి లేనిదే నేనేమీచెయ్యలేని అశక్తుడను. ఎవని ప్రకాశం వలన సూర్య చంద్రులూ, అగ్నీ, తారాగ్రహాలూ మున్నగువాటి వలెనే ఈలోకాలన్నీ సముజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయో, అట్టి దివ్యదీప్తితో తేజరిల్లుతున్న ఆ పరమేశ్వరునకు నేనెల్లవేళలా ప్రణమిల్లుతుంటాను. అతడే శ్రీహరి, వాసుదేవుడు, నారాయణుడు. అతడే సర్వస్వము, సర్వాంతర్యామి. అతడు వినా ఏమీలేదు. పంచమహాభూతాలూ, జన్మలను కలిగించే కర్మలూ, కాలము, స్వభావము (త్రిగుణాలు), ప్రకృతి, భోక్తయైన జీవుడూ, అంతా, ఆ వాసుదేవుడే అని తెలుసుకొనుము.

ఆదేవునికంటె అన్యమైనదేదీలేదు. ఇది నిజము. ఈ లోకాలన్నిటినీ నియమించేవాడు ఆ శ్రీమన్నారాయణుడే. దేవతలు ఆయనశరీరంనుండి వచ్చిన వారే. వేదాలు, యాగాలు, తపస్సులూ, యోగ విజ్ఞానాలూ ఆ నారాయణుని ఆరాధనా ప్రక్రియలే. జ్ఞానంవల్ల సాధింపబడిన ఫలము ఆయన అధీనంలోనే ఉంటుంది. నిర్వికారుడూ, సర్వాంతర్యామీ, సర్వదర్శనుడూ అయిన ఆ పరమేశ్వరుని కటాక్ష విశేషముచే నేను సృజింపబడితిని తత్ప్రేరితుడనై సృజింపవలసిన ప్రపంచాన్ని సృజిస్తుంటాను. నిర్గుణుడైన ఈశ్వరునినుండి సత్త్వరజస్తమోగుణములుద్భవించి, సృష్టిస్థితిలయాలకు పాల్పడి, కార్యకారణ కర్తృత్వభావాలలో, (ద్రవ్యములైన పంచభూతాలనూ జ్ఞానమూర్తులయిన దేవతలనూ, క్రియారూపాలైన ఇంద్రియాలనూ ఆశ్రయించి) సదాముక్తుడే అయినా మాయా సమన్వితుడైయుండే జీవుని బంధించుతాయి. జీవుని ఆవరించెడి ఈమూడు గుణాలనూ కల్పించి, ఇతరులకేమాత్రమూ గోచరించకుండా తనకు మాత్రమే తెలియవచ్చే తత్త్వంగలవాడైన ఈశ్వరుడు ఈవిధంగా క్రీడిస్తుంటాడు.

ఈశ్వరుడు మాయకు నియామకుడు. ఆమాయవల్ల కాలమూ, జీవాదృష్టమూ, స్వభావమూ, అనుమూడు ఉపకరణాలు సిద్ధించాయి. ఇవి సృష్టి కార్యక్రమానికి ఉపకరించాయి. ఈశ్వరునిచే అధిష్ఠింప బడిన మహత్తత్త్వం వలన వచ్చిన కాలం కారణంగా, త్రిగుణాల వ్యత్యాసమూ (సమతూకం చెదరడం), స్వభావమునుండి పరిణామమూ (పరివర్తనం), జీవాదృష్ట రూపమునన్నున్న "కర్మ'' నుండి జన్మమూ సంభవించాయి. రజోగుణంచేత సత్త్వగుణంచేత వృద్ధిపొందిన మహత్తత్త్వం వికారానికి లోనయినది. దానినుంచి, తమోగుణ ప్రధానమైనదీ, పంచభూతాలూ దశేంద్రియాలూ రూపంగా కలదీ,

అయిన అహంకారం జనించినది. ఆ అహంకారం మళ్లీ వికారానికి లోనై ద్రవ్యశక్తియైన తామసమని, క్రియాశక్తియైన రాజసమనీ, జ్ఞానశక్తియైన సాత్త్వికమనీ, మూడు రూపాలుగా పరిణమించినది.

పంచభూతాలకు మూలకారణమైన తామసాహంకారంనుండి ఆకాశం పుట్టినది. ద్రష్ట అయిన ఆత్మకూ, దృశ్యమైన జగత్తుకూ బోధకమై, సూక్ష్మ రూపమైయున్న శబ్దము ఆకాశానికి గుణమైనది. వికారానికిలోనైన ఆకాశమునుండి స్పర్శగుణప్రధానమైన వాయువు పుట్టినది. తనకు కారణమైన ఆకాశమందలి శబ్దమూ, తనకు సహజమైన స్పర్శమూ, అనే రెండు గుణాలు, వాయువునకున్నవి. వాయువు శరీరాలలో ప్రాణ రూపంలోనుంటుంది. అది ఇంద్రియ పాటవానికీ, మనోబలానికీ, శారీరిక శక్తికీ హేతువవుతున్నది. వికారం పొందిన వాయువునుండే రూపము, స్పర్శ, శబ్దము అనే మూడు గుణాలతోపాటు తేజస్సు జనించినది. తేజస్సునుండి రసము, రూపము, స్పర్శ, శబ్దము అనే నాలుగు గుణాలతో పాటు జలము జనించినది. జలమునుండి, గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము, అనే ఐదుగుణాలతో పృథివి పుట్టినది. ఇవన్నీ తామసాహంకారంనుండి కలిగినవే.

వికారానికి లోనైన సాత్త్వికాహంకారంనుండి మనస్సు పుట్టినది. దానికి చంద్రుడు అధిదేవత. ఆ సాత్త్వికాహంకారంనుండే, దిక్కులూ, వాయువూ, సూర్యుడూ, వరుణుడూ, అశ్వినీదేవతలూ, అగ్నీ, ఇంద్రుడూ, ఉపేంద్రుడూ, మిత్రుడూ, ప్రజాపతి అనే పదిమంది దేవతలూ పుట్టారు.

తైజసమైన రాజసికాహంకారంనుండి శ్రవణము మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్కుమొదలైన ఐదు కర్మేంద్రియాలూ, బుద్ధి, ప్రాణమూ కలిగాయి. ఆ పదిఇంద్రియాల అధిదేవతల వివరాలివి:-

శ్రవణేంద్రియానికి దిక్కులూ, త్వగింద్రియానికి వాయువూ, నేత్రేంద్రియానికి సూర్యుడూ, రసనేంద్రియానికి ప్రచేతసుడూ, ఘ్రాణేంద్రియానికి అశ్వినీదేవతలూ, వాగింద్రియానికి అగ్నీ, హస్తేంద్రియానికి ఇంద్రుడూ, పాదేంద్రియానికి ఉపేంద్రుడూ, గుదేంద్రియానికి మిత్రుడూ, ఉపస్థేంద్రియానికి ప్రజాపతీ, దేవతలుగా నున్నారు. బుద్ధి జ్ఞానాన్ని కలిగించే అంతఃకరణంలోని ఒక భాగము. ప్రాణము క్రియను కలిగించే అంతఃకరణము.

శ్రోత్రము మొదలైన దశేంద్రియాలతో కూడిన, భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, శబ్ద స్పర్శాదిగుణాలు విడివిడిగానున్నప్పుడు బ్రహ్మాండమనే శరీరాన్ని నిర్మించ లేకపోయాయి. పంచభూతాలూ, ఇంద్రియాలూ, మనస్సూ, గుణాలూ, భగవంతుని శక్తివల్ల ప్రేరణపొంది, ఒక్కటిగా చేరాయి. సమష్టిగానూ, వ్యష్టిగానూ కలిసి, చేతనాలనూ, అచేతనాలనూ కల్పించాయి. ఈ బ్రహ్మాండాన్ని నిర్మించాయి. ఆవిధముగా నిర్మింపబడిన ఆ అండము, కొన్నివేల దివ్యసంవత్సరాలు జలములలోనుండిపోయినది. కాల కర్మ స్వభావాల కతీతుడూ, సమస్తాన్నీ జీవయుక్తం చేయువాడూ, అయిన ఈశ్వరుడు, అచేతనముగనున్న దాన్ని సచేతనం చేశాడు. కాల, కర్మ స్వభావాలకు ప్రేరకుడైన అపరమేశ్వరుడు మహావరణ జలమధ్యనున్న బ్రహ్మండములోజీవరూపంలో ప్రవేశించి, దానిని బాగా విస్తృతం చేసి, చివరకు ఆ అండాన్ని ఛేదించుకొని వెలికి వచ్చాడు.

అది ఎలాగ జరిగిందంటే – ఒక మహాభవనాకృతిలో నున్న బ్రహ్మాండాన్ని ఒక క్రమ పద్ధతిని చతుర్దశ భువనాలుగా వివరించి విభజించాడు. ఆదేవుడు అనేకాలైన శిరస్సులూ, భుజాలూ, పాదాలూ మొదలైన అంగాలతో కూడియుండి, అనేకమైన ప్రాణులశరీరాల్లో విహరిస్తుంటాడు. అతడు యోగుల హృదయాలలో పూజనీయుడైయుంటాడు.

చతుర్దశభువనాల్లోనూ పై ఏడులోకాలూ శ్రీమహావిష్ణువుయొక్క నడుమునుండి పైశరీరమనీ, క్రింది ఏడులోకాలూ, అతని క్రిందిశరీరమనీ అంటారు. భూలోకమతనియొక్క కటిప్రదేశమనీ, భువర్లోకమునాభియనీ, సువర్లోకము హృదయమనీ,

మహర్లోకము వక్షస్థలమనీ, జనోలోకము కంఠమనీ, తపోలోకము స్తనద్వయమనీ, సనాతనమూ, బ్రహ్మనివాసమూ అయిన సత్యలోకము శిరస్సనీ, అలాగే జఘన ప్రదేశము అతలమనీ, తొడలు వితలమనీ, జానువులు (మోకాళ్ళు) సుతలమనీ, పిక్కలు తలాతలమనీ, గుల్ఫములు (చీలమండలు) మహాతలమనీ, పాదాగ్రాలు (మునివేళ్ళు) రసాతలమనీ, పాదాలు క్రింద (అరికాళ్ళు) పాతాళమనీ, అందుచేతనే అతడు సర్వలోకమయుడనీ అంటారు.

శ్రీమన్నారాయణుని ముఖంనుండి సమస్త ప్రాణుల వాక్కులూ, వాక్కుల కధిష్ఠానమైన అగ్నీ పుట్టాయి. చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లము, అతనియొక్క ఏడుధాతువులు. హవ్య (దేవతల కర్పింబడేవి), కవ్య (పితృదేవతల కర్పింపబడేది) అమృతాన్నం (నైవేద్యప్రసాదం), తీపి, మొదలైన షడ్రసాలకూ, రసనేంద్రియానికీ, రసాధీశ్వరుడైన వరుణునకూ, ఆ శ్రీహరియొక్క రసనేంద్రియమే జన్మస్థానము, సర్వప్రాణాదులకూ, వాయువునకూ విష్ణునాసికయే నివాసము. సమీప, దూర, వ్యాపి గంధాలకూ, ఓషధులకూ, అశ్వినీదేవతలకూ, భగవంతుని ఘ్రాణేంద్రియమే నివాసము. దేవలోకానికీ, సత్యలోకానికీ, తేజస్సునకూ, సూర్యునికీ సకల నేత్రాలకూ, లోకనేత్రుడైన పరమాత్ముని చక్షురింద్రియమే నివాసము. దిక్కులకూ, ఆకాశానికీ, శ్రవణాంశాలకూ, శబ్దానికీ సర్వేశ్వరునిశ్రోత్రేంద్రియమే జన్మభూమి. ప్రశస్తాలైన వస్తువులకూ, కొనియాడదగిన సౌందర్యాలకూ పరమపురుషుని శరీరమే మూల స్థానము. స్పర్శకూ, వాయువునకూ, స్నిగ్ధత్వానికి (నిగనిగశోభకు) ఆ దివ్యశరీరుని దేహేంద్రియమే నిలయం. సకల కోరికల సిద్ధికీ, శ్రేష్ఠమైన వరాలకూ ఆ పరమేశ్వరుని పాదపద్మాలే నిలయాలు.

జలాలు, శుక్లము, పర్జన్యుడు, ప్రజాపతి సర్గము – వీటన్నింటికీ ఆ సర్వేశ్వరుని పురుషాంగము జన్మస్థలము. సంతతికీ, కామము మొదలైన పురుషార్థాలకూ, మనస్సుకు హాయికలిగించే సుఖాలకూ, శరీరసుఖానికీ, అచ్యుతుని గుహ్యేంద్రియం స్థానము. యమునకూ, మిత్రునకూ, మలవిసర్జనానికీ ఆ దేవుని గుదేంద్రియం ఇల్లు.

హింసకూ, నిర్ఋతికీ, మృత్యువునకూ, నరకానికీ, అతని గుదము నెలవు. అవమానానికీ, అధర్మానికీ, అవిద్యకూ, చీకటికీ అనంతమైన అతని పృష్ఠ ప్రదేశము నివాసము. నదీనద సమూహాలకు, ఈశ్వరుని నాడీ సముదాయము నివాసము. పర్వతాలకు స్థానము అతని ఎముకలు. ప్రధానమునకూ, అన్నరసానికీ, సముద్రాలకూ, భూతాల లయానికీ, ఆ బ్రహ్మాండ గర్భుని ఉదరమే ఉనికి పట్టు. మానసిక వ్యాపార రూపమైన లింగ శరీరానికి ఆ దేవుని హృదయమే సృష్టి స్థానము. అంతేకాదు, శివునకూ, నీకూ, నాకూ, సనత్కుమారులకూ, ధర్మానికీ, సత్త్వానికీ, విజ్ఞానానికీ, శ్రేష్ఠమైన ఉనికిపట్టు ఆ పరమేశ్వరుని ఆత్మయే.

కుమారా! మానవులూ, దేవతలూ, దానవులూ, పితరులూ, ఉరగులూ, గజాలూ, మృగాలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ, వృక్షాలూ, సిద్ధులూ, విద్యాధరులూ, మేఘాలూ, చారణులూ,గ్రహాలూ, నక్షత్రాలూ, అప్సరసలూ, పక్షులూ, భూతగణాలూ, మెరుపులూ, కనకాది ధనరాసులూ, నీవూ, శివుడూ, మహర్షులూ, నేనూ, నీళ్లలోనూ, ఆకాశంలోనూ, భూమిమీదనూ, సంచరించే వివిధప్రాణులతోగూడియున్న ఈ ప్రపంచమూఅంతా విష్ణుమయమే. ఇన్ని మాటలెందుకు? బ్రహ్మాండ భాండాలన్నీ అతనిజేనలో నిమిడిపోతాయి. కేవలం బుద్ధిబలముతో మనం ఆ దేవదేవుని తెలిసికొనలేము. భూతభవిష్యద్వర్తమానకాలాల్లోని లోకాలన్నీ ఆ విష్ణువులోనే ఉన్నవి.

క॥ విశ్వాత్ముఁడు విశ్వేశుఁడు విశ్వమయుండఖిలనేత విష్ణుఁడజుండీ
విశ్వములో తానుండును విశ్వము తనలోన చాల వెలుగుచునుండన్. 100

చ॥ అతనినియుక్తిఁ జెంది సచరాచరభూతసమేతసృష్టి నే
వితతముగా సృజింతుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు ప్రోచు పార్వతీ
పతి లయమొందఁజేయు హరి పంకరుహోదరు డాదిమూర్తి య
చ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁడగుచుండును నింతకు తానె మూలమై॥ 101

క॥ హరి భగవంతుడనంతుడు కరుణాంబుధి సృష్టికార్యకారణహేతు
స్ఫురణుండవ్విభుకంటెం బరుడెవ్వడు లేడు తండ్రి పరికింపంగన్. 103

నారదా! నిర్గుణుడైన పరమేశ్వరుడు జగత్తును సృష్టించడానికి, తన మాయా ప్రభావముచే సగుణుడవుతున్నాడు, కనుక భగవంతుడనబడుతున్నాడు. విశ్వానికి ఆత్మ అయినవాడూ, ప్రభువూ, విశ్వమయుడూ సమస్తానికి నాయకుడూ, పుట్టుకలేనివాడూ అయిన విష్ణువు ఈ విశ్వంలోనుంటాడు. ఈ విశ్వమతని యందు ఎక్కువగా ప్రకాశిస్తుంది. అతని ఆనతి ప్రకారము నేను చరాచర ప్రాణులతో కూడిన ఈ సృష్టిని విస్తారముగా సృజిస్తున్నాను. ప్రభవిష్ణుడు పోషిస్తున్నాడు. పార్వతీ పతియైన శివుడు దీనిని లయింప జేస్తున్నాడు. పద్మనాభుడూ, ఆదిమూర్తీ అయిన శ్రీహరి ఈత్రిశక్తులతో కూడియున్న వాడై సృష్టి స్థితి లయకార్యాలను నిర్వహిస్తున్నాడు. ఈ సమస్త విశ్వానికీ ఆధారము ఆ పరబ్రహ్మమే. శ్రీహరి షడ్గుణైశ్వర్య సంపన్నుడు. అనంతుడు, భగవంతుడు, కరుణా సాగరుడు. సృష్టికార్యానికి కారణ భూతుడు. ఆ ప్రభువుకంటె శ్రేష్ఠుడింకెవ్వడూలేడు. ఆ దేవదేవుని పాదపద్మాలకు ప్రణామంచేస్తున్నాను.

మ॥ పరమాత్ముం డజుఁడీ జగంబుఁ బ్రతికల్పంబందు కల్పించుఁదా
పరిరక్షించును ద్రుంచునట్టి యనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ
ద్భరితున్ గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంత విహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్. 110

పుట్టుకలేని ఆ పరమాత్ముడు ప్రతికల్పంలోనూ ఈ విశ్వాన్ని పుట్టిస్తాడు. పోషిస్తాడు లయింపజేస్తాడు. పాపరహితుడూ, బ్రహ్మస్వరూపుడూ, శాశ్వతుడూ, జగమంతా నిండియున్నవాడూ, కేవలుడూ, ఏకమాత్రుడూ, నిర్మల జ్ఞానము కలవాడూ, సర్వాంతర్యామీ, ఆద్యంతములు లేనివాడూ నిర్గుణుడూ, నిత్యుడూ అయిన ఆ పరమేశ్వరుని ధ్యానిస్తున్నాను.

## భగవదవతారాలు - ఆదిపురుషావతారము

నారదా! మహాతేజోనిధియైన ఆ పరమాత్ముని మొదటి అవతారము - సహస్ర శీర్షాదులతో కూడియున్న ఆదిపురుషుడు. దానినుండి, కాలమూ, స్వభావమూ అనే రెండు శక్తులుదయించాయి. వాటినుండి కార్యకారణ రూపమైన ప్రకృతి పుట్టినది. ప్రకృతి వలన మహత్తత్త్వమూ, దానివలన సాత్త్విక, రాజసిక, తామసికాహంకారాలూ పుట్టాయి. రాజసికాహంకారంవలన ఇంద్రియాలూ, సాత్త్వికాహంకారమువలన ఇంద్రియగుణాలు ప్రధానంగాగల అధిదేవతలూ, తామసాహంకారంవలన పంచభూతాలకుహేతువులైన శబ్ద స్పర్శరూపరసగంధతన్మాత్రలూ ఉద్భవించాయి. ఆతన్మాత్రలనుండి, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, అనే పంచభూతాలు కలిగాయి. వాటినుండి త్వక్, చక్షు, శ్రోత్ర జిహ్వాఘ్రాణములనే జ్ఞానేంద్రియాలూ, మనస్సూ పుట్టాయి. అలాగే వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ అనే కర్మేంద్రియాలూ పుట్టాయి. వీటన్నిటి సంఘాతముచే విశ్వరూపుడైన విరాట్ పురుషుడుదయించాడు. అతనివలన స్వయంప్రకాశుడైన స్వరాట్టు ఆవిర్భవించాడు. అతనినుండి చరాచర రూపాలతో స్థావర జంగమాత్మకమైన జగత్తు పుట్టినది. దానినుండి సత్త్వగుణస్వరూపుడైన విష్ణువూ, రజోగుణ స్వరూపుడనై హిరణ్యగర్భుడనబడే నేనూ, తమోగుణ స్వరూపుడైన రుద్రుడూ జన్మించాము. సృష్టిజనన కారణుడైన చతుర్ముఖునినుండి, దక్షాదులైన ప్రజాపతులు తొమ్మండుగురు కలిగారు. అలాగే నీవూ, సనక సనందాది యోగులూ, ఇంద్రాది దేవతలూ, గరుడాది పక్షిరాజములూ, మానవలోక పాలకులైన మను, మాంధాతాదులూ, తలలోక పాలకులైన అనంత, వాసుకి, మొదలైనవారూ, గంధర్వ, విద్యాధర చారణ సాధ్య రాక్షస యక్ష, ఉరగ, నాగలోక పాలకులూ, ఋషులూ, పితృదేవతలూ, దైత్యదానవ భూత ప్రేత పిశాచ, కూష్మాండ పశుమృగాదులూ ఉద్భవించారు. జగత్తుయొక్క ఈ ప్రథమ సృష్టిని మహత్తత్త్వసృష్టి అంటారు.

రెండవది అండగతిసృష్టి. మూడవది సమస్త భూత గత సృష్టి అనబడుతాయి. అందులో ఐశ్వర్యబలతేజో సంపన్నులైన పురుషులు, సర్వాంతర్యామియైన శ్రీమన్నారాయణాంశతో జన్మించిన వారుగా తెలుసుకొనుము. ఆ అరవిందాక్షుని లీలావతారాలు అనంతమైనవి. ఆయనయొక్క ఘన కార్యాలను లెక్కించడానికెవ్వరికీ సాధ్యము కాదు. అయిననూ సాధ్యమైనంత వరకూ నీకు వినిపిస్తానులే!

**యజ్ఞవరాహావతారము :** పూర్వము హిరణ్యాక్షుడనే రాక్షసుడుండేవాడు. వాడు బాహుబలాటోపముతో భూచక్రాన్ని చాపచుట్టినట్లు చుట్టి, సాగరగర్భానికి కొని పోయాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు యజ్ఞ వరాహరూపముదాల్చి, ఆదానవునితో సముద్రగర్భంలో పోరి, వానిని హతమార్చి, భూమిని ఉద్ధరించాడు.

**సుయజ్ఞావతారము :** పూర్వము రుచి యనే ప్రజాపతికీ, స్వాయంభువ మనువు కూతురైన ఆకూతికీ "సుయజ్ఞు"డనే పుత్రుడు పుట్టాడు. అతడు దక్షిణ అనే కాంతను వివాహమాడి "సుయములు" అనే పేరుగల దేవతలను కన్నాడు. అతడు ఇంద్రుడై దేవతలకు రాజైనాడు. విష్ణువువలె సమస్తలోకాల దుఃఖాన్ని హరింపజేశాడు. స్వాయంభువ మనువు తన మనుమని ఉత్తమ చరిత్రకు సంతోషించి, "ఈ పరమపవిత్రుడు శ్రీహరియే" అని గుర్తించి ప్రకటించాడు.

**కపిలమహర్షిఅవతారము :** కర్దమ ప్రజాపతికీ, పతివ్రత అయిన దేవహూతికీ, తొమ్మండుగురు పుత్రికల తరువాత "కపిలుడు" అనే పేరుగల పుత్రుడుదయించాడు. శ్రీహరియే కపిలునిగా జన్మించాడు. శ్రీమన్నారాయణుని పొందటానికి సాధనమైన సాంఖ్యయోగాన్ని ఆమహనీయుడు తన మాతృమూర్తికి బోధించాడు. ఆమెయొక్క బంధనాలను త్రెంచి, ఆమెకు మోక్షాన్ని ప్రసాదించాడు.

**దత్తాత్రేయావతారము :** తాపసోత్తముడైన అత్రిమహాముని పుత్రసంతానార్థియై ప్రార్థించగా శ్రీహరి ప్రసన్నుడై "నేనునీకు దత్తుడనయ్యాను" అని చెప్పి అతనిపుత్రుడుగా జన్మించాడు. అందుచేతనాబాలుడు దత్తాత్రేయుడనబడ్డాడు. మహనీయుడైన ఆ దత్తాత్రేయుని యొక్క పాదపద్మపరాగము సోకి, యదు, హైహయ వంశీయులందరూ పవిత్రులయ్యారు. అతని అనుగ్రహించే వారు, జ్ఞానఫలాన్నీ, యోగబలాన్నీ, ఐశ్వర్య, శౌర్య, శక్తి, సౌఖ్యాలను పొందారు. ఇహపరలోకాల్లోనూ ఆ దివ్యదేహునికీర్తి ప్రసిద్ధిగాంచినది.

**సనకసనందనాదులు :** నేను కల్పారంభంలో, విశ్వసృష్టిని చేపట్టదలచి, తపస్సు చేస్తూ ఉన్నప్పుడు నానోట అప్రయత్నంగా "సన" అనేశబ్దం వెలువడగా, నలుగురు కుమారులుద్భవించారు. వారే – సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులుగా బ్రహ్మమానసపుత్రులనబడి ప్రసిద్ధికెక్కారు. గతించిన కల్పం చివరిలో అంతరించిపోయిన ఆత్మతత్త్వాన్ని వాళ్లు మళ్లీ లోకంలో ప్రవర్తింపజేశారు. నారదా! ఆవిష్ణుదేవుని కళలతో జన్మించిన ఆ నలుగురూ ఒకే అవతార సంభూతులు.

**నరనారాయణావతారము :** పరమపావనమూర్తులైన ఈ నరనారాయణులు, ధర్మునకు, దక్షపుత్రిక అయిన "మూర్తి"కి జన్మించారు. వారు, బదరీ వనంలో నిశ్చలమానసంతో తపస్సు చేసుకొంటుంటే, తన పదవికి ముప్పు రావచ్చునేమోయనే భయంతో ఇంద్రుడు వారికి తపోభంగం చేయదలచాడు. అప్సరసలను పురికొల్పి వారి వద్దకు పంపాడు. ఆ సుందరీమణులు చేస్తుండే శృంగార చేష్టలకు ఏమాత్రమూ చలించని ఆతపోధనులు, నిశ్చింతులై నిర్మోహులై, మహాతపస్సులో నిమగ్నమై యుండిపోయారు. తమకృషి వ్యర్థమై పోయిందని ఖిన్నలైయున్న దేవకాంతలను చూచి, వారిపై కోపగించి శపించడానికి బదులుగా ఆఋషి పుంగవులు జాలి పడ్డారు. అమర కాంతలాశ్చర్యం చెందునట్లుగా, నారాయణ ఋషి, తన తొడనుండి అతిలోక సౌందర్యరాశులైన స్త్రీ మూర్తులనుద్భవింపజేశాడు. ఊరువునుంచి పుట్టిన స్త్రీలలో ప్రథమురాలిని "ఊర్వశి" అన్నారు. అందచందాలలో తమకు తలదన్నినట్లున్న ఊర్వశిని చూచి ఇంద్రలోక

వనితలు తలలు వంచుకున్నారు. ఊర్వశిని ఇంద్రునకు కానుకగా నారాయణుడు పంపగా, ఆమెను ఇతర - అప్సరసలు నాయకురాలిగా స్వీకరించారు. శ్రీహరి అవతారమైన ఆ నరనారాయణులు సృష్టించగలరు, కామక్రోధాలను జయించగలరు అని నిరూపించారు.

## ధ్రువునకు దర్శనమిచ్చిన అవతారము:

ధ్రువుడు ఉత్తానపాదుడనే రాజునకు సత్పుత్రుడు. చిన్నప్పుడొకనాడు అతడు తన తండ్రి వద్దనుండగా నతని సవతి తల్లియైన సురుచి, అతనిని తూలనాడి, అతని మృదు హృదయాన్ని తీవ్రంగా గాయపరచినది. దానికి తట్టుకొనలేని ఆ బాలుడు నీయొక్క సలహాను పాటించి శ్రీహరిని గూర్చి గొప్ప తపస్సు చేశాడు. భగవంతుడు దర్శనమిచ్చి, అనుగ్రహించాడు. అతడు శరీరంతోనే వెళ్లి, శాశ్వతమైన మహోన్నతమైన ధ్రువస్థానంలో స్థిరపడ్డాడు. అతడు విష్ణు సమానుడయ్యాడు.

## పృథుచక్రవర్తిఅవతారము

వేనుడనే రాజు దుష్టుడై బ్రాహ్మణ శాపానికి గురియై, సిరినీ, పౌరుషాన్నీ కోల్పోయి నరకం పొందాడు. శ్రీహరి కళాంశతో సంభవించిన అతని పుత్రుడైన పృథువు అతనిని నరకంనుండి రక్షిస్తాడు. పృథువు భూదేవిని బిడ్డగా గ్రహించి, ఆమెనుండి ప్రజలకు కావలసిన అనేకమైన వస్తువులను పొందాడు. అందుకే భూమి పృథివి అనబడినది.

## వృషభావతారము (ఋషభావతారము):

అగ్నీధ్రునిపుత్రుడు. నాభికీ, మేరుదేవి (సుదేవి)కీ శ్రీహరి కుమారునిగా జన్మించాడు. అతడు జడుని వలెయోగాభ్యాసం చేస్తూ ప్రశాంతచిత్తుడై పరమహంసవలెనుండెడివాడని మహర్షులు ప్రశంసిస్తుండేవారు.

## హయగ్రీవావతారము:

నారదా! నీచే చేయబడిన యాగంలో, యజ్ఞపురుషుడైన శ్రీహరి బంగారు మేనిఛాయతో హయగ్రీవునిగా నావిర్భవించాడు. అతడు వేద స్వరూపుడూ, సర్వాంతర్యామీ, దేవతలకు ఆత్మ అయినవాడూను. అతని నాసికలనుండి వెలువడిన శ్వాసయే వేదాలు అతడు వేదవిహిత కర్మలచే నారాధింపబడువాడు.

## మత్స్యావతారము:

ప్రళయకాలంలో సమస్తమూ జలమయమైయుండగా వైవస్వత మనువు ఒక పడవలో కూర్చున్నాడు. అప్పుడు భగవంతుడు మత్స్యావతారమెత్తి రాబోవు సృష్టికి అవసరమయ్యే ద్రవ్యాలను పెట్టించి, పడవను రక్షించాడు. ఒకనాడు నాముఖంనుండి జారిన వేదాలను పొందుపరచి మళ్లీ నాకు అందజేశాడు.

## కూర్మావతారము:

పూర్వము దేవతలూ రాక్షసులూ అమృతం సాధించాలనే ప్రయత్నంలో మందరగిరిని కవ్వముగా పెట్టుకొని, క్షీరసాగరాన్ని మథించారు. ఆపర్వతం సముద్రంలో మునిగిపోతున్నప్పుడు శ్రీహరి కూర్మరూపం ధరించి, దానిక్రిందకు చేరి, దానినుద్ధరించి, ధరించి యుంచాడు.

## నరసింహావతారము:

హిరణ్య కశిపుడనే రాక్షసుడు దేవలోకమునాక్రమించి, దేవతలను బాధిస్తూ, తనపుత్రుడూ హరిభక్తుడూ అయిన ప్రహ్లాదుని హింసిస్తూ ఉండటంచేత శ్రీహరి వానిని హతమార్చి లోకాలకు క్షేమం కలిగించాలని నరసింహావతారమెత్తి వానిని సంహరించాడు.

### ఆదిమూలావతారము:

గజేంద్రుడు ఒక మొసలిచేత పట్టుబడి, వేయిసంవత్సరాలు దానితోపోరాడి, శక్తిచాలక, రక్షణకై మొరపెట్టుకొన్నాడు. "నీవేనాకు దిక్కు, రావా, కాపాడవా" అని ఆక్రందనం చేశాడు. అదివిని, వెంటనే పరమేశ్వరుడు ఆదిమూల స్వరూపుడై మకరిని చంపి, కరిని కాపాడాడు.

### వామనావతారము:

శ్రీహరి అదితి గర్భములో వామనునిగా జన్మించినాడు. దేవతల రాజ్యాన్ని దానవరాజైన బలిచక్రవర్తి ఆక్రమించడంచేత, ఆ రాజ్యాన్ని మళ్లీ దేవతలకిప్పించాలనే ఉద్దేశ్యంతో శ్రీహరి వామనరూపంలో వెళ్లి, మూడడుగుల నేలను దానమిమ్మని బలినర్థించి, త్రివిక్రముడై పెరిగిపోయి ముల్లోకాలనూ ఆక్రమించాడు. పరమదాత అయిన బలి చక్రవర్తి, గురువుగారైన శుక్రాచార్యులు వారిస్తున్నా ఆదానమిచ్చి, తాను సర్వమూ కోల్పోయినా లక్ష్య పెట్టక, భగవంతునికి దానమిచ్చి ధన్యుడయ్యాడు.

### హంసావతారము:

నారదా! నీయొక్క భక్తికిమెచ్చి, నీవుకోరితివని, నీకు ఆత్మతత్వాన్ని ఆపరమేశ్వరుడు ప్రేమతో హంసరూపానవచ్చి బోధించాడుకదా!

ఆయనే, **మనువుగా** నవతరించి, దుర్జనులైన రాజులను శిక్షించి సజ్జనులను రక్షించి, తనకీర్తిని సత్యలోకంలో ప్రకాశింపజేశాడు.

ధన్వంతరిగా అవతరించి, ఆయుర్వేదాన్ని రచించి, లోకుల అనారోగ్యమును పోగొట్టే మార్గము చూపాడు.

### పరశురామావతారము:

నాయనా! హైహయరాజులు దుష్టులై లోకకంటకులుకావడం చేత శ్రీహరి భార్గవరామునిగా నవతరించి, రణరంగంలో ఇరవై యొక్క సార్లు పోరాడి వారిని నిర్మూలించాడు. భూమండలమంతా బ్రాహ్మణులకు దానం చేశాడు.

### శ్రీరామావతారము:

దేవతల ప్రార్థనలను మన్నించి, శ్రీమన్నారాయణుడు తన అంశలతో శ్రీరామునిగా కౌసల్యాదశరథులకు జన్మించాడు. తండ్రి అభీష్టాన్ని నెరవేర్చడానికి భార్యఅయిన సీతతోనూ, తమ్ముడైన లక్ష్మణునితోనూ అరణ్యవాసంచేశాడు. మునులకోరికపై రాక్షస సంహారంచేశాడు. వానర రాజైన సుగ్రీవుని రక్షించడానికి మహాబలశాలియైన వాలిని వధించాడు. సీతనపహరించిన రావణుని శిక్షించదలచి వానరసేనతో దక్షిణ సముద్రం చేరాడు. దారి ఇవ్వని సముద్రునిపై నాగ్రహించి బాణము సంధించేపరికి సముద్రుడు భయపడి దారి ఇవ్వగా, వానరులు వారధి కట్టగా, లంకను ప్రవేశించాడు. యుద్ధంలో రావణుని సంహరించి, అతని తమ్ముడైన విభీషణునకు లంకారాజ్యమిచ్చి, సీతను తోడ్కొని ఆంజనేయాదులతో కూడి మరలి వచ్చాడు మహనీయుడైన శ్రీరాముడు.

### శ్రీకృష్ణావతారము:

రాక్షసాంశతో జన్మించిన రాజులు, తమసైన్యాలను పెంచుకొని, అధర్మవర్తనులై లోకకంటకులుకావడంచేత భూదేవి విలపిస్తూ మొరపెట్టుకొన్నది. పరమేశ్వరుడు కరుణించి, భూలోకంలో జన్మించి, దుష్టసంహారంచేసి భూభారం తగ్గించాలని సంకల్పించాడు. తన తలలోని ఒక తెల్లవెంట్రుకనూ, ఒక నల్లవెంట్రుకనూ తీసి, భూలోకంలో బలరామ కృష్ణులుగా నవతరించేటట్లు చేశాడు.

శ్రీకృష్ణుడు పరమేశ్వరునియొక్క పరిపూర్ణావతారము. షడ్గుణైశ్వర్యసంపన్నుడు. అతనిని గురించి చెప్పడానికెవ్వరికీ సాధ్యపడదు. పుట్టినప్పటినుండీ అవతారం చాలించే వరకూ అతడెన్నో అద్భుతాలు చేశాడు. పుట్టిన కొద్దిరోజుల్లోనే చంపవచ్చిన పూతన అనే రాక్షసి యొక్క ప్రాణాలను చనుబాలతో పీల్చి చంపివేశాడు. మూడు నెలల ప్రాయంలోనే శకటాసురుని తనచిన్ని పాదాలతో తన్ని చంపివేశాడు. మద్దిచెట్లజంట మధ్యదూరి, వాటిని కూల్చివేసి ఇద్దరుయక్షులకు శాపవిమోచనం చేశాడు. యశోదామాతకు తన నోట సమస్త చరాచర విశ్వాన్ని చూపించాడు. కాళియ సర్పవిషంతో కలుషితమైన నీటిని త్రాగి మరణించిన గో, గోపబాలురను బ్రతికించి, కాళియుని పడగలపై నృత్యంచేసి, దాని శక్తినిహరించి, దానిని దూరసాగరాలకు తరిమివేశాడు. వ్రజవాసులను చుట్టుముట్టి, దహించివేస్తున్న దావాగ్నిని తననోటిలోనికి పీల్చుకొని దానిని అంతంచేశాడు. యమునలో మునిగిపోకుండా వరుణునినుండి నందుని రక్షించాడు. వ్యోమాసురుని చంపి, గోపబాలురను రక్షించాడు. గోకులవాసులకు వైకుంఠాన్ని చూపించాడు. ఏడేళ్ల వయస్సులోనే ఏడు అహోరాత్రులు గోవర్ధన గిరినెత్తి పట్టుకొని, గో గోపకులను ప్రళయకాల వృష్టిలాంటి వర్షంనుండి కాపాడి, ఇంద్రునిగర్వమణచాడు. బృందావనిలో రాసక్రీడలు జరిపి, తన వేణుగానంతో అందరినీ మంత్రముగ్ధులను చేసేవాడు. గోపకన్యలనపహరింప వచ్చిన శంఖచూడుడనే గంధర్వుని చంపాడు.

ప్రలంబునీ, ధేనుకునీ, బకునీ, కేశినీ, అరిష్ట చాణూరులనూ, కువలయాపీడమనే మత్తగజాన్నీ, కంస కాలయవనులనూ, నరకాసుర పంచజనులనూ, పౌండ్రక, సాళ్వులనూ, ద్వివిద, ముష్టిక, శంబరులనూ, శిశుపాల, వల్వ దంత వక్త్రులనూ, రుక్మి మొదలైన అనేకులైన దుష్టులను లోక కంటకులనూ హతమార్చాడు.

## వేదవ్యాసావతారము:

ప్రతియుగంలోనూ అల్పబుద్ధులూ, అల్పాయుష్కులూ, దుర్గతిపాలైన వారూ ఉంటారు. వాళ్లకు భగవంతుడు నిర్మించిన వేదాలు అందుబాటులో నుండవు. అలాంటి వాళ్లను అనుగ్రహించాలని శ్రీహరి పరాశర మహర్షికి పుత్రునిగా జన్మించి, వేదవృక్షాన్ని శాఖప్రశాఖలుగా విభజించి వేదవ్యాసునిగా ప్రసిద్ధి చెందాడు.

## బుద్ధావతారము:

భోగలాలసులు, చపలచిత్తులు, అసత్యవాదులు, భేదాచారపరాయణులు, అధర్మనిరతులు, శుద్ధ పాషండులూ అయిన అసుర ప్రవృత్తి గలవారు ప్రజలను హింసిస్తూ పెడమార్గంపట్టడంచేత శ్రీహరి బుద్ధావతారమెత్తి, వారినీ, వారిదురాచారాలనూ నిర్మూలించాడు.

## కల్కి అవతారము:

కలియుగంలో బ్రాహ్మణులు ధర్మభ్రష్టులై, భగవంతుని కీర్తిని నుతించరు. వేదవిహితమైన యజ్ఞయాగాది కర్మలనాచరించరు. వాళ్లనోటినుండి, వషట్, స్వాహా, స్వధా అనే వైదిక మంగళకరవచనాలు వినిపించవు. వారు సత్యాన్ని పాటించక, నాస్తికులవలె ప్రవర్తిస్తారు. అల్పులు రాజ్యపాలన చేస్తారు. ఇలాంటి హీనస్థితి ప్రబలినప్పుడు భగవంతుడు కల్కిగా నవతరించి, అధర్మవర్తనులను నిర్మూలించి, ధర్మస్థాపన చేస్తాడు.

నారదా! శ్రీమన్నారాయణుని లీలావతారములను కొన్నింటిని పేర్కొన్నాను. చెప్పాలంటే ప్రపంచంలో ప్రతీజీవీ ఆయన యొక్క అవతార విశేషమే. సృష్ట్యాదిలో ఆయన తపస్సు, చతుర్ముఖుడు (నేను), ఋషులు, తొమ్మిది మంది ప్రజాపతుల, యొక్క రూపాలలో నవతరించి, లోకసృష్టి, కల్యాణాలను నెరవేరుస్తుంటాడు. ధర్మము, విష్ణువు, యజ్ఞాలు, మనువులు, ఇంద్రాదిదేవతలు, భూలోకపురాజులు, వీరిరూపాలలో రక్షణ, పాలన కొనసాగిస్తుంటాడు. అధర్మము, రుద్రుడు, సర్పాలు,

రాక్షసులు, దుండగులు, వీరి రూపాలలో సంహారక్రియను జరుపుతాడు. నాయనా! ఆ శ్రీహరి మాయాశక్తిని నేనే తెలుసుకొనలేకున్నాను. ఇక ఇతరులకు అది సాధ్యపడ్తుందా?

## భగవద్భక్తి

నారదమునీంద్రా! భగవంతుని మాయాశక్తిని తెలుసుకోడానికి నాకే సాధ్యపడలేదు. ఇక సనకసనందాదులైన ఇతరుల కెలాగ సాధ్యపడుతుంది? ఆదిశేషుడు ఇతర ఆలోచనలేవీలేకుండా ఆ శ్రీమన్నారాయణునియందే బుద్ధిని నిలిపియుంచుతాడు. వేయినోళ్లతో ఆయనయొక్క చరిత్రను, గుణగణాలనూ కీర్తిస్తూంటాడు. అట్టి శేషుడు కూడా ఆయన మాయమహిమ ఎలాంటిదో తెలుసుకొనలేకున్నాడు. ఇతరులకేం తెలుస్తుంది? ఎవరు ఏచింతలూ లేకుండా, ఆశ్రీమన్నారాయణునే దృఢంగా నమ్మి సదా సేవిస్తారో, వాళ్లను ఆ ఆశ్రిత వత్సలుడు కరుణతో ననుగ్రహిస్తాడు. అలాంటి ప్రపన్నులు మాత్రమే ఆయనమాయను దాటగలరు.

అందుచేత ఎల్లవేళలా మిక్కిలి శాంతుడైయుండేవాడూ విశ్వమయుడూ, కేవలజ్ఞానస్వరూపుడూ, శుద్ధాత్ముడూ, సర్వేశ్వరుడూ, శాశ్వతుడూ, సముడూ, సత్-అసత్తులకు అతీతుడూ, అయిన ఆ పరమేశ్వరుని నీవు నీహృదయంలో సదా ప్రతిష్ఠించుకొనుము. అప్పుడు మాయ నీదరి జేరడానికి సిగ్గుపడుతుంది. పరమాత్ముడూ, అచ్యుతుడూ, అనంతుడూ, అయిన శ్రీహరిని మనస్సులో స్థిరంగా భావించిన వాళ్లు శోకములేని సుఖస్థితిని పొందుతారు. అలాంటి బుద్ధిమంతులు భగవంతుని స్మరణ తప్ప ఇతర కార్యాలు పొరపాటున కూడ చెయ్యరు.

ఆభగవంతుడు, సర్వశరణ్యుడు (అందరూ శరణువేడ వలసినవాడు), అందరికిని కర్మఫలప్రదాత, సర్వశక్తిమంతుడు. అంతటా వ్యాపించియున్నవాడు. కల్పాంతంలో జీవులన్నీ అంతరించి పోయినా, తానుమాత్రం నిర్వికారుడై నిలిచియుండేవాడు.

ఉ॥ కారణకార్యహేతువగు కంజదళాక్షునికంటె నన్యులె
వ్వారును లేరు తండ్రి! భగవంతుననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లుదాత్త మతిం గొనియాడ కుండినం
జేరవు చిత్తముల్ ప్రకృతి చెందని నిర్గుణమైన బ్రహ్మమున్. 211

నాయనా, నారదా! అన్నింటికీ ఆ కమలాక్షుడే కారణభూతుడు. ఆయనకంటే ఆశ్రయింపదగిన వారింకెవ్వరూలేరు. భగవంతుడూ, అనంతుడూ, విశ్వాన్ని సృష్టించే ఉదారస్వభావుడూ అయిన ఆ పరమేశ్వరుని సద్గుణాలను గొప్ప మనస్సుతో కొనియాడలేకుంటే, ప్రకృతికి అతీతమైన నిర్గుణ బ్రహ్మమును చిత్తము చేరలేదు.

వత్సా! ఈభాగవత పురాణకథ వేదార్థాలను ప్రతిపాదించడం చేత ప్రశస్తమైయున్నది. మోక్షప్రదంగా నుండేటట్లు భగవంతుడే దీనిని రచించాడు. ఇది భగవద్భక్తులకు కల్పవృక్షము. ఈకథను నేను నీకు సంగ్రహంగా చెప్పాను. దీన్ని నీవు లోకంలో విస్తృతంగా ప్రచారం చేయుము. జన్మలలో పురుషజన్మ చాలా అపురూపము. అందులోనూ సద్బ్రాహ్మణ వంశంలో పుట్టడం మరీ విశేషము. అందుచేత మానవులు నిష్ప్రయోజనమైన పనుల్లో జీవితాన్ని వ్యర్థంచేసి నశించకుండా, శ్రీహరిని సేవించి, నిత్యమైన పరమపదాన్ని పొందడం మంచిది కదా!

నాయనా! ఉపవాసాలూ, వ్రతాలూ, శౌచాలూ, శీలాలూ, యాగాలూ, సంధ్యోపాసనలూ, అగ్నికార్యాలూ, దానాలూ, వేదాధ్యయనాలూ, మొదలైన పనులెన్నిచేసినా మోక్షము సిద్ధించదు, అచ్యుతుడూ, లక్ష్మీనాథుడూ, పద్మనేత్రుడూ పాపనాశకుడూ పరమేశ్వరుడూ అయిన శ్రీహరిని నిజమైన నిర్మల భక్తి శ్రద్ధలతో భజిస్తూ ఆ వనజాక్షుని మహిమల నెల్లప్పుడూ స్తుతించాలి. ఇతరులు స్తుతిస్తుంటే వినాలి. మనస్సులో ఆ మహిమలను మననం చేస్తూ ఆనందించాలి. అలాగ చేసేవాళ్లు దేవుని మాయకు లోబడరు.

ఈ విధంగా బ్రహ్మదేవుడు నారదమహర్షికి భగవదవతారగాథలను సూక్ష్మంగా వివరించాడు.

## పరీక్షిత్తుప్రశ్నలకు శ్రీశుకునిసమాధానాలు

నారదునకు బ్రహ్మచేసిన బోధను విని శ్రీశుకుని పరీక్షిత్తు ఇలాగ ప్రశ్నించాడు.

ఓయోగీశ్వరా! ఎవడు శ్రద్ధాభక్తులతో శ్రీకృష్ణుని కీర్తిస్తాడో ఇతరులు కీర్తిస్తుంటే వింటాడో, అతని హృదయ కమలంలోనికి, శ్రవణకుహరాల ద్వారా శ్రీకృష్ణుడు ప్రవేశించి అక్కడ విశ్రమిస్తాడని తెలుసుకొన్నాను. ఆయన చరణకమల ద్వయాన్ని ఆశ్రయించి, ఆ ఆనందాన్ని చవిచూచినవాడు వాటిని మరివిడువడు కదా!

మునీశ్వరా! దేనినీ అంటని నిర్మలాత్మకు భూతాలతో సాంగత్యమెలాగ కలిగినది? బ్రహ్మదేవుడు ఆ సర్వేశ్వరుని ఏవిధంగా సాక్షాత్కరింపజేసుకొన్నాడు? విరాట్పురుషుని అవయవాలతో లోకాలు ఎలాగ సృష్టింపబడినవి? జీవులు ఎలాంటి కర్మలు చేసి, ఏయే లోకాలకు ప్రయాణం సాగిస్తారు? ఈశ్వరుడు తన మాయచే సమస్త కర్మలకూ సాక్షిగానుంటూనే, ఆ మాయకు అతీతుడై ప్రభువై ఎలాగ క్రీడిస్తాడు? మొదలైన అనేక ప్రశ్నలకు శ్రీశుకుడిలా చెప్పనారంభించాడు.

రాజా! బ్రహ్మ - నారదునకు తెలిపినది భాగవత మహాపురాణము యొక్క సంక్షిప్తరూపము. ఆ పురాణము వేదముతో సమానము. దానిని పూర్వము బ్రహ్మకల్పంలో పరమేశ్వరుడే బ్రహ్మకు ఉపదేశించాడు. అది నేను నీకు వినిపిస్తాను.

'జ్ఞానస్వరూపుడైన జీవునకు శరీరంతో సంబంధం ఎలాగ కలిగినది' అనినీవడిగావు కదా! విను. అది, అంతటా వ్యాపించి యున్న ఈశ్వరుని మాయా ప్రభావము. నారాయణుని యోగమాయాప్రభావం చేత జీవుడు పంచభూతాలతో కూడిన దేహముతో సంబంధం కలవాడు అవుతాడు. క్రమంగా బాల్య కౌమార యౌవన దశలు పొందుతాడు. దేవమానవాది శరీరాలను స్వీకరిస్తాడు. "నేను" అనే అహంకారాన్ని "నాది" అనే మమకారాన్నీ పెంచుకొంటాడు. సంసార మాయలో బద్ధుడౌతాడు. ఇలాగ బద్ధుడైన జీవునికి భగవంతుని మీది భక్తితో ముక్తి ఎలాగ కలుగుతుంది - అని, కదా! నీప్రశ్న ప్రకృతికీ, పురుషునికీ అతీతమైన బ్రహ్మస్వరూపాన్ని ఎప్పుడు జీవుడు తీవ్రంగా ధ్యానిస్తాడో, అప్పుడు మోహంనుండి విడిపడుతాడు. అహంకారమమకార మయమైన సంసారంనుండి ముక్తి పొందుతాడు.

జీవుడూ, ఈశ్వరుడూ ఇద్దరూ శరీరధారులైనప్పుడు, అట్టి ఈశ్వరునియందు భక్తి కలిగియుంటే జీవునికి ముక్తి ఎలాగ సిద్ధిస్తుంది? అని నీ సందేహం కదా! విను:

అవిద్యకులోనైనవాడు జీవుడు. అందుచేత, అతడు, కర్మననుసరించి, సంప్రాప్తించిన దేహాన్ని ధరిస్తాడు. ఆదేహము మిథ్యారూపమైనట్టిది. భగవంతుడు యోగమాయతో కూడి యున్నవాడు. తన యోగ మాయాప్రభావంచేత తన ఇష్టానుసారం జ్ఞానమయమైన లీలాశరీరాన్ని కల్పించుకొంటాడు. అందుచేతనే మోక్షానికి సాధనమైన జ్ఞానసముపార్జనకై తనసేవ కల్పింపబడినదని భగవంతుడు బ్రహ్మతో చెప్పాడు. బ్రహ్మ శ్రద్ధతో తపస్సుచేసి, పరమేశ్వరుని ఆరాధించగా, ఆయన తన జ్ఞానానందస్వరూపాన్ని బ్రహ్మకు చూపి, ఈవిషయం తెలిపాడు. అందుచేత జీవునకు భగవద్భక్తి తప్పకుండా మోక్షమిస్తుంది. నేను ఇప్పుడు చెప్పబోయే విషయం వింటే నీసందేహం తీరిపోతుంది.

## బ్రహ్మకు వైకుంఠవిష్ణుదర్శనము

కల్పారంభంలో ఒకనాడు బ్రహ్మదేవుడు తన నివాసమైన పద్మానికి మూలమేమిటో తెలుసుకొనగోరి, జలములో నెంత వెదకినా దానిని కానక, విసిగి వేసారి, మళ్లీ వచ్చి ఆపద్మంలోనే ఆసీనుడయ్యాడు. జగత్తును సృష్టించాలనే సంకల్పం వచ్చినదిగాని, గతించిన కల్పంలో తాను చేసి యుండిన సృష్టి పరిజ్ఞానం గుర్తుకు రాక, ఆలోచన తోచక చింతా క్రాంతుడైనాడు. జడత్వమావేశించినది. ఆసమయంలో జలమధ్యమునుండి స్పష్టముగా "తప, తప" అని

వినవచ్చినది. ఆ శబ్దాన్నెవరు ఉచ్చరించారో తెలుసుకొనగోరి, అంతటా వెదకి, ఎవ్వరినీ కానక మళ్ళీ పద్మాసనుడై ఆలోచించగా తపస్సు చేయుమని తనను ఆశబ్దం హెచ్చరించినట్లు స్ఫురించినది. వెంటనే ప్రాణాయామం ప్రారంభించి, ఇంద్రియాలను స్వాధీనపరచుకొని, మనస్సునేకాగ్రపరచి, వెయ్యి దివ్యసంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. ఆ తపస్సునకు విశ్వం వేడెక్కిపోయినది. శ్రీహరిప్రసన్నుడై బ్రహ్మకు ప్రత్యక్షమైనాడు.

వెంటనే బ్రహ్మకు వైకుంఠపురదర్శనం కలిగినది. అది శుద్ధ సత్త్వగుణానికి నిలయము. అక్కడ కాల ప్రభావములేదు. అది అన్ని లోకాలకంటే అత్యున్నతమైనది. సమస్త దేవతలకూ ప్రస్తుతింపదగినది. అక్కడ లోభము, మోహము, భయమూ అనేవి అసలేఉండవు. అక్కడికి పోయినవారు తిరిగి రావడమంటూ జరగదు. అలాంటి అనంత తేజోవిరాజితమైన వైకుంఠపురాన్ని సరోజసంభవుడు సందర్శించాడు. అక్కడి భవనాలూ, విమానాలూ దివ్యమణి కాంతులతో దేదీప్యమానంగా తేజరిల్లుతూ, సూర్యకాంతిని మించియుంటాయి. అక్కడ కల్పవృక్ష వనాలుంటాయి. అక్కడి పక్షులు, "న దైవం కేశవాత్ పరః" (కేశవునికంటె పరదైవంలేదు), అనీ, "విశ్వం విష్ణుమయమఖిలం" అనీ, "మంగళం మధుసూదన" అనీ, "పద్మాక్షా! జయము జయము" అనీ, పలుకుతుంటాయి. తుమ్మెదలు శ్రౌషట్, వషట్, స్వధా లాంటి వైదిక శబ్దాలతో ఝుంకారం చేస్తాయి. ఈవిధంగా వైకుంఠము వైభవోపేతంగా, దివ్యమంగళ లీలావిలాసాలతో సుమనోహర సుందరంగానున్నది.

సునందుడు, నందుడు, అర్హణుడు, ప్రబలుడు మొదలైన వారు ఆ పరమేశ్వరుని సేవచేస్తుంటారు. వాళ్లంతా విష్ణువలె నీలదేహులు, పీతాంబరధారులు, రత్నాభరణభుజకీర్తిధారులు. నిత్యయౌవనంతో నిగనిగలాడేవారు. శ్రీహరి రూపధారులు.

ఆ భగవంతునిపాదపద్మమునుండి పావనగంగ ఉద్భవించినది. శ్రీమహాలక్ష్మి ఆయనవక్షస్థలంలో నివసిస్తుంది. కరుణాతరంగాలుట్టిపడే ఆయన కనుదోయియే సూర్యచంద్రులు. జగత్స్రష్ట అయిన బ్రహ్మ, ఆయన నాభికమలంనుండి ఉద్భవించాడు. ఆదిశేషుడే ఆయనకు శయనము, గరుడుడే ఆయన వాహనము. ముక్కోటి దేవతలూ, మునులూ, ఆయనను సేవిస్తుంటారు. సమస్తలోకాలకూ తండ్రి అయిన ఆ పరమేశ్వరుని బ్రహ్మదేవుడు కన్నుల కరువుతీరా కాంచినాడు.

ఆ పరమపదములో ఎల్లవేళలా, జ్ఞానమూ, సిరి, కీర్తి, బలమూ, ఐశ్వర్యాదులతో నున్నవాడూ, జగత్పతి, యజ్ఞేశుడు, అనంతుడు, అచ్యుతుడు, పంకజాక్షుడు, లక్ష్మీపతి, ఆద్యంతాలు లేనివాడు, వికారశూన్యుడు, కరుణాసాగరుడు, యాదవాధినాథుడ్వృద్ధిశీలుడు, సహనశీలుడు, విష్ణుడు, కల్యాణగుణసహితుడు, కాంతిమంతుడూ, మందహాసామృతాన్ని విరజిమ్మేవాడూ, నిజభక్త త్రాణ పరాయణుడూ, పీతాంబరధారి, త్రిలోక సుందరుడూ, అందెలు కుండలాలు కిరీటము ఇత్యాది భూషణాలు ధరించేవాడూ, యోగీశ్వరేశ్వరుడూ, వక్షఃస్థలమున లక్ష్మిని ధరించిన వాడూ, చిన్మయుడు, దయానిధీ, చతుర్బాహుడూ, రత్నమయసింహాసనాసీనుడూ, సునంద నందకుముదాదులచే సేవింపబడువాడూ, ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వము, అహంకారము అనే నాలుగు శక్తులూ, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనో, మహాభూత, తన్మాత్రలనే శక్తులూ, తనచుట్టూ చేరి కొలుస్తుండగా, కోటి సూర్యుల కాంతితో భాసించేవాడూ, ఇతరులకు లభ్యంకానివీ, తనకు మాత్రమే స్వభావసిద్ధమైయున్నట్టివీ అయిన సకలైశ్వర్యాలతో ప్రకాశించేవాడూ, నిజస్వరూపంలో నిత్యమూ వినోదించేవాడూ సర్వేశ్వరుడూ, పరమపురుషుడూ, పురుషోత్తముడూ, పద్మాక్షుడూ అయిన నారాయణుని చూచి, అత్యంతానందముతో వికసించిన హృదయారవిందము కలవాడై బ్రహ్మదేవుడు గగుర్పాటుతో, ఆనంద బాష్పాలతో తడిసిన చెక్కిళ్లతో, ఆపరమేశ్వరుని పాదపద్మాలకు తన నాలుగు శిరస్సులూ తగిలేటట్లు ప్రణామాలు చేశాడు.

తన నాభికమలంనుండి పుట్టిన పుత్రుడూ, దేవతలలో జ్యేష్ఠుడు, సృష్టికర్త, అయిన బ్రహ్మ నమస్కరించేసరికి శ్రీహరికి దయ పొంగిపొరలినది. ఆనందంతో ఆయన ముఖారవిందము విప్పారగా విధాతశరీరాన్ని నిమిరి, ఇలా అన్నాడు.

"సరోజ సంభవా! నీతపోనిష్ఠకు, సృష్టి చెయ్యాలనే నీ శ్రద్ధకు నేను సంతసించాను. నీకు వరమిస్తాను కోరుకొనుము. నీపై అనుగ్రహించే నేను నీకు నావైకుంఠ ధామాన్ని చూపాను. తపస్సే నాస్వరూపం గనుక తపస్సంటే నాకిష్టము. ఆతపస్సు వలననే నేను సృష్టి స్థితి లయాలను కావిస్తుంటాను. నాయందలి భక్తికి తపస్సే మూలధనము. నీతపస్సు ద్వారా నీకర్మలూ మోహమూ తొలగిపోయినవి. నీమనోభీష్టమేమిటో చెప్పు" అనగా బ్రహ్మ ఇలాగ విన్నవించుకొన్నాడు.

"స్వామీ! యోగిజన హృదయాంతర్యామీ! అవ్యక్తుడవై ప్రకాశించే నీవు వివిధ శక్తులతో వృద్ధి పొంది, విలసిల్లే బ్రహ్మాదుల రూపాలను నీ అంతట నీవే ధరిస్తుంటావు. సాలెపురుగులాగా జగత్తుకు సృష్టి స్థితి లయాలను నీవే జరుపుతున్నావు. ఇలాగ లీలావిభూతులతో వినోదిస్తున్న నీయొక్క ప్రభావం తెలుసుకొనే తెలివిని నాకు ప్రసాదించు. నేను నీ ఆజ్ఞానుసారం జగత్తును సృష్టించేటప్పుడు నాయందహంకారము తలెత్తవచ్చు. దానిని నీవు హరింప వలసినదిగా ప్రార్థిస్తున్నాను". అని చెప్పిన బ్రహ్మతో భగవానుడిలా అన్నాడు:-

"నాయనా! శాస్త్రార్థవిచారజ్ఞానమూ, నాయందు భక్తీ, ఉత్తమమైన సాక్షాత్కారమూ ఈమూడూ నీమనస్సులో నిలుపుకొనుము. నాస్వరూపమూ, స్వభావమూ, ప్రభావమూ, అవతారాలూ, వాటిలో నేను చేసే కర్మలూ, వీటినన్నిటినీ గ్రహించే తత్త్వజ్ఞానము నా అనుగ్రహం వలననే నీకు కలుగుతుంది. సృష్టికి ముందు నేను ఒక్కడనే ఉండేవాడను. అప్పుడు నాకు ఎలాంటి కర్మ సంబంధము ఉండేది కాదు. స్థూలరూపమూ, సూక్ష్మరూపమూ, వాటికి కారణమైన ప్రకృతీ, నా అంశమందే అప్పుడు లీనమైయుంటాయి. అందువలననే నేనొక్కడనే తప్ప నాకంటే వేరైన మరొక పదార్థమంటూ ఏదీఉండదు.

సృష్టికాలంలో జన్మించిన జగత్తంతా నాస్వరూపమే అని గ్రహించుము. కమలాసనా! కల్పప్రళయాంతములో ఆద్యంతాలులేనివాడనై పరిపూర్ణమైన నిత్యమహిమతో పరమాత్ముడనై యుంటాను.

నామాయగురించి నన్నడిగితివి. కొద్దిగా చెప్తాను విను. భ్రాంతివలన ముత్యపుచిప్పలో వెండి ఉన్నట్లు అనిపిస్తుంది. అలాగే లేని వస్తువు ఉన్నట్లు తోచి, పరికించిచూడగా లేదని స్పష్టమవుతుంది, ఇదే నామాయా విశేషం అని తెలుసుకొనుము. ఆమాయా ప్రభావంచేతనే లేనివస్తువున్నట్లు కనిపించడం, ఉన్నవస్తువు కనిపించకపోవడం జరుగుతూ ఉంటుంది.

పంచమహాభూతాలు భౌతిక పదార్థాలలో కలిసియున్నట్లే నేను పంచభూతాలలోనూ, వాటితో కూడియున్న పదార్థాల్లోనూ త్రిగుణాలతోకూడి ప్రవేశించి యుంటాను. ఈ పరబ్రహ్మస్వరూపము సర్వదేశ సర్వకాలాలలోనూ, ఇలాగే ఉంటుంది కాని మార్పు చెందదు. తత్త్వాన్ని తెలుసుకొనగోరే మీవంటివారు నేనిప్పుడు చెప్పినదే తత్త్వార్థమని తెలుసుకొంటారు. దీన్ని నీమనస్సులో నిలుపుకొనుము. అప్పుడు జగన్నిర్మాణ కార్యములో నీకు మోహము కలుగదు." అని చెప్పి భగవంతుడు అంతర్ధానమయ్యాడు.

రాజా! ఆవిధంగా చెప్పిన పరమేశ్వరుని, బ్రహ్మ తన హృదయంలో నిలుపుకొన్నాడు. ఎంతో ఆనందంతో ఆయనకు నమస్కరించాడు. పూర్వం లాగానే సమస్త లోకాన్నీ సృష్టించాడు. ధర్మాన్ని ప్రవర్తింపజేశాడు. తరువాత, సకలలోకాల క్షేమం కాంక్షించి, సంతుష్టాత్ముడై మహోన్నతమైన తపస్సు చేశాడు. ఆసమయంలో బ్రహ్మ మానసపుత్రుడైన నారదుడు బ్రహ్మవద్దకు వచ్చాడు.

## భాగవతపురాణలక్షణాలు

నారదుడు బ్రహ్మదేవుని సమీపించి, తండ్రికి సంప్రీతితో సపర్యలు చేసి, అతనిని ప్రసన్నునిగా చేసుకొని, భగవన్మాయను గురించి తెలియ జెప్పుమని వేడుకొన్నాడు.

పరీక్షిన్మహారాజా! నారదుని కోరికను మన్నించి, బ్రహ్మదేవుడు తనకు శ్రీహరి దయతో ఉపదేశించిన లోకకల్యాణకరమైన నాలుగుశ్లోకాలతోనూ, పదిలక్షణాలతోనూ కూడియున్న పరమపావనమైన భాగవతమును నారదునకు ఉపదేశించాడు. నారదుడు ఆభాగవతాన్ని నాతండ్రియైన వ్యాసమహర్షికి బోధించాడు. నాతండ్రి దానిని నాకు ప్రీతితో బోధించాడు. నేనిప్పుడు నీకు ఆపుణ్యగాథను వివరంగా చెప్తాను.

విరాట్ పురుషునినుండి ఈలోకాలు ఎలాగ పుట్టాయని నీవు అడిగావుకదా! ఇంకా ఇలాంటి ప్రశ్నలెన్నోవేశావు.

ఈభాగవతంవింటే నీ సందేహాలన్నీ తీరిపోతాయి. భగవానుడు చెప్పిన ఆ నాలుగుశ్లోకాల సారమిది:- (బ్రహ్మదేవునితో చెప్పబడినవి)

1. సృష్టికి పూర్వము నేనొక్కడనే ఉంటిని. తరువాతనూ నేనే ఉన్నాను. సకల చరాచర విశ్వాన్ని రచించి, వ్యక్తపరచినదీ నేనే. లయము తరువాత మిగిలియుండు వాడనూ నేనే.

2. ఈసృష్టి అంతా నానుండే ఉద్భవించినట్లు చూపేది నాయొక్క మాయాశక్తియే! ఉన్నది లేనట్లుగను, లేనిది ఉన్నట్లుగను కనిపించడం నామాయాశక్తిప్రభావము వలననే.

3. సృష్టి అంతా పంచభూతాలచే నిర్మింపబడినది. నేను జీవాత్మగా వెలసియున్ననూ, విశ్వమంతా వ్యాపించియున్నాను.

4. పరమసత్స్వరూపమైన ఈనా ఆత్మతత్త్వము, అనాదిగా సర్వత్రా వ్యాపించి యున్నది. సర్వం ఖల్విదంబ్రహ్మ అనే సత్యాన్ని తెలుసుకొని సాధనచేసే వ్యక్తి అహంకారమునుండియు, బంధాలనుండియు విముక్తుడవుతాడు.

**ఇక పురాణముల పది లక్షణాలివి :** సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతులు, మన్వంతరాలు, ఈశాను చరిత్రలు, నిరోధము, ముక్తి, ఆశ్రయము అనేవి. వీటిలో ఆశ్రయమే బ్రహ్మము. ఆబ్రహ్మతత్త్వజ్ఞానం కొరకై చెప్పబడినవే మిగిలిన తొమ్మిది లక్షణాలు.

**వాటి స్వరూపాలు ఈ విధముగా ఉండును.**

1. సర్గము : భగవంతుని వీక్షణముచే త్రిగుణాల సమతులనము చెదరి దశేంద్రియాలూ పంచతన్మాత్రలు, మనస్సు, అహంకారముతో కూడిన మహాతత్త్వమూ, పంచభూతాలు ఉద్భవించినవి. ఇదే సర్గము.

2. విసర్గ : చతుర్ముఖ బ్రహ్మ చరాచర భూతసృష్టిచేయడం విసర్గ.

3. స్థానము : సృష్టింపబడిన వాటిని వాటివాటి పరిధులలో నిలిపి యుంచడంలోనూ, లోకకంటకులను శిక్షించి, జయం సాధించడంలోనూ భగవానుడు కృతకృత్యుడుకావడం స్థానమనబడుతుంది.

4. పోషణము : భక్తులను రక్షించి, వారియెడల అనుగ్రహం చూపడం పోషణ.

5. ఊతులు : జీవరాసులయందు దాగియున్న కర్మవాసనలే ఊతులు.

6. మన్వంతరములు : తాము పాలించుచుండే మన్వంతరాలలో మనువులచే చేయబడిన మహత్తర కార్యాల గాథలు.

7. ఈశానుకథలు : వివిధ అవతారాలలోని శ్రీహరి కథలు, భక్తుల కథలు.

8. నిరోధము : అవాంతర ప్రళయమందు జీవాత్మలు వాసనలతోనుంటూ, వ్యాపారశూన్యములై యున్నప్పటి అవస్థను గురించి చెప్పడం నిరోధమంటారు.

9. ముక్తి : జీవుడు కర్తృత్వాన్ని వీడి, కర్మఫల వాసనలనువదిలించుకొని, బంధములను తప్పించుకొని, బ్రహ్మ పదాన్ని (వైకుంఠవాసాన్ని) పొందడం ముక్తి.

10. ఆశ్రయము : సృష్టి స్థితిలయాలు ఎక్కడినుండి జరుగుతున్నవో ఆ పరమాత్మస్థానము ఆశ్రయము.

అధ్యాత్మము, అధిదైవము, అధిభూతము అని మూడుగ వ్యక్తమయినది ఆత్మ. నేను చూచాను, నేను విన్నాను, అని భావించే జీవుడు అధ్యాత్మ. ఇంద్రియాలను ప్రకాశింపజేసే దేవతలు అధిదైవము, జీవాత్మ ఇంద్రియాధిదేవతలూ నివసించే దేహము అధిభౌతికము. ఈమూడింటిలో ఏఒక్కటి లేకపోయినా, ఇతర రెండూ గోచరించవు. ఈ మూడింటినీ ఎరిగియున్న వాడే సర్వలోకాశ్రయుడైన పరమాత్మ.

## విరాట్‌పురుషుడు

వినోదం గురించి జగత్తును సృష్టించాలనే తలంపు ఆ పరమాత్మకు కలిగినది. ఆ సంకల్పంతోనే బ్రహ్మాండాన్ని నిర్మించాడు. జలాన్ని సృష్టించి, బ్రహ్మాండంలో ప్రవేశించి జలరాశిలో శయనించాడు. అందుచేతనే -

**ఆపో"నారా" ఇతి ప్రోక్తా, ఆపో వై నరసూనవః**
**తాయదస్యాయనం పూర్వం తేన "నారాయణః" స్మృతః**

నరుడనే నామాంతరం గల భగవంతుడు జలాలను సృష్టించాడు. అందుకే నీటిని "నారము"లన్నారు. అట్టి నారములు స్థానంగా కలిగి యుండడం చేత ఆయన నారాయణుడనబడ్డాడు. అనే ప్రమాణాన్ననుసరించి, ఆయన నారాయణ శబ్ద వాచ్యుడయ్యాడు. ఆయనప్రభావమును వర్ణింపశక్యము కాదు.

తాను మొదట ఒక్కడే అయినా ఆ పరమాత్ముడు దేవ, మనుష్యాది రూపాలలో అనేకం కావాలని సంకల్పించాడు. స్వాత్మానుభవ రూపమైన యోగశయనంలో మేల్కొని యుండి, తన సంకల్పంతో హిరణ్మయమైన తన శరీరాన్నే అధిదైవతం, ఆధ్యాత్మికం, అధిభూతం అనే పేర్లతో మూడు విధాలుగా సృష్టించాడు.

అలాంటి విరాట్‌పురుషుని శరీరంలోపలి ఆకాశంనుండి ప్రవృత్తి సామర్థ్యరూపమైన ఓజస్సూ, వేగసామర్థ్యము, బలమూ అనే ధర్మాలు కలిగాయి. సూక్ష్మరూపమైన క్రియాశక్తివల్ల ప్రాణం పుట్టినది. అదే సమస్త ప్రాణులకు ముఖ్యమైనది. ప్రాణాలు జీవినసుసరించి, వెడలిపోతుంటాయి. విరాట్ పురుషునకు జఠరాగ్ని దీపించగానే ఆకలి దప్పికలేర్పడ్డాయి. ముఖం నుండి దవుడలు, నాలుక మొదలైన వేర్పడ్డాయి. వాటినుండి, ఆరు రసాలు జనించాయి. ఆరసభేదాలన్నీ నాలుకతోనే గ్రహింప బడుతున్నవి. ముఖం సంభాషించాలని కోరినది. ముఖంనుండి వాక్కుఅనే ఇంద్రియం పుట్టినది. దానికి అగ్ని అధిష్ఠానదేవత. వాగింద్రియంనుండీ, అగ్నినుండీ సంభాషణ పుట్టినది. జగత్తంగా జలవ్యాప్తం కావడం వల్ల అగ్నికి జలంవలన విరోధం కలిగినది. అందువలన అగ్నికి జలమే ప్రతి బంధకమైనది. చలించే మహావాయువునుండి ఘ్రాణం పుట్టినది. దానికి వాయువు అధిదేవత. ఆఘ్రాణేంద్రియం గంధాన్ని గ్రహించే శక్తి గలదయినది. విరాట్ పురుషుడు కంటికి కనిపించని ఆత్మను తనలో చూడగోరినాడు. అప్పుడు సూర్యుడు దేవతగా కలవీ, రూపాన్ని గ్రహించేవీ అయిన నేత్రాలు రెండూ తేజస్సునుండి పుట్టాయి.

మునులందరూ ప్రార్థించగా, ఆయన దిక్కులుదేవతగా కలిగి, శబ్దాన్ని గ్రహించే శ్రోత్రేంద్రియాన్ని ఉద్భవింపజేశాడు. సృష్టికర్తయైన పురుషుని నుండి త్వగింద్రియానికి అధిష్ఠానమైన చర్మం పుట్టినది. ఆ చర్మం, ఆయావస్తువులలోని మార్దవాన్నీ, కాఠిన్యాన్నీ, తేలికతనాన్నీ, బరువునూ, వేడిమినీ, శీతలాన్నీ గ్రహిస్తుంది. చర్మము నుండి వెంట్రుకలు పుట్టాయి. వాటికి వృక్షాలు అధిదేవతలయ్యాయి.

త్వగింద్రియాన్ని అధిష్ఠించినవాడూ, స్పర్శ అనే గుణం కలవాడూ, లోపలా, వెలుపలా వ్యాపించిన వాడూ, అయిన వాయువునుండి హస్తాలు పుట్టినవి. అవి బలం కలవీ, వస్తుగ్రహణంలో నేర్పుకలవీ, అనేకమైన పనులనుచేయగలవీనూ, వాటికి ఇంద్రుడు అధిదేవత. తనకు ఇష్టమైన చోటికి పోయే సామర్థ్యంకల ఈశ్వరుని నుండి పాదాలు పుట్టినవి. వాటికి విష్ణువు అధిదేవత.

ప్రజానందామృతాన్ని కోరిన భగవంతుని నుండి పురుషాంగం, ఉపస్థ, జనించాయి. వాటికి అధిదేవత ప్రజాపతి. మిత్రుడు అధిదేవతగాగల "పాయువు" అనే ఇంద్రియాన్ని గుదమని కూడా అంటారు. అది నిస్సారమైన పదార్థములను విసర్జించే అంగము.

ఒకశరీరాన్ని వదలి మరొక శరీరాన్ని ధరించగోరినప్పుడు మొదటిశరీరాన్ని వదలడానికి సాధనంగా బొడ్డు అనే ద్వారం పుట్టింది. ప్రాణం, అపానం బంధింపబడే స్థానమదే. ఆ బంధం విడిపోవడమే మృత్యువు. పైశరీరాన్నీ, క్రింది శరీరాన్నీ వేరుచేసేదికూడ, ఆనాభిస్థానమే. ఆహారపానీయాదులను ధరించడానికి పేగులు, పొట్ట, నాడీసమూహము పుట్టాయి. వాటికి నదులూ సముద్రాలూ అధిదేవతలు. వాటివలన తుష్టి, పుష్టి అనే ఉదరాన్ని భరించే రసపరిణామాలు కలిగాయి.

ఆవిరాట్ పురుషుడు తన మాయను ధ్యానించేటప్పుడు కామానికీ, సంకల్పాదులకూ స్థానమైన హృదయం పుట్టినది. ఆహృదయం నుండి, మనస్సూ, చంద్రుడూ, కాముడూ, సంకల్పమూ పుట్టాయి.

ఆవిరాట్ పురుషునకు మనస్సూ, బుద్ధీ ఏర్పడ్డాయి. ఆయనస్థూలవిగ్రహం పృథ్వి, జలము, తేజస్సు, వాయువు. ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము, అవ్యక్తమూ, అనబడే ఎనిమిది ఆవరణలచే ఒకదానిపైనొకటిగా (క్రమంగా) చుట్టి యున్నది. అది అత్యుజ్జ్వలంగా ప్రకాశిస్తుంది.

విరాట్ పురుషునిసూక్ష్మరూపము విలక్షణమైనట్టిది. దానికి ఆద్యంతాలు లేవు. అది నిత్యమైనది. మనస్సునకూ వాక్కునకూ గోచరం కానిది.

రాజా! మహాతేజోమయమైన భగవత్స్వరూపమునుగూర్చి నేనిప్పుడు చెప్పాను. స్థూలమనీ, సూక్ష్మమనీ రెండు రూపాలలో విలసిల్లే ఆభగవదాకారాన్ని ఈశ్వర మాయాప్రభావంచేత, దివ్యతేజోధనులైన మునులు కూడ తెలుసుకొనలేకున్నారు. నామరూప క్రియలను దాల్చిన ఈశ్వరుడు సమస్త లోకాలకూ నియామకుడైయున్నాడు. జ్ఞానమయస్వరూపుడైన ఆ శ్రీమన్నారాయణుడు ప్రజాపతులనూ, ఋషులనూ, పితృదేవతలనూ ప్రీతితోసృష్టిస్తున్నాడు.

జీవులు తాముచేసిన నానావిధాలైన కర్మల ననుసరించి సురులు, నరులు, అసురులు, గంధర్వులు- మృగాలు. పశువులు శునక సూకరాలు, పక్షులు, జలజీవాలు, వృక్షాలు, క్రిమికీటకాదులు వంటి జీవజాతుల్లో పుట్టి, నీటిలోనూ, నింగిలోనూ, నేలమీదను సంచరిస్తారు. సత్త్వరజస్తమోగుణాలు కలిగియుంటారు.

లక్ష్మీనాథుడు చతుర్ముఖుడై సృష్టిస్తాడు. విష్ణుస్వరూపుడై సృష్టిని రక్షిస్తాడు. హరునిలోనుంటూ సంహరిస్తాడు. ఈవిధంగా ధర్మస్వరూపుడై తానే సురనర పశుపక్ష్యాది రూపాలను ధరిస్తాడు. విశ్వాన్ని సృష్టించి, పోషించి సంహరిస్తాడు.

శ్రీహరినుండి ఆకాశం పుట్టినది. ఆకాశంనుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటినుండి భూమి పుట్టినవి. భూమినుండి నానావిధజీవ సంతతి పుట్టినది. ఇంతటికీ మూలమై ప్రకాశించేవాడు ఆ నారాయణుడే. ఆయన జ్ఞానానంద స్వరూపుడు. అవ్యయుడు. పుట్టుకలేనివాడు, అంతములేనివాడు, ప్రభువు, ఆదిమధ్యాంత రహితుడు,

ఆయననుండి పుట్టిన ఈసృష్టికి హేతువేమిటో, దాని స్వరూపమెలాంటిదో, ఎంత యోచించినా ఎంతటి మునీశ్వరులైనా తెలుసుకొనలేకున్నారు.

అంతేకాదు, ఈ విధంగా సృష్టించి రక్షిస్తున్న ఆ శ్రీహరి తనకు కర్తృత్వాన్ని అంగీకరించడు. ఇదంతా తన మాయకే ఆరోపిస్తాడు. తాను నిరవద్యుడు, నిరంజనుడు పరుడు, నిష్కించనుడు, ఆద్యుడు, నిరపేక్షుడు, నిష్కళంకుడూ, అయిన వాడై శాశ్వతత్వాన్ని పొందుతాడు.

జ్ఞానులు ఆపరమేశ్వరుని సృష్టి స్థితి లయ కర్తయని వర్ణిస్తారు గాని ఈనామ రూప గుణ కర్మాది వర్ణనలతో తృప్తిజెందక, ఇంకా సూక్ష్మముగా తరచి తరచి పరిశీలిస్తారు. నామ రూపాలు మాయాజనితాలని వేదాలు కూడా చెప్పినవి. 'నేతి, నేతి' యని వీటిని విడిచిపెట్టి, యథార్థ తత్త్వాన్ని గ్రహించడమే జ్ఞానులధ్యేయము.

ప్రతికల్పములోను సృష్టిరచన ఒకే రీతిగా ఉంటుంది గాని, మహాప్రళయం తరువాతి కల్పంలో మాత్రము, ప్రకృతి పంచమహాభూతాలుగా మార్పు చెందుతుంది. ఇతర కల్పాలలో చరాచర వస్తు సృష్టిని బ్రహ్మయే మళ్లీ మళ్లీ సృజిస్తుంటాడు. నేను ఇప్పుడు పద్మకల్పంగురించి చెప్తాను విను.

(పంచమ స్కంధములో సర్గను గూర్చి బ్రహ్మ వివరించాడు. దశమస్కంధములో శ్రీశుకుడు దానిని విశదీకరించాడు. తృతీయ స్కంధములో మైత్రేయుడు కూడా చెప్పాడు. సర్గవిసర్గల గురించి ద్వితీయ, చతుర్థ స్కంధాలలో చెప్పబడినది. సూక్ష్మతముడైన పరమాత్ముడు కనిపించడు గనుక, తీవ్రమైన విచక్షణా జ్ఞానము చేతనే గ్రహించడానికి ప్రయత్నించాలి. సృష్టి రహస్యము నిగూఢము గనుక మిక్కిలి సావధాన శ్రద్ధలతో అధ్యయనం చెయ్యాలి.)

**హరిః ఓం తత్ సత్**
**ద్వితీయస్కంధము సమాప్తము**
**ఓం శ్రీకృష్ణార్పణమస్తు**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# తృతీయస్కంధము

## విదురునివిరక్తి

**శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెప్తున్నాడు :**

రాజా! దుష్టుడైన ధృతరాష్ట్రుడు అంధుడే కాకుండా పుత్రవ్యామోహ మమకారాల్లో చిక్కుకొన్న మూఢుడు కూడాను. పాండురాజు మరణించగానే పాండవులు దిక్కులేని పక్షులై ధృతరాష్ట్రుని పంచజేరినారు. కాని దుర్యోధనాదులు చిన్నప్పటినుండీ వారిపట్ల అసూయాగ్రస్తులై, వారిని అన్నివిధాలా హింసిస్తుండేవారు. వారికి విషం కలిపిన అన్నం పెట్టారు. త్రాళ్లతోకట్టారు, నదిలోనికి నెట్టారు. రాజ్యంనుండి వెళ్లగొట్టారు. వారు లక్క ఇంట్లో నిద్రిస్తుండగా ఇంటికి నిప్పు అంటించారు. ఇంకా ఎన్నెన్నో దుష్కృత్యాలకు పాల్పడ్డారు. రాజసూయ మహాయాగంలో అవభృత స్నానంచేసి, పరమపవిత్రయైయున్న పాంచాలికొప్పును పట్టుకొని, నిండుకొలువులోనికీడ్చుకొనివచ్చి అవమానించారు. ఇన్ని చేస్తున్నా ఆ అంధరాజు కొడుకులను మందలించలేదు. చివరకు మాయాజూదంలో అన్యాయంగా పాండవులనోడించి, రాజ్యాన్ని లాక్కొని, వారిని అడవులకు వెళ్లగొట్టారు. పాండవులు జూదపుషరతుల ప్రకారం గడువు ముగిసిన తరువాత వచ్చి తమ రాజ్యభాగాన్ని ఇమ్మని అడిగితే ఇవ్వలేదు. యుధిష్ఠిరుని కోరికపై శ్రీకృష్ణ భగవానుడే రాయబారం చెయ్యడానికి ధృతరాష్ట్రుని వద్దకు వెళ్లి ఇలాగ చెప్పాడు:- "మహారాజా! కౌరవులూ, పాండవులూ నీకు సమానులే. పాండవులకు చెందిన రాజ్యభాగాన్ని వారికిచ్చి వేసి, అందరూ సుఖసంతోషాలతో వర్ధిల్లడం మంచిదని చెప్పడానికి వచ్చాను". శ్రీకృష్ణుని ఈ హితవాక్కులు విని, భీష్మద్రోణాదులూ, రాజశ్రేష్ఠులూ అందరూ సంతసించారు. కాని, ధృతరాష్ట్రునికి రుచించక ఊరుకొన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు విశేష నీతికోవిదుడైన విదురుని రప్పించగా నతడు విషయాన్ని తెలుసుకొని ధృతరాష్ట్రునితో ఇలాగన్నాడు:-

"మహారాజా! పాండురాజునీతమ్ముడు. అతని బిడ్డలను రక్షించడం మనధర్మము. అందుచేత మీరందరూ అన్యోన్యంగానుంటే, అందరూ సుఖసంపదలతో వర్ధిల్లడమే కాకుండా, శత్రువిజయం కూడా కలుగుతుంది. శ్రీకృష్ణుడు కూడా సంతోషిస్తాడు. నీకొడుకులూ, కర్ణుడూ ఇత్యాదుల ఆర్భాటమూ, ప్రగల్భాలూవిని నమ్ముతున్నావేమో విను. సాక్షాత్తూ పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడే పాండవులకు చెలికాడై, చుట్టమై, వియ్యంకుడై, ప్రబోధకుడై, ప్రభువై, సంరక్షకుడైయుండగా, వాళ్లనెవ్వరూ ఏమీ చెయ్యలేరు సరికదా, వారికి హాని తలపెట్టినవారు నశిస్తారు. అందుచేత, నాయొక్క హితవాక్యాలను విని, పుత్రులను, బంధువులను, వంశాన్నీ, దేశాన్నీ కాపాడుకో. దుర్యోధనుని దుర్బోధలు వింటివా సర్వనాశనం తథ్యము" అని చెప్పిన విదురుని వాక్కులను విన్నవాడైన దుర్యోధనుడు రోషావేశముతో మండిపడుతూ, తన మిత్రులైన కర్ణునితోనూ శకునితోనూ ఇలాగన్నాడు: "ఈదాసీ పుత్రుని ఈ సభకు ఎందుకు రానిచ్చారు? ఆసనం ఇచ్చి ఎందుకు ఆదరించారు? అధిక ప్రసంగాలు చేస్తున్న ఈతుంటరిని గెంటివెయ్యండి" అని కేకలు వేశాడు. విదురుని హృదయం గాయపడినది. సభలోని పెద్దలందరూ మౌనంగా విచారించారు. విదురుడు ప్రశాంతంగా భగవంతుని తలచుకోగా అతనికి కర్తవ్యం స్ఫురించింది, మనస్సు తేలిక పడింది. నెమ్మదిగాలేచి, శక్తిమంతమైన తన ధనుర్బాణాలను సభాద్వారము వద్ద విడిచిపెట్టి, వెనుకకు తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

విదురుడు రాగద్వేషాలను విడిచి, పరివ్రాజక వేషధారియై సంచరిస్తూ దేశంలోని పుణ్యనదులను, దివ్యక్షేత్రాలనూ, తపోవనాశ్రమాలనూ, సరోవరాలనూ సందర్శించి, కొన్ని సంవత్సరాలకు ప్రభాస తీర్థము చేరుకొన్నాడు. అప్పటికి కురుక్షేత్రంలో యుద్ధము జరిగి, కౌరవనాశనం అయి, శ్రీకృష్ణుని అనుగ్రహంచేత యుధిష్ఠిరుడు సామ్రాజ్యాన్ని ఏలుతున్నాడు. ఈ విషయాలన్నీ తెలుసుకొని, విదురుడు తన తీర్థయాత్రను ముగించుకొని, హస్తినాపురం వెళ్లనుద్దేశించి సాగిపోయాడు.

## ఉద్ధవుని భక్తి పరాకాష్ఠ

విదురుడు పోయిపోయి యమునాతీరము చేరుకొన్నాడు. అక్కడ మహాభాగవతుడు, శ్రీకృష్ణునికి అత్యంత ప్రియతముడు అయిన ఉద్ధవుని విధివశాన కలుసుకొన్నాడు. ప్రేమతో అతనిని గాఢాలింగనం చేసుకొన్నాడు. ద్వారకలోని యాదవ ముఖ్యులందరి కుశలములను పేరుపేరున అడిగాడు. శ్రీకృష్ణబలరాముల కుటుంబ సభ్యులందరి గురించి అడిగాడు. చివరికి లీలామానుష విగ్రహుడైన వాసుదేవుని గురించి అడిగేసరికి ఉద్ధవుడు దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్వనారంభించాడు. కొంతసేపటికి ఎలాగో మాట్లాడగలిగి ఇలాగ చెప్పాడు:-

"ఓ మహాశయా, విదురా! మహాతేజశ్వీ, లోకబాంధవుడూ అయిన శ్రీకృష్ణ భాస్కరుడు అస్తమించాడయ్యా! ధర్మానికే అంధకారం ఆవరించింది. ఆయనను తలచుకొంటేనే దుఃఖసముద్రం నన్ను అల్లకల్లోలంలో ముంచివేస్తుంది. ఆ మహనీయమూర్తిని గురించి నేనెలాగ చెప్పగలను? వైష్ణవ మాయా ప్రభావముచేత యాదవులు ఆపరమపురుషుని తమ బంధువుగాను, సఖునిగాను, నాయకునిగానే భావించారుగాని, జగన్నాటక లీలా విలాసార్థం మానవరూపం దాల్చిన పరమేశ్వరుడని గుర్తించలేకపోయారుకదా! గర్వమదాంధులైన శిశుపాలాది దుష్టులు ఆయనను దేవదేవునిగా తెలుసుకొనలేక, నానాదుర్భాషలాడినారు కదా!

శ్రీకృష్ణుడు, వారివారి స్వభావాలనుబట్టి కొందరికి శాంతస్వభావునిగను, కొందరికి భయంకరునిగను కనిపించినా, వారి అపరాధాలను మన్నించి, వాత్సల్యభావమే చూపాడు.

పుట్టుకలేని పరాత్పరుడు దేవతల ప్రార్థనలను మన్నించి, దేవకీ వసుదేవులకు పుత్రుడై కారాగారంలో జన్మించి, కంసుడు తనను చంపించాలని చేసిన ప్రయత్నాలన్నిటినీ వమ్ముచేసినాడు. కాలయవనుడు, జరాసంధుడూ లాంటి దుష్టులకు చేజిక్కకుండా తప్పించుకొని తిరుగుతూ, ఒక సామాన్య మానవ మాత్రునిలాగా నటిస్తూ, ఎన్నో కష్టాలను సహించాడు.

మొదటినుండీ శత్రుత్వం వహించియున్న శిశుపాలునికికూడా మోక్షప్రదానము చేశాడుకదా! విషపుచన్ను కుడిపి, తన్ను చంపవచ్చిన పూతనకు కూడ మోక్షపదాన్నిచ్చిన కరుణామూర్తి మన శ్రీకృష్ణుడు. కురుక్షేత్ర రణరంగంలో ఆపరమేశ్వరుని ముఖారవిందాన్ని చూస్తూ సమ్మోహితులై ప్రాణాలు విడిచిన శత్రుసైనికులందరికీ మోక్షపదాన్నిచ్చాడుకదా! కంసునిచంపి ఆరాజ్యాన్ని చేజిక్కించుకొనకుండా, కంసుని తండ్రియైన ఉగ్రసేనుని సింహాసనమెక్కించి, "మహారాజా! నీ ఆజ్ఞలను నిర్వహించడానికి సిద్ధంగానున్నాము" అని అతి వినమ్రంగా పలకడం ఆ మహాప్రభువుకే చెల్లినది. తనతో శత్రుత్వం పెంచుకొని, క్రోధావేశంతో నెదిరిస్తూ "ఓరీ, హరీ, మురారీ, నిన్ను హతమార్చుతానుండు" అని అరిచిన రాక్షసులకు కూడా మోక్షాన్నిచ్చాడు కదా!

"ఓమహాత్మా! విదురా! ఆ శ్రీకృష్ణుని గురించి ఏమని చెప్పగలను? ఆయన దివ్యచరిత్ర ఎంతచెప్పినా తనివి తీరనిది. కంసుని బారినుండి కాపాడే ఉద్దేశంతో వసుదేవుడు బాలముకుందుని నందగోకులంలో నుంచడంచేత, ఆయన నందనందనుడై బలరామసహితుడై ఆనందంగా పెరిగాడు. తాను శ్రీహరి అవతారమని ఎవ్వరూ గుర్తించ లేనట్లుగా, అతి సామాన్యపు గొల్లపిల్లవానిలాగా గడిపాడు. కంసునిచేత పంపబడిన పెక్కుమంది రాక్షసుల్ని, బొమ్మలాటలోవలె అతి- అవలీలగా హతమార్చినాడు ఆ బాలగోపాలుడు.

తనతో ఆడుకొనే గోపబాలురకును గోపాలకృష్ణుడు తన దివ్యలీలా విలాసాల ననేకం చూపాడు. కాళీయుడనే నాగరాజు యమునా నదిలో నివసిస్తూ నీటిని విషపూరితం చెయ్యడం చేత తీరవాసులూ గోవులూ పడ్తుండే బాధలనుండి వారిని రక్షించడానికి బాలకృష్ణుడు మడుగులోనికిదూకి నాగరాజు పడగలపై నృత్యంచేసినాడు. వాని మదమణచి, వాని దూరసముద్రానికి తరిమివేశాడు. ఇంద్రుని అహంకారమణచడానికి, వ్రజవాసులు ఇంద్రపూజను చెయ్యకుండా నిలుపుజేశాడు. ఇంద్రుడు కోపగించి రాళ్లతో కూడిన జడివానలను వారిపై కురిపించగా, వారంతా భయంతో తల్లడిల్లి, రక్షింపుమని శ్రీకృష్ణుని ప్రార్థించారు. ఆర్తత్రాణపరాయణుడైన ఆ భగవానుడు గోవర్ధన పర్వతాన్ని ఒకగొడుగులాగ ఎత్తి

పట్టుకొని, ఆబాలగోపాలమూ దాని క్రింద తలదాచుకొనగా ఒక వారంరోజులు అందరినీ కాపాడాడు. పూర్ణిమ పండువెన్నెలలో మురళీగానంతో బృందావనమంతా ఆనందడోలికల్లో నూగియాడేటట్లు రాసక్రీడలు జరిపి, గోపికలను తన్మయత్వంలో ముంచి తరింపజేశాడు. తానే జగద్గురువైనప్పటికీ, లోకాచారంప్రకారం ఆయన సాందీపని అనే గురువు వద్ద సకల వేదశాస్త్రాలనూ అభ్యసించాడు. గురుపుత్రుని పంచజనుడనే రాక్షసుడు చంపివేయగా, మృత బాలకుని జీవింపజేసి, తీసుకొనివచ్చి, అతనిని గురువుగారికి దక్షిణగా నర్పించుకొన్నాడు. విదర్భ రాజైన భీష్మకునియొక్క ముద్దుల కూతురైన రుక్మిణి స్వయంవరానికి వచ్చిన రాజులను ఓడించి, ఆమెను తీసుకొనిపోయి వివాహంచేసుకొన్నాడు. ఎవ్వరూ నిగ్రహించలేకపోయిన ఏడు పొగరుబోతు వృషభాలనొక్కసారిగా లొంగదీసుకొని, బంధించి, జగదేకవీరుడై, నాగ్నజితి రాకుమారిని పెండ్లాడాడు. స్వర్గంనుంచి పారిజాత తరువును తెచ్చి సత్యభామను సంతసింపజేశాడు. భూదేవి పుత్రుడైన నరకుడనే రాక్షసుని చంపి, వానిచే బంధింపబడిన పదహారువేలమంది రాజకన్యలను విడిపించి, వారిప్రార్థనను మన్నించి, వారందరినీ ఒకే శుభముహూర్తాన వివాహమాడి, ఒక్కొక్క భార్యకు ఒక్కొక్క కృష్ణునిగా అన్ని రూపాలు ధరించి, అందరినీ అంతులేని అనురాగముతో అలరింపజేసిన అద్భుతమూర్తి ఆ శ్రీకృష్ణుడు.

ఆ వాసుదేవుడు మధురను చుట్టుముట్టిన కాలయవన, సాళ్వ, జరాసంధాది దుష్టులను, వారిసేనలతో సహా అంతము చేయించినాడు. మదోన్మత్తులైన పాండవశత్రువులను నశింపజేశాడు. మహాభారత యుద్ధంలో రెండువైపులా ఉన్న పద్దెనిమిది అక్షౌహిణుల సేనలు, వారితోనున్న మదాంధులైన రాజులు అందరూనశించినా, ఇంకా భూభారం చాలా తగ్గవలసి ఉన్నదని గమనించి, సరియైన అదనుకైవేచియుండెను.

యుధిష్ఠిరుని సింహాసనమెక్కించినాడు, ఉత్తర గర్భస్థుడైయున్న పరీక్షిత్తును అశ్వత్థామ విడిచిన అస్త్రమునుండి రక్షించి, యుధిష్ఠిరునిచే అశ్వమేధ యాగాలనుచేయించినాడు. తాను ద్వారకలో ఆదర్శగృహస్థునివలె భార్యలతో సకల భోగాలనూ అనుభవిస్తుండెను. వైదికాలూ, లౌకికాలూ అయిన సకల కర్మలనూ సక్రమంగా నిర్వహిస్తూ, అన్నింటిలోనూ ఉంటూ, దేనిచేతనూ అంటబడనివాడై, నిత్యసంతోషియై, ఆశ్రితులందరినీ ఆనందంలో ముంచెత్తుతూ, లాలిస్తూ పాలిస్తూ ఉండేవాడు.

ఒకరోజు కొందరు మహామునులు ద్వారకకు వచ్చారు. ధనజన యౌవన గర్వంతో మిడిసి పడుతున్న కొందరు యాదవ యువకులు ఆమహాత్ములను చుట్టుముట్టి, పరిహాసాలాడగా, అవమానితులైన ఆమునులు ఆకుర్రల దుష్ప్రవర్తన మూలముగా యాదవ కులం అంతం కాగలదని పలికి వెళ్లిపోయాడు. పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు, తన భూభార నివారణ కార్యక్రమంలో ఇంకా మిగిలియున్న తనయొక్క (లక్షల సంఖ్యలోనున్న) పుత్రపౌత్రాది బంధువర్గంవారి అంతము గురించి వేసియున్న వ్యూహమిది. కొన్ని మాసాలు గడిచిన తరువాత, యాదవులంతా ఒక పెద్ద ఉత్సవం చేసే నిమిత్తం ప్రభాసతీర్థంవెళ్లారు. అక్కడ అనేక దానధర్మాలు చేశారు. ఇష్టమృష్టాన్నాలను సుష్ఠుగానారగించి, మితిమీరి మద్యపానంచేసి మత్తెక్కి మైమరచి పరిహాసాలతో పరస్పరం పోరాడుకొని, పొడుచుకొని చంపుకొన్నారు. శ్రీకృష్ణుడు అంతాగమనిస్తూ, నిర్వికారుడై అందరికీ ఉత్తరక్రియలు జరిపించాడు. బలరాముడు దేహత్యాగంచేసి వెళ్లిపోయాడు.

గోవిందుని విడిచి యుండలేని నేను ఆయన్ను వెదకుకొంటూ పోయి ఒక అశ్వత్థవృక్షాన్ని ఆనుకొని కూర్చున్న వాసుదేవుని చూచాను. చతుర్భాహువులతోను, దివ్యతేజస్సుతోను వెలిగిపోతున్న ఆ స్వామి తన ఎడమతొడపై కుడిపాదాన్ని పెట్టుకొని, కూర్చొని యున్నాడు. ఆదివ్యసుందర మూర్తిని దర్శించాను. నాజన్మతరించినది. సంసారసాగరాన్ని దాటివేశాను. అంతులేని ఆనందాన్ని అనుభవించాను.

విదుర మహాశయా! అదేసమయానికి, వేదవ్యాసుని సహాధ్యాయీ, భక్తవరేణ్యుడూ, పూజనీయుడూ అయిన మైత్రేయమహర్షి తీర్థయాత్రలు చేస్తూ అక్కడికి వచ్చాడు. విశ్వమంతా విస్తరిల్లిన సౌభాగ్యశోభావైభవంతో విరాజిల్లే మహాయోగీంద్రవందితుడూ, మహాతేజోమయుడూ అయిన శ్రీకృష్ణ భగవానుని మైత్రేయుడు అవలోకించాడు. అలాగే చూస్తూ చూస్తూ కన్నులు మూసుకొని, భగవంతుని యొక్క ఆదివ్యమంగళ రూపాన్ని హృదయ కమలంలో పదిలపరచుకొన్నవాడై, పులకాంకితుడై, ఆనందంపట్టలేక చేష్టలుడిగిన మైత్రేయ మహర్షి అలాగే నిల్చుండిపోయాడు.

చెంతజేరిన మైత్రేయుడు వింటుండగా, ఆ ప్రభువు నన్నుద్దేశించి ఇలా చెప్పాడు.

"ఉద్ధవా! పూర్వ జన్మలో నీవు వసువువు (దేవపురోహితుడవు). మీవారంతా చేస్తుండే సత్రయాగంలో, నీవు ఏఇతరకోరికలూ లేనివాడవై నాపాదసేవనే కోరుకొని యుంటివి. అందుచేతనే నేను నీహృదయంలోనే ఉంటాను. ఇది నీకు చివరిజన్మ. పద్మకల్పంలో నేను బ్రహ్మకిచ్చిన దివ్యజ్ఞానాన్ని నీకు ఇస్తాను. దానివలన నీకుసంసార బంధముపోయి, అఖండానందాన్ని కలిగించే నాయొక్క దివ్యమహత్త్వం తెలుస్తుంది." అని చెప్పాడు. నాశరీరం సంతోషంతో గగుర్పొడిచింది. నాచెక్కిళ్లు ఆనంద బాష్పాలతో తడిసిపోయాయి. స్వామి పాదాలకు ప్రణమిల్లాను. భగవానుడు నాకు ఆ పరతత్త్వ జ్ఞానాన్ని ప్రసాదించాడు. ఆ పరమేశ్వరుని పాదాలతో ఎడబాటును భరించలేక, నేను తిరిగి తిరిగి బదరికాశ్రమానికి చేరనున్నాను." అని చెప్పి, ఉద్ధవుడు విదురునితో కలిసి కొంత దూరం ప్రయాణంచేసి ఇలా చెప్పాడు:

"సాక్షాత్తూ విష్ణు సమానుడైన మైత్రేయుడు శ్రీహరినే తన చిత్తమందు నిలుపుకొని, ఇక కొద్ది దినాల్లో దేహత్యాగం చేసే తలంపులో నున్నాడు. శ్రీకృష్ణుడు, నీకు తత్త్వజ్ఞానాన్ని బోధించుమని మైత్రేయునకు ఆదేశించాడు గనుక, నీవు వెంటనే వెళ్లి, మైత్రేయుని అర్థిస్తే, అతడు ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానాన్ని నీకు అనుగ్రహిస్తాడు." అని చెప్పి ఉద్ధవుడు సాగిపోయాడు.

**పరీక్షిత్తు శ్రీశుకుని ఇలా ప్రశ్నించాడు :**

"మహాత్మా! అతిరథ మహారథులైన యాదవ మహావీరులంతా పరస్పరం చంపుకొని అంతమయ్యారుకదా! యదుకుల భూషణుడైన శ్రీకృష్ణ భగవానుడు కూడా అవతారం చాలించి, నిష్క్రమించగా, ఒక్కఉద్ధవుడే ఎలాగ మిగిలిపోయాడో నాకు తెలియజేయండి" అని అడుగగా శ్రీశుకుడిలా చెప్పాడు:

"రాజా! శ్రీకృష్ణుడు ఈ భూమండలం విడువ సంకల్పించుకొని, తనతరువాత విజ్ఞాన తత్త్వాన్ని అందుకొని, లోకంలో జిజ్ఞాసువులకు బోధించగల ప్రజ్ఞాశాలియు, జితేంద్రియుడూ, తనంతటివాడూ ఒక్కఉద్ధవుడే యని తలంచి, అతనిని విడిచి వెళ్లిపోయాడు" అని చెప్పాడు.

## జ్ఞానమైత్రేయము - భగవంతునిస్సృజనలీల

ఉద్ధవుడు నిష్క్రమించిన తరువాత విదురుడు పోయిపోయి హరిద్వారము చేరుకొన్నాడు. అక్కడ, పరమపవిత్రుడూ, యోగనిష్ఠాగరిష్ఠుడూ, శ్రీకృష్ణచరణారవిందచిత్తుడూ అయిన మైత్రేయుని దర్శించుకొని, అతనికి ప్రణమిల్లి ఇలా అన్నాడు:-

"మునీంద్రా! సుఖాన్ని కోరుకొని మానవులు అనేకమైన కర్మలు చేస్తుంటారు. కాని వాళ్లకు చివరికి కలిగేది దుఃఖమేకదా! ఎందుచేత? క్రియారహితుడైన భగవంతుడు తనను తాను ఎందుకు, ఎలాగ సృష్టించుకొన్నాడు? సృష్టి స్థితి లయ కార్యాలను ఎలాగ నిర్వహిస్తున్నాడు? శ్రీమన్నారాయణుని గాథలను వినడానికి నామనస్సు తహతహలాడుతున్నది. నాయందు కరుణించి, నాకు తత్త్వజ్ఞానబోధచేయండి" అని వేడుకొన్నాడు.

మైత్రేయమహర్షి మిక్కిలి సంతసించి, ఇలా అన్నాడు. "ఓ పుణ్యాత్ముడా! నీవు సాక్షాత్తూ యమధర్మరాజువు. మాండవ్యముని శాపం వలన శూద్రస్త్రీకి వ్యాస భగవానునివలన పుట్టావు. నీవు శ్రీమన్నారాయణునకు మిక్కిలి ఇష్టుడవు. అందుచేతనే శ్రీకృష్ణుడు నన్ను దగ్గరకు పిలిచి, నీకు జ్ఞాన బోధచేయుమని ఆదేశించాడు. నాకు ఆజ్ఞానాన్నంతా తానే బోధించాడు. అందుచేత నేను నీకు అంతా బోధిస్తాను. నేను చెప్పబోయే విషయాలను విన్నవారికి సకల కళ్యాణ శుభాలూ కలుగుతాయి.

"సృష్టికి పూర్వము పరమేశ్వరుడొక్కడే ఉండెను. "ఏకము అనేక మవ్వాలి" అనే సంకల్పం ఆయనకు కలిగినది. వెంటనే ఆయననుండి ఒక మహత్తరమైన మాయాశక్తి "అవిద్య" రూపంతో నుద్భవించినది. ఈ మాయ కాలచోదితము, అవ్యక్తము అయి, "ప్రకృతి"గా పిలవబడినది. దీనినుండి మహత్తత్త్వము పుట్టినది. దీనినుండి, కారణము (పంచభూతాలు), కార్యము (ఇంద్రియాలు), కర్త (మనస్సు) ఏర్పడినవి. వీటితో కూడి, సత్త్వరజస్తమోగుణాలతో కూడిన అహంకారం ఏర్పడినది.

"సాత్త్వికాహంకారంవలన ఇంద్రియములయొక్క మనస్సుల యొక్క అధిదేవతాగణాలు ఉదయించాయి. రాజసాహంకారంవలన జ్ఞానేంద్రియాలు (చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు) కర్మేంద్రియాలు (వాక్కు, చేతులు, కాళ్లు, గుదము, గుహ్యము) ఏర్పడ్డాయి. తామసాహంకారం వలన పంచతన్మాత్రలు (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము) ఆవిర్భవించాయి. తరువాత కాల మాయాంశయోగముతో భగవానుని ఈక్షణప్రభావంతో శబ్దము వలన ఆకాశము పుట్టినది. అట్లే ఆకాశము స్పర్శ తన్మాత్రవలన వాయువును పుట్టించినది. వాయువు ఆకాశంతో కలిసి, కాల మాయాంశ యోగముతో, భగవానుని ఈక్షణంతో రూప తన్మాత్రవలన తేజస్సును పుట్టించినది. తేజస్సు, వాయువుతో కలిసి, రసతన్మాత్రవలన జలాన్ని కలిగించినది. జలము తేజస్సుతో కలిసి, గంధతన్మాత్రవలన పృథివిని పుట్టించినది. ఈవిధంగా ఆకాశానికి శబ్దగుణము, వాయువునకు శబ్ద, స్పర్శ గుణాలూ, తేజస్సుకు శబ్ద, స్పర్శ, రూపగుణాలూ, జలమునకు శబ్ద, స్పర్శ, రూప, రసగుణాలూ, పృథివికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ గుణాలూ ఏర్పడ్డాయి.

"ఇవి అన్నీ ఉద్భవించినప్పటికీ అధిదేవతలకూ, ఇంద్రియాలకూ, తన్మాత్రలకూ, మనస్సుకూ సమైక్యత, పరస్పర సమన్వయము కుదరక, సృష్టికార్యముచేసే సామర్థ్యము కలుగలేదు. వీరందరూ (ఇవి అన్నీ) భగవంతుని ప్రార్థించగా, శ్రీహరి కరుణించి, తాను ప్రకృతితోకూడి ఇరువదిఏడు తత్త్వాలలో (పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచతన్మాత్రలు, కాలము, ప్రకృతి, మహత్తు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) ప్రవేశించి, అన్నింటినీ సంఘాత పరిచాడు. భగవానుడు ప్రవేశించిన పిదప ఏకము చేయబడిన తత్త్వసమూహమే, విరాట్ పురుషునిగా, (భగవంతుని ప్రథమ అవతారమైన ఆది పురుషునిగా) వెలసినది. ఆవిరాట్ పురుషుడే మొదటి జలాల్లో నేర్పడిన "బ్రహ్మాండం" అనబడే గర్భరూపంతో వెయ్యిసంవత్సరాలున్నాడు. ఈ బ్రహ్మాండమునుండే సమస్త సృష్టి కార్యరూపంగా వెలువడినది.

"విరాట్ పురుషుని నుండి - దైవము, ఆత్మ, కర్మ, అనబడునవి శక్తిగా వ్యాపిస్తాయి. సృష్టియందు చైతన్యం ప్రవేశిస్తుంది ఈ చైతన్య శక్తికి రూపాలుగా ఏర్పడి, వ్యక్తమయ్యే లక్షణం కలుగుతుంది. అదే కర్మశక్తి. కర్మశక్తి వలన ప్రవృత్తి భేదాలు కలుగుతాయి. దానియందు పది విధాలైన ప్రాణాలు స్పందిస్తాయి. (ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ) ఇన్ని శక్తులతో కూడిన ప్రజ్ఞ కలుగుతుంది.

"అధ్యాత్మం, అధిభూతం, అధిదైవం అనబడే మూడు భేదాలతో ఈవిరాట్ స్వరూపం జీవులకు తాను ఆత్మగా మెలగుతుంది. సమస్తానికీ జీవమై, పరమాత్మకు స్థానమై, తొలి అవతారమైన ఆవిరాట్ పురుషుని గర్భంనుండి, భూతమయమైన ఈ సమస్త విశ్వమూ పుట్టినది." అని మైత్రేయుడు విదురునకు చెప్పాడు.

ఆ శ్రీహరి, పరమాత్ముడు, ఈశ్వరుడు, అజుడు, అద్యుడు, అనంతుడు, అనంతమూర్తి, లక్ష్మీరమణుడు, నిర్వికారుడు, నిత్యమంగళ స్వరూపుడు, కరుణాసముద్రుడు, నిర్మలహృదయుడు, సమస్తశక్తిమంతుడు, కమలదళనేత్రుడు, సకల బుధసంస్తవనీయ చరిత్రుడు, పరమ పవిత్రుడు." అని శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెప్పెను.

**మైత్రేయుడు విదురునితో మళ్లీ చెపుతున్నాడు :**

"ఆదివ్యమూర్తి అయిన విరాట్ పురుషునకు నోరు ఏర్పడినది. అక్కడికి అగ్నిదేవుడు వాక్‌శక్తితో ప్రవేశించాడు. దానివలన జీవుడు మాట్లాడ గలుగుతున్నాడు. నాలుక స్థానంలో వరుణుడు రస శక్తితో ప్రవేశించాడు. తరువాత నాశికా రంధ్రాలేర్పడి అందు ఘ్రాణశక్తితో అశ్వినీ దేవతలు ప్రవేశించారు. చక్షుద్వయమేర్పడి, రూపదర్శన శక్తితో అక్కడ సూర్యుడు ప్రవేశించాడు. చర్మం ఏర్పడి, అక్కడ త్వగింద్రియంతో వాయువు ప్రవేశించాడు. కర్ణద్వయ మేర్పడినప్పుడు శబ్దగ్రహణ శక్తితో దిగ్దేవతలు ప్రవేశించారు. చర్మముపైన రెంట్రుకలతో ఓషధుల కధిపతులైన దేవతలు చేరినారు. పురుషాంగ మేర్పడి, అక్కడ సంతానోత్పత్తి శక్తితో ప్రజాపతి ప్రవేశించాడు. గుదస్థానంలో మలవిసర్జనశక్తితో మిత్రుడు చేరాడు. చేతులేర్పడగా ఇచ్చిపుచ్చుకొనే శక్తితో ఇంద్రుడు ప్రవేశించాడు. పాదాలేర్పడగానే గమనశక్తితో విష్ణువు ప్రవేశించాడు. హృదయము, మనస్సూ ఏర్పడగా సంకల్ప వికల్ప శక్తితో చంద్రుడు ప్రవేశించాడు. అహంకార మేర్పడగా కర్తవ్యపాలనాసక్తి

అనేశక్తితో రుద్రుడు ప్రవేశించాడు. బుద్ధి, చిత్తమూ ఏర్పడగా, గ్రహణ, విచక్షణా, విజ్ఞాన శక్తులతో బ్రహ్మప్రవేశించాడు.

విరాట్ పురుషుని శిరస్సునుండి స్వర్గము, పాదాలనుండి భూమి, నాభినుండి ఆకాశము, నోటినుండి వేదాలూ, బ్రాహ్మణులు, చేతులనుండి క్షత్రియులు, తొడలనుండి వైశ్యులు, పాదాలనుండి శూద్రులు వచ్చారు.

శ్రీహరి యొక్క మాయ, బ్రహ్మను కూడ భ్రమలో పడవేస్తుంది. ఆ శ్రీహరినే అందరూ కొలుస్తారు.

"ఓ విదురా! భగవన్మహిమను వేదముగాని, బ్రహ్మగాని ఋషులుగాని ఇంకెవ్వరైనా గాని ఇంతవరకూ సంపూర్ణంగా తెలుసుకొనలేకపోయారు. తెలియవచ్చినంత వరకూ తెలుసుకొని కృతజ్ఞులమై ఆ మహిమాన్వితుని కొలుచుకోవాలి" అని మైత్రేయుడు చెప్పెను.

## జ్ఞానమైత్రేయము - భాగవతరహస్యము

**విదురుడు అడిగిన అనేకప్రశ్నలకు సమాధానముగా మైత్రేయుడిలాగ చెప్పెను:**

విదుర మహాశయా! విష్ణుదేవుని మాయ ఎవ్వరికీ తెలియనట్టిది. ఆయన దేహాల్లో ప్రవేశించి, జీవునిగా ఎన్ని కార్యాలలో పాల్గొన్నా ఆయనకెట్టి బంధాలూ ఏర్పడవు. విపత్తులూ, విషాదాలూ అంటవు. కలలో చంపబడినవ్యక్తి మెలకువ వచ్చాక చావకుండా బ్రతికే ఉన్నట్లు, దేవుడు జీవునిగా నటిస్తున్నప్పుడు, ఆ సమయంలో సంభవించే కష్టసుఖాలు దేవునికి అంటవు. కదులుతున్న నీటిలోని చంద్రుని ప్రతిబింబము కదులుతున్నట్లు కనిపించినా వాస్తవానికి చంద్రుడేమీ కదలటంలేదుకదా! అజ్ఞానంచేత మాయాప్రభావంచేత జీవుడు కర్మబంధాల్లో చిక్కుకొంటున్నాడు గాని, సర్వభూతాల్లో నంతర్యామిగానున్న పరమాత్మకు బంధాలుండవు.

మానవునికి కర్మబంధాలు తొలగాలంటే శ్రీహరి పాదపద్మాలపై విశేషమైన భక్తి ఉంటే చాలు. ఇంద్రియాలూ, మనస్సూ, ఆభగవంతునికి అధీనంచేసి, ఏకాగ్రచిత్తంతో సంకీర్తనం చేస్తేచాలు.

ఒకనాడు సనక సనందాదులైన ఋషులుచేసిన ప్రార్థనలకు ప్రసన్నుడైన భగవంతుడు సమస్త వేదసారమైయున్న ఈ భాగవతాన్ని సనత్కుమారునకు ఉపదేశించాడు. అతడు సాంఖ్యాయనునకు బోధించాడు. అతడు పరాశరునకుపదేశించాడు. పరాశరుడు బృహస్పతికీ, బృహస్పతి నాకు వివరించారు. నేను చెప్పబోవు ఈ పురుషోత్తముని చరిత్రను వీనులవిందుగా విని తరించెదవుగాక.

ఈకల్పానికి పూర్వము ప్రళయము సంభవించినప్పుడు బ్రహ్మతోసహా సమస్తసృష్టి పరమేశ్వరుడైన శ్రీహరియందు సహస్రయుగముల కాలము లయించియుండేది. ఆదిశేషుని పాన్పుగా చేసుకొని, శ్రీహరి జలమందు శయనించినాడు. తరువాత కాలశక్తి ఆయునను మేల్కొలుపగా లేచి, పునః సృష్టిచేయసంకల్పించి, తనకుక్షిలో నిక్షిప్తమైయున్న జీవులను వారివారి ప్రారబ్ధసంచితకర్మలతో సహా, పంచభూతాలతో సహా ఒక పద్మాకార రూపములో, తన నాభినుండి బహిర్గతంచేశాడు. తన చైతన్య శక్తిని అందులో ప్రవేశపెట్టగానే బ్రహ్మ ఆ పద్మములో వ్యక్తమయ్యాడు. పద్మాసీనుడైయున్న బ్రహ్మకు ఏమీగోచరించనందున నాలుగు వైపులా పరికించి చూడగా, నాలుగు ముఖాలేర్పడినవి. మొదటిసారిగా అతడు పద్మములో నావిర్భవించినందున అది పద్మకల్పమనబడినది. తాను కూర్చున్న పద్మముయొక్క ఉత్పత్తి స్థానాన్ని కనుగొనదలచి, ఆతామర తూడులో ప్రవేశించి ఒక వంద దివ్య సంవత్సరాలపాటు వెదకి వెదకి, ఏమీ తెలుసుకొనలేక, నిరాశుడై మళ్లీ వచ్చి పద్మంపై కూర్చున్నాడు. ఒక వందసంవత్సరాలు తపస్సు చెయ్యగా జ్ఞాన సంపన్నుడయ్యాడు. అప్పుడు ధ్యానాన్ని హృదయంలోనే కేంద్రీకరించగా పరమాత్మను దర్శించగలిగాడు. తాను అంతటా అన్వేషిస్తున్న తన ఉత్పత్తికి మూలకారణుడు తన హృదయంలోనే ఉన్నట్లు తెలుసుకొన్నాడు. ఆ అనంతశయనుడు దివ్య కళలతో తేజరిల్లుచు నీలవర్ణుడై నానారత్నఖచిత సువర్ణకిరీట కంకణ భుజకీర్తులనూ, శంఖచక్రగదాపద్మములనూ ధరించినవాడై యుండెను. ఆయన యొక్క నాభినుండి ఉద్భవించిన పద్మములోనే తాను ఆసీనుడై యుండినట్లు బ్రహ్మ కనుగొనగలిగాడు.

పరమేశ్వరుని దివ్యవైభవాన్ని కన్నులారా తిలకించిన బ్రహ్మదేవునకు, ఆమహాపురుషునినాభినుండి ఉద్భవించిన కమలమూ, అంతటా ఆవరించియున్న జలమూ, అగ్ని, ఆకాశమూ, "విశ్వాన్ని సృష్టించు" అని సూచించే ఆయన యొక్క చూడ్కులు తప్ప, వేరేమీ కన్పించలేదు. ఆనంద సంభ్రమాలతో బ్రహ్మ ఆయనను స్తుతించనారంభించాడు. భగవానుడు ప్రసన్నుడై ప్రత్యక్షమైనాడు. ఆయనయొక్క ప్రసన్న వదనమును, విశ్వమోహన రూపమును, చిరునవ్వును గాంచిన బ్రహ్మ సర్వమూ మరచిపోయినాడు. కొంతసేపటికి తనకర్తవ్యం గుర్తుకురాగా, సృష్టికార్యాన్ని నెరవేర్చే జ్ఞానాన్నీ నైపుణ్యాన్నీ పొరపాటు చెయ్యకుండా ఉండటానికి కావలసిన అవధానాన్నీ ప్రసాదింపుమని వేడుకొన్నాడు. భగవానుడు కరుణించి ఇలా అన్నాడు: "చతురాననా! సమాధి నిష్ఠుడవై నన్నే నీహృదయంలో ప్రతిష్ఠించుకొని తపస్సుచేయుము. నీకార్యాలన్నీ నాఆరాధనా భావముతోనే చేయుము. నీవు సృష్టించవలసిన లోకాలు నీకు స్పష్టంగా గోచరిస్తాయి. నన్ను అంతటా దర్శించగలవు. రజోగుణము నీదరిజేరదు. నీహృదయంలోనే నన్నూ, నాలోనున్న సమస్తవిశ్వాన్నీ దర్శించగలవు. గతించిన కల్పంలో నేవిధంగా సృష్టిజరిగినదో, అదే విధంగా సృజింపుము." అనిచెప్పి, అంతర్ధానమయ్యాడు.

## కాలము

సూక్ష్మాతి సూక్ష్మాంశాన్ని పరమాణువంటారు. కిటికీనుండి గదిలోనికి సూర్యరశ్మి ప్రసరించినప్పుడు గాలిలో తేలుతున్న దూళికణాలు కన్పిస్తాయి. అలాంటి ఒక రేణువులోని ఆరవ వంతు పరమాణువుతో సమానమనవచ్చు. ఆ పరమాణువుపై నొక ప్రక్కనుండి రెండవ ప్రక్కకు సూర్యకిరణం పయనించే కాలము - సూక్ష్మ కాలమనబడుతుంది.

రెండు పరమాణువులు ఒక అణువు. మూడు అణువులు ఒక త్రసరేణువు. మూడు త్రసరేణువులు ఒక త్రుటి. నూరు త్రుటులు ఒక వేధ. మూడు వేధలు ఒకలవము. మూడు లవములు ఒక నిమేషము. మూడు నిమేషాలు ఒక క్షణము. ఐదు క్షణాలు ఒక కాష్ఠ, పది కాష్ఠలు ఒక లఘువు. పదునైదు లఘువులు ఒక నాడి. రెండు నాడులు ఒక ముహూర్తం. ఆరుగాని ఏడుగాని నాడులు ఒక ప్రహరము లేదా, జాము (యామము). నాలుగు జాములు ఒక పగలు నాలుగు జాములు ఒక రాత్రి.

ఒక పగలూ, ఒకరాత్రీ కలిసి ఒక దినము. పదునైదు దినాలు ఒకపక్షము, రెండు పక్షాలు ఒక నెల (అది పితృదేవతలకు ఒక దినము) రెండు నెలలు ఒక ఋతువు. ఆరునెలలు ఒక అయనము. రెండు అయనాలు ఒక సంవత్సరం (అది దేవతలకు ఒక దినము) మానవునిపరమాయువు ఒక వంద సంవత్సరాలు.

దైవాంశ సంభూతుడైన సూర్యభగవానుడు సంవత్సర కాలములో పన్నెండు రాసులను చుట్టివస్తాడు. పితృదేవతల ఆయువు మూడువేల మానవ సంవత్సరాలు. దేవతల ఆయువు ముప్పదియారువేల మానవ సంవత్సరాలు. (ఒక దివ్యవర్షం అంటే 360 మానవ సంవత్సరాలు).

కృతయుగము 4,000 దివ్య వర్షాలు. ఒక యుగానికీ తరువాతి యుగానికీ మధ్యకాలం "సంధ్య" అనబడుతుంది. కృతయుగసంధ్య 800 దివ్య వర్షాలు. త్రేతాయుగం మూడువేల దివ్యవత్సరాలు. దాని సంధ్యాకాలము 600 దివ్య వత్సరాలు. ద్వాపరయుగము రెండువేల దివ్య వర్షాలు, దాని సంధ్యాకాలం నాలుగువందల దివ్య వత్సరాలు. కలియుగము ఒక వెయ్యి దివ్య వత్సరాలు, దాని సంధ్యాకాలం రెండువందల దివ్యవర్షాలు. నాలుగు యుగాలూ, సంధ్యాకాలాలతో సహా 12 వేల దివ్యవర్షాలు ఒక చతుర్యుగమని (మహాయుగమని) అంటారు. సంధ్యాకాలాల్లో ధర్మము అల్పముగానుంటుంది. కృతయుగంలో ధర్మము నాలుగుపాదాలతోనూ, త్రేతాయుగంలో మూడు పాదాలతోనూ, ద్వాపరయుగంలో రెండు పాదాలతోనూ కలియుగంలో నొక్కపాదంతోనూ నడుస్తుంది. ఈ వ్యత్యాసాల వలన ప్రజలలో ధర్మవర్తనము కూడా మారుతూ ఉంటుంది.

భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం కంటే పైన సత్యలోకం ఉన్నది. అక్కడ బ్రహ్మదేవుడుంటాడు. ఒక వెయ్యి చతుర్యుగాల కాలం (432 కోట్ల మానవ సంవత్సరాలు) గడిస్తే, బ్రహ్మకు ఒక పగలు అవుతుంది. ఆయన రాత్రికూడా అంతే కాలం ఉంటుంది. బ్రహ్మయొక్క పగలు, కల్పమనబడుతుంది, రాత్రి నైమిత్తిక ప్రళయం అనబడుతుంది. ఒక

కల్పంలో 14 మన్వంతరాలు (పదునలుగురు మనువులు పాలించిన కాలము) గడుస్తాయి. ప్రతిమన్వంతరంలోనూ భగవానుని అవతారాలు సంభవిస్తుంటాయి. ప్రతికల్పాంతమందూ భూలోక, భువర్లోక, స్వర్గలోకాలూ, సూర్యచంద్రులూ, బ్రహ్మయందు లయిస్తుంటారు. ఈమూడు లోకాలూ సంకర్షణుని ముఖమునుండి వెలువడే అగ్నిచే దహింపబడుతాయి. సముద్ర జలాలు ఈ లోకాలను ముంచి వేస్తాయి. బ్రహ్మ నిద్రిస్తే లోకాలకు ప్రళయం వస్తుంది. (నైమిత్తిక ప్రళయం) మేల్కొంటే లోకాలన్నీ ఆవిర్భవిస్తాయి. దేవతలు, మునులు, సప్తఋషులూ, భగవంతుని అంశతో మనువులైపుట్టి, ఒక్కొక్కరూ 71 మహాయుగాల కాలం లోకాన్ని పాలిస్తారు. బ్రహ్మయొక్క జీవిత కాలంలో, 36వేల కల్పాలూ, అన్నే నైమిత్తిక ప్రళయాలూ సంభవిస్తాయి. సంకర్షణాగ్ని జ్వాలలకు తట్టుకొనలేక, మహర్లోకవాసులు జనోలోకానికి వెళ్తారు. ప్రళయకాలంలో భయంకరంగా ప్రచండవాయువులు వీచుతాయి. మహాసముద్రాలు పొంగి, ముల్లోకాలనూ ముంచి వేస్తాయి. ఆ మహాసముద్రమధ్యంలో శ్రీమన్నారాయణుడు శయనించి యుంటాడు.

బ్రహ్మదేవుని ఆయువు ఒక వంద బ్రహ్మసంవత్సరాలు. అందులో మొదటి సగము. పూర్వ పరార్థమనీ, రెండవ సగము ద్వితీయ పరార్థమనీ అనబడుతాయి. పూర్వపరార్థపు చివరికల్పము పద్మకల్పం. ద్వితీయ పరార్థపు మొదటి కల్పంలో శ్రీహరి వరాహరూపం ధరిస్తాడు. అందుకే దానిని వరాహ కల్పం అంటారు. ఇప్పుడు నడుస్తున్నది వరాహ కల్పమే. బ్రహ్మకు ఇప్పుడు 51వ సంవత్సరం వయస్సు. ఆద్యంతాలు లేని ఆ దేవదేవునికి బ్రహ్మదేవుని జీవిత కాలమంతా ఒక్క నిమేషమే (రెప్పపాటుకాలము). ఆయన అనంతుడు, శాశ్వతుడు కాలాతీతుడు. కాలమే ఆయనను ఆశ్రయించుకొని ఉంటుంది.

అండాకారాన ఉన్న ఈ విశ్వము. ఎనిమిది కారణ తత్త్వాలతోనూ, (మూలప్రకృతి, మహత్తత్త్వము, అహంతత్త్వము, పంచతన్మాత్రలు) 16 వికారాల తోనూ (మనస్సు, దశేంద్రియాలు, పంచభూతాలు) కూడియుండి, 50 కోట్ల యోజనాల విస్తీర్ణముతోనూ, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము అనబడు ఆవరణలతో నావరింపబడియున్నది. ఇలాంటి లెక్కలేనన్ని మహాండకోశాలను తన ఉదరంలో పదిల పరచుకొని, పరమేశ్వరుడు పరమాణువు రూపంలో ఆ బ్రహ్మాండకోశంలో ప్రకాశిస్తుంటాడు. అద్భుతతేజస్సుతో విరాజిల్లే ఆ పురుషోత్తముని వర్ణించడానికి ఆ బ్రహ్మకు గాని, శివునికి గాని సాధ్యపడదు.

## బ్రహ్మచేసిన సృష్టి

శ్రీహరి దర్శనమిచ్చి అంతర్థానమైన తరువాత బ్రహ్మ ఒక వంద సంవత్సరాలు తపస్సు చేశాడు. అప్పుడు మహావాయువు వీచినది. తాను ఆసీనుడైయున్న పద్మము ఎక్కువగా ఊగిపోతుంటే, వాయువును నిరోధించాడు. మహాజలాన్నంతా ఒక్కసారిగా త్రాగివేశాడు. అప్పుడుపైకి చూడగా ఆకాశమంతా నిండియున్న జలం కనిపించినది. ఆకాశంలో నొక పద్మం కనిపించినది. ఆ పద్మదళాల్లోదాగియున్న లోకాలన్నీ కనిపించాయి. అప్పుడు తాను సృష్టిచేయవలసిన సమయం వచ్చినదని తెలుసుకొని, బ్రహ్మ ఆ పద్మంలో ప్రవేశించాడు. అందులోనున్న లోకాలను తిలకించాడు. తన తపశ్శక్తితో చతుర్దశ భువనాలనూ, వాటిలో దేవతలను, మానవులను, పశుపక్ష్యాదులను, స్థావరాలనూ, క్రమంగా సృష్టించడం ఆరంభించాడు.

మొదలూ తుదీలేనిదీ, తరిగి పోనిదీ అయిన తత్త్వమే సృష్టి అంతటికీ మూలకారణము. కాలము, మహత్తూ, భూతాదులు తన్ను ఆశ్రయించగా, ఈశ్వరుడు గుణాలను ధరించి, కాలానికీ, అవసరానికీ తగిన రూపములో, వినోదానికై తన్నుతాను సృష్టించుకొంటాడు. సృష్టింపబడిన సమస్త లోకాల్లోనూ తాను వ్యాపించి యుంటాడు. అతనియందే సమస్తలోకాలూ ప్రకాశిస్తుంటాయి. విశ్వానికి కారణమూ, కార్యమూ తానే, ఆపరమపురుషునినుండి వ్యక్తమై ఈ విశ్వం విరాజిల్లుతుంది ఆయనయొక్క మాయా ప్రభావంచేత ఈ విశ్వమంతా ఒక క్రమంలో పుట్టి పెరిగి నశిస్తుంది. ఈవిధంగానే పూర్వకాలంలో జరిగినది. భవిష్యకాలంలో కూడ ఇలాగే జరుగుతుంది.

### సృష్టి తొమ్మిది వర్గాలుగా జరిగినది:

1. మహత్‌తత్త్వము : ఇది ప్రకృతినుండి వచ్చిన మొదటి సృష్టి. సత్త్వ రజస్తమోగుణాల సమతులనం కాలముచే చెదరగొట్ట బడగా ఈమహత్తత్త్వమేర్పడుతుంది.

2. అహంకారతత్త్వము : ఇది ప్రకృతినుండి వచ్చిన రెండవ సృష్టి. దీనినుండి పంచభూతాలు, దశేంద్రియాలు, పంచతన్మాత్రలు, మనస్సు వచ్చాయి. ఇది, ద్రవ్య, జ్ఞాన, క్రియాత్మకమైనట్టిది.

3. భూతసృష్టి : పంచతన్మాత్రలు (శబ్ద స్పర్శరూపరసగంధాలు) ఇవి సూక్ష్మావస్థలో నుండే శక్తులు. ద్రవ్యాలైన పంచభూతాలతో చేరియుంటాయి.

4. ఇంద్రియసృష్టి : ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదుకర్మేంద్రియాలు.

5. దేవతాసృష్టి : ఇంద్రియాభిమానులైన దేవతలసృష్టి. దీనిని దేవసర్గము అంటారు. ఇది మనోమయమైన సాత్త్వికాహంకారం వలన కలుగుతుంది.

6. తామససర్గ : ప్రకృతి మండలమైన అండసృష్టి. దీనివలన ఆవరణ విక్షేపాలు కలుగుతాయి. అజ్ఞానంవలన కలుగుతాయి. ఇది తామసాహంకార జనితము.

ఈ ఆరునూ, భగవంతుని లీలా విలాస జనితాలైన ప్రాకృత సృష్టులు. ఇప్పుడు చెప్పబోయే మూడు రకాల సృష్టులూ వైకృత సృష్టులు. ఇవి రజోగుణముతో కూడియున్న బ్రహ్మదేవునిచే చేయబడినవి.

7. స్థావరసృష్టి : ఓషధులు, అరటి, వెదురుపొదలు లాంటివి. పూవులు పూయకుండా ఫలించే వృక్షజాతులు (రావి, మేడి, మర్రి, పనస మొదలైన వనస్పతులు), పూవులు పూసి ఫలించిన తరువాత నశించి పోయేవి. (ఓషధులు - ధాన్యము, పెసలు మొ॥) మాలతి లాంటిలతలు, పుష్పించి, ఫలించే వృక్షాలు. ఇవి, భూమినుండి ఆహారం తీసుకొని పెరుగుతాయి.

8. తిర్యక్కులు : 28 జంతుజాతులు. నిన్న నేడు రేపు అనే జ్ఞానం లేనివి. తమోగుణప్రధానమైనవి. ఆహార నిద్రామైథునాలయందే ఆసక్తికలవి, వాసన చూచి గుర్తించునవి, సుఖదుఃఖాలను త్వరగా మరచునవి, భూచరాలే కాకుండా మొసలిలాంటి జలచరాలు. రాబందులాంటి ఆకాశచరాలు కూడా తిర్యక్కులే.

9. మానవులు : ఈజాతి రజోగుణ ప్రేరితమైనట్టిది. కర్మచేయడానికి ఆసక్తిమెండు. మానవులు దుఃఖమందు కూడా సుఖాన్నపేక్షిస్తారు.

ఈమూడు వైకృత సర్గములు. దేవతలు కూడా వైకృత సర్గములోని వారే అయినా, వారిని దశమవర్గముగా పేర్కొన్నారు.

10. దేవతలు : వీరు ఎనిమిది వర్గాలలో పేర్కొనబడ్డారు. పితృదేవతలు, అసురులు, గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, యక్షరాక్షసులు, చారణులు, భూతప్రేతపిశాచాలు, కిన్నర కింపురుషులు, విద్యాధరులు.

ఈవిధంగా ప్రతి కల్పారంభములోనూ సృష్టి జరుగుతుంది. విదురా! ఇప్పుడు బ్రహ్మచేసిన సృష్టి యొక్క క్రమము గురించి చెప్తాను విను:

బ్రహ్మదేవుడు "నేను సృష్టిస్తాను" అని సంకల్పించగానే అహంకారపూరితమైన దేహాభిమానంగల "మోహము" పుట్టినది. భోగాసక్తితో కూడిన "మహామోహము" పుట్టినది. కోరికలకు విఘ్నం కలుగగానే కన్నులు కనిపించనీయని "క్రోధము" పుట్టినది. మృత్యుభయముతో కూడిన తామిస్రము, అంధతామిస్రము పుట్టాయి. వీటివలన చిత్తవిభ్రమం కలుగుతుంది. వీటిని అవిద్యాపంచకం అంటారు. ఈ అవిద్యాపంచకంతో భూతకోటిని సృష్టించడం పాపకార్యమని గుర్తించి, బ్రహ్మ పశ్చాత్తాపం చెందాడు. భగవద్ధ్యానం చేసి పునీతుడయ్యాడు.

తరువాత సత్త్వగుణ సంపన్నులూ, బ్రహ్మచారులూ పరమ పవిత్రులూ అయిన నలుగురు కుమారులను సనక, సనందన, సనాతన, సనత్కుమార - అనే వారిని సృష్టించాడు. 'ప్రజోత్పత్తి చేయండి' అని బ్రహ్మ వారిని ఆదేశించగా, "మోక్షకాములమై శ్రీహరినే ఆశ్రయిస్తాముగాని, సంసారులము కాజాలము" అని వారు తిరస్కరించారు. బ్రహ్మకు పట్టలేనంత ఆగ్రహం వచ్చినా నిగ్రహించుకొన్నాడు. ఆ ఆగ్రహం అతని భ్రుకుటిలో కేంద్రీకృత మయినది. అక్కడ

క్రోధస్వరూపుడైన నీలలోహితుడుద్భవించాడు. అతడు జన్మిస్తూనే పెద్దగా రోదించాడు. నీలము ఎరుపురంగుతో పుట్టిన అతడు బ్రహ్మ నడిగాడు - "నేనెవరిని? నాపేరేమిటి? నేనెక్కడ ఉండాలి, ఏమిచెయ్యాలి?" అని. బ్రహ్మ అతనిని బుజ్జగిస్తూ - "నాయనా!ముందు ఆరోదన మాను. నీకు రుద్రుడు అనే నామం సరిపోతుంది. (రౌద్రముతో, రోదిస్తూ పుట్టడంచేత). సూర్యచంద్రులూ, పంచభూతాలూ, ఇంద్రియాలూ, ప్రాణము, తపస్సు, హృదయము, ఈ పదునొక్కటీ నీ నివాసస్థలాలు. నీకు ఏకాదశ నామాలుంటాయి (మన్యువు, మనువు, మహాకాలుడు, మహత్తు, శివ, ఋతధ్వజ, ఉరురేతస్క, భవ, కాల, వామదేవ, ధృతవ్రత - అనునవి). నీకు (ధీ, వృత్తి, ఉశన, ఉమ, నియుత్, సర్పి, ఇళ, అంబిక, ఇరావతి, సుధ, దీక్ష, అనుపేర్లతో). పదునొక్క మంది భార్యలుంటారు. నీవు ప్రజాసృష్టిని చెయ్యాలి." అని ఆదేశించగా రుద్రుడు తనతో సమానులైన తనలాంటి ప్రజల్ని సృష్టింపనారంభించాడు. రుద్రగణాలు భయంకరంగా తయారయ్యేసరికి, "అయ్యలారా! ఇక మీ సృష్టిచాలు. పోయి తపస్సుచేసుకొనండి" అని, బ్రహ్మ, రుద్రులను కోరినాడు. ఆప్రకారమే వారు శాంతులై తపస్సులో నిమగ్నులైనారు.

తరువాత బ్రహ్మ పదిమందిని సృష్టించాడు. తన బొటన వ్రేలినుండి దక్షుని, తొడనుండి నారదుని, నాభినుండి పులహుని, చెవులనుండి పులస్త్యుని, చర్మమునుండి భృగువును, చేతినుండి క్రతువును, ముఖమునుండి అంగిరసుని, ప్రాణమునుండి వశిష్ఠుని, మనస్సునుండి మరీచిని, కన్నులనుండి అత్రిని ఆవిర్భవింపజేశాడు. అతని కుడివక్షస్థలమునుండి ధర్మము, వెన్నునుండి అధర్మమూ, మృత్యువూ జన్మించాయి. ఆత్మనుండి మన్మథుడు పుట్టాడు. కనుబొమలనుండి క్రోధము, పెదవులనుండి లోభము, ముఖమునుండి సరస్వతి పుట్టారు. అతని పురుషాంగమునుండి సముద్రాలు, అపానం నుండి పాపాశ్రయుడైన నిరృతి, నీడనుండి కర్దముడు ఉదయించారు.

బ్రహ్మయొక్క నాలుగు ముఖాలనుండి నాలుగు వేదాలు వెలువడ్డాయి. నలుగురు హోతలతో చేయబడే చాతుర్హోత్రమనే కర్మతంత్రము ఆవిర్భవించినది. యజ్ఞనిర్వాహకులైన హోత, అధ్వర్యువు, ఉద్గాత, బ్రహ్మ అనబడే ఋత్విక్కులు పఠించవలసిన శస్త్ర, ఇజ్య, స్తోమ ప్రాయశ్చిత్తముల మంత్రాలు వెలువడినవి. ఉపవేదాలైన ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వము (గానశాస్త్రము), స్థాపత్యము (శిల్పశాస్త్రము) ఆముఖాలనుండి వెలువడ్డాయి. ఇతిహాసపురాణాలు, కర్మతంత్రాలు, ధర్మపాదాలు (విద్య, దానము, ధనము, తపస్సు) పుట్టినవి. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనబడే ఆశ్రమాలు చెప్పబడినవి. బ్రహచర్యాన్ని సావిత్రం అని కూడ అంటారు (గాయత్రీమంత్రోపదేశము పొంది జపించుతారు గనుక). ఉపనయనం తరువాత మొదటి మూడు రోజులూ గాయత్రిని జపించడం ప్రాజాపత్యం అంటారు. వేదవ్రతాల నాచరించడం బ్రాహ్మము. వేదాన్ని పూర్తిగా నేర్చుకొని ఆచరించడం నైష్ఠికం.

గృహస్థులు నాలుగు విధాలు : పొలందున్ని పండించుకోవడం వార్త అనబడుతుంది. యజ్ఞ సామగ్రిని సమకూర్చుకోవడం సంచయం. పరులను యాచింపకుండా ఉండడం శాలీనము. పొలాల్లో రాలిన గింజలను ఏరుకొని వచ్చి, వాటిని శిలలపై నూర్చుకొని జీవనం గడపడం శిలోంఛము.

వానప్రస్థులు నాలుగు విధాలు : దుంపలు త్రవ్వుకొని భుజించువారు వైఖానసులు. క్రొత్త పంటరాగానే పూర్వం దాచిపెట్టిన పదార్థాలన్నీ ఇతరులకు పంచిపెట్టేవారు వాలఖిల్యులు. పొద్దున్నే లేవగానే ఏదిక్కు కనిపిస్తుందో, ఆ దిక్కుకునపోయి, అక్కడ అయాచితంగా లభించిన దాన్ని భుజించేవారు ఔదుంబరులు. రాలిన ఫలపత్రాలను తినేవారు ఫేనపులు.

సన్న్యాసులు నాలుగువిధాలు : సొంత కుటీరం ఉండి, చేయదగిన కర్మలు చేయువారు కుటీచకులు. కుటీరం లేకుండా కర్మలు అప్రధానమని భావించి, జ్ఞానియై సంచరించేవాడు బహూదకుడు. కేవలం జ్ఞానాభ్యాసము మాత్రము చేయువాడు హంస, జ్ఞానాభ్యాసము కూడా లేకుండా పరబ్రహ్మతత్త్వము అలవడినవాడు నిష్క్రియుడు (పరమహంస)

బ్రహ్మనుండి ఆన్వీక్షకి, త్రయీ, వార్త, దండనీతి అనబడే నాలుగు న్యాయవిద్యలు పుట్టాయి. ఆన్వీక్షకి అంటే ఆత్మానాత్మ వివేకము ద్వారా మోక్షాన్ని సాధించే విద్య. త్రయీ అంటే ఋక్, యజు స్సామ వేదాలలో చెప్పబడిన కర్మానుష్ఠానం ద్వారా స్వర్గాది ఫలాలను పొందడం. వార్త అంటే జీవనోపాధి గురించి చేసే కృషివాణిజ్యాలు. దండనీతి అంటే అర్థసంపాదనవిద్య.

బ్రహ్మముఖంనుండి భూః భువః సువః మహః అనేనాలుగు వ్యాహృతులు వచ్చినవి. అతని హృదయాకాశంనుండి ఓంకారము పుట్టినది. ఆరు ఛందస్సులూ ఏభై అక్షరాలూ, సప్తస్వరాలూ, శబ్దబ్రహ్మమూ, అన్నీ అతనినుండి వచ్చినవే.

ఇంత జరిగినా అనుకొన్నంతగా ప్రజాసృష్టి జరగలేదని బ్రహ్మగుర్తించాడు. కారణం తెలియదు. దైవాన్ని ధ్యానించాడు. అతని దేహము నిలువుగా రెండు భాగాలైనది. కుడిభాగము స్వరాట్టు అయిన స్వయంభువుగానూ, ఎడమ భాగము దివ్యసుందరియైన శతరూపగానూ రూపొందాయి. వారిద్దరినీ వివాహంచేసుకొనుడని బ్రహ్మ ఆదేశించాడు. స్త్రీ పురుష సంయోగముచే సంతానోత్పత్తి విధానము, ఈ ఆదిమిధునముతోనే ప్రారంభమైనది. అంతవరకూ బ్రహ్మ శరీరమునుండే సృష్టి జరిగినది.

ఓ విదురమహాశయా! బ్రహ్మయొక్క శరీరమునుండేకాదు, అతని విభిన్నపరిస్థితుల మనోభావాలనుండి కూడ చిత్రవిచిత్రమైన సృష్టులు సంభవించాయి. చెప్తాను విను. నేను ఇదివరకే చెప్పినట్లు - భగవానుడు సర్వేశ్వరుడు, సర్వశక్తిమంతుడు. సాటిలేని ప్రభావము కలవాడు. "కాలము"లో ప్రవేశించి, పరమాత్మ తనలో నిక్షిప్తమైయున్న ప్రకృతిని, సృష్టికార్యాన్ని చేపట్టడానికి, కాలముచే ప్రేరణ కలుగజేయించాడు. సత్వరజస్తమోగుణాలతో కూడియున్న ప్రకృతినుండి ఆ గుణాలతోనే మహత్తత్త్వము బయటపడినది. రజోగుణప్రధానముగా నున్న మహత్తత్త్వం నుండి "భూతాది" అనబడే అహంకారము వచ్చినది. ఇది తన్మాత్రలనబడే సూక్ష్మ భూతాలను సృజించినది. రాజసాహంకారముతో కూడిన సాత్త్వికాహంకారము నుండి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు వెలువడ్డాయి. ఇవి అన్నీ ఉన్నప్పటికీ అవి అన్యోన్యముగ కలియకపోవడం చేత అండమును సృష్టింపలేక పోయినవి. భగవానుడు వాటిలో ప్రవేశించి, వానిని తగు పాళ్లలో కలిసేటట్లు చేశాడు. దానివలన బంగారంలాగా ప్రకాశించే ఒక అండము తయారయినది. కాని ఆ అండములో చైతన్యము లేదు. అది అంతకుముందే సృష్టింపబడిన జలములో పడియుండెను. అప్పుడు సర్వేశ్వరుడు అనిరుద్ధరూపియై ఆ అండములో ఒక వెయ్యి సంవత్సరాలు శయనించి యుండగా, ఆయననాభినుండి ఒక వెయ్యి సూర్యుల తేజస్సుతో ఒక పద్మము ఉద్భవించినది. అది సమస్త జీవరాశికీ స్థావరం. అందులో సకల జీవసమష్టి స్వరూపుడైన బ్రహ్మ ఆవిర్భవించాడు. అప్పుడతడు గతించిన కల్పములో లోకాలెలాగుండెనో, అలాగే ఆయా నామరూపాలతోనే లోకాలను సృష్టించాడు.

తమోగుణముచే అవిద్యను సృష్టించాడు. మొదట తామిస్రము, తరువాత అంధతామిస్రము, తమస్సు, మోహము, మహాతమస్సు, అనబడే ఐదు విధాల అవిద్యను సృష్టించాడు. అవిద్యాత్మకమైన సృష్టిని చేసినందుకు, తన ఛాయారూపమైన శరీరముపైన అసహ్యపడి, బ్రహ్మ దానిని విడిచిపెట్టాడు. ఆశరీరంనుండి, యక్షులు, రాక్షసులు పుట్టారు. వారు "రాత్రి"ని ఆశ్రయించి, ఆకలిగా నుండటంచేత ఆశరీరాన్నే భక్షించాలనుకొంటారు. వారిలో కొందరు దానిని రక్షిద్దాం అనుకొంటారు. "జక్షధ్వం" (భక్షించుడు) అన్నవారు యక్షులనబడ్డారు. "రక్షధ్వం" (రక్షించుడు) అన్నవారు రాక్షసులనబడ్డారు. తరువాత బ్రహ్మ తన తేజోమయమైన శరీరంనుండి ముందుభాగంనుండి దేవతలను సృష్టించాడు. అందుచేతనే దేవతలు తేజస్వరూపులైనారు. బ్రహ్మదేవుడు తన వెనుకభాగంనుండి కామగుణ ప్రధానులైన అసురులను సృజించాడు. వారు కామాతురులై తమ కామాన్ని తీర్చుమని బ్రహ్మను వెంబడించగా, అతడు శ్రీహరిని ప్రార్థించాడు. శ్రీహరి సూచనపైనతడు ఆ శరీరాన్ని విడిచాడు. దానినుండి "సంధ్య" వెలువడి, జగన్మోహనాకారముతో సంధ్యాసుందరిగా వెలసినది. ఆమెను చూచిన అసురులు ఆమెవెంటబడి బ్రహ్మను విడిచిపెట్టారు. ఈమెయే, సాయంసంధ్య. బ్రహ్మయొక్క ఛాయాశరీరంనుండి యక్షరాక్షసులకు నెలవైన రాత్రి వచ్చినది. అతని తేజోమయ శరీరం నుండి దేవతలకు నెలవైన పగలు వచ్చినది. చంచలమైన పృష్ఠభాగమునుండి వచ్చిన అసురులకు సంధ్యాకాలమే కామజనకము గనుక సంధ్య చేరినది. అసురులు సంధ్యాసుందరితో సంతుష్టులుకాగా బ్రహ్మ అప్సరసలను, గంధర్వులను ప్రాతః సంధ్యలో సృష్టించి, ఆ దేహాన్ని విడిచి పెట్టాడు. అది వెన్నెలకు, ఉషఃకాంతులకు నెలవైనది.

బ్రహ్మయొక్క సోమరితనము, బద్ధకములనుండి భూతములు పిశాచములు వచ్చినవి. అతని జృంభణము (ఆవులింత) నిద్ర, మత్తు, ఉన్మాదము లాంటి భావాలనుండి నిశాచరజీవాలు వచ్చినవి. తరువాత బ్రహ్మ అదృశ్యశరీరుడై

పితృదేవతలను, సాధ్యులను పుట్టించాడు. తరువాత సిద్ధులను, విద్యాధరులను, కిన్నరులను కింపురుషులను సృష్టించాడు. అతని కేశాలనుండి సర్పాలు పుట్టినవి.

తరువాత శ్రేష్ఠులైన మనువుల్ని సృష్టించి, వారికి తన పురుష శరీరాన్ని ఇచ్చాడు. చివరకు ఋషిదేహము ధరించి, తపస్సు, యోగము, విద్య, సమాధు లతో కూడియున్న ఋషిగణాలను సృష్టించాడు. తన ఐశ్వర్యము, వైరాగ్యము అన్నీ వారికి సంక్రమింపజేశాడు. వారిని యజ్ఞయాగాదుల్లోనూ తపస్సులలోనూ నియోగించాడు.

విదురా! భగవానునిచే ప్రసాదింపబడిన సృష్టిజ్ఞానము ఆధారముగా బ్రహ్మదేవుడు అతి అద్భుతమైన విశ్వసృష్టి రచనను కొనసాగించాడు. దానిలో ఒకింత మాత్రమే నేను నీకు సంక్షిప్తముగా చెప్పాను.

## జ్ఞానమైత్రేయము - స్వాయంభువమనువు, ప్రజోత్పత్తి

స్వాయంభువ మనువు శతరూపతో సహా బ్రహ్మదేవునికి ప్రణమిల్లి తామేమి చెయ్యాలో, ఎక్కడుండాలో నిర్దేశింపుమని ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మ అతనిని పవిత్రమైన చిత్తముతో పరమేశ్వరార్పణ బుద్ధితో నిస్స్వార్థముగ యజ్ఞాలు చేస్తూ సంతానోత్పత్తి చేస్తుండుమనిచెప్పాడు. ధర్మ మార్గాన ప్రజాపాలన చేయుమన్నాడు. కాని అతని సంతతి వారూ, విస్తరించనున్న ప్రజాసమూహాలూ ఉండడానికి స్థలంలేదే! జలగర్భంలో మునిగియున్న భూమండలాన్ని పైకి తేవడం ఎలాగ? ఏమీ దిక్కుతోచక బ్రహ్మ భగవంతుని స్మరించుకొన్నాడు. వెంటనే బ్రహ్మముక్కునుండి బొటనవ్రేలంత పరిమాణంతో యజ్ఞ వరాహమూర్తి బైటకువచ్చి, చూస్తుండగానే ఒక పెద్ద ఏనుగంతగా ఎదిగిపోయాడు. అక్కడనున్న మరీచాది మునులు, మనువు మొదలైన వారంతా ఆశ్చర్యచకితులైనారు. వరాహమూర్తి భయంకరంగా గర్జిస్తూ గంతులు వేస్తూ పర్వతమంతగా పెరిగిపోయాడు. శ్రీహరి ఈ విధంగా కరుణించినందుకు బ్రహ్మ ఆనందభరితుడయ్యాడు. జనోలోక, తపోలోక, సత్యలోకవాసులైన ఋషులు వేదమంత్రాలతో ఆదివ్యమూర్తిని స్తుతించారు. వరాహమూర్తి సముద్రంలో ప్రవేశించి, బీభత్సంగా నీటిని చెల్లాచెదరుచేసి, పాతాళంలోనికి ప్రవేశించాడు.

అప్పుడు సముద్రంలోదాగియున్న హిరణ్యాక్షుడనే ఒక రాక్షసుడు ఆగ్రహంతో ఆవరాహమూర్తి నెదుర్కొని, గదను భయంకరంగా తిప్పుతూ మీదపడబోయాడు. ఆ ఘోరపోరాటంలో రాక్షసుడు హతమైనాడు. అప్పుడు ఆ అవతారమూర్తి భూమిని తన కోరచివరను నిలిపి సముద్రంనుండిపైకి తీసుకొనివచ్చాడు. బ్రహ్మాది దేవతలందరూ అమితానందభరితులై ఆ మహామూర్తిని సంస్తుతించారు.

"స్వామీ! నీవు యజ్ఞస్వరూపుడవు. యజ్ఞకర్తవు. యజ్ఞభోక్తవు. యజ్ఞఫలప్రదాతవు. యజ్ఞరక్షకుడవు. సమస్తమూనీవే, ఓదేవా! ఈ విశ్వాన్ని సృష్టించేదీ, రక్షించేదీ, లయింపజేసేదీ నీవేకదా! సమస్తమూ నీవేఅయియున్న నీ లీలలను వర్ణించడానికి మాకు సాధ్యపడుతుందా ప్రభూ!" అని ప్రార్థించగా శ్రీహరి సంతుష్టుడై భూమండలాన్ని సముద్రం మీద సుస్థిరంగా నిలిపి అంతర్ధానమైనాడు.

## జ్ఞానమైత్రేయము - హిరణ్యాక్షహిరణ్యకశిపులు

స్వాయంభువ మనువు, శతరూపలకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు పుత్రులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు పుత్రికలు కలిగారు. ఆకూతిని రుచిప్రజాపతికి, దేవహూతిని కర్దమ ప్రజాపతికి, ప్రసూతిని దక్షప్రజాపతికి ఇచ్చి వివాహం చేశారు.

దక్షప్రజాపతి కుమార్తెలలో దితి ఒకతె. ఈమె కశ్యపఋషియొక్క పదముగ్గురు భార్యలలో నొక్కతె. ఒకనాడు కశ్యపుడు సాయంసంధ్యాగ్ని కర్మలను ముగించుకొని ధ్యానమగ్నుడై యున్నప్పుడు, దితి అతనిని సమీపించి కామాతురయై, సంతానకాంక్షతో తత్క్షణమే సంభోగసుఖాన్ని కోరినది. అది అసుర సంధ్య అనీ, ఆవేళప్పుడు భూతగణాలతో త్రినేత్రుడు సంచరిచేవేళగనుక ఒక్క ముహూర్తకాలం ఆగుమనీ, ఎంతనచ్చజెప్పినా వినకుండా భర్తను నిర్బంధించి, తన కోరికను

తీర్చుకొన్నది. తరువాత తన తొందరపాటునకు తానే సిగ్గుపడి చింతిస్తున్న దితితో కశ్యపుడు ఇలాగ చెప్పాడు: "సుందరీ! నీవు చేసిన ఈ విపరీతపు పనివలన నీగర్భంలో ఇద్దరు ఘోరరాక్షసులు పుట్టి, లోకకంటకులై శ్రీహరిచేత చంపబడుతారు. కాని, నీ మనుమడు మాత్రము పరమ భాగవతుడై దిగంతములలో శాశ్వతకీర్తిని పొందుతాడు." ఇది విని దితి ఖిన్నురాలయినది. అయినా తన పుత్రులు శ్రీహరిచేత చంపబడుతారనీ, మనుమడు పరమభాగవతుడవుతాడనీ ఊరటజెంది సంతసించినది.

తనకు పుట్టబోయే పుత్రులవలన దేవతలకు బాధలు కలుగుతాయని భయపడిన దితి తన గర్భములో పెరుగుతున్న కశ్యప బీజాన్ని ఒక వంద సంవత్సరాలు మరుగుపరచి ఉంచినది. ఆమె గర్భమునుండి ఒక దివ్యతేజస్సు కనబడుతుండేది. దాని కాంతివలన సూర్యచంద్రులు కూడ తేజోహీనులుగా కనిపించేవారు. ముల్లోకాలూ తల్లడిల్లినవి. ఏమి ఉపద్రవం జరుగుతుందోనని అందరూ భయపడేవారు. ఆ ఉపద్రవంనుండి కాపాడుమని దేవతలందరూ బ్రహ్మను ప్రార్థించారు. అప్పుడు బ్రహ్మ వారితో నిలాగ చెప్పాడు:-

"కొద్దికాలంక్రితం నాపుత్రులైన సనకసనందాదులు శ్రీమహావిష్ణువును సందర్శించాలని, తమ యోగశక్తిచే వైకుంఠధామాన్ని ప్రవేశించి, ఆరు మహాద్వారాలను దాటి, ఏడవ ద్వారంవద్ద ఇద్దరు ద్వారపాలకులను చూచారు. వారు సాధుసత్తములైన ఆ సనకాదిమునివరేణ్యులను లోనికిపోనీకుండా అడ్డగించి, పరుషవాక్కులతో నవమానించడంచేత, ఆ మహామునులకు కోపంవచ్చినది. ద్వారం వద్దజరుగుతున్న కలకలాన్ని దేవలోక వాసులంతా వచ్చి చూస్తున్నారు. కుమారమునులీవిధంగా తలపోశారు: "ఈవైకుంఠపురములోనందరూ నవమానులే, విష్ణుసములే, ఉచ్చనీచభేదభావాలుండరాదు. రాగద్వేషాలుండవు. మరి ఈ ద్వారపాలురెందుకిలాగ ప్రవర్తించారు? మేము వైకుంఠుని దర్శించడానికి అనర్హులం కాముకదా! వీరు వైకుంఠంలోనుండదగని విధంగా ప్రవర్తించారు గనుక ఇక్కడ ఉండనర్హులుకారు" అని భావించి "మీయొక్క దుర్వర్తనముచేత, కామ, క్రోధ, లోభ గుణాలు తాండవించే లోకంలో జన్మించెదరుగాక!" అని ఆ జయవిజయులనబడే విష్ణుద్వారపాలకులను శపించారు. జయవిజయులు తమ తప్పిదాన్ని తెలుసుకొని పశ్చాత్తప్తులై, తమకు ఆ శాపము తగియున్నదని స్వీకరించి, ఐదేండ్ల బాలురవలె కనిపిస్తున్న ఆ మహామునుల పాదాలపైబడి, క్షమింపుడని వేడుకొన్నారు. తాము ఏజన్మలోనున్నా, శ్రీహరి స్మరణకు మాత్రము దూరము కారాదని కోరుకొన్నారు.

ద్వారంవద్ద జరుగుతున్న కలకలం గురించి తెలుసుకొని, నారాయణుడే స్వయంగా లక్ష్మీసమేతుడై అక్కడికి విచ్చేశాడు. ఆదివ్యసుందరరూపాన్ని చూచి మునిపుంగవుల మేనులు పులకించగా వారు స్వామిని అనేక విధాలస్తుతించి, తమ జీవితాలు ధన్యమైనట్లు గ్రహించినవారై బ్రహ్మానందభరితులయ్యారు. తాము తొందరపడి ద్వారపాలకులను శపించిన వైనం విన్నవించుకొన్నారు. శ్రీహరి సంతసించి, సద్బ్రాహ్మణుల నవమానించినందుకు వారిద్దరికీ తగిన శిక్షయే లభించినదన్నాడు. సేవకులు చేసిన తప్పిదము యజమానిదే అవుతుంది గనుక తానుకూడా నిందార్హుడనే అని పలికి, శ్రీమహావిష్ణువు మన్నించుడని విప్రులను కోరాడు. జయవిజయులతోనిలాగన్నాడు. "మీరు అసురులైపుట్టి నాయందు వైరభావము పెంచుకొని, సదా నన్నే స్మరిస్తూ మూడు జన్మల అనంతరం మళ్లీ నావద్దకు చేరగలరు. లోగడ మీరు లక్ష్మీదేవిని నామందిరంలో ప్రవేశించకుండా అడ్డుతగిలినందుకు ఆమెవలన మీరు ఈ శాపాన్ని పొందారు. ఇప్పుడు ఈమునుల వాక్యంచే ఆశాపం ఫలిస్తుంది." అని చెప్పి నిష్క్రమించాడు. జయవిజయులు వైకుంఠమునుండి పడిపోయి, దితి గర్భంలో ప్రవేశించారు. వారితో వచ్చిన వైష్ణవతేజమే దితి గర్భమునుండి ప్రకాశిస్తుంది. ఇది అంతా ఆ శ్రీహరియొక్క లీలావిలాసమే. ఎవ్వరికీ అర్థముకాదు. ఆ పరమేశ్వరుడే అందరినీ రక్షిస్తాడు. మీరంతా నిశ్చింతగా మరలివెళ్లండి" అని బ్రహ్మదేవుడు దేవతలను పంపివేశాడు.

దితి రాబోయే అనర్థాలనుగురించి చింతిస్తూ ఖిన్నురాలయినది. తన పుత్రులు లోకకంటకులవుతారనే భయంతో వందసంవత్సరాలు గర్భిణిగా గడిపి, చివరకు ఇద్దరు మగబిడ్డల్ని కన్నది. ఆసమయంలో భూమికంపించినది. పర్వతాలు అదిరినవి. సముద్రాలు అల్లకల్లోలమైనవి. పెనుగాలులు వీచాయి. నెత్తుటి వర్షాలు కురిశాయి. అనేకమైన ఉత్పాతాలు సంభవించాయి. కశ్యపుడు వారికి హిరణ్యాక్ష, హిరణ్యకశిపులని పేర్లుపెట్టాడు. ఇద్దరూ సాటిలేని తేజస్సుతో పెరిగి బల పరాక్రమవంతులై తపస్సులుచేసి బ్రహ్మవలన వరాలను పొందినవారై దండయాత్రలు ప్రారంభించారు.

హిరణ్యాకశిపుడు ముల్లోకాల్లోని పాలకులను జయించి, తనకు మృత్యుభయంలేదని, మదాంధుడై విరాజిల్లుతున్నాడు. హిరణ్యాక్షుడు తనకు ఎదురునిలిచి పోరగల వీరుడెక్కడున్నాడని వెదుకుతూ భూలోకమంతా గాలించి చూచాడు. అట్టివారు ఎవ్వరూ కనబడకపోవుటచే స్వర్గలోకంలో ప్రవేశించి, దేవతలపై దండెత్తడానికి సిద్ధపడేసరికి ఇంద్రునితో సహా దేవతలంతా స్వర్గలోకాన్నివిడిచి పారిపోయారు. "పిరికిపందలు" అని, దేవతలను తిట్టుకుంటూ, తనను ఎదిరించేవీరుడు దేవలోకంలో కూడా లేడే? అని నిరాశజెంది, గర్వాతిశయంతో ఆ హిరణ్యాక్షుడు సముద్రంలో నెవ్వరైనా ఉండరా అనుకొంటూ సముద్రంలో ప్రవేశించాడు. అతని తేజస్సును చూచి భరించలేని వరుణుని సేనలు సాగరం అడుగునకు పారిపోయినవి. హిరణ్యాక్షుడు వరుణుని రాజధానియైన విభావరీ నగరానికి వెళ్లి, కొలువు తీర్చియున్న పాతాళలోకపు రాజైన వరుణుని కించపరచే స్వరంతో ఇలా అన్నాడు:

" ఓయీ వరుణుడా! నీవు ప్రపంచంలో నొక గొప్ప బలశాలివట కదా! వీరాధివీరుడవట! ఏదీ, ఇలా వచ్చి, నన్నెదుర్కో, చూద్దాం. నీ బండారం బయటపెట్టి నిన్ను నీళ్లపాలు చేస్తాను, ఇటురా!" అని సవాలుచేశాడు. వరుణుడు పరిస్థితిని గ్రహించినవాడై ఆగ్రహాన్ని దిగమింగి, ఇలాగ బదులు చెప్పాడు:

"ఓ దానవవీరుడా! ఎవ్వరితోనూ యుద్ధము చెయ్యరాదనే ఒక నియమంతోనున్నాను నేను. నిన్ను ఓడించగల ఏకైకవీరుడు వైకుంఠంలో నుంటాడు. అక్కడికి వెళ్లి, నీ బలాబలాలు తేల్చుకొనుము. వైకుంఠవాసుడైన విష్ణువు నీలాంటి ఎందరో రాక్షసుల్ని హతమార్చినాడు. నీవుకూడ వాళ్లతో చేరాలని ఉవ్విళ్లూరుతున్నట్లున్నావు. ఆ శ్రీహరి అందరి కోర్కెలనూ తీర్చేదయామయుడు. నీకోర్కెనుకూడా తీర్చగలడు. నీవు అక్కడికే వెళ్లు" అని, దైత్యుని పంపించివేశాడు.

మహాబలమదాంధుడై కదనకండూతితో విష్ణువును వెదుక్కొంటూ వైకుంఠపురంవైపు వెళ్తున్న ఆ దానవ వీరునకు, దారిలో నారదముని కనిపించి, శ్రీహరి ప్రస్తుతం, యజ్ఞవరాహరూపంలో రసాతలంనుండి భూమిని ఉద్ధరించడానికి వెళ్లియున్నాడనీ, అక్కడనే ఆయన్ను కలుసుకొనవచ్చుననీ చెప్పాడు.

రాక్షసుడు ఉగ్రరూపంతో పట్టరాని ఆగ్రహంతో పర్వతంలాగా నడుచుకొంటూ సముద్రంలోనికి ప్రవేశించి, పాతాళలోకం చేరాడు. అక్కడ, భూమండలాన్ని తన కొమ్ముతో నెత్తడానికి సిద్ధముగానున్న ఆ వరాహమూర్తిని చూచి, - ఈ పందియా దేవతలయొక్క మహావిష్ణువు? - అని వెటకారంగా అరిచాడు. శ్రీహరి తన వీక్షణ మాత్రంచేత ఆ దానవుని దేహకాంతినంతా హరించివేశాడు. భూమిమీద సంచరించే ఈ పంది సముద్రగర్భంలో నీ విధంగా వీరవిహారం ఎలాగ చెయ్యగలుగుతుంది? అని రాక్షసుడు ఆశ్చర్యపోయాడు. రాక్షసులకు చెందిన రసాతలంనుండి భూమండలాన్ని దొంగిలించడానికి ప్రయత్నించే ఈ వరాహాన్ని అంతం చెయ్యాలని, గదాధారియై ముందుకు వస్తున్న రాక్షసుని చూచి, ఆ యజ్ఞవరాహమూర్తి భూమండలాన్ని తన కొమ్ముతో నెత్తుకొని, సముద్రపు ఉపరితలం వైపుకి జోరుగా వెళ్లిపోతున్నాడు. హిరణ్యాక్షుడు అతనిని వెంబడిస్తూ "ఓయీ! వరాహమా! నిన్ను ఎన్ని విధాల తిట్టినా నీకు సిగ్గులేదు. రోషంరాదు. మాయోపాయంతో భూమిని మాలోకంనుండి ఎత్తుకొని పోతున్నావు. పిరికిపందా! శక్తి ఉంటే, నాతో యుద్ధం చేయుము. ఇలాగ పారిపోకు". అని అరుస్తున్నా వినిపించుకొనకుండా వెళ్లిపోయి, శ్రీహరి భూమిని సముద్రముపైనిలిపి, తన శక్తిని భూమిలో ప్రవేశపెట్టాడు. ఉద్ధరింపబడిన భూదేవిని చూచి, దేవతలు ఆనందంతో పుష్పవృష్టి కురిపించారు.

మహాక్రోధముతో ముందుకువస్తున్న రాక్షసుని శ్రీహరి వరాహరూపంతోనే ఎదుర్కొన్నాడు. ఇద్దరి మధ్యా ఘోరమైన గదాయుద్ధం జరిగినది. బ్రహ్మాది దేవతలు ఈ భీకర సమరాన్ని చూస్తున్నారు. బ్రహ్మ శ్రీహరిని స్తుతించి, దుష్టరాక్షసుని చంపడంలో ఏమాత్రమూ జాగుచెయ్యవద్దని ప్రార్థించాడు. సూర్యాస్తమయం అయితే అసురునిశక్తి పెరిగిపోతుందని జ్ఞాపకంచేశాడు. బ్రహ్మసలహాను చిరునవ్వుతో స్వీకరించి, శ్రీహరి తన గదాయుద్ధాన్ని తీవ్రతరం చేశాడు. ఒకసారి వరాహంచేతినుండి గద జారిపోతే దానవుడు పోరాటాన్ని నిలిపాడు. రాక్షసుని శౌర్యధైర్యాలకూ, రణనీతికీ శ్రీహరి సంతసించాడు. బ్రహ్మచేసిన హెచ్చరికను గుర్తుచేసుకొని, సుదర్శన చక్రాన్ని రప్పించుకొన్నాడు. చక్రాన్ని చూచి, రాక్షసుడు

చకితుడయ్యీ చలించకుండా పోరాడినాడు. తన ఆయుధాలన్నీ ఎందుకూ పనికిరాకుండా పోవటాన్ని గుర్తించాడు. ముష్టియుద్ధానికి దిగాడు. రాక్షసమాయలను ప్రయోగించాడు. తన బలమంతా ప్రయోగించి వరాహంయొక్క వక్షస్థలాన్ని నొక్కనారంభించగా, వరాహం వానిని ఒక్క చెంపపెట్టుతో కూల్చివేసినది. సుదర్శనచక్రము రాక్షసమాయలను, ఆయుధాలనూ ఖండించివేసినది. వరాహముకొట్టిన చెంపదెబ్బతో నేలకూలిన రాక్షసుడు విలవిల కొట్టుకొంటూ వరాహరూపములోనున్న శ్రీహరియొక్క కరుణాపూరితములైన కన్నులనే చూస్తూ ప్రాణం విడిచాడు.

దేవతలు హర్షధ్వానాలు చేసి పరమేశ్వరుని స్తుతించారు. అవతార కార్యం ముగియగానే ఆది వరాహమూర్తి అందరినీ ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

## కర్దమప్రజాపతి, దేవహూతి

**మైత్రేయముని విదురునితో చెపుతున్నాడు :**

కృతయుగంలో బ్రహ్మదేవుడు తన ఛాయనుండి ఉద్భవించిన కర్దమమునితో ప్రజోత్పత్తి చేయుమని ఆదేశించాడు. కర్దముడు సరస్వతీ నదీతీరాన కొన్నివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒకనాడు శ్రీమన్నారాయణుడు కరుణించి ఆకాశంలో ప్రత్యక్షముకాగా ఆనందాతిశయంతో మైమరచిన కర్దముడు ఇలాగ వేడుకొన్నాడు:

"మాధవా, ముకుందా! నీ దివ్యరూపాన్ని గాంచిన నా జన్మ ధన్యమైనది. బ్రహ్మదేవుని ఆజ్ఞను నెరవేర్చడానికి, నాకు అనుకూలవతియైన భార్య కావలసి వచ్చింది. అనుగ్రహింపుము." అనగా, ఆ మహావిష్ణువు ఇలాగ చెప్పాడు:

"ఓ బ్రహ్మనిష్ఠుడా! నీ అభీష్టము నెరవేరగలదు. బ్రహ్మమానసపుత్రుడైన స్వాయంభువమనువు ఈ భూమండలమంతా పాలిస్తున్నాడు. అతడు తన భార్య అయిన శతరూపను, పుత్రిక అయిన దేవహూతిని తోడ్కొని త్వరలోనే నీవద్దకు వస్తాడు. నీకు దేవహూతితో వివాహమవుతుంది. మీకు అత్యంతసౌందర్యవతులైన తొమ్మండుగురు పుత్రికలు జన్మిస్తారు. వారికి తొమ్మండుగురు ఋషులతో వివాహమవుతుంది. ఆ దంపతులకు ఉత్తములైన పుత్రులు జన్మిస్తారు. నేను నా కళాంశతో దేవహూతి గర్భాన నీకు పుత్రుడనై జన్మించి, నీకు తత్త్వ విద్యను బోధిస్తాను" అని చెప్పి అంతర్ధానమైనాడు.

శ్రీహరిచెప్పినట్లే, స్వాయంభువ మనువు, తన భార్యా పుత్రికలతోగూడి తన బిడ్డకు సరియైన వరుని గురించి లోకాలన్నీ వెదికి వెదికి, చివరకు బిందుసరోవర తీర్థాననున్న కర్దమాశ్రమానికి వచ్చాడు. శ్రీహరి సంతుష్టాంతరంగుడై కర్దముని కరుణార్ద్ర దృష్టితో వీక్షించినప్పుడు విష్ణుదేవుని కన్నులనుండి రాలిన ఆనంద బాష్ప బిందువులే సరస్వతీ నదీ దాపున బిందు సరోవరంగా వెలసినవి. బ్రహ్మచర్యవ్రతంతోనూ, తపశ్చర్యతోనూ, బ్రహ్మతేజస్సుతోనూ ప్రకాశిస్తున్న కర్దమమునీంద్రుని చూచి, భక్తి సంభ్రమాలతో స్వాయంభువమనువు అతని పాదాలకు నమస్కరించాడు. అతిథి సత్కారాలు ముగిసిన తరువాత, స్వాయంభువ మనువు తాను వచ్చినపనిని ఈ విధంగా విన్నవించుకొన్నాడు:-

"ఓ మునిచంద్రమా! సాక్షాత్తూ శ్రీమన్నారాయణుని దర్శనభాగ్యమును పొందిన నీయొక్క దర్శనముచే మా జన్మలు ధన్యమైనవి. బ్రహ్మదేవుడు తన ముఖతః వెలువడిన వేదాలను భూమిపై వెలయింపజేయడానికి తన ముఖమునుండి బ్రహ్మవేత్తలైన మీవంటి ఋషులను సృష్టించాడు. భూమిని, ప్రజలను దుండగుల బారినుండి రక్షించడానికి, దేశాన్ని పాలించడానికి, మాలాంటి రాజులను తన భుజాలనుండి సృష్టించాడు. ఈమె నా భార్య శతరూప. ఈమె నాపుత్రిక దేవహూతి. లోకములో ననేకులైన సుందరపురుషులున్నా వారిలో నెవ్వరినీ ఇష్టపడక, చింతాక్రాంతయైయున్న తరుణంలో నారదమహర్షివలన నీయొక్క రూపగుణవిశేషాలను గురించి తెలుసుకొన్నదై, నిన్నే వివాహమాడదలచినది. ఈమెను స్వీకరించి, సకల శుభాలనూ పొందుమని కోరుతున్నాను." అని చెప్పిన స్వాయంభువ మనువుతో కర్దమముని ఇలా అన్నాడు: "ఓ పుణ్యాత్ముడా! ఇతరు లెందరినో కాదని, నన్ను వరించి వచ్చిన ఈ త్రిలోకసుందరి, మహాలక్ష్మి సమానురాలు, ఇంతటి రూప గుణ శీల వైభవోపేతను, నాకు అన్ని విధాలా అనుకూలవతి అయిన నీ పుత్రికను నేనెలాగ కాదనగలను? సంతోషంగా స్వీకరిస్తాను. భగవానుని అభిమతం కూడ ఇదే. అయితే ఒక్క నియమం మాత్రము ఉన్నది. విను:

"శ్రీహరి ఆదేశం ప్రకారము, ఈ ఉత్తమ గుణసంపన్నురాలికి సంతానం కలిగేవరకే నేను గృహస్థాశ్రమంలోనుంటాను తరువాత యోగమార్గమవలంబించి, సన్న్యాసం స్వీకరిస్తాను." అని చెప్పగా స్వాయంభువ మనువు తన భార్యా పుత్రికల అభిప్రాయమును తెలుసుకొని, వారి సమ్మతితో వివాహం జరిపించి, పుత్రికనుండియు, అల్లునినుండియు వీడ్కోలు అందుకొని, భార్యతోగూడి తన రాజధాని అయిన (బ్రహ్మావర్తములోని) బర్హిష్మతీ నగరానికి తరలి పోయాడు.

స్వాయంభువ మనువు తన శేషజీవితాన్ని, శ్రీమన్నారాయణుని దివ్యమంగళ చరిత్రలనే శ్రవణంచేస్తూ, ఆయన రూపాన్నే ధ్యానిస్తూ గడిపాడు. అతడు 71 మహాయుగాల కాలం పరిపాలించాడు.

మహాసాధ్వి అయిన దేవహూతి కర్దమఋషికి అనేక విధాలుగా సేవలు చేస్తుండేది. పతియే ప్రత్యక్షదైవమనీ, అతడే స్త్రీకి సర్వస్వమనీ నమ్మిన పతివ్రత ఆమె. భర్త మనోగతాన్ని తెలుసుకొని, కామము, క్రోధము, కపటము, లోభము, మోహము లాంటి చెడుగుణాలను దరిచేరనీయక, తన సౌఖ్యాలను, శరీరసౌందర్యపోషణలను కూడ అలక్ష్యము చేస్తూ, అత్యంత భక్తి శ్రద్ధలతోను, ప్రేమానురాగాలతోను, పతిసేవా శుశ్రూషలు చేస్తుండేది. తానొక లోకాధీశుని పుత్రికననిగాని, అతిలోక సౌందర్యవతిననిగాని తలంపైనా లేకుండా మెలగుతుండేది. భార్యచేస్తున్న నిరంతర సేవాశుశ్రూషలకు మిక్కిలి సంతసించినవాడైన కర్దముడు, కరుణరసం పొంగిపొరలగా, ఒకనాడామెతో ప్రేమపూర్వకంగా ఇలాగన్నాడు. "దేవీ! అకుంఠిత ధర్మమార్గాచరణం ద్వారా మహిమలూ, భగవత్కటాక్షమూ లభిస్తాయి. ఆ విధంగా నాకు సమకూడిన సమస్తశుభాలూ, సంపదలూ, నన్ను సేవిస్తున్న నీకు కూడ సంప్రాప్తిస్తాయి. నేను నీకు దివ్యదృష్టిని కూడా ఇస్తున్నాను. దానివలన సృష్టిలోని సర్వమూ నీకు కానవస్తుంది." అని- సంతానాన్ని కాంక్షిస్తుండే భార్యయొక్క మనోగతాన్ని గ్రహించినవాడైన ఆమునీంద్రుడు తన యోగశక్తిచే ఒక దివ్య విమానాన్ని సృష్టించాడు. అది నిజానికి విమానంకాదు. ఉద్యానవనాలతో కూడియున్న ఒక మహాసౌధము. దానిలో అనేకమైన గదులూ, అంతస్తులూ ఉన్నవి. అందలి గోడలు, తలుపులు, మంచాలు, బంగారు రేకులతోను, మణిమాణిక్యాలతోను, పొదుగబడియున్నవి. పట్టుపరుపులతో, వస్త్రాలతో నలంకరింపబడియున్నవి. పుష్పలతలతోను, సుగంధ ద్రవ్యాలతోను గదులు పరిమళాలను వెదజల్లుతున్నవి. ఉద్యానవనంలోగల నానావిధ పుష్పఫల వృక్షాలు, పక్షులతో విలసిల్లుచున్నవి. ఇంద్రభోగాలన్నీ అనుభవించడానికి అనువుగా ఆ విమాన సౌధమునందు ఏర్పాట్లు చేయబడియున్నవి. దేవహూతికి ఆ అద్భుత విమానాన్ని చూపించి, బిందుసరోవరంలో స్నానము చేసి రమ్మన్నాడు కర్దముడు. ఆమె ఆ బిందు సరోవరంలో ప్రవేశించగానే, ఆ సరస్వతీ నదీ ప్రవాహంనుంచి, అప్సరసలవంటి నవయౌవనవతులు పెక్కుమంది వచ్చి ఆమెకు సేవలు చెయ్యనారంభించారు. తలంటి, నలుగుపెట్టి, బంగారుబిందెలతో స్నానము చేయించి, చందన, కర్పూర, సుగంధద్రవ్యాలు పూసి, అనేకరకాల నగలూ అలంకరణలతో సింగారించి, పట్టు వస్త్రాలను కట్టించి, పుష్పాలంకరణలు చేసినారు. హారతులిచ్చి, విమాన సౌధములో రత్నపీఠముపైన కూర్చుండబెట్టి, ఒక అద్దాన్ని చేతికిచ్చి, చూచుకొనుమన్నారు. చాలారోజుల తరువాత తన సౌందర్యాన్ని చూచుకొని ఆశ్చర్యచకిత అయిన ఆమె తన భర్తను తన ప్రక్కనే ఉన్నట్లు ఊహించుకొనేసరికి కర్దముడు అనేకమంది పరిచారికలతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఆయనకు తన భార్య సౌందర్యాన్ని మొట్టమొదటిసారిగా చూస్తున్నట్లనిపించించినది. అతడు ఆనందంతో ఉప్పొంగిపోయాడు. ఇదంతా సత్యమా? స్వప్నమా? అని దేవహూతి ఆనంద సంభ్రమాలతో చూస్తుండగా కర్దముడామె చెంతజేరి, దాసీజనాలతో సహా విమానయానం ప్రారంభించాడు.

వాయువేగంతో ఈ విమానంలో పయనిస్తూ వారు మేరుపర్వతాన్ని, నందనవనాన్నీ, మానస సరోవరాన్ని కుబేరుని ఉద్యానం అయిన చైత్రరథాన్నీ, అట్లే అనేకమైన వినోదస్థలాలను సందర్శించి, తిరిగితమ ఆశ్రమం చేరుకొన్నారు. అనేకమైన అభీష్టసుఖభోగాలననుభవిస్తూ, పరస్పర ప్రేమానురాగాలతో, కేళీ విలాసాల్లో సంవత్సరాలను క్షణాలుగా గడిపివేశారు. వారికి ఒకేసారి తొమ్మండుగురు పుత్రికలు కలిగారు. అనుకొన్న ప్రకారం కర్దముడు సన్న్యసించదలచాడు. భర్త ఆలోచనను గ్రహించిన దేవహూతి పుత్రికలకు వివాహమయ్యేంతవరకూ, తనకు వేదాంతోపదేశము చేసే పుత్రుడు జన్మించేవరకూ, సన్న్యసించవద్దని పతిని వేడుకొన్నది. శ్రీ మహావిష్ణువు చెప్పినమాటను గుర్తుతెచ్చుకొని, కర్దముడు పుత్రోదయంవరకూ ఉండదలచుకొన్నాడు. ఆమెతో ఇలాగ చెప్పాడు:-

"ఓ పుణ్యశీలా! ఏవిధమైన అన్యచింతలను నీ మనసులో చేరనివ్వకుండా, ఆ శ్రీహరినే ధ్యానిస్తూ ఉండు. కొద్ది రోజుల్లోనే ఆయన నీగర్భంలో ప్రవేశించి, పుత్రుడై జన్మించి, నిన్ను, నన్ను, లోకులను తరింపజేస్తాడు" అని చెప్పగా, ఆమె అమితానంద భరితురాలు అయినది.

భగవంతుడు దేవహూతి గర్భస్థుడై ఆవిర్భవించాడు. మరీచాది ఋషులతో బ్రహ్మ విచ్చేసి, ఇలా అన్నాడు:

"ధన్యచరితులైన కర్దమదంపతులారా! మీరు కృతార్థులు. నిజమైన భక్తిశ్రద్ధలతో, నిష్కపటమైన అంతరంగము (మనస్సు)తో మీరు విష్ణుదేవుని సేవించారు. ఆపరాత్పరుడు మిమ్మల్ని అనుగ్రహించి, తానే మీకు పుత్రుడై పుట్టాడు. మీరు పుణ్యమూర్తులు. ఓమునీంద్రా! నీ పుత్రికారత్నాలను పుణ్యశ్లోకులైన మునిశ్రేష్ఠులకిచ్చి వివాహంచెయ్యండి. అమ్మా దేవహూతీ! ఇప్పుడు నీకు పుట్టిన బిడ్డడు సామాన్యుడు కాడు. జ్ఞాన విజ్ఞాన యోగాలచే కర్మజీవుల్ని ఉద్ధరించడానికి అవతరించిన భగవానుడు. ఈయన నీకు తత్త్వబోధచేస్తాడు. నీ సంశయాలన్నీ తీరిపోతాయి. ఈయన సిద్ధ పురుషులచే సేవింప బడుతూ, మహనీయమైన సాంఖ్యయోగాన్ని స్థాపించి, కపిలుడనే పేరుతో ఈ ముల్లోకాల్లోనూ ప్రసిద్ధుడవుతాడు" అని చెప్పి, నిష్క్రమించాడు.

ఒకనాడు కర్దముడు పుత్రుడైన కపిల భగవానుని సమీపించి, నమస్కరించి ఇలా అన్నాడు: "ఓ మహాత్మా! నీవు జ్ఞానబోధ చేయడానికి అవతరించిన భగవానుడవని నాకు తెలుసు. నీవు అంతర్యామివి. చిచ్ఛక్తియుక్తుడవు. సర్వజ్ఞుడవు. నీవు అనుమతిస్తే ఉత్తమవ్రతయోగ ధ్యానాది సాధనలలో నిమగ్నుడనై, నీ పాదాలను నాహృదయంలో పదిలపరచుకొని సంచరించదలచుకొన్నాను" అని విన్నవించుకొన్న కర్దమునితో కపిల భగవానుడిలా అన్నాడు: "మునీంద్రా! నీకోరిక ఉత్తమమైనదే. భక్తి పూర్వకంగా నీవు నా పాదాలను ధ్యానించు. బుద్ధిని నాయందు లగ్నముచేస్తూ నిష్ఠతో యోగమార్గాన్ని అనుసరించు. సమస్త కర్మలనూ నాకు అర్పించు. మోహానికి లోబడకు. మనోవికారాలు త్యజించి మోక్షమును గురించి భక్తి శ్రద్ధలతో భజించు. నీవు మోక్షాన్ని పొందగలవు." అని చెప్పిన కపిలునకు కర్దముడు భక్తితో నమస్కరించి, ప్రదక్షిణములు చేసి నిష్క్రమించాడు.

కర్దమ మునీంద్రుడు అరణ్యానికి పోయి, మౌనమువహించి, నిలకడలేక సంచరిస్తూ, ఆపరమాత్మునే చిత్తమందు నిలుపుకొని, నేను, నాది, అనే ధ్యాసను వీడి, దయార్ద్రహృదయుడై, సర్వమూ విష్ణుమయముగా చూస్తూ, భాగవతులు పొందే పరమపదాన్ని పొందినాడు.

## జ్ఞానమైత్రేయము - కపిలబోధ - భక్తి

కర్దముడు సన్యసించి వెళ్లిపోయిన తరువాత దేవహూతి తనకు బ్రహ్మచెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకొని, పుత్రుడైన కపిలునితోఇలా అన్నది:

"నాయనా! నీవు నాకుమారుడవే అయినప్పటికీ, మానవుల అజ్ఞానాంధకారాన్ని బాపడానికి ఉదయించిన జ్ఞాన భాస్కరుడైన నారాయణుడవని నాకుతెలుసు. జీవితమంతా ఇంద్రియాలను తృప్తిపరచాలనీ, నాది, నేను, అనే భావాల్నే పెంచుకోవాలనీ, అజ్ఞానంచేత భావిస్తుండే నావంటివారు వ్యామోహంనుండి బయటపడే మార్గాన్ని జూపుమయ్యా!" అని వేడుకొన్న తల్లితో కపిలుడిలాగ చెప్పాడు.

"అమ్మా! సూక్ష్మంగా చెప్పాలంటే - బంధాన్ని కలిగించడానికిగాని, మోక్షాన్ని పొందటానికిగాని మనస్సే మూలకారణము. అది సత్త్వరజస్తమోగుణాలతో చేరి, ఇంద్రియవిషయాలయందు చరించితే బంధమేర్పడుతుంది. ఆ మనస్సే ఈశ్వరునియందు లగ్నమై, ఆయనతో సంగమేర్పరచుకొంటే మోక్షగామి అవుతుంది. "నేను, నాది" అనిపించే అహంకారమమకారరూపమైన అభిమానము వల్ల, కామము, క్రోధము, లోభము మొదలైన దోషసమూహాలు ఆవిర్భవిస్తాయి. చిత్తము వానికిలోనుగాకుండా వానినుండి విడివడినప్పుడు పరిశుద్ధమవుతుంది. అప్పుడు, సుఖమూ, దుఃఖమూ అనేవి ఉండక చిత్తములో జ్ఞానవైరాగ్యాలుదయిస్తాయి. శరీరముకంటే భిన్నమైనది ఆత్మ అని తెలుసుకోవడం జ్ఞానము.

ఇంద్రియసుఖాలను అనుభవించాలనే కోరికలేకపోవడం, నాది, నావారు, అనే మమకారం లేక పోవడం వైరాగ్యము. జ్ఞానవైరాగ్యాలు కలిగితే భగవానునియందు భక్తి ఉదయిస్తుంది. ఆత్మ స్వరూపము గోచరిస్తుంది.

పరమేశ్వరుడు ప్రకృతికి పరుడు, స్వయంప్రకాశుడు, సూక్ష్మస్వరూపుడు, అపరిచ్ఛిన్నుడు, ఉదాసీనుడు. అట్టి పరమాత్మను భక్తి జ్ఞాన వైరాగ్యములతో కూడిన చిత్తముతో దర్శించిన యోగులు ఆ సర్వాంతర్యామికి సర్వమూ సమర్పింపజేసే భక్తి మార్గమే మోక్షప్రాప్తికి ఉత్తమమైన మార్గమని అంటారు.

మనస్సు, ఇంద్రియసుఖాలతో సంగమేర్పరచుకుంటే బంధకారణమవుతుంది. ఆ సంగమే సద్వస్తువునందు ఏర్పడితే అంతఃకరణ సంయమం కలిగి తెరచుకొన్న మోక్షకవాటం అవుతుంది.

భాగవతోత్తములు, సహనశీలురై, సర్వప్రాణులకూ హితులై, కరుణార్ద్రహృదయులై, కర్మఫలాలను త్యజించిన వారై, స్వ, పర భేద భావములేనివారై, పరమేశ్వరుడనైన నన్నాశ్రయించిన వారై, నా గుణగణాలను స్మరిస్తూ, నా చరిత్రలను చెప్పుకొంటూ, వీనులవిందుగా వింటూ, ఎల్లప్పుడూ ఆనందిస్తుంటారు. వారిని (ఆధ్యాత్మిక అధిదైవిక, అధిభౌతిక) తాపత్రయాలేవీ అంటవు. అటువంటి సర్వసంగ పరిత్యాగులైన పరమభాగవతుల సాంగత్యమే కోరదగినది. అదేసర్వదోషహారిణి. వారి సాంగత్యమువలన మోక్షప్రదములైన శ్రద్ధాభక్తులుదయిస్తాయి, అజ్ఞానంనశిస్తుంది.

సహజమూ నిర్హేతుకమూ అయిన భగవద్భక్తి ముక్తికంటే గొప్పది. అది జీవుల కర్మలను, లింగశరీరాన్నీ నశింపజేస్తుంది. కొందరు నాపాదసేవ చేయుటయందు, నా గుణగణాలను సంకీర్తన చేయుటయందు, నాదివ్యగాథలను చెప్పుట, వినుటయందు ఆనందిస్తూ, భక్తి పరవశులై ముక్తిని కూడ వాంఛించరు. కొందరు నాదివ్యమోహనాకారాన్నే మనస్సులో నింపుకొని, లౌకికమైన సుఖసంపదలుగాని స్వర్గలోక బ్రహ్మలోక ప్రాప్తినిగాని, అణిమాది అష్టసిద్ధులుగానీ, ఇంకేమైనాగాని కోరకుండా, నిత్యానందంలో మునిగియుంటారు. అట్టివారు మహోన్నతమూ, సంపూర్ణ వైభవోపేతమూ అయిన వైకుంఠ ధామాన్ని చేరుకొంటారు. నాయొక్క కాలచక్రానికి కూడ లోబడరు: ఏలనన నేనే వారికి సర్వస్వము, తండ్రి, తల్లి, గురువు, ఇష్టదైవము. నేను వారిని ఈ జనన మరణ సంసార చక్రమునుండి, పైకి తీసుకొని పోతానుకనుక ప్రకృతికీ, పురుషునకూ కూడ నేనే అధీశ్వరుడను. కనుక నన్ను శరణు జొచ్చినవారు తప్ప మిగిలిన వారు సంసార చక్రంలో చిక్కుకొంటారు. నా ఆజ్ఞచేతనే గాలివీస్తుంది. అగ్ని మండుతుంది, సూర్యుడు ప్రకాశిస్తున్నాడు, ఇంద్రుడు వర్షిస్తున్నాడు, మృత్యువు సంహరిస్తున్నది. అందువలన వైరాగ్యముతో కూడిన భక్తి యోగము చేతనే, యోగులు, నాచరణాలను స్మరిస్తూ నిర్భయంగానుంటారు. భక్తియే మోక్షసాధనకు ప్రధాన మార్గము.

## తత్త్వజ్ఞానము

కపిలుడు దేవహూతితో ఇంకా ఇలాగ చెప్పాడు: అమ్మా! అనాదియైనవాడూ, పురుషుడనబడే వాడూ, త్రిగుణాలు లేనివాడూ, ప్రత్యక్ష స్వరూపము కలవాడూ ఆపరమాత్మ, అతడు అవ్యక్తమూ, త్రిగుణాత్మకమూ అయి, తనను అంటిపెట్టుకొని యున్న ప్రకృతిలో లీలగా ప్రవేశిస్తాడు. అప్పుడాప్రకృతి త్రిగుణాత్మకమైన శరీరముతో సాకారమై ప్రజాసృష్టిని చేయనారంభించినది. అదిచూచి పురుషుడు మోహాన్ని చెందాడు. విజ్ఞానం మరుగున పడినది. ప్రకృతి పురుషులు మేళవించారు. పురుషుడు, ప్రకృతియొక్క గుణాలు తనవిగానే భావించి, జరుగుతున్న కార్యాలన్నిటికీ తానే కర్తనని భ్రమను చెంది, సంసారబంధంలో చిక్కుపడి పరాధీనుడౌతాడు. ఈశ్వరుడు కర్తకాకున్నా కర్మలకు సాక్షిభూతుడు కావడంచేత, ఆత్మకు కార్య కారణ కర్తృత్వాలు లేవని విజ్ఞులు తెలుసుకొన్నారు.

త్రిగుణాత్మకమూ, అవ్యక్తమూ, నిత్యమూ, సదసదాత్మకమూ, ప్రధానమూ - అనే ఈ అయిదూ, ప్రకృతి యొక్క విశేషాలు– అందుకే ప్రకృతిని విశిష్టం అనికూడ అంటారు. ప్రకృతి 24 తత్త్వాలు కలది - అవి - పంచభూతాలు, పంచతన్మాత్రలు, (శబ్దస్పర్శాదులు), పంచజ్ఞానేంద్రియాలు (కన్నుముక్కు మొ॥నవి), పంచ కర్మేంద్రియాలు (చేతులు, కాళ్లు మొ॥నవి) (అంతఃకరణ) మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఇవి, సగుణ బ్రహ్మకు సంస్థానము. కాలము, 25వ తత్త్వము.

జీవరాసులలో అంతర్యామియై యున్నప్పుడు పురుషుడనీ వాటికి వెలుపల వ్యాపించి, నియమించేటప్పుడు కాలమనీ అనబడుతుంది. సత్త్వరజస్తమోగుణాల స్తబ్ధస్థితిని (సమతూకమును) చెదరగొట్టి వాటియందు హెచ్చుతగ్గులను, కదలికను కలిగించడం కాలం యొక్క ధర్మము. ప్రకృతి, పురుషుడు, కాలము, సగుణబ్రహ్మాంతర్గతములే. పురుషుడు, కాలము అగోచరులు.

పరమపురుషుడు ప్రకృతియందు తనయొక్క సృజనశక్తిని నిక్షేపించాడు. అప్పుడాప్రకృతి ప్రకాశవంతమైన మహత్తత్త్వమయినది. (హిరణ్మయము). దానినుండి అహంతత్త్వము వెలువడినది. దానినుండి 24 తత్త్వాలు పుట్టినవి. చిత్తమును, మహత్తత్త్వమనీ, వాసుదేవమనీ కూడా అంటారు. అహంతత్త్వాన్ని వెయ్యితలల సంకర్షణం అని అంటారు. సాత్త్విక - అహంనుండి మనస్సు ఏర్పడుతుంది. అహంకారము శాంత, ఘోర, విమూఢ, అనే మూడు రకాలుగా వ్యక్తమవుతుంది. శాంత (సాత్త్వికం) దశలో ప్రకాశము కలదిగనూ, ఘోర (రాజసిక) దశలో చంచలమైనదిగనూ, మూఢ (తామసిక) దశలో జడముగనూ ఉంటుంది. మనస్సునందు సంకల్ప వికల్పాలేర్పడుతాయి. సంకల్పమనగా ఒక్కటిగా తలచడం, వికల్పమనగా వివిధ విషయాల గురించి తలచడం. సాత్త్విక - అహంకారంనుండి ఏర్పడిన మనస్సును అనిరుద్ధం అనికూడ అంటారు. రాజసిక అహంకారనుండి పుట్టిన బుద్ధిని ప్రద్యుమ్నం అని అంటారు.

వాసుదేవవ్యూహము, షడూర్ములైన - ఆకలిదప్పులు, శోకమోహాలు, జరామరణాలు అనువాటి నుండి విడివడి, షడ్గుణాలైన ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యములతో పరిపూర్ణమై, సత్త్వగుణ ప్రధానమై, నిర్మలమై, శాంతమై, నిత్యమై, భక్తజన సంసేవ్యమై అలరారుతుంది.

మహత్తత్త్వమునుండి పుట్టిన క్రియాశక్తిరూపమైన అహంకారము వైకారికము, తైజసము, తామసము అనే మూడు రకాలైయుంటుంది. వైకారికాహంకారము అనేది మనస్సుకూ, పంచేంద్రియాలకూ పంచభూతాలకూ, ఉత్పత్తిస్థానమై, దేవతారూపమైయుంటుంది. తైజసాహంకారము బుద్ధిరూపాన్నీ, ప్రాణరూపాన్నీ కలిగియుంటుంది. తామసాహంకారము ఇంద్రియ విషయాలతో కూడియున్నదై ప్రయోజనమాత్రమై యుంటుంది.

వైకారికమైన సాత్త్వికాహంకారాన్ని సంకర్షణవ్యూహము అధిష్ఠించియుంటుంది. వెయ్యిపడగలతో ప్రకాశించేవాడూ అనంతుడూ మహానుభావుడు, అయిన సంకర్షణపురుషుడు పంచభూతాలతో పంచేంద్రియాలతో మనస్సుతో నిండియుంటాడు. శాంత, ఘోర, మూఢత్వములాంటి లక్షణాలతో ఉల్లాసంగానుంటాడు. దీనినుండి మనస్తత్త్వం పుట్టినది. ఈ మనస్తత్త్వానికి చింతనము సహజము. ఆ చింతనము - సంకల్పము, వికల్పము అనే రెండు విధాలు. ఈ సంకల్పవికల్పాలవల్లనే సృష్టిలోని వస్తువులు విభిన్న లక్షణాలతో కనిపిస్తాయి. వివిధకామాలు (కోరికలు) ఉత్పన్నమవుతాయి. దీనిని ప్రద్యుమ్న వ్యూహమంటారు.

అనిరుద్ధవ్యూహము ఇంద్రియాలకు అధీశ్వరమై, యోగీంద్రులకు సంసేవ్యమై,. శ్యామలవర్ణంలో విరాజిల్లుతుంటుంది. తైజసాహంకారంనుండి బుద్ధితత్త్వం పుట్టినది. ద్రవ్యాన్ని ప్రకాశింపజేసే జ్ఞానమూ, ఇంద్రియానుగ్రహమూ, సంశయమూ, మిథ్యాజ్ఞానమూ, నిద్ర, నిశ్చయించడమూ, స్మృతీ అనేవి బుద్ధియొక్క లక్షణాలు. ఈ తైజసాహంకారంవల్లనే ఐదు జ్ఞానేంద్రియాలూ, ఐదు కర్మేంద్రియాలూ, క్రియాజ్ఞాన సాధనాలూ ఏర్పడుతాయి. దీనివలననే ప్రాణానికి సంబంధించిన క్రియాశక్తీ, బుద్ధికి సంబంధించిన జ్ఞానశక్తీ కలుగుతాయి. ఈ రెండు శక్తులూ కర్మేంద్రియాలనూ, జ్ఞానేంద్రియాలనూ పనిచేసేటట్టు చేస్తాయి.

భగవత్ప్రేరితమైన తామసాహంకారమునుండి శబ్దతన్మాత్రం పుట్టినది. ఈ శబ్దతన్మాత్రం నుండి ఆకాశము వచ్చినది. ఆకాశమునుండి శ్రోత్రేంద్రియం పుట్టినది. ఈ ఆకాశము సకల సృష్టికీ జీవరాశులకూ, లోపలా వెలుపలా అవకాశం (స్థలం) ఇవ్వడమే కాకుండా, ఆత్మకూ, ప్రాణాలకూ, ఇంద్రియాలకూ, ఆశ్రయంగానుంటుంది. ఆకాశమునుండి స్పర్శతన్మాత్రము వెలువడి, దానినుండి వాయువూ, ఆవాయువు వల్ల స్పర్శనుగ్రహించగల త్వగింద్రియమూ పుట్టాయి. దీనివలన, మెత్తదనం, ఉష్ణము మొదలైన స్పర్శజ్ఞానం కలుగుతుంది. వాయువునకు కదలడం కదిలించడం మొదలైనవి లక్షణాలు.

వాయువునుండి, రూపతన్మాత్రము ఉద్భవించి, దానినుండి తేజస్సు ఆవిర్భవించినది. దానివలన చక్షురింద్రియం ఏర్పడి, రూపగ్రహణ శక్తి వెలసినది. దైవప్రేరితమై మార్పు చెందిన తేజస్సునుండి రసతన్మాత్రం పుట్టినది. దీనివలన జలము వచ్చినది. దానివలన రసనేంద్రియం ఏర్పడినది. రుచులను తెలుసుకోవడం గ్రహించడం రసనేంద్రియ లక్షణము.

దైవప్రేరణచే మార్పు చెందిన జలమునుండి గంధతన్మాత్రం పుట్టి, దానివలన పృథ్వి ఏర్పడినది. దానివలన ఘ్రాణేంద్రియం ఏర్పడి, నానావిధగంధాలను గ్రహించే శక్తి కలిగినది. అన్ని భూతాలకూ పృథివితో సంబంధం ఉండటంచేత, భూమియందు శబ్ద స్పర్శ రూపరస గంధాలన్నీ కలిసియుంటాయి.

మహత్తు, అహంకారము, పంచమహాభూతాలు అనబడే ఏడుతత్త్వాలూ కూడి, భోగశరీరుడైన ఒక పురుషాకారాన్ని కల్పింపలేని అసమర్థ స్థితిలోనున్న తరుణంలో, జగత్కారణుడూ, త్రిగుణాతీతుడూ, సర్వనియామకుడూ, నిరంజనాకారుడూ అయిన సర్వేశ్వరుడు, కాలము, అదృష్టము (కర్మ), త్రిగుణాలతోకూడి, వాటియందు ప్రవేశించినంతనే ఆ తత్త్వాలు పరస్పరమూ అన్యోన్యముగా కలసిపోయి, ఒక అండముగా తయారైనవి. ఆ అండానికి ఒక అధిష్ఠాన దైవము లేకపోవడంచేత, అది అచేతనముగానుండిపోయినది. ఆ అండములో మహత్తరమైన శక్తితో విరాట్ పురుషుడు సంభవించాడు. ఆ అండాన్ని పొదువుకొని, పృథివి, దానిచుట్టూ జలమూ, దానిచుట్టూ తేజస్సూ, దాని చుట్టూ వాయువు, దానిచుట్టూ ఆకాశమూ, దానిచుట్టూ అహంకారము, దానిచుట్టూ మహత్తూ, ఒకదానికంటే దానిపైది పదిరెట్లు పెద్దదిగా ఆవరించినవి. జలములో తేలియాడుతున్న ఆ బంగారు అండములో పంకజోదరుని (పద్మనాభుని) రూపము విలసిల్లుతుంది. మహానుభావుడు దేవదేవుడు, శ్రీహరి, విశ్వవిజేత అయిన నారాయణుడు ఆ అండములో ప్రవేశించి, ఆ బ్రహ్మాండాన్ని ఛేదించగా, అందులో నుంచి విరాట్పురుషుడు దివ్యతేజస్సుతో నావిర్భవించాడు.

ఆ విరాట్ పురుషుని ముఖమునుండి, వాణి, అగ్ని పుట్టాయి. ముక్కునుండి ప్రాణాలు, ఘ్రాణేంద్రియము వచ్చాయి. ప్రాణవాయువువలన కన్నులు, కన్నులందు సూర్యుడు ప్రభవించారు.

ధ్యానము చెయ్యగా చెవులేర్పడ్డాయి. వాటివలన శ్రోత్రేంద్రియము, దిక్కులూ ఏర్పడ్డాయి. చర్మమునుండి రోమాలు, ఓషధులూ పుట్టాయి. మర్మావయవం నుండి రేతస్సు, దానివల్ల జలము, దానివల్ల అపానము, దానివల్ల మృత్యువు పుట్టాయి. చేతులవల్ల బలము, బలమునుండి ఇంద్రుడు, పాదాలచే గమనము, ఉపేంద్రుడు ఉద్భవించారు. నాడులవల్ల రక్తము, రక్తమువల్ల నదులూ, జఠరం వల్ల ఆకలిదప్పులు, వాటివల్ల సముద్రాలూ పుట్టాయి. హృదయం వల్ల మనస్సూ, మనస్సువల్ల చంద్రుడూ, బుద్ధిచిత్తముల వల్ల బ్రహ్మ, క్షేత్రజ్ఞుడూ కలిగారు. ఈ విధంగా ఆ అండమునుండి సృష్టికారకుడైన పురుషుడు పుట్టాడు.

విరాట్పురుషునిలో ఉద్భవించిన పంచమహాభూతాలూ, పంచతన్మాత్రలూ, ఇంద్రియాలూ, ఇంద్రియాధిదేవతలూ, వేరువేరుగానే ఉండిపోయారుగాని సమైక్యం పొందలేదు. అందుచేత, జీవుని (క్షేత్రజ్ఞుని) ప్రవర్తింపజెయ్యలేకపోయాయి. ఇతరజీవుల్ని ఉత్పత్తి చెయ్యలేకపోయాయి. అనంతరం అన్నింటికీ సమైక్యము, సమన్వయమూ, కుదర్చగల సమర్థుడైన క్షేత్రజ్ఞుడు చిత్తములో ప్రవేశించాడు. అప్పుడు విరాట్ పురుషుడు జలమందు తేలుతున్న బ్రహ్మాండాన్ని అధిష్ఠించి సృష్టి కార్యాన్ని ప్రవర్తింపగలిగాడు.

ఎడతెగని భక్తి, వివేకాలు కలిగి, విరక్తులైన మహాత్ములు అటువంటి విరాట్ పురుషుని ధ్యానిస్తారు. ప్రకృతి పురుషులగురించి యథార్థజ్ఞానము వలన మోక్షమూ, ప్రకృతితోనే కేవలం సంబంధం కల్పించుకొంటే సంసారబంధమూ కలుగుతాయి.

ప్రకృతిచే ఏర్పడిన ఈ శరీరము, సత్త్వరజస్తమోగుణాలతో నిండియుంటుంది. పురుషుడు అలాంటి శరీరాన్ని ఆశ్రయించిన వాడైనప్పటికీ, అసంగుడైయుంటే ప్రకృతి జనితాలైన సుఖదుఃఖాలకులోనుకాడు, మోహము చెందడు, ఎటువంటి వికారాలకూ పాల్పడడు, త్రిగుణాలు లేనివాడై నిర్మలమైన జలములో స్వచ్ఛముగా ప్రకాశించే సూర్యప్రతిబింబములాగా ప్రవర్తిస్తాడు. కాని ప్రకృతియొక్క గుణాలలో తగులుకొంటే అహంకారమూఢుడై అన్నింటికీ తానే కర్తను అని భావిస్తూ సంగమువల్ల ప్రకృతి దోషాలకు లోనవుతాడు, సుర, నర, పశు, పక్ష్యాది నానావిధయోనులలో జన్మించి, కర్మవాసనలను విస్తరింపజేసుకొంటాడు. ఈవిధంగా చిక్కుకొని చరిస్తూ, విషయాలయందే ధ్యాసను పెంచుకొంటూ, స్వప్నంలోని ఐశ్వర్యసంపదలను నిజంగా పొందినట్టు భ్రమిస్తూ అసత్తునే ఆశ్రయిస్తూ చంచలమనస్కుడై చరిస్తుంటాడు.

అందుచేత మోక్షము కాంక్షించేవాడు విషయ సుఖాలయందు విరక్తుడై యమనియమాదులచే మనస్సును అదుపులోనుంచుకొని, యోగాభ్యాసము చేస్తూ అనన్య భక్తిని పెంచుకోవాలి. నా సత్యస్వరూపాన్ని తెలుసుకోవాలి. నాపాదసేవలు చెయ్యాలి. నాకథలను వింటుండాలి. సర్వజీవులయందూ, సమబుద్ధితో వర్తించాలి. బ్రహ్మచర్యము, మౌనము అవలంబించాలి. మితముగా భుజించాలి. స్వధర్మాచరణం చెయ్యాలి. నిత్యసంతుష్టుడై యుండాలి. ఏకాంతీ, మననశీలుడూ అయియుండాలి. మాత్సర్యము లేనివాడైయుండాలి. మైత్రి, కరుణ అభ్యసించాలి. ఆత్మజ్ఞానార్జన యందాసక్తిని కలిగియుండాలి. బంధకారకాలైన ధనార్జనకాంక్షను, గాఢమైన దేహధ్యాసనూ, విసర్జించి వర్తించాలి.

**సాంఖ్యయోగము :** త్రిగుణాత్మకమైన ప్రకృతిలో చిక్కుకొన్నవాడు జీవుడనీ, ప్రకృతిని నియమించేవాడు ఈశ్వరుడనీ, ఈ యథార్థ తత్త్వాన్ని తెలుసుకోవడంచేత, బుద్ధి అంతర్ముఖమై ఇతరమైన వాటిని వేటినీ దర్శించకుండా ఆత్మనాయకుడైన శ్రీమన్నారాయణునే దర్శించాలి. అప్పుడు మిథ్యాస్వరూపమైన అహంకారము తొలగిపోయి, సత్యము ప్రకాశిస్తుంది. అప్పుడు పరబ్రహ్మమును పొందవచ్చును. ఆత్మను తెలుసుకొన్నవానికి విష్ణుస్వరూపం (పరమాత్మ) తెలియవస్తుంది. అది ఎలాగంటే– నీటిబిందెలో పడిన సూర్యకిరణముచే సూర్యుని ప్రతిబింబము గోడమీద కనిపించితే, గది అనే ఆవరణ మధ్యనున్న మనిషి ఆ ప్రతిబింబాన్ని చూచి సూర్యుడు ప్రకాశిస్తున్నట్లు తెలుసుకొనగలడు. నేరుగా సూర్యుడు కనిపించకపోయినా ప్రతిబింబమెలాగ వచ్చిందో పరిశోధించి చూస్తే సూర్యస్వరూపాన్ని తెలుసుకొనవచ్చు. అలాగే మనోబుద్ధి అహంకారాలలో ప్రకాశమయ్యే చైతన్యము ద్వారా ఆత్మస్వరూపాన్ని గుర్తించవచ్చు. చరాచర ప్రపంచంలో అంతర్యామిగా నుండే ఆ మహనీయ మూర్తి, ఆత్మవేత్తలైన మహాత్ముల అంతరంగాలలో అఖండశోభావైభవంతో దర్శనమిస్తాడు. జీవుడు సుషుప్తిలో భగవంతునితో సంబంధం కలిగియుంటాడు. అతనిలోనున్న పంచభూతాలు మొదలైన తత్త్వాలు లీనమై ప్రకృతిలో సంస్కారమాత్రముగా పడియుంటాయి. ఆ సమయంలో జీవునియొక్క ఆత్మ మాత్రము మేల్కొనియుండి ఎటువంటి అవరోధమూ లేకుండా పరమాత్మానుభవాన్ని పొందుతుంటుంది.

సాధకుడు ఎటువంటి ఫలాన్నీ కోరకుండా, స్వధర్మాలను నిర్వర్తిస్తుండాలి. మనస్సు నెల్లప్పుడూ నిర్మలంగానుంచుకొంటూ, నాయందు అచంచలమైన భక్తిని కలిగియుండాలి. నాయొక్క సత్కథా శ్రవణము వలన కలిగిన వైరాగ్యముచే, దృశ్యప్రకృతీ, అవ్యక్తపురుషుల సంబంధిత జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవాలి. కోరికలను తొలగించుకొని, వైరాగ్యాన్ని పెంచుకోవాలి. తపస్సుతో కూడిన యోగాభ్యాసము చెయ్యాలి. ఏకాగ్రతను అలవరచుకోవాలి. ఈ సాధనలవలన ప్రకృతితో ఏర్పడిన సంగము వదలిపోతుంది. తత్త్వదర్శనంచేత, దోషభూయిష్ఠమైన ప్రకృతి యొక్క ఆకర్షణనుండి జీవుడు విడివడుతాడు. మెలకువరాగానే, స్వప్నంలోని బాధలు, బాధించనట్లు కర్మసాక్షియైన ఆత్మకు ప్రకృతియొక్క దోషాలు అంటవు. ఆత్మజ్ఞాన సంపన్నుడు బ్రహ్మపదం ప్రాప్తించేవరకు ఎన్ని జన్మలెత్తినా, అతని వైరాగ్యము చెక్కుచెదరదు. అణిమ, గరిమ లాంటి అష్టసిద్ధులు మోక్షప్రాప్తికి అడ్డుతగుల్తాయి. వాటియందు తగుల్కొనక, నా పాదపద్మాలను హృదయంలో పదిలపరచుకొన్నవాడు మృత్యువాతను పడకుండా మోక్షాన్ని పొందుతాడు.

**అమ్మా! యోగలక్షణాలను వివరిస్తాను విను:**

శక్తికొలది స్వధర్మాచరణము చెయ్యడం, శాస్త్రనిషిద్ధకర్మలను చెయ్యకుండడం, దైవికంగా లభించిన ద్రవ్యముతో సంతుష్టిజెందడం, మహాభాగవతుల పాదసేవ చెయ్యడం, నీచకర్మలు చేయకుండడం, మోక్షధర్మాలయందు అనురక్తి కలిగియుండడం, శుభ్రమైన మితాహారాన్ని భుజించడం, ప్రతిబంధకాలు లేని ప్రశాంతమైన స్థానంలో నుండడం, ఎవ్వరికీ హింసకలిగించకుండా మెలగడం, సత్యవర్తనము, ఇతరులకు చెందినదాన్ని అపహరించకుండడం, న్యాయార్జితధనములో తనకొంత అవసరమో అంతే స్వీకరించడం, బ్రహ్మచర్యము, తపస్సు, శౌచము పాటించడం, సద్గ్రంథాలను అధ్యయనం చెయ్యడం, పరమపురుషుడైన సర్వేశ్వరుని అర్చించడం, మౌనము, ఆసనసిద్ధిని అలవరచుకొనడం, దానివలన స్థిరత్వం సాధించడం, ప్రాణవాయువును వశపరచుకొనడం, ఇంద్రియనిగ్రహం ద్వారా ఇంద్రియాలను విషయాలనుండి ఉప సంహరించడం. విషయాలనుండి మరల్చ బడిన మనస్సును హృదయ మందు నిలపడం, మూలాధారాది స్థానాలలో

నేదో ఒక స్థానమందు మనస్సుతో కూడ ప్రాణధారణ చెయ్యడం. శ్రీమన్నారాయణుని దివ్యలీలలను మననం చేసుకొనడం, ఏకాగ్రతతో ధ్యానించడం, పరమేశ్వరుడైన పద్మనాభుడు అంతటా నిండియున్నాడని విశ్వసించడం- ఇవి అన్నీ యోగధర్మాలు.

**ధ్యానపద్ధతి :** ఈ యోగధర్మాలను పాటిస్తూ వ్రతదానాది సత్కర్మలనాచరిస్తుండాలి. మనస్సును కలుషితంచేసే అసత్కర్మలను విడిచిపెట్టాలి. ప్రాణాయామపరుడై యోగాసక్తుడై యుండాలి. శుచియైన ప్రదేశంలో, స్థిరసుఖాసనుడై, దర్భాసనమూ, దానిపైన జింకచర్మమూ దానిపై శుభ్రవస్త్రమూ వేసుకొని కూర్చోవాలి. శరీరాన్ని నిటారుగా నుంచుకొని, కుంభకపూరకరేచకాలతో ప్రాణాయామంచేసి, అన్నమయాది కోశశుద్ధిని చేసుకొని, చంచలమైన మనస్సును సుస్థిరం చేసుకొని, తీవ్రమైన యమము ద్వారా, కాల్చి శుద్ధిచేయబడిన కాంచనంలాగా మనస్సును శుద్ధిచేసుకోవాలి. ఈ విధంగా వాయువును జయించిన యోగికి ప్రాణాయామాగ్నిచే వాతపిత్తాది దోషాలు హరించుకొనిపోతాయి. ధారణచే పాపాలూ, ప్రత్యాహారముచే పూర్వ సంస్కారాలూ దహించుకొనిపోయేలాగచేసి, ధ్యానముచే రాగద్వేషాలనూ త్రిగుణాల ప్రభావాన్నీ నివారించుకొని తన నాసికాగ్రాన దృష్టిని కేంద్రీకరించాలి.

ఆ విధంగా దృష్టిని నిలిపి పరిశుద్ధమానసముతో, ఆ దివ్య సుందరమూర్తి అయిన శ్రీమన్నారాయణుని రూపగుణవైభవాలు స్మరిస్తూ ధ్యానము చెయ్యాలి.

పీతాంబరధారీ, జగన్నివాసుడూ, చతుర్బాహువులతో శంఖచక్రగదా పద్మాలను ధరించువాడూ, భక్తులకు అంతర్దృష్టిని పెంపొందించువాడూ, సద్గుణభూషణుడూ, నిత్యయౌవనుడూ, పుణ్యశ్లోకుడూ, సుందరాకారుడూ, యశోవిలాసుడూ సకల లోక నమస్కృత పాదపద్మాలు కలవాడూ, భక్త హృదయవాసీ, అనంతుడూ సర్వేశ్వరుడూ, సర్వాంగసుందరుడూ అయిన ఆ దివ్యమోహనమూర్తిని పాదాలనుండి శిరస్సుదాకా, శిరస్సునుండి పాదాలవరకూ ఉన్న, ప్రతి- అంగాన్నీ, ప్రతి- ఆభరణాన్నీ తేరిపార పరికిస్తూ మనస్సులో ముద్రింపబడేలాగ గమనించి చూడాలి. పాదాల అడుగుననున్న హలము, వజ్రము, అంకుశము, కమలము, ధ్వజము, ఛత్రము మొదలైన మంగళకరమైన రేఖలుగలవీ, చందమామలవలె మెరుస్తున్న గోళ్లుకలవీ పావనగంగ ఉద్భవించిన బొటన వ్రేలుగలదీ, ఎఱ్ఱ తామరలవంటివీ భక్తులయొక్కయు, యోగులయొక్కయు, హృదయాల్లో శాశ్వతంగా చోటుచేసుకొన్నట్టివీ, అయిన ఆ శ్రీహరి పాదపద్మాలును నిరంతరం ధ్యానిస్తుండాలి. సకల సౌభాగ్యదాయినీ, జగన్మాత అయిన లక్ష్మీదేవియొక్క ఒడిలో విలాసంగా వెలసియున్న శ్రీహరి మోకాళ్లపై మనస్సు నిల్పాలి. గరుత్మంతుని బంగారు భుజాలకు రెండువైపులా అమరియున్న ఆ పరమేశ్వరుని తొడలపై మనసునిల్పాలి. సొగసుగా వేలాడుతున్న అంచులతోనున్న పీతాంబరంతోనూ, చిరుమువ్వల మొలత్రాడుతోనూ ముచ్చటగా చుట్టబడిన ఆ కటిప్రదేశాన్ని భక్తితో కొలవాలి. బ్రహ్మదేవుని జన్మస్థలమైన పద్మము ఉద్భవించిన ఆ పరమపురుషుని నాభిస్థలాన్ని సంస్మరించాలి. దివ్యమైన మరకతమాణిక్యదీప్తులతో లక్ష్మీదేవికి నివాసస్థానమైన ఆశ్రీహరి వక్షస్థలాన్ని భావిస్తుండాలి. కౌస్తుభమణితో విరాజిల్లే వైకుంఠవాసుని కంఠాన్ని చింతిస్తుండాలి. రత్నాల భుజకీర్తులతో రంజిల్లుతూ, సాధుజనుల రక్షణకై సదా సిద్ధంగా నుండే ఆ విష్ణుమూర్తి బాహుదండాలను స్మరిస్తుండాలి. దుష్టుల్ని శిక్షించే వెయ్యి అంచుల సుదర్శన చక్రాన్నీ, రాజహంసవలె శ్రీహరిచేతిలో విలసిల్లే పాంచజన్యశంఖాన్నీ, శత్రు భయంకరమైన కౌముదకీగదనూ హృదయంలో పదిలపరచుకోవాలి. నిత్యపరిమళాలతో నిగారించే వైజయంతీ వనమాలనూ, అఖిలలోకాలకూ ఆత్మరూపమైన కౌస్తుభమణినీ, వైకుంఠనాథుని కంఠసీమలో వేర్వేరుగా ధ్యానించాలి. మకరకుండలాల మణికాంతులతో మెరిసిపోయేచెక్కిళ్ల సొంపులతో, తీర్చిదిద్దబడిన కనుబొమలతో, నల్లని ముంగురులతో, ముద్దుల మూటగట్టు ముకుందుని ముఖారవిందాన్ని ధ్యానించాలి. శరణాగతుల ఆర్తులను తీర్చడానికి అభయమిచ్చే చక్రపాణి పాణిపద్మాలను హృదయ పద్మంలో భావన చెయ్యాలి. ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక తాపత్రయాల నివారణకు, ఆ కమలాక్షుని కరుణాకటాక్షవీక్షణాలను స్మరణం చేసుకోవాలి.

యోగులు స్వామియొక్క మందస్మితముఖారవింద ప్రసన్నతను నిర్మలమానసంతో మననం చేసుకోవాలి. శిరస్సులువంచి కొలిచే భక్తుల దుఃఖబాష్ప జలాలను శుష్కింపజేసి, ఉదారంగా అనుగ్రహించూపే శ్రీహరి సుందర

దరహాసాన్ని నిరంతరం ధ్యానించాలి. మునులు ఆ మహనీయుని భ్రూమండలాన్నీ, ఆయన మందహాసాన్నీ, అందమైన పలువరుసనూ తలచుకొంటూ ధ్యానం చెయ్యాలి. ఈ విధంగా అన్ని అంగాలనూ స్థానాలనూ. వేర్వేరుగా మనస్సులో నిలుపుకొని ధ్యానము చెయ్యాలి.

నిష్కళంక వర్తనుడైన మహాత్ముడు ఈ విధంగా పరమేశ్వరునిపై చిత్తాన్ని నిలిపి, అత్యంత మోదముతో మేను పులకించిన వాడై, ఆనందబాష్పాలు పొంగిపొరలగా, అంతులేని సుఖసాగరంలో తేలియాడుతుంటాడు. చిత్తము భగవానునియందు లయమైపోగానే, ధ్యేయము, ధ్యాత, ధ్యానమూ ఒక్కటే అవుతాయి. మోక్షాన్ని అపేక్షించిన అతని మనస్సు దేనిచేతనూ బంధింపబడదు. భగవంతునికంటే ఇంకేదియు అతనికి ఎక్కువకాదు, అవసరం లేదు, ఇంకేదియు కనిపించదు. అనన్య భక్తి ఏర్పడుతుంది. పెద్ద తేజస్సుతో చిన్నదీపం తన అస్తిత్వాన్ని కోల్పోయినట్లు, ఆత్మధ్యాసలో తన దేహధ్యాసను విస్మరిస్తాడు. సర్వమూ భగవన్మయమే అని చూస్తాడు. అనన్య భావమే మోక్షము. అతనికి ఆత్మతత్త్వము అనుభూతమవుతుంది. అతడు జీవన్ముక్తుడవుతాడు. అతని శరీరం పనిచేస్తున్నా చెయ్యకపోయినా, ఏమీ పట్టించుకొనడు. కర్మఫలం అనుభవించవలసియున్నంతవరకూ, సంసారంలో మెలగుతు ఉంటాడు, కాని వాటిని స్వప్నంలోని అనుభవాలుగా మాత్రమే భావిస్తాడు.

ఆత్మ సర్వత్రా సర్వభూతాల యందూ వెలుగుతూ ఉంటుంది. ప్రకృతితో కలిసి, దేవతలు, మనుష్యులు, జంతువులూ, స్థావరాలూ మొదలైన విభిన్న యోనులలో, విభిన్న గుణాలతో జీవునిగా వెలుస్తున్నా ఆత్మమాత్రము ఒక్కటే.

భగవంతునియందు అనన్య భక్తిచేతనే జీవుడు మాయాజాలమునుండి బయటపడగలడు.

**భక్తియోగము :**

ఓ మాతా! మనుజుల యొక్క ఫలాసక్తీ, సంకల్పాలలోని తారతమ్యాల ననుసరించి, వారిలో భక్తిభావాలు ఉదయిస్తాయి. అవి తామసికము, రాజసికము, సాత్త్వికము అని మూడు విధాలు.

ఇతరులకు హింసకలిగిస్తూ, దంభము, మాత్సర్యమూ రోషము, తమోగుణము, భేదబుద్ధి, కలిగియుండి, నన్ను కొలవడం తామసిక భక్తి అనిపించుకొంటుంది. గొప్పగొప్ప విషయవస్తువులనూ, ప్రావీణ్యాన్నీ (సామర్థ్యాన్నీ), భూములను, ఐశ్వర్యాలనూ, కీర్తినీ కోరుకొంటూ (ఆడంబరార్భాటాలతోను, పేరు ప్రతిష్ఠలకోసమూ, అధికవ్యయ ప్రయాసలతోను,) నన్ను పూజించడం రాజసికభక్తి అనబడుతుంది. పూర్వకర్మలను పరిహరింపజేసేది భగవద్భక్తి ఒక్కటే అనే విశ్వాసంతో, సమస్త కార్యాలూ భగవదర్పిత భావముతో లోకులకు మేలు చేకూర్చే పనులు చేస్తూ భగవంతుని సేవించడం సాత్త్విక భక్తి. నాయొక్క దివ్యగుణవైభవాలు విన్నంతనే భక్తిపరవశులై నన్ను ఆశ్రయించినవారు ఉత్తమభక్తులు. నిర్హేతుకముగా, నిష్కామముగ నాగురించిచేయబడిన భక్తి కార్యాలే శ్రేష్ఠమైనవి. నిష్కాములైన నాభక్తులకు సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అనే ముక్తులే ధ్యేయము. అందుచేత మహాత్ములైనవారు తమ సొంతకోర్కెలను తీర్చేవే అయినా, నా ఆరాధనకు దూరముచేసే ఏ ఇతర కార్యాన్నీ చేపట్టరు. దీనిని ఆత్యంతిక భక్తియోగమంటారు. త్రిగుణాలకు అతీతుడైన మనిషి నావంటి ఆకారాన్ని పొందుతాడు.

నాభక్తుడు సంధ్యావందనాది నిత్యకర్మలయందూ, జగత్కళ్యాణార్థం చేసే యజ్ఞయాగాది నైమిత్తిక కర్మలయందూ అత్యంత శ్రద్ధాసక్తులను కలిగియుండాలి. గురువులయందు శ్రద్ధాభక్తులు కలిగియుండాలి. పాంచరాత్రాలలో చెప్పబడినట్లు నిష్కామ బుద్ధితో నన్నారాధించాలి. నారూపాన్ని దర్శించడం, స్మరించడం, నాచరిత్రలు వినడం, కర్మలలో చిక్కుకొనకుండా ఉండడం, తనకంటే గొప్పవారిపై ఆదరగౌరవాలూ, తక్కువ వారిపై దయా దాక్షిణ్యాలూ, సమానులపై స్నేహానురాగాలు కలిగియుండడం, యమనియమాలను పాటించడంలాంటి సుగుణాలను అలవరచుకోవాలి. యోగాభ్యాసం చెయ్యాలి. ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికాలగురించి తెలుసుకొని, ఇతరులకు తెలియజెప్పాలి, శ్రీహరి దివ్యగుణ కీర్తనలు చేస్తూ భగవద్భక్తులను నిజాయితీతోను, అనురక్తితోనూ సేవిస్తుండాలి. అహంకారములేనివాడై, నిశ్చలుడైయుండాలి. ఈ సుగుణాలు కలవాడు నన్ను పొందగలడు.

సర్వజీవుల హృదయకమలాల్లో నుండే ఈశ్వరుడనైన నన్ను అలక్ష్యముచేసి, కేవలము నా విగ్రహాన్ని మాత్రమే పట్టుకొని, ఆడంబరంగా పూజించేవాడు మూఢుడు. యథార్థ భక్తితో నన్నారాధించని వాని పూజలు నిరర్థకాలు. సర్వభూతాంతరాత్ముడనైన నాయందూ, జీవరాసులయందూ, మాయావులై భేదదృష్టిని పెట్టుకొని, నన్ను పూజించి, ఇతర జీవులను ద్వేషించే వారికి మనశ్శాంతి లభించదు. అటువంటి కలుషితాత్ములు అధిక ద్రవ్యము వెచ్చించి, ఆడంబరంగా నా పాదపూజలు చేసినా నేను సంతోషించను.

అమ్మా! చైతన్యం లేనిరాళ్లు రప్పలకంటే, చైతన్యంగల చెట్లు చేమలు శ్రేష్ఠములు. స్పర్శజ్ఞానంగల చెట్లకంటె, రసజ్ఞానంకల క్రిమికీటకాదులు శ్రేష్ఠములు. వాటికంటె గంధజ్ఞానము (వాసన చూచేశక్తి) గలవి శ్రేష్ఠములు. వీటికంటే శబ్ద జ్ఞానము (వినికిడిశక్తి) గలవి శ్రేష్ఠము. వీటికంటే రూపజ్ఞానము (చూచేశక్తి) గలవి శ్రేష్ఠములు. వాటికంటే పాదాలపై కదిలేవి శ్రేష్ఠములు. వీటికంటే బహుపాదాలపై కదిలేవి శ్రేష్ఠములు. వీటికంటే చతుష్పాదులూ, వాటికంటే ద్విపాదులూ శ్రేష్ఠతమములు. మానవులలో బ్రాహ్మణులుత్తములు. వీరికంటే వేదవేత్తలూ, వారికంటే వేదార్థములు తెలిసినవారూ, వారికంటే శాస్త్రవిషయాల్లో సందేహాలూ తీర్చేవారూ ఉత్తములు. వీరికంటే స్వధర్మాచరణలో నిపుణులూ, వారికంటే దేనియందూ సంగములేనివారు, వారికంటే సద్ధర్మపరులూ, వీరికంటే సర్వధర్మాలనూ, సర్వస్వభావ విశేషాలనూ విడిచి సర్వమూ నాకే సమర్పించి, అనన్య భావముతో సర్వత్రా సమవర్తనుడై జీవితంగడిపే పుణ్యాత్ముడు సర్వశ్రేష్ఠుడు. అటువంటి పుణ్యపురుషుని చూస్తూ, సమస్త ప్రాణికోటీ ఎల్లప్పుడూ సంతోషిస్తూ అభినందిస్తుంటుంది.

## కపిలబోధ - కాలము

తల్లీ! ఈశ్వరుడు జీవునిలో అనుప్రవేశించి యుంటాడు. ఆయన్ను యోగముచేగాని, భక్తిచేగాని పొందవచ్చు. ఆయన ప్రకృతి పురుషులతో కూడి కర్మ చేయించునట్లుంటాడు. ప్రకృతికి పరుడై కర్మను చేయని వాడై కూడ ఉంటాడు. ఇదే భగవంతుని లక్షణమనవచ్చును. ఈ భగవద్రూపమే భేదములతో కూడియున్నదై, అద్భుతప్రభావశాలియైన కాలముగా వెలసినది. ఈ కాలమే, మహత్తు మొదలైన తత్త్వాలకూ, ఆ తత్త్వాభిమానులైన జీవులకూ భయాన్ని కలిగిస్తుంది. అందుకనే అది సకల జీవులకూ ఆశ్రయమై, వాటియందే ఉంటూ, ఒక ప్రాణిచే మరొక ప్రాణిని గ్రసిస్తుంది. (అంతముచేస్తుంది)

యజ్ఞఫలప్రదాతయైన విష్ణువు కాలరూపుడై, జీవులను తన అదుపులోనుంచుకొని, ప్రభువై ప్రకాశిస్తుంటాడు. ఆయనకు మిత్రుడు, శత్రువు, బంధువు అనే భేద భావం ఎవ్వరిపైనా ఉండదు. ఆయన అందరియందూ ఆవేశించియుండి, బహుజాగరూకతతోనుంటూ, అజాగ్రత్తగానున్నవారిని అంతముచేస్తాడు. ఆయనవలన భయంచేత వాయువు వీస్తుంది, సూర్యుడు వేడినిస్తాడు, ఇంద్రుడు వాన కురిపిస్తాడు, చంద్రుడు ప్రకాశిస్తాడు, ఆయాకాలాలలో చెట్లూ లతలూ ఓషధులతో గూడి, ఫలపుష్పాదులనిస్తాయి. నదులు ప్రవహిస్తాయి, సముద్రాలు హద్దులలోనుంటాయి, అగ్నిమండుతుంది, భూమి కొండల బరువుకు క్రుంగిపోదు, ఆకాశం సకలజీవాలకూ చోటిస్తుంది.

త్రిగుణాలతో కూడియున్న బ్రహ్మాదులు సర్వేశ్వరునిచే సృష్టికార్యమందు నియోగింపబడినవారై ప్రతిదినమూ, ఆయా సృష్టికార్య నిర్వహణలో జాగరూకులైయుంటారు. తల్లితండ్రులు బిడ్డల్ని ఉత్పత్తి చేస్తారు. కాలస్వరూపుడు మృత్యుదేవత సహాయంతో సంహరిస్తాడు. చరాచరాత్మకమైన సకల ప్రపంచమూ భగవానుని అధీనంలోనుంటుంది. ఆయన యొక్క శక్తిని తెలుసుకొనగల సామర్థ్యం ఎవ్వరికీ ఉండదు.

మూఢుడైన మానవుడు, అశాశ్వతములైన ఇల్లు, పొలము, పశువులు, ధనము, సంతానము, భార్య, బంధువులు లాంటివే శాశ్వతమని నమ్మి వాటియందు మమకారము పెంచుకొని, వివిధయోనుల్లో జన్మిస్తూ, అనేక దేహాలను ధరిస్తాడు. అయినా వాటియందు విరక్తిజెందడు. నరకం అనుభవించిన తరువాతకూడ దేహి తన దేహాభిమానాన్ని వదలలేక మాయకులోనై, దానినే అంటిపెట్టుకొని యుంటాడు. భార్యాపుత్రాదుల సంరక్షణలోనే అహోరాత్రాలు కష్టపడి కృశిస్తాడు. ఇంద్రియలోలుడై పాపకర్మలుచేస్తూ కుటిలబుద్ధితో ఇతరులను కష్టపెడుతూ, స్వార్థపరుడై, పోమరియై, జవసత్వాలు కోల్పోయి, వ్యాధిగ్రస్తుడైనా దేహాభిమానాన్ని వదలుకొనలేడు. ఏ పరివారాన్ని పోషించడానికి అతడు అహోరాత్రాలు

శ్రమించి కృశించిపోతాడో ఆ పరివారమే అతనిని అసహ్యించుకొని ఈసడిస్తుంది. మృత్యువు ముంచుకొస్తుంది. దేహాన్ని విడిచి, యాతనా శరీరంలో ప్రవేశిస్తాడు. యమభటులచే బలవంతంగా ఈడ్చుకొని తీసుకెళ్లబడుతాడు. వాళ్లు నానారకాల బాధలు పెడుతుంటే పూర్వజన్మలలో చేసిన పాపాలన్నీ జ్ఞాపకం వస్తాయి. చిత్రహింసలకులోనవుతాడు.

గతజన్మలలో తాను ఆర్జించిన సిరిసంపదలూ, అనుభవించిన ఇంద్రియసుఖాలూ, తనచే పోషింపబడిన ఆలుబిడ్డలూ, ఆప్తులూ, తనవెంట రాకపోగా, వాటిని పొందడానికి తాను చేసిన అకృత్యాలన్నీ పాపశూలాలై తనను ముక్కముక్కలు చెయ్యడానికి ఎదురుచూస్తుంటాయి. అతడు తామిస్రం, అంధతామిస్రం, రౌరవం మొదలైన నరకాలలోపడి, దుర్భరమైన బాధలననుభవించిన తరువాత వేరొక దేహాన్ని ధరిస్తాడు. మళ్లీ అన్నీ పునరావృతం అవుతాయి.

## పిండోత్పత్తిక్రమము:

జీవుడు తన పూర్వ కర్మలననుసరించి, మళ్లీ దేహాన్ని పొందగోరుతాడు. జీవుడు మనుజుని వీర్యబిందు సంబంధముతో స్త్రీగర్భంలో ప్రవేశిస్తాడు. ఐదవ దినానికి బుద్బుదమంత అయి, పదవ దినానికి రేగుపండంతయై, తరువాత మాంసపిండమై, గ్రుడ్డు ఆకారం పొందుతాడు. ఒక నెలకు శిరస్సు ఏర్పడుతుంది. రెండు నెలలకు కాళ్లు చేతులు వస్తాయి. మూడు నెలలకు గోళ్లు, వెంట్రుకలు, ఎముకలు, చర్మము, నవరంధ్రాలు ఏర్పడుతాయి. నాల్గవనెలకు సప్తధాతువులు కలుగుతాయి. ఐదవ నెలకు ఆకలి దప్పులు సంభవిస్తాయి. ఆరవనెలలో మావిచే కప్పబడి, తల్లి కడుపులో కుడివైపున తిరుగుతుంటాడు. తల్లియొక్క అన్న పానాదులతో తృప్తిపొందుతాడు. మలమూత్రాలగుంటల్లో పొర్లుతూ, అందలి క్రిములచే బాధింపబడ్తుంటాడు. తల్లితిన్న కారము, పులుపు, చేదు మొదలైన ఘాటైన రసాలు అతని అవయవాల్ని తపింపజేస్తాయి. మావిచే కప్పబడి, ప్రేగులచే చుట్టబడి, తల్లిపొట్టలో తలదూర్చి, ముడుచుకొని పడియుంటాడు. అవయవాలను కదిలించడానికి శక్తిలేక, పంజరంలోని పక్షివలె బందీఅయి యుంటాడు. భగవంతుడిచ్చిన తెలివితో, పూర్వజన్మలలో చేసిన పాపకృత్యాలు మనస్సులో మెదలగా అయ్యో! అని వాపోతాడు. కించిత్తైన సుఖముకూడా లేకుండా కొట్టుకొంటుంటాడు. ఏడవనెలలో జ్ఞానం కలుగుతుంది. కదలికలు కలుగుతాయి. క్రిముల బాధలతోపాటు, కదలికలు ఎక్కువవుతాయి. తన దుస్థితికి విలపిస్తూ, విమోచనాన్నియాచిస్తూ, చేతులు జోడించి, సర్వేశ్వరుని ఈ విధంగా ప్రార్థిస్తాడు.

"సర్వదా లోకాలను సంరక్షించే ఆ సర్వేశ్వరుని పాదపద్మాలను అచంచల భక్తితో ఆరాధిస్తాను. ఆత్మ స్వరూపుడనైన నాకు ఎలాంటి బంధాలూ లేవు. అయినా, నేను ఈ విధంగా బంధింపబడి ఉండడానికి, నా అజ్ఞానమూ, పూర్వకర్మలే కారణాలు. హేభగవన్! పరిశుద్ధాంతరాత్మా! అఖండజ్ఞానస్వరూపా! పరంజ్యోతీ! సర్వజ్ఞా! శాంతమూర్తీ! ప్రకృతి పురుషులకు అతీతమైన ఓ పరమాత్మా! ఈ భరించలేని భయంకర గర్భనరకం నుండి నన్ను రక్షించి, శాంతిని ప్రసాదించు ప్రభూ!" అంటూ నానావిధాల ప్రార్థిస్తాడు.

అని చెప్పిన కపిల భగవానునకు, తల్లి అయిన దేవహూతి ఇలాగ అడుగుతుంది:

"ఓ మహితాత్మా! ఎవని మాయచే మానవుడు మోహములో చిక్కుకొని, దిక్కుగానక మాతృగర్భంలోపడి కొట్టుకొంటుంటాడో, ఆ దేవదేవుని అనుగ్రహంలేనిదే, ఆయన యొక్క గుణగణాలను స్మరించాలని, వానికి తోచుతుందా?" అని అడిగిన తల్లితో కపిలాచార్యుడిలా చెప్తాడు:

"తల్లీ! భగవంతుడు భూతభవిష్యద్వర్తమానములను మూడు కాలాల్లోనూ, సమస్త చరాచర జీవుల అంతర్యామియై యుండటంచేత, కర్మవశవర్తులైన వారు తమ తాపత్రయాలను నివారించుకొనడానికి, ఆయననే ఆశ్రయించాలని ఆయనే స్ఫురింపజేస్తాడు. జీవుడు తల్లిగర్భంలో మలమూత్ర కోశములలో నెత్తుటి గుంటలో ఆకలిమంటలతో క్రిమికీటకాల బాధలతో క్రుగ్గుతూ, ఆ గర్భనరకంనుండి ఎంతట బయట పడుతానా అని నెలలను లెక్కించుకొంటూ, నన్నెవరైనా బయటకు నెట్టేవారున్నారా అని ప్రార్థిస్తుంటాడు. పరమేశ్వరానుగ్రహంచే, చైతన్యంతోపాటు, పూర్వస్మృతులు కూడా

వస్తాయి. దుష్కృతాలస్మృతులు హింసిస్తాయి. ఆ ఏకైక నాథుడైన భగవానుడే రక్షించాలి అని తెలుసుకొంటాడు. అయితే ఆ పరమపురుషునకు తానేమి అర్పించగలడు? చేతులు జోడించి, నమస్కారము మాత్రమే చెయ్యగలడు. ఈ విధంగా అనుకొంటాడు:

"నేను కేవలం జీవుడను. రాబోవు జన్మలోనైనా శమదమాదిసాధనలతో కూడిన విజ్ఞాన దీపాన్ని వెలిగించుకొని, ఆవెలుగులో సర్వేశ్వరుని చూస్తాను. ఇలాంటి గర్భనరకంలో మళ్లీ పడకుండా కాపాడుమని వేడుకొంటాను." అని భావించినవాడై, జీవుడు తొమ్మిది నెలలూ పూర్తయ్యేవరకూ, బయట పడరాదనే, గడిపివేస్తాడు. కాని పదవ మాసం రాగానే అతడు అధోముఖుడై (తలక్రిందులుగా) తిరిగిపోతాడు. ఊపిరాడక ఉక్కిరి బిక్కిరవుతాడు. అంతవరకూ తనలోనున్న జ్ఞానమూ, పూర్వస్మృతులూ అదృశ్యమవుతాయి. నెత్తురుతో బైటపడుతాడు. ఏడుస్తూ ఎరుకలేనివాడై, తనమనసులోని మాటను తెలుసుకొనలేని వారిచే పోషింపబడుతుంటాడు. ఆవిధంగా అనేకమైన బాల్యశైశవారిష్ట బాధలు పడుతూ, యువకుడై కోర్కెలను తీర్చుకొనడానికి పాటుపడుతూ, కామక్రోధాలు, రాగద్వేషాలూ, అహంకార మమకారాలూ పెంచుకొంటూ, కర్మబంధాలూ, పాపసంచయాలూ పెంచుకొంటూ చరిత్రను పునరావృతం చేసుకొంటాడు. దుష్టసాంగత్యమువలన సత్యము, శుచిత్వము, దయ, ధైర్యము, మితభాషణం, బుద్ధి, సిగ్గు, ఓర్పు, కీర్తి, శమము, దమము మొదలైన సద్గుణాలు నశిస్తాయి. మాతా! మూఢచిత్తులు, శాంతిలేనివాళ్లు, దేహమే ఆత్మయని భావించేవాళ్లు, స్త్రీ సౌఖ్యం గురించి గొలుసుతోకట్టబడిన పెంపుడు జంతువులాగ ప్రవర్తించేవాళ్లు వీరంతా శోచనీయులు. వీరి సాంగత్యం వర్జనీయం. పురుషునకు పరస్త్రీ సాంగత్యము అత్యంత గర్హనీయం. మాయారూపమైన స్త్రీ పురుషుని మోహంలో పడవేసి పతనంచేస్తుంది. స్థిర బుద్ధితో నాపాదపద్మసేవ చేయదలచుకొన్న వారు కామినీకాంతాసంగము నరకద్వారంగా భావిస్తారు. ధనధాన్యాలు, పశువులు, మిత్రులు, స్త్రీ గృహాదులకు కారణభూతమైనది ఈ శరీరము. జీవుడు వీటిని అనుభవించి, మళ్లీ అనుభవించాలని కర్మలుచేస్తూ మళ్లీ మళ్లీ జన్మిస్తుంటాడు. ఆకాశంలోనికి ఎగిరిపోయినా దూరదిశలకు పారిపోయినా, భూమిలోనికి దూరిపోయినా ఈ కర్మఫలాలను అనుభవింపక తప్పదు. పురుషరూపము ధరించిన జీవుడు నిరంతర స్త్రీవ్యామోహ సాంగత్యముచేత, స్త్రీ అయి జన్మిస్తాడు. ఇలాగే స్త్రీరూపంలో పుట్టిన జీవి తనకు ధనమూ సుఖమూ ఇస్తాడు కదా అని పురుషునిగా పుట్టిన జీవి యందు వ్యామోహంపెంచుకొని, సంసారబంధానికి పాల్పడరాదు. జీవునకు ఆధారంగా లింగదేహముంటుంది. అది ఇతర లోకాలను పొందుతూ, కర్మఫలాలనుభవిస్తూ, మళ్లీ కర్మలయందు ఆసక్తిని పెంచుకొని దేహధారణచేస్తుంది. అదే జన్మము. ఆదేహాన్ని లింగశరీరం విడిచి వెళ్లడమే మరణము. వాస్తవానికి జీవునికి జనన మరణాలులేవు. అందుచేత మానవుడు భయకార్పణ్యాలను (దైన్యమును) విడిచిపెట్టి, జీవుని యథార్థతత్త్వాన్ని తెలుసుకొని, ధీరుడై, సంగాన్నివీడి, యుక్తమైన వైరాగ్యాన్ని అలవరచుకొని, సమ్యక్ జ్ఞానముతో మాయా కల్పితమైన ఈ ప్రపంచంలో దేహాదులందు ఆసక్తిని మాని ప్రవర్తించాలి. పంచభూతాత్మకమైన స్థూలదేహము నశించే స్వభావం కలది. వాసనామయ, మనోబుద్ధి చిత్త అహంకారాలతో నేర్పడిన సూక్ష్మదేహాన్ని (లింగశరీరాన్ని) వదలించుకొంటే, ఇక మిగిలేది ఆత్మమాత్రమే. లింగదేహాన్ని వదలించుకోవడమే కఠినమైన సాధన. ఇది కేవలం మానవజన్మద్వారానే సాధ్యపడుతుంది భగవంతునియందు అచంచలమైన అనన్య భక్తిచేతనే, ఆయన యొక్క కరుణాకటాక్ష అనుగ్రహాల చేతనే సూక్ష్మదేహము తొలగిపోతుంది. సుఖదుఃఖాలు మనోమయాలు కనుక, మనస్సును సంస్కరించుకొంటే అవి దరిజేరవు. కేవలం ఆత్మయే శాశ్వతమైనది కనుక దానియందు, ఏకమవడమే మానవజన్మసాఫల్యము అని గ్రహించి, భగవానుని అనుగ్రహాన్ని అర్థించాలి.

**దేహాంతరయానము** : సంసారానికి కట్టుపడిన గృహస్థులు, ధర్మార్థకామాలపై ప్రీతిని పెంచుకొని, వాటితోనే సంతుష్టులై, వాటిని సాధించడంలోనే మునిగితేలుతూ ఉంటారు. వేదాలలో చెప్పబడిన భగవద్భక్తికీ, భాగవతధర్మాలకూ విముఖులైయుంటారు. దేవతాగణాలను ఆరాధిస్తుంటారు. పితృకార్యాలనూ, వైదికకామ్యకర్మలనూ శ్రద్ధగా చేస్తుంటారు. కోర్కెలతో నిండియున్న మనస్సుగల ఇలాంటివారు మోక్షాన్ని పొందలేరు. వారు ధూమ్రాది మార్గాలలో చంద్రలోకం చేరి, అక్కడ సుఖాలనుభవించి, పుణ్యం తరిగిపోగా మళ్లీ జన్మ ఎత్తడానికి భూలోకానికి తిరిగివస్తారు.

బుద్ధిమంతులు ప్రళయకాలంలో యోగనిద్రలోనున్న శ్రీమన్నారాయణుని ధ్యానిస్తారు. వారు అచంచలమైన భక్తిప్రపత్తులతో తమతమ ధర్మాలన్నీ (మనోబుద్ధి - అహంకారధర్మాలను) ఆ శ్రీహరికే సమర్పించి, ప్రశాంత చిత్తులై, సర్వసంగ పరిత్యాగులై నిత్యమూ ఆయననే ధ్యానిస్తూ ఉంటారు. నేను, నాది అనే అహంకార మమకారాలులేని వారైయుంటారు. ఆ సర్వేశ్వరునిపై బుద్ధి నిలిపి, వెలుగు మార్గంలో పయనించి, తేజోవిరాజితమైన ఆనందమయ దివ్యధామాన్ని శాశ్వతంగా చూరగొని, సుఖించే ధీరులు పునర్జన్మపొందడానికి ఈ భూమిపైకి ఎన్నడూ రారు.

కొందరు చతుర్ముఖ బ్రహ్మనే పరమాత్మగా భావించి ఉపాసిస్తారు. వారు బ్రహ్మలోక వాసులతో కూడి, బ్రహ్మదేవునితోపాటు మహాప్రళయసమయంలో ఆ పరమేశ్వరునియందు లీనమైపోతారు. అందుచేత (ఇతరదేవతల నారాధించకుండా), సర్వహృదయనివాసీ, అద్వితీయుడూ, శాశ్వతుడూ అయిన ఆ పురుషోత్తమునే మనసారా శరణువేడాలి. యోగీంద్రులూ, సనకసనందాది కుమారులూ, సిద్ధులూ, మునులూ, దేవతలూ, అందరూ ఆపరాత్పరునే భజిస్తారు. సర్వేశ్వరుడు అనేక రూపాలలో అవతరిస్తుంటాడు. ఆయన అంశతో పుట్టిన ఋషులూ, దేవతలూ తమ కర్మఫలాన్ని అనుసరించి, జన్మించి ఐశ్వర్యం పారమేష్ఠ్యం అధికారంపొంది తిరిగివస్తారు. మరికొందరు కర్మానుసారమైన బుద్ధికలవారై, ధర్మవర్తనులై, రజోగుణోపేతులై, కామప్రవృత్తిలో ఇంద్రియాధీనులై, పితృదేవతలనే ఆరాధిస్తూ, సంసార మగ్నులై యుంటారు. వీరిని త్రైవర్గిక పురుషులంటారు.

అమ్మా! ధూమ్రమార్గాన వెళ్లినవారు పితృలోకాలకు వెళ్లి, పుణ్యము తరిగిపోగానే తిరిగివచ్చి, తమ బిడ్డలకే బిడ్డలై జన్మిస్తారు.

అనంత కల్యాణగుణ విశిష్టుడైన ఆపరమేశ్వరుని భజిస్తూ ఆయన మధుర కథాసుధలను తనివితీరా గ్రోలెడి వారే ధన్యాత్ములు. పరమేశ్వరుడైన వాసుదేవుని యందుండే భక్తివలన జ్ఞాన వైరాగ్యాలు కలుగుతాయి. ఇవే బ్రహ్మ సాక్షాత్కారానికి సాధనాలు. భగవద్భక్తితో కూడిన చిత్తము ఇంద్రియ వ్యాపారాలలో అంటీఅంటనట్లు సమవర్తియై యుంటుంది. అట్టి భక్తునకు ప్రియాప్రియాలు, విషయలాలస ఉండవు. గ్రహింపదగినవి, తిరస్కరింపవలసినవి ఉండవు. సర్వత్ర సమదర్శన మేర్పడుతుంది. ఆత్మను తనయందే దర్శించగలడు.

జ్ఞానస్వరూపుడూ, పరబ్రహ్మ, పరమాత్ముడు, ఈశ్వరుడు అయిన పరమేశ్వరుడు ఏకరూపుడే అయినా, (అరూపుడే అయినా), చూచేవారిని బట్టి, చేసే సాధనలనుబట్టి వేరువేరు రూపాలలో గోచరిస్తాడు. విషయాలనుండి వెనుకకు మరలిన ఇంద్రియాలవలన పరబ్రహ్మదర్శనం లభిస్తుంది. విరాట్పురుషుడు జీవస్వరూపుడు. బ్రహ్మాండమునందు నిండియుంటాడు. పరబ్రహ్మము నిర్గుణమనీ, యోగసాధనవలననే అనుభూతి కలుగుతుందనీ జ్ఞానయోగులంటారు. నేను చెప్పిన భక్తియోగంలో పరమాత్మ సగుణుడు, వాస్తవానికి భక్తియోగము, జ్ఞాన యోగము వేరువేరుకాదు. ఒక్కటే. సమస్త శాస్త్రాలనూ బాగుగా అనుష్ఠించడం చేతగాని, తీర్థ దర్శనాలచేగాని, జపతప - అధ్యయన యోగక్రియలచేగాని, దాన ధర్మ కర్మలచేగాని, ఆ పరమేశ్వరుడు గోచరించడు. కాని, మనస్సునూ, ఇంద్రియాలనూ వశపరచుకొని, సకల కర్మలూ భగవదర్పితముగా చేపట్టి, ఆత్మ తత్త్వజ్ఞానముతో తరిగిపోని వైరాగ్యముతో, కర్మఫలముపై సంగము లేకుండా ప్రవర్తించే వ్యక్తి మాత్రమే హేయగుణాలను పోగొట్టుకొని, అనంత కల్యాణగుణ విశిష్టుడైన ఆ పరమాత్మను చేరగలడు.

అమ్మా! నీకు భక్తిమార్గాన్నీ, సాంఖ్యయోగాన్నీ వివరించాను. దీనిని దుష్టునకు, నీతిహీనునకు, ఇంద్రియలోలునికీ, సంసార వ్యామోహంలో చిక్కుకొన్నవానికి, భక్తిలేనివానికి ఉపదేశించరాదు. భక్తుడు, శ్రద్ధాళువు, శాంతచిత్తుడు, దుష్టమైనకోరికలులేనివాడు, సర్వభూతమిత్రుడు లాంటి వానికే ఈ యోగము ఉపదేశింపదగినది.

**దేవహూతి మోక్షము పొందుట :** ఈ విధంగా మహాపతివ్రత అయిన దేవహూతి పుత్రుడైన కపిల భగవానుని ఉపదేశంపొంది, మోహము తొలగించుకొని, భగవానునికి సాష్టాంగదండ ప్రణామములచేసి ఇలాగ స్తుతించినది:-

"ఓ మహానుభావా! మహాప్రళయ సమయంలో సమస్తభువన సముదాయాన్నీ నీకుక్షిలో పదిలపరచుకొని, మహాసాగరమధ్యలో మఱ్ఱియాకుపాన్పుపై మాయాశిశువై ఒంటరిగా శయనించియుండు ఓ వటపత్రశాయీ! నిన్ను సాక్షాత్తూ సృష్టికర్త అయిన

ఆ చతుర్ముఖ బ్రహ్మయే తెలుసుకొనలేడు కదా! స్వామీ! నా పూర్వపుణ్య విశేషముచే నీవు నా గర్భాన ఉదయించడం వలన నాజన్మ ధన్యమైనది సుమా! ఓ జ్ఞానస్వరూపా! మంగళకరమైన నీ నామాన్ని స్మరించినా, కీర్తించినా, దరిద్రులు శ్రీమంతులౌతారు. నీచులు ఉత్తములౌతారు. నీ మధురకథాసుధారసాన్ని ఆస్వాదించిన వారికి సకల పుణ్యఫలాలూ ప్రాప్తమౌతాయి. పరమపురుషుడవూ, పరబ్రహ్మవూ, వేదమూర్తివీ, అయిన నీకు అనేక నమస్కారాలు". అని స్తుతించిన మాతృమూర్తిని కపిల భగవానుడు ఆశీర్వదించి నిష్క్రమించాడు.

జ్ఞానోదయంపొందిన దేవహూతి, తన సర్వస్వమూ పరిత్యజించి, సరస్వతీనదీ తీరమునందలి బిందు సరోవరం ఒడ్డున తపోదీక్ష వహించినది. ఏకాగ్రచిత్తముతో శ్రీమన్నారాయణ పాదపద్మాలపై చిత్తాన్ని నిలిపి, తీవ్రవైరాగ్యముతో పరిశుద్ధ మనస్కయై ధ్యానించినది. ఆమెకు బ్రహ్మజ్ఞానం సిద్ధించినది. జీవభావం నశించినది. విష్ణుదేవునిలో విలీనమయినది. ఆ పవిత్ర క్షేత్రము సిద్ధపదం అనే పేరుతో ప్రసిద్ధి జెందినది.

మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు :

"నాయనా! ఈ కపిల దేవహూతి సంవాదము అత్యంత పవిత్రమైనది. దీనిని భక్తిశ్రద్ధలతో పఠించినవారు, విన్నవారు శ్రీహరి పాదకమలాలను చేరుకొంటారు" అన్నాడు.

అని శ్రీశుకుడు పరీక్షితునకు చెప్పినట్లుగా సూతుడు శౌనకాదిమునులకు చెప్పెను.

**హరిః ఓం తత్సత్**
**తృతీయస్కంధము సమాప్తము.**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# చతుర్థస్కంధము

## స్వాయంభువపుత్రికలవంశవిస్తరణ

తనసృష్టికార్యక్రమములో ప్రజోత్పత్తే ప్రథమకర్తవ్యమని భావించి, బ్రహ్మదేవుడు తనశరీర దక్షిణభాగమునుండి స్వాయంభువు అనే ఒక మహాపురుషునీ, వామభాగమునుండి శతరూప అనే ఒక సుందర స్త్రీమూర్తినీ సృష్టించి, వారిని ఆది దంపతులుగాచేసి, సంతానోత్పత్తి చేయుమని ఆదేశించాడు. వారికి ఆకూతి, దేవహూతి, ప్రసూతి, అనే ముగ్గురు పుత్రికలు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు పుత్రులు కలిగారు. స్వాయంభువమనువు ఆకూతిని రుచిప్రజాపతికీ, దేవహూతిని కర్దమప్రజాపతికీ, ప్రసూతిని దక్షప్రజాపతికీ ఇచ్చి వివాహం చేశాడు విశ్వకర్మ ప్రజాపతియొక్క కుమార్తె అయిన బర్హిష్మతి ప్రియవ్రతుని భార్య. ఉత్తానపాదునకు సునీతి, సురుచి అనే ఇద్దరు భార్యలు. వీరందరి సంతానాలతోనే ప్రజోత్పత్తి విస్తరించినది.

**ఆకూతి** : రుచిప్రజాపతి, సద్గుణసంపన్నుడు, దైవభక్తితత్పరుడు, బ్రహ్మతేజస్వి. ఆకూతిని అతనికిచ్చి, వివాహము జరిపించునప్పుడు స్వాయంభువ మనువు "పుత్రికా ధర్మపద్ధతిని " అవలంబించడానికి రుచిని ఒప్పించాడు. ఈ పద్ధతి ప్రకారము పుత్రికకు పుట్టిన కుమారుని, ఆమెతండ్రి తన పుత్రునిగా పెంచుకొనవచ్చును. శ్రీమన్నారాయణుడు, ఆదిలక్ష్మి రుచియొక్క ప్రార్థనలకు ప్రసన్నులై, ఆకూతి గర్భాన, యజ్ఞుడు, దక్షిణ, అనబడే కవలబిడ్డలుగా అవతరించారు. యజ్ఞుడు అనుకొన్న ప్రకారము స్వాయంభువ మనువు పుత్రునిగా పరిగణింపబడి, సహోదరి అయినప్పటికీ, దక్షిణను వివాహం చేసుకొన్నాడు. వారిద్దరికీ, పన్నెండుగురు కుమారులుదయించారు. వారు: తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి, ఇడస్పతి, ఇధ్ముడు, కవి, విభువు (విభుడు), స్వహ్నుడు (వహ్ని) సుదేవుడు, రోచనుడు అనబడేవారు. వారిని తుషితులు, యాములు అంటారు. స్వాయంభువ మన్వంతరంలో వారు దేవతలుగా వెలిశారు. యజ్ఞుడు దేవేంద్రుడయ్యాడు. మరీచాది ఋషులు ఈ మన్వంతరంలో సప్తర్షులైనారు.

**దేవహూతి** : ఈమెకు కర్దమప్రజాపతితో వివాహమయి, వాళ్లకు నారాయణుడు కపిల భగవానుడై ఉదయించడం ఇదివరకే చెప్పబడినది. వారికి తొమ్మండుగురు పుత్రికలు పుట్టారు. వారు:

కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఊర్జ, శాంతి, ఖ్యాతి అనబడేవారు. వీరిని తొమ్మండుగురు బ్రహ్మర్షులకిచ్చి వివాహం చేశారు.

**కళ:** మరీచి మహర్షికి పత్ని అయి, కశ్యపుడనే కుమారునీ, పూర్ణిమ అనే కుమార్తెనూ కన్నది. కశ్యపుని సంతతితోనూ, పూర్ణిమ సంతతితోనూ ముల్లోకాలూ నిండిపోయాయి. పూర్ణిమకు విరజుడు, విశ్వగుడు అనే కుమారులూ, దేవకుల్య అనే కుమార్తె కలిగారు.

**అనసూయ** అత్రి మహామునికి పత్ని అయినది. వారికి బ్రహ్మ అంశతో సోముడు, విష్ణు అంశతో దత్తుడు, రుద్ర అంశతో దూర్వాసుడు పుత్రులుగా జన్మించారు.

**శ్రద్ధ అంగిరసమునీంద్రుని** భార్య అయినది. వారికి శినీవాలి, కుహూ, రాక, అనుమతి అనే నలుగురు కుమార్తెలు, ఉతథ్యుడు, బృహస్పతి అనే ఇద్దరు కుమారులు కలిగారు.

**హవిర్భువు** పులస్త్య ప్రజాపతికి పత్ని అయినది. వారికి అగస్త్యుడు, విశ్రవసువు పుత్రులైనారు. విశ్రవసువునకు ఇలబిల అనే భార్యయందు కుబేరుడూ, కైకసి అనే భార్యయందు రావణ కుంభకర్ణ విభీషణులూ జన్మించారు.

**గతి** పులహమునికి భార్యయై కర్మశ్రేష్ఠుడు, వరియసుడు, సహిష్ణుడు అనే ముగ్గురు కొడుకులను కనెను.

**క్రియ** క్రతువు అను ఋషికి భార్యయై, అరవై వేలమంది వాలఖిల్యులనబడే మహర్షులను కన్నది. వారు చేతి బొటనవేలంత ఆకారంతో బ్రహ్మతేజస్సుతోనున్నారు.

**ఊర్జ** వశిష్ఠ మహర్షికి భార్య అయి, చిత్రకేతువు, సురోచి, విరజుడు, మిత్రుడు , ఉల్బణుడు, వసుభృత్తు, ద్యుమానుడు, అనే ఏడుగురు బ్రహ్మర్షులనుకన్నది. వీరు మూడవ మన్వంతరంలో సప్త - ఋషులయ్యారు. ఊర్జ అరుంధతి అని కూడ అనబడేది.

**శాంత** (చిత్తి) అథర్వణుని భార్య అయి, ధృతవ్రతుడు, దధ్యంచుడు, అశ్వశిరుడు అనే పుత్రులను కన్నది.

**ఖ్యాతి** భృగుమహర్షికి భార్య అయినది. వారికి ధాత, విధాత అనే ఇద్దరు పుత్రులూ 'శ్రీ' అనే పుత్రిక, కలిగారు. మేరువు తన పుత్రికలైన ఆయతి, నియతి అనే వారిని, ధాత, విధాతలకిచ్చి, వివాహంచేశాడు. ధాత, ఆయతులకు మృకండుడు, విధాత నియతులకు ప్రాణుడూ పుట్టారు. మృకండునకు మార్కండేయుడూ, ప్రాణునకు వేదశిరుడూ అనే కొడుకులు పుట్టారు. వేదశిరుని పుత్రుడే శుక్రుడు. (కవి అని కూడా అంటారు) శుక్రుడు, భృగువంశ శ్రేష్ఠుడు. రాక్షసులగురువు.

దేవహూతి కర్దముల తొమ్మండుగురు పుత్రికల సంతతి పరంపరలే కాకుండా, ప్రసూతి, దక్షప్రజాపతుల బిడ్డల సంతతులతోకూడ లోకాలు నిండిపోయినవి.

స్వాయంభువ మనువుయొక్క మూడవ పుత్రిక ప్రసూతిని దక్షప్రజాపతికిచ్చి వివాహం చేశాడు. వారికి పదహారుగురు సుందరీమణులైన కన్యలు కలిగారు. వారిలో శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి, అనే పదముగ్గురు కన్యలను ధర్మునకిచ్చి వివాహం చేశాడు. తరువాతి కన్య అయిన స్వాహాను అగ్నిదేవునికీ, స్వధా అనే కన్యను పితృదేవతలకు, సతి అనే సాధ్విని పరమశివునకు ఇచ్చి వివాహంచేశారు.

ధర్మమున్న చోటికే సకల సద్గుణాలూ చేరుతాయి అని సూచించునట్లున్నవి ధర్ముని భార్యల నామాలు. వారికి పుట్టిన బిడ్డల పేర్లు కూడా విశిష్టముగానే ఉన్నవి. శ్రద్ధ పుత్రుని పేరు శుభుడు. మైత్రికి ప్రసాదమూ, దయకు అభయమూ, శాంతికి సుఖమూ, తుష్టికి ఆనందమూ, పుష్టికి గర్వమూ, క్రియకు యోగమూ, ఉన్నతికి దర్పమూ, బుద్ధికి అర్థమూ, మేధకు స్మృతి, తితిక్షకు క్షేమమూ, హ్రీకి ప్రశ్రయము (వినయము) అనే నామధేయాలుగల పుత్రులు జన్మించారు. మూర్తి అనే ఆమెకు, సమస్త కల్యాణగుణ శోభితుడైన శ్రీమన్నారాయణుడే, నరనారాయణ ఋషులనబడే ద్వయంగా జన్మించాడు. ఆ శుభసమయంలో దిక్కులు ప్రకాశించినవి. లోకాలు ఆనందంతో పరవశించినవి. పుష్పవృష్టి కురిసినది. గంధర్వులు గానం చేశారు. దేవతలు వచ్చి స్తుతించారు. ఈ నరనారాయణులు ఋషులై, గంధమాదన పర్వతాలకు వెళ్లిపోతారు. వారే ద్వాపర యుగంలో భూభారమును తగ్గించడానికి కృష్ణార్జునులై అవతరిస్తారు.

స్వాహాదేవికి అగ్నిదేవునకు, పావకుడు, పవమానుడు, శుచి అనే పుత్రులు పుడుతారు. వీరినుండి నలుబది ఐదు అగ్నిహోత్రులు జన్మిస్తారు. స్వధ అనేదక్షపుత్రికకు వయున, ధారిణి అనే పుత్రికలు పుడుతారు. వారిని మేధ, వైతరణి అని కూడా అంటారు. వారు బ్రహ్మజ్ఞానముగలవారై, బ్రహ్మచారిణులుగానే ఉండిపోయి, బ్రహ్మోపదేశము చేసేవారైనారు.

## సతీదేవి - దక్షయజ్ఞము

దక్షప్రజాపతి అనుంగు పుత్రిక సతీదేవి. ఆమె పరమశివుని పత్ని. పూర్వము బ్రహ్మవేత్తలు ఒక మహాయజ్ఞాన్ని ప్రారంభించారు. దానికి బ్రహ్మ, శివుడు, యోగీశ్వరులు, దేవతలు, ప్రజాపతులు మొదలైన వారెందరో వచ్చారు. దక్షప్రజాపతికూడ వచ్చాడు. ఆతడు రాగానే బ్రహ్మ, రుద్రుడు తప్ప, అందరూ లేచి నిల్చున్నారు. తన అల్లుడైన

శివుడు నిలబడకుండా తనను అవమానించాడని భావించి, దక్షుడు క్రుద్ధుడై, నానాదుర్భాషలతో శివుని నీచంగా వర్ణిస్తూ, ఇతనికి నా పుత్రికనిచ్చి చాలా పొరపాటు చేశాను అంటూ "ఇతడు దేవతలతో పాటు పొందుతున్న హవిర్భాగాన్ని, ఇక నుండి పొందకుండుగాక" అని శపించాడు. సభలోని పెద్దలు, దక్షుని ఈ అనుచిత ప్రవర్తనకూ, ఇచ్చినశాపానికీ, నిరసన తెల్పగా, దక్షుడు వారిపై కోపగించుకొని, సభనువీడి వెళ్లిపోతుండగా శివభృత్యుడైన నందీశ్వరుడు రోషము తెచ్చుకొని ఇలాగన్నాడు:

"ఈదక్షుడు, ఆత్మజ్ఞానములేనివాడై, దురహంకారంతో మతిపోగొట్టుకొన్నాడు. తనకేవిధమైన కీడు చెయ్యకుండా ప్రశాంతంగా కూర్చొనియున్న ఈశ్వరుడైన మహాదేవునే ఆత్మతత్త్వాన్ని విస్మరించి, తన అల్లుడే కదా అని నానా దుర్భాషలాడినాడు. దేహమే ఆత్మ అనుకొని, శరీరమే శాశ్వతం అనుకొనే ఈ మూర్ఖుడు, బుద్ధిలేని జంతువులాగ ప్రవర్తించినాడు, గనుక వీనితల గొర్రెతల అగుగాక! వీనిని అనుసరించే ఈ బ్రాహ్మణులు స్వార్థపూరితులై వైదిక కామ్యకర్మలనే చేస్తూ, సదా సంసారంలోనే చిక్కుకొని, యాచకులై తిరుగుచుందురుగాక!" అని శపించాడు. అది విని, భృగుమహర్షి కుపితుడై ఇలాగన్నాడు:

"రుద్రుని అనుసరించువారు, వేదవిరుద్ధమైన కర్మలనాచరించే పాషండులగుదురు గాక! శుచిలేని వారై, జడలు, భస్మము, ఎముకలు ధరించినవారై సురాపానము చేస్తూ ఆత్మ జ్ఞానము పొందనివారై యుందురుగాక!" అని శపించాడు.

ఈ శాప ప్రతిశాపాలకు మిక్కిలి ఖిన్నుడైన శివుడు, ఉదాసీనుడై శాంతముగ లేచివెళ్లిపోయాడు.

యజ్ఞము యథావిధిగా వెయ్యి సంవత్సరాలకు సమాప్తమయినది.

బ్రహ్మసత్రయాగము ముగిసి చాలాకాలమైనది. బ్రహ్మ ప్రజాపతులలో ముఖ్యునిగా దక్షుని నియమించి, అభిషేకం చేశాడు. దీనితో దక్షుని గర్వాహంకారాలు ఇంకా పెరిగిపోయాయి. అకారణంగా శివునిపై దినదినానికీ ద్వేషం పెంచుకొన్నాడు. శంకరుని అవమానించే ఉద్దేశ్యంతో బృహస్పతిసవనమనే ఒక క్రతువును ప్రారంభించి, దానికి ముందుగా చేయవలసిన వాజపేయాన్ని రుద్ర రహితంగా చేశాడు. శివుడులేని యజ్ఞము ఉండదు. అయినా ఆ దక్షుడు అలాగ చేశాడు. ఆ బృహస్పతి సవనానికి, బ్రహ్మర్షులు, దేవర్షులు, మహర్షులు, పితృదేవతలు, ప్రజాపతులు, వారివారి భార్యలతో విచ్చేశారు. రావలసిన దేవతలింకా తమతమ విమానాలలో భార్యలతో సహా వస్తున్నారు. ఆకాశవీధుల్లో మాట్లాడుకొంటూ వస్తున్న దేవతాగంధర్వస్త్రీలు చక్కగా అలంకృతలై వెళ్లుతుండడం చూచి, వారి మాటలను విని, శివపత్ని అయిన సతీదేవి తానుకూడా పతిసహితంగా వెళ్లిచూస్తే బాగుంటుందని భావించినది. పతిదేవుని ఇలాగ అర్థించినది:

"ప్రభూ! మీ మామగారైన దక్షప్రజాపతి ఒక మహాయజ్ఞమును నిర్వహిస్తున్నట్టున్నది. విమానాల్లో వెళ్లుతున్న దేవతాస్త్రీ పురుషుల మాటలు విని తెలుసుకొన్నాను. మాతోబుట్టువులూ పినతల్లులూ, బంధువులూ అందరూ వెళ్లియుంటారు. మనముకూడా అక్కడకు వెళ్లితే అందరినీ కలుసుకొనవచ్చు. మీరు సర్వజ్ఞులు, ఇక్కడ ఉంటూనే అన్నీ చూడగలరు. నాకు అవన్నీ చూడాలని చాలా కోరికగానున్నది. ఆహ్వానములేనిదే ఎలాగ వెళ్లడం అని మీరనుకొనవచ్చు, కాని పుట్టింటికి వెళ్లడానికి బిడ్డకు ఆహ్వానమెందుకు? మీరు దయామయులు, ప్రేమమయులు, మీ శరీరములోనే నాకు చోటిచ్చిన మీరు నా ఈ చిన్నకోర్కెను తీర్చగలరు" అని ప్రాధేయపడిన అర్ధాంగితో మహేశ్వరుడు మందహాసంతో ఇలా అన్నాడు:
"మానవతీ! నీకోరిక యుక్తముగానే ఉన్నది. పుట్టింటిలో జరుగుతున్న మహోత్సవానికి, ఆహ్వానింపబడక పోయినా, ఆత్మీయులు వెళ్లాలనుకొనవడంలో తప్పులేదు. అయినవారినీ, అతిథులనూ, బంధువులనూ చూడాలని ముచ్చటపడడం కూడా సమంజసమే! కాని, దురహంకారంతో కన్నులూ, బుద్ధీ మూసుకొనిపోయిన వారింటికి, ఆహ్వానం లేకుండా వెళ్లితే, ఆదరం పొందడానికి బదులుగా అవమానాన్ని ఎదుర్కొనవలసి వస్తుంది. నీ తండ్రికి అకారణంగా నామీద ఎందుకంత ద్వేషమో తెలియటం లేదు. ఇది విష్ణువుమీద కారణములేకుండానే దానవులు వైరము పెంచుకొన్నట్టున్నది. నాయెడల నీ తండ్రి ప్రవర్తన దుష్టము. నీవునా భార్యవు అవడం చేత నిన్నుకూడ నీ తండ్రి గౌరవించడు. నామాట కాదని నీవు వెళ్లినట్లయితే

నీవాళ్లందరి ఎదుట నీకు అవమానమే జరుగుతుంది. అప్పుడు అలాంటి అవమానముకంటే మరణమే మేలు అని నీకు అనిపించవచ్చు. బాగా ఆలోచించుకొనుము." అని అత్యంత సానుభూతితో చెప్పిన పతిదేవుని హితవాక్కులను సతీదేవి స్త్రీ సహజమైన పుట్టింటి మమకారంతో, చపల చిత్తముతో సరిగా అర్థం చేసుకొనక, అతి స్వల్పమైన తన కోరికను భర్త తిరస్కరించాడని రోషము తెచ్చుకొని వివేకాన్ని కోల్పోయినది. తన శరీరంలో సగ భాగమిచ్చి, గౌరవించి ప్రేమించే తన స్వామిమాట కాదని, పుట్టింటికే వెళ్ల నిశ్చయించుకొని, విసవిసా వెళ్లిపోయినది. ఆమె వెనుక పార్షదులు, యక్షులు, ప్రమథగణాలు, పరిచారికలు, నందీశ్వరుడూ పరుగునవెళ్లి, వాహనంపై కూర్చుండబెట్టి వెంటవెళ్లారు.

యజ్ఞము వైభవోపేతముగా జరుగుతుంది. సతీదేవి రావడం చూచి, ఆమెతల్లి, తోబుట్టువులూ ప్రేమతోపలుకరించినా, తండ్రిమాత్రము ఆమెవైపు చూడలేదు, ఆదరించలేదు. త్రిమూర్తులలో నొక్కడైన ఆమెభర్తకు యజ్ఞములో భాగము కల్పించలేదు. తమను ఆహ్వానించలేదు సరికదా, ఆమె తనకుగా తానై వచ్చినా, పల్కరించక ముఖము త్రిప్పుకొన్నాడు. తన తండ్రి ఉద్దేశపూర్వకంగా అవమానించదలచి, అలాగ ప్రవర్తిస్తున్నట్టు సతీదేవికి తెలిసిపోయినది. అందరూ చూస్తుండగా, తండ్రినుద్దేశించి, ఇలాగ అన్నది. "పరమశివుడు, ముల్లోకాల్లోని ప్రాణులందరికీ ఎంతో ఇష్టమైనవాడు. ఆయనకు ఎవ్వరిపైనా ద్వేషముగాని, కోపముగాని ఉండదు. అందరియెడలా కరుణజూపి, అడిగినంతనే అనుగ్రహించే భోలాశంకరుడు అమహనీయుడు. నీచులతో సహా అందరియందూ ఆదరం చూపే పవిత్రమూర్తి అతడు. ఆయననామాన్ని ఒక్కసారి "శివ" అని మనస్సులో తలచినంతనే సమస్త పాపాలూ హరించుకొనిపోతాయి. ఆయన శ్మశానంలోవసించుగాక, బూడిదను ధరించుగాక, భూతపిశాచాలతో సంచరించుగాక, ఆపరమశివుడు మంగళమూర్తి, శుభంకరుడు, లోకపావనుడు. తననుగురించి ఏమీ ఉంచుకొనకుండా, సకలైశ్వర్యాలూ భక్తులకు చేకూర్చే కల్యాణకరుడు. త్యాగమూర్తి. అటువంటి మహేశ్వరునిపై చిన్నబుద్ధితో నీవు ద్వేషముపెంచుకొని, శత్రువులాగ ప్రవర్తిస్తున్నావు. నీలాంటి నీచునికీ, శివద్వేషికీ, తనయనై పుట్టినందుకు నన్ను నేను అసహ్యించుకొంటున్నాను. దాక్షాయణీ అని పిలిపించుకోవడం నేను ఇక భరించలేను. శివనిందను విని, ఏమీ చెయ్యలేని వ్యక్తి తానే చావాలి. నీనుండి పుట్టిన ఈ నాదేహము, ఆ శంకరుని సేవకు ఇక పనికిరాదు. దీనిని ఇక్కడనే విడిచిపెడ్తాను." ఈ విధంగా దక్షుని నిందించి, ఉత్తరదిశగా కూర్చొని ప్రాణవాయువులను నిరోధించి, యోగాగ్నిని రగుల్చుకొని, ప్రాణనాథుడైన పరమశివునియందు చిత్తమును నిలిపి దేహత్యాగము చేసినది. సభాసదులలో హాహాకారాలు చెలరేగాయి. అంతా చూస్తూకూడా నిర్దయుడై ఊరుకొన్న దక్షుని చూచి, నీచుడనీ, నిర్దయుడనీ, నికృష్టుడనీ, పాపాత్ముడనీ నానావిధాల తిట్టిపోశారు. ఇతడు బ్రాహ్మణుడు కాడు నీచుడు, శివద్రోహి, గర్వాహంకారముతో అంధుడైన రాక్షసుడు అని ఛీత్కరించారు.

ఈ ఘోరసంఘటనను చూచిన ప్రమథగణాలు ఆయుధాలతో దక్షుని హతమార్చాలని విజృంభించాయి. ఇది చూచి అధ్వర్యువైన భృగుమహర్షి ఋభువులనబడే యజ్ఞరక్షకుల్ని సోమలోకంనుండి, వేలసంఖ్యలో హోమకుండంనుండి రప్పించాడు. వారు యజ్ఞనాశకులైన ప్రమథగణాల్ని తరిమివేశారు.

దాక్షాయణి అవమానింపబడి తనువుచాలించడం, ఋభువులు ప్రమథగణాలను తరిమివేయడం మొదలైన విషయాలను నారదుని వల్ల నాగభూషణుడు విన్నాడు. మహారౌద్రావేశముతో తన జడనొకదానిని తీసి భూమిపై విసరి కొట్టగా భయంకరాకారంతో నల్లని దేహముతో ఆకాశాన్ని అంటినంత విగ్రహముతో, అనేక ఆయుధాలను ధరించిన వేయి హస్తాలతో, మూడు కన్నులతో ప్రళయకాల రుద్రునివలె వీరభద్రుడు ప్రత్యక్షమయి, 'ఏమి ఆజ్ఞ?' అని అడిగాడు. దక్షయజ్ఞాన్నీ దక్షుణ్ణీ అంతము చేసి రమ్మని శివుడు ఆజ్ఞాపించాడు. వీరభద్రుడు ప్రచండతేజముతో, మృత్యువునకు మృత్యువువలె భయాన్ని కలిగిస్తూ ఆయుధాలను ఝళిపిస్తూ ప్రమథగణాలు వెంటరాగా యజ్ఞస్థలివైపు వెళ్లాడు. వాళ్లపాదాల తాకిడికి రేగిన దుమ్ము కారుమేఘాలలాగా ఆకాశమంతా నిండిపోయి, చీకటి ఆవరించినది. యజ్ఞస్థలిలోని వారంతా ఈ అకాలమేఘాలేమిటి అనుకొని ఆశ్చర్యపోయి ఏదో ఉత్పాతం సంభవించనున్నదని భయపడ్డారు. ఇదంతా దక్షుడు చేసిన అఘాయిత్యానికి రుద్రుడు విధించనున్న శిక్ష అని కొందరు బుద్ధిమంతులూహించారు. ఇంతలో ప్రమథగణాలు

భయంకరంగా వచ్చి విరుచుకొనిపడ్డారు. చేతికి దొరికిన వాటినన్నిటినీ ధ్వంసం చేశారు. అగ్నులను ఆర్పివేశారు. పాత్రలను ముక్కలుచేశారు. అందరూ చెల్లాచెదురై పారిపోయారు. వీరభద్రుడు భృగువుయొక్క గడ్డము, మీసము పెరికివేశాడు, భగుని కన్నులనూడబెరికాడు. పూషుని పండ్లూడగొట్టాడు. దక్షుని శిరస్సు ఖండించాడు. దానిని యజ్ఞకుండంలో పడవేశాడు. అలనాడు సత్రయాగములో, వీరంతా శివుని అవమాన పరచినవారే అని ఇప్పుడు ప్రతీకారంచేశాడు. తమ్ము ఎదిరించిన దేవతలనూ ఇతరులనూ రుద్రసేనలు చితుకగొట్టగా చాలామందియొక్క అంగాలు భంగమైనవి. సర్వనాశనంచేసి, వీరభద్రుడు సేనలతో వెళ్లిపోయాడు.

దేవతలంతా పోయి బ్రహ్మతో మొరపెట్టుకొన్నారు. యజ్ఞాన్ని ఎలాగైనా పూర్తిచేయించే ఉపాయం చెప్పుమన్నారు. ఈ విధంగా జరుగనున్నదని ముందే తెలిసియున్న బ్రహ్మవిష్ణువులు యజ్ఞానికి రాలేదు. బ్రహ్మదేవుడు దేవతలను మందలించాడు. ఇలాగ జరగడానికి దక్షునితోపాటు తమదికూడ తప్పిదం ఉన్నదన్నాడు. దక్షుడుచేస్తున్న తప్పును (శివుని ఆహ్వానించకపోవడం, యజ్ఞంలో భాగమివ్వకపోవడం) సరిదిద్దించకుండా ఊరుకొని, యజ్ఞంలో పాల్గొనడం దేవతల తప్పు అన్నాడు. "దేవాదిదేవుడైన ఆ మహాదేవునకు కోపం వస్తే ఏం జరుగుతుందో అందరికీ తెలుసు. ముల్లోకాలూ నశిస్తాయి. దక్షుడు చేసిన ఘోరమైన అవమానంతో పాటు ఇప్పుడు పరమశివునికి పత్నీవియోగం కూడ కలిగిన్నది. యజ్ఞాన్ని సక్రమంగా పూర్తి చెయ్యాలనే కోరిక మీకు ఉన్నట్లయితే, ఆయనను నిర్మల భక్తితో హృదయ పూర్వకంగా ఆశ్రయించండి, శరణువేడండి. ఆదయామయుడు ప్రసన్నుడైతే మీ కోర్కెతీరుతుంది. ఆయన అనుగ్రహం పొందడానికి ఒకే మార్గమున్నది. ఆయన భక్తపరాధీనుడు. శరణార్థులను రక్షించేవాడు. మనమందరమూపోయి ప్రార్థిస్తే ఆయన తప్పకుండాకరుణిస్తాడు." అని చెప్పి, బ్రహ్మదేవుడు ఇతర దేవతలనూ, పితృదేవతలనూ, ప్రజాపతులనూ ఇతరులనూ తోడుకొని శివుని వద్దకు బయలుదేరాడు. సుందర రమణీయ దృశ్యాలకు నిలయమైన కైలాసగిరిని చేరి, సౌగంధికవన సమీపానున్న ఒక మర్రిచెట్టు క్రింద ధ్యానమగ్నుడై సమాధినిష్ఠలోనున్న మహేశ్వరుని చూచారు. అప్పుడే ధ్యానము చాలించిన శివుడు నారదునితో ప్రియోక్తులాడుతూ ఉన్న సమయంలో బ్రహ్మాది దేవతలు వచ్చారు. శంకరుడు విధాతకు నమస్కరించి కుశలమడిగాడు, బ్రహ్మ ఈ విధంగా శివుని స్తుతించాడు: "ఓ మహేశ్వరా! నీవు సృష్టి స్థితి లయాత్మకమైన శివశక్తి స్వరూపుడవు. పరబ్రహ్మవు, విశ్వనాథుడవు. పురుషార్థసాధనకై శాస్త్రాలను, యజ్ఞాలను నీవే ఏర్పరచినావు. వాటియొక్క ఫలప్రదాతవు కూడా నీవే. మంగళకర కర్మలను చేసేవారికి స్వర్గమోక్షాది శుభాలను కలుగజేస్తావు. అమంగళకర వర్తనులను తగురీతిని శిక్షించువాడవు కూడా నీవే! జ్ఞానహీనులైన కొందరు నీమహత్త్వాన్ని గుర్తించలేక, నీయెడల చాలా అపచారము చేసినారు. పరమశివా! నీవు మాయకు అతీతుడవు. మాయలో మునిగి, మాయచే మతిచెడిన వారు చేసిన అపరాధాలను క్షమించగల దొడ్డబుద్ధి కలవాడవు. యజ్ఞము వలన లోకకల్యాణం జరుగుతుంది. అది దక్షుని మరణంతో ఆగిపోయినది. దానిని పునరుద్ధరించవలసిన అవసరం ఉన్నది. నీవులేని యజ్ఞము సమాప్తము కాదు. నీవు అనుగ్రహించి, యజ్ఞాన్ని సక్రమంగా సమాప్తమయ్యేటట్లు చెయ్యాలి. దీనికి యజమాని అయిన దక్షుడు బ్రతకాలి. మా అందరి ప్రార్థన మన్నించి, దక్షుని బ్రతికించి, భగునకు కన్నులిచ్చి, పూషునకు దంతాలిచ్చి, భృగువునకు గడ్డాలు మీసలూ ఇచ్చి, అవయవాలు పోగొట్టుకొన్న దేవతలకు, ఋత్విక్కులకు స్వస్థత చేకూర్చి, మిగిలిన యజ్ఞకార్యం పూర్తి కానిచ్చి, ఈ యాగాన్ని నీ భాగంగా స్వీకరించివలసినదిగా అనుగ్రహించు" అని చెప్పిన బ్రహ్మవాక్కులకు పరమశివుడు ప్రసన్నుడై ఇలా అన్నాడు:

"విష్ణుమాయకు వశులై పామరులు చేసిన దోషాలను నేను లెక్కచెయ్యను. అయినా, ధర్మరక్షణార్థం దుష్టులను శిక్షించాలి కదా! యజ్ఞకుండంలో కాలిపోయిన దక్షుని శిరస్సునకు బదులుగా గొఱ్ఱెతలను తగిలిస్తే దక్షుడు సజీవుడవుతాడు. భగుడు మిత్రుని నేత్రాలతో చూస్తూ యజ్ఞకార్యం ముగిస్తాడు. పూషుడు యజమాని దంతాలతో పిండిపదార్థాలు తింటాడు. అవయవాలను పోగొట్టుకొన్న ఋత్విక్కులు పూషునిహస్తాలతోనూ, అశ్వినీదేవతల హస్తాలతోనూ యజ్ఞకార్యాలు నిర్వహిస్తారు. దేవతలు పోయినఅవయవాలను పొందుతారు. భృగువు గొఱ్ఱెగడ్డము మీసము పొందుతాడు" అని శివుడు

చెప్పగా అందరూ సంతోషించి, హర్షధ్వానాలు చేశారు. ఇంద్రాది దేవతలు, ఋషులు నిష్క్రమించగా, బ్రహ్మ శివునితోడ్కొని యజ్ఞస్థలికి బయలుదేరాడు.

గొఱ్ఱెతలను అతకగానే శివుని వీక్షణముతో దక్షుడు నిద్రనుంచి మేల్కొన్న వానిలాగ లేచి కూర్చున్నాడు. ఎదురుగా ప్రసన్నవదనంతోనున్న పరమశివుని గాంచి నిర్మలుడయ్యాడు. పూర్వపు ద్వేషాసూయలూ, అహంకార దర్పాలూ తొలగిపోయాయి. తన ప్రియపుత్రిక అయిన సతీదేవి దగ్ధంకావడం గుర్తుకువచ్చి, శోక విహ్వలుడైనాడు. శివునితో ఇలాగన్నాడు: "దేవాదిదేవా! మహేశ్వరా! సద్బ్రాహ్మణుడనై మెలగవలసిన నేను, ప్రజాపతి నాయకుడననే గర్వాంధుడనై నీయొక్క పరబ్రహ్మ తత్త్వాన్ని విస్మరించి, నీయెడల ఘోరమైన అపరాధము చేశాను. నాపాపానికి నేను అధోగతి పాలైయుండును. కరుణాంతరంగుడవై నీవు నన్ను రక్షించి పునర్జీవింపజేసి, ఈ పవిత్రయజ్ఞాన్ని నిర్వహించే భాగ్యం కలిగించావు. నావంటి కపటబ్రాహ్మణులు క్షమార్హులు కారు. నన్ను క్షమింపుమని ప్రార్థిస్తున్నాను" అని వేడుకొన్నాడు.

బ్రహ్మ ఆదేశంపై మళ్లీ యజ్ఞం ప్రారంభమైనది. జయప్రదంగా ముగిసినది. శ్రీమన్నారాయణుడు ప్రసన్నుడై, సర్వాలంకార శోభితుడై శంఖచక్రగదాధారియై, కన్నులపండువుగా సాక్షాత్కరించాడు. బ్రహ్మరుద్రాది దేవతలకుకూడా దుర్లభమైన ఆదివ్యదర్శనం పొంది, వాళ్ల చేష్టలు దక్కి, నోటమాటరాక స్తుతించడం మరచిపోయారు. చివరకు తేరుకొని, నమస్కరించి స్తోత్రముచేశారు. తరువాత దక్షుడు ఋత్విక్కులు, ఋషులు, సిద్ధులు, దక్షపత్ని ప్రసూతి, ఋషిపత్నులు, గంధర్వులు, విద్యాధరులు, బ్రాహ్మణులు వేరువేరుగా ఆదివ్యమంగళ సుందర మూర్తిని స్తుతించారు. శ్రీమన్నారాయణుడు సంతసించి, అక్కడున్నవారినుద్దేశించి ఇలా చెప్పాడు:

"ఓదక్షప్రజాపతీ! నీయాగానికి సంతసించాను. మీరంతా నా నిజతత్త్వంగురించి కించిన్మాత్రమైనా తెలుసుకొనడం అవసరం. ఈ చరాచరాత్మకమైన సృష్టికి పూర్వము నేనొక్కడనే ఉంటిని. నామాయాశక్తిచే బ్రహ్మాండమూ, దానినుండి చతుర్ముఖ బ్రహ్మ, అతని ద్వారా సకల సృష్టి సంభవించినవి. నేనే బ్రహ్మ రూపములో సమస్త విశ్వాన్ని సృష్టించి, విష్ణురూపంలో దానిని పోషించి, శివరూపంలో దానిని లయింప జేస్తాను. బ్రహ్మ రుద్రులు కూడా నాయొక్క ఈశ్వర తత్త్వము లోనివారే. ఈ సత్యాన్ని తెలుసుకొనలేని అజ్ఞులు బ్రహ్మ రుద్రులు నాకంటే వేరని తలంచి భేద భావము చూపుతారు. వాస్తవానికి ఈ చరాచర భూతసముదాయమూ, దేవమానవ గంధర్వాది సర్వ లోక జీవులూ, ఈ విశ్వమంతా నాయొక్క శరీరములోని అంగములే. అందుచేత హరిహర బ్రహ్మలతో సహా సకల జీవరాసులూ పరబ్రహ్మ స్వరూపుడనైన నాకంటే వేరుకాదు అని తెలుసుకొన్న వ్యక్తులు ధన్యులు" అని ఉపదేశించిన శ్రీమన్నారాయణుని యజ్ఞమునకు యజమాని అయిన దక్షుడు అనేకవిధాల సేవించి, ఆశీస్సులను పొందాడు. యాగము సర్వశుభాలతో ముగిసినది.

## ధ్రువచరిత్రము

బ్రహ్మమానసపుత్రులైన సనకసనందాదులు, నారదుడు, ఋభువు, హంస, అరుణి, యతి అనువారు బ్రహ్మచారులుగానే ఉండిపోయారు. వేరొకపుత్రుడైన అధర్ముడు, మృష (అసత్యం) అనునామెయందు, దంభుడనే కొడుకును, మాయ అనే కూతుర్నీ పొందాడు. వీరిద్దరూ దంపతులై లోభుడు అనే కొడుకునూ, నికృత (క్రూర) అనే కూతుర్నీ కన్నారు. వీరుకూడ దంపతులై క్రోధుడు అనే కొడుకును, హింస అనే కూతుర్నీ కన్నారు. వీరిద్దరికీ కలి అనే కొడుకూ, దురుక్తి అనే కూతురూ కలిగారు. వీరిద్దరికీ, భయము అనే కొడుకు, మృత్యువు అనే కూతురూ కలిగారు. వీరిద్దరికీ యాతన అనే కొడుకూ, నిరయ (నరకం) అనే కూతురూ జన్మించారు.

ఇది అధర్ముని వంశవృక్షము. దీనినే పైన పేర్కొన బడిన శాఖోపశాఖలుగల సంసార వృక్షమనవచ్చును. బుద్ధిమంతులు ఈ వంశము వారితో ఎలాంటి సంపర్కమూ కలిగించుకొనరు.

స్వాయంభువమనువుపుత్రికలవంశములగురించి చెప్పి, ఇప్పుడు అతని పుత్రుల వంశ చరిత్ర చెప్పడమవుతున్నది.

స్వాయంభువ మనువుయొక్క రెండవ పుత్రుడు, ఉత్తానపాదుడు. అతనికి సునీతి, సురుచి అనే ఇద్దరు భార్యలున్నారు. సురుచి అంటే అతనికి మిక్కిలిప్రీతి. సునీతికి ధ్రువుడు అనే పుత్రుడూ, సురుచికి ఉత్తముడు అనే పుత్రుడూ జన్మించారు. ఉత్తానపాదునకు సురుచి పుత్రుడైన ఉత్తముడే ఎక్కువ ప్రీతిపాత్రుడు. ఒకనాడు తండ్రి ఉత్తముని తన తొడపై కూర్చుండబెట్టుకొని ముద్దుచేస్తుండగా, ధ్రువుడు కూడ తండ్రి చెంతజేరి రెండవ తొడపై కూర్చొనడానికి సరదాపడ్డాడు. కాని తండ్రి ధ్రువుని దగ్గరకు తీసుకొనలేదు. ఇది చూచి, సురుచి ధ్రువునితో సగర్వముగా ఇలాగన్నది: "నా కడుపున పుట్టిన వారికే తండ్రి తొడపై కూర్చునే అర్హత ఉంటుంది. నీకాభాగ్యము ఎలాగ కలుగుతుంది? నీవు పోయి, ఆ దేవుని ప్రార్థించుకొనుము నాకడుపున పుట్టింపుమని. అప్పుడు నీకోరిక తీరగలదు" అని ఈసడించుకొన్నది. తండ్రి ఎదుటనే సవతితల్లి తనను దారుణంగా తృణీకరించడాన్ని సహించలేని ఆ ఐదేళ్ల చిన్నారి బాలుడు రోషముతో ఏడుస్తూ తల్లి వద్దకు పోయి చెప్పుకొన్నాడు. సార్థకనామ అయిన సునీతి బాలుని బుజ్జగించి, ఓదార్చి ఇలా అన్నది: "నాయనా! నీ పినతల్లి అన్న మాటలు యథార్థమైనట్టివే. నాకడుపున నీవు పుట్టినందుకు నీకు ఈ అనాదరణ కలిగినది. అందరికీ దిక్కు ఆ శ్రీహరి మాత్రమే. ఆయన భక్తవత్సలుడు. ఆయనను ఆశ్రయించినవారికి సకలశుభాలూ కలుగుతాయి. నీవు బాధపడకు. ఎవ్వరినీ ద్వేషించకు. అనన్య భావముతో ఆపరమపురుషుని ఆరాధించు. ఆ కరుణామయుడు అనుగ్రహిస్తాడు" అని చెప్పిన కన్నతల్లి మాటలు ధ్రువుని మనఃఫలకం మీద ముద్రితములైనవి. అతడు ఎవ్వరికీ చెప్పకుండా, ఇల్లువిడిచి ఊరు విడిచి, గమ్యము తెలియని బాటలో వడివడిగా వెళ్లిపోతుంటే, నారదమహర్షి ఎదురు పడ్డాడు. విషయం తెలుసుకొన్నాడు. సకల ఐశ్వర్యాలూ కలిగియున్న రాకుమారుడు, అన్నీ త్యజించి విష్ణు శరణార్థియై, దృఢనిశ్చయుడై, ఈ విధంగా ఇల్లు విడిచి రావడం నారదమహర్షికి ఆశ్చర్యం కలిగించినది. బాలునితో ఇలా అన్నాడు:

"వత్సా! నీవు, ఇంతపసివాడివి. ఆటపాటలలో గంతులు వేసే పిన్నవయస్సునీది. ఈ వయస్సులో మానావమానాలను పట్టించుకొనే అవసరం లేదునీకు. సుఖదుఃఖాలు మానవుల పూర్వకర్మలను బట్టి కలుగుతాయి. వాటిని ఎవ్వరూ తప్పించుకొనలేరు. నీవు తలపెట్టిన కార్యము కఠినతరమైనట్టిది. గొప్పగొప్ప యోగీంద్రులు కూడ అనేక జన్మల సాధన చేసినా ఆ శ్రీహరి స్వరూపాన్ని తెలుసుకొనలేకున్నారు. అందుచేత నీవు ఈ వ్యర్థ ప్రయత్నాన్ని విరమించుకొని, ఇంటికి మరలిపొమ్ము. కర్మఫలదత్తమైన కష్టసుఖాలను సంతుష్టుడై అనుభవించేవానికి అజ్ఞానము నశించి, దైవానుగ్రహం లభిస్తుంది. నీకు అంతగా మోక్షాపేక్ష ఉంటే పెద్దయ్యాక ప్రయత్నించుదువుగాని, లే!" అని చెప్పిన నారదమహర్షితో బాలుడు ఇలాగన్నాడు:

"మహాత్మా! ఎట్టి పరిస్థితులలోనైనా చలించకుండా, సంతుష్టిని కలిగియుండాలనే మీ ఉపదేశము శిరోధార్యము. నా తల్లిగారు కూడ ఎవ్వరియందూ ద్వేషాసూయలు పెట్టుకొనరాదని చెప్పారు. మీ ఉపదేశాలవలన గొప్ప మనశ్శాంతి లభిస్తుంది. నిజమే! కాని, నా అశాంతికి మూలకారణము, నాపినతల్లి ప్రవర్తన. స్వామీ! క్షాత్రవంశంలో పుట్టిన మావంటి వారిని మానావమానాలు శీఘ్రముగా చలింపజేస్తాయని మీకు తెలుసు. ఆమె మాటలు, బాణాల్లాగా నాహృదయాన్ని తీవ్రంగా గాయపరచాయి. శాంతి లేకుండా చేశాయి. అందుచేత, నాతమ్మునికంటే, ఇతరులకంటే, అందరికంటే కూడ ఉన్నతమైన స్థానాన్ని పొందాలనే కాంక్ష నాలో బాగా స్థిరపడి పోయినది. మీరు బ్రహ్మదేవునిపుత్రులు. నిత్యమూ దివ్యనామ సంకీర్తనము చేస్తూ ముల్లోకాలనూ సంచరిస్తూ ప్రజలను తరింపజేసే మహానుభావులు. మీకు తెలియని దేదీలేదు. నాఆశయ సిద్ధికి నాకొక చక్కని మార్గము చూపుమని ప్రార్థిస్తున్నాను." అని చెప్పిన చిన్నారి బాలుని మాటలకు ముగ్ధుడైన మునీశ్వరుడు ఇలా అన్నాడు:

"కుమారా! నీవు నిర్మల హృదయుడవు. నిన్ను ఈ విధముగా ప్రేరేపించినవాడు నిస్సందేహముగా, ఆ శ్రీమన్నారాయణుడే. ధర్మార్థకామమోక్షాలను పొందడానికి ఆశ్రీహరి పాదపద్మాలనే ఆశ్రయించాలి. ఏకాగ్రమనస్సుతో వాసుదేవుని ధ్యానించాలి. నీవు యమునానదీతీరాననున్న మధువనానికి వెళ్లి, ప్రాణాయామాది యమనియమాలను పాటించి, స్థిరచిత్తముతో ధ్యానము చేయుము. ప్రసన్నవదనుడును, అఖండతేజో విరాజమానుడును, సర్వాలంకార

శోభితుడును, శంఖచక్రగదా పద్మధారియును అయిన ఆ శ్రీమన్నారాయణునియొక్క దివ్యసుందర మూర్తిని, నఖశిఖ పర్యంతము పరికించి చూస్తూ హృదయములో ముద్రించుకొని, ఆ రూపాన్నే నిరంతరమూ ధ్యానిస్తుండాలి. ద్వాదశాక్షరి అయిన "ఓం నమోభగవతే వాసుదేవాయ" అనే వాసుదేవ మంత్రాన్ని నిత్యమూ జపిస్తూ ధ్యానము చెయ్యాలి. ఈవిధముగా ఒక వారము దినములు చేస్తే దేవతలను దర్శించేశక్తి కలుగుతుంది. మనో నిగ్రహముతో శాంత చిత్తముతో సదాచారముతో మౌనముగా శ్రీహరి కల్యాణగుణాలను స్మరిస్తూ ధ్యానించాలి. కందమూలాలను భుజించాలి. ఈవిధంగా త్రికరణ శుద్ధితో భజిస్తే విష్ణుమాయ దరిజేరదు. భగవంతుడు పురుషార్థాలలో కోరినదాన్ని అనుగ్రహిస్తాడు. భక్తి వైరాగ్యాలతో ధ్యానించేవారికి మోక్షాన్ని కూడా ప్రసాదిస్తాడు" అని చెప్పి ఆశీర్వదించి, నారదుడు నిష్క్రమించాడు.

ధ్రువుడు ఇంటినుండి వెళ్లిపోయిన తరువాత ఉత్తానపాదుడు పశ్చాత్తాపముతో క్రుంగికృశించిపోయాడు. స్త్రీవ్యామోహములోపడి, సౌమ్యుడూ, సుశీలుడూ ఆయిన పెద్ద కుమారుని తృణీకరించానే! ఎక్కడికి వెళ్లిపోయాడో! ఎలాగున్నాడో, అరణ్యాలలో ఎలాంటి ప్రమాదంలో చిక్కుకొన్నాడో అని పరితపిస్తుండే సమయంలో నారదమహర్షి వచ్చి ఆయనను ఓదార్చాడు. "రాజా! ధ్రువుని గురించినీవు చింతించనవసరంలేదు. అతడిప్పుడు నారాయణుని సంరక్షణలోనున్నాడు. అతడు సామాన్య బాలుడుకాడు. అతని ప్రభావము నీవు తెలుసుకొనలేక అలక్ష్యం చేశావు. అతడు అచిరకాలంలోనే అసమాన కీర్తిని పొంది, తిరిగివచ్చి నీవంశ గౌరవ ప్రతిష్ఠలను చిరస్థాయిగా ప్రకాశింపజేస్తాడు." అని చెప్పి ఆశీర్వదించి నారదుడు నిష్క్రమించాడు.

ధ్రువుడు మధువనం చేరుకొని, శ్రీహరిరూపాన్ని చిత్తములో ప్రతిష్ఠింపజేసుకొని, తీవ్రమైన తపస్సు చెయ్యనారంభించాడు. మూడుదినాల కొకసారి వెలగపండ్లను, రేగుపండ్లను తింటూ మొదటి నెల గడిపాడు. ఆరుదినాల కొకసారి గడ్డినీ, రాలిన ఆకులనూ తింటూ రెండవనెల, తొమ్మిది దినాల కొకసారి నీటిని త్రాగి, మూడవ నెల, పన్నెండు దినాల కొకసారి గాలిని ఆరగిస్తూ నిశ్వాసాలను నిరోధించి నాలుగవనెల, ఒంటికాలిపై నిలిచి, సర్వమూ త్యజించి, మ్రోడువలె నిశ్చలంగా ఐదవనెల, భగవంతుని తన హృదయ కమలంలో నిలుపుకొని, ఏకదీక్షగా ధ్యానించాడు. ఆ బాలుని తేజస్సును మూడులోకాలూ భరించలేకపోయినవి. ఒంటికాలిమీద నిల్చున్న అతని కాలి బొటన వ్రేలు ఒత్తిడికి భూమి ఇటునటు ఊగసాగినది. ప్రాణవాయువును నిరోధించి, పరమేశ్వరునితో అనుసంధానం చెయ్యడంచేత శ్రీహరికూడ కదలడంతో విశ్వమంతా కంపించసాగినది. ఊపిరాడక తల్లడిల్లుతున్న దేవతలు తమను రక్షింపుమని శ్రీహరిని ప్రార్థించగా, భయపడవద్దని అభయమిచ్చి, గరుడ వాహనుడై, శ్రీహరి మధువనంచేరి, ధ్రువుని ఎదుట ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు ధ్రువుడు తన హృదయ పద్మంలో ప్రకాశిస్తున్న భగవత్స్వరూపాన్ని తన్మయుడై దర్శిస్తుండెను. తన ఎదుటనే సాక్షాత్కరించియున్న శ్రీహరిని చూడలేదు. అప్పుడు శ్రీహరి ధ్రువుని హృదయంనుండి అదృశ్యమవగా, కన్నులు తెరచి ఆ కరుణామూర్తిని కన్నుల పండువుగా తిలకించాడు. పులకించాడు, ఆనంద బాష్పాలలో కరిగిపోయాడు. సాష్టాంగదండప్రణామం చేశాడు.

ఆనందంతో ఉబ్బితబ్బిబ్బు అయిపోతున్నాడు ఆ ఐదేళ్ల బాలుడు. ఏమనాలో తెలియక నోరుమూగ వోయినది. స్తుతించడానికి విద్యాసంస్కారాలు లేవు. భాషచాలదు. నమస్కరిస్తూ నిల్చుండిపోయాడు. కరుణామయుడు కనికరించి, వేదమయమూ నాదబ్రహ్మమూ అయిన తన శంఖముతో బాలుని చెక్కిళ్లను స్పృశించి నిమిరాడు. దానితో వేదవాఙ్మయ పదజాలాలతో సహా, ఆత్మతత్త్వపరతత్త్వాలను తెలిపే వేదాంత జ్ఞానము కూడా నోటివెంట వెలువడగా ధ్రువుడు పరమేశ్వరుని ఇలాగ స్తుతించాడు:

### ధ్రువస్తుతి :

"ఓ దేవాదిదేవా! నీవు అఖిలశక్తి సంపన్నుడవు. స్తంభించి పోయిన నా ఇంద్రియాలకూ, వాక్శక్తికీ, ప్రాణాలకూ చలనం కల్పించిన అంతర్యామివైన నీకు నా వందనములు. పరమాత్మా! సృష్టికి పూర్వము నీవొక్కడవే ఉండి, నీనుండి

విడదీయబడని జగత్తును, నీ సంకల్పముచే మహత్తు, అహంకారము మొదలైన రూపాలలో వ్యక్తపరచావు. త్రిగుణాత్మకమైన ప్రకృతిచే నానారూపాలను కల్పించి, వాటియందు జీవునిగా ప్రవేశించి ప్రవర్తింపజేసే ఆత్మ రూపుడవైన నీకు నమస్కారములు. ప్రభూ! కల్పాదియందు మేల్కొన్న చతుర్ముఖ బ్రహ్మ సృష్టి ప్రక్రియను మరచిపోయి, నిన్ను శరణువేడి నీచే అనుగ్రహింపబడిన జ్ఞానముతో సృష్టిరచన చేశాడు కదా! ఈశ్వరా! నీమాయచే మతి చెడినవారు. నిన్ను ఆశ్రయించినవారై, నీవు అనుగ్రహించగల మోక్షాన్ని కోరకుండా, క్షుద్రమైన అర్థకామాలనే కోరుకొంటారు అవివేకులు. వారుకోరుకొన్న ఐహిక - ఇంద్రియ భోగాలన్నిటినీ కల్పవృక్షంవలె నీవు ప్రసాదిస్తావు. పద్మనాభా! నీ పాదసంస్మరణ వలననూ, నీ పాదదాసుల సాంగత్యమువలననూ, అమృతతుల్యమైన నీయొక్క కథాశ్రవణం వలననూ కలిగే పరమానందము మోక్షమువలనకూడా లభించదు. ఇక దేవతల స్వర్గలోకంలో మాత్రము లభిస్తుందా? ముకుందా! నిర్మలాత్ములైన నీయొక్క భక్తులతో నాకు మైత్రిని అనుగ్రహించు. ఆ సత్పురుషుల సాంగత్యముచేత నీయొక్క దివ్య కథాసుధారసాన్ని గ్రోలి, దుఃఖమయమైన సంసారసాగరాన్ని తరించగలను.

మాధవా! విశ్వతోముఖా! నీ పాదపద్మసుగంధాన్ని అనుభవించినవారు మరణశీలమైన శరీరాన్నీ, భార్యా బంధు పరివారాలనూ మరచిపోతారు.

ఓ పరమేశ్వరా! దేవ దానవ మానవ జంతు జీవాదులతో నిండియుండి, ప్రకృతి పురుషులతో కూడియున్న నీయొక్క స్థూలరూపాన్నే నేను ఎరుగుదునుగాని, నిత్యమూ ఐశ్వర్య సంపన్నమూ, ఇంద్రియ - అగోచరమూ, అయిన నీపరబ్రహ్మస్వరూపాన్ని నేను తెలుసుకొనలేనుకదా! సర్వేశ్వరా! కల్పాంతములో సకల సృష్టినీ, నీలోనే విలీనంచేసుకొంటావు. ఆదిశేషతల్పముపై యోగనిద్రలో శయనిస్తావు. నీనాభి అనే సముద్రంనుండి ఉద్భవించిన హిరణ్మయ పద్మమునుంచి, చతుర్ముఖబ్రహ్మను పుట్టిస్తావు. అటువంటి నీయొక్క దివ్యతేజోమయమైన పరబ్రహ్మ స్వరూపానికి నేను నమస్కరిస్తున్నాను. దేవదేవా! నీవు ఆదిపురుషుడవు, మాయాతీతుడవు, పరిశుద్ధుడవు, సర్వజ్ఞుడవు, కూటస్థుడవు, భగవంతుడవు, సాక్షిభూతుడవు. సర్వేశ్వరా! జ్ఞానమూ, అజ్ఞానమూ, వైరాగ్యమూ వ్యామోహమూ లాంటి పరస్పర విరుద్ధశక్తులతో కూడియున్న జగత్తునకు కారణ భూతుడవు నీవే. అద్వితీయమూ, అనంతమూ, ఆద్యమూ, ఆనందమయమూ, అవికారమూ, అయిన పరబ్రహ్మవు నీవు. నీకు వందనములు. పరమేశ్వరా! నిష్కాములైన భక్తులు నిన్నే సర్వతోముఖ ఫలముగా భావిస్తారు. వారికి నీ పాదపద్మాలే సర్వస్వము, సకాములైన భక్తుల కోర్కెలను కూడా కృపతో తీర్చుతూ, వారి సంసారభయాలను తొలగించే కరుణా సాగరుడవునీవు. నీకు అనేక నమస్కారములు" అని స్తుతించిన ధ్రువునితో మిక్కిలి సంతసించిన శ్రీమన్నారాయణుడిలా అన్నాడు.

"రాజకుమారా! నీ తపస్సునకు సంతసించి, నీకు దర్శనమిచ్చాను. నీ మనోభీష్టాన్ని నెరవేర్చుతాను. గ్రహాలూ, నక్షత్రాలు, ధర్ముడూ, అగ్ని, కశ్యపుడు, శుక్రుడూ, సప్తఋషులూ, ప్రదక్షిణం చేస్తుండే ధ్రువక్షితి అనే మహోన్నత స్థానాన్ని నీవు పొందుతావు. ఈ పదము ఇదివరకు ఎవ్వరికీ లభించలేదు. మూడులోకాలూ నశించినా అదినశించదు. నీవు ఇరువదియారువేల సంవత్సరాలు నీతండ్రివిడిచిన రాజ్యాన్ని పాలించిన అనంతరం ధ్రువక్షితిని అధిష్ఠిస్తావు. ఇంద్రియాలను జయించి ధర్మమార్గాన పరిపాలిస్తావు. నీతండ్రి వానప్రస్థానికి వెళ్లిపోతాడు. నీతమ్ముడైన ఉత్తముడు వేటకువెళ్లి అడవిలో మరణిస్తాడు. అతని తల్లి అతనిని వెదుకుకొంటూపోయి, అడవిలో కారుచిచ్చులో నశిస్తుంది. నీవు అనేక యజ్ఞాలుచేసి నన్నారాధిస్తావు. మరణకాలంలో నన్ను స్మరిస్తూ సప్తర్షి మండలం పైనున్న ఉన్నత స్థానాన్ని పొంది, చివరకు నా స్థానాన్ని పొందుతావు (నన్ను చేరుతావు)." అని చెప్పి, స్వామి గరుడారూఢుడై వెళ్లిపోయాడు. మహావిష్ణువు వెళ్లిపోయిన తరువాత ధ్రువుడు చింతాక్రాంతుడై ఈవిధంగా తలపోశాడు: "జితేంద్రియులూ, మహాత్ములూ అయిన సనందనాది మునీంద్రులు మిక్కిలిభక్తితో పెక్కుజన్మల సమాధియోగ శక్తిచే ఏ పరమేశ్వరుని చరణకమలాలను దర్శించగలుగుతారో ఆ శ్రీహరిని నేను ఆరునెలలు సేవించి, ఆయన సాక్షాత్కారాన్ని పొందికూడా, మాయామోహితుడనై, అనిత్యమైన దానినే ఆశించాను. తమ్మునికంటే ఇతరులందరికంటే అత్యున్నత పదమునే అజ్ఞానంగా కాంక్షించానేగాని,

మోక్షప్రదాత అయిన పరమాత్మయే సాక్షాత్కరించి, ఎదురుగా నిల్చుంటే మోక్షాన్ని కోరనైతిని. నాకంటే మందభాగ్యుడింకెవ్వడైన ఉంటాడా? నాయొక్క పూర్వకర్మయే నాబుద్ధిని పెడమార్గం పట్టించినది. విషయవాసనలు విడిచిపెట్టవు." అని గ్రహించిన వాడై ధ్రువుడు ఊరటజెంది, నిజనగరికి బయలుదేరాడు.

ధ్రువుడు ఇంటికి మరలి వస్తున్న వార్తను తెలుసుకొని, ఉత్తానపాదుడు నారదవాక్యాలను జ్ఞప్తికి తెచ్చుకొని, బ్రాహ్మణులనూ, మంత్రులనూ, భార్యలనూ, ఉత్తముని తోడ్కొని ఎదురుగావెళ్లి స్వాగతం పలికాడు. కొడుకు బ్రతికి వచ్చినంత సంబరపడిపోయి, ధ్రువుని కౌగలించుకొని, ముద్దాడి, ఆనందబాష్పవర్షం కురిపించాడు. ధ్రువుడు తల్లుల పాదాలకు నమస్కరించాడు. అన్నదమ్ములిద్దరూ గాఢాలింగనం చేసుకొన్నారు. సురుచి ప్రేమతో "చిరంజీవ" అని దీవించినది. సునీతి తన కష్టాలన్నీ మరచిపోయి ఆనందపరవశ అయినది. పురప్రజలు జయజయనాదాలతో హారతులిస్తూ స్వాగతం పలికారు. తరువాత యుక్త వయస్సు రాగానే ధ్రువుని పట్టాభిషిక్తుని జేసి, ఉత్తానపాదుడు తపోవనానికి వెళ్లిపోయాడు. ధ్రువుడు శింశుమారప్రజాపతి కుమార్తె అయిన భ్రమిని పెండ్లాడి, కల్పుడు, వత్సరుడు అనే పుత్రులను పొందాడు. వాయుపుత్రిక అయిన ఇలను పెండ్లాడి, ఉత్కలుడు అనే కుమారుని, సౌందర్యవతి అయిన ఒక కుమార్తెనూ పొందాడు. ఉత్తముడు వివాహం కాకముందే, వేటకు వెళ్లి అక్కడ ఒక యక్షునిచే చంపబడ్డాడు. సురుచి పుత్రశోకముతో అడవికి వెళ్లి, అక్కడ కారుచిచ్చులో చిక్కుకొని మరణించినది.

యక్షుడు తన తమ్ముని చంపిన వార్తవిని, ధ్రువుడు తీవ్రమైన కోపముతో మంచుకొండల లోయల్లోనున్న యక్షరాజధాని అయిన అలకాపురిపై దండెత్తాడు. ఘోరయుద్ధం జరిగినది. యక్షులు చాలామంది హతులైనారు. మిగిలినవారు పారిపోయారు. రాక్షసులు ప్రవేశించి మాయలు ప్రయోగించారు. మాంసము, నెత్తురు మలము లాంటివి వర్షింపజేశారు. కత్తులు, గదలు, రాళ్లు, కొండలు కురిపించారు. పులులు, సింహాలూ చుట్టుముట్టాయి. పైనుంచి చూస్తున్న మహామునులు ధ్రువునితో "శ్రీహరిని స్మరించు" అని కేకలు వేసి చెప్పారు. ఒక్క, నారాయణాస్త్రంతో రాక్షసమాయలన్నీ తొలగిపోయాయి. రణరంగమంతా మృతులతోను, బీభత్సముగా తయారయినది. ఇంకా ధ్రువుని కోపము చల్లారలేదు. ఆ సమయంలో తాతగారైన స్వాయంభువ మనువు, ఋషులతో అక్కడికి వచ్చి ధ్రువునితో ఇలా అన్నాడు: "నాయనా! శాంతించు. నీకు ఇంత ఆగ్రహము ఉండరాదు. నీతమ్ముని ఎవ్వడో ఒక యక్షుడు చంపితే దానికి ప్రతీకారముగా యక్షులందరినీ చంపబూనుకొనడం తగదు. ఘోరపాపమవుతుంది. నీ ఆగ్రహం నరకహేతువు అవుతుంది. మనువుల వంశానికే ఇది కళంకమవుతుంది. నీవు ఐదేళ్లనాడే శ్రీహరిని మెప్పించి ఆయన సాక్షాత్కారమును పొందిన పరమ భాగవతుడవని ప్రసిద్ధిచెందినావు. అలాంటి హరిభక్తులైన సజ్జనులకు కోపము, ద్వేషము, పగలాంటి దుర్గుణాలుండ తగనివి. చావుపుట్టుకలు దైవాధీనాలు. నీతమ్ముని చావునకు అతని కర్మయే కారణము. ఆయక్షుడు కేవలం నిమిత్త మాత్రుడే. నేను,నాది, అనే భావాలు అవిద్యాజనితాలు. ఈ మోహాన్ని నీవు విడనాడాలి. ఈ నీ దుష్కృతం వల్ల నీవు రుద్రుని సోదరుడూ, యక్షుల అధిపతీ అయిన కుబేరుని పట్ల అపరాధంచేసిన వాడవయ్యావు. నీవైరమువిడిచి, కుబేరుని చెలిమిని అర్థించు." అని మందలించి, మునులతో మనువు నిష్క్రమించాడు. ధ్రువుడు పోరాటం విరమించి శాంతుడైనాడు. కుబేరుడు యక్ష, చారణ, విద్యాధరాదులతో వచ్చి ఇలాగన్నాడు: "రాజకుమారా! మీ తాతగారి ఆజ్ఞను మన్నించి, విరోధాన్ని విడిచినందుకు సంతసిస్తున్నాను. వరమిస్తాను కోరుకొనుము." అనగా ధ్రువుడు శ్రీహరి స్మరణం తన మనస్సులో నిత్యమూ స్థిరంగా నిలిచేటట్లు వరమిమ్మన్నాడు. తథాస్తు అని భృత్యులతో కుబేరుడు నిష్క్రమించాడు.

ధ్రువుడు అనేకమైన మహాయజ్ఞాలు చేశాడు. సర్వజీవులయందూ, తనయందూ ఉన్న పరమేశ్వరుని అంతటా దర్శించాడు. దీనులను రక్షించేవాడు. ప్రజలను తన బిడ్డలుగా చూచుకుంటూ, 26వేల సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు. అనంతరం కుమారునకు రాజ్యపట్టముగట్టి, సమస్త భోగాలనూ త్యజించి, విరక్తుడై సర్వసంగపరిత్యాగియై బదరికాశ్రమానికి వెళ్లిపోయాడు. అక్కడ తన్ను తాను మరచి పోయినవాడై, పరమానందభరితుడై, పద్మనాభ పాదపద్మాలయందు మనస్సులగ్నంచేసి ధ్యానించసాగాడు.

అప్పుడు ఆకాశమునుండి, ఒక విమానము దిగి వచ్చినది. దానినుండి ఇద్దరు దివ్యపురుషులు దిగివచ్చారు. వారు విష్ణు సేవకులని ధ్రువుడు ఊహించాడు. వారు కుమార వయస్కులు, కిరీటకుండలగదాధారులై యుండిరి. వారికి ధ్రువుడు సవినయంగా నమస్కరించగా, నంద సునందులనబడే ఆవిష్ణు భృత్యులీవిధంగా చెప్పారు.

"రాజా! నీకు మంగళమగుగాక! మేము శ్రీమహావిష్ణువు యొక్క సేవకులము. ఆ స్వామి ఆజ్ఞప్రకారము నిన్ను ఆ భగవానుని దివ్యధామానికి చేర్చడానికి వచ్చాము. ఈ విష్ణుపదాన్ని ఇతరులెవ్వరూ పొందియుండలేదు. సప్తఋషులుకూడ దీనిని దూరమునుండే చూడగలరు. సూర్యచంద్రులూ, గ్రహతారకలూ దానిచుట్టూ ప్రదక్షిణలు చేస్తుంటాయి." అని చెప్పి, ధ్రువుని విమానమెక్కించుకొని పోవుచుండగా, మార్గమధ్యంలో వేరొక విమానంపై పతివ్రతాశిరోమణి, ధ్రువునిగన్న పుణ్యశీల అయిన సునీత ఊర్ధ్వలోకాలకు వెళ్లుతుండడం విష్ణుపార్షదులు చూపించగా ధ్రువుడు ఆనందభరితుడయ్యాడు. ధ్రువుడు విమానంలో గ్రహమండలాలు దాటి, మూడులోకాలనూ, సప్తర్షి మండలాన్నీ దాటి, ఆపైనున్న విష్ణుపదాన్ని చేరుకొన్నాడు. విష్ణుపదంచుట్టూ, జ్యోతిశ్చక్రం నిర్విరామంగా, అతివేగంగా తిరుగుతుంటుంది. ధ్రువుడు చతుర్భుజ కిరీటకుండలాలతోనున్న విష్ణుదాసుల ఆకారాన్ని పొంది, దివ్యతేజోమయమైన రూపముతో అక్కడే ఉండిపోయాడు.

నారదమహర్షి ఆ ఐదేండ్లపసిబాలుడేవిధంగా శ్రీమన్నారాయణుని అనుగ్రహంపొంది, దివ్యవైభవంతో శాశ్వత విష్ణుపదాన్ని పొందిన విషయమును ప్రచేతసులు చేస్తుండే సత్రయాగంలో గానముచేసి వినిపించాడు. ఈ ధ్రువచరిత్రను వినేవారికి భగవానునియందు భక్తి కలిగి, సంసారక్లేశము దూరమవుతుందని, మైత్రేయ మహాముని విదురునకు చెప్పినట్లు శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

## పృథుచక్రవర్తి

ప్రచేతసులు ఎవరు – అని అడిగిన విదురునకు మైత్రేయ మహాముని ధ్రువుని వంశీయుల గురించి ఇలా చెప్పాడు.

ధ్రువుని పెద్దకుమారుడైన ఉత్కలుడు, పుట్టుకతోనే పరమసాత్త్వికుడు, శాంతమూర్తి, నిస్సంగుడు, నిష్కళంకుడు, సమదర్శనుడు. యోగాగ్నిచే కర్మవాసనలు నశించగా, మందబుద్ధివలె పంచేంద్రియాలు పనిచేయని జడునివలె ప్రవర్తించేవాడు. సర్వజ్ఞుడైనా నివురుకప్పిన నిప్పులాగ ఉంటూ, దేనినీ ఆశించక, నిత్యమూ బ్రహ్మధ్యానములోనే ఉండేవాడు. ధ్రువుడు బదరికాశ్రమం వెళ్లిపోయిన తరువాత, మంత్రులూ, పెద్దలూ, ఉత్కలుని పిచ్చివానిగా భావించి, తమ్ముడైన వత్సరునికి పట్టంగట్టారు.

వత్సరునికి స్వర్వీథి అనే భార్య ద్వారా పుష్పార్ణుడు మొదలైన ఆరుగురు కొడుకులు కలిగారు. పుష్పార్ణునకు "ప్రభ" ద్వారా ప్రాతః, మధ్యందిన, సాయం అనేవారూ, "దోష" ద్వారా ప్రదోషుడు, నిశీథుడు, వ్యుష్టుడు అనేవారు, ఆరుగురు కొడుకులు కలిగారు. వ్యుష్టునకు, పుష్కరిణియందు సర్వతేజస్సు అనే కుమారుడు కలిగాడు. సర్వతేజునికి ఆకూతియందు చక్షుస్సు జన్మించాడు. అతడు మనువైనాడు – చక్షుస్సుకు నడ్వలయందు ఉల్ముకుడు మొదలైన పన్నెండుగురు పుత్రులు కలిగారు. ఉల్ముకునికి పుష్కరిణి అనునామెకు అంగుడు, అంగిరసుడు మొదలైన ఆరుగురు కుమారులు కలిగారు. అంగునికి, మృత్యువు పుత్రిక అయిన సునీథకు వేనుడు అనే కొడుకు పుట్టాడు.

ధ్రువుని వంశములోని వారిపేర్లు "కాలము" తేజస్సు తోనే చాలామందికి పెట్టబడినట్టు కనిపిస్తుంది. ధ్రువుడు జ్యోతిర్మండలంలో స్థిరముగానుంటాడు. అతని భార్య భ్రమి అతని చుట్టూ తిరిగే జ్యోతిశ్చక్రము. వారి కుమారులు – ఉత్కలుడు కాల ప్రభావములేనివాడు. వత్సరుడు కాలమానములో కొలతబద్ద. స్వర్వీథి గ్రహనక్షత్రాల రహదారి. వారి ఆరుగురు కొడుకులూ ఆరు ఋతువులు. ప్రభ, దోష – పగలూ రాత్రీ సూచిస్తాయి. పగలు ప్రాతర్మధ్యాహ్న సాయంకాలాలు అనే మూడు భాగాలు, రాత్రి ప్రదోష నిశీథ వ్యుష్ట అనే మూడు భాగాలు. సర్వతేజస్సు అంటే జ్ఞానస్వరూపము, ఆకూతి అంటే సంకల్పము, మనువు అంటే ఎరుక, చక్షువు – దృష్టి, వెలుగు.

## వేనునిచరిత్ర :

రాజర్షి అయిన అంగభూపతి సంతానం గురించి యజ్ఞము చేశాడు. యజ్ఞకుండమునుండి ఒక పురుషుడు వచ్చి ఒక బంగారు పాత్రలో పాయసము ఇవ్వగా అంగరాజు దానిని గ్రహించి, భార్య అయిన సునీథకు ఇచ్చాడు. సునీథ అధర్మని వంశానికి చెందిన మృత్యువు యొక్క కుమార్తె. ఆమెకు ఒక పుత్రుడు జన్మించాడు. అతనిపేరు వేనుడు. అతడు, మాతామహుని గుణగణలక్షణాలతో చిన్నప్పటినుండి అధర్మవర్తనుడై హింసాత్మకుడై మెలగేవాడు. అడవిలోని సాధుజంతువుల్నీ, వీధిలో ఆడుకొనే చిన్నపిల్లల్నీ నిర్దాక్షిణ్యంగా చంపేవాడు. అంగరాజు తన కుమారుని సరియైన మార్గంలో పెట్టాలని ఎన్నోవిధాల ప్రయత్నించి, విఫలుడై విచారంగా ఇలాగ తలపోశాడు: "భగవంతుడు సంతానములేని వారి పూజలకు సంతోషించి పుత్రసంతానం ప్రసాదిస్తాడు. కాని ఆ పుత్రుడు, తలిదండ్రులయొక్క తనయొక్క, కర్మాను గుణంగా పుడుతాడు. వాడు సుపుత్రుడైతే, తండ్రికి వ్యామోహం పెరిగి, సంసార బంధాలు ఇంకా దృఢంగా చుట్టివేసి పరమార్థం గురించి ఆలోచించడం జరుగదు. దుష్టుడైన పుత్రుడు ప్రాప్తిస్తే, వాడి దుష్టకృత్యాలను భరించలేక గృహసంసారాదులపై విరక్తిపుట్టి, భగవంతుని ఆశ్రయించాలనే బుద్ధిపుడుతుంది" అని ఆలోచించి, అర్ధరాత్రి సమయంలో సర్వమూత్యజించి అరణ్యానికి వెళ్లిపోయాడు.

మంత్రులూ, ప్రజలూ, ఎంతవెదికించినా రాజు జాడతెలియలేదు రాజులేని రాజ్యంలో అరాచకం ప్రబలుతుందని, ప్రజారక్షణ గురించి ఎవ్వరో ఒక రాజు ఉండాలికదా అని, తల్లియైన సునీథకూ, ప్రజలకూ మంత్రులకూ ఎవ్వరికీ ఇష్టంలేకపోయినా, భృగువు మొదలైన మునులు యోచించి, గత్యంతరంలేక వేనునికే పట్టంగట్టారు.

రాజైన వేనుడు నిరంకుశుడై, చండశాసనుడై లోకకంటకుడు అయ్యాడు. తనకంటే గొప్పవాడు, శక్తిమంతుడూ ఇంకెవ్వరున్నారు అని అహంకార బలదర్పాలతో గర్వించి, యజ్ఞయాగ జపతపాది పుణ్యకర్మలను చెయ్యరాదనీ, తననే పూజించాలనీ శాసించాడు. కొందరు ఋషులూ, పెద్దలూ, అతనిని సన్మార్గంలో పెట్టదలచి, మంచిగా నచ్చజెప్పితే ఏమైనా మారవచ్చునేమో అనే ఆశతో వేనుని వద్దకు వెళ్లారు. రాజధర్మాలనూ, ప్రజల్ని ఏవిధంగా ఆదరించి పాలించాలో ఆ సూత్రాలను వివరించి చెప్పారు. రాజు ప్రజలకు తండ్రివంటివాడు అన్నారు. యజ్ఞయాగాదులు చేయడంవల్ల భగవంతుడు, ఇతరదేవతలు సంతుష్టులై సకల సౌభాగ్యాలూ ప్రసాదిస్తారు. నీయొక్క కీర్తి, ఐశ్వర్యమూ పెరుగుతాయి, దేశము, ప్రజలూ సుఖ సంపదలతో నుంటారు. అందుచేత యజ్ఞాలు మానివెయ్యడం క్షేమకరంకాదు అని చెప్పారు. బుద్ధిహీనుడూ దుష్టుడూ అయిన వేనుడు మునులను హేళనచేస్తూ అవమానకరంగా మాట్లాడాడు. "రాజు సర్వదేవతా స్వరూపుడు, మీరు ఆరాధించే బ్రహ్మవిష్ణు రుద్ర ఇంద్రాదులంతా, నాలోనే ఉన్నారు. ప్రత్యక్షంగానేను మీ ఎదుటనుండగా నన్ను కొలవకుండా ఇతర దేవతలను నా ప్రజలైన మీరు కొలవడం భర్తను విడిచి ఇతరులతో వ్యభిచరించే జారిణిలా ప్రవర్తించడం అన్నమాట. మీరంతా అలాంటి వ్యభిచారం చేసిన వారన్నమాట" అని అనడంతో మునులకు పట్టరాని ఆగ్రహం వచ్చేసినది. వారు శపించకపోయినా, వారి ఆగ్రహమంతా వారినుండి ఒక్క హుంకార రూపంలో బైటకు వచ్చేసినది. వేనుని ప్రాణాలెగిరిపోయాయి. సునీథ తన యోగశక్తిచే వేనుని శరీరాన్ని కాపాడుతూ భద్రపరచినది.

రాజులేనిరాజ్యంలో అరాచకాలు పెరిగిపోయాయి. దుండగులు, దొంగలు, దుష్టులు చెలరేగిపోయారు. ఉత్పాతాలు విజృంభించాయి. మునులంతా మళ్లీ ఆలోచించారు. మార్గాంతరం కనిపించినది. వేనుని శవం వద్దకు పోయి, వాని తొడను మథించారు. వారి మంత్ర శక్తిచే దానినుండి వికృతాకారంగల ఒక నల్లని మరుగుజ్జు వచ్చాడు. నేనెవరిని, నేను ఏమిచెయ్యాలి అని అడిగాడు. వాడు రాజు కావడానికి పనికిరాడని గుర్తించి, మునులు - నీవు బాహుకుడవు, నిషీద - అని అన్నారు. నిషీద అంటే కూర్చో అన్నమాట. తరువాత వానిని కొండలమీద అడవుల్లోనూ నివసింపుమన్నారు. వాని సంతతి వారే నిషాదులనబడ్డారు.

## పృథు అవతారము :

మునులు మళ్లీ ఆ శవాన్ని మథించారు. ఈసారి బాహువులను మథించగా, కుడివైపునుండి ఒక పురుషుడు, ఎడమవైపునుండి ఒక స్త్రీ ఉద్భవించారు. అప్పుడు బ్రహ్మదేవుడు ఇతర దేవతలతో వచ్చి ఆ పురుషుని సాముద్రిక లక్షణాలను పరికించి చూచి, కుడిచేతిలో చక్ర చిహ్నామూ, పాదాలలో హలము అంకుశము మొదలైన చిహ్నాలుండడంచూచి, వారిద్దరూ లక్ష్మీనారాయణాంశలతో ఆవిర్భవించారని నిశ్చయించి చెప్పాడు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. దుందుభులు మ్రోయించారు. గంధర్వులు గానంచేశారు. నృత్యం చేశారు. ఆ పురుషుని పృథువనీ, అందాలరాశీ, శ్రీహరికి నిరంతర చరణార్చిని అయిన లక్ష్మి అంశతో వచ్చిన ఆ స్త్రీమూర్తిని, 'అర్చి' అనీ పిలువ సాగారు. లోకకల్యాణం జరుగనున్నదని మునులు మిక్కిలి సంతోషించారు. పృథువు మహావిష్ణువు అవతారాలలో నొక్కడు.

బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులు పృథువునకు పట్టాభిషేకము చేయించాలని సంకల్పించారు. అన్ని ఏర్పాటులూ చేయించారు. కుబేరుడు సువర్ణ సింహాసనం కానుకగా ఇచ్చాడు. వరుణుడు ప్రకాశించే గొడుగును ఇచ్చాడు. వాయుదేవుడు దివ్యవింజామరల నిచ్చాడు. ధర్ముడు కీర్తిమయమైన మాలను ఇచ్చాడు. యముడు ధర్మదండాన్నిచ్చాడు. బ్రహ్మ వేదమయ కవచాన్నిచ్చాడు. సరస్వతీదేవి ముత్యాల హారాన్నిచ్చినది. శ్రీహరి సుదర్శన చక్రాన్నీ, లక్ష్మీదేవి తరిగిపోని ఐశ్వర్యాన్నీ, శివుడు దశచంద్రమనే కత్తినీ, పార్వతీదేవి శతచంద్రమనే డాలునూ, సోముడు శ్వేతాశ్వాలనూ, త్వష్ట సుందరమైన రథాన్నీ, సూర్యుడు మెరిసిపోయే బాణాలనూ, అగ్ని అజగవం అనే ధనుస్సునూ, భూదేవి యోగమయాలైన పాదుకలనూ బహూకరించారు. సముద్రుడు శంఖాన్నిచ్చాడు. సిద్ధసాధ్యులు అంతర్ధానశక్తినిచ్చారు. ఋషులు బాగుగా ఆశీర్వదించారు. శాస్త్రోక్తంగా, వైభవోపేతముగా పట్టాభిషేకము జరిగినది. వందిమాగధులు స్తోత్రాలతో, ప్రశంసలతో పృథుచక్రవర్తిని ముంచెత్తేస్తున్నారు. పృథువు వారిని వారిస్తూ ఇలా అన్నాడు:

"ఓ వందిమాగధులారా! మీరీవిధంగా నన్ను స్తుతించడం తగదు. నేనింకా రాజ్యపాలనము ప్రారంభించలేదు. నా గుణగణాదులింకా ప్రజలకు తెలియరాలేదు. మీస్తోత్రాలన్నీ ఇప్పుడు అప్రస్తుతము. అర్హతలేకుండా ప్రశంసలను పొంది ఆనందించడం బుద్ధిమంతులకు తగదు. నిజానికి మీరు స్తుతించవలసినవాడు, సకల కల్యాణ గుణాభిరాముడైన ఆ శ్రీమన్నారాయణుడు." అని చెప్పినప్పటికీ వారు తమ ధోరణిని విడువకుండా, ఇంకా ఇలాగ కొనసాగించారు:

"ఓ పృథుసార్వభౌమా! నీగురించి వర్ణించడానికి మాకు శక్తిచాలదు. నీగురించి మాకు మునులు సవిస్తరముగా చెప్పి, స్తుతింపుడని ప్రేరేపించినారు. నీవు సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణుడవేననీ లోకంలో సుస్థిరమైన రాజ్యపాలనను నెలకొల్పడానికి వేనుని శరీరమునుండి అవతరించావనీ, మేము వారినుండి తెలుసుకున్నాము. అందుచేత ఆ నారాయణునికి ఒప్పిన వర్ణనలన్నీ నీకునూ చక్కగా ఒప్పుతాయి. కనుక మేము నిన్ను ఈ విధంగా వర్ణిస్తాము:

ఈ పృథుచక్రవర్తి, లోకములో ధర్మస్థాపన చెయ్యడానికి అవతరించాడు. ఇతడు ధర్మరక్షకుడు. అధర్మవర్తనులను శిక్షిస్తాడు. ప్రజలను అన్నివిధాలా సంతోషింపజేస్తాడు. ఈయన చేయు యజ్ఞాలకు సంతుష్టులైన దేవతలు సకల సౌభాగ్యాలనూ అనుగ్రహిస్తారు. ఈయన రాగద్వేషాలు లేనివాడై సర్వప్రాణులనూ సమముగా చూస్తాడు. ఆర్తులను ఆదుకొంటాడు. స్వపరభేదములేకుండా ధర్మయుతంగా న్యాయపాలన చేస్తాడు. ప్రజలపొరపాట్లను మన్నిస్తాడు. శత్రువులను దూరంగానుంచుతాడు. సముద్రునివలె గంభీరమనస్కుడు. అందరి గౌరవం కాపాడుతాడు. బ్రహ్మవేత్తలను, బ్రాహ్మణులను గౌరవిస్తాడు. వృద్ధులను ఆదరిస్తాడు. దీనులయందు కరుణజూపుతాడు. స్త్రీలయందు మాతృభావం చూపుతాడు. ప్రజలను కన్నబిడ్డలవలె చూచుకొంటాడు. విష్ణుమూర్తివలె తన సామ్రాజ్యాన్ని పాలించి సంరక్షిస్తాడు. ఈయన బ్రహ్మ జ్ఞాన స్వరూపుడు. భూమినుండి సమస్త వస్తుసామగ్రినీ పొందుతాడు. వంద అశ్వమేధయాగాలను చేయిస్తాడు." అని చెప్పారు.

పృథుచక్రవర్తి రాజ్యపాలన కార్యాలలో నిమగ్నుడైయుండగా, ప్రజలలో చెలరేగుతున్న ఆకలి హాహాకారాలు వినవచ్చాయి. కారణమేమిటని విచారించగా, సారహీనమైన భూమినుండి చాలినంత ఆహార ఉత్పాదన జరగటంలేదని తెలియవచ్చినది. పృథుచక్రవర్తి భూమిపై కుపితుడయ్యాడు. బాణం సంధించాడు. భూదేవి గోరూపం ధరించి, గజగజవణకి పోతూ పరుగెత్త నారంభించినది ఎటుపోతున్నా ఆగోవును వెంబడిస్తుంటే, ఇక పరుగెత్తలేక గోరూపంలోనున్న భూమాత ఇలాగ వేడుకొన్నది.

"ఓమహానుభావా! నీవు సకల ధర్మాలూ తెలిసిన ప్రభుడవు. ఏ నేరమూ చెయ్యని స్త్రీనైన నన్నెందుకు చంపబూనుకొన్నావు? నేను మిక్కిలి దృఢదేహము కలదానిని. సమస్త జీవులనూ జలములో మునిగిపోకుండా నావలాగ ధరించి భరించి రక్షిస్తున్నాను. నన్ను ముక్కలుముక్కలుచేసి, చంపబూనుకొన్నావుకదా, మరి జీవరాసులు నీటమునిగిపోవా? నీవు పాలించడానికి ఇక భూమి ఎక్కడుంటుంది? అందుచేత నన్ను చంపే ప్రయత్నం విరమించుకొనుము." అని చెప్పిన భూమాతతో పృథుచక్రవర్తి ఇలా అన్నాడు: "ఓ వసుంధరా! దేవతలతో సహా నీవు, యజ్ఞభాగాన్ని అందుకొంటూ కూడ, ప్రజలకివ్వవలసిన సస్యధాన్యాదులను సరిగా ఇవ్వటంలేదు. గోరూపముధరించి పూర్తి మేతమేస్తూ కూడా పాలు ఇవ్వకుండా, నీలోనే దాచుకొంటున్నావు. జీవులకు కావలసిన ఆహారానికై బ్రహ్మ నీలో ఓషధీ బీజాలను పొందుపరచాడు. నీవు పుష్కలంగా వాటిని ఉత్పత్తి చెయ్యకుండా నీలోనే అణచిపెట్టి ఉంచుకొంటున్నావు. జీవరాసులకు చాలినంత ఆహారం దొరకక అన్నీ అలమటించి పోతున్నవి. నీవు స్వార్థపరురాలివి, ప్రజావిరోధివి, భూతదయలేనివారు జీవించడానికి అర్హులు కారు. నీవు శిక్షార్హురాలివి. నిన్ను అంతమొందించాలి. నీవు లేకుంటే ప్రజలు నిలవడానికి ఆధారం ఉండదని నీవు గర్విస్తున్నావేమో, నేను నాయొక్క యోగశక్తిచే నిలపగలను." అంటూ మళ్లీ భూమాతను చంపడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు భూమాత పృథువునకు నమస్కరించి, ఇలాగ విన్నవించుకొన్నది:

"ఓ భూమీశా! నీవు భగవదంశచే ఉద్భవించిన పరమపురుషుడవని నాకు తెలుసు. భగవంతునిగా నీవు సకల ప్రాణికోటికీ, ఆధారమైయుండుమని నన్ను సృజించావు. పాతాళంలో పడియున్న నన్ను దయతో నీవేకదా ఆది వరాహమవై పైకి తెచ్చి నీటిపై నిలిపావు. అప్పటినుండి సమస్త చరాచర భూప్రపంచాన్ని నేనే భరిస్తున్నానుకదా! మరి, నాపై కోపము తగ్గించుకొని, శాంతముగా నావిన్నపము నాలకించు. ఆహారోత్పత్తి తగ్గడానికి కారణమేమిటో ఆలోచించు. పూర్వము ఋషులు లోకకల్యాణాన్ని ఉద్దేశించి అనేకమైన ఉపాయాలను, పద్ధతులను నిర్దేశించారు. కాని, వాటిని పాటించకుండా, నేటి మానవుడు తనకు తోచినట్లు చేస్తూ, ఫలం సిద్ధించలేదని ఇతరులను నిందిస్తున్నాడు పూర్వము బ్రహ్మదేవునిచే సృజింపబడిన పెక్కు ఓషధులను, కలుషాత్ములు, నియమభ్రష్టులు, అయిన దుష్టులు, స్వార్థ బుద్ధితో భుజించి వేశారు. యజ్ఞ యాగాదులగురించి, లోకకల్యాణం గురించి వాటిని వినియోగించలేదు. రాజులు కూడ వారిని అడ్డగించలేదు. అందుకు భ్రష్టనైనదినేను. మహారాజా! యజ్ఞకర్మలు అడుగంటాయి. నానుండి, సర్వమూ అపహరించడమేగాని, నన్ను పరిపుష్టిగా పోషించాలనే ఆలోచనే మానవులకు లేదు. వారు స్వార్థపరులైపోయారు. చోరులు తస్కరించకుండా, యజ్ఞాలకు ఉపయోగపడే ఓషధులను, నేను నాలో జీర్ణింపజేశాను. నీవు లోకకల్యాణం వాంఛిస్తున్నావు గనుక నీకు ఒక ఉపాయం చెప్తాను విను. అలాచేస్తే నానుండి నీవు సర్వమూ పొందగలవు. నాకు తగిన దూడనూ, తగిన పాత్రనూ, తగిన దోగ్ధనూ సమకూర్చు. ప్రాణులకు ఇష్టమైనవీ బలవర్ధకమైనవీ దుగ్ధము, అన్నరూపమైనవీ అయిన కోరికలను ప్రసాదిస్తాను. నాఉపరితలం మిట్టపల్లాలుగా నున్నది. వర్షపునీరు నిలవటం లేదు. దానిని సమతలంచేసి, నీరు నిలుచునట్లు చేయించు. మానవుల అభీష్టాలన్నీ నెరవేరుతాయి" అని భూదేవి చెప్పిన హితవాక్కులను పృథువు ప్రీతితో విన్నాడు. స్వాయంభువ మనువును ప్రార్థించి, అతనిని గోవత్సముగా నిలిపాడు. తానే దోగ్ధయై భూమినుండి సకల ఓషధులను పిదికాడు. ఇది చూచి, ఇతరులు కూడ భూదేవినుండి, తమతమ వాంఛితార్థాలను పిదుకుకొన్నారు.

ఋషులు బృహస్పతిని దూడగా నిలిపి, ఇంద్రియాలనే పాత్రలో వేదమయమైన క్షీరాన్ని పిదుకుకొన్నారు. దేవతలు ఇంద్రుని దూడగానుంచి, బంగారు పాత్రలో ఓజోబలవీర్యామృతాన్ని పిదుకుకొన్నారు. దానవులు ప్రహ్లాదుని దూడగానుంచి,

ఇనుప పాత్రలో సురాసవమైన క్షీరాన్ని పిదుకుకొన్నారు. అప్సరసలు, గంధర్వులు, విశ్వావసువును దూడగా నుంచి, పద్మమయమైన పాత్రలో, మాధుర్యము, సౌందర్యములతో కూడిన గాంధర్వం అనే క్షీరాన్ని తెచ్చుకొన్నారు. పితృదేవతలు సూర్యుని దూడగా పెట్టి, ఆమ పాత్రలో కవ్యము అనే క్షీరాన్ని తెచ్చుకొన్నారు. సిద్ధులు కపిలమునిని దూడగానుంచి, ఆకాశపాత్రలో అణిమాది సిద్ధులను పొందారు. యక్షరక్షభూత పిశాచాలు రుద్రుణ్ణి దూడగానుంచి, కపాలపాత్రలో రుధిరాన్ని పొందారు. నాగులు తక్షకుని దూడగానుంచి, బిలపాత్రలో విషాన్ని తెచ్చుకొన్నారు. ఈ విధంగా పశుపక్ష్యాదులూ, ఇంకా అనేకులూ, తమతమ వాంఛితార్థాలను భూదేవినుండి సంపాదించారు.

అప్పుడు పృథుచక్రవర్తి ఎంతో సంతోషించినవాడై, సర్వకామ ప్రదాత్రి అయిన ధరిత్రిని తన పుత్రికగా చేసికొని, భూమిని సమతలంచేసి, ప్రజలు సుఖంగా జీవించడానికి ఒక శాశ్వత వ్యవస్థను చేశాడు. పల్లెలు, పట్టణాలు, వాటికలు, దుర్గాలు, శిబిరాలు కట్టించి, ప్రజలు సుఖసంపదలతో నివసించే ఏర్పాటు చేశాడు. ఇదే పట్టణ నిర్మాణానికినాంది.

పృథుచక్రవర్తి ఒకనూరు అశ్వమేధయాగాలను చేయడానికి దీక్షపూనాడు. మహానిష్ఠతో బ్రహ్మావర్తదేశములోని మనుక్షేత్రములో సరస్వతీనదీ తీరాన యజ్ఞాలు చేయింపనారంభించాడు.

## నూరవ అశ్వమేధయాగము :

బ్రహ్మావర్తము పరమ పవిత్రస్థలము. స్వాయంభువమనువు ఉండిన స్థలము. ఇక్కడ సరస్వతీనది తూర్పుముఖంగా మజలి ప్రవహిస్తుంది. దృషద్వతీ నది సరస్వతిలో కలుస్తుంది. ఈరెండు నదుల మధ్యస్థలమే బ్రహ్మావర్తము. ఇచ్చటనే యజ్ఞాలు చేయించాలని పృథుచక్రవర్తి నిశ్చయించాడు. లోకోత్తరశోభతో వైభవోపేతముగా యజ్ఞోత్సవాలు విరాజిల్లుతుండేవి. యజ్ఞపతి అయిన శ్రీహరియే స్వయంగా వచ్చి యజ్ఞఫలాన్ని ప్రసాదించేవాడు. శ్రీహరిని దర్శించడానికి, సేవించడానికి బ్రహ్మరుద్రాది దేవతలంతా వచ్చేవారు. కపిల, నారద, దత్త, సనకసనందాదులూ వచ్చేవారు. యజ్ఞాలకు కావలసిన భోజ్యాలను పర్వతాలు సమర్పించేవి. భూదేవి సకల కామ్యార్థాలను సమకూర్చేది. నదులు పాలు, పెరుగు, మధుర రసాలు నెయ్యిమొదలైన వాటిని అర్పించేవి. సముద్రుడు రత్నాలను సమర్పించాడు. ఈ విధముగా శోభాయమానంగా జరుగుతున్న యజ్ఞాలను చూచి, ఇంద్రుడు అసూయ చెందాడు. తొంబదితొమ్మిది యజ్ఞాలు ముగిసినవి. నూరవది ముగిస్తే, మానవమాత్రుడైన ఈ పృథువు వల్ల తన పదవికే ముప్పురాగలదని దేవరాజు భావించాడు. దీనిని ఎలాగైనా భగ్నం చెయ్యాలనుకొన్నాడు.

నూరవయజ్ఞము ప్రారంభమైనది. ఇంద్రుడు ఒక పాషండుని వేషము ధరించి, యజ్ఞపశువైన అశ్వాన్ని అపహరించుకొని పోయాడు. పాషండుడు (పాఖండుడు) అంటే పాపవర్తనుడు, పుణ్యమూర్తివలె వేషాన్ని ధరించువాడు. వాడు వేదవిరోధి, యజ్ఞవిరోధి, మాటలతో మభ్యపెట్టగలనేర్పరి. ఇంద్రుడు ధరించిన ఈ పాషండవేషము తరువాతి తరాలలోని కపట సన్న్యాసులందరికీ అనుసరణీయమైపోయినది. జటాధారియై, ఉత్తమయోగివలె కనిపిస్తూ యజ్ఞాశ్వాన్ని తీసుకొనిపోతున్నవాడు ఇంద్రుడే అని గ్రహించిన అత్రిమహర్షి, పృథుపుత్రునితో - ఆచోరుని చంపి అశ్వాన్ని తీసుకొనిరమ్మని ఆదేశించాడు. అతడు ఆచోరుని వెంబడించి, యోగిరూపంలో నున్న వానిని చంపడానికి సందేహిస్తుంటే, అత్రిమహర్షి ఇలాగ కేకవేశాడు: "రాకుమారా! అతడు సన్న్యాసికాడు. యజ్ఞఘాతుకుడైన ఇంద్రుడు. అతనిని జయించు, జయించు, జయించు" అనగా విని, అతడు ఇంద్రునిని వెంటాడాడు. ఇంద్రుడు భయపడి అశ్వాన్ని విడిచి మాయమయ్యాడు. అశ్వాన్ని విడిపించుకొని తెచ్చిన పృథుపుత్రుని మునులంతా 'విజితాశ్వుడు' అని అన్నారు. ఆ పేరే అతనికి శాశ్వతంగా నిలిచిపోయినది. ఇంద్రుడు తన ప్రయత్నం మానలేదు. యజ్ఞక్షేత్రాన్ని దట్టమైన చీకటితో నింపివేశాడు. ఎవ్వరికీ కనిపించకుండా మళ్లీ అశ్వాన్ని తీసుకొనిపోతుంటే మళ్లీ అత్రిమహర్షి కనిపెట్టి, జితాశ్వుని పంపించాడు. ఈసారి ఇంద్రుడు కపాల ఖట్వాంగాలు ధరించి, అతడు రుద్రుడేమో అనే భ్రమను కలిగించడంచేత విజితాశ్వుడు బాణం వెయ్యలేదు. అతడు ఇంద్రుడే సుమా అని అత్రిమహర్షి హెచ్చరించగా, బాణం సంధించగానే ఇంద్రుడు భయపడి వేషాన్నీ అశ్వాన్నీ విడిచి అదృశ్యమైనాడు.

ఇదివినిని పృథు చక్రవర్తి ఇంద్రునిపైకి బాణప్రయోగం చెయ్యడానికి సిద్ధపడ్తుంటే, ఋత్విక్కులు వారించి, యజ్ఞదీక్షితుడు యజ్ఞపశువుపైన తప్ప ఇంకదేనిపైనను ఆయుధ ప్రయోగం చెయ్యరాదు అనీ, తామే మంత్రాలచే ఇంద్రుని రప్పించి, ఆహుతి చెయ్యగలమనీ, చెప్పి, స్రుక్కులూ, స్రువాలు ధరించి, వేల్చడానికి సిద్ధపడుతుంటే, బ్రహ్మదేవుడు వచ్చి, ఇలాగ చెప్పాడు: "ఇంద్రుడు యజ్ఞుడనే భగవదంశసంభూతుడు, చంపదగినవాడు కాడు. యజ్ఞంలో ఆరాధింపబడే దేవతలందరూ ఇంద్రుని అంశాలే. అందుచేత, యజ్ఞముద్వారా అతని పై ప్రతీకార చర్యతీసుకొనరాదు" అని చెప్పి, బ్రహ్మ పృథువుతో ఇలా అన్నాడు: "రాజా! నీవూ, ఇంద్రుడూ శ్రీహరి అంశతో పుట్టినవారే కనుక, మీలోమీకు వైరము తగదు. నీవు మోక్షాన్ని కోరేవాడవు కదా! నీకు ఈ యజ్ఞాలవల్ల మోక్షము సిద్ధించదు. తొంబైతొమ్మిది యజ్ఞాలు చేసినా, నూరు పూర్తి చేసినా నీకు ఒక్కటే! కాని, ఇంద్రునిలో పాషండప్రవృత్తి ప్రబలితే ధర్మహానికలిగే ప్రమాదముంటుంది కనుక నీవు నూరవ యజ్ఞాన్ని విరమించుకోవడం శ్రేయస్కరము. నీవు లోకంలో నశించిన ధర్మాన్ని పునరుద్ధరించడానికి అవతరించావుకదా! ఆ కర్తవ్యాన్ని నిర్వహించు" అని చెప్పి బ్రహ్మ నిష్క్రమించాడు. పృథుచక్రవర్తి యజ్ఞాన్ని విరమింపజేసి, యథావిధిగా అందరినీ భూరి దక్షిణలతో సన్మానించి సాగనంపాడు.

యజ్ఞేశ్వరుడైన శ్రీహరి, ఇంద్రుని తోడ్కొని వచ్చి పృథువుతో ఇలా అన్నాడు: "ఓ రాజచంద్రమా! ఈ ఇంద్రుడు నీవు చేస్తుండే నూరవ అశ్వమేధయాగాన్ని భంగపరచినందుకు నీయొక్క క్షమను అర్థిస్తూ వచ్చాడు. సత్పురుషుడవైన నీవు అతనిని సహృదయతతో క్షమింపుము. సంపదలు వచ్చినా, ఆపదలు వచ్చినా, నాభక్తులు నిర్వికారులైయుంటారు. నీవు ఇంద్రియాలను జయించి, సుఖదుఃఖాలయందూ, ఉత్తమ, మధ్యమ, అధమ పరిస్థితులయందూ సమవర్తనుడవైయుంటూ, మంత్రుల సహాయంతో ప్రజలను జనరంజకంగా పరిపాలించు. నరాధిపా! తపోయాగ యజ్ఞాదులచే నేను సులభంగా లభించను. కాని సమచిత్తులైన సత్పురుషులకు సులభంగా లభిస్తాను. నీయందు నేను ప్రసన్నుడనైనాను. నీకొక వరమిస్తాను. కోరుకొనుము" అని చెప్పగా, పృథువు అమితానందభరితుడయ్యాడు. సిగ్గుతో తలవంచుకొనియున్న ఇంద్రుని ప్రేమతో ఆలింగనం చేసికొన్నాడు. పరవశుడై, ఆనందబాష్పాలతో భగవానుని పాదపద్మాలకు అభిషేకంచేశాడు. అతని చేతుల పట్టునుండి విష్ణువు తన పాదాలను విడిపించుకొనలేక అలాగే నిల్చుండిపోయాడు. పృథువు అది గ్రహించి, తలఎత్తి ఇలాగ విన్నవించుకొన్నాడు:

"వాసుదేవా! భక్తవరదా! నీమాయలో నన్ను పడవేస్తున్నావా ప్రభూ? నేను నిన్ను ఎలాంటి వరమిమ్మని కోరుకొనేది? దేహాభిమానులు కోరుకొనే ఐహిక భోగాలేకాదు, నాకు మోక్షము కూడా వద్దు. నీ నిర్మల చరిత్ర గాథలను వినడానికి నాకు ఈ రెండు చెవులూ చాలవు. కనుక, నాకు పదివేల చెవుల వినికిడి శక్తిని ప్రసాదించు. ఇదే నా కోరిక. ఆత్మజ్ఞానాన్ని విస్మరించిన అభాగ్యులకూ, అజ్ఞానులకూ, మహాత్ముల వాక్కులనుండి వెలువడే నీమధుర కథాసుధారేణువులు సోకి, మళ్లీ ఆత్మ జ్ఞానం కలిగేటట్టు చేయగల వరాన్ని నాకు ప్రసాదించు. దేవదేవా! జగన్నాథా! నీపాదసేవ చేయడంలో లక్ష్మీదేవి నాతో పోటీపడి అడ్డము రాకుండా చేయుము. నీ పాదసేవాభాగ్యము కంటె విలువైనది ఇంకేమైనా ఉన్నదా?" అని చెప్పిన పృథువు యొక్క భక్తి ప్రకటనకు మహావిష్ణువు మిక్కిలి సంతసించినవాడై ఇలా అన్నాడు:

"వత్సా! నాభక్తులు నరకాన్నీ, స్వర్గాన్నీ, మోక్షాన్నీ, సమదృష్టితో చూస్తారు. నీవు కోరుకొన్నట్లే నీకు అచంచలమైన పరిపూర్ణమైన భక్తి లభిస్తుంది. నీకర్తవ్యాలను చక్కగా నిర్వర్తించి అన్ని శుభాలనూ పొందగలవు" అని ఆశీర్వదించి, శ్రీహరి గరుడారూఢుడై నిష్క్రమించాడు. దేవతలూ ఋషులూ ఆశీర్వదిస్తుండగా, జనులు స్తుతిస్తుండగా పృథు చక్రవర్తి యజ్ఞవాటికను వీడి రాజ ప్రాసాదం చేరుకొన్నాడు.

పృథుచక్రవర్తి గంగాయమునా నదుల మధ్యనున్న విశాలభూమిని, సకల భోగ భాగ్యాలతో, ప్రజారంజకంగా, దుష్టదమనుడై సుఖముగా పరిపాలిస్తూ, ఒక దీర్ఘసత్రయాగాన్ని ప్రారంభింప సంకల్పించాడు. అనేకులైన బ్రహ్మర్షులను, రాజర్షులను, పితృదేవతలను ఆహ్వానించి పూజించాడు. విష్ణుమూర్తి అంశతో సంభవించిన ఆ మహారాజు ఆజానుబాహుడు, స్ఫురద్రూపి, తేజోమయుడు. చల్లని చూపులతో ఆనందం చిందించే చిరునవ్వుతో దివ్యపురుషునిలాగ ప్రకాశించే ఆ రాజు, సభాసదులనుద్దేశించి, ఇలా అన్నాడు:

"మహాత్ములారా! సభాసదులారా! ధర్మయుతంగా పరిపాలిస్తూ, ప్రజలు తమతమ స్వధర్మ కర్మాచరణ చేసేటట్టు చూడడానికీ, ప్రజలు సురక్షితంగా, సుఖసంతోషాలతో అభివృద్ధి చెందేటట్లు చెయ్యడానికీ, బ్రహ్మదేవుడు రాజులను నియమించాడు. రాజు ప్రజల శ్రేయస్సును గురించీ, ప్రజలు రాజ్యముయొక్క సమష్టి సంక్షేమమును గురించీ, పరస్పరం పాటుపడుతూ ఉండాలి. ఈశ్వరార్పణ బుద్ధితో సమస్త ధర్మకర్మలనూ ఆచరిస్తుండాలి. అలాగ చెయ్యడం వల్ల రాజుకు ఉత్తమలోకప్రాప్తీ, ప్రజలకు ధర్మార్థ కామమోక్షాలైన పురుషార్థాలూ సిద్ధిస్తాయి."

సర్వేశ్వరుడే ఈ చిత్రవిచిత్రాలతో కూడిన విశ్వాన్ని సృజించాడు. మహనీయులైన మనువు, ధ్రువుడు, ప్రహ్లాదుడు, బలి, ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడు మొదలైన పూర్వులు ఆ పరమపురుషుని ఆరాధించి, ఆయన అనుగ్రహాన్నీ, సర్వశుభాలనూ పొందియుండిరి. ఆయనయొక్క దివ్య చరణాలను భక్తితో కొలిచే వారి సమస్త దోషాలూ తొలిగిపోయి, విజ్ఞానమూ, వైరాగ్యమూ, భక్తీ, శక్తీ అన్నీ లభిస్తాయి. నా ప్రజలందరూ విష్ణుభక్తిపరులై సుఖసంపదలతో నుండాలి. బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులే ప్రత్యక్షదైవాలు. వారిని సేవిస్తే సర్వేశ్వరుడు కూడ సంతసిస్తాడు. సకల సద్గుణాలూ సంప్రాప్తిస్తాయి. హృదయం నిర్మల మవుతుంది." అని పృథుమహారాజు చెప్పగా, దేవతలూ, పితరులూ, బ్రాహ్మణులూ, సదస్యులూ, అందరూ సంతోషించి, అభినందించారు. పృథువు చేసిన సత్కర్మల ఫలితంగా, పాపాత్ముడూ, శాపగ్రస్తుడూ అయిన అతని తండ్రి వేనుడు నరకలోకంనుండి తరించాడు.

అందరూ పృథుచక్రవర్తిని ప్రశంసించి నిష్క్రమించారు.

ఆ సమయంలో బ్రహ్మతేజోవిరాజితులైన సనకసనందన సోదరులు విచ్చేశారు. పృథువు వారికి ఎదురువెళ్లి, సకలమర్యాదలతో నాహ్వానించి, పూజలు చేసి ఇలాగ అన్నాడు:

"దివ్యమంగళస్వరూపులారా! మీరాకవలన నేను ధన్యుడనైనాను. ఈభూమి పవిత్రమైనది. మీరు బాల్యమునుండి మోక్షమార్గములోనే పయనిస్తున్న పుణ్యాత్ములు, లోకశుభంకరులు, ఆత్మారాములు, కర్మాధీనులమై సంసారంలో కొట్టుకొంటున్న మాలాంటివారికి వెలుగుబాటను చూపువారు. భగవంతుడు తన భక్తులకు తరణోపాయాన్ని చూపడానికి, మీవంటి మహనీయుల రూపంలో ఈ భూమి మీద సంచరిస్తుంటాడు." అని సవినయంగా అన్న రాజుమాటలకు ఆ మహాత్ములు సంతసించారు. వారిలో సనకుడు, రాజుతో ఇలా అన్నాడు:

"రాజచంద్రమా! నీవు సర్వప్రాణుల హితాన్ని కోరే మనస్సు గలవాడవు. నీకు తెలియని ధర్మ శాస్త్రాలు లేవు. శ్రీహరి కమలచరణ భక్తిలో నీవు పరిపూర్ణుడవు. నీచరిత్ర లోకోత్తరమైనట్టిది. అయినా, నీవు కోరితివిగనుక చెప్తాను విను:

ఆత్మయందు అనురక్తీ, దేహాదులయందు విరక్తీ మనిషికి సకల శ్రేయస్సులనూ చేకూర్చుతాయి. వాటిని పెంపొందించుకోడానికి చేయవలసిన ఇరవై సాధనలివి:

శ్రద్ధ, భాగవత ధర్మాలను పాటించడం, ఆయా ధర్మ విషయాలయందు జిజ్ఞాస, ఆధ్యాత్మిక యోగనిష్ఠ, యోగీశ్వరోపాసనము, నిరంతర శ్రీహరి గాథా శ్రవణము, ఇంద్రియలోలురూ, ధనలోభులూ అయినట్టివారికి దూరముగానుండడం, అలాంటివారు కాంక్షిస్తుండే అర్థకామాలయందు ఆసక్తి లేకుండడం, హరిగుణామృత రసాస్వాదనమునందు తప్ప ఇతర విషయాలందు విరక్తి కలిగియుండడం, ఆత్మారామస్థితి, ఏకాంత వాసమందు అభిరుచి, అహింసాపాలనము, ఇంద్రియనిగ్రహము, ఆత్మహితానుసంధానము, సంతత భగవత్కథానుచింతనము, యమనియమాభ్యాసము, ఇతర భక్తి మార్గాలను నిందించకుండా ఉండడము, తన సొంత యోగక్షేమాల గురించి ఏకార్యమూ చేపట్టకుండడం, శీతోష్ణాది ద్వంద్వాలను సహించడం, హరిభక్తులకు కర్ణాలంకారాలైన విష్ణు గుణగణాలను వర్ణించడం లాంటి సాధనలవల్ల భక్తి పెరుగుతుంది. దేహాదులయందు విరక్తీ, నిర్గుణ పరబ్రహ్మము నందు అనురక్తీ కలుగుతాయి. ఇట్టి భక్తుడు ఆచార్యులయొక్క అనుగ్రహానికి పాత్రుడవుతాడు. బ్రహ్మనిష్ఠులైన మహాత్ములతో

సాంగత్యమేర్పడి, దారేషణ, ధనేషణ, పుత్రేషణ అనే ఈషణ త్రయాన్ని వదిలించుకొని, సంసార బంధనాలనుండి విడివడుతాడు. కర్తృత్వ, భోక్తృత్వ భావాలనుండి విముక్తుడవుతాడు. ఉపాధి అయిన అంతఃకరణం పనిచేస్తున్నప్పుడు, ఆత్మ ద్రష్టగానుంటూ, అహంకారప్రేరితమై దృశ్యవిషయాలను గ్రహిస్తుంది. అందువల్ల ఉపాధితో కూడిన జీవుడు, జాగ్రదవస్థలోనూ, స్వప్నావస్థలోనూ, సుఖదుఃఖాది అనుభవాలను పొందుతుంటాడు. సుషుప్తిలో అంతఃకరణం లయించి యుండడంచేత, ఎలాంటి అనుభవాలూ ఉండవు. విషయాసక్తులకు, బుద్ధియొక్క విచారశక్తి క్రమక్రమంగా హరించుకొనిపోతుంది. తరువాత స్మృతి నశిస్తుంది. దానితో విజ్ఞానం నశిస్తుంది. దానినే సర్వనాశనం అంటారు. ఆత్మజ్ఞానం మరుగుపడడమే సర్వనాశమని చెప్పబడినది. రాజేంద్రా! దేహేంద్రియప్రాణమనోబుద్ధిఅహంకారాలతో ఆవరింపబడియున్న సర్వజీవుల హృదయాంతర్యామియై వెలుగుతున్న భగవంతుని తెలుసుకోవాలి. ఈ సమస్త విశ్వమూ పరమేశ్వరునియందు ఆయన మాయా ప్రభావంచే లీనాలీన భావంతో ప్రకాశిస్తూ ఉంటుంది. ఆదిపురుషుడైన ఆ దేవాదిదేవుడు భక్తిచేమాత్రమే లభ్యమవుతాడు కనుక ఓమహారాజా! ఆయనయొక్క చరణపద్మాలను భక్తితో సేవించు" అని చెప్పిన బ్రహ్మవిదుడూ, బ్రహ్మ మానసపుత్రుడూ అయిన సనత్కుమారునకు పృథుచక్రవర్తి ప్రణామాలుచేసి ఆశీర్వాదాలుపొందినాడు.

పృథుచక్రవర్తి ఆత్మనిష్ఠుడై బ్రహ్మార్పణ బుద్ధితో సత్కర్మలను, ధర్మాలను నిర్వహించేవాడు. సమస్త రాజ్య కార్యకలాపాల్లోనూ సంగములేనివాడై, అహంకార రహితుడై ప్రవర్తించేవాడు. భార్య అయిన అర్చి మహాదేవియందు ఐదుగురు పుత్రులను పొందాడు. అతడు అగ్నివలె తేజస్వి. ఇంద్రునివలె అజేయుడు, భూమివలె సహనశీలుడు, సముద్రమువలె గంభీరుడు, మేరువువలె ధీరుడు, యమునివలె శాసించేవాడు, కుబేరునివలె ధనవంతుడు, మన్మథునివలె సుందరుడు, వాయువువలె బలవంతుడు, శ్రీహరివలె జితేంద్రియుడు. భక్తుడు, లజ్జాశీలుడు, వినమ్రుడు, సచ్ఛీలుడు, పరోపకారపరాయణుడు, సకలసద్గుణాలూ తనవిగా చేసుకొన్నవాడు. అతని గుణగణాలను కవులు, గాయకులు, పలువిధాలుగా దేశదేశాలలో మారుమ్రోగేటట్లు గానం చేసేవారు.

పృథుచక్రవర్తి ప్రజలను బిడ్డలకంటె ఎక్కువగా వాత్సల్యముతో పాలించేవాడు. ధర్మాన్ని స్థాపించి పోషించేవాడు. దైవనిర్దేశితవేదప్రోక్త స్వధర్మాలను చక్కగా ఆచరించేవాడు. ఒకనాడు తాను ఐహిక వ్యాపారాలను విరమించుకొనవలసిన కాలము ఆసన్నమైనదని గ్రహించినవాడై, విజితాశ్వునికి పట్టముగట్టి, భార్యాసమేతుడై తపోవనానికి వెళ్లిపోయాడు. అరణ్యంలో కందమూలాలూ పండ్లూ ఆరగిస్తూ కొన్నాళ్లు, తృణపర్ణాలను తింటూ కొన్నాళ్లు, జలాన్ని మాత్రమే సేవిస్తూ కొన్నాళ్లూ, తరువాత కేవలం వాయుభక్షణమే చేస్తూ మహోగ్రమైన తపస్సు చేశాడు. ప్రచండమైన మండు వేసవిలోనూ, కుంభవృష్టిలోనూ వణికించే చలిలోనూ పీకవరకు చన్నీటిలోనూ నిల్చొని తపస్సు చేశాడు. కటికినేలమీద నిద్రిస్తూ, కఠోరనియమాలతో మౌనంగానుంటూ ఇంద్రియాలను జయించి, ఈశ్వరార్పణ బుద్ధితో ఘోరమైన తపమాచరించాడు. తపోమహిమచే సమస్త కర్మల మాలిన్యాన్నీ తొలగించుకొని, చిత్తశుద్ధిని పొంది, శ్రీహరిపాదచింతనచే జ్ఞానోదయంపొంది, ఆత్మయందు ఆత్మానుసంధానముచేసి యోగనిష్ఠుడై ముక్తిని పొందాడు.

పృథువు భార్య అర్చిమహాదేవి మహాపతివ్రత. లక్ష్మీ-అంశసంభూత. అసమాన సౌందర్యరాశి. కుసుమకోమల లావణ్యవతి. సుకుమారి అయినప్పటికీ, అరణ్యవాసంలో భర్తకు అన్నివిధాలా సేవాశుశ్రూషలు చేస్తూ, కందమూలాలను తింటూ కృశించి పోయినది. భర్తదేహత్యాగం చెయ్యగానే తానే చితిని సిద్ధపరచుకొని, దేవతలకు నమస్కరించి, అగ్నిముట్టించుకొని ముమ్మారు ప్రదక్షిణంచేసి, సాటిలేని మహాపురుషుడైన పతిదేవుని స్మరిస్తూ, మండుతున్న అగ్ని జ్వాలల్లోపడి సహగమనం చేసినది. దేవతలంతా ఆశ్చర్యంతో హాహాకారాలు చేసి, జయజయ ధ్వానాలు చేశారు. పుష్పవృష్టికురిపించారు. ఆ మహాసాధ్వి పతిదేవునితో సహా విష్ణులోకాన్ని పొందినది.

ఈ పుణ్య దంపతుల చరిత్రను చదివినవారు, వినినవారూ పుణ్యలోకాలను పొందగలరు.

అని మైత్రేయ మహాముని విదురునితో చెప్పినట్లు శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

## ప్రచేతసులు

విజితాశ్వుడు తండ్రికి (పృథువునకు) తగ్గకొడుకై, అతని అనంతరం పృథివిని పాలించాడు. తన నలుగురు తమ్ముళ్ళకూ, నాలుగు దిక్కులనూ పాలించుడని ఒప్పజెప్పాడు. అతనికి నభస్వతి అనే భార్యయందు హవిర్ధానుడనే కుమారుడు కలిగాడు. హవిర్ధానుని భార్య హవిర్ధాని. వీరికి ఆరుగురు పుత్రులు కలిగారు. వారిలో పెద్దవాడు బర్హిష్మదుడు. పాలకులు ప్రజలపట్ల సాధారణంగా అవలంబించే హింస, కాఠిన్యమూ ఇష్టంలేక, హవిర్ధానుడు రాజ్యాన్ని పుత్రునకు ఇచ్చి, తానొక దీర్ఘసత్రయాగాన్ని ప్రారంభించాడు. ఆ యజ్ఞములో పరమపురుషుడు హంసరూపంలో వచ్చి అతనికి ఆత్మతత్త్వాన్ని బోధించాడు. అతడు యోగ సమాధి ద్వారా ముక్తిని పొందాడు.

రాజైన బర్హిష్మదుడు నిత్యమూ యజ్ఞాలు చేయిస్తూ ఉండేవాడు. చేసిన చోట మళ్లీ చెయ్యక పోవడం చేత భూమండలమంతా యజ్ఞశాలలతో నిండిపోయినది. ప్రాచీనాగ్రాలు అనబడే దర్భలు భూమిఅంతటా మొలచివ్యాపించినవి. అందుచేతనే ఆ రాజును ప్రాచీనబర్హి అనేవారు. యజ్ఞాలూ, ధర్మకార్యాలూ నిత్యమూ చేయిస్తుండడంచేత అతనిని ప్రజాపతి అనీ, యోగసమాధి నిష్ఠుడనీ ప్రజలు ప్రశంసించేవారు. అతడు సముద్రునికూతురైన శతధృతిని వివాహమాడాడు. ఆమె త్రిభువనసుందరి. వివాహసమయంలో ఆమె సౌందర్యవైభవాన్ని తిలకించిన అగ్ని, ఇతర దేవతలు, గంధర్వులు మోహపరవశులైనారట. శతధృతిబర్హిష్మదులకు పదిమంది పుత్రులు జన్మించారు. వారు ప్రచేతసులుగా ప్రసిద్ధిచెందారు. వారు సమవ్రతులు, సమ (ఏక)నామము కలవారు, ధర్మజ్ఞులు. తండ్రికోరికపై వారంతా, సంతానాభివృద్ధి గురించి తపస్సు చెయ్యడానికి అరణ్యానికి వెళ్తుండగా, వారికి రుద్రుడు సాక్షాత్కరించి, నారాయణ మంత్రాన్ని ఉపదేశించాడు. అది ఎలాగ జరిగిందంటే –

### ప్రచేతసులు - రుద్రగీత

సంతానాభివృద్ధి చేయుమని, తండ్రిగారైన బర్హిష్మదుడు కోరినందున ప్రచేతసులు, పశ్చిమదిశగా వెళ్లుతూ సాగరంలాంటి ఒక మహాసరస్సును చూచారు. కలువలతోనూ, హంసలతోనూ, విహరిస్తుండే గంధర్వులతోనూ, శుద్ధజలాలతోనూ, ఆహ్లాదం కలిగిస్తుండే ఆ సరస్సునుండి ఒక దివ్యపురుషుడు బైటకు వస్తుండడం చూచారు. వారు ఆయనను మహేశ్వరుడని గుర్తించి, భక్తిపరవశులై ఆయన పాదాలపై బడ్డారు. దయామయుడైన శంకరుడు జ్ఞానసంపన్నులూ, పరిశుద్ధాత్ములూ అయిన ప్రచేతసులతో ఇలా అన్నాడు: "రాజపుత్రులారా! మీరెవరో, మీకోరిక ఏమిటో నాకు తెలుసు. మిమ్మల్ని అనుగ్రహించాలనే సంకల్పంతో మీకు దర్శనమిచ్చాను. శ్రీహరి భక్తులు నాకు మిక్కిలి ఇష్టులు. హరిభక్తులు విష్ణుపదాన్ని ఇతరులకంటే సులభముగా పొందగలరు. నేనిప్పుడు చెప్పబోయేది అతిరహస్యమూ, పవిత్రమూ, శుభప్రదమూ, మోక్షప్రదమూ అయినట్టి ఉపదేశము. దీనిని జపించి తరించండి. పూర్వము బ్రహ్మ తన పుత్రులైన సనక సనందాదులకు దీనిని ఉపదేశించే ఉద్దేశముతో, వారు వింటూఉండగా, శ్రీహరిని ఈ విధంగా స్తుతించాడు: "పరమేశ్వరా! ఆత్మజ్ఞానులకు నీ ఉత్కర్షం ఆనందం కలిగిస్తుంది. నీవు సంపూర్ణ ఆనంద స్వరూపుడవు. మాకు ఆనందం ప్రసాదించు. నీకు నమస్కారములు.

సీ॥ పంకజ నాభాయ సంకర్షణాయ శాంతాయ విశ్వప్రబోధాయ భూత
సూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదేవాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మ విస్తారకాయ క్షేత్ర పాలాయ త్రైలోక్య పాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వయం జ్యోతిషే దురంతాయ కర్మ
తే॥ సాధనాయ పురాపురుషాయ యజ్ఞరేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసేఽంతకాయ విశ్వయోనయే విష్ణవే జిష్ణవే నమోఽస్తు 702

ఓ సృష్టికర్తా! నీవు పద్మనాభుడవు: సంకర్షణుడవు, శాంతుడవు, విశ్వగురుడవు, జీవుల జ్ఞానేంద్రియాధారుడవు, సూక్ష్మతముడవు, అవ్యక్తుడవు, వాసుదేవుడవు, పరిపూర్ణుడవు, పుణ్యనిధివి, నిర్వికారుడవు, కర్మలనుండి దాటించువాడవు,

వేదాలను పోషించువాడవు, ముల్లోకాలనూ పాలించేవాడవు, సోమరూపుడవు, తేజోబలములు కలవాడవు, స్వయంప్రకాశకుడవు, అంతములేనివాడవు, (చెడును అంతము చేయువాడవు) కర్మలకు సాధనమైనవాడవు, పురాణపురుషుడవు, యజ్ఞఫలరూపుడవు, జీవత్ృప్తుడవు, పృథ్వీస్వరూపుడవు, లోకస్వరూపుడవు, ఆకాశాన్ని మించిన వాడవు, విశ్వానికి ఉత్పత్తి స్థానమైనవాడవు, విష్ణుడవు, జిష్ణుడవు. నీకు నమస్కారములు.

సీ॥ స్వర్గాపవర్గసుద్వారాయ సర్వరసాత్మనే పరమ హంసాయ కర్మ
పాకాయ సద్ధితఫలరూపకాయ కృష్ణాయ ధర్మాత్మనే సర్వశక్తి
యుక్తాయ ఘనసాంఖ్యయోగీశ్వరాయ హిరణ్యవీర్యాయ రుద్రాయ శిష్ట
నాథాయ దుష్టవినాశాయ శూన్యప్రవృత్తాయ కర్మణే మృత్యవే వి
తే॥ రాట్ శరీరాయ, నిఖిలధర్మాయ వాగ్విభూతయే నివృత్తాయ సత్పుణ్యభూరి
వర్చసేఽఖిలధర్మదేవాయ చాత్మనేఽనిరుద్ధాయ నిభృతాత్మనే నమోఽస్తు 703

ఓ దేవదేవా! నీవు స్వర్గాన్నీ, మోక్షాన్నీ పొందడానికి చక్కని ద్వారము వంటివాడవు. సకల రసస్వరూపుడవు, సూర్యుడవు ధర్మపాలకుడవు, సజ్జనహితఫలప్రదాతవు, కృష్ణుడవు, ధర్మాత్ముడవు, సర్వశక్తియుక్తుడవు, గొప్ప సాంఖ్యయోగీశ్వరుడవు, హిరణ్యగర్భుడవు, రుద్రుడవు, శిష్టరక్షకుడవు, దుష్టశిక్షకుడవు. శూన్యప్రవృత్తుడవు, కర్మస్వరూపుడవు, మృత్యుదేవతవు, విరాట్‌శరీరుడవు, సకలధర్మస్వరూపుడవు, వాగ్విభూతి గలవాడవు, నివృత్తుడవు, సత్పుణ్యతేజోవిరాజితుడవు, సకలధర్మములను ధరించువాడవు, ఆత్మస్వరూపుడవు, అనిరుద్ధుడవు, వృద్ధిక్షయాలు లేనివాడవు నీకు నమస్కారములు.

తే॥ సర్వసత్త్వాయ దేవాయ సన్నియామకాయ బహిరంతరాత్మనే కారణాత్మ
నే సమస్తార్థలింగాయ నిర్గుణాయ వేధసే జితాత్మకసాధవే నమోఽస్తు. 704

దేవా! నీవు అంతటా వ్యాపించియున్న సత్త్వగుణాత్మకుడవు. అన్నింటినీ నియంత్రించువాడవు, లోపలా బయటా, అంతటా నిండియున్నవాడవు, కారణాత్ముడవు, సమస్తకామితార్థాలకూ కారణభూతుడవు, నిర్గుణుడవు, సృష్టికర్తవు, సాధువులచే జయింపబడువాడవు. నీకు నమస్కారము.

నీవు ప్రద్యుమ్నదేవుడవు, అంతరాత్మవు, సర్వజ్ఞుడవు నీకు నమస్కారము. నీవు అనిరుద్ధదేవుడవు, జగద్రక్షకుడవు. స్వర్గప్రాప్తికీ, మోక్షప్రాప్తికీ నీవే సాధనము. శుద్ధ చిత్తముగలవారిని నీవు ఆనందింపజేస్తావు. నీవు యజ్ఞస్వరూపుడవు, యజ్ఞఫలమైనవాడవు, ఫలదాతవు. ఫలమునుకోరి దేవతలను, పితరులను, ఆశ్రయించువారికి ఆయా దేవతల పితరుల రూపాల్లోనే వారి కామ్యాలను అనుగ్రహిస్తావు. ఏకోరికలూలేక భగవదారాధనాభావంతో కర్మచేసేవారినికూడా అనుగ్రహిస్తావు. నీకు నమస్కారములు. నీవు జ్ఞానస్వరూపుడవు, జ్ఞానదాతవు, జగద్గురుడవు. నిన్ను ఏకాంతభక్తితో ఆరాధించేవారు, నీ పాదపద్మాలను తప్ప, స్వర్గాన్నిగాని, కైవల్యాన్నిగాని కోరరు. ప్రభూ! శీలము, సరళవర్తనము, సత్త్వగుణము, భూతదయ కలిగియున్న నీయొక్క భక్తులసహవాసము మాకు లభింపజేయుము. అదే చాలు. ఇంద్రియ సుఖాలయందు విరక్తి, నీ పాదాలయందు అనురక్తి సిద్ధిస్తాయి. నీయొక్క దివ్యపాదారవిందాలను పొందినట్టి ధన్యాత్మునకు, ఇక పొందదగినది వేరే ఏముంటుంది? ఓ అవ్యయానందనిధీ! గోవిందా! శ్రీహరీ! ముకుందా! పరమభక్తులు నిత్యమూ పూజించే నీదివ్యదర్శనాన్ని మాకు ప్రసాదించు" అని, సనక సనందాదులతో సహా బ్రహ్మదేవుడు స్తుతించాడు. ఈ స్తోత్రముపేరు యోగాదేశము. ప్రచేతసులారా! మీరు ఈ స్తోత్రాన్ని పలుమార్లు పఠిస్తూ శ్రీహరిని ధ్యానించండి. మీ అభీష్టము నెరవేరుతుంది. మీకు సకల శుభాలూ కలుగుతాయి. పరమ పురుషుని నుతించే ఈ స్తోత్రాన్ని ప్రాతఃకాలమందు శ్రద్ధతో ఎవరు పఠించినా వారు పరమేశ్వరానుగ్రహానికి పాత్రులవుతారు." అని రుద్రుడు ప్రచేతసులకు చెప్పి అంతర్ధానమైనాడు.

## పురంజనోపాఖ్యానము

ప్రాచీనబర్హి కర్మలయందే ఆసక్తి గలవాడై, యజ్ఞాలను చేయిస్తుండేవాడు. అతని యందు దయతలచిన వాడైన నారదమహర్షి ఒకనాడు వచ్చి, ఇలాగ చెప్పాడు: "రాజా! నీవు లౌకికఫలాపేక్షతో ఈ కర్మలన్నీ ఆచరిస్తున్నావు. కాని, ఇలాంటి కర్మల వల్ల మోక్షము సిద్ధించదు సుమా!" అనగానే, రాజు గ్రహించి, ఇలాగ వేడుకొన్నాడు: "మహాత్మా! నీవు చెప్పినది నిజమే అనిపిస్తున్నది. కర్మాసక్తి వల్ల నాకు జ్ఞానము నశించినది. ఏది శ్రేయస్కరమో తెలుసుకొనలేకపోయాను. భార్యా పుత్ర ధన సంపదలే పురుషార్థాలని నమ్మి కర్మలయందే కాలాన్ని గడిపివేసిన మూఢుడనయ్యాను. నాకు ఈ కర్మబంధనాలనుండి విముక్తిని పొందించే నిర్మలజ్ఞానాన్ని ఉపదేశింపుమని ప్రార్థిస్తున్నాను" అనగా నారదమహర్షి ఇలా చెప్పాడు: "రాజా! నీవు యజ్ఞాలలో నిర్దయుడవై లెక్కలేనన్ని పశువుల్ని సంహరించావు. అవి అన్నీ పరలోకంలో నీగురించి ఎదురుచూస్తున్నవి. అవినిన్ను తమయొక్క వాడి కొమ్ములతో పొడవనున్నవి. నీకు తత్త్వమూ, పురుషార్థమూ తెలియజేసే ఒక పురాతన ఇతిహాసాన్ని చెప్తాను విను:

పూర్వము పురంజనుడు అనే రాజుఉండెను. అతనికి అవిజ్ఞాతుడు అనే మిత్రుడు ఉండేవాడు. సకల ఇంద్రియ భోగాలనూ, నిర్విరామంగా అనుభవించడానికి అనువైన స్థలమెక్కడైనా ఉంటుందేమో అని పురంజనుడు భూమండలమంతా గాలించి, హిమవత్పర్వత దక్షిణ సానువులో నొక నగరిని కనుగొన్నాడు. ఆ నగరికి తొమ్మిది ద్వారాలుండెను. ఎత్తయిన కోటగోడలు, చుట్టూ కందకాలు, ఉద్యానవనాలు, పెద్ద భవనాలు, బంగారు, వెండి, ఉక్కులతో నిర్మింపబడిన గృహాలు మొదలైన సకలైశ్వర్యాలతో అది శోభిల్లుతున్నది ఆ నగరము. ఊరిచివరనున్న ఒక చక్కని ఉద్యానవనంలో ప్రవేశించాడు. పురంజనుడు. అక్కడ ఒక అతిలోక సుందరిని చూచాడు. ఆమెతో పదిమంది అనుచరులుండిరి. ఆమె వెనుకనే ఆమెను కాపాడుతూ ఒక ఐదుతలల సర్పము వెళ్తుండెను. ఆమె తనకు తగిన ప్రియుని గురించి అన్వేషిస్తుండేది. పురంజనుడు ఆమెను సమీపించి, ఆమెకు తన ప్రేమను వ్యక్తపరచాడు. ఆమెకూడ అతనిచే ఆకర్షింపబడి స్వీకరించినది. వారిద్దరూ భార్యాభర్తలై ఉండటానికి నిశ్చయించుకొన్నారు. భోగవతీనగరిలో ప్రవేశించారు. పురంజనునికి ఆమె అన్నివిధాలైన విషయభోగాలనూ సమకూర్చినది. ఆదంపతులు ఒక వంద సంవత్సరాలు నిర్విరామంగా ఇంద్రియభోగాలను అనుభవించారు. పురంజనుడు భార్యాలోలుడై, మూఢుడై, ఆమె ఏమిచేస్తుంటే, తానూ అదే చేస్తూ, ఆమె నవ్వితే తానూ నవ్వుతూ, ఆమె ఏడిస్తే తానూ ఏడుస్తూ ఉండేవాడు. ఈ విధంగా భార్యావ్యామోహంలోపడి, పదకొండు వందలమంది కుమారులను, నూటాపదిమంది కుమార్తెలనూ కని, వృద్ధుడై, యౌవనం గతించగా, శిథిలావస్థకు వచ్చాడు. అతని కొడుకులు, ఒక్కొక్కడూ వందమంది కొడుకుల్ని కన్నారు.

చండవేగుడనే గంధర్వుడు, తన 360మంది గంధర్వ వీరులతోనూ, 360మంది గంధర్వ - అంగనలతోనూ పురజంనుని భోగవతీనగరంపై దండెత్తాడు. ఐదుతలల సర్పమైన ప్రజాగరుడు ఒక్కడే వాళ్ళినెదుర్కొని ఒక వంద సంవత్సరాలు పోరాడి శక్తిహీనుడయ్యాడు. పురజంనుడుగాని, లక్షలసంఖ్యలో వృద్ధిచెందియున్న అతని కొడుకులూ, మనుమలూగాని, నగరసంరక్షణ గురించి ఏమీ పట్టించుకొనకుండా ఆపదను గుర్తించకుండా, తమ భోగవిలాసాల్లోపడి కాల యాపనం చేశారు.

**గంధర్వునిపేరు కాలము.** అతనికొక కుమార్తె ఉన్నది. ఆ కాలకన్యపేరు జర. ఆమెయొక్క వికృత రూపంచూచి, ఆమెను ఎవ్వరూ వరించనందున ఆమెయే వరుని వెదకుకొంటూ లోకాలు తిరుగుతుండేది. ఒకనాడు, ఆమె నావద్దకు (నారదుని వద్దకు) వచ్చి, వివాహమాడుమని కోరినది. నేను అంగీకరించనందున "నీవు, ఎక్కడా నిలకడ లేకుండా నిత్యమూ తిరుగుతూనే ఉందువుగాక!" అని శపించినది. తరువాత ఆమె యవనుల ముఖ్యుడైన భయుడు అనే వానివద్దకుపోయి, తనకోరిక తెలియజేసినది. అతడు సానుభూతితో ఇలా అన్నాడు:

"సోదరీ! నామాటవిను. ఈ వరాన్వేషణ విడిచిపెట్టు. నిన్ను అందరూ దుర్భగ (దౌర్భాగ్యవతి) అని అంటారు కదా! నీవలన ఎవ్వరికీ ఆనందముగాని అదృష్టముగాని కలుగదు కనుక ఎవ్వరూ అంగీకరించడంలేదు. అయినా, నీవు

నిరుత్సాహపడవద్దు. నీవు, నేను, నా సోదరుడైన ప్రజ్వరుడూ, మనము ముగ్గురం కలిసి ఎవ్వరికీ కనబడకుండా (అశరీరంగా) తిరుగుతూ, జీవులను పీడిస్తూ, అంతము చేస్తూ, ఆనందిద్దాం" అని చెప్పగా జర అనబడే కాలకన్య ఒప్పుకొన్నది.

కాలకన్య భోగవతీ రాజ్యంలో ప్రవేశించినది. పురంజనుని పూర్తిగా ఆవేశించి, ముసలితనంతో పడగొట్టినది. భయుడూ ప్రజ్వరుడూ, తమ యవన సేనలతో ప్రవేశించి, అందరినీ ఆవేశించారు. పురంజనుని బంధువర్గంతో సహా ప్రజలందరూ జ్వరము, ముసలితనము, శక్తిహీనత, భయములతో నానాబాధలకు లోనైనారు. కాలకన్య పురంజనుని అదృశ్యంగా కౌగలించుకొన్నది. అతనిలోనున్న కొద్దిపాటి శక్తికూడ నశించినది. ఆలోచించే శక్తికూడ క్షీణించి పోయినది. భార్య అలక్ష్యం చెయ్యసాగినది. సేవకులు గౌరవించడం మానివేశారు. తనకు విరక్తిపుట్టగా ఆ నగరాన్ని విడిచిపెట్టేయాలనుకొన్నాడు పురంజనుడు. ఇంతలో ప్రజ్వరుడు, నగరానికి నిప్పంటించాడు. ప్రజాగరుడు (సర్పము) ఇక పోరడానికి శక్తిలేక ఎక్కడికోపారిపోయాడు. భయుడు పురంజనుని పట్టుకొన్నాడు. యవనులు అతన్ని బంధించి ఈడ్చుకొనిపోతుంటే చావుబతుకుల్లోనుంటూకూడా, ఆ పురంజనుడు, తన ప్రియురాలైన భార్యనే స్మరించాడుగాని, తన ఆత్మీయుడూ, ఉత్తమ శ్రేయోభిలాషీ అయిన అవిజ్ఞాతుని జ్ఞప్తికి తెచ్చుకొనలేదు.

దేహాన్ని విడిచిన పురంజనుడు, అంత్యకాలంలో భార్యను స్మరిస్తూ ప్రాణంవిడువడంచేత, మరుజన్మలో, విదర్భ రాజునకు కుమార్తెయై జన్మించాడు. ఆ విదర్భరాజపుత్రిని పాండ్య రాజైన మలయ ధ్వజుడు పెండ్లాడాడు. వారికి ఏడుగురు కుమారులు, ఒక కుమార్తె కలిగారు. కుమార్తెను అగస్త్యమహామునికిచ్చి వివాహంచేశారు. మలయధ్వజుడు భార్యతో సహా 'కులాచలం' అను పర్వతం మీదనున్న ఒక తపోవనానికి పోయి, శ్రీకృష్ణుని ధ్యానించసాగాడు. చాలాకాలం తపస్సు చేసి దేహత్యాగం చేశాడు. విదర్భ రాజపుత్రి, ఏకాకియై దుఃఖసాగరంలో మునిగియుండగా, పూర్వజన్మపు చిరకాల మిత్రుడైన అవిజ్ఞాతుడు, ఒక బ్రాహ్మణ రూపధారియై అక్కడకు వచ్చాడు. అమ్మా! నీవెవ్వరవు? అని బ్రాహ్మణుడడిగిన ప్రశ్నకు సమాధానముగా, తాను మలయధ్వజ రాజపత్నిననీ, విదర్భ రాజపుత్రిననీ చెప్పినది. అప్పుడు బ్రాహ్మణ రూపములోనున్న అవిజ్ఞాతుడు ఇలాగ చెప్పాడు: "మిత్రమా! నీవు వైదర్భివీకావు, మలయధ్వజుని భార్యవూకావు, ఇంతకు ముందు జన్మలోని పురంజనుడవూ కావు. మన ఇద్దరమూ మొదట విడదీయశక్యము కానంతగా ఒక్కటిగా కలసియుండే మిత్రులము. మానస సరోవరములోని రెండు హంసల వలె మన ఇద్దరమూ ఒక వెయ్యి సంవత్సరాలు కలిసి ఉన్న వారము. నీవు ఇంద్రియభోగాన్వేషణలో తిరిగి తిరిగి, భోగవతీ పురంలో పురంజనియొక్క ఆకర్షణలో చిక్కుకొని, నీ యొక్క పూర్వజీవితాన్నీ, నన్నూ మరచిపోయావు. ఇంద్రియ సుఖాల గురించివెళ్లి, సంసార విషవలయంలో చిక్కుకొన్నావు. పురంజని ఎవ్వరు? ప్రలోభపెట్టే నీయొక్క మనస్సే! ఆమెయందు నీకు కలిగిన రాగానుబంధమే, నీవు వైదర్భిగా జన్మించడానికి కారణం అయినది. నీవు పురంజనుడవు కావు, రాజపుత్రికవు కావు. రాజపత్నివి కావు. అవిద్యచే కలిగిన భ్రాంతి వలన నేను, నాది, అనుకుంటూ బందీవి అయ్యావు. కాని వాస్తవానికి, నీవూ నేనూ ఒక్కటే" అని పరమాత్మస్వరూపుడైన అవిజ్ఞాతుడు చెప్పి అంతర్ధానమైనాడు. అవిజ్ఞాతుడంటే మనస్సుచే తెలియ బడనివాడు అని అర్థము.

**ప్రాచీనబర్హికి (బర్హిష్మదునకు) నారదమహర్షి ఇంకా ఇలాగ చెప్పుతున్నాడు :**

"రాజా! మనం తెలుసుకొనవలసిన కొన్ని వేదాంత రహస్యాలు ఈ కథ ద్వారా చెప్పబడినవి. ఈ కథలోని అంతరార్థాలు చెపుతాను విను: అవిజ్ఞాతుడే పరమాత్మ. విషయభోగాన్వేషణలో ఆయనను వీడివచ్చినవాడే జీవాత్మ (జీవుడు). ఈ జీవుడే పురంజనుడు. పురము అంటే నవద్వారములతోనున్న దేహము. ఆ దేహముతో జన్మించినవాడు పురంజనుడు. ఈ నవద్వారాలలో ఏడు, ఎత్తైన ప్రదేశములోనూ, రెండు దిగువ ప్రదేశములలోనూ ఉన్నవని చెప్పానుకదా! ఎగువనున్న ఏడు ద్వారాలూ ఇవి: రెండు చెవులు, రెండుకన్నులు, రెండు నాసికలు, ఒకనోరు. దిగువ నున్నవి, గుదము, జననేంద్రియము. పురంజనుని మోహములో ముంచివేసిన పురంజనియే మనస్సు. ఆమెను అనుసరించే పదిమందీ ఐదు జ్ఞానేంద్రియాలూ, ఐదు కర్మేంద్రియాలు. ఈ పదిమందినీ అనుసరించే వందలకొలదీ ఉన్న సేవక బృందాలు, ఇంద్రియ విషయాలూ, కర్మలూను. కాపలాకాస్తుండే ఐదుతలల సర్పము - పంచప్రాణవాయువులు. భోగవతీ పురమే

జీవునిచే సకల ఇంద్రియ భోగాలనూ అనుభవింపజేసే క్షేత్రము. ఈ పురానికి రాణి పురంజని అనబడే మనస్సు. ఈ పురంజని చేసే ప్రతిపనినీ పురంజనుడు చేస్తూ వచ్చాడు. అంటే ఎలాంటి బంధనాలూ లేని స్వతంత్రుడైన జీవుడు ఇంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యాన్ని కల్పించుకొని, వాటికి కలిగిన సుఖదుఃఖాలవంటి అనుభవాలు తనవిగా భావించడంచేత నవ్వుతాడు, ఏడుస్తాడు. చండవేగుడు కాలము. 360 మంది తెల్లగానుండే గంధర్వులు పగటివేళలు, 360 మంది నల్లగాఉండే గంధర్వాంగనలు రాత్రివేళలు. కాలమునుండి పుట్టినదే జర(ముసలితనము). ఈ జర ఎవ్వరికీ అక్కరలేదు. అందరూ దానిని దూరంగా నుంచాలనుకొంటారు. అందుకే ఆమె, భయునితోను (మృత్యువుతోను), అతని తమ్ముడైన ప్రజ్వారునితోను (దేహపీడ, రోగముతోను) చెయ్యికలిపినది. యవన సేనలు మనిషిని పీల్చిపిప్పిచేసే, ఆధి, వ్యాధులు (మానసిక, శారీరిక రోగాలు) మిథ్య, క్షణికము, అనిత్యమూ అయిన ఇంద్రియ భోగాలను అనుభవించాలనే కాంక్షతో పురంజనుడు, తనయొక్క శాశ్వతానంద పదాన్నీ, అవిజ్ఞాతుని సాయుజ్యాన్నీ వదులుకొని, భోగవతీ పుర నివాసి అయి, పురంజని యొక్క సాంగత్యంపొంది సంసార బంధాన్ని తెచ్చుకొన్నాడు. మనస్సువల్లనే నాది, నేను అనే మమకార అహంకారాలూ, కోరికలు, సంస్కార వాసనలు, కర్మ బంధనాలూ ఏర్పడుతాయి. స్వప్నంలో సంభవించే సంఘటనలతో మనిషి తాదాత్మ్యం చెందటంచేత, తానే ఆ స్వప్నంలో అనుభవాలన్నిటినీ పొందుతున్నట్లు భావిస్తాడు. ఆ స్వప్నావస్థలో అవి అన్నీ నిజమైనట్టివిగానే అనుభూతి చెందినా, మెలకువరాగానే అంతా మిథ్య అని గుర్తిస్తాడు. అలాగే జీవుడు ఉపాధి అయిన శరీరమనస్సులతో చేరియుండే సమయంలో వాటియొక్క సుఖదుఃఖాలు, తనవే అనుకొని అనుభవిస్తాడు. ఈభ్రమనుండి బయటపడాలంటే స్వప్నంలాంటి ఈ మాయామోహమునుండి మేల్కొనాలి. దీనికి ఆపరమేశ్వరుని పాదాలనాశ్రయించడమే శరణ్యము. రాజా! నీవు ఆచరిస్తున్న యజ్ఞ కర్మలన్నీ, నిన్ను కర్మఫలానుభవానికి బంధిస్తాయే తప్ప మోక్షాన్నివ్వవు" అని ఉపదేశించి, నారదుడు నిష్క్రమించాడు. బర్హిష్మదుడు రాజ్యాన్ని కొడుకులకు అప్పగించి కపిల మహర్షి ఆశ్రమానికి వెళ్లి ధ్యానమగ్నుడై దైవసాయుజ్యాన్ని పొందాడు. అని మైత్రేయముని విదురునితో చెప్పాడు.

## ప్రచేతసులు:

తండ్రికోరిక ప్రకారము సంతానోత్పత్తి చెయ్యాలని, సంకల్పించి, ప్రచేతసులు, పదివేల సంవత్సరాలు రుద్రగీతం జపిస్తూ సముద్రంలో తపస్సు చేశారు. శ్రీహరి ప్రత్యక్షమై, వారి తపఃక్లేశాన్ని శమింపజేసి ఇలా చెప్పాడు: "రాజకుమారులారా! మీతపస్సునకు సంతసించాను. వరముకోరుకొనండి. మీరందరూ కలిసిమెలసి ఒకే ధర్మాన్నాచరిస్తున్నారు. మీ అందరి ఐక్యత, పరస్పర స్నేహానురాగాలు చాలా ప్రశంసనీయములు. సంధ్యాసమయంలో నిత్యమూ మిమ్మల్ని స్మరించేవారికి సర్వభూతదయ, సోదరప్రేమ కలుగుతాయి. మీకు కండుమహర్షి ప్రమ్లోచనలకు పుట్టిన మారిష అనే కన్యతో వివాహముకాగా మీకు మహాకీర్తిమంతుడైన పుత్రుడు పుడుతాడు. అతని సంతతీ, కీర్తీ ముల్లోకాలూ వ్యాపిస్తాయి. మారిషకన్య మీలాగానే అత్యంతధర్మశీల. మీ అందరికీ భార్య అయి, ఆమె మీ అందరినీ సమానమైన ప్రేమ, ఆదర గౌరవాలతోనే సేవిస్తుంది. మీరు చిరకాలము భూలోక స్వర్గలోక సౌఖ్యాలననుభవించి, చివరకు నన్ను చేరుకొంటారు." అని చెప్పిన శ్రీహరిని ప్రచేతసులు అనేక విధాల స్తుతించారు. తమకు ఎల్లప్పుడూ భగవద్భక్తులతో సాంగత్యము లభించే భాగ్యము ప్రసాదించుమని కోరుకొన్నారు. శ్రీహరి సంతసించి ఆశీర్వదించి అంతర్ధానమైనాడు.

ప్రచేతసులు పట్టలేనంత ఆనందముతో సముద్రమునుండి బైటకు వచ్చిచూడగా పాదము మోపడానికైనా సందులేనంత దట్టముగా, భూమిఅంతా వృక్షాలతో నిండిపోయి ఉన్నది. వారు ఆగ్రహావేశపరులైనారు. వారి ఆగ్రహాగ్నిచే వనములన్నీ దగ్ధమైపోయే ప్రమాదాన్ని గుర్తించిన బ్రహ్మదేవుడు వచ్చి, లోకం మనుగడకు వృక్ష సంపద ఎంతో అవసరమని చెప్పి వారిని శాంతింపజేశాడు. వనదేవతలు, తమచే పోషింపబడిన మారిషకన్యను తెచ్చి, ప్రచేతసులకు సమర్పించుకొన్నారు. బ్రహ్మదేవుని ఆదేశము ప్రకారము వారు ఆకన్యను వివాహమాడారు.

పూర్వము చాక్షుషమన్వంతరంలో బ్రహ్మనుండి ఉద్భవించిన దక్షుడు, శివదూషణచేసిన కారణంగా, మానవుడై ప్రచేతసులకు మారిషకు పుత్రుడై జన్మించాడు. కొన్నాళ్లకు దక్షునికి రాజ్యపట్టాభిషేకము చేసి, ప్రచేతసులు సన్న్యసించి తపస్సు చెయ్యడానికి వెళ్లినారు.

ప్రచేతసులు జాబాలిఆశ్రమంలో తపస్సు చేయనారంభించారు. బ్రహ్మసత్రయాగం చేపట్టారు. నారదమహర్షి అక్కడకు వచ్చాడు. ప్రచేతసుల ప్రార్థనను మన్నించి, నారదుడు ఇలా చెప్పాడు:

"రాజర్షులారా! నాకు తెలిసినదంతా సూక్ష్మంగా చెపుతాను వినండి. 'శ్రీహరిని సేవించని జన్మ వృథా. హరిసేవ చెయ్యకుండా ఎన్నివేదాలు చదివినా, క్రతువులు చేసినా, యోగాభ్యాస జపతపాదులు చేసినా, పాండిత్యం సంపాదించినా, అంతా నిష్ప్రయోజనమే అని తెలుసుకోవాలి. శ్రీహరినుండి ఉద్భవించిన మహావిశ్వము తిరిగి ఆ శ్రీహరియందే లయమవుతుంది. శ్రీహరి సమస్తశరీరాలకూ ఆత్మ, ఆదిమధ్యాంత రహితుడు, సర్వజ్ఞుడు, పరమేశ్వరుడు, సచ్చిదానందస్వరూపుడు. ఆయనను సంతృప్తితోనూ, సర్వభూతదయగల హృదయంతోనూ సేవించాలి.

**దయయా సర్వభూతేషు సంతుష్ట్యా యేనకేనచిత్ । సర్వేంద్రియోపశాంత్యాచ తుష్యత్యాశు జనార్దనః ॥**

సర్వభూతదయ, తనకు ఏది ప్రాప్తిస్తే దానితోనే సంతుష్టి చెందడం, ఇంద్రియాలన్నిటినీ శాంతింపజేసుకొని వశమందుంచుకొనడం, ఈమూడూ పరమేశ్వరునికి ప్రీతిని కలిగించే ప్రవర్తనలు. ఆయనకు భక్తుని హృదయమే కావాలిగాని, అతని ఐశ్వర్యముకాదు." అని ఉపదేశించి, నారదుడు నిష్క్రమించాడు. ప్రచేతసులు తమ మనోబుద్ధులను భగవానుని పాదపద్మాలపై సంధించి, నిరంతర ధ్యానమగ్నులై పరమపదాన్ని పొందారు." అని మైత్రేయముని విదురునికి చెప్పాడు.

విదురుడు మైత్రేయుని పాదాలపైబడి ఆనంద బాష్పాలతో అభిషేకం చేసి, సెలవు తీసుకొని, హస్తినాపురం వైపుకు ప్రయాణం సాగించాడు. ఈ విదుర మైత్రేయ సంవాదమును విన్నవారు, చదివిన వారు జ్ఞాన సంపన్నులై ధన్యులవుతారు.

**శ్రీశుకుడు పరీక్షిత్తుతో ఇలా చెప్పాడు :**

"రాజా! నీకుస్వాయంభువుని కుమారుడైన ఉత్తాన పాదుని గురించి చెప్పాను. ఇక ప్రియవ్రతుని గురించి చెపుతాను విను." అని, చెప్పనారంభించాడు.

**హరిః ఓం తత్ సత్**

**చతుర్థస్కంధము సమాప్తము**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము
# పంచమస్కంధము

## ప్రియవ్రతుడు

**శ్రీశుకుడు పరీక్షిత్తుకు చెపుతున్నాడు :**

స్వాయంభువ మనువు పెద్దకుమారుడు ప్రియవ్రతుడు. అతనిపై నారదమహర్షి యొక్క ప్రభావముకలదు. లౌకిక వ్యవహారాలు ఆధ్యాత్మిక సాధనకు అంతరాయాలని అతని ఉద్దేశము. అందుచేత రాజ్యపాలన చెయ్యడానికి అతడు విముఖుడైయుండెను. అతడు ఒక బ్రహ్మసత్రయాగాన్ని చేయ సంకల్పించి, తపోవనంలో నారదమహర్షితో చర్చిస్తుండెను. రాజ్యపాలన చెయ్యడానికి ప్రియవ్రతుని ఒప్పించుమని స్వాయంభువు బ్రహ్మను ప్రార్థించాడు. ప్రియవ్రతుడు, నారదుడు, స్వాయంభువు ఉన్నచోటికి మరీచాది ఋషులను తోడ్కొని బ్రహ్మదేవుడు విచ్చేశాడు. ప్రియవ్రతాదులు ఎదురేగి పూజించి, స్తుతించి బ్రహ్మను ఆహ్వానించారు. బ్రహ్మ ప్రియవ్రతుని ఉద్దేశించి ఇలా చెప్పాడు:

"నాయనా! ప్రియవ్రతా! నేను చెప్పబోయే మాటలు ఆపరమేశ్వరుని ఆదేశాలుగా తెలుసుకొని, శ్రద్ధగా పాటించవలసినట్టివి. మనమందరమూ ఆ శ్రీమన్నారాయణుని ఆదేశానుసారముగ నడవవలసినవారమే! జీవుడు ఏమిచేసినా ఏది అనుభవించినా అది అంతా ఈశ్వరేచ్ఛ ప్రకారమే. అందరూ త్రిగుణాలచే బంధింప బడినవారే అని తెలుసుకోవాలి. ముక్తిని కాంక్షించే జ్ఞాని తనకు కర్మవశాత్తు ప్రాప్తమైన సుఖదుఃఖాల ననుభవిస్తూ, ఇకముందు చెయ్యబోయే కర్మలకు, వాటిఫలాలకు దూరముగానుంటాడు. అరణ్యానికి పోయినా ఇంద్రియ వ్యాపారాలను నియంత్రించలేక, కామాదులకు లోనైన వానికి సంసారబంధాలే మిగులుతాయి. గృహస్థాశ్రమంలో నున్నప్పటికీ ఇంద్రియాలను జయించి, ఆత్మజ్ఞానం పొందిన పురుషునకు మోక్షము తప్పక సిద్ధిస్తుంది. అందుచేత ఓ ప్రియవ్రతా! నీవు ఈశ్వర దత్తాలైన భోగాదులను అనుభవిస్తూ, ముక్త సంగుడవై ముక్తిని పొందగలవు. నీవు ఇదివరకే వైరాగ్యాన్నీ, శాంతినీ సాధించావు. కనుక నిస్సంగుడవై లోకకల్యాణార్థమై రాజ్యపాలన చేయగలవు. నీకు ఏవిధమైన బంధమూ ఏర్పడదు. నీవు రాజ్యభారాన్ని స్వీకరించి నీ తండ్రియొక్క వ్యథను తొలగించాలని నా కోరిక" అని చెప్పిన త్రిలోక గురువైన పితామహుని ఆదేశాన్ని శిరసావహించాడు ప్రియవ్రతుడు.

స్వాయంభువమనువు ప్రియవ్రతునకు రాజ్యభారాన్ని అప్పగించి, తాను తపోవనానికి వెళ్లిపోయాడు. ప్రియవ్రతుడు రాజుగా సమస్తబాధ్యతలనూ శ్రద్ధాసక్తులతో నిర్వహిస్తూ, విషయ ప్రలోభాల్లో చిక్కుకొనకుండా, అన్నింటికీ అతీతంగా నుండేవాడు. అతడు విశ్వకర్మ ప్రజాపతి యొక్క పుత్రికయగు బర్హిష్మతిని వివాహమాడాడు. ఆమెనుండి తనకుసమానులైన పదిమంది పుత్రులను, ఒక పుత్రికను పొందాడు. పెద్ద కుమారుడు అగ్నీధ్రుడు. కుమార్తె ఊర్జస్వతి శుక్రాచార్యుని భార్యఅయినది. పదిమంది పుత్రులలో ముగ్గురు నివృత్తి మార్గాన్ని అవలంబించి, పరమహంసలయ్యారు. ప్రియవ్రతునికి రెండవ భార్యయందు ఉత్తముడు, తామసుడు, రైవతుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. తరువాత వారు మనువులైనారు. ప్రియవ్రతుడు సకల భోగాలనూ అనుభవిస్తూ చిరకాలము రాజ్యాన్ని పాలించాడు. అతడు ధర్మపరుడు, శక్తిమంతుడు, శత్రువులే లేనివాడు. అనేక దివ్యశక్తులున్నవాడు. ఒకనాడు అతనికి ఒక వింత ఊహ కలిగింది. సూర్యకాంతి భూమికి రోజులో సగభాగానికే వెలుగునిస్తుంది కనుక రెండవ సగం చీకటిలోనుంటున్నది.

అందుచేత భూమిమీద చీకటిలేకుండా చెయ్యాలని సంకల్పించుకొన్నాడు. సూర్యవేగముతోనూ, సూర్యతేజస్సుతోనూ సమమైన ఒక దివ్యరథాన్ని చేయించి, అపరసూర్యునివలె ప్రకాశిస్తూ సూర్యునికి ఎదురు మార్గంలో భూమిచుట్టూ భ్రమింపనారంభించాడు. ఇలాగ ఏడుప్రదక్షిణలు అయేసరికి బ్రహ్మదేవుడు సృష్టికి వ్యతిరేకంగా చరించరాదని వారించి అతనిని విరమింపజేశాడు. ప్రియవ్రతుని రథచక్రాలబాటలు, సప్తసముద్రాలుగానూ, వాటి మధ్యనున్న స్థలాలు సప్తద్వీపాలుగానూ ఏర్పడినవి. ఆ ద్వీపాల పేర్లు: జంబూద్వీపము, ప్లక్షద్వీపము, శాల్మలీ ద్వీపము, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శాకద్వీపము, పుష్కరద్వీపము. మొదటి ద్వీపముకంటె దాని తరువాతది రెండురెట్లు విస్తీర్ణము కలది. దానికంటే దాని తరువాతిది రెండురెట్లు పెద్దది. అవి ఈ విధంగానున్నవి. రెండేసి ద్వీపాల నడుమ ఒక సముద్రమున్నది. జంబూద్వీపము ప్లక్షద్వీపముల మధ్యను, లవణ సముద్రము, అలాగే ప్లక్షద్వీపము శాల్మలీ ద్వీపములమధ్య ఇక్షు సముద్రమూ, ఈ విధంగా సురాసముద్రము, దధిసముద్రము, ఘృతసముద్రము, క్షీర సముద్రము, శుద్ధోదకసముద్రము ఉన్నవి. ప్రియవ్రతుడు ఒక్కొక్క ద్వీపాన్ని ఒక్కొక్క పుత్రునకు ఇచ్చి, పట్టంగట్టాడు. ఊర్జస్వతిశుక్రాచార్యులకు దేవయాని పుట్టెను.

భగవానునే ఆశ్రయించి యున్న ప్రియవ్రతుడు దివ్యశక్తి సంపన్నుడై పరాక్రమశాలియై చిరకాలము రాజ్యభోగాలను అనుభవించి, విరక్తుడై ఇలాగ తలపోయసాగాడు: "అయ్యో! నేను మొదట నివృత్తి మార్గములోనే వెళ్లుతూ పెద్దల కోరికపై రాజ్యలంపటములో చిక్కుకొని, ఇంద్రియాలకు బందీనయి, విషయసుఖాలనబడే నేలనూతిలో పడిపోయానుకదా! దీనినుండి ఇప్పుడైనా బైటపడాలి" అనుకొంటూ తీవ్రమైన వైరాగ్యముతో భార్యాపుత్రధన జనాది సకలసంపదలనూ పరిత్యజించి, చిత్తములో శ్రీహరిని నిలుపుకొని, నారదమహర్షి అడుగుజాడల్లో వెళ్లిపోయాడు. ప్రజలందరూ ఆమహాత్ముని వెయ్యినోళ్లతో పొగిడారు.

ప్రియవ్రతుని ప్రథమపుత్రుడైన అగ్నీధ్రుడు జంబూద్వీపాన్ని ధర్మయుతంగా పాలించాడు. ప్రజలను కన్నబిడ్డలవలె ఆదరించి ప్రఖ్యాతి గాంచాడు. అతడు సంతానముకోరి ఉత్తమురాలైన భార్యకోసం మందరగిరి సానువులో బ్రహ్మదేవుని ఆరాధించాడు. బ్రహ్మదేవుడు తన కొలువులో తన సమక్షాన సంగీతాలాపన చేస్తుండే పూర్వచిత్తి అనే అప్సరసను అగ్నీధ్రుని వద్దకు పంపించాడు. ఆమె అతిలోక సౌందర్యరాశి. బ్రహ్మ తన ఆలోచనా శక్తినంతా వినియోగించి, తీర్చిదిద్దిన అందాలబొమ్మ. ఆమెయొక్క లావణ్యసౌందర్యాలనుచూచి, మతిచలించినవాడైన అగ్నీధ్రుడు ఆమెవెంటబడి, ఆమెను వర్ణింప నారంభించాడు. తన ప్రేమావేశాన్ని కనబరచుకొన్నాడు. వీరశ్రేష్ఠుడూ, బుద్ధికీ, రూపానికీ, శీలానికీ, ఐశ్వర్యానికీ, ఔదార్యానికీ, విద్యకూ, వీర్యానికీ, సాటిలేని వాడూ అయిన ఆ జంబూద్వీప చక్రవర్తిని వివాహమాడడానికి ఆమెకూడ ఇష్టపడినది. ఇద్దరూ ఈ భూలోకంలోనే లెక్కలేనన్ని సంవత్సరాలు స్వర్గసౌఖ్యాలను అనుభవించి, తొమ్మండుగురు పుత్రులను కన్నారు. వారు నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావర్తుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అనే పేర్లతో ప్రసిద్ధికెక్కారు. అగ్నీధ్రుడు, జంబూద్వీపాన్ని వర్షాలుగా విభజించి, ఈ తొమ్మండుగురికీ ఇచ్చివేసి, ఈ వర్షాలకు వీరిపేర్లే పెట్టాడు. పూర్వచిత్తి, తిరిగి బ్రహ్మలోకానికి వెళ్లిపోయినది. అగ్నీధ్రుడు ఆమెనే తలచుకొంటూ అనేకమైన వైదిక క్రతువులను చేసి, తానుకూడ బ్రహ్మలోకానికి చేరుకొన్నాడు.

## ఋషభుడు

అగ్నీధ్రుడు దేహత్యాగము చేసిన పిదప నాభిసోదరులు మేరువుయొక్క తొమ్మండుగురు పుత్రికలను పెండ్లిచేసుకొన్నారు. నాభిభార్య మేరుదేవి. ఆ దంపతులకు సంతానము లేనందున వారు వాసుదేవునారాధిస్తూ ప్రవర్గ్యమనే క్రతువును చేశారు. భగవానుడు ప్రసన్నుడై, చతుర్భుజాలతో సర్వాలంకార శోభితుడై ప్రత్యక్షమైనాడు. ఋత్విక్కులు ఆ దేవదేవుని అనేక విధాల స్తుతిస్తూ ఇలాగ వేడుకొన్నారు: "హేభగవన్! నీవు పరమ పురుషుడవు, పరిపూర్ణుడవు. నిన్ను స్తుతించే శక్తిలేని వారము. నమోనమః అనటం తప్ప ఏ యోగ్యతలూ లేనివారము. అయిననూ మా

ప్రార్థనలకు ప్రసన్నుడవై నీదర్శనభాగ్యము మాకు కల్పించిన నీయొక్క అపారకరుణా విశేషాన్ని మేము ఏ విధంగా వర్ణించగలం? భక్తితో తులసిదళాలు, దూర్వాంకురాలు, శుద్ధ జలమూ సమర్పించినంతనే నీవు సర్వకామ్యాలనూ అనుగ్రహించే కృపాసాగరుడవు, అల్పసంతోషివి. పుణ్యమూర్తులైన ఈ నాభిదంపతులు నీతో సమానమైన నీవంటి పుత్రసంతానాన్ని కాంక్షిస్తూ ఈ క్రతువును చేశారు. నీ అనుగ్రహం ఉంటే పురుషార్థాలనే కాకుండా, స్వర్గమూ, మోక్షమూ ఏదైనా ప్రసాదించగలిగిన నిన్ను సంతానప్రాప్తి వంటి చిన్న కోరికనే కోరుతున్నారు వీరు. ఇది నీయొక్క మాయా ప్రభావము కదా!" అని విన్నవించగా సంతసించిన భగవానుడు ఇలా అన్నాడు: "ఋషులారా! నాకు సాటి అయినవాడు ఎక్కడా కానరాడు. మీకోరికను తీర్చాలంటే, నేనే ఈ పుణ్యదంపతులకు పుత్రుడనై పుట్టాలి. తథాస్తు" అని అంతర్ధానమయ్యాడు.

మేరుదేవికి సర్వశుభలక్షణాలతో శ్రీహరి పుత్రుడై జన్మించాడు. అతనికి ఋషభుడనే పేరుపెట్టారు. దినదిన ప్రవర్ధమానుడై ప్రకాశిస్తున్న అతనిలో ఆత్మ నిగ్రహము, వైరాగ్యము, కరుణ, భూతదయ లాంటి లక్షణాలు బాగా వ్యక్తమౌతుండేవి. అతడు ధైర్య, శౌర్య, బల పరాక్రమాల్లో మిక్కిలి శ్రేష్ఠుడైయుండెను. ఒకసారి ఋషభుడు పాలించే భారత వర్షములో ఇంద్రుడు అసూయచే వర్షాలు లేకుండా చేస్తే ఋషభుడు తన యోగశక్తిచే వర్షాలు కురిపించాడు. నాభి పుత్రుని చూస్తూ అతని గొప్పతనం మననం చేసుకొంటూ, సాక్షాత్తూ భగవానుడే తన పుత్రుడై అవతరించినట్లు తెలిసియుండి కూడ, ఋషభుని ముద్దులకొడుకుగానే వ్యామోహంతో చూచేవాడు. పుత్రుని గొప్పతనంచూచి, అతడు చక్కగా రాజ్యపాలనం చేయగలడని గర్తించి, నాభినరాధీశుడు భార్యతో బదరికాశ్రమం చేరి, నారాయణ సేవాతత్పరుడై తరించాడు.

నారాయణాంశతో జన్మించిన ఋషభుడు ఇంద్రునికుమార్తె అయిన జయంతిని వివాహమాడాడు. వారికి వందమంది కుమారులు పుట్టారు. వారిలో భరతుడు పెద్దవాడు. అతని పేరుమీదనే అంతవరకూ అజనాభ వర్షమనబడే భూభాగము భారతవర్షముగ ప్రసిద్ధిచెందినది. వందమంది కొడుకుల్లోనూ, ప్రతిపదిమందిలో మొదటివానిని, ఒక్కొక్క భూభాగానికి అధిపతిగా నియమించాడు ఋషభుడు. భరతుడు మొదటి పదిమందిలో ప్రథముడు. మిగిలిన తొంబై మందిలోని - కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, అవిర్హోత్రుడు, ద్రమిలుడు, చమసుడు, కరభంజనుడు, అనబడు తొమ్మండుగురు బ్రహ్మచారులుగానే ఉండిపోయి, మునులైనారు. మిగిలిన ఎనభైయొక్క మంది పుత్రులు తండ్రి ఆదేశముప్రకారము గృహస్థులై వేదాధ్యయన పరులై బ్రహ్మనిష్ఠులై బ్రాహ్మణమార్గాన్ననుసరించారు.

ఋషభుడు అవతార పురుషుడే అయినా సామాన్యునివలె వర్ణాశ్రమధర్మాలను చక్కగా ఆచరిస్తూ ప్రజలకు ఆదర్శమూర్తిగా నుండేవాడు. అతడు రాగద్వేష రహితుడై యుంటూ సర్వభూత సమత్వము, మైత్రి, కరుణ చూపేవాడు. తన రాజ్యాన్ని ఒక కర్మభూమిగా భావించి, కర్మలనాచరించడానికి తానే స్వయంగా గురువులవద్ద వేదాలను నేర్చుకొనేవాడు. ఒక వంద యజ్ఞాలను చేయించాడు. సకల ధర్మశాస్త్రాలనూ పాటిస్తూ రాజ్యపాలన చేసేవాడు. అతనిపాలనలో ప్రజలు ఆదర్శపౌరులుగా వెలశారు. ప్రజలందరూ ధర్మవర్తనులై పరమార్థాన్నే ఆశిస్తూ కర్మచేసేవారు.

ఈ విధంగా ఋషభదేవుడు చిరకాలం రాజ్యంచేసి కొడుకులకు రాజ్యభారాన్ని అప్పగించి, బ్రహ్మావర్త దేశానికి పయనించాడు. మంత్రులూ, కుమారులూ అందరూ అతనిని అనుసరించి వెళ్లారు. మహాత్ములైన మునిజనుల సమక్షంలో కుమారులను చెంతచేర్చుకొని, వారికి ఒక చక్కని ఉపదేశమిచ్చాడు.

భగవానుడైన ఋషభదేవుడు, పుత్రులకు ఇలా ఉపదేశించాడు. "కుమారులారా! ఈ మానవజన్మ, బహుదుర్లభమైనది. దానికి ఒక ఉత్తమ ప్రయోజనమున్నది. జీవరాసులన్నీ చేస్తుండే ఆహార నిద్రా మైథున కార్యాలే కాకుండా తనకే ఇవ్వబడిన బుద్ధిని మానవుడు సద్వినియోగపరచుకోవాలి. భగవదారాధనచే చిత్తాన్ని శుద్ధపరచుకొని మోక్షాన్ని పొందవచ్చు. కామములను అనుభవించడంచేత సంసారబంధాలు పెరుగుతాయి. మహాత్ములసేవ మోక్షానికి

దారితీస్తుంది. సాధుసజ్జనుల సాంగత్యము చాలా ఆవశ్యకము. కామప్రేరితమైన స్త్రీ పురుష సాంగత్యము చాలా హానికరము. మహాత్ములు, శాంతస్వభావులూ, సమచిత్తులూ, ద్వేషాసూయక్రోధాలు లేనివారూ, సమస్త జీవులయందు దయ, కరుణ కలవారూ, భగవానునియందు పరిపూర్ణ భక్తిశ్రద్ధలున్నవారూ, విషయలంపటులకు, దుష్టులకూ దూరముగానుండువారూ, ఎవ్వరియందూ, దేనియందూ, వ్యామోహము లేనివారూ అయి యుంటారు.

భగవద్భక్తియే జీవితంయొక్క ధ్యేయమని తెలుసుకోవాలి. దేహేంద్రియ మనోబుద్ధుల్ని సుఖపెట్టాలని చేసిన కర్మలు కర్మబంధాన్ని కలగజేస్తాయి. ఆ కర్మలే మళ్లీ దేహధారణకు కారకాలవుతాయి. ప్రస్తుత శరీరము పూర్వ కర్మల ఫలితం అయితే, ప్రస్తుత కర్మలు భావిజన్మకు బీజాంకురం వేస్తాయి. ఇల్లూ, ఇల్లాలు, పిల్లలూ అనుకొంటూ, వ్యామోహమూ, అనుబంధమూ పెంచుకొంటుంటే, సంసారబంధాలు ఇంకా చుట్టుకొంటాయి. తెలుసుకొనవలసినదీ, ఆశ్రయించవలసినదీ, పొందవలసినదీ, వీటికి భిన్నంగానూ, అతీతంగానూ, ఉన్న పరమాత్మ తత్త్వమని గుర్తించనంతవరకూ, ఈ సంసార చక్ర భ్రమణం కొనసాగుతునే ఉంటుంది మానవుడు దుఃఖపంకిలంలోనే కొట్టుకుంటూ ఉంటాడు.

అవిద్యచే, "ఈ శరీరమే నేను" అనీ "ఈ శరీరానికి చెందిన భార్య, బిడ్డలు, సంపద, అన్నీ నావే" అనీ అహంకార మమకారాలు కల్పించుకొని, వాటిని తృప్తి పరచడానికి కర్మలు చేస్తూ, కర్మ ఫలాలను అనుభవిస్తూ వాసనలను పెంచుకొంటూ కొత్త జన్మలకు పునాది వేసుకొంటాడు మానవుడు. ఈ వాసనాక్షయమే ముక్తి. ఇది సిద్ధించాలంటే దృష్టిని ప్రపంచంనుండి మళ్లించి పరమేశ్వరునియందు లగ్నం చెయ్యాలి. భాగవతుల సాంగత్యమూ భగవద్గుణకీర్తనమూ చేస్తుండాలి. అప్పుడు, విషయాసక్తి తగ్గి మోక్షాసక్తి పెరుగుతుంది.

అందుచేత నాయనలారా! మీరు ఎల్లప్పుడూ భగవంతునే ఆశ్రయించండి. ఈ దృశ్యప్రపంచమంతా అశాశ్వతమైనట్టిదని తెలుసుకొని, దేనిపైననూ ప్రగాఢమైన సంగమును పెరుగనివ్వకండి. బ్రహ్మజ్ఞానమును పొందడానికి సాధన చెయ్యండి. భగవంతునకు శరణాగతులుకండి. ఈవిధంగా చెయ్యడానికి కొన్ని సూత్రాలను పాటించాలి. అవి ఏమిటంటే-భగవానునియందు ప్రేమ, భక్తి కలిగియుండడం, భగవంతుని విషయమై ఆసక్తిని జ్ఞానాన్ని పెంచుకొనడం, కోరికలు లేకుండా ఉండడం, సుఖదుఃఖాలయందు సహనము, సమానత్వము కలిగియుండడం, జీవులపట్ల సానుభూతిని జూపడం, భగవంతుని కథలూ, గుణగణాలూ, లీలావైభవాలూ వినడం, కీర్తించడం, అంతటా అన్ని పరిస్థితులలోనూ సమబుద్ధిని కలిగియుండడం, అహంకార మమకారాలను తొలగించుకొనడం, ఇంద్రియాలను జయించడం, అంతటా ఆ పరమేశ్వరునే చూడడం. ఈవిధంగా సాధన చేస్తే మనస్సునుండి కర్మవాసనలు తొలగి జీవుని కారణదేహం వెంటబడకుండా విడిచిపెట్టేస్తుంది. ఇదే ముక్తి. భగవంతునియందు అచంచల భక్తి కలిగియున్నవాని సూక్ష్మ దేహము ఆ జీవుని వెంటపడదు. ఈ రహస్యాన్ని తలిదండ్రులు బిడ్డలకూ, గురువులు శిష్యులకూ, రాజులు ప్రజలకూ తెలియజెప్పాలి. జనన మరణ సంసారపు సంకెళ్ల నుండి విడిపించే ఆత్మ విద్యను శిష్యులకు నేర్పని గురువు గురువుకాడు, బంధువులకు నేర్పని వాడు బంధువుకాడు, బిడ్డలకు నేర్పనితండ్రి తండ్రికాడు, తల్లి తల్లికాదు, భార్యకు నేర్పని భర్త భర్తకాడు. అజ్ఞానముచే, దేహపోషణమే పరమావధి అనుకొని కర్మలలోనే మునిగి, నీచజన్మలకు దిగజారనున్నవారిని వారించి సరియైన మార్గము చూపనివారూ, తెలియక మృత్యువు ముఖంలో పడనున్నవారిని రక్షింపని వారూ ద్రోహులనబడుతారు.

కుమారులారా! నేను సత్త్వగుణము నిండియున్నవాడను. నా బిడ్డలైన మీరంతా కూడా సత్త్వగుణ ప్రధానులే! అట్టివారికి ప్రవృత్తి (కర్మాసక్తి) మార్గాలు నచ్చవు. భగవద్భక్తే రుచిస్తుంది. ఈ ప్రపంచంలో కదలని మొక్కలకంటె, కదిలే జీవరాసులు గొప్పవనీ, వాటికంటే జంతువులు గొప్పవనీ, జంతువులకంటే మనుష్యులు గొప్పలనీ, వారికంటే గంధర్వులూ, సిద్ధులూ గొప్పవారనీ, వారికంటే ఇంద్రాది దేవతలూ, వారికంటే బ్రహ్మరుద్రులూ, వారికంటే, వాసుదేవుడూ గొప్పవారని అంటారు. ద్విజులలో బ్రహ్మజ్ఞాన సంపన్నులు గొప్పవారు. బ్రాహ్మణులకు అర్పింప

బడినవాటిని భగవంతుడే స్వీకరిస్తాడు. భగవద్భక్తులైన భాగవతులయందు భక్తి కలిగియుండాలి. ఈ విశ్వమందున్న స్థావర జంగమ భూతాలన్నీ (ప్రాణులన్నీ) ఆ భగవానుని శరీరమే అని గ్రహించి, ప్రవర్తించడం భగవానుని ఆరాధించడమే అవుతుంది. భగవదారాధన ఒక్కటే మోక్షసాధనమని తెలుసుకోండి. సర్వభూతాలయందు భగవానుని భావించడం, ఎల్లప్పుడూ భగవానుని గురించే ప్రసంగిస్తుండడం, అంతటా భగవానుని శరీరాన్నే చూస్తూ ఉండడము ముక్తి సాధనము.

నాయనలారా! సద్బ్రాహ్మణులను గౌరవించి ఆదరించడం, ప్రజలను ప్రేమతోనూ, ధర్మయుతంగానూ పరిపాలించడం, మీ అన్న అయిన భరతుని, నన్ను గౌరవించినట్లే భక్తి శ్రద్ధలతో సేవించడం, మీ అందరి యొక్క ధర్మమని తెలియజేస్తున్నాను" అని చెప్పి ఋషభదేవుడు తన ఉపదేశం ముగించాడు. ఆ మహాత్ముడు భరతునకు పట్టముగట్టి, సన్న్యసించి, సర్వమూ త్యజించి, ఊరువిడిచి, దేనియందూ అపేక్షలేనివాడై, చింపిరిజుట్టుతో జడునివలె పిచ్చివానివలె దిగంబరుడై, పోయి పోయి, దారిలో ఎవ్వరు ఎన్ని మాటలు అనినా, రాళ్లు రువ్వినా, ఏమీ చలించకుండా, తన సుందర మనోహర విగ్రహం ధూళిధూసరితమై మట్టి పట్టేసినా పట్టించుకోకుండా, శరీర స్పృహయేలేనివాడై, తనలోతానే ఆనందిస్తూ, తన హృదయంలోనే దేవుని దర్శించుకొనేవాడు. అనేక సిద్ధులు అతనిని ఆశ్రయించినా అతడు వాటిని స్వీకరించలేదు. దివ్యతేజస్సుతో, భగవత్స్వరూపముతో ప్రకాశిస్తూ ఉండేవాడు. దేహత్యాగ సమయం ఆసన్నమైనట్లు తెలుసుకొని, కుటక పర్వతారణ్యంలో ప్రవేశించి, అక్కడ చెలరేగుతున్న కారుచిచ్చునకు ఆహుతి అయిపోయి విష్ణు సాయుజ్యం పొందాడు.

ఋషభుడు కర్మ సంబంధం లేని మోక్షధర్మాన్ని బోధించాడు. అన్నిలోకాలకూ, సమస్త దేవతలకూ, బ్రాహ్మణులకూ గురువైనాడు భగవానుడైన ఋషభుడు.

## భరతుడు

ఋషభపుత్రుడైన భరతుడు రాజ్యాన్ని చాలాకాలము చక్కగా పరిపాలించాడు. అతడు గొప్ప ధర్మపరాయణుడు. విశ్వరూపుడనే రాజుయొక్కకుమార్తెయగు పంచజనిని భరతుడు వివాహమాడి, ఐదుగురు పుత్రులను పొందినాడు. అంతవరకూ అజనాభం అనబడే భూభాగాన్ని భరతుడు గొప్పగా చాలాకాలము పాలించడం చేత అది భారతవర్షముగా ప్రసిద్ధి చెందినది.

భరతుడు శ్రీమన్నారాయణుని ఉత్తమభక్తుడు. తన పూర్వీకుల సంప్రదాయం ప్రకారం అనేకమైన యజ్ఞయాగాలు చేయించి, ఫలాన్ని నారాయణార్పణం చేసేవాడు. అతని పరిపాలనలో ప్రజలు సుఖ సంతోషసౌభాగ్యాలతో నుండేవారు. చాలాకాలము రాజ్యపాలనం చేసిన తరువాత రాజ్య సంపదనంతా కుమారులకు పంచిపెట్టి, సర్వమూ పరిత్యజించి, హరిద్వారము వద్దనున్న పులహ మహర్షి ఆశ్రమానికి వెళ్లిపోయాడు. ఆ ఆశ్రమం అతి రమణీయంగానుంటుంది. ఆ ఆశ్రమంలో శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షంగా ఆశ్రమవాసులను అతివాత్సల్యంతో ఆదరిస్తుంటాడు. అక్కడ విష్ణుప్రతిరూపాలైన సాలగ్రామాలు గండకీ(చక్రా)నది నిండా ఉంటాయి. అక్కడ భరతుడు ప్రతిదినమూ తనవితీరా నారాయణుని ఆరాధించేవాడు. అతని హృదయము ఆనందముతోనూ, మనస్సు ప్రశాంతతతోనూ కన్నులు ఆనంద బాష్పాలతోనూ నిండిపోతుండగా అతడు పరవశించి పోయేవాడు. అతని పూర్వవాసనలూ, అహంకారమూ, అన్నీ కరిగిపోయాయి. అతడు ప్రతిదినమూ సూర్యోదయ సమయంలో ఈ ఋక్కుతో ప్రార్థించేవాడు.

**"పరోరజః సవితుర్జాతవేదో దేవస్య భర్గో మనసేదం జజాన**
**సురేతసాఽదః పునరావిశ్య చష్టే హంసం గృధ్రాణం నృషద్రింగరామిమః"**

"ఈ లోకాన్ని సృష్టించిన అద్భుతశక్తియు, ఈ ప్రపంచమంతా ఆవరించి సృష్టించినట్టి శక్తియు, బుద్ధిని ప్రకాశింపజేసి, చైతన్యవంతము గావించునట్టి శక్తియు, సూర్యునకు అమిత తేజస్సును కలిగించునట్టిదియు అగు ఆ శక్తికి నేను శరణాగతుడను." (ప్రణమిల్లుతున్నాను).

ఈ విధంగా నారాయణ చింతనలోనే ఆనందంగా దినములు గడుపుతున్న భరతుడు ఇక పరమేశ్వర సాయుజ్యానికి యోగ్యతను సంపాదించియున్న తరుణంలో కర్మవశాత్తూ.

ఒకనాడు భరతుడు గండకీ నదిలో స్నానంచేసి, ప్రణవం జపిస్తుండగా నిండు గర్భిణి అయిన ఒక లేడి నీరుత్రాగడానికి వచ్చినది. అప్పుడు భయంకరమైన ఒక సింహగర్జన ఆ చేరువలోనే వినబడినది. లేడి అదిరిపోయి, ప్రాణభయంతో అవలి ఒడ్డునకు చెంగున గంతువేసినది. ఆ అదిరిపాటుకు ఎగురుతున్న జింక గర్భమునుండి బిడ్డజారి పోయి, నదిలో పడిపోయినది. తల్లిజింక ఆవలి ఒడ్డుపై స్పృహతప్పి పడిపోయి, కొంతసేపటికి ప్రాణం విడిచినది, అంతా చూస్తున్న భరతుని హృదయం జాలితో నిండిపోయినది. నీటిలో మునకలు వేస్తున్న జింకపిల్లను రక్షించి, ఆశ్రమానికి కొనిపోయి సాకనారంభించాడు. పాపం తల్లిలేని పసిబిడ్డ, నోరులేని సాధుజంతువు అనే కనికరంతో మరింత ప్రేమతో పెంచసాగాడు. ఈ లేడి పిల్లను సంరక్షించడంలో తన నిత్యనైమిత్తిక కర్మలూ, యమనియమాది సాధనలూ, దైనందిన దేవతార్చనలూ, నిర్లక్ష్యానికిలోనై ఒక్కొక్కటిగా మానివేయబడ్డాయి. లేడిపిల్ల పెద్దదై, స్వతంత్రంగా తిరుగుతుంటే అయ్యో! ఏ క్రూరమృగము నోట పడిపోతుందో? అని అతనికి బెంగ పట్టుకొనేది. దైవమాయచే ప్రారబ్ధకర్మచే ఆ రాజర్షి లేడిపిల్లకు తానే తల్లీ, సంరక్షకుడూ, సర్వస్వమూ అనే భ్రమలో పడి, మమకారమూ, వ్యామోహమూ పెంచుకొని, మాయాజాలములో చిక్కుకొన్నాడు. ఆ లేడి పెద్దదై, ఒకనాడు అరణ్యంలోకి పారిపోయినది. భరతుడు పుత్ర వియోగం కంటే ఎక్కువగా శోకించాడు. దాని బాల్యచేష్టలన్నిటినీ గుర్తునకు తెచ్చుకొని, ఒక సామాన్య గృహస్థునికంటే ఘోరంగా విలపించాడు. భార్యనూ బిడ్డలనూ, రాజ్యాన్నీ సర్వసంగాలనూ పరిత్యజించి వేసిన ఆ తపస్వి చివరకు హరిణ వియోగశోకముతో క్రుంగి కృశించి, రోగగ్రస్తుడై, దైవచింతన మాని, జింకనే స్మరిస్తూ ప్రాణం విడిచాడు భరతుడు. విధిబలీయము కదా!

మరుజన్మలో భరతుడు లేడియై జన్మించాడు. అయితే అతడు అదృష్టవశాత్తూ పూర్వ జన్మ స్మృతిని కలిగియుండెను. గతించిన జన్మలోని తన తప్పిదాన్ని గుర్తుంచుకొని, పరమ పుణ్యస్థలమైన పులహాశ్రమానికే చేరుకొన్నాడు. మళ్లీ కొత్తకర్మ బంధాలు కలుగని రీతిగా గడ్డిపరకలూ ఎండిన ఆకులూ తింటూ గండకీ నదీ తీరమున నివసిస్తూ చివరకు ఆనదిలోనే స్నానంచేస్తూ, లేడి శరీరాన్ని విడిచిపెట్టాడు.

లేడిగా దేహత్యాగము చేసిన జీవుడు మరుజన్మలో అంగిరస వంశీయుడైన ఒక సద్బ్రాహ్మణునకు పుత్రుడై జన్మించాడు. ఆ బ్రాహ్మణునికి మొదటి భార్యయందు తొమ్మండుగురు కుమారులూ, రెండవ భార్యకు ఒక కుమారుడు, ఒక కుమార్తె కలిగారు. రెండవ భార్య పుత్రునికి భరతుడనే పేరు పెట్టడమైనది. బ్రాహ్మణుడు శుద్ధ శ్రోత్రియుడు వేదవిదుడు కర్మనిష్ఠుడు. భరతునకు ఉపనయనం చేసి, ప్రణవము, గాయత్రి, శౌచవిధి, అధ్యయనవిధి మొదలైన అభ్యాసాలు నేర్పనారంభించాడు. మహాత్ముడైన భరతునకు పూర్వజన్మల స్మృతి, సంస్కారమూ, మెండుగానుండడం చేత తనకు ఇక జన్మలేదని తెలిసియున్నవాడై, బంధకారకమైన ఎలాంటి కర్మనూ చేపట్టేవాడుకాడు. స్వంతప్రయోజనం గురించి ఏపని చేసినా, అది బంధకారకమవుతుందని, తనంతటతాను ఏకర్మనూ చేపట్టకుండా, ఇతరులు ఏపనిని చేయుమన్నా, కర్తృత్వ భోక్తృత్వ భావము లేకుండా, చేసేవాడు. కొడుకు ఏమీ నేర్చుకొనటంలేదు, దేనినీ పట్టించుకొనటం లేదు, శుంఠగా తయారైపోతాడేమోననే బెంగతో తండ్రి అస్వస్థుడై మరణించాడు. తల్లి సహగమనం చేసినది. భరతుడు చూడగలిగినా అంధుని వలెనూ, వినగలిగినా బధిరునివలెనూ, మాట్లాడగలిగినా మూగవానివలెనూ, దేనినీ పట్టించుకొనకుండా, తనదైన వేరే ప్రపంచంలో నుండేవాడు. అందుకే అతనిని జడభరతుడు అనేవారు, అందరూ నిర్లక్ష్యంచేసేవారు. సవతి అన్నలు అతనిచే నానా రకాలైన నీచపు చాకిరీలు చేయించుకొనేవారు. మిగిలిపోయిన అన్నమూ, తవుడు, తెలకపిండి లాంటి తినరానివి పెట్టినా, అదేమిటో గుర్తించకుండా, సంతృప్తిగా తినేవాడు. ఎవ్వరు ఎలాంటి పనిచేయుమన్నా, విసుగుకొనకుండా చిరునవ్వుతో చేసేవాడు. చలి, వేడి, గాలి, వర్షము లాంటి వాటిని పట్టించుకొనకుండ ఎక్కడ ఉండుమంటే అక్కడే ఉండేవాడు. బట్టలు మాసినా, ఒళ్లు మట్టిపట్టినా, తిండి తినినా తినకపోయినా, ఎత్తైన అతని శరీరము మాత్రము బలిష్ఠముగానూ,

బ్రహ్మతేజస్సుతో మెరిసిపోతూనూ ఉండేది. ఎల్లప్పుడూ ఆనందంగానుండే అతనిని చూచి - "పాపం పిచ్చివాడు, ఎందుకో నవ్వుకొంటున్నాడు" అని అందరూ అనుకొనే వారు. అన్నల ఆజ్ఞప్రకారం అతడు పొలములో కాపలా ఉండేవాడు.

భరతుడు పొలం కాపరిగా నున్నరోజుల్లో - ఒక భిల్లుల నాయకుడు సంతానార్థియై కాళీమాత యొక్క అనుగ్రహం పొందడానికి, ఒక నరబలిని ఏర్పాటు చేశాడు. బలిఇవ్వడానికి ఒక యువకుని సిద్ధపరచి కాళీదేవిగుడికి తీసుకొనివచ్చారు. ఆయువకుడు చీకటిలో ఎలాగో తప్పించుకొని పారిపోయాడు. భిల్లులు అతని గురించి వెదకి వెదకి, నిరాశ చెందియున్న సమయంలో భరతుడు చేనును కాపలా కాస్తూ వారికంటబడ్డాడు. భిల్లులు సంతోషించారు. అతని అంగాలు సరిగా ఉన్నవోలేవో చూచుకొన్నారు. బలి ఇవ్వడానికి పనికి వస్తాడని, అతనిని బంధించి తీసుకొనిపోయారు. మీరెవరు, ఎందుకు ఇలాగ చేస్తున్నారు, ఎక్కడికి తీసుకొనివెళుతున్నారు అని భరతుడు వారిని ప్రశ్నించలేదు, అడ్డుకొనలేదు, పెనగులాడలేదు. వారు అతనిని తీసుకొనివెళ్లి స్నానము చేయించి నూతన వస్త్రాలు ధరింపజేసి, చందన కుంకుమలు పూసి, పుష్పాలతో అలంకరించి, మంచి భోజనం చేయించి, కాళీమాత గుడిలో వధ్యశిలపై కూర్చుండబెట్టారు. తప్పెటలు, తాళాలు, డప్పులతోను ధ్వనులు చేసుకొంటూ, పాటలు పాడుతూ, గెంతుతూ ఉండేవారు. పూజారి అట్టహాసంగా మంత్రాలు చదువుతూ, బలిపశువుయొక్క శిరస్సును ఛేదించడానికి సిద్ధంగానున్నాడు. ఇది అంతా చూస్తున్నా భరతుడు చలించలేదు. చిరునవ్వు వీడలేదు. బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్నాడు. ధ్యానమగ్నుడై కూర్చున్నాడు. కాళీమాత కన్నులు తెరచి చూచినది. చంపబడనున్న బ్రాహ్మణ యువకుని తేజస్సుచూచి చకితురాలయినది. భద్రకాళి ఉగ్రురాలయినది. ఆ కిరాతకుల ప్రాణాలను హరించివేసినది. భరతుడు ధ్యానము చాలించి, లేచి చూచాడు. మళ్లీ పొలంవద్దకు వచ్చి కూర్చున్నాడు.

**రహూగణుడు:**

ఇలాగ కొన్నాళ్లు గడిచిన తరువాత భరతుడు కూర్చున్న పొలము ప్రక్కగా బోయీలచే మోయబడుచున్న ఒక పల్లకీ వెళ్లుచుండెను. ఆ బోయీలలో నొకడు పల్లకీని మోయలేకుండటంచేత, వాని బదులుగా ఇంకొకడు కావలసివచ్చినది. ఆజానుబాహుడూ, దృఢకాయుడూ, ఏపనీపాటాలేక కూర్చున్న వాడూ అయిన భరతుడు వాళ్ల కంటబడ్డాడు. వాళ్లు భరతుని లాక్కొచ్చి పల్లకీని ఒక ప్రక్క మోయుమన్నారు. భరతుడు అలాగే మొయ్యనారంభించాడు.

ఆ పల్లకీలో సింధు సౌవీర దేశాలకురాజైన రహూగణుడు కపిలమహాముని వద్దకు వెళ్లుచుండెను. భరతుడు పల్లకీని మోయనారంభించినప్పటినుంచీ, అతడు అందరికంటే మిక్కిలి పొడవుగానుండడం చేతనూ, నడుస్తున్నప్పుడు నేలమీదనున్న కీటకాదులపై పాదము పడకుండా, అతడు దాట్లువేస్తుండడం చేతనూ, పల్లకీలో సమతలం తప్పి, ఎగుడుదిగుడై, కుదుపులు ఎక్కువై, లోన కూర్చోవడం కష్టమవుతుండేది. రాజు చికాకుపడి అలాగ ఎందుకు అవుతున్నదని బోయీలనడిగాడు. వాళ్లంతా ఆక్రొత్తగా వచ్చిన వానివలన అలాగవుతుందనగానే రాజు భరతుని చూచాడు. బలిష్ఠముగానున్న ఆ ఆజానుబాహుడు కావాలనే అలాగ ప్రవర్తిస్తున్నాడని భావించి, రాజు అతనితో వ్యంగ్యముగా ఇలా అన్నాడు: "అయ్యోపాపం! చాలా దూరం నుండి మోస్తున్నట్లున్నావు. అలసిపోయియుంటావు. ముసలివాడివి కదూ! కాళ్లు, చేతులు, నడుమూ సరిగా నిలవటంలేదేమో!" అని, ఎత్తిపొడుపుగా అంటున్నప్పటికీ, భరతుడు ఏమీ చలించకుండా, ఎప్పటిలాగే తల వంచుకొని, మోసుకొంటూ ముందుకు సాగడం చూచి, రాజుకి బాగా కోపం వచ్చేసినది: "ఓరీ పొగరుబోతా! నామాటలు వినబడలేదా, అర్థంకాలేదా? నీవు జీవన్మృతుడవా? నడుస్తున్న శవమువా? నీ మదం అణగగొడతానుండు. నీ అహంకారానికి తగిన శిక్ష విధిస్తాను. ఇక నన్ను ఎన్నడూ మరచిపోలేవు" అని వదురుతున్న సింధురాజుతో, పాపం అజ్ఞానంచే ఇలాంటి మాట్లాడుతున్నాడని దయతలచి, చిరునవ్వుతో భరతుడు ఇలాగ జవాబు చెప్పాడు:

**భరతుడు రహూగణునితో చెపుతున్నాడు :**

"అయ్యా! వేషభాషలనుబట్టి నీవొక రాజువని భావిస్తున్నాను. నీవు వ్యంగ్యముగా చెప్పినా, నీమాటలలో కొంత సత్యమున్నది. నేను దృఢకాయుణ్ణి, యౌవనవంతుడను, బలిష్ఠుడను అయియుండీ, ముసలివానివలె బలహీనునివలె నడుం నిలువనివానివలె, దూరము నడువలేనివానివలె, బరువుమోయలేనివాని వలె పల్లకీని మోస్తున్నానని భావించావు. వ్యావహారిక దృష్టిలో చూస్తే అలాగ అనుకొనడం సమంజసమే. కాని నిజానికి ఆ బరువు మోసినది "నేను" కాదు. బరువు మొయ్యడం, నడవడం, లావెక్కడం నీరసించిపోవడం, అలసిపోవడం, ముసలితనము, యౌవనము, ఇవి అన్నీ పంచభూతాల సంఘాతమైన శరీరానివే. అలాగే కోరిక, కోపము, మదము, అహంకారము లాంటి భావాలన్నీ ఆ శరీరాన్ని నడిపించే మనస్సునకు చెందినవే. నన్ను జీవన్మృతుడవు అని అన్నావు, అంటే, నడిచే శవము అని. ప్రతిశరీరమూ ఒక శవమే. దానిని నడిపించేది ఆత్మయొక్క చైతన్యము. "నేను" జీవన్ముక్తుడను గాని జీవన్మృతుడను కాను. "నేను" అనే ఆత్మకు చావు పుట్టుకలు లేవు. అది నిత్యము. సదా ముక్తము. శీతోష్ణ సుఖదుఃఖాదులు, బంధమోక్షాలూ, శరీరానికి, మనస్సుకూ చెందుతాయికాని, ఆత్మకు చెందవు. అవి అన్నీ శరీరమే నేను అనుకొనేవారికి కలిగే మానసిక అనుభవాలు. యజమాని, సేవకుడు అనే భావాలుకూడ, ఆ శరీరాలు చేసే కర్మలను బట్టి ఏర్పరచుకొనబడిన సంబంధాలే. అందరికీ ప్రభువు ఒక్కడే - ఈశ్వరుడు. నీవు నన్ను శిక్షిస్తానంటివి. అదికూడ, ఒక శరీరము వేరొక శరీరాన్ని హింసించడమేగాని ఆ శిక్ష "నాకు" కాదు. నాకు దేహాభిమానము ఎప్పుడో పోయినది ఈ దేహము ఎలాగున్నా, ఏమయినా, నేను పట్టించుకొనను. అందుకే ఇతరులకు నేను, జడునిగాను, మూగవానిగాను, చెవిటివానిగాను, పిచ్చివానిగాను కనిపిస్తాను. నన్ను నీవు ఏ విధంగానూ శిక్షించలేవు" అని, మళ్లీ పల్లకీ మోయడానికి సిద్ధపడ్డాడు.

మంత్రముగ్ధుడై వింటున్న రాజు వెంటనే పల్లకీ దిగిపోయి భరతునకు సాష్టాంగ నమస్కారము చేసి, వినయ వినమ్రుడైనాడు. అతడు తత్త్వజిజ్ఞాస కలవాడు. కపిల భగవానుని వద్ద జ్ఞాన బోధను పొందడానికి వెళ్తున్నవాడు. భరతుని మాటలు అతనికి సూటిగా అర్థమైనవి. ఇతడు సామాన్యుడు కాడు, నివురు కప్పిన నిప్పువంటి ఒక మహాత్ముడు అని గుర్తించాడు. ఇతడు చెప్పిన కొద్దిపాటి మాటలలోనే, ఎన్నో గ్రంథాలు చదివితేగాని తెలియని ఆధ్యాత్మిక సత్యాలు తెలిసినవి. రాజు యొక్క అహంకారం తొలగిపోయినది. సిగ్గుతో పశ్చాత్తాపముతో ఇలాగ విన్నవించుకొన్నాడు:

"మహానుభావా! నీవెవ్వరివి? సామాన్య బ్రాహ్మణుడవు మాత్రము కావు. నిన్ను నేను అనరాని మాటలతో అవమానించాను. ఇప్పుడు నా అహంకారమంతా తొలగిపోయినది. నన్ను క్షమింపుమని వేడుకొంటున్నాను. నేను సింధు, సౌవీర దేశాధిపతిని. నాపేరు రహూగణుడు. నీయొక్క బ్రహ్మవర్చస్సును దాచుకొంటూ అవధూత లాగా తిరుగుతున్న నీవెవ్వరవు? నన్ను అనుగ్రహించడానికి ఈ వేషంలో వచ్చిన కపిల మునీంద్రుడవు కావుకదా! నేను ఇంద్రుని వజ్రాయుధానికి గాని, శివుని త్రిశూలానికి గాని, యముని దండానికి గాని భయపడను, కాని సద్బ్రాహ్మణుని ఆగ్రహానికి మాత్రము భయపడతాను. నేను కపిల భగవానుని సందర్శించాలని బయలుదేరాను. ఆయన ప్రసన్నుడైతే ఈ సంసారంనుండి రక్షింప బడడం ఎలాగ అని తెలుసుకుందామనుకొంటున్నాను. శరీరానికి కలిగిన శ్రమ, ఆత్మకు తగలదని నీవు చెప్పిన మాట, నాకు ఇంకా కొంచెం తెలిసేటట్లు చెప్పుము. నాకు బ్రహ్మతత్త్వాన్ని బోధింపుమని ప్రార్థిస్తున్నాను" అని, రాజు కోరగా భరతుడు సంతసించి ఇలా చెప్పాడు:

"రాజా! మానవునకుమనస్సే బంధకారకమూ, మోక్షకారకము కూడాను. అందుచేత మనస్సును కావలసిన రీతిలో మలచుకోవాలి, నియంత్రణం చెయ్యాలి. సత్త్వ రజ స్తమో గుణాలతో కూడియున్న మనస్సు విషయ ప్రపంచంలో సంచరిస్తుంది. మంచీ, చెడూ కర్మలుచేస్తూ, ఆ కర్మ ఫలాలను అనుభవించడానికి మళ్లీ మళ్లీ జనన మరణ సంసార వలయంలో చిక్కుకొంటాడు జీవుడు. మనస్సులో పుట్టే కోరికలను బట్టి ఉత్తమ, అధమ గతులు

సంభవిస్తాయి. సుఖదుఃఖాలు కలుగుతుంటాయి. వీటికి అంతం ఉండదు. విషయ ప్రపంచంతో మనస్సునకు అనుబంధం ఉన్నంత వరకూ, ఇది పునరావృతం అవుతూనే ఉంటుంది. రాజా! ఈ ప్రపంచము మిథ్య. దానిని వ్యవహారసత్యం అనవచ్చు. వ్యవహారసత్యము అసలు సత్యము కానేరదు. కలలో కనిపించేవన్నీ కలగంటున్నంతసేపూ తాత్కాలికంగా సత్యాలే అయినా, మెలకువ రాగానే అవి మిథ్య, అసత్యం అయిపోతాయి. మనస్సు అనేకమైన సంస్కారాలను పొందుతుంది. వాటినిబట్టి, జీవుడు, దేవ, దానవ, మానవ, జంతు, పక్షి, వృక్ష, కీటక జన్మలను పొందుతాడు. మనస్సు గుణరహిత స్థితిని చేరినప్పటి అనుభవమే ముక్తి. గుణాలూ, కర్మలూ, కోరికలూ అసలే లేకపోతే మనస్సే ఉండదు. కేవలం పరతత్త్వముగానుండిపోతుంది. పదహారు తత్త్వాలలో మనస్సే ప్రధానమైనది. మాయచే మనస్సు కలుగుతుంది. పరిశుద్ధమైన మనస్సే ఆత్మను తనలో ప్రతిబింబించు కొంటుంది. మనస్సు వల్లనే జీవుడు దేహాలను ధరించి అనుభవాలను పొందుతాడు.

ఓరాజా! పరమాత్మ, జీవాత్మ రూపంలో ఉపాధిలో నున్నప్పటికీ, ఉపాధియొక్క కర్మలతోగాని, వాటి ఫలములతోగాని, ఆ ఫలానుభవాలతోగాని ఎలాంటి ప్రమేయమూ లేక కేవలం సాక్షిగా మాత్రమే ఉంటుంది. పరమాత్మ స్వయం ప్రకాశము. తానే సకల కర్మలకూ కర్తననీ, ఆ కర్మ ఫలాలకు భోక్తననీ, జీవాత్మ భ్రమ పడడానికి కారణం మాయలోనున్న మనస్సే. ఈ భ్రమ వలననే జనన మరణాలు కలుగుతాయి. దీనివలననే తాను ఇంద్రియ మనస్సులకు పరుడనని ముక్తిదశ వరకూ తెలుసుకొనలేడు. ఇంద్రియాలతో సంగమును వీడలేడు. ఈ స్థితినుండి బైటపడడానికి శ్రీహరియొక్క పాదపద్మ ధ్యానమనే ఖడ్గముచే, మనస్సును జయించి, పరతత్త్వాన్ని తెలుసుకోవాలి. ఈ మనస్సే రజస్తమోగుణాలతో కూడియున్నప్పుడు మమకారము, లోభము, పగ, మనశ్చాంచల్యమూ, మతి మరుపు, శోకము లాంటి భావాలతో నిరంతరం పనిచేస్తుంటుంది. సత్త్వగుణముతో కూడియున్నప్పుడు భక్తి, జ్ఞానము, ఉదయిస్తాయి.

ఓరాజా! "పల్లకీనిమోసే బరువు శరీరానిది గాని, నాది కాదు," అనే మాటను, నీవు సరిగా గ్రహించినట్లులేదు. ఈ కనిపిస్తున్న ప్రపంచమూ, దానియందున్న చరాచర భూత సృష్టియావత్తూ, పంచభూతాల సంఘాతముచే ఏర్పడిన ప్రకృతి వికారాలే కదా! ఒక పాషాణము (పెద్ద బండరాయి) కూడ పృథివి యొక్క వికారమే. అది కదలదు. శరీరాలు కూడ ప్రకృతి యొక్క వికారములే. రాతిమీద మనిషి కూర్చుంటే రాతికి బరువైపోయినదే అని అనుకోము. మనిషి శిరస్సుపై ఏదైనా బరువు పెడ్తే అతనికి బరువై పోయినది అంటాము. రాయి, మనిషి శరీరమూ, రెండూ ప్రకృతి వికారాలే అయినప్పుడు కదలని రాయి, కదిలే మనిషీ, రెండూ బరువును మోస్తున్నవికదా, ఈ రెండింటి బరువునూ మోసేది పృథివియే. శిరస్సుయొక్క బరువును మెడ, మొండెము యొక్క బరువును నడుమూ, కాళ్లూ, మొత్తం శరీరం యొక్క బరువును పాదాలూ మోస్తున్నవి కదా, అవి వేరువేరుగా భారం మోస్తున్నామని అనుకొంటున్నాయా! పృథివితో సహా సమస్తవస్తువులనూ ప్రకృతి ధరిస్తుంది. కనుక పల్లకీ, పల్లకీలోని రాజూ, మోసిన శరీరమూ, వీటన్నిటినీ భరించే భూమి, అన్నీ కూడా పృథివి యొక్క వికారాలే. అన్నింటిలోనున్న ఆత్మ ఒక్కటే. ఈ సత్యాన్ని తెలుసుకొనలేక మోయబడే మట్టి శరీరము రాజు అనీ, మోసే మట్టి శరీరము సేవకుడనీ, భిన్నంగాచూడడం అవిద్య. రాజూ, బోయీలూ తమతమ కర్మల వశముచే ఆయా శరీరాలను ధరించి, ఆయా ప్రవృత్తులలో నున్నారు. నామ రూపాలతో నున్న సమస్త చరాచర వస్తువులూ ఆ నామరూపాలను కోల్పోయి క్రొత్త రూపనామాలను పొందుతాయి. భూమికూడా నిత్యముకాదు. అలాగే ఇతర భూతాలు కూడాను. పంచభూతాలూ, త్రిగుణాలూ, కాలమూ, వీటన్నిటినీ కలిపి ప్రకృతి అంటారు. ఇది పరిణామాత్మకము. ఎప్పుడూ మారుతుండే స్వభావముగలది. ఇది జడాత్మకము. ప్రకృతి నుండే దేహము ఉద్భవించినది. మనస్సు కూడా జడమే. అన్నీ మాయాచోదితాలే.

ఒక్క ఆత్మయే చైతన్యాత్మకము. స్వయంప్రకాశకము. జ్ఞానస్వరూపము. అదే పరమాత్మ, బ్రహ్మము. ఏకైక సత్యము. అందుకే బ్రహ్మసత్యము, జగన్మిథ్య అన్నారు. ఇటువంటి మిథ్యారూపమైన జగత్తును ఆశ్రయించి, జీవుడు సంసారి అయి, అనేకమైన బాధలు, కష్టసుఖాలు, విచారాలు, ప్రేమ, ద్వేషము, భయము, భ్రమ, క్రోధము, దురాశ,

అసూయ, ఆకలిదప్పులు, మానసిక శారీరిక క్లేశాలూ, చావుపుట్టుకలూ మొదలైన దుఃఖాలకు లోనౌతాడు. సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి మార్గాలను అన్వేషిస్తూ సంసారమనే గాఢాంధకారపు అరణ్యంలో కూరుకొనిపోయి, దారీతెన్నూ, వెలుగూ కానలేక అందులోనే భ్రమిస్తుంటాడు. ఆ అరణ్యంలో ఆరుగురు తస్కరులు సదా వీరవిహారం చేస్తూ అమాయకులైన ఈ సంసారి బాటసారుల్ని దోచుకొని, శాశ్వత బానిసలుగా చేసుకొని హింసిస్తుంటారు. వారే కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనే (అరిషడ్వర్గాలనడే) దొంగలు. వీరి ప్రభావం వల్ల సంసారికి భగవంతుని గురించి తలచుకొనడానికే సమయం లేకుండాపోతుంది. అయితే ఈ స్థితినుండి బయటపడడానికి మార్గము లేకపోలేదు. సాధుసత్పురుషులసాంగత్యము, వారి పాదసేవల ద్వారా గురుభక్తి, దైవభక్తి, సిద్ధిస్తాయి. నిస్సంగత్వము, నిర్మోహత్వమూ అలవడుతాయి. జ్ఞాన కాంక్ష పెరుగుతుంది. చివరకు జ్ఞానోదయంకూడా కలుగుతుంది. అట్టి జ్ఞానము, వైదిక కర్మాచరణము ద్వారాగాని, వేదాధ్యయనముచేగాని, ఘోర తపస్సుచేగాని, దానధర్మాలచేగాని, యాత్రలచే, వ్రతాలచే, అర్చనలచేగాని లభించదు. ఇంద్రియభోగాలకు విముఖులై, అరిషడ్వర్గాలను మనో నిగ్రహంచే జయించి, శ్రీమన్నారాయణుని సద్గుణకీర్తనలలో ఆనందించే భాగవతులను అనుదినమూ ఆరాధిస్తుంటే, భక్తుని బుద్ధి మోక్షమార్గంవైపు పయనించి, శ్రీమన్నారాయణ పాదపద్మాలపై లగ్నమవుతుంది. అదే ముక్తికి సాధన.

రాజా! ఇక, నా విషయం చెప్తానువిను. పూర్వము నేను భరతుడనబడే రాజును. సర్వసంగాలనూ పరిత్యజించి, సన్న్యసించి ఒక పుణ్యాశ్రమంలో నేనుండగా, తల్లిలేని ఒక లేడిపిల్లయందు, కర్మవశాత్తూ, నాకు మమకారం ఏర్పడినది. ఆ సంగప్రభావంచే నేను ఒక లేడినై జన్మించి, ఆ ఆశ్రమంలోనే గడిపాను. దైవానుగ్రహంచే నాకు పూర్వజన్మల స్మృతి ఉన్నది. లేడి జన్మ తరువాత నేను ఇప్పుడు బ్రాహ్మణుడనై జన్మించాను. నాకు అన్ని కర్మబంధాలూ నశించాయి. కనుక, మళ్లీ కర్మలుచేసి క్రొత్త బంధాలను కలిగించుకొనకుండా, ఈ విధంగా సంచరిస్తున్నాను. రాజా! నరుడు దుస్సంగదోషముచే పతనమౌతాడు. సత్సంగ మహిమచే ఉద్ధరింపబడతాడు. సత్సంగమువలన జ్ఞానం కలిగి, మోహం తొలగిపోతుంది. శ్రీహరి కథాశ్రవణముచే సంసార-అరణ్యాన్ని సులువుగా దాటివేయవచ్చును. కాని ఇంద్రియాలను జయించలేని మనిషిని కామము, లోభము, అనే దొంగలు చుట్టుముట్టి, పట్టుకొని, అతడు దాచుకొన్న ధర్మమనే మహాధనాన్ని దోచుకొంటారు. అందుచేత సంసారమునందు కోరికలను పెంచుకొనరాదు.

**సంసారారణ్యము (భవాటవి) :**

భరతుడు రహూగణునితో ఇంకా ఇలాగ చెపుతున్నాడు: "ఓ సింధు రాజా! ఈ సంసారము భయంకరమైన ఒక చీకటికీకారణ్యము వంటిది సుమా! ఇది దట్టమైన మానులతోనూ ముళ్లపొదలతోనూ, చుట్టివేసే తీగలు లతలతోనూ, కత్తులవంటి వాడి రాళ్లతోనూ నిండి ఉండడం వలన ముందుకు సాగడమే కష్టమైపోతుంది. క్రూర మృగాలూ, విషసర్పాలూ, కీటకాలూ తిరుగుతుంటాయి, దోపిడీ దొంగలూ, బంధించి వేసే ఆటవికులూ, సేవలు చేయించుకొనే కామినీ కాంతలూ, భూతప్రేత పిశాచాలూ, యక్షరాక్షస గణాలూ, వంచకులూ మొదలైనవారికి ఇది స్థావరము. అందులో ప్రవేశించిన వ్యక్తి నిరంతరమూ భయంతో ఇటూ అటూ పరుగెత్తుతూ దారీ తెన్నూ కానక దాటలేక, వెనుకకు పోలేక, అందులోనే తిరుగుతూ ఉంటాడు. తనలాంటి దారితప్పిన వారితో చెలిమిచేస్తాడు. వారిలో కొందరు తనను వీడివెళ్లిపోతే శోకిస్తాడు.

రాజా! ఈ సంసారాటవిలో జీవుడు తెలిసోతెలియకో ప్రవేశించినప్పటినుండీ, ఏదో ఒక రకమైన బాధను అనుభవించుతుంటాడు. ఆరు ఇంద్రియాలూ (శ్రోత్రము, చక్షువు, స్పర్శ, రసనము, ఘ్రాణము, మనస్సు), ఆరుగురు శత్రువులవలె, (కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము) దోపిడీ దొంగలవలె, శాంతి అనే ధనాన్ని దోచుకొని హింసిస్తారు. బంధువులు తోడేళ్లలాగా బుద్ధిని తినేస్తారు. పరిచారకులు కందిరీగలు లాగ చుట్టూ ముసురుకొని బాధిస్తారు. కర్మ బంధాలు తీగవలె బంధిస్తాయి. వైవిధ్యముతో కూడిన ఇంద్రధనుస్సు లాంటి

విషయప్రపంచము, గంధర్వనగరం లాగా ఆకర్షించి, మోహంలోముంచి, అదృశ్యమైపోతుంది. నీటికోసం ఎండిపోయిన నదివెంట పరుగెత్తి, సుఖాలకోసం, ఇంద్రియ సుఖాలవెంట పరువులెత్తి హతాశుడై చివరకు దుఃఖాన్నే పొందుతాడు. తేనెకోసం వెళ్లి తేనెటీగలచే హింసింప బడుతాడు. సంగ్రహించిన సంపదను చోరులు తస్కరించగా, ధనముగురించి ఇతరుల నాశ్రయించి, వారిచుట్టూ తిరుగుతూ, అవమానింప బడుతూ వ్యథలపాలౌతాడు. ఇతరులతో పోట్లాడుతాడు. దెబ్బలు తింటాడు. భూమిని గురించీ, భామనుగురించీ, శత్రువులై చంపుకొంటారు. వానరులవలె సమయ, స్థల, విచక్షణలేక కామకేళి సలుపుతుంటారు. భార్యాబిడ్డల్నీ సంపదల్నీ విడువలేక ఆ అడవిలోనే సంచరిస్తుంటారుగాని, అడవిని దాటి బయటి ప్రదేశంలో వెలుగులో స్వేచ్ఛగా ఉందామని అనుకొనరు. అరణ్యానికి అవతల విష్ణుపదమే ఉన్నదని తెలిసినా, అలవాటైన అరణ్య జీవితాన్ని విడిచి వెళ్లడానికి ఇష్టపడరు, శ్రీహరిని తలచుకొనడానికి పాటుపడరు. భగవంతుని మాయచే జీవులు ఈ సంసారాటవిలో ప్రవేశిస్తారు. దీనిని దాటాలంటే ముఖ్యముగా ఉండవలసినది సర్వభూతహితకాంక్ష. మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, కర్మచేగాని, ఏజీవినీ హింసించకుండా, మైత్రి, కరుణ కలిగియుండడం. స్వధర్మాచరణను శ్రీహరి సేవగా భావించి చెయ్యడం, భగవదారాధన ద్వారా తత్త్వజ్ఞానాన్ని పొంది, జ్ఞాన ఖడ్గముతో ఈ సంసారాటవిలతలను, పొదలనూ ఛేదించి, ఆవలివైపుననున్న విష్ణుపదాన్ని చేరడమే ఏకైక - ఉపాయము." అని భరతుడు చెప్పగా విని, రహూగణుడు తత్త్వాన్ని తెలుసుకొని వైరాగ్యము కలుగగా ఇలా అన్నాడు:

"మహాత్మా! పవిత్రమైన నీ వాక్కులను విన్నతరువాత నాకండ్లు తెరచుకొన్నవి. దేవ మనుష్యాది - అనేక జన్మలలో మానవజన్మయే శ్రేష్ఠమైనదని తెలిసినది. ఏలనన సత్పురుషుల సహవాసభాగ్యము ఒక్క మానవునకే లభిస్తుంది. అతని జన్మయే సార్థకమవుతుంది. విష్ణుపదాన్ని పొందడానికి నీవంటి భాగవతోత్తముల పాదసేవ చెయ్యడం చాలా అవసరం అని తెలుసుకొన్నాను. నా సౌభాగ్యముచే నేడు నాకు నీ దర్శనం లభించినది. ఈ స్వల్ప వ్యవధిలోనే నా అజ్ఞానము నశించినది. అంతటా అందరిలోనూ ఆ వాసుదేవుడే ఉన్నాడని ఇప్పుడు తెలిసినది. అందుచేత పిన్నా పెద్దా అనే వయోభేదములేక అందరికీ నమస్కరిస్తున్నాను. సామాన్యులకూ, బ్రహ్మవేత్తలకూ నమస్కరిస్తున్నాను. నీవంటి ఉత్తమజ్ఞాన సంపన్నులకు శుభమగుగాక! వారి యొక్క కరుణాకటాక్షములచే నావంటి అహంకారులూ, అజ్ఞానులూ, భగవంతునియొక్క లీలావైభవాలను తెలుసుకొని, నిర్మల భక్తులగుదురుగాక!" అని రహూగణుడు భరతుని పాదాలపై బడ్డాడు. జీన్ముక్తుడైన భరతుడు, రాజునాశీర్వదించి, నిర్వికారుడై, లోకసంచారానికి వెళ్లిపోయాడు. శ్రీశుకుడు పరీక్షిత్తుతో ఇలా చెప్పాడు: "రాజా! భరతుడు చెప్పిన సంసార - అరణ్యంగురించి చెపుతాను విను: శరీరమే ఆత్మ అని నమ్మేవారు, తమ కర్మఫలాలను అనుభవించడానికి అనేక జీవయోనుల్లో జన్మిస్తుంటారు. కామ్యకర్మలను చెయ్యడమే సంసారారణ్యంలో ప్రవేశించడం అన్నమాట. విష్ణుమాయచే మనిషి ఈ అరణ్యంలోనికి ఆకర్షితుడవుతాడు. అతడు వ్యాపారంచేసి ధనం ఆర్జించాలనుకొనే వ్యాపారిలాంటివాడు. అరణ్య మార్గంలో అడ్డంకులూ, ఆశాభంగాలూ ఎదురౌతున్నా భగవంతుని ఆశ్రయించాలని అనుకొనడు. ఆర్జించిన ధనాన్ని భగవదర్పితంగా ధర్మమార్గాన వినియోగించాలని అనుకొనడు. ఇంద్రియభోగాల్లో వెచ్చిస్తే ఆ ధనముచే, లోన పొంచియున్న ఆరుగురు తస్కరులను పోషించినట్లవుతుందని తెలుసుకొనడు. బంధువులూ, పరివారజనులూ, ఆశ్రితులూ పీడించి తినేటటువంటి తోడేళ్లవంటివారు. లతలు, తీగలూ లాగా, కార్యకలాపాలూ, కర్మలూ చుట్టివేసి కర్మాసక్తుని బంధిస్తాయి. అప్పుడు పూర్వకర్మ వాసనలు అనుభవించవలసియుంటుంది. మోసగాళ్లను, కుట్రదారులను, దోపిడీదారులను ఎదుర్కొనవలసియుంటుంది. మానవుడు ఆకలి తీర్చుకొనడానికీ కామతృష్ణను తీర్చుకొనడానికీ, కాంచనం సంగ్రహించడానికీ, ఇంద్రియాలను తృప్తిపరచడానికి నానాయాతనలు పడుతుంటాడు. అయినా అవి ఎన్నటికీ తీరనట్టివి. విషయ వస్తువులవెంట అతడు తీసే పరుగులు, ఎండమావులను వెంబడించడం లాంటివి. అతడు ఎండిపోయిన చెట్టుక్రింద విశ్రమించేమూఢునిలాగ బుద్ధిహీనులను, నాస్తికులను ఆశ్రయిస్తాడు. సుఖాలను అనుభవించాలని గృహస్థుడు చేసే కర్మలన్నీ కారుచిచ్చులో చిక్కుకొనడం అని తెలుసుకోవాలి."

ఇలాంటి కర్మ ప్రవృత్తి ప్రమాద భరితము. అది సంసార వ్యామోహంలో పడవేసి, శ్రీహరి చింతనాన్ని విస్మరింప జేస్తుంది. భరతుని వలె నిరంతర స్మరణచేస్తూ దేహత్యాగ సమయంలో కూడా "నారాయణాయ నమః" అని స్మరించ గలిగేటట్లు భగవద్భక్తిని పెంచుకోవాలి.

ఈ భరతుని చరిత్రను శ్రవణం చేసిన వారికి సంగదోషము తొలగిపోయి, భక్తి జ్ఞాన వైరాగ్యాలు సిద్ధిస్తాయి.

## సప్తద్వీపాలు

**భరతునివంశము :**

స్వాయంభువమనువు పుత్రుడైన ప్రియవ్రతుడు మహాప్రభావశాలి. ప్రపంచానికి సూర్యరశ్మి తగలని రెండవవైపు కూడా వెలుగులమయం చెయ్యాలనే సంకల్పంతో, సూర్యకాంతివలె మెరిసిపోతున్న ఒక రథాన్ని చేయించి, దానిలో అతడు సూర్యునికి ఎదురు బాటలో భూమికి ప్రదక్షిణం చేయనారంభించాడు. ఏడుసార్లు తిరిగేసరికి ప్రకృతికి విరుద్ధంగా అలాగ చెయ్యరాదని బ్రహ్మదేవుడు వారించాడు. ఆ రథంవల్ల ఏర్పడిన ఏడు బాటలూ సప్తసముద్రాలు అయి, వాటి మధ్యనున్న భూభాగాలు సప్తద్వీపాలు అయినవి. వాటి వివరాలను సూక్ష్మంగా చెపుతాను.

ప్రియవ్రతుని వంశములో నారాయణాంశతో ఋషభుడు జన్మించాడు. అతని పుత్రులలో భరతుడు గొప్పవాడు. భరతుని కుమారుడు సుమతి. అతడు ధర్మయుతంగా పాలించేవాడు. ఆ వంశంలో పన్నెండు తరాల తరువాత విష్ణుఅంశతో గయుడు అనేవాడు జన్మించాడు. అతడు గొప్ప రాజర్షి అయ్యాడు. ధర్మమార్గాన ప్రవర్తిస్తూ, ప్రజలను సత్కర్మలలో నియోగిస్తూ ఆదర్శ ప్రభువై వెలిశాడు. భూదేవి సంతసించి, అతడు కోరకపోయినా, అన్నీ సమకూర్చేది. బ్రాహ్మణులు తాముచేసే పుణ్యకార్యాలలో కొంతభాగం అతనికి ఇచ్చేవారు. బ్రహ్మ, ఇంద్రాది దేవతలు స్వయంగా వచ్చి యజ్ఞ హవిస్సులను స్వీకరించేవారు. శ్రీహరికూడా సంతుష్టుడైనాడు. అతని తరువాత పదితరాలకు విరజుడు జన్మించాడు. ప్రియవ్రతుని వంశములో ఇతడు చివరివాడు. బాగా ప్రసిద్ధిజెందినవాడు.

**సప్తద్వీపాలు :**

భూమండలము ఒక పద్మాకారములోనున్నది. దానిలో ఏడు ద్వీపాలున్నవి. అవి: జంబూద్వీపము, ప్లక్షద్వీపము, శాల్మలీ ద్వీపము, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శాకద్వీపము, పుష్కరద్వీపము.

**1. జంబూద్వీపము :** ఇది పద్మాకారంలోనున్న భూమండలం మధ్యలో ఒక లక్షయోజనాలు పొడవు, అంతే వెడల్పుతో వర్తులాకారంలో నుంటుంది. ఇది తొమ్మిదివేల యోజనాల వైశాల్యంగల తొమ్మిది వర్షాలుగా విభజింపబడినది. వాటిపేర్లు ఇవి: ఇలావృతవర్షము, రమ్యకవర్షము, హిరణ్మయవర్షము, కురువర్షము, హరివర్షము, కింపురుషవర్షము, భారతవర్షము, కేతుమాలవర్షము, భద్రాశ్వవర్షము. ఈ వర్షాలను విభజించే సరిహద్దులుగా ఎనిమిది పర్వతాలున్నవి. ఈ తొమ్మిది వర్షాలకు మధ్యను ఇలావృత వర్షమున్నది. పద్మానికి కర్ణికలాగ ప్రకాశిస్తూ ఇలావృతవర్ష మధ్యస్థంగా సువర్ణ సుమేరు పర్వతమున్నది. అది లక్షయోజనాల ఎత్తుగానుంటుంది. దాని శిఖరము, ముప్పది రెండువేల యోజనాల వైశాల్యంకలది.

ఇలావృతవర్షానికి ఉత్తరాన, నీల, శ్వేత, శృంగవత్తు అనే మూడు పర్వతాలున్నవి. వీటినడుమనున్న ప్రదేశాలలో రమ్యకవర్షము, హిరణ్మయవర్షము, కురువర్షము ఉన్నవి. ఈ పర్వతాలే ఆ వర్షాలకు సరిహద్దులు. వీటికి తూర్పున లవణ సముద్రమున్నది. ఇలావృత వర్షానికి దక్షిణాన నిషధ, హేమకూట, హిమవత్పర్వతాలున్నవి. ఇవి హరివర్షము, కింపురుషవర్షము, భారతవర్షాలకు సరిహద్దు పర్వతాలైయున్నవి. ఇలావృతానికి తూర్పున గంధమాదన పర్వతము, పడమరన మాల్యవంతము అనే సరిహద్దుపర్వతములున్నవి. ఇవి కేతుమాల వర్షానికి, భద్రాశ్వవర్షానికి సరిహద్దులు. సుమేరు పర్వతానికి తూర్పున మందరపర్వతము, దక్షిణాన మేరుమందరము, పశ్చిమాన సుపార్శ్వ పర్వతము, ఉత్తరాన కుముదపర్వతము ఉన్నవి. ఈ నాలుగు పర్వతశిఖరాలపై శతయోజన వైశాల్యముగల సరస్సులున్నవి. మందరపర్వతముపైనున్నది క్షీరసరస్సు, మేరుమందరముపై మధు (తేనె) సరస్సు, సుపార్శ్వముపైన ఇక్షు (చెరకురసం)

సరస్సు, కుముదముపైన శుద్ధ జలసరస్సు ఉన్నవి. అక్కడ నందనము, చైత్రరథము, వైభ్రాజకము సర్వతోభద్రము అనబడు నాలుగు దేవతా - ఉద్యానవనాలున్నవి. ఆ సరస్సులలోని జలాన్ని స్పృశించినవారికి సహజంగానే యోగనిష్ఠ, అణిమాది సిద్ధులు సిద్ధిస్తాయి. దేవతలు, అప్సరసలు, ఆ సరస్సులలోను, ఉద్యానవాల్లోనూ వినోదిస్తుంటారు.

మేరు పర్వతానికి తూర్పుగా జఠరము, దేవకూటము అనే పర్వతాలూ, దక్షిణంగా కైలాసము, కరవీరము అనే పర్వతాలు పశ్చిమాన పవనము, పారియాత్రమూ, ఉత్తరాన త్రిశృంగము, మకరము అనే పర్వతాలూ ఉన్నవి. మేరుపర్వత శిఖరమధ్యన శాతకౌంబి అనే పట్టణమున్నది. అక్కడ చతుర్ముఖబ్రహ్మ నివసిస్తాడు. ఆ పట్టణానికి ఎనిమిది దిక్కులా అష్టదిక్పాలకులనగరాలున్నవి. అవి:- ఇంద్రుని అమరావతి, అగ్నియొక్క తేజోవతి, వరుణుని శబ్దావతి, వాయువు యొక్క గందవతి, కుబేరుని (అలకాపురి) మహోదయ, ఈశానుని యశోమతి ఉన్నవి. వామనావతారంలో త్రివిక్రముడైన నారాయణుని పాదనఖము తగిలి అండకటాహము (బ్రహ్మాండము) యొక్క పైభాగమున రంధ్రమేర్పడి, పైన ప్రవహిస్తున్న జలము లోనికి ప్రవేశించి, త్రివిక్రముని పాదప్రక్షాళణంచేసి ప్రవహించినది. అందుకే అది, భగవత్పది అనే పేరున పిలువబడినది. అది క్రిందికి పారిపారి చాలాకాలానికి విష్ణుపదమనబడే ద్యులోకంలో పడ్తుంది. అక్కడ ధ్రువుడు స్నానం చేస్తుంటాడు. సప్తర్షులు నిత్యమూ ఆజలాన్ని శిరస్సున ధరిస్తారు. అటనుండి చంద్రమండలాన్ని తడిపి, మేరు పర్వతశిఖరాన ఉన్న బ్రహ్మలోకంలో పడుతుంది. విష్ణుపది అనే ఆనది అక్కడ సీత, అలకనంద, చక్షువు, భద్ర అనే పేర్లతో నాలుగు నదులు అయి, నాలుగు దిక్కులుగా, ప్రవహిస్తుంది. సీతానది తూర్పుగా ప్రవహించి, కేసరగిరి, గంధమాదన పర్వతాల మీదుగా భద్రాశ్వ వర్షాన్ని పవిత్రం చేస్తూ, లవణసముద్రంలో కలుస్తుంది. చక్షువునది పడమటిద్వారం నుండి వెలువడి, మాల్యవత్పర్వతం మీదుగా కేతుమాల వర్షాన్ని పవిత్రంచేస్తూ పశ్చిమసముద్రంలో కలుస్తుంది. భద్రానది ఉత్తరద్వారంగుండా వెలువడి, కుముద, నీల, శృంగవత్పర్వతాల మీదుగా మానసోత్తరాలైన కురుభూములను పవిత్రంచేస్తూ, ఉత్తర లవణ సాగరంలో కలుస్తుంది. అలకనందానది దక్షిణంగా వెళ్లి, హేమకూట, హిమవత్పర్వతాలను దాటివచ్చి, కర్మక్షేత్రమైన భారతవర్షాన్ని పవిత్రం చేస్తూ దక్షిణ దిక్కున ఉన్న సముద్రంలో కలుస్తుంది.

భారతవర్షమే కర్మభూమి. ఇతర వర్షాలన్నీ భోగభూములు భారతదేశములోనే కర్మచేసి, పాప, పుణ్య ఫలాలను సంచయించేసుకొని, ఇతర వర్షాలలో అనుభవించవచ్చును. ఈ ఎనిమిది వర్షాలను భూలోకస్వర్గాలంటారు. అక్కడి ప్రజలు త్రేతాయుగములో నున్నట్లు ఉత్కృష్టమగు సుఖాన్ని అనుభవిస్తారు.

ఈ ఎనిమిది వర్షాలలోని జనులు దేవతల లాగా ఉంటారు. బలవంతులు, దీర్ఘాయుష్కులు అయి యుంటారు. స్త్రీ పురుషులు పరస్పరం ఆనందం అనుభవిస్తూ గడుపుతారు. వారికి ఆయువు నిండడానికి ఒక్క సంవత్సరం ముందు ఒక్క సంతానం కలుగుతుంది. ఈ ఎనిమిది వర్షాలలో దేవతలు తరచూ విహరిస్తూ వినోదిస్తుంటారు. ఈ తొమ్మిది వర్షాలలోనూ నారాయణుడు వర్షాధిపతిగానుంటూ, అక్కడి జీవులను అనుగ్రహించడానికి వారికి అనుగుణమైన రూపాల్లో, తన కల్యాణ గుణవైభవాలను ప్రదర్శిస్తుంటాడు.

1. ఇలావృత వర్షములో భగవానుడు రుద్రరూపములో అధిపతిగానుండి, పార్వతితో సహా అందరిచే ఆరాధింపబడుతాడు. ఆ వర్షములో శివుడు తప్ప ఏ పురుషుడు ప్రవేశించినా పార్వతీదేవి శాపముచే స్త్రీగా మారిపోతాడు. అక్కడ భవానియే సర్వమూ నియమించి పాలిస్తుంది. రుద్రునకు అధిష్ఠానమైన సంకర్షణ భగవానుడు రుద్రునిచే ఈ విధంగా ఆరాధింపబడుతాడు:

**మంత్రము :** ఓం నమో భగవతే మహాపురుషాయ
సర్వగుణ సాంఖ్యానాయ అనంతాయ అవ్యక్తాయ చ.

2. భద్రాశ్వ వర్షానికి ధర్మునిసుతుడైన భద్రశ్రవుడు అధిపతి. అక్కడి జనులు భగవానుని ప్రతిరూపమైన హయగ్రీవమూర్తిని ఆరాధిస్తారు.

**మంత్రము: ఓం నమో భగవతే ధర్మాయ ఆత్మ విశోధనాయ నమః అని ధ్యానిస్తారు.**

హయగ్రీవుడు వేదాన్నీ, ధర్మాన్నీ ప్రవర్తింపజేస్తాడు. అంతఃకరణం శుద్ధిచేసి, ప్రకృతి సంగాన్ని తొలగించి, బ్రహ్మప్రాప్తిని కలిగిస్తాడు.

**3. హరివర్షము :** ఇక్కడ ఉపాస్యమూర్తి నరసింహస్వామి. ప్రహ్లాదాది దైత్య దానవులు, ప్రజలూ కొలిచే ఇష్టదైవము ఈ స్వామి.

**మంత్రము : ఓంనమోభగవతే నరసింహాయ, నమః తేజస్తేజసే, ఆవిరావిర్భవ**
**తమోగ్ర సగ్రస ఓం స్వాహా, అభయం అభయం ఆత్మని భూయిష్ఠా ఓం క్ష్రౌం:**
అని ధ్యానిస్తారు.

తేజస్సులకు తేజస్సునూ, తిమిర సంహారకుడునూ, కర్మ వాసనాశకుడునూ అయిన నరహరి ఆవిర్భవించుగాక, అభయ మిచ్చుగాక! అని.

4. కేతుమాలవర్షములో భగవానుడు, కామదేవుడైన ప్రద్యుమ్నరూపంలో ఆరాధింపబడుతాడు. సంవత్సరుడనే ప్రజాపతి యొక్క బిడ్డలు అక్కడ అధిపతులు. వీరునూ లక్ష్మీదేవీ భగవానుని ప్రద్యుమ్న రూపంలో ఉపాసిస్తారు. ఆయన తన మాయామయమైన మానస రూపంలో, వారియొక్క ఇంద్రియ కామనలను తృప్తి పరుస్తాడు. వారు జపించే మంత్రము ఇలాగుంటుంది:

**ఓం హ్రాం హ్రీం హ్రూం**
**ఓం నమో భగవతే హృషీకేశాయ**
**సర్వగుణ విశేషైః విలక్షితాత్మనే**
**ఆకూతీనాం చిత్తానాం, చేతనానాంచ, విశేషాధిపతయే**
**షోడశ కళాయ, ఛందోమయాయ, అన్నమయాయ,**
**అమృత మయాయ, సర్వమయాయ సహసే ఓజసే**
**బలాయ, కాంతాయ, కామాయ, నమస్తే ఉభయత్రభూయాత్**

5. రమ్యక వర్షానికి శ్రీహరి యొక్క మత్స్యరూపము ఆరాధ్యదేవత. మనువు అధిపతి. మనువూ, అతని సంతతి వారూ, ప్రజలూ ఈ విధంగా ధ్యానిస్తారు:-

**ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమః**
**సత్త్వాయ, ప్రాణాయ, ఓజసే, సహసే, బలాయ, మహామత్స్యాయ నమః**

6. హిరణ్మయ వర్షములో శ్రీహరియొక్క కూర్మరూపము ఆరాధింపబడుతుంది. అర్యముడు అధిపతి.

7. ఉత్తరకురు వర్షములో శ్రీహరి యొక్క వరాహరూపము ఆరాధింప బడుతుంది. భూదేవితో సహా అందరూ ఆవరాహమూర్తిని సేవిస్తారు.

**మంత్రము : ఓం నమో భగవతే మంత్ర తత్త్వలింగాయ యజ్ఞక్రతవే, మహాధ్వర - అవయవాయ,**
**మహాపురుషాయ నమః కర్మశుక్లాయ, త్రిగుణాయ నమః**

8. కింపురుష వర్షములో భగవానుడైన శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై ఆరాధింప బడుతాడు. కింపురుషులతో గూడి, పరమభాగవతుడైన హనుమానుడు అక్కడే ఉపాసిస్తుంటాడు. గంధర్వులు గానము చేస్తుండే శ్రీరామ కథను హనుమంతుడు వింటూ రామనామం జపిస్తుంటాడు. అక్కడ ఈ మంత్రాన్ని పఠిస్తారు.

**ఓం నమో భగవతే ఉత్తమ శ్లోకాయ**
**నమో ఆర్యలక్షణ శీలవ్రతాయ**
**నమః ఉపశిక్షితాత్మనే, ఉపాసితలోకాయనమః**
**సాధువాదనికషణాయ, నమో బ్రహ్మణ్యదేవాయ**
**మహాపురుషాయ, మహారాజ్ఞేనమః**

9. భారత వర్షము : భగవానుడు, నారాయణునిగా నరునితోకూడి, బదరికాశ్రమంలో కల్పాంతం వరకు తపస్సు చేస్తుంటాడు. నారాయణుడే ఈ వర్షానికి అధిపతి, ఆరాధ్యుడు. నారదునితో సహా సకలమునిపుంగవులూ, భక్తులూ నారాయణుని సేవిస్తుంటారు. పాంచరాత్రమనే ఆరాధనా విధానాన్ని నారదుడు సావర్ణిమనువునకు ఉపదేశించాడు. నారాయణుని ఉపాసించే మంత్రము ఇది:-

ఓం నమోభగవతే ఉపశమశీలాయ, ఉపరతనాత్మ్యాయ,
నమో అకించన విత్తాయ, ఋషివృషభాయ,
నరనారాయణాయ, పరమహంసపరమగురవే
ఆత్మారామాధిపతయే, నమోనమః

**భారతవర్షంలో ప్రసిద్ధికెక్కిన పర్వతాలు ఇవి :** మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటకము, కొల్లకము, సహ్యము, దేవగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధరము, వింధ్యము, గోవర్ధనము, రైవతకము, కకుభము, నీలము, కాకముఖము, ఇంద్రకీలము, రామగిరి, శుక్తిమంతము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణగిరి, చిత్రకూటము.

**భారతవర్షములో ప్రసిద్ధికెక్కిన నదీనదములివి :** తూర్పుగా ప్రవహించేవి నదులనీ, పశ్చిమంగా ప్రవహించేవి నదములనీ అంటారు. తామ్రపర్ణి, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, తపతి, రేవ, సురస, నర్మద, చర్మణ్వతి, సింధు, శోణము, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతీ, సరయు, భోగవతి, సప్తవతి, సుషోమ, శతద్రువు, చంద్రభాగ, మరుద్వృధ, అసిక్ని, విశ్వ మొదలైనవి.

సత్త్వగుణ ప్రధానమైన కర్మలు చేసేవారు దేవలోకాలను, రజోగుణప్రధానమైన కర్మలు చేసేవారు మానవ లోకాలనూ, తమోగుణ ప్రధానమైన కర్మలు చేయువారు అధోలోకాలనూ పొందుతారు. స్వధర్మాచరణము చేస్తూ వాసుదేవునియందు భక్తి పెంచుకొన్నవారు ఈ భారత వర్షములో మోక్షము పొందగలరు. ఎలాంటి ప్రయోజనమూ ఆశించకుండా భగవంతుని ప్రేమిస్తే భక్తి ఏర్పడుతుంది. మోక్షము పొందడానికి అనువైన సాధన క్షేత్రము, పుణ్యభూమి అయినది భారతవర్షమే. ఇతర లోకాల్లో అంతులేని ఇంద్రియ భోగాలను కల్పాంతం వరకూ అనుభవించినా వ్యర్థమే. పుణ్యము వ్యయమైపోగానే పునర్జన్మ తప్పదు. ఈ భారతవర్షములో స్వల్ప కాలం ఉన్నాచాలు, భక్తి ముక్తి సాధనలు చేసుకుంటూ, శ్రీహరికి సర్వమూ సమర్పించి విష్ణుపదాన్ని పొందవచ్చు. శ్రీహరి భారతవర్షంలోనే అనేక అవతారాలు దాల్చి మానవులను తరింపజేశాడు.

అపహరింపబడిన అశ్వమేధాశ్వాన్ని అన్వేషిస్తూ, జంబూద్వీపములో సగరుని పుత్రులు అన్నివైపులా భూమిని త్రవ్వి వేసినప్పుడు ఎనిమిది ఉపద్వీపాలు ఏర్పడ్డాయి. అవి:- స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందేహారుణము, పాంచజన్యము, సింహళము, లంక.

**2. ప్లక్షద్వీపము :** (సప్త ద్వీపవర్ణన ఊహాతీతముగా నున్నది. భూమండలం పద్మాకారములో నున్నదనీ, సప్త సముద్రాలూ, సప్తద్వీపాలూ, ప్రియవ్రతుని సూర్యరథచక్రం యొక్క జాడలవల్ల ఏర్పడినవనీ చెప్పబడినది. కనుక ఈ ద్వీపాలన్నీ ఒకే సమతల భూమట్టముపై నున్నట్టుగా కాకుండా ఒకదానిపై నొకటి దొంతరగానూ, జంబూద్వీపము అట్టడుగునా పుష్కరద్వీపం శిఖరాన ఉన్నట్టుగానూ భావించ వలసివస్తుంది. అన్ని ద్వీపాలకూ పద్మకర్ణికలాగ మేరు పర్వతం, లక్షయోజనాల ఎత్తుగా నున్నది. దానిశిఖంపైన బ్రహ్మదేవుని పట్టణమున్నది.)

జంబూద్వీపము లక్షయోజనాల వైశాల్యంగలది. దానిచుట్టూ అంతే పరిమాణమున్న లవణ సముద్రం ఉన్నది. దాని తరువాత రెండులక్షల యోజనాల వైశాల్యముతో ప్లక్షద్వీపమున్నది. దానిచుట్టూ అంతే వైశాల్యముతో చెరకుసముద్రమున్నది. జంబూద్వీప మధ్యస్థంగా జంబూ (నేరేడు) వృక్షం ఉన్నట్లు ప్లక్షద్వీపం మధ్యను ఒక మహా

ప్లక్ష (జువ్వి) వృక్షమున్నది. ఈ వృక్షమూలమందు సప్తజ్వాలలతో అగ్ని ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ అగ్నియే ద్వీపానికి అధిపతి. ప్రియవ్రతుని పుత్రుడు ఇధ్మజిహ్వుడు ఈ ద్వీపానికి రాజు. అతడు దీనిని ఏడుగా విభజించి, తన ఏడుగురు కుమారులకు ఇచ్చి, ఆ భూభాగాలకు వారి పేర్లనే పెట్టాడు. అవి - శివము, శాంతము, యశస్యము, సుభద్రము, క్షేమము, అమృతము, అభయము. ఆ వర్షాలకు సరిహద్దులుగా ఏడు పర్వతాలున్నవి. అవి- మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, సుపర్ణము, హిరణ్యష్ఠీవము, మేఘమాల అనునవి. అలాగే ఏడునదులున్నవి: అరుణ, నృమణ, అంగీరస, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర అనేవి సప్తనదులు. భారతవర్షంలోనున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణస్థులవలె, ఈ ద్వీపములో హంస, పతంగ, ఊర్ధ్వాయన, సత్యాంగ అనే వర్ణస్థులుంటారు. వీరి ఆయుర్దాయం ఒక వెయ్యి సంవత్సరాలు. దేవతలై సౌందర్యవంతులైయుంటారు. వారు సూర్య భగవానుని ఉపాసిస్తారు.

**మంత్రము : ప్రత్నస్య విష్ణోరూపం, యత్ సత్యస్యఋతస్యబ్రహ్మణః**
**అమృతస్య చ మృత్యోశ్చ సూర్యమాత్మానమీమహి**

**3. శాల్మలీ ద్వీపము :** ప్లక్షద్వీపానికి తరువాతనున్న ఈ ద్వీపము ప్లక్షద్వీపానికి రెండింతల (నాలుగు లక్షల యోజనాలు) విస్తీర్ణముకలది. దీనిచుట్టూ, అంతే విస్తీర్ణతగల సురా సముద్రము వ్యాపించియున్నది. మధ్యలో ఒక మహాశాల్మలీ (బూరుగు) వృక్షమున్నది. దానిపై గరుడుడు నివసిస్తుంటాడు. ప్రియవ్రతుని పుత్రుడైన యజ్ఞబాహువు ఈ ద్వీపాన్ని పాలించి, దానిని ఏడు వర్షాలుగా విభజించి, వాటికి తన పుత్రుల పేర్లు పెట్టి, వారిని అధిపతులుగా నియమించాడు. ఆ వర్షాల పేర్లు ఇవి:-

సురోచనము, సౌమనస్యము, రమణకము, దేవబర్హము, పారిబర్హము, అప్యాయనము, అభిజ్ఞాతము. ఆ వర్షాలకు ఉండే సరిహద్దు పర్వతాలివి: స్వరస, శతశృంగ, వామదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతక్రతు, అనునవి. అందులోనున్న ఏడు నదులు: అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహూవు, రజని, నంద, రాక. అక్కడ - శ్రుతధర, వీర్యధర, వసుంధర, విద్యాధర, అనే నాలుగు వర్ణాల వారుంటారు. ఈ ద్వీపవాసులు సోముని ఈ మంత్రముతో ఉపాసిస్తారు:

**స్వగోభిః పితృదేవేభ్యో విభజన్ కృష్ణ శుక్లయోః ప్రజానాం సర్వాసాం రాజాంధః సోమోన ఆస్త్వితి ॥**

**4. కుశద్వీపము :** ఇది ఎనిమిది లక్షల యోజనాల వైశాల్యము కలది. దీనిచుట్టూ అంతే విస్తీర్ణము ఉన్న ఘృత (నేతి) సముద్రమున్నది. ద్వీపమధ్యంలో బ్రహ్మచే నాటబడిన కుశ (దర్భగడ్డిదుబ్బు) స్తంభము ఉన్నది. అది అగ్ని జ్వాలల వలె తేజోమయంగా వెలుగుతూ ఉంటుంది. ఈ ద్వీపాన్ని ప్రియవ్రతుని పుత్రుడు హిరణ్యరేతసుడు పాలించి, దానిని ఏడు భాగాలుగా విభజించి, తన పుత్రులకిచ్చి ఆ ఏడు వర్షాలకూ, వారియొక్క పేర్లే పెట్టాడు: ఆ వర్షాల పేర్లు ఇవి. వసు, వసుదేవ, దూఢరుచి, నాభిగుప్త, సత్యవ్రత, వివిక్త, వామదేవములు. వాటి సరిహద్దు పర్వతాలపేర్లు ఇవి: చక్రము, చతుఃశృంగము, కపిలము, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము. ఆ వర్షాలలో ప్రవహించే నదులు ఇవి: రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల. అక్కడ కుశల, కోవిద, అభియుక్త, కులక, అనే నాలుగువర్ణాల ప్రజలుంటారు. అక్కడివారు, జాతవేదసుడు అనే అగ్నిదేవుని ఈ మంత్రంతో ఉపాసిస్తారు.

**పరస్య బ్రహ్మణః సాక్షాత్ జాతవేదోఽసి హవ్యవాట్**
**దేవానాం పురుషాంగానాం యజ్ఞేన పురుషం యజ ॥**

**5. క్రౌంచద్వీపము :** కుశద్వీపానికి తరువాతనున్న ఈ ద్వీపముయొక్క విస్తీర్ణము పదహారులక్షల యోజనాలు. దానిచుట్టూ అంతే విస్తీర్ణంతో పాలసముద్రం ఉంది. ప్రియవ్రతుని పుత్రుడైన ఘృతపృష్ఠుడు ఈ ద్వీపానికి రాజు.

అతడు ఆ ద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభజించి, కొడుకులకు అప్పగించి, వారిపేర్లే ఆ ఏడు వర్షాలకు పెట్టాడు. అవి: ఆమోదము, మధువహము, మేఘపృష్ఠము, సుదామము, భ్రాజిష్ఠము, లోహితార్ణము, వనస్పతి. అక్కడి సరిహద్దు పర్వతాలపేర్లు: శుక్లము, వర్ధమానము, భోజనము, ఉపబర్హణము, నందము, నందనము, సర్వతోభద్రము. ఆ వర్షాలలోని నదులు ఇవి: అమృతౌఘ, అభయ, ఆర్య, తీర్థవతి, తృప్తిరూపవతి, పవిత్రవతి, శుక్ల. ఈ ద్వీపానికి మధ్య క్రౌంచము అనే పర్వతము ఉండడం చేత ఆ ద్వీపానికి ఆపేరువచ్చినది. ఇక్కడి జనులు పురుష, ఋషభ, ద్రవిణ, దేవక, అనే నాలుగు వర్ణాలలోనుంటారు. వారు భగవానుని జలరూపంలో జలాంజలితో అర్ఘ్యప్రదానము చేసి, ఈ మంత్రముచే నారాధిస్తారు:

**ఆపఃపురుషవీర్యాః స్థపునంతీర్భూర్భువఃసువః తానఃపునీతా మీవఘ్నీః స్పృశతా మాత్మనాభువః**

**6. శాకద్వీపము** : ఇది, 32 లక్షల యోజనాల వైశాల్యముగల ద్వీపము. దీనిచుట్టూ అంతే విస్తీర్ణముతో దధి సముద్రమున్నది. దాని మధ్యన ఒకపెద్ద శాకవృక్షమున్నది. దానిపరిమళము ద్వీపమంతా వ్యాపించియుంటుంది. ప్రియవ్రతుని పుత్రుడు మేధాతిథి దీనికి ప్రభువు. అతడు ఆద్వీపాన్ని ఏడువర్షాలుగా విభజించి, ఏడుగురు కొడుకులకు ఇచ్చి, వాటికి వారిపేర్లనే పెట్టాడు. అవి: పురోజవము, మనోజవము, పవమానము, ధూమ్రానీకము, చిత్రరేఫము, బహురూపము, విశ్వాధారము - వాటి సరిహద్దు పర్వతాల పేర్లు: ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రస్రోతము, దేవపాలము, మహానసము. అందలి నదుల పేర్లు: అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపది, సహస్రస్రుతి, నిజధృతి. ఆద్వీపవాసులు: ఋతవ్రత, సత్యవ్రత, దానవ్రత, సువ్రత, అనే నాలుగు వర్ణాలవారైయుంటారు. భగవానుని యొక్క వాయురూపాన్ని, వారు ప్రాణాయామ ప్రక్రియల ద్వారా ఆరాధిస్తారు: ఈ మంత్రమును పఠిస్తారు:

**అంతః ప్రవిశ్య భూతాని యోర్భాబి భర్త్మ త్మకేతు భిః అంతర్యామీశ్వరః సాక్షాత్ పాతునోయద్వశేస్ఫుటం.**

**7. పుష్కరద్వీపము** : ఈ ద్వీపము 64 యోజనాల వైశాల్యం కలది. అంతే వైశాల్యంతో శుద్ధోదక (మంచినీటి) సముద్రం దాని చుట్టూ ఉన్నది. ఈ ద్వీపము మధ్యలో ఒక విశాలమైన పుష్కరం (పద్మము) ఉన్నది. దానిదళాలు (రేకులు) బంగారురేకులు. అవి తప్తకాంచన తేజస్సుతో వెలిగి పోతుంటాయి. ఆ పద్మములో చతుర్ముఖ బ్రహ్మ ఆసీనుడైయుంటాడు. అతడే అక్కడి వారికి ఆరాధ్యదైవము. ఈ ద్వీపమధ్యలో మానసోత్తరమనే పర్వతం ఉన్నది. దానికి నాలుగు దిక్కులా నలుగురు దిక్పాలకుల (ఇంద్ర, అగ్ని, వరుణ, కుబేరుల) పట్టణాలున్నవి. ఈ పట్టణాలకు పైన మేరువు చుట్టూ, సూర్యుని రథచక్రం తిరుగుతుంటుంది. ఈ ద్వీపానికి అధిపతి ప్రియవ్రతుని పుత్రుడు వీతిహోత్రుడు. ఇతనికి రమణకుడు, ధాతకి, అనబడే ఇద్దరు కుమారులుండిరి. వీరిద్దరికీ, రెండు వర్షములూ ఇవ్వబడినవి. అక్కడి ప్రజలు చతుర్ముఖుని ఈ మంత్రంతో కొలుస్తారు.

**యత్తత్ కర్మమ లింగం బ్రహ్మలింగం జనోఽ భ్యయేత్**
**ఏకాంతమద్వయం శాంతం తస్మై భగవతే నమః.**

**లోకాలోకపర్వతము** :

పుష్కరద్వీప మధ్యలో మానసోత్తరము అనబడే పదివేల యోజనాల ఎత్తుగల పర్వతమున్నది. ఆ ద్వీపముచుట్టూ 64 లక్షల యోజనాల విస్తీర్ణంతో శుద్ధోదక జలధి ఉన్నది. అంతటితో భూమండల సీమ సరి. దాని తరువాత లోకాలోక (చీకటి వెలుగు) పర్వతమున్నది. శుద్ధోదక జలధినుండి లోకాలోక పర్వతం వరకు ఉన్న దూరము 8 కోట్ల 39 లక్షల యోజనాలు. అక్కడ జీవరాసులేవీ ఉండవు. దానిపై ఏదీ నిలువలేదు. ఒకవైపు గాఢాంధకారము, వేరొకవైపు వెలుగు ఉంటాయి. భూః భువః సువః అనే మూడు లోకాలూ ఆ పర్వతంలోనే ఉంటాయి. సూర్యుని నుండి ధ్రువుని వరకూ వ్యాపించియున్నది - జ్యోతిర్మండలము. దాని కిరణాలచే భూః భువః సువః లోకాలు

ప్రకాశింపబడుతాయి. లోకాలోక పర్వతం అడ్డంగా నుండడం చేత ఈ జ్యోతిర్మండలం యొక్క కాంతులు ఆవలివైపున ప్రకాశించవు.

మొత్తము భూమండలమంతా 50 కోట్ల యోజనాల పరిమితి గలది. లోకాలోక పర్వతము, 12 కోట్ల యోజనాల పరిమాణముకలది. దీనిపైభాగాన, బ్రహ్మదేవుడు – ఋషభుడు, పుష్కరచూడము, వామనము, అపరాజితము అనే పేర్లుగల నాలుగు దిగ్గజాలను నిలిపారు. వాటివలన లోకాలు స్థిరంగా నుంటాయి. అక్కడనే శ్రీమన్నారాయణుడు మాయాసహితుడై కల్పాంతం వరకూ ఉంటూ పాలిస్తుంటాడు. విష్వక్సేనాది పార్షదులు ఆయన ప్రక్కనే ఉంటూ సేవిస్తుంటారు. ఈ పర్వతానికి ఆవల సంచరించడానికి ఆ భగవానునికి తప్ప ఇంకెవ్వరికీ సాధ్యపడదు.

## సూర్యుడు, అంతరిక్షము

నక్షత్రాది తేజోరాసులు సంచరించే జ్యోతిర్మండలం ద్యులోకములోనున్నది. భూలోకానికీ ద్యులోకానికీ మధ్యన సూర్యుడుంటాడు. ఉడక బెట్టబడిన ఒక గ్రుడ్డును అడ్డంగా సగానికి కోస్తే, క్రింది భాగము, భూమండలం అనుకుంటే, పైభాగము ద్యులోకాది లోకాలతో కూడియున్న మండలం అనుకొనవచ్చు. ఈ రెండింటికీ మధ్యస్థంగా సూర్యుడు ఉంటాడు. అక్కడినుండి అండము చివరి వరకూ, పైకి 25 కోట్ల యోజనాలూ, క్రిందికి కూడా అంతే పరిమాణముతోనూ ఉన్నది బ్రహ్మాండము. మృత అండానికి (కోయబడిన గ్రుడ్డుకు, లేదా నశించే స్వభావంగల బ్రహ్మాండానికి) మధ్య నున్న వాడుగనుక సూర్యుడు మార్తాండుడనబడుతాడు. సూర్యస్థానమునుండే దిక్కులు, అంతరిక్షము, ద్యులోకము, భూలోకము, స్వర్గము, నరకము, అతలాది అధోలోకాలూ నిర్దేశింపబడినవి. దేవతలకు, పశుపక్ష్యాది సకల జీవులకూ సూర్యుడే ఆత్మ స్వరూపుడు, సూర్యుడు చక్షురింద్రియానికి అధిష్ఠానదైవము.

భూమండలానికీ, ద్యుమండలానికీ మధ్యన అంతరిక్షమున్నది. అంతరిక్షం మధ్యనున్న సూర్యుడు, ఉత్తరాయణము, దక్షిణాయనముల మధ్య సంచరిస్తుంటాడు. నక్షత్రాలూ, గ్రహాలూ, సూర్యగమనాన్ని అనుసరిస్తూ శింశుమార చక్రంలో సంచరిస్తుంటాయి. ఎనిమిది వేల యోజనాల వలయాకారం గల మూడు రేఖలున్నవి. శింశుమార చక్రము మధ్యవలయంలో నుంటుంది.

మానసోత్తర గిరికి తూర్పున ఇంద్రుని పట్టణమైన దేవధాని, దక్షిణమున యముని పట్టణమైన సంయమని, పశ్చిమాన్న వరుణుని పట్టణమైన నిమ్లోచని, ఉత్తరాన కుబేరుని పట్టణమైన విభావరి ఉన్నవి. సూర్యుని రథానికి ఒక్క చక్రమే ఉంటుంది. ఆ రథము ఒక్క ఘడియలో 24 లక్షల 8 వందల యోజనాలు నడుస్తూ ఈ నాలుగు పట్టణాలచుట్టూ తిరుగుతుంది. దాని పేరు సంవత్సరము. ఈ రథాన్ని గాయత్రి మొదలైన ఏడు ఛందస్సులనే గుర్రాలు లాగుతాయి. అంగుష్ఠమాత్రులైన అరవైవేలమంది వాలఖిల్యులనే ఋషులు, దేవతలు, గంధర్వులు, అప్సరసలు మొదలైనవారంతా సూర్యుని స్తుతిస్తారు. సూర్యునితోపాటు గ్రహాలూ, నక్షత్రాలూ, జ్యోతిశ్చక్రంలో కనబడుతుంటాయి.

భగవానుడే లోకకల్యాణం గురించి సూర్యరూపాన్ని ధరించి, దర్శనమిస్తున్నాడు. సూర్యుడు వేదస్వరూపుడు. కాలాన్ని నియంత్రణం చేసేవాడు. భగవానుడు అంతరిక్షములో శింశుమారము అనే కాలచక్రంలోనుంటాడు.

చంద్రుని గమనమును బట్టి చాంద్రమానం ఏర్పడుతుంది. రెండు పక్షములు ఒక మాసము. చిత్త నక్షత్రముతో కూడిన పూర్ణిమ గల మాసము చైత్రమాసము అనబడుతుంది. సౌర మానానికి, చంద్రమానానికి పన్నెండు దినాల వ్యత్యాసం ఉంటుంది. సూర్యునకు ఒక్క సంవత్సర కాలము (మానవకాలమానం ప్రకారం) చంద్రునికి రెండు పక్షాలలో గడిచిపోతుంది. సూర్యుడు ఒక పక్షములో పయనించిన భాగాన్ని చంద్రుడు 30 ఘడియల్లో పయనిస్తాడు. చంద్రుడు జీవులకు పోషకుడు, మనస్సుకు అధిదేవత, అన్న స్వరూపుడు, ఓషధీశుడు.

చంద్రునికి మూడేసి లక్షల యోజనాలకు మీదుగా ఒక్కొక్క నక్షత్రమూ ఉన్నవి. (అవి, అభిజిత్తుతో సహా 28) సప్తర్షి మండలానికి 13 లక్షల యోజనాలపైన ధ్రువమండలం ఉన్నది. (ఉత్తరాషాఢ, శ్రవణం నక్షత్రాల నడుమ

అభిజిత్తు అనే ఒక నక్షత్ర మున్నది.) ఈ ధ్రువ మండలము ఒక ప్రసిద్ధమైన విష్ణుస్థానము. ధ్రువుడు కేంద్రముగా, గ్రహనక్షత్ర మండలాలన్నీ కల్పాంతం వరకూ పరిభ్రమిస్తుంటాయి.

సూర్యునికి పదివేల యోజనాలకు క్రింద రాహుగ్రహమున్నది. సూర్యునికి పన్నెండు వేల యోజనాలు మీద చంద్రమండలమున్నది. రాహుమండలానికి క్రిందుగా సిద్ధులు చారణులు, విద్యాధరులు నివసిస్తారు. వారి స్థానాలకు క్రిందుగా యక్షులు, రాక్షసులు, పిశాచ ప్రేత, భూతాలు ఉండే స్థానములుంటాయి. అదే అంతరిక్షము. వారికి గృహాలుండవు. అంతరిక్షానికి వంద యోజనాల క్రిందుగా భూలోకమున్నది.

**అధోలోకాలు:**

భూలోకానికి క్రిందుగా ఏడు అధోలోకాలున్నవి. ఇవి ఒక్కొక్కటీ పదివేల యోజనాల వెడల్పు, అంతే లోతు ఉంటాయి. ఇవి బిలస్వర్గాలనబడుతాయి. ఈ లోకాల్లోకూడా, కామ, భోగ, ఐశ్వర్యాలు స్వర్గలోక వాసుల్లాగానే అనుభవిస్తుంటారు. మాయలు తెలిసిన మయుడు ఆలోకాలలోని భవనాలను పట్టణాలను అద్భుతంగా నిర్మించాడు. అంతులేని కామభోగాలను అనుభవించడమే, ఆలోకవాసులవ్యాపకము. అక్కడ సూర్యరశ్మి ఉండదు. కనుక సర్పాల మణుల కాంతులే దేదీప్యమానంగా వెలుగుతుంటాయి. ఓషధులు, రసాయనాలూ సేవిస్తారు. కనుక వాళ్లకు వ్యాధులు, వార్ధక్యము ఉండవు. మానసిక బాధలుండవు. వారు భగవానుని సుదర్శన చక్రానికి భయపడతారు.

అతలలోకంలో మయుని పుత్రుడైన బలుడు, 96 విధాలైన మాయలను ప్రయోగించి, వినోదిస్తుంటాడు. దాని క్రిందనున్న వితల లోకములో శివుడు, హాటకేశ్వరునిగా భవానితో వినోదిస్తుంటాడు. అక్కడ హాటకీనదీ జలము వలన సువర్ణం తయారవుతుంది. అసురస్త్రీలకు ఆభరణాలుగా ఆ బంగారం పనికివస్తుంది. దానిక్రింద సుతల లోకంలో బలి చక్రవర్తి ఇంద్రునికంటె వైభవంగా పాలిస్తుంటాడు. విష్ణుమూర్తి అక్కడ ఆరాధ్యదైవమై ఆలోకాన్ని రక్షిస్తుంటాడు. తరువాతనున్నది తలాతలము. దీనికి మయుడు ప్రభువు, అతడు రాక్షసుల పట్టణాలను నిర్మించినట్టి శిల్పి. తలాతలాన్ని రుద్రుడు రక్షిస్తుంటాడు. తరువాత మున్నది మహాతలము. ఇక్కడ కద్రువ పుత్రులైన సర్పాలుంటాయి. కుహుడు, తక్షకుడు, కాళీయుడు, సుషేణుడు మొదలైన వారు వారిలో ముఖ్యులు. వీరికి గరుత్మంతుడంటే ప్రాణభయం. అందుకే బయటకు రారు. రసాతలంలో దైత్యులూ, దానవులూ అయిన హిరణ్య పురవాసులు, నివాత కవచులు, కాలకేయులు, ఉంటారు. వీరుమహాసాహసవంతులు, తేజస్సు కలవారు. శ్రీహరికి భయపడిఉంటారు. పాతాళలోకంలో ఎంతో తెలివైన నాగజాతి వాళ్లుంటారు. వాసుకి, శంఖుడు, కుళికుడు, ధనంజయుడు మొదలైన వారు మహానాగులు. వీరికి మణులతో మెరుస్తున్న అనేకమైన తలలుంటాయి.

పాతాళం అడుగున ఆదిశేషుడు 30 వేల యోజనాల స్థలంపై చుట్టుకొనియున్నాడు. అతనినే అనంతుడు, సంకర్షణుడు అంటారు. అతని తలపైన ఈ భూమండలం ఒక ఆవగింజంత పరిమాణంలో నిలిచి యుంటుంది. ప్రళయకాలంలో ఆదిశేషుడు ఏకాదశ రుద్రులను సృష్టించి, వినాశానికి నియోగిస్తాడు.

## నరకలోకము

ఓ పరీక్షిన్మహారాజా! నరకాలు మూడులోకాలకు చివరనున్నవి. దక్షిణదిశలో భూమి, అంతరిక్షాల నడుమ మహాభయంకరాలైన ఈ నరకాలున్నవి. ఇవి మొత్తముగా ముఖ్యమైనవి 28 ఉన్నవి. వాటి వివరాలివి:-

1. **తామిస్రము :** పరులధనమూ, బిడ్డలూ, కాంతలూ లాంటి వారిని అపహరించేవారు చేరే లోకమిది. ఇక్కడ పాశాలతో బంధించి, అన్నపానాదులు లేని చీకటిలో పడవేసి కర్రలతో కొట్టి బాధిస్తారు.

2. **అంధతామిస్రము :** పరస్త్రీయొక్క భర్తను వంచించి, ఆమెతో రమించేవారు ఇక్కడ పడుతారు. వారు, మతిచెడినవారై, అంధులై, ఒక్కొక్క అంగమూ ఖండింపబడినవారై, హింసింప బడుతారు.

**3. రౌరవము :** శరీరమే తాను అని నమ్మి, ఆశరీరాన్నీ, దానికి సంబంధించినవారినీ, పోషించాలనీ, సుఖపెట్టాలనీ, ఇతర ప్రాణుల్ని హింసిస్తూ, మోసగిస్తూ ఎవడు ప్రవర్తిస్తుంటాడో, అలాంటివాడు ఈనరకంలో పడుతాడు. ఇక్కడ, రురువు అనబడే వాడి కొమ్ములు గల క్రూర మృగాలచే పొడవబడి కరవబడి క్రుమ్మబడి హింసింపబడుతాడు.

**4. మహారౌరవము :** మాంస భక్షణం గురించి అనేకమైన జంతువుల్ని చంపి, తమ శరీరాల్ని పెంచుకొనదలచుకొనే వారు ఈ నరకంలో పడుతారు. ఇక్కడ కూడా రురువులే హింసిస్తాయి. పైగా ఈ పాపుల మాంసాన్ని పీక్కొని తింటాయి.

**5. కుంభీపాకము :** జంతువుల్ని, పక్షుల్ని, ఇతర జీవాలను సజీవంగా కాల్చి, తినేవారు ఈ నరకంలో పడుతారు. ఇక్కడ అలాంటివారిని, పెద్ద కుండలలో నూనెపోసి, వాటిలో పడవేసి ఉడికించుతారు.

**6. కాలసూత్రము :** తలిదండ్రులకూ, బ్రాహ్మణులకూ ద్రోహము చేసినవారు ఈ నరకంలో పడుతారు. ఇది వెయ్యి యోజనాల విస్తీర్ణంగల ఒక పెద్ద తావా (మూకుడు) లాగుంటుంది. క్రిందినుండి, మంటలవేడి, మీదినుండి సూర్యతాపముతో మండిపోతుంటే, ఈ పాపుల్ని, దానిపై కూర్చొనబెట్టి, దొర్లించి, పరుగెత్తించి ఆకలి దప్పులతో వేలాది సంవత్సరాల వరకు హింసిస్తారు.

**7. అసిపత్రవనము :** తనకు విహితమైన వేదమార్గాన నడవకుండా నాస్తికునిగా తిరిగేవాడు ఈనరకంలో పడుతాడు. కత్తులలాంటి వాడిగానున్న ఆకులుగల చెట్లతో నిండియున్న అరణ్యమిది. దానిలో పరుగెత్తుమని, కొరడాలతో కొడుతూ ఉంటారు. శరీరమంతా కోసుకొనిపోయి, రక్తం కారుతుంటే మూర్ఛపోయి, లేచి, మళ్లీ పరుగెత్తుతాడు.

**8. సూకరముఖము :** దండించే అధికారంగల రాజులూ, అధికారులూ, తప్పుచేయనివానిని శిక్షించినా, బ్రాహ్మణుని ప్రాణాలు పోయేటట్లు శిక్షించినా, ఈ నరకంలో పడుతారు. ఇక్కడ పందిమూతి వంటి సూది మూతిగల జంతువులు వారిని చెరుకుముక్కను నమలినట్లు నమలి పిప్పిచేస్తాయి.

**9. అంధకూపము :** నల్లులూ, దోమలూ, పేలూ లాంటి కీటకాలను చంపినవారు నూతిలాంటి అంధకూపములో పడవేయబడుతారు. అక్కడ ఈ క్రిములూ కీటకాలు రక్తం పీల్చి హింసిస్తాయి.

**10. క్రిమిభోజనము :** అతిథులకు, భూతాలకు, పితృదేవతలకు దేవతలకు అర్పించకుండా, తమకొరకే వండుకొని తినేవారు ఈ నరకంలోపడి ఆహారం ఏమీ దొరకక క్రిములచే కొరకబడి, ఆ క్రిములనే తింటుంటారు.

**11. సందంశము :** సద్బ్రాహ్మణుల ధనాన్ని దోచుకొన్నవారు ఈ నరకంలో కాల్చబడిన ఇనుప ఊచలతో హింసింపబడ్తారు.

**12. తప్తసూర్మి :** తనకు శాస్త్రోక్తంగా చెందిన భార్యతో తప్ప ఇతర స్త్రీలతో సంగమించే పురుషుని, అలాగే తనకు శాస్త్రోక్తంగా సంక్రమించిన భర్తతో తప్ప ఇతర పురుషులతో సంగమించిన స్త్రీనీ, ఈ నరకంలో ఎర్రగా కాలిన స్త్రీ విగ్రహాన్నీ, అలాగే ఎర్రగా కాగిన పురుష విగ్రహాన్నీ కౌగిలింపజేసి హింసిస్తారు.

**13. వజ్రకంటకశాల్మలి :** ధనకాంక్ష లోభముచేతనూ, శరీర పోషణ కోసమూ, చేయరాని పాపపు పనులను చేసేవారిని ఈ నరకంలో వేస్తారు. ఇక్కడ వజ్రాలవంటి వాడియైన ముళ్లుగల బూరుగుచెట్లుంటాయి. ఆ చెట్లెక్కుమనీ దిగుమనీ పదేపదే ఆజ్ఞాపిస్తూ కొట్టికొట్టి, రక్తాలు కారుతుండగా హింసిస్తారు.

**14. వైతరణి :** ధర్మరక్షణ చేయవలసిన రాజులూ, అధికారులూ, తమ విధులను అలక్ష్యం చేసి, ఉల్లంఘిస్తే, చీమూ, నెత్తురూ మలమూత్రమయమై, నరకం చుట్టూ ప్రవహిస్తున్న ఈ వైతరణీ నదిలో పడుతారు. వారిని భయంకరులైన రాక్షసగణాలు పీక్కొని తింటుంటారు.

**15. పుయోదము :** శిష్టాచార, నిత్యనైమిత్తిక కర్మలను మాని, తినరానివి తింటూ, నీచస్త్రీ సంగమం చేసే బ్రాహ్మణులువైతరణి వంటి ఈ సముద్రములోపడి హీనాతి హీనంగా కొట్టుకొంటారు.

**16. ప్రాణనిరోధము :** లోక రక్షణకు కాకుండా వినోదానికి వేటలు చేస్తూ జంతువుల్ని చంపేవారు, ఈ నరకంలో యమభటుల బాణాలచే కొట్టబడి, హింసింపబడుతారు.

**17. విశసనము :** కీర్తికోసమూ, ఇతరులను వంచించడం కోసమూ, యజ్ఞాలు చేస్తూ మృగాలను చంపేవారు ఈ నరకంలోపడి యమభటులచే హింసింపబడుతారు.

**18. లాలాభక్షము :** ప్రియురాలిచే వీర్యపానంచేయించేవారు ఇక్కడ హింసింపబడుతారు.

**19. సారమేయాదనము :** ఇంటికి నిప్పంటించడం, విషంపెట్టిచంపడం, దోచుకొనడం, రాజులు, రక్షకభటులు, ప్రజలను హింసించడం లాంటి పాపాలు చేసేవారు ఈ నరకంలో 720 కుక్కలచే కరవబడుతుంటారు.

**20. అవీచి :** అసత్యమాడడం, అబద్ధపు సాక్ష్యం చెప్పడం లాంటి పాపాలు చేసిన వారు, ఇక్కడ ఎత్తైన కొండల మీదనుంచి, మాటిమాటికి త్రోయబడుతారు.

**21. అయఃపానం :** యజ్ఞంలో సోమపానం చేసిన తరువాతనూ, వ్రతదీక్షలో నుండగానూ సురాపానం చేసిన వారి గొంతులలో కరిగిన ఇనుపద్రవం ఇక్కడ పోస్తారు.

**22. క్షారకర్దమము :** తమకు ఎలాంటి శ్రేష్ఠత్వమూ లేకపోయినా అహంకరించి, శ్రేష్ఠతగల యోగ్యులను అవమానించేవారు, ఇక్కడ కారపుకూపంలో పడవేయబడుతారు.

**23. రక్షోగణ భోజనము :** స్వార్థప్రయోజనాల గురించి, నరబలి, జంతుబలి ఇచ్చి క్షుద్రదేవతల నాశ్రయించేవారు, ఇక్కడ రాక్షసగణాలచే నానా హింసలు పొందుతారు.

**24. శూల ప్రోతము :** జంతువులకు ఉరిపన్ని, పట్టుకొని, వినోదిస్తూ, వాటిని చంపివేసేవారు, ఇనుప శూలాలకు గ్రుచ్చబడి, కాకులు, గ్రద్దలూ, వారిని పొడుచుకొని తినేటట్లు పారవేయ బడుతారు.

**25. దందశూకము :** ఇతరులను విషంలాంటి, శూలాలలాంటి మాటలతో హింసించేవారు, ఇక్కడ పాములచే కరిపింపబడుతారు.

**26. అవట నిరోధము :** గ్రుడ్డివారినీ, బలహీనులను, పసిపిల్లలను, గోతిలో పడేటట్లు చేసి, వినోదించేవారు, ఇక్కడ, విష, అగ్ని జ్వాలల్లో పడేవేయబడుతారు.

**27. అపర్యావర్తనము :** అతిథులు వచ్చారని, వారిపైన కోపగించుకొన్న గృహస్థులు, ఈ నరకంలో పడుతారు. గ్రద్దలు వాళ్ల కళ్లను పీకివేస్తాయి.

**28. సూచీముఖం :** ఇంటికి వచ్చిన పెద్దలను, గురువులను తమ ధనాన్ని అపహరించడానికి వచ్చిన తస్కరులుగా భావించి, తమ ముఖాలను దిగులుతో ముడుచుకొని, వ్యాకులపడే వ్యక్తులు ఈ నరకంలోపడి, ధనపిశాచంచే పీడింపబడి, యమ భటులచే దేహమంతా సూదిదారంచే కుట్టునేయబడుతారు. ఇంకా ఇలాంటి నరకాలెన్నో ఉన్నవి.

ఈ విధంగా, అనేక రకాలైన పాపకర్ములు, నరకాల్లోపడి, తమ దుష్కర్మల ఫలాన్ని అనుభవించి, కర్మశేషాలతో, మళ్లీ భూలోకంలో జన్మిస్తారు. అదేవిధంగా, పుణ్యాత్ములు, ఊర్ధ్వలోకాలకు వెళ్లి సుఖాలననుభవించి, కర్మశేషాలతో, మళ్లీ భూలోకంలో జన్మిస్తారు. అని, శ్రీశుక యోగీంద్రుడు పరీక్షిత్తుతో చెప్పాడు.

**హరిః ఓం తత్ సత్**

**పంచమ స్కంధము, సమాప్తం**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# షష్ఠస్కంధము

## శ్రీశుకవాణి: అజామిళోపాఖ్యానము

### నారాయణనామోచ్చారణమహిమ

శ్రీశుకమహర్షిని పరీక్షిత్తుడిలా అడిగాడు: "మహాత్మా! పాపకర్మలు చేసినవారు నరకాల్లో పడి అనేకమైన యాతనలననుభవిస్తారని మీరు చెప్పారు. పాపపరిహారానికి కొన్ని ప్రాయశ్చిత్తకర్మలు చేసి, నరక యాతనలనుండి తప్పించు కోవాలని అనుకొంటారు. మళ్లీ మళ్లీ పాపకర్మలు చేస్తూనే ఉంటారు. అలాంటి వారి గతి ఏమిటి?" అని అడుగగా శ్రీశుకుడు ఇలాగ బదులు చెప్పాడు: "రాజా! మానవుడు మనస్సుద్వారాను, వాక్కుద్వారాను, చేష్టలద్వారాను అనేకమైన పాపకర్మలను చేస్తుంటాడు. కాని, ప్రతికర్మకూ ప్రాయశ్చిత్తం చేసుకోవాలని అనుకోడు. ప్రతిపాపకర్మకూ ఒక ప్రాయశ్చిత్తకర్మ నిర్దేశింపబడి ఉంటుంది.దాని నాచరించడం ద్వారా ఆ ఒక్క పాపము మాత్రమే పరిహరింపబడుతుంది. అనేక జన్మల పాప సంచయాన్ని ప్రాయశ్చిత్తకర్మల ద్వారా నిశ్శేషంగా పరిహరింప జేయడం జరుగదు. అందుచేత మానవుడు పశ్చాత్తప్తమానసముతో, పాపరహితమైన ప్రవర్తన గలవాడై స్వధర్మాచరణ ద్వారా భగవద్భక్తి ద్వారా పాప సంచయాన్ని నశింపజేసుకోవాలి. భగవద్భక్తియే ఏకైక పాపమోచన సాధనము. నారాయణ పరాయణత్వములేని ఇతర సాధనలు ఫలించవు. కేవలం నారాయణ నామోచ్చారణ మాత్రాన ఒక మహాపాపి అయిన వ్యక్తి ఏవిధంగా రక్షింపబడ్డాడో తెలిపే ఒక ఉదంతం చెప్తాను, విను:

పూర్వము కన్యాకుబ్జము అనే పట్టణంలో అజామిళుడు అనే ఒక బ్రాహ్మణుడు ఉండెను. అతడు ఉత్తమ సంస్కారం గల సదాచారసంపన్నుడే అయినప్పటికీ, విధివశాన ఒక నీచ స్త్రీ యొక్క సంపర్కం ఏర్పడి, ధర్మభ్రష్టుడై, మహాపాపవర్తనుడైనాడు. తలిదండ్రులను, అనుకూలవతియైన భార్యను, విడిచి, కాముకియైన ఆ నీచస్త్రీతో కులుకుతూ, ఆమెతోనే ఉంటూ, పదిమంది కొడుకులకు తండ్రియై, తన తండ్రియొక్క ఆస్తినంతా ఈ కుటుంబ పోషణకే వెచ్చించి దరిద్రుడైనాడు. చివరకు జూదము, త్రాగుడు, దొంగతనాలు, దారిదోపిడీలు మున్నగువాటికి అలవాటుపడి, నికృష్టుడై, సంసారలంపటుడై జీవిస్తూవచ్చాడు. వృద్ధాప్యం వచ్చి, తలనెరిసి, దృష్టి క్షీణించి, దంతాలు రాలిపోయి, శక్తి ఉడిగి, రోగాలు ఆవరించి 88 ఏళ్ల వయస్సు గడిచినా ఆశావ్యామోహాల్లో మునిగితేలుతూ జీవితాన్ని నెట్టుకొచ్చేవాడు. అతనికి చిన్నకొడుకైన నారాయణునియందు మితిలేని వ్యామోహం ఉండెను. వానిని మాటిమాటికీ "నారాయణా! ఇలాగ రా" అని పిల్చేవాడు. వృద్ధుని అంత్య కాలం ఆసన్నమైనది. భయంకరాకృతితో యమకింకరులు అతని ఎదుటే తాండవించసాగారు. అతడు తన చిన్న కొడుకునుద్దేశించి, భయంతో "నారాయణా! నావద్దకు రా!" అంటూ కేక వేసి ప్రాణాలు విడిచాడు. "నారాయణా" అనే పిలుపు విని విష్ణుభృత్యులు అక్కడకువచ్చి, జీవుని తీసుకొని పోయే ప్రయత్నంలోనున్న యమదూతల్ని అడ్డుకొన్నారు. తమ విధినిర్వహణకు అడ్డుతగులుతున్న విష్ణుదూతలతో యమదూతలు ఇలాగన్నారు: "ఓ దివ్య పురుషులారా! మీరెవ్వరు? పీతాంబరములను, కిరీట కుండల భుజకీర్తులను ధరించి, విష్ణు మూర్తివలె మెరిసిపోతున్న మీరు ఈవిధంగా మా పనికి అంతరాయం కలిగిస్తున్నారెందుకు? మేము ఎవ్వరమో తెలిస్తే మీరు ఇలాంటి దుస్సాహసానికి పూనుకొనలేరు. సకలజీవరాశుల యొక్క జీవితాలను హరించివేయగల సాటిలేని శాసకుడైన యమధర్మరాజు యొక్క భృత్యులము మేము. మా

పనికి అడ్డుపడి, మా ప్రభువు యొక్క ఆగ్రహానికి మీరు గురికావద్దు. మీ దారిని మీరు పొండి" అని చెప్పిన యమదూతలతో విష్ణు దూతలు ఇలా అన్నారు: ఓయమదూతలారా! ధర్మదేవత భృత్యులమని చెప్పుకొంటున్న మీకు ధర్మముగురించి ఏమీ తెలిసినట్లులేదే! తెలిస్తే చెప్పండి. ఎలాంటి వారు దండనార్హులు? వారిని ఎలాగ శిక్షించాలి? చెప్పండి" అనగా యమదూతలు ఈవిధంగా చెప్పనారంభించారు: "అయ్యలారా! వినండి: వేదాలచే నిర్దేశింపబడినదే ధర్మము. వేదము సాక్షాత్తూ నారాయణుడే. వేదవిహితము కాని నిషిద్ధకర్మాచరణమే అధర్మము. స్వధర్మాచరణ చేయక పోవడం అధర్మము. ప్రతీజీవీ చేసే కర్మలకు సూర్యుడు, అగ్ని, ఆకాశము, వాయువు, చంద్రుడు, గోవులు, సంధ్యలు, పగలు, దిక్కులు, జలము, భూమి, కాలము, ధర్మము అనేవి ప్రత్యక్ష సాక్షులు. దుష్కర్మలు చేసేవారు తగువిధంగా దండన పొందుతారు. ప్రతిజీవి సత్కర్మలూ దుష్కర్మలూ ఏవో కొన్ని చేస్తూ ఉంటుంది. దుష్కర్మలకు దండన, సత్కర్మలకు సత్ఫలితాలను అనుభవించవలసి యుంటుంది. రాబోవు జన్మలు కూడ వెనుకటి జన్మలలో చేయబడిన కర్మలచే నిర్ణయింపబడుతాయి. ఈ విధంగా జన్మ పరంపరలతో కూడిన సంసారమేర్పడుతుంది. అజ్ఞానముచేత మానవుడు ఈ శరీరమేశాశ్వతమనీ, దానిని సుఖపెట్టడమే పురుషార్థమనీ, భావిస్తూ కర్మలు చేస్తూ వాటిచే బంధింపబడుతాడు. ఓ వైకుంఠవాసులారా! మాకు తెలిసిన కొలదిపాటి విషయాలు మీకు చెప్పాము. ఇక ఈ అజామిళుని గురించి వినండి: ఇతడు వేద శాస్త్రాధ్యయనం చేసియున్న సదాచార సంపన్నుడైన సద్బ్రాహ్మణుడు. పెద్దలయందు, గురువులయందు భక్తిశ్రద్ధలు కలవాడు. సకల సద్గుణాలూ కలవాడు. ఒకనాడు అతడు అడవినుండి సమిధలు, పుష్పాలూ కోసుకొని వస్తుండగా, ఒక పొదమాటున ఒక శృంగారదృశ్యాన్ని చూచాడు. ఒక నీచస్త్రీ తన ప్రియునితో తనివితీరని కామకేళిలో ఒడలు మరచి పొరలుతుండడం చూచాడు. యౌవనంలోనున్న ఈ బ్రాహ్మణయువకుడు, చలించిపోయి కామోపహతుడైనాడు. నిత్యనైమిత్తిక కర్మలను విడిచి, ముసలి తలిదండ్రుల్నీ, సుందరియు, సుశీలయుఐన భార్యను విడిచి, ఆ నీచ స్త్రీతోనే కులుకుతూ బిడ్డల్ని కని, వారి పోషణకై అనేకమైన దారుణ కృత్యాలను చేస్తూ భ్రష్టుడైనాడు. ఈ మహాపాపిని తగురీతిని శిక్షించాలని మా ప్రభువుయొక్క ఆజ్ఞ. దానిని మేము నెరవేర్చాలి" అని చెప్పిన యమదూతలతో విష్ణుసేవకులు ఇలాగ చెప్పారు:

"ఓ యమదూతలారా! మీరు చెప్పినట్లు పాపకర్మలు చేసిన వారు శిక్షింపబడాలి. నిజమే! కాని ఒక్క ధర్మ సూక్ష్మాన్ని మీరు విస్మరించారు. ఈ జీవుడు అవసానదశలో ఉచ్చరించిన ఆ "నారాయణ" శబ్దముచే అతని గతించిన కోటిజన్మల పాపసంచయము భస్మమైపోయినది. అతడు ఇప్పుడు పాపరహితుడు, పరిశుద్ధుడు అయినాడు. 'అతడు నారాయణుని స్మరించలేదు, తన పుత్రునే పిలిచినాడు.' అని మీరు అనవచ్చు. అయిననూ నారాయణ నామోచ్చారణ మహిమ మీకు తెలియదు వినండి:

**సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలన మేవవా ।**
**వైకుంఠనామగ్రహణం అశేషాఘహరం విదుః ॥**
**పతితః స్ఖలితః ఛిన్నః సందష్టః తప్త ఆహతః ।**
**హరిరిత్యవశేనాహ పుమాన్ నాఽర్హతి యాతనాం ॥**

పేరుపెట్టి (సైగచేసి) పలికినా, పరిహాసంగా పలికినా, వెక్కిరిస్తూ హేళనగా పలికినా, ఊత పదంగా పలికినా, ఏ విధంగానైనా భగవన్నామాన్ని ఉచ్చరిస్తే పాపాలన్నీ నిశ్శేషంగా నశించిపోతాయి. పైనుండి పడినప్పుడు గాని, కాలుజారినప్పుడు గాని, అంగము విరిగినప్పుడు గాని, పాము, తేలు లాంటివి కరచినప్పుడు గాని, ఒళ్లు కాలినప్పుడు గాని, జ్వరతీవ్రతలో గాని, దెబ్బతగిలినప్పుడు గాని, అమ్మో బాబోయ్ అని అరిచేబదులు, శ్రీహరీ, కేశవా, నారాయణా లాంటి భగవన్నామాలను స్మరిస్తే, యాతనననుభవించవలసి యుండదు.

ఔషధము యొక్క గుణము తెలిసి సేవించినా, తెలియక సేవించినా అది పనిచేస్తుంది కదా! అలాగే భగవన్నామమును అనుకోకుండా ఉచ్చరించినా పాపాలు శమించి పోతాయి. అంత్యకాలంలో నారాయణ నామస్మరణం

పూర్వజన్మల సుకృతం ఉంటేగాని చేయలేరు కదా! అందుచేత ఈ జీవిని శిక్షించడానికి మీరు తీసుకొనివెళ్లరాదు. కావాలంటే ఈ ధర్మసూక్ష్మాన్ని మీ ప్రభువైన యమధర్మరాజు నడిగి తెలుసుకోండి" అని చెప్పిన విష్ణుదూతల మాటలను విని సంతసించి, యమదూతలు నిష్క్రమించారు.

అజామిళుడు యమపాశంనుండి విడువడినవాడై, స్పృహను పొంది విష్ణుదూతలకు నమస్కరించగా వారు అంతర్ధానమయ్యారు. సర్వపాపాలూ తొలగిపోయిన అజామిళుడు దేవదూతలూ యమదూతలూ చెప్పుకొన్న మాటలను మననం చేసుకొని, నారాయణ నామ మహిమను గూర్చి తెలుసుకొన్నాడు. అతని మనోబుద్ధులు నిర్మలమై, నిశ్చలమై భక్తి పూరితమైనవి. తాను పశ్చాత్తాపంతో శ్రీమన్నారాయణునికి శరణాగతుడైనాడు. అతనికి జ్ఞానోదయం కలిగినది. హరిభక్తులతోనూ సత్పురుషులతోనూ సాంగత్యం చేశాడు.

క॥ హరిభక్తులతో మాటలు ధరనెన్నడు చెడని పుణ్యధనములమూటల్
వరముక్తికాంతతేటలు నరిషడ్వర్గంబు చొరని యరుదగుకోటల్

సంసార బంధాలన్నీ తొలగించుకొని, అతడు హరిద్వారానికి పోయి, యోగాన్ని అభ్యసించి, పరమాత్మను చేరాడు. పరమ పాపాత్ముడైనమా, నారాయణ నామ స్మరణచే పరమ పదాన్ని పొందవచ్చునని ఈ అజామిళుని చరిత్ర నిరూపిస్తుంది.

విష్ణుదూతలచేత భంగపడిన యమదూతలు పోయి, యమునికి సర్వమూ విన్నవించి, ఇలాగ అడిగారు:

"ప్రభూ! జీవులకు వారివారి కర్మలననుసరించి శిక్షించే ప్రభువు నీవొక్కడవే అని మా విశ్వాసము. అయితే మరి నీ ఆజ్ఞను ధిక్కరించి, దానిని వమ్ము చేయగల శక్తి ఆ నలుగురు దివ్యపురుషులకు ఎలాగ వచ్చినది? నీకు పై అధికారి ఎవ్వరైనా ఉన్నారా?" అనగా విని, దండధరుడు ఇలాగ చెప్పాడు: "అవును, నేన్నకాదు. ఈ విశ్వమంతటినీ శాసించే ఏకైకనాథుడొకడున్నాడు. ఆయనే శ్రీమన్నారాయణుడు. నాతో సహా బ్రహ్మాది దేవతలూ, సమస్త జీవరాసులూ ఆయన మాయకు లోబడి, ఆయన యొక్క లీలా విలాసముచే సృష్టింపబడినవే. ఆయనలోనే సమస్త సృష్టి ఇమిడియున్నది. వస్త్రములో దారమువలె అంతటా ఆయన వ్యాపించియున్నాడు. ఆయన యొక్క మాయాశక్తినీ, వైభవాన్నీ బ్రహ్మరుద్రాదులు సైతమూ ఎరుగలేరు. నేను ఆయననే ఎల్లప్పుడూ ధ్యానిస్తుంటాను. ఆయననామాన్ని స్మరించినంతనే సకల కర్మబంధాలూ వీడిపోతాయి. శివుడు, బ్రహ్మ, నారదుడు, సనత్కుమారుడు, కపిలుడు, మనువు, భీష్ముడు, బలి, జనకుడు, వ్యాసుడు, శుకుడు మాత్రమే వైష్ణవ తత్త్వాన్ని కొంతవరకు తెలుసుకొన్నవారు. నాయనలారా! నారాయణ నామ మాహాత్మ్యాన్ని మీరే కదా ప్రత్యక్షంగా చూచి తెలుసుకొన్నారు. భగవానునియందు భక్తి కలిగియున్న వానిని దండించే అధికారము నాకులేదు. నామ మాహాత్మ్యాన్ని గురించి విని యున్ననూ, బుద్ధి హీనులైనవారు దానిని అలక్ష్యం చేసి, సంసార వలయంలో చిక్కుకొంటున్నారే గాని, సులువైన ముక్తిమార్గాన్ని అనుసరించరు. తెలిసో తెలియకో నిప్పును ముట్టుకొన్నా, ఔషధాన్ని మ్రింగినా, దాని ఫలితం అనుభవించాలికదా! అలాగే భక్తితోగాని, భక్తిలేకుండాగాని, ద్వేషముచేగాని, తెలిసిగాని, తెలియకగాని భగవన్నామ స్మరణంచేస్తే, దాని ఫలితం తప్పకుండా కలుగుతుంది. అందుచేత ఇకముందు మీరు ఇలాంటి పొరపాటు చెయ్యవద్దు. లౌకిక వ్యాపారాల్లో మునిగిపోయి, తాను, తన ఇల్లు, పరివారమూ, సంపదలే సర్వస్వమని భావించి, భగవన్నామాన్ని ఉచ్చరించనివారు, భగవద్గాథలను వినడానికి ఇష్టపడనివారు, భగవానుని ఆరాధించనివారు, దండనార్హులుగనుక, అట్టివారినే ఇక్కడికి తీసుకొనిరండు. మీవలన జరిగిన ఈ పొరపాటును సైరించుమని నేను ఆదేవదేవుని ప్రార్థిస్తున్నాను" అని యముడు తన భటులకు ఉపదేశమిచ్చాడు.

పరీక్షిత్తుతో శ్రీశుకుడు ఇంకా ఇలాగ చెప్పాడు: "రాజా! మలయపర్వతం మీద అహర్నిశలూ, ఆ శ్రీహరినే ధ్యానిస్తూ ఉండే అగస్త్యమహాముని నాకు ఈ రహస్యాన్ని చెప్పాడు. అనేకజన్మల పాపసంచయం పరిహారం కావాలంటే, ఆ శ్రీహరి నామజపమే ఏకైక సాధనము." అని.

# దక్షప్రజాపతివంశవిస్తరణ

సృష్టివిస్తరణ గురించి ఇంకా వివరించవలసినదిగా కోరిన పరీక్షిత్తుతో శ్రీశుక బ్రహ్మ ఇలాగ చెప్పాడు:-

ప్రాచీనబర్హి పుత్రులైన పదిమంది ప్రచేతసులు సముద్ర గర్భంలో కొన్నివేల సంవత్సరాలు తపస్సు చేసి, పైకిలేచివచ్చి చూచేసరికి పాదము పెట్టడానికైనా సందులేకుండా, భూమి అంతా పొదలతోనూ వృక్షాలతోనూ నిండి ఉన్నది. వారికి పట్టరానంత కోపం వచ్చేసినది. ఆ కోపాగ్నికి వృక్షాలు, లతలూ, పొదలూ, కాలిపోసాగినవి. అప్పుడు, ప్రమాదాన్ని గుర్తించిన ఓషధీపతి (చంద్రుడు) ప్రత్యక్షమై, వారిని శాంతింపజేసి, ఇలా అన్నాడు: "మహానుభావులారా! మీరు ప్రజాపతులై ప్రజోత్పత్తిని విస్తరింపజేయడానికై మిమ్మల్ని భగవంతుడు నియమించాడు కదా! వనస్పతులు, వనాలూ ప్రజల మనుగడకు ఎంతో అవసరం. దేవతల ఆహారమైన హవిస్సు, ఇషము, పితృదేవతల ఆహారమైన ఊర్జము, ఈఓషధులు వనస్పతుల నుండే లభిస్తాయికదా! అందుచేత మీరు శాంతించి, మీ క్రోధాగ్నిని ఉపశమింపజేసి, ఈ వనాలను రక్షించండి. మీ గురించి నేనొక చక్కని కానుకను భద్రపరచి ఉంచాను. దానివలన మీకు సకల సౌఖ్యాలూ చేకూరుతాయి. ఇదిగో ఈమెయే ఆ కానుక. ఈ కన్యపేరు మారిష. ఈమె కండు మహర్షికీ, ప్రమ్లోచన అనే అప్సరసకూ పుట్టినది. ఈమెను నేను పోషించి పెంచాను. ఈ వన దేవతను మీరు భార్యగా స్వీకరించి ఆనందించండి" అని చెప్పి, ఆమెను వారికి అప్పజెప్పి, సోముడు నిష్క్రమించాడు. వారికి శ్రీహరి చెప్పిన వాక్కులు జ్ఞప్తికి వచ్చాయి. (చతుర్థ స్కంధము). పదిమంది ప్రచేతసులు, మారిషను శాస్త్రోక్తముగ వివాహమాడి, సకల సుఖాలూ అనుభవించారు. కొన్నాళ్లకు బ్రహ్మదేవునితో సమానుడైన పుత్రుడు జన్మించగా, అతనిని దక్షుడన్నారు. సతీదేవి తండ్రి అయిన దక్షప్రజా పతి మళ్లీ మారిషయందు జన్మించాడు. అతడు ముల్లోకాలనూ తన మానససంతానంతో నింపివేశాడు. ఖేచరులూ, భూచరులూ, వనచరాలూ, జలచరాలూ, నిశాచరులూ, దినచరులూ అందరూ అతనియొక్క మానస సంతతివారే. కాని, అతనికి సంతుష్టి కలుగలేదు. అతడు వింధ్యపర్వత సానువుల్లో అఘమర్షణం అనే తీర్థంలో రోజూ స్నానం చేస్తూ, శ్రీమన్నారాయణుని గురించి తపస్సుచేసి, ఆయన సాక్షాత్కారాన్ని పొందాడు. దక్షుడు హంస గుహ్యస్తోత్రముతో ఆయనను స్తుతించి సంతసింపజేశాడు. సర్వేశ్వరుడూ, సర్వాత్ముడూ, సర్వాంతర్యామీ అయిన ఆ శ్రీమహావిష్ణువు ప్రసన్నుడై, గరుడవాహనుడై, తనయొక్క సమస్త పరిచారక బృంద సమేతుడై దక్షప్రజాపతికి దర్శనమిచ్చాడు. దక్షుడు ఆనందసంభ్రమంతో స్వామికి సాష్టాంగ దండ ప్రణామం చెయ్యగా, శ్రీహరి ఇలాగన్నాడు: "దక్షప్రజాపతీ! సృష్టిని కొనసాగించాలనే కోరికతో నీవు చేసిన తపస్సు ఫలించినది. పంచజన ప్రజాపతి పుత్రిక అయిన అసిక్నిని నీవు వివాహమాడి, ఆమెద్వారా బిడ్డలను కని, ప్రజోత్పత్తిని కొనసాగించు. ఇకనుండి స్త్రీపురుష సంయోగము చేతనే సృష్టివిస్తరణ జరుగుతుంది." అని చెప్పి అంతర్ధానమైనాడు.

దక్షునకు అసిక్నియందు హర్యశ్వులు అనబడే పదివేలమంది పుత్రులు జన్మించారు. వారు తండ్రి ఆజ్ఞ ప్రకారము ప్రజాసృష్టిగురించి తపస్సు చేయదలచి, సింధునది సాగరసంగమంవద్దనున్న నారాయణ సరస్సు ప్రాంతంలో ఆసీనులైనారు. ఒకనాడు నారదుడు వారివద్దకు వచ్చి, ఇలా అన్నాడు: "నాయనలారా! మొట్టమొదట సృష్టిరహస్యము తెలుసుకొనకుండా సృష్టికార్యాన్ని మీరు ఎలాగ చేపట్టగలరు? ఆత్మస్వరూపుడైన పురుషుడు సర్వాంతర్యామియై యున్నాడు. మాయారూపిణి అయిన ప్రకృతి స్త్రీస్వరూపిణియై యున్నది. పురుషుడు ప్రకృతికి లోబడి సంసారియై చిక్కుకొన్నాడు. ఈ ప్రకృతి పురుషుల విలాసంగురించి మీరు బాగా యోచించండి" అని చెప్పి, నారదుడు నిష్క్రమించాడు. నారదుని వాక్కులపై హర్యశ్వులు బాగా తర్కించుకొని, ఈవిధంగా విశ్లేషించుకొన్నారు:- సమస్తలోకాలకూ సృష్టిస్థితి లయకర్త అయిన ఆ సర్వేశ్వరుని దర్శించలేకపోతే, బ్రహ్మదేవునికి కూడా మోక్షములభించదు. ప్రయోజనంలేని కర్మలనాచరిస్తూ, సంతతులను సృష్టిస్తూ, సంసారకూపంలో కొట్టుకొంటూ, నిజ – ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొనలేక అజ్ఞానాంధకారంలో పడియుండడం విజ్ఞతకాదు" అని ఆలోచించినవారై వారు నివృత్తిమార్గాన్ని ఎన్నుకొని మోక్షకాములై పోయారు. ఈ విషయం నారదుడు దక్షునికి చెప్పగా అతడు ఖిన్నుడై బ్రహ్మదేవునకు చెప్పుకొన్నాడు. బ్రహ్మదేవుడు అతనిని ఓదార్చి, మళ్లీ సంతానాన్ని పొందుమన్నాడు. అసిక్నికి,

మళ్లీ పదివేలమంది పుత్రులు పుట్టారు. వారు శబలాశ్వులు అనబడ్డారు. వాళ్లు కూడ తండ్రి ఆదేశము ప్రకారము, సంతానాపేక్షతో, తమ అన్నలు వెళ్లిన నారాయణ సరస్సు వద్దకే వెళ్లి తపస్సు చేయనారంభించారు. మళ్లీ నారదుడు వెళ్లి "నాయనలారా! మీరు కూడ, మీ అన్నలవలెనే జ్ఞానవంతులై, ఈ సంసార కూపంలో పడిపోకుండా, మిమ్మల్ని మీరు రక్షించుకొని, మోక్షమును పొందండి" అని ఉపదేశించి, వెళ్లిపోయాడు. వీరు కూడ, తమ అన్నలవలెనే నివృత్తిమార్గాన్నవలంబించి మోక్షకాములైనారు. ఈ విషయం తెలుసుకొని, దక్షప్రజాపతి మిక్కిలి దుఃఖించిన వాడై నారదునిపై పట్టరాని ఆగ్రహావేశముతో ఈ విధంగా శపించాడు:- "నారదా! పసివారైన నా బిడ్డలను పెడమార్గం పట్టించి, మా వంశానికి ఋషిఋణం, దేవఋణం, పితృఋణం తీర్చుకొనే అవకాశం లేకుండాచేసినందుకు నిన్ను శపిస్తున్నాను. నీవు ఉత్తములైన భగవద్భక్తుల మధ్య,సిగ్గుమాలిన వాడవై తిరుగుతూ అపహసింపబడుతూ ఎక్కడా నిలుకడలేని లోక సంచారివి అగుదువు గాక!" అని శపించాడు. నారదునికి ఒకించుకైననూ బాధ అనిపించలేదు. మందహాసంతో నారాయణ నామ కీర్తన చేసుకొంటూ వెళ్లిపోయాడు.

దుఃఖిస్తున్న దక్షుని బ్రహ్మదేవుడు ఓదార్చి ఆశీర్వదించి, మళ్లీ సంతానం పొందుమన్నాడు. ఈసారి అసక్ని అరవైమంది పుత్రికలను కన్నది. వీరంతా అతిపుణ్యవతులై, పరమసాధ్వీమతల్లులై విలసిల్లారు. వీరియందే ముల్లోకాల సంతతులూ ఉద్భవించాయి. వీరికి యుక్తవయస్సు రాగానే దక్షుడు వివాహాలు చేశాడు! ధర్మునకు పదిమందినీ, కశ్యపునికి పదముగ్గురినీ, చంద్రునకు ఇరవై ఏడుగురినీ, తార్క్ష్యునకు నలుగురినీ, భూతునకూ, అంగిరసునికీ, కృశాశ్వునికీ, ఇద్దరిద్దరినీ ఇచ్చి వివాహాలు చేశాడు.

**ధర్మునిసంతతి :** ధర్ముని భార్యలైన పదిమంది దక్షపుత్రికలు సంతానవతులైనారు.

**భానువుకు** - వేద ఋషుడు, అతనికి ఇంద్రసేనుడు పుట్టారు.

**లంబకు** - విద్యోతుడు, అతనికి స్తనయిత్నువులూ కలిగారు.

**కకుబ్‌దేవికి** - సంకటుడు, అతనికి కీటకుడు, అతనికి, దుర్గాభిమానులైన దేవతలూ పుట్టారు.

**జామిదేవికి** - కోటలకు అధిష్ఠాన దేవతలునూ, వారికి స్వర్గుడు, నంది పుట్టారు.

**విశ్వకు** - విశ్వేదేవతలు పుట్టారు. వీరికి సంతానం కలుగలేదు.

**సాధ్యకు** - సాధ్యులు పుట్టారు. వీరికి అర్థసిద్ధి పుట్టాడు.

**మరుద్వతికి** - మరుద్వంతుడూ, జయంతుడూ కలిగారు. జయంతుడు వాసుదేవాంశతో జన్మించి, ఉపేంద్రునిగా ప్రసిద్ధికెక్కాడు.

**ముహూర్తకు** - మౌహూర్తికులు అనబడే ముహూర్త - అధిదేవతలు కలిగారు.

**సంకల్పకు** - సంకల్పుడు, అతనికి కాముడూ పుట్టారు.

**వసువునకు** - అష్టవసువులు జన్మించాడు. వారిపేర్లు: ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వసువు, విశ్వావసువు. ద్రోణుని భార్య అభిమతి. ఆమెకు, హర్ష, శోక, భయములనబడే పుత్రులు కలిగారు. ప్రాణుని భార్య ఊర్జస్వతి. ఆమెకు సహుడు, ఆయువు, పురోజనుడు కలిగారు. ధ్రువుని భార్య ధరణి. ఆమెకు పురాభిమాన దేవతలు పుట్టారు. అర్కుని భార్య వాసన, ఆమెకు తర్షుడు మొదలైన కుమారులు కలిగారు. అగ్నికి వసుధార వలన ద్రవిణాదులూ, కృత్తికయందు స్కందుడు, స్కందునకు విశాఖాదులూ జన్మించారు. దోషుని భార్య శర్వరి. ఆమెకు శ్రీహరి అంశతో శింశుమారుడు కలిగాడు. వసువు భార్య అంగీరస. ఆమెకు దేవతల శిల్పి అయిన విశ్వకర్మ జన్మించాడు. విశ్వకర్మ పుత్రుడు చాక్షుషమనువు. అతనికి విశ్వులు, సాధ్యులు పుట్టారు. విభావసువు (విశ్వావసువు) భార్య ఉష, ఆమెకు వ్యుష్టుడు, రోచి, ఆతపుడు పుట్టారు. ఆతపునకు దినాధిదేవత అయిన పంచయాముడు పుట్టాడు.

**భూతునిసంతతి :** దక్షపుత్రికలైన సురూప, ఆమె చెల్లెలు, భూతుని (రుద్రుని) భార్యలైనారు. సురూపకు

ఏకాదశ రుద్రులతో సహా అనేకమైన రుద్రగణాలూ, ఆమె చెల్లెలికి పదకొండుగురు రుద్ర పారిషదులు, ప్రేతాది భూతనాయకులూ పుట్టారు.

**అంగిరసునకు** (దక్షపుత్రికలైన) స్వధరయందు పితృదేవతలూ, సతియందు అధర్వాంగిరసుడనే వేదాభిమాని పుత్రులై జన్మించారు.

**కృశాశ్వునకు** (దక్షపుత్రికలైన) అర్చియందు ధూమ్రకేతువూ, ధిషణయందు వేదశిరుడు, దేవలుడు, వయునుడు, మనువు పుట్టారు.

**తార్క్ష్యునకు** (దక్షపుత్రికలైన) వినత, కద్రువ, పతంగి, యామిని అనే నలుగురు భార్యలుండిరి. వినతకు గరుత్మంతుడూ, సూర్యసారథియైన అనూరువు అనబడే అరుణుడూ జన్మించారు. కద్రువ నాగులనూ, పతంగి, పక్షులనూ, యామిని, మిడుతలనూ కన్నారు.

**చంద్రునకు** అశ్విని మొదలైన 27గురు దక్షపుత్రికలు భార్యలు. అతనికి రోహిణి యందు ప్రత్యేకాభిమానము, ఇతర భార్యలయందు ఉపేక్ష ఉండడంచేత దక్షుడు అతనిని శపించాడు. దానివలన చంద్రునకు క్షయరోగము, సంతానములేమి సంభవించాయి.

కశ్యపుని సంతతి : అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ట, సురస, ఇళ, ముని, క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి, అనబడే పదముగ్గురు దక్షపుత్రికలు కశ్యపుని భార్యలు. తిమి అనే ఆమె తిమింగలాది జలచరాలను కన్నది. సరమకు వ్యాఘ్ర శునకాది జంతువులు కలిగినవి. సురభికి గోవులూ మొదలైన చీలిన గిట్టలుగల జంతువులు జన్మించినవి. తామ్రకు డేగలు, గ్రద్దలూ లాంటి పక్షులు పుట్టినవి. మునికి అప్సరసలు జన్మించారు. క్రోధవశకు భయంకర సర్పాలు పుట్టినవి. ఇళకు వృక్ష జాతులు పుట్టినవి. సురసకు రాక్షసులూ, అరిష్టకు గంధర్వులూ పుట్టిరి. కాష్ఠకు చీలని గిట్టలుగల గుఱ్ఱములు మొదలైనవి కలిగినవి. దనువుకు పుట్టినవారు దానవులనబడ్డారు. ఆమెకు 61 మంది జన్మించారు. వారిలో 18మంది ముఖ్యులు. వారిపేర్లు ఇవి:- ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసువు, అయోముఖుడు, శంఖశిరుడు, స్వర్భానువు, కపిలుడు, అరుణుడు, వృషపర్వుడు, లోముడు, ఏకచక్రుడు, అనుతాపకుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తుడు, దుర్జయుడు అనువారు. వారిలో స్వర్భానువు కుమార్తె సుప్రభను నముచి పెండ్లాడాడు. వృషపర్వుని కుమార్తెయైన శర్మిష్ఠను, నహుషుని కుమారుడైన యయాతి పెండ్లి చేసుకొన్నాడు.

దనువు తనయుడైన వైశ్వానరునకు, ఉపదానవి, హయశిర, పులోమ, కాలక అనే కుమార్తెలు కలిగారు. ఉపదానవిని హిరణ్యాక్షుడూ, హయశిరను క్రతువూ పెండ్లాడారు. పులోమ, కాలకలను, బ్రహ్మదేవుని ఆదేశం ప్రకారం, కశ్యపుడు పెండ్లి చేసుకొన్నాడు. పులోమకు పౌలోములూ, కాలకకు కాలకేయులూ పుట్టారు. వీరు యుద్ధము చేయడంలో నేర్పరులు. నివాత కవచులు అని కూడా పిలునబడే ఈ దానవులు యజ్ఞాలకు విఘ్నాలు కలిగిస్తూ దేవతలతో యుద్ధాలు చేసేవారు. ఇంద్రుని కోరికపై మీతాత అయిన అర్జునుడు, వీరితో పోరాడి ఓడించాడు.

విప్రచిత్తుడు సింహిక అనే భార్యయందు నూట ఒక్కమంది దానవులను కనెను. వారిలో పెద్దవాడు, రాహువు. మిగిలిన నూరుమందీ కేతువులు. ఈ రాహునే అమృతం చవిచూచి అమరుడై, ఒక గ్రహంగా నిలిచిపోయాడు.

ఇక అదితి సంతానం గురించి విను. సాక్షాత్తూ నారాయణుడే ఆ పవిత్రమాతృమూర్తి గర్భాన ఉదయించినాడు. ఆమెకు వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట, సవిత, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శుక్రుడు, ఉరుక్రముడు అనబడే ద్వాదశ ఆదిత్యులు జన్మించారు. ఈ ఉరుక్రముడే వామనుడు, త్రివిక్రముడు అనబడే నారాయణుడు. వివస్వంతునకు సంజ్ఞ అనే భార్యయందు శ్రాద్ధదేవుడు జన్మించాడు. ఇతడే వైవస్వత మనువయ్యాడు. సంజ్ఞాదేవికి యముడు, యమి అనే కవలలు కలిగారు. ఆమె గుఱ్ఱం రూపం ధరించి, అశ్వినీదేవతలను కన్నది. వివస్వంతునికి ఛాయాదేవియందు శనైశ్చరుడు, సావర్ణి అనే మనువు, తపతి అనే పుత్రిక పుట్టారు. తపతిని

సంవరణుడు పెండ్లాడాడు. అర్యమునకు మాతృకయందు కర్మానుష్ఠాన పరులైన చర్షణులు కలిగారు. పూషునికి సంతతిలేదు. త్వష్ట, దైత్యుల చెల్లెలైన రచన (ప్రవచ)ను పెండ్లి చేసుకొని మహాబలశాలి, బుద్ధిమంతుడు అయిన విశ్వరూపుని కన్నాడు. అతడు బృహస్పతి స్థానంలో దేవ పురోహితుడయ్యాడు.

## విశ్వరూపుడు

దేవగురువైన బృహస్పతి స్థానంలో త్వష్టపుత్రుడైన విశ్వరూపుడు దేవగురువు అవడం ఎలాగ సంభవించింది? అని అడిగిన పరీక్షిత్తుతో శ్రీశుకుడు ఇలాచెప్పాడు:

సాటిలేని అధికారమూ, ఐశ్వర్యమూ తనకే ఉన్నాయి కదా అనే అహంకార గర్వమదాంధుడైయున్న ఇంద్రుడు ఒకనాడు కొలువు తీర్చియుండగా, వసువులు, రుద్రులు, మరుత్తులు, గంధర్వులు, మునులూ స్తుతిస్తూ ఉండగా, అప్సరసలు ఆడుతూ పాడుతూ ఉండగా, దేవతల గురువూ, బుద్ధిభూషణుడూ, పూజనీయుడూ అయిన బృహస్పతి ప్రవేశించాడు. శిష్టాచారము ప్రకారము లేచి నిల్చొని, ఎదురేగి, గురుదేవుని ఆహ్వానించడానికి బదులు ఇంద్రుడు సింహాసనం నుండి లేవనైనా లేవకుండా, గురువు గారిని అలక్ష్యంగా ఉపేక్షచేశాడు. పరిస్థితిని గ్రహించిన బృహస్పతి ఖిన్నుడై చల్లగా వెళ్లిపోయాడు. తెలివి తెచ్చుకొన్న ఇంద్రుడు తాను చేసిన గురుద్రోహాన్ని తెలుసుకొని, సిగ్గుపడి, వెంటనే వెళ్లి క్షమాభిక్షను కోరడానికై గురుగృహానికి వెళ్లినా ఆయన ఎక్కడా కనిపించలేదు.

దేవగురువు కనిపించడం లేదనే వార్తను తెలుసుకొన్న అసురులు ఇదే తరుణమని భావించి, దేవతలపై దండెత్తి వచ్చారు. దేవాసుర సంగ్రామం ఘోరంగా కొనసాగింది. శుక్రాచార్యుల యొక్క మంత్రశక్తి తమ అస్త్రశస్త్రాలకు తోడుకాగా, అసురులదే పైచేయి అయి, దేవతలంతా పారిపోయి, బ్రహ్మదేవుని ఆశ్రయించారు. సర్వమూ తెలిసియున్న బ్రహ్మ దేవతలను మందలించాడు:-

"దేవతలారా! మీరు పుట్టిన క్షణం నుంచి, విద్యాబుద్ధులు నేర్పి, మీయోగక్షేమాలను సదా పెంపొందిస్తూ ఉండే గురువర్యుడూ, పూజనీయుడూ, బ్రహ్మజ్ఞానీ, సర్వశ్రేయోభిలాషీ అయిన ఆ మహాత్ముని అవమానించి, తీరని గురుద్రోహం చేశారుకదా! మీకు ప్రమాదం వాటిల్లకుండా ఉంటుందా? రాక్షసులైనప్పటికీ వారు తమ గురువైన శుక్రాచార్యుని పట్ల ఎలాంటి భక్తి విశ్వాసాలు చూపుతున్నారో కాంచలేదా! మీదురహంకారమే మిమ్మల్నీదుస్థితికి తెచ్చిందని తెలుసుకొండి. ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని, గురువుయొక్క గొప్పతనం, ఆవశ్యకత గుర్తించి త్వష్ట అనే మనువు పుత్రుడైన విశ్వరూపుని గురువుగా నుండుమని వేడుకొనండి. అతడు మహాతపస్వి. సత్త్వగుణ సంపన్నుడు. మీ కోరికను మన్నించగలడు. అతని తల్లి యొక్క బంధువులు అసురులు గనుక, అతనికి అసురులపట్ల కొంత సానుభూతి ఉండవచ్చు. అయినా దానిని మీరు అంతగా పట్టించుకొననవసరంలేదు" అని పితామహుడు చెప్పాడు. ఇంద్రాది దేవతలందరూ విశ్వరూపుని వద్దకుపోయి, అతనితో "మీరుమా గురువుగా నుండుడు"- అని అర్థించడానికి వచ్చామని చెప్పుకొన్నారు. బ్రహ్మచారీ, వయస్సులో పిన్నవాడూ అయిన విశ్వరూపుడు ఇంద్రాది దేవతలకు గురువుగా నుండడానికి సందేహించాడు, తన తపశ్శక్తి క్షీణిస్తుందన్నాడు. పౌరోహిత్యము ద్వారా తనకు ఏవిధమైన ధన సంపదలుగాని, అధికారగౌరవాలుగాని అక్కరలేదన్నాడు. అయినా దేవతలు విడిచిపెట్టలేదు. దేవతల శ్రేయస్సూ, లోక కళ్యాణము గురించి, తాను ఈ త్యాగముచేసి, బాధ్యతను స్వీకరించాలన్నారు. చివరకు ఆయనకు ఎలాగో ఒప్పించారు.

విశ్వరూపునకు శ్రీనారాయణ కవచమనే విద్య తెలియును. ఈ మంత్రము అతి శక్తిమంతమైనది. విజయం చేకూర్చునట్టిది. దీనిని విశ్వరూపుడు ఇంద్రునకు బోధించగా, అతడు నారాయణుని రక్షణ పొందాడు. ఈ కవచాన్ని ధరించిన వానిని చూచినా, స్పృశించినా సర్వభయాలూ తొలగును. పూర్వము కౌశికుడనే బ్రాహ్మణుడు ఈ కవచాన్ని సాధించి, యోగసిద్ధిద్వారా ఒక ఎడారిలో దేహత్యాగం చేశాడు. చిత్రరథుడనే గంధర్వరాజు భార్యలతోసహా విమానంలో విహరిస్తుండగా, ఆవిమానం నీడ కౌశికుని అస్థిపంజరం మీద పడగా, విమానం కదలలేక క్రిందపడిపోయినది.

ఏమిచెయ్యాలో తోచక గంధర్వుడు భార్యలతో సహా నేలమీద పడియుండగా, వాలఖిల్యుడనే మునీంద్రుడు ఆదారిన పోతూ ఇలాగన్నాడు:

"ఇది నారాయణ కవచ ప్రభావము. దీనిని ధరించియుండిన బ్రాహ్మణుని అస్థిపంజరమిది. దానిమీద నీ విమానపు నీడపడినందున నీకీ గతి పట్టినది. నీవు ఈ పుణ్యాత్ముని ఎముకలను తీసుకొని పోయి, సరస్వతీనదిలో కలిపి స్నానం చేసివస్తే నీకష్టం తొలుగుతుంది." అని చెప్పాడు. చిత్రరథుడు ఆవిధంగాచేసి, బంధవిముక్తుడై మరలి పోయాడు.

ఇటువంటి శక్తిగల మంత్రాన్ని విశ్వరూపుడు ఇంద్రునకు ఉపదేశింపగా అతడు శ్రీనారాయణుని రక్షణ పొంది, అసురులను జయించాడు. దేవతలకు విశ్వరూపుని వలన గురువులేని కొరత తీరినది.

అని శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెప్పాడు.

## వృత్రాసురుడు

సురపురోహితుడైన విశ్వరూపునకు మూడు శిరస్సులుండెను. ఒక శిరస్సు సురాపానము, ఇంకొక శిరస్సు సోమరసపానము చేస్తాయి. మూడవ శిరస్సు అన్నంతినేది. అతనితల్లి అసురస్త్రీ అవటంచేత యజ్ఞాలలో హవిర్భాగాన్ని దేవతలకు కనిపించకుండా గుప్తంగా అసురులకు కూడ కొంత ఇస్తుండేవాడు. ఈ విషయాన్ని ఇంద్రుడు తెలుసుకొని, 'అతనికి అసురులయందు సానుభూతి ఉండవచ్చు, అయినా అంతగా పట్టించుకొననవసరం లేదు' అని బ్రహ్మదేవుడు మొదటనే చెప్పి యున్నప్పటికీ, రోషావేశపరుడై, అతికష్టం మీద లభించిన గురుదేవుడని అయినా ఆలోచించకుండా, విశ్వరూపుని మూడు శిరస్సులనూ ఖండించాడు ఇంద్రుడు. ఆమూడు శిరస్సులూ, కపింజలము, కలవింకము, తిత్తిరి అనబడే మూడు పక్షులై "నీవు బ్రహ్మహత్య చేసిన మహాపాతకుడవు" అని మాటిమాటికి జ్ఞాపకం చేస్తున్నట్లుగా ఇంద్రుని చుట్టూ అరుస్తూ ఎగురుతుండేవి. అతడు ఆ బాధను భరించలేక, ఆపాపాన్ని స్వీకరించి, ఒక సంవత్సరం భరించి, చివరకు దానిని నాలుగు భాగాలుగా విభజించి, భూమికి, నీటికి వృక్షాలకు, స్త్రీలకు పంచిపెట్టాడు. దానివలన భూమికి చౌడుపట్టే దోషము, నీటికి నురుగులు, బుడగలు అయ్యేదోషము, వృక్షాలకు కోస్తే జిగురు కారే దోషము, స్త్రీలకు ఋతుస్రావ దోషము పట్టాయి. తన పాపం భరిస్తున్నందుకు ప్రతిగా భూమియందు త్రవ్వబడిన గొయ్యి దానంతట అదే పూడుకొని పోయేటట్లును, మలినాన్ని ప్రక్షాళనం చేసే గుణము నీటికినీ, నరికినా చిగిర్చే గుణము వృక్షాలకూ, కామభోగాన్నివ్వగల శక్తిని స్త్రీలకూ ఇచ్చాడు.

దేవేంద్రుడు చేసిన ఘోరకృత్యానికి దుఃఖించిన విశ్వరూపుని తండ్రియైన త్వష్టప్రజాపతి ఒక మహాయాగాన్ని చేసి ఇంద్రుని రూపుమాపడానికి ఆ హోమకుండమునుండి మహాభయంకరుడైన ఒక అసురుని సృష్టించాడు. వాడు ప్రళయకాలరుద్రునికంటే భయంకరుడై, క్షణక్షణానికీ ఎదిగి పోతూ ఆకాశాన్నంటి మిరుమిట్లు గొలిపే కాంతులతో నోరు తెరచి, నక్షత్రగ్రహాలను చప్పరించి ఉమ్మేస్తున్నాడు. అతని పేరు వృత్రాసురుడు. దేవతలంతా గుమిగూడి, తమ అస్త్రాలను వానిపై ప్రయోగించగా, వాటినన్నింటినీ ఆ రాక్షసుడు గుటుక్కున మ్రింగివేశాడు. దేవతలు తేజోహీనులైనారు. వానిని జయించలేక దిక్కుతోచక, భయంతో పారిపోయి, శ్రీమన్నారాయణుని వద్దకు పరుగెత్తారు. పాలసముద్రంలో శ్వేతద్వీపాన్ని సమీపించి స్తుతించగా, ఆ భువనమోహనాకారుడు వారికి సాక్షాత్కరించాడు. దేవతలంతా ఆ దేవదేవునికి సాష్టాంగదండ ప్రణామాలు చేసి ఇలాగ మొరపెట్టుకొన్నారు.

"ఓ పురాణపురుషా! ఆదిదేవా! ఆర్తజనరక్షకా! మమ్మల్ని కాపాడు. ఈ వృత్రాసురుడు మాకు నిలువ నీడలేకుండా చేస్తున్నాడు. అనంతుడవైన నీవే వానిని అంతం చెయ్యాలి గాని మాకు అశక్తిలేదు. ప్రభూ! మా అస్త్రాలనూ, తేజస్సునూ అతడు మ్రింగివేశాడు. నీవే మాకు శరణ్యం!

ఆ॥ **పరమపురుష దుఃఖభంజన పరమేశ భక్తవరద కృష్ణ భయవిదూర**
**జలరుహాక్ష నిన్ను శరణంబు వేడెదమభయమిచ్చి కావుమయ్య మమ్ము!**

హేభగవన్! శ్రీమన్నారాయణా! ఆదిపురుషా! మంగళస్వరూపా! వాసుదేవా! సచ్చిదానందమూర్తీ! నీవు నిర్గుణుడవూ, పరబ్రహ్మస్వరూపుడవూ, అంతేగాక అనంత గుణ సంపన్నుడవు. నీ మాహాత్మ్యం ఇతరులకు అనూహ్యం. నీమాయలో పడిన కుతర్కపండితుల బుద్ధికి నీవు అగోచరుడవు. అంత్యకాలం దాపురించిన దానవాదులైన లోకకంటకులను వామనాది దేవతారూపాలతోనూ, రామకృష్ణాది మానవరూపాలతోనూ, వరాహాది మృగరూపాలతోనూ, మత్స్యకూర్మాది జలచరరూపాలతోనూ శిక్షిస్తావు. సమస్తవిశ్వానికీ ఆశ్రయమై, సకల పాపాలనూ, సంసారతాపాలనూ పరిహరింపజేసే నీయొక్క పాదపద్మాల ఛాయను ఆశ్రయిస్తున్నాము." అని అనేక విధాల స్తుతించిన దేవతల యొక్క ప్రార్థనలకు ప్రసన్నుడైన శ్రీహరి ఇలా అన్నాడు: "దేవతలారా! నా సన్నిధికి మిమ్మల్ని చేర్చగలిగిన మీయొక్క భక్తి జ్ఞానాలు నన్ను సంతసింప జేసినవి. నా భక్తులకు దుర్లభమైన దేదీలేదు. నాయందు అనన్య భక్తి కలవాడు నన్ను తప్ప ఇతరమైన దేనినీ కోరడు. మీరు వెళ్ళి దధీచి మహర్షిని ప్రార్థించండి. నారాయణ కవచ శక్తిచే అతని దేహము వజ్రంవలె గట్టిపడి, తేజోవంతం అయినది. మీరు అతనినుండి అతని దేహాన్ని యాచించి పొందండి, అతని వెన్నెముకచే, ఒక ఆయుధాన్ని విశ్వకర్మచేత చేయించండి. ఆ ఆయుధంతో ఇంద్రుడు వృత్రాసురుని శిరస్సు ఛేదించగలడు. అప్పుడు మీ అస్త్రాలూ, శక్తి, తేజస్సూ మీకు తిరిగి రాగలవు. దధీచి అత్యంతదానశీలుడు. అశ్వినీకుమారులను ముందు ఉంచుకొని, దధీచిని ఆశ్రయించండి. మీకోరిక నెరవేరగలదు" అని చెప్పి, అంతర్ధానమైనాడు.

ఇంద్రాది దేవతలు దధీచిమహర్షి వద్దకు వెళ్ళి ఎంతో బిడియంతో తమ కోర్కెను వెలిబుచ్చుకొన్నారు. ఆకోరికలోని నీచత్వమూ, స్వార్థపరత, వారికి ఎత్తి చూపాలనే ఉద్దేశంతో- ఆ మహర్షి ఇలా అన్నాడు: "సురశ్రేష్ఠులారా! ఎంతో విరాగులైన వారుకూడ మరణాన్ని ఆహ్వానించరు. స్వయంగా భగవానుడే వచ్చికోరినా ప్రాణాన్ని విడిచిపెట్టడానికి ఎవ్వరైనా ఒప్పుకొంటారా? పలురకాలైన దానాలు అడిగే వారున్నారు. ఇచ్చేవారూ ఉంటారు గాని బ్రతికి ఉండగానే దేహాన్నే ఇచ్చివేయుమని ప్రాణదానం అడిగే వారుగాని, అలాంటి దానాన్ని ఇచ్చేవారుగాని ఎక్కడైనా ఉంటారా? అబ్బురమైన ఇటువంటి అడగరాని దానాన్ని స్వార్థ ప్రయోజనం గురించి అడిగి లేదని పించుకొనడం, లోకరక్షకులైన మీవంటివారికి తగియున్నదా?" అని దధీచి ముని ప్రశ్నించగా దేవతలు సిగ్గుపడి, ఖిన్నులై, మళ్ళీ ఇలాగ విన్నవించుకొన్నారు: "మహాత్మా! మేమడిగిన దానం అతి నికృష్టమైనదని మాకు తెలుసు. నీ దేహముగురించి 'దేహి అని యాచించే దీనస్థితికి దిగజారిపోయాము. అవసరంకొద్దీ అడిగే యాచకుడు, అడగదగినది, అడగరానిది అనే విచక్షణను కోల్పోయి, సిగ్గువిడిచి అడిగేస్తాడు. అసలు యాచించడమే ఒక నీచ కర్మ. అందులో అడగరాని దాన్ని అడగడం నీచాతినీచమైనదని తెలిసీ, దేవలోకవాసుల సమష్టి క్షేమం గురించి అడగడానికి సాహసించాము. మీవంటి సర్వభూతహితైషులూ త్యాగధనులూ తమకున్నదంతా ఇతరులకు ఇచ్చివేసి ఆనందిస్తారు. వారి దృష్టిలో ఇవ్వదగినదీ ఇవ్వరానిదీ అనే విచక్షణే ఉండదు కదా!" అని అతి వినయముతో పలికిన మాటలు విని, మహాముని మందహాసంతో ఇలాగ బదులు చెప్పాడు:

"అమరులారా! మీయొక్క అభ్యర్థన లోని స్వార్థపరతను మీరు గుర్తించాలని ఈ విధంగా అన్నాను. ఎప్పటికైనా విడువవలసిన ఈ శరీరము మీ అందరికి సంక్షేమాన్ని కలుగజేయగలదంటే దానికి అంతకంటే ఉత్తమప్రయోజనం ఇంకేముంటుంది? తప్పకుండా ఇప్పుడే నా శరీరాన్ని మీకు అర్పిస్తాను" అని చెప్పి, ఆ పరమ త్యాగధనుడు యోగధారణచే ప్రాణాలను విడిచిపెట్టాడు. అనంతరం, ఆదధీచిమహర్షివెన్నెముకతో దేవశిల్పి అయిన విశ్వకర్మ వజ్రాయుధాన్ని తయారుచేసి ఇంద్రునకిచ్చాడు. ఆ వజ్రాయుధాన్ని పట్టుకొని, ఐరావతాన్నెక్కి ఇంద్రుడు వృత్రాసురుని పైకి దండెత్తి వెళ్లాడు.

ఇంద్రునకు సహాయంగా దేవతలు, గంధర్వులు, గరుడుడు, కిన్నరులు, ఖేచరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, మరుత్తులూ మున్నగువారంతా తమతమ సేనలతోను, ఆయుధాలతోను వెళ్లారు. వృత్రాసురుడు తన అనుయాయులైన నముచి, శంబర, అనర్వ, పులోమ, హయగ్రీవ, వృషపర్వ, హేతి, ప్రహేతి, ఉత్కట, ధూమ్రకేశ, విరూపాక్ష, ఇల్వల, పల్వల, విప్రచిత్తి, అంబర, అయోముఖ మొదలైన

అనేకమంది రాక్షసవీరులతోను, సేనలతోను, దేవతల నెదుర్కొనడానికి తరలి వెళ్లాడు. ఏనుగులమధ్యను కదిలి వెళ్లుతున్న పర్వతంలాగ కన్పిస్తుండే వృత్రాసురుడు అతిభయంకరంగా నుండెను.

సురాసురుల మధ్య భయంకరంగా ఆ మహాసంగ్రామం కృతయుగంనుండి త్రేతాయుగం వరకూ కొనసాగినది. రెండు వైపులా సమాన బలంతో, సామర్థ్యముతో, తాత్కాలిక జయాపజయాలతో యుద్ధం జరిగినది. నర్మదానదీతీరమున రణరంగమంతా నెత్తుటి మడుగులతోనూ, మృతదేహాలతోనూ, విరిగిన ఆయుధాలతోనూ నిండిపోయినది.

దైవశక్తి దేవతలకు రక్షగా నుండడంచేత రాక్షసబలం తరిగిపోనారంభించినది. జరిగిన నష్టాన్ని చూచి రాక్షసులు భయపడి పారిపోనారంభించారు. వృత్రాసురుడు ఇది గమనించి పారిపోతున్న వారిని నిలిపి, ఇలాగ ప్రబోధించాడు: "రాక్షసవీరులారా! పుట్టిన ప్రతిజీవీ చావకతప్పదు. వీరుడైన వాడు యుద్ధభూమిలో చస్తే వీరస్వర్గం పొందుతాడు. ధీరుడైన వాడు యోగధారణచే బ్రహ్మపదం చెందుతాడు. ఈ విధంగా పారిపోయి, క్షుద్రజీవుల్లాగా చస్తే అపకీర్తి, దుర్గతి కలుగుతాయి. మీరంతా నిలిచి పోరాడండి" అని చెపుతున్న తమ నాయకుని మాట మన్నించి కొందరు ఆగిపోయినా, మిగిలిన వారు పారిపోతుంటే, దేవతలు, వారిని వెంబడించి చంపనారంభించారు. ఇది చూచి వృత్రాసురుడు దేవతలపై క్రుద్ధుడై ఇలా అన్నాడు: "ఓ దేవతలారా! మీరు భీరులు. మీలో వీరధర్మము అసలేలేదు. పారిపోతున్న వారిని వెనుకనుండి చంపడం ఎక్కడి న్యాయమిది? మీకు నిజంగా పోరాడే ధైర్యముంటే వచ్చి, నాతో తలపడండి. పిరికి పందలవలె పారిపోతున్న వారికి వెన్ను పోటు పొడవడం, వీరలక్షణం కాదు." అని గంభీరంగా గర్జించేసరికి దేవతలు కొందరు మూర్ఛపోయారు. వారి సేనలు చెదిరిపోయాయి. వృత్రాసురుడు తానే రంగంలోకి దిగాడు. పెద్ద బండ రాళ్లవంటి పాదాలతోనూ, స్తంభాల్లాంటి కాళ్లతోనూ నడిచి వచ్చే పర్వతంలాంటి దేహముతో కదనరంగమంతా వీరవిహారం చేశాడు. దేవసేనలను త్రొక్కి చంపుతూ, తాటి చెట్టులాంటి త్రిశూలాన్ని త్రిప్పుతూ మీదికి వస్తున్న వృత్రాసురుని ఇంద్రుడు చూచి, తిరుగులేని తన గదను వాని మీదికి విసిరాడు. వృత్రుడు ఆ గదను తన ఎడమ చేత్తో పట్టుకొని, దానితోనే ఇంద్రుని వాహనమైన ఐరావతమును కొట్టగా దాని కుంభస్థలము బ్రద్దలై, అది తనపై ఆసీనుడైయున్న ఇంద్రునితో సహా ఏడు ధనుస్సుల దూరాన వెళ్లి పడినది. కష్టపరిస్థితిలో నిస్సహాయుడై పడియున్న శత్రువును మళ్లీ కొట్టరాదనే నీతిని పాటించి వృత్రుడు మళ్లీ దెబ్బతీయకుండా వేచి యున్నాడు. ఇంతలో ఇంద్రుడు లేచి, ఐరావతం యొక్క శరీరాన్ని నిమిరి, దానికి ఉపశమనం కలిగించి లేవదీసి, మళ్లీ వృత్రాసురునిపై దాడి చెయ్యడానికి సిద్ధపడ్డాడు. అది చూచి, వృత్రుడు వికటాట్టహాసంతో నవ్వి, తన అన్న అయిన విశ్వరూపుణ్ణి అన్యాయంగా చంపిన ఇంద్రునిపై క్రోధావేష్టుడై హుంకరించి గర్జించాడు. పర్వతాలు ఊగిసలాడాయి, సముద్రం అల్లకల్లోలమైనది, భూమి క్రుంగినది, కొందరు మూర్ఛపోయారు. వృత్రుడు ఇంద్రునితో ఇలా అన్నాడు:

"ఓయీ సురాధమా! నీవు బ్రహ్మహంతకుడవు. నీవంటి మహాపాపితో యుద్ధము చేయవలసిరావడం నా దౌర్భాగ్యము. నా సోదరుడైన విశ్వరూపుడు నీకు విద్యనేర్పి విజయం చేకూర్చిన సద్గురువు. నీకూ నీవారైన దేవతలకూ, రక్షణకల్పించే గురుదేవుడు, యజ్ఞదీక్షలో నుండగా నీవు నిర్దాక్షిణ్యముగా అతనితలలునరికి హేయమైన పాపకృత్యము చేశావు. నీయంత నీచుడూ, గురుద్రోహీ ఇంకెవ్వరూ ఉండరు. ఇదిగో ఇప్పుడే, నాశూలాన్ని నీ గుండెలో గ్రుచ్చి, నిన్ను అంతమొందించి, నాసోదరునికి ఆత్మశాంతి కలుగజేస్తాను. పాపాత్ముడవైన నీ మాంసఖండాలు కాకులు గ్రద్దలు కూడ ముట్టుకొనవు. ఒకవేళ అలాగ జరుగకపోతే నీవే నీ వజ్రాయుధంతో నా శిరస్సును ఖండిస్తావు. అదికూడా నాకు మేలే అవుతుంది. మహాత్ముడైన దధీచియొక్క ఎముకలతో చేయబడినది ఆ వజ్రాయుధం. నీకు నారాయణుని అభయము, ఆశ్రయము ఉన్నవి. నేను వీరస్వర్గానికే పోతాను. నా కర్మ బంధాలు వీడి, నేను ఆ సంకర్షణ భగవానుని చరణ సన్నిధికి పోతాను, గాని నీలాగా భోగలాలసుడవై పాపకృత్యాలు చేస్తూ పడియుండను. నీవు నాపై వజ్రాయుధాన్ని ప్రయోగించు. అదికూడ నీ గదవలె నామీద నిష్ఫలమై పోతుందేమోనని భయపడుతున్నావా?" అని, కవ్వించాడు.

ఆకస్మాత్తుగా అతని మనస్సు నారాయణుని యందు నిలిచి పోయినది. యుద్ధభూమి కనుమరుగయినది. ఇలాగ ప్రార్థించసాగాడు: "ప్రభూ! పద్మనాభా! నాకు వైకుంఠముగాని, బ్రహ్మపదముగాని, స్వర్గలోక భూలోకపాతాళలోక ఆధిపత్యముగాని అక్కరలేదు. నాకు సిద్ధులుగాని యోగశక్తిగాని మోక్షముగాని వద్దు. నిన్ను చేరడానికి నాహృదయం పరితపించుతున్నది. నాకు పుణ్య పురుషులతోసాంగత్యమే జన్మజన్మలలో లభించేట్లు అనుగ్రహించు. నీయందు భక్తిలేనివారితోగాని, తత్త్వజ్ఞానం లేనివారితోగాని సంసార లంపటులతోగాని, ఎలాంటి సంపర్కమూ కలుగకుండునట్లు అనుగ్రహించు. నీ. దాసానుదాసులతో చెలిమి, భార్యాగృహవిత్తాదులయందు విరక్తిని ప్రసాదించు" అని తన ఇష్టదేవతను ప్రార్థించుకొని, తన ప్రస్తుత కర్తవ్యమైన దేవతల దాడిని ఎదుర్కొడానికి పూనుకొన్నాడు. ఇంద్రునిపైకి భయంకరమైన తన త్రిశూలాన్ని ప్రయోగించాడు. అది ప్రళయకాలాగ్నివలె ఇంద్రుని మీదికి శరవేగంతో రావడం చూచి ఇంద్రుడు దానిని వజ్రాయుధంతో ఖండించి, వృత్రుని బాహువుకూడా ఆ ఆయుధంతోనే ఖండించాడు. వానికి అమితమైన బాధకలిగినా, రెండవచేతితో ఒక పరిఘను (ఇనుప గుదియ) పట్టుకొని ఐరావతాన్ని, ఇంద్రునీ కొట్టాడు. ఐరావతం బెదిరిపోయినది. ఇంద్రుని చేతినుండి వజ్రాయుధం జారిపోయినది. ఇదే అదను అని వృత్రుడు భావించి, ఇంద్రునిపై వేటువెయ్యలేదు. యుద్ధనీతిని పాటించి, సిగ్గుతో తలవంచుకొనియున్న ఇంద్రునితో ఇలా అన్నాడు:

"ఇంద్రా! భయపడకు. అభయమిస్తున్నాను, ఆయుధహీనుని చంపడం ధర్మము కాదు. లేచి నీ ఆయుధాన్ని ధరించి యుద్ధం చెయ్యి. అందరం ఆ పరమాత్ముని మాయాయంత్రంలోని మరబొమ్మలమే. జయాపజయాలను ఆయనే అనుగ్రహిస్తాడు. ఇప్పుడు నా విషయమే చూడు. నాచెయ్యి తెగిపోయినది. అయినా నాలో కొన ఊపిరి ఉన్నంత వరకూ నేను యుద్ధము చెయ్యాలి. నీవు లేచి నీ కర్తవ్యం నిర్వర్తించు." అన్నాడు. అసురుని తత్త్వజ్ఞానానికి, దైవభక్తికీ ఇంద్రుడు ఆశ్చర్యపోయాడు. వాని ధర్మనిరతికి, తన అధర్మ వర్తనకూ సిగ్గుచెందాడు. తన వజ్రాయుధాన్ని చేతబూని, వృత్రునితో ఇలా అన్నాడు: "దానవేంద్రా! నీయొక్క తత్త్వజ్ఞానము, వాసుదేవభక్తి అమోఘమైనట్టివి. విష్ణుతత్త్వాన్ని నీవు బాగా గ్రహించినవాడవు. ఇంక నీవు ఈ రాక్షసరూపంలో నుండదగనివాడవు. నీవు ఆపరమాత్మను చేరగలవు." అని చెపుతున్న ఇంద్రునకు వృత్రుడు యుద్ధానికి పురికొల్పి, భయంకరంగా గర్జిస్తూ మీదకు ఉరకగానే ఇంద్రుడు వాని రెండవ బాహువును కూడ వజ్రాయుదంతో నరికివేశాడు. రెక్కలు తెగిన పర్వతంలాగా అసురుడు నేల కూలినప్పటికీ, ఆకాశానికీ, భూమికీ తగులునట్లు నోరు తెరచి, నాలుకచాచి, ఇంద్రునితోసహా ఐరావతాన్ని మ్రింగివేశాడు. దేవతలు అది చూచి హాహాకారాలు చేశారు. కాని నారాయణ కవచ ప్రభావంచేత ఇంద్రుడు సురక్షితంగానే ఉన్నాడు. వజ్రాయుధంతో అసురుని పొట్టచీల్చుకొని బైటకు వచ్చి, ఆ ఆయుధంతోనే వాని శిరస్సు ఖండించాడు. ఆ శిరస్సును ఛేదించడానికి వజ్రాయుధానికి కూడ ఒక సంవత్సర కాలం పట్టినది. దేవతలు దుందుభులను మ్రోయించారు, ఇంద్రుని ప్రశంసించారు. వృత్రాసురుని నుండి ఒక దివ్యజ్యోతి వెలువడి వైకుంఠప్రవేశం చేసినది. వాని వధతో దేవతలందరూ భయంతీరి జయజయ ధ్వనులు చేశారు. కాని అంతలోనే దేవతలూ, ఋషులు, పితృదేవతలు, అందరూ ఇంద్రునితో చెప్పకుండానే తమతమ తావులకు వెళ్లిపోయారు. ఎందుచేతనంటే బ్రహ్మహత్యాపాతకము ఒక వికృతమైన చండాలస్త్రీ రూపంలో ఇంద్రుని వెంబడిస్తుంది. అతడు ఎటువెళ్తుంటే అటే వెంటాడి, శాంతిలేకుండా వేధిస్తుంది. అతడు పోయిపోయి, మానససరోవరంలో, నొక తామర తూడులోని నాళంలో ప్రవేశించి దాగుకొన్నాడు. మానససరోవరం మహేశ్వరుని స్థానం కనుక బ్రహ్మహత్యాపాపపు ప్రతీకం అందు ప్రవేశించలేక పొలిమేరల్లో కాచుకొని ఉన్నది. ఇంద్రుడు ఆ తామర తూడులో దాగుకొని ఒక వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాడు.

ఇంద్రుడు లేని కాలంలో నహుషుడనే రాజు స్వర్గాధిపతి అయ్యాడు. అతనికి అధికార ఐశ్వర్యాలతో పాటు గర్వము, మదము అతిశయించి కామాంధుడై ఇంద్రపత్నియైన శచీదేవిని భార్యగా ఉండుమన్నాడు. ఆమె దేవగురువైన బృహస్పతితో సంప్రదించి నహుషునికి ఇలాగ సందేశం పంపించినది: "ఇంద్రుని వలె ఋషులచే మోయబడిన

శిబిక (పల్లకీ) నెక్కి నా భవనానికి రమ్ము" అని. నహుషుడు సంతోషంతో అగస్త్యాది ఋషుల నాదేశించి, వారు మోసే శిబికలో వెళ్తూ "సర్ప సర్ప" (త్వరగా సాగండి) అంటూ కాళ్లతో వాళ్లను తోస్తూ తొందర చేయసాగాడు. ఋషులకు కోపంవచ్చి "సర్పోభవ" (సర్పము అగుదువుగాక) అని శపించగా, అతడు వెంటనే ఒక కొండచిలువగా మారి, భూలోకంలో పడ్డాడు. ఋషులు 'ఋతంభర' అనే హోమంచేసి తామర తూడులోనున్న ఇంద్రుని బైటకు రప్పించారు. అతని వెయ్యేళ్ల తపస్సుచే బ్రహ్మహత్యా దోషము తొలగిపోయినది. తరువాత ఋషులు అతనిచే అశ్వమేధయాగము చేయించి, పాపప్రక్షాళనం కావించి, అతనిని శుద్ధపరచి సింహాసనమును అధిష్ఠింపజేశారు.

## చిత్రకేతూపాఖ్యానము

అసురుడైన వృత్రునకు ఇంతటి భక్తిజ్ఞాన వైరాగ్యాలు ఎలాగ అబ్బినవి అని ప్రశ్నించిన పరీక్షిత్తునకు శ్రీశుకుడు ఇలాచెప్పాడు:

పూర్వము చిత్రకేతువనేరాజు శూరసేన దేశాలను పాలిస్తుండెను. అతడు సుగుణభూషణుడు, యశస్వి, ప్రజారంజకుడు. అతనికి అనేకమంది భార్యలుండిరి గాని ఒక్కరూ సంతానవతి కాలేదు. తనకు రూపము, వీర్యము, యౌవనము, విద్య, ఐశ్వర్యము, ఉన్నతవంశము అన్నీ ఉన్నప్పటికీ సంతానము లేకపోవడంచేత రాజు వ్యాకులచిత్తుడై యుండెను. ఒకనాడు లోకసంచారము చేస్తూ బ్రహ్మపుత్రుడైన అంగిరస మహర్షి విచ్చేసెను. రాజు సకల మర్యాదలతో ఋషిని సంతోషపెట్టాడు. ఋషి రాజుయొక్క కుశలమడిగి, అతని చింతకు కారణం తెలుసుకొన్నాడు. త్వష్టదేవతను ఆరాధిస్తూ ఒక హోమం చేయించి, చరువు (యజ్ఞప్రసాదము)ను కృతద్యుతి అనే జ్యేష్ఠ భార్యకు ఇచ్చాడు. "రాజా! నీకు పుత్రుడు కలుగుతాడు. అతని వలన నీకు హర్షము, శోకమూ కలుగుతాయి" అని చెప్పి, మహర్షి వెళ్లిపోయాడు. కొన్నాళ్లకు పుత్రోదయం అయినది. రాజదంపతులతో పాటు రాజ్యమంతా ఆనందంలో మునిగిపోయినది. రాజు అనేకమైన దానధర్మాలు చేస్తూ తన ఆనందాన్ని ప్రజలతో పంచుకొనేవాడు. బాలుడు దినదినప్రవర్ధమానుడై అలరారుచుండెను. రాజు ఇప్పుడు పెద్దభార్య నివాసంలోనే ఎక్కువ సమయం గడుపుతూ కుమారునితో కాలక్షేపం చేస్తుండటంచేత, తమకు సంతానం కలుగలేదనే చింతతోపాటు భర్త తమను అలక్ష్యం చేస్తూ, పెద్దభార్యనే ఎక్కువగా ఆదరిస్తున్నాడనే అసూయ ఇతర రాణులలో రాజుకొన్నది. అసూయ ఎంతటి ఘోరపాపానికైనా ప్రేరేపిస్తుంది. రాణులు కుట్రపన్ని, వరపుత్రునికి విషము పెట్టించి చంపించి వేశారు. లేకలేక కలిగిన వంశోద్ధారకుడు ఈ విధంగా దుర్మరణం చెందడంతో రాజదంపతులు రెక్కలు తెగిన పక్షుల్లాగ నేలకూలి, శోకవిహ్వలులై కొట్టుకొంటున్నారు. ఈ శోకవార్త రాజ్యమంతా వ్యాపించి, అందరినీ దుఃఖంలో ముంచివేసినది. ఆ తలిదండ్రుల్ని ఓదార్చే శక్తి ఎవ్వరికీ లేకపోయినది. విషయం తెలుసుకొని, అంగిరసమహర్షి నారదునితో సహా వచ్చి, రాజుతో ఇలా అన్నాడు: "మహారాజా! మీ ఇద్దరూ ఈ విధంగా శోకింపదగదు. బాగా ఆలోచిస్తే, ఈ బాలునితో మీకెలాంటి సంబంధమూ లేదని మీకే తెలుస్తుంది. ఈనాటి బాంధవ్యాలు గడిచిన జన్మలలో లేవు. మీరు ఇతనికి ఎన్నవ తలిదండ్రులో తెలియదు. నదీ ప్రవాహంలో కొట్టుకొనివచ్చే ఇసుక రేణువులు ఒక చోట కలిసి, విడిపోయి వేరొక చోట వేరువేరు ఇతర రేణువులతో కలిసి విడిపోతూ కొట్టుకొనిపోతుంటాయి. ఈ విధంగానే జీవులు కాలప్రవాహంలో కలుస్తూ విడిపోతూ ఉంటాయి. ఈ తాత్కాలిక సంయోగ వియోగాలను జననమరణాలంటారు. ఇవి తప్పింపలేని సహజ సంఘటనలు. ఇది అంతా ఆ పరమేశ్వరుని మాయా విలాసము. దీనివలన జీవులకు జీవులు పుట్టినట్లు కనిపిస్తుంది. కాని వాస్తవానికి పుట్టునదీ గిట్టునదీ శరీరమే. ఈ శరీరము నీకుమారుడు కాడు. శరీరములో నివసించే జీవునికి చావు పుట్టుకలులేవు. ఆ జీవుడు వేరొక శరీరాన్ని అధిష్ఠించడానికి వెళ్లాడు. ఇక చనిపోయినదెవ్వరు? ఈ సృష్టి రహస్యాన్ని గుర్తించి, నీవు ధైర్యము వీడకుండా, దైన్యము చెందకుండా ఉండాలి. మన సుఖదుఃఖాలన్నీ స్వప్నంలోని సంఘటనలవంటివే, నిలిచియుండేవికావు. ఇవి అన్నీ మనస్సు కల్పించుకొన్న భ్రమలే. అందుచేత ఈ మిథ్యా శోకమునుండి బయటపడి, నిర్మలమైన మనస్సుతో వాసుదేవునియందు చిత్తాన్ని లగ్నముచేయుము." అని చెప్పిన అంగిరసుని జ్ఞానబోధ విని, ఊరట జెంది, రాజు

ఇలా అన్నాడు: "మహాత్ములారా! మీరెవ్వరోగాని ఈ మందబుద్ధికి జ్ఞానోపదేశం చేయవచ్చిన సనత్కుమారులో, వ్యాస మార్కండేయులో, నారదఋషులో, దేవల అంగిరసులో అని నాకు అనిపిస్తున్నది. మీవంటి మహాపురుషులు మావంటి అజ్ఞానులను తరింప జెయ్యడానికి లోకసంచారం చేస్తుంటారు. తమరెవ్వరో సెలవియ్యండి అని వినయంతో ప్రశ్నించిన రాజునకు అంగిరసుడు ఇలా చెప్పాడు: "రాజా! నేనెవరినో నీవెరుగుదువు గాని శోకము వలన గుర్తించలేకున్నావు. నీకు పుత్రప్రాప్తి గురించి యాగము చేసిన అంగిరసుడనే నేను. ఈయన నా సోదరుడు, బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు. అజ్ఞానముచే నీకు కలిగిన ఈ పుత్రశోకమునుండి రక్షించడానికి వచ్చాము. నీవు దైవభక్తి గలవాడవు. జ్ఞానాన్ని పొందగలవాడవు. నేను ఇదివరకు వచ్చినప్పుడు మాయావశముచే నీలో పుత్రకాంక్ష ప్రగాఢముగా నుండెను. ఆవాంఛ తీరడానికి యాగము చేసి పుత్ర ప్రాప్తిని కలిగించాను. నీలో ఇంకా వ్యామోహము పెరిగినది. భార్య, బిడ్డలు, గృహము, సంపద, కీర్తి, భోగములాంటి వన్నీ భ్రాంతి, భయము దుఃఖములను కలుగ జేస్తాయి. శాంతిని పోగొట్టుతాయి. స్వప్నంలోని అనుభవాల వలె తాత్కాలికమైన మిథ్యలు. ఈ ప్రపంచంలో కనిపించేవన్నీ అనిత్యములు, అసద్వస్తువులు, దుఃఖకారకాలు. ఒక్క ఆత్మయే ఏకైకసత్యము, శాశ్వతము అయినట్టిది. ఆ ఆత్మజ్ఞానాన్ని పొంది శోకముక్తుడవు కమ్ము" అని అంగిరసుడు బోధించగా నారదుడు ఇలాగ చెప్పాడు: "ఓ చిత్రకేతు మహారాజా! నేనిప్పుడు చెప్పబోవు మంత్రము ఉపనిషత్తులలో నిక్షిప్తమైయున్నది. దానిని ఏడు రాత్రులు జపించిన వానికి సంకర్షణభగవానుడు దర్శనమిస్తాడు. (అంటూ మంత్రాన్ని ఉపదేశించాడు). (మంత్రోపనిషత్తులోని ప్రథమ శ్లోకము:)

**"ఓం నమో తుభ్యం భగవతే వాసుదేవాయ ధీమహి**
**ప్రద్యుమ్నాయ అనిరుద్ధాయ నమః సంకర్షణాయ చ**
**ఆత్మారామాయ శాంతాయ నివృత్తద్వైతదృష్టయే**
**ఓం నమోభగవతే మహాపురుషాయ మహానుభావాయ**
**మహావిభూతిపతయే సకల సాత్వత పరివృఢ నికర**
**యుగళ పరమ పరమేష్ఠిన్ నమస్తే"**

రాజా! నీ పుత్రుని యందలి మోహము ఇంకా నీకు తొలగకపోతే ఆ జీవిని రప్పించి మాట్లాడిస్తాను విను" అంటూ తన యోగశక్తిచే ఆ జీవుని ఆహ్వానించి, నారదుడు ఇలాగ అడిగినాడు. "చూడు, నీ తలిదండ్రులు నీ వియోగముతో ఎంత శోకంలో మునిగియున్నారో! జీవుడా! నీవు విడిచిన - శరీరంలో నీవు మళ్లీ ప్రవేశించి, అందరినీ ఆనందింపజేసి, ఈ సింహాసనాన్ని అధిష్ఠించి, నీ శేష జీవితాన్ని సుఖంగా వెళ్లబుచ్చు" అని అనగానే ఆ జీవుడు ఇలా అడుగుతాడు.

"నేను నాకర్మల ప్రకారము దేవ, మానవ, పశు, పక్ష్యాది జన్మలను ఎన్నెన్నో పొందియుంటిని. ఈ ఇద్దరూ నాకు ఏ జన్మలోని తలిదండ్రులు? ఈ విధంగా శోకిస్తున్న అనేకులైన నా తలిదండ్రుల దుఃఖాన్ని తొలగించడానికి సాధ్యపడుతుందా? జీవునకు ప్రతి జన్మలోనూ అనేకులతో సంబంధాలేర్పడుతాయి. ఈ జన్మలోని తలిదండ్రులు గాని స్నేహితులుగాని మరుజన్మలో శత్రువులుగా పుట్టవచ్చును. జీవునికి దేహం వలన ఏర్పడిన బంధుత్వాలతో ఎలాంటి సంబంధమూ ఉండదు. నశించెడి దేహాలలో జీవుడు తాత్కాలికంగా నివసించే యాత్రికుడు మాత్రమే. అందుచేత ఎలాంటి బాంధవ్యాలూలేని పరమాత్మస్వరూపుడనైన నాకునూ, నా తలిదండ్రులు అనుకొనే ఈ దేహాలకూ ఎట్టి సంబంధమూలేదు అని చెప్పి జీవుడు అదృశ్యమైనాడు. చిత్రకేతువుయొక్క పుత్ర వ్యామోహము తొలగినది. నారదమహర్షి ఉపదేశించిన నారాయణమంత్రాన్ని సమాధినిష్ఠుడై ఏడు అహోరాత్రాలు ఏక దీక్షతో ఆరాధించి శ్రీహరి అనుగ్రహంతో దివ్య విమానాన్ని విద్యాధరచక్రవర్తిత్వాన్ని పొందాడు.

విమానంలో విహరిస్తున్న చిత్రకేతువునకు ఒకనాడు ఆదిశేషుడు దివ్యదర్శనం ఇచ్చాడు. చిత్రకేతువు ఆనంద బాష్పాలతో అనంతునకు అభిషేకం చేశాడు. అతని స్తోత్రాలకు సంతసించి, అనంతుడు ఇలా అన్నాడు. "అంగిరస

నారద మునులు బోధించిన తత్త్వమువలన నీవు నా యథార్థ స్వరూపాన్ని తెలుసుకొంటివి కనుక నన్నిప్పుడు దర్శించగలిగావు. లోకంలో నరజన్మ పరమదుర్లభమైనది. ఈ జన్మలోనే ఆత్మస్వరూపం తెలుసుకోవాలి. సుఖప్రాప్తికై దుఃఖనివృత్తి కోసం ప్రయత్నిస్తూ, కోరికలతో కర్మలు చేస్తుంటారు. కనుక మనుజులకు దుఃఖమే లభిస్తుంది. నన్ను విస్మరించి సంసారబంధంలో చిక్కుకొన్న వారికి మోక్షము సిద్ధించదు. నన్ను భక్తితో ఆరాధించువారు తరిస్తారు" అని చెప్పి అనంతుడు అంతర్ధానమయ్యాడు.

చిత్రకేతువు యక్షకిన్నర కాంతలచేత భగవంతునిదివ్యలీలాగాథలను గానం చేయించేవాడు. నాట్యం చేయించేవాడు. భగవద్భక్తులను అర్చించేవాడు.

పార్వతి శాపము : ఒకనాడు చిత్రకేతువు కైలాసపర్వతంపై విమానములో విహరిస్తుండగా, ఋషులు, సిద్ధచారణాదులందరూ కూడియున్న సభకు పార్వతీ సమేతుడైన పరమేశ్వరుడు అధ్యక్షత వహించియున్నాడు. శంకరుడు పార్వతీదేవిని తన తొడపై కూర్చుండబెట్టుకొని, ఒక చేతితో ఆమెను ఆలింగనం చేసుకొని యుండడం చిత్రకేతువు చూచి అట్టహాసంగా నవ్వి ఇలాగ అన్నాడు: "అయ్యో ఇదేమిటి? పరమశివుడు అందరిమధ్యా సిగ్గులేకుండా పత్నిని కౌగలించుకొని కూర్చున్నాడు." ఈ మాటలు విని శివుడు చిరునవ్వు నవ్వి ఊరుకొన్నాడు. బ్రహ్మాది దేవతలు మునులూ ఏమీ పట్టించుకొనకుండా తమ స్తోత్రాలను కొనసాగిస్తున్నారు. పార్వతీదేవికిమాత్రము కోపం వచ్చినది. ఇలాగ అన్నది. "బ్రహ్మాది దేవతలకు, భృగు, కపిల, నారదాది మహర్షులకూ ఆక్షేపణీయంగా కనిపించని శివపార్వతుల అభిన్నసాన్నిహిత్యము ధూర్తుడైన ఈ క్షత్రియునకు విడ్డూరంగా కనిపించినదా! శివశక్తితత్త్వము వీనికేమి తెలుసు? ఈ అహంకారి విష్ణుపాదసేవకు కూడ అర్హుడుకాడు. ఇతడు శిక్షార్హుడు, అసురుడైపుట్టుగాక!" అని శపించినది.

చిత్రకేతువు విమానం దిగి పార్వతీ పరమేశ్వరులకు సాష్టాంగ ప్రణామాలు చేసి, ఆ దేవితో ఇలా అన్నాడు: "జగజ్జననీ! నీ శాపాన్ని శిరసా వహిస్తున్నాను. పూర్వజన్మకృత కర్మఫలాన్ని ఎవ్వరైనా అనుభవించక తప్పదు. దేహమే ఒక బంధమైనప్పుడు, అది మానవదేహమైనా, దానవదేహమైనా ఒక్కటే కదా! నేను చేసిన అపరాధానికి చింతిస్తున్నాను. నన్ను మన్నించు. కర్మఫలాన్ని అనుభవించాలి. కనుక శాపాన్ని తగ్గింపుమని కూడ కోరను." అని, సెలవుతీసుకొని వెళ్లిపోయాడు. పరమశివుడు పార్వతితో ఇలా అన్నాడు: "దేవీ! విష్ణుభక్తులకు అంతా సమానమే. ద్వంద్వాతీతులు నారాయణుడు సర్వాంతర్యామియై యుంటాడు. కనుక వారికి అందరూ ఇష్టులే. ఈ చిత్రకేతువు తనకు శక్తి ఉండి కూడ నిన్ను తిరిగి శపించలేదు కదా!" అని చెప్పగా, ఆమె ప్రసన్నురాలయినది.

ఈ విధంగా శపింపబడిన చిత్రకేతువు త్వష్ట ప్రజాపతి చేసిన యజ్ఞంలో దానవునిగా ఉద్భవించి, వృత్రాసురునిగా ప్రసిద్ధిగాంచాడు. అందుచేతనే, అతడు రాక్షసుడై యుండికూడ తన ఆత్మజ్ఞానాన్ని కోల్పోకుండా, భక్తునిగా వ్యవహరించాడు అని శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెప్పాడు.

## అదితి, దితి - వారిసంతతులు

అదితి పుత్రులైన వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్టల గురించి చెప్పాను కదా ఇప్పుడు మిగిలిన 8 మందిని గురించి చెపుతాను విను - అని శ్రీశుకుడు పరీక్షిత్తుతో అన్నాడు.

అదితి కశ్యపులకు పుట్టిన ద్వాదశాదిత్యులలో ఐదవవాడు సవిత. అతని భార్య పృశ్ని. వారికి సావిత్రి, వ్యాహృతి, త్రయి, అనే ముగ్గురు కూమార్తెలు, అగ్నిహోత్రము, పశుయాగము, సోమయాగము, పంచమహాయజ్ఞాలు అనబడే కుమారులూ కలిగారు. ఆరవ ఆదిత్యుడైన భగుని భార్య సిద్ధిక. వారికి మహిముడు, విభుడు ప్రభుడు అనే కుమారులు, ఆశిష అనే కుమార్తె కలిగారు. ఏడవ ఆదిత్యుడైన ధాతకు కుహువు, సినీవాలి, రాక, అనుమతి అనే నలుగురు భార్యలు. వారికి వరుసక్రమంలో సాయంకాలము, ధర్ముడు, ప్రాతఃకాలము, పూర్ణిమాఖ్యుడు అనే కుమారులు కలిగారు. ఎనిమిదవ ఆదిత్యుడైన విధాతకు క్రియ అనే భార్యయందు పురీష్యాదులైన అగ్నులు పుట్టారు. తొమ్మిదవ ఆదిత్యుడైన వరుణునకు చర్షణి యందు పూర్వము బ్రహ్మపుత్రుడైన భృగువు, వల్మీక సంభవుడైన

వాల్మీకి కలిగారు. ఈ వరుణునకును, దశమ ఆదిత్యుడైన మిత్రునకును ఊర్వశిని చూడగానే వీర్యస్ఖలనం కాగా దానిని ఒక కలశములో నుంచగా, ఆ కలశం నుండి అగస్త్యుడు, వశిష్ఠుడు పుట్టారు. మిత్రునకు రేవతి యందు ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు కలిగారు. ఏకాదశాదిత్యుడైన ఇంద్రునకు శచీదేవియందు (పౌలోమియందు) జయంతుడు, ఋషభుడు, విదుషుడు అనే పుత్రులు కలిగారు. ద్వాదశాదిత్యుడు వామనుడు. అతడు త్రివిక్రముడు, ఉపేంద్రుడు అని కూడ ప్రసిద్ధికెక్కాడు. అతనికి కీర్తియందు బృహత్‌శ్లోకుడూ, అతనికి సౌభగుడు మొదలైన పుత్రులు జన్మించారు. ఇదీ అదితి కశ్యపుల సంతతి.

ఇక దితి కశ్యపుల సంతతిని గురించి చెపుతాను. దితి సంతతి దైత్యులనబడుతారు. వీరికి మొదట పుట్టిన వారు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు. జంభాసురుని కుమార్తె అయిన కయాధువు హిరణ్యకశిపుని భార్య. వీరికి ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు, అనే కుమారులూ, సింహిక అనే కుమార్తె కలిగారు. సింహిక విప్రచిత్తి అనే దానవుని భార్య. వీరి కుమారుడే రాహువు. అతడు దేవతల పంక్తిలో కూర్చొని అమృతం త్రాగడానికి సిద్ధపడితే శ్రీహరి వానిశిరస్సును ఛేదించాడు. సంహ్లాదునకు గతియందు పంచజనుడు పుట్టాడు. హ్లాదునికి దమనియందు వాతాపి, ఇల్వలుడు, పుట్టారు. వీరే అగస్త్యమునిని చంపబోయి అతని గర్భములో చేరి జీర్ణమైపోయారు. అనుహ్లాదునకు ఊర్మియందు బాష్కలుడు, మహిషుడు కలిగారు. ప్రహ్లాదునకు దేవియందు విరోచనుడు పుట్టాడు. అతని పుత్రుడే బలి. బలికి అశనయందు బాణునితో సహా వందమంది కుమారులు కలిగారు. బాణాసురుడు శివుని ఆరాధించి శివభృత్యులలో ప్రధాన స్థానము పొందాడు. దితికి ఇంకా 49 మంది పుత్రులు కలిగారు. వీరు మరుత్తులనబడ్డారు. వీరికి సంతానము లేదు. వీరు ఇంద్రసమానులైనారు. ఇది ఎలాగ సంభవించినది? అని ప్రశ్నించిన పరీక్షిత్తుతో శ్రీశుకుడు మరుత్తుల చరిత్రను ఈ విధంగా చెప్పాడు:

**మరుత్తులు** : విష్ణుమూర్తి దేవతల పక్షపాతి. ఇంద్రునిశత్రువులను ఆయన ఏదో ఒక విధంగా హతమార్చుతాడు. అలాగే తన సవతితల్లి బిడ్డలైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను విష్ణువు మాయరూపాలు ధరించి చంపివేశాడు. ఈ విధంగా రేయింబవళ్లు తలపోస్తూ దితి ఇంద్రునిపై ద్వేషము, పగను పెంచుకొన్నది. ఇంద్రుడు బ్రాహ్మణహంత. తన పదవిని పదిలపరచుకొనడానికి సోదరులను కూడా అంతముచేసే పాపాత్ముడు. ఇంద్రియలోలుడు. ఇతడు బ్రతికి యుండరానివాడు. వీనిని చంపగల పుత్రుడు నాకు కావాలి – అని కాంక్షించి, దితి తన భర్త అయిన కశ్యపుని ఇంకా ఎక్కువ భక్తి శ్రద్ధలతో సేవించినది. కశ్యపుడు మిక్కిలి సంతృప్తుడై వరము కోరుకొనుమన్నాడు. ఆమె ఎలాంటి సంకోచమూ లేకుండా ఇంద్రుని హతమార్చ గల పరాక్రమశాలీ, అమరుడూ, అయిన పుత్రుడు కావాలి అని కోరినది. కశ్యపుడు త్రుళ్లిపడి, ఈ కఠినాత్మురాలు ఇంతటి క్రూరమైన కోరిక కోరినదేమిటి – అని తల్లడిల్లిపోయి, స్త్రీ వ్యామోహంలో పడి, ఆలోచించకుండా వరమిస్తానని మాట ఇచ్చినందుకు చింతించి, మార్గాంతరం ఆలోచించి, ఇలా అన్నాడు "ఓ సుందరీ! నీ కోరిక సామాన్యమైనది కాదు. అది తీరడానికి పుంసవనము అనే ఒక వ్రతమున్నది. దాని నియమాలన్నీ ఒక ఏడాది పాటిస్తూ, నిష్ఠతో ఆ వ్రతమాచరించాలి. ఆ నియమాలు ఇవి:- మార్గశీర్ష శుద్ధపాడ్యమి నుండి ఒక సంవత్సరం దీక్షవూనాలి. ఈ సమయంలో ఏ ప్రాణినీ హింసించరాదు. ఎవ్వరినీ నిందించరాదు. అసత్యమాడరాదు. కోపపడరాదు. మాంసాహారం తినరాదు, అతిగా మాట్లాడరాదు. దుర్జనులతో మాట్లాడరాదు. పరుషముగ పలుకరాదు, కాళ్లు చేతులు కడుగుకొనకుండా నిద్రించరాదు, ఎల్లప్పుడూ శుచిశుభ్రతలను పాటించాలి, సంధ్యవేళల్లో నిదురించరాదు, దిగంబరంగా నిద్రించరాదు, మనస్సులో నేవిధమైన మలినమూ చేరనివ్వరాదు, ప్రాతఃకాలములో లక్ష్మీనారాయణులను ఆరాధించాలి. ముత్తైదువలను పూజించాలి. భర్తను దైవముగ భావించి, భక్తి శ్రద్ధలతో పూజించాలి. కోరినటువంటి పుత్రుడు గర్భంలోనున్నట్లు సదా భావన చేస్తుండాలి. ఈ విధముగా పన్నెండునెలలూ, పొరపాటు జరుగకుండా జాగ్రత్త పడుతూ వ్రతమాచరించి, చివరకు యథావిధిగా ఉద్యాపన చెయ్యాలి." అని కశ్యపుడు చెప్పగా, దితి అలాగే చేస్తానని పలికినది. సరియైన ముహూర్తాన వ్రతాన్ని ప్రారంభించి, దీక్షాగృహంలోనుంటూ, నియమాలను పాటించసాగినది. ఆమె గర్భవతి అయినది. ఇంద్రుడు ఈ విషయాన్ని

తెలుసుకొని, మారువేషంలో పినతల్లి వద్ద పరిచారకునిగా చేరి, ఆమెకు కావలసిన పూజాసామగ్రి, ఫలపుష్పాదులు అన్నీ తెచ్చిపెట్టేవాడు. ఆమెవలన వ్రతమాచరించడంలో ఏదైనా లోపం జరుగకుండా ఉంటుందా అని వెయ్యికళ్లతో కనిపెట్టుకొని ఉండేవాడు. చివరకు ఒకనాడు దితి బడలిక వలన తొందరలో కాళ్లు చేతులు కడుగుకొనకుండా పక్కఎక్కి నిదురపోసాగినది. అదనుకోసం ఎదురు చూస్తున్న ఇంద్రుడు అదితికి నియమ భంగమైనట్లు తెలుసుకొన్నాడు. తన యోగశక్తిచే సూక్ష్మదేహము ధరించి దితి గర్భంలో ప్రవేశించాడు. దేదీప్యమానుడై వెలిగిపోతున్న గర్భస్థబాలుని చూచాడు. తన వజ్రాయుధంతో ఆ బాలుని ఖండఖండాలుగా చెయ్యబోతే వాడు ఏడ్వనారంభించాడు. ఇంద్రుడు "మారుద" (ఏడ్వకు) అంటూవానిని ఏడుఖండాలుగా ఛేదించాడు. ఆ ఏడు శకలాలూ ఏడుగురు బాలురై ఏడ్వనారంభించారు. ఇంద్రుడు మళ్లీ ఆ ఏడుగుర్నీ ఏడేసి ఖండాలుగా ఛేదించగా ఆ ఖండాలన్నీ 49 మంది బాలురుగా తయారయినవి. దితి చేసిన పన్నెండునెలల ఉపాసనా ఫలితంగా శ్రీలక్ష్మీనారాయణుల అనుగ్రహంచేత జన్మించిన వారవటంచేత వారు వజ్రాయుధం చేతకూడ చావలేదు. ఆ బిడ్డలందరూ ఇంద్రుని "అన్నా! మేము నీ సోదరులము. నీ సేవ చేస్తాము. మమ్మల్ని చంపవద్దు" అని ప్రార్థించారు. అప్పుడు ఇంద్రుడు చేసేదిలేక "అలాగే, మిమ్మల్ని చంపను. నాపార్షదులుగ నా సేవలు చేస్తూ ఉండడానికి నా వద్దనే ఉంచుకొంటాను. మీరు మరుద్గణాలనబడుతారు" అని అభయమిచ్చాడు.

దితి గర్భం నుండి ఇంద్రునితో సహా 49 మంది మరుత్తులూ బైటపడ్డారు. ఈ విపరీత పరిణామం చూచి, దితి దిగ్భ్రాంతి చెందినది. ఇంద్రుని చంపగల ఒక్క పుత్రుని గురించి తాను పుంసవనవ్రతం చేస్తే యాభైమంది కుమారులొక్కసారి పుట్టడం ఎలాగ సంభవించినది? అంటూ ఆమె కలవరం చెందినది. ఆ బిడ్డలను తేరిపార చూడగా, అగ్నితేజస్సుతో వెలిగిపోతున్న ఇంద్రుని వారిలో పోల్చుకొన్నది. ఆమె ఆగ్రహావేశముతో ఇలా అడిగినది: "ఓయీ! ఏమిటీ వైపరీత్యము? నిన్ను చంపగల పుత్రుని కోసం నేను వ్రతంచేస్తే, నీవే నా గర్భంనుండి బయటకు రావడమేమిటి? నిజం చెప్పు" అని గద్దించి అడిగేసరికి ఇంద్రుడు భయపడిపోయి, జరిగినదంతా చెప్పి, ఆమె శరణువేడుకొన్నాడు. దితి మాతృహృదయం కరిగినది. ఆమె ఇంద్రుని క్షమించినది. విధి నిర్ణయం ఎలాగుంటే అలాగే జరుగుతుంది. దానినెవ్వరూ మార్చలేరని జ్ఞప్తికితెచ్చుకొన్నది. తనకు ఒక్క పుత్రుని బదులుగా 49 మంది లభించారనీ, వారంతా అసురులుకానకుండా అమరులైనారనీ, అంతా ఈశ్వరేచ్ఛ అని సంతసించినది. ఇంద్రునితో సహా 49 మరుత్తులూ స్వర్గలోకానికి వెళ్లి దేవతలై వెలసినారు. ఇంతటితో అరవైమంది దక్షపుత్రికల సంతతుల వివరాలు ముగిసినవి అని శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెప్పాడు.

**షష్ఠస్కంధము - సమాప్తము**

**హరిః ఓం తత్ సత్**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# సప్తమస్కంధము

## జయవిజయులు

**పరీక్షిత్తు ఇలాగ ప్రశ్నించాడు** : 'మునీంద్రా! శ్రీమహావిష్ణువు సర్వజీవకోటికీ హితుడూ, దయాసాగరుడూ, సముడూ కదా! మరి కేవలం ఇంద్రుని కాపాడడానికే రాక్షసులను హతమార్చడం ఎందుకు? అసురులవలన తనకేమీ చేటూ, భయమూ లేవు కదా?'' అని అడుగగా శ్రీశుకుడిలాగ చెప్పాడు: "రాజా! చాలా చక్కని ప్రశ్న వేశావు. చాలామందిలో ఈ సందేహం ఉండవచ్చు. సృష్టిలోని జీవరాసులన్నీ పంచభూతములతో కూడియున్న ప్రకృతినుండి ఉద్భవించినవే. సత్త్వ రజ స్తమో గుణాలనబడే త్రిగుణాలు, జీవరాసులను కూడ ఆవరించియుంటాయి. జీవులలో వ్యక్తమయ్యే రాగద్వేషాలు, కామక్రోధాలులాంటి ద్వంద్వభావాలన్నీ ఆయా జీవులయందున్నట్టి త్రిగుణాల ప్రభావం వలన కలుగుతుంటాయి. భగవంతుడు ఈ త్రిగుణాలకు అతీతుడు గనుక ఆయనకు ఎవ్వరియందూ, దేనియందూ, రాగద్వేషాది ద్వంద్వభావాలుండవు. అందుచేతనే ఆయన సమవర్తనుడు. జీవులకు కలుగుతుండే కష్టసుఖాలు, చావుపుట్టుకలులాంటి అనుభవాలు, ఆయా జీవులు చేసుకొన్న కర్మల ననుసరించి సంభవిస్తాయి. భగవంతుడు కేవలం సాక్షిభూతునిగాను, కర్మఫలప్రదాతగాను మాత్రమే ఉంటాడు. న్యాయాన్ని అమలుపరచే విధాత అనవచ్చును. ఈ రహస్యం మానవులకు తెలియదు కనుక భగవంతుడే అన్నీ స్వయంగా చేస్తున్నట్లు భావిస్తారు. శ్రీహరి చరిత్రలూ, చేష్టలూ ఎవ్వరికీ అర్థంకావు.

క॥ చిత్రంబులు త్రైలోక్య పవిత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవనచైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్. 6

శ్రీమహావిష్ణువు చరిత్రలు కేవలం చిత్రాలు మాత్రమే కాదు, ముల్లోకాలనూ మిగుల పవిత్రం చేయునవికూడా, జీవరాసులకు ఆప్తమిత్రాలు, వనాలకు వసంతఋతువువలె మునిజనులకు ఆనందదాయకాలు, సంసారబంధాలను అవలీలగా ఛేదించే లవిత్రాలు(కొడవళ్లు), భక్తిముక్తిప్రదాలు, ఆయనతత్త్వం ఎవ్వరికీ అంతుబట్టదు. సత్త్వగుణ ప్రధానులకూ రజోగుణతమోగుణ ప్రధానులకూ, గుణ స్వభావ భేదమువలన సంఘర్షణ జరుగుతునే ఉంటుంది. కాల, కర్మానుసారముగ, వృద్ధిక్షయాలు పొందుతాయి. సత్త్వగుణాధిక్యతలో నున్నప్పుడు దేవతలు, సాధువులు సజ్జనులు పైచేయిగానుంటారు. రజోగుణతమోగుణాధిక్యతలో నున్నప్పుడు అసురప్రవృత్తిగల వ్యక్తులదిపైచేయిగా నుంటుంది. రాజా! నీ సందేహంలాంటిదే పూర్వము రాజసూయయాగం చేస్తున్నప్పుడు యుధిష్ఠిరునికి కూడ వచ్చినది. రాజసూయయాగంలో శిశుపాలుడు శ్రీకృష్ణుని నానామాటలాడి దూషించి, అవమానించగా, శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని ప్రయోగించి, వాని శిరస్సును ఛేదించాడు. శిశుపాలుని శరీరంనుండి వాని జీవాత్మ దివ్యతేజస్సుతో బయటకు వచ్చి, శ్రీకృష్ణునిలో ప్రవేశించినది. అది చూచి యుధిష్ఠిరుడు అత్యాశ్చర్యచకితుడై నారద మహర్షిని ఇలాగ అడిగాడు: "మునివరేణ్యా! మహాతపశ్శాలికి అయినా భగవత్సాయుజ్యం అతి దుర్లభంకదా! మరి నిరంతర కృష్ణద్వేషియైన ఈ శిశుపాలునకు ఇంతటి మహద్భాగ్యం ఎలాగ కలిగినది? పూర్వము వేనుడనే రాజు వాసుదేవద్వేషంతో బ్రాహ్మణ సంకల్పంచే నశించిపోలేదా?'' అని అడుగగా నారదమహర్షి ఇలా చెప్పాడు: "ధర్మనందనా! విష్ణుమూర్తికి ఎవ్వరియెడలా పక్షపాతం ఉండదు. సకల చరాచర సృష్టిపట్ల ఆయన సమవర్తనుడే. జీవులే మాయామోహితులై గుణచోదితులై, వాసనాప్రేరితులై, కర్మలనాచరిస్తూ కర్మఫలాలననుభవిస్తుంటారు. ఏమరకుండా ఎడతెగకుండా ఆశ్రీహరినే స్మరిస్తుంటే, ఆయన సన్నిధానం లభిస్తుంది. ఈస్మరణ కోరికతోగాని, కోపముతోగాని, స్నేహముతోగాని, మోహముతోగాని,

ప్రీతితోగాని, భీతితోగాని, శత్రుత్వంతోగాని, వాత్సల్యంతోగాని, మూఢత్వంతోగానీ, ఏవిధంగానైనా సరే జరగవచ్చు. శ్రీహరిని భక్తితో కంటే విరోధంతోనే త్వరగా చేరవచ్చునేమో? అని అనిపిస్తుంది.

శా॥ కామోత్కంఠతగోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రింగంటి మెట్లైన ను
ద్ధామధ్యానగరిష్ఠుడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా. 18

పాండునందనా! కామాతిశయముతో గోపికలు, భయముతో కంసుడూ, వైరభావముతో శిశుపాలాది రాజులూ, బంధుత్వముచే యాదవులు, ప్రేమచే మీరూ(పాండవులు), భక్తిచే మేము(మునులము) ఇక్కడ చక్రిని చూడగలిగాము. నిరంతర సంస్మరణ ధ్యానాదులచే శ్రీహరిని చేరవచ్చును. శిశుపాలుడు ద్వేషముచేనైననూ నిరంతరమూ కృష్ణునే స్మరిస్తుండేవాడు. వేనునికి భగవంతుని యందు అలక్ష్యభావము, నాస్తికత్వమూతప్ప, నిరంతరస్మరణము, మననము చేసే తలంపే లేదు నిరసనగానైనా. అందుచేతనే బ్రాహ్మణుల కోపాగ్నికి హతుడైనాడు. రాజా! ఈ శిశుపాలుడు కూడ సామాన్యుడేమీ కాడు. వైకుంఠవాసి. సాక్షాత్తు విష్ణుమూర్తి యొక్క అంతఃపుర ద్వారపాలకుడు. ఆ ద్వారపాలకుల చరిత్ర చెపుతాను విను:-

ఒకనాడు బ్రహ్మమానస పుత్రులైన సనక సనందాదులు ముల్లోకాలూ సంచరిస్తూ వైకుంఠుని దర్శించాలని వెళ్లారు. అప్పుడు వారు ఐదారేళ్ల చిన్ని బాలకులవలె నుండేవారు. వారు విష్ణుమూర్తియొక్క అంతఃపురద్వారంలో ప్రవేశిస్తుంటే అక్కడ జయవిజయులనే ద్వారపాలకులు వారినడ్డగించి, గేలిచేసి లోనికి పోనీయకుండా 'బైటకు పొండు' అన్నారు. బాలరూపధారులైయున్న ఆ మహామునులు శ్రీ మహావిష్ణువుయొక్క పరమభక్తులు. వారంటే, ఆయనకుకూడా ప్రీతి ఎక్కువ. బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్న చూడచక్కని ఆ ముని బాలురు అతి నిర్మల మనస్కులు. గర్వము అంటనివారు. తమను శ్రీహరి సన్నిధికి పోకుండా అడ్డుపెట్టి, కర్కశంగా ప్రవర్తించిన ఆ జయవిజయులను "మీరు వైకుంఠంలో ఉండరాని అసురప్రవృత్తిని ప్రదర్శించారు కనుక అసురులై పుట్టెదరుగాక!" అని ఆ బాలఋషులు శపించారు. జయవిజయులు తెలివితెచ్చుకొని తమ తప్పిదాన్ని తెలుసుకొని, పశ్చాత్తాపంతో శరణువేడుకొనగా, కనికరించి, "మీకు మూడు జన్మల వైర భక్తి కలిగిన అనంతరం మళ్లీ భగవత్సాన్నిధ్యం లభిస్తుందని" అనుగ్రహించి వెళ్లిపోయారు. జయవిజయులు హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా దితి గర్భాన జన్మించారు. హిరణ్యాక్షుడు భూమిని చుట్టచుట్టుకొని పట్టుకుపోతుంటే విష్ణువు వరాహరూపంలో వానిని సంహరించి, భూమండలాన్ని ఉద్ధరించాడు. తమ్ముని చంపిన శ్రీహరిపై కక్షకట్టిన హిరణ్యకశిపుడు ఆయనకై ముల్లోకాల్లోనూ వెదకసాగాడు. తన పుత్రుడైన ప్రహ్లాదుడే హరిభక్తుడయ్యే సరికి శ్రీహరిపై ద్వేషమూ, రోషమూ పెంచుకొని, పరమభాగవతుడైన ప్రహ్లాదకుమారుని చిత్రహింసలు పెట్టేసరికి విష్ణువే నరసింహుని రూపములో అవతరించి, హిరణ్యకశిపుని హతమార్చాడు. రెండవ జన్మలో జయవిజయులు కైకసి అనే అసుర స్త్రీకి రావణ కుంభకర్ణులై జన్మించి, రఘురామునిగా అవతరించిన శ్రీహరిచేతనే సంహరింపబడుతారు. మూడవ జన్మలో మీపిన తల్లి అయిన సాత్వతికి శిశుపాల దంతవక్త్రులుగా జన్మించి, నిత్యమూ శ్రీహరినే దూషిస్తూ శ్రీకృష్ణ పరమాత్మ చేత చంపబడి, తిరిగి శ్రీహరి సన్నిధికే చేరుకొన్నారు.

## హిరణ్యకశిపుడు

తమ్ముడైన హిరణ్యాక్షుని చంపిన శ్రీహరిపై హిరణ్యకశిపుడు ఆగ్రహోదగ్రుడై తన సభామంటపంలో చిందులు త్రొక్కుతూ, అక్కడనున్న - త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, నముచి, శతబాహు, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి మొదలైన ప్రముఖ దైత్య దానవులతో ఇలా అన్నాడు: "మా తమ్ముని హతమార్చిన ఆ మాయావి - వరాహం ఎక్కడ దాగియున్నా ఆచూకీ తెలుసుకొని రండి. విప్రులుండే ప్రదేశాలూ, యజ్ఞాలు జరిగే ప్రదేశాలూ ధ్వంసం చెయ్యండి. ఆ విష్ణువు అలాంటి చోట్లనే దొరుకుతాడు" అని ఆదేశాలు ఇచ్చాడు. ఆ ప్రకారమే ఆ రాకాసి మూకలు గ్రామాలను,

పుణ్య క్షేత్రాలను, ఆశ్రమాలను, తపోవనాలను ధ్వంసం చేశారు. గోవులను, బ్రాహ్మణులను, మునులను, సాధువులను హతమార్చారు. దేవతలు కూడ భయపడి ఎక్కడెక్కడనో దాగుకొన్నారు.

హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుని భార్యలను కొడుకులను ఓదార్చాడు. తన తల్లి అయిన దితి పుత్రశోకంతో కుమిలిపోతుంటే ఇలాగ ఆమెను ఊరడించాడు: "తల్లీ! తమ్ముడు మహాశూరుడు. వీరస్వర్గాన్నధిష్ఠించాడు. నిన్ను వీరమాతను చేశాడు. పుత్రవియోగానికి నీవు శోకింపదగదమ్మా! దాహము తీర్చుకొనడానికి వచ్చి, కాసేపు ఉండి వెళ్లిపోయే బాటసారుల వంటివే కదమ్మా. సంసారంలో ఈ జీవుల రాకపోకలు తనమాయాశక్తిచే లోకాలను ఆడించే ఆ పరమేశ్వరుని లీలలే కదమ్మా ఇవిఅన్నీ ఈ చావు పుట్టుకలూ, శోకమోహాలూ, ఎట్లు క్షణికమైనవో ఒక సంఘటనతో వివరించే ఒక కథ చెప్తాను విను!

"ఉశీనరదేశంలో సుయజ్ఞుడనే రాజు ఉండెను. అతడు యుద్ధములో మరణించగా అతని రాణులు మిక్కిలి దుఃఖముతో విలపిస్తూ దహన సంస్కారానికి అడ్డంగా నిలిచారు. యముడు ఒక విప్రబాలుని రూపములో వచ్చి ఇలాగ చెప్పాడు. "దేహంధరించిన ప్రతి వ్యక్తీ పుట్టటం గిట్టటం సహజము. ఈ చనిపోయిన వ్యక్తి గురించి చనిపోకుండా శాశ్వతంగా ఉండిపోయే వారిలాగా మీరు విలపిస్తున్నారేమిటి? జీవి ఎక్కడి నుండి వచ్చినదో మళ్లీ అక్కడికే వెళ్లిపోతుంది. ఈ అనివార్య ఘటనను గురించి మీరు దుఃఖించవదగదు. భగవంతుని అనుగ్రహం ఉంటే అడవిలో క్రూరమృగాల మధ్యన ఉన్ననూ సురక్షితంగా నుండవచ్చును. దైవానుగ్రహం లేకపోతే ఇంటిలో నెంత భద్రముగా దాగినా ఆపదసంభవించ వచ్చును. ఆ పరమేశ్వరుడే సకల జీవరాసులనూ రక్షించి, పోషించి, నశింప జేసేవాడు. ఆయన తత్త్వం ఎవ్వరికీ అర్థంకాదు. జీవులు తమతమ కాల కర్మలకు వశులై నడిపింపబడుతుంటారు. కర్మాను బంధం ఉంటే సంయోగం కలుగుతుంది. ఈ సుయజ్ఞుని శరీరం ఇక్కడనే ఉన్నది కదా! మరి మరణించినదెవ్వరు? ఆలోచించారా? దేహాన్ని ఆత్మ విడిచి పెట్టడాన్ని చావు అనుకొంటారు. ఆ చావు ఆత్మకు ఎప్పుడూ సంభవించదు. పతనమయ్యేది ఒక్క దేహము మాత్రమే. నశించేదేహాలతో ఏర్పడిన సంబంధాలు కూడా అంతమయ్యేవే. ఈ సత్యాన్ని గ్రహించలేక అజ్ఞానులు శోకిస్తారు. మీరు ఒక వందసంవత్సరాలు ఇలాగ ఏడుస్తూ కూర్చున్నా, ఈ సుయజ్ఞుడు లేచి కూర్చొనడు"అని చెప్పిన బాలకుని వాక్కులు విని సుయజ్ఞుని పరివారంవారు తెలివి తెచ్చుకొని తమ కర్తవ్యం నిర్వహించారు.

హిరణ్యకశిపుడు ఇంకా ఇలాగ చెప్పాడు: "అజ్ఞానంచేత జీవులు నావాళ్లూ ఇతరులూ అనే భేదభావం చూపుతారుగాని, యథార్థం తెలుసుకొంటే అంతా ఒక్కటే కదా!" అని, ఈ విధంగా తల్లినీ, తమ్ముని పరివారాన్నీ ఊరడించాడు.

హిరణ్యకశిపుడు త్రిలోకాధిపత్యాన్ని చేజిక్కించుకొని, జరామరణాలను జయించాలనే కోరికతో మందర పర్వత సానువులకుపోయి, ఘోరమైన తపస్సు చేయనారంభించాడు. ఒంటికాలిబొటన వ్రేలిపై నిల్చొని, రెండు చేతులు పైకెత్తి, ఆకాశంపైన దృష్టి నిలిపి, కఠోరమైన దీక్షతో తపస్సు చేయసాగాడు. అతని శిరస్సునుండి అగ్నిజ్వాలలు చెలరేగాయి. భూమండలం అదిరినది. సముద్రాలు అల్లకల్లోలమయ్యాయి. గ్రహనక్షత్రాలు గతితప్పి, మాడిపోసాగాయి. ప్రాణికోటులు భయంతో తల్లడిల్లాయి. దేవతలు భీతిజెంది బ్రహ్మదేవుని శరణుజొచ్చారు. హిరణ్యకశిపుని తపస్సు విరమింపజేయుమన్నారు. ఆ అసురునకు భయపడి పారిపోయి దాగుకొన్నదేవతలు వాడు తపస్సునకు వెళ్లిన తరువాత తిరిగివచ్చి, తమతమ తావులను వశపరచుకున్నారు. హిరణ్యకశిపుడు తాను అమరుడు, అజేయుడూ, కావాలని కోరుకొనవచ్చు, కనుక వరమిచ్చేటప్పుడు సావధానముగా యోచింపుమని వారు బ్రహ్మదేవుని వేడుకొన్నారు. వారికి విధాత అభయమిచ్చి, భృగువూ, దక్షుడూ మొదలైన పెద్దలను తోడ్కొని, మందర పర్వతం వద్దకు వెళ్లాడు. హిరణ్యకశిపుడు వెయ్యి దివ్య సంవత్సరాలు దేహధ్యాసలేకుండా తపోనిష్ఠలో మగ్నుడైయున్నాడు. అతని శరీరంలోని రక్తమాంసాలను చీమలూ, కీటకాలూ తినివేసి, చుట్టూ పుట్టను పెట్టాయి. దానిమీద గడ్డి, వెదురు తుప్పలూ మొలచినా, అతని శరీరకాంతి సూర్యరశ్మివలె పైకి కనిపిస్తున్నది. అదిచూచి విధాత విస్మయంచెంది ఇలా అన్నాడు: "ఓ దానవేంద్రా! ఇక నీ తపస్సు చాలించు. ఇంత ఘోరమైన తపస్సును ఇంతవరకు ఎవ్వరూ చెయలేదు. నీ తపస్సునకు సంతసించాను. నీ కోరిక ఏమిటో చెప్పు. తీర్చుతాను", అని చెప్పి, తన కమండలం నుండి నీరు తీసి ఆ పుట్టపై జల్లగానే, తపస్సు విరమించి సంపూర్ణదేహసౌష్ఠవంతో, సుందర విగ్రహుడై సూర్యునివలె మెరిసిపోతూ,

హిరణ్య కశిపుడు బైటకు వచ్చాడు. వానికి శ్రీహరి శత్రువు కనుక, బ్రహ్మదేవుడే ఆరాధ్య దైవము. అందుచేత బ్రహ్మదేవుని పాదాలకు శిరస్సుతో మ్రొక్కి, ఆయనను అనేకప్రియవచనాలతో స్తుతించి ఇలా అన్నాడు: "ఓ సృష్టికర్తా! నీ దర్శన భాగ్యముతోనే నా జన్మ పావనమైనది. వరాలనిస్తానన్నావని కోరుకొంటున్నాను. అనుగ్రహిస్తావని నమ్ముతున్నాను. ఓ దేవపితామహా! నేను ఈ ముల్లోకాలలో నెక్కడికి వెళ్లినా విజయమే కలగాలి. నీచే సృష్టింపబడిన ఏ ప్రాణి చేతనైననూ, నాకు చావు రాకూడదు. గాలిలోగాని, నీటిలోగాని, నింగిలోగాని, నిప్పులోగాని నేలపైగాని, ఇంటాబయటాగానీ, చీకటివెలుగుల్లో గాని, అస్త్రశస్త్రాలతోగాని, నాకు మరణం రాకూడదు. నాకు దేవ, దానవ, నర, జంతు, నాగులలో నెవ్వరిచేతనూ చావు రాకూడదు. అలాంటి జీవితం ప్రసాదించు" అని కోరుకొన్న హిరణ్యాకశిపునితో బ్రహ్మ "సరే"అని, ఇలాగ అన్నాడు: "నాయనా! ఇలాంటి వరాలు ఎవ్వరూ కోరలేదు. అయినా నీకు మాత్రమే ఇవ్వబడిన ఈ అపూర్వమైన వరాన్ని నీవు దుర్వినియోగం చేయకుండా సద్బుద్ధితో ప్రవర్తిస్తూ అనుభవించు" అని హితవు చెప్పి అంతర్ధాన మయ్యాడు.

వరము పొందిన హిరణ్యాకశిపుడు బ్రహ్మదేవుని హితవాక్యాలను మన్నించకుండా, పట్టలేని అహంకారంతో శ్రీహరిపైన వైరముపెంచుకొని, ముల్లోకాల్లోనూ బీభత్సం సృష్టించడానికి పూనుకొన్నాడు. దేవతలను గంధర్వులను విద్యాధరులను యక్షులను కిన్నరులను సిద్ధులను సాధ్యులను చారణులను నాగులను పక్షులను భూతప్రేత పిశాచాలను మానవులను జంతువులను నానాబాధలకు గురిచేశాడు. దిక్పాలకులను తరిమివేసి, వారి రాజధానులను ఆక్రమించాడు. లోకాలన్నిటినీ జయించి, సురేంద్రుని రాజమందిరాన్ని ఆక్రమించడానికి వెళ్లాడు. విశ్వకర్మచే సకల వైభవాలతో నిర్మింపబడిన ఆఇంద్రభవనవైచిత్రిని చూచి దిగ్భ్రాంతి చెందాడు. తిన్నగా పోయి దేవేంద్రుని సింహాసనాన్ని అధిష్ఠించాడు ఆ దానవేంద్రుడు. దేవతలంతా భయభ్రాంతులై ఏమాత్రమూ అడ్డగింపలేదు సరికదా శిరస్సులువంచి, కానుకలిచ్చి, శరణువేడుకొన్నారు. ఏ క్షణాన ఎవరికి ఎలాంటి హింసలు పెడతాడో అనే భయంతో పిడికిళ్లలో ప్రాణాలు పెట్టుకొని వినయంగా నిల్చొనియుంటే, వారికి రాక్షసభటులు పనులు పురమాయిస్తూ, అదలిస్తూ ఆజ్ఞాపిస్తున్నారు. హిరణ్యాకశిపుడు తన భార్య అయిన లీలావతితో సర్వ స్వర్గసుఖాలూ అనుభవిస్తుండేవాడు. నేనూ(నారదుడు), తుంబురుడూ మా గానాలతో అతనిని సంతోషపెట్టేవారము, యజ్ఞాలలో హవిర్భాగాలను దేవతలకు అందకుండా అంతా తానే తీసుకొనేవాడు.

హిరణ్యాకశిపుని చండశాసనానికి భయపడి, మూడులోకాల్లోనూ పాడిపంటలు సమృద్ధిగా లభించేవి. దున్నకుండానే భూములు పంటలనిచ్చేవి. అవసరం అయినప్పుడే వర్షం కురిసేది. వృక్షాలు అన్ని ఋతువుల్లోనూ, అన్ని రకాల పువ్వులూ పళ్లూ ఇచ్చేవి. రత్నరాసులూ, సకల ఐశ్వర్యాలూ సమృద్ధిగా నుండేవి. ఏకైకనాథుడైన ఆ దానవరాజు అదుపులేని ఇంద్రియ భోగాలననుభవిస్తూ తృప్తిచెందక, శాస్త్రమర్యాదలను, వైదిక ధర్మాలనూ ఉల్లంఘించి, నిరంకుశంగా శాసించడం మొదలుపెట్టాడు. రాక్షసులకు బానిసలుగా తయారైన దేవతలు, మహర్షులు మొదలైన వారంతా, ఆహారము, నిద్ర మానుకొని, ఈ రాక్షసుని పీడనుండి తమను రక్షించుమని శ్రీహరిని ప్రార్థించసాగారు. వారికి ఆకాశంనుండి ఇలాగ వినిపించినది: "దేవతలారా! భయపడకండి. నాకు అంతా తెలుసు. ధర్మం తప్పిన వాడూ, వేదాలనూ, నన్నూ నిందించేవాడూ, గోవులను, సాధుసజ్జనులను హింసించువాడూ, అచిరకాలంలోనే పతనమైపోతాడు. సకల సద్గుణ సంపన్నుడైన ప్రహ్లాదుని కన్నకొడుకని అయినా కరుణలేకుండా, నాయందున్న ద్వేషముచే ఎప్పుడైతే హింసిస్తాడో అప్పుడే వాని అంతము ఆసన్నమయినదని గ్రహించండి. అంతవరకు ధైర్యము వహించండి. మీకు శుభము కలుగుతుంది." అని భగవానుడు అభయమివ్వగా అందరూ ఆనందించారు.

## ప్రహ్లాద చరిత్రము

(సప్తమ స్కంధానికి జంధ్యాలపాపయ్య శాస్త్రిగారి ప్రవేశికనుండి:-) ప్రహ్లాదుడు భక్తాగ్రేసరులలో ప్రప్రథముడు: అందుకే - "ప్రహ్లాదనారద పరాశర పుండరీక, వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్" అని అన్నారు. ప్రహ్లాదుని పేరు వచ్చేసరికి పరవశించిపోతారు పోతనగారు. అతని గుణగణాలను వర్ణిస్తూ పోతనగారు వాడిన సుమధుర లలిత పదాలివి:- ప్రహ్లాదుడు లలిత మర్యాదుడు, సుగుణాలవాలుడు, సమస్త సభ్యనుతశీలుడు, అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేషమత్తచిత్తుడు, బుధజనవిధేయుడు, మహాభాగధేయుడు,

సుగుణమణిగణగరిష్ఠుడు, పరమ భాగవతశ్రేష్ఠుడు, కర్మబంధలతాలవిత్రుడు, పవిత్రుడు, ప్రభావశాలుడు, హరిపాదపయోరుహ చింతన క్రియాలోలుడు, శాంతగుణ ప్రధానుడు, అతి శుద్ధాంచిత జ్ఞానుడు, అజ్ఞానారణ్యకృశానుడు, అంజలీపుటీసంభ్రాజమానుడు, భయవిరహితుడు, బ్రహ్మజ్ఞానసహితుడు, పులకితదేహుడు, సంతోషబాష్పసలిల ధారాసమూహుడు, ప్రేమాతిశయగద్గదభాషణుడు, వినయవివేక భూషణుడు, ఏకాగ్రచిత్తుడు, భక్తిపరాయత్తుడు.

### ఓం నమో నారాయణాయ

యుధిష్ఠిరునితో నారదమహర్షి ఇలాగ చెపుతున్నాడు:- హిరణ్యకశిపునకు నలుగురు కుమారులుండిరి. వారిలో ప్రథముడు ప్రహ్లాదుడు. అతడు హరిభక్తుడు పరమభాగవతుడు, నారాయణతత్త్వాన్నెరిగినవాడు. ఇంకా, ఎలాంటివాడంటే -

**సీ॥ తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాడు**
**పెద్దలపొడగన్న భృత్యునికైవడి చేరి నమస్కృతుల్ సేయువాడు**
**కన్నుదోయికి నన్య కాంతలడ్డంబైన మాతృభావన సేసి మరలువాడు**
**తల్లిదండ్రుల భంగి ధర్మ వత్సలతను దీనులఁగావ చింతించు వాడు**
**తే॥ సఖులయెడ సోదరస్థితి జరుపువాడు దైవతములంచు గురువుల దలచువాడు**
**లీలలందును బొంకులు లేనివాడు లలిత మర్యాదుడైన ప్రహ్లాదుడధిప! 115**

ఓ ధర్మరాజా! ప్రహ్లాదుడు సమస్తప్రాణులూ తనవంటివేనని, వాటియందు సమహితత్వము కలిగియుండేవాడు (సమదర్శనుడు). పెద్దలెదురైతే సేవకునివలె వినయంతో నమస్కరించే వినమ్రశీలి. ఇతర స్త్రీలు కనిపిస్తే మాతృభావంతో ప్రక్కకు తొలగిపోయే శీలవంతుడు. దీనులను తలిదండ్రులవలె ధర్మవత్సలతతో ఆదరించే దయార్ద్ర హృదయుడు. స్నేహితులను సోదరులవలె భావించే సహృదయుడు, గురువులను దైవసమానులుగా గౌరవించే ఆదర్శశిష్యుడు, హాస్యానికైనా అసత్యమాడని సత్యసంధుడు. అతడుచక్రవర్తి తనయుడూ, సుందరరూపుడూ అయినప్పటికీ కొంచెమైనా గర్వము లేనివాడు. విషయభోగాలమధ్య పెరిగినా, వాటిని పట్టించుకొనని ధీరుడు. కామము, క్రోధము, లోభము, మోహము ఏమీలేని వాడు. దైత్యతనయుడైనా అతనికి ఎల్లవేళలా శ్రీహరిచింతనే తప్ప అన్యతలంపే ఉండదు. సద్గుణాలన్నీ వచ్చి అతనిని అంటిపెట్టుకొని ఉంటాయి. అతనిని దేవతలు కూడ తమతమ సమావేశాలలో మెచ్చుకొంటూ ఉత్తమునకు ఒక చక్కని ఉదాహరణగా పేర్కొంటారు. అతని గుణగణాలను వర్ణించడానికి ఆదిశేషునకుగాని, బృహస్పతికిగాని, కడకు బ్రహ్మదేవునికిగాని సాధ్యపడదు. ప్రహ్లాదుడు నిత్యమూ ఇతర కార్యకలాపాల్లో పాల్గొనకుండా శ్రీహరినే చిత్తమందు తలచుకొంటూ ఉండటంచేత పైకి జడుని వలె కన్పించేవాడు.

**శా॥ పానీయంబులు ద్రావుచున్ కుడుచుచున్ భాషించుచున్ హాసలీ**
**లానిద్రాదులు సేయుచున్ తిరుగుచున్ లక్షింపుచున్ సంతత**
**శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం**
**ధానుండై మరచెన్ సురారి సుతుడేతద్విశ్వమున్ భూవరా! 123**

ఓ ధర్మజా! ఆ ప్రహ్లాదుడు ఆహారపానీయాలు తీసుకొనేటప్పుడూ, సంభాషించేటప్పుడూ, వినోదించేటప్పుడూ, తిరిగాడుతున్నప్పుడూ, పనిచేస్తున్నప్పుడు, నిద్రిస్తున్నప్పుడుకూడ ఆ శ్రీమన్నారాయణ పాదపద్మ స్మరణామృతాన్ని ఆస్వాదించడంలోనే నిమగ్నుడై ఈ లోకాన్నే మరచిపోయేవాడు, అంతేకాదు -

**సీ॥ వైకుంఠ చింతావివర్జితచేష్టుడై యొక్కడు నేడుచు నొక్కచోట;**
**వశ్రాంత హరిభావనారూఢ చిత్తుడై యుద్ధతుడై పాడునొక్కచోట;**
**విష్ణుడింతియ కాని వేరొండులేదని యొత్తిలి నగుచుండు నొక్కచోట;**
**నళినాక్షుడను నిధానము గంటినేనని యుబ్బిగంతులు వైచునొక్కచోట;**
**ఆ॥ పలుకునొక్కచోట పరమేశుకేశవుఁ బ్రణయహర్షజనిత బాష్పసలిల**
**మిళిత పులకుడై నిమీలితనేత్రుడై యొక్కచోట నిలిచి యూరకుండు. 124**

ప్రహ్లాదుడు ఒక్కొక్కసారి హరిస్మరణానందములో మైమరచి ఒక్కడూ కూర్చొని ఏడ్చేవాడు. నిరంతర హరిచింతనతో నిండిన మనస్సుతో గొంతెత్తిగానం చేసేవాడు. అంతా విష్ణుమయమేగాని వేరేమీ లేదని గట్టిగా నొక్కివక్కాణిస్తూ నవ్వేవాడు. "కమలాక్షుడనే పెన్నిధిని నేను కనుగొన్నాను" అంటూ పొంగిపోతూ గంతులు వేసేవాడు. కేశవా! మాధవా! మధుసూదనా! పరమేశ్వరా! అంటు భక్తి పారవశ్యంలో కేకలుపెడుతూ ఆనందబాష్పాలు కురిపిస్తూ మైమరచేవాడు. ఒక్కొక్కసారి అర్ధనిమీలిత నేత్రుడై ఎక్కడున్నాడో తెలియనివానివలె కూర్చుంటూ ఉండేవాడు. అతని తనువంతా విష్ణుమయమే. అతని పూర్వజన్మలలో మహాభాగవతులతో మంచి స్నేహం ఉండేది. అందుచేత ఈ జన్మలో అసురగృహంలో జన్మించినా దుష్టుల మధ్య పెరుగుతున్నా అతని హరిభక్తి సడలలేదు. అతడు బంధాల్లో చిక్కుకొనలేదు. అటువంటి పుణ్యాత్ముడైన పుత్రుని కఠినాత్ముడైన తండ్రి అనేకమైన హింసలకు గురిచేసి చంపించ ప్రయత్నించేవాడు.

తన పుత్రుడు తనవలె రజోగుణముతో చురుకుగా ఉరకలు వేస్తూ ఉండకుండా స్తబ్ధుడుగా, అన్యమనస్కంగా తనలోనే తాను మురిసిపోతూ ఉండడం రాక్షస చక్రవర్తికి విడ్డూర మనిపించినది. విద్యాభ్యాసంలో నియోగిస్తే చురుకుదనం వచ్చి, చక్కబడగలడని భావించి, శుక్రాచార్యుని పుత్రులైన చండుడు, అమర్కుడు అనే గురువులవద్దకు బాలుని పంపించాడు ఆ తండ్రి. ప్రహ్లాదుడు విష్ణువునందే మనస్సు నిలిపి, గురువులు చెప్పిన విద్యలన్నిటినీ అవలీలగా నేర్చుకొని ఒప్పజెప్పేవాడు.

కొన్నాళ్ల తరువాత బాలుడెంత వరకు బాగుపడ్డాడో తెలుసుకొనగోరి, దానవరాజు ప్రహ్లాదునీ గురువులను రప్పించి, పుత్రుని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని, ప్రేమతో ఇలా అడిగాడు: "కుమారా! నీవు గురువుల వద్ద చాలా విషయాలు నేర్చుకొని యుంటావు. నీకు నచ్చిన విషయం గురించి ఏమైనా చెప్పు" అని అడిగిన తండ్రితో ప్రహ్లాదుడిలా చెప్పాడు: "తండ్రీ! నాకు నచ్చిన విషయం ఒక్కటే - అది నిరంతర నారాయణ చరణ స్మరణము. ప్రజలు అనేక బాధలకు గురిఅవడం మనం చూస్తున్నాం. దానికి కారణం నిస్సారమైనగృహ సంసారాది విషయాల యందు నేను, నాది అనే భావనలలో చిక్కుకొని, శాశ్వతమైన విష్ణుపాదాలను విస్మరించడమే అని నా ఉద్దేశము". అని చెప్పిన పసివాని మాటలు విని, ముసిముసి నవ్వులునవ్వుతూ తండ్రి ఇలా అన్నాడు: "నాయనా! విష్ణువు మన దానవజాతికే శత్రువు. మనము హరినీ, హరిభక్తుల్నీ బాధించి, వారికి భంగపాటు కలిగించాలిగాని భజింపరాదు. విష్ణువుమీద అభిమానం నీకే పుట్టిందా లేక మన శత్రువులే నీ మనస్సునకు ఎక్కించారా, లేక స్వామి ద్రోహం తలపెట్టి, నీ గురువులే నిన్ను ఈ వక్రమార్గం పట్టించారా చెప్పుతండ్రీ" అని లాలించి అడిగాడు. తనకెవ్వరూ ఏమీ నేర్పలేదన్నట్లు తల ఊపుతూ ప్రహ్లాదుడు గురువుల వంక చూస్తూ ఇలా అన్నాడు: "గురువర్యా! ఆ పరమాత్మను బ్రహ్మదేవుని వంటి వేదమూర్తులే తెలుసుకొనలేరు కదా, మరి ఎంత పాండిత్యమున్నా ఇతరులకు సాధ్యపడ్తుందా? హరిభక్తి ఒకరు చెపితే వస్తుందా? దైవానుగ్రహం చేత ఇనుము అయస్కాంతం వైపు ఆకర్షింపబడినట్లు నా మనస్సు ఆ మహావిష్ణుపాదాలచే ఆకర్షింపబడినది. మరిదేనియందూ నా మనస్సు లగ్నమవటంలేదు.

**సీ॥ మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు?**
**నిర్మల మందాకినీ వీచికల దూఁగు రాయంచ చనునె తరంగిణులకు?**
**లలిత రసాల పల్లవఖాదియై చొక్కు కోయిల చేరునే కుటజములకు?**
**పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకంబరుగునే సాంద్రనీహారములకు?**
**తే॥ అంబుజోదర దివ్య పాదారవిందచింతనామృత పానవిశేషమత్త**
**చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు వినుత గుణశీల మాటలు వేయునేల? 150**

గురుమహాశయా! మందార పుష్పాల మకరంద మాధుర్యములో మునిగితేలే తుమ్మెద ఉమ్మెత్త(కొండమానుల) పూవుల వైపుకి పోతుందా? నిర్మల సరోవరపు అలలపైతేలియాడే రాజహంస సముద్రకెరటాలవైపుకు పోతుందా? లేలేత మామిడిచిగుళ్లను ఆరగించి మైమఱచేకోయిల అడవి వృక్షాల చెంతకు చేరుతుందా? పూర్ణచంద్రుని

పండువెన్నెలలో పరవశించే చకోరపక్షి దట్టమైన పొగమంచువైపునకు మళ్లుతుందా? లేదు, అలాగవెళ్లలేవు. అలాగే దివ్యమైన ఆ విష్ణుపాదపద్మ ధ్యానామృతాన్ని గ్రోలి మత్తిల్లెడి నా చిత్తము ఇతర విషయాలపైకి ఎలాగ పోగలదు? అది అసంభవం. కనుక ఉత్తమ గుణశీలుడవైన ఓ గురుదేవా! ఇన్ని మాటలెందుకు?" అనిన బాలుని మాటలకు ఆశ్చర్యపోయి, ప్రభుభృత్యుడైన గురువు ఇలా అన్నాడు: "బాలకా! ఐదేళ్లవాడివి "ఇంత" గూడలేవు. మేము నేర్పిన అనేకమైన విద్యలలో నేదీ రాజుగారికి చెప్పకుండా శత్రు ప్రశంస చేస్తూ మాకు తలవంపులు తెస్తున్నావు. మీ వంశానికే అపకీర్తి తెస్తున్నావు. వీడు మహారాజునకు పుత్రుడు కాడు శత్రువు. గంధపుతోటలో పుట్టిన ముళ్లమొక్క. వీనిని కఠినంగా శిక్షిస్తే గాని బాగుపడడు" అంటూ ప్రహ్లాదుని మళ్లీ విద్యాలయానికి తీసుకుపోయాడు. అతనికి ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కామశాస్త్రము, రాజనీతి, అన్నీ బోధించాడు. ప్రహ్లాదుడు అన్నీ నేర్చుకొని, ఒప్పచెప్పగా, సంతోషించినవాడైన గురువు అతనిని లీలావతి వద్దకు ముందుగా తీసుకెళ్లి ఇలా అన్నాడు: "నాయనా, ప్రహ్లాదకుమారా! నీ కిప్పుడు సకలవిద్యలూ అబ్బినవి. నీ తండ్రి ప్రశ్నిస్తే సరియైన జవాబులు చెప్పు తండ్రీ! విష్ణు ప్రసక్తిని మాత్రము ఎత్తబోకు, నాయనా! మా పరువూ, ప్రాణాలూ కాపాడు" అని బ్రతిమాలుకొని, బాలుని రాజు వద్దకు తీసుకెళ్లాడు. రాజు సంతోషించి కుమారుని ఒడిలో కూర్చోబెట్టుకొని, ముద్దాడి, తలనిమిరి, ప్రియాలాపాలు చేసి ఇలా అన్నాడు:

**శా॥ చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ శోధించి యేమేమి సం**
**వేద్యాంశంబులు సెప్పిరో గురువులేవెంటన్ పఠింపించిరో**
**విద్యాసారమెఱుంగ గోరెద భవద్విజ్ఞాత శాస్త్రంబులో**
**పద్యంబొక్కటి సెప్పి సార్థముగ తాత్పర్యంబు భాషింపుమా. 163**

నాయనా! నీవు చదువుమొదలు పెట్టి ఇన్నాళ్లయినది కదా! నీ గురువులు నీకు ఏ విధంగా విద్య నేర్పించారో, నేర్చుకొనవలసినట్టి ఏయే విషయాలు నీకు నేర్పారో, దాని సారాంశం తెలుసుకోవాలనే కుతూహలం నాకు మిక్కుటముగా నున్నది. నీవు నేర్చుకొన్న విషయాల్లోనే ఒక్క అంశం మీదనైనా ఒక పద్యాన్ని వినిపించి, దాని తాత్పర్యం నాకు చెప్పుమయ్యా" అని కోరిన తండ్రితో ప్రహ్లాదుడిలాగన్నాడు:

**క॥ చదివించిరి నను గురువులు చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ**
**జదివినవి గలవు పెక్కులు చదువులలో మర్మమెల్లఁ జదివితి తండ్రీ! 166**

తండ్రీ! గురువులు నన్ను చక్కగా చదివించారు. నేను ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము మొదలైన అన్ని ముఖ్యమైన శాస్త్రాలను చదివాను. నేను చదివినవి చాలా ఉన్నవి. చదువులలో సారమంతా చదివాను. అది ఏమిటంటే:-

**మ॥ తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా**
**ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం**
**బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబుదైత్యోత్తమా! 167**

మనోవాక్కాయ కర్మల ఏకత్వము శ్రవణము, దాసత్వము, వందనము, అర్చనము, సేవ, ఆత్మనివేదనము, సంకీర్తనము, చింతనము, అనే నవవిధభక్తిమార్గాలను ఆశ్రయించి, సర్వాత్ముడైన శ్రీహరిని నమ్మి సజ్జనుడై యుండుటయే క్షేమకరం అని నేను నమ్ముతున్నాను, ఇదే సత్యము. తండ్రీ! హరిభక్తిలేని వారి జీవితాలు నిస్సారములు, వ్యర్థములు అని నా నమ్మకము.

**సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ**
**సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము**
**విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము**
**భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి.**
**తే॥ దేవదేవుని చింతించు దినము దినము చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు**
**కుంభినీధవుఁ జెప్పెడి గురుడు గురుడు తండ్రి! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి. 169**

తండ్రీ! శ్రీహరిని పూజించే చేతులే చేతులు, శ్రీనాథుని వర్ణించే నాలుకే నాలుక, శ్రీపతిని చూచేచూపులే చూపులు, శేషశాయికి మ్రొక్కెడిశిరస్సే శిరస్సు, విష్ణు కథలను వినెడి చెవులే చెవులు, మధుసూదనుని తలంచెడి మనస్సే మనస్సు, భగవంతునికి ప్రదక్షిణలు చేయు పాదాలే పాదాలు, పురుషోత్తమునియందు నిలిచెడి బుద్ధియేబుద్ధి, దేవదేవుని గురించి ఆలోచించెడి దినమే దినము, చక్రధారిని గురించి తెలియజేయు చదువే చదువు, గోవిందుని గురించి బోధించు గురువే గురువు, హరినే చేరాలి అని చెప్పెడి తండ్రియేతండ్రి.

**సీ॥ కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే పవన గుంభిత చర్మ భస్త్రి గాక**
**వైకుంఠుఁబొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమ ధ్వని తోడి ఢక్కగాక**
**హరి పూజనము లేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మిత దర్వికాక**
**కమలేశుఁజూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాల రంధ్రములు గాక**
**ఆ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే తరళ సలిల బుద్బుదంబు గాక**
**విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే పాదయుగముతోడి పశువు గాక!** 170

శ్రీహరిని సేవించని శరీరము కేవలం గాలితో నిండిన కొలిమితిత్తిగాని శరీరం అవుతుందా? వైకుంఠుని స్తుతించని నోరు కేవలం ఢమఢమ ధ్వని చేసే ఢక్కగాని నోరు అవుతుందా? హరిపూజ చెయ్యని చేయి కేవలం కర్రతో చేయబడిన తెడ్డుగాని చేయి అవుతుందా? కమలేశుని చూడని కన్నులు కేవలం శరీరమనే గోడలోనున్న రంధ్రాలుగాని కన్నులు అవుతాయా? చక్రధారిని గురించి ఆలోచించని జన్మ క్షణికమైన నీటి బుడగగాని జన్మకాదు. విష్ణుభక్తిలేని పండితుడు కేవలం రెండు కాళ్ల పశువేగాని పండితుడు కాడు. ఇంకా చెప్పాలంటే -

**సీ॥ సంసారజీమూత సంఘంబు విచ్చునే చక్రిదాస్య ప్రభంజనములేక**
**తాపత్రయాభీల దావాగ్నులాఱునే విష్ణుసేవామృత వృష్టిలేక**
**సర్వం కషాఘౌఘ జలరాసులింకునే హరిమనీషా బడబాగ్నిలేక**
**ఘనవిపద్గాఢాంధకారంబు లణగునే పద్మాక్షు నుతి రవిప్రభలు లేక**
**తే॥ నిరుపమాపునరావృత్తి నిష్కళంక ముక్తినిధిఁగాన వచ్చునే ముఖ్యమైన**
**శార్ఙ్గ కోదండ చింతనాంజనములేక తామరసగర్భునకునైన దానవేంద్ర!** 171

ఓ దానవేంద్రా! సంసారమనే కారుమేఘసమూహాలు చక్రధరుని సేవలు అనే పెనుగాలులు వీచకుండా తొలగిపోవు? తాపత్రయాలు అనబడే దావాగ్నులు విష్ణుసేవామృత వర్షధారలు కురియకుండా చల్లారవు. అంతటా నిండియున్న పాపాలు అనబడే జలరాసులు హరిచింతనము అనే బడబాగ్ని లేనిదే ఇంకిపోవు. ఘోరవిపత్తులనే గాఢాంధకారాలు కేశవుని కీర్తనలనబడే సూర్యకిరణాలు లేనిదే తొలగిపోవు. నిరుపమానమైన పునర్జన్మలేని నిష్కళంకమైన ముక్తి నిధిని కనుగొనడానికి, విష్ణుచింతనం అనే అంజనంలేకుండా ఆ బ్రహ్మదేవునికైనా సాధ్యపడదు. దానవేంద్రా! ఆ శ్రీహరియందు నిర్మల నిరుపమాన భక్తిలేనిదే ఈ సంసారబంధాలు వీడవు. మోక్షము సిద్ధించదు" అని ఉపదేశిస్తున్న ఆ చిన్నారి బాలుని మాటలు తండ్రికి శూలాల్లాగ గ్రుచ్చుకోగా గురువులపై ఉరిమిచూస్తున్న రాజుతో తమ తప్పిదమేమీ లేదనీ, బాలుడు హరిభక్తిని ఎలాగ పెంచుకుంటున్నాడో తమకు తెలియదనీ, గురువులు విన్నవించుకొన్నారు. అప్పుడు ప్రహ్లాదుడు గురువుల తప్పిదమేమీ లేదని చెపుతూ ఇలా అన్నాడు:

**ఉ॥ అచ్చపు చీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై**
**చచ్చుచుఁబుట్టుచున్ మరల చర్విత చర్వణులైన వారికిం**
**జెచ్చెర పుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే**
**మిచ్చిననైన కాననకునేగిననైన హరిప్రబోధముల్.** 181

అజ్ఞానాంధకారంలోపడి ఇంద్రియ సుఖాలలో మునిగి చచ్చుచూ, పుట్టుచూ, మళ్లీ మళ్లీ చచ్చుచూ పుట్టుచూ ఉండే గృహవ్రతులైన వారికి ఇతరులు చెప్పినా, స్వతహాగానైనా ఇంక ఎవ్వరేమిచ్చినా గాని, అంతసులువుగా శ్రీహరిని తెలుసుకోవాలనే బుద్ధి కలుగుతుందా? తండ్రీ! సంసార చక్రంలో చుట్టూ తిరుగుచున్నవారికి శ్రీహరి భక్తి ఎలాగ కుదురుతుంది? వారు ఇతరులకేమి బోధించగలరు? ఈ సంసారం ఒక లోతైన సాగరం వంటిది. కామక్రోధాదులే దానికెరటాలు. దానిని దాటాలంటే హరిభక్తి ఒక్కటే నావ. చదువులూ, పాండిత్యాలూ ఎందుకూ పనికిరావు." అని బాలుడు చెప్పేసరికి, రాక్షసరాజు రౌద్రాకారుడై కొడుకును క్రిందకు త్రోసివేసి, ఇలా ఆజ్ఞాపించాడు: "మంత్రులారా! నాకు వీడు పుత్రుడు కాడు, శత్రువు. నా తమ్ముని హతమార్చి, మాకు వైరియైన శౌరినే వీడు కొలుస్తున్నాడు. ఎంత మందలించినా వినకుండా నాకే శత్రువుగా తయారయ్యాడు. వీనిని తీసుకొనిపోయి, వధించండి, దయతలచవద్దు" అనేసరికి, రాక్షసులు ఆ బాలుని చుట్టుముట్టి, నానావిధాలా హింసించసాగారు. కాని చిత్రమేమో గాని శూలాలతో పొడిచినా రక్తము చిందలేదు, చర్మమునలుగ లేదు. బాలుడు "అన్నా" అని అయినా అనలేదు. ఎటూ పారిపోజాడడు.

ఉ॥ తన్ను నిశాచరుల్ వొడువ దైత్యకుమారుడు మాటిమాటికో
పన్నగశాయి! యోదనుజభంజన! యోజగదీశ! యోమహా
పన్నశరణ్య! యోనిఖిలపావన! యంచు నుతించుగాని తాఁ
గన్నుల నీరుతేడు భయకంపసమేతుడు కాడు భూవరా! 193

ఉ॥ పాఱడులేచి దిక్కులకు బాహువులొడ్డడు బంధురాజిలోఁ
దూఱడు ఘోరకృత్యమని దూఱడు తండ్రిని మిత్రవర్గమున్
జీరడు మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిన్
దాఱడు కావరేయనడు తాపమునొందడు కంటగింపడున్ 194

ఓ ధర్మరాజా! రాక్షసులు రెచ్చిపోయి, తనకు చిత్రహింసలు పెడుతుంటే ఆ కుమారుడు మాటిమాటికీ "ఓ పన్నగశాయీ! దానవభంజనా! జగదీశా! దీనశరణ్యా! ఓ పరమపావనా! అని భగవంతుని స్తుతిస్తాడేగాని, కన్నుల నీరు పెట్టుకొనడు, భయకంపితుడు కాడు, ఇటూ అటూ పారిపోడు, చేతులతో అడ్డుకోడు, బంధువుల మధ్యకుపోయి దాగుకొనడు, "ఇది చాలా ఘోరం" అని తండ్రిపై నిరసన చూపడు, మిత్రులను సహాయానికి పిలువడు, తల్లి, ఇతర పరివారంవారు నివసించే సువర్ణ - అంతఃపురంలోనికి పోయి తలదాచుకొనడు, "నన్ను కాపాడుడు" అని అడుగడు, బాధపడడు, ఎవ్వరిపైనా మనస్సు కష్టపెట్టుకొనడు ఎవ్వరినీ దూషించడు, ద్వేషించడు, మనస్సు మాధవునియందు నిలిపి, తన్మయుడై ఆనందించేవాడేగాని ఆర్తనాదం చెయ్యడు.

ఈ వింతను కనిపెట్టిన దానవరాజు ఆశ్చర్యచకితుడై, ఇంకా ఘోరమైన హింసలను ప్రయోగింపుడని ఆజ్ఞాపించాడు. రాక్షసులు ఇంకా పట్టుదలతో బాలుని క్రూర కర్మలకు గురిచేశారు. ఏనుగులచే త్రొక్కించారు, విషసర్పాలచే కరిపించారు, అగ్నిగుండాలలో పడవేయించారు, పర్వతశిఖరాలపైనుండి లోయల లోనికి త్రోయించారు, ఖడ్గాలతో నరికించారు, ఆహారము, నీరు పెట్టకుండా బంధించి ఉంచేవారు, మండుటెండల్లోనూ, జడివానల్లోనూ, మంచుకొండల మీదను నడిపించి నిల్చోబెట్టేవారు, వారికి తోచిన రీతిగా ఇంకా ఎన్నెన్నో విధాలుగా చిత్రహింసలు పెట్టారు. ఏమిచేసినా బాలుడు చెక్కుచెదరకుండా చిరునవ్వుతో శ్రీహరినే స్మరించేవాడు. రాక్షసులు ఇంకేమిచెయ్యాలేక విసుగెత్తి ఊరుకొన్నారు. మహామహా వీరులను హతమార్చి, ముల్లోకాలనూ జయించి, అందరినీ ముప్పుతిప్పలు పెట్టి పాదాక్రాంతం చేసుకొన్న ఏకైక వీరుడైన హిరణ్యకశిపుడు ఒక చిన్న బాలుని చంపించలేక, ఏమి చెయ్యాలో తోచక, వ్యాకులచిత్తుడై అవమానంతో క్రుంగిపోయి, ఇలాగ తలపోశాడు:

చ॥ ముంచితి వార్ధులన్; గదలమొత్తితి; శైలతటంబులందు ద్రో
బ్బించితి; శస్త్ర రాజిఁబొడిపించితి; మీద నిభేంద్ర పంక్తి ద్రొ
క్కించితి; ధిక్కరించితి; శపించితి; ఘోర దవాగ్నులందు ద్రో
యించితి; పెక్కుపాట్లనలయించితి; చావడిదేమిచిత్రమో? 201

చ॥ ఎఱుగడు జీవనౌషధములెవ్వరు భర్తలు లేరు: బాధలన్
దరలడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచునున్నవాఁ డొక నిమేషము దైన్యము నొందడింకనే
తెఱఁగున ద్రుంతు? వేసరితి దివ్యము వీని ప్రభావమెట్టిదో? 202

"ఈ మూర్ఖుని సముద్రాల్లో పడవేయించాను, గదలతో మొత్తించాను, పర్వతాల మీదినుంచి త్రోయించాను, ఖడ్గాలతో పొడిపించాను, ఏనుగులచే త్రొక్కించాను, అగ్నిజ్వాలలో పడవేయించాను, భయపెట్టాను, శపించాను, ఎన్నోవిధాల చిత్రహింసలకు గురిచేశాను. ఏమిచేసినా వీడు చావటంలేదు, ఇదేమి చిత్రమోమరి. ఇంకేమి చెయ్యాలో తోచటంలేదు.

వీనిని ఎన్నివిధాల హతమార్చాలని ప్రయత్నించినా, వీడు చావటం లేదు. చావకుండా చేసేమందులేమీ వీనికి తెలియవు గదా! వీనిని ఆదుకొని రక్షించేవారుకూడా ఎవ్వరూ లేరు గదా! వీడు ఎలాంటి బాధలకైనా చలించటంలేదు, వీని శరీర తేజస్సులో నేమాత్రమూ తరుగులేదు సరికదా, ఎక్కువ తేజస్సుతో మెరుస్తున్నాడు. ఒక్క నిముషమైనా దైన్యత చెందడు. ఇకనేను ఏ విధంగా వీనిని అంతము చేయగలను? అలసిపోయాను. వీడిలో ఏదో ఒక దివ్య ప్రభావం ఉన్నదేమో!" అనుకుంటూ నిఃస్పృహ చెందడంచూచి, గురువులైన చండామర్కులు ఈ విధంగా మార్గాంతరం చూపారు.

"దానవేంద్రా! అద్భుతమైన మీయొక్క శక్తి పరాక్రమాల ఎదుట ఈ అర్భకుడేపాటివాడు? ఏదో చిన్నతనం, తెలియనితనం చేత శ్రీహరీ అని అంటున్నాడుగాని, పెద్దలైన గురువుల వద్దకు పంపించి, కొన్నాళ్లు వివాహితులకు సరిపడే ధర్మార్థ కామశాస్త్రాలను, దైవద్వేషాన్నీ బోధిస్తే దారిలో పడగలడు." అని చెప్పగానే రాజు వెంటనే వానిని తన ఎదుటి నుంచి తీసుకొనిపొమ్మన్నాడు.

మళ్లీ గురుకులంలో ప్రవేశించిన ప్రహ్లాదుడు, గురువులు బోధించే విద్యలన్నీ నిరర్థకాలనీ, కోరికలు ఫలించాలనుకొనేవారికే గాని, భగవంతుడు కావాలనుకొనేవారికి పనికి రావనీ తెలుసుకొన్నాడు. గురువులు గృహకృత్యాలూ, జపతపాలూ చేసుకొనే సమయాల్లో తనతోడి బాలురను దగ్గరకు పిలుచుకొని ఈ విధంగా బోధించేవాడు:-

ఉ॥ బాలకులార రండు మన ప్రాయపు బాలురు కొందరుర్విపైఁ
గూలుటకంటిరే! గురుడు క్రూరుడనర్థచయంబునందు దు
శ్శీలత నర్థ కల్పనముఁ జేసెడి, గ్రాహ్యము కాదు శాస్త్రమే
మేలెఱిఁగించెదన్, వినిన మీకు నిరంతర భద్రమయ్యెడిన్. 212

బాలకులారా! రండి, వినండి. మన ఈడు పిల్లలు కొందరు నేలగూలి చనిపోవడం చూస్తున్నాంకదా! దాని అర్థమేమిటో మనకు చెప్పకుండా, మన గురువు పెడదారిపట్టించి అర్థంలేని, పనికిమాలిన విషయాలకేవేవో అర్థాలు కల్పించి చెపుతుంటాడు. అతడు చెప్పేశాస్త్రాలు మనం నేర్చుకోనవసరంలేనట్టివి. మనకు మేలు కలిగించే విషయాల గురించి నేను చెపుతాను. అవి వింటే మనకు సర్వదా క్షేమము కలుగుతుంది. మిత్రులారా! మనకు లభించిన ఈ జన్మ బహుదుర్లభమైనది. ఈ జన్మలోనే మనం ఎంతో మంచిని సాధించవచ్చును, లేదా క్షుద్రమైన భోగాలననుభవిస్తూ పతనమూ కావచ్చును. ఏది క్షేమకరమో, శాశ్వతమో ఆ మార్గాన్నే మనం ఎన్నుకోవాలి. జీవితంలో సగభాగం నిద్రలోనే పోగా, ఒక పావు భాగం, బాల్యము, కౌమారము, క్రీడల్లోపోగా, మిగిలిన భాగము యౌవనము, భార్యాబంధు పరివార ధనార్జన వార్ధక్య చింతలలోనే గడిచిపోతుంది. సంసారి ఇక భగవంతుని గురించి తలచుకొనడానికి అవకాశమే కలిగించుకొనడు. ఇలాగే మళ్లీమళ్లీ జన్మిస్తూ, మరణిస్తూ, నారాయణతత్త్వాన్ని ఏ జన్మలోనూ తెలుసుకొనలేక, గమ్యమునుండి ఇంకా దూరదూరంగా జరిగిపోతుంటాడు. అన్ని శరీరాల్లోనూ ఆత్మ అంతర్లీనంగా నుంటుంది. ప్రతిజీవీ తనను తాను ప్రేమించుకొనడం సహజము కదా! ఎవరి ఆత్మను వారు ప్రేమిస్తూ, సర్వాత్ముడైన నారాయణునే అనుకొనకుండానే ప్రేమిస్తున్న సంగతి మనం గుర్తించాలి. ఈ సత్యాన్ని మనం గ్రహించగానే సర్వమూ నారాయణుడే అని తెలుస్తుంది. నేనూ, నీవూ, నాదీ నీదీ, ఇతడు శత్రువు ఆతడు మిత్రుడు అనే భేద భావాలే మనలో ఉదయించవు. అంతా ఆ

నారాయణమయముగానే చూడగలుగుతాము. మన గురువులు చెప్పేవిద్య వలన ఈ జ్ఞానము లభించదు. దానివలన సంసారపంకములో ఇంకా లోతుకు కూరుకొనిపోయే ప్రమాదం ఉన్నది. నేను చెప్పబోయే నారాయణ తత్త్వాన్ని మీరంతా గ్రహించి అవలంబిస్తే, మనలో సర్వభూతదయ కలిగి, అసురభావాలు తొలగిపోతాయి. ఈ చిన్నవయస్సులోనే మోక్షమార్గం కోరుకొని, సజ్జన సాంగత్యం చేస్తూ, ఆ అచ్యుతుని ఆరాధించడం ఆరంభించాలి. అనుభవంద్వారా మాత్రమే మనకు ఆ పరమేశ్వరుడు గోచరిస్తాడు. ఆయనకు రూపము గాని గుణాలుగాని లేవు. కాని తన మాయాశక్తిచే అనేక రూపాల్లో కనిపిస్తాడు. సత్త్వ రజ స్తమో గుణాలు ఆయనసుండే ఉద్భవించాయి. ఆ శ్రీహరి చరణకమలాల వద్ద మనము శరణాగతులమై పరవశించి పడియుంటే, మనం కోరకుండానే మనకు అవసరమైనంత వరకు ఆయనే ధర్మార్థ కామాలను అనుగ్రహిస్తాడు. ఇక మోక్షము కూడా తనంతట తానే ప్రసాదిస్తాడు. పరమాత్మచింతనమే పరమానందదాయకము. అదే శాశ్వతమైన ఆనందాన్నిచ్చేది. ఇతరమైనవి అన్నీ కలలోని అనుభవాలవలె క్షణికాలే.

సోదరులారా! ఈ జ్ఞానాన్ని పూర్వము నరనారాయణులలోని నారాయణుడు నారదమహర్షికి బోధించగా, ఆ మహనీయుడు నాకు బోధించాడు - అని ప్రహ్లాదుడు చెప్పగా రాక్షసబాలురంతా ఆశ్చర్యపోయి ఇలా అడిగారు: "మిత్రమా! మనము పుట్టినప్పటి నుండీ కలిసే ఉంటున్నాము. చండామర్కులే మనకు చదువు చెప్పారు కదా! మీ తండ్రి శాసనం వలన నారాయణ శబ్దమే వినబడరాదు కదా! మరినీకు నారదమహర్షి ఈ నారాయణ తత్త్వాన్ని బోధించడం ఎలాగ కుదిరినది?" అని ప్రశ్నించగా ప్రహ్లాదుడు ఈ విధంగా చెప్పనారంభించాడు:

పూర్వము మాతండ్రి మందరపర్వతముపై తపస్సు చెయ్యడానికి వెళ్లినప్పుడు, ఇంక అతడు తన తపస్సును ముగించుకొని తిరిగి రావడం ఉండదని భావించిన ఇంద్రాదిదేవతలు, అతని రాజ్యంపై దండెత్తారు. రాక్షసులందరూ పారిపోయారు. దేవతలు రాజభవనాన్ని ఆక్రమించుకొని, ధనసంపదలన్నీ కొల్లగొట్టుకొనిపోయారు. ఇంద్రుడు అంతఃపురంలో ప్రవేశించి, మా తల్లిని హింసించబోయాడు. ఆమె విలవిలా పక్షిలాగ కొట్టుకొంటూ చేసిన ఆక్రందనను విని, త్రిలోక సంచారియైన నారదమహర్షి వచ్చి ఇంద్రుని మందలించి, ఇలా అన్నాడు: " ఓ దేవరాజా ఈమె గర్భవతి, పరమసాధ్వి, పుణ్యాత్మురాలు. ఈమె భర్తపై నీకున్న శత్రుత్వాన్ని ఈమెపై జూపడం ధర్మంకాదు. ఈమెకు పుట్టబోవు ఇంకొక దేవవైరిని అంతం చేయవచ్చుననుకొంటున్నావేమో! కాని, ఈమె గర్భంలో ఎన్నో జన్మలనుండి శ్రీహరిభక్తుడైన ఒక పరమభాగవతుడు ఎదుగుతున్నాడు. ఆ నారాయణుని అనుగ్రహంచేత ఆ బాలుని ఎవ్వరూ చంపలేరు. అతడు దేవతలకే కాదు ఎవ్వరికీ శత్రువు కాడు. అందుచేత ఈ సాధ్వీమణికి ఏ విధమైన హానీ తలపెట్టకుండా విడిచిపెట్టు. ఈమెను నేను సురక్షితంగా కాపాడుతాను" అని చెప్పగా, ఇంద్రుడు మా అమ్మకు నమస్కరించి వెళ్లిపోయాడు. నారదమహర్షి మా అమ్మను పుత్రికావాత్సల్యంతో తన ఆశ్రమంలోనే ఉంచాడు. మా తండ్రి తప్పకుండా తపస్సు ముగించుకొని తిరిగివస్తాడని, ఆమెకు ధైర్యం చెపుతూ, సకల ధర్మశాస్త్రాలూ, ఆత్మజ్ఞానమూ, భగవద్భక్తీ మొదలైన వెన్నో బోధించాడు. ఆమె గర్భంలోనున్న నేను వాటినన్నిటినీ వింటూ, నా చిత్తమందు పదిలపరచుకొని, ఇప్పటికి కూడ దేనినీ మరచిపోలేదు. ఈ భక్తితత్త్వం తెలుసుకొంటే అహంకార మమకారాలు తొలగిపోతాయి. ఉత్తమ భక్తి ఏర్పడుతుంది. ఈ తత్త్వాన్ని బాలురూ స్త్రీలూ కూడ తెలుసుకొనవచ్చు. నారదమహర్షి చెప్పిన తత్త్వాన్ని మీకు చెపుతాను వినండి:

కాలము పరమాత్మ నుండి పుట్టినది. ఈ కాలప్రభావముచేత దేహానికి పుట్టుట, ఉండుట, పెరుగుట, మారుట, తరుగుట, నశించుట అనే ఆరు పరిణామాలు కలుగుతాయి. కాని ఆత్మ ఈ కాలానికి అతీతమైనట్టిది, కనుక దానికి ఈ పరిణామాలుండవు. ఆత్మ స్వచ్ఛమైనది. నాశనములేనిది. అతిసూక్ష్మమైనది. అన్నిటియందూ వ్యాపించి యున్నది. శరీరంలో నివసిస్తున్నా వేరుగా నుంటుంది. స్వయంప్రజ్ఞ. దేహేంద్రియ మనోబుద్ధులకు ఆత్మయే ఆధారము. అవి ప్రవర్తించడానికి ఆత్మయే కారణము (చైతన్యదాత). 'నేను''గా వ్యవహరించేది ఆత్మయే. 'దేహమే నేను' అనే భ్రాంతిని కలుగజేసేది అవిద్య. ఖనిజంనుండి బంగారాన్ని విడదీసినట్లు ఆత్మను ఆవరించియున్న పంచకోశాలను విడదీస్తే మిగిలేది శుద్ధచైతన్యమైన ఆత్మయే - మూలప్రకృతి, మహత్తు, అహంకారము, పంచభూతాలూ కలిసి, అష్టప్రకృతులనబడుతాయి. అవి అన్నీ త్రిగుణాలతో కలిసియున్నట్టివి. మనస్సుతో కూడిన దశేంద్రియాలూ, పంచసూక్ష్మభూతాలూ కలిసి, 16 వికారాలన బడుతాయి. వీటియొక్క సంఘాతమే శరీరము. ఈ ఇరువదిఏడింటికీ

ఆత్మ సాక్షీభూతంగా పూసలలో దారమువలె ప్రకాశిస్తుంది. సంసారము కేవలము బుద్ధి వల్లనే ఏర్పడుతుంది. అది కేవలము స్వప్నము వంటిది. సకల కాంక్షలకు ఉత్పత్తి స్థానము మనస్సు. పూర్వ కర్మలకు నిలయము బుద్ధి. వీటివలననే జననమరణాలు కలుగుతుంటాయి. అజ్ఞానం వలన అశాశ్వతమైన శరీరము, స్త్రీ సుత పరివార ధన సంపదల వంటివాటి మీద మమకారం ఏర్పడుతుంది. వీటికి అతీతమైన, శాశ్వతమైన, ఆనందమయమైన, ఆత్మయందు మనస్సులగ్నం కానివ్వకుండా జీవుడు సంసారమనే సుడిగుండంలోనే తిరుగుతుంటాడు.

కాబట్టి మిత్రులారా! సజ్జన సాంగత్యము, సద్గురుసేవ, శ్రీహరికథాశ్రవణము, వాసుదేవ వైభవ మననము, నారాయణనామసంకీర్తనము, దివ్యపురుష ఆరాధనము, విష్ణుపాదధ్యానము, విరాట్స్వరూప దర్శనము, సమస్త కర్మల, కర్మఫల అర్పణము మొదలైన సాధనలు జ్ఞానవైరాగ్యాలను కలిగిస్తాయి. ఇవి భాగవతధర్మాలు. భగవంతుడే ఆత్మస్వరూపుడై సర్వజీవరాసులలోనూ ఉన్నాడని తెలుసుకొని, వాటి పట్ల ప్రేమ, ఆదరసమత్వాలు కలిగియుండాలి. మన శత్రువులు ఎవరో కారు. మనలోనున్న కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలే అని గుర్తించాలి, వాటిని జయించాలి. నిజమైన భగవద్భక్తుడు భగవంతుని నామం చెవిని సోకగానే పరవశించిపోతాడు. ఆయన యొక్క లీలాగుణ వైభవ విశేషాల గాథలను విని, ఆవేశంతో గంతులు వేస్తాడు. "గోవిందా! నారాయణా! వాసుదేవా! భక్తవరదా!" అని గొంతెత్తి పాడుతాడు. అరుస్తాడు, నవ్వుతాడు, మ్రొక్కుతాడు, గెంతుతాడు. ఈ విధంగా వేరు తలంపులేమీ లేకుండా, ఎల్లవేళలా ఆస్వామినే కొలుస్తూ, పిలుస్తూ ఉంటాడు. చివరకు సర్వమూ త్యజించి, బంధాలను తెంచుకొని, భక్తి వివశుడై భగవానుని సాన్నిధ్యానికి చేరుకొంటాడు. ఈ సంసార వలయంనుండి బయటపడాలంటే శ్రీహరినామ సంకీర్తనమే ఆయన చేయూత.

మానవుడు చేసే సకల కర్మలూ ధర్మార్థకామాలనే అందిస్తాయి. కాని మోక్షాన్ని తెచ్చిపెట్టవు. ఒక్క జ్ఞానము మాత్రమే మోక్షప్రదము. మోక్షాన్ని ప్రసాదించేవాడు ఆ శ్రీమన్నారాయణుడే. ఆయన జీవుని రూపంలో సర్వప్రాణి కోటియందూ వెలసియున్నాడు. కాబట్టి ఆయనను వెదకుకొంటూ ఎక్కడికో పోనక్కరలేదు. ఎవరికి వారు తమ హృదయాలలోనున్న పరమాత్మను భక్తి శ్రద్ధలతో ధ్యానించి పొందాలి.

**క॥ చిక్కడు వ్రతముల క్రతువులఁజిక్కడు దానముల శౌచ శీల తపములన్**
**జిక్కడు యుక్తిని భక్తినిఁజిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ. 243**

ఆయన, భక్తికి చిక్కినంత సులువుగా ఏ ఇతర సాధనలకూ చిక్కడు. సర్వం విష్ణుమయం జగత్ అని గ్రహించాలి.

బాలకులారా రండి! మనకు పనికిరాని విద్యకు స్వస్తిచెప్పి శ్రీహరినామ సంకీర్తనలు చేసుకొందాం. చిత్తాన్ని శ్రీహరికి సమర్పించుకొందాం. కైవల్యపదాన్ని పొందుదాం. మనకు ఆ శ్రీహరి శుభం చేకూర్చుతాడు". అని ప్రహ్లాదుడు తన తోడి రాక్షస బాలురకు బోధించాడు.

ప్రహ్లాదుని బోధలను విని, రాక్షసబాలురంతా హరిభక్తులుగా మారి, హరిభజనలు చేస్తుండడం చూచి, గురువులు గుండెలు బాదుకొన్నారు. పరుగు పరుగున పోయి దానవరాజునకు విన్నవించుకొన్నారు. "దానవేంద్రా! రాక్షస బాలురంతా మేము చెప్పే పాఠాలను చదవడం మానివేసి, ప్రహ్లాదుని బోధలను తలకెక్కించుకొని, మోక్షకాంక్షులై, మాధవుని గాథలను చెప్పుకొంటూ హరిభజనలు చేస్తున్నారు. ఏమి చెయ్యాలోతోచక తమవద్దకు వచ్చాము. ఆజ్ఞాపించండి." అని వేడుకొన్నారు.

గురువుల మాటలు ములుకులవలె తగలగా, హిరణ్యకశిపుడు ఉగ్రుడై మండిపడి, ప్రహ్లాదుని రప్పించి, రోషావేశంతో ఇలా అంటాడు: "ఓరీ అర్భకా! నా ఆదేశము లేనిదే సూర్యుడు ప్రకాశించడానికి భయపడుతాడు. వాయువు అన్ని ఋతువుల్లోనూ, నాకు అనుకూలంగా తప్ప ఇంకొకలాగ వీచలేదు. నా ప్రతాపాగ్ని ముందు అగ్నిహోత్రుడు వెలవెలపోతూ ఉంటాడు. కాని తనకు తోచినట్లు మండలేడు. నా ఆజ్ఞను కాదని యముడు ప్రాణులను చంపలేడు. ఇంద్రుడు నా ఎదుట తలఎత్తి నిల్చోవడానికి హడిలిపోతాడు. ఇక ఇతరులైన దేవ కిన్నర గంధర్వాదులంతా భయంతో బిగుసుకొంటారు. నీవు మాత్రము నా ఆజ్ఞలకు వ్యతిరేకముగా ప్రవర్తిస్తున్నావు.

శా॥ ఆచార్యోక్తమువాని బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి, నీ
వాచాలత్వముఁ జూపి విష్ణుసహితున్ వర్ణించి మద్దైత్య వం
శాచారంబులు నీఱుఁజేసితివి మూఢాత్ముం గులద్రోహి నిన్
నీచుం జంపుటమేలు చంపి కులమున్ నిర్దోషముంజేసెదన్. 260

క॥ దిక్కులు గెలిచితి నన్నియు, దిక్కెవ్వఁడురోరి నీకు? దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేఱొక దిక్కెరుగక కొలుతురితడె దిక్కని నన్నున్ 261

క॥ బలవంతుడ నే జగముల బలములతో చనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని బలమున నాడెదవు నాకు ప్రతివీరుడవై? 262

ఓరీ మూర్ఖుడా! ఆచార్యులు చెప్పినది కాదని, నీవాచాలత్వంచూపుతూ, మనదైత్య సంప్రదాయాలకు విరుద్ధంగా, శత్రువైన హరిని స్తుతిస్తూ, రాక్షస బాలురలో మోక్షాసక్తిని కలిగిస్తున్నావట! నీవు కులద్రోహివి, నీచుడవు, నిన్ను చంపవలసినదే! నిన్ను చంపి, మన వంశానికి మచ్చలేకుండా చేస్తాను. దిక్కులన్నిటినీ జయించిన వాడను నేను. దేవేంద్రుడూ దిక్పాలకులూ మొదలైన వారంతా వేరేదిక్కులేక, నేనే దిక్కు అని, నన్నే కొలుస్తుంటారే! మరి నీకెవడురా దిక్కు? ముల్లోకాల్లోనూ, బలవంతుడను నేనే! ఏ సైన్యమూ సహాయము లేకుండానే, నేనొక్కడనే గొప్ప గొప్ప వీరులను ఓడించాను. ఒక్కడు కూడా నాఎదుట నిలువడానికి సాహసించడు. నీవు పొగడుతుండే ఆ వైకుంఠుడుకూడా నా ఎదుట పడడానికి భయపడుతాడు. అతడే శక్తిమంతుడైతే నేను దేవతలను దండించి ఖండిస్తుంటే ఒక్కసారి అయినా వచ్చి, వారిని రక్షించడేమి? నీవు పితృద్రోహివి. నా శత్రువును కొలుస్తున్నావు. నీతోడి బాలురను పాడుచేస్తున్నావు. నీవు ఎవరి బలం (దన్నును) చూచుకొని ఇలాగ మిడిసి పడుతున్నావు? నన్నే ఎదిరిస్తున్నావు. నిన్నిప్పుడే హతమార్చి, నా రాక్షస జాతిగౌరవం నిలుపుకొంటాను" అని గర్జిస్తున్న తండ్రితో బాలుడిలాగన్నాడు:

క॥ బలయుతులకు దుర్బలులకు బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు ప్రాణులకును బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్రా! 264

క॥ దిక్కులు కాలముతో నే దిక్కున లేకుండుఁగలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేని వారికి దిక్కెయ్యది యదియు నాకు దిక్కు మహాత్మా! 265

దానవేంద్రా! లోకములోని బలవంతులకూ, బలహీనులకూ ఎవడు బలమో, నీకూ నాకూ బ్రహ్మాది దేవతలకు కూడా ఎవడు బలమో, సమస్తప్రాణులకూ బలమెవ్వడో, ఆ ఈశ్వరుడే నాకు కూడ బలము. ఓ మహాత్మా! దిక్కులకు దిక్కయిన వాడూ (సర్వాధారుడు), దిక్కులకూ కాలానికీ అతీతుడూ, దిక్కుగలవానికీ, దిక్కులేనివానికీ కూడా ఎవ్వడు ఆశ్రయమో, వాడే నాకును దిక్కు (ఆశ్రయము). అచ్యుతుడే ఈ విశ్వాన్ని సృష్టించి, పోషించి, లయింపజేసి వినోదిస్తుంటాడు. తండ్రీ!

ఉ॥ లోకములన్నియున్ గడియలోన జయించిన వాడ వింద్రియా
నీకముఁజిత్తముంగెలువ నేరవు నిన్ను నిబద్ధుఁజేయు నీ
భీకర శత్రులార్వురఁ బ్రభిన్నులఁ జేసిన ప్రాణి కోటిలో
నీకు విరోధిలేడొకడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా. 267

దానవేశ్వరా! నీవు అన్నిలోకాలనూ క్షణంలో జయించిన పరాక్రమశాలివి. అయినా, నీ ఇంద్రియాలనూ మనస్సునూ జయించలేకపోయితివి. నిన్ను కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరుగురు శత్రువులు బంధించి వేశారు. భయంకరమైన ఈ అరుగురినీ నశింపజేసినట్లైతే, ప్రాణికోటిలో నీకు శత్రువనే వాడే ఉండడు. ఈ విషయాన్ని నీవు తెలివిగలిగి గ్రహించడం మంచిది. తండ్రీ! నిజానికి శ్రీహరి నీకు శత్రువు కాడు. సమత్వం కోల్పోయిన నీ చిత్తమే ఈ భ్రమను కల్పిస్తుంది. నీ చుట్టూ ఉన్నవారు భయంచేత నీకు ప్రియము కలిగించే మాటలే చెపుతారు

గాని నీకు హితము కలిగించే సత్యవాక్కులు చెప్పరు. తండ్రీ సంసారవ్యామోహాన్ని తొలగించుకొని మాధవునియందు మనస్సులగ్నం చేయడం క్షేమకరము" అని చెప్పిన ప్రహ్లాదునిపై హుంకరించి అసురేశ్వరుడు ఇలాగ గర్జించాడు. "నోరు ముయ్యరా దుర్మతీ! చావుకు తెగించి కర్ణకఠోరంగా వదరుతున్నావు. నన్నే ఎదిరించి వాగుతున్నావు.

శా॥ నాతోడన్ ప్రతి భాషలాడెదు జగన్నాథుండు నాకంటె నీ
భూతశ్రేణికి రాజులేడొకడు సంపూర్ణ ప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిన్ బల్మాఱు నారాయణుం
డేతద్విశ్వములోన లేడు మరి వాడెందుండురా దుర్మతీ. 271

నా కంటే సంపూర్ణ శక్తి సంపన్నుడూ, జగన్నాథుడూ అయిన రాజు ఈ జీవకోటికి ఇంకెవడున్నాడురా! నా సోదరుని చంపిన ఆ హరిని గురించి మొదట ముల్లోకాలూ గాలించాను. కాని వాడు ఈ విశ్వములోనే ఎక్కడాలేడు. మరి ఎక్కడ దాగుకొన్నాడో ఆపిరికిపంద, చెప్పరా! చెప్పు". అని గద్దించి అడుగుతున్న తండ్రితో ప్రహ్లాదుడు, ఆనందాతిశయంతో పరవశించిపోయి, నృత్యంచేస్తూ ఆ శ్రీహరినే మనస్సులో నింపుకొని ఇలా అన్నాడు: "తండ్రీ!

మ॥ కలఁడంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులందంతటన్
గలఁ డీశుండు కలండు తండ్రి! వెదకంగా నేల నీ యా యెడన్ 274

క॥ ఇందుగలఁ డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందే గలఁడు దానవాగ్రణి! వింటే. 275

దానవశ్రేష్ఠా! పరమేశ్వరుడు సముద్రంలోనున్నాడు, గాలిలోనున్నాడు, ఆకాశంలో నున్నాడు, భూమియందున్నాడు, అగ్నియందున్నాడు, అన్నిదిశలలోనున్నాడు, పగటిలోనున్నాడు, రాత్రిలోనున్నాడు, సూర్యునియందున్నాడు, చంద్రునియందున్నాడు, ఆత్మయందున్నాడు, ఓంకారములోనున్నాడు, త్రిమూర్తులయందున్నాడు, స్త్రీ పురుష, అలింగులలోనున్నాడు. అంతటా ఉన్నాడు, అక్కడా ఇక్కడా వెదకడం దేనికి? ఆ భగవంతుడు ఇక్కడుంటాడు, అక్కడ ఉండడు, అనే సందేహం పెట్టుకొనవద్దు. చక్రపాణి అంతటా ఉన్నాడు, ఎక్కడెక్కడ వెదకి చూచినా, అక్కడక్కడనే కానవస్తాడని తెలుసుకొనండి." అని ఈ విధంగా అచ్యుతుడు అంతటా ఉన్నాడని ప్రహ్లాదుడూ ఎక్కడాలేడని తండ్రీ వాదులాడుకొంటారు.

మ॥ హరి సర్వాకృతులం గలండనుచు ప్రహ్లాదుండు భాషింప స
త్వరుడై యెందునులేడు లేడని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుడు నానా జంగము స్థావరో
త్కర గర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్. 277

హరి అన్ని రూపాల్లోనూ ఉన్నాడంటూ ప్రహ్లాదుడు వాదిస్తుంటే, ఎక్కడా లేడు లేడు అని కొడుకును తండ్రి గద్దించి గర్జిస్తుంటే, అచ్యుతుడు శ్రీనరసింహాకారాన్ని దాల్చి, సమస్త చరాచరజీవవస్తుజాలములలో అన్ని ప్రదేశాలలో, భీకరతేజోమయుడై వ్యాపించియున్నాడు. (తన ప్రియభక్తుని విశ్వాసాన్ని నిరూపించడానికి సర్వసిద్ధంగా అంతటా వెలసియున్నాడు) తండ్రీకొడుకులిద్దరూ తీవ్రంగా వాదించుకొంటూ ఉండగా రాక్షసరాజు రోషము తెచ్చుకొని ఇలా అరిచాడు:

క॥ డింభక! సర్వస్థలముల నంభోరుహనేత్రుడుండు నంచు మిగుల సం
రంభంబున పలికెద వీ స్తంభంబునఁ జూపగలవె చక్రిన్ గిక్రిన్. 279

ఓరీ డింభకా! శ్రీహరి అన్ని స్థలాల్లోనూ ఉంటాడని, ఎంతో సందడిగా చెప్పుకొంటున్నావే. నీ చక్రిని గిక్రినీ ఈ స్తంభములో చూపగలిగితే చూపించు. ఈ స్తంభములో నీవు హరిని జూపలేకపోతే నీతలను త్రుంచివేస్తాను. అప్పుడు చూస్తాను, వాడు నన్ను నిగ్రహించి, నిన్ను ఎలాగ రక్షిస్తాడో!" అని గర్జించిన తండ్రితో ఆ పరమభక్త బాలుడు ప్రశాంతవదనంతో ఉప్పొంగిపోతున్న ఆనందంతో అన్నాడు.

శా॥ అంభోజాసనుడాదిగాఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబుననుండు ప్రౌఢ విపుల స్తంభంబులో నుండడే
స్తంభాంతర్గతుడయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేడు గానబడు ప్రత్యక్ష స్వరూపంబునన్. 282

పద్మాసనుడైన బ్రహ్మదేవునినుండి గడ్డిపరక వరకూ విశ్వమంతా తానే అయి, వ్యాపించి యున్న ఆ శ్రీహరి ఇంతపెద్ద స్తంభములో నుండడా తండ్రీ! ఈ స్తంభములో కూడా ఉన్నాడనడానికి ఏ సందేహమూ లేదు. దంభము లేకుండా చూస్తే, ప్రత్యక్ష స్వరూపములో ఇప్పుడే ఇక్కడే కనపడగలడు – అనిన ప్రహ్లాదుని మాటలు విని, హిరణ్యకశిపుడు వికటాట్టహాసం చేస్తూ చివాలున లేచి. సింహాసనం నుండి క్రిందికి దిగి వచ్చి, ఖడ్గాన్ని ఝళిపిస్తూ ఇలా అన్నాడు:

మ॥ వినరా డింభక! మూఢచిత్త! గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెదవైన నిందుగలడే యంచున్ మదోద్రేకియై
దను జేంద్రుండఁటచేత వ్రేసెను మహోదగ్రప్రభాశుంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్. 284

"వినరా డింభకా! మూఢుడా! విష్ణువు విశ్వాత్మకుడని గొప్పగా వదరుతున్నావు. అయితే వాడు ఇందులో నున్నాడా చూపించు" అంటూ మదోన్మత్తుడై, ఉద్రేకముతో ఆ అసుర చక్రవర్తి ఉగ్రకాంతులతో చూపరులకు అత్యంతదంభాన్ని ప్రదర్శిస్తూ, హరి భక్తుడైన ప్రహ్లాదునకు అమితానందము కలుగునట్లుగా, తన అరచేతితో ఆ స్తంభానికి ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బకు ఫెళఫెళమంటూ విస్ఫులింగాలను విరజిమ్ముతూ, ఆ స్తంభము బ్రద్దలైనది. భయంకరమైన ధ్వనులు వినిపించాయి, ప్రళయకాలపు పెనుగాలులు వీచి, పిడుగులతో వర్షాలు కురిశాయి. స్తంభము ఛిన్నాభిన్నమయినది. అందులోనుండి దేదీప్యమానమైన దివ్య తేజస్సుతో నరసింహస్వామి ఆవిర్భవించాడు. నర – ఆకారములో సింహముగా వచ్చిన స్వామి అతి – ఉగ్రరూపముతో భయంకరుడై యున్నాడు. వజ్రాయుధాల్లాంటి గోళ్లూ, కోరలూ, దేనినైనా చీల్చిచెండాడడానికి సిద్ధముగానున్నవి. అగ్నిజ్వాలల్లాగా కనిపించే నాలుక, జ్వాలాముఖివంటి ముక్కురంధ్రాలు, సూర్యగోళాలవంటి నేత్రాలూ, ముల్లోకాలనూ భస్మం చేయునట్టివిగా కనిపిస్తున్నవి. స్వామిసాక్షాత్కారము ప్రహ్లాదుని పరవశింపజేసినది. ఆ భయంకరరూపము త్రిలోక భయంకరుడైన అసురరాజును కూడ భయకంపితునిచేసినది.

క॥ నరమూర్తికాదు, కేవల హరిమూర్తియు కాదు మానవాకారము కే
సరి యాకారము నున్నది, హరి మాయా రచితమగు యథార్థము చూడన్. 286

ఉ॥ తెంపున బాలుడాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహ శరీరముఁదాల్చి చక్రి శి
క్షింపగ వచ్చినాడు హరిచే మృతి యంచుతలంతునైన నా
సొంపును పెంపు నందఱును జూడఁజరింతు హరింతు శత్రునిన్. 287

ఇది నరరూపమూ కాదు, సింహరూపమూకాదు. రెండూ కలిసియున్నమాయావి హరి రూపములాగున్నది. సాహసంతో తెగించి, బాలుడు చెప్పిన మాటను నిలిపి, తనయొక్క సర్వవ్యాపకత్వాన్ని నిరూపించడానికి హరి ఈ స్తంభములో నరసింహరూపము దాల్చి, నన్ను శిక్షింప వచ్చినాడు. వీని చేతిలోనే నా అంతము జరుగుతుందనిపిస్తున్నది.

అయినా అందరూ చూస్తుండగా నా బల పరాక్రమాలను ప్రదర్శించి, ఈ శత్రువును హతమార్చుతాను. వరాహరూపంలో వచ్చి నా తమ్ముని చంపినాడు. ఈ వింత మృగరూపంలో వచ్చి నన్ను చంపగోరుతున్నాడు ఆ మాయావి విష్ణువు. వాని పని పడతాను అని భీకర రోషముతో తన గదను గిరగిరాత్రిప్పుతూ మీదకు ఉరకగానే, నరసింహుడు కాళ్లతో పామును పట్టుకొన్న గరుత్మంతుని వలె ఆ రాక్షసుని పట్టుకొన్నాడు. వాడు గిలగిలకొట్టుకొంటూ, తన బలాన్నంతా కూడ గట్టుకొని, పట్టు తప్పించుకొని పోరసాగాడు. ఇద్దరిమధ్యా ఘోరమైనపోరాటం కొనసాగినది. ఎప్పటికీ అంతము కానట్టి ఈ సంఘర్షణ పట్ల నరసింహ స్వామి విసుగుచెంది, కోపముతో దానవుని పట్టుకొనగా, వాడు క్రమక్రమంగా శక్తిని కోల్పోయి లొంగిపోయాడు. స్వామి ద్వారముపై కూర్చొని, రాక్షసుని తన తొడలపై నిడుకొని, గుండెలు చీల్చి ప్రేవులూ రక్తనాళాలూ త్రెంచి సంహరించాడు.

ఆ నరహరి రూపము భయంకరముగా నున్నది. ఆ ఉగ్ర స్వరూపములో ఆయన దావానల జ్వాలలాగా కనిపిస్తున్నాడు. మెడలోని జూలు గోళ్లూ రక్తసిక్తమై యున్నవి. సింహముచే చీల్చిచెండాడబడిన ఏనుగులాగ పడియున్నాడు రాక్షసరాజు. ఇతర రాక్షసులు గుంపులుగా చేరి, తమ ఆయుధాలతో ఆ వింతమృగాన్ని చంప ప్రయత్నించారు. గాని ఒక్కడూ మిగలకుండా వారు శ్రీహరి చక్రాయుధానికి బలిఅయి గుట్టలుగా పడిపోయారు. ఈ విధంగా రాక్షససంహారం ముగిసినా స్వామి యొక్క ఆగ్రహం చల్లారలేదు.

శివ బ్రహ్మాది దేవతలూ, కిన్నర కింపురుషులూ, గంధర్వులూ మొదలైన ఊర్ధ్వలోక వాసులు అక్కడ చేరి, జయజయధ్వానాలు చేస్తూ పుష్ప వృష్టిని కురిపిస్తూ గాన సంకీర్తనలతో నృత్యం చేయసాగారు. కాని స్వామి యొక్క ఉగ్రరూపము ప్రసన్నము కాలేదు. స్వామి సింహాసనంపై నధిష్ఠించియున్నాడు. ఇంకా భయంకరంగా నున్నాడు. ఆయనను ప్రసన్నునిగా చేయడానికి అక్కడ చేరినవారంతా అనేక విధాలస్తుతించ నారంభించారు. బ్రహ్మదేవుడు ఇలా స్తుతించాడు:-

**మ॥ ఘనలీలా గుణచాతురిన్ భువనముల్ కల్పించి రక్షించి భే**
**దనముం జేయు దురంతశక్తికి ననంత జ్యోతికిన్ చిత్ర వీ**
**ర్యునికిన్ నిత్య పవిత్ర కర్మునికి నేమత్కంఠతోనవ్యయా**
**త్మునికిన్ వందన మాచరించెద కృపాముఖ్య ప్రసాదార్థినై. 306**

గొప్ప అద్భుత లీలాగుణ విశేషాలు గల చైతన్యవంతునకు, భువనాలను సృష్టించి, రక్షించి, నశింపజేయు అమోఘశక్తిసంపన్నునకు, అనంతజ్యోతికి, విచిత్రపరాక్రమశాలికి, నిత్యమూ పవిత్ర కర్మలు చేయువానికి, అవ్యయాత్మునికి నేను అత్యంత ఆసక్తితో కృపానుగ్రహాల నర్థిస్తూ నమస్కరిస్తాను. రుద్రుడిలా ప్రార్థించాడు:- దేవదేవా! నీ ఆగ్రహానికిది సమయంకాదు. ఇంకా సహస్రయుగాలు గడస్తే గాని ప్రళయ సమయంరాదు కదా! దానవుని హతమార్చావు. ఇక చాలు. శాంతించు ప్రభూ!

ఇంద్రుని ప్రార్థన : ప్రభూ! ఈ హిరణ్యాకశిపుని సంహరించి, మా మనస్సులలో శాంతిని నెలకొల్పావు. ఇక నిన్ను స్మరించుకొనే అవకాశం లభించినది. ఋషులు ఇలా ప్రార్థించారు:- పురుషోత్తమా! మా తపస్సులకు అంతరాయం కలిగించిన ఈ దానవుని తొలగించి, మళ్లీ మేము యథావిధిగ తపస్సు చేసుకొనే అవకాశం కలిగించిన నీకు మా ప్రణతులు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, గంధర్వులు, ప్రజాపతులు ఇంకా ఎందరో, అనేక విధాల స్తుతించి, శాంతించుమని ప్రార్థించారు. అయినా స్వామి శాంతించలేదు. దేవతలు లక్ష్మీ దేవిని ఆహ్వానించి, ఆమెను ఇలాగ వేడుకొన్నారు:

**క॥ హరికిం పట్టపుదేవివి హరిసేవానిపుణమతివి హరిగతివి సదా**
**హరి రతివి నీవు నని నరహరి రోషము డింపవమ్మ హరివరమధ్యా! 340**

తల్లీ! శ్రీహరికి పట్టపుదేవివి, హరిసేవ చేయుటలో నిపుణమతివి, హరిచే ఎల్లప్పుడూ కోరబడేదేవివి, ఎల్లప్పుడూ హరిని రమింపజేయు సతివి. నీవువెళ్లి, ఆనరహరి రోషాన్ని శాంతింపజేయుమమ్మా సింహమధ్యా! అని ప్రార్థించగా

అప్పుడు ఆదేవి కరుణించి, నరసింహస్వామిసన్నిధికి పోయి చూచినది. తాను అంతవరకూ చూచియుండని స్వామియొక్క భయంకరాకారాన్ని చూచి, చకితురాలయింది. ఎల్లప్పుడూ చంద్రబింబములాంటి సౌమ్యవదనమూ, ప్రేమలొలికించే చూడ్కులూ, సమ్మోహనాస్త్రంలాంటి చిరునవ్వూ, ప్రియాలాపాలూ వీటికే అలవాటు పడియున్న ఆ ఆదిలక్ష్మి, ఆ ప్రళయంకరుని చెంతకు చేరసాహసించలేక, అలాగే నిల్చుండిపోవడం చూచి, బ్రహ్మదేవుడు ఆలోచించి, ఒక్క ప్రహ్లాదుడే దీనికి సమర్థుడని గ్రహించి, ఆ బాలుని స్వామి చెంతకు వెళ్లుమన్నాడు. పరమభక్త శిఖామణిఅయిన ప్రహ్లాదుడు చిరునవ్వుతో, ఆనందాతిశయంతో స్వామిని సమీపించి, ఆయన దివ్యపాదాలకు సాష్టాంగ దండ ప్రణామం చేసినంతనే ఉగ్రనరసింహమూర్తి ప్రసన్నుడై, బాలుని లేవనెత్తి ప్రేమ పురస్సరంగా తలనిమిరాడు. శ్రీహరి స్పర్శతో ప్రహ్లాదునకు బ్రహ్మజ్ఞానం కలిగినది. భక్తిపారవశ్యముతో ఆనందబాష్పాలతో ప్రహ్లాదుడు ప్రభువు నిలాగ స్తుతించాడు:-

ప్రహ్లాదస్తుతి : ఓ పరమేశ్వరా! బ్రహ్మరుద్రాదులతో సహా ఎల్లరూ నిన్ను అనేక విధాల నిత్యమూ స్తోత్రము చేస్తూ ఉంటారు. ఆరాధిస్తుంటారు. అయినా నిన్ను సంపూర్ణంగా తెలుసుకొనగలిగిన వారెవ్వరూలేరు కదా! నేను మూర్ఖుడను, బాలుడను, అసురగర్భంలో పుట్టినవానిని. నిన్ను నేను స్తుతించగలనా స్వామీ! నీ సాయుజ్యం పొందడానికి జపతపాలూ, వేదాధ్యయనాలూ, వ్రతక్రతువులూ, పుణ్యకర్మలూ, తీర్థయాత్రలూ, నియమనిష్ఠలూ, ఏవీ పనికిరావు. గజేంద్రునివలె భక్తి శరణాగతిచేతనే నీ అనుగ్రహం పొందవచ్చు. దేవదేవా! ధర్మము, సత్యము, దమము, పాండిత్యము, ఓరిమి, దానము, యజ్ఞము, వ్రతనిష్ఠ, అసూయామాత్సర్యాలు లేకుండుట, ఈ పన్నెండు సద్గుణాలుండీ దైవభక్తి లేని వానికంటే, సంస్కారహీనుడై జన్మించినా, తన మనస్సు, ధనము, ప్రాణమూ, సర్వమూ సర్వేశ్వరునికి సమర్పణ చేసే భక్తిగలవాడు మిక్కిలి శ్రేష్ఠుడు కదా! విధ్యుక్త ధర్మ కర్మలు చేస్తూ ఫలితాన్ని నీకు అర్పించడమే ఉత్తమ మార్గము. నీవు భక్త వత్సలుడవు, నీగుణవైభవాలను కీర్తించినంతనే, అజ్ఞానం నశించి, కైవల్యం ప్రాప్తిస్తుంది కదా! సర్వేశ్వరా! నీ భయంకరాకారాన్ని చూడడానికి దేవతలాదిగా అందరూ హడలిపోతున్నారు. దేవాదిదేవా! శాంతించు. లోకకంటకులను హతమార్చి, లోకకల్యాణం చేకూర్చి, నీ అవతారకార్యం సాధించావు కదా స్వామీ! ఇక ప్రసన్నత జూపుమని వేడుకొంటున్నాను.

ప్రభూ! నీ ఉగ్రరూపముకంటే భయాన్ని కలిస్తున్న ఈ సంసార దావాగ్ని నుండి కాపాడు. ఈ దేహము మీదనున్న మోహాన్ని తొలగించు. నీ పాదసేవ చేసే భక్తులయొక్క సాంగత్యాన్ని ప్రసాదించు. సమస్తమూనీవే. సత్యరక్షకుడవూ నీవే కదా! దేవా! ఈ సకల చరాచర విశ్వములో శాశ్వతమైన దేదీలేదు. సాటిలేని బలవంతుడననీ, మరణమేలేని మేటిననీ భావించే నా తండ్రి గతి ఏమయినది? అట్టి అజేయుడే అదృశ్యమైనప్పుడు, నీ పాదసేవయే తప్ప! ఇక ప్రపంచములో నేది శాశ్వతము? దానినే నాకు అనుగ్రహించు. నా పూర్వ జన్మల సుకృతాల ఫలితంగా నారదమహర్షి యొక్క జ్ఞానోపదేశము నాకు లభించినది. కనుక నీ పాదసేవయొక్క దివ్యమహిమ నాకు తెలిసినది. యుగయుగాల్లో అనేక రూపాల్లో నీవు అవతరించి, దుష్ట శిక్షణ, శిష్టరక్షణ, చేస్తూవచ్చావు. నేడు ఈ నరసింహరూపంలో కూడా, అలాగే లోకాలను అనుగ్రహించడానికి వచ్చావు. ప్రభూ! నాతల మీద నీ దివ్యహస్తాన్ని ఉంచి, శ్రీదేవికీ శివునికీ బ్రహ్మకూ కూడా లభ్యము కాని మహాభాగ్యాన్ని నాకు ప్రసాదించావు. నాకు ఇంకేమి కావాలి? ఎట్టి కోరికలూ లేని బుద్ధిమంతులు నీ పాదాల నాశ్రయించి దివ్యానందం పొందుతారు కదా! భక్తిలేని వానికి నీతత్త్వము అంతు పట్టదు, ముక్తిరాదు. స్వామీ నీ యొక్క చరణాభివందనము, నీ దివ్యనామ సంకీర్తనము, ఆత్మ నివేదనము, నీ దాస్యము, నీ పవిత్రగాథా శ్రవణము, నీనామ రూప గుణవైభవాల స్మరణాలతో కూడియున్న చర్యలు, నీయందు భక్తి ప్రపత్తులను వృద్ధి చేస్తాయి కదా! కావున హే ప్రభో! నీ సేవచేసే మహాభాగ్యాన్ని ప్రసాదించు" అని ప్రణామం చేసిన ప్రహ్లాదుని భక్తికి సంతసించిన వాడైన శ్రీహరి ఇలా అన్నాడు: "కుమారా!

**శా॥ సంతోషించితి నీ చరిత్రములకున్, సద్భద్రమౌగాక ! నీ**
**యంతర్వాంఛిత లాభమెల్ల కరుణాయత్తుండనై యిచ్చెదన్**
**చింతం జెందకు భక్త కామదుడనే సిద్ధంబు, దుర్లోక్యుడన్**
**జంతుశ్రేణికి నన్ను జూచిన పునర్జన్మంబు లేదర్భకా.** 369

నీ యొక్క సచ్చరిత్రను చూచి సంతోషించాను. నీకు శుభమగుగాక! నీ మనోవాంఛితాలన్నీ నీకు ప్రసాదిస్తున్నాను. నేను భక్తుల కోర్కెలను తీర్చేవాడను, నా దర్శనం అంత సులువుగా లభించనిది, కాని ఒక్కసారి నన్ను దర్శిస్తే చాలు, ప్రాణికోటికి ఇక పునర్జన్మ ఉండదు. నీవేదైనా ఒక వరం కోరుకొనుము ప్రసాదిస్తాను." అని చెప్పిన నరసింహస్వామితో జితేంద్రియ శ్రేష్ఠుడైన ప్రహ్లాదుడిలా గన్నాడు:

"స్వామీ! నన్ను పరీక్షించాలని వరాలిస్తానంటున్నావా! సంసార వృక్షానికి కామములే బీజాలు కదా! నేను మోక్షకామిని గాని కామార్థిని కాను. లోకంలో ఏ వస్తువూ శాశ్వత సుఖాన్నిచ్చేది కాదు. సమస్తమూ నశించేవే. నీవు నాకు వరమివ్వదలచుకొంటే, కామములు కలుగకుండేటట్లు వరప్రదానము చేయుము." అని, నరసింహా! పురుషోత్తమా! పరమాత్మా! "ఓం నమోభగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే! హరయే-ద్భుతసింహాయ బ్రహ్మణే, పరమాత్మనే!" అని స్తుతించాడు. నరసింహస్వామి మిక్కిలి సంతసించి ఇలా అన్నాడు: "ప్రహ్లాద కుమారా! నీ వంటి జ్ఞానసంపన్నులు, ఏకాంతవాసులు, ఎటువంటి కోరికలనూకోరరు. అయినా నేను అనుగ్రహిస్తున్నాను. నీవు దానవనాథుడవై మన్వంతరకాలం సకలభోగాలూ అనుభవిస్తావు. శుభప్రదమైన నాగాథలనువింటూ, నన్ను ఈశ్వరునిగా తెలుసుకొని, ఆత్మలో నిత్యమూ ఆరాధిస్తావు. సుఖాలననుభవించడం చేత నీ పూర్వ పుణ్య సంచయము వ్యయమవుతుంది. వ్రతాలవలన పాపాలు తొలగిపోతాయి. ఈశ్వరార్పణ బుద్ధితో చేయబడిన కర్మల వలన కర్మబంధాలేర్పడని వాడవై, నన్ను ఆరాధిస్తూ గొప్ప కీర్తిమంతుడవై నా సాన్నిధ్యాన్ని పొందుతావు" అని చెప్పిన స్వామితో ప్రహ్లాదుడిలా గన్నాడు:

"దేవదేవా! తన తమ్ముని సంహర్తవని నా తండ్రి, నీపై ద్వేషం వహించి, శత్రువువలె అనేక అపచారాలు చేశాడు. నీ చేయి సోకగానే నిర్మలుడయ్యాడు. ఆయన యొక్క పాపాలు పోగొట్టి పరిశుద్ధాత్ముడయ్యేలాగున వరము ప్రసాదించు స్వామీ!" అని వేడుకొన్నాడు. స్వామి, కరుణాకటాక్ష వీక్షణాలతో ఇలా అన్నాడు:

"నాయనా! నిన్ను కన్న సుకృతానికి, నీ తండ్రితో సహా వెనుకటి 21 తరాలవారు పవిత్రులయ్యారు. నీ తండ్రి శుభస్థితిని పొందుతాడు. నా భక్తులు నివసించే ప్రదేశాలలో నుంటూ, వారి ప్రేమకు పాత్రులైన వారెవ్వరైనా సరే పరిశుద్ధులవుతారు. ఓ పుణ్యచరిత్రుడా! నీవు నా భక్తులలో నుత్తముడవు. నీవు నా యందు మనస్సు నిలిపి సకల విధులనూ నిర్వహించు." అని సెలవిచ్చి బ్రహ్మదేవునితో స్వామి ఇలా అన్నాడు: "పద్మాసనా! ఇకనెప్పుడూ పాపాత్ములకు వరాలివ్వవద్దు" అని ఆనతిచ్చి అంతర్ధానమయ్యాడు.

బ్రహ్మాది దేవతల సమక్షాన ప్రహ్లాదుని పట్టాభిషేకము జరిగినది. ఈ విధంగా వైకుంఠద్వారపాలకులైన జయవిజయులు మొదటిజన్మనుండి విముక్తులయ్యారు. రెండవ జన్మలో రావణకుంభకర్ణులై పుట్టి, శ్రీరామావతారంచే విముక్తులై, చివరిజన్మలో శిశుపాల దంతవక్త్రులుగా పుట్టి, శ్రీకృష్ణుని చేత ముక్తిని పొంది వైకుంఠానికి చేరుకొంటారు. - అని నారదుడు ధర్మజానికి చెప్పాడు.

ఉ॥ శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రు సం
హారముఁ బుణ్యభాగవతుడైన నిశాచరనాథపుత్రు సం
చారము నెవ్వడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా
కారము తోడనేభయము కల్గని లోకము చెందుభూవరా! 385

రాజా! మనోహరమూ, శుభప్రదమూ అయిన ఈ నరసింహవిహారమును, ఇంద్రశత్రువైన హిరణ్యకశిపుని సంహారమును, పరమభాగవతుడైన ప్రహ్లాదుని సంచారము నెవ్వడైన శ్రద్ధతో విన్నా పఠించినా, సర్వశుభాలతో పుణ్య లోకాలను పొందుతాడు.

(ఈ ప్రహ్లాద చరిత్రలో వేదాంతసారమంతా ఉన్నది. నారదమహర్షి యొక్క బోధలతోపాటు శ్రీమహావిష్ణువు యొక్క కరస్పర్శ ఆశీస్సులు, అనుగ్రహం వలన ఆ బాలుని యందు తత్త్వజ్ఞానము ఉదయించినది.)

## త్రిపురాసుర సంహారము

దేవతల దాడులకు తట్టుకొనలేని రాక్షసులకు తలదాచుకొనే తావులేక పోయినది. మహామాయావీ, రాక్షస శిల్పిఅయిన మయుడు, వారికి ఆశ్రయం కల్పించడానికి మూడు పట్టణాలను నిర్మించిఇచ్చాడు. ఒకటి సువర్ణముతోనూ, ఇంకొకటి వెండితోనూ, మూడవది ఉక్కుతోనూ నిర్మింపబడిన ఆ త్రిపురాలు బైటకు కనబడకుండా కోరినచోటికి ఎగిరి వెళ్ళేడి శక్తిగలవి. ఆమాయాశక్తిచే రాక్షసులు దేవతలను పలు విధాలుగా హింసించసాగారు. దేవతలందరూ ప్రార్థించగా పరమశివుడు త్రిపురవాసులైన రాక్షసులైన అసురులపై ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించగా, రాక్షసులందరూ మరణించారు. కాని మాయావియైన మయుడు అదివరకే తయారుచేసియుంచిన సిద్ధామృతరసంతో నున్న కూపములో వారందరినీ తీసుకెళ్లి పడవేశాడు. వారంతా సజీవులై మళ్ళీ దేవతలపైకి దండెత్తారు. తన అస్త్రశక్తి వ్యర్థమైపోయిందని శివుడు ఖిన్నుడైనాడు.

రాక్షసమాయను మాయోపాయము చేతనే వమ్ము చేయదలచి, శ్రీహరి ఒక అందమైన గోవురూపాన్ని ధరించి, బ్రహ్మను గోవత్స రూపంలో తనతో రమ్మని ఆ సిద్ధరసం ఉన్న కూపము వద్దకుపోయి, ఆ రసాన్ని పూర్తిగా త్రాగివేశారు. మోహనాకారంలోనున్న ఆ గోవును, గోవత్సమునూ చూచి భ్రమించి పోయిన రక్షకభటులు వాటిని తరిమి వేయడం మరచిపోయారు. తరువాత విషయం తెలుసుకొన్న మయుడు చేసేదిలేక ఇదిదైవనిర్ణయం అని ఊరుకొన్నాడు.

విష్ణుమూర్తి తన సహజశక్తులైన ధర్మము, జ్ఞానము, విద్య, తపస్సు, వైరాగ్యము, సమృద్ధి, క్రియాశక్తి విశేషాలతో, యుద్ధ సామగ్రి అయిన, రథము, కేతనము, కవచము, ధనుస్సు, సారథి, మొదలైన వాటితో సర్వసన్నాహాలూ గావించి శంకరునకర్పించాడు. త్రినేత్రుడు కవచం ధరించి, రథారూఢుడై, పినాకపాణియై, ఉగ్రుడై, బాణం సంధించి విడిచాడు. మయుని మాయచే పునర్నిర్మింపబడిన త్రిపురాలు, త్రినేత్రుని శరీరం నుండి వెలువడిన ప్రళయకాల బడబాగ్నులవంటి జ్వాలల్లో అసురులతో సహా భస్మమైపోయినవి. అప్పటికి రాక్షసుల బెడదనుండి దేవతలు రక్షింపబడ్డారు.

శివశక్తికి వైష్ణవశక్తిని జోడించి, శ్రీమన్నారాయణుడు శివునిచే త్రిపురదహనం చేయించాడు. లోకకల్యాణం కలిగినది. ఓ ధర్మనందనా! బ్రహ్మాదులకు సైతము దుర్లభుడైన శ్రీహరి శ్రీకృష్ణరూపములో మీ యింటనుంటూ, మీతో మిత్రునిగా, బావమరదిగా, ప్రియునిగా, రక్షకునిగా మెలగడం అపూర్వమైన మీయొక్క మహద్భాగ్యము కదా"! అని నారదమహర్షి చెప్పాడు.

## వర్ణాశ్రమ ధర్మాలు

స్వధర్మాచరణమే మోక్షసాధనం గనుక ఆ ధర్మముయొక్క స్వరూపమెలాంటిదో చెప్పుమని యుధిష్ఠిరుడు కోరగా నారదమహర్షి ఇలా చెప్పనారంభించాడు:

పాండుకుమారా! దక్షపుత్రిక అయిన "మూర్తి" అనే ఆమెయందు ధర్మునకు భగవానుడు నర, నారాయణులుగా అవతరించాడు. బదరికాశ్రమంలో తపోనిష్ఠుడై వెలసినాడు. అన్ని వర్ణాల మానవులూ పాటించవలసిన ముఖ్యమైన, సనాతనమైన అనేక ధర్మాలను ఈ నారాయణుడు నాకు ఉపదేశించాడు. వాటిని నీకు సూక్ష్మంగా చెపుతాను విను – అవి: (మానవులందరికీ వర్తించే 30 ధర్మాలు) సత్యము, సంతోషము, సమదృష్టి, సత్ అసత్ వివేకము, శౌచము, క్షమ, దయ, దానము, మార్దవము, మనోనిగ్రహము, మహాజనసేవ, మితభాషణము, ఇంద్రియజయము, బ్రహ్మచర్యము, ప్రాణులలో పరమాత్మ దర్శనము, అభేదబుద్ధితో ప్రవర్తించడము, ఉపవాసాదికము, ఉచితజపము, అహింస, ఆత్మావలోకనము, అన్నోదకాలు పంచిపెట్టడము, అసభ్యవాంఛలను, అనర్థక క్రియలను విడిచిపెట్టడము, శ్రీమన్నారాయణ స్మరణము, కథాశ్రవణము, నామసంకీర్తనము, సేవాభావము, ఆరాధనము, నమస్కృతి, దాస్యము, సఖ్యము, ఆత్మసమర్పణము. వీటిని అన్ని వర్ణాలవారూ అలవరచుకొని పాటించాలి.

బ్రాహ్మణులు అదనముగా షోడశ సంస్కారాలను పొంది, యజ్ఞాలు చెయ్యడం చేయించడం, వేదం చదవడం, చదివించడం, దానం ఇవ్వడం, గ్రహించడం, అనే షట్ కర్మల నాచరించాలి. ముఖ్యంగా ఇంద్రియ నిగ్రహము, శుచి, తపము, దయ, సత్యము, జ్ఞానము, క్షమ, మృదు స్వభావము, హర్షము, హరిభక్తి, కలిగియుండుట విప్రులధర్మము.

క్షత్రియులు దానస్వీకారం మినహా మిగిలిన విప్రధర్మాలతో పాటు అదనంగా ప్రజాపాలనము, దోషిదండనము, పన్నులు వసూలు చెయ్యడం చెయ్యాలి. ధైర్యము, శౌర్యము, వీర్యము, దానగుణము, ధర్మనిష్ఠ, రక్షణ, ఆచార్యసేవనము, కళాపోషణము, దైవారాధన, కలిగియుండుట క్షాత్రధర్మాలు.

వైశ్యులు, బ్రాహ్మణ కులధర్మానుసరణతో పాటు అదనముగా వ్యవసాయము, వాణిజ్యము, పశుపాలనము, ధర్మార్థకార్యసిద్ధి, దేవ బ్రాహ్మణసేవ, గురు సమాజసేవ, నిర్మలత్వము మొదలైన ధర్మాలను పాటించాలి.

శూద్రులు వినయము, శౌచము కలిగియుండుట, కపటమూ, దొంగబుద్ధీ లేకుండుట, సత్యవర్తనముతో నుండుట, గోబ్రాహ్మణులను కాపాడుట, దేవ, గోబ్రాహ్మణ, సమాజ సేవ చేయుట, శారీరక కర్మలు, పంచయజ్ఞాలు(అమంత్రకముగ) ఆచరించుట, మొదలైన ధర్మాలను పాటించాలి.

స్త్రీలు గృహనిర్వహణ, శుచి, సౌందర్యపోషణ, ప్రియభాషణం, సత్యవర్తనం, దయాదాక్షిణ్యాలూ ధర్మచింతనా మున్నగునవి కలిగియుండుట, సంతోషంగా నుండుట, పతిసేవ, బంధు - ఆదరణ, అతిథిసత్కారములు, మొదలైన ధర్మాలను పాటించాలి. పతిని విష్ణుమూర్తిగా కొలుస్తూ, తాను లక్ష్మీ దేవిలాగ ప్రవర్తించాలి. భర్తను అనుసరిస్తూ అన్ని ధర్మాల్లోనూ సహకరించాలి. ఉపవాస, వ్రత, తపస్సులకంటే, నిర్మలంగా, నిష్కపటంగా పతిసేవ చెయ్యడమే శ్రేష్ఠము. పతి వక్ర మార్గానపోతే, స్త్రీ తన పాతివ్రత్యబలంతో అతనిని ఉద్ధరించి తీర్చిదిద్దాలి. జాతి (జన్మ) మాత్రంచే మనుష్యుని వర్ణం నిర్ణయించరాదు. శమదమాది ధర్మవర్తనముద్వారా వర్ణాన్ని నిర్ణయించాలి.

ఇక నాలుగు ఆశ్రమ ధర్మాల గురించి చెపుతాను విను:

**బ్రహ్మచర్యాశ్రమ ధర్మాలు** : బ్రహ్మచారి శీలవంతుడై, నియమనిష్ఠలు కలవాడై, వినమ్రుడై, సౌమ్యుడై ప్రవర్తిస్తుండాలి. గురుసేవ చేస్తుండాలి. దేవతార్చనాది నిత్య కర్మలు చేస్తుండాలి. అధ్యయనం అభ్యాసము చేస్తుండాలి. స్త్రీలతో అవసరానికి మించి మాట్లాడరాదు, కలియరాదు. స్త్రీలయందు మాతృభావం కలిగియుండాలి. గురువుగారిని సేవా శుశ్రూషలతోను, శ్రద్ధాభక్తులతోను సేవించాలి. ఆయన అనుగ్రహంతో విద్యనభ్యసించాలి. విద్యాభ్యాసాంతమున గురుదక్షిణ సమర్పించి, అతని ఆశీస్సులతో గృహస్థధర్మంగాని, సన్న్యాసముగాని స్వీకరించాలి.

**గృహస్థాశ్రమధర్మాలు** : గృహస్థుడు మనఃస్థైర్యముతో, సత్ప్రవర్తనతో, తన ధర్మాలను నిర్వర్తిస్తుండాలి. పరసతులయందు పవిత్రభావము కలిగియుండాలి. ఋతుకాలంలోతప్ప భార్యాసంగమమును వర్జించాలి. ఇంద్రియనిగ్రహము అన్ని విషయాల్లోనూ పాటించాలి. ఋజువర్తనుడై ధర్మబద్ధముగ ప్రవర్తిస్తూ, గురువువద్ద అభ్యసించిన విద్యను ఆచరణలో పెట్టాలి. అతిథిసత్కారం, సంఘక్షేమమూ, మానవధర్మాలూ పాటించాలి. సర్వభూతాలయందూ సర్వేశ్వరుని దర్శించాలి.

గృహస్థుడు గృహోచిత కర్మలన్నీ వాసుదేవార్పణగా చెయ్యాలి. మహాత్ములను ఆదరించి, వాళ్లచే శ్రీహరిగాథలను చెప్పించుకొని వినాలి. సజ్జన సాంగత్యమూ, సాన్నిహిత్యమూ పొందడానికే సదా కాంక్షిస్తుండాలి. పుత్రమిత్ర కళత్రాదులతోడి అనుబంధం యొక్క యథార్థతను గుర్తించి, అమితమైన మమకార వ్యామోహాలను దేనియందూ పెంచుకొనరాదు. తన అవసరాలకు మాత్రమే ఉంచుకొని, మిగులు ద్రవ్యాన్ని దీనులకు ఇస్తుండాలి. భార్యచేత సకల ధర్మకార్యాలూ, అతిథి సత్కారాలూ, గృహస్థవిధులూ నిర్వహింపజెయ్యాలి. భగవంతుడు అతిథిరూపంలో వస్తాడుగనుక, అతిథిదేవులను సత్కరించాలి. పితృదేవతలకు తర్పణములు, శ్రాద్ధాలూ చేస్తూ ఉండాలి. శ్రీహరి సాధు పురుషులయందు ప్రకాశిస్తుంటాడు గనుక వారికి చేసిన సేవ శ్రీహరి సేవయే అనే భావంతో చెయ్యాలి. ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రాలను సేవిస్తూ ధర్మకార్యాలనాచరించాలి సామాన్య ప్రజలు ఆరాధించే నిమిత్తం త్రేతాయుగములో విష్ణు ప్రతిమారాధన ప్రవేశపెట్టబడినది. సద్బ్రాహ్మణులను శ్రీహరి కూడా సేవిస్తాడు కనుక గృహస్థులు కూడా సద్బ్రాహ్మణులను సేవించాలి.

ఇంద్రియలోలత్వము వలన జ్ఞానము నశిస్తుంది. గృహస్థు పంచయజ్ఞాల నాచరించాలి: అవి:- దేవయజ్ఞము, ఋషియజ్ఞము, పితృయజ్ఞము, మానవయజ్ఞము, పశుపక్ష్యాదియజ్ఞము. వీటిని చేయడంచేత భగవంతుని గురించి యజ్ఞము చేసినట్లే. చిత్తాన్ని జయించి, అన్యసాంగత్యాన్ని విడిచిపెట్టి, శ్రీహరిని భజించాలి.

**వానప్రస్థాశ్రమధర్మాలు :** గృహస్థాశ్రమం సక్రమంగా నిర్వహించిన తరువాత వానప్రస్థాశ్రమం స్వీకరించాలి. వనములలో నివసించాలి. దున్నకుండా పండే నీవారాది ధాన్యాలు ఉడకబెట్టినవిగాని, పచ్చివిగాని, సూర్యతాపంచే పండి ఎండిన ఫలాలు గాని భుజిస్తూ, పరమేశ్వరుని భజిస్తుండాలి. అగ్నిరక్షణ కోసం పర్ణశాలలలోనో, కొండగుహలలోనో నివసించాలి. శీతోష్ణాలన్నిటినీ సహించాలి. దండము, కమండలము, జింకచర్మము, నారబట్టలు, ధరించాలి. పన్నెండు సంవత్సరాలుగాని లేదా, ఎనిమిదిగాని, నాలుగుగాని, రెండుగానీ కనీసం ఒక్క సంవత్సరమైనాగాని ఏకాగ్రచిత్తముతో మౌనియై జీవించాలి. వృద్ధాప్యంవల్లగాని, అనారోగ్యమువల్లగాని తన ధర్మానుష్ఠాలు సరిగా నెరవేరకపోతే, నిరశనవ్రతం పూని, ఆత్మయందు అగ్నులను ఆరోపణచేసి సన్న్యసించాలి. పరబ్రహ్మయందు ఇంద్రియ మనోబుద్ధుల్ని లయం చెయ్యాలి.

**సన్న్యాసాశ్రమధర్మాలు :** సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించినవాడు, దేహమాత్రావశిష్టుడై యుండాలి. అన్నిటియందూ నిరపేక్షుడై భిక్షుకుడై నిరాశ్రయుడై ఆత్మారాముడై సర్వసముడై శాంతుడై సమచిత్తుడై నారాయణపరుడై యుండాలి. దండకమండలాలను విసర్జించాలి. కౌపీనధారియై యుండాలి. ఆత్మజ్ఞానానికి సంబంధించని సకలశాస్త్రాలనూ విసర్జించి, వాద తర్కాలలో పాల్గొనకుండా ఉండాలి. ఒక ఊళ్లో ఒక రాత్రికంటె ఎక్కువ గడపరాదు. ఎల్లప్పుడూ ఆత్మదర్శనం గురించే ఆసక్తుడైయుండాలి. దేహము నశించునట్టిదని తెలుసుకొన్నవాడై తన అంత్యకాలంగురించి ఎదురుచూస్తుండాలి. ఈ విధంగా ఆత్మదర్శనం కోసం ధ్యానము చేస్తూ ఉంటే ఆత్మజ్ఞానం లభ్యమై పరమహంస అవుతాడు. అప్పుడు అతడు ఇతరులకు మూగవానివలె బాలునివలె ఉన్మత్తునివలె కనిపిస్తాడు.

బ్రహ్మచారి తన ఆశ్రమనిష్ఠలను మానరాదు. గృహస్థుడు నిత్యనైమిత్తిక కర్మలను మానరాదు. వానప్రస్థుడు జనపదంలో నివసించరాదు. సన్న్యాసికి స్త్రీ ఆలోచన రాకూడదు. అని నారదుడు యుధిష్ఠిరునకు చెప్పి, అజగరవ్రతాన్ని అవలంబించిన ఒక అవధూత చరిత్రను చెపుతాడు. శరీరపోషణ గురించి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యకుండా ఏది లభ్యమైతే దానినే స్వీకరించి కొండచిలువలాగా పడియుండడం అజగరవ్రతం అనబడుతుంది.

## అజగరోపాఖ్యానము

ఒకనాడు ప్రహ్లాదుడు కొందరు మంత్రులతో లోకసంచారము చేస్తుండగా, కావేరీ నదీతీరాన సహ్యాద్రిసానువులలో దుమ్ముకొట్టుకొనియున్న శరీరంతో అజగరుడు అనే ముని శయనించియుండడం చూచాడు. నివురుకప్పిన నిప్పులాగ నిర్వికారంగా పడియున్న ఆ మునీశ్వరుని సమీపించి ఆయన ఇలా అడిగాడు:

"మహాత్మా! మీ శరీరము పరిపుష్టముగా బలిష్ఠముగా నున్నది. ఇటువంటి శరీరము కష్టపడి ధనార్జనచేసి, సకలభోగాలతో దేహాన్ని పోషించేవారికే గాని ఇతరులకు సాధ్యపడదుకదా మరి శరీరపోషణకు ఎటువంటి ప్రయత్నమూ చేయకుండా, చలనం లేకుండా నిర్వ్యాపారులై పడియున్న మీకు ఇంతటి సౌందర్యశోభతో బలిష్ఠమైన శరీరం ఎలాగ పెరిగిందో ఆశ్చర్యంగానున్నది. అద్భుతమూర్తి అయిన మీ గురించి నాకు తెలుసుకోవాలని ఉన్నది" అని కోరగా ఆ అజగరమౌని సంతసించి ఇలాగ చెప్పాడు:

"దానవసార్వభౌమా! నీవు పరమభాగవతోత్తముడవు. భగవంతుడు నీ హృదయంలో సదా ప్రకాశిస్తుంటాడు. నీకు తెలియనిదేమున్నది? నేను విషయసుఖాల వెంట పరువులెత్తి, సంసార చక్రంలో చిక్కుకొని, నానాజన్మల నెత్తాను. దాన ధర్మాలు పుణ్యకార్యాలూ చేసి స్వర్గద్వారాలు చేరుకొన్నాను. అధర్మాలూ పాపకర్మలూ చేసి, శునక సూకరాది యోనుల్లో పుట్టి హీనమైన అనుభవాలను పొందాను. ఎలాగో మళ్లీ మానవజన్మ లభించిన తరువాత స్వర్గమైనా నరకమైనా, మోక్షమైనా మరుజన్మ అయినా లభించడానికి ఈ మానవజన్మయే ఆధారం అని తెలుసుకొని, దాంపత్యసుఖాలూ, ఇతర విషయసుఖాలూ పొందాలని చేయబడే కర్మలన్నీ క్షణిక సుఖాలిచ్చినా, దుఃఖాన్నే కలిగిస్తాయని తెలుసుకొన్నాను. ఆత్మానందమును గురించి చేయబడిన సాధనలే అనంత సుఖాన్నిస్తాయని గ్రహించి, కర్మబంధాలనుండి నివృత్తిపొంది, ఏ కోరికాలేక, ఇలాగ ఉంటూ, ప్రారబ్ధభోగాల ననుభవిస్తున్నాను. మానవునకు ధనమువలన దుఃఖమే కలుగుతుందిగాని, సుఖం లభించదు. ధనవంతుడు నిరంతర భయసందేహాలతో కొట్టుకొంటూ

ఉంటాడేగాని ఒక్కనాడు కూడా సుఖశాంతుల్ని పొందలేదు. తెంపులేని కోరికలలో మునిగి తేలుతుంటాడు. తేనేటీగలు కూడబెట్టిన తేనెను ఇతరులు అనుభవించునట్లు లోభుల ధనము ఇతరుల పాలవుతుంది. నేను ఒక కొండచిలువను చూచి - లభించిన దాన్నే తింటూ కదలకుండా పడిఉంటే జీవనం గడిచిపోతుంది - అనే నీతిని నేర్చుకొన్నాను. అందుచేతనే నేను ఇలాంటి ఏకాంత జీవితాన్ని గడుపుతున్నాను. నా శరీరము, పరిపుష్టంగా నుండడానికి కారణం నాకున్న సంతుష్టియే. నాకు ఏదిలభించినా సంతోషముగాని, లభించకుంటే దుఃఖముగాని కలుగవు. నాకు ప్రియులుగాని, అప్రియులుగాని లేరు. నా మనస్సులో ఎవ్వరి రూపమూ నిలిచియుండదు. పరమాత్మనే సతతమూ ధ్యానిస్తుండడం చేత నాకు అందరూ అంతా పరమాత్మ మయంగానే కనిపిస్తుంది. ఈ పరమహంస ధర్మాన్ని పరమభక్తుడవైన నీకు చెప్పగలిగినందుకు సంతోషంగా నున్నది. నీవంటి పవిత్రాత్ములతో సంభాషణమే ఒక సౌభాగ్యము" అని చెప్పిన ముని పాదాలకు శిరస్సును తాకించి, ప్రహ్లాదుడు ప్రణామాలు చేశాడు. ఉత్తమ సన్యాసి లక్షణాలను తెలిసికొనినందుకు సంతోషించి, అతడు నిష్క్రమించాడు.

నారదుడు యుధిష్ఠిరునకు వర్ణాశ్రమ ధర్మాలను వివరించి చెప్పి, గృహస్థులు శ్రీకృష్ణసేవచే తరించగలరని చెప్పాడు. భగవంతుని సేవయే కాదు, భాగవతుల సేవచే కూడ ఉత్తమ గతిని పొందవచ్చునని చెప్పి, ఉదాహరణగా, తన చరిత్రనే ఇలాగ చెప్పాడు:

గతించిన కల్పములో నేను ఉపబర్హణుడు అనబడే గంధర్వుడును. చక్కని రూపసినే కాకుండా మధుర గాయకుడను కూడ అయియుండటం చేత గంధర్వాంగనలు నా చుట్టూ చేరేవారు. ఒకసారి ప్రజాపతులు జరిపిస్తుండే దేవసత్రయాగంలో శ్రీహరిని గూర్చిగానం చెయ్యడానికి గంధర్వులను, అప్సరసలను ఆహ్వానించారు. నేను విష్ణుగాథలను వీనుల విందుగా గానం చేస్తూ మధ్యలో గంధర్వాంగనల మోహంలోపడి వెళ్లిపోయాను. అదిగమనించిన ప్రజాపతులు నన్ను భూలోకంలో ఒక శూద్ర స్త్రీ గర్భంలో పుట్టవలసిందిగా శపించారు. నేను ఒక బ్రాహ్మణుల ఇంటపనిచేసే దాసీ స్త్రీకి పుత్రుడనై జన్మించాను. ఆ ఇంటికి చాతుర్మాస్యవ్రత దీక్షలో నున్న కొందరు మహాత్ములు అతిథులుగా వచ్చిరి. వారికి సేవచేసే అవకాశము నాకు కలిగినది. నా సేవలకు ఆ మహాత్ములు చాలా సంతోషించి, నాకు ఈశ్వర తత్త్వ రహస్యాన్నీ, నారాయణనామ మహిమనూ ఉపదేశించారు. దాని ఫలితంగా ఈ జన్మలో బ్రహ్మమానస పుత్రుడనై నారాయణ నామసేవచేసుకొంటున్నాను. ధర్మజా! ఈ యాగానికి శ్రీకృష్ణుడే ఆరాధ్యదైవమై యుండుట మీ యొక్క పూర్వజన్మల సుకృతమేసుమా"! అని ఆశీర్వదించి, నారదుడు నిష్క్రమించాడు.

**సప్తమ స్కంధము సమాప్తము**

**హరిఃఓం తత్ సత్**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# అష్టమస్కంధము

## మనువులు

స్వాయంభువ మనువు తరువాత పాలించిన ఇతర మనువుల గురించి చెప్పుమని పరీక్షిత్తు వేడగా శ్రీశుకుడు ఇలా చెప్పాడు:

ఈ కల్పములోని పదునలుగురు మనువులలో ఆరుగురు ప్రఖ్యాతులు (కీర్తిశేషులు) అయినారు. మొదటి మనువైన స్వాయంభువునకు దేవహూతి, ఆకూతి అనే కుమార్తెలు కలిగారు. శ్రీమహావిష్ణువు లోకాలకు ధర్మాలను, జ్ఞానాన్నీ బోధించే నిమిత్తమై దేవహూతికి కపిలునిగను, ఆకూతికి యజ్ఞునిగను జన్మించాడు. కపిలుని చరిత్ర ఇదివరకే చెప్పడమయినదికదా! ఇప్పుడు యజ్ఞుని గురించి చెప్తాను.

ప్రతి మన్వంతరములోనూ ఒక మనువూ, మనుపుత్రుడు, ఇంద్రుడు, ఋషులు, అంశావతారము, దేవతలు ఉంటారు. వీరందరినీ పాలిస్తూ, భగవానుడు లోకరక్షణ చేస్తుంటాడు. స్వాయంభువమన్వంతరను మొట్టమొదటిది. స్వాయంభువమనువు భార్యఅయిన శతరూపతో సకల సౌఖ్యాలనూ అనుభవించి, చిరకాలము రాజ్యం ఏలిన తరువాత సర్వమూత్యజించి, భార్యతోపాటు సునందానదీతీరమునకు చేరి అచట ఒంటికాలిపై నిలిచి, ఒక వంద సంవత్సరాలు తపస్సు చేశాడు. మంత్రోపనిషద్వాక్యాలతో భగవంతుని ఇలాగ స్తుతించాడు. "ఎవరైతే తనచైతన్యశక్తిచే విశ్వాన్ని సృష్టిస్తాడో, లోకాలు నిద్రిస్తుండగా తాను మేల్కొనియుంటూ బ్రహ్మాండాన్ని చూస్తూఉంటాడో, తనకుతానే ఆధారమైయుంటూ సమస్తమూ తానే అయియుంటాడో, తనకొకరూపము లేకపోయినా తన చైతన్య ప్రభావాన్ని రూపొందించుతాడో, ఆది మధ్యాఅంతములు లేనివాడై, అంతటా ఎల్లప్పుడూ వ్యాపించియుంటాడో, ఎవడు అందరికీ జ్ఞానాన్ని కలుగజేస్తాడో అటువంటి పరమేశ్వరునకు ప్రణమిల్లుతున్నాను." అని ప్రార్థిస్తుండగా, అసురులు వచ్చి అతనిని చంపి ఆరగించాలని మీదపడ్డారు. అది చూచి, మూర్తి ధర్ములకు పుత్రుడై జన్మించిన యజ్ఞుడనబడే శ్రీమహావిష్ణువు వచ్చి, చక్రాయుధంతో రాక్షసులను సంహరించి, మనువును రక్షించాడు. అతడే ఇంద్రుడైనాడు.

రెండవ మన్వంతరంలో అగ్ని కుమారుడైన స్వారోచిషుడు మనువైనాడు. అతని పుత్రులలో ప్రసిద్ధులైన ద్యుమంతుడూ, సుషేణుడూ, రోచిష్మంతుడూ మొదలైన వారు భూమిని పాలించారు. అప్పుడు రోచనుడు ఇంద్రుడైనాడు. తుషితులు మొదలైనవారు దేవతలైనారు. ఊర్జస్తంభుడు మొదలైన వారు సప్తఋషులైనారు. విష్ణువు విభువు అనే పేరుతో, తుషిత, వేదశిరులనే బ్రాహ్మణ దంపతులకు పుత్రుడై జన్మించి, కుమార బ్రహ్మచారియై వ్రతదీక్షాపరుడయ్యాడు.

ప్రియవ్రతుని పుత్రుడైన ఉత్తముడు మూడవ మనువైనాడు. అతనికి పవనుడు, సృంజయుడు, యజ్ఞహోత్రుడు మొదలైన గుణవంతులైన కుమారులుండిరి. వశిష్ఠపుత్రులైన ప్రమథాదులు సప్తఋషులయ్యారు. సత్యజిత్తు అనే వాడు ఇంద్రుడయ్యాడు. సత్యులూ, భద్రులూ మొదలైన వారు దేవతలైనారు. విష్ణువు ధర్మునికి సూనృతయందు సత్యసేనుడనే పేరుతో జన్మించాడు. అతడు సత్యజిత్తుకు చెలికాడై దుర్మార్గులైన యక్షరాక్షసులను దండించాడు.

నాల్గవ మన్వంతరంలో తామసుడనే వాడు మనువైనాడు. అతని కుమారులైన కేతువు, వృషుడు, నరుడు, ఖ్యాతి మొదలైన పదిమంది బలవంతులు రాజులయ్యారు. సత్యకులూ, హరులూ, వీరులూ మొదలైనవారు దేవతలైనారు. త్రిశిఖుడనే వాడు ఇంద్రుడయ్యాడు. జ్యోతిర్వ్యోముడు మొదలైన వారు సప్తఋషులైనారు. విష్ణువు

హరిణి, హరిమేధులకు పుత్రుడై జన్మించి హరి అనబడ్డాడు. సర్వలోక ప్రభువైన హరి దయాసముద్రుడై మొసలికి చిక్కిన గజేంద్రుని విడిపించి రక్షించాడు.

తామస మనువు తమ్ముడైన రైవతుడు ఐదవమనువైనాడు. అతని కుమారులైన ప్రతివింధ్యుడు, అర్జునుడు, మొదలైనవారు రాజులయ్యారు. ఈ మన్వంతరంలో హిరణ్యరోముడూ, ఊర్ధ్వబాహుడూ, వేదశిరుడూ మొదలైనవారు దేవతలైనారు. శుభ్రునకు వికుంఠయందు విష్ణుమూర్తి వైకుంఠుడై జన్మించాడు. అతడు సర్వలోక పూజనీయమైన వైకుంఠలోకాన్ని సృష్టించాడు. ఆయనను లక్ష్మీదేవి వరించినది.

తరువాత చక్షువుపుత్రుడైన చాక్షుషుడు ఆరవ మనువైనాడు. అతని కుమారులైన పురుడు, పురుషుడు, సుద్యుమ్నుడు మొదలైన వారు రాజులయ్యారు. మంత్రద్యుమ్నుడు ఇంద్రుడయ్యాడు. ఆప్యాదులు దేవతలైనారు. హవిష్మంతుడు, వీరకుడు మొదలైనవారు సప్తఋషులైనారు. వైరాజుకు సంభూతియందు విష్ణువు అజితుడనే పేరుతో జన్మించాడు. ఆయనే కూర్మరూపుడై మందరపర్వతం సముద్రములో మునగకుండా మోసినాడు. దేవతలు ప్రార్థించగా క్షీరసముద్రాన్ని చిలికి అమృతాన్నిచ్చాడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఇప్పుడు వైవస్వతుడనే ఏడవమనువు పరిపాలిస్తున్నాడు. అతనిని శ్రాద్ధదేవుడని కూడా అంటారు. అతనికి ఇక్ష్వాకుడు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశకుడు, పృషధ్రుడు, వసుమంతుడు - అనే పదిమంది పుత్రులు కలిగారు. వీరు రాజులైనారు. పురందరుడనేవాడు ఇంద్రుడయ్యాడు. ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, రుద్రులు, దేవతలైనారు. గౌతముడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, వశిష్ఠుడు, సప్త ఋషులయ్యారు. వీరిలో కశ్యపుని భార్య అదితిగర్భంనుండి విష్ణువు వామనరూపుడై ఇంద్రుని తమ్మునిగా జన్మిస్తాడు. ఇంతవరకూ ఏడు మన్వంతరాల గురించి చెప్పాను. రాబోయే మన్వంతరాలు ఇలాగుంటాయి:

సూర్యునకు విశ్వకర్మ పుత్రికలైన సంజ్ఞా, ఛాయ భార్యలైనారు. ఆయనకు బడబ అనే భార్య కూడ ఉన్నది. సంజ్ఞకు యముడు, శ్రాద్ధదేవుడు, యమున పుట్టారు. ఛాయకు, శనైశ్చరుడు, తపతి, పుట్టారు. తపతిని సంవరుణుడు పెండ్లాడాడు. బడబకు అశ్వినీదేవతలిద్దరు పుట్టారు. రాబోయే కాలంలో సావర్ణి ఎనిమిదవ మనువు అవుతాడు. అతడిప్పుడు తపస్సు చేస్తున్నాడు. సూర్యసావర్ణి పాలించే ఎనిమిదవ మన్వంతరములో అతని కుమారులు నిర్మోహుడు, విరజస్కుడు మొదలైన వారు రాజులవుతారు. సుతపులు, విరజులు, అమృత ప్రభువులూ, దేవతలవుతారు. గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, అశ్వత్థామ, కృపుడు, వ్యాసుడు, ఋష్యశృంగుడు, సప్తఋషులవుతారు. బలిచక్రవర్తి ఇంద్రుడవుతాడు. పూర్వము దానవుడైన బలి స్వర్గలోకాన్ని స్వాధీనంచేసుకొనగా, విష్ణువు వామనుడై వెళ్ళి దానమడిగి దానవుని అణగద్రొక్కాడు. తరువాత శ్రీహరి బలికి అమరావతి కంటె అందమైన సుతల లోకాన్ని ఇవ్వగా అక్కడ బలి సుఖంగానున్నాడు. తరువాత విష్ణువు దేవగుహ్య సరస్వతికీ సార్వభౌముడనే పేరుతో జన్మిస్తాడు. ఇంద్రుని పదవి నుండి తొలగించి, బలిని ఇంద్రపదవిలో నుంచుతాడు. విష్ణువు నుండి బలి ఇంద్రపదవిని పొందినప్పటికీ, అతడు మొదట విష్ణువునకు చేసిన దానము యొక్క పుణ్యము తరిగిపోదు.

తరువాత వరుణుని కొడుకైన దక్షసావర్ణి తొమ్మిదవ మనువు అవుతాడు. అతని పుత్రులైన ధ్రువకేతువు, దీప్తికేతువు మొదలైన వారు రాజులౌతారు. అద్భుతుడనే వాడు ఇంద్రుడౌతాడు. ద్యుతి మంతుడు మొదలైన వారు సప్త ఋషులౌతారు. ఆకాలంలో విష్ణువు ఆయుష్మంతునకూ, అంబుధారకూ పుడుతాడు. అతని రక్షణలో దేవేంద్రుడైన అద్భుతుడు మూడులోకాలనూ ఆనందంగా పాలిస్తాడు.

ఆ తరువాత ఉపశ్లోకుని కుమారుడైన బ్రహ్మసావర్ణి పదియవమనువు అవుతాడు. అతని కొడుకులైన భూరిషేణుడు మొదలైనవారు రాజులౌతారు. హవిష్మంతుడు మొదలైనవారు సప్తఋషులౌతారు. శంభుడనేవాడు ఇంద్రుడవుతాడు. విబుద్ధులూ మొదలైన వారు దేవతలౌతారు. విష్ణువు విశ్వసృజునకూ, విషూచికీ, విష్వక్సేనుడనే పేరుతో జన్మిస్తాడు. శంభుని చెలికాడై లోకాలను కాపాడుతాడు.

ధర్మసావర్ణి పదకొండవ మనువు అవుతాడు. అతని కుమారులైన సత్యధర్ముడు మొదలైన పదిమందీ రాజులవుతారు. విహంగములూ, కామగమనులూ, నిర్వాణరుచులూ దేవతలౌతారు. వైధృవుడనే వాడు ఇంద్రుడౌతాడు. వరుణుడు మొదలైన వారు సప్తఋషులౌతారు. విష్ణువు ధర్మసేతువు అనే పేరుతో సూర్యుని పుత్రునిగా జన్మిస్తాడు. అతడు మహిమాసంపన్నుడై ఇంద్రుడు సంతోషించేటట్లు ముల్లోకాలనూ కాపాడుతాడు.

భద్రసావర్ణి పన్నెండవ మనువౌతాడు. అతని పుత్రులైన దేవవంతుడు, ఉపదేవుడు, దేవజ్యేష్ఠుడు మొదలైన వారు రాజులౌతారు. ఋతుధాముడనేవాడు ఇంద్రుడౌతాడు. హరితులు మొదలైనవారు దేవతలౌతారు. తపోమూర్తి, తపస్వి, ఆగ్నీధ్రకుడూ మొదలైనవారు సప్తఋషులౌతారు. సత్యతపునకూ, సూనృతకూ స్వధాముడనే పేరుతో విష్ణువు జన్మిస్తాడు. మనువు సంతోషించేటట్లుగా లోకాన్ని రక్షిస్తాడు.

దేవసావర్ణి పదమూడవ మనువవుతాడు. అతని పుత్రులు చిత్రసేనుడు, విచిత్రుడు మొదలైనవారు రాజులవుతారు. సుకర్ములు సుత్రాములు దేవతలౌతారు. దివస్పతి అనే వాడు ఇంద్రుడు అవుతాడు. నిర్మోహుడూ, తత్త్వదర్శనుడూ మొదలైన వారు సప్తఋషులైతారు.

ఇంద్రసావర్ణి పధ్నాలుగవ మనువౌతాడు. అతని పుత్రులైన గంభీరుడు, వసువు మొదలైన వారు రాజులౌతారు. పవిత్రులు, చాక్షుషులు దేవతలౌతారు. శుచి అనేవాడు ఇంద్రుడౌతాడు. అగ్ని, బాహువూ, శుచి, శుక్రుడు, మాగధుడు మొదలైనవారు సప్తఋషులౌతారు సత్రాయణునకు, వితానకూ విష్ణువు బృహద్భానుడనే పేరుతో పుత్రుడౌతాడు. దేవతలు సంతోషించేటట్లు కార్యకలాపాలు పెంపొందిస్తాడు.

ఈ పధ్నాలుగు మంది మనువులూ, అంతరించిపోయినప్పుడు, అనగా, వెయ్యి మహాయుగాలు (చతుర్యుగాలు) గడిస్తే, బ్రహ్మకు ఒక పగలు అవుతుంది. ఒక మన్వంతరం అంటే 71 చతుర్యుగాలు, అనగా మానవకాలమానంలో ఆరుకోట్ల, 8 అక్షల, 45 వేల సంవత్సరాలు. ఒక చతుర్యుగాంతం ముగిసే సరికి క్రమంగా వేదాలు అంతరించిపోయి, మళ్లీ ఉద్ధరింపబడుతాయి. మనువులు ధర్మాన్ని రక్షించుతారు. ఋషులు తమ తపశ్శక్తిచే వేదాలను దర్శిస్తారు. పూర్వంలాగా ధర్మము మళ్లీ నాలుగు పాదాలమీదా నడుస్తుంది. విష్ణువు ఇంద్రుని ఇతర దేవతలను వేరు వేరు పదవుల్లో నియమిస్తాడు.

శాశ్వతుడైన విష్ణువు యోగీంద్రుని రూపంలో యోగాన్ని బోధిస్తాడు. మౌని రూపంలో కర్మానుష్ఠానాన్ని బోధిస్తాడు. ప్రజాపతి రూపంలో సృష్టిస్తాడు. ఇంద్రుడై రాక్షసుల మదాన్ని అణచివేస్తాడు. సిద్ధ స్వరూపునిగా జ్ఞానం ఉపదేశిస్తాడు. కాలరూపంలో కడతేర్చుతాడు. అవ్యయుడైన ఆదివిష్ణువు పెక్కు నామ రూపాలతో వెలుస్తాడు. విషయాసక్తులకు గోచరించడు. ఆయన భూత, వర్తమాన, భవిష్యత్కాలాలలో లెక్కలేనన్ని నామ రూపాలతో ప్రకాశిస్తాడు.

## గజేంద్ర మోక్షము

క్షీర సముద్రములో త్రికూటము అనే ఒక పర్వతమున్నది. ఆ పర్వతముపైన నానాజాతుల ఫలపుష్ప సుగంధలతల వృక్షాలున్నవి. ఆ పండ్లనుండి కారుతున్న ఫలరసాలు కాలువలై పారుతుంటాయి. ఆ కొండపైన చక్కని సరోవరాలు, ఉద్యానవనాలు ఉన్నవి. సరస్సులలో సొగసైన తామరలు విరిసియున్నాయి. అక్కడికి దేవతలు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, విద్యాధరులు తమ ప్రియురాండ్రతో విహారానికి వస్తారు. ఆ అడవుల్లో నానారకాల జంతుజాతులు విహరిస్తుంటాయి.

ఒక ఏనుగులమంద నీరు త్రాగడానికి వచ్చి, ఒక మడుగులో ప్రవేశించి, జలక్రీడలాడ సాగినది. ఆ ఏనుగుల ప్రభువైన గజేంద్రుడు ఆడు ఏనుగులతోనూ, ఏనుగు గున్నలతోనూ మైమరచి ఆడుతూ ఉల్లాసంగా నున్న సమయంలో ఆ మడుగులోనే ఉంటున్న ఒక మొసలి గజేంద్రుని కాలు పట్టుకొన్నది. అంతవరకూ అనుభవించిన ఆనందమంతా మటుమాయమై, బాధ, దుఃఖము ఆవరించాయి. క్షణికమైన సుఖభోగాలకుపోయి, అంతులేని దుఃఖములో చిక్కుకొన్న సంసారి వలె గజేంద్రుడు మొసలి పట్టులో చిక్కుకొని గజగజలాడిపోయాడు. తన శక్తినంతా కూడగట్టుకొని వాడియైన

దంతాలతో మొసలిని పొడుస్తూ ఘోరమైన పోరుసలిపాడు. కరి, మకరుల భీషణ పోరాటంలో అనేకమైన చేపలూ, తాబేళ్లూ, చిన్న చిన్న మొసళ్లూ చితికిపోయాయి. మడుగంతా నెత్తుటిమయం అయిపోయినది. ఆడు ఏనుగులు గజరాజునకు ఏవిధంగానూ సహాయపడలేక, విడిచి వెళ్లలేక, నిశ్చేష్టలై నిలిచిపోయాయి. స్థానబలంచేత మకరికి పట్టుగట్టి పడినది. గజేంద్రుని బలము క్షీణించసాగినది. నిర్వీర్యుడై కదలలేక నిలిచిపోయాడు. అనేక సంవత్సరాలు పోరు సాగించినా ఏమీ వెసులుబాటు కనిపించకపోగా, మొసలికాట్ల బాధ ఎక్కువయి నరకకూపంలోనికి లాగివేస్తున్న దానియొక్క పట్టుకు తట్టుకోలేక, శక్తిసన్నగిల్లి, దేహబలము, మనోబలమూ, రెండూ శిథిలముకాగా, ఏమిచెయ్యాలో దిక్కుతోచని స్థితిలో కరి రాజునకు పూర్వ జన్మల సుకృతంచే లోకోత్తర శక్తి ఏదో ఒక్కటి సకల జీవరాశుల రక్షణ పోషణ చేసే దివ్యశక్తి ఉన్నది అని స్ఫురణకు వస్తుంది. ఆ దివ్యశక్తినే ఆ ఈశ్వరునే ప్రార్థించాలనుకొని, ఈ విధంగా తలపోస్తాడు.

ఈ అడవిలోని ఏనుగుల రాజును. ఆడు ఏనుగుల అధినాథుని. హాయిగా మంచి గంధపు చెట్లనీడల్లో క్రీడావినోదాలు చేసుకొనకుండా ఈ పాడుమడుగులోనికి ఎందుకు దిగాను? నీరుత్రాగి వెంటనే బైటపడకుండా ఇందులో నెందుకు జలక్రీడ లాడాను? ఇప్పుడు నన్ను ఈ పాపిష్టి మొసలి బారినుండి రక్షించేవారెవ్వరు? ఎవ్వరైనా ఉండకపోతారా! భగవంతుడా! నేనేమి చేసేది? భయమేస్తున్నది.

ఉ॥ ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందు డిందు, పరమేశ్వరుడెవ్వడు, మూలకారణం
బెవ్వడనాది మధ్య లయుఁడెవ్వడు, సర్వము తానయైన వాఁ
డెవ్వడు, వానినాత్మభవునీశ్వరునే శరణంబువేడెదన్. 73

ఈ జగము ఎవ్వనివల్ల పుడుతుందో, ఎవ్వని యందు ఉంటుందో, ఎవ్వని యందు లీనమై లయిస్తుందో, పరమేశ్వరుడెవ్వడో, ఈ విశ్వమంతటికీ మూలకారణమైన వాడెవ్వడో, ఆది మధ్య అంతములు లేనివాడెవ్వడో సర్వమూ తానే అయినవాడెవ్వడో, అటువంటి ఆత్మభవుడైన (స్వయంభువు అయిన) ఆ ఈశ్వరునే నేను శరణు వేడుతున్నాను.

క॥ ఒక పరి జగములు వెలినిడి యొక పరి లోపలికి గొనుచు నుభయముతానై
సకలార్థ సాక్షియగు న య్యకలంకుని, నాత్మమూలు నర్థితలంతున్. 74

లోకాలను ఒకసారి తననుండి ఉద్భవింపజేసి, ఇంకొకసారి తనలోనికి తీసుకొంటూ, వెలుపలా, లోపలా, తానే అయి యుంటూ, సర్వసాక్షియై, నిర్మలుడైన ఆ పరమాత్మను భక్తితో ధ్యానిస్తున్నాను.

క॥ లోకంబులు లోకేశులు లోకస్థులు తెగిన తుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వండేకాకృతి వెలుగు నతని నేసేవింతున్. 75

లోకాలూ, లోకులూ, లోకపాలురూ అన్నీ నశించిన తరువాత, ఏమీ కనిపించని గాఢాంధకారానికి అవతల ఏకైక అఖండరూపముతో ప్రకాశించే వానిని నేను సేవిస్తాను.

క॥ నర్తకుని భంగి పెక్కగు మూర్తులతో నెవ్వడాడు మునులు దివిజులున్
కీర్తింప నేర రెవ్వని వర్తన మొఱులెరుగ రట్టి వాని నుతింతున్. 76

నటునిలాగా అనేకమైన మూర్తులతో నెవ్వడు ఆడుతుంటాడో, ఋషులూ, దేవతలు కూడా, ఎవనిని పూర్తిగా కీర్తింపలేరో, ఎవ్వని ప్రవర్తన గురించి ఇతరులెవ్వరూ గ్రహించలేరో, అలాంటి దేవదేవుని నేను స్తుతిస్తున్నాను.

ఆ॥ ముక్తసంగులైన మునులు దిదృక్షులు సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశ వ్రతాఢ్యులై కొల్తురెవ్వని దివ్యపదము వాడు దిక్కునాకు. 77

సంగము వీడిన మునులూ, దివ్యదర్శన కాంక్షులూ, సకల ప్రాణి కోటికి మేలు కోరేవారు, సాధుచిత్తులు, సాటిలేని వ్రతాల నాచరిస్తూ, ఎవ్వని దివ్యపాదాలను కొలుస్తారో వాడే నాకు దిక్కు. హే ప్రభో! నీకు జనన మరణాలు

లేవు, రూపనామాలూ, గుణదోషాలూ లేవు. అయినప్పటికీ, నీయొక్క మాయకు లోనైనవారు, నీకు నామ రూపాలను కల్పించి, కొన్ని గుణాలనారోపిస్తున్నారు. లోక కల్యాణం గురించి నీవు ధరించిన రూపాలను చూచినవారు నీయొక్క నిర్గుణ నిరాకార తత్త్వాన్ని గుర్తించలేరు. నీవు ఇంద్రియాలకు, మనస్సునకు, బుద్ధికీ అతీతుడవు. నీవు సామాన్యుల అవగాహనకు అతీతుడవైననూ కొందరు మహాపురుషులు నిన్ను తెలుసుకొనగలిగి నిన్ను చేరుకొంటారు. నీవు ఇంద్రియ వ్యాపారాలకు ద్రష్టవే తప్ప దేనికీ కారణము గాని, కర్తవుగాని కావు. నీవు సనాతనుడవు. నిత్యుడవు, అనాదివి, అనంతుడవు, అప్రమేయుడవు. అజుడవు. నీవు గుణాతీతుడవని పండితులు అంటారుగాని, నావంటి దీనులయెడల నీవు కరుణానిధివని అందరూ అంటారు కదా!

శాంత స్వరూపుడూ, స్వపరభేదములేనివాడు, ఆనందము, మోక్షమూ ఇచ్చేవాడు, దుష్టభయంకరుడు, సర్వజ్ఞుడూ, ప్రభుపూ, సృష్టి స్థితి లయములకు కర్తా అయినట్టి వానికి నమస్కరిస్తున్నాను. జ్ఞానాగ్నిచే కర్మ బంధాలను దగ్ధము గావించుకొన్న యోగులు, తమ హృదయాలలో ఆయనను దర్శిస్తారు. ఆయన దేవతలకు, మానవులకు, జంతువులకు చెందనివాడు. స్త్రీజాతికీ, పురుషజాతికీ చెందనివాడు. ఎవ్వరియందూ ప్రత్యేకాభిమానము లేని వాడు, అహంకార, మమకార, అవిద్యలతో కూడియున్న, జంతు శరీరుడనైన నన్ను రక్షించడానికి వస్తాడో రాడో!

క॥ **కలడందురు దీనుల యెడ కలడందురు పరమయోగి గణముల పాలన్**
**కలడందురన్ని దిశలను కలడు కలండనెడివాడు కలడో లేడో.** 86

అహో! నాబాధ ఎక్కువైపోతున్నది. ఎంత ప్రార్థించినా, నాబాధ కొంచెమైనా తగ్గటంలేదే! దేవునకు నామొఱ వినబడలేదా? దీనులయెడల దయతో నుంటాడని అంటారే! పరమయోగుల మధ్యనుంటాడని అంటారే. అన్ని దిక్కులలోనూ ఉంటాడని అంటారు కదా! ఉన్నాడు, ఉన్నాడు, అని అందరూ అంటుండే ఆ దేవుడు, అసలు నిజంగా ఉన్నాడో లేడో! ఛ,ఛ, నేను అలాగ అనుకొనకూడదు, ఆయన నిశ్చయంగా, ఉన్నాడు:

సీ॥ **కలుగడే నాపాలి కలిమి సందేహింప కలిమిలేములు లేక కలుగువాడు**
**నా కడ్డపడరాడె నలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాడు**
**చూడడే నా పాటు చూపులఁ జూడక చూచువారలఁ గృప చూచువాడు**
**లీలతో నామొరాలింపడే మొరగుల మొరలెరుంగుచు తన్ను మొరగువాడు.**

తే॥ **అఖిల రూపులు తన రూపమైన వాడు నాది మధ్యాంతములు లేక యడరువాడు**
**భక్త జనముల దీనుల పాలివాడు వినడె చూడడె తలపడే వేగరాడె** 87

కలిమి లేములు లేక (కలవారూ లేనివారూ అనే విచక్షణ లేకుండా, లేదా, ఉన్నాడో లేడో అనే సందేహం లేకుండా) వెలసిల్లే ఆస్వామి నాపట్ల లేకుండా ఉంటాడా? ఆయన ఉనికిని సందేహించడం దేనికి? దుష్టుల పాల్పడిన సాధువులకు అడ్డుపడేవాడు, నాకు అడ్డుపడడానికి(రక్షించడానికి) రాడా? బాహ్యదృష్టితో కాక అంతర్దృష్టితో చూచేవారిపై కృపజూపేవాడు, నా యొక్క పాట్లను చూడకుండా ఉంటాడా? దీన జనుల మొరలు వింటూ, తన్ను తాను మరచిపోయేవాడు, కరుణతో నా మొర ఆలకించరాడా? అన్ని రూపాలూ తన రూపమే అయినవాడు, ఆది, మధ్య, అంతములు లేక వెలసిల్లేవాడు, భక్తులకూ, దిక్కులేని దీనులకూ దిక్కయినవాడు. అటువంటి కరుణామయుడు, నామొర వినడా, (వింటే) నా బాధనుచూడడా, (చూస్తే) నాయందు దయతలచడా (దయతలచిన వాడైతే) నన్ను రక్షించడానికి ఇంకా రాడేమి?" అని తర్కించుకొంటూ, ఇక బాధను భరించేశక్తిలేక, ఎక్కువ అవుతున్న బాధను ఓర్చుకొనలేక ఈ విధంగా విన్నవించుకొంటాడు:

శా॥ **లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె తనువున్డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప నితఃపరంబెరుగ మన్నింపందగున్ దీనునిన్**
**రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా!** 90

ఓ భగవంతుడా! నాలో శక్తి కొంచెమైనా లేదు. ధైర్యము సడలిపోయినది. ప్రాణాలు కూడా నిలకడ తప్పాయి. మూర్ఛ వచ్చేసినది, శరీరము చితికి పోయినది. అలసట ఆవరించినది. నీవేతప్ప నాకు ఇంకెవ్వరూ తెలియరు. ఈ దీనుని నీవే ఆదుకోవడం సమంజసం. ఓ ఈశ్వరా! రావా! వరాలిచ్చే ప్రభువా, వచ్చి నన్ను కాపాడవా? ఓ జగద్రక్షకా! నన్ను రక్షించవా? హే ప్రభో! దీనులను రక్షించే వాడవు.నీయొక్క కీర్తి అనన్యసాధ్యమైనట్టిది - అది ఎలాంటిదంటే

**క॥ వినుదట జీవుల మాటలు చనుదట చనరాని చోట్ల శరణార్థులకో**
**యనుదట పిలిచిన సర్వము కనుదట సందేహమయ్యె కరుణావార్ధీ! 91**

ఓ దయాసాగరుడా! ప్రాణుల పిలుపు నీవు వింటావట. ఆర్తులను రక్షించడానికి నీవు ఎలాంటి వెళ్లరాని చోట్లకైనా వెళ్లుదువట. శరణార్థులు శరణుదేవా అని పిలిస్తే "ఓ" యని పలుకుతావట, నీవు అంతా వీక్షిస్తూ సర్వమూ తెలుసుకొంటావట. కాని ఇప్పుడు, నాకు ఇదంతా నిజమేనా అనే సందేహం కలుగుతున్నది స్వామీ!

**ఉ॥ ఓకమలాప్త యోవరద యోప్రతిపక్షవిపక్షదూర కు**
**య్యో కవియోగివంద్య సుగుణోత్తమ యోశరణాగతామరా**
**నోకహ యోమునీశ్వరమనోహర యోవిపులప్రభావ రా**
**వే కరుణింపవే తలపవే శరణార్థిని నన్ను కావవే! 92**

ఓ కమలప్రియా! ఓ వరప్రదాతా! శత్రువుల పైన కూడ శత్రుత్వములేని, ఓ దయామయా! కుయ్యో! ఓ కవి, యోగివందితా! సుగుణోత్తమా! శరణాగతులకు కల్పవృక్షమా! ఓ మునిమానసచోరా! ఓ విమలప్రభావా! రావా! నన్ను కరుణింపవా! నా ఆర్తిని గురించి తలంచవా? శరణార్థినైన నన్ను రక్షించవా?" అని మొరపెట్టి, రక్షణలేని వారిని రక్షించే భగవంతుడు ఆపదలోనున్న నన్ను ఆదుకొనడా, అని తలపోసి, గజరాజు నింగివైపు నిక్కిచూస్తూ, నిట్టూర్పులు విడుస్తూ తొండముపైకెత్తి, ఆక్రోశించాడు. అప్పుడు, విభుడూ, విశ్వమయుడూ, విజయశీలీ అయిన విష్ణుమూర్తి, ఆర్తితో ఆక్రోశిస్తున్న జీవిని ఆదుకోవాలనుకున్నవాడై -

**మ॥ అలవైకుంఠ పురంబులో నగరిలో నామూలసౌధంబు దా**
**పల మందార వనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో**
**త్పలపర్యంకరమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి**
**హ్వల నాగేంద్రము "పాహి పాహి" యన కుయ్యాలించి సంరంభియై. 95**

ఆపద్బాంధవుడు (శ్రీహరి) అప్పుడు అవైకుంఠపురములో, రాజప్రాసాదములో, అంతఃపురసౌధసమీపములో, మందారవనమధ్యనున్న అమృత సరస్సువద్ద, చంద్రకాంత శిలావేదికపై, కలువపువ్వుల పాన్పుపై, రమాదేవితో వినోదిస్తున్నాడు. భయకంపితుడై "రక్షించు రక్షించు" అని ఏడుస్తూ మొరపెట్టుకొంటున్న గజేంద్రుని ఆర్తనాదం విని, ఆ ప్రభువు అతనిని రక్షించాలనే ఉత్సాహంతో సిద్ధపడ్డాడు.

ఆయన యొక్క ఆతృత, తొందరపాటు ఎలాగున్నాయంటే -

**మ॥ సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే**
**పరివారంబును జీర దభ్రగపతిం బన్నింపఁ డాకర్ణి కాం**
**తర ధమ్మిల్లముఁ జక్కనొత్తడు వివాద ప్రోత్థిత శ్రీ కుచో**
**పరిచేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై. 96**

గజరాజు ప్రాణాలను కాపాడాలనే ఉత్సాహంతో ఉరకలు వేస్తున్న శ్రీహరి లక్ష్మీదేవికైనా చెప్పడు. శంఖచక్రాలను చేత ధరించడు, అనుచరులనెవ్వరినీ పిలువడు, పక్షిరాజైన గరుడుని సిద్ధపడుమని చెప్పడు, చెవులవరకు జాలువారిని జుట్టునైనా సవరించుకొనడు, అంతేకాదు ఆప్రభువు గజేంద్రుని రక్షించుటకై వెళ్లిపోతున్నప్పుడు అప్పటి వరకు

ప్రణయలీలలో తాను తన చేతితో పట్టుకొనియున్న లక్ష్మీ దేవియొక్క పైటచెంగును కూడ వదలిపెట్టడు, అలాగే లేచి ఆకాశమార్గాన వడివడిగా, వెళ్లిపోతున్నాడు అప్పుడేం జరిగినదంటే -

మ॥ తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధ వ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుడు వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును నారదుండు ధ్వజనీకాంతుండురావచ్చి రౌ
య్యన వైకుంఠపురంబునం గలుగు వారాబాల గోపాలమున్. 98

విష్ణువు వెంటలక్ష్మీదేవి, ఆమెవెంట, అంతఃపుర స్త్రీ జనము, వారివెంట గరుడుడు, అతని ప్రక్కనే ధనుస్సు, గద, శంఖచక్ర పరికరాలూ, నారదుడు, ధ్వజనీకాంతుడు, బయలుదేరగా, వారివెంట రంయిమని వైకుంఠములోనున్న ఆ బాల గోపాలమంతా వెంటపరుగెత్తినారు. గోవిందుని వేళ్లమధ్యను చిక్కుకున్న తనపైట చెంగును రక్షించుకొంటూ, ఆయన వెనువెంటనే పరుగెత్తుతున్న శ్రీదేవి ఇలాగ తలపోస్తున్నది:

మ॥ తనవేంచేయు పదంబు పేర్కొనడనాథ స్త్రీ జనాలాపముల్
వినెనో స్రుచ్చులు స్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులం
గని చక్రాయుధుడేడి చూపుడని ధిక్కరించిరో దుర్జనుల్ 100

స్వామి ఇంత తొందరగా ఎక్కడికి వెళ్లుతున్నాడో చెప్పనేలేదే! ఎవ్వరైనా అనాథ స్త్రీ జనుల ఆర్తనాదాలు విన్నాడేమో! దుర్మార్గులైన దొంగలు వేదాలను దొంగిలించారేమో! రాక్షసులమూకలు దేవతల నగరంపై దండెత్తినారేమో! విష్ణువేడీ? చూపండి, అని దుష్టులు భక్తులను ధిక్కరించి హింసిస్తున్నారేమో!" అని తనలోనే ఆలోచించుకుంటూ, ఆ ఇందిరాదేవి, వడివడిగా అడుగులు వేసుకుంటూ హరి వెంట నడుస్తుండగా,

మ॥ వినువీధిం జనుదేర గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ
వన సంపత్తి నిరాకరిష్ణుఁ గరుణా వర్దిష్ణు, యోగేంద్ర హృ
ద్వన వర్తిష్ణు సహిష్ణు భక్తజన బృంద ప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105

రాక్షసుల జీవితాలను నశింపజేసేవాడూ, కరుణాసాగరుడు, యోగీంద్రుల హృదయవిహారీ, సహనశీలి, భక్తజనులహృదయాలను ఉత్కృష్టపరచేవాడు, నవయౌవనవతియైన ఇందిరాదేవి పరిచర్య చేయువాడు, జయశీలుడు, తేజోమయుడూ అయిన విష్ణుమూర్తి ఆకాశవీధుల్లో వస్తుండగా దేవతలు చూచినారు. అంతేకాదు, ఆయన వెనువెంటనే వడివడిగా వస్తున్న వారిని కూడచూచి ఇలాగ అనుకొంటున్నారు:

మ॥ చనుదెంచెన్ ఘనుడల్లవాడె హరి పజ్జం గంటిరే లక్ష్మి శం
ఖ నినాదంబదె చక్రమల్లదె భుజంగధ్వంసియున్వాడె క్ర
న్నన నేతెంచె నటంచు వేల్పులు "నమోనారాయణాయే"తి ని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తి దురవస్థా వక్రికిన్ జక్రికిన్. 107

గజరాజు దురవస్థను తొలగించడానికి వెళ్తున్న విష్ణువును చూచి, "అదిగో మహనీయుడైన మహావిష్ణువు వస్తున్నాడు. ఆయన వెనువెంటనే వెళుతున్న మహాలక్ష్మిని చూచారా! అదిగో శంఖధ్వని, అల్లదే సుదర్శన చక్రము. అదిగో గరుత్మంతుడు కూడా వస్తున్నాడు చూడండి. "ఆహా! ఏమిదర్శనము! ఓం నమోనారాయణాయ" అని దేవతలు ప్రణామాలు చేశారు. కాని, కరిరాజును కాపాడాలనే తొందరలో నున్న, శ్రీహరి దేవతల ప్రణతులను గమనించకుండా మనోవేగంతో పోయిపోయి, జ్యోతిర్మండలం దాటి కరి మకరి పోరాడుతున్న జలాశయం వద్దకు చేరి, గజేంద్రుని దుస్థితిని గమనించి:

మ॥ కరుణాసింధుడు శౌరి వారిచరమున్ ఖండింపగాబంపె స
త్వరితాకంపిత భూమి చక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండభాండచ్ఛటాం
తర నిర్విక్రము పాలితాఖిల సుధాంధశ్చక్రముంజక్రమున్. 109

కరుణా సాగరుడైన శ్రీహరి, మకరిని ఖండించడానికి తన చక్రాన్ని పంపించాడు. ఆ చక్రము ఎలాంటిది? సాధు జనులను రక్షించేదీ, భూమండలాన్ని కంపింపజేసే వేగము కలదీ, తననుండి వెలువడే అగ్నికణాలతో ఆకాశాన్ని చుట్టివేయగలదీ, పెక్కుబ్రహ్మాండ భాండాలను కాంతిపుంజాలతో నింపివేయగలదీ, తిరుగులేనట్టిదీను. ఆ సుదర్శన చక్రము పోయి, పర్వతంలాంటి మేను కలిగియున్న మకరితలను త్రుంచివేసినది. మొసలి పట్టునుండి ముక్తుడైన గజేంద్రుడు కాలుకదిపాడు. సంసారబంధమునుండి విడివడిన సన్న్యాసివలెను, మబ్బులు తొలగిన చంద్రునివలెను, నిశ్చలచిత్తుడై, ఆడుఏనుగులు తొండాలతో నీరుపోయగా నిర్మలుడై ఆనందంగా కనిపించసాగాడు.

శ్రీహరిపాంచజన్యశంఖాన్ని ఊదగానే దేవతలు జయజయధ్వానాలు చేస్తూ పుష్పవృష్టి కురిపించారు. విష్ణుమూర్తి చేయిచాచి గజేంద్రునికి అందించి, మడుగునుంచి వెలికి లాగాడు. గజరాజుయొక్క వెన్నుతట్టి, ఒళ్లు నిమిరాడు. స్వామిహస్త స్పర్శతో హస్తియొక్క సర్వబాధలూ సమసిపోయాయి. ఆనందంతో మేను పులకరించగా తొండాన్నెత్తి, ఘీంకరించి, తన కృతజ్ఞతను తెలుపుకొన్నాడు గజేంద్రుడు. అతని అజ్ఞానం నశించినది. తరువాత అతడు విష్ణు సారూప్యాన్ని పొందాడు. అతడు వెనుకటి జన్మలో పాండ్యదేశానికి రాజైన ఇంద్రద్యుమ్నుడు. ఆ రాజు ధర్మవర్తనుడు, విష్ణుభక్తుడు, తపోధనుడు. పూర్వకర్మవశాత్తూ ఆ రాజు అగస్త్యఋషి ఆగ్రహానికి అకారణంగా గురి అయి, ఏనుగైపుట్టాడు. అయినా పూర్వపుణ్యముచేత, భగవద్భక్తిని కోల్పోకుండా, క్లిష్టపరిస్థితిలో భగవంతుని ప్రార్థించాలనే జ్ఞానము కలిగినది. భగవంతుని స్పర్శచే అతని పాపము, శాపము, తొలగిపోయి, విష్ణురూపం వచ్చి, వైకుంఠానికి వెళ్లిపోయాడు.

చనిపోయిన మకరి శరీరం నుండి ఒక దివ్యపురుషుడు వచ్చాడు. అతడు, హూహూ అనే గంధర్వుడు. అతడు పూర్వ జన్మలో భార్యలతో సహా ఇదే సరస్సులో జలక్రీడలాడుతున్నాడు. ఆ సరస్సు అడుగున నిల్చొని దేవలమహర్షి తపస్సుచేసుకొనడం చూచి, గంధర్వునకు ఒక తుంటరి ఆలోచన వచ్చి, అతని కాలిబొటన వ్రేలు లాగాడు. మహర్షికి ధ్యానభంగముకాగా - "నీవు ఈ నీటిలోనే మొసలివై పడి యుందువుగాక" అని గంధర్వుని శపించాడు. గంధర్వుడు తెలివి తెచ్చుకొని, మన్నింపుమని ప్రార్థించగా, "మొసలివై నీవు శాపగ్రస్తుడైన ఒక గజేంద్రుని పట్టుకొన్నప్పుడు విష్ణుచక్రము వచ్చి నిన్ను సంహరించినప్పుడు, నీ పూర్వరూపము వస్తుందిలే" అని అనుగ్రహించాడు. గంధర్వుడు ఆ విధంగా శాపవిముక్తుడై శ్రీహరిని స్తుతించి వెళ్లిపోయాడు.

తరువాత శ్రీహరి శ్రీదేవి వంక చిలిపిగా చూస్తూ ఇలాగ పరిహాసమాడాడు:

క॥ బాలా! నావెనువెంటను హేలన్ వినువీధి నుండి యేతెంచుచు నీ
చేలాం చలంబు పట్టుట కాలో నేమంటి నన్ను నంభోజ ముఖీ. 129

"ఓ బాలా! నీపైట చెంగును విడువకుండా ఆకాశమార్గాన విలాసంగా వెళ్లిపోతున్న నావెంట పరుగెత్తుకుంటూ వస్తున్నప్పుడు నీవు నా గురించి ఏమనుకొన్నావో కదా పద్మముఖీ!" అని పలికిన ముకుందునితో, అరవింద మందిర అయిన ఆ ఇందిరాదేవి, మందస్మిత వదనారవిందయై ఇలా అన్నది: "ఏం చేసేది స్వామీ! మీ పాదాలను అనుసరించడమే కదా నా కర్తవ్యం మరి! మీరు ముందు పరుగెత్తుతుంటే, మీ వెంట రాకుండా ఉండగలనా నేను?" అన్నది.

క॥ దీనుల కుయ్యాలింపను, దీనులరక్షింప మేలు దీవన పొందన్
దీనావన! నీ కొప్పును, దీనపరాధీన! దేవదేవ! మహేశా! 133

"ఓ దీనపరాధీనా! దేవదేవా! మహేశా! దీనులయొక్క మొరాలకించడానికీ, దీనులను రక్షించడానికీ, వారి స్తుతులను పొందడానికీ, నీకే తగియున్నది, స్వామీ" అనగా, మహావిష్ణువు సంతసించి, మహాలక్ష్మిని ప్రేమతో దగ్గర చేర్చుకొని, అందరినీ ఇలా ఆశీర్వదించాడు: "ఈ గజేంద్రుని గాథను ప్రతిదినమూ చదివేవారికి సుఖసంతోషాలూ, నాయొక్క

రక్షణా, చివరకు మోక్షమూ లభిస్తాయి," అని చెప్పి నిష్క్రమించాడు. రాజా! ఈ ఉదంతము చతుర్థమన్వంతరంలో జరిగినది. ఈ మన్వంతరంలో విష్ణువు హరిమేధునకు, హరిణికి శ్రీహరియై జన్మించి, గజరాజుని రక్షించాడు.

## కూర్మావతారము

**పరీక్షిత్తుతో శ్రీశుకుడు ఇలాగ చెప్పాడు:** ఒకనాడు దూర్వాసమహర్షి ఇంద్రునకు పూజచేయబడిన ఒక పుష్పమాలను ఇస్తే, ఇంద్రుడు దానిని నిర్లక్ష్యముగా ఐరావతం మీద పడవేశాడు. ఆ ఏనుగు ఆమాలను తన కాలిక్రింద త్రొక్కి, నలిపివేసినది. ఈ ఘోరమైన అపచారానికి మహర్షి మండిపడి శపించాడు. ఆ శాప ఫలితంగా, ఇంద్రునితో సహా మూడులోకాలవారూ, ఐశ్వర్యమూ వైభవమూ, పౌరుషమూ కోల్పోయారు. రాక్షసులతో జరుగుతుండే యుద్ధాలలో దేవతలు అధిక సంఖ్యలో మరణించేవారు. దేవతలే తరచూ ఓడిపోయేవారు. ఎన్ని యజ్ఞయాగాదులు చేసినా పరిస్థితి ఏమీ మెరుగుపడలేదు. ఏమి చెయ్యాలో దిక్కుతోచక, ఇంద్ర వరుణాది దేవతలు బ్రహ్మదేవుని వద్దకు పోయి విన్నవించుకొన్నారు. బ్రహ్మ వీరందరినీ తోడ్కొని, గాఢాంధకార తమస్సుకు ఆవలనున్న అజిత(విష్ణు) భగవానుని వద్దకు వెళ్లాడు. అందరూ ఆ భగవానుని అనేక విధాలుగా స్తుతించారు. వారికి కూడ సాధారణంగా ఆయన దర్శనం దొరకదు. ఆ స్వామి కరుణించి వెయ్యి సూర్యులకాంతితో వారికి దర్శనమిచ్చాడు. బ్రహ్మాది దేవతలు ఆ దివ్య దర్శనాన్ని చూడలేక అత్యాశ్చర్యచకితులై చూస్తూ, ఇలా అన్నారు: "ప్రభూ! లోకాలన్నింటా నిండియుండి, సర్వమూ తెలిసియున్న నీకు మేము ఏమని విన్నవించుకొనగలము? నీ యొక్క పాదపద్మాల దర్శనంతోనే మాకు సర్వశుభాలూ కలుగుతాయి కదా!" అనగానే భగవానుడు ప్రసన్నుడై ఇలా అన్నాడు: "బ్రహ్మాది దేవతలారా! మీయొక్క ఇక్కట్లు నాకు తెలుసును. కాని సమయం మీకు అనుకూలముగా లేదు. ప్రస్తుతానికి మీరు కొంచెం అణిగి యుండి రాక్షసులతో మంచిగా నుండండి. మీరు అమృతాన్ని సంపాదించితే, యుద్ధాలలో మరణించకుండా ఉంటారు, శక్తిమంతులవుతారు. పాలసముద్రాన్ని మధించితే అమృతం లభిస్తుంది. మందర పర్వతాన్ని కవ్వముగాను, వాసుకిసర్పాన్ని కవ్వపు త్రాడుగాను వినియోగించాలి. దీనికి బలవంతులైన రాక్షసుల సహకారము, సహాయము మీకు చాలా అవసరం. కనుక వారితో సఖ్యంగా నుండండి. సాగరమథనంలో కొన్ని మంచి వస్తువులు వస్తాయి. వాటిని ఆశించవద్దు. విషము కూడా వస్తుంది, దానికి భయపడవద్దు. మీకు శుభము కలుగుతుంది" అని చెప్పి భగవానుడు అంతర్ధానమయ్యాడు.

దేవతలు, రాక్షసరాజైన బలిచక్రవర్తి పట్ల స్నేహాన్ని కనపరచారు. బలహీనులై యున్న దేవతలు, శత్రుత్వంచూపటం లేదు కనుక, వారికి ఏవిధమైన హానీ తలపెట్టవద్దని, నీతిమంతుడైన బలిచక్రవర్తి రాక్షసులను ఆదేశించాడు. ఇంద్రుడు, బలిచక్రవర్తికి మంచి మంత్రిలాగా మంచి మాటలతో శాంతిని కలిగించేవాడు. "అక్క చెల్లెళ్ల సంతతి వారమైన మనము సఖ్యముగా నుంటే అనేకమైన సుఖాలను పొందగలము. శత్రుత్వము వలన ఇంతవరకు చెడిపోయినాము కదా! మనమంతా కలిసి కష్టపడి, అమృతాన్ని సంపాదిద్దాం" అని చెప్పి ఇంద్రుడు బలిచక్రవర్తిని సాగరమథనానికి ఒప్పించాడు. ఎలాగ చెయ్యాలో వివరించి చెప్పాడు. దేవతల సమూహానికి ఇంద్రుడూ, రాక్షసులకు బలిచక్రవర్తీ నాయకులుగానుంటూ మందర పర్వతాన్ని సమీపించారు.

దేవ శిల్పి అయిన త్వష్ట ఆధ్వర్యాన పర్వతం చుట్టూ కొంతమేరకు త్రవ్వి, రోకళ్లవంటి పనిముట్లను దూర్చి, పెకలించి, కదిలించి, తమ శక్తినంతా పెట్టి పెల్లగించి, పర్వతాన్ని పైకి ఎత్తారు. బలిష్ఠమైన చేతులతోనూ, తలలతోనూ, భుజాలతోనూ మోసుకొని వెళ్లారు. కొంతదూరం మోసిన తరువాత వాళ్లకు శక్తి సన్నగిల్లి, పర్వతం ఒరిగి, నేల పడినది. దానిక్రింద అనేకులైన దేవదానవులు పడిపోయి మరణించారు. మిగిలినవారు నిరుత్సాహపడి, ఇటువంటి అసంభవమైన సాహసకృత్యానికి పూనుకొనడం వెర్రితనం అని, తమను తాము నిందించుకొని, నిస్సహాయులై, నిల్చుండిపోయారు. ఈ తరుణంలో గరుడవాహనుడై, విష్ణుమూర్తి వచ్చాడు. దేవదానవులు, ఆయన్ను స్తుతించారు. వారిని చింతించవద్దని ధైర్యము చెప్పి, ఆ పర్వతాన్ని సాగరతీరానికి తరలించవలసినదిగా గరుత్మంతుని ఆదేశించాడు విష్ణుమూర్తి. గరుడుడు, శ్రీహరినీ మందర పర్వతాన్నీ తన వీపుపైన ఎక్కించుకొని పోయి సముద్రతీరాన దించివేశాడు.

దేవతలూ, దానవులూ, సర్పరాజైన వాసుకిని పిలిపించి, అమృతంలో కొంత భాగమిస్తామని చెప్పి, కవ్వపు త్రాడుగా ఉండుమని వేడుకొన్నారు. పర్వతాన్ని చుట్టూ చదునుచేసి, వాసుకిని దాని చుట్టూచుట్టి, పర్వతాన్ని పాలసముద్రంలోనికి త్రోసారు. దేవతలు వాసుకి పడగలవైపు పట్టుకొనగా, రాక్షసులు నీచమైనట్టి దానియొక్క తోకను పట్టుకొనడానికి నిరాకరించారు. దేవతలు సరేనని తోకవైపు పట్టుకొనగా, రాక్షసులు తలవైపు పట్టుకొని చిలకడం ఆరంభించారు. వెంటనే మందర పర్వతం బుడబుడమని మునిగిపోసాగినది. రెండు పక్షాలవారూ పర్వతాన్ని ఎత్తడానికి సాయశక్తులా శ్రమించారు. అయినా ఫలితంలేక పోయినది. దైవసహాయం లేనిదే ఎలాంటి శ్రమ అయినా ఫలించదని గుర్తించినవారై దేవ దానవులు విష్ణుదేవుని ప్రార్థించారు. ఒడ్డునే నిల్చొని చూస్తున్న విష్ణువు, వారిపై దయతలచి, అందరూచూస్తుండగా సముద్రంలోనికి దిగాడు.

సముద్రంలోదిగిన విష్ణుమూర్తి మహాకూర్మముగా మారిపోయాడు. దాని వీపు (డిప్ప) లక్షయోజనాల విస్తీర్ణత కలది. అది పర్వతమూలానికి వెళ్లి, తన వీపుపై కొండనెక్కించుకొని, దానిని పైకి ఎత్తగా దేవదానవులు హర్షధ్వానాలు చేశారు. భగవంతుడు కూర్మరూపుడై మందరగిరిని ధరించి, దాని శిఖరాన్ని వెయ్యి చేతులతో ఊగకుండా పట్టుకొన్నాడు. అలాగే వాసుకి యందు ప్రవేశించి రాపిడికి దాని శరీరము తెగిపోకుండా శక్తి నిచ్చాడు. దేవదానవులలో ఆవేశించి వారికికూడ శక్తిని నిచ్చాడు. వారిని ప్రోత్సహించడానికి తాను కూడ దేవతల ముందునిల్చొని కొంతసేపు లాగనారంభించాడు.

దేవదానవులు అత్యంత ఉత్సాహంతో, ఒకరినొకరు ప్రోత్సహించుకొంటూ, చిలకడం సాగించారు. మందరపర్వతం, కవ్వము వలె గిరగిరా తిరగసాగినది. పాలతుంపరలు మేఘాలవలె ఆకాశాన్ని ఆవరించాయి. రెండువైపులా ఉత్సాహంతో పాటు, పట్టుదలలు, పౌరుషాలు కూడా పెరగసాగాయి. చేపలు, చిన్న చిన్న తిమింగిలాలులాంటి జలచరాలు చచ్చి, తేలిపోతున్నవి. సర్పరాజు శరీరం శిథిలమవుతున్నది. దేవదానవుల పట్టు మరింత బిగుసుకొన్నది. అంతలో సముద్రంనుండి అగ్నిజ్వాలలతో కూడిన హాలాహలమనే మహావిషం కారుమేఘాల లాగా వెలువడ నారంభించినది. రాక్షసులు, దేవతలు భయముతో వాసుకిని విడిచి పరుగెత్తసాగారు. ఆ హాలాహలము భుగభుగమనే పొగలతో, చిటపటమనే నిప్పుకణాలతో ధగధగమనే జ్వాలలతో ఆకాశాన్ని ఆవరిస్తున్నది. అడవులు మండిపోతున్నవి, జీవరాసులు మాడిపోతున్నవి. నదులు, సముద్రాలు ఇంకిపోతున్నవి. పర్వతాలు బ్రద్దలౌతున్నవి. ముల్లోకాలూ తల్లడిల్లుతున్నవి. అకాలప్రళయం సంభవించిందేమో నని అందరూ భయభ్రాంతులైనారు బ్రహ్మాది దేవతలు దిక్కుతోచక శివుని చెంతజేరి, సాష్టాంగ ప్రణామాలు చేసి, ఇలాగ విన్నవించుకొన్నారు:-

సీ॥ **భూతాత్మ భూతేశ భూతభావనరూప దేవ మహాదేవ దేవవంద్య**
**యీ లోకములకెల్ల నీశ్వరుండవు నీవ, బంధమోక్షములకు ప్రభుడ వీవ**
**ఆర్త శరణ్యుండ వగు గురుండవు నిన్ను కోరి భజింతురు కుశలమతులు**
**సకల సృష్టి స్థితి సంహార కర్తవై, బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ బరగుదీవు**

ఆ॥ **పరమ గుహ్యమైన బ్రహ్మంబు సదసత్తమంబు నీవ శక్తి మయుడవీవ**
**శబ్దయోనివీవ జగదంతరాత్మవు, నీవ ప్రాణమరయ నిఖిలమునకు.** 222

క॥ **నీయంద సంభవించును, నీయంద వసించి యుండు నిఖిల జగంబుల్**
**నీయంద లయము బొందును, నీయుదరము సర్వభూత నిలయము రుద్రా!** 223

క॥ **కొందరు కలదందురు నిను, కొందరు లేదందు "రతడు గుణికాడ" నుచున్**
**కొందరు కలదని లేదని, కొందలమందుదురు నిన్ను గూర్చి మహేశా.** 225

ఆ॥ **మూడు మూర్తులకును మూడులోకములకు మూడు కాలములకు మూలమగుచు**
**భేదమగుచుఁదుది నభేదమై యొప్పారు బ్రహ్మమనగ నీవ ఫాలనయన!** 227

ఓ పరమేశ్వరా, శంకరా! నీవు పంచభూతాలలో నున్నవాడవు. వాటికి నీవు ఈశ్వరుడవు (ప్రభువువు). జీవులయొక్క భావనారూపుడవు. దేవా! మహాదేవా! దేవతలచే పూజింపబడువాడా! ఈ లోకాలన్నిటికీ ప్రభువువు నీవు. బంధమోక్షాల నిర్దేశకుడవు. ఆర్తులకు శరణ్యుడవైన గురువువు. బుద్ధిమంతులు నిన్ను ప్రీతితో పూజిస్తారు. సకల సృష్టి స్థితి సంహారకర్తవై బ్రహ్మ విష్ణు శివుడనే పేర్లతో ప్రకాశించే వాడవు నీవే. నిగూఢమైన పరబ్రహ్మము నీవు. సత్ అసత్ రెండునూ నీవే! శక్తిమయుడవూ, శబ్ద బ్రహ్మమువూ నీవే. జగత్తు అంతానిండియున్న అంతరాత్మవు. సమస్తానికీ ప్రాణము నీవే. పరమశివా! ఈ జగములన్నీ నీయందే ఉద్భవిస్తాయి, నీ యందే నివసించియుంటాయి, మరి నీయందే లయిస్తాయి. నీ ఉదరము సర్వభూతాలకూ నిలయము. మహేశా! కొందరు నీవు ఉన్నావని అంటారు. కొందరు నీవు త్రిగుణాతీతుడవు గనుక (ఒక ప్రత్యేకమైన రూపాన్ని ధరించి) ఉండవు అని అంటారు. మరికొందరు నీవున్నావో లేవో అని నిన్ను గూర్చి తికమక చెందుతుంటారు, (కాని నీయొక్క నిజతత్త్వాన్ని ఎవ్వరూ తెలుసుకొనలేరు కదా!) ఓ త్రినేత్రా! త్రిమూర్తులకూ, త్రిజగాలకూ, త్రికాలాలకూ మూలమైయుంటూ, విభేదాలతో కనిపిస్తున్నా చివరకు ఏకైక పరబ్రహ్మవై అభేదతత్త్వమై నీవు ఒప్పుతున్నావు. సత్ అసత్ తత్త్వములతో కూడియున్న చరాచర సృష్టికి ఆశ్రయమైయున్న నిన్ను పొగడడానికి మేము ఎంతటి వారము దేవదేవా!

**క॥ సదసత్తత్త్వచరాచరసదనంబగు నిన్ను పొగడ జలజభవాదుల్**
**పెదవులు కదలుప వెరతురు వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా! 229**

**క॥ లంపటము నివారింపను సంపద కృపసేయ జయము సంపాదింపన్**
**చంపెడివారి వధింపను సొంపారగ నీకెచెల్లు సోమార్ధధరా. 230**

**క॥ నీకంటె నొండెఱుంగము నీకంటెం బరులు కావనేరరు జగముల్**
**నీకంటెనొడయ డెవ్వడు లోకంబులకెల్ల నిఖిలలోకస్తుత్యా. 231**

ఓ చంద్రశేఖరా! సంసారలంపటాన్ని నివారించడానికి, సంపదలను అనుగ్రహించడానికి, జయాన్ని సిద్ధింపజేయడానికి, దుష్టులను హతమార్చడానికి నీకే చెల్లుతుంది. ఓ సర్వలోకపూజ్యా! మేము నిన్ను తప్ప ఇంకెవ్వరినీ ఎరుగము. నీవు తప్ప ఇంకెవ్వరూ ఈ లోకాలను కాపాడలేరు. ఈ లోకాలన్నిటా నీ కంటె గొప్పవాడు ఇంకెవ్వడూ లేడు. ఓ పరమేశ్వరా! ఇప్పుడు ముల్లోకాలూ ఒక ఘోరవిపత్తులో పడినవి. దేవదానవులు, అమృతంగురించి పాలసముద్రాన్ని మథించగా, హాలాహలము ఉద్భవించినది. లోకాలు భస్మముకానున్నవి. ఆ విషజ్వాలలను పరిహరించడానికీ, లోకాలను రక్షించడానికీ నీవే సమర్థుడవని విశ్వసించి నిన్ను ప్రార్థిస్తున్నాము. రక్షించు ప్రభూ! రక్షించు" అని వేడుకొంటున్న బ్రహ్మాదుల అభ్యర్థనను మన్నించి, సర్వభూతహితరతుడైన పరమశివుడు పార్వతీదేవితో ఇలా అన్నాడు: "దేవీ! లోకాలకు సంభవించిన విపత్తును గురించి విన్నావు కదా! ప్రాణులను కాపాడడం ప్రభువుల కర్తవ్యము.

**క॥ పరహితము సేయునెవ్వడు పరమహితుండగును భూతపంచకమునకున్**
**పరహితమె పరమధర్మము పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ. 235**

**క॥ హరి మది నానందించిన, హరిణాక్షి జగంబులెల్ల నానందించున్**
**హరియును జగములు మెచ్చగ గరళము వారించుటొప్పు కమలదళాక్షీ! 236**

"భవానీ! పరహిత మెవడుచేస్తాడో, అతడు పంచభూతాలకూ చాలా ఇష్టుడౌతాడు. పరహితమే పరమ ధర్మము. పరహితునకు ఎక్కడా ఎదురుండదు. ఓ కమలాక్షీ! విష్ణువు మనస్సులో నానందిస్తే లోకాలన్నీ ఆనందిస్తాయి. శ్రీహరీ, లోకాలూ సంతోషించే విధంగా హాలాహలాన్ని నివారించడం మంచిది. నేను ఆ హాలాహలాన్ని ఆరగించి, లోకాలను కాపాడుతాను." అని చెప్పిన శివునితో, శివాని సమ్మతించి, "మీకు ఇష్టమైన రీతిని లోకకల్యాణం చెయ్యండి స్వామీ" - అని తన సమ్మతిని తెలియజేసినది. ఆహా! ఆ జగజ్జననికి లోక సంగ్రహం అంటే ఎంతటి అనురక్తి!

కII ఫ్రింగెడివాడు విభుండని ఫ్రింగెడిదియు గరళమనియు మేలనిప్రజకున్
ఫ్రింగుమనె సర్వమంగళ మంగళ సూత్రంబు నెంతమది నమ్మినదో! 241

మ్రింగవలసినది హాలాహలమని తెలిసీ, మ్రింగదలచుకున్న వాడు తన పతిదేవుడే అని తెలిసీకూడ, దాని వలన లోకాలకు మేలు కలుగుతుందనే సదుద్దేశముతో, సర్వమంగళ అయిన పార్వతీదేవి మ్రింగుమని అనుమతించినది. మరి ఆ తల్లి తన మాంగల్య బలాన్ని ఎంతగా నమ్మినదో కదా! తనకేకాకుండా సర్వలోకాలకూ భర్త అయిన సర్వేశ్వరుడు, సర్వలోకాలకూ మంగళం చేకూర్చే పవిత్ర సంకల్పంతో చేయబూనుకొన్న మహత్తర త్యాగము వలన తనకు కలుగబోవు ప్రమాదాన్ని అయినా సరకు చెయ్యకుండా, సమ్మతించిన సర్వమంగళాదేవి సార్థకనామ అయినది కదా!

అప్పుడు పరమశివుడు తన చెయ్యి చాచి, అన్నిచోట్లా వ్యాపించియున్న హాలాహలాన్ని ఊడ్చి పోగుచేసి, కబళంగా చేసి నేరేడు పండును మ్రింగినంత విలాసంగా నోట్లో వేసుకొన్నాడు. ఆయనకు ముఖం వాడిపోలేదు, చెమటైనా పట్టలేదు, కన్నులు ఎర్రబడలేదు, మెడలోని సర్పాలు కదలలేదు, శిగపైని చంద్రుడు కందలేదు. తన ఉదరము, సమస్త లోకాలకూ నిలయము కనుక, ఆ గరళము లోనికి పోరాదని, దానిని గొంతువంటే ఉండేట్లు నిలుపుకొన్నాడు. ఆ కంఠము నీలవర్ణం అయిపోయినది. అందుచేతనే ఆయన నీలకంఠుడన బడ్డాడు. లోకరక్షణకోసం ఆయన చేసిన త్యాగానికి చిహ్నమైన ఆ నీలకంఠము, ఆయనకు ఒక అమూల్యమైన ఆభరణంగా భాసించినది. బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది దేవతలు, ఉమాదేవి మేలుమేలు అంటూ జయధ్వానాలతో స్తుతించారు. శివుని చేతినుండి జారిపడిన విషపుచుక్కలను పాములు, తేళ్లువంటి కీటకాలు నాకడంచేత అవి విషకీటకాలైనవి. అలాగే కొన్ని విషపు ఓషధులైనవి.

దేవాసురులు భయముతీరినవారై, మళ్లీ సాగరమథనము కొనసాగించారు. కొంతసేపటికి కామధేనువు బైటకు వచ్చినది. తెల్లని, పుష్టిగా నున్న శరీరమూ, నిండైన పెద్దపొదుగు, అందమైన కొమ్ములూ, మనోహరమైన రూపముతో కోరినకోర్కెలను తీర్చే దివ్యధేనువు అది. హోమద్రవ్యాలను పొందవచ్చునని, యజ్ఞ యాగాది క్రతువులకు చాలాపనికి వస్తుందని ఆ సురభిని ఋషులు కావాలని తీసుకొన్నారు. తరువాత వచ్చినది ఉచ్చైశ్రవం అనే అశ్వము. దానిని ఇంద్రుడు కోరగా, విష్ణువు వారించి, బలిచక్రవర్తికి ఇప్పించాడు. పిమ్మట ఐరావతం అనే నాలుగు దంతాల తెల్లని ఏనుగు వచ్చినది. దానిని ఇంద్రుడు తీసుకొన్నాడు. తరువాత పుట్టినది కల్పవృక్షము. అన్ని ఋతువుల్లోనూ విరబూస్తూ, రాలిపోని పువ్వులతో, ఆశ్రితుల కోర్కెలను తీర్చేదివ్యద్రుమమది. దానిని తన నందనవనానికి శోభతెచ్చేదిగా ఉంటుందని, ఇంద్రుడు సంగ్రహించాడు. తరువాత వచ్చారు అప్సరసలు. మెరుపుతీగవంటి మేనిఛాయతో, నిత్యయౌవనలైయుండే దివ్యసుందరీమణులు వారు. తన కొలువును నృత్యగానాలతో రంజిపజేయాలని ఇంద్రుడు వారిని దక్కించుకొన్నాడు. పోనీలే అని అసురులు ఊరుకున్నారు. అప్పుడు ఉద్భవించాడు చంద్రుడు. బ్రహ్మదేవుడు అతనిని ఆకాశాన్నధిష్ఠించుమన్నాడు. తరువాత వచ్చినది త్రిలోక సుందరియైన లక్ష్మీదేవి. బ్రహ్మదేవుడు, విశ్వములోని సౌందర్యమంతా ప్రోవుచేసి తీర్చిదిద్దిన అందాలరాశి ఆమె. ఆమెను దేవాసురులందరూ కాంక్షించారు. ఇంద్రుడు ఒక రత్నాలపీఠాన్ని తెచ్చి, ఆమెను కూర్చోబెట్టాడు. నదులు బంగారు కలశాలతో నీరుతెచ్చి స్నానంచేయించడానికి సిద్ధపడినవి. భూమి, సుగంధ ఓషధులను తెచ్చినది. గోవులు పంచామృతాలు ఇచ్చినవి. మాసములు ఫలపుష్పాదులను ఇచ్చినవి. దిగ్గజాలు పూర్ణకలశాలతో అభిషేకం చెయ్యగా ఋషులు మంత్రాలు చదివారు. గంధర్వులు గానం చేశారు. నటులు నాట్యమాడారు. సముద్రుడు పట్టుపీతాంబరాలనూ, వరుణుడు వైజయంతిమాలనూ, విశ్వకర్మ ఆభరణాలనూ, బ్రహ్మ పద్మమును, సరస్వతి మాలనూ సమర్పించారు. మహాలక్ష్మి మాలను చేత పట్టుకొని, దానిచే అలంకరింపబడడానికి అర్హుడెవ్వరా అని యోచించసాగినది. అక్కడ చేరియున్న వారినందరినీ పరికించి చూచినది. ప్రతి ఒక్కరిలోనూ ఏదో ఒక లోపము ఆమెకు గోచరించినది. కొందరు తపోధనులైనా క్రోధవశులు. కొందరు మహాజ్ఞానులైనా సంగమును వీడలేనివారు. కొందరు సకలసద్గుణసంపన్నులైనా, కోరికలను జయించలేనివారు. కొందరు నిష్ఠాగరిష్ఠులైనా దయాధర్మాలు లేనివారు. కొందరు రూపవంతులైనా, కాలవశులు (వార్ధక్యాన్ని జయించలేనివారు), కొందరు శక్తిమంతులైనా శీలములేనివారు. ఈ విధంగా ఆమెఎవ్వరినీ ఎన్నుకొనలేకపోయినది. చివరకు ఆమెదృష్టి

విష్ణుమూర్తిపై పడినది. ఆ మహనీయుడు నిశ్చింతుడై నిర్వికారుడై, ఆమెను ఆపేక్షించనివాడై యున్నాడు. ఆయన సకలసద్గుణ సంపన్న పరిపూర్ణుడు. ఏవిధమైన లోపమూలేనివాడు. దివ్యమోహనాకారుడు. కాని తాను ఆయనకు తగియున్నానా? ఆయన తనను స్వీకరిస్తాడా అనే సందేహంతో, ఆమె తడబడుతున్న అడుగులతోపోయి, మాలను ఆయన కంఠములోవేసి, సిగ్గుతో నిల్చుండిపోయినది. విశాలమైన ఆయన యొక్క వక్షస్థలముపైననే ఆమె తన చూపును నిలిపి, అదియే తనకు తగిన నివాసస్థానమని స్థిరపరచుకొన్నది. సర్వజ్ఞుడైన స్వామి తథాస్తు అనుకొని, ఆమెను స్వీకరించాడు. బ్రహ్మ రుద్రాదులంతా స్తోత్రాలు చేశారు. పుష్పవర్షం కురిసినది. మహాలక్ష్మి యొక్క కరుణా కటాక్ష వీక్షణాలు సోకినవారందరూ సర్వసుఖసంపదలతో ఆనందించారు. అసూయా ద్వేష రోషాలతో మండిపోతున్న అసురులు, ఆమె యొక్క అనుగ్రహానికి దూరమైనవారై దుఃఖాన్నే పొందారు. తరువాత వచ్చినది అందాలరాశియైన వారుణీ కన్య. ఆమె రాక్షసులకు ఇవ్వబడినది. పిమ్మట ధన్వంతరి అనే విష్ణు అంశగల దివ్యపురుషుడు వచ్చాడు. అతడు వైద్యవిద్యా నిపుణుడు. అతని చేతిలో ఒక అమృత కలశం ఉన్నది. దానిని అసురులు, అతని చేతినుండి లాక్కొని పోయారు.

## మోహినీ అవతారము

అమృత భాండాన్ని అసురులు ఎత్తుకొని పోవడంతో దేవతలు హతాశులై విష్ణువుతో మొరపెట్టుకొన్నారు. మీ అభీష్టం నెరవేరుతుంది లెండు - అని విష్ణువు వారికి అభయమిచ్చి, అంతర్ధానమయ్యాడు. అమృత కలశాన్ని ఎత్తుకొనిపోయిన అసురులు పట్టలేనంత ఆతృతతో, నేనుముందు అంటే నాకు ముందు అనుకొంటూ కలహించుకొనసాగారు. వారిలో కొందరు బుద్ధిమంతులు దేవతలకు కూడ కొంతభాగమివ్వాలన్నారు. కొందరు ఒప్పుకొనలేదు. ఈ విధంగా మొదలయిన గందర గోళంలో విష్ణుమూర్తి మోహిని రూపధారియై రంగప్రవేశం చేశాడు.

ముల్లోకాలనూ సమ్మోహింప జేసే హావభావలావణ్య విలాసాలతో, విశ్వమోహనాంగియైన ఆ జగన్మోహిని అసురుల గుండెల్ని గుబగుబలాడించినది. వారంతా ఆమె వెంటపడి, "సుందరీ! నీవు ఎవ్వరవు, ఎవ్వరిదానివి? నీ వంటి త్రిలోక సుందరిని మేము ఇంతవరకూ చూడలేదు. మేమెవ్వరి వారమో తెలుసా! కశ్యప-దితి సంతతి వారము. దేవతలు మా సోదరులే అయినా బలహీనులు కనుక మాకు సేవలు చేస్తున్నారు. ప్రస్తుతం ఈ కలశంలోనున్న పదార్థాన్ని మాలో మేము పంచుకొనలేక తగవులు పడ్తున్నాము. నీవు వచ్చావు కనుక నీ అందమైన చేతితో స్వపరభేదము లేకుండా, మా అందరికీ సమంగా పంచిపెట్టు. దేవతలూ, మేమూ రెండు బారులుగా కూర్చుంటాము" అని వివరించారు. ఆ త్రిజగన్మోహిని ఇలా అన్నది: "ఓదానవవీరులారా! అందకత్తెలను అసలే నమ్మరాదని పెద్దలంటారు. వారి మాటలు తేనె లొలుకుతాయి. వారి ఆలోచనలు ప్రమాదాలకు దారితీయవచ్చు. నన్ను మీరు విశ్వసించడం అంత మంచిది కాదేమో ఆలోచించుకొండి. అయినా మీరంతా సహాయం చేయుమని కోరుతున్నారు కాబట్టి నా శక్తి వంచన లేకుండా, చక్కగా పంచిపెడుతాను లెండి" అని చెప్పిన మర్మములేని మాటలకు ఆమెపై అసురులకు నమ్మకం కుదిరినది. అమృతకలశాన్ని ఆమెకు అందించారు ఆ అవివేకులు. ఆమె చిరునవ్వులు చిందిస్తూ ఇలాగన్నది. "నేను పంచిపెట్టే పద్ధతికి అవుననిగాని, కాదనిగాని అనకుండా ఒప్పుకోవాలి" అనగానే వారంతా సరేనని ఒప్పుకొన్నారు. స్నానాలుచేసి, అగ్నిహోత్ర దీపధూపార్చనాది కర్మలనాచరించి, తూర్పుముఖంగా కూర్చున్నారు. లక్ష్మీదేవికి మించిన అందచందాలతో, అందెల రవళులతో, అమృత కలశాన్ని పట్టుకొని, ఒకరికొకరు కనబడని రీతిని, దేవదానవుల్ని తూర్పుపడమర ముఖంగా కూర్చోబెట్టి, రాక్షసులకు అమృతం పొయ్యడం పాముకి పాలుపోసి పోషించడం వంటి ప్రమాదకర కార్యమని తలచి, "దానవులారా! తొందరపడకుండా కూర్చోండి. ఈ వరుసను ముగించుకొని, మీ వరుసకు వస్తున్నాను" అని చెప్పి, ముసిముసినవ్వులతో వారిని మురిపింపజేసి, మంత్రముగ్ధులను చేసి, దేవతలవైపుకి వెళ్లి, త్వరగా త్రాగండి-అని, వారికి అమృతం పోసినది. ఆ సమయంలో రాహువు అనే దానవుడు దేవతల వరుసలో చేరి, అమృతాన్ని ఆరగించడం కనిపెట్టిన సూర్యచంద్రులు ఈ విషయాన్ని ఆమెకు చెప్పగా, విష్ణువు చక్రాయుధంతో రాహువు యొక్క శిరస్సు ఖండించాడు. త్రాగిన అమృతం ఇంకా నోటిలోనే ఉండటం చేత తల నిర్జీవంకాలేదు కాని

మొండెము నేల గూలింది. బ్రహ్మదేవుడు రాహువు శిరస్సును ఒక గ్రహంగా ఆకాశంలో నిలిపాడు. పగ వదలని రాహువు ఇప్పటికీ అమావాస్య, పౌర్ణమి దినాల్లో సూర్యచంద్రులకు అడ్డం వస్తుంటాడు.

ఒక్కచుక్క అయినా మిగల్చకుండా, అమృతం అంతా దేవతల కిచ్చిన తరువాత మోహిని రూపాన్ని వీడి, విష్ణుమూర్తి నిజరూపాన్ని ధరించాడు. మోసపోయిన రాక్షసులు రోషముతో ఉడికిపోయారు. విష్ణువును శరణుజొచ్చిన దేవతలు సర్వశుభాలూ పొంది అమరులైనారు.

**దేవాసుర సంగ్రామము** : అమృతం పూర్తిగా దేవతలకే సంక్రమించడం చేత రాక్షసులు కక్షకట్టి, యుద్ధానికి బయలుదేరారు. బలిచక్రవర్తీ ఇంద్రుడూ మొదలైన దానవ దేవతా వీరులంతా యుద్ధానికి సిద్ధపడి వచ్చారు. మయుడు నిర్మించిన రథం మీద బలిచక్రవర్తి నిండుచంద్రుని లాగ ప్రకాశిస్తున్నాడు. ఆ రథంలో అన్ని శస్త్రాలూ అమర్చబడి యున్నాయి. సైనికులు కూడ ఉన్నారు. అది పైకి కనబడకుండా ఎక్కడికి పోవాలని కోరితే అక్కడికి తీసుకొని పోగలదు. మహాబలికి ముందుగా నముచి, శంబరుడు మొదలైన అనేకమంది రాక్షసవీరులూ, మహావీరులూ సైన్యాలతో వెళ్తున్నారు. దేవేంద్రుడు ఐరావతాన్నెక్కి వచ్చాడు. అతనితో కూడ అగ్ని, వరుణుడు, వాయువు, యముడు మొదలైన దేవతలు సైన్యాలతో వచ్చారు.

దేవదానవసేనలు, రెండు సముద్రాలు ఢీకొన్నట్లుగా కనిపించాయి. ఇంద్రుడు బలితోనూ, కుమారస్వామి తారకునితోనూ, వరుణుడు హేతితోనూ, మిత్రుడు ప్రహేతితోనూ, శంబరుడు త్వష్టతోనూ, సవితుడు విరోచనునితోనూ యుద్ధము చేశారు. యుద్ధము చాలా ఘోరముగా జరుగుతున్నది. అసురులు అనేకమైన మాయా ప్రయోగాలు చేసి, పర్వతాలను, మేఘాలనూ, సముద్రాలనూ సృష్టించి, దేవతలకు కనిపించకుండా ఉంటూ, నానా బీభత్సాన్ని కలుగజేశారు. దేవతలు భయంతో భగవానుని ధ్యానించగా, ఆయన అష్టభుజాలతో ఆయుధాలతో ఆవిర్భవించాడు. విష్ణు ఆగమనంతో రాక్షసమాయలన్నీ అదృశ్యమైనవి. దేవతలు దేవదేవుని ప్రార్థించారు. కాలనేమి అనే అసురుడు గరుడుని పైకి బలమైన బల్లెమును విసిరాడు. విష్ణువు ఆ బల్లెమునే రాక్షసునిపైకి విసరగా, వాడు చచ్చి పడ్డాడు. మాలీ, సుమాలీలు గదలతో గరుడుని కొట్టగా, విష్ణువు చక్రాయుధంతో వారి తలలను త్రుంచి వేశాడు. మాల్యవంతుడు గరుడుని రెక్కలు చెదరగొట్టగా, వాడుకూడా చక్రాయుధానికి బలిఅయినాడు. ఇంద్రుడు, బలిచక్రవర్తిని నానాదుర్భాషలతో తిట్టి, ఎదిరించినాడు. అప్పుడు బలిచక్రవర్తి ఇలా అన్నాడు: "దేవేంద్రా! సుఖదుఃఖాలూ, జయాపజయాలూ, మానావమానాలూ, కాల, కర్మల, వశాత్తు సంభవిస్తుంటాయి. అవి దైవాధీనాలు, బ్రహ్మరుద్రాదులు కూడా వాటిని తప్పించుకొనలేరు. సంపదలైనా, ఆపదలైనా శాశ్వతాలు కావు. అందుచేత బుద్ధిమంతులు, తమ శత్రువులకు ఆపదలు, అపజయమూ, అపకీర్తి, కలిగినప్పుడు పొంగిపోరు, అవే తమకు సంభవించునప్పుడు క్రుంగిపోరు. మాకు ఇటువంటి ద్వంద్వాలతో ప్రమేయంలేదు. మన కర్తవ్యం నిర్వహిద్దాం, పద." అంటూ బాణం సంధించాడు. ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. విమానంతో సహా, మహాబలి నేల కూలాడు. అప్పుడు జంభుడనే రాక్షసుడు సింహవాహనుడై ఇంద్రునిపైకి దూకి, గదతో ఐరావతాన్ని మొత్తగా, అది నేలపై చతికిల బడిపోగా ఇంద్రుడు నేలకూలాడు. అప్పుడు సారథియైన మాతలి రథాన్ని తెచ్చి, ఇంద్రుని రథము పైకి ఎక్కించుకొన్నాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో జంభుని వధించాడు. అప్పుడు జంభుని సోదరులైన బలుడూ, పాకుడూ, నముచీ, ఇంద్రుని మీద పడ్డారు. ఇంద్రుడు బలునీ, పాకునీ వజ్రాయుధంతో హతమార్చాడు. కాని, నముచిపైన వజ్రాయుధం పనిచెయ్యలేదు. ఖిన్నుడైన ఇంద్రునితో ఆకాశవాణి ఇలాగ చెప్పినది: "ఈ నముచి పొడిగానున్న వాటితోగాని, తడిగానున్న వాటితోగాని చావురాకుండా వరంపొందిన వాడు సుమా!" అని. తడీపొడీ కానట్టి సముద్రపు నురగలో వజ్రాయుధాన్ని ముంచి, నముచిని వధించాడు ఇంద్రుడు ఇక ఈ భయంకరమైన యుద్ధాన్ని ఆపుచేయుమని బ్రహ్మకోరగా దేవతలు యుద్ధాన్ని విరమించారు. మిగిలియున్న రాక్షసులు దెబ్బతిని పడియున్న బలిచక్రవర్తిని తీసుకొనిపోయారు. శుక్రాచార్యుడు మృతసంజీవనీ విద్యచే రాక్షసుల్ని బ్రతికించాడు. తత్త్వజ్ఞానియైన మహాబలి ఓటమిని చిరునవ్వుతో స్వీకరించాడు.

**మోహినీ రూపాన్ని శివుడు మోహించుట** - విష్ణువు మోహినీ రూపాన్ని ధరించి, రాక్షసుల్ని భ్రమింపజేసి, దేవతలకు అమృతమును పంచిపెట్టిన ఉదంతం విని, శివునికి ఆమోహినీరూపాన్ని చూడాలనే కోరిక కలిగినది. అతడు పార్వతీ సమేతంగాపోయి, విష్ణువును ఇలాగ స్తుతిస్తాడు:

"ఓ దేవదేవా, జగన్మయా, దేవేశా, జగదీశా, కాలస్వరూపా! జగద్వ్యాపక స్వరూపా! సకల భావములకు ఆత్మవూ, కారణ భూతుడవూ అయిన ఈశ్వరుడవు, ఆది మధ్యాంతములు లేక, లోపలా వెలుపలా అనే భేదములేక, అంతటా పూర్ణమై, అమృతమై, మహాసత్యమూ, ఆనందచిన్మాత్రమూ, అవికార్యమూ, ఆద్యమూ, అనన్యమూ, అశోకమూ, అగుణమూ సకలసృష్టి స్థితి లయాలను నిర్వహించే మాయా స్వరూపమూ అయిన పరబ్రహ్మము నీవే. మోక్షకాములైన మునులు, ఉభయసంగములను వీడినవారై, నిరంతరమూ నీ పాదపద్మాలను కొలుస్తుంటారు.

నిన్ను పరబ్రహ్మమని భావిస్తారు కొందరు. ధర్మస్వరూపమని తలుస్తారు కొందరు. సత్ అసత్‌ల రెండింటికీ ప్రభువవని కొందరు చర్చిస్తారు. నీవు శక్తి స్వరూపుడవని కొందరంటారు. నీవు శాశ్వతుడవు, అవ్యయుడవు, స్వతంత్రుడవు, పరుడవు, శ్రేష్ఠుడవు అని కొందరూహించి ధ్యానిస్తారు. నీవు చివరకు అద్వయుడవు, (ఏకము అయిన వాడవు), సత్ అసత్‌లకు అతీతుడవు, ద్వయుడవు (అనేకం అయినవాడవు), విశిష్టుడవు, అన్నింటికీ ఆశ్రయమైనట్టి వాడవు. ఆభరణాలకూ సువర్ణానికీ, అలలకూ సముద్రానికీ, భేదం ఉన్నట్టుకనిపించినా భేదము లేనట్టు, నీవు అభిన్నుడవు. అటువంటి నీ యొక్క లీలలు ఎవ్వరికీ అర్థము కావు. పరాత్పరా! ఏ రూపమూ లేని నిన్ను పురుష రూపములో చూస్తున్నాము. నీవు స్త్రీ రూపము ధరించి, రాక్షసుల్ని మోహములో ముంచి, దేవతలకు అమృతం పంచిపెట్టావట కదా! నాకు ఆమోహినీరూపాన్ని చూడాలని కోరికగా నున్నది, ప్రభూ!" అని వేడుకొన్న ఈశ్వరునితో విష్ణుమూర్తి ఇలా అన్నాడు: "మహేశ్వరా! కాముకులు ఎలాగ వంచితులవుతారో చూపడానికీ, దేవతలకు అమృతం ప్రసాదించడానికీ నేను మోహినీ రూపం ధరించాను. నీవు చూడదలచుకొంటే అవశ్యము నీ కోరిక తీరగలదు." అని చెప్పి, విష్ణువు అదృశ్యమైనాడు. శివుడు అన్ని వైపులా చూచినా ఆ మాయావి ఎక్కడా కానరాలేదు. కొంతసేపటికి దగ్గరలోనే ఒక ఉద్యానవనములో ఒక దివ్యమోహన సుందరాంగి, ఒక చెట్టు క్రింద సొగసులొలికిస్తూ గెంతుతూ కనిపించినది. ఆమె ఎవరో ఎందుకు అలాగ ఒక్కతే ఆడుకొంటుందో తెలుసుకోవాలనే కుతుహలం శివునకు కలిగింది. అతడు బాగా ఆకర్షింపబడ్డాడు. నిగ్రహాన్ని కోల్పోయిన శివుడు ప్రక్కనే పార్వతీదేవి ఉన్నదనిగాని, ప్రమథ గణాలందరూ చూస్తున్నారనిగాని లజ్జపడకుండా ఆ మెరుపుతీగ వంటి మోహనాంగి వద్దకు నడవసాగాడు. బంతితో బంతివలె గెంతుతూ, ఆడుతూ, హొయలుచూపుతూ, బంతిని చేతినుండి జార్చివేసి, దానివెంట పరుగెత్తుతూ, పైటను జార్చుకొని సిగ్గునటిస్తున్న ఆ సుందరిని చూచి, శివుడు మంత్రముగ్ధునివలె మతిచెడగొట్టుకొన్నాడు. పరుగునపోయి, ఆమెను ఆలింగనం చేసుకొనబోయాడు. ఆమె తప్పించుకొని పోతుంటే వెంటబడ్డాడు. మన్మథునే జయించి, భస్మంచేసిన మహాదేవుడు, ఉద్రేకంలో స్ఖలనమైన శివుని రేతస్సు భూమిపై బడి, బంగారు, వెండి గనులుగా ఏర్పడినది. పర్వతాలపైన, నదులలోనూ పడగా, ఆ స్థలాలు, పవిత్ర పుణ్యస్థలాలుగా వెలసినవి. విష్ణుమాయనుండి ఈశ్వరుడు కూడ తప్పించుకొనలేడని ఈ ఉదంతం సూచిస్తున్నది.

అప్పుడు విష్ణువు నిజరూపంలో కనబడి ఇలా అన్నాడు, "మహేశ్వరా! నా మాయను తెలుసుకొనడానికి ఎవ్వరికీ సాధ్యపడదు. నీ కోరికతీరినది కదా! నన్నే పరమగతిగ నమ్మి, శరణుజొచ్చిన వారు మాత్రము నా మాయను తెలుసుకొనగలరు." అని చెప్పి, అంతర్ధానమైనాడు.

మహారాజా! ఈ క్షీరసాగరమథనము ఆరవమన్వంతరములో జరిగినది. ఈ వృత్తాంతాన్ని శ్రవణం, పఠనం చేసినవారికి సంసారక్లేశాలంటవు. మాయ మోహంలో పడవేయదు అని శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

## వామనావతారము

ఇంద్రుని చేతిలో దెబ్బతిని ఓడిపోయిన బలిచక్రవర్తి శుక్రాచార్యుల వలన స్వస్థుడైనాడు. మళ్లీ తన పూర్వపు వైభవాన్ని సంపాదించాలని సంకల్పించిన అతనిచే అసుర గురువు విశ్వజిద్యాగాన్ని చేయించాడు. హోమకుండము నుండి ఇంద్రుని గుర్రములవంటి గుర్రాలు పూన్చబడిన బంగారు రథము సింహధ్వజముతో నావిర్భవించినది.

దివ్యధనుస్సు, అక్షయమనే అమ్ములపొది, దివ్యకవచము కూడ వచ్చినవి. బ్రహ్మదేవుడు వచ్చి వాడిపోవని పుష్పహారాన్నిచ్చాడు. శుక్రాచార్యుడు మంచి శంఖాన్నిచ్చాడు. బలిచక్రవర్తి గురువులకు, బ్రాహ్మణులకు, తాతగారైన ప్రహ్లాదునకు నమస్కరించి వారి ఆశీస్సులను పొందాడు.

ఇంద్రుని మించిన దేహశోభతో, అగ్నిహోత్రాన్నిమించిన తేజస్సుతో, దివ్య రథాన్నధిరోహించిన బలిచక్రవర్తి సాటిలేని తేజో బలశౌర్యాలతో, పెద్ద సైన్యాన్ని కూర్చుకొని, ఇంద్రునిపైకి దండెత్తాడు. అతనివెంట మృత్యుదేవతను కూడా దండించగల మహాశక్తిసంపన్నులైన రాక్షససేనాధిపతులు వెళ్లుతున్నారు. అందరూపోయి నందనవనంలో శిబిరాలేర్పరుచుకొని విడిది చేశారు. బలిచక్రవర్తి శంఖనాదం చేశాడు. అది విని ఇంద్రుడు హడలిపోయి గురువైన బృహస్పతి వద్దకు పరుగు పరుగున వెళ్లాడు.

అమరావతి ఇంద్రుని రాజధాని. అత్యంత సుందరమైన నగరము. దేవశిల్పి విశ్వకర్మ తన ప్రతిభనంతా ప్రదర్శించి నిర్మించిన నగరమది. ఇంద్రపురిచుట్టూ ఆకాశగంగ కందకములాగా కాపాడుతూ ప్రవహిస్తున్నది. కోట గోడలు ప్రత్యేకమైన లోహాలతోనూ, తలుపులు బంగారువెండి వజ్రవైడూర్యాలతోనూ పొదగబడినవి. ఆ నగరి సుఖసంతోషాలకూ హద్దులేని విషయభోగాలకూ నిలయము. పుణ్యాత్ములకు నివాసస్థానము, అక్కడ ఆకలి దప్పులు, రోగాలు, దుఃఖాలు, ముసలితనము ఉండవు. అక్కడ స్త్రీలు ఎప్పుడూ నిత్యనవయౌవనవతులై చిరునవ్వులు చిందిస్తూ ఉల్లాసంగానుంటారు. అటువంటి అమరావతిని రాక్షసుల ముట్టడినుండి రక్షించుకొనడం ఎలాగో దిక్కుతోచక ఇంద్రుడు గురువుగారితో చర్చించాడు. "గురుదేవా! అసురుడైన ఈ బలి మనచేత ఒకసారి దెబ్బతిని భంగపడి, పారిపోయి, ఇప్పుడు మళ్లీవచ్చాడంటే, బాగా శక్తిపుంజుకొని వచ్చాడన్నమాట. ఇప్పుడు వానిని మనం ఎదుర్కొనడం అంతసులువేమీ కాదు. ఈ ప్రమాదంనుండి, బైటపడడంఎలా?" అని అడిగిన ఇంద్రునితో బృహస్పతి ఇలా అన్నాడు.

"దేవరాజా! శక్తి ఉంటే శత్రువును ఓడించాలి, లేదా రణరంగంలో వీరమరణం పొందాలి. మూడవ మార్గము-ఇప్పుడు పారిపోయి, అనుకూల సమయం గురించి వేచియుండాలి. ఈ బలి ఇప్పుడు చాలా శక్తి సంపన్నుడు. భృగువంశపు బ్రాహ్మణులు ఇతనికి ఈ బలసంపదను క్రతువుల ద్వారా సమకూర్చారు. శివుడూ విష్ణువూ తప్ప ఇంకెవ్వరూ ఇతనిని అణచలేరు. అందుచేత నీవు నీ రాజ్యాన్నీ, రాజధానినీ విడిచివెళ్లడమే క్షేమకరము. విజయం సాధించిన తరువాత, ఈ బలికి బ్రాహ్మణుల పట్ల గౌరవం తగ్గడంతో పాటు అతని శక్తికూడ సన్నగిల్లుతుంది. ఆ సమయం కొరకు నీవు వేచి యుండడం మంచిదని నా అభిప్రాయం" అని చెప్పిన గురుహితవును మన్నించి, ఇంద్రుడు ఇతర దేవతాముఖ్యులూ, మారు రూపాలు ధరించి ఎక్కడికో వెళ్లిపోయారు.

అనాయాసముగా లభించిన విజయానికి బలి మిక్కిలి సంతసించి, విశ్వవిజేతఅయి, ముల్లోకాలకూ ప్రభువైనాడు. శుక్రాచార్యుడు అతనిచేత నూరు అశ్వమేధ యాగాలను చేయించాడు. అతని కీర్తి విశ్వమంతా వ్యాపించినది. సకాలవర్షాలతోనూ, సమృద్ధియైన పాడిపంటలతోనూ అతని రాజ్యాలలోని ప్రజలు సుఖసంతోషాలతో నుండేవారు. ప్రజల సకల కోరికలూ తీరేవి. బ్రాహ్మణులు సంతుష్టులైయుండేవారు. దేవాలయాలు నిత్యపూజలతో కలకలలాడేవి. రాజ్యాలలో దానమిచ్చే దాతలకు లోటులేదు. అసలు యాచకులే కరువయ్యారు. ఒక్క దేవతలే తప్ప బలిచక్రవర్తియొక్క మంచితనాన్నీ ఔదార్యాన్నీ సద్గుణాలనూ కీర్తించని వారే లేరు, దేవమాత అయిన అదితి మాత్రము తన సంతతి వారైన దేవతలకు సంభవించిన దుర్భర దుస్థితిని తలచుకొని క్రుంగి కృశించి పోయినది. తలదాచుకొనడానికైనా తావులేక వారంతా దిక్కుమాలినవారై ఎక్కడెక్కడో తిరుగుతున్నారు. కశ్యపప్రజాపతి తపస్సుచాలించి ఇంటికి రాగానే అదితియొక్క దీనస్థితిని చూచి, విచారించి ఓదార్చి ప్రేమతో ఇలాగ కుశల ప్రశ్నలు వేశాడు: "ఓ పుణ్యశీలా, నీ ఈ దీనావస్థకు కారణం ఏమిటి? బ్రాహ్మణులకు సరియైన ఆదరము లభిస్తున్నదా? దేవాలయాల్లో అర్చనలు సరిగా జరుగుతున్నవా? పుత్రులు ధర్మవర్తనులై యున్నారా? అతిథి అభ్యాగతులకు సత్కారములు జరుగుతున్నవా? సజ్జనులు గౌరవింపబడుతున్నారా? సేవకులకు, యాచకులకు దయాదాక్షిణ్యాలు లభిస్తున్నవా?" ఈ విధంగా

యోగక్షేమాలను అడిగిన కశ్యపునితో అదితి ఇలాగ చెప్పినది: "స్వామీ! మీరు అడిగిన అన్ని విషయాలూ సవ్యముగానే కొనసాగుతున్నవి. కానీ హృదయేశ్వరా! నా ఆవేదనను నేను ఎలాగ చెప్పేది? దితి సంతతి వారు నావారైన ఇంద్రాదులను పారద్రోలి, అమరావతిని ఆక్రమించుకొన్నారు. దితి నా చెల్లెలే అయినా తన వారు చేస్తున్న దుండగాలకు వారిని మందలించకపోగా, ప్రోత్సహిస్తున్నట్లున్నది. ఇంద్రుడు దిక్కులేనివాడై ఎక్కడో తిరుగుతున్నాడు. ఇతర దేవతలు కూడ, ఎలాంటి ఇక్కట్లు పడుతున్నారో మరి! బలి అతిబలశాలియై ముల్లోకాలనూ పాలిస్తున్నాడు. హవిర్భాగాన్నంతా తానే చేజిక్కించుకొంటున్నాడు. మహాత్మా! ప్రజాపతి అయిన మీకు అందరూ సమానులే. రాక్షసులను దండించి, దేవతలకు అమరావతిని తిరిగి ఇప్పించండి" అని విన్నవించుకొన్న అదితితో కశ్యపుడు ఇలా అన్నాడు: "దేవీ! నీ బాధ నాకు అర్థమయినది. ఇది అంతా విష్ణుమాయ. దానిని తెలుసుకొనడం మహా మహులకు కూడ కష్టతరము. ఆ మాయయే మనచేత నేను, నాది, నావారు, అనిపించి, మనల్ని మమతాహంకారాల్లో పడవేస్తుంది. కాని, యథార్థస్థితి, తత్త్వము ఆలోచిస్తే తండ్రిఎవరు, బిడ్డలెవరు? వారి సంబంధం ఏనాటిది, ఎన్నాళ్లుంటుంది? మనం విచారించడం ఎందుకు, ఎవరికోసం? అజ్ఞానంచే విష్ణుమాయచే మమకారంలో పడి చింతిస్తుంటాం. అయినా నీ మనోవ్యథతీరడానికి మార్గం చెపుతాను విను. అన్నిటికీ, అందరికీ, భగవంతుడైన ఆజగదీశ్వరుడే శరణ్యం. అతడు దయాసముద్రుడు. నీవు ఆ విష్ణుమూర్తిని ఆరాధిస్తే, నీ కోరిక తీర్చుతాడు. పయోభక్షణం అనే ఒక వ్రతమున్నది. దానిని నీవు నిష్ఠతో ఆచరించు", అని కశ్యపుడు ఆవ్రత విధానం వివరించి చెప్పాడు. సూక్ష్మంగా:- ఫాల్గుణ శుక్ల పాడ్యమి నుండి ద్వాదశి వరకు, పగలు, రాత్రి శ్రీమన్నారాయణుని పూజించాలి. పాలు మాత్రమే ఆహారంగా తీసుకోవాలి. ద్వాదశాక్షరి అయిన, ఓంనమోభగవతే వాసుదేవాయ - అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ పూజించాలి. ఈ విధంగా దీక్షతో, శ్రద్ధాభక్తులతో వ్రతమాచరిస్తే కోరిక తీరుతుంది అని కశ్యపుడు చెప్పగా ఆ ప్రకారం అదితి పన్నెండు దినాలు దీక్షతో ఆ వ్రతాన్ని నిర్వహించినది.

శ్రీమన్నారాయణుడు ప్రసన్నుడై, చతుర్బాహువై ప్రత్యక్షమైనాడు. అదితి ఆనందానికి మేరలేదు. ఆనందాశ్రువులతో ఆమె వక్షస్థలం తడిచిపోయినది. గొంతుమూగపోయినది. ఏమి చెప్పాలో, ఎలాగ స్తుతించాలో తెలియక తికమక చెందినది. చివరికెలాగో మాట్లాడగలిగింది. "ప్రభూ! నిన్నెలాగ స్తుతించాలో తెలియని అజ్ఞానురాలిని. నీవు దయామయుడవని మాత్రము ఎరుగుదును. ఓ దీనబాంధవా! పరమేశ్వరా, అచ్యుతా, అనంతా! నా సంతతి వారు మళ్లీ అమరావతిలో సుఖించేటట్లు అనుగ్రహించు" అని మాత్రము చెప్పగలిగినది. నారాయణుడు కరుణించిన వాడై ఇలా అన్నాడు: "ఓ దేవమాతా! నీ బాధను తెలుసుకొన్నాను. అసురుల అదుపు ఆజ్ఞలకులొంగి, బ్రతుకుతున్న దేవతలు మళ్లీ తమ పూర్వపు వైభవముతో సుఖించాలని నీకోరిక అని నాకు తెలుసు. ప్రస్తుతం రాక్షసులు ఉచ్చస్థితిలో నున్నారు. ఇప్పుడు వారిని గెలవడం కష్టం. అమ్మా! ఏ కార్యమైనా సిద్ధించడానికి కొంత సమయమూ, ఎంతో సహనమూ అవసరం. ఉపాయంతో తప్ప అసురులను అణగద్రొక్కడం సాధ్యంకాదు. నీ భక్తికి నేను ప్రసన్నుడనైనాను. అందుచేత నేనే ఈ కార్యాన్ని చేపట్టదలచాను. నేను నీ గర్భములో జన్మించి, రాక్షసుల్ని అణచివేసి, మీ కష్టాలను తొలగించి మీ అందరినీ ఆనందింపజేస్తాను. నా ఈ జన్మ రహస్యాన్ని ఎవ్వరికీ తెలియనివ్వరాదు. నా రూపాన్నే తలచుకొని నీ భర్తను సేవించు." అని చెప్పి, అంతర్ధానమయ్యాడు. ఒకనాడు కశ్యపుడు తపస్సులో నుండగా అతనిలో విష్ణుతేజస్సు ప్రవేశించినది. అదితి గర్భవతి అయినది.

విశ్వమంతా తన కుక్షిలో నుంచుకొన్న భగవంతుడు, అదితి గర్భములో నిమిడిపోయి, దేదీప్యమానముగా, దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు. సమయమాసన్న మయ్యేసరికి బ్రహ్మదేవుడు వచ్చి ఇలాగ స్తుతించాడు:- "అదితి గర్భవాసంలో అలరారుతున్న ఓ స్వామీ! నీవు సకల భువనాలనూ నీకుక్షిలో నుంచుకొన్న సర్వాంతర్యామివి. స్వర్గలోకాన్ని పోగొట్టుకొన్న దేవతల బాధలను బాపడానికి సత్వరమే వేంచేయవలసినదిగా మేమంతా నిన్ను వేడుకొంటున్నాము" అని ప్రార్థించగానే అదితి గర్భంనుండి ఉదయించాడు స్వామి. చతుర్భుజుడై, శంఖచక్రగదాధారియై, సర్వాలంకార భూషితుడై దివ్యమనోహరరూపముతో వెలువడిన స్వామిని చూచి, అదితి ఆశ్చర్యచకిత అయినది. తనకు లోగడ

దర్శనమిచ్చిన నారాయణుడే అని గుర్తించి- ఈ మహానుభావుడు, ఈ రూపములో నింతకాలమూ నా గర్భములో నెలాగ ఇమిడియున్నాడు? అని ఆశ్చర్యపోయినది. ఇలాగ స్తుతించినది:

సీ॥ **యజ్ఞేశ విశ్వంభరాచ్యుత శ్రవణ మంగళనామధేయ లోకస్వరూప**
**ఆపన్నభక్తజనార్తివిఖండన దీనలోకాధార తీర్థపాద**
**విశ్వోద్భవస్థితి విలయకారణభూత సంతతానంద శశ్వద్విలాస**
**ఆయువుదేహంబు ననుపమలక్ష్మియు వసుధయు దివము త్రివర్గములును**
తే॥ **వైదిక జ్ఞానయుక్తియు వైరి జయము, నిన్ను కొలవని నరులకు నెరయుగలదె?**
**వినుతమందార గుణహార వేదసార ప్రణుతవత్సల పద్మాక్ష పరమపురుష!** 483

యజ్ఞేశ్వరా, విశ్వంభరా, అచ్యుతా, శ్రవణమాత్ర మంగళకరనామధేయా! లోకస్వరూపా! ఆపన్న భక్తజన ఆర్తినివారకా! దీనలోకాధారా! పాదమే తీర్థమైన వాడా! విశ్వసృష్టి స్థితిలయకారకా! నిత్యానందా! శాశ్వత లీలావిలాసుడా! నిన్ను కొలిచేవారికి, ఆయుస్సూ, ఆరోగ్యము, ఐశ్వర్యమూ, ఇహము, పరము, ధర్మార్థకామాలూ, వేదవిజ్ఞానము, యుక్తి, శత్రుజయమూ అన్నీ సిద్ధిస్తాయి కదా! ఓ భక్తమందారా! సుగుణభూషణా! వేదస్వరూపా, శరణాగతవత్సలా, పద్మాక్షా, పరమపురుషా! అనిస్తుతించినది. కశ్యపుడు స్వామిని అనేక విధాల స్తుతించాడు. స్వామి జన్మించిన దినము భాద్రపదశుద్ధ ద్వాదశి శ్రవణ నక్షత్రం 'అభిజిత్' ముహూర్తాన జరిగినది. పంచభూతాలూ, ముల్లోకాలూ, స్వామి ఆవిర్భావంతో సంతోషించినవి. తరువాత, అదితికశ్యపులు చూస్తుండగనే స్వామి వామనరూపాన్ని ధరించి వటువుగా మారినాడు. పిమ్మట ఆ వటువునకు వడుగుచేసే వయస్సురాగానే మునీంద్రులు అన్ని ఏర్పాట్లు చేశారు. సూర్యుడు గాయత్రి మంత్రాన్ని ఉపదేశించాడు. బృహస్పతి జంధ్యాన్నీ, కశ్యపుడు మేఖలను (ముంజదర్భ మొలత్రాడు), అదితి కౌపీనాన్నీ, భూదేవి నల్లజింక చర్మాన్నీ, చంద్రుడు దండాన్నీ, ఆకాశము గొడుగునూ, బ్రహ్మ కమండలాన్నీ, సరస్వతి జపమాలనూ, సప్తఋషులు పవిత్ర దర్భలను, కుబేరుడు భిక్షాపాత్రనూ ఇచ్చారు. పార్వతీదేవి అక్షయంఅంటూ భిక్షపెట్టినది. బ్రహ్మర్షులు ఆశీర్వదించారు. వేదమంత్రాలతో హోమంచేశారు.

ఉపనయనం పూర్తి అయిన తరువాత, మాయావటుడైన వామనుడు అక్కడ చేరిన బ్రాహ్మణులను ఇలా అడిగాడు: "బ్రాహ్మణులకు తగురీతిని గౌరవించి, సత్కరించి, దానాలిచ్చేదాతలెవరైనా ఉన్నారా? వారెవరు, ఎక్కడుంటారు?" అనగా బ్రాహ్మణులిలా చెప్పారు: "వామనమూర్తీ! అటువంటి దాత లెందరో ఉన్నారు. కాని బలిచక్రవర్తితో సమానుడైన మహాదాత ఎక్కడా లేడు" అని చెప్పగా విని, సంతసించిన వాడైన వామనుడు తలిదండ్రులయొక్క, పెద్దలయొక్క దీవెనలను పొంది, ఒక శుభముహూర్తాన బయలుదేరాడు. ఆ సమయంలో నర్మదానదీతీరానున్న భృగుకచ్ఛము అనే క్షేత్రములో, శుక్రాచార్యుడు బలిచక్రవర్తిచే అశ్వమేధయాగాన్ని చేయిస్తున్నాడు. వామనుడు బలిచక్రవర్తిని కలుసుకోవాలని, యాగశాలకు వడివడిగా వెళ్లుతున్నాడు. యజ్ఞస్థలం ముందర ఏనుగులు, గుర్రాలు, సైన్యాలు, బారులు తీర్చి యుండెను. ఆ యజ్ఞంలో పాల్గొంటున్న ఉద్దండులైన మునులంటే దేవతలు కూడ భయపడ్డారు.

యజ్ఞశాలలోని ఋత్విక్కులూ, సభాసదులూ, వడివడిగానడచి వస్తున్న వామనమూర్తిని చూచి, సూర్యుడో, అగ్నిదేవుడో, స్వయంగా యజ్ఞంచూడడానికి వస్తున్నాడేమో అనుకొన్నారు. ఇలాగ తలపోశారు:

శా॥ **శంభుండో హరియో పయోజభవుడో చండాంశుడో వహ్నియో**
**దంభాకారత వచ్చెగాక ధరణిన్ ధాత్రీసురుండెవ్వ డీ**
**శుంభద్యోతనుడీ మనోజ్ఞతనుడంచున్ విస్మయభ్రాంతులై**
**సంభాషించిరి బ్రహ్మచారి(గని, తత్సభ్యుల్ రహస్యంబుగన్.** 533

ఈ వామనరూపుడైన సుందరబాలకుడెవ్వడు? మారువేషంలో వచ్చిన శివుడో, విష్ణువో, బ్రహ్మయో, సూర్యుడో, అగ్నియో కాడుకదా! ఇంతటి తేజస్వీ, మనోహరమూర్తీ అయిన బ్రాహ్మణ వటువు, ముల్లోకాల్లో ఎక్కడున్నాడు?

ఇంతకూ ఇతడెవడు? అనుకొంటూ ఆ బ్రహ్మచారిని చూచి, అక్కడి సభాసదులు ఆశ్చర్య సంభ్రమాలతో తమలో తాము గుసగుసలాడుకున్నారు. కుతూహలంతో చూడసాగారు. మెరుస్తున్న మేని ఛాయతో, మెరుపు తీగవంటి యజ్ఞోపవీతాన్ని ధరించి చంకలో కృష్ణాజినము, చేతులతో ఛత్రము, కమండలము ధరించి యజ్ఞశాలలో ప్రవేశించిన వామనమూర్తిని చూచి, అక్కడనున్న పెద్దలందరూ అనుకొనకుండానే గౌరవ సూచకంగా లేచి నిల్చున్నారు. వామనుడు యజ్ఞవాటికలో విహరిస్తూ, సామవేదం పఠిస్తున్న ఉద్గాతలనూ, మంత్రాలు పఠిస్తూ హోమంచేస్తున్న హోతలనూ, అగ్నులను వెలిగించే ఋత్విజులనూ చూచాడు, వారిని కలుసుకొన్నాడు. కొందరితో కలిసి వేదం చదివాడు, కొందరితో వాదించాడు, కొందరితో ఛలోక్తులూ ప్రియాలాపాలూ ఆడాడు. కొందరిని నవ్వించాడు. అంతటా తానే అయి, తిరిగాడు. నెమ్మదిగా బలిచక్రవర్తిని సమీపించి, ఇలా అన్నాడు:

మ॥ ఇతడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గర్వాపనయప్రవర్తి గతలోభస్ఫూర్తి నానామఖ
వ్రతదానప్రణవానువర్తి సుమనోరామా మనోభేదనో
ద్ధత చంద్రాతపకీర్తి సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి తాన్. 543

ఓహో! ఇతడేనా ఆ దానవచక్రవర్తి, ఎవడైతే దేవేంద్ర, అగ్ని, యమాది దిక్పాలకుల గర్వాన్ని తొలగించిన వీరుడో? ఇతడేనా లోభాన్ని పూర్తిగాపోగొట్టుకొన్న వ్యక్తి? ఇతడేనా అనేకమైన యజ్ఞ, వ్రత, దానాది సత్కర్మలను చేసిన పుణ్యమూర్తి? ఇతడేనా దేవతా రమణుల మానస సాగరములో కల్లోలం కలిగించే (సముద్రాన్ని ఉప్పొంగించే) చంద్రుని వంటివాడు? ఇతడేనా సత్యమూ, దయా, ధర్మాలతో విలసిల్లే సౌజన్యమూర్తి? అని పలికి, ఈ విధంగా స్వస్తిపలికాడు:

ఉ॥ స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు హోసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు నుదార పద వ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీ గళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్. 545

త్రిభువనాలను శాసించేవాడునూ, ఇంద్రుని అవలీలగా అణగద్రొక్కి మహోన్నత పదవినలంకరించి నిర్వహించినట్టి వాడునూ, మునీంద్రులచే స్తుతింపబడి, మంగళకరమైన యాగాలను జరిపించువాడునూ, దేవతాసతుల మంగళసూత్రాలను పోగొట్టువాడునూ అయిన ఓ దానవేంద్రా! నీకు శుభమగుగాక! అని దీవించాడు.

బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్న ఆ బ్రహ్మచారి వద్ద అక్కడనున్న బ్రాహ్మణ శ్రేష్ఠులంతా తేజోహీనులై వెలవెలపోయారు. బలిచక్రవర్తి బ్రహ్మచారికి ప్రణామాలు చేసి, ఉచితాసనం ఇచ్చి, అడుగులు తుడిచాడు. అతని ధర్మపత్ని బంగారు కలశంతో నీరుపోయగా, దానవేంద్రుడు ఆ వడుగు యొక్క అడుగులు కడిగి తుడిచినాడు. ఆ నీరు శిరస్సుపై చల్లుకున్నాడు. పిమ్మట ఇలా అడిగాడు:

మ॥ వడుగా! యెవ్వరివాడ వెవ్వడవు సంవాస స్థలం బెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్
కడుధన్యాత్ముడనైతి నీ మఖము యోగ్యంబయ్యె నా కోరికల్
కడతేరెన్, సుహుతంబులయ్యె శిఖులుం కల్యాణమిక్కాలమున్. 549

ఓ బ్రాహ్మణకుమారా! నీకు స్వాగతము. నీవెవ్వడవు? ఎవ్వరి బాలుడవు? నీనివాస స్థలమేది? ఇక్కడికి నీవు రావడం చేత నా జన్మమూ, వంశమూ సఫలత చెందినవి. నేను ధన్యుడనయ్యాను. ఈ యజ్ఞము పవిత్రమయినది. నా కోరికలు నెరవేరాయి. అగ్నులు బాగా వేల్చబడినవి. ఈ సమయము చాలా మంగళకరం అయినది.

మ॥ వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా. 550

ఓ. భూసురోత్తమా! నీకేమికావాలి? మేలైన పట్టువస్త్రాలా, బంగారు నాణాలా, ఫలాలూ వనసంపదలా, గోవులా, గుర్రాలూ రథాలా, రత్నాలా, మృష్టాన్నభోజనాలా, కన్యలా, ఏనుగులా, గృహాలా, భూములా, రాజ్యాలా, లేదా నీకు కావలసినదేదైనా కోరుకో! దానిని నీకిచ్చి నేను ఆనందిస్తాను అని అనగా, దానవేంద్రుని ధర్మయుతమైన వాక్కులకు సంతసించిన వాడైన వామనుడు ఇలా అన్నాడు: ఓ దానవేంద్రా:

సీ॥ ఇదినాకునెలవని యేరీతిఁ బలుకుదు నొక చోటనక యెందు నుండ నేర్తు
ఎవ్వని వాడనంచేమని పలుకుదు నాయంత వాడనై నడవనేర్తు
ఈ నడవడియని యెట్లు వక్కాణింతు పూని ముప్పొకలఁ బోవనేర్తు
అదినేర్తు నిదినేర్తు ననియేల చెప్పంగ నేరుపు లన్నియు నేవనేర్తు
ఆ॥ ఒరులు కారు నాకు నొరులకునేనాదు నొంటివాడ చుట్టమొకడు లేడు
సిరియుతొల్లిగలదు సెప్పెద నాటెంకి సుజనులందు తరచు చొచ్చియుండు. 552

అయ్యా! "ఇది" నా చోటని నేనెలాగ చెప్పేది, ఒక్క చోటనక నేనెక్కడైనా ఉంటాను. ఎవరికి చెందినవాడనని నేనెలాగ చెప్పగలను? నాకు చెందినవాడను నేనే, స్వేచ్ఛగా నాకు తోచినరీతిని నడుస్తుంటాను. ఇది నా నడవడి (సంచరించే తావు) అని నేనెలాగ చెప్పగలను? పూనికతో మూడు పోకడలూ పోగలను (ముల్లోకాల్లోనూ సంచరించగలను, లేదా, జాగ్రత్ స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థలలోనూ ఉండేవాడిని) అది నేర్చుకున్నాను, ఇది నేర్చుకున్నాను అని చెప్పనేల, నేర్చుకోవలసినదంతా నేర్చుకున్నాను. ఎవ్వరూ నాకు పరులు కారు, వారికి నేను ఆత్మీయుడనౌతాను. నేనొంటరివాణ్ణి, నాకు చుట్టాలెవ్వరూ లేరు. పూర్వము నాకు సిరి ఉండేది. నాయొక్క ఉనికి చెప్తాను విను- నేను ఎల్లప్పుడూ సజ్జనుల మధ్యనే నివసిస్తుంటాను.

దానవేంద్రా! నా విషయం అలా ఉండనీ. ఇప్పుడు నీవు నాకు కానుకలిస్తానని అన్నమాటలు, మీ వంశానికే తగియున్నవి. నీ యొక్క సత్కీర్తిని ఇనుమడింపజేసేవి. సత్య ధర్మాలతో కూడియున్నట్టివి. మీ వంశములో కరుణ, ఆత్మశక్తీ లేని వారు పుట్టలేదు. దానముచెయ్యడానికిగాని, యుద్ధము చెయ్యడానికిగాని వెనుదీసేవారేలేరు మీ వంశములో. మీ తాతలందరూ మేటి వీరులు. ప్రహ్లాదుడు మీ వంశములోని కీర్తి చంద్రుడు. పూర్వము మీ ముత్తాత అయిన హిరణ్యాక్షుడు విశ్వాన్ని జయించి, తనను ఎదిరించగల వీరుడు ఎక్కడా కనిపించక, చివరకు వరాహరూపంలో నున్న విష్ణువుతో పోరి మరణించాడు. అతని అన్న హిరణ్యకశిపుడు పగతో వైకుంఠం పైకి దండెత్తగా, అతనిని జయించడం అసంభవమని గ్రహించిన విష్ణువు సూక్ష్మరూపము దాల్చి, అతని ముక్కు రంధ్రము గుండా అతని హృదయంలోనే దూరి దాక్కొన్నాడు. హిరణ్యకశిపుడు విష్ణువుకోసం ముల్లోకాలూ గాలించి, ఎక్కడా కానక, ఇలా తలపోశాడు: "నా శత్రువు భయంతో మరణించియుంటాడు. లేకుంటే, నేవెదకని చోటేలేదు కదా, ఎక్కడైనా నాకు ఎదురు పడేవాడే. మరణించిన వానితో శత్రుత్వం తగదు" అని భావించి ఊరుకొన్నాడు నీతిమంతుడైన ఆ అసురాధిపతి. మీ తండ్రి అయిన విరోచనుడు మాత్రము సామాన్యుడా! ఇంద్రాదిదేవతలు బ్రాహ్మణరూపములో వచ్చి అర్థించగా, తన ఆయుస్సునే దానమిచ్చినాడు కదా! నీవు, వారందరికీ ఏ మాత్రము తీసిపోని వాడవు. రాజ్యాధికారము వచ్చిన వారు పూజనీయులకూ, బ్రాహ్మణులకూ, యాచకులకూ, ఉదారముగా ధనసహాయం చేస్తుండాలి. లేనిచో ఆ సంపదలన్నీ నిరర్థకాలే అవుతాయి. అవి త్యజింపవలసినవే ఓ దనుజేంద్రా! నీవు నాకు ఏదైనా దానం చెయ్యాలని ఉత్సాహపడుతున్నావు కాని నేను ఒంటివాడను. నాకు ఏమి కావాలి? ధనమూ, భూములూ

ఏమి చేసుకొంటాను? మూడడుగుల నేల మాత్రమివ్వు. అదే నాకు బ్రహ్మాండం" అని చెప్పిన వామనునితో బలిచక్రవర్తి ఇలా అన్నాడు.

మ॥ వసుధాఖండము వేడితో గజములన్ వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేరవీవడుగ నీ భాగ్యంబు లీపాటి గా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీయల్పంబు నీ నేర్చునే. 569

ఓ బ్రాహ్మణకుమారా! నీవు చెప్పిన మాట సమంజసముగానే ఉన్నది. కాని, అడిగిఅడిగి ఇంత స్వల్పమైన దానిని అడిగావు. దాతయొక్క గొప్పతనాన్నీ, అతని సంతోషాన్నీ సరకుచెయ్యాలి కదా! రాజ్యభాగము కోరితివా, ఏనుగులు కావాలంటివా, అందగత్తెలను చూచి ఇష్టపడి, కావాలంటివా, పసిబాలుడవు. పాపం! అడగడమైనా రాదు నీకు. నీ భాగ్యము స్వల్పమైనదే కావచ్చు. కాని నీవు అడిగావు కదా అని ఈ అసురేంద్రుడు మూడడుగల నేలనే ఇచ్చి ఎలాగ సంతోషించగలడు? అని అన్నాడు. అప్పుడు చిరునవ్వు చిందించే ముఖముతో వామనమూర్తి ఇలా అన్నాడు:

మ॥ గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ముంజియో దండమో
వడుగేనెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచిత కర్మమెక్కడ? మదాకాంక్షామితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్. 572

దానవరాజా! బ్రహ్మచారినైన నేనెక్కడ, భూములూ, ఏనుగులు, గుర్రాలూ, అందాల భామలూలాంటి వన్నీ ఎక్కడ? వీటితో నాకేం పని? గొడుగో, జంధ్యమో, కమండలమో, దండమో, దర్భల మొలత్రాడో, ఇలాంటివే నా నిత్యకర్మలకు పనికి వచ్చేవి. (అవి కూడా నా వద్దనున్నవి నాకింకేమీ వద్దు) నేనుకోరిన మూడు అడుగుల మేర నాకిస్తే, నాకు అదే బ్రహ్మాండం అవుతుంది. లభించినది ఎంత స్వల్పమైనదైనా సంతృప్తిని చెందాలి. అలాగ తృప్తి జెందనివానికి సప్తద్వీపాల సంపదలొచ్చిపడినా ఇంకా కావాలి అనిపిస్తుంది. పూర్వము పృథు చక్రవర్తీ, గయుడూ, మొదలైన రాజులు కొందరు సముద్రాల వరకూ వ్యాపించియున్న సామ్రాజ్యాలను పొందినా ఆశమాత్రము వదులుకొనలేకపోయారు. వారి ఆశలు నెరవేరనూలేదు. సంతుష్టి కలవాడెల్లప్పుడూ సుఖిస్తుంటాడు, గౌరవింపబడుతాడు. అతనికి మోక్షము కూడా లభిస్తుంది.

సీ॥ సంతుష్టుడీమూడు జగముల పూజ్యుండు సంతోషికెప్పుడు జరుగుసుఖము
సంతోషికాకుంట సంసార హేతువు సంతసంబున ముక్తి సతియు దొరుకు
పూటపూటకు జగంబుల యదృచ్ఛాలాభతుష్టిని తేజంబు దోనపెరుగు
పరితోషహీనతఁ బ్రభ సెడిపోవును జలధారననలంబు సమయునట్టు
ఆ॥ నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట తగవుకాదు నాకు తగిన కొలది
యేను వేడి కొనిన యీ పదత్రయమును చాలదనక యిమ్ము చాలు చాలు. 575

సంతుష్టిలేనివాడు, జనన మరణ సంసార వలయంలో కొట్టుకొంటాడు. అప్రయత్నంగా ఎప్పటికేది లభిస్తుందో దానితో సంతుష్టి చెందిన వానికి ఈ ప్రపంచంలో తేజస్సు పెరుగుతుంది. అలాగ సంతోషించలేని వానియొక్క తేజస్సు అంతరించిపోతుంది. నీవు జగత్ప్రసిద్ధుడవైన మహాదాతవు, ఏది అడిగినా ఇస్తావు కదా, అని అదీఇదీ అడగడం నాకు తగదు (ఉచితంకాదు). నాకు తగినదేదో, నేను కోరిన ఈ మూడడుగుల నేలను మాత్రమిమ్ము. ఇంత తక్కువదా అని అనుకొనకుండా ఇమ్ము. అదే చాలు అనిన విని, దానవరాజు చిరునవ్వుతో ఇలా అన్నాడు: "బ్రహ్మబాలకా! నీ మాటలు చాలా విజ్ఞానంతో నిండియున్నవి గాని నీ ఆలోచనలు మాత్రము పసితనము వీడినట్లులేదు. నీ అవసరాలేమిటో, నీవేమిటి అడగాలో నీకు తెలీదు. నా నుండి ఇంత స్వల్పమైన కానుకనుపొంది,

మళ్లీ నీవు ఇతరులను యాచించడం నాకు నచ్చదు. అయినా అంతకుమించి ఇంకేమీ వద్దు అని అంటున్నావు కనుక నీవు కోరిన మూడడుగుల భూమిని ఇదే అర్పిస్తున్నాను స్వీకరించు" అని దానం చెయ్యడానికి సిద్ధపడుతున్న బలిచక్రవర్తిని వారించి, రాక్షస శ్రేయోభిలాషీ, గురువరేణ్యుడూ అయిన శుక్రాచార్యుడిలా అన్నాడు:

సీ॥ **దనుజేంద్ర! యీతడు ధరణీసురుడు కాడు, దేవకార్యంబు సాధించుకొరకు**
**హరి విష్ణు(డవ్యయుండదితి గర్భంబున కశ్యప సూనుడై కలిగెనకట**
**యెరుగవీతని కోర్కె నిచ్చెదనంటివి దైత్యసంతతి కుపద్రవమువచ్చు**
**నీ లక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చును వాసవునకు**
ఆ॥ **మొనసి జగములెల్ల మూడు పాదంబుల నఖిల కాయుడగుచు నాక్రమించు**
**సర్వధనము విష్ణు సంతర్పణము చేసి బడుగు పగిది యెట్లు బ్రతికెదీవు? 577**

ఓ దానవేశ్వరా! ఇతడు బ్రాహ్మణ బ్రహ్మచారి కాడు. దేవకార్యాన్ని సాధించడానికి వచ్చిన హరి. ఇతడు అవ్యయుడైన విష్ణువు. అదితి గర్భాన కశ్యపుని పుత్రునిగా జన్మించినవాడు. అయ్యో! తెలియక నీవతనికి కోరిన దానమిస్తానంటివి. దైత్యసంతతికి, దీనివలన ఉపద్రవం వచ్చిపడుతుంది. నీ యొక్క సిరిసంపదలు, తేజస్సూ, రాజ్యమూ, ఐశ్వర్యమూ, అన్నీ నిన్ను వంచించి, తీసుకొని, ఆ ఇంద్రునికి ఇచ్చివేస్తాడు. విశ్వరూపాన్ని ధరించి, మూడు పాదాలలో అన్ని లోకాలనూ ఆక్రమిస్తాడు. నీకున్న సర్వసంపదనూ విష్ణువునకు ధారపోసి, నిరుపేదవై నీవు ఎలాగ బ్రతుకుతావు? ఇతడు తన చిన్ని పాదాలతో కొలిచి, మూడడుగుల నేలనే తీసుకొంటాడు అని నీవు అనుకొంటున్నావు. గాని అతడు తన శరీరాన్ని పెంచివేసి, ఒక పాదముతో భూలోకాన్నీ, రెండవ పాదముతో ద్యులోకాన్నీ ఆక్రమించగలడు. ఇక నీకు నిలువడానికి చోటుగాని, మూడవ పాదానికి స్థలముగాని మిగిలియుండదు. ఇస్తానని మాట ఇచ్చినా, ఇవ్వకపోతే వచ్చే పాపకర్మఫలమైన నరకాన్ని దాటివేయగల శక్తి నీకున్నది. దాతకు వినాశము తెచ్చిపెట్టే దానము దానమే కాదు. ఋగ్వేదములో కూడా ఒక సూత్రం ఉన్నది. మాట ఇచ్చినా సరే, సర్వస్వాన్నీ నష్టపరచే దానాన్ని ఇవ్వకపోయినా తప్పు లేదు అని. ఉన్నంతలో కొంత దేహ పోషణకు ఉంచుకొని, మిగిలినదే దానము చెయ్యాలి. మొదటికే చేటురాని విధంగా దానము చెయ్యాలని చెప్పారు. కొన్ని సందర్భాలలో ఆడినమాట తప్పడముగాని, అసత్యం ఆడడంగాని అవసరం అవుతుంది.

ఆ॥ **వారిజాక్షులందు వైవాహికములందు ప్రాణ విత్త మాన భంగమందు**
**చకితగోకులాగ్రజన్మరక్షణమందు బొంకవచ్చు నఘము పొందదధిప! 584**

రాజా! స్త్రీలను ఒప్పించవలసినప్పుడు, పరిహాసాలాడినప్పుడు, వైవాహిక వినోద వేడుకలందూ, ప్రాణాలకు, ధనానికీ, గౌరవానికీ, ప్రమాదం వాటిల్లనున్నప్పుడూ, భయాతురులైన గోవులను బ్రాహ్మణులను రక్షింపవలసియున్నప్పుడూ, అసత్యమాడినా పాపము కలుగదు సుమా! ఈ పొట్టివాడు సామాన్యుడు కాడు. మూడు లోకాలనూ మూడు అడుగులలో కొలవగల విష్ణువు. నా మాట విను. దానము వద్దు గీనమూ వద్దు. ఈ వటుని త్రిప్పిపంపించు." అని, గురువు చెప్పిన హితవాక్కులను విని, బలిచక్రవర్తి కొంతసేపాలోచించి, చివరకు ఇలా అన్నాడు: "గురుదేవా! నా హితము కోరి, మీరు చెప్పినదంతా మిక్కిలి సమంజసముగా నున్నది. గృహస్థులు అవశ్యము పాటింపవలసినవే. ఈ జీవితాన్ని, శరీరాన్నీ రక్షించుకొనవలసివచ్చినప్పుడు అసత్యమాడినా తప్పులేదన్నారు. కాని ఒక సద్బ్రాహ్మణునకు దానమిస్తానని ఇచ్చిన మాటను కాదని, రక్షించుకొనవలసినంత గొప్పదా ఈ శరీరము? ఈ శరీరము, సంపద, అధికారము, ఇవి అన్నీ శాశ్వతములా? వీటి గురించి అసత్యమాడి, అనృతదోషాన్ని పొందడం త్యాగధనులైన మా తాతగారైన ప్రహ్లాదునికీ, మా తండ్రిగారైన వైరోచనునికీ, అపకీర్తికరము కాదా! మేరు మందరాది పర్వతాలనైనా మోయగలనుగాని, అసత్యవాదులను మాత్రము భరించలేను అని భూమాత పదేపదే మొరపెట్టటంలేదా! యుద్ధములో వెనుదిరగకుండా వీరమరణం పొందడం, మాటతప్పకుండా సత్యపాలనం చెయ్యడం ఉత్తముల ధర్మము కదా! దాతకు తగినంత ధనమూ, దానాన్ని తీసుకొనే ఉత్తమ గ్రహీత దొరకడం అపురూపమైన అదృష్టమే కదా!

శా॥ కారే రాజులు రాజ్యముల్ కలుగవే గర్వోన్నతింబొందరే
వారేరీ? సిరిమూట గట్టుకొని పోవంజాలిరే భూమిపై
పేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా?

ఆచార్యదేవా, భార్గవా! ఆదినుండి ఎందరెందరు రాజులుకాలేదు? ఎన్నెన్ని సామ్రాజ్యాలు స్థాపింపబడలేదు? ఆ రాజ్యాధీశులెంతెంత గర్వాహంకారాలను చూపలేదు? మరి వారంతా ఇప్పుడేరీ, ఎక్కడున్నారు? వారు పోగుచేసుకొన్న సిరిసంపదలన్నిటినీ మూటగట్టుకొని తీసుకొనిపోగలిగారా? ఈ భూమి మీద వారి పేర్లయినా మిగిలియున్నవా? శిబిచక్రవర్తి లాంటి దాతలు, కీర్తి కాములై, ప్రేమతో అడిగిన వారి కోర్కెలను తీర్చలేదా! వారిని, ఈనాటి వరకూ ఎవ్వరైనా మరచి పోగలిగారా? గురువర్యా! మీరు చెప్పినట్లు, ఈవటుడు విష్ణువే అయితే అదీ మహద్భాగ్యమేకదా! ఎన్నెన్నో యాగాలు, వ్రతాలు, తపస్సులూ చేసినా, కంటికైనా కనిపించని, ఊహకైనా అందనట్టి ఆ విష్ణువు తన్ను తానుకుదించుకొని, కురుచవాడై, యాచకుడై, నాముందు నిల్చొని కోరుతుంటే, ఆయన కోరిన మూడడుగులే కాదు, నా సర్వస్వమూ, ప్రాణమూ అయినా అర్పించడం కంటే నాకు ఇంకేమి కావాలి?

శా॥ ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై నంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై కపోలతటిపై పాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీదై నాకరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నా పాయమే? 591

మొదట శ్రీదేవి యొక్క కురులు సవరిస్తూ, శరీరాన్ని నిమురుతూ, పైటచెంగులాగుతూ, పాదాలను తడుముతూ, పాలిండ్లతో నాడుతూ,చెక్కిళ్లను స్పృశిస్తూ, నిత్యమూ లాలింపబడి, పూజింపబడే ఆ (విష్ణువుయొక్క) చేయి నన్ను యాచిస్తూ, ఇప్పుడు క్రిందిది కావడమూ, నా చెయ్యి దానమిస్తూ పైది కావడమూ, ఆహా ఎంత అదృష్టము? అదే మేలు కాదా! ఈ రాజ్యమూ గీజ్యమూ ఏమైనా శాశ్వతమా! శరీరము మాత్రము పడిపోకుండా ఉండిపోతుందా?

మ॥ నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైన కులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుడైనన్, హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నాఁ
దిరుగన్నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య! వేయేటికిన్ 592

క॥ మేరువు తలక్రిందైనను పారావారంబులింకఁబారిన లోలో
ధారుణి రజమైపోయిన తారాధ్వము బద్ధమైన తప్పక యిత్తున్. 594

గురువర్యా! నాకు నరకము దాపురించినాసరే, నేను బంధింపబడినా సరే, భూమండలం నిర్మూలమైనా సరే, నాకు దుర్మరణం సంభవించినాసరే, నిజానికి కులాంతమైనా సరే, ఏది నిజంగా సంభవించవలసియున్నదో అది జరగనీ, ఇప్పుడు అడుగవచ్చిన ఈ అభ్యాగతుడు, శివుడైనా, శ్రీహరియైనా, బ్రహ్మదేవుడైనా ఎవ్వరైనా కానీ, ఒక సారి మాట ఇచ్చిన తరువాత నాజిహ్వ ఇక వెనుకకు తిరుగదు. ఇంక పలుమాటలేల? మేరు పర్వతం తలక్రిందులైనా, సముద్రాలు ఇంకిపోయినా, భూమండలం లోలోనే చూర్ణమైపోయినా, మిన్నువిరిగి మీద పడినా సరే, నేను ఈ దానాన్ని ఇచ్చి తీరుతాను." అని, తన దృఢ నిశ్చయాన్ని తెలిపిన బలిచక్రవర్తి గురు ఆదేశాన్ని ధిక్కరించినట్టుగా భావించిన శుక్రాచార్యుడు, కోపగించుకొని, "పదభ్రష్టుడవు ఔదువుగాక!" అని శపించాడు.

బలిచక్రవర్తి ధర్మపత్ని అయిన వింధ్యావళి బంగారు కలశముతో శుద్ధ జలము తెచ్చినది. దానవేశ్వరుడు బ్రహ్మచారిని పిలిచి, ఉచితాసనంపై కూర్చుండబెట్టి, కాళ్లు కడిగి, పూజచేసి, ఆ జలాన్ని తలపై చల్లుకొని, ఇలా అన్నాడు: ఓ బ్రహ్మవటోత్తమా! నీవు వేదవేత్తవు, విష్ణుసమానుడవు. నీవు కోరిన మూడడుగుల భూమిని ఇదే

దానమిస్తున్నాను. స్వీకరించు. పరమాత్మ ప్రీతి చెందుగాక!" అని, ధారపోస్తుండగా, శుక్రాచార్యుడు సూక్ష్మరూపంలో కలశంలో ప్రవేశించి, నీరు పడకుండా అడ్డుకొన్నాడు. వామనమూర్తి అది కనిపెట్టి, దర్భకొనతో కలశంలోనికి పొడవగా అడ్డుతొలగి, నీటి ధారవచ్చినది. దర్భకొన శుక్రుని కంటిలో గుచ్చుకొనగా ఒక కన్ను పోయినది. పరమ పవిత్రమైన ఆ జలధారను వామనమూర్తి స్వీకరించాడు. దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. జయజయధ్వానాలు చేశారు. "భళిభళిరా, ఈ బలిచక్రవర్తి ఎంత త్యాగధనుడు! రాక్షసుల శత్రువైన విష్ణువే స్వయంగా వచ్చి, తన సర్వస్వాన్నీ హరించుకొపోనున్నాడని తెలిసినా, చలించకుండా భక్తితో హృదయ పూర్వకంగా ఆత్మార్పణం చేసుకొంటున్నాడు, ఇతని చరిత్రయే ధన్యము." అన్నట్లుగా పంచభూతాలూ స్పందించాయి. మునీశ్వరులూ, దేవతలు, సిద్ధులు, గంధర్వులు, అందరూ మహాబలియొక్క దానశీలతను, ఔదార్యాన్నీ మిక్కిలిగా ప్రశంసించి, అతనిని ఆశీర్వదించారు.

### విశ్వరూపుడైన వామనమూర్తి

ఆ విధంగా దానాన్ని స్వీకరించిన వామనమూర్తి,

**శా॥ ఇంతింతై వటుడింతయై మరియు తానింతై నభోవీధిపై**
**నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై**
**నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై**
**నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై. 620**

దానము తీసుకొన్న వామనుడు కొద్దికొద్దిగా ఎదుగుతూ – ఇంతింతగా ఇంతవాడు, అంతవాడై, అంతవాడు మరి అంతవాడై, ఆకాశవీధిపైన అంతయై, మేఘమండల శిఖరానికి అల్లంతవాడై, తేజోరాశిపైన మరి అంతయై, చంద్రునిపై అంతయై, ధ్రువతారపైన అంతయై, మహర్లోకంపైన అంతై, సత్యలోకం కంటె ఉన్నతుడై, బ్రహ్మాండమంతా నిండేటట్టు పెరిగిపోయాడు.

ఆ వామనమూర్తి విగ్రహం ఎలాగ పెరిగిపోయినదో గ్రహించాలంటే, సూర్యబింబము యొక్క ఉచ్ఛస్థితినే కొలమానముగా ఊహించుకొని, అది, సూర్యునకు ఎంతవరకు పెరిగినదో, గమనించాలి.

**మ॥ రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై**
**శ్రవణాలంకృతమై గళాభరణమై, సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటియై నూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుడు తాఁబ్రహ్మాండమున్ నిండుచోన్. 621**

సూర్యబింబము యొక్క ఎత్తుతో పోల్చిచూస్తే, పెరిగిపోతూ బ్రహ్మాండమంతా నిండిపోతున్న ఆ వామనునకు, సూర్యబింబము మొదట సరియైన ఛత్రములాగాను, పిదప శిరోభూషణము లాగాను, తదుపరి శ్రవణాలంకారము గాను, తరువాత కంఠాభరణం లాగాను, ఆ తరువాత సువర్ణ భుజకీర్తిలాగాను, తరువాత కాంతులీనే కంకణములాగాను, ఆ తరువాత మొలలోని ఘంటలాగాను, ఆ పైనిమేలైన కాలి అందెలాగాను, చివరకు పాదపీఠంలాగాను, కనిపించసాగినది.

ఈ విధముగా వామనమూర్తి, సత్త్వరజస్తమోగుణాత్మకమైన విశ్వరూపాన్ని ధరించాడు. భూమి, ఆకాశము, స్వర్గము, దిక్కులు, సముద్రాలు, సమస్త ప్రాణులూ తానే అయ్యాడు. భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక తపోలోకాలను దాటి, సత్యలోకాన్ని కూడ అధిగమించి, అంతటా వ్యాపించిపోయాడు. పాదాల అడుగుభాగంలో రసాతలాన్నీ పాదాలపై భూమినీ, కాళ్లపై పర్వతాలనూ, తొడలలో దేవతలను, రహస్యాంగములో ప్రజాపతులను, పిరుదులలో రాక్షసుల్ని నాభిలో ఆకాశాన్నీ కడుపులో సముద్రాలను, వక్షములో నక్షత్ర మండలాన్నీ, భుజాలలో ఇంద్రాది దేవతలను, కన్నులలో సూర్యుని, ఎదలోలక్ష్మీదేవినీ, తలలో స్వర్గాన్నీ, బుద్ధిలో బ్రహ్మనూ, శరీరములో సకలచరాచరజీవరాసులనూ ఇముడ్చుకొన్నాడు. పాంచజన్యమనేశంఖాన్నీ శార్ఙ్గమనే ధనుస్సును, సుదర్శనమనే

చక్రాన్నీ, కౌమోదకి అనే గదను, నందకమనే ఖడ్గాన్ని, ధరించి ప్రకాశిస్తున్నాడు. మకరకుండల, కిరీట, కంకణ, భుజకీర్తులుమున్నగు ఆభరణాలతో, కౌస్తుభ, వైజయంతి మొదలైన హారాలతో, పీతాంబరధారియై విరాజిల్లుతున్నాడు. నందుడూ, సునందుడూ, జయుడూ, విజయుడూ మొదలైన పార్షదులు, పరిచారకులూ, చుట్టూ ఉండి స్తుతిస్తున్నారు.

ఈ విధముగా త్రివిక్రముడైన వామనమూర్తి విశ్వరూపుడై, ఒక అడుగుతో భూలోకాన్నీ, రెండవ అడుగుతో పైలోకాలనూ ఆక్రమించినాడు. అంతటా నిండిపోయి యున్న ఆ విరాట్ స్వరూపం తప్ప ఇంకేమీ కనిపించలేదు. భూమండలం అంతా పద్మానికి అంటుకున్న చిన్న మట్టిముద్ద లాగాను, పైలోకాలన్నీ, ఆ పద్మం మీదవాలిన తుమ్మెదల లాగున కనిపించినవి. త్రివిక్రముని కాలిగోళ్ల కాంతికి సత్యలోకంలోని బ్రహ్మయొక్క తేజస్సు వెలవెలపోయినది. బ్రహ్మలోక వాసులైన మునీంద్రులు, యోగులూ, పుణ్యాత్ములూ ఆ పాదానికి మ్రొక్కులిడి, "ఎన్నేళ్ల నుంచో ఆకాంక్షిస్తున్న పెన్నిధి ఇప్పుడు లభ్యమైనది." అని ఆనందించారు. మహావిష్ణువు నాభియందున్న పద్మాన్ని చూచి, బ్రహ్మ తనజన్మస్థలమిదేనని గుర్తించి, సంతసించి తన కమండలజలంతో స్వామి పాదాన్ని ప్రక్షాళనం చేశాడు. ఆ జలధారలు ఆకాశంలో దేవనదిగా ప్రవహించాయి. బ్రహ్మాది దేవతలు, ఆ దేవదేవుని స్తోత్రాలతోను, జయజయ ధ్వానాలతోను పొగిడారు. ఫల పుష్పాదులనర్పించి, అర్చించారు. అంతటా నిండియున్న ఆ స్వామి రూపాన్ని కన్నులతో కాంచలేక, మనస్సుతోనైనా ఊహించలేక, బలిచక్రవర్తీ, అక్కడి యజ్ఞసభాసదులూ స్తోత్రంచేశారు.

అప్పుడు త్రివిక్రముడు వామనుడైనాడు, ఇంద్రాది దేవతలను జయించిన అహంకారంతో నున్న హేతి, ప్రహేతి, విప్రచిత్తి మొదలైన రాక్షసులు, క్రోధంతో ఇలాగ తలపోశారు. "విష్ణుమాయను తెలుసుకొనలేని మన చక్రవర్తి, ఈ కపట బ్రహ్మచారిచే మోసగింపబడ్డాడు. మూడు అడుగుల నేల కావాలని చెప్పి, ముల్లోకాలూ ఆక్రమించాడు, ఈ పొట్టివాడు. వీనినిహతమార్చాలి." అంటూ ఆయుధాలు ధరించి, కేకలు వేస్తూ వామనమూర్తిని చుట్టుముట్టారు. అదిగాంచి, విష్ణుసేనలు ఆయుధాలతోను, వాహనాలతోనూ రంగములోకి దిగి యుద్ధానికి సిద్ధపడ్డాయి. పరిస్థితిని గమనించి, బలిచక్రవర్తి, శుక్రాచార్యుని శాపాన్ని గుర్తునకుతెచ్చుకొని, తన అనుచరులను పిలుచుకొని, వారితో ఇలా అన్నాడు:

"దానవవీరులారా! ఆగండి, శాంతించండి. ఇప్పుడు కాలము మనకు అనుకూలముగా లేదు. అంతా దైవాధీనము, కాలవశము. సర్వశక్తిమంతుడైన భగవంతుని మనము ఓడించలేము. ఆయనే మొదట దేవతల రాజ్యాన్ని మనకు ఇచ్చాడు. ఇప్పుడు దానిని మననుండి తీసుకొని దేవతలకిస్తాడు. ఆయన, ఎప్పుడు, దేనిని ఎందుకు చేస్తాడో, ఎవ్వరూ ఏమీ తెలుసుకొనలేరు. అంతా మన అదృష్టము ప్రకారమే జరుగుతుంది. ఇదివరకు అనేకసార్లు మనల్ని ఎదిరించలేక పారిపోయిన దేవతలే ఇప్పుడు యుద్ధానికి సిద్ధపడ్తున్నారంటే, ఇది దైవ నిర్ణయం అన్నమాట. ఇప్పుడు మనం ఏమీ చెయ్యకుండా, అదృష్టం కలిసివచ్చినప్పుడు దండెత్తుదాం. మనకు ఎన్ని బలసంపదలున్నా, కాలానికి లోబడి, మనము ఓర్పుతో, ఉపాయముతో వ్యవహరించాలి." అని, బలిచక్రవర్తి చెప్పగా, వారు, రసాతలానికి వెళ్లిపోయారు.

గరుడుడు విష్ణుమూర్తి అభిమతం గ్రహించి, బలిచక్రవర్తిని వరుణ పాశముతో బంధించాడు. కాళ్లూ చేతులూ బంధింపబడిన మహాబలి ఏమీచలించకుండా మౌనముగా మన్నాడు. ఇదికూడ విష్ణువు యొక్క అనుగ్రహమే అనుకొన్నాడు. సర్వమూ కోల్పోయినా, అతనిలో దీనత్వము కనిపించలేదు సరికదా, ధైర్యమూ స్థైర్యమూ, జ్ఞానమూ ప్రకాశించాయి. అప్పుడు వామనమూర్తి బలితో నిలా అన్నాడు: "దానవేశ్వరా! నీ విస్తానన్న మూడు అడుగుల నేలలో, భూలోకమూ, సూర్యచంద్రులవరకూ ఉండే స్థలమూ, నాకు ఒక్క అడుగైనది. స్వర్గలోకం ఇంకొక అడుగు అయినది. ఇక మూడవ అడుగున, నీకు చెందినదేదీ మిగలలేదు. నీ వాగ్దానం వమ్ము అయిపోయినది. బ్రాహ్మణునకు దానం చేయబడినదానిని ఇవ్వకపోతే, అసత్యదోషంతోపాటు నరకమూ ప్రాప్తిస్తుంది సుమా!" అని పలికిన వామనమూర్తి పలుకులకు, బలిచక్రవర్తి, ఏమీ చలించకుండా, ప్రసన్న వదనంతో, ఇలా అన్నాడు: "దేవదేవా! దానమివ్వకుండడంగాని,

ఇచ్చిన మాటను కాదనడంగాని, ఈ దేహములో ప్రాణముండగా జరుగదు. నీ మూడవపాదానికి స్థలము, ఇదిగో-నా శిరస్సునే శాశ్వతంగా నిస్తున్నాను. స్వీకరించి, నన్ను అనుగ్రహించు. స్వామీ! అసత్యదోషానికి భయపడునంతగా నేను నరకానికి గాని, ఇంకెలాంటి దురవస్థకుగాని భయపడను. అంతేకాక పెద్దలైన తలిదండ్రులు, గురువులు, అన్నలు మందలించి బుద్ధిచెప్పడం మంచిదేగాని, నష్టమేమీ లేదుకదా! రాక్షసులును, రాజ్యమదాంధులును అయిన మా వంటి వారి బుద్ధి చలించి, వక్రమార్గాన పోకుండా, తగిన సమయంలో బంధించి, శిక్షించడం, ఆది గురువైన నీకు తగియున్నది. ఇదివరలో రాక్షసులు, నిన్నెదిరించి, మోక్షపదవినే పొందారు కదా!

ఈ శరీరమూ, ప్రాణమూ క్షణభంగురాలని తెలుసుకొనలేని మూర్ఖులు, దానము, దయ, ధర్మమూ, విడిచిపెట్టేసి, ఈ మాయాసంసారమే సత్యమూ, శాశ్వతమూ అనే భ్రమలో నుంటారు. స్వామీ! నీవు నన్ను శిక్షించుట నా భాగ్యము. మా అసురజాతికి నీవు పరోక్షముగా హితము కలిగించువాడవు. నీ కటాక్షము చేతనే కదా, అహంకారము తొలగుతుంది! పరమ భాగవతుడైన మాతాతగారు ప్రహ్లాదుడు నీకు ప్రియాతి ప్రియతముడు. నిన్ను శత్రువుగా భావించిన అతని తండ్రిచే అతడెన్నెన్ని హింసల ననుభవించాడో కదా! అయినా అతడు నిన్నే ఆశ్రయించాడు. అతని ఉద్దేశములో బంధువులు తస్కరులు, కుమారులు అప్పుల వాళ్ళు, భార్యలు బంధకారకులు, సిరిసంపదలు స్థిరమైనవికావు, శరీరము అతి చంచలమైనట్టిది, ఇతరులు స్వార్థపరులు, ఆయువూ ఐశ్వర్యమూ ఎప్పుడు గతిస్తాయో తెలియనట్టివి, కనుక వీటియందు మమకారం ఉంచుకొనరాదని ఆయన చెప్పేవారట. ఆ మహాత్మునికి మరణములేని మహాపదవినే అనుగ్రహించావు. పురుషోత్తమా! మా రాక్షస వంశీయులు, నీకు శత్రువులైతేనే తప్ప నిన్ను దర్శించలేకపోయారు. కాని నా యొక్క పుణ్యఫలముచే నీవే నా వద్దకు వచ్చావు కదా!" అని చెపుతుండగా, పరమభక్త శ్రేష్ఠుడైన ప్రహ్లాదుడు అక్కడకు వచ్చి, స్వామిని దర్శించి సాష్టాంగ ప్రణామాలు చేసి, ఇలాగ విన్నవించాడు: "స్వామీ! నీవు ఈ బలికి, ఇంద్రపదవి వచ్చేటట్లు చేశావు. ఇప్పుడు దానిని తొలగించడం, అతనికి చాలా మేలే అయినది. అజ్ఞాన, అహంకారాలకు ఆ పదవియే మూలకారణమవుతుంది కదా! దానిని పోగొట్టడం, శిక్షించడంకాదు, రక్షించడమే అవుతుంది. పరమాత్మని పొందదలచుకొన్నవానికి, ఈ ఇంద్రపదవి ఎందుకూ కొరగానిది, దానిని తొలగించి, నీవు ఇతనిని అనుగ్రహించావు" అన్నాడు. అప్పుడు బలిచక్రవర్తి భార్యయైన వింధ్యావళి స్వామికి నమస్కరించి ఇలా అన్నది. "స్వామీ! ఈ మూడు లోకాలూ, నీ లీలావినోదానికై నీవు కల్పించుకొన్నవే కదా! అజ్ఞానులు ఈ లోకములో నున్న వాటిని తమ సొత్తుగా భావిస్తారు. ఇదినాది, దీనికి నేను కర్తను, నేను పాలకుడను, అనుభవించువాడను, నేను స్వతంత్రుడను అని భావిస్తారు. కానీ అన్నిటికీ, కర్త, భర్త, భోక్త అయిన, నీకు ఇతరులేమిటి అర్పించగలరు? నీది కానిది ఏదైనా ఉన్నదా! నా భర్త అజ్ఞానముచే అంతా తనదే అనుకొని నీకు అర్పించారు. ఆయనయొక్క తలకూడా నీదే కదా స్వామీ! ఆయన తప్పిదంమన్నించి, నాకు పతిభిక్షపెట్టుమయ్యా". అని వేడుకొన్నది. అప్పుడు బ్రహ్మదేవుడు స్వామిని ఇలా ప్రార్థిస్తాడు.

**సీ॥ భూతలోకేశ్వర భూతభావన దేవదేవ జగన్నాథ దేవవంద్య**
**తన సొమ్ము సకలంబు తప్పక నీకిచ్చె దండయోగ్యుడు కాడు దానపరుడు**
**కరుణింపనర్హుండు కమలలోచన నీకు విడిపింపు మీతని వెరపు దీర్చి**
**తోయపూరము చల్లి దూర్వాంకురంబుల చేరి నీపదము లర్చించునట్టి**
**తే॥ భక్తియుక్తుడు లోకేశ పదమునందు నీవు ప్రత్యక్షముగ వచ్చి నేడు వేద**
**నెరిగి తన రాజ్యమంతయు నిచ్చినట్టి బలికిఁ దగునయ్య దృఢపాశ బంధనంబు** 657

ఓ దేవదేవా, దేవవంద్యా! జగన్నాథా, భూతలోకేశ్వరా! నీవు ప్రాణులను కాపాడి పోషించేవాడవు. ఈ మహాబలి గొప్పదానపరుడు. తనకున్నదంతా, మాటతప్పకుండా, నీకే అర్పించినవాడు. కమలలోచనా! ఇతడు దండింపదగినవాడు కాడు, కరుణార్హుడు. ఇతనిని బంధవిముక్తునిగ చేసి, భయాన్ని తొలగించు. నీపాదపద్మాలను జలముతో నభిషేకించి,

అర్చించినట్టి భక్తియుక్తుడు. లోకేశ్వరుడవైన నీవు నేడు స్వయంగా వచ్చి అడిగావనీ, సర్వమూ హరించివేయగలవని తెలిసికూడా, తన రాజ్యమంతా ఇచ్చివేసినట్టి త్యాగమూర్తి అయిన బలికి, ఈ దృఢ పాశబంధనము తగునా శ్రీహరీ? అని అడిగిన బ్రహ్మతో భగవానుడిలా అన్నాడు:

సీ॥ ఎవ్వని కరుణింప నిచ్చయించితి వాని యఖిల విత్తంబునేనపహరింతు
సంసారగురుమద స్తబ్ధుడై యెవ్వడు తెగడి లోకము నన్ను ధిక్కరించు
నతడెల్ల కాలంబు నఖిల యోనులయందు పుట్టుచు దుర్గతి పొందు పిదప
విత్తవయో రూప విద్యా బలైశ్వర్యకర్మ జన్మంబుల గర్వముడిగి
తే॥ ఏకవిధమున విమలుడై యెవ్వడుండు వాడు నాగూర్చి రక్షింపవలయువాడు
స్తంభలోభాభిమాన సంసార విభవమత్తుడై చెడనొల్లడు మత్పరుండు. 659

పద్మాసనా! నీకు తెలుసుకదా! ఎవ్వని పైన నేను కరుణజూపదలచుకొంటానో వానియొక్క సకల సంపదలనూ అపహరిస్తాను. ఎవడు అహంకారంతో కూడి, మిక్కిలి మదముతో సంసారమైకంలో మునిగి, నన్ను తిరస్కరించి, దూషిస్తాడో, వాడు నానారకాల గర్భాలలో పుడుతూ, దుర్గతిలోనే పడియుంటాడు. కాని ఎవ్వడైతే ధన, యౌవన, రూప, విద్యా, బల, ఐశ్వర్య, జన్మ, కర్మల ఆధిక్యంచే కలిగిన గర్వాహంకారాలను వదిలించుకొని, నిర్మలు డౌతాడో, వాడు, నాచే, రక్షింపబడడానికి యోగ్యుడౌతాడు. నాయందు మనస్సు లగ్నముచేసిన వాడు అజ్ఞాన, లోభ, దురభిమాన, సంసార, వైభవమత్తుడై నశించడానికి ఇష్టపడడు. ఈ పుణ్యాత్ముడు, గురుశాపం వలన రాజ్యభ్రష్టుడైనా, నిర్మలచిత్తుడైన సన్మార్గాన్నీ, దయను, సత్యాన్నీ, ధర్మాన్నీ విడిచిపెట్టకుండా, జ్ఞానియై, దుస్సాధ్యమైన మాయను గెలిచిన మహనీయుడు, నేను సంతసించాను. ఇతడు సుతలలోకాన్ని పరిపాలిస్తూ, సకల ఐశ్వర్యాలతో దానవుల సేవలనందుకొంటూ సుఖిస్తాడు. ఆ లోకములో ఆపదలు, శ్రమలు, దుఃఖాలూ, రోగాలూ ఉండవు, అనిచెప్పి, భగవంతుడు బలితో ఇలా అన్నాడు.

"ఓ ఇంద్రసేన మహారాజా! నీకు శుభమగు గాక! నీయొక్క దానగుణము అతి శ్రేష్ఠమైనది. దేవతలు కూడ నివసించడానికి కాంక్షించే సుతల లోకంలో ఏవిధమైన బాధలూ ఉండవు. దానికి నీవే సర్వాధిపతివి. నీ ఆజ్ఞను మీరిన వారినీ, నీ శత్రువులనూ నేను తొలగిస్తుంటాను. నేనెల్లప్పుడూ నీకు కరుణార్ద్ర దృక్కులతో దర్శనమిస్తూ నీకోటగుమ్మం వద్ద కావలియుండి, నిన్ను కాపాడుతుంటాను. నన్ను సదా ధ్యానించుచుండటం చేత నీలోని అసురత్వము త్వరలోనే నశిస్తుంది. సావర్ణి మనువుకాలములో నీవు ఇంద్రుడవై దేవతలకు ప్రభువు అవుతావు. అతి దుర్లభమైన ఆ పదవిని నేను నీకిచ్చి, నిన్ను సదా రక్షిస్తాను" అని ప్రేమతో పరమాత్ముడు చెప్పగా, బలికి, మేనుపులకించినవి, ఆనంద బాష్పాలు కట్టలు తెంచుకొని ప్రవహించాయి. మాటలు తడబడ్డాయి, చేతులు జోడించి ఇలా అన్నాడు: "ఆదిశేషశయనా! అంతర్యామీ, దేవతలకుగాని, దిక్పాలకులకుగాని, ఇంకెవ్వరికైనాగాని, ఇంత కృపజూపని నీవు నన్ను ఈనాడు ఇలాగ కీర్తించడంతో నా జన్మ ధన్యమయినది. నా జీవితంతేజో మయమయినది. నాకు ఇంకేమి కావాలి. నిన్ను ఆశ్రయించినవారికి ఇక కష్టాలెక్కడుంటాయి?" అని హరికి ప్రణామాలు చేసి, బ్రహ్మ రుద్రులకు వందనాలర్పించి, బంధవిముక్తుడై పరివారసహితంగా సుతలలోకానికి పయనముకావడానికి సిద్ధపడ్డాడు. విష్ణువు అనుగ్రహం సంపాదించి ధన్యుడై, కులానికి కీర్తి తెచ్చిన మనుమని చూచి ప్రహ్లాదుడు సంతసించి, దేవదేవుని ఇలా స్తుతించాడు:

"ప్రభూ! ఈ బలి పొందినటువంటి మహద్భాగ్యము బ్రహ్మరుద్రులు కూడా పొందలేదు. వారిచే నీవూ సతతమూ పూజింపబడువాడవు, అయిననూ నిన్ను దరిజేరడానికి ఎవ్వరికీ సాధ్యము కాదు. అటువంటి దుర్లభుడవైన నీవు అసురులమైన మా యొక్క దుర్గరక్షకుడవు అవుతున్నావంటే అనూహ్యమైన నీ యొక్క లీలావిలాసాన్ని ఎలాగ గ్రహించగలము? మేము నీచజన్ములము, అల్పులము. అపారమైన నీ యొక్క కృపను ఈ విధంగా పొందడానికి మేము చేసిన పుణ్యవిశేషమేమిటో మాకు తెలియదు. ఎంత ఆశ్చర్యము! నీవు సర్వాంతర్యామివి, సమవర్తివి, అయినప్పటికీ, భక్తులపక్షపాతివి. ఆశ్రితవత్సలుడవు" అని చెప్పిన ప్రహ్లాదునితో శ్రీహరి ఇలా అన్నాడు:

"వత్సా! ప్రహ్లాదా! చాలా సంతోషము. నీవు నీమనుమనితో సుతలలోకములో నుండుము. నేను గదాహస్తుడనై మిమ్మల్ని కాపాడుతుంటాను." అని చెప్పిన భగవంతునికి ప్రదక్షిణం చేసి ప్రణామాలు చేసి, సెలవు తీసుకొని, బలిచక్రవర్తితో సుతలలోకానికి వెళ్లి పోయాడు.

పిమ్మట విష్ణువు, శుక్రాచార్యుని పిలిచి, యాగాన్ని సక్రమంగా నిర్వహించి, ముగించుమని ఆదేశించాడు. బ్రహ్మాదులు వామనుని ఉపేంద్రునిగా పేర్కొని, సర్వలోకాధిపతిగా సర్వభూతనాథునిగా గుర్తించారు. ఉపేంద్రుడు తన అన్న అయిన ఇంద్రునకు స్వర్గలోకాన్ని అర్పించాడు. బ్రహ్మాది దేవతలు విష్ణుమహిమను కొనియాడుకొంటూ స్తుతిస్తూ నిష్క్రమించారు. శ్రీహరి యొక్క త్రివిక్రమ చరిత్రను విన్నవారికి సకలకార్యసిద్ధి, ఉత్తమగతి లభిస్తాయి.

## మత్స్యావతారము

శ్రీ శుకుడు పరీక్షిత్తుతో ఇలా చెపుతున్నాడు: ప్రభువైన విష్ణువు వేదాలను బ్రాహ్మణులను, గోవులను, దేవతలను, సజ్జనులను, ధర్మాన్నీ, అర్థాన్నీ రక్షించడం కోసం, అనేకమైన అవతారాలను ధరిస్తాడు. నామరూపగుణాలేవీ లేని ఆ పరబ్రహ్మకు ఇది గొప్పది, అది తక్కువది అనే భేదభావమేదీ ఉండదు. అన్నింటా వ్యాపించియుండి, సర్వమూ తానేయైన వాడు కనుక అన్నిటియందూ సముడై యుంటాడు. త్రిగుణాలతో కూడియున్న ప్రకృతిని వినియోగించి, నామరూపగుణాలతో అవతరిస్తుంటాడు.

గత కల్పాంతములో ద్రవిడదేశపు రాజైన సత్యవ్రతుడు కృతమాలఅనే నదిఒడ్డున కూర్చొని విష్ణువు గురించి తపస్సు చేస్తుండెను. ఒకనాడు అతడు నదిలో తర్పణం విడుస్తుండగా దోసిలిలో ఒక చిన్న చేపపిల్ల కనిపించినది. అతడు దానిని నదిలో పడవేశాడు. అప్పుడు ఆ చేపపిల్ల ఇలా అన్నది: "ఓ దయామయా, జాలరివాని వలలో పడతానో, లేదా పెద్ద చేపనోటిలో పడతానో అనే భయముచే నీ చేతిలోనికి వచ్చాను. నన్ను మళ్లీ మృత్యుముఖంలో పడవేయడం ధర్మమేనా?" అని అడిగినది. ఆ రాజర్షి ఆ చేపపిల్లను తన కమండలంలోనుంచి ఇంటికి తీసుకెళ్లాడు. ఇల్లుచేరుకొనేసరికి ఆ చేపపిల్ల కమండలమంతా నిండిపోయి, "రాజేంద్రా! నాకీ స్థలం చాలటంలేదు" అన్నది. దానిని ఒక కడవలో నుంచాడు రాజు. క్షణంలోనే అది కడవంతా నిండిపోయి, ఇంకా పెద్ద స్థలం కావాలన్నది. దానిని తీసుకొనివెళ్లి ఒక మడుగులో వేశాడు ఆ మహాత్ముడు. అది మడుగుకంటే పెద్దదై ఆ చోటు చాలదంటే, దాన్ని ఒక పెద్ద చెరువులో వేశాడు. అది కూడ చాలకపోయేసరికి, దానిని ఈడ్చుకొని వెళ్లి సముద్రంలో విడిచాడు. అప్పుడా చేప "ఓ రాజా! నన్ను ఇంతదానినిగా పెంచి, ఇప్పుడు ఈ సముద్రములోని తిమింగిలాల పాలు చేస్తావా? ఇది నీకు న్యాయమేనా?" అని అడిగినది. రాజుకు ఆశ్చర్యమేసినది. ఏమి చెయ్యాలో తోచక ఇలా అన్నాడు: " ఓమీనరాజమా! నీవెవరవు? సామాన్యపు చేపవు మాత్రము కావు. ఒక్క రోజులోనే ఇంతటి భీకరమైన శరీరానికి ఎదిగిపోయిన నీవు నన్ను అనుగ్రహించడానికి మాయా రూపములో వచ్చిన విష్ణుమూర్తివే అనుకొంటున్నాను. నిజంగా నీవు ఆ పరమేశ్వరుడవే! ఓ అచ్యుతా, అనంతా, నారాయణా, ఈ విధంగా దర్శన మిస్తున్నావా ప్రభూ! నీ అవతారాలకు ఏదో ఒక మహాప్రయోజనమే ఉంటుంది. లోకకల్యాణమే నీలీల. నీవు భక్త పరాధీనుడవు. నీకు అనేక వేల వందనాలు. వైకుంఠములో మహాలక్ష్మితో వినోదిస్తుండవలసిన నీవు ఈ నీచరూపమైన చేపగా ఎందుకువచ్చావు?" అని అడిగిన సత్యవ్రతునితో మీన రూపధారియైన విష్ణువు ఇలా అన్నాడు. ఓ నరేంద్రా! నేటికి ఏడవరోజున ఈ మూడులోకాలూ ప్రళయజలముతో నిండిపోతాయి. అప్పుడు ఒక విశాలమైన నావ నీ వద్దకు వస్తుంది. నీవు ఆ నౌకలో సమస్త ఓషధులనూ, విత్తనాలనూ సంగ్రహించి ఉంచు. నీతోపాటు సప్తఋషులూ ఆ నౌకలో నుంటారు. మీ ముందు భాగంలో పెనుచీకటి ఆవరిస్తుంది. సూర్యచంద్రుల కాంతి ఉండదు కనుక మునుల మేనికాంతులే మీకు దీపాలవలె మెరుస్తుంటాయి. సముద్రజలాల్లో నావ తేలుతూ సాగిపోతూఉంటుంది. అలలతాకిడికి నావ భగ్నం కాకుండా, మీనరూపంలో నేను కాపాడుతుంటాను. వాసుకి అనే ఒక పెద్ద సర్పము నీకు కనిపిస్తుంది. దానిని త్రాడు లాగా ఉపయోగించి, నావను నా ముక్కుకొనకు బంధించి ఉంచు. బ్రహ్మయొక్క రాత్రి గడిచేవరకూ, ప్రళయరాత్రి ముగిసేవరకు నేను మిమ్మల్ని రక్షిస్తాను" అని చెప్పి అదృశ్యమైనాడు.

సత్యవ్రతుడు భగవానుడు చెప్పిన ప్రళయరాత్రి ఆగమనం గురించి ఎదురుచూస్తున్నాడు. ఆ సమయం వచ్చినది. ఎడతెరిపి లేని వర్షాలతో, ఉరుములు మెరుపులు పిడుగులతో, గాడ్పులతో సముద్రాలు పొంగి, భూమండలాలు మునిగి, నానాబీభత్సంగా నున్నది. నౌకరాగానే సత్యవ్రతుడూ, సప్తఋషులూ, సరుకులతో నెక్కారు. లక్షయోజనాల శరీరంతో ఒంటి కొమ్ముగల ఒక మత్స్యమూ, ఒక సర్పమూ వచ్చాయి. భగవంతుడు చెప్పినట్లే నావను చేపకొమ్ముకు బంధించాడు సత్యవ్రతుడు. భగవానుని ఈ విధంగా స్తోత్రం చేయసాగాడు: "ఓ పరమేశ్వరా! అనాదిగా వస్తూ ఉన్న అవిద్య(అజ్ఞానం) వలన కొందరు సంసారంలో చిక్కుకుంటారు. కోరికల వెంట పరుగులెత్తుతారు. పూర్వపుణ్యవిశేషం చేత అనుకొనకుండా నిన్ను తలచుకొనడం తటస్థించి, నిన్ను సేవించి, తరించుతారు. నీవే అందరికీ పరమగురుడవు. జ్ఞాన దాతవు. మోక్ష ప్రదాతవు. నిన్ను సేవించినంతనే మాలిన్యము తొలగిన బంగారము వలె సంసారులు జ్ఞానవంతులౌతారు. నీ అనుగ్రహంలో పదివేలవంతులో ఒక లవలేశము వలన దేవేంద్ర పదవి లభిస్తుంది కదా! అలాంటి నీ కరుణ ఉంటే, లభించని భాగ్యమేముంటుంది? నా అజ్ఞానాన్ని నశింపజేసి, నీ లోకములోనికి నన్ను చేర్చుకొనుము, ప్రభూ" అని వేడుకొన్న సత్యవ్రతునితో, మీనశరీరుడైన భగవంతుడు సంతోషించి, అతనికి బ్రహ్మజ్ఞానం బోధించాడు.

బ్రహ్మదేవుడు దినమంతా సృష్టికార్యములో నిమగ్నుడై సాయం సమయం అయ్యేసరికి అలసిపోయి, నిద్రించిన సమయంలో అతని ముఖం నుండి వేదాలు వెలువడినవి. సమయం కోసం వేచియున్న హయగ్రీవుడనే రాక్షసుడు ఆ వేదాలను దొంగిలించాడు. బ్రహ్మను దరిజేరడానికి ఇతరులకు సాధ్యముకాదు. రాక్షసుడు వేదాలను చదివేసి సముద్రగర్భంలో దాగున్నాడు. తెల్లవారుతుందనగా వేదాలు బాధతో మూల్గడం బాధపడుతూ మొరపెట్టుకొనడం విష్ణుమూర్తికి వినిపించినది. ఆయన మత్స్యావతారములో సముద్రంలోనికి చొచ్చుకొనిపోయి, రాక్షసుని హతమార్చి వేదాలను రక్షించి తెచ్చాడు. అంతలో బ్రహ్మదేవుడు మేల్కొన్నాడు. విష్ణువు తెచ్చిన వేదాలను కృతజ్ఞతతో నందుకున్నాడు. మళ్ళీ తన సృష్టికార్యాన్ని ప్రారంభించాడు.

ఈ కల్పములో సత్యవ్రతుడు వివస్వతునికి (సూర్యునికి) శ్రాద్ధదేవుడనే పేరుతో పుట్టి, విష్ణుదేవుని అనుగ్రహంవలన ఏడవమనువై వైవస్వతమనువుగా ప్రస్తుతం పాలిస్తున్నాడు. వేదాలను రక్షించిన తరువాత తెల్లవారగానే, మత్స్యావతరాన్ని మహావిష్ణువు చాలించాడు.

ప్రళయసమయంలో మైమరచి నిద్రించిన బ్రహ్మదేవుని ముఖాలనుండి వెలువడిన వేదాలను దొంగిలించిన రాక్షసుని సంహరించి, సత్యవ్రతునకు బ్రహ్మజ్ఞానాన్నిచ్చి, మనువుగా వెలయింపజేసిన ఆ పరమేశ్వరుని యొక్క ఈ మత్స్యావతారగాథను విన్నవారు, సకల సంసారబాధలనుండి విముక్తులౌతారు, అని శ్రీశుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పినట్లు, శౌనకాది మునులకు సూతుడు చెప్పాడు.

**హరిః ఓం తత్ సత్**

**అష్టమ స్కంధము సమాప్తం**

**ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము
# నవమస్కంధము

## వైవస్వత మనువు వంశము

### ఇళా వృత్తాంతము

మనువుల వంశాలనుగురించి ఇంకా వినగోరిన పరీక్షిత్తుతో శ్రీశుకయోగీంద్రుడు ఇలాగ చెప్పసాగాడు.

మహాప్రళయం సంభవించినప్పుడు, సమస్త సృష్టీలయించిపోయి, సూక్ష్మరూపంలో భగవానుని కుక్షియందుండి పోతుంది. మళ్లీ పునః సృష్టి ప్రారంభములో భగవానుని నాభినుండి దివ్యతేజస్సుతో ఒక పద్మము, దానిలో బ్రహ్మదేవుడూ ఉద్భవిస్తారు. సృష్టియావత్తూ యథా తథంగా ఆవిర్భవిస్తుంది. చతుర్ముఖ బ్రహ్మమానసము నుండి మరీచి మహర్షి ఉద్భవించాడు. మరీచికి కశ్యపుడు జన్మించాడు. కశ్యపునకు అదితికి వివస్వంతుడు (సూర్యుడు) జన్మించాడు. వివస్వంతునకు సంజ్ఞ అనే భార్యయందు శ్రాద్ధదేవుడు జన్మించాడు. అతడు మనువు అయి వైవస్వత మనువు అనబడ్డాడు. అతడు పుత్రసంతానాన్ని కోరుతూ వశిష్ఠుని అధ్వర్యాన ఒక యాగాన్ని చేయిస్తుండగా, అతని భార్య అయిన శ్రద్ధాదేవి హోత వద్దకు వెళ్లి తనకు పుత్రికా సంతానం కావాలని చెప్పినది. హోత ఆ విధంగానే పుత్రికా ప్రాప్తి కోసం వషట్కారం చెప్తూ హవిస్సును వ్రేల్చినాడు. తత్ఫలితంగా శ్రద్ధకు కుమార్తె జన్మించినది. ఆమె ఇళా అనబడినది. వైవస్వతుడు విస్మయంచెంది, వశిష్ఠునితోనిలా అన్నాడు. “ఆచార్యవరా! పుత్రుని కోరుతూ నేనీ యాగాన్ని చేయిస్తే, పుత్రిక జన్మించడం ఎలా సంభవించినది? మీ వంటి మహర్షుల ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యంలో ఈ అక్రమం ఎలాగ జరిగినది?” అని అడిగాడు. వశిష్ఠుడు జరిగిన విషయాన్ని తెలుసుకొని, మనువును ఓదార్చుతూ ఇలా అన్నాడు. “రాజా! హోత చేసిన తప్పిదం వలన ఇలాగ జరిగినది. అయినా చింతించ వద్దు. నేనీ బిడ్డను బాలునిగా మార్చుతాను.” అని చెప్పి, ఆదిపురుషుని ఆరాధించాడు. భగవానుడు కరుణించి అనుగ్రహించగా, ఇళా కన్య సుద్యుమ్న కుమారునిగా మారిపోయినది.

సుద్యుమ్నుడు పెద్దవాడై రాజ్యం చేస్తూ ఒకనాడు కొందరు అనుచరులతో గుఱ్ఱాలపై వేటకు వెళ్లాడు. ఉత్తర దిశగా పోయి పోయి, మేరు పర్వత ప్రాంతంలోనున్న కుమారవనంలో వీరంతా ప్రవేశించగానే, రాజుతో సహా అందరూ స్త్రీలుగా మారిపోయారు. వారి గుఱ్ఱాలు కూడ ఆడుగుఱ్ఱాలై పోయినవి. ఆ స్థలప్రభావానికి ఒక పూర్వ గాథ ఉన్నది....

ఈ వనములో శివ పార్వతులు కేళీవిలాసాలతో విహరిస్తుంటారు. ఒకనాడు కొందరు ఋషులు, శివదర్శనార్థం ఆ వనంలో ప్రవేశించే సరికి శివపార్వతులు ఏకాంతంగా వినోదిస్తున్నారు. ఋషుల రాకను గమనించిన జగన్మాత సడలియున్న తన వస్త్రాన్ని సర్దుకొని లేచిపోయినది. ఋషులు రాకూడని సమయంలో వచ్చినందుకు చింతించి, బదరికాశ్రమం వైపుకు సాగిపోయారు. అంతరాయానికి అసంతుష్టుడైన శంకరుడు, పార్వతిని మెప్పించాలని “ఇకనుండి ఈ వనంలో ఏ పురుషజీవి ప్రవేశించినా స్త్రీ జీవిగా మారిపోతాడులే” అని ఓదార్చాడు. శివ సంకల్ప ప్రభావంచే సుద్యుమ్నాదులు స్త్రీలుగా మారిపోయారు.

కన్యగా మారిన రాజా చెలికత్తెలుగా మారిన అనుచరులూ ఆ వనం వెలుపల విహరిస్తుండగా నొకనాడు చంద్రుని పుత్రుడైన బుధుడు, ఇళా కన్యను చూచి మోహించి, తన నివాసానికి కొనిపోయాడు. వారిద్దరికీ పురూరవుడనే

పుత్రుడు పుట్టాడు. ఈ విధమైన జీవితంతో విసుగెత్తిన ఇళ వసిష్ఠ మహర్షిని స్మరించినది. ఆయన వచ్చి, అంతా గ్రహించి ఆమెను మళ్లీ సుద్యుమ్నునిగా మార్చుమని ఈశ్వరుని ప్రార్థించాడు. శివుడు కనికరించి, తాను విధించిన నియమానికి భంగముకాని విధంగా ఆమె ఒకనెల స్త్రీగాను ఒక నెల పురుషునిగాను ఉండేటట్లు వరమిచ్చాడు. సుద్యుమ్నుడు మళ్లీ రాజ్యపాలన చేయసాగాడు. స్త్రీగానున్నప్పుడు మాత్రము అంతఃపురంలోనే ఉండేవాడు. అతనికి ఉత్కళుడు, గయుడు, విమలుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వారు ఉత్తర భాగాలకు రాజులయ్యారు. సుద్యుమ్నుడు పురూరవునకు రాజ్యాన్ని అప్పగించి, ప్రతిష్ఠానపురం విడిచి, తపస్సునకు వెళ్లిపోయాడు. ఈ విధంగా సూర్యవంశం నుంచి చంద్రవంశానికి రాజ్యం సంక్రమించినది.

సూర్యవంశం వృద్ధిచెందాలని వైవస్వతమనువు వంద సంవత్సరాలు శ్రీహరిని గూర్చి తపస్సుచేసినాడు. ఆయన అనుగ్రహంచే ఇక్ష్వాకుమనువునకు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూషకుడు, నరిష్యంతుడు, పృషధ్రుడు, నభగుడు, కవి అనే పదిమంది పుత్రులు కలిగినారు.

## పృషధ్రుని వృత్తాంతము

వైవస్వతమనువు కొడుకులలో నొకడైన పృషధ్రుని వసిష్ఠుడు గో సంరక్షణకు నియమించాడు. ఆలమంద అడవిలో నుండగా భోరున వర్షం కురిసినది. మందను ఒక చోటచేర్చి, అతడు అర్ధరాత్రివేళ చుట్టూ తిరుగుతూ, కాపలా కాస్తుండేవాడు. అంతలో ఒక పులి, ఒక గోవుపై లంఘించి పట్టుకొన్నది. గోవు అరుపువిని, పృషధ్రుడు తన ఖడ్గంతో ఒక్కవేటు వేశాడు. చీకటిలో ఆ వేటు పులియొక్క చెవుతో సహా ఆవు మెడను ఖండించినది. తెల్లవారిన తరువాత జరిగిన తప్పిదాన్ని తెలుసుకొని, అతడు గురువుకు తెలియజేశాడు. అప్పుడు వసిష్ఠుడు ఇలా అన్నాడు. "తెలిసిచేసినా, తెలియక చేసినా నీవు చేసినది గో హత్యయే కనుక నీవు క్షత్రియునిగా నుండదగవు. శూద్రునిగా సంచరించవలసినదే!" అని తీర్పు చెప్పాడు. పృషధ్రుడు గురు శాపాన్ని స్వీకరించి, వాసుదేవుని యందు మనస్సు నిలిపి, సర్వభూత హితరతుడై, దైవధ్యానంలోనే ఉండేవాడు. లౌకిక వ్యాపారాలను వీడి, జడుని వలె సంచరిస్తూ ఒక అరణ్యంలో దావాగ్నిలో చిక్కుకొని పరమ పదాన్ని పొందాడు.

కవి అనేవాడు చివరివాడు. అతనికి బాల్యమునుండి విషయాభిలాష లేకుండెను. అతడు పరమాత్మ యందే మనస్సు నిలిపి, పరమగతిని పొందాడు. కరూషునకు ముగ్గురు కుమారులు. వారు ఉత్తరదేశానికి పాలకులై వేద ధర్మరక్షకులైనారు. ధృష్టుని వల్ల ధార్ష్యమనే వంశం వర్ధిల్లినది. నృగుని వంశంలో సుమతి జన్మించి వంశవృద్ధి చేశాడు. నరిష్యంతుని వంశము కూడ బాగా విస్తరించినది. దిష్టునికి నాభాగుడనే కుమారుడు కలిగాడు. అతడు వైశ్యవృత్తిని అవలంబించాడు. ఈ వంశంలో అనేకులైన ప్రసిద్ధ చక్రవర్తులు జన్మించారు. వీరు వైశాలురు అని ప్రసిద్ధి గాంచారు.

## సుకన్య చరిత్రము

వైవస్వత మను పుత్రులలో శర్యాతి రాజు ప్రసిద్ధుడు. అతడు ధర్మశీలుడు, శ్రౌత ప్రక్రియలలో నేర్పు కలవాడు. అతనికి సుకన్య అనే పుత్రిక ఉండెను. ఆమె అందాలరాశి. ఆమెకు యుక్తవయస్సు వచ్చినా తండ్రి దృష్టిలో ఆమె ఇంకా చిన్నారి ముద్దుల పాపగానే ఉండెను. శర్యాతి రాజు ఒకనాడు పరివారముతో సహా చ్యవన మహర్షి ఆశ్రమం ఉన్న అడవికి వెళ్లాడు. తనతో సుకన్యను తీసుకొనివెళ్లాడు. ఆమె తన చెలికత్తెలతో ఆ అరణ్యంలో నాడుకొంటూ ఒకచోట ఒక పుట్టలో రెండు జ్యోతులు వెలుగుతుండడం చూచి, అవి ఏమిటో తెలుసుకోవాలనే చిలిపి కుతూహలంతో ఒక ముల్లుతో పుట్టలోని ఆ రెండు కన్నాలలో పొడిచినది. ఆ పుట్టలో నున్నది ఎన్నాళ్లుగానో తపస్సుచేసుకొంటున్న చ్యవన మహర్షి, అతని కండ్లకు ముల్లుగుచ్చుకొని బాధ కలిగించగా, రాజుతో వచ్చిన వారి మలమూత్రాలు బంధింపబడినవి. శర్యాతి రాజు తమవలన ఈ ఆశ్రమంలో ఏదో అపరాధం జరిగియుంటుందని ఊహించి, అందరినీ

ప్రశ్నించాడు. తాను చేసిన చిలిపి చేష్టను సుకన్య తండ్రితో చెప్పినది. వెంటనే రాజు పుట్టలోనున్న మహర్షి వద్దకు పోయి, అతన్ని అన్ని విధాల స్తుతించి, జరిగిన అపరాధానికి క్షమించుమని వేడుకొన్నాడు. ముని ప్రసన్నుడైనాడు. మునియొక్క మనోగతాన్ని తెలుసుకొన్న రాజు సుకన్యను చ్యవనునకిచ్చి వివాహంచేసి, ఆమె నచ్చట విడిచిపెట్టి, రాజధానికి మరలి వెళ్లిపోయాడు.

మిక్కిలి కోపిష్టి అయిన చ్యవనమహర్షికి సకల పరిచర్యలూ చేస్తూ, సుకన్య అతని మెప్పునూ, ఆదరాభిమానాలనూ పొంది, చాలా కాలం కాపురం చేసినది. ఒకనాడు ఆ ఆశ్రమానికి దేవవైద్యులైన అశ్వినీ కుమారులు వచ్చారు. చ్యవనుడు వారిని పూజించి, ఇలా ప్రార్థించాడు:

"ఓ దేవభిషగ్వరులారా! నా యొక్క ఈ ముసలితనాన్ని చూడండి. నాకు శరీర సౌందర్యాన్ని ప్రసాదించండి. నేను మీకు యాగాల్లో సోమపానంలోని భాగాన్నిస్తాను. సోమపానంచేసే సమయంలో మీకు ఆ పాత్రను అందిస్తాను. ఇంతవరకూ మీకు ఆ అర్హత లేకుండెను కదా!" అనగానే అశ్వినీ దేవతలు సంతోషించి సరే అన్నారు. ఆ చెరువులో స్నానం చేసి రమ్మన్నారు. నడవలేని ముసలిమునిని ఎత్తుకొని తీసుకొనివెళ్లి, చెరువులో ముగ్గురూ మునిగి, లేచేసరికి, ఆశ్చర్యం, అద్భుతం, దివ్యసుందరమూర్తులూ, మనమోహనాకారులూ అయిన ముగ్గురు ఒక్కలాంటి యువకులు సూర్యకాంతితో ప్రకాశిస్తూ కనిపించారు. వారిలో తన భర్త ఎవరో తెలుసుకొనలేని సుకన్య తన పాతివ్రత్యానికి పరీక్షపెట్టకుండా, తన భర్త ఎవరో తాను తెలుసుకొనేటట్టు చేయుడని అశ్వినీ దేవతలను ప్రార్థించినది. అశ్వినీ దేవతలు ఆమెయొక్క సచ్ఛీలానికి సంతసించి, యౌవనసౌందర్యాలతో మెరిసిపోతున్న చ్యవనుని తీసుకొనివచ్చి ఆమెకు ఒప్పజెప్పి నిష్క్రమించారు.

ఒకనాడు శర్యాతి రాజు ఒక యాగాన్ని చేయదలచి, కుమార్తెను, అల్లుణ్ణీ ఆహ్వానించడానికి చ్యవనాశ్రమానికి వచ్చాడు. అక్కడ తన కుమార్తె, ఒక దివ్యమోహన సుందరాంగునితో ఉండడం చూచి అనేక భయసందేహాలతో నిండిపోయిన మనస్సుతో వణికిపోయాడు. పట్టరాని ఆనందోత్సాహాలతో ఎదురు వచ్చి ప్రణమిల్లిన సుకన్య నమస్కారాలను కూడ స్వీకరించి, దీవించలేక ముఖముత్రిప్పుకున్నాడు. చివరకు ఎలాగో అడిగాడు: "గొప్ప మనువంశంలో జన్మించిన నీవు ఇలాంటి నీచకర్మనెలాగ చెయ్యగలిగావు? పుణ్యాత్ముడైన ఆ చ్యవనమహర్షి ఎక్కడున్నాడు? నీతోనున్న ఇతడెవ్వడు? పూజనీయుడైన భర్తను మోసగించి ఈ విధంగా పరపురుషునితో సాంగత్యం చేసి, ఇటుకన్న తండ్రినీ, కట్టుకొన్న భర్తను దుర్గతి పాలుచేసిన పాపాత్మురాలివి. నీ ముఖం చూడరాదు" అని వెళ్లిపోతున్న తండ్రిని చూచి, దంపతులిద్దరూ కిలకిలా నవ్వసాగారు. వెళ్తూ ఆగిపోయి, వెను దిరిగి చూస్తున్న తండ్రితో పరమ పతివ్రత అయిన సుకన్య ఇలా అన్నది:

"తండ్రీ! నేనెలాంటి పాపమూ చేయలేదు. ఈయనెవరో కాదు. నీ అల్లుడైన భార్గవుడే గాని ఇతరుడు కాదు. నీవు ఈయనను ఆనందముతో ఆదరించు." అని వృత్తాంతమంతా వివరించి చెప్పగా, శర్యాతి సంతోషంతో కూతురుని చేరదీసి, ఆదరంతో ఆశీర్వదించాడు. చ్యవన మహర్షి భార్యతోపాటు వెళ్లి మామగారి యాగాన్ని నిర్వహించాడు. ఇచ్చిన మాట ప్రకారము చ్యవనుడు అశ్వినీ దేవతలకు సోమరసాన్ని గిన్నెలో సమర్పించాడు. అది చూచి దేవేంద్రుడు కోపగించి చ్యవన మునిపైన వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. చ్యవనుడు తన తపశ్శక్తిచే ఆ వజ్రాయుధాన్ని ఇంద్రుని భుజం మీదనే స్తంభించి పోయేటట్టుగా చేశాడు. చేసేదిలేక ఇంద్రుడు తనతప్పును ఒప్పుకొనవలసి వచ్చినది. ఈ విధంగా దేవవైద్యులైన అశ్వినీ దేవతలు అర్హత లేకపోయినా చ్యవన ముని ప్రభావం వల్ల సోమ భాగాన్ని పొందగలిగారు.

శర్యాతి యొక్క ముగ్గురు పుత్రులలో ఆనర్తునకు రైవతుడు పుత్రుడు. అతడు సముద్రములో కుశస్థలి అనే నగరాన్ని నిర్మించాడు. అతడు ఆనర్తాది దేశాలను పాలించిన చక్రవర్తి. అతనికి నూరుమంది కుమారులు, రేవతి

అనబడే కుమార్తె కలిగారు. గొప్ప కీర్తిమంతుడు, శక్తిమంతుడు, అయిన రైవతుడు, తన కుమార్తెకు ము
తగిన వరుడెవరుంటారో తెలుసుకొనగోరి, రేవతితో సహా బ్రహ్మ వద్దకు వెళ్లాడు. అక్కడ అప్పటికి గంధర్వ
గాన సభ జరుగున్నది. కొద్దిసేపు ఆగి సభముగియగానే బ్రహ్మదేవుని సమీపించి, తన కోరిక తెలు
బ్రహ్మదేవుడు నవ్వి, ఇలా అన్నాడు.: "రాజా! నీవు ఇక్కడికి వచ్చినప్పటినుండి, నాలుగు యుగాలూ
పునరావృతమైనవి. మానవకాలమానంలో కొన్ని వేల సంవత్సరాలు సాగిపోయినవి. ఈ కన్యకోసం నీవు
దృష్టిలో పెట్టుకొన్నావో వారే కాదు, వారి వంశాలన్నీ అంతరించి పోయాయి. ఇప్పుడే నీవు భూలో
భూభారాన్ని పోగొట్టడానికి శ్రీమన్నారాయణుడు బలరామావతారాన్ని ఎత్తియున్నాడు. ఆయనకు ఈకన్యా
వివాహం చెయ్యి" బ్రహ్మయొక్క ఆదేశం ప్రకారం రైవతుడు రేవతిని బలరామునకిచ్చి వివాహం
బదరికాశ్రమానికి వెళ్లిపోయాడు.

## నాభాగుడు

వైవస్వత మనుపుత్రులలో నొకడైన నభగుని కుమారుడు నాభాగుడు. అతడు చాలా బుద్ధిమంతుడు. విద్యన
నెక్కువ ఆసక్తి కలవాడు కనుక అతడు గురువు వద్దనే ఎక్కువ కాలం ఉండిపోయాడు. అంతలో తండ్రి
మిగిలిన సోదరులే పంచుకొని, నాభాగునికేమీ మిగల్చలేదు. అతడు చదువు ముగించుకొని వచ్చి, తన
అని సోదరులను అడుగగా, వారు, "పోయి, తండ్రిగారి నడుగు" అని పంపించి వేస్తారు. తండ్రి ఏమీ
"నాయనా! నీవు ఇదేమీ పట్టించుకొనకు. వారినుండి ఏమీ ఆశించకు. అంగిరసులు పన్నెండు రోజుల
చేస్తున్నారు. వారికి వైశ్వదేవము అనే కర్మకు సంబంధించిన రెండు సూత్రాలు తెలియవు. నీవు అక్కడకుపో
ఆసూత్రాలను చెప్తే, వారు సంతసించి, తాము స్వర్గానికి వెళ్లిపోతూ, ఆయాగంలో మిగిలిన ధనాన్ని నీకి
అని చెప్పిన తండ్రి మాటల ప్రకారము నాభాగుడు అలాగే చేశాడు.

అంగిరసులు ఇచ్చిపోయిన ధనాన్ని నాభాగుడు. సేకరిస్తుండగా ఉత్తర దిశనుండి ఒక పురుషుడు
అంతానాది అని లాగుకొనబోయెను. అంగిరసులు తనకు ఆ ధనాన్నిచ్చి వెళ్లారని నాభాగుడు విన్న
వినకుండా" పద, నీ తండ్రి ఈ వివాదాన్ని ఎలాగ తీర్చితే అలాగే చేద్దాం" అని ఆ వ్యక్తి అన్నాడు.
"యజ్ఞ భూమిలో మిగిలిన ధనమంతా రుద్రునికి చెందుతుందని పూర్వము ఋషులు చెప్పియున్నారు
ధనము మహాదేవుని సొత్తు" అని నభగుడు తీర్పు చెప్పాడు. అప్పుడు నాభాగుడు రుద్రునకు నమస్క
దేవా! ఈ ధనము నీకు చెందుతుందని తెలియక, అంగిరసులు నాకిచ్చారు కదా అని, నాకు ఏ ఇతర
నేను దీనిని స్వీకరించాలనుకొన్నాను. తెలియక చేసిన నా తప్పిదానికి, నన్ను క్షమించుమని ప్రార్థిస్తున్నా
వేడుకొన్నాడు.

అప్పుడు రుద్రుడు సంతసించి, "నాభాగా! నీ తండ్రి ధర్మ నిర్ణయం చేశాడు. నీవు సత్య నిష్ఠను
వైశ్వదేవ మంత్రద్రష్టవైన నీకు బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాను. ఈ సత్రయాగ శేషధనాన్ని నీకే ఇచ్చివే
అని చెప్పి, అంతర్ధానమయ్యాడు.

నా భాగుడు ఒక గొప్ప వేదాంతి అయినాడు.

## అంబరీషుడు

మహనీయుడైన నాభాగునకు యోగ్యుడైన పుత్రుడు అంబరీషుడు. అతడు మహాభాగవతుడు.
బ్రాహ్మణశాపముకూడ పని చెయ్యనంతటి పుణ్యాత్ముడు. సప్తద్వీపములతో కూడియున్న భూమండలాన్ని పరి
అపరిమితమైన ఐశ్వర్యాన్ని కలిగి యున్నా, అవి అన్నీ స్వప్నతుల్యాలనీ, ఐశ్వర్యము నరక హేతువనీ, అతని

వాసుదేవునియందు, భగవద్భక్తులైన సాధుపురుషులయందు అతనికి అచంచలమైన భక్తి ప్రపత్తులుండెను. అతనిమనోబుద్ధులు సర్వదా శ్రీమన్నారాయణుని పాదపద్మాలయందే లగ్నమై యుండేవి. గర్వమూ అహంకారమూ అతనిలో ఏ కోశానా లేవు.

**సీ॥ చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద పలుకులు హరిగుణ పఠనమంద**
**కరములు విష్ణు మందిరమార్జనములంద శ్రవములు హరికథా శ్రవణమంద**
**చూపులు గోవింద రూప వీక్షణమంద శిరము కేశవ నమస్కృతులయంద**
**పదములీశ్వర గేహ పరిసర్పణములంద కామంబు చక్రి కైంకర్యమంద**
**తే॥ సంగమచ్యుత జన గుణ సంగమంద ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద**
**రసన తులసీ దళములంద రతులు పుణ్య సంగతుల యంద యా రాజచంద్రమునకు** 82

ఆ రాజచంద్రుని (అంబరీషుని) చిత్తమెల్లప్పుడూ శ్రీహరి పాదాల మీదనే, వాక్కు శ్రీహరి గుణ సంకీర్తన మందే, చేతులు విష్ణుమందిరాలను శుభ్రపరచడంలోనే, చెవులు శ్రీ హరికథలను వినడంలోనే, చూపులు గోవిందుని సుందరరూపాన్ని వీక్షిస్తుండడమందే, శిరము కేశవునకు నమస్కరించడమందే, పాదాలు విష్ణుమందిర ప్రదక్షిణల యందే, కోరిక శ్రీహరికి అర్పితమవడమందే, చెలిమి విష్ణుభక్తుల పాదసేవయందే, ముక్కు మురవైరి భక్తుల పాదపద్మ సుగంధము వాసన చూచుటయందే, నాలుక విష్ణు ప్రియమైన తులసీ దళాలయందే, మక్కువ (ప్రీతి) శ్రీహరికి సంబంధించిన పుణ్యవిషయాల యందే, ఎల్లప్పుడూ ఉంటాయి. ఈ విధముగా అంబరీష చక్రవర్తి మనో వాక్కాయములచే శ్రీమన్నారాయణుని సేవిస్తూ రాజ్యాన్ని ప్రజారంజకంగా పరిపాలిస్తుండేవాడు. లోకకల్యాణార్థం అశ్వమేధాది అనేకమైన యజ్ఞాలను, వసిష్ఠ, అసిత, గౌతమాది ఋషుల ఆధ్వర్యాన జరిపించేవాడు. ఎన్ని ఐశ్వర్యాలున్నా, తాను మాత్రము నిత్య వైరాగ్యముతో మెలగేవాడు. అతని రాజ్యములోని ప్రజలు హరికథాశ్రవణములోనూ, హరినామసంకీర్తనంలోనూ ఆనందంగా కాలం గడిపేవారు. అతడు సంసార వ్యామోహాన్ని కూడా తొలగించుకొని, పరిశుద్ధాంతరంగుడై, ఏకాంత భక్తి పరవశుడై యుంటుండగా, సంతుష్టుడైన శ్రీహరి అతని రక్షణ గురించి తన సుదర్శన చక్రాన్ని నియమించాడు.

అంబరీషునిధర్మపత్ని ఆయనకు అనుకూలవతి, పుణ్యశీల. అంబరీషుడు తన భార్యతో కలిసి ఒక సంవత్సరం ద్వాదశీ వ్రతాన్ని చేసినాడు. కార్తిక శుక్ల ఏకాదశినాడు ఉపవాసముండి, ద్వాదశినాడు యమునా నదిలో స్నానం చేసి, మధువనంలో నారాయణుని దర్శించి అర్చించినాడు. భగవద్భక్తులను సేవించి, భూరి దానాలు ఇచ్చి, అందరికీ మృష్టాన్న భోజనాలు పెట్టించాడు. ఆ తరువాత ఉపవాసానంతరం భోజనం స్వీకరించడానికి సిద్ధంగా నుండగా దూర్వాసమహర్షి అతిథిగా వచ్చాడు. అంబరీషుడు మహర్షియొక్క కాళ్లు కడిగి పూజించి, ఆసనం ఇచ్చి, భోజనం చేయుడని ప్రార్థించాడు. దూర్వాసుడు అంగీకరించి, కాళిందీనదిలో స్నానం చేసి వస్తానని చెప్పి వెళ్లాడు. అతడు అక్కడ జపం చేస్తూ చాలాసేపు ఉండిపోయాడు. సమయం మించిపోతున్నది. అప్పటికి ద్వాదశి పారణం చెయ్యడానికి ఒక్క ఘడియ కాలం మాత్రమే మిగిలియున్నది. ఈలోగా భోజనం చెయ్యకపోతే వ్రత భంగమవుతుంది. అతిథిని విడిచి భోజనం చేస్తే అపచారం అవుతుంది. ఈ ధర్మసంకటస్థితిలో ఏమి చెయ్యాలో తోచక రాజు శాస్త్రసమ్మతమైన మార్గాంతరం చెప్పుడని పండితులను కోరినాడు. అప్పుడు వారు బాగుగా యోచించి ఈ విధంగా సలహా ఇచ్చారు:

**ఆ॥ అతిథి పోయి రామి నధిప యీ ద్వాదశి పారణంబు మానఁ బాడిగాదు**
**కుడువకుండ కాదు కుడుచుటయును కాదు సలిల భక్షణంబు సమ్మతంబు.** 99

రాజా! అతిథి వెళ్లి, చాలా సేపైనా ఇంకా రాలేదు కనుక ఈ ద్వాదశి పారణం సకాలంలో చెయ్యాలి గనుక మంచినీటిని సేవిస్తే ఉపవాసం ముగించి నట్లూ అవుతుంది, అతిథి గురించి భోజనం చెయ్యకుండా వేచియున్నట్టూ

అవుతుంది. ఇది ధర్మ సమ్మతమే! అని శాస్త్రజ్ఞులు చెప్పారు. ఆప్రకారమే రాజు శ్రీహరిని స్మరించి, తులసి తీర్థాన్ని సేవించి, తపస్వి రాక కోసం ఎదురు చూస్తుండెను.

యమునలో స్నానము ముగించి వచ్చిన మునిని రాజు సగౌరవముగ ఆహ్వానించి ఆసనం చూపాడు. ముని తన తపశ్శక్తిచే విషయం తెలుసుకొన్నాడు. క్రోధ పరవశుడై కంపించిపోయాడు. "ఈ ఘాతకుడు ఐశ్వర్య మదముతో కన్నుమిన్నుగానక అతిథిని అవమానించాడు. నన్ను భోజనానికి పిలిచి తానే ముందుగా ఆరగించి కూర్చున్నాడు. వీడు విష్ణు భక్తుడు కాడు, ధర్మభ్రష్టుడు. నా శక్తి ఏమిటో వీనికి చూపిస్తాను." అంటూ పండ్లు పటపట కొరుకుతూ, జేవురించిన ముఖముతో రుద్రుడై తన సిగలోని ఒక జడను పెరికి, దానిని ఒక ఆయుధ పాణి అయిన కృత్యగా రూపొందించి, అంబరీషునిపైకి ప్రయోగించాడు. (కృత్య అంటే స్త్రీ రూపంలోనున్న ప్రళయ కాలాగ్ని). కృత్య శూలపాణియై, భయంకరంగా విజృంభిస్తూ రాజుపైకి ఉరికినది. అతని రక్షణకై ఎల్లప్పుడూ సిద్ధముగానున్న సుదర్శన చక్రము శ్రీహరి ఆదేశాన్ని అనుసరించి కృత్యను హతమార్చి ముని వెంటబడినది. దూర్వాసుడు ప్రాణ భయంతో పరువెత్తి మేరుపర్వత గుహలో దాగుకొన్నాడు. విష్ణు చక్రము కారుచిచ్చులాగ అతనిని వెంబడించగా, అతడు అక్కడి నుండి పారిపోయాడు. అతడెక్కడెక్కడికి పారిపోతుంటే ఆ చక్రము అక్కడక్కడికి వెంటబడి తరుముతూ ప్రాణభయాన్ని కలుగజేసేది. ఏలోకానికి వెళ్లినా తరుముకొని వస్తున్న విష్ణు చక్ర జ్వాలలకు తట్టుకొనలేక, దూర్వాసుడు బ్రహ్మదేవుని వద్దకు పోయి శరణువేడాడు. "నేను, రుద్రుడు, ఇంద్రాదులు అందరమూ ఆ మహా విష్ణువు యొక్క అధీనములోనే ఉన్నవారము కనుక ఆయన యొక్క చక్రాయుధాన్ని నిరోధించే శక్తి మాకులేదు" అని బ్రహ్మ అతనిని పంపించివేశాడు. అతడు శివుని వద్దకు పోయి రక్షింపుమని వేడుకొనగా, శివుడు కూడా అలాగే చెప్పి ఆ మహావిష్ణువునే శరణు వేడుకొనుమని సలహా చెప్పాడు. దూర్వాసుడు వైకుంఠలోకానికి పోయి, శ్రీమన్నారాయణునితో ఇలాగ మొరపెట్టుకొన్నాడు: "హే ప్రభో! భక్తవరదా! ఆర్తత్రాణ పరాయణా! ఈ చక్రజ్వాలలనుండి నన్ను రక్షించు. రక్షించు. నీకు ఇష్టుడైన నీ దాసునికి కీడుతలపెట్టినందుకు నాకు తగిన శాస్తి జరిగినది. నా యొక్క తప్పును మన్నించి, నన్ను క్షమించు. నీ యొక్క నామము స్మరించినంతనే పాపాత్ముడైనా పవిత్రుడై పరమసుఖాన్ని పొందుతాడు కదా! శ్రీహరీ, నన్ను బ్రోవవా?" అని, విష్ణు పాదాలను పట్టుకొని పడియున్న దూర్వాసుని లేవనెత్తి శ్రీహరి ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! నేను భక్తపరాధీనుడను గనుక అస్వతంత్రుడను. పవిత్రమైన భక్తిలతలతో భక్తులు నన్ను బంధించి వేస్తారు. వారికి నేనే సర్వస్వము గనుక వారియొక్క యోగక్షేమాలను పరిరక్షించాలి. వారు నాకు లక్ష్మీదేవి కంటే ప్రియతములు. వారి వెంటనే నేనుంటాను.

ఆ॥ **తనువు మనువు విడిచి తనయుల చుట్టాల నాలివిడిచి సంపదాళి విడిచి**
**నన్నె కాని యన్యమెన్నడు నెరుగనివారివిడువనెట్టి వారినైన.** 121

ఇంద్రియాలనరికట్టి, పుణ్యాత్ములు నన్ను తమ మనస్సులో నిలుపుకొంటారు. పతివ్రతకువలె వారికి అన్యచింతయే ఉండదు.

క॥ **సాధుల హృదయము నాయది సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్**
**సాధుల నేన యెరుంగుదు సాధులెరుంగుదురు నాదు చరితము విప్రా!** 123

సద్బ్రాహ్మణులకు విద్య, తపస్సూ ముక్తిని కలిగిస్తాయి. కాని ఆ విద్యాతపస్సులే దుర్జనులైన బ్రాహ్మణులకు కీడు చేయకుండా ఉండవు సుమా! సాధువుల్లో నా తేజము విరివిగానుంటుంది. వారిని హింసించే వ్యక్తులకు ఆ తేజమే భయాన్ని కలిగించి సంతోషాన్ని హరించివేస్తుంది. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు రక్షింపబడడానికి ఒకే ఒక మార్గమున్నది. నీ యొక్క దురాగ్రహానికి గురి అయిన ఆ సాదుసత్తమునే శరణువేడితే, సద్గుణ సంపన్నుడూ,

దయామయుడూ, సర్వజన వినుతుడూ అయిన ఆ భక్త - అంబరీషుడే నీకు అభయమివ్వగలడు. నీవుపోయి అతనినే శరణువేడుకొనుము." అని శ్రీహరి ఆనతిచ్చిన వెంటనే దూర్వాసుడు పరుగు పరుగున పోయి, పరమ భాగవతుడైన అంబరీషుని పాదాలను వదలకుండా పట్టుకొన్నాడు. ఆ రాజు దయతో కాళ్లు వెనక్కి లాక్కొని సుదర్శన చక్రాన్ని ఇలా స్తుతించాడు.

సీ॥ **నీవపావకుడవు నీవ సూర్యుండవు నీవ చంద్రుండవు నీవ జలము**
**నీవ నేలయు నింగినీవ సమీరంబు నీవ భూతేంద్రియ నికర మీవ**
**నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము**
**నీవలోకేశులు నీవ సర్వాత్మయు నీవ కాలంబును నీవజగము**

తే॥ **నీవ బహుయజ్ఞ భోజివి నీవ నిత్య మూలతేజంబు నీకునే మ్రొక్కువాడ,**
**నీరజాక్షుండు చాలమన్నించునట్టి శస్త్ర ముఖ్యమ కావవే చాలు మునిని.** 129

అని సుదర్శనచక్రాన్ని స్తుతించి, "నేను నిత్యమూ ఆరాధించే సర్వాంతర్యామియైన శ్రీహరి ఈ బ్రాహ్మణోత్తమునకు శుభమొనరించుగాక." అని ప్రార్థించగా సుదర్శనం తరలి వెళ్లిపోయినది.

దుర్వాసుడు శాంతిని పొంది, సంతోషంగా రాజును ఆశీర్వదించాడు. "ఓ రాజశ్రేష్ఠుమా! నా తప్పును మన్నించి నన్ను కాపాడినావు. శ్రీహరి పాద సేవాతత్పరుడవైన నీలో పరమ భాగవతునకు ఉండవలసిన సకల సద్గుణాలూ మూర్తీభవించియున్నవి. నీకీర్తిని దేవతలూ, మానవులూ, అందరూ కొనియాడుచుందురు." అని, ప్రశంసించాడు.

అంబరీషుడు మహర్షిని సకల - అతిథి మర్యాదలతో సత్కరించి, సుష్ఠుగా మృష్టాన్నము పెట్టి తృప్తిపరచాడు. దూర్వాసుడు సంతుష్టుడై, రాజునాశీర్వదించి నిష్క్రమించాడు. అంబరీషుని ద్వాదశీవ్రతము నిరాతంకముగా శుభప్రదముగా ముగిసినది.

దుర్వాసుడు విష్ణుచక్ర భయంతో పరువులెత్తి తిరిగివచ్చేసరికి మానవకాలమానములో ఒక సంవత్సరం గడిచిపోయినది. అంతవరకూ అంబరీషుడు ఋషి రాకకై ఎదురుచూస్తూ జలభక్షణముతోనే ఉంటూ వాసుదేవారాధన చేస్తూవచ్చాడు. చివరకు రాజ్య భారాన్ని పుత్రులకు అప్పజెప్పి, సర్వసంగపరిత్యాగియై వనవాసియై, వాసుదేవసాన్నిధ్యాన్ని పొందాడు.

## ఇక్ష్వాకు వంశము - మాంధాత

అంబరీషుని మనుమడైన రథీతరునికి అంగిరసముని వరప్రభావాన బ్రహ్మతేజస్సుతో పుట్టిన పుత్రులు. ఆంగిరసులనబడే బ్రాహ్మణులుగా ప్రసిద్ధులైనారు.

ఒకనాడు వైవస్వతమనువు తుమ్మగా ముక్కునుండి ఇక్ష్వాకువు పుట్టాడు. అతడు గొప్ప కీర్తిమంతుడై సూర్య వంశానికి ప్రభువైనాడు. అతని యొక్క వందమంది పుత్రులలో వికుక్షి, నిమి, దండకుడు పెద్దవాళ్లు. వీళ్లు హిమాలయ, వింధ్య పర్వతాల మధ్యనున్న ప్రాంతాలను పాలించగా, మిగిలిన వారు తూర్పు, పశ్చిమ, దక్షిణ భూభాగాలను పాలించారు.

ఒకనాడు ఇక్ష్వాకువు అష్టకశ్రాద్ధము చేయదలచి పెద్దకొడుకైన వికుక్షిని పిలిచి, పరిశుద్ధమైన మాంసఖండాన్ని తెచ్చిపెట్టుమన్నాడు. అతడు అడవుల్లో తిరిగి అలసిపోయి, చివరకు ఒక కుందేలును చంపాడు. ఎక్కువగా ఆకలి వెయ్యడం చేత, ఆ కుందేటి మాంసంలో కొంత భాగం తిని, మిగిలినది తెచ్చి తండ్రికిచ్చాడు. కులగురువైన వశిష్ఠుడు ఈ విషయాన్ని తెలుసుకొని, ఆ మాంసం పనికి రాదని చెప్పగా, తండ్రియైన ఇక్ష్వాకువు కోపగించి,

వికుక్షుని దేశాంతరం పొమ్మన్నాడు. వికుక్షి కుందేటి మాంసం తిన్నందున శశాదుడని పిలువబడ్డాడు. కొన్నాళ్లకు ఇక్ష్వాకువు సర్వసంగ పరిత్యాగియై, యోగియై, శ్రీహరి చింతనలోనే దేహత్యాగము చేశాడు. తరువాత వికుక్షి (శశాదుడు) చాలా కాలము రాజ్యము చేసి, అనేక యాగాలు చేసి, పురంజయుడనే పుత్రుని కన్నాడు. ఈ శశాద పుత్రుడు విష్ణుతేజస్సు కలవాడై, దేవదానవుల యుద్ధాలలో దేవతల తరఫున పోరాడి అనేక మంది దానవులను హతమార్చి, వారి పురాలను జయించడం చేత పురంజయుడనబడ్డాడు. ఒకసారి విష్ణుమూర్తి ఆదేశించడం చేత ఇంద్రుడు ఆబోతు అయి, తన మూపురం మీద పురంజయుని ఎక్కించుకొని, రాక్షసులతో యుద్ధముచేసి పురంజయుని శరశక్తిచే విజయం సాధించాడు. అందుచేతనే పురంజయుని ఇంద్రవాహనుడనీ, కకుత్స్థుడనీ (ఆబోతునెక్కినవాడని) పేర్లు వచ్చాయి. తరువాత అతని వంశములోనివారు కాకుత్స్థులనబడ్డారు. ఈ వంశములో యవనాశ్వుడనే రాజు ప్రసిద్ధిగాంచాడు.

ఇక్ష్వాకు వంశములోని యువనాశ్వునకు వందమంది భార్యలున్ననూ సంతానము కలుగలేదు. ఆతడు నిస్పృహ జెంది, భార్యలతో సహా అరణ్యవాసానికి వెళ్లాడు. అక్కడ మునులు కనికరించి, ఇంద్రుని ఉద్దేశించి పుత్రకామేష్టి యాగము చేసి, ఒక కలశంలో మంత్రజలం సిద్ధము చేసి ఉంచారు. ఆ జలాన్ని ఉదయాన్నే ప్రథమ భార్యచే త్రాగించవలసి యుండెను. కాని విధివిలాసము చేత అర్ధరాత్రివేళ రాజుకు దాహం వెయ్యగా, అతడు యజ్ఞ శాలలో నున్న కలశంలోని జలాన్ని త్రాగివేశాడు. ఉదయాన్నే మునులు వచ్చి ఆ జలాన్ని పట్టపురాణిచే త్రాగించాలని చూచేసరికి కలశం ఖాళీగానున్నది. ఏమి జరిగినదని అందరినీ అడుగగా రాజే త్రాగినట్లు తెలుసుకొని, విధి నిర్ణయం అలాగున్నదని ఊరుకున్నారు.

కొన్నాళ్లకు రాజు గర్భధారణ చేయగా అతని పొట్ట చీల్చుకొని ఒక మగ బిడ్డడు వచ్చాడు. రాజు మరణించినా దైవానుగ్రహం చేత సిద్ధి పొందాడు. ఉద్భవించిన బిడ్డడు సప్తద్వీపాలను పాలించే చక్రవర్తి కాగలడని మునులు తెలుసుకొన్నారు. బిడ్డడు తల్లి పాలులేక ఆకలితో అలమటించిపోయి, నిర్విరామంగా ఏడుస్తుంటే ఇంద్రుడు వచ్చి, తన అనుగ్రహంచే పుట్టిన ఆ బిడ్డను "మామ్ ధాతా" (అనగా "వత్సా! ఏడ్వకు, నన్ను పానము చెయ్యి" అని అర్థము) అని ఓదార్చుతూ, తన చూపుడు వేలును చీకడానికి బిడ్డడి నోటిలో పెట్టి అమృతం స్రవించేటట్టు చేశాడు. అతని పేరు మాంధాతగా నిలిచిపోయినది. మాంధాత పెద్దవాడై సప్తద్వీపాలకూ చక్రవర్తి అయ్యాడు. రావణుని వంటి పరాక్రమశాలురను కూడా శిక్షించాడు. అందుచేతనే అతనిని త్రసదస్యుడన్నారు. అతడు అనేక యజ్ఞయాగాదులను చేయించాడు. అతనికి శతబిందుని పుత్రిక అయిన బిందుమతి యందు పురుకుత్సుడూ, అంబరీషుడూ, ముచుకుందుడూ అనే పుత్రులూ, యాభైమంది పుత్రికలూ కలిగారు. అతడు మహా విష్ణువును ఆరాధించేవాడు.

## సౌభరి

సౌభరి అనే గొప్ప మహర్షి యమునానదిలో నీటిమధ్య మునిగి తపస్సు చేసుకొంటుండగా, ఒక చేపల జంట ఆడుకోవడం అతని కంటబడినది. కర్మవశాత్తు ఆ దృశ్యము అతనిలో కాపురము చెయ్యాలనే కోరికను రేకెత్తించినది. సౌభరి వచ్చి మాంధాతను, తన యాభైమంది పుత్రికలలో ఒక్కతెను తనకు ఇమ్మని కోరినాడు. రాజు ఆ ముసలివగ్గును వరించడానికి తన కుమార్తెలు ఇష్టపడరనే అనుమానంతో "సరే ఇస్తాను గాని, వారిలో ఎవ్వతె ఇష్టపడి నిన్ను వరిస్తే, ఆమెనిస్తాను" అని చెప్పాడు. అప్పుడు ముని అతని ఆంతర్యాన్ని తెలుసుకొని, తన యోగ శక్తిచే దేవతా స్త్రీలనుకూడా మోహింపజేయగల దివ్యసుందరరూపాన్ని ధరించి రాజగృహానికి వెళ్లాడు. యాభైమంది కన్యలూ అతనిని వరించగా, మాటకు కట్టుబడిన మాంధాత చక్రవర్తి కన్యలందరినీ సౌభరికిచ్చి వివాహం చేశాడు. సౌభరి యాభై రూపాలను దాల్చి, భార్యలందరితోనూ స్వర్గతుల్యమైన ఇంద్రియ భోగాలననుభవిస్తూ, ఎంత అనుభవించినా తనివి తీరక

అసంతుష్టుడై, పూర్వ సంస్కారబలముచే ఒకనాడు ఇలాగ తలపోశాడు: "అయ్యో నేను చేసిన దేమిటి? ఎంతో తపశ్శక్తిని సంపాదించిన నాకు ఈ దుర్గతి ఏమిటి? మీన మిథునాన్ని చూచినంతనే నా మనస్సెందుకు చలించిపోవాలి? ఎంత అనుభవించినా తనివితీరని ఈ విషయలంపటంలోనే నెందుకు ఇలా చిక్కుకొన్నాను? నా తపశ్శక్తి అంతా వమ్ము ఐపోయింది. నేను భ్రష్టునిగా మిగిలిపోయాను. లోకంలో ఒక్క భార్యయే గృహస్థుని సంసార కూపంలో ముంచివేస్తుంది కదా, మరి నన్ను ఈ యాభైమంది భార్యలూ, ఐదువేలమంది పుత్రులూ నరకంలో ముంచకుండా ఉంటారా? నన్నుచూచి మహాత్ములు పరిహసించకుండా ఉంటారా? అజ్ఞానివలె ఎంత మూర్ఖుడనయ్యాను! శ్రీహరి చింతనామృతపానంలో నున్న ఆనందంతో పోల్చిచూస్తే, ఈ క్షుద్రమైన విషయసుఖాలేపాటివి?" అని పరితపించినవాడై, తన శేషజీవితాన్ని భగవద్ధ్యానంలో గడపడానికి అరణ్యానికి వెళ్లిపోయాడు. పతివ్రతలైన అతని భార్యలుకూడ అతనిని అనుసరించారు. సౌభరి తీవ్రమైన తపమాచరించి, శరీరాన్ని కృశింపచేసి, తపోజ్వాలలను పుట్టించుకొని, ఆ జ్వాలలకు ఆహుతి అయి, పరమాత్మ సాయుజ్యాన్ని పొందాడు. పుణ్యశీలలైన అతని పత్నులు కూడ అతనిని అనుసరించారు.

విషయసుఖాలను అనుభవించాలనే చిరుసంకల్పమే మనుజుని అధఃపతనానికి దారి తీయగలదని ఈ సౌభరి వృత్తాంతం ద్వారా తెలియవస్తుందని శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

## ఇక్ష్వాకు వంశము - హరిశ్చంద్రుడు)

మాంధాత వంశములోని ఒకరాజైన సత్యవ్రతుడు (ఇతడే తరువాత త్రిశంకుడనబడ్డాడు) మానవ శరీరముతో స్వర్గానికి వెళ్లదలచి, వశిష్ఠ మహర్షి చేత యజ్ఞాలు చేయించ సంకల్పించాడు. సృష్టికి విరుద్ధమైన ఈ విచిత్రకార్యాన్ని చేపట్టటానికి వసిష్ఠుడు, అతని పుత్రులు నిరాకరించారు. అతడు తన పట్టువిడువనందున నీవు చండాలుడవు కమ్మని శపించారు. అతడు అప్పుడు వశిష్ఠునిపై అహితభావముగలియున్న విశ్వామిత్రుని ఆశ్రయించాడు. విశ్వామిత్రుడు అతనిని శరీరముతో స్వర్గానికి పంపించే యాగాన్ని చేయనంగీకరించి అట్లే నిర్వహించాడు. త్రిశంకువు మానవ శరీరముతో చండాలునిరూపంలో స్వర్గంలో ప్రవేశించాడు. దీనిని సహించలేని ఇంద్రాదిదేవతలు అతనిని క్రిందికి త్రోసివేయగా త్రిశంకుని ఆర్తనాదం విన్న విశ్వామిత్రుడు కుపితుడై తలక్రిందులుగా క్రిందికి పడిపోతున్న త్రిశంకుని ఆకాశమధ్యంలో నిలిపివేసి అతని కోసం అక్కడనే ఒక స్వర్గాన్ని సృష్టించాడు. ఆ స్వర్గానికి ఒక బ్రహ్మను కూడా సృష్టించబూనుకొనగా దేవతలు వచ్చి వారించి, ఆ ప్రయత్నాన్ని విరమింపజేశారు. దానినే త్రిశంకుస్వర్గమంటారు త్రిశంకువు అలాగే ఉన్నాడని ప్రతీతి.

త్రిశంకు కుమారుడు హరిశ్చంద్రుడు. అతడు సత్యవ్రతుడు. అతని సత్యసంధతను పరీక్షించడానికి వసిష్ఠ విశ్వామిత్రుల మధ్యనున్న వైరము మరింత పెరిగినది. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని పరీక్షించడానికి అతని వద్దకుపోయి, యాగ దక్షిణ నెపముతో, అతని సర్వస్వమూ తీసుకొని, అతనిని ఒక నీచవ్యక్తికి బానిసగా నుండే దురవస్థకు గురిచేశాడు. ఐనా ఆ సత్యహరిశ్చంద్రుడు అసత్యమాడకుండా అన్ని కష్టాలూ సహించి, తన సత్యసంధతను నిరూపించుకొన్నాడు. ఆ విధంగా హరిశ్చంద్రుని బాధపెట్టినందుకు వశిష్ఠుడు విశ్వామిత్రుని గ్రద్దవు కమ్మని శపించాడు. విశ్వామిత్రుడు కూడా వశిష్ఠుని నీవు కొంగవు కమ్మని ఎదురు శపించాడు. పక్షిరూపాల్లో కూడ వారిద్దరూ పోట్లాడు కొనడం మానలేదు.

హరిశ్చంద్రుని గురించి ఇంకొక కథకూడ ఉన్నది. హరిశ్చంద్రుడు సంతాన హీనుడుకావడం చేత దుఃఖితుడై నారద మహర్షి ఉపదేశం ప్రకారం వరుణదేవుని ఆరాధించాడు. వరుణదేవుడు ప్రత్యక్షముకాగా హరిశ్చంద్రుడు ఇలాగ ప్రార్థించాడు. "ఓ దేవా! నాకు గొప్ప వీరుడైన పుత్రుడు పుట్టినచో నీవు సంతోషించునట్లుగా హోమము చేసి, అతనిని యజ్ఞపశువును చేసి, హోమాగ్నిలో వేస్తాను. నాకు పుత్రుడు లేని వెలితిలేకుండాచేయుము." అనికోరాడు.

కొంతకాలానికి అతనికి ఒక పుత్రుడు కలిగాడు. అతని పేరు రోహితుడు. వరుణ దేవుడు వచ్చి యజ్ఞపశువుగా కుమారుని ఇస్తానన్న మాటను జ్ఞాపకం చేశాడు. ఇప్పుడు కాదు, పురిటిమైల తీరనిమ్ము అన్నాడు. తరువాత వచ్చి అడిగితే దంతములు రానిదే యజ్ఞ పశువుగా పనికి రాడు అన్నాడు. దంతాలువచ్చిన తరువాత అడిగితే శాశ్వతమైన దంతాలు రావాలి అన్నాడు. ఆ తరువాత వచ్చి అడితే నా కొడుకు కవచాన్ని ధరించిన యుద్ధవీరుడుకానిమ్ము అన్నాడు. ఈ విధంగా పుత్రవ్యామోహముతో తన ప్రాణాలను కాపాడాలని తన తండ్రి మాటతప్పి, ఏదో ఒక మిషతో వాయిదాలు వేస్తున్నాడని గుర్తించిన రోహితుడు తన్ను తానే రక్షించుకోవాలనుకొని విల్లమ్ములు పట్టుకొని అడవులకు వెళ్లిపోయాడు. మోసగింపబడిన వరుణుడు హరిశ్చంద్రుని పట్టుకొని, అతనికి ఉదరవ్యాధిని కలుగజేశాడు. ఈ వార్తవిని, రోహితుడు తండ్రి వద్దకు తిరిగి వెళ్తుంటే దారిలో ఇంద్రుడు అడ్డు తగిలి, తీర్థయాత్రలు చేసి రమ్మని పంపించివేశాడు. ఈ విధంగా ప్రతి సంవత్సరమూ రోహితుడు ఇంటికి వెళ్లబోతుంటే ఇంద్రుడు అడ్డుకొని, వెనుకకు పంపించడం, ఇలా అయిదు సంవత్సరాలు జరిగినవి. ఆరవ సంవత్సరంలో రోహితుడు ఇలా తలపోశాడు. వరుణుని ప్రీతికై నరమేధయజ్ఞము చేస్తేనేగాని తన తండ్రి యొక్క మాట నిలువదు. అసత్యదోషము చేతనే తండ్రి రోగగ్రస్తుడైయుండవచ్చు అని భావించి, దారిలో అజీగర్తుడనే భార్గవ వంశజుడైన బ్రాహ్మణుని కలుసుకొని, అతని కుమారుడైన శునశ్శేపుని యజ్ఞ పశువుగా వినియోగించడానికి కొనితెచ్చి తండ్రికిచ్చాడు. హరిశ్చంద్రుడు నరమేధయాగం చేశాడు. దానికి భృగుమహర్షి అధ్వర్యుడు, విశ్వామిత్రుడు హోత, జమదగ్ని ఋత్విజుడు, వశిష్ఠుడు సామవేదాన్నిగానంచేసిన ఉద్గాత. వరుణుడు తృప్తి చెందాడు. ఇంద్రుడు సంతసించి, హరిశ్చంద్రునికి ఒక బంగారు రథాన్ని బహూకరించాడు.

హరిశ్చంద్రుని యెడ ప్రసన్నుడైన విశ్వామిత్రుడు అతనికి జ్ఞాన బోధచేయగా, అతని అజ్ఞానము నశించి, ఆత్మ దర్శనమయి, పరమానంద ధామప్రాప్తి కలిగినది. దేవతలు ఆశీర్వదించారు.

## సగరుడు

హరిశ్చంద్రుని వంశములోని ఒక రాజైన బాహుకుడు శత్రువులచే ఓడింపబడి, భార్యలతో సహా అరణ్యానికి వెళ్లిపోయాడు. కొన్నాళ్లకు రాజు చనిపోగా అతని పెద్ద భార్య సహగమనం చెయ్యడానికి సిద్ధపడినది. ఈ విషయం తెలుసుకొని, ఆ అరణ్యంలోనే నివసిస్తున్న ఔర్వముని గర్భవతిగానున్న ఆమెను వారించి, సహగమనం చెయ్యనివ్వలేదు. ఆమెకు నవమాసాలూ నిండుతుండగా, సవతులు ఓర్వలేని వారై అన్నములో విషము కలిపి, ఆమెకు పెట్టారు. చిత్రమేమోమరి గర్భములోని బిడ్డకుగాని, ఆమెకుగాని అపాయమేమీ జరగలేదు. బిడ్డడు ఒంటినిండా విషముతో జన్మించాడు. అందుచేత అతనికి సగరుడు అనే పేరు సార్థకమైనది.

సగరుడు పెద్దవాడై తండ్రిని ఓడించిన వారిపై దండెత్తి శత్రువులను చెండాడాడు. చక్రవర్తియై భూమండలమంతా పాలించాడు. ఔర్వ మహర్షి ఆనతిచే అనేక అశ్వమేధయాగాలను చేశాడు. ఒక యజ్ఞములో అతడు విడిచిన అశ్వాన్ని ఇంద్రుడు అపహరించుకొనిపోయి, నాగలోకంలో తపస్సు చేసుకొంటున్న కపిలమహర్షి ఆశ్రమంలో కట్టివేశాడు.

సగరునికి కేశిని, సుమతి అనే ఇద్దరు భార్యలుండిరి. కేశిని కుమారుడు అసమంజసుడు. సుమతికి అరవై వేలమంది పుత్రులు కలిగారు. వారు మహాబలవంతులు, అహంకారులు కూడాను. వారు గుర్రము గురించి భూమండలంలోని సప్త ద్వీపాలనూ గాలించినా అది ఎక్కడా కానరానందున తమ బాహుబలంతో భూమిని త్రవ్వి, పాతాళం వరకూ వెళ్లిపోయారు. అక్కడ ఇంద్రునిచే కపిలాశ్రమంలో కట్టివేయబడిన యజ్ఞాశ్వం కనబడగానే, వారు రోషావేశపూరితులై, అక్కడే ధ్యానమగ్నుడైయున్న కపిల మహర్షిపై విరుచుకొనిపడ్డారు. "ఈ కపట సన్న్యాసియే గుర్రపుదొంగ, పరమ సాధువులాగా వేషంవేసుకొని, ఏమీ ఎరుగని వానిలా కళ్లుమూసుకొని ఈ మూల కూర్చున్నాడు. ముల్లోకాల్లోనూ ఎక్కడ దాక్కొన్నా, ఈ సగరపుత్రులనుండి తప్పించుకొనజాలరని తెలియదు కాబోలు. ఈ దొంగను

చిత్రహింస చెయ్యండి, చంపండి" అంటూ కేకలు వేసుకొంటూ ఆయుధాలతో మీదపడబోయారు. ఆ కలకలం విని, కపిలమహర్షి కళ్లు తెరిచీ తెరవగానే క్రోధాగ్నియే జ్వాలలై విజృంభించి, అహంకార బలగర్వమదాంధులైన ఆ సగర పుత్రులను అరవై వేలమందినీ దహించివేసినది. వారుచేసిన అపచారమే వారిని దహించివేసినదిగాని కపిలుని క్రోధాగ్ని కాదు. అతడు శుద్ధసత్త్వస్వరూపుడు. అతనికి ఎవ్వరియందూ ద్వేషము ఉండదు. అతడు లోకంలో సాంఖ్యయోగాన్ని బోధించడానికి అవతరించిన విష్ణుమూర్తి. అతనికి కోపమే ఉండదు.

సగరుని ప్రథమ భార్యపుత్రుడైన అసమంజసుడు పూర్వజన్మలో ఒక యోగి. అతడు సహవాస దోషముచే భ్రష్టుడై సగర పుత్రుడై పుట్టినా, పూర్వజన్మస్మృతి యున్నందున విరక్తుడై, అయోగ్యుడనిపించుకొని, నింద్యార్హమైన పనులు చేస్తుండేవాడు. తనపై తన తండ్రికి ఉన్న మమకార బంధాన్ని తొలగించాలనీ, ప్రజలు తన్ను అసహ్యించుకొని, తండ్రికి ఫిర్యాదుచెయ్యాలనీ, అతడు అయోధ్యానగర వీధుల్లో ఆడుకొంటున్న పిల్లలను తీసుకొనివెళ్లి సరయూనదిలో పడవేసేవాడు. ప్రజలు హాహాకారాలు చెయ్యగా రాజు అతనిని రాజ్యం విడిచి పొమ్మన్నాడు. తానుకోరుకొన్నట్లే జరిగినదని సంతసించి, అసమంజసుడు చనిపోయిన పిల్లలందరినీ తన యోగశక్తిచే బ్రతికించి, తలిదండ్రులకు ఒప్పజెప్పాడు. అందరూ ఆశ్చర్యపోయారు. రాజు పశ్చాత్తాపపడ్డాడు. అయినా అసమంజసుడు ఇల్లు విడిచి ఎక్కడికో వెళ్లిపోయాడు. అతని పుత్రుడే బుద్ధిమంతుడైన అంశుమంతుడు. అతడు సగర చక్రవర్తికి అన్ని విధాలా తోడ్పడుతుండేవాడు. తాతగారి యాగాశ్వాన్ని వెదకి తేవాలనే సంకల్పంతో అంశుమంతుడు తన తండ్రులు వెళ్లిన మార్గాన్నే అనుసరించి కపిలాశ్రమం చేరాడు. అక్కడ రాసులు రాసులుగా పడియున్న భస్మపు కుప్పలను, అశ్వాన్నీ చూచాడు. కపిల భగవానుని సమీపించి ఇలాగస్తుతించాడు:

"ఓ దేవా! నీవు పరమాత్మవు. ఆ బ్రహ్మదేవుడే నీ గురించి తెలుసుకొనలేనప్పుడు, అతనిచే సృష్టింపబడిన అల్పజీవులమూ, త్రిగుణాలతో కూడియున్న దేహ ధారులమూ అయిన మావంటివారికి సాధ్యపడుతుందా స్వామీ! మేము దేహమే సర్వస్వమని భావించి, మాలోనే అంతర్యామివై వెలసియున్న నిన్ను గుర్తించలేని జీవరాసులము. నేడు నీ దర్శన భాగ్యమువలన నా మోహము వీడి, ధన్యుడనైనాను" అని ప్రార్థించిన అంశుమానునితో కపిల భగవానుడిలా అన్నాడు. "ఓ బుద్ధిమంతుడా! ఈ అశ్వాన్ని కొనిపోయి మీతాతకు ఇమ్ము. నీ తండ్రులు అవివేకులై బూడిద అయ్యారు. ఆ బూడిదరాసులపైన గంగా జలము ప్రవహిస్తే శుభమవుతుంది." అని చెప్పిన కపిల మునికి అంశుమానుడు ప్రణమిల్లి సెలవు తీసుకొన్నాడు. అశ్వాన్ని తీసుకొనివెళ్లి సగరునికి ఇవ్వగా అతడు యజ్ఞాన్ని పూర్తి చేసినాడు. తరువాత అంశుమంతునకు రాజ్యాన్ని ఒప్పచెప్పి, ఔర్వముని చెప్పిన మార్గంలో సగరుడు తపస్సు చేసి, ఉత్తమగతిని పొందాడు. అంశుమంతుడూ, అతని పుత్రుడైన దిలీపుడూ ఆకాశగంగను భూమిమీదకు రప్పించడానికి ఎన్నో సంవత్సరాల తపస్సు చేసినా కృతకృత్యులు కాలేకపోయారు.

దిలీపుని పుత్రుడు భగీరథుడు. తన పూర్వీకులకు సద్గతిని కలిగించే ప్రయత్నంలో తన తండ్రి, తాత విఫలురైనందున, అతడు మరింత పట్టుదలతో తీవ్రమైన తపస్సు చేసి గంగాదేవి దర్శనం పొందగలిగాడు. ఆమె ప్రసన్నురాలయి, వరముకోరుకొమ్మనగా, "తల్లీ! నా పూర్వీకులు మూడు తరాలనుండి పితృలోక ప్రాప్తిలేక పడియున్నారు. వారికి సద్గతి కలుగాలంటే నీయొక్కపాదస్పర్శసోకాలి. కనుక నీవు దివినుండి భువికి దిగిరావలసిందని ప్రార్థిస్తున్నాను." అని వేడుకొన్నాడు. అప్పుడు గంగాదేవి ఇలా అన్నది: "రాకుమారా! నా ప్రవాహ ధాటిని తట్టుకొనలేక భూమి బ్రద్దలైపోతుంది. అప్పుడు నేను నేరుగా పాతాళం లోనికిపోతే నీకోరిక నెరవేరేదెట్లా? అంతే కాక నేను భూమిపైన ప్రవహిస్తే, మానవులు వచ్చి తమ పాపపంకిలాలను నాయందు ప్రక్షాళనం చేసుకొంటారు. అప్పుడు నేను కలుషితం అయిపోనా? ఆ పాపాలను నేను వదలించు కోవడం ఎట్లా? అందుచేత నీ కోరికను మన్నించలేను."

అని చెప్పిన గంగామాతతో భగీరథుడిలా అన్నాడు: "తల్లీ! నీ సందేహానికి ఆస్కారం లేదు. సర్వపాపాలనూ హరించి వేయగల శ్రీహరి బ్రహ్మనిష్ఠులైన ఋషుల హృదయాల్లోను, సన్న్యాసి సాధు సత్తముల హృదయాల్లోనూ సదా నివసించియుంటాడు గనుక అట్టి మహాత్ముల స్పర్శచేత నీలో చేరిన పాపములన్నీ తొలగిపోగలవు. ఎల్ల శరీరధారులకూ విశ్వాత్ముడైన విశ్వనాథుడు నీయొక్క ప్రవాహభారాన్ని ధరించగల సమర్థుడు. ఆయనను నేను ప్రార్థిస్తాను. నీవు నా ప్రార్థనను అనుగ్రహించుము" అనగా గంగాదేవి సరేయన్నది.

భగీరథుడు శివుని గురించి తపస్సు చేశాడు. పరమశివుడు ప్రసన్నుడై, భగీరథుని కోర్కెను తెలుసుకొని, ఆకాశగంగను తన శిరస్సు పై ధరించడానికి సమ్మతించాడు. తన యొక్క పుట్టుక, పవిత్రత, గొప్పతనాల గురించి విష్ణుపదియైన ఆకాశగంగ యందు కొంచెం అహంకారం ఉదయించినది. ఆమె శివునిశక్తినే పరీక్షిస్తుందా అన్నట్టు ప్రచండవేగంతో దిగివస్తుంటే, శివుడు గ్రహించి, చిరునవ్వుతో తన జటాజూటాన్ని ఒడ్డి నిల్చున్నాడు. అంతటి ప్రవాహమూ ఆ జటాజూటములో చిక్కుకొని ఏమయిందో తెలియలేదు. గంగ బయట పడడానికి ఎంత ప్రయత్నించినా ఒక్క చుక్క అయినా బయటకు రాలేకపోయినది. భగీరథుడు విస్తుపోయి, తన ప్రయత్నాలన్నీ వృథా అయిపోయినవా అని నిస్పృహ జెంది, పరమశివుని ప్రార్థించాడు. శివుడు కరుణించి, తన జటాజూటములోని ఒక వెంట్రుకనుండి గంగ కొద్దికొద్దిగా బైటకు వచ్చునట్లు విడిచిపెట్టాడు. అదియే నదీప్రవాహమై భగీరథుని రథము వెంట పరుగులెత్తుతూపారి, సగరపుత్రుల భస్మరాసులపై ప్రవహించి వారిని పునీతులనుచేసినది. శ్రీహరి చరణారవిందములో పుట్టి, శివజటాజూటాన్నధిష్ఠించి, భూమిని పవిత్రంచేసిన ఆ పావన గంగానదిలో మునిగిన మునీంద్రులు కొందరు శ్రీహరి సాయుజ్యాన్ని పొందారు. భగీరథునిచే భువికి రప్పింపబడినందున గంగ భాగీరథి అనబడినది.

## సౌదాస మహారాజు

భగీరథుని వంశములో జన్మించిన వాడు సౌదాసుడు. అతడు తన పూర్వులవలె ధర్మపరాయణుడు, దైవభక్తి కలవాడు. ఒకసారి ఆ రాజు వేటకు వెళ్ళగా, అడవిలో ఒక రాక్షసుడు ఎదురైనాడు. వారిద్దరికీ జరిగిన పోరులో రాక్షసుడు మరణించాడు. అది తెలుసుకొని, ఆ రాక్షసుని సోదరుడు రాజుపై పగబూని, వంటవాని వేషము వేసుకొని, రాజు గృహంలో వంటవానిగా కుదురుకొన్నాడు.

ఒకసారి అతిథిగా వచ్చిన వశిష్ఠమహర్షికి రాజు విందును ఏర్పాటు చేశాడు. అవకాశం కొఱకు ఎదురు చూస్తున్న అసురుడు నరమాంసం వండిపెట్టాడు. వశిష్ఠుడు తినరానిది పెట్టబడినదని తెలుసుకొన్నవాడై, "నీవు రాక్షసుడవు అవుదువుగాక" అని శపించాడు. తరువాత ఇది వంటవాడు చేసిన కుట్ర అని తెలుసుకొని, రాజుయొక్క రాక్షస జీవితాన్ని పన్నెండు సంవత్సరాలకు తగ్గించాడు ఋషి. తన తప్పేమీ లేకపోయినా సత్యాన్ని తెలుసుకొనకుండా తొందరపడి, ముని తనను శపించినందుకు కుపితుడైన రాజు వశిష్ఠునకు ఎదురుశాపమివ్వడానికి సిద్ధపడి, జలాన్ని మంత్రించగా, సద్గుణవతి, ధర్మపరాయణ అయిన రాణి మదయంతి రాజును వారించి, ఇలా అన్నది: "స్వామీ! మీరు ఆ పని చెయ్యరాదు. వశిష్ఠుడు మనకులగురువు. గురువులు, బ్రాహ్మణులు, ఋషులూ పూజనీయులు. వారు తప్పు చేసినా మనము దండించరాదు. అది మీకు, మీ వంశానికీ శ్రేయస్కరంకాదు" అని చెప్పిన భార్యయొక్క హిత వాక్కులను మన్నించి, తన చేతిలోని మంత్ర జలాన్ని తన పాదాలపైననే వేసుకున్నాడు. తత్ఫలితంగా అతని పాదాలు నల్లగా మాడిపోయాయి. అందుచేతనే అతడు కల్మాషపాదుడనబడ్డాడు. అతడు రాక్షసుడై అడవులలో తిరుగుతుండగా, ఏకాంతమనుభవిస్తున్న బ్రాహ్మణదంపతుల్ని చూచి, ఆ బ్రాహ్మణుని బలవంతంగా ఈడ్చివేసి, అతనిని చంపి భక్షింప పూనుకొనే సరికి, ఆ బ్రాహ్మణ పతివ్రత ఇలాగ వేడుకొన్నది: "అయ్యా! నీవు నిజంగా రాక్షసుడవు కావు. శాపగ్రస్తుడవైన రాజర్షివి. నా భర్త ఒక మహర్షి. అతనినీవిధంగా భార్యనుండి విడదీసి, చంపడంవలన

బ్రహ్మ హత్యాపాపం నీకు చుట్టుకొంటుంది. నీకు అంత ఆకలి గానుంటే, నన్ను తిని, ఆయనను విడిచిపెట్టు" అని ఆమె ఎంత ప్రాధేయపడినా వినకుండా, ఆ బ్రాహ్మణుని చంపివేశాడు. అప్పుడామె ఆ రాక్షసుని ఇలా శపించినది: "భర్తతోకూడి గర్భవతినిగానున్న నానుండి నా భర్తను విడదీసి చంపినందుకు, నీవు నీ భార్యతో కలిసి గర్భాధానము కాకుండానే చనిపోతావు" అని శపించి, ఆమె అగ్ని ప్రవేశం చేసి మరణించినది. శాపకాలము తీరిన తరువాత రాక్షసుడు రాజు అయి భార్య పొందునుకోరగా, ఆమె బ్రాహ్మణస్త్రీ శాపాన్ని గుర్తుకు తెచ్చి వారించినది. అతడు స్త్రీ సాంగత్యం కోల్పోయి, వంశం నిలవడానికి, వశిష్ఠ బీజముతో అశ్మకుడనే పుత్రుని పొందాడు. అతని మనుమడే ఖట్వాంగ చక్రవర్తి.

ఖట్వాంగ చక్రవర్తి దేవతల అభ్యర్థనపై రాక్షసులను సంహరించి, ఇంకా తన ఆయుర్దాయం ఎంత ఉందో చెప్పమని దేవతలనుకోరగా, వారు ఇంకొక్క ఘడియమాత్రమే ఉన్నదనీ, తాను ఏవరం కోరితే దానినిస్తామనీ చెప్పారు. ఆ పుణ్యాత్ముడు క్షుద్రమైన విషయభోగాలనేవీ కోరకుండా, విమానంలో తన ఇల్లు చేరుకొని, రాజ్యమూ, భార్యాపుత్రులు, సంపదలూ వైభవాలూ ఇవి అన్నీ బంధ కారకాలు గనుక, వాటినిత్యజించి, పరమేశ్వరుడే తప్ప ఇంకేమీ తనకు అవసరంలేదని నిశ్చయించుకొని, విష్ణుచరణ ధ్యానములో నిమగ్నుడై పరమపదాన్ని పొందాడు. ఖట్వాంగుని వంశములో జన్మించిన రఘువు, దశరథుడు ప్రసిద్ధులైనారు.

## ఇక్ష్వాకువంశము - శ్రీరామచరిత్ర

సృష్టి స్థితి లయ కర్త అయిన పరమేశ్వరుడు రావణాది రాక్షసుల బారినుండి సాధుసజ్జనులను కాపాడే లోకకల్యాణకరమైన సంకల్పముతో బ్రహ్మాది దేవతల ప్రార్థనలను పురస్కరించుకొని భూలోకంలో దశరథ మహారాజునకు పుత్రునిగా అవతరించాడు. అతనితో పాటే భగవదంశతో భరత లక్ష్మణ శత్రుఘ్నులు దశరథుని కుమారులై జన్మించారు.

విశ్వామిత్రమహర్షి కోరికను మన్నించి, అతడు చేయనున్న యాగాన్ని రాక్షసులు పాడు చెయ్యకుండా రక్షించడానికి దశరథుడు అనుమతించగా రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట సిద్ధాశ్రమానికి వెళ్లారు. శ్రీరాముడు యాగభంగము చేయవచ్చిన అనేక మంది రాక్షసులను సంహరించాడు. తాటక అనే ఘోర రాక్షసిని నేలగూల్చాడు. సుబాహుడనే రాక్షసుని చంపి, మాయావి అయిన మారీచుని సముద్రతీరంవరకు తరిమి కొట్టాడు. విశ్వామిత్రుని యాగము నిర్విఘ్నముగ సమాప్తమైనది. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మిథిలా నగరానికి తీసుకొనివెళ్లాడు. అక్కడ విదేహరాజైన జనకుని ఇంట శివధనుస్సు ఉండెను. మూడువందలమందిచే మోయబడిన ఆ మహా ధనుస్సును ఇతర రాజులందరూ ఆశ్చర్యముతో చూస్తుండగా శ్రీరాముడు ఎక్కుపెట్టినంతనే అది విరిగి ముక్కలయినది. జనకమహారాజు తన పుత్రిక అయిన సీతను శ్రీరామునకిచ్చి వివాహము చేశాడు. గుణము, శీలము, సౌందర్యము, లావణ్యము అన్ని విషయాల్లోనూ సీత శ్రీరామునకు తగియున్న ధర్మపత్ని.

దశరథమహారాజు సీతారామాదులను మిథిలనుండి అయోధ్యకు తీసుకొనివెళ్లుతుండగా దారిలో రణరంగ భయంకరుడైన పరశురాముడు ఎదురైనాడు. అతడు ఈ భూమండలాన్ని ఇరవైయొక్క సార్లు గాలించి రాజులందరినీ తన గండ్ర గొడ్డలికి ఆహుతి చేసినట్టి వీరుడు. శ్రీరాముడు అతనిని ఎదుర్కొని భంగపరచినాడు.

మునుపెప్పుడో కైకేయికిచ్చిన వాగ్దానానికి కట్టుబడి దశరథుడు శ్రీరామునకు పదునాల్గేండ్ల వనవాసాన్ని విధించాడు. పరమయోగులు నిస్సంగులై సర్వసంగపరిత్యాగము చేసినట్లు, తండ్రి కోరికను శిరసావహించి, రాజ్యమునూ, కన్నతల్లినీ, సంపదలనూ అయోధ్యానగరాన్నీ ఏ విధమైన మమకారము లేకుండా విడిచివెళ్లాడు. శ్రీరామునితో సీత, లక్ష్మణుడు కూడ అరణ్యానికి వెళ్లారు. తన చరణసేవానిరతుడైన భరతుని రాజ్యపాలనలో నియోగించి, అతడు చిత్రకూటానికి వెళ్లాడు.

దండకారణ్యంలో రాముడు - భార్యతోను, తమ్మునితోను ఒక కుటీరంలోనుండగా, రావణాసురుని చెల్లెలైన శూర్పణఖ శ్రీరామునిపై మోహావేశముతో రాగా, లక్ష్మణుడు ఆమె ముక్కును కోసి, కురూపిని చేశాడు. అది విని, దండెత్తి వచ్చిన ఖర, దూషణ, త్రిశిరులు మొదలైన పధ్నాలుగు వేలమంది రాక్షసులను శ్రీరాముడు తన బాణాలతో భస్మంచేశాడు. రావణాసురుడు తనసోదరియగు శూర్పణఖ అవమానింప బడినందులకు, జనస్థానంలోనున్న తనయొక్క రాక్షస సైన్యమంతా హతమైపోయినందులకు, ప్రతీకారము చేయనిశ్చయించుకొన్నాడు. అతడు సీతయొక్క అపురూపసౌందర్యం గురించి వినియున్నాడు, కనుక ఆమె నపహరించి, రామునిపై పగతీర్చుకొనదలచాడు. రావణుడు మాయావి అయిన మారీచుని ప్రోత్సహించి అతడు బంగారు వన్నె మాయలేడి రూపము ధరించి, సీతను భ్రమింపజేసి, రాముడు దానిని వెంబడించు నట్లు చేయడానికి నియోగించాడు. అంతా అలాగే జరిగినది. శ్రీరాముడు కుటీరములో లేని సమయంలో రావణుడు కపటసన్న్యాసి రూపంలో వచ్చి సీతను ఎత్తుకొనిపోయాడు. దారిలో జటాయువు అనే పక్షిరాజు రావణుని ఎదిరించగా, రావణుడు దాని రెక్కలను ఖండించి వెళ్లిపోయాడు. రామలక్ష్మణులు సీతను గురించి అరణ్యంలో వెదకుతుండగా చావుబ్రతుకుల్లోనున్న జటాయువు కనిపించి, విషయం చెప్పి ప్రాణం విడిచాడు. జటాయువునకు దహన సంస్కారం చేసి, అన్వేషణ సాగిస్తున్న రామలక్ష్మణులను కబంధుడనే రాక్షసుడు తన పొడవైన చేతులతో వారిని పట్టుకొనగా, వారతని చేతులను ఖండించి, వానిని వధించారు. ఆ తరువాత వారు ఋష్యమూకపర్వతం చేరి అక్కడ, బుద్ధిమంతుడూ, బలశాలీ అయిన హనుమంతుని కలుసుకొని అతని ద్వారా వానరప్రభువైన సుగ్రీవునితో చెలిమిచేసుకొని, గొప్ప బలవంతుడైన వాలిని వధించి, సీతాన్వేషణకు ఆంజనేయుని పంపించారు. ఆంజనేయుడు సముద్రాన్ని దాటి, సీతను దర్శించి, అక్షకుమారుడు మొదలైన వారిని సంహరించి తిరిగివస్తూ లంకను కాల్చి, శ్రీరాముని వద్దకు తిరిగి వచ్చి, సీతావృత్తాంతం చెప్పాడు. శ్రీరాముడు వానరసేనతో సముద్రపుఒడ్డుకు చేరుకొని వారధి కట్టించే ప్రయత్నంలో నుండగా సముద్రపు ఉధృతం ఎక్కువ కాసాగినది. తనకు దారి ఇమ్మని శ్రీరాముడు సముద్రుని కోరినా, సముద్రుడూ తగ్గకపోయేసరికి శ్రీరాముడు విల్లు అమ్ములు ధరించగా సముద్రుడు భయపడిపోయి, స్వయంగా వచ్చి ఇలాగ స్తుతించాడు:

**శా॥ ఓ కాకుత్స్థకులేశ! యోగుణనిధీ! యోదీనమందార! నే**
**నీకోపంబున కెంతవాడ? జడధిన్ నీవేమి భూరాజవే!**
**లోకాధీశుడవాదినాయకుడ వీలోకంబు లెల్లప్పుడున్**
**నీకుక్షింబ్రభవించుచుండు నడగున్ నిక్కంబు సర్వాత్మకా.** 283

**క॥ కట్టుము సేతువు లంకన్ జుట్టుము నీ బాణవహ్ని సురవైరి తలల్**
**గొట్టుము నేలంబడ జే పట్టుము నీయబల నధిక భాగ్యప్రబలన్.** 285

అని విన్నవించగానే రామచంద్రుడు ప్రసన్నుడైనాడు. వానరశ్రేష్ఠులు పెద్ద పెద్ద కొండలను వృక్షాలను పెకలించి తెచ్చి వారధి కట్టారు. అందరూ సముద్రాన్ని దాటి వెళ్లారు. రావణుని తమ్ముడైన విభీషణుడు వచ్చి రామచంద్రుని శరణువేడాడు. అతని సహాయంతో లంకలో ప్రవేశించి, ఆ పట్టణాన్ని ముట్టడించారు. వానరసేనలు కోటగోడలను త్రవ్వి, తలుపులను పడగొట్టి, నానాబీభత్సాన్ని సృష్టించాయి. పిమ్మట రావణుడు పంపగా, కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహోదాంతులు మొదలైన రాక్షస వీరులు ఆయుధాలతో వచ్చి పోరాడారు. సుగ్రీవ, అంజనేయ, పనస, గజ, గవయ, గంధమాదన, నీల, అంగద, కుముద, జాంబవంతాదులు వారిని ఎదుర్కొని, హతమార్చారు. అజేయుడూ, మాయావీ అయిన అతికాయుని లక్ష్మణుడు నేలగూల్చాడు. మహాబలశాలీ అయిన కుంభకర్ణుని శ్రీరాముడు కూల్చివేశాడు. ఇంద్రుని జయించి, దేవతలను హడలెత్తించిన

మహాపరాక్రమశాలియైన మేఘనాథుని లక్ష్మణుడు హతమార్చాడు. తనవారంతా నేలకూలగా, రావణుడే పుష్పక విమానం మీద రణరంగానికి వచ్చి, గొప్ప రౌద్రావేశముతో శ్రీరామునితో యుద్ధానికి తలబడ్డాడు. ఆ సమయంలో ఇంద్రుడు ఒక దివ్యరథాన్నిచ్చి మాతలిని రామచంద్రుని దగ్గరకు పంపించాడు. శ్రీరాముడు ఆ రథాన్నెక్కి, రావణునితో ఇలా అన్నాడు: "ఓ లంకాధిపా! నాతో యుద్ధము చేయడమంటే కపట వేషముతో వెళ్లి, కారడవిలో నిస్సహాయురాలైన అబలను ఎత్తుకొని రావడమంత సులువేమీ కాదు. నీవు చేసిన పాపాలకు యముడు శిక్షించే ముందు నేనే నిన్ను ఖండిస్తాను" అని చెప్పి, శ్రీరాముడు భయంకరమైన తన తిరుగులేని బాణముతో రావణుని నేలగూల్చాడు. రావణుని మరణవార్త విని అంతఃపుర కాంతలు నెత్తి బాదుకొంటూ యుద్ధభూమికి వచ్చారు. మందోదరి భర్తపైబడి ఇలా విలపించినది.

ఉ॥ హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక సో
న్మాదమునన్ రఘుప్రవరు మానిని నేటికి తెచ్చితప్పుడేఁ
గాదని చెప్పినన్ వినక కాలవశంబును బొంది తక్కటా! 308

క॥ దురితము దలపరుకానరు జరుగుదురెటనైన నిమిష సౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును పరధనరక్తులకు నిహము పరముంగలదే 310

నాథా! నీ ఆజ్ఞ లేనిదే సూర్యచంద్రవాయు వరుణులు లంకలో తమ తమ విధులను నిర్వహించడానికే భయపడే వారు కదా! అలాంటి లంకా నగరమూ, లంకా వాసులూ, మేమూ ఇప్పుడు అనాథలమై పోయాము కదా! ఇక మాగతి ఏమిటి?" అని విలపించినది.

శ్రీరాముని సలహాపై విభీషణుడు రావణాది మృతులకు అంత్యక్రియలు జరిపించాడు. పిమ్మట రామచంద్రుడు అశోకవనానికి వెళ్లి, మిక్కిలి శోకాకుల చిత్తయై కృశించి ప్రాణాలు బిగబట్టుకొని యున్న సీతను చూచి, మిక్కిలి దుఃఖించాడు. 'సీత నిష్కళంక' అని అగ్నిముఖంగా ప్రకటింపజేసి, దేవతల అనుజ్ఞతో ఇల్లాలిని శ్రీరామచంద్రుడు స్వీకరించాడు. విభీషణునకు లంకా రాజ్యపట్టాభిషేకము చేసి, సీతాలక్ష్మణులతోను, సుగ్రీవ హనుమదాదులతోను పుష్పకవిమానమెక్కి, దేవతలు పుష్పవృష్టి కురిపిస్తుండగా, శ్రీరామచంద్రుడు నందిగ్రామానికి తరలివచ్చాడు. శ్రీరాముని రాకవిని, పురజనులు వెంటరాగా భరతుడు పాదుకలను నెత్తిన పెట్టుకొని, ఎదురు వెళ్లాడు. సాష్టాంగదండప్రణామాలు చేసి, శ్రీరాముని పాదాలకు లలాటమును తాకించి, హృదయానికి హత్తుకొని, ఆనందబాష్పాలతో అభిషేకం చేశాడు అసమానగుణశీలుడైన భరతుడు. రామచంద్రుడు భూసురులకు నమస్కరించి, పట్టలేని ఆనందోత్సాహాలతో గంతులు వేస్తున్న ప్రజలను పరామర్శించి, సుగ్రీవవిభీషణులు వింజామరలతో వీస్తుండగా, వాయునందనుడు గొడుగు పట్టగా, భరతుడు భక్తితో పాదుకలను పట్టుకొనగా, శత్రుఘ్నుడు విల్లంబులు పట్టుకొనగా, సీతాదేవి కలశమును పట్టుకొనగా, అంగదుడు ఖడ్గాన్ని పట్టుకొనగా, జాంబవంతుడు డాలు పట్టుకొనగా, లక్ష్మణుడు దారి చూపుతుండగా శ్రీరామచంద్రప్రభువు తరలివెళ్లి, పుష్పక విమానమెక్కి, నక్షత్రాల మధ్యను ప్రకాశిస్తున్న పూర్ణచంద్రునివలె వెలిగాడు.

అయోధ్యానగరమంతా నూతనవధువు లాగా సర్వాలంకారశోభితయై అలంకరింపబడినది. పుష్పద్వారాలతోను, మంగళవాద్యాలతోను, సంకీర్తనలతోను, వేదమంత్రాలతోను, కిటకిటలాడే వీథులతోను, మారుమ్రోగుతున్నది. పండితులూ, పురజనులూ ఎదురువెళ్లి, తమ హృదయాధినాథుడూ, ఆత్మారాముడూ అయిన ఆ శ్రీరామచంద్రుని ఎప్పుడు చూస్తామా అని ఎదురుచూస్తున్నారు. సపరివారముగా శ్రీరామచంద్రుడు అయోధ్యానగర వీధుల్లో వెళ్లుతుండగా, పుణ్యస్త్రీలు తమలో తాము ఇలాగ ముచ్చటించుకొనుచున్నారు: "సూర్యతేజస్సుతో మెరిసిపోతున్న అతడే

శ్రీరామచంద్రుడు. ఆయన వెనుకనే వస్తున్న ఆ చంద్రబింబాననయే సీతాసాధ్వి. ఈమెను రక్షించడానికే శ్రీరాముడు రావణాసురుని చంపాడు. అతడే లక్ష్మణుడు. ఆ వానర రాజు సుగ్రీవుడు. ఆచెంతనున్న వాడే వానరవీరుడైన హనుమంతుడు. అతడు లంకాధీశుడైన విభీషణుడు" అనుకొంటూ కన్నుల పండువుగా ఆదృశ్యాన్ని తిలకిస్తున్నారు. రాముడు అంతఃపురంచేరి; తల్లులకు వందనం చేసి, పండితులయెడ వినయము చూపి, బంధువులను ఆలింగనం చేసుకొని, మంత్రులను ఉద్యోగులను, సేవకులను, ఆదరంతో పరామర్శించాడు. సీతారామలక్ష్మణులను చూచి, అందరూ, పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లు ఆనందబాష్పాలతో అభివందనములు చేశారు.

వశిష్ఠుడు శ్రీరాముని దీక్షను విరమింపజేసి, పుణ్యతీర్థ జలాలతో నభిషేకముచేసి, అలంకరింపజేసి ఆయునకు రాజ్యపట్టాభిషేకము గావించాడు. రామరాజ్యంలో భూకంపాలు, సముద్ర కల్లోలాలు లేవు. దుష్ట శిక్షణ చేయవలసిన అగత్యం శ్రీ మహావిష్ణువునకు కలుగలేదు. పంచభూతాలు, సూర్యచంద్రులు, దిక్పాలకులు, నిరాటంకంగా తమ విధులను సక్రమంగా నిర్వహిస్తుండేవారు. భూమి పుష్కలంగా సస్య శ్యామలంగా ఫలిస్తుండేది. ప్రజల్లో పేదరికం, కౌటిల్యం, చంచలత్వం, పరపీడనం, మాంద్యము, తాపము, చౌర్యము మొదలైన అవగుణాలకు అవకాశమేలేకపోయినది. కన్నతండ్రి కంటె మిన్నగా రామచంద్రుడు ప్రజలను చూచుకొనేవాడు. ఏకపత్నీవ్రతుడై ధర్మనిష్ఠ కలవాడై త్రేతాయుగంలో కృతయుగ ధర్మాలను పాటిస్తూ రాజర్షివలె రాజ్యపాలనం చేసేవాడు.

శ్రీరాముడు అనేక యాగాలను చేయించాడు. ఒకనాటి యాగములో - హోతకు తూర్పు దిక్కున నున్న భూమండలాన్నీ, ఉద్గాతకు ఉత్తర భూమండలాన్నీ, అధ్వర్యునకు పశ్చిమ భూమండలాన్నీ, బ్రహ్మకు దక్షిణ భూమండలాన్నీ, మిగిలినదంతా ఆచార్యునకూ ఇచ్చివేసి, కట్టుబట్టలు, సీతమ్మ తాళిబొట్టు తప్ప, సమస్త సంపదలను మునులకూ ఇచ్చివేశాడు. అటువంటి దాతృత్వాన్ని ఎక్కడా కనీవినీ ఎరుగని బ్రహ్మజ్ఞులు, మునులూ ఆశ్చర్యపోయి, "ప్రభూ! రామచంద్రా! ఋషులమైన మాకు ఈ భూములూ భౌతిక వస్తు సంపదలూ ఎందుకు? నీవు సాక్షాత్తు శ్రీహరివని మాకు తెలుసు. మాకు కావలసిన సద్గతినే మాకు ప్రసాదించు. మా అజ్ఞానాన్ని తొలగించి, నిన్ను చేరే జ్ఞానాన్ని ప్రసాదించు" అని చెప్పి, ఆశీర్వదించి ఏమీ స్వీకరించకుండా వెళ్లిపోయారు.

ఈ విధంగా జనరంజకంగా సకల భోగ భాగ్యవైభవాలతో చాలా కాలం శ్రీరాముడు రాజ్యము చేస్తుండగా, ఒకనాడు మహా పతివ్రత అయిన సీతాదేవి లంకలో ఒంటరిగా నుండడం గురించి, ప్రజలు చులకనగా మాట్లాడడం ఆ ప్రభువునకు తెలియవచ్చినది. ఆమె వాల్మీకి ఆశ్రమంలో విడిచిపెట్టబడినది. అప్పటికి గర్భవతి అయి యుండిన సీతాదేవి వాల్మీకి ఆశ్రమంలో కుశలవులనే కుమారులను కన్నది. లక్ష్మణునకు అంగదుడు, చంద్రకేతువూ, భరతునకు తక్షుడు, పుష్కలుడూ, శత్రుఘ్నునకు సుబాహుడు, శ్రుతసేనుడూ అనే ఇద్దరేసి కుమారులు కలిగారు. భరతుడు గంధర్వులను ఓడించి, అశేష ధనరాసులను, సువర్ణాన్నీ తెచ్చాడు. శత్రుఘ్నుడు మధురాక్షసుని కొడుకైన లవణాసురుని చంపి, మధువనంలో మధురాపురాన్ని నిర్మించాడు.

రామచంద్రుని పుత్రులైన కుశలవులు వాల్మీకి మహర్షి వద్ద సకల విద్యలూ నేర్చుకొన్నారు. రామకథను గానం చెయ్యడం నేర్చుకొన్నారు. అనేక సభలలో ఆ గాన కథను వినిపించారు. ఒకరోజు శ్రీరాముని యజ్ఞశాలకు వెళ్లి, మోళ్లు చిగిరించేలాగా, అమృతధారలు స్రవించేలాగ, అందరూ సమ్మోహితులయ్యేలాగా గానము చేశారు. శ్రోతలతో పాటు శ్రీరామచంద్రుడు కూడా కరిగిపోయాడు కన్నీటి ధారలు కార్చాడు. ఆ బాలురయందు వాత్సల్యము, ప్రేమ, పొంగిపొరలగా, వారితో ఆ ప్రభువు ఇలా అన్నాడు:

ఆ॥ చిన్నియన్నలార శీతాంశుముఖులార నళినదళవిశాలనయనులార
మధురభాషులార మహిమీద నెవ్వరు తల్లి దండ్రి మీకు ధన్యులార 352

అని అడుగగా, ఆ బాలకులు ఇలా జవాబిచ్చారు: "మేము వాల్మీకి మునీంద్రుని మనుమలము. రఘురామునిచే చేయబడుతున్న యాగాన్ని చూడవచ్చినాము" అని చెప్పగానే శ్రీరాముడు వారిని గుర్తించి, సత్కరించి, పంపించాడు. మరునాడు వాల్మీకి మునీంద్రుడు కుశలవులను, సీతమ్మను తోడ్కొని, శ్రీరాముని వద్దకు వచ్చి, అనేక విధాల రాముని స్తుతించి, ఇలా అన్నాడు: రామచంద్రా!

ఆ॥ సీత శుద్ధురాలు చిత్తవాక్కర్మంబు లందు సత్యమూర్తి యమల చరిత
పుణ్యసాధ్వి విడువ బోలదు చేకొను రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర! 354

అని వాల్మీకి మహర్షి చెప్పగా, సీత తన పవిత్రతను నిర్ధారిస్తు ప్రమాణం చెయ్యవలసినదిగా రాముడు కోరాడు. శ్రీరాముని తప్ప ఇతరుల గురించి, కలలోనైనా చింతించనట్టి తనయొక్క శీలాన్ని మాటిమాటికీ నిరూపించుకొనుమని కోరే ఆ భర్త, ఆప్రజలూ, ఆ భూమీ తనకు అక్కరలేదని చెప్పి కుశలవులను వాల్మీకి మహర్షికి ఒప్పజెప్పి, "తల్లీ నన్ను నీలో చేర్చుకో" అని భూమాతను ప్రార్థించి శ్రీరామచంద్రుని పాదాలపై ధ్యానము నిలిపి సీతాదేవి భూప్రవేశం చేసినది. శ్రీరాముడు ఎంతో దుఃఖించాడు. అతడు శ్రీమన్నారాయణుడే అయినా మానవ జన్మ ఎత్తినందుకు అందరి మానవులవలె రాగద్వేషాలకూ, సుఖదుఃఖాలకూ లోనైనట్లే ఉండడం జగన్నాటకంలోని ఒక భాగమేకదా! శ్రీరాముడు బ్రహ్మచర్యవ్రతం పాటిస్తూ పదకొండు వేల సంవత్సరాలు యజ్ఞయాగాదులను చేస్తూ గడిపి, చివరకు నిజ ధామానికి వెళ్లిపోయాడు. లోకకల్యాణం కోసం శ్రీరామునిగా అవతరించిన భగవానుడు పడరాని పాట్లు పడుతూ, ధీరుడై అన్నింటినీ ఎదుర్కొంటూ ఒక ఆదర్శమానవునిగా, ఆదర్శపుత్రునిగా ఆదర్శపతిగా, ఆదర్శసోదరునిగా, ఆదర్శ మిత్రునిగా, ఆదర్శ శత్రువుగా, ఆదర్శ ప్రభువుగా, లోకులకు మార్గదర్శకునిగా వెలశాడు.

## ఇక్ష్వాకు వంశము - నిమి, విదేహులు

ఇక్ష్వాకువుయొక్క కుమారుడు నిమి. అతడొక సత్రయాగాన్ని చేయ సంకల్పించి, వశిష్ఠుని ఋత్విక్కుగా నుండుడని అర్థిస్తాడు. వసిష్ఠుడు సరే అని ఒప్పుకొన్నాడు కాని అంతకు ముందే ఒప్పుకొన్న ఇంద్రుని యాగము ముగించి వచ్చేవరకు వేచియుండుమన్నాడు. కాని రేపు మనది కాదు గనుక సంకల్పించిన సత్కార్యానికి కాలయాపన చెయ్యరాదని భావించిన నిమి వేరే ఋత్విజులచే యజ్ఞము చేయించుకొన్నాడు. తిరిగి వచ్చిన వసిష్ఠుడు కుపితుడై "నీవు విదేహుడవు (దేహములేని వాడవు) అగుదువు గాక!" అని శపించాడు. అకారణంగా గురువు తనను శపించినందుకు నిమి వసిష్ఠునకు ప్రతిశాపమివ్వగా అతడు కూడ విదేహుడైనాడు. ఇద్దరూ దేహత్యాగము చేశారు. నిమియొక్క దేహాన్ని మునులు సుగంధ ద్రవ్యాలతో భద్రపరచి సత్రయాగాన్ని కొనసాగించి, ముగించారు. యాగదేవతలు ప్రత్యక్షముకాగా, మునులు నిమిని బ్రతికింపుమని ప్రార్థించారు. నిమి బ్రతికాడుకాని, అనిత్యమూ, సుఖ దుఃఖ పీడితమూ, అహంకార మోహ మమకారాలకు మూలమూ అయిన ఈ శరీరము తనకు అక్కరలేదన్నాడు. అప్పుడు దేవతలు నిమికి ఇలా వరమిచ్చారు. "ఈ నిమి సూక్ష్మ దేహములోనుంటూ, దేహధారులు కనురెప్పలు మూస్తూ తెరుస్తూ ఉన్నప్పుడు గుర్తింపబడుతుండుగాక!" అన్నారు. (అందుకే రెప్పపాటులను నిమిషాలు అంటారేమో!) రాజులేని రాజ్యములో అరాచకత్వం ప్రబలుతుంది గనుక మునులు నిమి యొక్క శరీరాన్ని మథించగా ఒక వ్యక్తి ఉద్భవించాడు. మథించగావచ్చిన వాడు కనుక మిథిలుడనబడ్డాడు. అలాగే మాతృ దేహము నుండి జన్మించక, జీవుడు లేని శరీరంనుంచి వచ్చాడు గనుక విదేహుడనబడ్డాడు. శరీరమునుండి జనించాడు కనుక జనకుడనబడ్డాడు. అతడు విదేహరాజ్యాన్ని మిథిలానగరాన్నీ స్థాపించాడు. ఆదేశాన్ని పరంపరగా పాలించిన రాజులందరూ జనకులనీ, మైథిలులనీ, విదేహులనీ పిలువబడ్డారు. (సీతమ్మ తండ్రి కూడ ఒక జనకుడే. అతని నామధేయము సీరధ్వజుడు). ఈ నిమి వంశసంజాతులైన మైథిలులందరూ (జనకులందరూ) ఉత్తమ గృహస్థులూ, ఆత్మజ్ఞాన సంపన్నులైన రాజర్షులుగా వెలశారు.

నిమిచే శపింపబడిన వసిష్ఠుడు ఊర్వశిని చూచి చలించిన మిత్రావరుణుల వీర్యస్ఖలనం వలన బిడ్డడై జన్మిస్తాడు.

# చంద్ర వంశము - పురూరవుడు

బ్రహ్మమానసపుత్రుడైన అత్రిమహాముని యొక్క ఆనందబాష్పపూరిత చూపులనుండి చంద్రుడు ఉద్భవించాడు. బ్రహ్మదేవుడు చంద్రునకు నక్షత్రాలపైన, ఓషధులపైన, విప్రులపైన ఆధిపత్యాన్నిచ్చాడు. అతనిని సోముడు అని కూడ అంటారు. అతడు రాజసూయ యాగాన్ని చేసి, ముల్లోకాలనూ జయించాడు. అతడు అందరినీ ఆకర్షించగల సుందరరూపము గలవాడు. అతనిలో గర్వాహంకారాలు బాగా పెరగటంచేత యుక్తాయుక్తవిచక్షణ క్షీణించసాగినది.

దేవతల గురువైన బృహస్పతి భార్య తార. ఆమె ఒక అందాల రాశి. సోముడు ఆమెను బలవంతంగా లేవదీసుకొనిపోయాడు. అతని అందాల ఆకర్షణకు ఆమె వివశురాలైపోయి, అతనితోనుండసాగినది. భార్యను ఎక్కువగా ప్రేమిస్తున్న బృహస్పతి, ఆమెను విడిచి ఉండలేక, ఆమెను ఒదిలిపెట్టుమని సోముని అనేకసార్లు బ్రతిమిలాడుకొనెను. సోముడు ఆమెను విడువనందున వారిద్దరికీ బద్ధవైరమేర్పడినది. ఇదే అదను అనుకొని, బృహస్పతి పైన ద్వేషంగల రాక్షసగురువైన శుక్రాచార్యుడు సోమునినైపు చేరగా, ఇంద్రుడు బృహస్పతిని బలపరచాడు. ఇది ఒక దేవదానవ యుద్ధంగా తయారయినది. రెండు పక్షాలవారూ బాగా నష్టపోయారు. బృహస్పతి తండ్రియైన అంగిరసుడు, ఈ యుద్ధాన్ని నిలుపు చేయింపుమని బ్రహ్మను కోరాడు. బ్రహ్మదేవుడు సోముని మందలించి, తారను బృహస్పతికి ఇప్పించాడు. గర్భిణిగా తిరిగి వచ్చిన తార, బంగారు మేని ఛాయతోనున్న ఒక అందాల బాలుని కన్నది. ఆ బిడ్డను చూడగానే బృహస్పతికీ, సోమునకూ మోహము పుట్టుకొచ్చినది. వాడు నా కొడుకే అని ఇద్దరూ వాదులాడుకొన్నారు. ఈ వివాదం కొనసాగి వృద్ధి చెందే సరికి మళ్లీ బ్రహ్మదేవుడు జోక్యం కలిగించుకొన్నాడు. తారను ఏకాంతంగా పిలిచి, అసలు విషయం తెలుసుకొన్నాడు. బిడ్డడు సోముని కొడుకని తెలుసుకొని అతని కిప్పించాడు. ఆ బాలుడు బుద్ధిమంతుడని గ్రహించి, బ్రహ్మ వానికి బుధుడు అనే నామధేయమిచ్చాడు. బుధుడు అన్ని విధాలా బుద్ధిమంతుడై, రూపవంతుడై పెద్దవాడైనాడు. అతడు వైవస్వత మనుపుత్రుడైన శ్రాద్ధ దేవుని పుత్రిక అయిన ఇళను ప్రేమించి, ఆమెయందు పురూరవుడనే కుమారుని పొందాడు.

పురూరవునకు తండ్రియొక్క వివేకము, పితామహుడైన సోముని యొక్క సౌందర్యమూ సంక్రమించాయి. అతడు పెద్దవాడై చంద్రవంశానికి ప్రప్రథమ మహారాజైనాడు. అతని గొప్పతనము, శౌర్యము, సౌందర్యమూ, ఔదార్యమూ, ధర్మనిష్ఠాది సద్గుణాలు దశదిశలావ్యాపించి పొగడబడుతుండేవి. ఒకనాడు ఇంద్రసభలో నారదుడు పురూరవుని ఘనతను కొనియాడు తుండగా వినియున్న ఊర్వశికి అతనిపై మనస్సు లగ్నమైనది. మిత్రావరుణుల శాపంవలన ఆమె భూలోకంలో మానవ రూపంలో నుండవలసియుండెను. ఆమె పురూరవుని వద్దకు వెళ్లి, అతని సౌందర్యం చూచి ముగ్ధురాలైనది. అతడు కూడ ఆమెను చూచి మోహపరవశుడై దిగ్భ్రాంతి చెందాడు. కొంతసేపటికి ఇలా అన్నాడు: "ఓ త్రిలోక సుందరీ! నీవెవ్వరవు? నిన్ను చూచి, నామతి చలిస్తున్నది. నీకు సర్వమూ అర్పించాలనిపిస్తున్నది. నీవు నా భార్యవు కాగలవా?" అని అడిగాడు. "ఓ శశివంశ శ్రేష్ఠుడా! నీవంటి సుందరమూర్తి యొక్క కోరికను ఈ ముల్లోకాల్లో ఏ స్త్రీ అయినా కాదనగలదా? కాని నేను నీ భార్యను అవడానికి నావి కొన్ని షరతులున్నవి. వాటిని పాటిస్తానని నీవు మాట ఇవ్వాలి. మొదటిది: ఈ రెండు పొట్టేళ్లూ నాకు ప్రాణసమానమైనవి. వీటిని నీవు ఎల్లప్పుడూ కంటికి రెప్పలాగ కాపాడుతూ ఉండాలి. రెండవది: నీవెన్నడూ నాకు నగ్నముగా కనపడరాదు. మూడవది: నేను నేతిని తప్ప ఇంకేమీ భుజించను. నీకు కూడ నెయ్యి ఇష్టమైయుండాలి. వీటికి నీవు సమ్మతిస్తే, నేను నిన్ను సకల స్వర్గసుఖాలలో ముంచి తేల్చుతాను" అని చెప్పినది. రాజు అన్ని షరతులకూ అంగీకరించాడు. వారు భార్యాభర్తలై ఒక్క క్షణమైనా విడిచి యుండక రేయింబవళ్లు విహరిస్తూ, వినోదిస్తూ, శృంగార భోగాలననుభవిస్తూ ఎన్ని సంవత్సరాలు గడిపివేశారో లెక్క లేదు.

ఒక రోజు సభలో ఊర్వశి లేకపోవడం ఇంద్రునకు ఎంతో వెలితి అనిపించి, ఆమె ఎక్కడున్నా వెదకి తీసుకు రమ్మని గంధర్వులను పంపించాడు. వారు వెదకి వెదకి ఆమె ఉనికిని కనిపెట్టి, పురూరవుడూ, ఊర్వశీ గాఢనిద్రలో నున్న సమయంలో ఆ రెండు పొట్టేళ్లను అపహరించి, లాక్కొనివెళ్లుతుంటే అవి అరచినవి. ఆ అరుపులకు నిద్రాభంగమైన ఊర్వశి ప్రక్కనే ఉన్న పురూరవునిపై మండిపడి, అతనిని లేపివేసి నానా దుర్భాషలాడి అవమానించినది. "నా ప్రాణసమానమైన, నా బిడ్డలవంటి పొట్టేళ్లను ఎవరో అపహరించుకొని పోతుంటే మగతనంలేని వానిలాగ కదలవేమి? నీవొక గొప్ప వీరుడవనుకొని నేను మోసపోయాను. ఇలాంటి భీరుడవైన నీకు చక్రవర్తిత్వము ఇచ్చినబ్రహ్మ వెర్రివాడు" అంటూ ఇంకా అనేకమైన పరుషవాక్కులాడినది. ఆ రాజు రోషముతో లేచి కత్తి పట్టుకొని పోయి గొర్రెలను విడిపించుకొని వచ్చాడు. ఈ సందడిలో అతని పంచవీడిపోయి అతడు దిగంబరు డయ్యాడు. ఇంతలో ఇంద్రుని మాయచేత ఒక పెద్ద మెరుపు మెరిసి, అతని నగ్నరూపాన్ని ఊర్వశి చూచినది. నియమ భంగమైనందుకు మారుమాటాడకుండా అంతర్ధానమయినది. చంద్రవంశపు చక్రవర్తి అయిన పురూరవుడు పిచ్చివానిలాగా అయిపోయాడు. ఊర్వశిలేని జీవితం వ్యర్థం అనుకొన్నాడు. ఆమెకోసం ఊళ్లూ అడవులూ దేశాలూ వెదికాడు. చివరకు సరస్వతీనదీతీరాన చెలికత్తెలతో విహరిస్తున్న ఆమెను చూచాడు. దీనుడై ఇలాగ వేడుకొన్నాడు: "ఓ ప్రియతమా! నన్ను విడిచి నీవు ఇలాగ ఎందుకు వెళ్లిపోయావు? ఇది నీకు న్యాయమేనా? నిన్ను విడిచి ఉండగలనా? నాపై కరుణించి, నా చెంతకు తిరిగి రావా? నీవు రాకపోతే నా శరీరము శిథిలమై కృశించిపోయి, చివరకు తోడేళ్లు గ్రద్దలపాలుకాదా?" అని ప్రాధేయపడ్డాడు. ఆమె పకపకా నవ్వుతూ ఇలాగన్నది. "రాజా! ఒక ఆడుదానికి దాసోహం అంటూ ఇంతగా దీనుడవై దిగజారిపోవడం చంద్రవంశపు చక్రవర్తి అయిన నీకు తగియున్నదా? స్త్రీల సంగతి ఇంకా నీకు పూర్తిగా తెలియదు. వాళ్లు చపల చిత్తలు, తమ స్వార్థానికి అడ్డు వచ్చేవారిని క్షమించరు. తోడేళ్ల వంటివారు. ముఖ్యముగా స్వేచ్ఛా విలాసాలకు అలవాటుపడినవారు, ప్రేమ నటిస్తారు గాని దయలేనివారు. నమ్మరాని వారు. వారు తమ మాటలలో అమృతం ఒలికిస్తారు గాని చేతలలో చిచ్చుపెడ్తారు. ఎలాంటి పనికైనా సాహసిస్తారు. అందుచేత నాపైన కూడా నీవు అంతగా ఆశలు పెట్టుకొనడం మంచిదికాదు. నీవు నన్ను సంవత్సరాంతములో కలుసుకొంటే ఒక సర్వలక్షణ సంపన్నుడైన పుత్రుని పొందగలవు"అని చెప్పి వెళ్లిపోయినది. ఆమెను తిరిగి కలుసుకొనబోతున్నందుకూ, ఆమె తనకొక వారసుని ఇవ్వబోతున్నందుకు రాజు ఆనందంతో గంతులు వేశాడు. ఆమె కోరినట్లుగనే అతడు సంవత్సరాంతాన ఆమెను కలుసుకొని ఒక రాత్రి గడిపాడు. విడిపోయే సమయం వచ్చినప్పుడు అతడు మళ్లీ విచారంలో మునిగి పోయాడు. ఆమె దయతలచి, ఇలా చెప్పినది. "రాజా! నీవు గంధర్వులను ఆరాధిస్తే, వారు నీకు మాలోకానికి వచ్చే పద్ధతి చెపుతారు." అని చెప్పి వెళ్లిపోయినది. పురూరవుడు గంధర్వులను ప్రార్థించాడు. వారు ప్రసన్నులై, ఒక అగ్ని పాత్రనిచ్చి, మంత్ర విధులను చెప్పుతారు. కాని అతడు వాటిని గ్రహించలేక ఆ కుంపటిని ఆ వనములోనే విడిచి పెట్టి, నిరాశ జెంది వెళ్లిపోయాడు. తరువాత త్రేతాయుగ ప్రారంభంలో పురూరవుని మనస్సులో వేదము ఆవిర్భవించినది. అతడు ఆ అగ్ని స్థాలిని (కుంపటిని) విడిచి పెట్టిన స్థలానికి వెళ్లి చూడగా అక్కడ ఒక జమ్మి చెట్టు దానినుండి ఒక రావి చెట్టూ పుట్టి యున్నవి. ఆ రావిచెట్టు కర్రతో రెండు అరణులు చేసి, మంత్రాలనుచ్చరిస్తూ మథించ సాగాడు. దానినుండి జాతవేదుడనే అగ్ని పుట్టినది. ఆ అగ్ని పురూరవుని పుత్రునిగ భావింపబడినది. ఆ అగ్నిద్వారా అతడు యజ్ఞేశుడైన శ్రీహరిని ఆరాధించి, గంధర్వలోకమునుచేరి, ఊర్వశిని పొందగలిగాడు. వారికి ఆరుగురు పుత్రులు కలిగారు. వారి ద్వారా చంద్రవంశము విస్తరించినది.

త్రేతాయుగానికి పూర్వము (కృతయుగంలో) అగ్ని అఖండమైయుండేది. నారాయణుడొక్కడే దైవము. ప్రణవము (ఓంకారము) ఒక్కటే వేదమైయుండేది. సర్వవాఙ్మయమూ ఓంకారములోనే ఉండేది. ఒకే వర్ణముండేది. త్రేతాయుగంలో పురూరవునిద్వారా మూడు వేదాలు ఆవిర్భవించాయి. పురూరవుడు తన బుద్ధి పెంపుచే శక్తి హీనులకు

కూడ కర్మమార్గము సుగమయ్యేటట్టుగా, ఒక్కటిగానున్న అగ్నిని, గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అనే మూడు అగ్నులను ఏర్పరిచాడు. ఈ మూడు అగ్నులూ మూడు వేదాలకు ప్రతినిధులు.

## పరశురామావతారము

పురూరవుని వంశములో గాధి అనే మహారాజు జన్మించాడు. అతనికి సత్యవతి అనే పుత్రిక ఉండేది. ఆ సత్యవతిని తనకిమ్మని భృగు వంశపు బ్రాహ్మణుడైన ఋచీకుడు గాధిరాజును కోరాడు. అతడు ఎంత వరకు యోగ్యుడో తెలుసుకొందామని గాధిరాజొక కఠిన పరీక్షను పెట్టాడు. తెల్లని మృదువైన దేహము నల్లని చెవులూ ఉన్న ఒక వెయ్యి అశ్వాలను తెచ్చి ఇమ్మన్నాడు. ఋచీకుడు వరుణుని ప్రార్థించి, మెప్పించి అలాంటి అశ్వాలను సంపాదించి తెచ్చి గాధిరాజునకిచ్చాడు. గాధిరాజు సంతోషించి సత్యవతిని ఋచీకునకిచ్చి వివాహం చేశాడు.

గాధిరాజునకు పుత్రులు లేరు. ఋచీకునకు సంతానము లేదు. అందుచేత సత్యవతీ, ఆమె తల్లీ పుత్రులు పుట్టే క్రతువు చేయుమని ఋచీకుని కోరినారు. ఋచీకుడు క్షాత్ర మంత్రములతో అత్తగారి గురించి ఒక చరువును బ్రహ్మ మంత్రాలతో భార్య గురించి ఒక చరువును తయారు చేసి, సిద్ధముగానుంచి, నిత్యకర్మలను చెయ్యడానికి నదికి వెళ్ళాడు. ఇంతలో తొందరపడిన అత్తగారు తన కుమార్తె గురించి ఉంచబడిన చరువును భుజించగా, మిగిలియున్న రెండవ చరువును సత్యవతి భుజించినది. ఋచీకుడు వచ్చి, జరిగిన మార్పును గురించి తెలుసుకొని భార్యపై కోపించినాడు: "మీరు చేసిన ఈ తెలివి తక్కువ పనికి ఫలితం ఏమిటంటే, నీకు పుట్టవలసిన బ్రహ్మజ్ఞాని అయిన బ్రాహ్మణుడు నీతల్లికిని, రాజసిక తామసిక గుణాత్మకాలైన కామక్రోధాదులతోగూడిన కుమారుడు నీకును కలుగుతారు" అని చెప్పగా ఆమె ఖిన్నురాలైనది. మార్గాంతరం చెప్పుమని భర్తను వేడుకొన్నది. అప్పుడు ఋచీకుడు ఇలా అన్నాడు: "దీనిని పూర్తిగా తప్పించడం జరగదు గాని, ఒక తరము తరువాత సంభవించేటట్టు చేయవచ్చును. దానివల్ల నీకు పుట్టబోయే వాడు సాత్త్వికుడౌతాడుగాని, అతని పుత్రుడు మాత్రము క్షాత్రగుణాలతో ఘోర స్వభావుడవుతాడు" అని చెప్పగా ఆమె తృప్తి జెందినది. ఆమెకు శాంత స్వభావుడైన జమదగ్ని జన్మిస్తాడు. తరువాత కొన్నాళ్లకు సత్యవతి కౌశికీ నదియై లోకపావని అవుతుంది. జమదగ్ని రేణువు యొక్క కుమార్తెయైన రేణుకను వివాహమాడుతాడు. వారికి విష్ణు - అంశతో పరశురాముడనబడే పుత్రుడు జన్మిస్తాడు. అతనికి క్షాత్రగుణాలు మెండుగా నుండేవి. అతడు క్షత్రియద్వేషియై క్షత్రియ వంశనాశకునిగా ప్రసిద్ధి కెక్కాడు.

హైహయవంశపు రాజులలో కార్తవీర్యార్జునుడు గొప్పవాడు. అతడు నారాయణాంశసంభూతుడైన దత్తాత్రేయుని ఆరాధించి, ఆయన అనుగ్రహించే వెయ్యి చేతులూ అణిమాది సిద్ధులూ, యశస్సూ, ఓజస్సూ, శత్రువిజయమూ వరాలుగా పొందాడు. ఒకనాడు ఆ రాజు తన భార్యలతో రేవానదిలో జలక్రీడలాడుతూ తన వెయ్యి చేతులతో నదీ ప్రవాహాన్ని అడ్డగించగా ఆ జలమంతా నిలిచిపోయినది. ఒడ్డునే దేవతారాధన చేసుకొంటున్న రావణుని చుట్టుముట్టినది. రావణుడు పట్టలేనంత ఆగ్రహంతో కార్తవీర్యునితో పోట్లాటకు రాగా అతడు రావణుని ఒక కోతి పిల్లను పట్టుకొన్నట్లు పిడికిటిలో పట్టుకొని, రాజధానియైన మాహిష్మతీ నగరానికి తెచ్చి బంధించి, తరువాత విడిచి పెట్టేశాడు. రావణుడు తీవ్ర అవమానంతో వెళ్లిపోయాడు.

ఒకనాడు కార్తవీర్యుడు వేటకువెళ్లి అలసిపోయి, ఆకలితో జమదగ్ని ఆశ్రమాన్ని ప్రవేశించాడు. మునీంద్రుడు రాజునకూ సకల పరివారానికీ ఆదరముతో మృష్టాన్నం పెట్టించాడు. రాజు ఆశ్చర్యపోయి అది అంతా మునివద్దనున్న కామధేనువుచే ప్రసాదింపబడినట్టు తెలుసుకొని, మునిపై అసూయ జెందాడు. ఆ కామధేనువును తోలుకొని రమ్మని భటులకు ఆజ్ఞాపించాడు. వాళ్లు బలవంతముగా ఆ ధేనువును లాగుకొని పోయారు. తరువాత ఆశ్రమానికి వచ్చిన పరశురాముడు విషయం తెలుసుకొని, ఉగ్రుడై కవచము గండ్రగొడ్డలి విల్లమ్ములూ ధరించి, సింహంలాగా లంఘించి

వెళ్లాడు. భూమిదద్దరిల్లేటట్టు గర్జిస్తూ, క్రోధావేశపరుడై, ప్రళయకాలరుద్రునివలె నడచివస్తున్న బ్రాహ్మణయువకుడైన భార్గవ రాముని చూచి, కార్తవీర్యార్జునుడు మహా బలగర్వ - అహంకార దర్పాలతో అట్టహాసంగా నవ్వుచు ఇలాగన్నాడు:

ఉ॥ బాలుడు వెఱ్ఱి బ్రాహ్మణుడు బ్రాహ్మణుకైవడినుంటమాని భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబుదక్కి క
య్యాలకు వచ్చినాడు మనయందిక పాపము లేదులెండు లెం
డేల సహింప భూసురుని నేయుడు వ్రేయుడు గూల్చుడిమ్మహిన్. 448

అని కార్తవీర్యుడు రథ, గజ, తురగ, పదాతి దళాలతో కూడిన పదిహేడు అక్షౌహిణుల సైన్యముతో భార్గవ రాముని ఎదుర్కొన్నాడు. పరశురాముడు వీరావేశముతో గండ్రగొడ్డలితో చిందులు వేస్తూ విజృంభించాడు. శత్రువుల బాణాలను గడ్డిపోచలలాగా ఖండించి పారేశాడు. వరిమొక్కలను కోసివేసినట్లు సైనికుల కాళ్లు తెగగోసినాడు. ఏనుగుల కాళ్లను తొండాలను అరటి బోదెలవలె నరికివేయగా అవి భయపడి తమసేనలనే త్రొక్కివేసి నాశనం చేశాయి. నేలగూలిన సేనను చూచి "ఈ బ్రాహ్మణుడొక్కడే ఇంత సైన్యాన్ని హతమార్చాడే, వీడు సామాన్యుడు కాడు. ఉపేక్ష చేయరాదు." అని తలపోసి, తన 500 చేతులతో బాణాలను, 500 చేతులతో ధనుస్సులనూ పట్టుకొని, శరవర్షం కురిపించాడు. అప్పుడు భార్గవరాముడు తన ధనుస్సును ఎక్కుపెట్టి ఒక్క బాణముతోనే కార్తవీర్యుని 500ల ధనుస్సులనూ ముక్కలు చేశాడు. అప్పుడు అతడు చెట్లనూ బండరాళ్లనూ తన వెయ్యి చేతులతో పీకి విసురుతుంటే, పరశురాముడు వాటినన్నిటినీ ఖండిస్తూ చివరకు కార్తవీర్యుని వెయ్యి చేతులనూ ఖండించి వేశాడు. అతడు కొండవలె నేలకూలగా అతని శిరస్సును కూడా ఖండించి వేశాడు. అతని యొక్క పదివేల మంది పుత్రులూ భయపడి పారిపోయారు. శత్రునాశనం సంపూర్ణమైన తరువాత భార్గవరాముడు కామధేనువునూ, దూడనూ ఆశ్రమానికి తోలుకొని వెళ్లాడు.

జమదగ్ని పరశురాముని నుండి క్షత్రియక్షయమును గురించి వివరాలను తెలుసుకొని, చాలా ఖిన్నుడైనాడు. ఇలా బోధించాడు: "కుమారా! రామా! దేవతలు రాజునందు తమతమ అంశలను ఉంచుతారు. రాజ్యాన్ని పాలించే రాజును చంపడం బ్రహ్మ హత్యకంటే ఎక్కువ పాపకరము. బ్రాహ్మణులకు క్షమయే ధర్మము కదా!

క॥ తాలిమి మనకును ధర్మము
తాలిమి మూలంబు ధర్మతత్త్వంబునకున్
తాలిమి గలదని యీశుం
డేలించును బ్రహ్మ పదము నెల్లన్ మనలన్. 461

క॥ క్షమ కలిగిన సిరికలుగును
క్షమ కలిగిన వాణి కలుగు సౌఖ్యము లెల్లన్
క్షమ కలుగ దోన కలుగును
క్షమ కలిగిన మెచ్చు శౌరి సదయుడు తండ్రీ. 462

నాయనా! క్షమయే మన ధర్మము. ధర్మతత్త్వానికి క్షమయే మూలము. క్షమ కలిగి యుండడం చేతనే సర్వేశ్వరుడు బ్రహ్మ పదాన్ని మనల నందరినీ, పరిపాలిస్తున్నాడు. క్షమ కలిగియుంటే సిరి కలిగి యుంటుంది. క్షమ కలిగియుంటే విద్య అబ్బుతుంది, సౌఖ్యాలన్నీ కలుగుతాయి. క్షమ కలిగియుంటే దయామయుడైన ఆ శ్రీహరి మెచ్చుతాడు. అందుచేత, నాయనా! నీ పాపపరిహారానికి నీవు తీర్థయాత్రలు చేసిరావాలి" - అని తండ్రి చెప్పగా భార్గవ రాముడు ఒక సంవత్సరం పాటు తీర్థయాత్రలు చేసివచ్చాడు.

ఒకరోజు జమదగ్ని భార్య అయిన రేణుక నీళ్లుతేవడానికి నదికి వెళ్లగా అక్కడ చిత్రరథుడనే గంధర్వుడు అప్సరసలతో జలకాలాడుతుండడం చూచినది. ఆహా! ఇతడెంత అందంగానున్నాడో - అనుకొని క్షణం సేపు ముగ్ధురాలైపోయి అక్కడే కాలయాపనం చేసినది. భర్తయొక్క అగ్ని హోత్రాది కర్మలకు ఆలస్యమయినదని గుర్తుకు వచ్చి, వడివడిగా తడబడే అడుగులతో కడవ నెత్తుకొని అడలిపోతూ వచ్చిన భార్యయొక్క తత్తరపాటును చూచి, జమదగ్ని దివ్యదృష్టిలో అంతా గ్రహించి, ఆమె మానసిక వ్యభిచారానికి పాల్పడిన పాపానికి ఆమె శిరస్సును ఖండింపుమని ఒక్కొక్క కుమారుని పిలిచి ఆదేశించాడు. ఆ ఘోరకృత్యాన్ని 'నేను చెయ్యలేను' అని ప్రతి ఒక్కడూ చెప్పగా ఆఖరివాడైన పరశురాముని పిలిచి, తల్లిని, అన్నల శిరస్సులు ఖండింపుమని తండ్రి ఆజ్ఞాపించాడు. అతడు మారుమాటాడకుండా తండ్రి పాదాలకు మ్రొక్కి ఎటువంటి సంకోచమూ లేకుండా తండ్రి ఆజ్ఞను నెరవేర్చాడు. అలాగ చెయ్యకపోతే తండ్రి శపిస్తాడనీ, చేస్తే సంతోషించి వరమిస్తానన్నప్పుడు మృతులను బ్రతికింపుమని కోరవచ్చుననీ, రాముడు భావించి తండ్రి ఆజ్ఞను వెంటనే నెరవేర్చాడు. అతడూహించినట్లే అతని పితృవాక్యపాలనకు సంతసించిన తండ్రి వరం కోరుకొమ్మనగానే, "తండ్రీ! నాచే చంపబడిన నా తల్లీ, సోదరులూ పునర్జీవులుకావాలనీ వారు చంపబడి బ్రతికిన విషయం వారికి తెలియకుండా ఉండాలనీ, నేను వరము కోరుకొంటున్నాను" అని వేడగా జమదగ్ని యొక్క ఆగ్రహం పోయినది. అతడు అందరినీ బ్రతికించగా, వారు అప్పుడే నిద్రనుండి లేచిన వారిలా లేచి కూర్చున్నారు.

పరశురామునిపై పగ తీర్చుకోవాలని పొంచియున్న కార్తవీర్యుని పుత్రులు ఒకనాడు అతడు ఆశ్రమంలోలేని సమయంలో ఏకాంతంగా ధ్యాననిష్ఠలో కూర్చొనియున్న జమదగ్నిముని శిరస్సును ఖండించి వెళ్లిపోయారు. నిస్సహాయ అయిన రేణుక గుండెలు బాదుకొంటూ. "రామా! రామా!" అని అరవసాగినది. రేణుక (తల్లి) రోదన విని, కుమారులందరూ వచ్చిచేరారు. ఆమె భర్త శరీరంపైబడి రోదిస్తూ ఇరవైయొక్క సార్లు గుండెలు బాదుకోవడం పరశురాముడు గమనించి, అన్నలతో ఇలా అన్నాడు: "తండ్రిగారి శరీరాన్ని జాగ్రత్తగా కాపాడండి. నేను వాళ్ల పని పట్టి వస్తాను." అని చెప్పి గండ్రగొడ్డలిని చేతబూని, ప్రళయ కాలరుద్రునివలె మెరుపు తీగలాగ మాహిష్మతీపురం చేరుకొన్నాడు. కార్తవీర్యుని పుత్రులందరినీ తన గండ్ర గొడ్డలికి ఆహుతిచేసి హతమార్చాడు. అయినా అతని ఆగ్రహం శమించలేదు. భూమిమీద క్షత్రియుడెవ్వడూ మిగిలియుండరాదని ప్రతినబూని, ఇరవై యొక్క సార్లు భూమండలమంతా గాలించి క్షత్రియులను నిశ్శేషంగా అంతము చేశాడు. రాజుల రక్తంతో ఐదు మడుగులు నిండిపోయినవి. అవి శమంతపంచకమనబడే పుణ్యక్షేత్రములైనవి. తండ్రి తలను శరీరముతో చేర్చి యాగము చేశాడు. జమదగ్ని సంకల్ప శరీరాన్ని పొంది సప్తఋషి మండలం చేరాడు. రాజులను చంపి గెల్చిన భూభాగాలను హోత మొదలైన యజ్ఞ కర్తలకు, సదస్యులకూ ఇచ్చివేశాడు పరశురాముడు. యజ్ఞం ముగిసిన తరువాత సరస్వతీ నదిలో అవభృథస్నానముచేసి, పవిత్రుడయ్యాడు. పరశురాముడు ఇప్పటికీ మహేంద్రపర్వతంపై తపోనిష్ఠుడై ప్రకాశిస్తున్నాడు. ఈ విధంగా దుష్ట రాజులను అంతమొందించడానికి శ్రీహరి అవతరించాడు.

ఋచీకుడు చేసిన క్రతువువలన గాధిరాజునకు అగ్నితేజస్సుతో విశ్వామిత్రుడు జన్మించాడు. అతనికి నూరుగురు పుత్రులు. అతడు క్షాత్రధర్మాన్ని విడిచి బ్రహ్మర్షి అయినాడు. హరిశ్చంద్రుడు చేసిన నరమేధ యాగములోని యజ్ఞపశువైన శునశ్శేపుడనే భృగువంశపు బ్రాహ్మణయువకుని దేవతలు కరుణించి విముక్తి చెయ్యగా, అతనిపై జాలిపడి విశ్వామిత్రుడు అతనిని పుత్రునిగా తెచ్చి తన వందమంది కొడుకులతో అతనిని అన్నగా స్వీకరింపుమంటాడు. వారిలో మొదటి 50 మందీ నిరాకరించారు. రెండవ ఏబదిమందీ శునశ్శేపుని (దేవరాతుని) తమ అన్నగా స్వీకరిస్తారు. విశ్వామిత్రుడు మొదటి ఏబది మందినీ మ్లేచ్ఛులు కండు అని శపించి దేవరాతుని అన్నగా స్వీకరించిన మధుచ్ఛందుడూ మొదలైన ఏబదిమందినీ సంతానవంతులు కండు అని దీవించాడు.

# యయాతి

పురూరవుని పౌత్రుడైన నహుషునకు ఆరుగురు పుత్రులు. నహుషుడు గొప్ప చక్రవర్తియై వందయజ్ఞాలు చేయించి, ఇంద్ర పదవిని పొందినవాడు. కాని కొన్నాళ్లకు అధికారగర్వము మదము పెరగడంచేత ఇంద్ర పత్నియైన శచీదేవిని పొందగోరి ఋషిశాపానికి గురియై, భూలోకంలో కొండచిలువయైపతనం పొంది, ద్వాపరయుగంలో యుధిష్ఠిరుని సంపర్కం కలిగి శాపవిముక్తుడౌతాడు. నహుషుడు ఇంద్రుడయిన తరువాత అతని రెండవ పుత్రుడు యయాతి రాజు అయి, తమ్ములకు కూడ రాజ్యభాగాన్నిచ్చి ధర్మయుతంగా పరిపాలిస్తాడు.

ఒకనాడు రాక్షసరాజుయొక్క (వృషపర్వుని) పుత్రిక అయిన శర్మిష్ఠ తమ గురువైన శుక్రాచార్యుని పుత్రిక దేవయానితోనూ, చెలికత్తెలతోనూ ఉద్యానవనంలోని కొలనులో స్నానము చేస్తుండగా పార్వతీ పరమేశ్వరులు నందివాహనులై వినువీధిలో వెళ్తుండడం చూచి సిగ్గుపడి, అందరినీ హెచ్చరించినది. కన్యలందరూ తత్తరపాటుతో ఒడ్డున నున్న తమతమ చీరలను తీసుకొని చుట్టేసుకొన్నారు. పొరపాటున దేవయాని చీరను శర్మిష్ఠ కట్టుకొన్నది. వారిద్దరూ పరస్పర ప్రేమలుగలవారే అయినప్పటికీ విధివశాన దేవయానికి పట్టరాని దురాగ్రహం వచ్చేసినది. ఆమెలోని ఆభిజాత్యాహంకారమూ, సౌందర్య గర్వమూ బుసలు కొడుతూబైటకు రాగా, శర్మిష్ఠతో ఆమె ఇలా అన్నది: "భృగువంశశ్రేష్ఠులైన బ్రాహ్మణులము మేము. మీ అసురులందరికీ గురువు మా తండ్రి. మీ తండ్రి నా తండ్రికి పాదపూజ చేసే సేవకుడు. అలాంటి అసురజాతికి చెందిన నీవు నా చీరను ధరించి, అపవిత్రం చేయడానికి నీకు ఎంత సాహసమే?" అంటూ నానాదుర్భాషలాడినది. సహజంగా తామసిక రాజసిక గుణాలు మెండుగానున్న అసుర జాతికి చెందిన రాజకన్య శర్మిష్ఠ. ఆమెకు ఇట్టే రోషం వచ్చేయడం స్వాభావికం. ఆమె వెంటనే ఇలా అన్నది. "నా తండ్రి యొక్క దయాదాక్షిణ్యాలపై బ్రతుకుతున్న యాచకుని కూతురువైన నీకు ఇంత అహంకారమా! రాక్షస రాజపుత్రికనైన నన్నే నీవు ఇలాగ తిడుతున్నావా? నీపని పట్టిస్తానుండు" అంటూ రెచ్చిపోయి, నగ్నంగా నున్న దేవయానిని చెలికత్తెలచే నొక పాడు నూతిలో పడవేయించినది.

వాళ్లంతా వెళ్లిన తరువాత వేటనుండి తిరిగి వస్తున్న యయాతి మహారాజు, ఆదారినే వెళ్ళుచూ, దాహం వెయ్యగా ఆ నూతి వద్దకు వచ్చాడు. నూతినుండి ఆర్తితోనున్న ఒక స్త్రీయొక్క మూలుగులు వినిపించగా లోనికి తొంగిచూచాడు. ఎండిన గడ్డి మొక్కలతోనున్న ఆనూతిలో తెల్లగా మెరిసిపోతున్న ఒక స్త్రీమూర్తి నగ్నముగా కనిపించగా అతడు జాలిపడి తన వస్త్రాన్ని విప్పి నూతిలో వేసి తన చేతిని అందించి, ఆమెను బైటకు లాగాడు. అప్పుడామె కృతజ్ఞతతో నిలా అన్నది: "ఓ మహానుభావా! నీవస్త్రాన్నిచ్చి నామానాన్ని రక్షించావు. నా ప్రాణాలను నిలబెట్టావు. నా కుడిచేతిని పట్టుకొని పాణిగ్రహణం చేశావు. అందుచేత నీవే నా భర్తవు కావడం విధి నిర్ణయంగా కనిపిస్తున్నది. ఆ కచుని వాక్యము నిజమవుతున్నట్లు కనిపిస్తున్నది. ఓ పుణ్యశీలుడా! నాగురించి చెప్పుతాను విను. నేను అసురులగురువైన శుక్రాచార్యుని పుత్రికనైన దేవయానిని. నీవెవరవో నాకు తెలుపుము." అనగా రాజు ఇలా చెప్పాడు. "ఓ మానినీ! నేను చంద్రవంశానికి చెందిన నహుషచక్రవర్తి కుమారుడను. నన్ను యయాతి అంటారు. వేటనుండి తిరిగి వస్తూ ఈ నూతి వద్దకు వచ్చాను. నీవీ స్థితిలోనుండడానికి కారణమేమిటి?" అని అడుగగా ఆమె ఇలా చెప్పినది: "రాజా! రాక్షసరాజైన వృషపర్వుని కుమార్తెకు, నాకు ఒక చిన్న విషయంపై కలహం వచ్చి ఆమె నన్ను ఈ నూతిలో పడవేయించినది. ఈ విధంగా నిన్ను కలియడం ఆ కచుని శాపఫలమే ననిపిస్తున్నది. లోగడ బృహస్పతి పుత్రుడైన కచుడు నా తండ్రివద్ద మృతసంజీవనీ విద్యను రహస్యముగా నేర్చుకోవాలని వచ్చి కొన్నాళ్లున్నప్పుడు, నేను అతనిని ప్రేమించాను. గురుపుత్రికను అనే కారణంతో అతడు నా ప్రేమను తిరస్కరించాడు. ఆ అవమానం భరించలేక, నేను "నీ విద్య ఫలించకుండు గాక!" అని శపించాను. అప్పుడు అతడు నన్ను "నీకు బ్రాహ్మణుడు భర్త కాకుండుగాక!"

అని ప్రతిశాపం ఇచ్చాడు. దానివలననే మన కలయిక ఇలాగ సంభవించినట్లున్నది." అని చెప్పినది. ఆ బ్రాహ్మణసుందరిని చూచి, యయాతి పరవశుడైనాడు. "ఇది దైవనిర్ణయం లాగానే కనిపిస్తున్నది. లేకుంటే ఈమెను చూచి, నా మనస్సెందుకు చలిస్తుంది?" అని తలపోసి తన అంగీకారాన్ని తెలిపి వెళ్లిపోయాడు.

దేవయాని తండ్రివద్దకు పోయి, శర్మిష్ఠతో తనకు జరిగిన వివాదమంతా విన్నవించినది. అల్పులను ఆశ్రయించడం కంటే పక్షులవలె ఎప్పటికప్పుడు లభించిన దానితో తృప్తి జెంది యుండడం మేలు అని తలపోసిన శుక్రాచార్యుడు వృషపర్వుని కొలువు విడిచి, దేవయానితో వెళ్లిపోయాడు. గురుదేవుడు నిష్క్రమించిన విషయము తెలుసుకొని వృషపర్వుడు గురువును వెతుక్కొంటూ వెళ్లి పాదాలపై బడి తన్ను విడిచి వెళ్లవద్దనీ, తనకున్న శక్తీ కీర్తీ సంపదా సర్వస్వమూ గురుదేవుని అనుగ్రహముచే వచ్చిననే అనీ, గురువులేనిదే అసురులు జీవించలేరనీ ఎన్నో విధాల గురువును దేవయానిని కూడ రాజు బ్రతిమాలాడు. అప్పుడు దేవయాని ఉండడానికి ఒక షరతుపెట్టినది. శర్మిష్ఠ ఒక వెయ్యిమంది సేవికలతో తనకు బానిసగా నుండాలనీ, తాను వివాహమై వెళ్లిపోయినా తన వెంట వాళ్లంతా రావాలనీ కోరినది. తండ్రియొక్క శ్రేయస్సూ, యావత్తు రాక్షస రాజ్యం యొక్క శ్రేయస్సుకోసం శర్మిష్ఠ దేవయానికి బానిసగా నుంటూ ఆమెతో ఆమె భర్త గృహానికి వెళ్లడానికి కూడ ఒప్పుకొన్నది.

పిమ్మట శుక్రాచార్యుడు దేవయానిని క్షత్రియుడైన యయాతికిచ్చి వివాహం చేయనిశ్చయించాడు. బ్రాహ్మణకన్యను వివాహం చేసుకోడానికి యయాతి మొదట సంకోచించినా శుక్రాచార్యుని అనుమతితో, సమ్మతించాడు. దేవయానితోసహా శర్మిష్ఠ, ఇతర సేవికలూ వెళ్లవలసియున్నందున, "శర్మిష్ఠతో ఎలాంటి సంపర్కమూ పెట్టుకోవద్దు సుమా" అని అల్లుని శుక్రాచార్యుడు గట్టిగా హెచ్చరించాడు. యయాతి దేవయానితో సర్వసుఖాలూ అనుభవిస్తూ కొన్నాళ్లకు యదు, తుర్వసుడు అనే కుమారులను పొందాడు.

శర్మిష్ఠ రాజపుత్రిక, అపురూప సౌందర్యవతి. ఆమెను చూచినప్పటి నుండి యయాతికి ఆమెపై అనురాగం పుట్టినది. ఆమె ఒక రాజపుత్రిక అయి యుండి విధివశాన తన ఇంట్లో బానిసగా పడియున్నదని అతడు ఆమెపై జాలి తలచేవాడు. ఆమె ఉండడానికి మంచి వసతి ఏర్పాటుచేశాడు. ఆమె దీనవదనం చూచి, ఆమె దుఃఖాన్ని ఎలాగ తొలగించడమా అని ఆలోచించేవాడు. ఒకనాడు వారిద్దరూ ఉద్యానవనంలో అనుకొనకుండా కలుసుకొన్నారు. ఒకరి ప్రేమను ఇంకొకరికి తెలుపుకొన్నారు. క్షత్రియసమ్మతమైన గాంధర్వపద్ధతిని భార్యాభర్తలైనారు. శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనువు, పూరువు అనే ముగ్గురు పుత్రులు కలిగిన తరువాత దేవయానికి వారి సంబంధం గురించి తెలిసిపోయినది. ఆమె రోషంతో తండ్రి ఇంటికి వెళ్లి పోయినది. యయాతి కూడా భయపడుతూనే మామగారింటికి వెళ్లాడు. దేవయాని చెప్పినదంతా విని, శుక్రాచార్యుడు ఆగ్రహావేశపరుడై నిగ్రహములేకుండా కామపిశాచానికి వశుడై నీతి తప్పిన యయాతిని "నిన్ను వృద్ధాప్యము ఆవహించుగాక!" అని శపించాడు. అక్కడే ఉన్న యయాతి శర్మిష్ఠ యొక్క దుస్థితికి జాలిపడి ఆమె దుఃఖాన్ని కొంతవరకైనా తగ్గించే తలంపుతో తాను క్షత్రియోచిత కర్మచేశాననీ, కామవాంఛతో కాదనీ, శాపాన్ని ఉపసంహరించుమనీ ప్రార్థించాడు. శుక్రాచార్యుడు మెత్తపడి శాపాన్ని ఇలా మార్పు చేశాడు:

వృద్ధాప్యాన్ని ఒక యువకునితో మార్చుకొని అతని యౌవనం అనుభవించవచ్చుననీ, అవసరం తీరిన తరువాత యౌవనం ఇచ్చివేసి వృద్ధాప్యం స్వీకరించవచ్చుననీ మార్చినాడు. యయాతి తన ఐదుగురు కుమారులనూ విడివిడిగా పిలిచి – "నాయనా! నీ యౌవనాన్ని నాకిచ్చి, నా ముసలితనాన్ని స్వీకరిస్తావా?" అని ప్రాధేయపడ్డాడు. దేవయాని పుత్రులైన యదు, తుర్వసులూ, శర్మిష్ఠ పుత్రులైన ద్రుహ్య, అనువులూ ఇలా జవాబిచ్చారు: "తండ్రీ! శక్తిహీనమై, కళావిహీనమై, రోగాలకు నిలయమైన ముసలితనాన్ని మేము భరించలేము." అని చెప్పివేశారు. చివరివాడైన శర్మిష్ఠ

మూడవ కొడుకు పూరువు మాత్రము ఇలా అన్నాడు: "తండ్రీ! దానికి ఇంతగా వేడుకోవాలా? తండ్రికోరికను తీర్చడం తనయుని ధర్మము కాదా! ముసలితనాన్ని స్వీకరించడానికి నేను సంతోషంతో అంగీకరిస్తాను" అని చెప్పి, తన యౌవనాన్ని అర్పించి, తండ్రి వార్ధక్యాన్ని స్వీకరించాడు.

యయాతి ఏడు ద్వీపాలలోనున్న భూమండలాన్ని జనరంజకగా పాలించి, దేవయానితో తనివి దీరునట్లుగా ఇంద్రియభోగాలను అనుభవిస్తూ అనేకయాగాలు చేశాడు. ఒకనాడు, తాను ఇన్ని సంవత్సరాలుగా కామోపభోగాలలోనే జీవితాన్ని వ్యర్థం చేసేసినట్లు గుర్తించి, దేవయానితో ఇలా అన్నాడు. "దేవీ! చెక్కుచెదరని నీయొక్క యౌవనపు బిగీ, నీ సౌందర్యమూ నన్నెప్పుడూ కామతృష్ణలోనే బంధించి ఉంచుతున్నాయి. ఓ సుందరీ! వెయ్యేళ్లనుంచీ మనము కామకేళిలో మునిగి తేలుతున్నా ఆసక్తి మాత్రమూ ఏమీ తగ్గలేదు. శరీరం శక్తిహీనమైనా, ముసలితనం ఆవరించినా, ఇంద్రియ సుఖాల పట్ల కాంక్ష, ఆశ తగ్గవు. వీటిని తొలగించుకొంటేనే గాని సంసార బంధము తొలగదు. అందుచేత నేటినుండి తృష్ణను తొలగించుకొని, విషయాసక్తిని వీడి, అహంకారాన్ని తగ్గించుకొని, అరణ్యాలలో తిరుగుతాను. పరబ్రహ్మంలో చిత్తాన్ని చేర్చుతాను." అని చెప్పాడు. తరువాత పూరుని యౌవనం అతనికి ఇచ్చివేసి, తన ముసలితనాన్ని తీసుకొన్నాడు. పూరువునకు పట్టముగట్టి, మిగిలిన నలుగురుకి కూడ రాజ్యభాగాలనిచ్చి, సర్వమూ పరిత్యజించి, శ్రీహరి యందు చిత్తాన్ని నిలిపి, వాసుదేవపరబ్రహ్మ సాయుజ్యాన్ని పొందాడు. దేవయానికూడ భర్తచెప్పిన విషయాలను మననం చేసుకొంటూ సమస్తబంధాలనూ వదిలించుకొని, శ్రీహరిని ధ్యానిస్తూ ముక్తిని పొందినది ఈ యయాతి చరిత్ర ద్వారా స్పష్టమయ్యే సత్యమేమిటంటే - కామభోగాలు ఎంతకాలము అనుభవించినా తీరనట్టివి. అనర్థమునే కలుగజేస్తాయి. కనుక అవి త్యజించవలసి నట్టివి. అవి భగవచ్చింతనకు దూరము చేయునట్టివి, అని శ్రీశుకుడు చెప్పాడు.

## దుష్యంతుడు

యయాతి పుత్రుడైన పూరువు చాలా ప్రసిద్ధికెక్కిన రాజు అయ్యాడు. దుష్యంతుడు అతని వంశములోనే జన్మించాడు. సమస్తభూమండలానికీ రాజైన దుష్యంతుడు, ఒకనాడు వేటకు పోయి, కణ్వాశ్రమమునగల తపోవనంలో ప్రవేశించి, సహజశత్రుత్వం గల సింహాలు, ఏనుగులూ, పాములూ నెమళ్లూ, గోవులూ పులులు, పిల్లులు ఎలుకలు కలిసిమెలిసి ఆడుకొనడం చూచి, ఆమునియొక్క గొప్పతనాన్ని ఊహించుకొని ఆశ్చర్యపోయాడు. కణ్వముని దర్శనం చేసుకొని వెళ్లే ఉద్దేశంతో అనుచరులను అక్కడే ఉండుడని చెప్పి, ముందుకు సాగాడు. అక్కడ వనదేవతలాగ అప్పుడే విచ్చిన పద్మంలాగ, చంద్రకాంతితో మెరిసిపోతున్న శకుంతలను కన్నులార్పకుండా చూచాడు. ఇలాగ తలపోశాడు: "ఈమె ముని కన్య అయి యుండదు. తప్పకుండా రాజపుత్రికయే అయియుంటుంది. కాకుంటే నా మనస్సు ఈమె యందు ఈ విధంగా ఆకర్షింపబడదు." అనుకొంటూ ఆమెను సమీపించి, ఇలా అడిగాడు: "ఓ పూర్ణచంద్రాననా! నీవు రాజపుత్రికవే అనిపించి, నీమీద నా మనస్సు లగ్నమయినది. నీ పేరేమిటి? నీవు ఎవ్వరిదానవు? ఈ తపోవనంలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగిన ప్రశ్నలకు అప్పుడే మన్మథ బాణ బాధితురాలై యున్న ఆ సుందరి ఇలా చెప్పినది:

"ఆర్యా! నన్ను బాల్యావస్థనుండి ఇంతవరకూ పోషించి, పెంచిన కణ్వమహర్షియే నా తండ్రియని నేను భావిస్తున్నాను. నాకు జన్మనిచ్చిన తండ్రీ తల్లీ గురించి కణ్వమహర్షి ఇంకొక ఋషితో చెపుతుండగా నేను వినడం జరిగినది. ఆ విషయాన్నే ఇప్పుడు నీకు చెపుతున్నాను. రాజర్షియైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కాదలచుకొని ఘోరమైన తపస్సు చేస్తుండగా ఇంద్రుడు అతని తపస్సును భంగం చెయ్యడానికి మేనక అనే అప్సరసను అతని వద్దకు పంపించాడు. అతని తపస్సును భంగం చేయడంలో ఆ అప్సరస కృతకృత్యురాలై రాజర్షిని వశపరచుకొని, అతనితో

కొన్నాళ్లుండి ఒక ఆడుబిడ్డనుకన్నది. దానితో అతడు చేసిన తప్పిదం గుర్తుకు వచ్చినది. ఆ బిడ్డ నాకక్కరలేదని వెళ్లిపోయాడు. మేనక ఆ బిడ్డను మాలినీ నదీతీరంలో విడిచి పెట్టి వెళ్లిపోయినది. దిక్కులేని ఆ బిడ్డ ఏడుస్తుంటే, శకుంతములు (పక్షులు) వాటి రెక్కలతో ఎండ, మంచు, తగలకుండా కాపాడి, దయామయుడైన కణ్వమహర్షి నదికివస్తే అతనికి ఆ బిడ్డను ఒప్పచెప్పి ఆపక్షులు వెళ్లిపోయాయి. శకుంతములచే (పక్షులచే) కాపాడబడిన ఆ బిడ్డను కణ్వముని శకుంతల అని నామకరణం చేసి, తాను బ్రహ్మచారి అయినప్పటికీ, తల్లిగాను, తండ్రిగాను పెంచి పెద్దచేశాడు. ఆ శకుంతలనే నేను." అని చెప్పగా విని దుష్యంతుడు, ఆమె నిజంగానే క్షత్రియకన్య అని తెలుసుకొని సంతసించాడు. "మా ఆశ్రమానికి వచ్చిన నీవు మా ఆతిథ్యాన్ని స్వీకరించవలసినది" అని ఆమె కోరగా అతడు సమ్మతించి ఇలా అన్నాడు. "సుందరీ నీవు క్షత్రియకన్యవు. కనుక గాంధర్వ వివాహము క్షత్రియులకు శాస్త్ర సమ్మతమేకనుక, నీవు అంగీకరిస్తే నేను నిన్ను వివాహం చేసుకొనాలని కాంక్షిస్తున్నాను." అని చెప్పి, ఆమె చేత ఒప్పించి, వివాహం చేసుకొని, ఆశ్రమంలో ఆమెతో గడిపాడు. దుష్యంతుడు వెళ్లిపోయిన తరువాత శకుంతల భయపడుతూ కణ్వమునితో జరిగిన విషయం చెప్పినది. కణ్వుడు దివ్యదృష్టితోచూచి, సర్వమూ తెలుసుకొని, దుష్యంతుడు పౌరవవంశములో శ్రేష్ఠుడనీ, ధర్మప్రభువనీ, గొప్ప చక్రవర్తియనీ, ఆమె ఎంపిక సరియైనదేననీ, భయపడవద్దనీ, ఆమెకు పుట్టబోయే పుత్రుడు గొప్పఖ్యాతి గల చక్రవర్తి అవుతాడనీ చెప్పాడు. ఆమె కొంతకాలనికి ఒక పుత్రుని కన్నది. వాడు బాలచంద్రునివలె దిన దిన ప్రవర్ధమానుడై మహా బలశాలియై సింహాలతో ఆడుకొనేవాడు.

కొద్ది రోజుల్లోనే వచ్చి శకుంతలను తన రాజధానికి తీసుకొనివెళ్లుతానని చెప్పిన దుష్యంతుడు రాకపోయేసరికి శకుంతలకు కణ్వునకు ఆందోళన ఆరంభమైనది. రాజ నగరిలో పట్టపురాణిగా నుండవలసిన శకుంతల రాజరికపు విద్యలు నేర్చుకొనవలసిన బాలుడూ, ఆశ్రమవాసులై యుండడం సరికాదని, కణ్వమహర్షి వారిని శిష్యుల సహాయంతో దుష్యంతుని రాజధానియైన ప్రతిష్ఠానపురం పంపించాడు. కుమారుని తోడ్కొని శకుంతల దుష్యంతుని సభా భవనంలోనికి ప్రవేశించినది. సౌందర్య రాశియైన శకుంతలనూ విష్ణు తేజస్సుతో మెరిసిపోతున్న బాలునీ చూచాడు కొలువు తీర్చికూర్చున్న దుష్యంతుడు. వాళ్లిద్దరూ ఎవరో గుర్తించాడు. అయినా సభాసదులూ, ప్రజలూ ఏమనుకొంటారో అనే సంకోచంతో ఏమీ తెలియనట్లే నటిస్తున్న రాజును చూచి, శకుంతల చాలా ఖిన్నురాలయినది. ఎలాగో ధైర్యము కూడగట్టుకుని, ఇలా అన్నది. "మహారాజా! ఈ చిరంజీవి నీపుత్రుడు. ఆనాడు నీవు కణ్వాశ్రమంలో గాంధర్వ వివాహం చేసుకొన్న శకుంతలను నేను. నా తండ్రియైన కణ్వమహర్షి ఈ బాలుడు నీకు వారసుడై గొప్ప ఖ్యాతి గల చక్రవర్తి అవుతాడని చెప్పి, తన ఆశీస్సులతో మమ్మల్ని ఇక్కడికి పంపించాడు" అని చెప్పి, అతని జవాబుకు ఎదురుచూస్తున్నది. దుష్యంతుడు ఇరుకున పడి, ఇలా చెప్పి తప్పించుకొనబోయాడు. "వనితా! నేను నిన్ను ఇదివరకు చూచిన గుర్తులేదు. ఎవరో ఒక బాలుని తీసుకొనివచ్చి ఇతడు నీ సామ్రాజ్యానికి వారసుడు అని చెప్పేస్తే కుదురుతుందా? నీవు నా నుండి ఏదైనా ధనసంపదలనాశించి వచ్చియుంటే, ఎంతకావాలో మా కోశాధికారిని అడిగి తీసుకొనుము?" అన్నాడు. శకుంతలకు ప్రపంచమే కూలిపోయినట్లనిపించినది. ఏమి చెయ్యాలో తోచలేదు. తిరిగి కణ్వాశ్రమానికి ఎలాగ వెళ్లగలదు? ఇప్పుడేమి చెయ్యాలి? ఇంతలో దైవమే ఆదుకొన్నట్లు అశరీరవాణి స్పష్టంగా ఇలాగ అందరికీ వినిపించినది: "ఓ రాజేంద్రా! ఆనాడు నీవు కణ్వాశ్రమంలో గాంధర్వ విధిని వివాహమాడిన స్త్రీయే ఈ శకుంతల. నీ బీజముతో కలిగిన వాడే ఈ బాలుడు. ఈ పవిత్ర సంబంధాన్ని అవమానించకుండా వీరిని స్వీకరించి ఆదరించు. ఈ బాలుడు భరతుడనబడి గొప్ప వాడవుతాడు." అనే వాణిని విని రాజుతో సహా అందరూ సంతోషించారు. రాజు భార్యాపుత్రులను ఆదరించాడు.

దుష్యంతుని తరువాత భరతుడు రాజు అయి, ఎదురు లేని సార్వభౌమత్వంతో భూమండలాన్ని పాలించాడు. 133 అశ్వమేధయాగాలను చేశాడు. భూరిదానాలిచ్చాడు. అనేక మంది రాజులను జయించాడు. పాతాళలోకంలో

రాక్షసుల చెరనుండి అనేకమంది దేవతాస్త్రీలను విడిపించి, వారి భర్తలకు ఒప్పజెప్పాడు. రాక్షసులను జయించి, దేవతలకు భయము లేకుండా చేశాడు. 27 వేల సంవత్సరాలు భూమిని పాలించాడు. విదర్భ రాజ పుత్రికలు ముగ్గురునీ పెండ్లాడినా, ముగ్గురూ కొడుకులను కనినా, ఒక్కడూ దక్కలేదు. అందుచేత అతడు పుత్రుడు కావాలని మరుత్స్తోమం అనే యాగాన్ని చేసి దేవతలను మెప్పించగా వారు బృహస్పతికి మమత యందు పుట్టి విడిచి పెట్టబడిన బిడ్డను తెచ్చి భరతునకు ఇచ్చి, ఆ బిడ్డను భరద్వాజుడన్నారు. అతనిని వితథుడు అని కూడ అన్నారు. అతని వంశములోనే రంతిదేవుడు జన్మించాడు.

## రంతి దేవుడు

భరతునివంశములో రంతిదేవుని కీర్తి సాటిలేని దానశీలునిగా ముల్లోకాల్లోనూ వ్యాపించినది. అశేష సంపదలుగల రాజే అయినప్పటికీ, అతడు తన సంపదలన్నింటినీ దీనులకు పంచి పెట్టేసి తాను బీదవాడైపోయాడు. అతనికి దాచుకొనడం అంటే ఏమిటో తెలియదు. ఎప్పుడు ఏది లభిస్తే దానిని ఎవ్వరికైనా ఇచ్చివేయడమే అతనికి ఆనందము, తనకుటుంబమును గురించి కూడ రేపటికి అవసరం పడుతుందేమోననే తలంపే లేకుండా ఇచ్చివేసేవాడు.

ఒకసారి నలభై ఎనిమిది రోజులవరకు అతనికేమీ ఆహారము దొరకక భార్యాబిడ్డలు కూడ అలమటించి పోయారు. అయినా అతడు గుండెనిబ్బరాన్ని కోల్పోలేదు. అప్పుడు అతనికి కొంచెము పాయసము, మంచి నీరూ లభించాయి. భార్యాబిడ్డలకు కొంతపెట్టి, తాను తినడానికి సిద్ధపడగా, ఒక బ్రాహ్మణుడు అన్నార్తుడైవచ్చాడు. అతనిని ప్రేమతో ఆహ్వానించి, అతిథి రూపములో వచ్చిన శ్రీహరి యని తలంచి, హరిసమర్పణగా సగభాగం అతనికి అర్పించాడు. అతడు తిని వెళ్లగానే, ఇంకొక అన్నార్తుడు వచ్చి అడుగగా మిగిలిన దానిలో సగము ఇచ్చి, తృప్తి పరచాడు. వాడు వెళ్లిన వెంటనే, కొన్ని కుక్కలతో ఇంకొకడు వచ్చి ఆకలి అన్నాడు. వానికి మిగిలి యున్న కొద్దిపాటి అన్నాన్ని ఇచ్చివేసి నమస్కరించాడు. అతడు వెళ్లగానే ఒక చండాలుడు వచ్చి, "దాహం దాహం నా ప్రాణాలు నిలపండి" అని దీనాలాపాలుచేశాడు. అది విని, రంతిదేవుడు మిక్కిలి దుఃఖితుడై ఇలా అన్నాడు.

ఉ॥ **అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న రా**
**పన్న శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్**
**గ్రన్నన మాన్పి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే**
**లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముడొక్కడ సుమ్ము పుల్కసా.** 647

"ఓయన్నా! అన్నము లేదు, కాని కొద్దిపాటి మంచినీరు మాత్రమున్నది. రావన్నా రా! త్రావుమన్న. శరీధారులకు ఆపదవచ్చినప్పుడు వెంటనే వారి ఆపదలను పోగొట్టి వారికి సుఖము కలిగించుటకన్న మనుజులకు వేరే పరమార్థం ఉన్నదా? ఇక నా విషయమంటావా, నాకు ఆ పురుషోత్తముడొక్కడే దిక్కు సుమా!" అని చెప్పి, దుర్భరమైన దాహముతో తన ప్రాణం పిడచకట్టుకుపోతున్నా ఏమాత్రమూ చలించకుండా, ఇతడి దాహం తీరి, బాధ తొలిగితే నాకంతేచాలు. అంతా ఈశ్వరేచ్ఛ అనుకొంటూ రంతిదేవుడు తన వద్దనున్న ఆ కొద్దిపాటి నీటినీ ఆ చండాలుని పాత్రలో పోశాడు.

మహాత్ముడైన రంతిదేవుడు సర్వత్రా శ్రీహరినే చూడగలిగిన పరమభాగవతుడు. అతనికి ఆకలితో వచ్చిన బ్రాహ్మణుడు, శూద్రుడు, చండాలుడూ, కుక్కలూ అందరూ ఆర్తిలోనున్న శ్రీహరి స్వరూపాలు గానే కనిపించినవి. వారి ఆర్తిని తీర్చడమే తనకు పరమ పురుషార్థమని నమ్మినాడు. అప్పుడు బ్రహ్మాది దేవతలు సంతసించి, అతని ముందు ప్రత్యక్షమై అతనిని పరీక్షించదలచి తామే ఆయా రూపాలలో వచ్చితిమని చెప్పి ఏదైనా వరం

కోరుకొనుమన్నారు. రంతిదేవుడు వారికి నమస్కరించాడు. ఏమీ కోరలేదు. తన సర్వస్వం ఇచ్చి వేయుగల దానశీలునకు, ఇక కావలసినదింకేముంటుంది? మాయా ప్రభావం తెలిసిన మహాత్ముడతడు. అతనిలో పూర్తిగా నారాయణ చింతనం ఆవహించినది. మాయ తొలగినది. అతడు పరమపదాన్ని పొందాడు. అంతేకాదు, ఆ రాజర్షిని సేవించిన వారుకూడ అతని యొక్క దానమహిమచే హరిచింతన కలవారై సద్గతిని పొందారు.

పరీక్షిత్తు కోరికపై శ్రీశుకుడు, శాఖ ప్రశాఖలుగా విస్తరించిన యయాతి పుత్రుల వంశాలను వివరించాడు. (యదు, ద్రుహ్యు, తుర్వసు, అను, పూరువు అనువారు యయాతి పుత్రులు)

## శంతనుడు

ఒకప్పుడు మహాభిషుడనే గొప్ప చక్రవర్తి భూమండలాన్ని పాలించేవాడు. అతని గొప్పతనానికి గుర్తింపుగా అతనిని ఇంద్రుడు తన సింహాసనంపై కూర్చుండబెట్టుకొన్నాడు. ఇంద్ర సభలో నున్న గంగ, మహాభిషుని పైదృక్కులు సారించి, మరల్చలేకుండడం ఇంద్రుడు కనిపెట్టి, ఈ రాజునకు మరుజన్మలో నీవు భూలోకంలో అతని భార్యవు అవుదువు గాక అని శపించాడు.

ఇంకొక సందర్భంలో భూలోకంలో జన్మించాలని శపింపబడిన అష్ట వసువులనబడే దేవతలు, గంగాదేవిని సమీపించి ఇలా వేడుకొన్నారు: "తల్లీ! భూలోకంలో ఎవరి గర్భములోనో జన్మించేకంటే పవిత్రమైన నీ గర్భములో జన్మించడమే మాకు శ్రేయస్కరము. కనుక నీ పుత్రులమై జన్మిస్తాము. కాని మాదొక్క మనవి ఉంది. మేము పుట్టగానే మమ్మల్ని నదిలో పారవేస్తుండు. అప్పుడు మా భూలోకవాసము ముగిసిపోతుంది." అనగా ఆమె సమ్మతించినది.

మహాభిషుడు యయాతి పుత్రుడైన పూరుని వంశములోని ప్రతీపునకు శంతనుడై జన్మించాడు. అతడు గంగాదేవిని వివాహమాడి పుత్రులను పొందాడు. గంగ వరుసగా ఏడుగురు పుత్రులను నదిలో పడవేసినా, శంతనుడు భరించి, ఎనిమిదవ వానిని కూడ పడవేస్తుంటే అడ్డుకొన్నాడు. ఆమె ఆ బిడ్డను తీసుకొని దేవలోకానికి వెళ్లిపోయినది. అతడు సకల విద్యలూ నేర్చుకొని పెద్దవాడైన పిమ్మట వానిని తెచ్చి తండ్రికి ఒప్పజెప్పినది. అతనిపేరు దేవవ్రతుడు. శంతనుడు సత్యవతి అనే జాలరికన్యను ప్రేమించి పెండ్లి చేసుకొనదలిచాడు. సత్యవతికి పుట్టబోయే కొడుకే రాజ్యానికి వారసుడు వాలని జాలరికన్యతండ్రి పట్టుబట్టగా, దేవవ్రతుడు తన రాజ్యాధికారాన్నీ వైవాహిక జీవితాన్నీ వదులుకొంటానని ప్రతిజ్ఞచేసి తండ్రికీ సత్యవతికి వివాహం చేయిస్తాడు. ఇంతటి తీవ్రమైన ప్రతిజ్ఞను చేసినందుకు అతడు భీష్ముడనే పేరుతో ప్రసిద్ధుడైనాడు. అతడు విష్ణు భక్తుడు, తేజోనిధి, శత్రుభయంకరుడు, పరశురాముని కూడ జయించగలిగిన వీరుడు.

సత్యవతికి చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అనే ఇద్దరు పుత్రులు కలిగారు. చిత్రాంగదుడు గంధర్వులతో యుద్ధముచేసి మరణించాడు. భీష్ముడు కాశీరాజు కుమార్తెలైన అంబిక, అంబాలికలను తెచ్చి విచిత్రవీర్యునకిచ్చి వివాహం చేశాడు. విచిత్రవీర్యుడు అంబిక అంబాలికలతో చాలా కాలం కాపురం చేసిన తరువాత సంతానం లేకుండా చనిపోయాడు. చంద్రవంశం అంతరించి పోకుండా సత్యవతి ఒక మార్గాంతరం ఆలోచించినది. శంతనునితో వివాహానికి పూర్వము సత్యవతికి పరాశరమహర్షి వలన వ్యాసుడు జన్మించాడు. సత్యవతి వ్యాసుని స్మరించగా అతడు వచ్చాడు. సమస్యను తెలిపి, వ్యాసబీజాన్ని అంబిక అంబాలికలందు ఉంచుమని సత్యవతి చెప్పగా వ్యాసుడు అలాగే చేశాడు. వాళ్లిద్దరియందే కాకుండ ఒక దాసీయందు కూడ బీజప్రదానము చేయడమైనది. తత్ఫలితంగా అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు, దాసీకి విదురుడు జన్మించారు. ధృతరాష్ట్రుడు గాంధారదేశ రాజకన్య అయిన గాంధారిని వివాహమాడి, దుర్యోధనాదులైన నూర్గురు కుమారులను, దుస్సల అనే కుమార్తెను పొందాడు. పాండురాజు వసుదేవుని సోదరి అయిన పృథను (కుంతిని), మాద్రిని వివాహం చేసుకొన్నాడు. అయితే

శాపవశాన అతడు భార్యలను కలుసుకొను వీలులేనందున, వారికి సంతానం కలుగలేదు. కుంతి వివాహం కాక పూర్వము దూర్వాసమహర్షిచే ఉపదేశింపబడిన మంత్రశక్తిచే దేవతలనాహ్వానించి, వారి అనుగ్రహంచే సంతానం పొందగలిగినది. యముని వలన యుధిష్ఠిరుని వాయువువలన భీముని, ఇంద్రునివలన అర్జునుని పొందినది. అలాగే మాద్రికూడ ఆ మంత్రశక్తిచేతనే అశ్వినీ దేవతలనాహ్వానించి నకుల సహదేవులను పొందినది.

పంచపాండవులనబడే ఈ ఐదుగురూ ద్రుపదరాజపుత్రిక అయిన ద్రౌపదిని వివాహమాడి ఉపపాండవులనబడే ఐదుగురు పుత్రులను పొందారు. వీరుకాక యుధిష్ఠిరునికి పౌరవతియందు దేవకుడు, భీమునకు హిడింబయందు ఘటోత్కచుడు, కాళియందు సర్వగతుడు, సహదేవునకు విజయయందు సుహోత్రుడు, నకులునకు రేణుమతి వలన నిరమిత్రుడు, అర్జుననకు ఉలూపి యందు ఇలావంతుడు, మణిపుర రాజకన్య అయిన చిత్రాంగద యందు బభ్రువాహనుడు, సుభద్రయందు నీ తండ్రియైన అభిమన్యుడూ జన్మించారు. బభ్రువాహనుడు అర్జునుని అనుమతితో మాతామహుని గోత్రానికి వంశకర్త అయ్యాడు. అభిమన్యునకు ఉత్తర గర్భంలో నీవు జన్మించావు నీకుమారులలో పెద్దవాడైన జనమేజయుడు తక్షకునిపై పగబూని సర్పయాగం చేసి సర్పాలు భస్మమయ్యేటట్లు చేస్తాడు. అతడు సమస్త భూమండలాన్నీ జయించి, అశ్వమేధ యాగం చేశాడు.

యయాతికొడుకైన అను వంశంలోని చిత్రరథుని రోమపాదుడని కూడ అంటారు. అతనికి సంతానం లేకపోతే దశరథుడు తన దత్తపుత్రిక అయిన శాంతను అతనికి పెంపకం ఇచ్చాడు. రోమపాదుని రాజ్యంలో కొంతకాలం వర్షాలు పడనందున ఏమి చెయ్యాలో విజ్ఞులు ఆలోచించి 'విభాండక మహర్షి పుత్రుడైన ఋష్యశృంగుని పాదము ఆభూమిపైన పడితే వానలు కురుస్తాయి అన్నారు. కాని లేడి గర్భములో పుట్టినప్పటినుండి ఘోర తపస్సులో నుంటూ వేరే ప్రపంచమే తెలియని ఆ ఋష్యశృంగుని తీసుకొనిరావడం ఎలాగ? అని ఆలోచించి, ఒక వ్యూహం పన్నారు. తల్లి సంపర్కమూ మానవ సంపర్కమైనా లేకుండా పెరిగిన ఆ యువకుని స్త్రీలచే లాలన పాలన వంచన ప్రేమాలాపనలు చేయించి ఆకర్షించి తీసుకొనిరావచ్చునని తలపోసి, నెరజాణలైన సుందరీమణులను అతని వద్దకు పంపించారు. ఆ కాంతలు, హావ, భావ, స్పర్శ చేష్టలతోను, ఆటలపాటలతోను అతని ఇంద్రియాలను ఉత్తేజపరిచారు. వారుకూడ తన వంటి ఋషులే అనుకొని పసిబాలునికంటే అమాయకుడైన ఆ ఋషి వారికి నమస్కరించాడు. నెరజాణలు నవ్వుకొని అతనిని ఇంకా ఆటపట్టించారు. మా ఆశ్రమానికి వెళ్లుదాం పద అని అతనిని తీసుకొనిపోయి రోమపాదునకు ఒప్పజెప్పారు. రాజు మిక్కిలి సంతోషించి, తన దత్తపుత్రిక అయిన శాంతను అతనికిచ్చి వివాహం చేశాడు. దేశం సస్యశ్యామలం అయినది. ఋష్యశృంగుడు మామగారిచేతను, దశరథుని చేతనూ కూడా ఇంద్రయాగాది యాగాలను చేయించాడు.

## యదు వంశము

యయాతి పుత్రుడైన యదువు యొక్క వంశములో దేవమీఢుని కుమారుడు శూరసేనుడు. శూరసేనునియొక్క పదిమంది పుత్రులలో వసుదేవుడు పెద్దవాడు. అతడు పుట్టినప్పుడే దేవదుందుభులు మ్రోగాయి. ఈ పుణ్యాత్మునకే శ్రీహరి పుట్టనున్నాడని దేవతలు సంతసించారు. అందుకే వసుదేవుని ఆనకదుందుభి అని అనేవారు. శూరుడు, తన మిత్రుడైన కుంతి భోజునకు సంతానంలేనందున, తన కూతురైన పృథను అతనికి పెంపకం ఇచ్చాడు. అందుకే ఆమె కుంతి అనబడినది. కుంతిభోజుని ఇంటికి అతిథిగా వచ్చిన దూర్వాస మహర్షికి కుంతిబాల అతి శ్రద్ధాభక్తులతో సేవ చేసినది. ఋషి సంతసించి దేవతలనాహ్వానించే మంత్ర విద్యను ఆమెకు నేర్పాడు. ఆ మంత్రం యొక్క మహిమను పరీక్షించాలనే చిలిపి కుతూహలంతో ఒకనాడు ఆమె సూర్యుని ఆహ్వానించగా అతడు నిజంగానే ప్రత్యక్షమయ్యేసరికి ఆమె హడలిపోయి, ఏమి చెయ్యాలో తోచక "పొరపాటున పిలిచాను. నా తప్పును మన్నించి

మరలిపొమ్ము" అని ప్రార్థించినది. అప్పుడు సూర్యుడిలా అన్నాడు: "బాలా! దేవతల నాహ్వానించడం అంటే బాల్యక్రీడకాదు. నారాక వ్యర్థంకారాదు. నీవిప్పుడు గర్భందాల్చి పుత్రుని కంటావు. భయపడకు సిగ్గుపడకు" అని చెప్పి వెళ్లిపోయాడు. పిమ్మట కుంతి అపరసూర్యుని వంటి బిడ్డను కని, వానిని ఒక పెట్టెలో పెట్టి, గంగలో విడిచినది. అతడే కర్ణుడు. కుంతిని పాండురాజు పెళ్లాడాడు. ఆమె యుధిష్ఠిర, భీమ, అర్జునులను కన్నది ఆమె చెల్లెలైన శ్రుతదేవ వృద్ధశర్మకు భార్యయై, మునిశాపం వలన దంతవక్త్రుడనే అసురుని కన్నది. శ్రుతకీర్తి దృష్టకేతునకు భార్యయై ఐదుగురు పుత్రులను కన్నది. రాజ్యాధిదేవి జయత్సేనుని పెండ్లాడి విందఅనువిందులను కన్నది. శ్రుతశ్రవ (సాత్వతి) దమఘోషుని పెండ్లాడి శిశుపాలుని కన్నది.

వసుదేవుడు దేవకితోపాటు ఆమె ఆరుగురుతోబుట్టువులనూ పెండ్లాడాడు. అతనికి రోహిణి యందు బలరామాదులు జన్మించారు. దేవకియందు శ్రీకృష్ణునితో సహా ఎనిమిది మంది పుత్రులూ, సుభద్ర అనే పుత్రిక, కలిగారు. అతని ఇతర భార్యలకు కూడ అనేకమంది బిడ్డలు జన్మించారు.

**క॥ దుష్టజన నిగ్రహంబును శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై**
**యష్టమ గర్భమున గుణోత్కృష్టుడు దేవకికి విష్ణుదేవుడు పుట్టెన్.** 723

శ్రీకృష్ణుని తరువాత పుట్టిన సుభద్ర అర్జునుని వివాహం చేసుకొన్నది.

**క॥ ఎప్పుడు ధర్మక్షయమగు నెప్పుడు పాపంబు పొడము నీలోకములో**
**నప్పుడు విశ్వేశ్వరుడు హరి తప్పక విభుడయ్యు తన్ను తాసృజియించున్** 725

**క॥ తనమాయలేక పరునకు ఘనునకు నీశ్వరున కాత్మకర్తకు హరికిన్**
**జననములకు కర్మములకును మనుజేశ్వర కారణంబు మఱియున్ గలదే!** 726

ఓ రాజా! పరాత్పరుడు, ఈశ్వరుడు, ఆత్మ స్వరూపుడు అయిన శ్రీహరి తన మాయచేతనే జన్మకర్మలను పరిగ్రహిస్తాడు. ఇంకే కారణమూ ఉండదు. రాక్షసులు రాజులుగా భూమిమీద పుట్టి, ప్రజలను పీడిస్తారు. వాళ్లను శాసించడానికి శ్రీహరి సంకర్షణునితో సహా జన్మించి, ఆశ్చర్యకరమైనట్టి కార్యాలను చేసి, మానవుల అజ్ఞానాన్ని, దుఃఖాన్నీ తొలగించి పరిశుద్ధమైన కీర్తులతో ప్రకాశిస్తుంటాడు. ఆ స్వామి వసుదేవుని ఇంటపుట్టిద్రేపల్లెలో పెరిగి, భారతయుద్ధములో భూభారాన్ని తగ్గించి, అర్జునునకు, ఉద్ధవునకు తత్త్వజ్ఞానాన్నిచ్చి, అవతారాన్ని చాలించాడు. మంగళకరమైన శ్రీహరి కీర్తి గంగామృతం వంటిది. వీనుల విందుగా దీనిని ఆస్వాదిస్తే సమస్త బంధనాలూ తొలగి పోతాయి:

**హరిః ఓం తత్ సత్**
**నవమస్కంధము సమాప్తము**
**ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః**

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# దశమస్కంధము

## పూర్వభాగము

### దేవకీవసుదేవులు - కంసుడు

శ్లో॥ ఆదౌ దేవకిదేవిగర్భజననం గోపీ గృహే వర్ధనం
మాయాపూతనజీవితాపహరణం, గోవర్ధనోద్ధారణం ।

శ్లో॥ కంసచ్ఛేదనకౌరవాదిహననం కౌంతేయసంరక్షణం
ఏతద్భాగవతం పురాణకథితం, శ్రీకృష్ణలీలామృతం ॥

శ్రీకృష్ణచరితామృత పానపిపాసుడైన పరీక్షిత్తుయొక్క కోరికను మన్నించి, శ్రీశుకయోగీంద్రుడిలా అన్నాడు.

క॥ విష్ణుకథారతుడగు నరు విష్ణుకథల్ చెప్పుమనుచు, వినుచుండు నరున్
విష్ణుకథాసంప్రశ్నము విష్ణుపదీజలము భంగి విమలుల జేయున్. 13

"రాజా! అందుచేత వాసుదేవుని చరిత్రను చెప్పడానికి నాకు కూడ మిక్కిలి సంతోషంగానుంటుంది. చెపుతాను విను:

ఆసురీసంపదతో మదించిపోయియున్న వేలాది రాజులు భూమిని కొల్లగొట్టి పాలిస్తూ, తమ పాపాచరణము వలన భూమికి భారమైపోయి యున్నందున భూదేవి గోవు రూపాన పోయి, బ్రహ్మదేవునకు నివేదించినది. బ్రహ్మ రుద్రాది దేవతలతో సహా క్షీరసాగరతీరానికి పోయి పురుషసూక్తంతో స్తుతించాడు. ధ్యానములో నుండగా బ్రహ్మకు దివ్యవాణి వినిపించినది. ఆ వాక్కులను అతడు అందరికీ ఇలా చెప్పాడు: "భూదేవి యొక్క కష్టాలు భగవంతునకు తెలుసు. దేవదేవుడు, వసుదేవపుత్రుడై పుట్టి ఆ అవతారకాలములోనే భూభారాన్నంతా తొలగించుతాడు. అనంతుడు శ్రీహరి అంశతో ఆయనకు అన్నయై అక్కడే పుడతాడు. అమరులందరూ తమతమ అంశలతో యాదవకులంలో పుట్టాలి. విష్ణుమాయ కూడ అక్కడే పుడుతుంది. దేవతాస్త్రీలు కూడా శ్రీహరి సేవార్థం సుందరశరీరలై అక్కడే పుట్టాలి. ఇది భగవంతుని ఆదేశము" అని చెప్పగా, భూదేవి, దేవతలు, సంతృప్తులై వెళ్లిపోయారు.

యదువంశములోని శూరసేనుడు శూరసేనమనే రాజ్యానికి ప్రభువు. అతని కుమారుడు వసుదేవుడు. ఉగ్రసేనుడు యదు, భోజ, అంధక, రాజ్యాలకు ప్రభువు. అతని కుమారుడు కంసుడు. ఉగ్రసేనుని తమ్ముడు దేవకుడు. అతని కుమార్తె దేవకి. వసుదేవుడు దేవకిని వివాహమాడి నిజగృహానికి తీసుకొనివెళ్లేటప్పుడు కంసుడే స్వయంగా తన చెల్లెలిని రథంపైతీసికొని ఆమెను పతిగృహంలో విడిచిపెట్టి రావాలని బయలుదేరాడు. కొంతదూరం పోయిన తరువాత ఒక అశరీరవాణినుండి ఇలాగ వినిపించినది: "ఓయీ కంసా! నీవు ఇంత సంతోషంతో నీ చెల్లెలిని తీసుకొనివెళ్ళుచున్నావు. కాని ఈమెయొక్క ఎనిమిదవ పుత్రుడు నిన్ను సంహరిస్తాడు సుమా!" అనే హెచ్చరికను విని, కంసుడు ఉగ్రుడై కత్తిదూసి, చెల్లెలిని జుట్టుపట్టుకొని ఈడ్చి, చంపడానికి సిద్ధ పడ్డాడు. అప్పుడు వసుదేవుడు కంసునికి ఇలా విన్నవించుకొన్నాడు: "బావా!

ఉ॥ అన్నవు నీవు చెల్లెలికి అక్కట మాడలు చీరలిచ్చుటో
మన్నన సేయుటో మధురమంజులభాషల నాదరించుటో
మిన్నుల మ్రోతలే నిజము మేలని చంపకుమన్న మాని రా
వన్న సహింపుమన్న తగదన్న వధింపకుమన్న వేడెదన్. 26

(మిన్నుల మ్రోతలు = ఆకాశము నుండి వినవచ్చిన శబ్దాలు, మాటలు) బావా! నీవు, భోజవంశ శ్రేష్ఠుడవు, శూరుడవు. ఒక అశరీరవాణికి భయపడి ఏ పాపమూ ఎరుగని నిర్మలచరిత అయిన నీ చెల్లెలిని ఈ విధముగ చంపబూనడం నీవంశానికే కళంకము కాదా? ఈమెను చంపినంతనే నీమృత్యుభయము తొలగిపోతుందని అనుకొనవద్దు. శరీరంతో పాటే చావుకూడ పుట్టియుంటుంది. నేడో, రేపో, నూరేండ్లతరవాతనో మృత్యువు శరీరాన్ని పడవేస్తుంది కాని విడిచి పెట్టదు. జీవుడు కర్మాధీనుడు. తాను చేసియుండిన కర్మల ఫలితములనే అనుభవిస్తుంటాడు.

క॥ కర్మములు మేలు నిచ్చును కర్మంబులు కీడు నిచ్చు కర్తలు తనకున్
కర్మములు బ్రహ్మకైనను కర్మగుడై పరుల దడవ గానేమిటికిన్. 32

మత్తకోకిలము॥

వావి చెల్లెలుగాని కూతురువంటిదుత్తమురాలు సం
భావనీయ చరిత్ర భీరువు బాల నూత్న వివాహను
శ్రీవిలాసిని దీన కంపితచిత్త నీకిదె మ్రొక్కెదన్
కావవే కరుణామయాత్మక! కంస! మానవవల్లభా! 34

ఈ విధముగా ఎంత ప్రాధేయపడిననూ, కఠినాత్ముని మనస్సు కరుగనందున వసుదేవుడు తీవ్రముగా నాలోచించి, మళ్లీ ఇలాగ చెప్పుకొన్నాడు.

క॥ లలనకు బుట్టిన కొమరునివలనం తెగెదనుచు గగనవాణి పలికెనం
చలిగెదవేని మృగాక్షికి గల కొడుకుల జంపనిత్తు క్రమముగ నీకున్. 42

బావా! ఈమెకు పుట్టబోవువాని వలన నీకు ప్రమాదమున్నదని ఆకాశవాణి చెప్పినదిగాని, ఈమె వలన కాదుకదా! నీవు కరుణించి ఈమెను విడిచిపెట్టు. ఈమెకు పుట్టబోవు పిల్లలను నేను నీకు అప్పగిస్తాను. చంపుకొనుము." అని చెప్పగా కంసుని మనస్సు మారినది. దేవకీవసుదేవులను వారింటికి చేర్చి వెళ్లిపోయాడు. దేవకీదేవి మొదటి కొడుకును కనగానే వచనబద్ధుడైన వసుదేవుడు, వానిని తీసుకొనిపోయి కంసునకిచ్చాడు. వసుదేవుని సత్యనిరతికి సంతసించిన కంసుడు: "వీని వలన నాకు ప్రమాదము లేదు గనుక వీనిని తీసుకొని పొమ్ము" అన్నాడు.

ఒకనాడు నారదుడు వచ్చి కంసునితో ఇలాగ చెప్పాడు: "ఓ కంసా! నీవెవరివో తెలుసా? గతజన్మలో కాలనేమియనే అసురుడవు. నీ అనుచరులు కూడ అసురులే. మీ అసురజాతికి శత్రువైన శ్రీహరి అసురీగుణ సంభూతులైన రాజులను సంహరించి భూభారాన్ని తగ్గించే కార్యక్రమంతో దేవకీపుత్రుడై జన్మించనున్నాడు. దేవతలు యాదవులై జన్మించారు" అని చెప్పి నిష్క్రమించాడు. తాను అసురుడనని యాదవులు తన శత్రువులైన దేవతలని తెలుసుకొన్న కంసుడు ఉగ్రుడై తండ్రియైన ఉగ్రసేనుని, దేవకీవసుదేవులనూ, చెరసాలలో బంధించి, అంతవరకు పుట్టియున్న దేవకీ పుత్రులను వధించాడు. తానే మధురకు రాజైనాడు.

ఆ॥ తల్లిదండ్రులనైన తమ్ములనన్నల, సఖులనైన బంధుజనులనైన
రాజ్యకాంక్ష జేసి రాజులు చంపుదురవనిఁదరచు జీవితార్థులగుచు. 55

దేవతలు యాదవులై జన్మించారని తెలుసుకొన్నప్పటినుండి కంసునకు వారి పట్ల వైరమూ, క్రౌర్యమూ మితిమీరి పెరిగిపోయినవి. తన అనుచరులైన బాణుడు, భౌముడు, మాగధుడు, అఘాసురుడు, కేశి, ధేనుక, ప్రలంబ, తృణావర్త, చాణూర, ముష్టిక, అరిష్ట, ద్వివిద, పూతనాది అసురుల సహాయంతో యాదవులను యుద్ధాలలో నోడించి, హింసించగా వారంతా నిషధ కురు కోసల విదేహ విదర్భ పాంచాల కేకయ సాల్వ దేశాలకు వెళ్లిపోయారు. కొందరు మాత్రం కంసునకు లొంగిపోయి, అతడు పెట్టే బాధలను భరిస్తూ పడియున్నారు. దేవకి పుత్రులను ఆరుగురిని కంసుడు చంపివేశాడు. ఏడవగర్భాన భగవంతుని ఆదేశముపై అనంతుడు ప్రవేశించాడు.

## బలరామకృష్ణుల జననము

దేవకీవసుదేవులు చెరసాలలో నున్నప్పుడు, కంసునిదుండగాలకు భయపడిన యాదవులు కొందరు యమున ఆవలనున్న నందవ్రజములో తలదాచుకొనేవారు. వసుదేవుని భార్య అయిన రోహిణికూడ నందుని రక్షణలో అక్కడే ఉన్నది.

శ్రీహరి యోగమాయను పిలిచి, దేవకి గర్భాన ఉన్న ఏడవ బిడ్డను వెలికి తీసి, రోహిణీగర్భాన ఉంచుమని ఆదేశించాడు. మళ్లీ యోగమాయ నందునిభార్య అయిన యశోద గర్భాన ప్రవేశించి జన్మించాలని ఆదేశించాడు. దాని తరువాత యోగమాయ లోకములో ఈశ్వరిగా పూజలందుకొని, సంతానములేనివారికి సంతానం కలిగిస్తుంది. ఆమెకు ప్రజలు దేవాలయాలు నిర్మించి ఆమెను దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాని, శారద, అంబిక అనే పదునాలుగు నామాలతో కొలుస్తారు అని శ్రీహరి చెప్పాడు. శ్రీహరి ఆదేశించిన ప్రకారమే అంతా చేయబడినది. దేవకి గర్భమునుండి వెలికి తీయబడి, రోహిణి గర్భములో ఉంచబడడం చేత ఆ బిడ్డను సంకర్షణుడని తరువాత అన్నారు. దేవకీదేవియొక్క సప్తమగర్భము నష్టమైపోయినదని అందరూ భావించారు. రోహిణి గర్భాన జన్మించిన బిడ్డడు మిక్కిలి బలశాలిగా కనిపించడం చేత బలభద్రుడనీ, అందరినీ ఆనందింపజేసేవాడుగా కనిపించడం చేత బలరాముడనీ పిలువబడ్డాడు.

ఎనిమిదవ సంతానముగా వచ్చేయ సంకల్పించిన శ్రీహరి వసుదేవునియందు ప్రవేశించాడు. వసుదేవుడు దివ్యతేజస్సుతో వెలిగిపోయాడు. దేవకిగర్భాన ప్రవేశించిన స్వామి కంసుని చెరసాలను ఒక సూర్యమండలమా అన్నట్టు ప్రకాశింప జేశాడు.

ఒకనాడు కంసుడు చెరసాలకు వచ్చి, దివ్యతేజస్సుతో వెలిగిపోతున్న దేవకిని చూచాడు. ఆశ్చర్య చకితుడయ్యాడు. ఆకాశవాణి చెప్పినది నిజమే కాబోతున్నదని గ్రహించాడు. "ఇప్పుడు, ఈమె గర్భములో నున్నవాడు నిశ్చయంగా ఆ హరియే. ఇప్పుడేమి చెయ్యాలి? చంపి వెయ్యాలి. కాని దేవకి గర్భవతి. స్త్రీవధ అందునా చెల్లెలే కదా! మహాపాపం చుట్టుకొంటుంది. చిరకాలం ఈ అపకీర్తి నాయందు నిలిచిపోతుంది. అయినా నేను ఇదివరకు ఎందర్ని చంపలేదు! ఇప్పుడు ఈ సంశయాలెందుకు వస్తున్నాయి? నిజంగా ఇది విష్ణుమాయయే, ఈమెను చూస్తుంటే నాకు ఎందుకో ధర్మచింతన కలుగుతున్నది చంపవలసిన చెయ్యి వెనకాడుతున్నది." అనుకొంటూ ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు. అయినా అతని తలపులన్నీ హరిపైననే ఉంటున్నాయి. ఆ హరి ఎప్పుడు పుడతాడా, అతనిని నేను ఎప్పుడు హతమార్చి వదలించుకొంటానా, ఈ మృత్యుభయంనుంచి ఎప్పుడు ముక్తుని అవుతానా అని అహర్నిశలూ ఆరాటపడుతుండేవాడు:

క॥ **తిరుగుచు కుడుచుచు ద్రావుచు నరుగుచు కూర్చుండి లేచుచనవరతంబుల్**
**హరి దలచి దలచి జగమూ హరి మయమని తలచె కంసుడారని యలుకన్.** 85

సీ॥ **శ్రవణ రంధ్రములనే శబ్దంబు వినబడు నది హరి పలుకని యాలకించు,**
**అక్షిమార్గమున నెయ్యది చూడబడు నది హరిమూర్తిగానోపునంచు జూచు**
**తిరుగుచోదేహంబుఁ దృణమైన సోకిన హరికరాఘాతమో యనుచు కలుగు**
**గంధంబు లేమైన ఘ్రాణంబు సోకిన హరిమాలికా గంధమనుచు నదరు**
ఆ॥ **పలుకు లెవ్వియైన పలుకుచో హరిపేరు పలుక బడియెననుచు భ్రమసి పలుకు**
**తలపులెట్టివైన తలచి యాతలపులు హరితలంపు లనుచు నలుగ దలచు.** 87

ఈ విధముగా, కంసుడు మనోవాక్కులచేత, ఇంద్రియ కర్మలచేత క్షణక్షణమూ భయముతోనైనా శ్రీహరి చింతనలోనే మునిగియుండేవాడు.

భగవంతుడు భూమిపై దేవకీగర్భస్థుడై అవతరించనున్నాడని ఎరిగిన బ్రహ్మ రుద్రాది దేవతలందరూ దేవకీ వసుదేవులుండే చెరసాలకు వచ్చి, స్వామిని ఇలాగ స్తుతించారు:

సీ॥ సత్యవ్రతుని నిత్య సంప్రాప్తి సాధనుఁ గాలత్రయమునందు కలుగు వాని
భూతంబులైదును పుట్టు చోటగువాని నైదు భూతంబులందమరు వాని
ఐదు భూతంబులు నణగిన పిమ్మటఁ బరుగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడు వానిని నిన్నాశ్రయింతుము నీయధీన
ఆ॥ మాయచేత నెరుక మాలిన వారలు పెక్కుగతుల నిన్ను పేరుకొందు
రెరుగ నేర్చు విబుధు లేకచిత్తంబున నిఖిల మూర్తులెల్ల నీవ యండ్రు. 89

ఓ పరాత్పరా! సత్యవ్రతుడవు, నిత్యత్వాన్ని పొందించే సాధనమైనవాడవు, త్రికాలాల్లోను ఉండువాడవు. పంచభూతాల యొక్క ఉత్పత్తికి, ఉనికికి, లయాలకు స్థానమైనవాడవు, సత్య భాషణము, సమదర్శనము, పాటించే వాడవు అయిన నిన్ను ఆశ్రయిస్తున్నాము. నీ మాయ చేత అజ్ఞానులు నిన్ను అనేకంగా వర్ణిస్తారు. కాని విబుధులు (జ్ఞానులు) అన్ని మూర్తులలోనూ ఉన్నది నీవొక్కడివే అని ఏకమనస్సుతో అంటారు. ఓ పరమేశ్వరా! నీవే జగత్కారణుడవు, జ్ఞానస్వరూపుడవు, సర్వాంతర్యామివి, ఈ లోకాల క్షేమం గురించి అనేక రూపాలలో అవతరిస్తుంటావు. నీ పాదమే సంసారసాగరతరణానికి నౌక. దానిని పట్టుకొన్న వాడు ఆవలి ఒడ్డు చేరుకొంటాడు. కాని అహంకారులకు నీయొక్క మహిమ అంతుచిక్కదు. వారు మళ్లీ మళ్లీ నీచ జన్మలకు దిగజారిపోతారు. నీ పాదసేవకులకు ఎలాంటి భయమూ ఉండదు. అసురులను శిక్షించడానికి నీవే స్వయంగా భూలోకంలో అవతరించనవసరం లేదు. ఏలనన, నీ సంకల్పమాత్రముచే ఒక్క అసురులేయేమిటి సమస్తబ్రహ్మాండమూ నశించిపోగలదు. అయినా నీవు జీవకోటి యందు అపార - అనుగ్రహంతో అనేకరూపాల్లో నవతరించి, వారు ఆయా రూపాలను దర్శించి, ధ్యానించి, తరించాలని వచ్చిన వారికి నీ దర్శన భాగ్యాన్ని కలిగించుతావు. అలాగ చెయ్యకపోతే, నామ రూపాలు లేని నిన్ను ఏ రూపములో నారాధించాలో తెలియక లోకులు నాస్తికులైపోతారు కదా! స్వామీ! పరమ పురుషా!

మ॥ గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుడవై హయాననుడవై క్ష్మాదేవతా భర్త వై
ధరణీ నాథుడవై దయాగుణగణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెదమిలా భారంబు వారింపవే! 100

ప్రభో! కంసాది దుష్టులదుండగాలనుండి సాధు సజ్జనులను రక్షించడానికి సత్వరమే మాతృ గర్భము నుండి వెలికి రమ్ము ముకుందా!" అని ప్రార్థించి, దేవకితో ఇలా అన్నారు.

మత్తకోకిలము
తల్లి! నీయుదరంబులోనఁ బ్రధాన పూరుషుడున్న వా
డెల్లి పుట్టెడి కంసుచే భయమింతలేదు నిజంబు మా
కెల్ల వారికి భద్రమయ్యెడునింక నీకడుపెప్పుడున్
చల్లగావలె యాదవావళి సంతసంబును పొందగన్. 103

ఈ విధంగా హరిని స్తుతించి, దేవకిని దీవించి, బ్రహ్మాదిదేవతలు నిష్క్రమించారు.

జన్మయేలేని భగవంతుడు ఆవిర్భవించే సమయమాసన్నమైనది. గ్రహాలు తారలు అన్నీ ప్రశాంతముగ నున్నవి. భూమండలమంతా మంగళకరముగనున్నది. గంధర్వులు గానం చేస్తుండగా అప్సరసలు నాట్యము చేస్తుండగా దేవకీదేవి గర్భమునుండి దేవదేవుడు సూర్యునిలా ఉదయించి దర్శనమిచ్చాడు. అప్పుడే పుట్టిన బాలునిలాగా కనిపించినా, దివ్యతేజస్సుతో చతుర్భుజాలతో, శంఖ చక్ర గదాపద్మహస్తుడై కిరీటకుండల కౌస్తుభాలంకారాలతో నీలమేఘచ్ఛాయతో మెరిసిపోతున్న శ్రీమహావిష్ణువు దర్శనమిచ్చాడు. సంభ్రమాశ్చర్యాలతో నోటమాట రాని వసుదేవుడు. "ఇతడు నా పుత్రుడా? మహావిష్ణువా? అని పరికించి చూచాడు. అతడు పరమపురుషుడే యని నిశ్చయించుకొని సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆ గది అంతా దివ్యతేజస్సుతో నిండిపోగా, అతడు ఇలాగ స్తోత్రం చేశాడు: "సర్వమూ అయి, సర్వత్రా నిండియున్న నీవు జ్ఞానస్వరూపుడవు. సచ్చిదానందమూర్తివి. లోకములో ప్రబలిపోతున్న అసుర ప్రవృత్తులను అంతము చెయ్యడానికి నా కుమారునిగా పుట్టిన నీకు నా నమస్కృతులు. నీ అన్నల నందరినీ క్రూరుడై వధించిన కంసుడు నీమీదకు కూడ వస్తాడు. అందుచేత స్వామీ, ఈ నీరూపాన్ని అతనికి కనిపించకుండా చేయుము" అని ప్రార్థించాడు. అప్పుడు దేవకీదేవి ఈ విధంగా స్వామిని స్తుతించింది.

"ఓ పరాత్పరా! నీ లీలావిలాసంతో సంకల్పమాత్రాన సంభవించే ఈ విశ్వసృష్టి అంతా బ్రహ్మదేవుని ఆయుర్దాయం నిండగానే నిశ్శేషంగా అంతమయి, నీలో లయించినా, నీవు ఒక్కడవు మాత్రమే నిత్య సత్యస్వరూపుడవై నిలిచి యుంటావు. అటువంటి నీ యొక్క పాదపద్మాలను ఆశ్రయించినట్టి మనుజునకు ఇక మృత్యు భయమెక్కడిది?

ఉ॥ విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకు చుట్టమవైన నీకు దా
శాశ్వతమైన కాలమిది సర్వము వేదబనుందు రట్టి వి
శ్వేశ్వర మేలుకుప్ప నిను నెప్పుడు కోరి భజించువాడె పో
శాశ్వతలక్ష్మిమృత్యుజయసౌఖ్యయుతుండభయుండు మాధవా! 126

మాధవా! నీయొక్క లీలావినోదానికి విశ్వాన్ని ప్రవర్తింపజేస్తావు. మాయ, నీయొక్క బంధువు (నీనుండి ఉద్భవించినది). ఆ అనంతమైన కాలము నీయొక్క అద్భుత ప్రక్రియ. అట్టి విశ్వేశ్వరా! మంగళ ప్రదాతా! నిన్నెప్పుడూ కోరి భజించే వాడే కదా శాశ్వత సౌభాగ్య సౌఖ్య - అభయ అమరత్వాలను పొందగలడు!

మత్తకోకిలము

ఒంటినిల్చి పురాణయోగులు యోగ మార్గ నిరూఢులై
కంటిమందురుగాని నిక్కము కానరీ భవదాకృతిన్
గంటి భద్రము కంటిమాంసపు కన్నులం గనబోల దీ
తొంటి రూపు తొలంగ బెట్టుము తోయజేక్షణ మ్రొక్కెదన్. 127

ఆ॥ విలయకాలమందు విశ్వంబునీ పెద్దకడుపులోన దాచు కడిమిమేటి
నటుడవీవు నేడు నాగర్భజుడవౌట పరమపురుష వేడబంబు కాదె. 128

పూర్వము యోగులు ఒంటికాలిమీద నిల్చొని యోగమార్గాన నిన్ను చూచితిమని అంటారేగాని, నిజంగా నీ యొక్క స్వరూపాన్ని చూడలేరు. ఈ చర్మచక్షువులకు కానబడని ఈ అద్భుతరూపాన్ని నేను ఇప్పుడు చూస్తున్నాను. ఓ పరమేశ్వరా నీకు నమస్కరిస్తున్నాను. కాని స్వామీ! నీయొక్క ఈ నిజస్వరూపాన్ని తొలగించుమయ్యా దేవా!

ప్రళయకాలంలో విశ్వాన్నంతా నీ యొక్క దొడ్డకుక్షిలోనిముడ్చుకొన్న గొప్ప నటుడవు. నీవు నేడు నా గర్భము నుండి జన్మించడం మహా విచిత్రము కాదా! పరమపురుషా!

తరలము॥ నళిన లోచన నీవు నిక్కము నాకు పుట్టెదవంచు నీ
ఖలుడు కంసుడు పెద్దకాలము కారయింట నడంచె దు

రమలిన చిత్తుని నాజ్ఞ చేయుము మమ్ముఁగావుము భీతులన్
సులుసు లేక ఫలించె నోచిన నోము లెల్లను నీవయై. 129

ఓ నళినాక్షా! నీవు నాకు పుడతావని ఈ దుష్ట కంసుడు మమ్మల్ని చాలా కాలంగా చెరసాలలో అ యుంచాడు. వానిని శిక్షించి, మమ్మల్ని కాపాడుమయ్యా తండ్రీ! బిడ్డలులేక నేను నోచిన నోములన్నీ నీవే అ మాకు కలిగినావు కదా!" అప్పుడు దేవదేవుడిలాగ చెప్పాడు: "అమ్మా! నీవు మొదట స్వాయంభువ మన్వంతరవ పృశ్ని అనే పతివ్రతవు. వసుదేవుడు సుతపుడనే ప్రజాపతి. మీ ఇద్దరినీ ప్రజోత్పత్తి చేయుమని బ్రహ్మ నియమించ మీరు పన్నెండు వేల దివ్య సంవత్సరాలు తపస్సుచేసి నా సాక్షాత్కారం పొంది, వరము కోరుకొనుమనగా నా పుత్రుడు కావాలని కోరుకొన్నారు. నేను మీకు పుత్రుడనై పృశ్నిగర్భుడనిపించుకొన్నాను. తరువాత మీరు అ కశ్యపులు, మీ గర్భాన నేను వామనుడనై జన్మించాను. ఇప్పుడు మళ్లీ మీకు తనయుడనై జన్మించాను. దీ నేను మీకిచ్చిన వరము సంపూర్ణమయినది. మీకు పూర్వస్మృతి కలగాలని ఈ దర్శనం ఇచ్చాను. మీరు మీ పుత్రునిగానే కాకుండా పరబ్రహ్మముగా తెలుసుకొని ధ్యానించండి. మీకు ఇదే ఆఖరు జన్మ అవుతుం అని చెప్పి అప్పుడే పుట్టిన బిడ్డడైనాడు.

భగవంతుని ఆదేశము ప్రకారము వసుదేవుడు బిడ్డను గుడ్డలో చుట్టుకొని నెత్తిన పెట్టుకొని బయలుదే సంకెళ్లు వీడిపోయాయి. తలుపులు తెరచుకొన్నాయి. సైనికులు సుషుప్తులై యుండిరి. ఉరుములు మెరుపులతో కురుస్తున్నది. శేషుడు తన పడగలే ఛత్రముగా స్వామి తడవకుండా అనుసరిస్తున్నాడు. వరదలు కెరటా ఉప్పొంగిపోతున్న యమున (యముని సోదరి) దారి ఇచ్చినది. అర్ధరాత్రిలో అందరూ నిద్రిస్తుండగా వసుదే నందవ్రజము చేరి, యశోద ప్రక్కలో తన కొడుకును ఉంచి, ఆమెకు పుట్టియున్న బిడ్డను తీసుకొని కారాగారంలో ప్రవేశించి, ఆ బిడ్డను దేవకి ప్రక్కలో పెట్టి సంకెళ్లను తగిలించుకొన్నాడు. తలుపులు మూసుకొ యోగమాయా ప్రభావముచేత యశోదకుగాని, ఇంకెవ్వరికినిగాని పుట్టినది ఆడుబిడ్డా? మగబిడ్డడా? ఏమీ తెలియలే వసుదేవుడు చేసిన మార్పిడి కూడ ఎవ్వరికిని తెలియదు.

వసుదేవునిచే తీసుకొని రాబడిన బిడ్డ దేవకి ప్రక్కలోనుండి ఏడ్చినది. భటులు లేచి, వెంటనే పోయి కంసుని చెప్పారు. కంసుడు దిగ్గున లేచాడు. తాను ఇంతకాలంగా బెదురూ భయాలతో ఎదురు చూస్తున్న మృత్యువు గుమ్మంలోనే ప్రవేశించినట్లు అదిరిపోయాడు. మొండి ధైర్యం తెచ్చుకొన్నాడు. మృత్యురూపుడైన ఈ బిడ్డ హతమార్చి మృత్యువునే జయించాలని, చెదిరిన జుట్టూ, విడిపోతున్న పంచకట్టూ, తడబడుతున్న కాళ్లూ, వణుకుత చేతులూ, ఇవేమీ పట్టించుకొనకుండా వడివడిగా పరుగెత్తుకొంటూ కారాగారం చేరుకొన్నాడు. దేవకి చేతిలోనున్న బిడ్డ లాగుకొనబోయాడు. దేవకీదేవి భయంతో వణిపోతూ దీనంగా ఇలా అన్నది:

ఉ॥ అన్న శమింపుమన్న తగ దల్లుడు కాడిది మేనకోడలా
మన్నన సేయుమన్న విను మానిని చంపుట రాచపాడి కా
దన్న సుకీర్తివై మనఁగదన్న మహాత్ములు వోవుత్రోవపో
వన్న భవత్సహోదరిఁగదన్న నినున్ శరణంబు వేడెదన్. 149

క॥ కట్టా ఆర్గురు కొడుకులఁ బట్టి వధించితివి యాడుపడుచిది కోడల్
నెట్టన చంపఁగవలెనే కట్టిడివి గదన్న అన్న కరుణింపగదే 150

క॥ పుత్రుడు నీ బ్రతుకునకును శత్రుండని వింటిగాన సమయింపదగున్
పుత్రులకు నోచనైతిని పుత్రీదానంబు సేసి పుణ్యము గనవే! 151

అని పలు విధాల ప్రాధేయపడి, వేడుకొంటున్నను, కరుణించనివాడై దేవకి చేతినుండి బిడ్డను దురుసుగా లాక్కొని, కర్కశమైన తన ఇనుపపిడికిలితో పైకెత్తి, తన శక్తినంతా వినియోగించి నేలకు విసిరికొట్టాడు. ఆ బిడ్డ దివ్య తేజస్సుతో వెలిగిపోతూ, నేలపడకుండా పైకి వెళ్లినది. ఎనిమిది చేతులతో, ఆయుధపాణియై దివ్యమాల్యాంబర ధారిణియైన ఆ యోగమాయాదేవి ఇలా అన్నది: "ఓరీ దుర్మతీ! దేవకి బిడ్డలను అందరినీ చంపి, నన్ను రాతిపై కొట్టాలని ప్రయత్నించావు. కాని, నిన్ను చంపే వాడు నాతోనే జన్మించి వేరొక చోట పెరుగుతున్నాడు సుమా!" అని చెప్పి అదృశ్యమయినది. ఆయోగమాయాదేవి అనేక రూపనామాలతో ఇప్పటికీ వెలసియుంటూ ప్రజల మన్ననల నందుకొంటూ వారి కోర్కెలను తీర్చుతున్నది.

యోగమాయ మాటలు విని కంసుడు యోచించాడు. దేవకీ వసుదేవులను ఇంకా బంధించి యుంచడం అనవసరం, తాను అకారణంగా శిశుహంతకుడు అయినా ప్రయోజనం లేకపోయినది. విధి విలాసం వేరు విధంగా నున్నది అని తలపోసి, చెల్లెలిని బావను చెరనుండి విడిపించి, పశ్చాత్తాపంతో ఇలా అంటాడు: "బావా!

ఉ॥ **పాపుడ బాలఘాతకుడ బంధువిరక్తుడ దుష్ట చిత్తుడన్**
**కోపనుడం జరన్ మృతుడఁ గ్రూరుడ బ్రాహ్మణ హంతభంగి మీ**
**పాపలఁజంపితిన్ బయలి పల్కులు నమ్మితి సాధులార నా**
**పాపములుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే!** 157

ఆకాశవాణి మాటలువిని, ప్రాణభయముతో మీ బిడ్డలను నిష్కారణముగ చంపాను. ఎవరు చేసిన కర్మఫలాన్ని వారు అనుభవింపక తప్పదు కదా! దేహము ఎప్పటికైనా చనిపోవునట్టిదే. ఆత్మకు ఎవ్వరి వలనా చావు రాదు. ఆత్మ జ్ఞానము కలవారు, శరీరాలు కలియడానికి విడిపోవడానికి, చనిపోవడానికి కారణం ఆ జీవుల యొక్క కర్మలే అని తెలుసుకొంటారు. నా దుర్మార్గాన్ని క్షమించండి." అని వారిని వేడుకొన్నాడు. దేవకీ వసుదేవులు కంసుని పశ్చాత్తాపానికి ఊరట జెందారు. వసుదేవుడు కంసునితో ఇలా అన్నాడు.

శా॥ **బావా! నీ వచనంబు నిక్కము సుమీ ప్రాణుల్ గతజ్ఞానులై**
**నీ వేనంచును లోభమోహమదభీ నిర్మిత్రతా మోద శో**
**కావేశంబుల నొండొరుం బొడుతురేకాకారుడై సర్వరూ**
**పావిష్టుండగు నీశ్వరుం దెలియలేరన్యోన్యవిభ్రాంతులై.** 161

"బావా! నీవు చెప్పిన మాట నిజము సుమా! అన్ని ప్రాణులలోనూ అందరి యందూ ఆవేశించి వ్యాపించి యున్న ఈశ్వరుని గుర్తించలేని జ్ఞానశూన్యులు, లోభము, మోహము, మదము, భయము, శత్రుత్వము, శోకము మొదలైన ఆవేశాలకు లోనైనవారై, ఒకరినొకరు నిందించుకొంటూ, విభ్రాంతులై పొడుచుకొంటున్నారు కదా!" అని చెప్పగా కంసుడు సంతుష్టుడై వెళ్లిపోయాడు.

ఆ రాత్రి గడిచిన తరువాత కంసుడు అసుర ప్రవృత్తిగల తన అనుచర బృందాన్ని సమావేశ పరచి జరిగిన దంతా నివేదించాడు. వాళ్లంతా కూడబలుకుకొని ఇలా గన్నారు: "కంసరాజా! దేవతలు మన శత్రువులు, వారు పిరికిపందలు, ఇది వరకు నీచేత దెబ్బతిని యున్నారు గనుక నీతో యుద్ధానికి మరిరారు. కాని పొంచియుండి, దెబ్బ తియ్యడానికి ప్రయత్నిస్తారు. ముఖ్యముగా ఆ హరి మాత్రము ఉపేక్షించ రానివాడు. శత్రు శేషం ఉంచరాదు. అందుచేత బ్రాహ్మణులు, గోవులు, వేదాలు, యజ్ఞాలు, తపస్సులు మొదలైన విష్ణుస్థావరాలను నాశనం చేస్తే, వాటితోపాటు దేవతలు, విష్ణువూ నశిస్తారు. నీవు అనుమతిస్తే వాటి నాశనానికి ఇప్పుడే పూనుకొంటాము. మళ్లీ ఈ మధ్యనే పుట్టి, ఇంకా దంతాలు రాని పిల్లలందరినీ వెదకి హతమార్చుతాము. దేవకి అష్టమపుత్రుడు ఎక్కడున్నా తప్పించుకొనలేడు" అని దుర్బోధ చెయ్యగా, విష్ణుమాయచే కంసుడు సరే అన్నాడు. వాళ్లంతా సాధుహింసకు విజృంభించారు.

వ్రేపల్లెలో నందుడు అత్యానందభరితుడై పుత్రునకు జాతకాది కర్మలను చేయించాడు. వేలకొలది గోవులనూ, వస్త్రాలను, సువర్ణరత్నాలను తిలరాసులను దానం చేశాడు. వీథులు గృహాలు గోవులు అలంకరింపబడ్డాయి. గోపగోపీ జనులు. నూతనవస్త్రాలు ధరించారు. వసంతాలాడుకొన్నారు. యశోదమ్మ కొడుకును చూచి వద్దామని జనులు తండోపతండాలుగా వచ్చారు. అంతా వేడుకలే! మహా ఉత్సవంగా తయారయినది.

**ఆ॥ ఏమినోము ఫలమొ యింత ప్రొద్దొక వార్త, వింటి మబలలార! వీనులలర**
**మన యశోద చిన్ని మగవాని కనెనట! చూచి వత్తమమ్మ సుదతులార!** 183

ఆ తల్లులందరూ బాలునికి స్నానం చేయించి, అలంకరించి ఇలా జోకొట్టారు.

**క॥ జోజో కమలదళేక్షణ! జోజో మృగరాజ మధ్య! జోజో కృష్ణా!**
**జోజో పల్లవకరపద! జోజో పూర్ణేందువదన! జోజో యనుచున్.** 189

యశోద, రోహిణి తమ బిడ్డలు క్షేమంగా వర్ధిల్లాలని దేవుని ప్రార్థించారు. విష్ణువు అవతరించినప్పటి నుండియు నందవ్రజంలో మహాలక్ష్మి తాండవించడం ప్రారంభించినది. అంతా సుభిక్షంగా సిరి సంపదలతో తులతూగుచున్నారు.

నందుడు మధురను పాలించే రాజుకు సామంతుకావడం చేత ఏటేటా కప్పం కట్టాలి. నందుడు తన పరిచారకులతో మధుర వెళ్లాడు. వసుదేవుని కూడ చూద్దామని నందుడు వసుదేవుని నివాసానికి వెళ్లాడు. వసుదేవుడు ఎదురుగా వచ్చి, నమస్కరించి, కౌగలించుకొని, కుశల మడిగి, ఇలా అన్నాడు: "అన్నా! సంతతిలేని చింతతోనున్న నీకు పెద్ద వయస్సులో పుత్రసంతానం కలిగినందుకు మాకు మిక్కిలి ఆనందమైనది. సుపుత్ర సంతానం కలగడం సంసారికి మహాభాగ్యము కదా! నా కుమారుడు మీ దంపతులను ఆనందింప జేస్తున్నాడా?" అని అడిగాడు. ఈ ప్రశ్న నంద గృహంలో పెరుగుతున్న రోహిణీ పుత్రుడైన బలరాముని గురించి అని నందుడు భావించాడు. శ్రీకృష్ణుడు దేవకి పుత్రుడని నందునకు తెలియదు గనుక అతడు వసుదేవుని యందు సానుభూతితో ఇలా అన్నాడు: "సోదరా! మీకు పుట్టిన బిడ్డలందరినీ కంసుడు పొట్టన పెట్టుకొన్నాడు. చివరికి కుమార్తె కూడా ఆకాశానికి ఎగిరిపోయినది. పాపం ఒక్కరైనా దక్కలేదు అంతా విధివిలాసం. మనం చేయగలిగిందేమీలేదు" అని అనునయించాడు. అప్పుడు వసుదేవుడిలా అన్నాడు: "నందరాజా! నీవు వెంటనే వ్రజపురానికి వెళ్లిపోవాలి. అక్కడ ఊహించలేనట్టి ఉపద్రవాలు సంభవించనున్నవి సుమా!" అని హెచ్చరించి పంపించివేశాడు.

## బాల్యలీలలు - దుష్టసంహారము

కంసునిచే పంపబడిన పూతన అనే రాక్షస స్త్రీ ఊరూరా, వాడవాడా తిరిగి, పసిబిడ్డలను వెదకి వెదకి, సంహరిస్తూ నందగ్రామం చేరుకొన్నది. కామరూపిణి గనుక సర్వమోహనసుందరాంగి రూపాన్ని ధరించి, నానాలంకారభూషితయై, ఘల్లుఘల్లున నడిచి వెళ్లుతుంటే, ఈమె ఎవరు? విష్ణువును వెతుక్కుంటూ వచ్చిన లక్ష్మీదేవి కాదు కదా! అని గోపవనితలంతా ఆశ్చర్యంతో చూస్తున్నారు. ఆమె నేరుగాపోయి నందగృహంలో ప్రవేశించి పాన్పుపై వటపత్రశాయి లాగా పవ్వళించియున్న బాలుని చూచినది. ఆ బాలుడు సామాన్యుడా? సర్వమూ తెలిసిన సర్వేశ్వరుడు. తనను చంపవచ్చిన స్త్రీని చూచి, నిద్ర నటించి కళ్లు మూసుకొన్నాడు. తాను ఎవరినిగురించి లోకమంతా గాలిస్తూ తిరుగుతున్నదో, ఆ శ్రీహరియే ఈ బిడ్డడని తెలియని ఆ అసురాంగన చొరవతీసుకొని, తిన్నగా పోయి ఆ బాలునెత్తుకొని, ముద్దాడి తలనిమిరి ఇలా అన్నది:

**క॥ నా చనుపాలొక గ్రుక్కెండో చిన్నికుమార! త్రావు మొయ్యన పిదపన్**
**నీ చెలువమెరుగ వచ్చును నా చెలువము సఫలమగును నళినదళాక్షా.** 220

ఈ సుందరి ఎవరు? ఎవరి భార్య? ఎక్కడి నుండి వచ్చినది? ఇలా చొరవ తీసుకొని మా నల్లనయ్యను ఒడిలోకి తీసుకొంటున్నదేమిటి? అనుకొంటూ ఆమె చేష్టలను నిశ్చేష్టలై చూస్తున్న యశోదా రోహిణులు - "వనితా! వలదమ్మా వలదు, చన్ను కుడుపవద్దమ్మా బిడ్డను విడిచిపెట్టి, నీవు వెళ్లిపొమ్మా!" అని వారిస్తున్నా వినిపించుకొనకుండా, ఆమె విషముతో ఉబ్బియున్న తనచన్నులను కుడిపింది. అదే తడవుగా ఆ బాలుడు రెండు గ్రుక్కలలో ఆమెచనుబాలతో పాటు ఆమె ప్రాణాలను కూడా పీల్చివేస్తుంటే, ఆమె తటపటా కొట్టుకొంటూ, గిలగిల తన్నుకొంటూ, విడువు విడువు అని అరుస్తూ పెద్ద కేక పెట్టి పడిపోయినది. ఆమె సుందర శరీరం ఒక వికృతమైన మహాపర్వతమై పడిపోయినది. ఆ ధ్వనికి భూమి దద్దరిల్లినది. పిడుగు పడినదేమో అని అనుకొన్నారు కొందరు. మూర్ఛ పోయారు కొందరు. ఆ శరీరం ఒక యోజనం మేర ఆక్రమించినది. దాని క్రిందబడి అనేక వృక్షాలు నలిగి పోయాయి. ఆమె దంతాలు నాగళ్ల వలెను, ముక్కురంధ్రాలు కొండగుహలవలెను, కాళ్లు చేతులు మహా వృక్షాలవలెను ఉన్నవి. వెల్లకిలా పడియున్న ఆమె దేహంమీద, కొండలలాంటి ఆమె చన్నులపై నల్లనయ్య నిర్భయంగా నవ్వుతూ ఆడుకొంటున్నాడు. ఆ దృశ్యాన్ని చూచి హడలిపోయిన రోహిణీ యశోదలతోపాటు గోపస్త్రీలందరూ రోదన చేసుకొంటూ బాలకృష్ణుని ఎత్తుకొని తీసుకొనివచ్చి, దోష పరిహారం చెయ్యడానికి అనేక దిగదుడుపులు చేశారు. దేవతలను ప్రార్థించారు. బాలుని ప్రతి అంగాన్నీ ఒక్కొక్క దేవత రక్షించేటట్లు రక్షకులుగా అనేక దేవతలను ప్రార్థించారు. అలాగే నిద్రించేటప్పుడు, నడిచేటప్పుడు, ఆడుకొంటున్నప్పుడు భుజించేటప్పుడు కూడ కాపాడుమని దేవతలను ప్రార్థించారు. జగద్రక్షకుడైన స్వామికి అమాయకులైన ఆ గోపవనితలు అత్యంతప్రేమతో రక్షణ కల్పించాలని ఆత్రుత పడ్డారు.

నందాదులు మధురనుండి తిరిగి వచ్చి మహాపర్వతం లాగా పడియున్న శరీరాన్ని చూచారు. ఉపద్రవాలు రానున్నవని వసుదేవుడు హెచ్చరించినట్లే అయినదని ఆశ్చర్యపోయాడు నందుడు. గోపయువకులు గొడ్డళ్లు తెచ్చి ఆ శరీరాన్ని ఖండఖండాలుగా కొట్టి ఊరవతల దహనంచేసినారు. ఆదేహమునుండి సువాసనలు వచ్చి ఊరంతా వ్యాపించాయి.

ఆహా! ఆ రాక్షసి ఎంతటి ధన్యురాలో కదా! ఆ పరమేశ్వరుని దర్శన మాత్రంచే సకల దురితాలూ దూరమవుతాయి కదా, మరి ఆయన స్వయంగా ఆమె చనుపాలే త్రాగి, ఆమె శరీరంమీద ఆడుకొంటే ఇక నామెకు ఇంకేమి కావాలి?

**క॥ హరి తనమీదం బదములు, కరములు నిడి చన్నుకుడిచి కదిసిన మాత్రన్**
**హరి జనని పగిది పరగతి కరిగెను దురితములు వాసి అసురాంగనయున్. 239**

**క॥ వెన్నునికొకమటి విషమగు, చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్**
**వెన్నునిఁగని పెంచుచు తనచన్నిచ్చిన సతికి మరియు జన్మము కలదే. 240**

**క॥ హరిఁ గని చన్నులు కుడిపెడు తరుణులు ప్రాప్తించు పదము తలపగ వశమే**
**హరి యారగించుటకు పాల్ కురిసిన ధేనువులు ముక్తి కొనల చరించున్. 241**

నందుడు ఇల్లు చేరుకొన్నాడు. ఏమీ ఎరుగనట్లు హాయిగా నిద్రపోతున్న చిన్ని బాలుని చూచాడు. యశోదాది గోపమ్మలు చెప్పిన వివరాలు విన్నాడు. ఎంత అదృష్టవంతులము! ఎంత గండము గడిచినది! అనుకొని చిన్ని కృష్ణుని ముద్దాడి, శిరము మూర్కొని ముదముతో ముక్కోటి దేవతలకు నమస్కరించాడు.

అని చెప్పి, శ్రీశుకుడు ఇలా అన్నాడు -

**క॥ ఉరు సంసారపయోనిధి, తరణంబులుఁబాపపుంజతరణంబులు శ్రీ**
**కరణంబులు ముక్తి సమాచరణంబులు బాలకృష్ణసంస్మరణంబుల్. 245**

## శకటాసురుడు

శ్రీకృష్ణుడు పుట్టి నెలరోజులు కాకుండానే మళ్లీ రోహిణీనక్షత్రం నాడు ఇల్లు దాటించే ఉత్సవాన్ని చేయతలపెట్టి యశోద యమునాతీరాన పెద్దఎత్తున కార్యక్రమం చేపట్టినది. బ్రాహ్మణులకు పుణ్యస్త్రీలకు కానుకలిచ్చి, సత్కరించే ఏర్పాటు చేసినది. అందరికీ మృష్టాన్న భోజనాలు పెట్టించే ఏర్పాటు చేసినది. ఊరంతా తరలి వచ్చినది. బాలునికి ఒక బండిక్రింద ఉయ్యాల కట్టి పరుండబెట్టినది. తాను వేరే పనులలో నున్న సమయంలో కంసునిచే పంపబడిన అసురుడొకడు వచ్చి, ఆ బండిపైనావేశించాడు. ఇది కనిపెట్టిన బాలకృష్ణుడు అందరిదృష్టినీ ఆకర్షించాలని గట్టిగా ఏడ్చినా ఎవ్వరూ వినిపించుకొనలేదు. ఉయ్యాలలో నున్న బాలుడు తన చిన్ని పాదాలతో ఒక్క తాపుతన్నగా, బండీ, దానిలో నున్న సామాగ్రితో సహా అసురుడూ, ఆకాశంలో అంతెత్తున ఎగిరి నేలపైబడి తునాతునకలై చెల్లాచెదురుగా పడిపోయినాడు. శకటరూపంలోనున్న అసురుని ప్రాణాలు అలాగే ఎగిరిపోగా వాని అవయవాలు బండి భాగాల రూపంలో పడిఉన్నవి. బండి శిథిలాలమధ్య సురక్షితంగా ఉయ్యాలలోనున్నాడు బాలకృష్ణుడు. దగ్గరలోనే ఆడుకుంటున్న పిల్లలు ఈ దృశ్యాన్ని చూచి యశోదాది తల్లులకు చెప్పగా వారెవ్వరూ నమ్మకుండా ఇలా అనుకొన్నారు.

**శా॥ బాలుండెక్కడ? బండియెక్కడ? నభో భాగంబుపైఁ జేడ్పడన్**
**కాలందన్నుట యెక్క దాటపడుచుల్ కల్లాడిరీ జడ్డుఁబ**
**ల్కే లోకంబున నైన చెప్పబడునే? యే చందమో కాక యుం**
**చాలాపించుచు వ్రేలు వ్రేతలుఁబ్రభూతాశ్చర్యులై రంతటన్. 256**

భయముతోనూ జాలితోనూ చలించిపోతున్న యశోద బాలుని ఒడిలోనికి తీసుకొని, ఇలా అన్నది.

**ఆ॥ అలసితివి గదన్న! యాకొంటివి గదన్న! మంచియన్న! యేడ్పుమానుమన్న!**
**చన్ను కుడువుమన్న! సంతసపడుమన్న! యనుచు చన్ను కుడిపె నర్భకునకు. 258**

బాలగ్రహమేదో సోకియుండవచ్చునని, అలాంటి అరిష్టాలేవీ రాకుండా నందుడు అనేక హోమాలూ దానాలూ చేయించి బ్రాహ్మణుల ఆశీస్సులను పొందాడు.

## తృణావర్తుడు

ఒకనాడు యశోద ఒడిలో బాలుని కూర్చుండఁబెట్టుకొని ముద్దు చేస్తుండగా అతడు కొండలాగ బరువైనాడు. ఏమిటీ వింత అనుకొని వానిని క్రింద కూర్చుండఁబెట్టి ఏదో పనిమీద ఇంట్లోకి వెళ్లినది. ఇంతలో కంసుని అనుచరుడైన తృణావర్తుడనే అసురుడు, ఒక సుడిగాలియై వచ్చి బాలుని ఎగరవేసుకొని పోయాడు. వ్రేపల్లె అంతా ధూళిమేఘాలతో అంధకారమయిపోయినది. బాలుడేమైనాడో తెలియక ఇలా విలపించినది యశోదమ్మ:

**ఉ॥ ఇక్కడఁబెట్టితిం దనయుడిక్కడ నాడుచునుండె గాలి తా**
**నెక్కడి నుండి వచ్చె? శిశువెక్కడి మార్గము పట్టిపోయె? నే**
**నెక్కడ జొత్తునంచుఁ గమలేక్షణ క్రేపుఁ దొరంగి ఖిన్నయై**
**పొక్కుచు వ్రాలు గోవుక్రియ భూస్థలి వ్రాలె దురంతచింతయై. 268**

ఆమె ఏడ్పువిని అందరూ వచ్చి, కృష్ణుని వెదకసాగారు. తృణావర్తుడు బాలుని ఎగురవేసుకొని పోతూ, అతని బరువును భరించలేకపోతున్నాడు. బాలుడు అసురుని కంఠం పట్టుకొని వ్రేలాడుతున్నాడు. అతని పట్టు బిగుసుకొంటున్నది. ఊపిరి ఆడక, కన్నులు తేలవేసి, వెర్రి అరుపులతో అసురుడు ఆకాశంనుండి ఒక బండరాతిపై బడి, శరీరం ముద్ద అయి ప్రాణాలు పోగొట్టుకొన్నా బాలకృష్ణుడు మాత్రం చెక్కు చెదరకుండా వానిపై కూర్చొని యున్నాడు. స్త్రీలందరూ పోయి బాలుని ఎత్తుకొనిపోయి, యశోదమ్మకిచ్చారు. రాక్షసుడు చచ్చిపడి ముద్ద

అయిపోయినా, వానిచే ఎత్తుకొని పోబడిన చిన్నారి బాలుడు మాత్రము సురక్షితముగా నుండడం ఎంత అద్భుతం! మనమెంతటి అదృష్టవంతులము?

మ॥ గతజన్మంబులనేమినోచితిమొ? యాగశ్రేణులేమేమి సే
సితిమో? యెవ్వరికేవి పెట్టితిమొ? యే చింతారతిం బ్రొద్దు పు
చ్చితిమో? సత్యములేమి వల్కితిమొ? యే సిద్ధ ప్రదేశంబు ద్రొ
క్కితిమో? యిప్పుడు చూడగంటిమిచటం గృష్ణార్భకున్ నిర్భయున్. 277

నందుడు మిక్కిలి సంతసించినవాడై, వసుదేవుని హెచ్చరికను జ్ఞాపకం చేసుకొన్నాడు. ఒకనాడు యశోద బాలునికి పాలు ఇస్తుండగా, అతడు పాలుత్రాగుటమాని, తల్లి ముఖం వైపు చూస్తూ లీలగా ఆవులించాడు. ఆనోటిలో ఆమెకు విశ్వమంతా కనిపించినది. ఆకాశము, భూమండలము, జ్యోతిర్మండలము, సూర్యచంద్రులు, పంచభూతాలు, నదులు, పర్వతాలు అన్నీ కనిపించాయి. ఆమె ఆశ్చర్యంతో వణకిపోతూ కన్నులు మూసుకొన్నది. తాను సామాన్య బాలుడను కానని విశ్వరూపుడైన వాసుదేవుడనని యశోదకు చూపి లీలలను ప్రదర్శించాడు.

## నామకరణము

నందవ్రజములో పెరుగుతున్న దేవకీ రోహిణుల పుత్రులకు జాతక నామకరణాది కర్మలను చేసి రమ్మని వసుదేవుడు తమ కులగురువైన గర్గుని నందుని వద్దకు పంపించాడు. మహాప్రజ్ఞాశాలి యైన గర్గుని రాకకు నందుడు సంతసించి ఇలా అన్నాడు: "గురువర్యా! మీరు భవిష్యత్తును చదువగల దైవజ్ఞులు ఈ బాలురిద్దరి జాతక నామకరణాలను జరిపించవలసినదిగా ప్రార్థిస్తున్నాను. వేడుకలకు ఏర్పాట్లు చేయిస్తాను" అని చెప్పగా గర్గుడు ఇలా అన్నాడు: "ఓ నందరాజా! ఈ కార్యము చాలా గుప్తముగా జరుగవలసి యున్నది. యదువుల కులగురువునైన నేను ఇక్కడికి వచ్చి ఈ బాలుర నామకరణం చేసినట్లు కంసునికి తెలిస్తే చాలా ప్రమాదం వాటిల్లుతుంది. వీరుదేవకీ దేవి పుత్రులనే రహస్యం బయటపడుతుంది. ఇంతవరకు నీకు కూడ వీరిజన్మ రహస్యము తెలిసి యుండదు." అని గర్గుడు నందునకు అతిరహస్యంగా చెప్పాడు. నందుడు అంతా గోప్యంగా జరిపించాడు. గర్గముని ఇలా చెప్పాడు: "రోహిణీ పుత్రుడు జేష్ఠుడు. బలశాలి, అందరినీ ఆనందింపజేసే లక్షణాలున్నవి కనుక బలరాముడు అనే నామము సరిపడుతుంది. మొదట దేవకీదేవిగర్భాన ఉండి బైటకు తీసుకొనిరాబడి రోహిణి గర్భములోనుంచబడినందున సంకర్షణుడు అనే పేరు కూడ తగియున్నది. ఈ చిన్నవాడు పూర్వము విభిన్న వర్ణాలలో శరీరాన్ని ధరించినా, ఈ జన్మలో నల్లని వర్ణంతో జన్మించాడు. గనుక కృష్ణుడు అనదగియున్నాడు. వసుదేవుని సుతునిగా జన్మించియున్నందున వాసుదేవుడనబడుతాడు. ఇతనికి అనేకమైన రూపాలు, గుణాలు, కర్మలు ఉంటాయి కనుక వాటికి సరిపోయే అనేకమైన నామాలుంటాయి. ఇతడు నారాయణసముడు. ఇతని వలన దుష్టశిక్షణం జరుగుతుంది. మీ అందరి కష్టాలు తొలగిపోతాయి." అని గర్గమహాముని చెప్పగా నందుడు పరమానందభరితుడైనాడు. తన చిన్నారి కృష్ణయ్య సామాన్యుడు కాడు, నారాయణాంశతో పుట్టిన వాడని గర్గమహాముని నేరుగా చెప్పకపోయినా సూచన ప్రాయంగా తెలియజేశాడు కదా! అని, నందుడు ఆనందపరవశుడైనాడు.

## నవనీత చోరుడు

బలరామకృష్ణులు మోకాళ్లమీద చేతులమీద ఇంట్లోనే కాకుండా వాకిట్లోకి, వీధిలోకి, మట్టిలోకి, ముళ్ల కంచెల్లోకి వెళ్లడం మొదలు పెట్టడంతో తల్లులు అన్ని పనులూ మానుకొని వారిని కనిపెట్టుకొని ఉండడంలోనే ఎక్కువగా కాలక్షేపం చేసేవారు. పిల్లలు కొంచెం పెరిగి, నడుస్తూ పరుగెత్తుతూ వీధిలోని వారందరికీ వినోదం, ఆనందం కలిగించేవారు. దూడలతోకలు లాగుతూ వాటి వెంట పరుగెత్తుతూ ఉంటే తల్లులు తల్లడిల్లి పోయేవారు. ఇంకా కొంచెం పెద్ద వారై తమ ఈడు పిల్లలతో ఆటలాడడం ప్రారంభించారు. పిల్లలమూక చేస్తున్న అల్లర్లు ఎక్కువౌతున్నా

గోపకాంతలు మురిసిపోయే వారే గాని కోపగించుకొనేవారు కారు. పిల్లలందరికీ నాయకుడు బాలకృష్ణుడు. అతని దివ్యమోహనరూపాన్ని చూచి అందరూ ముగ్ధులై అల్లరి చేష్టలన్నీ లీలావినోదాలుగా ఆనందించేవారు. అది వారి యొక్క పూర్వజన్మాను బంధమేకదా! అప్పుడప్పుడు ఆ అల్లరి ఆగడాలు కొంచెం మితిమీరేవి. బాలకృష్ణుడు దూడలకు కట్టువిప్పి, పాలుకుడిపించేవాడు. గోపమ్మల ఇళ్లలో దూరి పాలు పెరుగు త్రాగేవాడు. అందకపోతే పీటలూ రోళ్లూ ఎత్తుగా వేసి అందుకొనేవాడు. లేదా తన తోడి బాలుర వీపుపైనెక్కి అందుకొనేవాడు. పాలుపెరుగువెన్నలను ఈ విధంగా దొంగిలించి, పిల్లలందరికీ పంచి పెట్టి, కోతులకు కూడ పెట్టేవాడు. గోపస్త్రీలు కోపపడితే నవ్వుతూ పారిపోయేవాడు. వాళ్లంతా పోయి యశోదమ్మకు చెప్పినా, ఆమె కొడుకును వెనకేసుకొని వచ్చేది. ముసిముసిగా నవ్వుతూ నా చిన్ని కృష్ణుడు అలాంటి వాడు కాదర్రా అనేది.

ఒకనాడు గోపికలూ, అత్తలూ కలిసి వచ్చి, యశోదమ్మతో ఇలాగ చెప్పారు.

**క॥ బాలురకు పాలులేవని బాలింతలు మొరలు వెట్ట పకపక నగి యీ**
**బాలుండాలము సేయుచు నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ. 306**

**క॥ పడతీ నీ బిడ్డడు మా కడవలలో నున్న మంచి కాగిన పాలా**
**పడుచులకు పోసి చిక్కిన కడవలఁ బోనడిచె నాజ్ఞ కలదో లేదో. 307**

**మత్తకోకిలము:**

**పుట్టి పుట్టఁడు నేడు దొంగిలఁ బోయి మా ఇలుసొచ్చి తా**
**నుట్టి యందక రోళ్లఁబీటలు నొక్కత్రోవిడి యెక్కి చే**
**వెట్టఁ జాలక కుండ క్రిందొక పెద్ద తూటొనరించి మీ**
**పట్టి మీగడపాలు చేరలఁ బట్టి త్రావె తలోదరీ. 309**

**క॥ ఆడంజని వీరల పెరుగోడక నీ సుతుఁడుత్రావి యొకయించుక తాఁ**
**గోడలి మూతిం జరిమినఁ గోడలు ముచ్చనుచు నత్త కొట్టె లతాంగీ. 310**

**క॥ వారిల్లు సొచ్చి కడవలఁ దొరంబుగ నెయ్యి త్రావి తుది నా కడవల్**
**వీరింటను నీ సుతుడిడ వారికి వీరికిని దొడ్డ వాదయ్యె సతీ. 311**

**క॥ వేలుపులటె నాకంటెను వేలుపు మరి యెవ్వడనుచు వికవిక నగి మా**
**వేలుపుల గోడపై నో హేలావతి నీ తనూజుడెంగిలి చేసెన్. 312**

ఓ యశోదమ్మా! నీ ముద్దుల బిడ్డడు చేయు ఆగడాలు ఎన్నని వర్ణించగలం? ఇంట్లోని పసిపిల్లలకు పాలు చాలటం లేదని తల్లులు బాధ పడ్తుంటే, మీవాడువచ్చి దూడల్ని విప్పేయగా అవి వెళ్లి ఆవులపాలన్నీ త్రాగివేశాయి అని ఒకామె అంటే, నీ బిడ్డడు వచ్చి మాఇంట్లో పాలన్నీ తీసుకుపోయి, తన స్నేహితులకు ఇచ్చేసి కడవలను తొక్కేసి వెళ్లిపోయాడమ్మా అని ఇంకొకామె అన్నది. ఉట్టి అందకపోతే రోళ్లూ పీటలూవేసి, అప్పటికిని అందక పోతే కర్రతో కన్నం పొడిచి, దోసిలి పట్టి పాలన్నీ తాగివేశాడమ్మా – అని ఇంకొకావిడ అన్నది. వాళ్లింట్లో మీగడ పెరుగుతినేసి, పోతూ పోతూ, ఒకింత ఆ ఇంటి కోడలి మూతికి రాసి పోయాడమ్మా, అప్పుడు, కోడలే తినేసిందని అత్త ఆమెను కొట్టిందట అని ఇంకొకామె చెప్పినది. వాళ్లింట్లో నెయ్యి త్రాగి, ఆ ఖాళీ కడవలను వీళ్లింట్లో పెట్టేసి వెళ్లిపోతే వాళ్లకూ వీళ్లకు పెద్ద తగవు అయిందటమ్మా – అని ఇంకొకామె చెప్పినది. వాళ్లింట్లో దూరి, వెన్న తినేసి ఎంగిలి చేతిని గోడలమీద దేవుళ్ల చిత్రాలకు రాస్తే అలాగ చెయ్యవచ్చా అని వాళ్లు అడిగితే, నా కంటే దేవుళ్లింకెవరున్నారే – అని అడిగాడటమ్మా నీ కొడుకు అని ఇంకొకామె చెప్పినది. ఓ యశోదమ్మా! మా వీధి వారమంతా కూడబలుకుకొని, మా

పాలుపెరుగులను గదుల్లో పెట్టి తాళాలు వేసి, నీ కొడుకు ఏ త్రోవను వచ్చినా పట్టుకుందామని అన్ని దారుల వైపూ కాపలాకాస్తిమి. కాని వాడు వచ్చిన జాడలేదు. మేము కాపలా ఉండడం చేత రాలేదని అనుకొని సంతోషించాము. కాని తాళాలు తీసి గదుల్లో చూచే సరికి ఖాళీ కడవలే కనిపించాయి, అందరి ఇళ్లలోనూ, తలుపులూ తాళాలూ భద్రంగా నున్నా కడవలు ఎలాగ ఖాళీ అయి పోయినవో తెలియటం లేదు. మీరు శ్రీమంతులు కదమ్మా, మీ బిడ్డకు అన్నీ పెట్టగలరు. మరి మా ఇండ్లలోని పాలూ పెరుగూ తినడానికి అతనిని ఈ విధంగా విడిచిపెట్టడం మీ రాజరికానికి ఏమైనా తగియున్నదా'' అని నిష్ఠూరాలు ఆడారు.

క॥ ఓయమ్మ! నీ కుమారుడు మా యిండ్లను పాలు పెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికైనను మాయన్నల సురభులాన మంజులవాణీ. 328

అని ఆ భామలు, తమ చిరాకును చెప్పుకొన్నారు. ఆహా! ఇదే విష్ణుమాయ! ఈ గోపీగోపజనులందరూ పూర్వము మహా ఋషులూ, దేవతలూ అయి యుండి, విష్ణుసేవా సాంగత్యాలను కాంక్షించిన వారే అయి యుండి, మాయామోహితులై, బాలకృష్ణుని బాలలీలా వినోదాలన్నీ ఆ మహావిష్ణువు తమయెడల చూపిన అనుగ్రహ విశేషాలూ, మహాప్రసాదాలూ అని గుర్తించలేక, అతని మీద యశోదమ్మకు అభియోగాలు చెప్పుకొనడానికి వచ్చారు, పాపం, ఎంతటి అవివేకులు? వారితో యశోదమ్మ ఇలా అన్నది.

క॥ చన్నుు విడిచి చనడిట్టటు నెన్నడు పొరుగిండ్ల త్రోవ లెరుగడు నేడుం
గన్నులు తెరవని మా యీ చిన్ని కుమారకుని రవ్వసేయందగునే. 330

ఆ॥ అన్యమెరుగడు తనయంత నాడుచుండు మంచివాడీతడెగ్గులు మానరమ్మ
రామలార! త్రిలోకాభిరామలార! తల్లులార! గుణవతీమతల్లులార! 331

అయ్యో! నా చిన్ని కుమారుడు ఎప్పుడూ నా ఒడిలోనే ఉంటూ పాలు త్రాగుతుంటాడమ్మా! నన్ను విడిచి ఎవ్వరిళ్లకూ వెళ్లడే! అలాంటి పసికందు మీద ఇలాగ రట్టు చేయడం ఏమైనా బాగుందా? అమ్మలారా! నా బిడ్డడు చాలా మంచివాడు. తనంతటతానే ఆడుకొంటాడుగాని ఇంకేమీ ఎరుగని వాడు. వాడిమీద ఎగ్గులు చెప్పకండమ్మా! అని తల్లి వెనకేసుకొని వస్తుంటే, చిన్నారి చిలిపి కృష్ణుడు-

ఉ॥ కాంతలు తల్లితో తన వికారములెల్ల గణింప భీతుడై
శాంతుని సొంపునన్ పరమసాధుని పెంపున కోలమూఢ్కి వి
భ్రాంతుని కైవడిన్ జడుని భంగి కుమారకుడూరకుండె నే
వింతయులేక తల్లి కుచవేదిక నౌదలమోపి యాడుచున్. 333

గోపకాంతలందరూ తన అల్లరి చేష్టలన్నీ లెక్కపెడ్తూ తల్లితో చెపుతుంటే, భయపడినవానివలె, శాంతునివలె, పరమసాధువువలె, అమాయకునివలె, మతిభ్రమించినవానివలె, జడునివలె బాలకుడేమీ చలించకుండా తల్లిపయ్యెదలో తలదూర్చి ఏమీ తెలియనట్టు ఆడుకొంటున్నాడు. ఇలాంటి అమాయకపు బిడ్డను ఏ తల్లి మాత్రము శిక్షించగలదు? గోపమ్మలను ఎలాగో సముదాయించి పంపివేసినది యశోదమ్మ. ఏమి చెప్పినా యశోదమ్మ నమ్మటంలేదని గోపమ్మలందరూ కూడబలుకుకొని, అల్లరిచేస్తుండగా పట్టుకొని, ప్రత్యక్ష సాక్ష్యముగా బాలుని యశోద వద్దకు తీసుకొనివెళ్లాలనుకొన్నారు. కనిపించకుండా కాపలా కాశారు. కృష్ణుడు వచ్చి, వెన్న తింటుండగా పట్టుబడ్డాడు. పట్టలేనంత ఉత్సాహంతో "దొంగ దొరికాడు, ఇప్పుడెక్కడిపోతాడు'' అని సంబరపడిపోతూ పట్టుబడిన ఆ పసివానిని, లాక్కొని, ఒక్కొక్క గోపికా, తన ఇంటినుండి బయలుదేరి, యశోద ఇంటికి వచ్చినది. ఆశ్చర్యం, అద్భుతం, అక్కడచేరిన ప్రతి ఒక్క స్త్రీ చేతనూ ఒక్కొక్క చిన్ని కృష్ణుడు పట్టుబడి యున్నాడు. ఈ కలకలం విని, యశోద ఇంటిలోపలినుండి బైటకువచ్చి, విశేషమేమిటని ఆ స్త్రీలను అడుగుతుంటే, ఇంటిలోనుండి యశోదవెనుకనే బయటకు

వచ్చిన బాలకృష్ణుడు, తల్లి యొక్క చీరకొంగు చుట్టేసుకొని, దాక్కున్నాడు. గోపికల చేతుల్లో చిక్కిన చిన్నికృష్ణుడు ఒక్కడూలేడు. ఆ స్త్రీలు మూగవోయి, ఏమి చెప్పాలో తెలియక సిగ్గుపడి, తలలువంచుకొని, వెళ్లివస్తాం అని చెప్పి వెళ్లిపోయారు. ఆ చిన్నికృష్ణుని చిలిపి చేష్టలను ప్రేమతో తిలకించడంలోనే పరమానందం ఉన్నదని వారు గ్రహించారు.

## విశ్వరూపము

ఒకనాడు కృష్ణుడు మన్ను తిన్నాడని బలరాముడు, ఇతర బాలురు యశోదకు చెప్పారు. ఆమె కృష్ణుని మందలించాలని అతనిని పిలిచి ఇలా అన్నది.

క॥ **మన్నేటికి భక్షించెదు మన్నియమము లేల నీవు మన్నింపవు నీ**
**యన్నయు సఖులును జెప్పెద రన్నా! మన్నేల? మరి పదార్థము లేదే?** 335

అని అడిగిన తల్లితో బాలకృష్ణుడు ఇలాగ బదులు చెప్పాడు:

శా॥ **అమ్మా! మన్నుతినంగ నే శిశువునో? యాకొంటినో? వెఱ్ఱినో?**
**నమ్మంజూడకు వీరి మాటలు మదిన్ నన్నీవు కొట్టంగ వీ**
**రిమ్మాడ్కిన్ ఘటియించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్య గం**
**ధమ్మాఘ్రాణముసేసి నా వచనముల్ తప్పైన దండింపవే.** 337

"అమ్మా! మన్ను తినడానికి నేనేమైనా చంటి పిల్లవానినా? వెర్రివానినా? ఆకలి గొన్నవానినా? నీవు వీరి మాటలను నమ్మబోకు. నీవు నన్ను కొట్టాలని వారీ విధంగా కల్పించి చెపుతున్నారు. కావాలంటే నా నోరు వాసన చూచి, నామాట తప్పైతే నన్ను దండింపవే!" అని ముద్దులొలికే మాటలతో తల్లికి చెప్పి లీలామానుష బాలకుడైన ఆ ఈశ్వరుడు తన నోరు తెరచి చూపించగా

క॥ **ఆ లలితాంగి కనుంగొనె బాలుని ముఖమందు జలధిపర్వత వన భూ**
**గోళ శిఖి తరణి శశి ది క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్.** 338

ఆ చిన్నారి బాలుని చిన్నినోటిలో యశోదాదేవి చూచినదేమిటి? ఆకాశము, దిక్కులు, చంద్రతారకలు, జ్యోతిర్మండలము, పర్వతాలు, ద్వీపాలు, సముద్రాలు, భూగోళము, వాయువు, అగ్ని, సర్వ భూతాలనూ చూచి ఇలా అనుకొన్నది.

మ॥ **కలయో? వైష్ణవమాయయో? యితర సంకల్పార్థమో? సత్యమో?**
**తలపన్నేరక యున్నదాననొ? యశోదాదేవి గానో? పర**
**స్థలమో? బాలకుడెంత? యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర**
**జ్వలమైయుండుటకేమి హేతువొ? మహాశ్చర్యంబు చింతింపగన్.** 341

ఆ॥ **బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు విశ్వమెల్ల నెట్లు వెలసియుండు**
**బాలుభంగి నితడు భాసిల్లుఁగాని సర్వాత్ముఁ డాది విష్ణుఁడగుట నిజము.** 342

ఆ॥ **ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు కానఁబడిన బుద్ధి కంపమయ్యె**
**నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు నార్తు లెల్ల బాయ నాశ్రయింతు.** 344

క॥ **నామగడు నేను గోపులు నీ మందయు గోపజనుల ని బ్బాలుని నె**
**మ్మోమందున్న విధముగని యేమరితిమిగాని యీశుడితడే మాకున్.** 343

"ఓహో! ఏమిటీ అద్భుతం! నేను చూస్తున్నదంతా సత్యమా, లేక స్వప్నమా? లేక, ఇదంతా విష్ణుమాయయా?

లేక ఏదైనా విచిత్రమైన భ్రమ నన్ను ఆవేశించినదా, లేక నా ఆలోచనా శక్తియే లోపించినదా, లేక నేను యశోదాదేవిని కానా? నేను నా ఇంట్లోనే ఉంటున్నానా లేక పరస్థలంలోనా? ఈ బాలకుడేపాటివాడు? ఇతని నోట్లో ఈ బ్రహ్మాండమంతా ఇలాగ ప్రకాశించడానికి కారణమేమిటో? చూస్తుంటే అంతా ఆశ్చర్యంగా నున్నదే! ఇతడు బాలునిగా కనిపిస్తున్నాడుగాని, నిజంగా సర్వాత్ముడైన ఆదివిష్ణువే. ఇతని నోటిలో నా భర్త, నేను, గోవుల మందలు, గోపజనాలు, అందరం ఉండడం చూచి కొంచెం ఏమరుపడ్డాను. కాని, నిశ్చయంగా ఇతడే మాపాలిటి సర్వేశ్వరుడు. ఏ మహాత్మునివలన ఈ విశ్వరూప దర్శనమయి, బుద్ధి, ఆనంద సంభ్రమాలతో కంపించినదో, అఖిలలోకాధారుడైన ఆ మహాత్ముని విష్ణుమూర్తిని, నా భవబంధ విముక్తి కై ఆశ్రయిస్తున్నాను" అని బాలుని ప్రార్థించినది. అప్పుడు తనను పరమేశ్వరునిగా తెలుసుకొన్న యశోద యందు శ్రీకృష్ణుడు వైష్ణవమాయను ప్రయోగింపగా నామె:-

క॥ **జడను వడి మోహమున నా, పడతుక సర్వాత్ముడనుచు పలుకక యతనిం**
**గొడుకని తొడపై నిడుకొని, కడువేడుకతోడ మమత గావించె నృపా! 347**

శ్రీశుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు: "రాజా! శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని విరమించగానే మాయ ఆవరించగా, యశోదమ్మ మళ్లీ మోహములో పడిపోయి, కృష్ణుడు సర్వాత్మకుడనే విషయాన్ని పూర్తిగా విస్మరించి, అతనిని కొడుకా! అని ఒడిలోనికి తీసుకొని మమకారంలో మునిగిపోయి ముద్దుచేయనారంభించినది" అని చెప్పగా పరీక్షిత్తు ఇలా అడిగాడు:

ఆ॥ **జగదధీశ్వరునకు చన్నిచ్చు తల్లిగా, నేమి నోము నోచె నీ యశోద**
**పుత్రుడనుచు నతని పోషించు తండ్రిగా, నందుడేమి చేసె నందితాత్మ! 349**

అని అడుగగా శ్రీ శుకుడిలా చెప్పాడు:

## నంద యశోదలు

వసువులలో ముఖ్యుడు ద్రోణుడు. అతని భార్య ధర. బ్రహ్మదేవుడు దేవతలను, కృష్ణావతారములో విష్ణు సేవకై భూలోకంలో జన్మించాలని చెప్పినప్పుడు, ఈ దంపతులు తమకు వాసుదేవుని యందు నిరతిశయమైన ప్రేమ, వాత్సల్యభక్తి కలిగేటట్లు అనుగ్రహింపుమని కోరుకొన్నారు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. వారే ఈ నందయశోదలు. సాక్షాత్తూ ఆ వాసుదేవునే తమ బిడ్డగా సాటిలేని ప్రేమతో పోషించినారు. కన్నతల్లి, తండ్రి అయిన ఆ దేవకీ వసుదేవులకు కూడ లభించని భూరిభాగ్యము పుణ్యమూర్తులైన ఈ నందదంపతులకు అనుగ్రహించాడు పరమేశ్వరుడు. వారినే తలిదండ్రులుగా స్వీకరించి, వారి అనన్య ప్రేమ వాత్సల్యాలను పొందాడు.

## దామోదరుడు

కృష్ణునకు ఇష్టమైన వెన్నను చిలకడం యశోదమ్మకు ఎంతో ప్రియమైన పని. ఒకనాడు ఆమె బాలకృష్ణుని చిలిపిచేష్టలనే తలచుకొంటూ వెన్నచిలుకుతునది. కడవలోని పెరుగు చిక్కగా నుండడం చేత, కవ్వము త్రిప్పడం కష్టంగా నున్నది. ఆమె అలసిపోయినది. చెమటపట్టినది. ఇంతలో బాలకృష్ణుడు వచ్చి, పాలిమ్మని మారాం చేస్తే ఆ పనిని ఆపివేసి, కూర్చొని పాలు కుడుప సాగినది. అంతలో పొయ్యిమీదనున్న పాలు పొంగి నిప్పులో పడుతుంటే కొడుకును నేలపైకూర్చొనబెట్టి పొయ్యిదగ్గరకు వెళ్లినది. పాలివ్వడం సగంలో ఆపివేసినందుకు కృష్ణయ్యకు కోపం వచ్చేసినది. చిలకబడుతున్న కడవ మీదికి ఒక్కరాయి విసిరాడు. అది బ్రద్దలై పెరుగంతా నేల పాలయినది. దొరికినంత వెన్నతినేసి, కొంత వెన్నను చేత్తో పట్టుకొని పారిపోయాడు. యశోద వచ్చి అంతా చూచినది. కృష్ణుడు భయపడి ఎక్కడికి పారిపోయాడో అని వెతుకసాగినది. చివరకు పెరటిలో ఒక కఱ్ఱరోలు మీద నిల్చొని, కోతికి వెన్న తినిపిస్తూ కనిపించాడు. నల్లనయ్య చిలిపి చేష్టలకు మురిసిపోయినది. అయినా, బెదిరించాలని ఒక కఱ్ఱ పట్టుకొని వచ్చినది. ఇలాగ తలపోసినది:

సీ॥ బాలుడీతండని భావింతునందునా, యే పెద్దలును నేరఁ క్రమంబు
వెరపెఱుంగుటకునై వెరపింతునందునా, కలిగి లేకొక్కఁడు గాని లేడు
వెరపుతో నాబుద్ధి వినిపింతునందునా, తను దానయై బుద్ధి తప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా, చొచ్చి చూడనిదొక్క చోటు లేడు
ఆ॥ తన్ను నెవ్వరైన తలపోయఁబారెడు, నోజలేదు భీతి యొకటెఱుంగ
డెలమి నూరకుండ డెక నక్కెములనాడు, పట్టి శాస్తి చేయు భంగి యెట్లు? 363

క॥ లాలనమున బహుదోషము లోలింబ్రాపించు తాడనోపాయములం
జాల గుణంబులు కలుగును బాలురకును తాడనంబ పథ్యం బరయన్. 365

ఇతడు ఇంకా చిన్నపిల్లవాడే కదా అని ఉపేక్షచేస్తే ఏ పెద్దవాళ్లు కూడా చెయ్యలేని అల్లర్లు చేస్తాడు. భయం తెలియడానికి భయపెడ్దాం అనుకుంటే, లేకలేక కలిగిన వాడు ఈ ఒక్కడే మరి! నా మనస్సులోని కోపాన్ని ప్రదర్శించి భయపెడదామంటే, తనకుతానుగా ఏ తప్పూ చెయ్యని వాడులాగుంటాడు. ఇంకెక్కడికీ వెళ్లకుండా ఇంట్లోనే పడి ఉండుమని చెప్తే, వాడు ఇంట్లో దూరి చక్కబెట్టని చోటే ఉండదు. తన్ను ఎవరైనా పిలిస్తే పరుగులుదీస్తాడు. భయం కొంచెమైనాలేదు. పోనీ పట్టించుకొనకుండా ఊరుకొంటే, నన్నేమీ చెయ్యలేకపోయారోచ్ అన్నట్లు ఎగతాళి చేస్తాడు. వీనిని పట్టుకొని, మరి శిక్షించడం ఎట్లా? పిల్లలకు లాలనం (ముద్దు) చేస్తే వాళ్లకు కీడు కలుగుతుంది. దండించి, రెండు తగిలించితే దాని వల్ల మంచి గుణం ఉంటుంది. చూడగా, పిల్లల్ని దారిలో పెట్టాలంటే దండించడమే తగిన పథ్యం అనిపిస్తున్నది. అని తలపోసి, ఆమె తన చేతిలోనున్న కర్రను ఝుళిపించి, బాలుడా! నిలునిలు అంటూ అతనిని సమీపించేసరికి ఆ నల్లనయ్య రోలు మీదనుంచి చెంగున గెంతి, గజ్జెలు ఘల్లుఘల్లుమని మ్రోయ పరుగెత్తాడు. అతనిని వెంబడిస్తూ ఆమె అలసిపోయినది. దొరికీ దొరకనట్లు పరుగెత్తుతూ ఆమెను ముప్పుతిప్పలు పెట్టాడు. ఆమె శరీరం డస్సిపోయినది. చెమటలు పట్టాయి. శక్తి సన్నగిల్లినది. చివరకు ఆ కరుణాసాగరుడు ఆమెపై జాలిపడి పట్టుపడ్డాడు. చేతిలో కర్ర అయితే ఉన్నదిగాని ఆమె కొట్టగలదా! చిన్నవాడు చేజిక్కాడని సంతసించి, వానిని ఒక చోట కట్టివేయాలని అనుకొని, అతనితో వ్యంగ్యముగా ఇలా అన్నది: "ఓహో!

క॥ వీరెవ్వరు శ్రీకృష్ణులుఁ గారా! యెన్నడును వెన్నకానరట కదా!
చోరత్వం బించుకయును నేరరట ధరిత్రినిట్టి నియతులు కలరే! 372

క॥ పట్టినఁ బట్టుపడని నినుఁ బట్టెదమని చలము గొనినఁ బట్టుట బెట్టే!
పట్టు వడవండ్రు పట్టీ పట్టుకొనన్ నాకు గాక పరులకు వశమే. 373

క॥ ఎక్కడనైనను తిరిగెద వొక్కయెడన్ గుణము కల్గి యుండవు నియమం
బెక్కడిది నీకు మరచినఁ జిక్కగఁజనియెదవు పెక్కు జాడలఁ బుత్రా! 374

"ఓహో! వీరెవ్వరు? శ్రీకృష్ణులుంగారు కారా! వీరెన్నడూ వెన్నను చూచియుండలేదట కదా! వీరికి వెన్నను దొంగిలించడం కొంచెమైనా తెలియదటకదా, పాపం! ఈ భూమిమీద ఇంతటి నియమ పరులింకెక్కడైనా ఉన్నారా? పట్టుకొనందామంటే పట్టువడని నిన్ను పట్టుకొందాం అని పట్టుపట్టితే మాత్రము పట్టడానికి వీలవుతుందా? నీవెవ్వరికీ పట్టుపడవంటారు కాని, బిడ్డా! నిన్ను పట్టుకొనడానికి (నీ తల్లినైన) నాకు కాక ఇతరులకు వశమవుతుందా? నాయనా! నీవు ఒక్కచోటైనా బుద్ధిగా ఉండకుండా ఎక్కడెక్కడికో తిరుగుతావు. నీకు ఒక నియమం అంటూ ఎక్కడున్నది? కొంచెం ఏమరుపాటున ఉంటే ఎన్నో దారులవెంట ఇట్టే పారిపోగలవు, ఘనుడా!" అని బాలకృష్ణునితో అన్నది. భగవంతుడు భక్తపరాధీనుడు. మహా యోగులకు కూడ అంతుచిక్కని మహానుభావుడు. మాయా మర్మము తెలియని మాతృ ప్రేమకు వశుడైపోయాడు. ఆ చిన్నారి బాలుడే సచ్చిదానందమూర్తియైన పరమేశ్వరుడని తెలియని ఆ

అమాయకపు తల్లి గోవిందునే బంధించి వేయాలనుకొంటున్నది పాపం! కొడుకును, కర్రరోలుకు కట్టిపెట్టాలనే తలంపుతో కవ్వపుత్రాడును తెచ్చి, అతని కడుపు చుట్టూ చుట్టబోయినది. ఆశ్చర్యం, అంతపొడవైన త్రాడూ, ఆమూడేళ్ల బిడ్డడి పొట్టకు రెండంగుళాలు చాలలేదు. ఇంకొక త్రాడును తెచ్చి జోడించి చుట్టగా, అదికూడ ఆ రెండు అంగుళాలే తక్కువైనది. ఈ విధంగా ఇంట్లోనున్న తాళ్లన్నీ ఒక్కొక్కటిగా జోడించినా, ఆ రెండంగుళాలే చాలకపోవడం చాలా అద్భుతంగా నున్నది. ఈ దృశ్యాన్ని ఆ వీధిలోని స్త్రీలంతా చోద్యంగా చూస్తుంటే యశోదమ్మకు అవమానంతోపాటు పట్టుదలకూడ పెరుగుతున్నది. ఒళ్లు చెమటలు పట్టినది, చీరకట్టు వదులైనది, జుట్టు ముడివీడి పువ్వులు రాలిపోయినవి. ఆమె అలసిపోయినది. ఏమిచెయ్యాలో తోచని నిస్సహాయస్థితికి వచ్చేసినది. కళ్లనీళ్ల పర్యంతం అయినది. ఆకరుణామయుడు కనికరించాడు. బంధవిమోచనుడైన పరమేశ్వరుడు తనను బంధించడానికి పెనగులాడుతున్న తల్లి యొక్క పాట్లకు జాలి జెందిన వాడై కట్టుపడ్డాడు. ఆ విధంగా బంధింపబడిన పొట్టగలవాడు గనుక దామోదరుడనబడ్డాడు.

క॥ ఆలలన కట్టె రోలన్ లీలన్ నవనీత చౌర్య లీలుం బ్రియవా
గ్జాలున్ బరివిస్మిత గోపాలున్ ముక్తాలలామఫాలున్ బాలున్ 377

క॥ వెలిలోను మొదలు తుది నడుములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియును లోనగు నీశ్వరు నలవడునే కట్టఁ బ్రణతురాల్ కాకున్నన్? 379

క॥ చిక్కఁడు సిరి కౌగిటిలోఁ జిక్కఁడు సనకాది యోగిచిత్తాబ్జములన్
చిక్కఁడు శ్రుతి లతికావళిఁ జిక్కెనతడు లీలఁ దల్లి చేతన్ రోలన్. 381

క॥ జ్ఞానులచే మౌనులచే దానులచే యోగ సంవిధానులచేతన్
పూని నిబద్ధుండగునే శ్రీనాథుడు భక్తి యుతుల చేతం బోలెన్. 388

ఓ పరీక్షిన్మహారాజా! ఆ విధంగా తల్లియందు జాలిచెంది కట్టువడిన నవనీత చోరుని, చిరునవ్వుల చిన్ని కృష్ణుని ఆమె ఒక రోలుకు కట్టినది. ఆది మధ్యాంత రహితుడై జగములయొక్క మొదలు మధ్య తుదియందూ లోనా వెలుపలా అంతటా వ్యాపించి యున్న ఆ భక్త పరతంత్రుని, భక్తి ప్రపత్తులతో తప్ప బంధింపవీలవుతుందా? నా బిడ్డడే కదా అని ఆ అమాయకురాలు కట్టదలచినదిగాని, అతడు బ్రహ్మాండాలకే ఉనికి పట్టు అని తెలిస్తే అలాగ సాహసించగలదా? అతడేమైనా సామాన్యుడా? వేదవేత్తలకుగాని, సనకాదిమునుల చిత్తములకుగాని, లక్ష్మీదేవి యొక్క కౌగిలికి గాని చిక్కనివాడు. అటువంటి ఆ సర్వేశ్వరుడు లీలావిలాసంగా ప్రేమమయి అయిన తల్లి చేతికి చిక్కిపోయాడు. ఈ గోపమ్మకు లభించిన స్వామి యొక్క కరుణ బ్రహ్మరుద్రులకు గాని, శ్రీదేవికి గాని లభించలేదు. భక్తియుతులచేత బంధింపబడునంత సులువుగా, ఆ శ్రీనాథుడు జ్ఞానులచేగాని, మౌనులచేగాని, యోగులచేగాని బంధింపబడడు కదా!

ఆ విధంగా బంధింపబడిన బాలకృష్ణుడు రోలునీడ్చుకొంటూ పోయి, నారద శాపవశాన అర్జున వృక్షాలుగా మారిన నలకూబరమణి గ్రీవులనబడే యక్షుల వద్దకు వెళ్లాడు. అని చెప్పిన శుకయోగీంద్రునికి, ఆ శాప వృత్తాంతం చెప్పుమని పరీక్షిత్తు కోరగా శ్రీశుకుడు ఇలా చెప్పాడు:

## ఇద్దరు యక్షులు

శ్రీకృష్ణుని రోలుకు బంధించి, ఇంక ఈ బిడ్డడెక్కడికీ కదలలేడులే, తగిన శాస్తి చేశాను కదా! అనుకొంటూ యశోదమ్మ ఇంటి పనులు చేసుకొనడానికి వెళ్లినది. భగవంతుని లీలలు బ్రహ్మాదులకు కూడ అర్థంకావు. తాను రోలుకు కట్టబడిన ఉదంతము ద్వారా ఒక దైవకార్యము జరగవలసియున్నది. బాలకృష్ణుడు తన బొజ్జకు కట్టబడిన రోలును ఈడ్చుకొంటూ, వాకిట పెరిగియున్న ఒక మద్ది వృక్షాల జంట మధ్యను దూరగా, రోలు అడ్డుకొని కృష్ణుని

ఈడ్పుడు శక్తికి తట్టుకొనలేక, శ్రీకృష్ణుని పాదస్పర్శ సోకి, ఆ రెండు అర్జున వృక్షాలూ పెళపెళ శబ్దము చేస్తూ సమూలముగ కూలిపోయినవి. ఆ వృక్షాలనుండి మిక్కిలి ప్రకాశవంతులైన ఇద్దరు దివ్యపురుషులు లేచి, శ్రీకృష్ణునకు సాష్టాంగదండప్రణామాలు చేసి స్తుతించారు.

ఆదివ్య పురుషులు యక్షులకు రాజైన కుబేరుని పుత్రులు, నలకూబరుడు, మణిగ్రీవుడు వారి పేర్లు. ధన, బల, యౌవన, అహంకార పూరితులైన ఆ యువకులు వెండికొండ నుండి ప్రవహించే మందాకినీ నదీ తరంగాలలో సుందరీ మణులతో జలక్రీడలాడుతుండగా, ఆ దారిన పోతున్న నారద మహర్షిని చూచారు. వివస్త్రలైయున్న స్త్రీలు సిగ్గుపడి ఒడ్డునకుచేరి వస్త్రాలు చుట్టుకొన్నారుగాని మద్యపాన మత్తులైన ఈ యువకులు మాత్రము అలాగే నగ్నంగా నారదునివైపు చూస్తూ నవ్వుతూ నిల్చున్నారు. నారదుడు అవమానంతో కోపగించుకొని ఇలాగ తలపోశాడు: "సంపన్నుడు ధన మదాంధుడై, తన శరీరమే సర్వస్వమనుకొని, దానికి నానారకాల సౌఖ్యాలనూ చేకూర్చడానికి తన జీవితం అంతా వెచ్చించి సంసార బంధాల్లో చిక్కుకొంటాడు. ఇంద్రియలోలుడై అహంకారియై కన్నూ మిన్నూ కానక దుష్కర్మలు చేస్తుంటాడు. మూర్ఖులైన ఈ యువకులు కూడా ఇలాంటి వారే కనుక శిక్షార్హులు అవుతారు." అని వారిని ఇలాగ శపించాడు:

"మితిలేని ఇంద్రియ భోగాలతో మత్తెక్కియున్న మీరు భూలోకంలో ఇంద్రియభోగాలనుభవించే అవకాశం లేని వృక్షాలై వెయ్యి సంవత్సరాలు పడియుంటారు" అనగా ఆయువకులు తెలివి తెచ్చుకొని, క్షమించుమని వేడుకొంటారు. అప్పుడు నారదుడు దయతలచి, "మీరు ద్వాపరయుగంలో నందుని వాకిట అర్జున వృక్షాలయి జంటగా పెరుగుతుండగా అక్కడ అవతరించిన భగవానుని పాద స్పర్శ తగిలి,

**క॥ ముక్తులరై నారాయణభక్తులరై పరమసాధుభావ శ్రీసం**
**సక్తులరై సురలోకవ్యక్తులరయ్యెదరు నాదు వాక్యము కతనన్.** 396

ఆ యక్షులు బాలకృష్ణుని ఇలాగ స్తుతించారు:

**క॥ బాలుడవె నీవు? పరుడ వనాలంబుఁడ వధిక యోగి వాద్యుఁడవు తను**
**స్థూలాకృతి యగు విశ్వము నీ లీలారూపమండ్రు నిపుణులు కృష్ణా!** 402

**క॥ భువనములు సేయ కావఁగ నవతీర్ణుడవైతి గాదె యఖిలేశ్వర! యో**
**గివరేణ్య! విశ్వమంగళ! కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ!** 404

**శా॥ నీ పద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్**
**నీ పేరం బనిసేయు హస్తయుగమున్ నీమూర్తిపైఁ జూపులున్**
**నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీసేవపైఁ జిత్తముల్**
**నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా!** 406

"కృష్ణా! నీవు బాలుడవు కావు, పరమేశ్వరుడవు. విశ్వానికి ఆధారమైన వాడవు. యోగేశ్వరుడవు, ఆద్యుడవు, స్థూలవిశ్వము నీ లీలారూపమైయున్నవాడవు. భువనాలను సృష్టించి, రక్షించడానికి అవతరించావు కదా, ఓ అఖిలేశ్వరా! యోగివరేణ్యా! విశ్వమంగళ కరా! కవిసన్నుతా! కల్యాణనిధీ! వాసుదేవా! నీయందు భక్తి కలిగి, బుద్ధి నిలిచేటట్టు అనుగ్రహించు దేవా!" అని ప్రార్థించగా సంతసించిన స్వామి వారితో ఇలా అన్నాడు.

**క॥ తమతమ ధర్మము తప్పక, సములై నను నమ్మి తిరుగు సభ్యులకును బం**
**ధము నను జూచిన విరియును, గమలాప్తుడు వొడమ విరియు ఘనతమము క్రియన్.** 408

"తనతను ధర్మాలను పాటిస్తూ సమదృష్టి కలిగి, నన్ను నమ్మినవారికి, సూర్యోదయం కాగానే చీకట్లు తొలగిపోయినట్లు, నన్నుచూస్తే, సంసార బంధాలు తొలగిపోతాయి. నారదుని వాక్కు వలన మీరు నా అనుగ్రహం పొంది, నా భక్తులైనారు. మీకు సంసారమంటదు. మీరు మీ ఇండ్లకు వెళ్లవచ్చును." అని చెప్పాడు. శాపవిమోచనం గురించి వేచియున్న యక్షులకు ఈ చిన్నారి బాలుడు మహావిష్ణువై యుండునా అనే సందేహం కలుగలేదు. అతనిలో వారు విష్ణువును చూడగలిగారు.

పిడుగుపాటువంటి శబ్దం విని, నందాదులంతా వృక్షాల వద్దకు వచ్చిచూడగా, నేలకూలిన మ్రాకుల మధ్య, రోలుకు బంధింపబడిన నల్లనయ్య జడునిలాగా చూస్తున్నాడు. సురక్షితంగా నున్నాడు. ఆ దృశ్యం చూస్తున్న పెద్దలకేమీ అర్థం కాలేదు. అక్కడే ఆడుకొంటూ అంతా చూచియున్న గోపబాలకులు కృష్ణుడే ఆ చెట్లను రోలుతో లాగి కూల్చాడనీ, వాటినుండి ఇద్దరు మెరిసిపోతున్న మనుష్యులు వచ్చి కృష్ణునకు నమస్కరించి మాయమయ్యారని చెప్పగా ఆ పిల్లలేదో ఊహించి, కట్టుకథ చెపుతున్నారని, ఎవ్వరూ నమ్మలేదు. అయితే ఆ వృక్షాలు ఎలాగ కూలిపడ్డాయో ఎవ్వరికీ అర్థంకాలేదు. నందుడు పుత్రునికట్లు విప్పి ఇంటికి తీసుకొనివెళ్లాడు.

తన దివ్యత్వం గురించి ఎవ్వరూ ఏమీ తెలుసుకొనరాదని ఆ కపటబాలుడు అనేక రకాల వేషాలు వేస్తుంటాడు.

శా॥ **పాడున్ మందుని భంగి గోపవనితల్ పాణిధ్వనుల్ సేయగా**
**నాడున్ జంత్రముక్రైవడిన్ పరవశుండై హస్తముల్ త్రిప్పుచున్**
**చూడన్ వేరని వాని భంగి జనులన్ చూచున్ నగున్ బాలురన్**
**గూడున్ పెద్దల పంపుసేయ జను డాగున్ దూగు చిట్టాడుచున్. 416**

గోపభామలు చప్పట్లు కొడుతుంటే మందబుద్ధిలాగాపాడుతాడు. పరవశుడై చేతులు త్రిప్పుకొంటూ యంత్రంలాగా ఆడుతాడు. అంధునిలాగా నటిస్తూ చూస్తాడు. నవ్వుతాడు. ఇతర పిల్లలతో కూడుతాడు, చిల్లర పనులను పెద్దలు పురమాయిస్తే వెళ్లి చేస్తాడు. దాగుంటాడు గెంతుతాడు. నీవు ఏడ్చితే నిన్ను బిచ్చగాళ్లు జోలెలో వేసుకొని పోతారు సుమా అని తల్లి చెపితే, ఆమె కొంగుచాటున దాగుకొనేవాడు. ఇలాంటి కపట లీలలను ఎన్నో చూపేవాడు.

## ముక్తి రత్నాలు

ఒకనాడు ఒకామె పండ్లు అమ్ముకొనడానికి వచ్చినది. ధాన్యం ఇస్తే పళ్లు ఇస్తానన్నది. చిన్ని కృష్ణుడు ఇంటిలోపల నుండి తన చిన్న దోసిట్లో కొంచెం ధాన్యం తీసుకొస్తుంటే, దారిలో అతని చేతినుండి చాలా గింజలు జారిపోగా మిగిలిన కొద్ది పాటి గింజలను ఆమెబుట్టలోవేసి పళ్లు ఇమ్మన్నాడు. అతని ముగ్ధమోహన రూపాన్ని చూచి ఆమె మురిసిపోయి అతని దోసిలినిండా పండ్లు పెట్టినది. ఆమె తన బుట్టలో చూచుకొంటే బాలకృష్ణుడు వేసినవి ధాన్యపుగింజలు కావు, నవరత్నాలు. స్వామి లీలలు అద్భుతాలు. మానవుడు హృదయఫలాలు, కర్మ ఫలాలు అర్పిస్తే ఆయన ముక్తిరత్నాలనే ప్రసాదిస్తాడు. బాలకృష్ణుని చేష్టలు ఇతర పిల్లలుచేసే అల్లరి చేష్టలవలె కనిపించినా అవి నిగూఢార్థమున్న స్వామిలీలలు, ఆయనఅనుగ్రహాలు. గోపబాలికలు కృష్ణునికి వెన్నపెట్టి, పాడుమంటే పాడేవాడు. ఆడుమంటే ఆడేవాడు. అవి గంధర్వగానాలు, నటరాజనృత్యాలు లాగా ఉండేవి. యశోదమ్మ ఆ స్వామిని అనేక విధాలుగా సేవచేసి, లాలించి, పాలించి, పోషించి, ప్రేమించిన ధన్యాతిధన్యురాలు. కన్నతల్లి అయిన దేవకీదేవికి కూడ ఆ భాగ్యము కలుగలేదు.

పుట్టినప్పటినుండీ కృష్ణునిచే అందరూ ఆకర్షింపబడేవారు. గోకులంలో పిన్నలూ, పెద్దలూ గోవులూ దూడలతో సహా అందరూ కారణం తెలియకుండానే కృష్ణ ప్రేమలోపరవశులై యుండేవారు. బలరామకృష్ణుల దివ్యత్వము గురించి, వారి అవతార కార్యముల గురించి వారిద్దరికే తెలుసు. వారి దివ్యత్వాన్ని ఎవ్వరూ గుర్తించకుండా ఇద్దరూ జాగ్రత్త పడేవారు.

కొద్దిరోజులుగా గ్రామంలో జరుగుతున్న ప్రమాదాలు అక్కడి ప్రజలకు ఆందోళన కలిగిస్తున్నవి. ముఖ్యముగా బాలకృష్ణునికి ముప్పు తెచ్చేటట్లు సంభవిస్తున్నాయి. యాదవులలో వయోవృద్ధుడూ, జ్ఞానవృద్ధుడూ అయిన ఉపనందుడు వ్రజపురి వాసులను సమావేశ పరచి ఇలా అన్నాడు: "బృహద్వనంలోనున్న ఈ ప్రదేశంలో ఈ మధ్య ప్రమాదాలు ఉత్పన్నమవుతున్నవి. ఆ పరమేశ్వరుని కృపా కటాక్షాలచే నందనందనునికి ప్రాణాపాయం కలుగుటలేదుగాని, లేనిచో పూతన వలననో బండివలననో, సుడిగాలి వలననో, మద్దిచెట్ల వలననో ఎంతటి ప్రమాదం కలిగియుండెడిదో కదా! మనం ఈ ఊరు విడిచి, యమునానదిలోని కాళింది మడుగు ఒడ్డున నున్న బృందావనమునకు తరలి వెళ్లిపోదాం. అక్కడ ఎక్కువ స్థలము, పచ్చిక బయళ్లు బాగా ఉన్నవి." అని చెప్పగా అందరూ బాగుబాగు అన్నారు.

నందవ్రజంనుండి బృందావనానికి తరలిపోవడానికి అన్ని సన్నాహాలూ చేసుకొన్నారు.

## బృందావనలీలలు

వ్రజవాసులందరూ బృందావనమునకు తమ నివాసములను మార్చడానికి ప్రయాణమయ్యారు. ముందు గోవులూ, తరువాత బళ్లలో స్త్రీలూ పిల్లలూ, తరువాత బళ్లలో సామాన్లు, చుట్టూ విల్లమ్ములతో రక్షణ కోసం నడిచే పురుషులూ, ఒక తిరునాళ్లలాగ తరలి వెళ్లుతున్నారు. బృందావనం చేరి ఒక అనుకూలమైన స్థలంలో అర్ధచంద్రాకారంగా బళ్లను నిలబెట్టి, అదే క్రమంలో ఇళ్లు కట్టుకొన్నారు. ప్రక్కనే రమ్యమైన గోవర్ధనగిరికూడ ఉన్నది.

బలరామకృష్ణులకు ఈ బృందావనం ఎంతో బాగున్నదని భావించారు. తమ ఈడు పిల్లలందరూ కూడి, దూడలను తోలుకొని పోయి, పచ్చిక బయళ్లలో విడిచి, తాము గోవర్ధన గిరిపైన, యమునానది ఇసుక తిన్నెలపైన, అడవిలోని వృక్షాలమధ్య అనేక విధాలుగా ఆడుకొనడానికి చాలా అనుకూలంగా నున్నదని భావించారు. వాళ్లంతా అచట ఆటలలోను, పాటలలోను, బలప్రదర్శనలలోను, వినోదాలలోను, రోజంతా గడిపి, సాయంకాలానికి ఇళ్లకు చేరేవారు.

ఒకనాడు వత్సాసురుడనే రాక్షసుడు ఒక చక్కని ఆవుదూడ రూపంలో దూడల మందలో దూరాడు. ఈ విషయం కనిపెట్టిన ఐదేళ్ల గోపాలకృష్ణుడు ఆ దూడ యొక్క వెనుకటి రెండు కాళ్లనూ తోకనూ పట్టుకొని, గిరగిరా త్రిప్పి, అక్కడనున్న వెలగచెట్టునకు విసిరి కొట్టగా, ఆ అసురుడు నిజరూపంలో కేకలు వేసుకొంటూ చచ్చిపడ్డాడు. అప్పుడు గోపకుమారులంతా ఆ రాక్షసశరీరాన్ని చూచి అబ్బురపడి సందడిగా బలేబలే అని కృష్ణుని ఎత్తుకొన్నారు.

ఇంకొకనాడు బలరామకృష్ణులూ, గోపబాలురూ మామూలుగా దూడలను మేతకు తీసుకొనిళ్లారు. ఎండగా నుండటంచేత మందను యమునకు తీసుకొనివెళ్లి, దూడలకు నీరు త్రావించి, తాము త్రాగి మరలి వెళ్లుతుండగా, ఒక తెల్లని పర్వతం లాగ దారికి అడ్డంగా నిలిచి యున్న ఒక కొంగను చూచారు. అది బకాసురుడు అనబడే ఒక అసురుడు. పూతన సోదరుడు. కంసుని అనుచరుడు. వాడు కృష్ణుని చంపడానికి వేచియున్నాడు. అందరితో వెళ్తున్న గోపాలకృష్ణుని బకుడు తన పొడవైన ముక్కుతో పట్టుకొని మ్రింగప్రయత్నించగా కృష్ణుడు గొంతుకు అడ్డంగాపడి బకుని గొంతులో మంట పుట్టించగా భరించలేక, వాడు కక్కివేసి కృష్ణుని బైటపడవేసి ముక్కుతో పొడవనారంభించాడు. ఇదంతా ఇతర బాలకులు నిస్సహాయులై చూస్తున్నారు. పొడుస్తున్న ముక్కును పట్టుకొని ఆ కొంగ నోటిని రెండుగా చీల్చి వేశాడు కృష్ణయ్య. రాక్షసుడు పర్వతాకారంలో చచ్చిపడ్డాడు. బలరామాది బాలకులు సంతసించి గంతులు వేసి, కృష్ణుని కౌగలించుకొన్నారు. తరువాత వారు గ్రామంలోని పెద్దలకు అంతా వివరించి చెప్పారు. వాళ్లంతా ఆశ్చర్యపోయి ఇలాగ తలపోశారు.

**క॥ ఆపదలమీద నాపదలీపాపని( జెంది తలగె, నీ యర్భకుపై**
**వేపడిన ఖలులు దహనుని(బైపడు శలభములపగిది పడిరి ధరిత్రిన్.** 450

"ఈ బిడ్డడి పైన ఆపదలమీద ఆపదలు వచ్చిపడ్డున్నా, అతనికి హాని తలపెట్టిన దుష్టులు మాత్రమే నిప్పులో

పడిన మిడుతలమాదిరి నేలరాలి నశిస్తున్నారు కదా" అని సంతోషించారు.

ఒకనాడు బలరామకృష్ణులతో గోప బాలురంతా మందలను తోలుకొని, కావడులలో చలిది అన్నము, భోజ్య పదార్థాలు, చేత పిల్లన గ్రోవి, బెత్తములు పట్టుకొని అడవికి బయలుదేరారు. మందలను మేతకు విడిచిపెట్టి, ఆటలాడసాగారు. కోతులవలె ఎగురుగెత్తి, చెట్లెక్కి గెంతుతూ, దాగుడు మూతలాడుతూ, కృష్ణుడెక్కడ ఉంటే అక్కడే అందరూ మూగిపోయేవారు. అతనిని పట్టుకొంటూ, ఎత్తుకొంటూ, పడవేస్తూ, కౌగలించుకొంటూ, వీపున మోస్తూ ఈ విధంగా అతనితో దర్శన స్పర్శన సంభాషణ లాలనలు చేస్తూ ప్రొద్దు పుచ్చేవారు. ఆహా! ఆ గొల్లపిల్లలెంత ధన్యులో కదా! అనేక జన్మల తపస్సు చేసినా, యోగులకూ, జ్ఞానులకూ కూడా దుర్లభుడైన స్వామి ఈ బృందావన వాసులకు ఇంత సులభుడైనాడు. వారి భాగ్యమే భాగ్యము కదా!

ఉ॥ ఎన్నడునైన యోగివిభులెవ్వని పాదపరాగమింతయున్
గన్నుల కానరట్టి హరిఁ గౌగిట చేర్చుచు జెట్టపట్టుచున్
తన్నుచు గ్రుద్దుచున్ నగుచు దద్దయు పైఁబడిఁ కూడియాడుచున్
మన్నన సేయు వల్లవ కుమారుల భాగ్యము లింతయొప్పునే. 459

క॥ విందులకును బ్రహ్మసుఖానందంబై భక్తగణమునకు దైవతమై
మందులకు బాలుడగు హరిపొందుగనిరి గొల్లలిట్టి పుణ్యులు గలరే. 460

## అఘాసురుడు

కంసుని అనుచరులైన బకి, బకాసురుల సోదరుడు, అఘాసురుడు. కొండ చిలువరూపమున నున్నవాడు. వాడంటే అమరులకు కూడ ప్రాణభయమే. తన అన్న అయిన బకుని చంపినందుకు పగబూని, కృష్ణుని చంప నిశ్చయించుకొన్నాడు. ఒక యోజనం పొడవూ పర్వతమంత ఎత్తూ ఉన్న ఆఅజగర రాక్షసుడు భూమిపై క్రింద దవుడ, ఆకాశం మీదికి పైదవుడ చాచుకొని దారి కడ్డంగా నోరు తెరుచుకొని ఉన్నాడు. గోపబాలురు ముందు నడుస్తుండగా వెనుక కృష్ణుడు వస్తున్నాడు. ఇదేదో తాము అది వరకు చూచి యుండని గుహ అనుకొన్నారు ఆ పిల్లలు. కాదు కాదు, ఇది, నోరు తెరుచుకొని యున్న కొండ చిలువ లాగున్నదే అని కొందరనుకున్నారు. అయితే మాత్రం మనకేం భయం మన కృష్ణుడుండగా? బకాసురుని మూతిని చీల్చివేసినట్లు దీనిని కూడ చీల్చి వేయగలడు, అనుకొంటూ ఆ పిల్లలు భయంకరమైన ఆ సర్పం నోట దూరారు.

అఘము అంటే పాపము. పాపమంటే నిషిద్ధ కర్మను చేయుటం మాత్రమే కాదు, భగవంతుని పొందటానికి అవరోధమయ్యే ప్రతి కార్యమూ పాపమే, అఘమే. పుణ్యకర్మలు చేసి తత్ఫలితంగా సుఖాలననుభవించడం కూడా, అది భగవత్ప్రాప్తికి అవరోధంగా ఏర్పడితే వర్జనీయమే, పాపమే. స్వర్గములో నున్న దేవతలు కూడ భోగలాలసులై భగవంతుని విస్మరిస్తే, సద్గతికి దూరమవుతారు. అఘాసురుని నోటిలోనికి ప్రవేశించిన బాలకులకు, ఎర్రగా మెత్తగా నున్న వాని నాలుక, తివాసీలాగను, పరుపులాగను, సుఖంగానున్నట్టు అనిపించినది. వాని కోరలు తెల్లని అందమైన పర్వతాలుగా కనిపించినవి. బాగా ఆడుకొనవచ్చు ననుకొన్నారు. ఇదే జీవుని సంసార వ్యామోహంలోనికి ఆకర్షించే భ్రమ. ఇంకా లోనికి పోతే, గాఢాంధకార నరక కూపములాంటి ఆ అసురుని గర్భంలో పడిపోతామని ఆ బాలకులకు తెలియదు. కాని మా వెనుక కృష్ణుడున్నాడు మాకేమి భయము అనే ప్రగాఢ విశ్వాసమే వారిని ప్రమాదం నుండిరక్షించినది. ఇలాంటి విశ్వాసమే ఉత్తమ భక్తునికి భగవంతుని యందు ఉంటుంది. సర్వాంతర్యామి అయిన స్వామికి ఆ గొల్లపిల్లలకు తనయందు ఉండే అచంచల విశ్వాసము తెలుసు గనుకనే వారినిరక్షించబూనుకొన్నాడు. అఘాసురుడు నోరు తెరిచే ఉంచాడు. కృష్ణుడు ప్రవేశించగానే మూసివేసి, అందరినీ చప్పరించి మింగివేయాలకొన్నాడు. రాక్షసుని చంపితే, వానితోపాటు బాలకులేగాక, గోవులు కూడా చనిపోతాయని తెలుసుకొన్న స్వామి, అసురుని

నోటిలో ప్రవేశించి, వాడు నోరుమూసేలోగానే, గొంతుకకు అడ్డంగా నిల్చొని పెరిగిపోనారంభించాడు. ఊపిరాడక సర్పము విలవిలాకొట్టుకొంటున్నది. నోరు మూతపడలేదు. కృష్ణుడు పెరిగి పెరిగి దాని శిరస్సును ఛేదించగా, సర్పము ప్రాణము విడిచినది. స్వామి తన అమృతవీక్షణాలతో మూర్ఛపోయియున్న బాలురను, గోవులను లేవదీసి, బైటకు తెచ్చాడు. అందరికీ మోక్షాన్నిచ్చే ముకుందుడు అఘాసురుని కూడ తనలో చేర్చుకొన్నాడు. కొండచిలువ శరీరం నుండి ఒక దివ్య తేజస్సు వచ్చి, స్వామియందు లీనమయినది. దేవతలు పుష్పవృష్టి కురిపించారు.

క॥ **తన రూపొకమూర్తైనను, మనమున నిడుకొనిన పాపమంతయు తనలో**
**కొనిచను హరి తను మ్రింగిన, దనుజుని కొనిపోవకున్నె? తనలోపలికిన్.** 482

దేవతలు అప్సరసలు గంధర్వులు చేస్తుండే జయజయ ధ్వనులు, నృత్యాలు, గానాలు, సందడీ విని బ్రహ్మదేవుడు భూలోకానికి దిగివచ్చి స్వామిచేస్తున్న లీలలను చూచి, ఆశ్చర్యపోయాడు. స్వామిలీలలు ఇంకా జరగాలనీ, తాను స్వయంగా తిలకించి ఆనందించాలనీ తలపోశాడు ఆ బ్రహ్మయ్య.

అఘాసురసంహారము బాలకృష్ణుని ఐదవ ఏట జరుగగా, గొల్లపిల్లలు ఒక సంవత్సరం తరువాత తల్లిదండ్రులకు తెలియజేశారు. అని శ్రీశుకుడు చెప్పగా అలాగ ఎందుకు జరిగినదనీ, బ్రహ్మదేవుడు ఏయే లీలలు చూచాడనీ అడిగిన ప్రశ్నకు, అతని జిజ్ఞాసకు సంతసించి, శ్రీశుకుడు ఇలా అన్నాడు: భాగవతోత్తమా! భగవానుని కథామృతాన్ని ఆరగిస్తున్న కొద్దీ ఇంకా కావాలనే అనిపిస్తుంది. అది సహజమే!

క॥ **ప్రియురాలివలన వార్తలు, ప్రియజనులకు నెల్ల ప్రొద్దు ప్రియమగు భంగిన్**
**ప్రియుడగు హరిచరితంబులు, ప్రియభక్తులకెల్లయెడల ప్రియములు కావే.** 487

## బ్రహ్మయ్యభ్రమ

అఘాసురుని నోటినుండి బైటపడిన గోవత్సగోపబాలురను తోడ్కొని కృష్ణుడు యమున వద్దకు వచ్చాడు. గోపాలురు గోవులకు నీరుత్రావించి, దగ్గరనున్న పచ్చిక బయలులో విడిచివచ్చారు. ఇసుకతిన్నెమీద అందరూ వలయాకారంలో కూర్చొని, ఉట్లలోకట్టుకొని వచ్చిన భోజనపదార్థాలను విప్పి సర్దుకొని, తినడానికి సిద్ధంగానున్నారు. కృష్ణుడు మధ్యను నిల్చొనియున్నాడు. మొలకు కట్టిన గుడ్డలో మురళిని దోపుకొన్నాడు. చంకలో బెత్తం పెట్టుకొన్నాడు. చేతిలో వెన్న కలిపిన అన్నం ముద్దను, వేళ్లసందులో ఆవకాయముక్కను పట్టుకొన్నాడు. ఆహా! యజ్ఞాలలోని హవిస్సును ఆరగించే యజ్ఞపురుషుడైన శ్రీహరి గొల్లపిల్లలతో చల్దిఅన్నం తినడం చూచి, దేవతలు మురిసిపోయి, ముసిముసిగానవ్వుకొంటున్నారు. ఆదృశ్యము ఎంతమనోహరంగా నున్నదంటే మీదినుంచి చూస్తే పద్మదళాలమధ్య పద్మనాభుడు శంఖచక్రగదాపద్మధారియై లోకాలను వీక్షిస్తూ అనుగ్రహిస్తున్నట్టు కనిపిస్తున్నది. అందరూ కృష్ణునిపైనే దృష్టి నిలిపి భోజనానికి ఉపక్రమించారు. ఇంతలో దూడలు పచ్చిక మేస్తూ దూరంగా వెళ్లిపోవడం చేత, పిల్లలు అలజడి చెందారు. "మీరంతా అన్నం తింటూ ఉండండి, నేను దూడలను తోలు కొనివస్తాను." అని చెప్పి గోపాలకృష్ణుడు పరుగున వెళ్లి చూడగా దూడలు ఎక్కడాలేవు. వెతుక్కొంటూ తిరిగి పిల్లలు కూర్చున్న చోటికి వచ్చి చూడగా, అక్కడ, పిల్లలు కూడా లేరు. స్వామియొక్క అద్భుతలీలలను స్వయంగా చూచి ఆనందించాలనే కోరికతో బ్రహ్మ, దూడలను, బాలురను దాచివేశాడు. సర్వాంతర్యామియైన స్వామి సర్వమూ గ్రహించి, తనయుని కోర్కెను వాత్సల్యంతో తీర్చదలచి, మందహాసంతో ఇలా అనుకొన్నాడు:

క॥ **గోపాలసుతులు లేరని గోపికలకు చెప్పనేల గోపాలకులున్**
**గోపికలు నలర బాలుర క్రేపుల రూపముల నేఁజరించెద ననుచున్.** 508

"గోపబాలకులు, దూడలు లేరని గోపికలకు చెప్పడమెందుకు? గోపాలురు, గోపికలు సంతోషించునట్లుగా నేను ఆ బాలకుల, దూడల రూపాలను ధరించి సంచరిస్తాను." అని తలంచిన వాడైన స్వామి, ఎందరు బాలురూ, ఎన్ని దూడలూ ఉన్నాయో, ముమ్మూర్తులా అలాగే అన్నీ తానే అయ్యాడు. వారివారి రూపాలూ, స్వభావాలూ,

దుస్తులు, కర్రలూ, పిల్లన గ్రోవులూ, పాత్రలూ, ఉట్లూ, అన్నీ తానే అయినాడు. 'సర్వం విష్ణుమయం జగత్'. అని ప్రత్యక్షంగా చూపించాడు.

సాయంకాలమయ్యేసరికి స్వామి గోవత్సగోపబాలురరూపాలలో వారివారిఇళ్లలో ప్రవేశించాడు. గోమాతలకు గోవత్సాలూ, గోపమ్మలకు గోపకుమారులూ, ఇదివర కెన్నడూ ఇవ్వనంత ఆనందాన్నిస్తున్నారు. ఆ తల్లులుకూడా ప్రేమ పెల్లుబుకగా, వాత్సల్యంతో స్తన్యము పొంగారగా, తమబిడ్డలు తనుతో ఇంకా కొంతసేపు ఉంటే బాగుండునని రోజూ భావించేవారు. ఆహా! ఏమి వారి భాగ్యము! ఆ గోమాతలు, గోపమ్మలు ఎంత ధన్యలోకదా! సాక్షాత్తూ పరమేశ్వరుడే తమ బిడ్డలరూపంలో వచ్చి, బ్రహ్మానందాన్ని అందించుచున్నాడు. వారికి ఇక వేరే మోక్షము ఎందుకు? ఈవిధంగా స్వామి గోవత్స గోపబాలర రూపాల్లో తల్లులను తరింపజేస్తూ ఒక సంవత్సరం వినోదించాడు.

ఈ వత్సాపహరణ ఘట్టము జరిగి ఒక సంవత్సరం నిండడానికి ఇంకా ఐదు రోజులుండగా బాలకృష్ణుడు బలరామునితో అడవికి వెళ్లాడు. దూడలు క్రింద పచ్చిక బయలులో మేస్తుండగా వాటి తల్లి గోవులు గోవర్ధన పర్వతంపైన మేస్తున్నవి. ఆ దూడలు పాలుకుడవడం ఎప్పుడో విడిచి పెట్టేసినా, వాటిని చూచేసరికి ఆ గోవులకు ఎక్కడలేని వాత్సల్యం పుట్టుకొనివచ్చి పొదుగులు నిండిపోయాయి. గొల్లకాపరులు ఎంత వారిస్తున్నా, ఆ గోవులు నిలువకుండా ఉరకలు వేసుకొంటూ కొండ దిగిపోయి, దూడల వద్దకు పోయి ఒళ్లు నాకుతూ పాలు కుడుపుతూ 'అంబా'రవాలతో తమ ప్రేమను ప్రదర్శించసాగాయి. అలాగే గోవులవెంట పరుగు పరుగున కొండదిగి వచ్చిన గొల్లలు కూడ క్రిందనున్న తమ కొడుకులను ఎత్తుకొని, కౌగలించుకొని, ముద్దులాడి, ఎన్నాళ్లకో కలుసుకొన్నట్టు ప్రేమ చూపిస్తుంటే, బలరామునకు ఇదంతా ఏదో అనూహ్యమైన విచిత్రంగా తోచినది. ఇది కృష్ణమాయయే అని తెలుసుకొని, దూడలను బాలురను పరికించి అంతర్దృష్టితో చూడగా అందరూ శ్రీమహావిష్ణురూపాలతో కనిపించారు. అప్పుడు బలరాముడు ఆశ్చర్యంతో కృష్ణుని వంక చూచి ఇలా అడిగాడు: "మహాత్మా! గోపాలురంతా మొదట దేవతలనీ, గోవులు ఋషులనీ తెలుసు. గాని ఇప్పుడు గోవత్సాలూ, గోపబాలకులూ నీవే అని అనిపిస్తున్నది. ఏమిటీ లీల?" అని అడిగిన అన్నకు కృష్ణుడు అంతా చెప్పాడు.

గోవత్సాలను, గోపబాలురను ఒక గుహలో దాచివేసిన బ్రహ్మయ్య తన సత్యలోకం వెళ్లి, సభా మందిరంలో ప్రవేశింపబోతే ద్వారపాలకులు అడ్డగించారు. "నీ వెవ్వడివోగాని, మా బ్రహ్మదేవుని వేషం వేసుకొని వచ్చావు. మా బ్రహ్మదేవుడు దేవతలతో కొలువు తీర్చియున్నాడు. నీవు ఇప్పుడు లోనికిపోతే సభకు అంతరాయం కలుగుతున్నది. కనుక వెనుకకు మరలిపో" అన్నారు. బ్రహ్మయ్య ఆశ్చర్యపోయి, తలుపుసందులోనుండి సభలోనికి చూడగా, నిజంగానే ఒక బ్రహ్మ ఆసనంపై కూర్చుండగా దేవతలు స్తుతిస్తున్నారు. చేసేదిలేక మళ్లీ భూలోకం వచ్చి గుహలో చూడగా అంతా నిద్రపోతున్నారు. ఈలోగా మానవకాలమానంలో ఒక సంవత్సరం గడిచిపోయినది. బృందావనంలో కృష్ణుడు ఏమిచేస్తున్నాడో చూడాలనుకొన్నాడు. యథాతథంగా శ్రీకృష్ణుడు గోపకుమారులతోను, గోవత్సములతోను సంచరించడం చూచాడు. అక్కడ గుహలో నిద్రపోతున్న వారంతా ఇక్కడ కృష్ణునితో నుండడం ఎలాగ సంభవం? అని ఆశ్చర్యచకితుడై ఇలాగ తలపోశాడు.

శా॥ మందం గల్గిన వత్సబాలకులు నామాయాగుహాసుప్తులై
యెందుంబోవరు లేవరిప్పుడును వేరేచేయ నాకన్యులొం
డెందున్ లేరు విధాతలుం బరులు వీరెవ్వారల్ ఎట్లైరొకో
యెందేతెంచిరొ కృష్ణుతో మెలగువారేడయ్యోడిన్ నేటికిన్. 528

మత్తకోకిలము

బ్రహ్మపంపునగాని పుట్టదు ప్రాణి సంతతి యెప్పుడున్
బ్రహ్మనొక్కడ గాని వేరొక బ్రహ్మలేడు సృజింపగా
బ్రహ్మ నేను సృజింప నొందొక బాలవత్సకదంబమే
బ్రహ్మమందు జనించె నొక్కట బ్రహ్మమైనది చూడగన్. 529

క॥ పుట్టితి బుద్ధి యెరింగితి పుట్టించితి జగము సగము పోయెను ప్రాయం
బిట్టి వినూతనసృష్టులు పుట్టుట లేదౌర యిట్టి బూమెలు భూమిన్. 534

మందకు చెందిన దూడలు, బాలకులు నా యొక్క మాయాగుహలో బాగా నిద్రిస్తున్నారు. ఇప్పుడప్పుడే లేవరు, ఎక్కడికీ పోలేరు. నేను తప్ప సృష్టికర్తలింకెవ్వరూలేరు. మరి ఈ కృష్ణునితో మెలిగే బాలురు, దూడలూ ఎవ్వరు, ఎక్కడినుంచి ఎలాగవచ్చారు? ఇప్పటికి ఏడాది అయిపోయినదే! బ్రహ్మ సంకల్పిస్తే గాని ప్రాణిసంతతి ఎన్నడూ పుట్టదు. సృష్టించడానికి బ్రహ్మను నేనొక్కడనే గాని వేరే ఎవ్వరునులేరు కదా! మరి నేను సృష్టించకుండా ఈ బాలల వత్సల సమూహము ఏ సృష్టిలోనుంచి వచ్చినది? చూడగా చాలా ఆశ్చర్యంగా నున్నదే! నేను పుట్టి జగములను అనేక సార్లు సృష్టించాను. నా వయస్సు సగం చెల్లిపోయినది గాని, ఔరా! ఇలాంటి విడ్డూరపు అపరసృష్టులు ఈ భూమిమీద ఇంత వరకూ జరగలేదే!" పాపం బ్రహ్మదేవుడు ఈ విధంగా అయోమయ స్థితిలో చిక్కుకొన్నాడు.

క॥ మోహములేక జగంబుల, మోహింపగ జేయ నేర్పు మొనసిన విష్ణున్
మోహింపించెదననియెడి, మోహమున విధాత తానె మోహితుడయ్యెన్. 531

తాను మోహములో పడకుండా జగములను మోహింపజేయగల నేర్పరి అయిన విష్ణువునే భ్రమింపజేయదలచుకొన్న బ్రహ్మయ్య తానే భ్రమలో పడ్డాడు కదా! ఇంకా ఆశ్చర్యం నుండి తేరుకొనని బ్రహ్మకు తాను దాచియుంచిన వారు నిజమైన వారా? ఇప్పుడు తనకు కనిపిస్తున్న వారు నిజమైన వారా? అనే సందేహం కలిగినది. కండ్లు నులుపుకొని కృష్ణునితోనున్న గోవత్సగోపబాలురను తేరిపార చూచాడు. అహో ఏమాశ్చర్యము! ప్రతిదూడ, ప్రతిబాలుడూ ఒక మహావిష్ణువై చతుర్ముఖునకుదర్శనమిచ్చారు. నీలమేఘశ్యాములై పీతాంబరధారులై చతుర్భుజులై శంఖచక్రాదులను, కిరీటకుండలాది ఆభరణాలను ధరించిన వారై కన్నుల పండువుగ బ్రహ్మకు దర్శనమిచ్చారు.

ఉ॥ ఏ పరమేశుతేజమున నీ సచరాచరమైన లోకము
దీపితమయ్యె నట్టి విభుతేజము కన్నులఁ జక్కఁజూడగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమరచెనప్పుడు చిత్రపురూపు కైవడిన్. 538

ఏ పరమేశ్వరుని తేజముచే ఈ చరాచరవిశ్వమంతా సచేతనమై ప్రవర్తిస్తున్నదో, ఆ విభుని తేజాన్ని బాగా వీక్షించలేక, సృష్టికర్త ఇంద్రియాలన్నీ శాంతింపబడినవాడై పరవశుడై మైమరచినవాడై ఒక ప్రతిమలాగ ఉండిపోయాడు. ఈ విధంగా దిగ్భ్రమ చెందియున్న బ్రహ్మయందు దయతలచిన స్వామి తన విశ్వరూపాన్ని ఉపసంహరించుకొన్నాడు. బ్రహ్మ తెప్పరిల్లి నాలుగువైపులా చూచి, తన ఎదుటను బాలకృష్ణునీ బృందావనాన్నీ అంతా మామూలుగా చూచాడు. వెంటనే స్వామి పాదాలపైబడి, శిరస్సులతో పాదాలను స్పృశించి, ఆనంద బాష్పాలతో అభిషేకించాడు. వినయముతో లేచి నిల్చొని, అంజలి ఘటించి, ఇలాగ స్తుతించాడు.

# బ్రహ్మస్తుతి

"స్వామీ, లోకమును అనుగ్రహించడానికి గోపాలబాలుడవై అవతరించిన నీకు నా ప్రణామాలు. నిన్ను తెలుసుకోలేక నీపట్ల నేను చేసిన నా అపచారాన్ని వాత్సల్యంతో మన్నించి, నీ నిజరూపాన్ని చూపించావు. అయినా నిర్మల జ్ఞానానంద స్వరూపుడవైన పరమాత్ముడవు నీవు. నిన్ను నేను ఎరుగగలనా స్వామీ! నీవు ఇంద్రియ జ్ఞానానికి అగోచరుడవు. విశ్వమంతా నీకుక్షిలో నిమిడియున్నది. నేనూ నీకుక్షిలో నున్నవాడినే గనుక నిన్నెరుగలేను. విశ్వమంతా నీలో లయించినప్పుడు, ఆదినారాయణుడవైన నీవు జలములో శయనించి యుంటావు. మళ్లీ నీనుండియే విశ్వసృష్టి అంతా ఉద్భవిస్తుంది. అణువులో అణువువైయుండి, నీవు అంతటా వ్యాపించియుంటావు. మహత్తు కంటె మహత్తువైన నీలో అంతా ఇమిడి యుంటుంది. నీ నాభీకమలంనుండి ఉద్భవించిన నేను, నా ఉత్పత్తి స్థానమైన నిన్ను తెలుసుకోవాలని వందసంవత్సరాలు వెదకి వెదకి విఫలుడనైనాను.

ఈ అవతారంలోనే విశ్వమంతా నీనోటిలోనే నీ తల్లికి చూపించావు. గోవత్స బాలకులలో నీయొక్క దివ్యరూపాన్ని చూపించి, నాకు కూడా నీ విశ్వరూపాన్ని చూచే భాగ్యం కలిగించావు. విశ్వమంతా నీలోనే ఉంచుకొని, దానిని వెలుపలకు పంపించి, అందులో నీవు ఉండి, అన్నిటిలోనూ నీవే వ్యాపించి, మళ్లీ అన్నిటినీ కనబడకుండా చేసి, చివరికి నీవొక్కడవే మిగిలియుంటావనే నీ యొక్క సృష్టి రహస్యాన్ని ఇప్పుడు నాకు చూపించావు. సృష్టి స్థితిలయాలు అన్నీ నీవే చేస్తున్నా బ్రహ్మవిష్ణు మహేశ్వరులు వేరువేరుగ నున్నట్లు కనిపింపజేస్తావు. సర్వమూనీవే. నిన్ను వినా ఇంకేదీలేదు,. అనే సత్యాన్ని తెలుసుకొననివ్వదు నీమాయ. జన్మయే లేని నీవు, దేవతల్లోనూ, ఋషులలోనూ, మానవులలోనూ, జంతు జలచరాదులలోనూ జన్మిస్తూ సాధువులను రక్షిస్తూ, దుష్టులను శిక్షిస్తూ ఉంటావు కదా! నీవు సకల జీవులకూ ఆత్మవైన పరమాత్ముడవని సద్గురుకృపను పొందిన జ్ఞానులు మాత్రము తెలుసుకొనగలరు. నీ పాదసేవలోనే నిమగ్నులైన భక్తులు కూడ తెలుసుకొనగలరు. నిన్ను సేవించే మహా భాగ్యము ఈ నందవ్రజములోని వారందరికీ లభ్యమైనది.

శ్లో॥ అహో భాగ్యమహోభాగ్యం, నందగోపవ్రజౌకసాం ।
యన్మిత్రం పరమానందం, పూర్ణం బ్రహ్మ సనాతనం ॥

శా॥ ఏలా బ్రహ్మపదంబు, వేదములకున్ వీక్షింపగారాని వి
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ! యం
చాలాపాది సమస్తభావములు, నీయందే సమర్పించు నీ
వ్రేలం దొక్కని పాదరేణువులు, పై వేష్టించినం జాలదే. 570

వేదాలుకూడ తెలుసుకొనలేనట్టి నిన్ను ఈ భూలోకంలో ఈ బృందావనంలో ఈ మందలో నిన్ను కృష్ణా అని పిలుస్తూ, ఆలాపిస్తూ, ప్రేమిస్తూ, తమ సర్వస్వాన్నీ సమర్పించే ఈ గొల్లలలో ఒక్కని పాదధూళి అయినా నా శిరస్సుపై పడితే చాలదా, ఈ బ్రహ్మపదం దేనికి? నిన్ను చంపవచ్చిన పూతననే నీలో చేర్చుకొన్నావు కదా మరి, ఈవ్రేపల్లెలోని వారు తమ యొక్క మనస్సు ధనము దేహము సర్వమూ నీసేవకే అంకితం చేసినారు. కనుక ఎలాంటి ఫలము పొందుతారో తెలుసుకోవాలని ఉన్నది.

ఓ జగన్నాథా! కంసాది లోకకంటకులను అంతమొందించడానికి అవతరించిన దేవదేవా! నిన్ను నేను ఈ కల్పాంతమువరకూ ఆరాధించే వాడనగుదును గాక!" అని ఇంకా అనేక విధాల స్తుతించి బాలకృష్ణుని అనుమతితో సత్యలోకానికి వెళ్లిపోయాడు. దాచబడిన దూడలూ, బాలకులూ ఎక్కడివారక్కడే వెలశారు.

ఒక్క సంవత్సరకాలము గడిచినా కృష్ణమాయచే బాలురంతా ఒక్క అరక్షణమే గడిచినట్లు భావించారు. వారి భోజన పదార్థాలన్నీ చెక్కుచెదరక, చెడిపోక, అలాగే ఉన్నవి. మొదట దూడలను తోలుకొని వచ్చుటకు వెళ్లిన కృష్ణుడు చేతిలో వెన్న కలిపిన అన్నముతో ఆ దూడలను తోలుకొని అందరూ కూర్చున్న చోటికి వచ్చాడు. కృష్ణుని

చూచి వారందరూ "కృష్ణా! నీగురించే చూస్తున్నాము. ఆకలి వేస్తున్నది. అన్నము తిందాము వేగమే వచ్చి, కూర్చో" అన్నారు. అందరూ కలసి హాస్యాలాడుకొంటూ ఆనందంగా ఆరగించారు. ఇళ్లకు తిరిగి వెళ్తూ కృష్ణుడు వారందరినీ కొండచిలువ చచ్చిన చోటికి తీసుకొని వెళ్లాడు. ఆ సర్పం తెరిచియున్ననోటితోనే ఈ సంవత్సరకాలంలో బాగా ఎండిపోయి, కేవలం చర్మంగానే మిగిలిపోయినది. ఇళ్లకు వెళ్లి, అజగర సర్పాన్ని కృష్ణుడు ఆవేళనే చంపినట్లు పిల్లలంతా పెద్దలతో వర్ణించి చెప్పారు.

రాజా! ఈ విధంగా కృష్ణుడు తనఐదవఏటను అఘాసురుని చంపినా ఒక సంవత్సరం తరువాతనే బృందావనవాసులకు పిల్లలు చెప్పగా తెలిసినది.

ఈ సంవత్సరకాలంలో గోపులకు, గోపెమ్మలకు తమ బిడ్డలపై అపరిమితమైన ప్రేమ కలగడానికి కారణమేమిటి అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శ్రీశుకుడు ఇలా చెప్పాడు:

రాజా! ఈ సంవత్సరకాలంలో, తమ బిడ్డలరూపంలో సంచరించినది సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మయే కదా! అందుచేతనే ఆ తల్లుల యొక్క తండ్రులయొక్క జీవాత్మ, పరమాత్మ సన్నిధిలో స్పందించి ఆకర్షితమయినది. ఆత్మ ఆత్మనే ప్రేమిస్తుందిగాని శరీరాలను ప్రేమించదు కదా! అని శుక యోగీంద్రుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

## వనవిహారము

బలరామకృష్ణులకు కౌమారము (ఐదు సంవత్సరాలు) దాటి పౌగండం (6 నుండి 10 సంవత్సరాల స్థితి) వచ్చినది. వాళ్లిప్పుడు దూడలను కాయడం మానివేసి, గోవులనే కాస్తున్నారు. అడవులలోనికి కూడ వెళ్తున్నారు. బృందావనం అతి మనోహరమైన వనము. ఒకనాడు రామకృష్ణులు గోపబాలురతో కూడి వనములో ప్రవేశించారు. అది ఎఱ్ఱని చిగుళ్లతో, పుష్పాలతో, ఫలాలతో, తుమ్మెదలతో, పక్షులతో, లేళ్లతో అతి రమ్యముగా నున్నది.

**శ్రీకృష్ణుడు సంకర్షణుడైన అన్నతో ఇలా అన్నాడు:**

"అన్నా! దేవతలచే ఆరాధింపబడే నీ పాదాలకు, ఫలపుష్పాలతో నిండియున్న ఈ వృక్షాలు తలలువంచి మ్రొక్కుతున్నవి. తుమ్మెదలు నీ కీర్తిని గానము చేస్తున్నవి. నెమళ్లు నిన్నుచూచి, మేఘాలు వచ్చినంత ఆనందంతో నృత్యము చేస్తున్నాయి. కోకిలలు ఆహ్వాన గీతాలు ఆలాపిస్తున్నవి. నీపాదాలు సోకి ఈ భూమి పవిత్రమయినది. నీ కృపాదృష్టిచే ఇక్కడి నదులూ పర్వతాలూ పవిత్రమైనవి." అని ఈ విధంగా ఆది దేవుడు అనంతుని స్తుతించాడు.

శ్రీకృష్ణుడు అత్యంత ఆనందాన్ని చిందిస్తూ అడవి అంతా తన క్రీడారంగముగా సంచరించేవాడు. మురళీగానముతో వనమంతా మారుమ్రోగించేవాడు. తుమ్మెదలు హంసలు కోకిలలూ చేసే స్వరాలను అనుకరించేవాడు. జంతువులు అరుస్తుంటే తాను కూడ వాటిలాగా అరిచేవాడు. బలరాముడు అలసిపోయి, విశ్రాంతి తీసుకొంటే, తాను అతని పాదాలు ఒత్తేవాడు. తాను ఒక గోపబాలునితొడపై తలపెట్టుకొని విశ్రమిస్తే తక్కిన పిల్లలు ఉపచారాలు చేసేవారు. గోపాలకృష్ణుడు గోవులను ఇలా పిలిచేవాడు:

**సీ॥ రా పూర్ణచంద్రిక! రా గౌతమీగంగ! రమ్మి భాగీరథరాజతనయ**
**రా సుధాజలరాశి! రా మేఘమాలిక! రమ్మి చింతామణీ! రమ్మి సురభి**
**రా మనోహారిణి రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!**
**రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్మి మందాకినీ! రా శుభాంగి!**
**ఆ॥ అనుచు మరియు కలుగు నాఖ్యలు గలగోవులడవిలోన దూరమందు మేయ**
**ఘన గభీరభాష కడునొప్ప జీరు నాభీరజనులు పొగడ పెంపునెగడ.** 601

**క॥ పాడుచు నాడుచు ముచ్చటలాడుచు వొండొరుల తాకు నాప్తులఁ గని బి**
**ట్టాడుచు చేతులు వ్రేయుచు క్రీడింతురు నగుచు బలుడు కృష్ణుడు నొకచోన్.** 602

సీ॥ వేదాంత వీథుల విహరించు విన్నాణి, విహరించు కాంతారవీథులందు
ఫణి రాజశయ్యపై పవళించు సుఖభోగి, పల్లవ శయ్యలఁబవ్వళించు
గురుయోగి మానస గుహలఁ గ్రుమ్మరు మేటి, గ్రుమ్మరు నద్రీంద్రగుహలలోన
కమలతోడఁ బెనంగి కడు డయ్యు చతురుఁ డాభీర జనులతోడ పెనగి డయ్యు
ఆ॥ నఖిల లోకమునకు నాశ్రయుండగు ధీరుడలసి తరులనీడ నాశ్రయించు
యాగభాగచయము లాహరించు మహాత్ముడడవిలోని ఫలములాహరించు. 605

## ధేనుకాసురుడు

ఈ విధంగా బలరామకృష్ణులు తమ తోడి బాలురతో వనములో విచ్చల విడిగా విహరిస్తుండగా, ఒకనాడు శ్రీదాముడనే బాలుడు రామకృష్ణులతో ఇలాగ చెప్పాడు.

ఇక్కడ దగ్గరలో నొక తాటిచెట్ల వనమున్నది. ఎన్నో తాటిపండ్లు రాలుతునే ఉంటాయి. కాని ఆ వనములో నెవ్వరూ ప్రవేశించలేరు. ఎందుకంటే అక్కడ గార్దభ రూపాన నున్న ధేనుకుడు అనే రాక్షసుడు ఉన్నాడు. వాడు మహా బలశాలి. వానితో సమానులైన గార్దభరాక్షసులు ఎందరో ఆవనంలోనున్నారు. ఆ వనంలోనికి ఎవ్వరు ప్రవేశించినా, ఆ రాక్షసుడు భక్షించేస్తాడు. అందుచేత మనుష్యులేకాక పశుపక్ష్యాదులు కూడ అందు చొరబడవు. ఆ తాటి పండ్ల వాసన అంతటా వ్యాపిస్తుంది. మాకు ఆ పండ్లను తినాలని ఉన్నది." అని చెప్పగా మిత్రుల కోర్కెను తీర్చాలని అన్నదమ్ములిద్దరూ ఆ వనంలో ప్రవేశించారు. బలశాలియైన రాముడు తాటి చెట్లను ఊపగా చాలా పండ్లు రాలినవి. ఆ శబ్దము విని, రాక్షసుడు పరుగెత్తుకొంటూ వచ్చి బలరాముని గుండెమీద వెనుక కాళ్లతో తన్నాడు పరుగెత్తుకొని కొంతదూరం వెళ్లివచ్చి మళ్లీ అలాగే తన్నబోయాడు. బలరాముడు దాని వెనుక కాళ్లను పట్టుకొని ఆ గార్దభాన్ని గిరగిరా త్రిప్పి, విసిరికొట్టేసరికి అది అప్పుడే ప్రాణాలు విడిచి, చచ్చి చెట్లమీద పడినది. ఆ తాకిడికి కొన్ని తాటిచెట్లు పడిపోయాయి. ధేనుకుడు పడిపోవడంచూచి తక్కిన గార్దభ రాక్షసులు వచ్చి అన్నదమ్ముల మీద పడి తన్నబోయారు. బలరామకృష్ణులు వారందరినీ అదే విధంగా హతమార్చారు. ఆ వనానికి రాక్షసపీడ వదలిపోయినది. పిల్లలందరు గోవులను తోలుకొని ఆవనంలో ప్రవేశించి, పండ్లను ఆరగించారు. గోవులకు పచ్చని పచ్చిక బయళ్లు దొరికాయి.

ప్రకృతి ప్రసాదించిన వాటిని తాము అనుభవించలేనందున ఇతరులెవ్వరు కూడా అనుభవించతాదు అనే కొంటె తత్త్వంగలవారు లోభులు మత్సరులు అనబడుతారు. అట్టివారు నశిస్తారని ఈ ధేనుకాసుర వృత్తాంతం తెలియజేస్తున్నది.

## కాళియమర్దనము

బృందావనంలో బాలకృష్ణుడు బలరామునితోను, గోపబాలురతోను కూడి విహరిస్తూ అనేకలీలలు చూపుతున్నాడు. ఒకనాడు బలరాముడు లేకుండా కృష్ణుడు మిత్రులతో యమునకు వెళ్లి ఆటలాడుతుండగా అందరూ అలసిపోయారు. గోవులూ గోపబాలురు అంతా యమునలో నీరు త్రాగారు. వెంటనే అందరూ మూర్ఛపోయి, ప్రాణంలేని వారిలాగా నిశ్చేష్టులై పడిపోయారు. ఆ కాళింది మడుగులోని నీరు విషంతో కలుషితం అయినట్లు తెలుసుకొన్న స్వామి ప్రాణసంకటంతో పడియున్న గోవులను, బాలురను తన అమృత మయమైన దృక్కులతో వీక్షించగా వారంతా లేచి కూర్చున్నారు. మృత్యుముఖంనుండి తమ్ము కాపాడిన కృష్ణయ్యను వారు సంతోషంతో పొగడి ఎత్తుకొన్నారు.

కాళింది మడుగు విషమయం కావడానికి కారణమైన కాళియుడనే సర్పాన్ని అక్కడినుంచి తొలగించకపోతే ప్రజలకు, పశువులకు ఎల్లప్పుడూ ప్రమాదం కలుగుతుంటుందని గ్రహించాడు స్వామి. ఆ విషగాలులు సోకి, గట్టున ఉన్న చెట్లు, పక్షులూ, ఇతర జీవాలూ మాడిపోతుండేవి. దీనికి నివారణోపాయం ఆలోచించాడు. ఆ మడుగు గట్టుపైన ఒక పెద్ద కదంబవృక్షం ఉన్నది. ఆచెట్టెక్కి మడుగులోనికి చెంగున గెంతాడు బాలకృష్ణుడు. నీరు చెదరి,

మడుగులో కల్లోలమేర్పడినది. కాళియుని ప్రశాంతత భంగమయినది. అతడు రోషంతో బుసలుకొడుతూ విషం కక్కాడు. నీరు నూరు ధనుస్సులపైకి ఎగసినది. తన స్థావరంలో చొచ్చుకొని దాడిచేసిన శత్రువును ఎదుర్కొడానికి తన సైన్యాన్ని ఆయత్తపరిచాడు. తన శత్రువెవడో చూచి, ఈ పసిపాపడా తనపై దాడి చేశాడు? అనుకొంటూ బాలకృష్ణుని శరీరాన్నిచుట్టివేసి, తొడలూ, పాదాలూ కరవసాగాడు. ఆసుందరసుకుమారశ్యామసుందరుడేమీ భయపడలేదు. మందహాసంతో, వినోదిస్తున్నట్లు కనిపించాడు. ఒడ్డున నిల్చున్న బాలకులు తమ ప్రియమిత్రుడూ తమ ప్రాణమూ, దైవమూ, సర్వస్వమూ అయిన బాలకృష్ణుడు ఆ విధంగా ఘోరసర్పం పాలబడడం చూచి భరించలేక ఏమీ చెయ్యలేక, నిర్జీవులై చూస్తూ నిల్చుండిపోయారు. గోవులు, దూడలు, అంబా అంటూ రోదించాయి. వ్రేపల్లెలో ఉత్పాతాలు సంభవించినవి. బలరాముడు లేకుండా కృష్ణుడొక్కడే వెళ్లినాడు. ఎలాంటి ఆపదలో చిక్కుకొన్నాడో అని శంకిస్తున్న తల్లులకు అపశకునాలు కనిపించినవి. గ్రామంలోని ఆ బాలగోపాలమంతా చేరి, కృష్ణుడు తిరగే చోట్లన్నీ వెతుక్కొంటూ కాళింది మడుగుకు వచ్చారు. మహాసర్పంచే చుట్టబడి ఉన్నాడు నాథవుడు. బలరాముడు చూచి, ఇది కూడ ఒక స్వామి లీలయే అని తెలిసికొన్నవాడై, చిరునవ్వుతో అంతా చూస్తున్నాడు. గోకులవాసులంతా ఆర్తులై గొల్లున ఏడ్చారు. యశోదాదేవిని పట్టుకొని, తాముకూడ ఏడ్వసాగారు. బాలకృష్ణుని చేష్టలన్నీ ఏకరవు పెట్టుకొంటూ అతడు లేనిదే ఇక తమ జీవితం ఎందుకు? అని, విలపిస్తున్నారు.

క॥ పన్నగము మమ్ము కరవక నిన్నేటికి కరచె కుఱ్ఱ! నెమ్మి గలిగి నీ
పున్నను మము రక్షింతువు నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ! 654

ఉ॥ చూడవదేమి? గారవపు చూపుల మమ్ము సఖాళితోడ మా
టాడవదేమి? నర్మముగ నందెలు పాదములందు మ్రోయ నే
డాడవదేమి? నర్తనములవ్వల మ్రోలను గోపికావళిన్
కూడవదేమి? నవ్వులకు గోపకుమారవరేణ్య చెప్పుమా. 655

సీ॥ శ్రవణరంధ్రంబులు సఫలత పొందంగ నెలమి భాషించువారెవ్వరింక?
కరచరణాదుల కలిమి ధన్యత నొంద నెగిరి పైఁ బ్రాకువారెవ్వరింక?
నయనయుగ్మంబులున్నతి కృతార్థములుగా నవ్వులు చూపువారెవ్వరింక?
జిహ్వలు గౌరవ శ్రీఁ జేరఁబాటల యెడ పరికించు వారెవ్వరింక?

ఆ॥ తండ్రి! నీవు సర్పదష్టుండవైయున్న నిచట మాకు ప్రభువులెవ్వరింక!
మరిగి పాయలేము మాకు నీతోడిద లోకమీవు లేని లోకమేల? 656

తండ్రీ! ఈ పాడు సర్పము మమ్మల్ని కరవకుండా నిన్నెందుకు కరిచిందయ్యా! నీవు బాగుంటే మమ్మల్ని రక్షిస్తావుగాని, నిన్ను మేము రక్షించలేము కదా! అయ్యో నాయనా! నీయొక్క గారాల చూపులతో మమ్మల్ని ఇక చూడవా? నీ స్నేహితులతో గుస్తంగా కబుర్లు చెప్పవేమి? అందెలు ఘల్లు ఘల్లుమనునట్లు నీ చిన్ని పాదాలతో నృత్యం చేయవదేమి తండ్రీ! గోపికలతో కిలకిలా నవ్వడానికి వెళ్లవేమి? గోపకిశోరా! తండ్రీ! ఇప్పుడు నీవు ఇలా పామువాత పడితే ఇంక మాకు ప్రభువు ఎవ్వరయ్యా! మాకు నీ తోడిదే లోకము కదా! నీవులేని లోకము మాకెందుకు? స్వామీ?" అని గోలపెట్టి ఏడుస్తూ, అందరూ కలసి, ఆ విషపు మడుగులో పడి, ప్రాణాలు విడువడానికి సిద్ధపడ్తుండగా, బలరాముడు వారిని వారించి అడ్డుపడ్డాడు.

ఈ వ్యవహారమంతా నిర్లిప్తతతో గమనిస్తూ నిస్సహాయుని లాగా కొంతసేపు నటిస్తూ ఉన్న స్వామి ఒక్క ఊపున సర్పబంధమునుండి విడలించుకొన్నాడు. కాళియుడు రోషముతో పడగలు పైకెత్తి విషజ్వాలలు కక్కుతూ బాలునిపై బడ్డాడు. స్వామి చెంగున ఆ పడగల పైకి లంఘించి, ఇటూ అటూ, విలాసంగా నడిచాడు. నాట్యం చేయనారంభించాడు.

నూట ఒక్క పడగలతో మణులవలె మెరిసిపోతున్న ఆ కాళీయుని శిరస్సు ఒక విశాలమైన నాట్యవేదిక అయిపోయినది. ఆ మణిమయరంగ స్థలంమీద నృత్యం చేస్తున్న ఆ శ్రీరంగనాథుని ఎర్రని పాదాల మనోహర దృశ్యమును గోకుల వాసులతో సహా దేవలోకవాసులు కూడ తిలకించి తమ జన్మలు ధన్యమయినవని ఆనందించారు. దివ్యవాద్యాలు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. దివ్యపురుషులు స్తుతించారు. స్వామియొక్క పాదాఘాతాలకు తట్టుకొనలేని ఫణిరాజు విషంతోపాటు రక్తం కక్కుకొన్నాడు. పడగలతోపాటు వాని శరీరమూ శిథిలమయినది. దేవతలనుకూడ హతమార్చగల విషజ్వాలలకు చెక్కు చెదరకుండా, చలించకుండా ఉండే ఈ బాలుడు తననే అణగ ద్రొక్కుతున్నాడే, వీడు సామాన్యుడుకాడు. సాక్షాత్తూ నారాయణుడే అయి యుంటాడు. సందేహంలేదు, అని తలపోసిన కాళియుడు మనస్సులో శరణుజొచ్చాడు.

శ్రీకృష్ణుని తాండవనృత్యంయొక్క తాకిడికి శిథిలమైన శరీరంతో కాళియుడు చావుబ్రతుకుల స్థితికి వచ్చేశాడు. వాని భార్యలు తీవ్రమైన శోకముతో ఆర్తులై, బిడ్డలను ముందుంచుకొని స్వామిని ఈ విధంగా స్తుతించారు.

"ఓ జగదీశ్వరా! దుష్టులను దండించడమే నీయొక్క అవతారకార్యము గనుక నీవు ఇతనిని దండించడం యుక్తముగానే ఉన్నది. నీయొక్క దండన వాస్తవానికి అనుగ్రహమే కదా! అపరాధం చేసిన వారు నీచే దండింపబడితే వారి పాపాలన్నీ తొలగిపోతాయి.

**ఉ॥ ఎట్టి తపంబు చేసెనొకొ? యెట్టి సుకర్మము లాచరించెనో**
**యెట్టి నిజంబు పల్కెనొకొ యీ ఫణి పూర్వ భవంబునందు ము**
**న్నెట్టి మహానుభావులకు నెన్నడు చేరువకాని నీవు నే**
**డిట్టి వినోదలీలఁ దలలెక్కి నటించెదవీ ఫణీంద్రుపై.** 674

**మ॥ బహుకాలంబు తపంబుసేసి వ్రతముల్ పాటించి కామించి నీ**
**మహనీయోజ్జ్వల పాదరేణు కణ సంస్పర్శాధికారంబు శ్రీ**
**మహిళారత్నము తొల్లి కాంచెనిదె నేమంబేమియున్ లేక యీ**
**యహి నీపాదయుగాహతిన్ బడసె నేఁడత్యద్భుతం బీశ్వరా.** 675

**ఉ॥ ఒల్లరు నిర్జరేంద్రపదమొల్లరు బ్రహ్మపదంబు నొందగా**
**నొల్లరు చక్రవర్తిపదమొల్లరు సర్వరసాధిపత్యము**
**న్నొల్లరు యోగసిద్ధి మరియొండు భవంబున నొందనీని నీ**
**పల్లలితాంఘ్రిరేణువులసంగతి నొందిన ధన్యులెప్పుడున్.** 676

స్వామీ! ఈ ఫణీంద్రుడు పూర్వజన్మలలో ఎలాంటి తపస్సులు చేశాడో, ఎలాంటి సుకృతాలు చేశాడో, ఎలాంటి సత్యవచనాలు పలికాడో కాని ఇదివరకెన్నడు, ఎంతటి గొప్పవారికైనా దగ్గరికి చేరనివ్వని నీవు ఈ విధంగా ఈతని తలలపై నాట్యంచేసి, నీ లీలా వినోదాన్ని ప్రదర్శించావు. ఈశ్వరా! మునుపు చాలాకాలం తపస్సు చేసి లక్ష్మీదేవి నీ పాదరేణువులను శిరస్సున ధరించే అధికారాన్ని పొందియున్నది. కాని ఈ సర్పరాజు అలాంటివేమీ చెయ్యకుండానే నీపాదాల సంస్పర్శను పొందాడు. ఎంత అద్భుతమో కదా! పరమేశ్వరా! నీపాద పరాగాన్ని పొందిన ధన్యులు భూలోకంలో చక్రవర్తిపదాన్నిగాని, స్వర్గలోకంలో ఇంద్రపదాన్నిగాని, సత్యలోకంలో బ్రహ్మపదాన్ని గాని, రససిద్ధులుగాని యోగ సిద్ధులుగాని దేనినీ పొందడానికి ఇష్టపడరు కదా! ఎవ్వరికీ లభించని ఈ మహా భాగ్యము, పగపట్టి, పరులను హింసించే ఈ ఫణి రాజునకు ఎలాగా సిద్ధించినదో కదా! నీ అనుగ్రహం, ఎవరికి, ఎప్పుడు, ఎందుకు లభిస్తుందో ఎవ్వరూ చెప్పలేరు. స్వామీ! నీవు విశ్వాత్ముడవు విశ్వరూపుడవు, విశ్వకారణుడవు. నీకు మా శతకోటి ప్రణామాలు. దేవా! నీవు తండ్రివి కదా! బిడ్డలుచేసే అపరాధాలను మన్నించే జగత్పితవు. మా భర్త చేసిన తప్పులను క్షమించి,

అతనికి ప్రాణభిక్ష, మాకు పతిభిక్ష ప్రసాదించుమని ప్రార్థిస్తున్నాము. ఇకనుండి నీ ఆజ్ఞప్రకారమే నడుచుకొంటాం ప్రభూ!" అని, నాగపత్నులు దీనంగా వేడుకొనగా, స్వామి కరుణించి కాళియుని విడిచిపెట్టాడు.

కాళియుడు కోలుకొన్నాడు. వాని శక్తితోపాటు అహంకారము కూడా క్షీణించిపోయినది. వినమ్రుడై దీనుడై ఇలా విన్నవించుకొన్నాడు: "హే భగవన్! జన్మతః మేము దుష్టులము, తామసులము. పగపెంచుకొనేవారము. ఇదంతా నీ సృష్టి విశేషమేకదా! నీమాయా ప్రభావమేకదా! నీవు మన్నించినా శిక్షించినా, నీ అనుగ్రహమూ నా భాగ్యము అనుకొంటాను.

క॥ నా పుణ్యమేమి చెప్పను నీ పాదరజంబుగంటి నే సనకాదుల్
నీ పాదరజముఁ గోరుదురేపద మందున్న నైన నికమేలు హరీ! 691

అని ప్రార్థించిన కాళియుని మాటలకు స్వామి సంతసించి ఇలా అన్నాడు: "సర్పశ్రేష్ఠా! ఈ మడుగులో నీవు కాపురం ఉండడం ప్రజలకు, పశుపక్షులకు ప్రమాదకరము, కనుక నీవు నీ సకల బంధు పరివారముతో పోయి సముద్రగర్భములో నివసించు. నీ తలలపై ఏర్పడిన నాయొక్క పాద చిహ్నాలను చూచి, గరుత్మంతుడు నిన్ను హింసించడు." అని అభయమిచ్చి, లోకాలను ఈ విధంగా ఆశీర్వదించాడు స్వామి: "ఈ కాళీయమర్దన వృత్తాంతం విని, స్మరిస్తుండే వారికి సర్పభయముండదు. ఈ మడుగులో స్నానమాచరించి, ఉపవాసముతో నన్ను తలచి, కొలిచి జలతర్పణ చేసేవారు పాపాలను పోగొట్టుకొన్నవారై సమచిత్తులై యుంటారు." అన్నాడు. దయా మయుడైన ఆ సర్వేశ్వరునకు కాళియుడు ప్రణామాలు చేసి, దివ్యాభరణ రత్నమాలికలను, నీలోత్పలమాలికలను సమర్పించి, సపరివారముగ రత్నాకర ద్వీపానికి వెళ్లిపోయాడు.

పూర్వము సర్పభీతిచేత ప్రజలు నెలనెలా పూజలు చేస్తూ నైవేద్యాలను చెట్లక్రింద పెట్టేవారు. వాటిలో కొంత ఆరగించి, కొంతభాగం ఆ సర్పాలు గరుత్మంతునకు అర్పించేవి. తన విషముయొక్క శక్తి యందూ, తన పడగల శక్తియందూ మితిమీరిన అహంకారం పెంచుకొన్న కాళియుడు తాను ఇవ్వవలసిన నైవేద్య భాగాన్ని ఇవ్వకపోవడమే కాకుండా ఇతర సర్పాలు అర్పించిన భాగాలను కూడా తానే తిని వేస్తుండేసరికి గరుడునికి ఆగ్రహంవచ్చి కాళియుని చీల్చి వేయాలని దిగివచ్చాడు. తన నూట ఒక్క పడగలనెత్తి బడబాగ్ని వంటి విషజ్వాలలను క్రక్కుతూ, కాళియుడు ఎదిరించాడు. ఇద్దరి మధ్యా ఘోరయుద్ధం జరిగినది. గరుడుని రెక్కల దెబ్బలకు గోళ్లూ, ముక్కూ చేసిన ఛిద్రాలకూ భయపడిపోయి, కాళియుడు ఈ కాళింది మడుగులో కాపురం పెట్టాడు. గరుడుడు ముని శాపం వలన ఈ మడుగు ప్రాంతాలకు రాలేడని కాళియునికి తెలుసు. తొల్లి సౌభరి అనే ఋషి ఈ మడుగులో తపస్సుచేసుకొంటున్నప్పుడు, గరుడుడు వచ్చి అందలి చేపలను తినేస్తుంటే, ఆ చేపలు చేస్తుండే హాహాకారాలను విని ముని ఆ మడుగు వద్దకు ఏ పక్షులూ రాకూడదని శపించాడు. ఆ విధంగా కాళింది మడుగులో ప్రవేశించిన కాళియుడు ఇప్పుడు శ్రీకృష్ణుని ఆదేశంచే విడిచి వెళ్లాడు.

కాళియుడు అతని పత్నులు సమర్పించిన దివ్యగంధ - అంబర సువర్ణ మణి మయ మాలికలను ధరించి, శ్రీకృష్ణుడు బైటకు రావడం చూచిన యశోద, రోహిణి మొదలైన గోపాంగనలు నందసునందాదులైన గోపకులు మూర్ఛనుండి తేరుకొని పరమానందంతో గంతులువేశారు. బలరాముడు తమ్ముని గాఢాలింగనం చేసుకొన్నాడు. గోవులూ వృషభాలు సంతోషంతో రంకెలు వేస్తూ గంతులు వేశాయి. మోడులు చిగిర్చాయి. బ్రాహ్మణులు స్వస్తి వచనాలు పలికారు. దేవతలు పుష్ప వృష్టి కురిపించారు.

సూర్యుడు అప్పటికే అస్తమించాడు. అందరూ తిరిగి గ్రామం చేరుకోవడం కాదని ఆ రాత్రికి అక్కడే విశ్రమించాలనుకొన్నారు. చెట్లక్రింద ఆకులూ గడ్డీ పరుచుకొని పండుకొన్నారు. రోజంతా భోజనం లేక వ్యాకులపాటు చెంది యుండటం చేత బడలికచే గాఢ నిద్రపోయారు. అర్ధరాత్రివేళ అడవిలో కారుచిచ్చు రేగి అన్ని వైపులా వ్యాపిస్తున్నది. అందరూ హాహా కారాలు చేస్తూ అటూ ఇటూ పరుగెత్తుతున్నారు. గోవుల అంబారవాలతో అంతా

మారుమ్రోగుతున్నది. "కృష్ణా కృష్ణా! రక్షించుడి" అనే ఆర్తనాదాలు వినవచ్చాయి. అప్పుడు దీనబాంధవుడైన ఆ దేవదేవుడు ఆదావాగ్నిని తననోటిలోనికి పీల్చుకొన్నాడు. అంతటా జయజయ ధ్వనులు నిండిపోయాయి. తెల్లవారుతుండగా అందరూ ఇండ్లకు బయలుదేరారు.

## ప్రలంబాసురుడు

బలరామకృష్ణులు నదీనదతీరాలలోను, కొండచరియలలోను, పొదలపొంతను, పచ్చిక గుబురులలోను, పశువులను మేపుతూ, విచ్చల విడిగా విహరిస్తూ ఆనందంతో గడిపివేస్తున్నారు. వీరిని ఏవిధంగా హింసించాలా అని యోచిస్తూ, ప్రలంబుడనే అసురుడు గోపబాలుని రూపం ధరించి, వారి చెంతకు వచ్చాడు. సర్వమూ తెలిసిన స్వామి ఏమీ తెలియని వానిలా చూస్తున్నాడు. రాక్షసుని దగ్గరకు పిలిచి, చెలిమిచేసి తన మిత్రులతో ఇలా అన్నాడు: "మనమంతా రెండు పక్షాలుగా అయి, ఆడుకొందాం. బలరాముని పక్షంలో కొందరు, నా పక్షంలో కొందరు చేరండి. ఓడిన వారు గెలిచిన వారిని మొయ్యాలి." అని చెప్పాడు. ప్రలంబుడు కృష్ణుని పక్షంలో చేరాడు. కారణం ఏమిటంటే – ఒకవేళ ఓడిపోతే కృష్ణుని మొయ్యవలసియుండదు. ఇదివరకు తృణావర్తుడనే అసురుడు సుడిగాలియై వచ్చి కృష్ణుని ఎగురవేసుకొనిపోయి, అతనిని మొయ్యలేక చచ్చాడు. అందుచేత ప్రలంబుడు కృష్ణుని పక్షంలో చేరాడు. అందరూ భాండీరకం అనే మర్రిచెట్టుక్రిందకు చేరి ఆటలాడ నారంభించారు. శ్రీకృష్ణుడు బలరామునితో రహస్యంగా ప్రలంబుని గురించి చెప్పి, జాగ్రత వహించి వీలైతే వధించుమన్నాడు. ఆటలు జోరుగా సాగినవి. బలరాముని పక్షంలోని శ్రీదాముడు ఓడిపోయి, కృష్ణుని తన మీద నెక్కించుకొని మోశాడు. కృష్ణుని పక్షంలోని భద్రసేనుడూ ప్రలంబుడూ ఓడిపోయారు. భద్రసేనుడు ఎదిరి పక్షంలోని వృషభుని ఎక్కించుకొంటాడు. ప్రలంబుడు బలరాముని ఎక్కించుకొంటాడు. అదను దొరికిందని ప్రలంబుడు బలరాముని ఎటో మోసుకొని పోసాగాడు. బలరాముడు రానురాను బరువెక్కి, అసురుడు మోయలేనంత భారంగా తయారయ్యాడు. ప్రలంబుడు ఇక మానవదేహాన్ని విడిచి, అతిభయంకరమైన నిజరూపంలో బలరాముని మోసుకొని పోసాగాడు. బలరామునకు పర్వత శిఖరం మీద కూర్చున్నట్టనిపించినది. అసురుని శిరస్సుననున్న సువర్ణ రత్న ఖచిత కిరీటము మెరిసిపోతున్నది. వాని ముఖము, కోరలు, కన్నులు, మహాభయంకరముగా నున్నవి. ఆకాశమార్గాన ఎగిరిపోతున్న అసురుని భుజస్కంధాలపైనున్న బలరాముడు తన పిడికిలి బిగించి, వాని నెత్తిపై మొత్తగా, వాని తలబ్రద్దలయినది. ఇంద్రుని వజ్రాయుధ ఘాతానికి రెక్కలు తెగిపడిపోయిన పర్వతంలాగా ప్రలంబుడు పెద్ద శబ్దంచేస్తూ నేలకూలాడు.

గోపకుమారులందరూ హర్షంతో గంతులు వేసి ఆడారు. అంత పెద్ద రాక్షసుని మన రామన్న ఒక్కడే నేల గూల్చాడు. ఎంత అద్భుతం అంటూ జేజేలు చెప్పారు. ఒక అసురిని పీడ వదిలిందని ఇంద్రాది దేవతలు సంతసించి పుష్పవృష్టి కురిపించారు.

## దావాగ్ని

ఈ విధంగా బాలకులందరూ ఆటలలో మునిగియుండగా గోవులమంద పచ్చికను మేస్తూ మేస్తూ కారడవి మధ్యకు వెళ్లిపోయినది. అక్కడ కారుచిచ్చు చెలరేగినది. ఆ వేడి గాలికి తట్టుకొనలేక అవి దప్పికతో భయంతో అంబా అంబా అని ఆక్రోశించాయి. ఆ ఘోషవిని ఆటలు చాలించి, బాలకులు పరుగు పరుగున పోయి గోవులను మరలించారు. గోపాలకృష్ణుడు మేఘగర్జన లాంటి స్వరముతో ఆ గోవులను పేరుపేరున పిలువగా, అవి అన్నీ తల్లిని చేరుతున్న బిడ్డలలాగ పరుగు పరుగున అంబా అంబా అంటూ వచ్చేశాయి.

దావాగ్ని వనమంతా వ్యాపిస్తున్నది. తప్పించుకొనేమార్గమే కనబడదు. అందరూ దానికి ఆహుతి కాకతప్పదా? అన్నట్టు ఉన్నది. పిల్లలంతా భయంతో తల్లడిల్లి పోతున్నారు. శ్రీకృష్ణునకు ప్రణామాలు చేస్తూ ఇలా అన్నారు: "కృష్ణా! చూస్తూన్నావు కదా ఆకాశాన్ని అంటుకొంటున్న ఈ కారుచిచ్చు ప్రపంచాన్నే బూడిద చేసేటట్లున్నది. మేమంతా

నీవారమే కదా! మాకు నీవు తప్ప ఇంకెవ్వరున్నారు రక్షించేవారు? మా ఈశ్వరుడవు నీవే. మమ్మల్ని కాపాడుమయ్యా!" అని వేడుకొనగా స్వామి ఇలా అన్నాడు. "ఓ ప్రియబంధువులారా! భయపడకండి. అందరూ కండ్లు మూసుకొనండి" అని చెప్పి, భగవానుడు ఆ దావాగ్నిని తననోటిలోనికి పీల్చుకోగా అంతా శాంతించినది. శ్రీకృష్ణుడు మూర్ఛపోయిన బాలకులను భాండీరకవృక్షం వద్దకు చేర్చాడు. వాళ్లు తెలివి తెచ్చుకొని, తమ కృష్ణుడు భగవంతుడే అయి యుంటాడని మరి ఒకసారి అనుకొన్నారు.

శ్రీకృష్ణుడు బలరామునితో గూడి వేణువు ఊదుతూ గ్రామంలో ప్రవేశించాడు. బాలకృష్ణుడు తమ వద్ద లేని సమయము గోపికలకు ఒక నిముషము శతయుగాలుగా అనిపించేది. మురళీనాదం వినగానే అందరూ బైటకు వచ్చి ఎదురుగావెళ్లి అతనిని సందర్శించగానే వారికి పరమానందం కలుగుతుండేది.

గోపబాలురు తమ ఇండ్లకు వెళ్లి, పెద్దలకు బలరాముడు ప్రలంబాసురుని వధించడం, కృష్ణుడు, తమనందరినీ దావాగ్ని జ్వాలలనుండి రక్షించడం, మొదలైన అద్భుత చర్యలను వర్ణించి చెప్పారు. బలరామకృష్ణులు ఏదో దైవకార్యం నిర్వహించడానికి వచ్చిన దేవతలై యుంటారని గ్రామస్థులు భావించారు.

## ప్రకృతిశోభ

బలరామకృష్ణులు బృందావనమంతా తమదే అన్నట్టు గోపకుమారులతోగూడి విహరించే వారు. కాలము కూడ వారి వశములోనున్నట్టు ఉండేది. మండువేసవిలో సూర్యుడు బృందావనంలో తన ప్రతాపాన్ని చూపేవాడు కాడు. అక్కడ నిత్యవసంతం లాగుండేది. వృక్షాలు ఫలపుష్పాదులతో అందముగానుండేవి. నదులూ సరస్సులు శుష్కించేవి కావు. పచ్చిక బయళ్లు పచ్చగా నుండేవి. ఇది అంతా ఆ భగవానుని సాన్నిధ్యవిలాసమే కదా! నామ రూప రహిత పరమాత్మ మానవరూపధారియై అవతరించి, సామాన్యపు గొల్లపిల్లవానిలాగా పెరుగుతున్నా ఆయన యొక్క దివ్యమాయా ప్రభావంచేత ప్రకృతి మాత కూడ ఆ విధంగా సేవచేసేది.

వర్షాకాలంలో నదులూ జలాశయాలూ నిండినవి. వేసవిలో శుష్కించిన బీజాలు అంకురించాయి. భూమాత సర్వాంగసుందరిలాగా చూడముచ్చటగా ఉన్నది. జీవరాశులన్నీ తేరుకొని స్వస్థత చెందాయి.

## వేణుగానము

శరదృతువులో నీరు తేటపడినది. చంద్రకిరణాలు సోకి, పైరులు నిండుగా పెరిగాయి. రాజులు విజయోత్సవాలు, రమణులు లక్ష్మీపూజలూ, జనులు జగజ్జనని ఉత్సవాలూ జరుపుకొంటున్నారు. మన్మథుడు తన కార్యక్రమం చేపట్ట సంకల్పించాడు.

ఇలాంటి ఆహ్లాదకరమైన శరదృతువులో శ్రీకృష్ణుడు హాయిగా పశువులను మేపుకొంటూ వేణువును ఊదుకొంటూ ఆనందించేవాడు. శ్రీకృష్ణుని వేణుగానము గాంధర్వ గానము. సిగలో నెమలి పింఛము, మెడలో వైజయంతీమాల, చెవులలో పువ్వులు, చేతిలో మురళి. ఆ విశ్వమోహనాకారమును చూచి దేవతలు కూడ పరవశులయ్యేవారు. ఇక గోపకన్యలగురించి వేరే చెప్పాలా? వేణునాదం విని, గోపికలు మైమరచేవారు. సిగ్గు విడిచేవారు. దేహధ్యాసయే లేని వారయ్యేవారు. గుంపులుగా చేరి, తమలోతాము ఆ జగన్మోహనాకారుని లీలా విశేషాలను ముచ్చటించుకొనేవారు. వారి సంభాషణలు ఇలా ఉండేవి:

"విన్నావటే సుందరీ! మురళీమోహనుని వేణుగానము. నీ మనస్సు చలించలేదూ? నేనైతే పరవశనైతిని సుమా! మన సంగతి అలా ఉంచు. విమానాల్లో భర్తలతో విహరిస్తున్న దివ్యాంగనలు కూడా ఆ మదన గోపాలుని మోహన మురళీ నాదము విని, వశము తప్పి పతుల చేతులలోకి వాలిపోతున్నారట." అని ఒకామె అంటే, ఇంకొక పడుచు ఇలాగంటున్నది. "నన్నడిగితే ఈ కన్నులూ చెవులూ మనకు దేవుడెందు కిచ్చినట్లు? కన్నులపండువుగా ఆ ముగ్ధ

మోహన రూపాన్ని తిలకించడానికీ, వీనుల విందుగా, అతని వేణుగానాన్ని వినడానికీ" అని. ఇంకొకతె ఏమంటున్నదంటే - "అమరావతిని అమితంగా వర్ణించే కవులు, మన బృందావనాన్ని చూస్తే మరి ఆ అమరావతి ప్రసక్తే ఎత్తరు కదా!" అని. ఇంకొకామె ఇలాగ విలపిస్తున్నది. "అయ్యో! నేను గత జన్మలో నోములు నోచినప్పుడు యమునా నదీతీరాన, వెదురు మొక్కగా పుట్టాలని ఎందుకు కోరుకొనలేదో, మందభాగ్యను ఆ వెదురు గొట్టం (వేణువు)చూడు, ఎంత పుణ్యం చేసికొన్నదో, ఎప్పుడూ ఆ గోపాల కృష్ణుని అధరాలకు అంటిపెట్టుకొనే ఉంటున్నది." అని. ఇంకొకతె ఇలా చమత్కరిస్తున్నది. "చెలియా చూచావుటే! ఆ నీలమేఘశ్యాముడు అలాగ వెళ్తుంటే అతని వెంట నృత్యం చేసుకొంటూ ఆ నెమళ్లు ఎలాగ వెళ్లుతున్నాయో! బహుశ వాటికి అతడే మేఘూల్లాగా కనబడుతున్నాడేమో." అన్నది. ఇంకొక భామ ఇలా అంటున్నది: ఇంతేకాదు, ఇంతులారా! ఎలాంటి జ్ఞానమూ లేని అడవి మృగాలు కూడ గోవిందుని వేణునాదం వింటేసరి, మేతలు మాని, చెవులు నిక్కించి, చేష్టలుడిగి నిల్చుండి పోతాయి కదా! లేగలు, తల్లులు కుడిచే పాలుత్రావడం మానేసి, చిన్ని కృష్ణుని యందే ధ్యాస నిలిపి వింటాయి. నదీజలాలు కూడా ఉరకలు వేసే ప్రవాహవేగాన్ని తగ్గించి వేణునాదం వినివెళ్లుదాంలే అన్నట్లు మంద గమనంతో వెళ్లుతున్నాయి. పక్షులు కిలకిలారవాలు మానివేసి, వేణునాదానికి లయబద్ధంగా తమ స్వరాలు కలుపుతున్నాయి" అని. ఇంకొక జాణ ఇలా అంటున్నది: "అడవిలోని కోయకాంతలు, నెమలి ఈకలూ, ఆకులూ మొలకు చుట్టుకొని మధురమైన పండ్లనూ సుగంధ పుష్పాలను మాధవున కర్పించి పరవశించిపోతారట, మీకు తెలుసా?" అంటున్నది. ఇంకొకామె అంటున్నది. : "మురళిగానం వింటూ మోడులు చిగురించడం నీవు చూడలేదా" అని. "ఈ కొండ నూతన వధువులాగ రామకృష్ణుల పాదస్పర్శతో పులకించి పోతుండటం మీరు గమనించలేదటే" అని ఇంకొకామె అడుగుతున్నది. ఈ విధంగా, మనోహరమైన ముచ్చట్లతో బాలకృష్ణుని యందు తమకున్న ప్రేమాతిశయాన్ని వెళ్లబుచ్చుకొంటూ గొల్ల పడుచులు మందనుండి అతని రాకై ఎదురు చూస్తుంటారు.

## గోపికావస్త్రాపహరణము

హేమంత ఋతువు వచ్చినది. శ్రీకృష్ణధ్యాసలోనే రేయింబవళ్లు కాలం వెళ్లబుచ్చుతున్న గోపకన్యలు అతనినే తమకు పతిగా అనుగ్రహింపుమని వారందరూ కాత్యాయనీ వ్రతాన్ని చేపట్టదలిచారు. మార్గశిరమాసమంతా వేకువ జామునే లేచి, కాళిందీనదిలో స్నానం చేసి, ఇసుకతో దేవీమూర్తిని చేసి, సుగంధ పుష్పాలతో అలంకరించి, ధూపదీపనైవేద్యాలతో ఆరాధించి, నైవేద్య ప్రసాదాన్ని ఆరగించి, ఇండ్లకు వేళ్లేవారు. స్నానంచేస్తున్నప్పుడు కూడ శ్రీకృష్ణనామ గానమే చేసేవారు. కాత్యాయనీదేవిని ఇలా ఉపాసించేవారు:

**శ్లో॥ కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి ।**
**నందగోపసుతం దేవి! పతిం మే కురు తే నమః ॥**

(ఆశ్చర్యకరమైన శక్తిశాలినీ, మహాయోగినీ, అధీశ్వరీ! ఓ దేవీ! నీకు నమస్కరిస్తున్నాను. నాకు నందగోపకుమారుని పతిగా అనుగ్రహించు.)

ఒకనాడు ఈ కన్యలందరూ కలసి చెట్టా పట్టాలు వేసుకొని కృష్ణగీతాలు పాడుకొంటూ, సొగసుగా నడుస్తూ యమునా తీరమును చేరుకొని, ఒక నిర్జన స్థలములో కోకలను విడిచి, నదిలోనికి ప్రవేశించి, యవ్వనపు పొంగులు ఉరకలు వేస్తుండగా జలకాలాడసాగారు. ఆ జలక్రీడలలో కూడ వారు శ్రీకృష్ణ లీలల గీతాలనే పాడుకొంటున్నారు. ఆ ఆనందంలో వారు ప్రపంచాన్నే మరచిపోయారు. ఆ నళినాక్షులను చూచాడు నల్లనయ్య. వారు నగ్నముగ నదిలో స్నానం చెయ్యడం అపచారం అని గ్రహించాడు. దానికి ప్రాయశ్చిత్తము చేసుకొనకుంటే ఆ వ్రతఫలము, వారికి దక్కదు. వారికీ విషయము తెలియదుగనుక స్వామి దానికి తగిన ప్రక్రియ తానే చెయ్యదలచుకొన్నాడు. మిత్రులందరినీ పొదలచాటున ఉండుడన్నాడు. తాను చాటుమాటుగా వెళ్లి ఆ వలువలను పట్టుకొని అక్కడే ఒక

కడిమి చెట్టెక్కి కూర్చున్నాడు. స్వామి పాద స్పర్శతో ఆ చెట్టు యొక్క జన్మతరించింది. గోపికలు స్నానం ముగించి వచ్చి బట్టలు కనబడక, నలువైపులాచూచి, కానక మళ్లీ నీటిలో ప్రవేశించారు. కళ్లతో వెతకసాగారు. వారియందు జాలి తలచి, కృష్ణుడు చెట్టుమీది నుంచి ఇలా అన్నాడు. "ఓ అమ్మాయిలారా! మీ బట్టలు నా వద్దనున్నవి. మీరు ఒక్కొక్కరుగాని, అందరూ ఒక్కసారిగాని ఇక్కడికి వచ్చి అడిగితే ఇస్తాను. మీరు ఉపవాసాలు చేసి శుష్కించిపోయారు. నీటిలో ఎక్కువసేపు ఉండలేరు. త్వరగా వచ్చి తీసుకొండి" అన్నాడు. ఏమి చెయ్యాలో తోచలేదు ఆ కన్యలకు. ఇలాగ బ్రతిమాలారు: "ఓ మహాశయా! మా చీరలను హరించి, మా మానముల నెందుకు పోగొడ్తావు? మా మనస్సులను ఎప్పుడో హరించావు కదా! మా సిగ్గునుకూడ దోచుకొనుచున్నావు. ఇంకా ఏమి చేయనున్నావో కొంటె కృష్ణయ్యా! నీ సంగతి మాకు తెలియదనుకొన్నావా? ఇక చాలించు. నీవు చేసిన ఈపని ఏమైనా ఘనకార్యమా! భూమిని ఉద్ధరించడమా! నరసింహామై అసురుని చంపడమా, వామనుడు త్రివిక్రముడుకావడమా? దుష్టులను శిక్షించడమా, బుద్ధి కుశలత చూపడమా? ఏమిటి నీవు చేసిన ఈ ఘనకార్యము, కేవలం కలికితనం కాకపోతే! నీకు వావివరుసలు లేవా? నావారూ పరవారూ అనే వివేకం అక్కరలేదా! కృష్ణా! మా వస్త్రాలు మాకివ్వు. రాచబిడ్డడివైనా నీకు రాచప్రవర్తన తెలిసినట్లులేదే! నీవేమైనా ఈ భూమండలానికి రారాజువా, నీవేమి చేసినా సహించడానికి? మేము నందరాజునకు చెప్తాం ఉండు" అని ఈ విధంగా నయాన, భయాన, విన్నవించుకొంటున్న భామల మాటలు విని భగవంతుడు చిరునవ్వు నవ్వుకొంటూ ఇలా అన్నాడు: "ఓ మానవతులారా! రాజులతో రమణులు మాటాడే తీరేనా ఇది? కొంచెమైనా మొగమాటం లేకుండా నన్ను నిందిస్తున్నారుగాని, మీ తప్పిదాన్ని తెలుసుకోరేమి? మీరు చేసిన నగ్నస్నానం ద్వారా వరుణదేవతకు అపచారం చేసి మీ వ్రతఫలమునకు దూరమయ్యారు. నీటినుండి బైటకు వచ్చి మీ బట్టలను తీసుకొండి" అన్నాడు. బాలకృష్ణుని మాటలకు ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ, కంఠం వరకు నీటమునిగియున్న పడుచులు చలికి వణకిపోతూ ఇలా అన్నారు: "కృష్ణా! నీతో మేము వాదించలేము గాని స్త్రీలు స్నానం చేసే చోటికి పురుషులు ఇలాగ రావచ్చా! వచ్చినా ఇలాంటి తుంటరి పనులు చేస్తారా? ఇలాంటి వింత చర్యలు చెయ్యడం నీకే చెల్లినది. నీవు ధర్మపరుడవు కదా! నీకు తెలియనిదేమున్నది? నిన్ను బ్రతిమాలుతాము. నీవేమి చేయుడన్నా చేస్తాము. నీ దాసులమై యుంటాము. మా కోకలను మాకిచ్చి, మా మానాలను కాపాడు" అని వేడుకొనగా కొంటె కృష్ణుడిలాగ అడిగాడు. "ఓకన్యలారా! ఏ యువకుని భర్తగా కోరి, మీరు ఈ వ్రతాన్ని చేస్తున్నారో నిజం చెప్పండి. మీ మానధనాన్ని అపహరించిన ఆ చోరుడెవడు? నాతో చెప్పడానికి మీకు సిగ్గెందుకు, నేనేమైనా పరాయివాడినా? నాకు దాసులమంటారు మరి, నేను చెప్పినట్లు చెయ్యరేమి? ఇక్కడికి వచ్చి మీ చీరలు తీసుకొండి." అని చిలిపిగ నవ్వుతున్న చిన్ని కృష్ణుని చూచి, ఇతడు మాటవినడు అని తెలిసి, ఏమిచెయ్యాలో తోచక ఒక చేతితో సిగ్గును కప్పుకుంటూ ఇంకొక చేతితో వక్షస్థలాన్ని కప్పుకుంటూ నీటినుండి బైటకు వచ్చారు. వారితో కృష్ణుడిలా అన్నాడు.

**సీ॥ శృంగారవతులార సిగ్గేల? మిముగూడి, పిన్ననాటను గోలె పెరిగినాడ**
**నెరుగనే మీలోన నెప్పుడు నున్నాడ, నేను చూడని మర్మమెద్ది కలదు?**
**వ్రతనిష్ఠలైయుండి వలువలు కట్టక, నీరుసొత్తురె మీరు నియతి తప్పి**
**కాత్యాయనీ దేవిఁ గల్లసేయుట గాక, యిూరీతి నోము వారెందు గలరు?**
**ఆ॥ వ్రతము ఫలము మీకు వలసిన చక్కగ నింతులెల్ల చేతులెత్తి మ్రొక్కి**
**చేరి పుచ్చుకొనుడు చీరలు సిగ్గువో నాడనేల యెగ్గులాడనేల?** 839

"ఓ సుందరీమణులారా! చిన్ననాటినుండీ మీతోనే కలిసిమెలిసి పెరిగిన నా వద్ద మీకు సిగ్గెందుకు? మీలోనే ఎల్లప్పుడూ ఉండే నేను చూడని రహస్యమేదైనా మీలోనున్నదా? వ్రతనిష్ఠలోనున్న మీరు వస్త్రాలు కట్టకుండా నదిలోదిగి నియమభంగం చేశారు కదా, ఇది కాత్యాయనీ దేవిపట్ల అపచారం చేసినట్లుకాదా? ఇలాగెవ్వరైనా నోములు నోచుతారా? మీకు వ్రతఫలం కావాలంటే సిగ్గు విడిచి ఎగ్గులాడకుండా అందరూ రెండుచేతులూ ఎత్తి నాకు నమస్కారం చెయ్యండి."

అని కృష్ణుడు చెప్పగా, వ్రతభంగం నుండి తమను కృష్ణుడు కాపాడడానికే ఈ విధమైన ప్రాయశ్చిత్తకర్మను తమచే చేయిస్తున్నాడని తెలుసుకొన్నారు. స్మరణ మాత్రం చేత సర్వదోషాలూ, అపచారాలూ పరిహరించగల పరమేశ్వరుని ఎదుట ఇక దాచుకోవలసినదేమున్నదని గ్రహించారు. ఎవరినైతే పతిగా పొందాలని ఈ వ్రతం చేస్తున్నారో ఆ దివ్యసుందరమూర్తియే సాక్షాత్తూ తమ ఎదుటనుండగా ఇక సంకోచించడమెందుకు అనుకొన్నారు. భగవంతునకు భక్తునికి మధ్యను దేహధ్యాస ఒక అడ్డు తెరగా ఉంటున్నది కనుక దానిని తొలగించి సంపూర్ణ శరణాగతిని కలుగజేయాలని స్వామి సంకల్పము. ఆ ప్రకారమే జరిగినది. రెండు చేతులూ ఎత్తి నుదుటిపై జోడించి, వంగి, మైమరచి, కన్యలు వందనం చేశారు. నతజనవత్సలుడైన స్వామి ఆ సుందరీమణుల చీరలనిచ్చివేయగా, వారు వాటిని ధరించి, కృతజ్ఞతతో, ప్రేమపారవశ్యముతో స్వామిని కన్నులార్పకుండా వీక్షిస్తుంటే, ఆనవనీతచోరుడు వారితో ఇలా అన్నాడు: "ఓ శుభాంగులారా! సిగ్గుచేత మీరు చెప్పలేకపోయినా, మీ మనస్సులలోని మర్మం నాకు తెలియదనుకొన్నారా? మీ నోములన్నీ ఫలిస్తాయి. నన్నారాధించే వారికి మోక్షమే లభిస్తుందికదా, ఇతర కోరికలు ఈడేరకుండా ఉంటాయా? మీరు చేస్తున్న అంబికావ్రతం పూర్తి అయిన తరువాత నన్ను మీరు పొందగలరు" అని చెప్పిన స్వామి పాదాలను మదిలో ధ్యానించుకొంటూ ఆనంద పరవశలై గోపికలు వెళ్లిపోయారు.

## విప్రపత్నులభక్తి

అది తీవ్రమైన వేసవి దినము. ఆనాడు ఎవ్వరూ అన్నము తెచ్చుకొనలేదని తెలిసినప్పటికీ, కృష్ణుడు అందరినీ దూరంగా తీసుకొనిళ్లాడు. బలరాముడు, శ్రీదాముడు, దేవప్రస్థుడు, విశాలుడు మొదలైన వారంతా ఎండతాపానికి తట్టుకొనలేక చెట్లనీడకు చేరారు. అక్కడినుండి పశువులను తోలుకొని యమునకు వెళ్లారు. అందరూ నీరు త్రాగారు. అలసిపోయారు. ఆకలివేస్తుందన్నారు. స్వామిలీలలు ఎవ్వరికీ అర్థంకావు. అంతదూరం అందరినీ ఎందుకు తీసుకొనివెళ్లాడో తెలియదు. మిత్రులను పిలిచి "ఇక్కడికి దగ్గరలోనే కొందరు బ్రాహ్మణులు అంగీరసమనే ఒక సత్రయాగం చేస్తున్నారు. అక్కడికిపోయి నా పేరు, అన్నగారి పేరూ చెప్పి అన్నము పెట్టుడని సవినయంగా అడగండి." అని వారిని పంపించాడు. వారంతా యాగ క్షేత్రానికి వెళ్లి, బ్రాహ్మణులకు నమస్కరించి ఇలా అన్నారు: "అయ్యలారా! కృష్ణుడూ, బలరాముడూ అలసిపోయి వచ్చి ఇక్కడ దగ్గరలోనే విశ్రమిస్తున్నారు. అన్నమును అర్థింపుడని మమ్మల్ని మీ వద్దకు పంపించారు. మా ఆకలి బాధను నివారింపుడని ప్రార్థిస్తున్నాము. యజ్ఞము ముగియకుండా ఇతరులకేమీ పెట్టరాదనే నియమము ఒక్క సౌత్రామణి యాగానికే వర్తిస్తుంది గాని ఇతర యజ్ఞాలలో ఈ పట్టింపు ఉండదని కృష్ణుడు చెప్పాడు" అని ఆ బాలురు చెప్పారు. ఆ బ్రాహ్మణులు క్షుద్రమైన స్వర్గప్రాప్తిని కాంక్షించి, ఈ యజ్ఞము చేస్తున్నారు గాని సర్వలోక మహేశ్వరుడూ సమస్త యజ్ఞ వేదపురుషుడూ అయిన ఆ శ్రీమన్నారాయణుడే ఈ శ్రీకృష్ణుడు అని తెలుసుకోలేనివారై కోరివచ్చిన సౌభాగ్యాన్ని కాలదన్నుకొన్నారు. గొల్లపిల్లల్ని పొమ్మన్నారు. ఆ పిల్లలు నిరాశచెంది, తిరిగివచ్చి కృష్ణునితో చెప్పుకొన్నారు. ఆదయామయుడు అందరి అంతరంగమూ తెలిసి యున్నవాడు గనుక వారితో ఇలా అన్నాడు: "మిత్రులారా! ఆ బ్రాహ్మణులను వారి వారి కర్మలకు విడిచిపెట్టి యజ్ఞశాల వెనుకనున్నశాలలలో బ్రాహ్మణపత్నులుంటారు, ఆ అమ్మలకు మా రాకను తెలియజేసి, ఆహారాన్ని అర్థించండి." అని చెప్పి పంపించాడు. బాలకులు పోయి, ఆ ధర్మపత్నులతో ఇలాగ చెప్పారు: "అమ్మలారా! శ్రీకృష్ణుడు, బలరాముడు ఈ చేరువలోనే ఆకలితో విశ్రమిస్తున్నారు. మిమ్మల్ని అడిగి అన్నము పెట్టించుకొని రమ్మని మమ్మల్ని పంపించారు." అని చెప్పగానే కృష్ణనామం చెవులకు సోకగానే ఆ పుణ్యసతులు పులకించిపోయారు. ఆ నందనందనుని కన్నులారా సందర్శించే భాగ్యము, అతనికి అన్నము పెట్టే అదృష్టము కలిగినందుకు సంభ్రమానందాలు ఉప్పొంగగా, ఆ కాంతలు నైవేద్యానికి సిద్ధము చేయబడిన వంటకాలనుంచి కొద్ది కొద్దిగా తీసి పాత్రలలో పెట్టుకొని సాగరాన్ని చేరడానికి ఉరకలు వేసే నదీమతల్లులలాగా ఆ బాలుర వెంట బయలుదేరారు. వారి భర్తలు, సోదరులు, పుత్రులు వారించి అడ్డం వచ్చినా లక్ష్యపెట్టక వారు వెళ్లిపోయారు.

శ్రీకృష్ణుడు కాళిందీ నదీతీరాన అశోకవృక్షం క్రింద వయ్యారంగా ఒక మిత్రుని భుజంమీద చేతిని ఆన్చి రెండవ చేత్తో ఒక పద్మాన్ని విలాసంగా త్రిప్పుతూ చెవులలో కలువ పువ్వుదోపుకొని పీతాంబరమూ పట్టుదట్టీ ధరించి, నెమలికన్నును తలలో తురుముకొని వనమాలను ధరించి సొగసుకన్నులతో తన భక్తులరాకకై ఎదురు చూస్తున్నట్టు నిల్చున్నాడు.

శ్రీకృష్ణునిసుందరవిగ్రహదివ్యలీలావైభవాల గురించి వినియున్న విప్రపత్నులు అతనియందు భక్తి ప్రపత్తులను పెంచుకొని హృదయంలో పదిలపరచుకొన్నారు. వినడమేగాని చూచి యుండని ఆ భక్తులకు తమ మోహనకృష్ణుని ఇప్పుడు కన్నులారా కాంచే అదృష్టం లభించినది. ఆ కాంతలు తమ పూర్వ పుణ్యవిశేషములచే ఆ భువన మోహన నటవర నాగరుని కన్నుల కరువుతీరా కాంచినారు. అలాగ చూచి చూచి, ఆ దివ్యసుందర మూర్తిని తమనయన ద్వారాల ద్వారాలోనికి ప్రవేశపెట్టి తమ హృదయ మందిరాల్లో ప్రతిష్ఠింపజేసుకొని, అక్కడ స్వామి సాయుజ్యాన్ని పొందారు ఆ ధన్యవనితలు. ఆ విధంగా తమ సర్వస్వాన్నీ సమర్పించి, జన్మసార్థకం చేసుకొన్న ఆ ద్విజాంగనల ఆంతర్యాన్ని గ్రహించిన ఆ సర్వాంతర్యామి చిరునవ్వు చిందిస్తూ ఇలా అన్నాడు. "ఓ కాంతామణులారా! ఎంతో వేడుకతో మీరు మాదర్శనానికి వచ్చారు సంతోషం. మీలాగానే జ్ఞానులు కూడ ఎలాంటి కాంక్షలూ లేనివారై నన్ను ఆశ్రయించి సేవిస్తారు. నా అనుగ్రహం పొందుతారు. మీగురించి మేము ఏమి చెయ్యాలో చెప్పండి. గృహస్థులైన మీ పతులు, మీతోకూడి యాగాన్ని సంపూర్ణంగా నిర్వహించాలి కనుక మీరు యజ్ఞ వాటికకు మరలిపొండి" అని చెప్పిన కృష్ణునితో ఆ రమణులంతా ఇలా అన్నారు: "మాధవా! మాతో ఇలాంటి దయలేని మాటలాడడం నీకు తగునా? మా పతులు, పితలు, సుతులు, సోదరులు, అందరూ వారిస్తున్నా వినకుండా నీ చరణాల చెంతకు వచ్చి చేరినాము కదా! మేము తిరిగివేళ్తే వాళ్లు మమ్మల్ని చేరన్విరు. కృష్ణా! మేము నీ సేవ చేసుకొంటూ ఉంటాము. నీ దాసీజనంగా మమ్మల్ని స్వీకరించుమయ్యా!" అని దీనంగా వేడుకొంటున్న వనితలతో విభుడు ఇలా అన్నాడు: "అమ్మలారా! మీరు నా చెంతకు వచ్చారని మీ వాళ్లెవ్వరూ కోపగించుకొనరు, గౌరవిస్తారు. మిమ్మల్ని దేవతలు కూడ మెచ్చుకొంటారు. నా సాంగత్యము మనుష్యులకు శారీరిక సౌఖ్యాన్ని కలిగించేది కాదు, అది ముక్తి ప్రదాయకము. నన్నుగూర్చి వినుచుండుట చూచుచుండుట, కీర్తించుచుండుట, ధ్యానించు చుండుట వలన మీకు కర్మబంధాలు, దేహాధ్యాసలు వీడిపోతాయి. మీ మనస్సులను నాయందు లగ్నము చేసినట్లయితే మీరు నన్ను తప్పకుండా చేరుకొంటారు." అని అభయమిచ్చి విప్రపత్నులు తెచ్చిన భక్ష్యాలను స్వామి తన మిత్రులతోగూడి ప్రీతితో నారగించాడు.

శ్రీకృష్ణుని ఆదేశము ప్రకారము యజ్ఞశాలకు తిరిగి వచ్చిన విప్రపత్నులను వారి మగవారు సగౌరముగానే ఆదరించారు. యజ్ఞము సక్రమముగానే ముగిసినది. విప్రపత్నులలో నొకామెను మిగిలిన స్త్రీలతో కలిసి కృష్ణుని వద్దకు వెళ్లనివ్వకుండా ఆమె భర్త నిర్బంధించి ఉంచేశాడు. ఆమెకు కృష్ణునిపై అందరికంటె భక్తి మెండు. కాని కదలలేకపోవుటచేత, ఆమె శ్రీకృష్ణునిపై ధ్యానము నిలిపి ప్రాణము విడిచి మోక్షము పొందినది.

యజ్ఞము ముగిసిన తరువాత బ్రాహ్మణులు తమ ప్రవర్తనకు, బుద్ధిహీనతకు సిగ్గుజెంది, పశ్చాత్తప్తులై బాధపడ్డారు. సర్వేశ్వరుడే మానవుడై వచ్చి అన్నము పెట్టుమని అడిగితే పెట్టనివ్వని తమ అవివేకాన్ని నిందించుకొన్నారు. తమ స్త్రీలకున్న పాటి భక్తి శ్రద్ధలు తమకు లేకపోయినవి కదా అని చింతించారు. "ఓ పరమేశ్వరా! మేము కపటులము, కల్మషచిత్తులము, విష్ణుభక్తిలేని మా వంటి వారి ప్రాజ్ఞత లెందుకు? మంట కల్పనా! మేము చేసిన జపతపో యజ్ఞాది కర్మలు, తీర్థయాత్రలు అన్నీ వ్యర్థములే. ఇవేవీ చేయని మా కాంతలు నీయొక్క అనుగ్రహం పొందగలిగారు. ఈ భూమిని రక్షించడానికి జన్మించిన సర్వేశ్వరుడవైన నిన్ను మా తప్పిదాన్ని మన్నించు మని ప్రార్థిస్తున్నాము." అని మనస్సులో ప్రార్థించుకొన్నారు ఆ బ్రాహ్మణులు.

# ఇంద్ర గర్వభంగము

నందాదులు ఏదో కార్యము చేయబూని చాలా ఉత్సాహముతో ఏర్పాట్లు చేస్తుండడం చూచి, ఈ ఏర్పాట్లన్నీ దేనినిగురించి చేస్తున్నారని శ్రీకృష్ణుడు నందుని ప్రశ్నించాడు. అప్పుడు నందుడిలా చెప్పాడు: "కుమారా! ఈ ఏర్పాట్లన్నీ ఇంద్రయాగం చెయ్యడానికి జరుగుతున్నవి. ఇంద్రుడు వర్షాధిదేవతకదా! సకలజీవులకూ జలము అత్యవసరము. పంటలకూ, పచ్చికలకూ ఆ జలమే ఆధారము. పచ్చికలవలన పశువులూ, పంటలవలన మనుష్యులు వర్ధిల్లుతారు. పాడిపంటలు సమృద్ధిగానుంటే నరులూ సురలూ కూడా సుఖసంతోషాలతోనుంటారు. అందుచేత ఇంద్రుని మెప్పించడానికి ఈ ఇంద్రయాగం చెయ్యడం తరతరాలుగా వస్తున్న ఆచారము" అని చెప్పగా, ఈ మనుష్యులంతా ఒక మూఢవిశ్వాసముతో పూర్వాచారాన్ని అనుసరించి చేస్తున్నందున వీరికి యథార్థస్థితిని తెలియజేయాలనీ, అహంకారముతో మిడిసిపడుతున్న ఇంద్రుని యొక్క గర్వాన్ని అణచాలనీ స్వామిసంకల్పించి, అక్కడ ఉన్న పెద్దలందరికీ అర్థం అయేలాగా ఇలా చెప్పాడు: "అయ్యలారా! ఇంద్రుడు, వరుణుడు మొదలైన దేవతలందరూ తమతమ విధులను నిర్వహించడానికి భగవంతునిచే నియమింపబడిన కార్యకర్తలు. వారి శక్తియుక్తులన్నీ, వారికి ఆ సర్వేశ్వరుని నుండి సంక్రమించినవే. స్వతహాగా వారు స్వతంత్రులు కారు. ఇంద్రుడు వర్షాన్నివ్వలేడు, దానిని ఆపలేడు.

క॥ **కర్మమునఁబుట్టు జంతువు, కర్మమునన్ వృద్ధిఁబొందు కర్మమునఁ జెడున్**
**గర్మమె జనులకు దేవత, కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!** 882

మహారాజా! జీవులు తమతమ పూర్వ కర్మల చేతనే పుట్టి, కర్మచేతనే వృద్ధిచెంది, కర్మచేతనేలయిస్తారు. అందుచేత కర్మమే జనులకు దేవత, కర్మమే సుఖదుఃఖాలకు కారణము. కర్మయే చేయనినాడు ఇంద్రుడు కాదుకదా, ఈశ్వరుడైనా ఫలితాన్నివ్వలేడు. కర్మయే ఫలితాన్ని తెచ్చిపెడుతుంది. ఇందులో ఇంద్రుని ప్రమేయమేమీ లేదు. అందుచేత ఇంద్రునకు భయపడి, అతనిని మెప్పించడానికై ఏ యాగమూ చేయనవసరం లేదు. జీవుడు తన కర్మానుగుణమైన దేహాలను పొందుతూ, విడుస్తుంటాడు. తన స్వభావానుగుణమైన కర్మనే ఆచరిస్తాడు. అతనికి కర్మమే దైవతం గనుక కర్మనే ఆరాధించాలి. బ్రాహ్మణునకు, వైదిక - అధ్యయన కర్మలు స్వాభావికాలు. క్షత్రియునకు రక్షణ, వైశ్యునకు కృషి గోరక్షణ వాణిజ్యాలు, శూద్రునకు సేవ స్వాభావిక కర్మలు. సత్త్వ రజస్తమో గుణాలవలన సృష్టి స్థితి లయాలు సంభవిస్తాయి. రజోగుణంచేత జగత్తు పుడుతుంది. మేఘాలు వర్షిస్తాయి. కాని ఇంద్రుని అనుగ్రహం వలన కాదు. అందుచేత ఇంద్రునకు ప్రీతి కలిగించాలని మనం ఈ యాగం చేయనవసరం లేదు. దానికి బదులుగా మన జీవనాధారాలైన పశువులకు, వాటికి జీవనాధారమైన గోవర్ధనగిరికి, అందరిహితాన్ని కోరే బ్రాహ్మణులకూ సంతుష్టిని కలిగించే యజ్ఞాలను చేయడం ఉత్తమం. కనుక ఇంద్రయాగానికి తెప్పించదలచుకొన్న సామాగ్రినంతా తెప్పించండి, హోమాలు చేయించండి, పాయసం, పిండి వంటలు వండించండి. బ్రాహ్మణులకు, గోదాన దక్షిణలతోసహా సంతుష్టిని కలిగించే భోజనాలు పెట్టించండి. అచంచల భక్తి విశ్వాసాలతో గోవర్ధన గిరిని ఆరాధించండి. దీనులకు అనాథలకు భోజనాలు పెట్టండి. కుక్కలు మొదలైన గ్రామ జీవాలకు భక్ష్యాలు తినిపించండి. మీరంతా చందనం పూసుకొని, ఆభరణాలను, నూతన వస్త్రాలను ధరించి, ఇష్ట భోజ్యాలను ప్రీతితో ఆరగించి, వేడుకలతో గిరికీ, గోవులకు బ్రాహ్మణులకు అగ్నిహోత్రానికీ నమస్కారాలు చెయ్యండి. మీ జన్మ ధన్యమౌతుంది." అని శ్రీకృష్ణుడు చెప్పగా, నందాది గోపముఖ్యులు బాగుబాగు అన్నారు. కృష్ణుడు చెప్పిన విధంగానే అన్నీ జరిపించారు. స్వామి గోపాల బాలకృష్ణునిగా గొల్లల మధ్యను మెలుగుతూ, పూజలు, ప్రదక్షిణలలో పాల్గొంటూ కూడ తాను పర్వతస్వరూపములో అవహించి పూజలను నైవేద్యాలను అందుకొని, కృష్ణునిగా నమస్కరిస్తూ, పర్వతాధి దేవతా స్వరూపములో ఆపూజలను, నమస్కారాలను తానే అందుకొనే వాడు. నైవేద్యాల నారగించేవాడు. గోపాలకులందరూ గోపాలకృష్ణునితోకూడి గిరికి పూజలు అర్చనలు చేస్తూ ఆలమందలను ముందు నడిపిస్తూ, బ్రాహ్మణులు మంత్రస్తుతులను చేస్తుండగా

పర్వతానికి ప్రదక్షిణలు చేశారు. స్త్రీలు బండ్లలో వెళ్లుతూ గోపాల కృష్ణుని లీలాగానాలు చేశారు. యాగం సమాప్తం చేసి అందరూ ఇళ్లు చేరారు.

దేవేంద్రుడు అంతా తెలుసుకొన్నాడు. క్రోధావేశపరవశుడయ్యాడు. ప్రళయంకరములైన సంవర్తకములు అనబడే మేఘగణాన్ని రప్పించి, ఇలా అన్నాడు. "ఈ గొల్లలు, పాలు, పెరుగు నెయ్యి, త్రాగి మదించి భయభక్తులు వీడినారు. మానవమాత్రుడైన ఒక డింభకుని మాటలు విని, దేవతల్నే అవమానిస్తున్నారు. వజ్రాయుధంతో పర్వతాల రెక్కల్నే ముక్కలు చేసిన నన్నే ధిక్కరించి, కొండకు పూజచేసి వెళ్లి పోయిన ఈ మూర్ఖులకు బుద్ధిచెప్పాలి. కొండలూ అడవుల్లో తిరుగుతూ, గురువూ, గుణమూ, ప్రభువూ, దైవము ఎరుగని ఆ అర్భకుడైన కృష్ణుని మాటలు విని, ఈ వెర్రి గొల్లలు నన్ను అలక్ష్యం చేశారు. మీరు వెళ్లి, ఉరుములు మెరుపులు, రాళ్ల వానలతో ఆ గొల్లల సంపదనంతా ధ్వంసము చేసి, వాళ్లను అంతము చెయ్యండి. నేను ఐరావతం మీద వచ్చి చూస్తుంటాను. దేవతలు కూడ నా వెంట వస్తారు." అని ఆజ్ఞాపించి, సంవర్తక మేఘాల సంకెళ్లు తొలగించాడు.

ఆ మేఘాలు, పెనుగాలులతో విజృంభించి, బృందావనమంతా ఆవరించాయి. కారుచీకట్లు క్రమ్మినవి, ఉరుములు మెరుపులతో పిడుగులు పడినవి. రాళ్లవంటి వడగళ్లు నిర్విరామంగా వర్షించినవి. ఏనుగుతొండాలవంటి ధారలతో కుంభవృష్టి కురిసినది. అంతా జలమయం అయినది. తలదాచుకోడానికైనా చోటు లేకుండా పోయినది. అంతా అస్తవ్యస్తమై పోయినది. భీభత్సంగానున్నది. పశువులు హడిలిపోయి చిందరవందరగా పరుగెత్తుతున్నవి. అంబా అని ఆర్తనాదం చేస్తున్నాయి. గోపమ్మలూ, గొల్లలూ, పిల్లలు అందరూ శ్రీకృష్ణుని చెంతకు చేరి ఇలా మొరపెట్టుకొన్నారు. "కృష్ణా! దయామయా! చూస్తున్నావుకదా! ఈ ఉపద్రవం. ఇంతకు ముందెన్నడూ మేము చూచియుండలేదు ఇలాంటి జలప్రళయం. ఇది ఇంద్రుని కోపోద్రేకఫలము. దీనినుండి రక్షించడానికి నీవు తప్ప మాకు ఇంకెవ్వరున్నారు? ప్రభూ! రక్షించు, రక్షించు" అని ప్రార్థించారు. ఇది అంతా ఆ ఇంద్రుని ప్రతీకార చేష్ట అని స్వామికి తెలుసు. అధికారాహంకారములతో మిడిసిపడుతున్న ఇంద్రుని గర్వం అణచాలనీ, తనను ఆశ్రయించిన బృందావనవాసుల్ని రక్షించాలనీ సంకల్పించిన స్వామి ఇలా అన్నాడు: "మీరెవ్వరూ భయపడనవసరం లేదు. అందరూ మీ గోవులను, వస్తువులనూ తీసుకొనివచ్చి ఇక్కడ చేరండి ఆ పరమేశ్వరుడు మిమ్మల్ని రక్షిస్తాడు" అని చెప్పి, ఆదివరాహమూర్తియై అవనిని పైకెత్తిన అచ్యుతుడు ఏనుగు తామర మొగ్గను పైకెత్తునంత సులువుగ ఆట పిల్లలు పుట్టగొడుగును పైకెత్తి పట్టుకొన్నంత లీలగ గోవర్ధన గిరిని ఒక చేతితో ఎత్తి పట్టుకొన్నాడు. అందరినీ, ఆ గొడుగువంటి గిరి క్రిందకు రమ్మనాడు. కొందరు సంకోచించడం చూచి ఇలా అన్నాడు:

**శా॥ బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా**
**జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపగా బోల దీ**
**శైలాంభోనిధి జంతు సంయుతధరాచక్రంబు పైఁబడ్డ నా**
**కేలల్లాడదు బంధులార! నిలుడీ క్రిందన్ ప్రమోదంబునన్.** 918

"బంధుజనులారా! ఈ క్రిందికి రండి. "ఇతడు చూడగా ఇంత చిన్న బాలుడు, ఈ కొండ చూస్తే ఎంతో పెద్దది. ఈ మహాభారాన్ని భరించగలడా?" అని శంకించవద్దు. పర్వతాలు, సముద్రాలు, జంతు, జీవరాసులన్నిటితో కూడియున్న ఈ భూమండలమంతా వచ్చి పైబడినా నా చెయ్యి చలించదు. నిర్భయంగా మీరంతా ఈ క్రిందికి వచ్చి సుఖంగా నుండవచ్చు. రండి, రండి త్వరపడండి" అని అభయమిచ్చిన శ్రీకృష్ణునియందు పరిపూర్ణ విశ్వాసముంచి, అందరూ తమతమ గోవులతో, వస్తువులతో గోవర్ధన గిరి క్రిందికి వచ్చి, అనువైన స్థలాలు చూచుకొని నిర్భయులై, ఆకలి దప్పులు లేనివారై, తమకు ప్రియతముడైన గోపాలకృష్ణుని లీలావైభవ గాథలను పాడుకొంటూ ఆనందంగా కాలం గడిపివేశారు. ఆ గోవర్ధనగిరి అనే గొడుగునకు స్వామియొక్క హస్తమే కర్ర, జారుతున్న జలధారలే ముత్యాలసరులు. గోపికల చిలిపి కన్నులూ, చిరునవ్వులే రత్నాల వెలుగులు.

ఏడు పగళ్లు, ఏడు రాత్రులూ ఎడతెరిపి లేకుండా అలాగే వర్షం కురిసినది. గొల్లలెవ్వరూ ఏ విధంగానూ బాధపడ్తున్నట్లు ఇంద్రునికి గోచరించలేదు. శ్రీహరి అలాగే అహోరాత్రాలు ఆ పర్వతాన్ని ఎత్తిపట్టుకొన్నాడు. ఇంద్రుడు విస్మయం చెందాడు. ఇంక ఏమి చెయ్యాలో ఇంద్రునకు తోచలేదు. విసుగుజెంది తన ప్రయత్నాన్ని విరమించాడు. తన వ్యూహం వమ్ము అయినందుకు ఖిన్నుడైనాడు. వాన వెలిసినది. గగనమండలం తేజోమయం అయినది. అప్పుడు గిరిధరగోపాలుడు అందరినీ తమతమ సామగ్రితో వెలుపలకు వెళ్లిపొమ్మనాడు. కొండను యాథాస్థానములోనుంచి, ఏమీ జరగనట్లు ఏమీ తెలియని అమాయకునిలాగా నిల్చున్నాడు. గోపాలురు, పెద్దలు బాలకృష్ణుని ఆశీర్వదించారు. గోపమ్మలు ఆలింగనం చేసుకొన్నారు. ముత్తయిదువులు అక్షతలు చల్లి ఆశీర్వదించారు. నందుడు, బలరాముడు, యశోదా రోహిణులు కౌగలించుకొని ముద్దాడి, ఆశీస్సులు చెప్పారు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. గంధర్వులు గానము చేశారు. శంఖనాదాలు చేశారు. అందరూ గోవర్ధనగిరి వద్దనుండి తరలి వెళ్లి, గ్రామానికి చేరుకొన్నారు.

గోపాలకులంతా శ్రీకృష్ణుని అద్భుతచర్యల్నీ, లీలావిలాసగాథల్నీ స్మరించుకొంటూ, నందునితో ఇలా అన్నారు.

**సీ॥ కన్నులు తెరవని కడుచిన్న పాపడై, దానవిచనుఁ బాలు ద్రావి చంపె**
**మూడవనెలనాడు ముద్దులబాలుడై, కోపించి శకటంబు కూలదన్నె**
**ఏడాది కుఱ్ఱడై యెగసి తృణావర్తు, మెడ పట్టుకొని కూల్చి మృతునిఁ జేసె**
**తల్లి వెన్నలకునై తను రోల కట్టిన, కొమరుడై మద్దులఁ గూలనీడ్చెఁ**
**తే॥ బసులఁగ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె వెలగతో వత్సదైత్యుని వ్రేసి చంపె**
**సబలుడై ఖరదైత్యుని సంహరించె నితడు కేవల మనుజుఁడే యెంచిచూడ? 928**

ఇంతేకాదు బలరామునిచే ప్రలంబాసురుని చంపించాడు. దారుణమైన దావాగ్నిని మ్రింగివేశాడు. భయంకర విషసర్పమైన కాళియుని అణగద్రొక్కి వానిని కాళింది మడుగునుండి సముద్రానికి తరిమివేశాడు. "ఏడేండ్ల బాలుడెక్కడ, మనమందరమూ చూస్తుండగనే పర్వతాన్ని ఒక్క చేతితో ఎత్తిపట్టుకొని ఏడు అహోరాత్రాలు నిలిపి ఉంచడమెక్కడ? ఆశ్చర్యం కాదూ? ఓ నందరాజా! నీ కొడుకు మానవ మాత్రుడు కాడు సుమా! అనిన విని, పూర్వము తనకు గర్గమహాముని చెప్పిన రహస్యం గుర్తునకు తెచ్చుకొని నందుడిలా అన్నాడు: "నిజమే, ఈ కృష్ణుడు సామాన్యబాలుడు కాడు. నారాయణాంశతో జన్మించిన వాడని నేను విన్నాను." అనగానే అందరూ ఆశ్చర్యపోయారు.

గోవర్ధనగిరిని ఏడు రోజులు ఒక్క చేతితో కదలకుండా ఎత్తి పట్టుకొనగలగిన వాడు సామాన్యమానవ బాలుడు కాడనీ, స్వయముగ భగవానుడే అనీ, అతడు ఈ విధంగా తనకు బుద్ధి చెప్పాడనీ ఇంద్రుడు గ్రహించాడు. సిగ్గుపడి అహంకారము విడిచి, కామధేనువును తోడ్కొనివచ్చి శ్రీకృష్ణుని సందర్శించి, పాదాలకు నమస్కరించి, ఇలాగ స్తుతించాడు:

"ఓ పరమ పురుషా! నీవు జగత్పతివి, గురుడవు, తండ్రివి. పాలించే ప్రభువుననే అహంకారముతో ప్రవర్తించే నావంటి మూర్ఖులను శిక్షించే ఈశ్వరుడవు నీవు.

**ఆ॥ వాసుదేవ కృష్ణ వరద స్వతంత్ర విజ్ఞాన మయ మహాత్మ సర్వపుణ్య**
**పురుష నిఖిలబీజభూతాత్మక బ్రహ్మ నీకు వందనంబు నిష్కలంక. 939**

ఓ సర్వేశ్వరా! నీ సామర్థ్యం తెలుసుకొనలేక తీరని అపచారం చేశాను. నన్ను క్షమించి, కరుణ జూపు. నిన్ను బ్రహ్మాదులే ఎరుగలేరు కదా. నేనెంతవానిని? ప్రభూ!" అని ఇంకా, అనేక విధాలస్తుతించగా, వాసుదేవుడిలా అన్నాడు: "దేవేంద్రా! నీలో అధికార - ఐశ్వర్య గర్వ - అహంకారాలు బాగా పెరిగియుండడం చేత వాటిని తొలగించాలని ఈ ఇంద్రయాగాన్ని నిలుపుచేశాను. సంపదలచే మదించినవారు సర్వేశ్వరుని మరచిపోతారు. అందుచేత నేనెవ్వరిని

అనుగ్రహించదలచుతానో వారిని ధనహీనులుగ చేస్తాను. ఇంద్రాధిపత్యం వలన గర్వించకు. నీవిధులను సక్రమంగా నిర్వర్తించుకొనుము." అని చెప్పాడు. అప్పుడు కామధేనువు వచ్చి స్వామిని ఇలాస్తుతించినది:

క॥ విశ్వేశ విశ్వభావన విశ్వాకృతి యోగివంద్య విను నీచేతన్
శాశ్వతుల మైతిమిప్పుడు శాశ్వతముగఁ గంటి మధిక సౌఖ్యంబు హరీ. 946

దేవా! నీవు మాకు పరమదైవతమవు. మా గోజాతికి పూజలు చేయించి మాకు శాశ్వతమైన కీర్తిస్థానాన్నిచ్చావు. నీవే మాకు ప్రభువుడవు ధేనువులు, బ్రాహ్మణులు, సాధువులు, దేవతలు, వీరియొక్క శ్రేయస్సును చేకూర్చు ప్రభువుగా నీకు పట్టము గట్టుమని బ్రహ్మదేవుడు నన్ను ఆదేశించి పంపినాడు. నీవు ఈ భూభారాన్ని నివారించడానికి అవతరించిన శ్రీహరివి. నీకు నమస్కారములు" అని చెప్పినది. దేవమాత అదితితోను, మునీశ్వరులతోను కలిసి, ఇంద్రుడు కామధేను విచ్చిన క్షీరముతోను, ఐరావతం తెచ్చిన మందాకినీ జలములతోను, స్వామికి అభిషేకం చేశాడు. నారద తుంబుర సిద్ధచారణ గంధర్వాదులు విష్ణుగాథలను గానం చేశారు. దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. అప్సరసలు నాట్యం చేశారు. లోకాలు జయజయ హర్షధ్వానాలు చేశాయి. ఆవులు ఆనందంతో పరవశించి పొదుగులు పట్టలేక పాలుకురిపించాయి. నదులు నీటితో ఉప్పొంగి పోయాయి. పుష్పాలు మకరందం వర్షించాయి. వృక్షాలు ఫలపుష్పాలతో తలలు వంచి, స్వామికి వందనమాచరించాయి. ఆనాటినుండి శ్రీకృష్ణునకు గోవిందుడు అనే నామము కూడ సార్థకం అయినది. దేవేంద్రుడు దేవ, ఋషి గణాలతో వందనాలు చేసి వెళ్లిపోయాడు.

## నందరక్షణము

ఒకనాడు ఏకాదశి పుణ్యదినాన నందరాజు ఉపవాసం ఉండి అర్ధరాత్రివేళ విష్ణుపూజ చేసి అది అసుర సమయం అని గమనించక, ద్వాదశీ స్నానము చెయ్యడానికి యమునా నదిలో దిగినాడు. అప్పుడు వరుణుని భృత్యుడైన అసురుడొకడు నందరాజును పట్టుకొని వరుణ పట్టణానికి వెళ్లిపోయాడు. నందుని వెంటవచ్చిన వారు అతనిని గానక బలరామకృష్ణులను పిలుచుకొని వచ్చారు. కృష్ణుడు విషయాన్ని గ్రహించి వరుణలోకానికి వెళ్లాడు. కృష్ణుని రాకకు వరుణుడు అమితానంద భరితుడై స్వామిని ఆహ్వానించి, పూజించి ఇలా స్తుతించాడు.

ఉ॥ ఏ విభుపాదపద్మరతులెన్నడు నెవ్వరు పొందలేని సెం
ద్రోవ చరింతురట్టి బుధతోషక! నీవరుదెంచుటన్ ప్రమో
దావృత మయ్యెఁ జిత్తము కృతార్థతనొందె మనోరథంబునీ
సేవఁబవిత్ర భావమును జెందె శరీరము నేడు మాధవా. 954
ఉ॥ ఏ పరమేశ్వరున్ జగము లన్నిటిఁ గప్పిన మాయ కప్పగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకును
దీపిత భద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదార తపోధన చక్రవర్తికిన్. 956

సజ్జనరంజకుడవైన ఓ ప్రభూ! నీ పాదపద్మాలయందు ప్రీతిగలవారు ఉత్తమ గతినే పొందుతారు కదా! ఓ మాధవా! నీరాకచే నా చిత్తము ఆనందమయమైపోయినది, నా కోరికలన్నీతీరినవి. నీ సేవతో నా శరీరము పునీతమైనది. ఓ తపోధన చక్రవర్తీ! సర్వజగాలనూ ఆవరించియున్న మాయ, నిన్ను ఆవరించలేక నీకు అధీనమై యుంటుంది కదా! ఓ సజ్జన రక్షకా! భద్రమూర్తీ! నా సకల తాపాలను హరింపజేయుమని మ్రొక్కుతున్నాను. ఓ పరమేశ్వరా! నీవు సర్వాంగ సుందర దివ్యతేజో విరాజిత మంగళ మూర్తివి. సాధు సజ్జనుల మానస సార్వభౌముడవు. పితృభక్తిపరాయణుడవు. నా భృత్యుడు తెలియక నీ తండ్రిని ఇక్కడికి తీసుకొనివచ్చాడు. మావలన జరిగిన అపరాధాన్ని మన్నించి మమ్మల్ని రక్షించు. మీ జనకుని తీసుకొనివెళ్లు. మమ్మల్ని క్షమించు." అని వేడుకొన్న వరుణుని కరుణించి క్షమించాడు.

తరువాత శ్రీకృష్ణుడు తండ్రిని తోడ్కొని నది ఒడ్డునకు చేరుకొనగానే వారి రాక గురించి వెయ్యికళ్లతో ఎదురు చూస్తున్న గోపాలురందరూ సంతోషముతో గంతులు వేశారు.

## పరంధామదర్శనము

వరుణుడు కృష్ణునిపై చూపిన భక్తిశ్రద్ధలను నందుడు ప్రత్యక్షంగా చూచినాడు. తన చిన్నారి కృష్ణుడు స్వయంగా భగవానుడే అని ఇంకొకసారి జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. ఆ విషయాన్నే కొందరు గోపాలురకు చెప్పాడు. భగవంతుడు తమ మధ్య అతి సామాన్యునిగా మెలగుతున్నాడు కదా, అతని నిజరూపము నిజధామము ఎలాగుంటాయో అనే ఊహ వారిలో జనించినది. స్వామి అది తెలుసుకొని వారియొక్క మనోరథాన్ని ఈడేర్చ సంకల్పించాడు. బృందావనంలోని గోపాలురకు స్వామి అంటే స్వచ్ఛమైన ప్రేమ ఉన్నది. ఆ ప్రేమయే వారిపట్ల మహా తపస్సులాగ ఫలించినది. వారిపై స్వామియొక్క అనుగ్రహం ప్రసరించినది. వారికి తన పరంధామాన్ని ఒక్కసారి చూపించాలనుకొన్నాడు. ఈ మానవులందరూ మాయచే కప్పబడియున్నవారు గనుక కర్మలలోను, కామక్రోధాలలోను, అజ్ఞానంలోను, జనన మరణాల్లోనూపడి కొట్టుకొంటున్నారు. వీరికి తన నిజధామం ఒకసారి చూపించే ఉద్దేశముతో వారిని బ్రహ్మకుండానికి తీసుకొనివెళ్లాడు. బ్రహ్మహ్రదంలో వారిని ఒకసారి ముంచి తీశాడు. వారిని ఆవరించియున్న విష్ణుమాయను ఒక్కక్షణం తొలగించాడు. వెంటనే వారికి బ్రహ్మ సమాధిస్థితి వచ్చినది. త్రిగుణాలకు, ఇంద్రియమనోబుద్ధులకు అతీతమైన ఆ దివ్యతేజస్సును తిలకించారు. సర్వసంగపరిత్యాగులై జీవన్ముక్తులైన మునులు దేనిని దర్శించాలని అహర్నిశలూ కాంక్షిస్తుంటారో ఆ పరమానందధామాన్ని దర్శించారు. సచ్చిదానందస్థితిని అనుభవించారు. ఈవిధంగా నందుడూ మొదలైన గోపాలకులంతా శ్రీకృష్ణుని ఆ వైకుంఠధామంలో చూచి, పరమానందభరితులై స్తుతించి పూజించారు.

ఆ దివ్యదర్శనం తొలగిపోయినది. మాయ మళ్లీ అవరించినది. వారు ఇదంతా నిజమా స్వప్నమా ఊహా జనితమా, తెలుసుకొనలేక పోయారు.

## కృష్ణప్రేమ - ఒకవివరణ

శ్రీమద్భాగవతములోనత్యంత మధురఘట్టము గోపికలయొక్క కృష్ణప్రేమ. ఈ కృష్ణప్రేమతత్త్వాన్ని సరిగా అర్థము చేసుకోవాలంటే దీనిని ఆధ్యాత్మికపరంగా పరిశీలించాలి.

నానాటికీ మారుతుండే సాంఘిక వ్యవస్థకు అనుగుణంగా ఆచార వ్యవహారాలూ, నీతినియమాలూ మారుతూ ఉంటాయి. మ్లేచ్ఛ పాశ్చాత్య దేశాల సంస్కారాల ప్రభావంచేత పూర్వపు నియమాలు కొంతవరకు పరివర్తన చెందాయి. ఒకప్పుడు ఆచరింపబడుతుండే సతీసహగమనము, బహు భార్యాత్వము మొదలైనవి ఇప్పుడు నిషేధింపబడినవి. కొన్ని ప్రత్యేకమైన పరిస్థితుల్లో బహుభర్తృత్వము, పరబీజసంతానములాంటివి అనుమతింపబడుతుండేవి. అందుచేత ఇప్పటి సాంఘికవ్యవస్థనూ, నైతికనియమాలనూ దృష్టిలో పెట్టుకొని, పౌరాణిక యుగాల్లోని సంఘటనలను విమర్శించడం, తీర్పు చెప్పడం సమంజసం కాదు.

శ్రీకృష్ణుడు చోరుడు జారుడు అనే అపవాదు, హాస్యధోరణిలో చెప్పే కొందరు పౌరాణికులనుండి వెలువడినట్లున్నది. ఇది ఎంతవరకు సమంజసమో యోచించవలసియున్నది.

భూభారాన్ని తగ్గించడానికి, దుష్టులను శిక్షించడానికీ, బ్రహ్మాది దేవతల ప్రార్థనను మన్నించి, భగవానుడు కృష్ణావతారాన్ని ధరింపసంకల్పించి, ముందుగా దేవతలను, యాదవులుగా భూలోకంలో జన్మింపుడన్నాడు. రామావతారంలో శ్రీరామచంద్రుని దివ్యమోహనసుందరవిగ్రహాన్ని ఆలింగనం చేసుకోవాలనే ఋషులయొక్క ప్రగాఢకాంక్షను తీర్చడానికి, వారికి కృష్ణావతారంలో గోపికలజన్మ లభించినది. ఈ విధమైన కారణజన్ములు ఈ గోకులవాసులు. సాక్షాత్తూ భగవంతుడైన శ్రీకృష్ణుడు (కృష్ణస్తు భగవాన్ స్వయం), దుష్టశిక్షణ, శిష్టరక్షణలే కాకుండా

భక్తాభీష్టవరదాన కార్యాన్ని కూడ చేయ సకల్పించాడు. ఆ కార్యక్రమము లోనివే అతడు దేవకీవసుదేవులకు పుత్రుడై జన్మించడం, నందయశోదలకు ముద్దుల బిడ్డడై వారిని మురిపింపజేయడం, బృందావనగోపకులకు వైకుంఠాన్ని దర్శింపజేయడం, యశోదమ్మకు తన నోటిలో బ్రహ్మాండాన్ని చూపించడం, గోపెమ్మల వెన్నలనుదొంగిలించడం, గోపికలకు స్వర్గానందాన్నివ్వడం, ముచుకుందునికి ముక్తినివ్వడం, విప్రపత్నులను, అక్రూరుని, సుదాముని కుబ్జను, కుచేలుని అనుగ్రహించడం మొదలైనవి. వీటిని లౌకిక దృష్టితో చూచి సంకుచితమైన అర్థాలను ఆపాదించడం సరికాదు.

కృష్ణుడు నందుని ఇంట వెలసినప్పటినుండీ నందవ్రజములోని ఆబాలగోపాలమందరికీ ప్రియతముడై పెరిగినాడు. శిశువులతో, వృద్ధులతో సహా అన్ని వయస్సులకు చెందిన స్త్రీ పురుషులే కాకుండా గోవులూ దూడలు కూడ అతని యొక్క సమ్మోహన శక్తికి వశమైపోయాయి. కృష్ణుడు అంటే అందరినీ ఆకర్షించు వాడు అని కూడ అర్థము. కృష్ణుడు ప్రేమ స్వరూపుడు. అటువంటి కృష్ణుని ప్రేమించకుండా ఎవ్వరు ఉండగలరు?

కృష్ణుడు గొల్లల రాజైన నందునికి లేకలేక ప్రాప్తించిన ఏకైక పుత్రుడు. అతడు దొంగిలించే వాడు అని చెప్పబడే ఆ పాలూవెన్నలు నందుని ఇంట కోకొల్లలుగా నుండేవి కదా! కృష్ణునికి ఏదికావాలన్నా వెంటనే అందించే మాతృమూర్తి యశోదమ్మ. మరి బాలకృష్ణుడు గోపెమ్మల ఇండ్లలోని వెన్నలను దొంగిలించడంలోని ఆంతర్యమేమిటి? ఈ విషయాన్ని కొంచెం ఆధ్యాత్మిక దృష్టితో చూడాలి. పాలలోని అత్యుత్తమమైన భాగము వెన్న. పాలను తరచి తరచి చిలికితే లభ్యమైన నవనీతమది. అలాగే మానససాగరాన్ని తరచి తరచి మథించితే ఉత్పన్నమయ్యే నవనీతమే భక్తి ప్రపత్తులు. ఇదే భగవంతునకు అత్యంత ప్రీతికరమైన నైవేద్యము. దీనినే అతడు భక్తునినుండి గైకొంటాడు. అందుకే అతనిని మానసచోరుడు, చిత్తచోరుడు అని భక్తులు స్తుతిస్తుంటారు. తమకు ఆ విషయం తెలియక పోయినా, గోపెమ్మలు పరిపక్వత చెందిన భక్తులు. వారినుండి వారి భక్తికి ప్రతిరూపమైన నవనీతాన్నే భగవంతుడు గైకొనేవాడు. ఈ విధంగా భక్తుల్ని అనుగ్రహించడం చౌర్యమవుతుందా?

ఇక జారత్వం విషయం విమర్శించాలంటే, దాన్ని రెండు దృక్పథాలలో చూడవచ్చు: (1) లౌకికము (2) ఆధ్యాత్మికము. కృష్ణుడు దేవకీగర్భాన పుట్టి యశోదానందుల పుత్రుడై పెరిగిన మానవమాత్రుడేనని లౌకిక పరంగా భావిస్తే - అతడు తన పన్నెండవ ఏటనే బృందావనం విడిచిపెట్టి మథురవెళ్లి తిరిగి రానేలేదు. మళ్లీ గోపికలను కలుసుకొననేలేదు. అతడు తన ఏడవ ఏటనే గోపికలతో రాసక్రీడ అనే నృత్యము చేయించాడు. యమునానది ఇసుకతిన్నెలలో వారితో ఆటలాడుకొన్నాడు. వివాహితలు, పిల్లలతల్లులు, ప్రౌఢవయస్కలు, కన్యలు అయిన గోపికలు, తమ సర్వస్వమూ మరచిపోయి, ఆ బాలకృష్ణునితో రాసలీలా వినోదాల్లో పాల్గొన్నారు. ఏడేళ్ల బాలుడు, అంతమంది స్త్రీలతో కామకేళి జరపడం భౌతికంగా సాధ్యమా?

'అతడు మానవమాత్రుడు కాడు, భగవంతుడు' అనిగ్రహించితే అతని చేష్టలను లౌకిక పరంగా కాకుండా ఆధ్యాత్మిక దృష్టితో పరిశీలించాలి. పుట్టిన దాదిగా తనపన్నెండవ ఏటను, మథుర వెళ్లేలోగా, అతడు ఎందరో అసురులను అంతముచేశాడు, ఇద్దరు యక్షులకు శాపవిమోచనం చేశాడు. బ్రహ్మదేవుని భ్రమను తొలగించాడు, గోవర్ధనగిరినెత్తి ఇంద్రుని గర్వమణచాడు. భక్తులైన జీవులు భగవంతునితో సాయుజ్యము పొందడమే జీవిత పరమార్థము. ఇదే వేదాంతసారము. పూర్వజన్మల సుకృతాల ఫలితంగా, పరమ భక్తులైన గోపికలు, బాలకృష్ణుని లీలలనే కీర్తనంచేస్తూ, శ్రవణంచేస్తూ, అహర్నిశలూ అతనినే స్మరిస్తూ, అతడే తమ హృదయాధినాథుడని వందనం చేస్తూ, అతని పాదాలచెంత పడియుండడమే పరమానందమని నమ్మికొన్నారు. అతని పాదాలను తమ ఎదలకు అద్దుకుంటూ, అతడే తమ ప్రాణ సఖుడనీ, అతని తోడిదే లోకమనీ తమ సర్వస్వమూ అతనిదేననీ, ఆత్మార్పణం చేసుకొని నవవిధభక్తిని ప్రదర్శించిన మధుర భక్తులు వారు. తమ యొక్క తనువులు, మనస్సులు, చిత్తములు, సర్వస్వమూ ఆ శ్రీకృష్ణపరమాత్మకే అర్పించిన త్యాగధనులు. వారు తమ భర్తలను బంధువులను సకల బంధాలను

వదిలించుకొని తమ ఆరాధ్యదైవముయొక్క పాదాలచెంతను పడియుండడమే జీవితపరమార్థమనీ ఇంకేమీ అవసరం లేదనీ దృఢంగా విశ్వసించిన అనన్య భక్తులు. గోపికల భక్తి అత్యుత్తమభక్తిగను, పరాభక్తిగాను వర్ణింపబడినది. వారి భక్తిపారవశ్యాన్ని తిలకించిన నారద మహర్షి, ఉద్ధవుడు ఆశ్చర్యచకితులయ్యారు.

సకల చరాచర సృష్టి భగవంతుని నుండే ఉద్భవించి, వర్ధిల్లి అతనిలోనే లయిస్తుంది. ఈ మానవదేహాలు కూడ ఆ సృష్టిలోనివే. భగవంతుడు తాను సృష్టించిన మాంసపు బొమ్మలతో కామకేళిని జరిపాడని అనుకొనడం హాస్యాస్పదం.

రాసక్రీడలో ఒకే కృష్ణుడు ఎందరు గోపికలుంటే అందరు కృష్ణులుగా వెలిసినాడు. ఇద్దరు గోపికల మధ్యను ఒక కృష్ణుడున్నట్లుగా అందరినీ వలయాకారంలో నిల్చోబెట్టి, తాను కేంద్రస్థానంలో నిల్చొని వేణువు ఊదుతుంటే, అందరూ నృత్యం చేశారు. కేంద్రస్థానములోనున్న బాలకృష్ణుడు వేణునాదంతో అందరిచేత నాట్యం చేయిస్తుండగా గోపికలు కృష్ణ ప్రతిరూపాలతో చెట్టాపట్టాలు వేసుకుంటూ, చేతులు శరీరాలు కలుపుకుంటూ పరిపూర్ణ స్వర్గానందం పొందినారు. ఈ సన్నివేశము ఒక వేదాంత సత్యాన్ని నిరూపించేటట్లు ఉన్నది. ఒకే పరమాత్మ తన ప్రతిరూపాలైన జీవాత్మలను ప్రవర్తింపజేసి జీవులయొక్క కర్మలతోగాని, కర్మఫలాలతోగాని ప్రమేయమేమీ లేకుండా అసంగుడై సాక్షిభూతముగానుంటాడని వేదాంతం చెపుతున్నది. శ్రీకృష్ణుడు నిర్వహించిన రాసక్రీడకూడ ఈ పరమాత్మ జీవాత్మల లీలానాటక ఖేలనం లాగానే జరిగినట్లు సూచిస్తున్నది. నిజానికి గోపికలు కామోద్రేకముతోనే కృష్ణునివద్దకు చేరియుండవచ్చు. కాని వారి కామోద్రేకమంతా ఆ లీలామానుషవిగ్రహునియొక్క, సమ్మోహనాస్త్రము వంటి చిరునవ్వుతోనో ప్రేమపూరితములైన దృక్కులతోనో, హస్తస్పర్శతోనో, ఆలింగనంతోనో సంపూర్ణంగా తృప్తిజెందినట్లు ఆనందానుభూతిని వారు పొందారు. అదే వారి జన్మసాఫల్యము.

కృష్ణుడు పదహారువేలమంది "గోపికల"తో మెలిగాడు అనే వాదనకు ఆధారములేదు. నరకాసురునిచే చెరపట్టబడిన "రాజకన్యల"ను కృష్ణుడు, నరకుని వధించి, విడుదలచేసి వారిని తమ తమ గృహాలకు పంపించే ఏర్పాట్లు చేశాడు. కాని ఆ రాజకన్యలు తమ తల్లిదండ్రులు తమని స్వీకరించరు గనుక ఇళ్లకు పోలేమన్నారు. కృష్ణుడే తమను రక్షించి ఆదరించాలనీ తాము అతనినే వివాహం చేసుకొంటామనీ, వారు ప్రాధేయపడ్డారు. అప్పుడు కృష్ణుడు వారందరినీ ద్వారకకు పంపించి, తాను పదహారువేల కృష్ణరూపాలను ధరించి అందరినీ వివాహమాడి వారితో వేరువేరు ఇళ్లలో కాపురముండి వాళ్లకు సంతానం అనుగ్రహించాడు. దిక్కులేని ఆ రాజకన్యలను రక్షించి రక్షణ కల్పించడం జారత్వమవుతుందా? ఇటువంటి అద్భుతచర్యలుకేవలం భగవంతుడే చెయ్యగలడు. ఆయన చర్యలను, భక్తుల అభీష్టాలను అనుగ్రహించే లీలా వినోద చర్యలుగానే అర్థంచేసుకొంటే గాని కృష్ణ తత్త్వము అవగాహన కాదు: హరిః ఓం తత్ సత్.

## రాసలీల

(భగవంతుడు మూర్తీభవించిన సచ్చిదానందస్వరూపుడు. తానే ఆనంద మయుడుకావడం చేత ఆ ఆనందాన్ని జీవరాసులకు వాటివాటి కర్మ, యోగ్యతలను బట్టి వితరణ చేస్తాడు. పైనుండి ఆనందాన్ని సంపాదించి, అనుభవించవలసిన అవసరం ఆయునకు లేదు. తనయొక్క అపారకరుణచే అప్పుడప్పుడు ఆ ఆనందసాగరుడు మానవాళిపై కొన్ని ఆనందబిందువులను చిలుకరించాలని సంకల్పిస్తుంటాడు. అలాంటి ఒకానొకసన్నివేశమే శ్రీకృష్ణుడు గావించిన రాసలీల. దీనిద్వారా ఆయన దివ్య రసానుభూతిని అందరికీ కలిగించాడు.)

శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెపుతున్నాడు:

శరదృతువులో అది యొక పున్నమిరాత్రి. శ్రీకృష్ణుడు బృందావనిలో యమునా తీరములో ముల్లోకాలనూ సమ్మోహింపజేసే ఒక మోహనగీతాన్ని మురళితో నాలాపింపసాగినాడు. ఆ మధుర స్వరానికి పరవశలైన గొల్ల పడుచులు సర్వమూ మరచిపోయి, తత్తరపాటు చెందారు. ఏ పనులూ చేయడానికి వారికి తోచడంలేదు. చేస్తున్న పనులను ఎక్కడివక్కడే విడిచిపెట్టేస్తున్నారు. కొందరు ఆవులకు దూడలను విడువమరుస్తున్నారు. విడిచినవారు

పాలుపిదకడం మరుస్తున్నారు. పిదికనవారు పాలుకాచడం మరుస్తున్నారు. పాలుకాచిన వారు దించడం మరుస్తున్నారు. దించినవారు పిల్లలకు ఇవ్వడం మరుస్తున్నారు. కడకు ఆ పారవశ్యంలో భర్తలకు సేవలు చేయడం, వంటవండడం, ఆరగించటం, అలంకరించుకొనడం, సరిగా వస్త్రములను ధరించడం వంటి ముఖ్యమైన పనులుగూడా వారికి పట్టడం లేదు. అందరూ ఎవరి మటుకువారు, ఇండ్లు విడిచి వేణునాదం వినవచ్చే చోటికి మంత్రముగ్ధలై నడిచి వెళ్లిపోతుంటే ఇండ్లలోని పురుషులు వారించి అడ్డుపడతున్నారు. అయినా ఆస్త్రీలు లక్ష్యపెట్టకుండా ముందుకు సాగిపోతున్నారు. అలాగతోసుకొని వెళ్లలేకపోయిన ఒకరిద్దరు స్త్రీలు, తమ భర్తలచే ఇంట్లోనే బంధింపబడి ఉండిపోయారు. వారు తమ హృదయాల్లోనే శ్రీకృష్ణునితో ఏకమై ఆయనలోనే లీనమైపోయి ప్రాణాలను విడిచి ముక్తిని పొందినారు. అని చెప్పగా పరీక్షిత్తునకు సందేహం వచ్చినది. తత్త్వజ్ఞానములేని ఈ గోపికలు శ్రీకృష్ణుని సౌందర్యానికి సమ్మోహితలై ఆయన చెంతకు చేరలేక, ఆయనయందే మనస్సు నిలుపుకొని ప్రాణాలు విడిచారు కదా, వాళ్లకు మోక్షమెట్లాలభించినది? అని అడుగగా, శ్రీశుకుడిలా చెప్పాడు: "రాజా! ధ్యేయ వస్తువు రజోగుణ తమోగుణోపేతమైనట్టిదైతే, ధ్యాత మనస్సు ఆ గుణాలతో నిండిపోతుంది. అతనికి దుఃఖమే కలుగుతుంది. ధ్యేయ వస్తువు సత్త్వగుణోపేతమైనట్టిదైతే ఆనందం కలుగుతుంది. శ్రీకృష్ణుడు గుణాతీతుడే అయినను శుద్ధ సత్త్వస్వరూపుడు గనుక ఆయన స్మరణయే ఆనందముతోపాటు బంధమోచనం కూడ కలిగిస్తుంది. అలాగే విరోధియైన శిశుపాలుడు, చంపవచ్చిన పూతన మున్నగువారు ముక్తిని పొందారు కదా!

**ఆ॥ బాంధవముననైన పగనైన వగనైన ప్రీతినైన ప్రాణభీతినైన**
**భక్తినైన హరికి పరతంత్రులైయుండు జనులు మోక్షమునకు జనుదురధిప! 971**

నారాయణునిస్పర్శమాత్రాన, కొండలూ, చెట్లూలాంటి స్థావరాలుకూడ ముక్తిని పొందగలవు. ఇక మానవులగురించి వేరే చెప్పాలా?

ఆ విధంగా మంత్రముగ్ధలవలె నడచి వచ్చిన గొల్ల పడుచులను మృదువుగా మందలిస్తూ కృష్ణుడు ఇలా అన్నాడు: "ఓ మానవతులారా! మీరు ఈ చీకటివేళ క్రూరమృగాలు సంచరించే ఈ అడవిలోనికి ఈ విధంగా రావచ్చునా? మీ ఇండ్లలోని వారంతా మీ జాడలు తెలియక తల్లడిల్లిపోరా? ఇలాగ సాహసించి రావడం మీకు తగునా? మీ కుటుంబ గౌరవానికి చేటుకాదా? మీరంతా ఇళ్లకు వెళ్లిపోయి మీ మీ పనులను చూచుకోండి. నన్ను చూస్తుండడం, నామాటలు వినడం, నా పాటలు పాడుకొనడం నన్నే స్మరిస్తూ ఉండడం చేస్తుంటే చాలును. మీరు ధన్యులవుతారు. ఇక మీరు మీ గృహాలకు మరలిపొండి." అని చెప్పిన స్వామితో ఆకాంతలు ఇలాగ మొరపెట్టుకొన్నారు: "కృష్ణా! సర్వమూ విడిచిపెట్టి, నీపాదాల చెంత చేరిన మాతో ఇలాగ మాట్లాడడం నీకు తగునా! కరుణామూర్తివైన నీవు నిర్దయుడవై మమ్మల్ని ఈ విధంగా తిరస్కరిస్తావని మేము కలలోనైనా ఊహించలేదు. పతులూ, బిడ్డలూ, బంధువులూ, అందరూ దుఃఖాన్ని తెచ్చిపెట్టే బంధాలేకదా! నీవే తల్లివి, తండ్రివి, భర్తవు, బంధువు సఖుడవు, గురుడవు, పుత్రుడవు, దైవమవూ అని ధర్మశాస్త్రజ్ఞులు చెప్తారు కదా! మరి మేము నీలోనే అన్ని బాంధవ్యాలనూ కల్పించుకోనడం తగదా? మాకు గృహస్థధర్మాలు, నీతినియమాలూ తెలియవని మాకు నేర్పాలనుకొంటున్నావా? ఆనందసాగరుడవైన నీ చెంతకు చేరిన మమ్మల్ని మళ్లీ ఆ సంసారదుఃఖసాగరంలో పడమంటావా స్వామీ! సర్వమూ త్యజించి, నీ పాదాలనే ఆశ్రయించిన యోగీశ్వరులను స్వీకరించి అనుగ్రహిస్తావుకదా. మరి మమ్మల్ని ఎందుకు తిరస్కరిస్తావు? సంసార బంధాలు దుఃఖాన్నితెచ్చి పెడతాయిగాని, నీతోడి అనుబంధము మాత్రము శాశ్వతమైన బ్రహ్మానందాన్నిచ్చేదని గ్రహించి, మేము అన్నీ వదలుకొని నీపాదాల చెంత చేరాము. మామనోబుద్ధులు నీకే అంకితమయ్యాయి. అవి అన్యులను ఆశ్రయించవు. మా కాళ్లు మరలిపోవు. మా చేతులు ఇంకే పనినీ చెయ్యలేవు. మా చెవులు ఇంకెవ్వరి పలుకులనూ వినలేవు. మా కన్నులు నీ మోహనాకారాన్ని తప్ప ఇంక దేనినీ చూడలేవు. నీ పాటలూ, మాటలూ తప్ప మా నాలుకలు ఇంకేమీ ఉచ్చరించలేవు. మా మనోవాక్కర్మలూ నీలోనే ఐక్యమైపోయిన

మమ్మల్ని ఇలాగ తిరస్కరించి పొమ్మనడం నీకు న్యాయమేనా? మేము వెనక్కి పోలేము. నీ పాదాలచెంతనే దాసీలుగా పడియుంటాము. విరహాగ్నివేదనలో దహించుకొని పోతున్న మాయొక్క తాపాన్ని నీ మృదుమధురసంభాషణస్పర్శలతో చల్లార్చకుంటే, ఇక్కడే భస్మమైపడియుంటాము. నిన్ను చూచినా, నీ వేణుగానాన్ని వినినా, గోవులూ, మృగాలూ పక్షులూ వృక్షాలూకూడా పరవశించి, పులకిస్తాయి కదా, మరి మేము ద్రవించకుండా ఉండగలమా, కృష్ణా! శ్రీహరి దేవతలను కాపాడుతుండేరీతిగా, నీవు కరుణతో నీ అభయ హస్తాన్ని మా శిరస్సులపై నుంచకపోతే మేము మూర్ఛపోతాము సుమా!" అని ఈ విధంగా దీనాలాపాలు చేసిన ఆ గోపస్త్రీల విన్నపాలు విని, ఆత్మారాముడైన స్వామి వారి ఆత్మను రమింపజేయ సంకల్పించాడు. వందల సంఖ్యలో నున్న ఆకాంతలు తన స్పర్శకు, ఆలింగనానికి తహతహలాడుతున్నట్టు గ్రహించాడు. అందరినీ అనుగ్రహించే తలంపుతో ఏ ఒక్కరికీ చిక్కకుండా, అందరికీ తాము కాంక్షిస్తుండే అనుభూతులను కలుగజేసి, బ్రహ్మానందాన్ని అందించాడు. ప్రతిపడుచూ కృష్ణుడు తన వాడేననీ, తానే అందరికంటే ధన్యురాలిననీ మురిసిపోతూ మైమరచి యున్న సమయాన, మాయావి అయిన స్వామి అదృశ్యమైనాడు.

తమ చెంత కృష్ణుని గానక, కాంతలందరూ వశము తప్పిన వారైపోయారు. నందనందనుని మాటలు, పాటలు, చేష్టలు, చూపులు, వినోద క్రీడలు తలచుకొంటూ, ముచ్చటించుకొంటూ, పిచ్చివారిలాగా, బృందావనమంతా వెదకసాగారు. కనిపించిన ప్రతి చెట్టునూ అడిగారు, తమ హృదయాధినాథుడెక్కడున్నాడు? అని "ఓ అశ్వత్థ వృక్షమా! మానసస్సులను దోచుకొనిన మాధవుని నీవు చూచావా? ఓ అశోకమా! నీవైనా చూచావా? ఆ మాయావిని, ఓ తులసీ! గోవిందునకు ఇష్టమైన దానవుకదా! నీకు కూడా అతని జాడ తెలియదా? ఓ భూదేవీ! స్వామిపాద స్పర్శతో పునీతమైన నీకు కూడ అతడెక్కడున్నాడో తెలియదా?

**ఉ॥ నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై**
**జల్లెడి వాడు మౌళిపరిసర్పిత పింఛమువాడు నవ్వు రా**
**జిల్లెడు మోమువాడొకడు చెల్వల మానధనంబు తెచ్చెనో**
**మల్లియలార! మీపొదల మాటున లేడుగదమ్మ చెప్పరే. 1010**

ఈ విధంగా వారు ఆ వనములోని ప్రతిచెట్టునూ, లతనూ, పువ్వులనూ పేరుపేరున పిలిచి అడిగారు.

వియోగవేదనను భరించలేని ఆ వనితలు, శ్రీకృష్ణుని అనుకరిస్తూ బాలకృష్ణుని లీలలన్నిటినీ నటించారు. ఒకతె కృష్ణుని వలె నటించగా, ఇంకొకతె పూతన వలె చన్నుకుడిపింది. ఒకతె తృణావర్తుడై ఇంకొకతెను కృష్ణునిగా భావించి ఎగురవేసుకొనిపోయింది. ఒకతె నేను యశోదను అంటే ఇంకొకతె ఇదిగో నా నోటిలో విశ్వమున్నది చూడు అని నోరు తెరిచినది. మీరు కాళియుని పత్నులు, నేను కాళియుని తలపై నృత్యం చేస్తాను చూడండి అంటున్నది ఒకామె. ఇదిగో నేను గోవర్ధన గిరినెత్తుతున్నాను చూడండి అంటూ తన చీర చెంగును గొడుగులాగ ఎత్తుతున్నది. ఇంకొకామె. ఈ విధంగా వారి హావ భావాలను వెలిబుచ్చుకొంటూ గోవిందుని వెదుక్కొంటూ, బృందావనమంతా గాలించారు. పండువెన్నెల వెలుగులో అడుగుల జాడలను చూచి, ఇవిగో, ఇవి గోవిందుని పాదముద్రలు. ఆ ప్రక్కనే కనిపిస్తున్న పాదముద్రలు, ఏ ముద్దరాలివోకదా! ఇక్కడ చిన్న అడుగుల జాడలేదు. ఆమెను ఎత్తుకొని నడిచాడు కాబోలు. ఇక్కడ గడ్డి చెదరినది. వారు ఆటలాడుకొన్నారు కాబోలు. ఈ విధమైన పిచ్చిప్రలాపాలు చేస్తూ వెదక సాగారు. వెదకి వెదకి కృష్ణుని ఎక్కడాకానలేక నిరాశచెంది ఇసుకతిన్నెలపై చతికిల పడ్డారు.

తమ చిత్తచోరుని ఎక్కడా కానలేక విరహబాధతో గోపికలు ఇలాగ విలపించారు: "స్వామీ! నీవు మా పల్లెకు వచ్చిన తరువాత నిన్ను విడిచి ఉండలేని మహాలక్ష్మికూడ ఇక్కడే స్థిరనివాసం చేసుకొన్నట్లున్నది. నీవు ఇలాగ మాయమైపోతే ఇక మాగతి ఏమికాను? నీపైనే ప్రాణాలన్నీ నిలుపుకొన్నాం కదా! లక్ష్మి కూడ నిన్ను వెదుక్కొంటూ వెళ్లిపోతుంది. ఓ సుందరాకారుడా! నిన్ను వలచి మేమంతా నీకు జీతములేని దాసీలమైపోయాము కదా! మమ్మల్ని

ఇలాగ వేధించడం తగునా?కాళియుని విషమునుండి, అఘాసురుని నోటినుండి, ఇంద్రుని రాళ్ల వర్షమునుండి, కారుచిచ్చునుండి, ఇంకా ఎన్నో ఆపదలనుండి రక్షించి, చివరకు మమ్మల్ని ఈ క్రూరుడైన మన్మథుని బాణాలకు బలిచేయడం నీకు న్యాయమేనా ప్రభూ! నీ చరణదాసులయొక్క సంసార భయాన్ని బాపునట్టిదీ, లక్ష్మీదేవికి ప్రియమైనట్టిదీ అయిన నీయొక్క అభయహస్తాన్ని మాతలలపైన ఉంచి, మమ్మల్ని అనుగ్రహించవా?

ఉ॥ నీవు యశోదబిడ్డడవె? నీరజనేత్ర! సమస్త జంతు చే
తోవిదితాత్మవీశుడవు తొల్లివిరించి తలంచి లోక ర
క్షావిధ మాచరింపుమని సన్నుతిసేయగ సత్కులంబునన్
భూవలయంబు గావ నిటు పుట్టితిగాదె మనోహరాకృతిన్. 1040

ఓ నీరజనేత్రా! నీవు నిజంగా యశోదమ్మ బిడ్డవు కావని మాకు తెలియదా? సకల ప్రాణికోటియొక్క చేతనాత్మవు (చేతనముచేతనే తెలియబడగల వాడవు) ఈశ్వరుడవు. పూర్వము బ్రహ్మ నిన్ను స్మరించి, లోక రక్షణ చేయుమని ప్రార్థించగా భూమండలాన్ని రక్షించడానికి ఈ విధంగా మనోహర రూపములో పుట్టినవాడవు కదా!

శ్లో॥ తవ కథామృతం తప్తజీవనం, కవిభిరీడితం కల్మషాపహం ।
శ్రవణమంగళం శ్రీమదాతతం, భువి గృణంతి తే భూరిదా జనాః ॥ శ్రీమద్భాగవతమ్ 10/31/9

ప్రభూ! నీ కథామృతము సంసారతాపత్రయతప్తజీవుల తాపాన్ని హరించే సంజీవనివంటిది. పాప కల్మషాన్ని కడిగివేసేది. శ్రవణ మాత్రాన శుభాలను కలుగజేసేది. నీ స్మరణ భాగ్యాన్ని నిత్యమూ కలిగించేది. నీ కథామృతాన్ని జనులకు పంచిపెట్టే వారు, పరమదాతలు. స్వామీ! నీవు గోవులను తోలుకొని, గులక రాళ్లపైన, సూదుల వంటి గరిక దుబ్బులపైన నడుస్తుంటే సుకుమారమై సున్నితమైన నీ పాదారవిందాలు ఎంత కందిపోతాయో, ఎంతగా నొప్పికిగురియైతాయో కదా! వాటిని మా మెత్తని గుండెలకు హత్తుకొని, సేవ చేద్దామంటే, పగలంతా పశువులతో తిరుగుతావు. రాత్రులందు మాకు కుటుంబపు అడ్డంకులతోపాటు, బ్రహ్మసృష్టించిన కనురెప్పతెరలు కూడ అడ్డమవుతాయి కదా! హృదయేశ్వరా! మా హృదయాలను ఇంత మృదువుగా మెత్తగాచేసి, నీ హృదయాన్ని ఇంత కఠినంగా తయారు చేసిన మా యొక్క మంద భాగ్యానికే మేము వాపోవాలి." అని ఈ విధమైన ఆవేదనను వ్యక్తపరుస్తూ ఆ గోపకాంతలు గోపాలకృష్ణుని స్తుతిస్తూ, పాడుతూ, విలపిస్తూ, అలుగుతూ చేసిన విన్నపాలను వినిన స్వామి త్రిజగన్మోహనుడై, మన్మథమన్మథుడై, దివ్యసుందర విగ్రహుడై ప్రత్యక్షమైనాడు. గోపికలందరికీ పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినవి. తమ మనోహరుని చుట్టూ మూగిపోయారు. కన్నుల పండువుగా రెప్పలార్పకుండా చూచుకొన్నారు. ఒక ముద్దరాలు కృష్ణుడు తనవాడే అన్నట్టు అతని రెండు చేతులనూ తీసుకొని తన బుగ్గలకు ఆన్చుకొన్నది. ఇంకొకామె ఎర్రకలువల లాంటి స్వామి పాదాలను తన ఎదకు హత్తుకొన్నది. ఇంకొకతె స్వామి భుజాలు తనకు చెందినవే అన్నట్టు వాటిపై వాలిపోయినది. ఈ విధంగా ఆ మోహనాంగులందరూ స్వామిని ఎలాగైనా స్పృశించి, ముద్దాడి, తన్మయులై మురిసిపోవాలని ముందుకు తోసుకొంటూ వస్తున్నారు. కొందరు అతనిపై అలకప్రదర్శిస్తూ దూరంగా నిల్చొని, కొంటె చూపులు చూస్తున్నారు. కొందరు – "నీవు ఇంత నిర్దయుడవని కలలో కూడ అనుకొనలేదు" అని నిష్ఠురాలాడారు. కొందరు శ్రీకాంతుని దివ్యసుందరమూర్తిని చక్షుర్ద్వారాలగుండా హృదయంలోనికి ప్రవేశపెట్టి, మళ్లీ పారిపోతాడేమో అన్నట్లు కళ్లుమూసుకొని ఆత్మానందాన్ని అనుభవిస్తున్నారు. స్వామి అందరితోనూ తగురీతిని అనునయిస్తూ ఆనందింపజేస్తున్నాడు. వారి విరహతాపం శమించినది. భగవంతుని దర్శించిన భాగవతోత్తముల వలె వారంతా బ్రహ్మానందభరితలైనారు. ఇక వారు తమ జీవితంలో కోరదగినదేదీ లేదు.

కృష్ణుని గురించి ఆ ఇసుక తిన్నెపైన తమ పైట చెంగులను పరచి, ఒక మెత్తని ఆసనంచేసి కూర్చుండబెట్టారు. చంద్రునిచుట్టూ చేరిన తారలవలె ఆ భామలు ఆయనచుట్టూ కూర్చున్నారు. నీకు మా మీద ప్రేమలేదన్నారు. అన్నీ

దోచుకొంటావు గాని, ఏమీ ఇవ్వని స్వార్థపరుడవు నీవు అన్నారు. ప్రణయ కలహం లాంటి సూటిపోటి మాటలన్నారు. అన్నీ విని స్వామి చిరునవ్వుతో ఇలా అన్నాడు. "నేను మీ అందరి హృదయాలలో నివసించే ఆత్మబంధువును. మీయొక్క ఆర్తి, అనురాగము సన్నగిల్లకుండా ఉండాలనీ, మీరు ఎల్లప్పుడూ నన్నే స్మరిస్తూ ఉండాలనీ, అప్పుడప్పుడు మీ మధ్యనుండి నా రూపము కనుమరుగవుతుంది. అంతేకాని నాకు మీయందు ప్రేమలేక కాదు" అని మాధవుడు చెప్పగా ఆ మగువలంతా మహదానందము పొందారు.

## రాసక్రీడ

ఆ శరత్కాల పున్నమి రాత్రిలో శ్రీకృష్ణుడు ఆ సుందరీమణులతో రాసక్రీడ చేయ సంకల్పించాడు. ఎందరు గోపికలున్నారోతాను అందరు కృష్ణులుగా వెలసి ప్రతి ఇద్దరు గోపికల మధ్యను ఒక కృష్ణరూపము ఉండునట్లుగా రాసమండలాన్ని ఏర్పాటు చేశాడు. (అంగనాం అంగనాం అంతరే మాధవః మాధవం, మాధవం, చాంతరేణాంగనా... నారీ నారీ నడుమ మురారీ, హరికీ హరికీ నడుమ వయారీ) అందరూ వలయాకారంలో నిల్చొని ఒకరిచేతిని ఇంకొకరు పట్టుకొని, పలువిన్యాసాలతో నృత్యము చెయ్యడానికి సిద్ధపడ్డారు. కృష్ణుడు పద్మము మధ్యను కర్ణికలాగ రాసమండల కేంద్రములో, త్రిభంగియై, త్రిభువనాలనూ సమ్మోహింపజేసేటట్లు నిల్చొని, వేణుగానం ప్రారంభించాడు. ఈ రాసమండల రచన వెయ్యి కన్నుల దేవేంద్రునకు కూడ అద్భుత దృశ్యముగా కనిపించినది. అది పైనుండి చూచేవారికి మణుల మధ్య పొదగబడిన ఇంద్రనీలములాగ కనిపించినది. గోపికల ప్రక్కనున్న కృష్ణమూర్తుల కరకమలాలు గోపికల మెడలపైన భుజాలపైన ఆడుకుంటుండగా నాట్యము ప్రారంభమైనది.

అచ్యుతుడు అంగనలతో కూడి నాట్యశాస్త్ర కళలన్నిటినీ ప్రయోగించి, నృత్యాలు చేయించాడు. పద్మము, వజ్రము మొదలైన పన్నెండు రాసబంధనాలను ఏర్పరచాడు. ఏకపాదము, త్రిభంగి మొదలైన ఎనిమిది భంగిమలలో నాడించాడు. పాదవిన్యాసాలు, పార్థివాచారి విశేషాలు, గగనాచారి విశేషాలు ప్రదర్శించాడు. అర్ధచంద్రము మొదలైన హస్తాభినయనాలు చేయించాడు. మయూరము మొదలైన తొమ్మిది కరణాలను ఆడించాడు. ఆరు శిరోభావాలను, ఐదు అంగ విక్షేపాలను చూపించాడు. అడుగులు, నడుములు, చేతులు, మెడల యొక్క కదలికలు అతి రమ్యముగ నుండినవి. ఆ రాసలీల భూమండలాన్నంతా సంతోషంతో నింపివేసినది. శృంగార రసముతో పొంగారినది. శంకరాభరణాదిరాగాలతో నిండిపోయినది. నందనందనుని వేణుగానము అందరినీ సమ్మోహితులను చేసినది.

**చ॥ నడుములు వీగియాడ చిరునవ్వులు నివ్వటిలంగ హారముల్**
**సుడివడ మేఖలల్ వదల చూడ్కి మెరుంగులు పర్వ ఘర్మముల్**
**వొడమ కురుల్ చలింప శ్రుతిభూషణముల్ మెరయన్ సకృష్ణలై**
**పడతుక లాడుచుం జెలగి పాడిరి మేఘతటిల్లతాప్రభన్.** 1084

నడుములు సొంపుగా కదలాడగా చిరునవ్వులు శోభించగా, మెడలోని హారాలు చిక్కుపడగా, మొలత్రాళ్ల సడలగా, చూపులు మిలమిల మెరయగా, చెమటలు క్రమ్మగా, జుట్టు చెదరగా, చెవుల కమ్మలు మెరయగా ఆసుందరవదనలు కృష్ణమూర్తులతో గూడి నీలిమబ్బులలో మెరుపు తీగలవలె కనిపిస్తూ ఉల్లాసంగా పాడినారు, ఆడినారు. వాళ్ల కాళ్ల అందెలు, చేతి కంకణాలు, మొలపైని చిరుగంటలు. లయుబద్ధంగా చేసే కింకిణీ ధ్వనులు మనోహరంగా నుండేవి. బాలకృష్ణుడు చేయిస్తుండే రాసక్రీడను వీక్షించడానికి, వినువీథిలో దేవతలు, గంధర్వాదులు తమ భార్యలతో బారులు తీరి, విమానాలలో వచ్చి చేరారు. పుష్పవృష్టి కురిపించారు. లయ కలిపారు, గానము చేశారు, పరవశించి పోయారు. ఇలా అనుకొన్నారు: "అహో! శ్రీహరితో నీ విధంగా చేతులు కలిపి, మేనులు తాకించి, ఆటలాడి, పాటలు పాడే మహాభాగ్యము దేవతలకు కూడ లభించదే. ఈ గొల్ల భామలకెలాగ ప్రాప్తించినదో! వీళ్లు ఎంతటి పుణ్యాత్ములో కదా!" అనుకొన్నారు. ఈ విధంగా భగవంతుడైన శ్రీకృష్ణుడు తాను ఒక్కడే అయియుంటూ, ఒక్కొక్క గోపికకు

ఒక్కొక్క కృష్ణమూర్తిగా వెలసి ఆత్మారాముడు గనుక రాసక్రీడద్వారా అందరినీ రమింపజేసి, వారి జన్మజన్మాంతర కాంక్షలను తీర్చినాడు. జీవన్ముక్తులైన యోగులకువలె వారి సర్వ కర్మలూ, కామితాలూ, తీరిపోగా, చిత్త శుద్ధిని పొందిన ఆ పుణ్యకాంతలు ధన్యతపొంది తరించారు.

రాసక్రీడను ముగించి, జలక్రీడలకై అందరూ యమునానదిలో ప్రవేశించారు. ఒకరిపైనొకరు నీళ్లు చల్లుకొంటూ ఆడుకొన్నారు. ఇక తెల్లవారనున్నదని కృష్ణుడు జలక్రీడను ముగించి, అందరినీ ఇండ్లకు వెళ్లిపొమ్మన్నాడు. గోపికల హృదయాలు ఆనందంతో సంపూర్ణంగా నిండిపోయినవి. ఆ రాత్రియొక్క మధుర స్మృతులను నెమరువేసుకొంటూ, అందరూ ఇండ్లకు జేరారు. విష్ణుమాయచేత వాళ్ల ఇళ్లలో నెవ్వరికీ, వాళ్లు ఇంట్లో లేని విషయమే తెలియరాలేదు.

అని శ్రీశుకుడు చెప్పగా పరీక్షిత్తు ఇలా అడిగాడు:

"యోగీంద్రా! ధర్మ రక్షణ చేయడానికి శ్రీకృష్ణుడై అవతరించిన భగవానుడు, ఈ విధంగా సామాన్యమైన ఇంద్రియలోలుని వలె పరస్త్రీలతో కలియడం ధర్మవిరుద్ధము కాదా?" అని అడుగగా శుక మహాముని ఇలాగ చెప్పాడు:

"రాజా! కృష్ణుడు నందనందనుడైన గొల్లపిల్లవానిగా అందరి మధ్యను మసలుతుండడం చేత, అతడొక సామాన్య మానవుడే అను లౌకిక దృష్టితో చూడడంచేత ఇలాంటి సందేహం కలుగుతున్నది. కాని అతడు మానవ రూపంలో అవతరించిన పరమాత్మ. జీవాత్మలన్నీ పరమాత్మయొక్క అంశలే గనుక ఎట్టి భేదమూలేదు. శరీరస్థాయిలో వ్యవహరించే దేహాభిమానులకే శరీరసంబంధమైన బంధుత్వాలు, భిన్నత్వమూ కనిపిస్తాయి. ఆత్మ స్థాయిలో అంతా ఒక్కటే కదా!

ఆ॥ గోపజనములందు గోపికలందును, సకలజంతులందు సంచరించు
నా మహాత్మునకు పరాంగన లెవ్వరు? సర్వమయుఁడు లీల సలిపెగాక! 1109

ఉత్తమ యోగులయొక్క, ఉత్తమ భక్తులయొక్క అభీష్టాన్ని అనుగ్రహించడమే భగవంతుని లీల. గోపికలు వాంఛించిన స్వర్గానందాన్ని కృష్ణుడు అనుగ్రహించాడు. అందరికీ అన్నీ ప్రసాదించే భగవానుడు మానవ శరీరాలనుండి ఇంద్రియ భోగాలను అనుభవించగోరుతాడా? మానవులు ఏర్పరచుకొన్న నీతినియమాలు సృష్టికర్తకు వర్తిస్తాయా? ఆయన మాయాతీతుడు. త్రిగుణరహితుడు, ప్రకృతిని నియమించువాడు. ఏకార్యానికీ కర్తకాడు. ఆయనను కర్మలు బంధించవు. పరమ శివుడు హాలాహలాన్ని మ్రింగాడని ఇతరులు అలాగ చెయ్యగలరా? భగవంతుని లీలావైభవాలు, మానవ మనోబుద్ధులకు అగోచరాలు - అని శ్రీశుకుడు చెప్పాడు.

## వేణుగీత

శ్రీకృష్ణుడు పగటి వేళలలో గోవులతో వెళ్లినప్పుడు గోపికలకు క్షణమొక యుగముగా గడుస్తుంది. ఎల్లప్పుడూ ఆయన లీలలనే ఇండ్లలో పాడుకొంటూ, వేణుగానాన్ని తలచుకొంటూ మైమరచిపోతూ, తమలో తాము ముచ్చటించుకొంటూ మురిసిపోయేవారు. వాళ్ల ఆలాపనలు ఇలాగుండేవి: "నందనందనుడు మురళి వాయిస్తుంటే, వినువీధిలో పతులతో విహరిస్తున్న దేవతాస్త్రీలు పరవశించిపోయి, పతులమీద వాలిపోతారట నీకు తెలుసా? వేణుగానం వినగానే అడవిలోని ఆవులూ, లేళ్లూ మేతమాని, మోరలెత్తి వింటూ సర్వమూ మరచిపోతాయట! లేగలు పాలు త్రాగడం మానివేసి, వింటుంటాయట. నీలమేఘశ్యాముని వేణునాదాన్ని విని మయూరాలు అతనినే మేఘాలని భావించి నృత్యంచేయనారంభిస్తాయట. ఓ చెలీ! అసలు పగలు ఎందుకొస్తుందో? అంతా ఏకంగారాత్రి అయిపోతే ఎంత బాగుండునోకదా? ఓ సుందరీ! ఇంకా ప్రొద్దుక్రుంకదేమమ్మా! ప్రాణనాథుడెప్పుడు వస్తాడో! చెంతను జేరి ఎప్పుడాదరిస్తాడో గాని నా ప్రాణము గిలగిల లాడిపోతున్నదమ్మా!" ఆ విధంగా కృష్ణ వియోగంతో కొట్టుకొంటూ,

ఆ గోపికలు పలురీతుల తపించిపోతూ పగలు వెళ్లబుచ్చుతారు. సాయంకాలం అయ్యేసరికి ఎదురు తెన్నులు చూస్తూ "అదిగో గోధూళి రేగుతున్నది. పశువుల రంకెలు వినిపిస్తున్నాయి. వల్లభుడు వస్తున్నాడు. రండమ్మా రారండి" అంటూ ఒకరినొకరు తోడుచేసికొంటూ ఎదురేగుతారు. అలాగ ఎదురు వచ్చిన కాంతలను ఉచిత రీతిని స్వామి ఆదరిస్తాడు.

ఈ విధంగా బలరామకృష్ణులు, తమ ఎనిమిదవ, తొమ్మిదవ, పదవ, పదకొండవ సంవత్సరాల కాలాన్ని ఆనందంగా గడిపివేశారు.

గోపికలకు కృష్ణుని యందుండు అద్వితీయ - అచంచల - అనిర్వచనీయమైన మధుర భక్తిని గురించీ, భగవానుడు వారితో చేయించిన రాసక్రీడ రమణీయత గురించీ, భక్తి శ్రద్ధలతో చదివిన వారికి, విన్న వారికి భక్తి ఇనుమడించి, దుఃఖము శమించి, పాపము నశిస్తుంది అని శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

## దుష్టదమనము - సుదర్శనశాపవిమోచనము

ఒకనాడు నందాదులందరూ పశుపతి జాతరకు బండ్లమీద అంబికా వనానికి వెళ్లారు. అక్కడ సరస్వతీ నదిలో స్నానాదికాలు చేసుకొని, పార్వతీ పరమేశ్వరుల పూజలు జరిపించి, విరివిగా అన్నవస్త్ర సువర్ణ దానాలిచ్చి, పూర్తిగా ఉపవాసముండి, నది ఒడ్డున నిద్రపోతుండగా ఒక మహా సర్పము వచ్చి నిద్రిస్తున్న నందరాజును చుట్టివేసి, మ్రింగబోతుంటే నందుడు, "కృష్ణా, కృష్ణా నన్ను రక్షించు, రక్షించు" అని కేకలు వేశాడు. గొల్లలందరూ ఆ సర్పాన్ని కర్రలతో కొట్టసాగారు. అయినా ఆ సర్పం నందుని విడిచిపెట్టలేదు. అంతలో శ్రీకృష్ణుడువచ్చి, దానిని ఒక్కతాపు తన్నాడు. వెంటనే అది ఒక సుందరరూపుడైన విద్యాధరునిగా మారిపోయినది. అప్పుడు కృష్ణుడిలా అడిగాడు: "ఓయీ, నీవెవ్వడవు? ఈ సర్పరూపంలో ఇలాగెందుకు సంచరిస్తున్నావు?" అనగా అతడిలాగ చెప్పాడు: "స్వామీ! నేను సుదర్శనుడనే విద్యాధరుడను. ఒకనాడు విమానంలో విహరిస్తుండగా, అంగిరసుని సంతతి వారైన కొందరు ఋషుల వికారరూపాలను చూచి నవ్వాను. దానికి వారు కోపగించి నన్ను ఇలాగ శపించారు: "ఓరీ సౌందర్య గర్వమదాంధుడవై నీవు మమ్ము గేలిచేసినావు కనుక వికృతాకారమైన ఒక మహాసర్పమై పడియుంటావు" అనగా, నేను నా తప్పిదాన్ని తెలుసుకొని, పశ్చాత్తాపపడి క్షమించుడని వేడుకొన్నాను. వారు కనికరించి ఇలా అన్నారు: "యాదవ వంశములో విష్ణువు అవతరించి, ఈ అడవికి ఒక రోజు వచ్చి నిన్ను తన్నడం సంభవిస్తుంది. అప్పుడు నీకు నిజరూపం ప్రాప్తిస్తుంది." అని చెప్పి వెళ్లిపోయారు. నీ పాదస్పర్శచే నా పాపాలు నశించి, నాకు నిజరూపం వచ్చినది. నీకు నా ప్రణామాలు" అని నమస్కరించి సుదర్శనుడు వెళ్లిపోయాడు. ఇదంతా చూస్తున్న గోపకులు ఆశ్చర్య చకితులై స్వామియొక్క అద్భుత లీలలను ఇంకొకసారి చూచినందుకు ఆనందించారు. యాత్ర ముగించుకొని అందరూ గోకులం చేరుకొన్నారు.

## శంఖచూడుడు

ఒకనాటి రాత్రి బలరామకృష్ణులు చక్కగా అలంకరించుకొని గోపవనితలతో వెన్నెలలో విహరించడానికి బృందావనం వెళ్లారు. తమ చుట్టూ తరుణీమణులు కూర్చొని యుండగా, మనోహరమైన మధురగీతాల నాలాపించారు. ఆ గానాలు చెవులకు సోకగానే, ఆ సుందరీ మణుల సర్వేంద్రియాలూ స్తంభించిపోయి, వారు ఆ గానమాధుర్యంలో తన్మయులై పోయారు. ఆ స్థితిలో వారిని విడిచి రామకృష్ణులు గానము చేసుకుంటూ కొంతదూరం వెళ్లారు. అప్పుడు కుబేరుని భృత్యుడైన శంఖచూడుడనే యక్షుడు, ఆ గోపకాంతలను అపహరించుకొని తన మాయాశక్తిచే తీసుకొని పోతుంటే వారంతా - "కృష్ణా, బలరామా, రక్షించండి, రక్షించండి" అని కేకలు పెట్టారు. ఆ కేకలు విని, వారు పరుగెత్తుకొంటూ వచ్చి, విషయం గ్రహించి రెండు మద్దిచెట్లను పీకి ఆ యక్షుని ఎదుర్కొన్నారు. వాడు భయపడి ఆస్త్రీలను విడిచిపెట్టి పారిపోసాగాడు. స్త్రీలకు బలరాముని రక్షణగా నుంచి కృష్ణుడు శంఖచూడుని వెంబడించాడు.

యక్షుడు మారురూపాలు ధరించి ఎక్కడెక్కడికి పారిపోతున్నా, అక్కడక్కడికి వానిని వెంబడిస్తూ చివరకు పట్టుకొని తన పిడికిటి పోటులతో వాని శిరస్సును ఛేదించి సంహరించాడు. వాని కిరీటంలోనున్న చూడామణిని తీసుకొనిపోయి బలరామునకిచ్చాడు. గోపవనితలు కృష్ణుని స్తుతించారు.

## వృషభాసురవధ

ఒకనాడు అరిష్టుడనే అసురుడు వృషభరూపంలో వచ్చి మందలో చేరాడు. భయంకరాకారుడైన వాని మూపురం ఒక పర్వతశిఖరంలాగ ఉండేది. వాని రంకెలు సకల ప్రాణులను కంపింపజేసేవి. కొమ్ములతో పర్వతాలనైనా తిరగ దోయగల బలశాలివాడు. వాని ప్రవేశంతో దూడలు, ఆవులు, ఎద్దులూ, గోపాలురూ కలవరం చెందారు. గోపాలకృష్ణుని శరణువేడారు. గోపికలు భయంతో రక్షించు రక్షించు అని గోలపెట్టారు. వారందరికీ స్వామి అభయమిచ్చి, వృషభుని ఎదుర్కొనడానికి వెళ్లాడు. "ఓరీ అసురుడా! నీవెవడవో నాకు తెలుసు. ఇలాగ పసిపిల్లల్నీ పడతుల్నీ, పశువుల్నీ భయపెడుతూ తిరగడం, పరాక్రమం అనుకొంటున్నావా? శక్తి ఉంటే, వచ్చి ఎదుర్కో, నా ప్రతాపం చూపుతాను." అని కృష్ణుడు కేకవేయగా ఆ అరిష్టుడు బలిష్ఠమైన తన గిట్టలతో నేలను గీకుతూ, పొడవైన తన తోకను ఎత్తి, బుసలు కొడుతూ, వాడి కొమ్ములతో చీల్చివేయడానికి సిద్ధముగా, కృష్ణుని మీదికి లంఘించాడు. స్వామి అసురుని రెండు కొమ్మల్నీ పట్టుకొనగానే వాడు కదలలేకపోయాడు. స్వామి ఆ రాక్షసుని వెనక్కు నెట్టి నేలకూల్చాడు. ఆ శరీరంమీద నిల్చొని స్వామి అసురుని కొమ్మును పీకివేసి దానితోనే పొడిచి వాణ్ణి సంహరించాడు. దేవతలు హర్షించారు. గోపగోపీజనులు సంతోషంతో గంతులు వేశారు. కృష్ణుని వేనోళ్ల స్తుతించారు.

## కేశివధ

కంసునిచే పంపబడిన కేశి అనే రాక్షసుడు, అశ్వరూపాన్ని దాల్చి, గోకులం చేరాడు. భీకరాకారముతో, గిట్టలతో భూమిని బ్రద్దలు చేస్తూ, జూలుకదలికలచే వాయుచలనాన్నే మార్చివేస్తూ సకిలింపులతో ప్రపంచాన్నే అదరగొడ్తూ, భయంకరమైన కొండగుహలాంటి నోటిని తెరుస్తూ, కృష్ణుని గురించి గాలిస్తున్నాడు. వీడు ఇంద్రునీ వరుణునీ ఓడించినట్టి బలశాలి. కృష్ణుడే వానికి ఎదురు వెళ్లి, – "ఏమిరా దైత్యుడా! నీవు నా గురించే వచ్చావట కదా! ఇక తిరిగి పోలేవులే" అని అనేసరికి ఆ అసురుడు భయంకరంగా సకిలిస్తూ, భూమండలాన్నే మ్రింగి వేసేటట్టు నోరుతెరచి, కృష్ణుని కొరకడానికి మీదపడబోయాడు. కృష్ణుడు తప్పించుకొన్నాడు. అసురుడు పైకెగిరి, వెనుక కాళ్లతో తన్నబోయాడు. కృష్ణుడు మళ్లీ తప్పించుకొని ఆ కాళ్లను పట్టుకొన్నాడు. రాక్షసుడు కదలలేక గిలగిలా కొట్టుకొంటూ పట్టును విడిపించుకొనబోయాడు. కృష్ణుడు దాని కాళ్లను పట్టుకొని బొమ్మనాడించినట్లుగా గిరగిరా త్రిప్పి విసిరి కొడితే ఆ అశ్వము రెండువందలగజాల దూరాన పడినది. రాక్షసుడు లేచి, మళ్లీ విజృంభించి కృష్ణుని మ్రింగడానికి నోరు తెరిచాడు. కృష్ణుడానోటిలోనికి తన చేతిని దూర్చి వాని పండ్లను రాలగొట్టి, గొంతుకలో అడ్డముగా చేతిని ఉబ్బించాడు. ఊపిరి ఆడక, ఆ రాక్షసుడు పెద్దగా కేకలు వేస్తూ మరణించాడు.

కేశి సంహారాన్ని చూచి, నారదుడు వచ్చి ఇలా స్తుతించాడు: "కృష్ణా! జగదీశ్వరా! రాక్షసులలాంటి రాజుల్ని అంతమొందించడానికి నీవు అవతరించావు కదా స్వామీ! నీవు ఇంకనూ అనేకమైన అద్భుతకార్యాలు చేయవలసి యున్నది కదా ! చాణూర, ముష్టిక, కంస, కాలయవన, నరక, శిశుపాల, దంతవక్త్ర, సాళ్వాది దుష్టులను అంతమొందించాలి. అర్జునునకు సారథివై స్వ, పర భేదములేక, భూభారాన్ని తగ్గించాలి. దేవా! నీ లీలా వినోద చేష్టలను లెక్కించడానికి ఆ బ్రహ్మకు కూడ సాధ్యపడదు కదా! నీవు పరమేశ్వరుడవు. నీకు ప్రణామాలు" అని స్తుతించి, నారదుడు నిష్క్రమించాడు.

# వ్యోమాసుర వధ

ఒకనాడు గోపబాలురు కృష్ణునితో అడవికిపోయి పశువులను మేపుతూ, దాగుడుమూతలాట ఆడుతున్నారు. వారిలో కొందరు గొర్రెలుగను, కొందరు కాపరులుగను, కొందరు దొంగలుగను అనుకొని కన్నులు మూసుకొని ఆడుతుండగా, మయుడనే అసురుని కొడుకు వ్యోమాసురుడు, గోపబాలుని రూపం ధరించి, వీళ్లలో చేరినాడు. ఆటలో "దొంగ"గా నటించి, "గొర్రెలు"గా నున్న గోపకుమారులను ఒక్కొక్కరినే ఎత్తుకొనిపోయి, ఒక కొండ గుహలో దాచి, ఒక పెద్ద బండరాతిని తలుపుగా మూసియుంచాడు. ఇంకా నలుగురే "గొర్రె"బాలకులు మిగిలారు. కృష్ణుడు విషయం గ్రహించి, అసురుని పట్టుకొని "ఓరీ రాక్షసుడా! నీవెవడివో తెలిసిపోయినది. ఇంకెక్కడికి పోగలవు?" అని, తన పట్టు బిగించే సరికి, అసురుడు నిజరూపంలో నేలగూలాడు. కృష్ణుడు వానిని పిడికిలితో పొడిచి సంహరించాడు. గుహద్వారాన్ని ఛేదించి, గొల్ల బాలురను రక్షించి, గ్రామానికి తీసుకొనివెళ్లాడు.

# అక్రూరునిగోకులాగమనము

ఒకనాడు నారదుడు కంసుని వద్దకు వెళ్లి, ఇలా చెప్పాడు: "ఓ కంసా! నీ ప్రాణానికి ఎటువంటి ముప్పు లేదని నిర్భయుడవై యున్నావా? దేవకీ వసుదేవుల అష్టమ సంతానము ఆడుపిల్ల కాదు, మగ బిడ్డడే. అతడు గోకులంలో నందయశోదల పుత్రునిగా పెరుగుతున్నాడు. అలాగే దేవకి యొక్క సప్తమగర్భస్థ బిడ్డడు వసుదేవపత్నియైన రోహిణి పుత్రునిగా అక్కడనే పెరుగుతున్నాడు సుమా! నీచేత పంపబడిన పూతనాది అసురులందరినీ హతమార్చినవాడు నందనందనుడనబడే కృష్ణుడే, కనుక నీకు మృత్యుభయము తొలగిపోలేదు సుమా!" అని హెచ్చరించి, నారదుడు, బలరామకృష్ణుల జన్మరహస్యాన్ని కంసునికి చెప్పగా నతడు ఉగ్రుడై మండిపడి, తనను మోసగించిన వసుదేవుని అంతము చెయ్యాలని కత్తి తీసి వెళ్లబోయాడు. నారదుడు అడ్డుకొని, "కంసా! నీకు మృత్యువు కృష్ణుని వలనగాని, వసుదేవుని వలన కాదు కదా! వసుదేవుని చంపి ప్రయోజనమేమిటి?" అని వారించాడు. కంసుడు ఆ ప్రయత్నాన్ని విరమించి, ఇంకా కోపం పెంచుకొని, ఇది వరకు విడిచిపెట్టబడిన దేవకీ వసుదేవులను మళ్లీ చెరసాలలో పెట్టించి, సంకెళ్లతో బంధించినాడు. బలరామకృష్ణులను చంపడానికి కేశి అనే రాక్షసుని పంపించాడు. వానిని కృష్ణుడు వధించాడు.

తరువాత మంత్రులను, మిత్రులను, మల్లురను ముఖ్యులను పిలిపించి, వారితో ఇలాగ చెప్పాడు: "నన్ను ఎదిరించి, పోరాడడానికి ఇంద్రాదులు కూడ భయపడుతారు కదా! గోకులంలో బలరామ కృష్ణులనబడే వసుదేవ పుత్రులు గొల్లపిల్లలై పెరుగుతున్నారట. వాళ్లు నన్ను చంపుతారట, నేనొక వ్యూహం పన్నినాను. వాళ్లనిక్కడకు రప్పిస్తాను. ధనుర్యాగమొకదాన్ని ఏర్పాటు చెయ్యండి. మల్ల యుద్ధ ప్రదర్శనం ఏర్పాటు చెయ్యండి. ఓ ముష్టిక చాణూరులారా! జగజెట్టులైన మీకు సమానులెవ్వరూ లేరు. మీరు ఆ గొల్లపిల్లలను నలిపి పారవెయ్యండి. ప్రజలందరూ వచ్చి ఈ వినోదాన్ని తిలకించడానికి చుట్టూ కూర్చొనే ఏర్పాట్లు చెయ్యండి. ఆ అర్భకులు మల్లరంగంలోనికి రాకముందే, ద్వారము వద్ద సాటిలేని శక్తిగల మన గజరాజైన కువలయాపీడము చేత త్రొక్కించి చంపండి. ఈ చతుర్దశినాడు ధనుర్యాగాన్ని ప్రారంభించి, రుద్రునకు ప్రీతికరమైన బలులు ఇవ్వండి." అని, అందరికీ పనులు పురమాయించాడు. యాదవులలో సాత్త్వికుడూ, సత్కీర్తిమంతుడూ, పెద్ద మనిషీ అయిన అక్రూరుని పిలిపించి, అతని చేతిని పట్టుకొని ఇలా చెప్పాడు: "అక్రూరా! నీవు సార్థకనాముడవు. కపటము, కోపములేనివాడవు. నీ మాటను అందరూ మన్నిస్తారు. నీవు నాకొక సహాయం చెయ్యాలి. దేవతలు నాకు భయపడి, వేడుకొంటే విష్ణువు వసుదేవునకు పుత్రుడై పుట్టి నందవ్రజంలో నందుని ఇంట కృష్ణుడనే పేరుతో పెరుగుతున్నాడట, అతడు నన్ను చంపనున్నాడట. అతనితో అతని అన్న బలరాముడనే పేరుతో అక్కడనే ఉన్నాడట. నేను వారిని హతమార్చాలనే ఉద్దేశంతో ఉన్నాను. ధనుర్యాగం అనే మిషతో వారిని ఇక్కడికి రప్పించి కువలయాపీడ గజముచే త్రొక్కించి గాని, మల్లులతో యుద్ధము చేయించిగాని చంపించాలని నా సంకల్పము. కాబట్టి, నీవు అక్కడికి పోయి, నందుని ఒప్పించి, బలరామకృష్ణులను ఎలాగో

ధనుర్యాగానికి తీసుకొనిరావాలి. నందాదులను కప్పము పట్టుకొని, ధనుర్యాగాన్ని తిలకించడానికి రమ్మనాలి. రామకృష్ణుల్ని చంపించిన తరువాత వసుదేవాదులను వృష్ణి, భోజ, దాశార్హ వంశజులనూ, నా తండ్రియైన ఉగ్రసేనుణ్ణీ, పినతండ్రియైన దేవకునీ కడతేర్చుతాను. అప్పుడు నా స్నేహితులైన జరాసంధ, నరక, బాణ శంబరాదుల మైత్రితో ఈ భూమండలాన్నంతా నిష్కంటకముగ పాలిస్తాను. నీవు వెంటనేపోయి, ఆ పిల్లలను తీసుకొనిరావాలి" అని చెప్పిన కంసుని మాటలకు అక్రూరుడు ఖిన్నుడై ఇలా బదులు చెప్పాడు: "కంసరాజా! నీవు వెళ్ళుమంటే నేను వెళ్లకుండా ఉంటానా? మృత్యువునుండి తప్పించుకోవాలి అని నీవు ప్రయత్నించడం మంచిదే, కాని అది సిద్ధించడం, సిద్ధించకపోవడం దైవాధీనము కదా! నీవు కోరిన ప్రకారం నీ శత్రువులైన ఆ బాలురను తీసుకొనివస్తాను లే!" అని చెప్పి అక్రూరుడు వ్రేపల్లెకు ప్రయాణమయ్యాడు.

కంసుని ఆదేశము ప్రకారం అక్రూరుడునందగోకులమునకు రథముపై పయనమైనాడు. పరమానంద భరితుడై "ఆహా! ఏమి నా భాగ్యము! శ్రీకృష్ణుని దర్శించడమే కాకుండా, స్వయంగా నారథములో ఆ దేవుని కూర్చుండబెట్టుకొని తీసుకొనివెళ్లడం కూడాను! నాది ఎంత అదృష్టము.

**ఉ॥ ఎట్టితపంబుసేయబడె నెట్టి చరిత్రము లబ్ధమయ్యెనో**
**యెట్టి ధనంబులర్హులకు నీబడెనో తొలుబామునందు నా**
**యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులన్**
**పట్టగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడగల్గెడిన్. 1187**

గతజన్మలలో నేను ఎలాంటి తపస్సులు చేసి యుంటినో, ఎటువంటి సత్కర్మలనాచరించి, కీర్తిని పొంది యుంటినో, ఎలాంటి సత్పాత్రదానాలను చేసియుంటినో కదా! లేకుంటే ఆదిమునీంద్రులు సైతము యోగదృష్టిలోనైనా గ్రహించలేనట్టి బ్రహ్మమయుడు, పరమేశ్వరుడూ అయిన శ్రీహరిని నావంటి వివేకహీనునకు దర్శించే భాగ్యము కలుగుతుందా? పూర్వము పరమ భాగవతులు ఏదేవదేవుని పాదపద్మాల నాశ్రయించి, సంసారంలో చిక్కుకొనకుండా తరించారో, ఆ భగవంతుని పిలుచుకొని రమ్మని చెప్పి, కంసుడు నాయందు అకారణప్రేమను జూపి, స్నేహితునివలె నాకు ఎంతమేలు చేసినాడో కదా! ఇంతకూ ఆ కృష్ణమూర్తి నా గురించి ఏమనుకొంటాడో ఏమో!

**మ॥ "ఇతడా కంసుని చేతఁ బంపుపడి నన్ హింసింపనేతెంచి నాఁ**
**డతి దుష్టుం" డని చూచునో సకల భూతాంతర్బహిర్మధ్య సం**
**గతుడౌటం దలపోసి నన్ను సుజనుంగా జూచునో యెట్టి యు**
**న్నతి గావించునొ యేక్రియం బలుకునో నా భాగ్యమెట్లున్నదో? 1189**

"ఇతడు నన్ను హింసించడానికి ఆ కంసునిచే పంపబడగా వచ్చిన అతిదుష్టుడు" అని నా గురించి అనుకొంటాడో, లేక అందరియొక్క పుట్టుపూర్వోత్తరాలూ తెలిసియున్న వాడు గనుక నా ఆంతర్యాన్ని తెలుసుకొని నన్ను సజ్జనునిగా గుర్తించి నాతో ఎలాగ మాట్లాడి గౌరవిస్తాడో నా భాగ్యమెలాగున్నదో కదా! నేను ఈ సంధ్య వేళకు బృందావనం చేరుకొని, మాధవుని పాదాల చెంత దండాపతితుడనై (సాష్టాంగదండప్రణామాలు చేస్తూ) నమస్కరిస్తాను. ఆ కరుణామయుడు తన అభయహస్తాన్ని నా శిరస్సుపైనుంచి, చిరునవ్వుతో నాకు అభయమివ్వడా?" ఈ విధంగా తలపోస్తూ తన ఆలోచనలన్నిటినీ ఆ గోపాలకృష్ణునియందే కేంద్రీకరించి, అక్రూరుడు ఆ సాయంకాలమునకు బృందావనం చేరుకొన్నాడు. అప్పటికి గోవులు ఇళ్లకు చేరుకొన్నవి. గోపాలురు పాలుపితుకుతున్నారు. గోపికలు అడవినుండి తిరిగి వస్తున్న కృష్ణబలరాములను దారిలోనే దర్శించాలని వెళ్లియున్నారు.

అక్రూరుడు నందగృహంలో ప్రవేశించాడు. పన్నెండేళ్ల ప్రాయపు శ్రీకృష్ణ బలరాములను కన్నుల పండువుగా కాంచినాడు. భక్తిపరవశుడై ఆనందబాష్పాలు కట్టలు తెంచుకొని ప్రవహించగా వారి పాదాలకు శిరస్సు చేర్చి వినయంగా

మ్రొక్కాడు. భక్తవత్సలుడైన భగవంతుడు అక్రూరుని ఆలింగనం చేసుకొన్నాడు. అక్రూరుని భాగ్యమే భాగ్యము కదా! అతడు బలరామునకు ప్రణమిల్లినాడు. బలరాముడు అతనిని సాదరంగా కౌగలించుకొని ఆసీనుని చేసి, కాళ్లు కడిగాడు. నందుడు ప్రేమతో పలుకరించి ఆహ్వానించాడు. ప్రీతి భోజనాలు జరిగిన అనంతరం ప్రియాలాపాలు చేసుకొన్నారు. నందుడు ఇలా అడిగాడు: "అక్రూరా! క్రూరుడైన ఆ కంసుడు దాశార్హుపు వంశస్థులైన మిమ్మల్ని శాంతితో బ్రతుకనిస్తున్నాడా? మీరంతా ఎంత వ్యథతో అక్కడ ఉంటున్నారో మేము ఊహించుకొనగలం." అని అన్నాడు. కృష్ణుడు ఇలా అడిగాడు.

మ॥ శుభమే నీకు? ప్రమోదమే సఖులకుం జుట్టాలకున్ సేమమే?
అభయుంబే ప్రజకెల్ల? గోత్రజులకాత్మానందమే? మామ ము
క్తభయుండే వసుదేవ దేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవ వ్యాజనిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై. 1206

అక్రూరా! నీవు సుఖంగానున్నావా, సఖులు ఆనందంతోనున్నారా. చుట్టాలందరూ క్షేమమేకదా! ప్రజలు భద్రముగా నున్నారా, మామ భయము తీరి యున్నాడా? నన్ను కన్న నేరానికి కారాగారంలో బంధింపబడిన దేవకీ వసుదేవులు ప్రాణాలు నిలుపుకొని, ఇంకా బ్రతికే ఉన్నారా? నాకు వారేమైనా సందేశం పంపించారా? దీనులై

దుఃఖిస్తున్నారా? నీవు ఇక్కడికి వచ్చిన కారణమేమిటి?" అని కృష్ణుడు అడుగగా అక్రూరుడు అంతా సముచితంగా వివరించి చెప్పాడు. నారదుడు వచ్చి కంసునితో శ్రీకృష్ణబలరాముల జన్మరహస్యములగురించి, వారు ఎక్కడనున్నదీ చెప్పినప్పటినుంచీ కంసుడు ఎలాగ ప్రవర్తిస్తున్నాడో చెప్పాడు. ధనుర్యాగం మిషతో ఏవిధంగా వారిని రప్పించి, చంపించాలను కొంటున్నాడో చెప్పాడు. అంతా విని బలరామకృష్ణులు నవ్వుకొన్నారు. తప్పకుండా మామ కోర్కెను తీర్చడానికి మథుర వెళ్దామన్నారు. అది విని, నందరాజు గొల్ల పెద్దలతో ఇలా అన్నాడు : "కంసుడు చేయిస్తున్న ధనుర్యాగాన్ని దర్శించడానికి, పిలువనంపినాడు గనుక పాలు, పెరుగు, నెయ్యి, కానుకలు, కట్నాలు, పట్టుకొని మనమందరం వెళ్లాలి. అన్ని ఏర్పాట్లూ చెయ్యండి" అనగా అందరూ సిద్ధపడ్డారు.

అక్రూరుడు, కృష్ణబలరాములను మథురకు తీసుకొని పోవడానికి వచ్చాడని తెలుసుకొని, గోపవనితలు దిగ్భ్రమ చెందారు. గుంపులు గుంపులుగా చేరి, కృష్ణుడు లేని వారి జీవితం ఇకముందు ఎలాగ సాగుతుందో ఊహించుకొనలేక కలత చెందారు. వారిది అమాయకమైన, నిర్మలమైన, నిస్స్వార్థమైన, అనన్యమైన ప్రేమ. తమ ప్రేమావేశంతో రెక్కలు తెగిన పక్షులవలె నిస్సహాయులై, ఆ గోపికలు బ్రహ్మదేవునీ తమ మంద భాగ్యాన్నీ, తీసుకొపోడానికి వచ్చిన అక్రూరునీ, కృష్ణునీ నిందించారు. ఉక్రోషంతో నిస్పృహతో కంటతడిపెట్టుకొన్నారు. ఇలా అనుకొన్నారు: "ఎంతో పెద్దమనిషి అనుకొన్నాం. ఆబ్రహ్మదేవుడు ఒట్టి నిర్దయుడు. మా స్వామిని మానుండి విడదీసి వినోదింపనున్నాడు. ఈ కృష్ణుడు మాత్రము తక్కువవాడా! రమ్మనగానే వెళ్లిపోతానన్నాడే గాని, "నేను రాను, నన్నే సర్వస్వంగా నమ్ముకొన్న ఈ గోపికలను వట్టేట విడిచి నేనెలాగ రాగలను?" అని ఒక్కమాటైనా అన్నాడా? ఈ గొల్ల పెద్దలైనా "నాయనా, నీవెందుకు మథురకు వెళ్లడం? వద్దులే" అని అతనిని వారించారా? ఈ అక్రూరుడు పని గట్టుకొని ఇక్కడికెందుకు వచ్చేయాలి?

శా॥ అక్రూరుండని పేరుపెట్టుకొని నేడస్మన్మనోవల్ల భుం
జక్రిన్ మాకడ బాపి కొంచు నరుగన్ చర్చించి యేతెంచి నాఁ
డక్రూరుండట క్రూరుడీతడు నిజంబక్రూరుడౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవంబో విచారింపడే? 1214

అక్రూరుడు అని పేరు పెట్టుకొని, ఈ మహానుభావుడు మన మనోవల్లభుడైన చక్రిని మననుండి విడదీసి లాక్కొని పోవడానికి బాగా ఆలోచించుకొని వచ్చినాడు. ఇతడు అక్రూరుడట, కాదు, కాదు, క్రూరుడు. నిజంగా

అక్రూరుడే అయితే కృష్ణుని ఇక్కడే విడిచిపెట్టి తిన్నగా తాను వచ్చిన త్రోవనే వెళ్లిపోవాలని అనుకొనడేమి? ఈ నల్లనయ్య శృంగారవతులైన ఆ నగరకాంతలతో స్నేహం చేసి, ఈ గొల్లపడుచుల్ని ఇకనెందుకు గుర్తుంచుకొంటాడు? ఎంతైనా, ఇతడు రాచరికపు బిడ్డడే కదా! ఇప్పుడు మనమేం చెయ్యాలి?

మ॥ హరినేలా కొనిపోయెదంచు మనమా యక్రూరుఁ బ్రార్థింతమా
హరిఁ బోనీకుడు నిల్పరే యనుచు నేఁడర్చింతమా వేల్పులన్
హరిపాదంబులకడ్డముల్ వడుదమా హా దైవమా! యంచు నా
తరుణుల్ కొప్పులు చీరలున్ మరచి కందర్పజ్వరభ్రాంతలై 1218

మా ప్రాణమే అయిన ఆ శ్రీహరినేల కొనిపోతున్నావయ్యా అక్రూరా! అతన్ని విడిచిపెట్టివెళ్లు అని వేడుకొందామా! మమ్మల్ని విడిచి వెళ్లనివ్వకుండా, శ్రీహరిని నిలపండి అని దేవతలకు పూజలు చేద్దామా, లేదా నేరుగా వెళ్లి మన కృష్ణుని పాదాలు కదలకుండా అడ్డంగా పడిపోదామా? అనుకొంటూ చెదిరిన జుట్టులతో చీరకట్టులు కూడ సర్దుకోవడం మరచి హతాశలై, ప్రేమజ్వరంతో మతిస్తిమితం లేనివారైనారు గోపికలు. మమ్మల్ని రక్షించి ఆదుకొనవా మాధవా! దామోదరా! అని కన్నీటి ధారలు వర్షించేటట్లు రోదించారు. వశంతప్పినవారై పరితపించారు.

మరునాటి ఉదయాన నందాది ముఖ్యులందరూ మథురకు ప్రయాణమయ్యారు. బండ్లనిండా పాలు, పెరుగు, నెయ్యి మొదలైన కానుకలను పెట్టుకొని బయలుదేరారు. గోపికలందరూ అక్రూరుని రథం వెంట పరుగెత్తుతూ తామూ వస్తామని గోలపెట్టారు. "నేను మళ్లీ వస్తాను. మీరు నిలిచిపొండి" అని కృష్ణుడు దూతికల ద్వారా చెప్పి పంపించాడు, బలరామసహితుడై అక్రూరునితో ముందుకు సాగిపోయాడు. అంతటితో శ్రీకృష్ణుని బృందావనవాసము సమాప్తమయినది.

బలరామకృష్ణులు దారిలో రథాన్ని ఆపి, కాళిందీ నదీ జలములను త్రాగి వచ్చి, మళ్లీ రథంపై ఆసీనులయ్యారు. అక్రూరుడు వారి అనుజ్ఞను పొంది, కాళిందీనదిలో స్నానం చెయ్యడానికి వెళ్లాడు. యథావిధిగా మంత్రాలను పఠిస్తూ స్నానమాచరిస్తున్నాడు.

## శ్రీకృష్ణుని ఆగమనము - మథురాపురలీలలు

రథములో కూర్చొని యుండిన బలరామకృష్ణులు స్నానము చేస్తున్న అక్రూరునకు యమునాజలములలో కనిపించారు. అరే! రథాసీనులైయున్న ఈ బాలురు ఇంతలో ఈ నది మధ్యకు ఎలాగ వచ్చారు. అని ఆశ్చర్యపోయిన అక్రూరుడు లేచి నిల్చొని రథంవైపు చూచాడు. అన్నదమ్ములిద్దరూ రథంలోనే కూర్చొని ముచ్చటించుకొంటూ నవ్వుకొంటున్నారు. "ఇదేమి వింత! రథములోనూ, నదిలోనూ ఒకేసారి ఉండడం ఎలాగ సాధ్యపడుతుంది? నామతి భ్రమించడం లేదుగదా!" అనుకొని, కళ్లునులుముకుంటూ, మళ్లీ స్పష్టంగా చూడాలి అనుకొని నీట మునిగాడు. ఆ నదిమధ్యలోను కనిపించారు. ఫణిరాజైన ఆదిశేషుడు వేయి పడగలతో రాజ వేషములో రత్నమణి భూషణాలతో మెరసిపోతున్నాడు. శేషశాయియై, పీతాంబర ధారియై, శాంతాకారుడై, చతుర్భుజుడై, సర్వాలంకార శోభితుడై దర్శనమిచ్చాడు నీల మేఘశ్యాముడు. బ్రహ్మ రుద్రాది దేవతలు, సనకాది మునులు, నందసనందాది పార్షదులు, ప్రహ్లాద నారదాది భాగవతోత్తములు చుట్టూచేరి దివ్యస్తోత్రాలు చేస్తున్నారు. ద్వాదశ శక్తులతో కూడి శ్రీదేవి సేవచేస్తున్నది. ఇటువంటి అపూర్వమైన అద్భుతమైన దివ్యదర్శనాన్ని గాంచినాడు మహా భాగ్యశాలి అయిన అక్రూరుడు, ఒక్కక్షణంపాటు నోట మాటరాక, భక్తి సంభ్రమాలతో ఇలాగ స్తుతించాడు:

### అక్రూరస్తుతి

శ్రీమానినీ మానసచోరా! శుభాకారా! ప్రళయజలధిలో క్రీడించే శ్రీమన్నారాయణా! వటపత్రశయనా! చతుర్ముఖ బ్రహ్మోద్భవ పద్మనాభా! నీ మహిమను తెలుసుకొనడానికిగాని, వర్ణించడానికి గాని, ఆ బ్రహ్మకు కూడా సాధ్యపడదు

గదా! నీవు అంతర్యామివి, సర్వసాక్షివి, ఈశ్వరుడవు. నిన్ను జ్ఞానులు, భక్తులు, యోగులు, పలువిధాల కొలుస్తారు. వేర్వేరు మార్గాలలో ప్రవహించే నదులన్నీ సముద్రాన్నే ప్రవేశించునట్లు అన్ని మార్గాల యొక్క గమ్యము నీవే కదా ప్రభూ! నీవు అన్నింటా అంతటా నిండియున్నావు. నీకు అందరూ సమానమే! మత్స్యరూపంలో వేదాలను సంరక్షించావు. హయగ్రీవుడవై మధుకైటభులను హతమార్చినావు. కూర్మరూపుడవై మందరగిరినెత్తినావు. వరాహుడవై భూమండలాన్ని ఉద్ధరించి హిరణ్యాక్షుని అంతం చేసినావు. నరసింహుడవై భక్త శిరోమణి అయిన ప్రహ్లాదుని రక్షించి, హిరణ్యకశిపుని శిక్షించావు. వామనుడవై బలిచక్రవర్తి గర్వమణచి అనుగ్రహించావు. భార్గవ రాముడవై దుష్టక్షత్రియులను దునుమాడినావు. దశరథ రాముడవై దశకంఠ రావణుని హతమార్చినావు. వాసుదేవుడవై వసుంధర భారాన్ని బాపనున్నావు. కల్కిరూపుడవై లోకకల్యాణమే చేయనున్నావు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపుడవై సృష్టి, స్థితి, సంహార, శాస్త్రధర్మరక్షణ, నిర్వహణ కార్యాలను జరుపుతావు. నీకు నా ప్రణామాలు. కృష్ణా! పరమేశ్వరా! నిన్ను తెలుసుకొనలేని అజ్ఞుడనైన నేను నిన్ను స్తుతించగలనా స్వామీ! నీ మాయలోనే మునిగి, ప్రవర్తిస్తున్నవానిని, సంసార దుఃఖములోనున్న వానిని, నన్ను కరుణించి అనుగ్రహించు. నీకు నా దండ ప్రణామాలు" అని స్తుతించిన అక్రూరుని దృష్టినుండి స్వామి తన దివ్య దర్శనాన్ని ఉపసంహరించుకొన్నాడు. అక్రూరుడు నదినుండి రథం వద్దకు తిరిగి వచ్చాడు. అప్పుడు కృష్ణుడిలా అడిగాడు: "అక్రూరా! నీవు స్నానానికి వెళ్లి చాలా సేపయినదే! నదికూడా అంతదూరమేమీ కాదు కదా! అక్కడ నీటిలోగాని, భూమిపైగాని, ఆకాశంలోగాని ఏదైనా వింత విషయం కనిపించినదా?" అని అడుగగా అక్రూరుడిలా అంటాడు. "ఓ మహానుభావా! నీలోలేని వింతలు ఏలోకాలలోనైనా ఉంటాయా? ఇక నీటిలోనూ నింగిలోనూ మాత్రమెలాగుంటాయి" అని వడివడిగా రథాన్ని నడపసాగాడు. సాయంకాలానికి మధురాపురి పొలిమేరలకు చేరుకొన్నారు. అప్పటికే బళ్లతోనక్కడకు చేరుకొన్న నందాదులు బస ఏర్పాటు చేసియుండడం చూచి, రామకృష్ణులు అక్కడ దిగిపోయి, అక్రూరుని "పోయి తమ రాకను గురించి కంసునకు తెలియజేయు"మన్నారు. అక్రూరుడు బలరామకృష్ణులను తమ మిత్ర బృందముతో సహా తన గృహానికి విచ్చేసి, తన ఆతిథ్యాన్ని స్వీకరించి, తన ఇంటిని పావనం చేయుడని వేడుకొన్నాడు. అప్పుడు కృష్ణుడు తాము వచ్చిన పని పూర్తి అయిన (కంస సంహారం) తరువాత వస్తామని మాట ఇచ్చి పంపించివేశాడు.

అక్రూరుడు కంసుని వద్దకు వెళ్లి బలరామకృష్ణ నందాదుల రాకను తెలియజేశాడు. ఆ తరువాత కృష్ణుడు, బలరామ, గోపకుమారులతో కూడి, మధురా నగర సందర్శనానికి బయలుదేరాడు. సుందరవదనలు, సుందర భవనాలు, కోటలు, రాజభవనాలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు, ఉద్యానాలూ అంగడులు మొదలైనవాటి శోభలతోనున్న మధురానగర విలాసాలను తిలకించారు. ఆ పురవీథులలో నడుస్తున్న గోపాల చూడామణిని చూచి, రమణులు ఇలా అనుకొంటున్నారు. వారు ఇదివరకే నందనందనుని యొక్క లీలా వినోద గాథలను విని యున్నవారు గనుక అతనిని చూచి తరించాలనుకొన్నారు.

ఉ॥ నందతపఃఫలంబు సుగుణంబులపుంజము గోపకామినీ
బృందమునోముపంట సిరివిందు దయాంబుధి యోగిబృందముల్
డెందములందుఁ గోరెడు కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార! రండు చనిచూతము కన్నుల కోర్కె తీరగన్. 1245

(కడింది = అపురూపమైన)

అనుకొంటూ అందకత్తెలందరూ గోవింద సందర్శనోత్సాహులై ఒకరి నొకరు పిలుచుకొంటూ వెళ్లారు. వారు చేస్తున్న పనులన్నీ ఎక్కడివక్కడే విడిచి, తొందరలో సరిగా అలంకరించుకొనడం కూడ మరచిపోయి పరుగెత్తారు. మేడలపైన, మిద్దెలపైన, ఎత్తైన అరుగులపైన ఎక్కి, నిల్చొని, నిక్కినిక్కి చూడసాగారు. అప్పటికే వారందరికీ శ్రీకృష్ణుని బాలలీలలన్నీ తెలిసియుండెను. ఇలాగ అనుకొన్నారు:

సీ॥ వీడటే రక్కసి విగత జీవగఁ జన్నుఁబాలుఁద్రావిన మేటి బాలకుండు
వీడటే నందునివెలదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాడు
వీడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాపరీడు
వీడటే యెలయించి వ్రేతలమానంబు చూరలాడిన లోకసుందరుండు

తే॥ వీడులేకున్న పుర మటవీస్థలంబు వీని పొందని జన్మంబు విగత ఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగ రుతము వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు. 1248

చెలియా! ఇతడేనటే రాక్షసి చనుపాలు త్రాగి దాని ప్రాణాలు హరించిన ఆ అద్భుతబాలకుడు, ఇతడేనటే నందుని భార్యకు తన నోటిలో విశ్వమంతటినీ చూపిన దివ్య బాలుడు, ఇతడేనటే గోకులంలో వెన్నలను దొంగిలించి తినిన కొంటె బాలుడు. ఇతడేనటే గొల్ల కన్యల మనస్సులను దొంగిలించిన సుందరుడు. ఇతడు లేని ఊరు అడవియే, ఇతనిని పొందలేని జన్మ నిష్ఫలము, ఇతనిని స్తుతించని వాక్కు పక్షి అరుపే, ఇతనిని దర్శించలేని చూడ్కులు వ్యర్థయే. ఇతనిని ఆ గోకులంలోని పడుచులందరూ లాలిస్తూ, స్పృశిస్తూ, అతనితో సంభాషిస్తూ, నవ్వుతూ, నాట్యం చేయిస్తూ, అతనినే ధ్యానిస్తూ నిత్యమూ ఆనందిస్తుంటారట. వారు పూర్వ జన్మలలో ఎలాంటి తపస్సులు చేసియుండిరో కదా!" అనుకొంటూ ఆ మథురాపుర వనితలు తమ నేత్రాలతో శ్రీకృష్ణ రూపాన్ని నేత్రపర్వంగా తిలకిస్తూ హృదయాలలో నింపుకొని, ఆ రూపాన్ని అక్కడ పదిలపరచుకొన్నారు. మథురా పుర ప్రజలు బ్రాహ్మణులు, బలరామ కృష్ణులను పలువిధాలుగా పూజించారు.

బలరామకృష్ణులు, వారి స్నేహితులు మథురానగర వీథుల్లో నడచి వెళ్తుండగా, ఉతికిన బట్టలు పట్టుకొని వెళ్తున్న ఒక చాకలి వానిని చూచారు. వానిని నిలిపి కృష్ణుడు ఇలా అన్నాడు: " ఓ రజక శ్రేష్ఠా! మేము మీ రాజుగారి అతిథులము. అతని మేనల్లుళ్లం కూడాను. ధనుర్యాగం చూడవచ్చినాము. ధరించడానికి మాకు మంచి దుస్తులు లేవు. నీ మూటలోనివి కొన్ని మాకు ఇస్తే, నీకు మేలు కలుగుతుంది" అన్నాడు. ఆ రజకుడు మిక్కిలి రోషావేశపరుడై, పొగరుబోతుగా ఇలాగ వాగాడు: "ఏమిరా గొల్లడింభకా! పాలూ నెయ్యీ తిని క్రొవ్విక్కినట్టున్నావు. నేనెవరినో తెలుసా? కంస రాజుయొక్క రజకుని. రాజుగారి వస్త్రాలు మీకు కావాలా, వాటిని ధరించే అర్హత మీకున్నదా? మా రాజ భటులు చూస్తే మీకు దేహశుద్ధి చేస్తారు. మా మహారాజునకు తెలిస్తే మీ తలలు ఎగిరిపోతాయి. మీకింత పొగరా? మీదారిని మీరు పోతారా ప్రాణాలు పోగొట్టుకుంటారా?" అని వదరుతున్న ఆ చాకలివానిపై శ్రీకృష్ణుడు కోపగించుకొని, చేతితో ఒక్కవేటువేసే సరికి వాడు చచ్చి పడ్డాడు. కృష్ణ బలరామాదులు వారికి కావలసిన దుస్తులను తీసుకొని, మిగిలిన వాటిని అక్కడే విడిచి, ముందుకు సాగిపోయారు.

ఒక చేనేత పనివాడు, ఎదురుగావచ్చి, వారికి చక్కని వస్త్రాలను అర్పించాడు. వాటిని వారు ప్రీతితో స్వీకరించి, ఆ పనివానికి సంపదను అనుగ్రహించారు.

తరువాత పూలమాలలనుకట్టే సుదాముని ఇంటికి వారు వెళ్లారు. సుదాముడు వారిని అర్ఘ్య పాద్యాలతో సత్కరించి ఆదరించాడు. ఆనందం పెల్లుబుకగా అతడు ఇలా అన్నాడు:

"భూమండలాన్ని సంరక్షించడానికి అవతరించిన మహానుభావులు మీరు. మీ రాకవలన మా వంశము పావనమైనది. నా తపస్సు ఫలించినది. నాజన్మ సార్థకమయినది. నా గృహము లక్ష్మీకరమైనది. నా కోరికలు తీరినవి. ఇక నేనేమి చెయ్యాలో, ఎలాగ నడుచుకొనాలో ఈ దాసునకుసెలవియ్యండి." అని పలికి, రామకృష్ణులను సుగంధపుష్పమాలలతో నలంకరించి పూజించాడు. వారు మిక్కిలి సంతసించి, వరమిస్తాం కోరుకొనుము అన్నారు. అతడు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు. "స్వామీ! నీ దర్శనము, పాదస్పర్శనములే సర్వసౌభాగ్యాలకంటే ఉత్తమోత్తమము. అవి నాకు లభించాయి. నా జన్మ తరించినది. నాకు ఇంకేమి కావాలి?

క॥ నీ పాదకమలసేవయు నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును తాపసమందార! నాకు దయసేయగదే.

ఇలాంటి ఉత్తమమైన కోరికను కోరిన సుదాముని యందు స్వామి సంతుష్టుడై "తథాస్తు" అని, సుదామునకు బలము, ఆయుస్సు, ఐశ్వర్యము, తేజస్సు, యశస్సు అన్నీ అడుగకుండానే అనుగ్రహించాడు. అందరూ మళ్లీ రాజవీథిలో నడవసాగారు.

వారికి దారిలో ఒక స్త్రీ ఎదురుపడినది. ఆమె సుగంధ లేపనాలు, చందనము, అత్తరులు కంసునకై తీసుకొనివెళ్లుతున్నది. ఆమె చాలా సౌందర్యవతి. కాని శరీరము మూడు వంకరలుగా నుండడంచేత గూనిగా నడుస్తుంది. కృష్ణుడు ఆమె యందు జాలిపడి, ఆమెను పలుకరించాడు. "ఓ మానినీ! నీవెవ్వరి దానవు? నీ పేరేమి? ఈ లేపనాలను ఎవరికోసం తీసుకొనివెళ్తున్నావు? వీటిని మాకిస్తే చక్కని దానవు అవుతావు" అనగా కృష్ణుడు తన వక్ర రూపం చూసి గేలి చేస్తున్నాడని భావించి, ఆమె ఇలా అన్నది.

ఉ॥ చక్కనివాడ వాడు సరసంబుల నొంపకు మెల్లవారికిన్
చక్కదనంబులెక్కడివి చారుశరీర త్రివక్రయంద్రు నే
నిక్కము కంసుదాసిని వినిర్మల లేపన విద్యదాన నన్
మిక్కిలి రాజు మెచ్చుఁదగ మీరు విలేపనముల్ ధరింపరే. 1276

ఓ సుందర శరీరుడా! నీవైతే చూడచక్కని వాడవేగాని, చక్కగాలేని వారిని చూచి పరిహాసాలాడబోకుము అందరికీ చక్కదనాలెక్కడినుండి వస్తాయి. నన్ను అందరూ త్రివక్ర అంటారు. నేను కంసరాజు గృహంలో సైరంధ్రిని. చక్కని సుగంధలేపనాలను తయారుచేసి రాజునకు పూస్తాను. అతడు నా సేవను నిజంగా మెచ్చుకొంటాడు. మీరుకూడా నేనిచ్చే లేపనాలను పూసుకొంటారా?" అని అమాయకంగా అడిగిన ఆ సుందరిపట్ల స్వామి జాలిపడి ఆమెసేవను స్వీకరించి, ఆమె అవిటితనాన్ని తొలగించ సంకల్పించాడు. ఆమె రామకృష్ణుల సుందరవిగ్రహాలకు లేపనాలు పూసినది. కన్నుల పండువుగా ఆ మనోహరరూపాలను తిలకించి, ప్రేమతో హృదయంలో పదిలపరుచుకొన్నది. శ్రీకృష్ణుడు ఆమెరెండుపాదాలను తనపాదాలతో అదిమిపెట్టి, తనరెండు చేతులతో ఆమెయొక్క గడ్డమును, తలను పట్టుకొని పైకిలేవనెత్తాడు. ఆమెశరీరము వంపులుతీరి తిన్ననైనది. ఆమె ఒక సర్వాంగసుందరియై నిల్చున్నది. స్వామిస్పర్శతో ఆమె పరవశించిపోయినది. స్వామిని మనసారా కాంక్షించినది. తన ఇంటికి రమ్మని ఆహ్వానించినది. కృష్ణుడు తాను వచ్చినపనిని ముగించుకొన్న తరువాత వస్తానులే అని చెప్పి, ముందుకు సాగిపోయాడు.

## మథురావిజయము - కంసాదిదుష్టులసంహారము

శ్రీకృష్ణబలరామాదులు మథురాపురి రాజవీథులను తిలకిస్తూ నడిచివెళ్లుతుంటే పురప్రజలు వారికి పుష్పహారాలు, హారతులు కానుకలు ఇస్తుండేవారు. స్త్రీలు వారి సుందరరూపాలనుచూచి ముగ్ధలైనారు. కృష్ణాదులు ధనుశ్శాలకు వెళ్లినారు. అనేకమంది యోధులచే కాపాడబడుతున్న ఆగొప్పధనుస్సును భటులు వారిస్తున్నా వినకుండా శ్రీకృష్ణుడు ఎడమచేతితోపైకెత్తి ఎక్కుపెట్టి, నారిని మొరయిస్తూ చెరకు గడనువిరిచినట్లు దానిని విరిచివేశాడు. ఆ శబ్దానికి దిక్కులు మారుమ్రోగాయి. కంసుడు హడలిపోయాడు. సైనికులు రామకృష్ణులను వధించడానికి ముందుకువచ్చారు. విరిగిపోయిన ధనుస్సు ముక్కలతో రామకృష్ణులు ఆ సైనికులందరినీ అంతముచేశారు. వీరవిహారము ముగించుకొని, అందరూ బసకు చేరుకొన్నారు.

ధనుర్భంగము గురించి పురప్రజలు తెలుసుకొని, ఆ యువకులు సుందరవిగ్రహులే కాకుండా సింహబలులుకూడాను అని ఆశ్చర్యపోయారు. వీరిని కంసుడు బ్రతకనిస్తాడా? అని భయపడ్డారు. కంసుడు అంతా తెలుసుకొన్నాడు. కలతజెందాడు. నిద్రపట్టలేదు. దుస్స్వప్నాలు దాడిచేశాయి. మరణమాసన్నమయినదనుకొన్నాడు. ఏ క్షణాన మృత్యువు కృష్ణరూపంలో రానున్నదో అని భయంతో త్రుళ్లిపడుతున్నాడు.

## గజ, మల్లురవధ

కంసుని వ్యూహము ప్రకారము అన్ని ఏర్పాట్లూ జరిగినవి. మల్లయుద్ధరంగము సిద్ధముగా నున్నది. సైనికులు చుట్టూ సిద్ధముగా నిల్చున్నారు. పతాకాలు, తోరణాలతో అంతాకలకలలాడుతున్నది. మంత్రులు, సామంతులు, పురపెద్దలు, ఆహ్వానితులు, పురుషులు, స్త్రీలు అందరూ తమతమ స్థానాలలో ఆసీనులైనారు. ఉన్నతమైనమంచెపై కంసుడు, ఉచితాసనాలపై అతని ముఖ్యసన్నిహితులు కూర్చున్నారు. వాద్యాలు మ్రోగుతున్నవి. పర్వతాకారులైన మల్లులు జబ్బలను, తొడలను చరచుకొంటూ, కండలు ప్రదర్శించుకొంటూ, మల్లరంగమంతా భీకరంగా కదంత్రొక్కుతున్నారు. చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, శలుడు, తోశలుడు అనే ముఖ్యులేగాక ఇంకా ఇతర మల్లులు కూడ ఉన్నారు. వారిగురువులుకూడ వారిని ప్రోత్సహించడానికివచ్చి కూర్చున్నారు. ప్రేక్షకులంతా ఏమిజరుగనున్నదో? అని ఎదురుచూస్తున్నారు.

బలరామకృష్ణులు చక్కగా అలంకరించుకొని, ఠీవిగా నడచుకొంటూ మల్లరంగ ద్వారం వద్దకువచ్చారు. కాని ప్రవేశించడానికి వీలులేకుండా అడ్డంగా ఐరావతంలాంటి మహాకాయంతో కువలయాపీడమనే పేరుగల కంసుని ఏనుగు అక్కడనిల్చున్నది. రామకృష్ణులను చూడగనే మావటివాడు ఏనుగును వారిపైకి పురికొల్పడం చూచిన కృష్ణుడు మావటివానితో భూమిదద్దరిల్లే స్వరంతో ఇలా అన్నాడు. ఓరీ అంబష్ఠా! ఏనుగును ప్రక్కకు తొలగించు. లేకుంటే దానితోపాటు నిన్నుకూడ యమపురికి పంపిస్తాను" అని గద్దించినా, వాడు లక్ష్యపెట్టకుండా, దానిని కృష్ణునిమీదికి పురిగొల్పాడు. అది పరుగునపోయి కృష్ణుని తన తొండముతో కాలసర్పంలాగ చుట్టివేసినది. కృష్ణుడు దాని పట్టునుండి జారిపోయి, దానికాళ్లమధ్యదూరాడు. ఏనుగు తన తొండముతో అంతటా తడిమి, తనకాళ్ల మధ్యనున్న బాలుని పట్టుకొనబోయినది. కృష్ణుడు దాని వెనుకకాళ్ల మధ్యనుండి బైటకువచ్చి, దానితోకనుపట్టుకొని, వెనుకకు ఈడ్చి, బొమ్మను త్రిప్పునట్టుగా గిరగిరాత్రిప్పి, ఏబదిగజాలదూరానికి విసిరివేశాడు. అది ఎలాగోలేచి, భయంకర మృత్యుదేవతవలె విజృంభించి, కృష్ణునిమీదపడబోయినది. అతడు చెంగున దానిమీదికి ఉరికి, పిడికిటితో దాని కుంభస్థలాన్ని మొత్తగా అదిబ్రద్దలయినది. ఏనుగు మళ్లీతేరుకొని, దంతాలతో పొడవబోతే, కృష్ణుడు ఆ దంతాలను పట్టుకొని, ఏనుగును వెనుకకు నెట్టుతూ దాన్నినేలపడదోసి, దంతాలను పీకివేసి వాటితోనే దానిని కొట్టికొట్టి సంహరించినాడు. తరువాత ఏనుగును తనపైకి పురిగొల్పిన మావటివానిని, ప్రక్కనుంచి ఏనుగును గోలచేసి రెచ్చకొట్టిన ఇతర దుష్టులను ఆ దంతాలతోనేకొట్టి చంపాడు. కువలయాపీడముయొక్క పీడను వదలించుకొనిన తరువాత బలరామకృష్ణులు ఏనుగుదంతాలను భుజాలపై పెట్టుకొని, తమమిత్రులు జైజై ధ్వనులు చేస్తుండగా, ప్రేక్షకులు శబాష్ అంటుండగా విజేతలై మల్లరంగాన్ని ప్రవేశించారు.

శ్రీకృష్ణుడు అక్కడచేరియున్న ప్రజలకు ఒక్కొక్కరికీ ఒక్కొక్కలాగ కనిపించసాగాడు. కంసునకు ప్రత్యక్ష మృత్యువుగను, మల్లులకు యమునిగను, ప్రజలకు ధర్మప్రభువుగను, పడుచుపిల్లలకు నవమన్మథునిగను, మూర్ఖులకు గొల్లకుర్రనిగను, దుర్మార్గులకు శత్రువుగను, భక్తులకు భగవంతునిగను, యోగులకు పరబ్రహ్మముగను ప్రకాశించినాడు. ప్రజలు ఆదివ్యసుందరమూర్తిని కన్నులార్పకుండా చూడసాగారు. వారు ఇలా అనుకొనసాగారు: "వీరు నారాయణాంశతో దేవకీవసుదేవులకు జన్మించి, నందునియింట పెరిగినారు. వీరిని సామాన్యబాలురని భావించరాదు. ఆ నల్లనివాడు కృష్ణుడు. అతడెవరనుకొన్నారు?

సీ॥ చంపె రక్కసిఁబట్టి; చక్రవాకుఁనిగూల్చె; పడఁద్రొబ్బె మద్దుల; బకుని చీరె;
నఘదైత్యుఁ బొరిగొనె; నడరివత్సకుఁద్రుంచె; గిరియెత్తె; దేవేంద్రుఁగ్రిందుపరచె
కాళియు మర్దించె; గహనానలముఁద్రావె; కేశి నంతకుపురికేపకనిచె
మయుపుత్రుఁ బరిమార్చె; మరియు దానవభటులమర్దించి గోపకులఁగాచె
తే॥ గోపకాంతల మనములఁగోర్కె తీర్చె; నీసరోరుహలోచనుం డీ శుభాంగు
డీ మహామహుడీ దిగ్గజేంద్ర విభుడు; మనుజమాత్రుడె? తలపోయ మాధవుండు 1328

ఈ మహామహుడు సాక్షాత్తు మాధవుడేగాని మానవమాత్రుడుకాడు, ఏలనన పూతన, తృణావర్త, అఘాసుర, వత్సాసుర, కేశి, వ్యోమాసురాది అసురులను అంతమొందించాడు: మద్దిచెట్లను కూల్చాడు, గోవర్ధనగిరినెత్తి ఇంద్రుని గర్వమణచాడు. నందుని రక్షించాడు, గోపికల కోరికను తీర్చాడు. ఇంకెన్నెన్నో, మానవులుచెయ్యలేని మహత్కార్యాలను చేశాడు.

మల్లరంగంలో ప్రవేశించిన బలరామకృష్ణులను చూచి ప్రేక్షకులలోని సజ్జనులు ఇలా అనుకొన్నారు: "అయ్యో! ఏనుగులలాంటి ముష్కరులైన ఈరాక్షసులను ఎదుర్కొనడానికి ఈ పసిబాలకులు ఎందుకు సాహసిస్తున్నారో కదా! వద్దు, ఇది సమానఉజ్జీకాదు, అని, వాళ్ల తలిదండ్రులు ఎందుకువారించకున్నారు?" అని తలపోయసాగారు. వాళ్లనుచూచి హేళనగా చాణూరుడు ఇలా అన్నాడు:

"ఓహో! మహావీరులు వచ్చారా? రండి రండి. అడవుల్లో ఆవులనుమేపుకొంటూ మీగొల్లపిల్లలందరూ మల్లయుద్ధాలు చేసుకొంటూ మంచిపేరుగడించారటకదా! మీ శక్తిసామర్థ్యాలేమిటో చూడాలని, మారాజు ముచ్చటపడి మిమ్మల్ని రప్పించాడు. ఈప్రజలంతా వినోదించడానికి మనం ఒక్క పట్టు పడదామా? నీ జవసత్త్వాలు బాగున్నవా? సాముచెయ్యగలవా? ఒంట్లోశక్తి ఉన్నదా, లేకపోతే రాజునకుచెప్పి, పాలుతెప్పించుమంటావా? నాపిడికిటిపోటు, పిడుగులాంటిది సుమా! వెన్నముద్దకాదు మింగడానికి," అని వికారంగా నవ్వాడు చాణూరుడు. దానికి జవాబుగా కృష్ణుడిలా అన్నాడు. "ఔనుమరి! మేముచిన్నవాళ్లము. సత్తువ ఎలాగుంటుంది? సాములు ఎలాగతెలుస్తాయి? గొల్లవాళ్లము, రాజునకువినోదంకలిగించే నేర్పు ఎలాగవస్తుంది మాకు? మరి మీరో! మల్లయుద్ధవిశారదులు. వజ్రములాంటి శరీరము కలవారు, మీతో మేము తలపడగలమా? అయినా మీ ఆహ్వానాన్ని కాదంటే, మీకు అవమానం కాదా! నేను నీతోనూ, మాఅన్న ముష్టికునితోనూ తలపడుతాం. మల్లయుద్ధం చేసి మీ రాజునకు ప్రీతి కలిగిద్దాం." అనిచెప్పగా చాణూరుడిలా అన్నాడు: "ఓరీ గొల్లడింభకా! నాతోపోరాడడానికి, నీవేపాటివాడవు? నేను మల్లయుద్ధంలో జగత్ప్రసిద్ధుడను. ఈ మల్లయుద్ధంలోపోరడం అంటే గోపికల ముందు కుప్పిగంతులు వేయడంఅనుకొన్నావా? బాగా ఆలోచించుకొనుము. ఈ చాణూరుడంటే ఎవడో నీకు తెలియదు. బ్రహ్మనూ శివునికూడ లెక్కచెయ్యడు. నీవేపాటివాడవు. ఏదో, మా రాజుకోర్కెతీర్చాలని నీతో యుద్ధంచెయ్యడానికి వచ్చానుగాని కాచుకొనుము. నానుండి తప్పించుకొని ఎక్కడికీపోలేవు. మీతల్లితండ్రులకు చెప్పి వచ్చావా?" అంటూ భీకరాకారముతో కృష్ణుని వైపు నడిచాడు. కృష్ణుడు ఎదుర్కొన్నాడు. సింహం సింహంతోను, ఏనుగు ఏనుగుతోను, కొండ కొండతోను ఢీకొన్నట్లు ఇద్దరూ భీకరంగా పోరాడారు. పిడికిళ్లతో గుద్దుకొన్నారు. ఇద్దరూ అనేక మల్ల బంధాలు ప్రదర్శించారు. కృష్ణుడు ఎన్నిసార్లు ఆ మహాకాయుని నేలపడవేసినా, నిపుణుడైన ఆ మల్లుడు లేచిపోయి మళ్లీ విజృంభించేవాడు. ఒకసారి ఏనుగులాంటి చాణూరుడు కృష్ణుని కాళ్లలో కాలు పెట్టి, పడవేసి, మీదపడగా కృష్ణుడు తప్పించుకొంటే, వాడు నేల కరిచి పడిపోయాడు. కృష్ణుడు చెంగున ఎగిరి, వానిపై నిల్చున్నాడు. అదే సమయంలో బలరాముడు ముష్టికునితో భయంకరంగా పోరాడుతున్నాడు. అన్నదమ్ములిద్దరూ, మహాకాయులైన మేటి మల్లులతో బాహాబాహీ పోరాడుతుంటే, ప్రేక్షకులు ఆందోళనతో ఇలాగ అనుకోసాగారు: "అయ్యో! ఈ కంసుడు ఎంతటి క్రూరుడు? కుసుమకోమల శరీరులైన ఈ చిన్నారుల మీదికి జగజెట్టులైన రాక్షసులను ప్రయోగించి వినోదిస్తున్నాడు. ఈ సభలోని పెద్దలైనా ఈ అసమానమైన జోడుకుదురదని, మల్లయుద్ధం అధర్మమని చెప్పి, ఆపించరేమి?" అనుకొన్నారు. యువతులు, బలరామకృష్ణులనుచూచి, ఇలాగ తలపోశారు: "ఆ గోకులంలోని గోపికలు ఎంత అదృష్టవతులో కదా! వీరితో సదావినోదించే భాగ్యము వాళ్లకే దక్కినది" అని. ఇతరులు ఇలా అనుకొన్నారు: రోజంతా ఈ గోపాలచూడామణితో కలసిమెలసి తిరిగే ఆ గోపాలకులు ఎంతటి ధన్యాత్ములో కదా!" అని పలువిధాల అనుకొన్నారు.

చాణూరునిమీద ఎక్కినిల్చున్న శ్రీకృష్ణునికి ప్రేక్షకుల యొక్క ఆందోళన సానుభూతి తెలియవచ్చి, ఇక ఈ ఆటను త్వరగా ముగించాలని అనుకొన్నాడు. వజ్రపాతాలలాగ తన పాదాలతోను పిడికిళ్లతోను, మోకాళ్లతోనూ

మల్లుని పొడవసాగాడు. వానిబిగి సడలినది. శక్తి సన్నగిల్లినది. అయినా ఇటూఅటూ కొట్టుకొంటూ లేచినిల్చొని కృష్ణునిపై పడబోయాడు. కృష్ణుడు వాని చేతులను పట్టుకొని, బొమ్మను త్రిప్పినట్టు గిరగిరాత్రిప్పి, ఆ మహాకాయుని నేలకువేసికొట్టగా, వాడు ప్రాణంవిడిచాడు. అదే సమయంలో బలభద్రుడుకూడ ముష్టికుని గిరగిరాత్రిప్పి, నేలకేసి కొట్టగా వాడూ ప్రాణంవిడిచాడు. అలాగే మిగిలిన మల్లులైన కూటుడు, తోసలుడు శలుడు అనే మల్లులను అన్నదమ్ములిద్దరూ అవలీలగా మట్టుబెట్టారు. మిగిలిన మల్లులు ప్రాణభయంతో పారిపోయారు. ఓటమితెలియని ఈ మల్లరాక్షసులను మట్టికరిపించిన చిన్నారి గొల్లవీరులను చూచి ప్రేక్షకులు, బ్రాహ్మణులు, ఆ బాలగోపాలమూ ప్రీతితో కొనియాడినారు.

వాద్యసంగీతముతో పాటు ప్రేక్షకుల జయజయధ్వానాలు కంసునకు పిచ్చెత్తించాయి. వెయ్యిఏనుగుల బలముగల కువలయాపీడ గజము కృష్ణునిచే చంపబడినది. సాటిలేని జగత్ప్రసిద్ధులైన మల్లులు ఆ గొల్లపిల్లలచేత చంపబడ్డారు. కృష్ణుని చంపించాలనే తన వ్యూహము వమ్ము అయిపోయినది. కంసుడు కృష్ణుని మొదటిసారిగా చూచాడు. తన మృత్యువు బాగా దగ్గరగా వచ్చేసినట్లు భయపడ్డాడు. ఏమిచెయ్యాలోతోచలేదు. వాద్య సంగీతాన్ని ఆపివేయుమన్నాడు. జయజయధ్వనులుచేస్తున్న ప్రజలను పొమ్మన్నాడు. పిచ్చిగా ఇలాగ కేకలు వేశాడు: "ఈవసుదేవపుత్రులను దూరముగా తరిమివేయండి. నందునిబంధించివేసి కారాగారంలో పడవేయండి. గొల్లల ఆస్తులను స్వాధీనంచేసుకొనండి. మోసగాడైన వసుదేవుని చంపివెయ్యండి. శత్రుపక్షపాతి అయిన నా తండ్రి ఉగ్రసేనునికూడ విడిచిపెట్టవద్దు, చంపండి". అని ఆజ్ఞాపించాడు. ఈ విధంగా రెచ్చిపోయి వాగుతున్న కంసుని వద్దకు శ్రీకృష్ణుడు సింహములాగ లంఘించాడు. మృత్యువేవచ్చి మీదపడినట్లు భయంతోవణకిపోయాడు కంసుడు. సింహాసనం మీదినుండి లేచిపోయి, అలవాటు ప్రకారంకత్తి దూసాడుగాని, దానిని ఉపయోగించలేకపోయాడు. గరుడుడు సర్పాన్ని పట్టుకొన్నట్లు కృష్ణుడు కంసుణ్ణి పట్టుకొన్నాడు. జుట్టుపట్టుకొనగా వానికిరీటం నేలపడి, పొదగబడినమణులన్నీ చెల్లాచెదురుగారాలిపోయాయి. అప్పటికే భయంతో కంసునకు సగం ప్రాణాలుపోయాయి. కృష్ణుడు వానిని క్రిందపడవేసి, జుట్టుపట్టుకొని ఎత్తైన మంచెనుండి మల్లరంగస్థలమునకు ఈడ్చుకొనివెళ్లి నేలపడవేసి గుండెమీదనెక్కి కూర్చునేసరికి, మిగిలిన ప్రాణాలు కూడపోయాయి. భయముతో బిగుసుకొని చచ్చాడు కంసుడు. కంసుడు గత పన్నెండు సంవత్సరాలలోను అహర్నిశలూ త్రాగుతున్నప్పుడు, కుడుచునప్పుడు, ఊపిరిపీల్చునప్పుడు, నిద్రలోను, స్వప్నంలోనూకూడా ఆ శ్రీహరినే ద్వేషముతోనైనా స్మరిస్తుండడంచేత దుష్టుడైనప్పటికీ భగవత్సారూప్యమనే ఉత్తమగతినే పొందినాడు.

ప్రజలలో హాహాకారాలు చెలరేగాయి. కంసుని తమ్ములైన న్యగ్రోధాదులు ఎనమండుగురు బలరామకృష్ణులపై దాడిచేశారు. బలరాముడు వారందరినీ, తన ఇనుప గుదియవంటి ఆయుధముతో హతమార్చాడు. నారదమహర్షి నారాయణ నామం చెపుతూ నాట్యంచేశాడు. బ్రహ్మరుద్రాదిదేవతలు శ్రీకృష్ణస్తోత్రాలు చేస్తూ పుష్పవృష్టి కురిపించారు. కంసాది సోదరుల భార్యలు రోదిస్తూ మల్లరంగములోపడియున్న తమభర్తల శరీరాలపైబడ్డారు. కంసుని భార్యలు ఇలాగ విలపించారు: "జీవితేశ్వరా! దేవేంద్రాదులనుకూడ శాసించే శక్తిగల నీవు ఇలాగ పడియున్నా ఇంకా జీవించియేయున్న మాయొక్క దౌర్భాగ్యాన్నేమనాలి? ప్రాణేశ్వరా! నీవుచేసిన ప్రాణిహింసయే చివరికి నీ ప్రాణాలను హరించివేసిందాస్వామీ! గోపాలకృష్ణుని చంపడానికి నీచే పంపబడిన వారందరూ అతని చేతిలో తామే చంపబడినప్పుడు నీకు పండితులు ప్రబోధించలేదా? వైరముమాని ఆ శ్రీహరి శరణు పొందుమని? అలాగ చేస్తే ఈ స్థితి వచ్చియుండేదా?" అని పలు విధాల శోకిస్తున్న స్త్రీలను ఓదార్చి, మృతులకు అంత్యసంస్కారాలను జరిపించుమని శ్రీకృష్ణుడు చెప్పాడు.

శ్రీకృష్ణుడు అన్నతో కలసివెళ్లి, తలిదండ్రులైన దేవకీవసుదేవులను చెరసాలనుండి విడిపించి, వారిపాదాలకు నమస్కరించాడు. వారి ఆనందానికిమేరలేదు. "ఈ బిడ్డలు సామాన్య మానవులుకారు. లోకాలకు ప్రభువులు" అని, వారు అనుకొంటూ ఉండగా, స్వామి వారిపై విష్ణుమాయను ప్రయోగించి, పుత్రవ్యామోహాన్ని కలుగజేసి ఇలా అన్నాడు: "జననీ జనకులారా! మీరు మమ్ముకన్నారేగాని కంసునివలన భయముచేత మాయొక్క బాల్య, కౌమార

దశలలో మాలాలనపాలన పోషణచెయ్యలేకపోయారు. మాకుకూడ మీప్రేమనుపొందే అదృష్టం లేకపోయినది. సకల పురుషార్థాలనూ సాధించడానికి ఉపయోగపడే శరీరాన్ని ఇచ్చిన తలిదండ్రుల ఋణాన్ని నూరేండ్లకైనా తీర్చుకొనలేముకదా! శక్తిసామర్థ్యాలు ఉండికూడ తలిదండ్రులకు తన దేహముతోను, ధనముతోనూ సేవచేయని కుమారుడు దుష్టుడూ, నికృష్టుడు అనిపించుకొంటాడు, వాడు అధోలోకాలకుపోతాడు. యమునిచే శిక్షింపబడుతాడు. తలిదండ్రులను, వృద్ధులను, పుత్రులను, గురువులను, బ్రాహ్మణులను, సాధువులను, భార్యలను, శరణార్థులను, సామర్థ్యముండి కూడ కాపాడనివాడు జీవన్మృతునితో సమానుడు. మాకారణంగా కంసుడు మిమ్మల్ని చెరసాలలో బంధించి, బాధలకుగురి చేస్తుంటే, మేము ఏమీ చెయ్యలేక ఊరుకొన్నందుకు మమ్మల్ని క్షమించండి". అని, మాయామానుషవిగ్రహుడైన శ్రీకృష్ణుడు చెప్పగా దేవకీవసుదేవులు మిక్కిలి మోహముజెంది, పుత్రులను కౌగిలించుకొని, ఒడిలో కూర్చుండబెట్టుకొని, కన్నీళ్లతో వారి శిరస్సులను తడిపారు. తరువాత మాతామహుడైన ఉగ్రసేనుని కలుసుకొని, శ్రీకృష్ణుడు ఇలాగ చెప్పాడు:

"మహానుభావా! యయాతిశాపం వలన యాదవులు రాజపీఠాన్ని అధిష్ఠించలేరు. కాబట్టి ఈ రాజ్యానికి నీవే అధిపతిగానుండు. మేము నిన్ను సేవిస్తాము. ఇతర రాజులేకాక దేవతలుకూడ నీకు కప్పను కడతారు."అని చెప్పి ఉగ్రసేనునికి రాజ్యాభిషేకము చేయించాడు. కంసునివలన భయముచే ఇతర దేశాలకు పారిపోయిన యదు, వృష్ణి, అంధక, మధు, దాశార్హ, కుకరాది వంశజులను మరల రప్పించి, ధనమిచ్చి వసతులు కల్పించి, ఆనందంగా నుండే ఏర్పాటు చేయించాడు శ్రీకృష్ణుడు.

తరువాత అన్నతోనెళ్లి నందునకు వీడ్కోలు చెప్పవలసియున్నది. ఇది శ్రీకృష్ణునికి కూడ అతి సున్నితమైన సన్నివేశము. పుట్టినదాదిగా అతడు యశోదానందుల యొక్క సాటిలేని వాత్సల్యప్రేమలను చూరగొన్నాడు. వారు ఏ ఇతర తలిదండ్రులూ ఇవ్వలేనంత నిస్స్వార్థప్రేమను కురిపించిన ప్రేమమూర్తులు. కృష్ణునితోడిదే తమ ప్రపంచముగా జీవించిన పుణ్యమూర్తులు వారు. అటువంటి భక్తులనుండి దూరముకావడం భగవంతునకు కూడ కష్టమేనేమో! నందునితో కృష్ణుడిలా అన్నాడు:

శా॥ **తండ్రింజూడము తల్లిఁజూడము యశోదాదేవియున్ నీవు మా**
**తండ్రిందల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే**
**తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి? భవత్సౌజన్య భావంబులన్**
**తండ్రీ! యింతటి వారమైతిమిగదా తత్తద్వయో లీలలన్** 1400

"తండ్రీ! మేము తల్లిని చూడలేదు, తండ్రిని చూడలేదు, యశోదమ్మ, నీవు మాత్రమే మా తల్లీతండ్రీ అంటూ ఇన్నాళ్లు ఉన్నాము. ఈవిధంగా సద్ధర్మాలతో, (ఉత్తమ సంస్కారాలతో) ఇదివరకు ఏ తలిదండ్రులు (మీరుతప్ప) బిడ్డలను పెంచారు? నీయొక్క సజ్జనత్వంవలననేకదా, తండ్రీ! వయస్సునకుతగ్గ లీలలతో మేము ఇంతవారముకాగలిగాము! ఇక్కడి బంధువులను కొన్నాళ్లు సంతోషపెట్టి, మేము గోకులంవస్తామని అమ్మకు, అందరికీ, చెప్పు. మీరంతా మాకిచ్చిన ప్రేమాదరాభిమానాలను మేమెక్కడున్నా మరువలేము" అని చెప్పి, ఆదరంతో కౌగలించుకొని పాదనమస్కారంచేశాడు ఇతర గోపకులకు, మిత్రులకు వీడ్కోలు చెప్పి, అందరికీ వస్త్రాలు, ఆభరణాలు, కానుకలు ఇచ్చి సాగనంపాడు. నందుని మనస్థితి ఊహాతీతము. వర్ణనాతీతము. పన్నెండేళ్లుగా పెంచిన ప్రేమపెల్లుబుకగా, వలవలాఏడుస్తూ, అతడు విలవిలలాడిపోయాడు. విడువలేక ముందుకువెళ్తున్నా, వెనక్కేచూసుకొంటూ, గోవిందుని రూపాన్ని గుండెలో దాచుకొని, నెమ్మదిగా సాగిపోయాడు మహాత్ముడైన నందుడు.

## విద్యాభ్యాసము, గురుదక్షిణ

వసుదేవుడు గర్గాదిపురోహితులచే యథావిధిగా తనయులకు ఉపనయనసంస్కారం చేయించాడు. బ్రహ్మచర్యదీక్షనుపూని గురుకులవాసంచేసి, గురువువద్ద శిక్షణపొంది, విద్యనభ్యసించాలనేది వైదిక సంప్రదాయము. తాము సర్వజ్ఞులే అయినప్పటికీ ప్రజలకు ఆదర్శంచూపాలని రామకృష్ణులు సంప్రదాయం ప్రకారం ఆచార్యుని అన్వేషిస్తూ బయలుదేరారు. కాశీపట్టణము చేరుకొని అవంతీపురవాస్తవ్యుడైన సాందీపనిఅనే గురువువద్ద విద్యాభ్యాసానికి చేరారు. ఆయన బలరామకృష్ణులకు వేదవేదాంగ - ఉపనిషత్తులూ, ధనుర్వేదము, తంత్రము, మనుధర్మాది శాస్త్రాలు, న్యాయ, తర్క, రాజనీతి మొదలైన శాస్త్రాలు బోధించాడు. శిష్యులు అరవైనాలుగు విద్యలను అరవైనాలుగు దినాలలో, శ్రవణమాత్రాన నేర్చుకొన్నారు. తాము గురువులకే గురువులైనప్పటికీ, సాందీపని గురువును అసలైన శిష్యులవలె సేవించారు. ఇంతటి ప్రతిభావంతులైన శిష్యులను సాందీపనిగురువు చూచియుండలేదు. ఇంతశీఘ్రముగా సకలవిద్యలలో నిష్ణాతులైన ఈ శిష్యులు సామాన్యులుకారని గురువు గ్రహించాడు. విద్యాభ్యాసము ముగిసినది. సంప్రదాయము ప్రకారము గురుదక్షిణ ఇవ్వవలసియున్నది. గురువుగారి అభీష్టాన్ని తెలుసుకొనదలచి అడిగారు. గురువు ఒక అపూర్వమైన గురుదక్షిణను కోరినాడు. "నాయనలారా! మీరు అసమాన శక్తి సామర్థ్యాలు కలవారనీ, దేనినైనా సాధించగలరనీ గ్రహించాను. మాకుమారుడు ప్రభాసతీర్థానికి వెళ్లి, స్నానంచెయ్యడానికి సముద్రంలోదిగి తిరిగిరాలేదు. అతనిని మీరు తీసుకొని వచ్చి, శోకముతో కృశించిపోతున్న గురుపత్నిని రక్షించండి. ఇదే నా కోరిక. సర్వసమర్థులైన మీకు ఈకోరికను తీర్చడం అసంభవం కాదని నేను భావిస్తున్నాను." అని చెప్పగా వారు గురువునకు నమస్కరించి, రథమెక్కి సముద్రుని వద్దకు పయనమై వెళ్లారు. సముద్రాన్ని సమీపించి, ఇలా అన్నారు: "ఓసాగర శ్రేష్ఠమా! నీ గర్భాన దాచిపెట్టిన మా గురుపుత్రుని వెంటనేతెచ్చి ఇవ్వకపోతే, మాబాణాలతో నిన్ను శుష్కింపజేస్తాము." అనగా, సాగరుడిలాగ బదులుచెప్పాడు: "యాదవేశ్వరులారా! మీగురుపుత్రుడు నావద్దలేడు. నమ్మండి. ఆ అందాలబాలుడు స్నానానికి దిగగానే, ఒక పెద్దతరంగం అతనినిలోనికి లాక్కొనిపోగా, పంచజనుడనే అసురుడు వానిని మ్రింగివేశాడు." అనిచెప్పి, ఆ రాక్షసుని ఉనికిని తెలియజేశాడు సాగరుడు. అప్పుడు శ్రీకృష్ణుడు తన శంఖం పూరించగా, ఆశంఖారవాన్నివిని పంచజనుడు కంపించిపోయాడు. శ్రీకృష్ణుడు సాగరగర్భంలో ప్రవేశించి, పంచజనుని చంపి, పొట్టచీల్చిచూడగా గురుపుత్రుడు అక్కడలేడు, కాని ఒకశంఖమున్నది. అదే పాంచజన్యశంఖము. దానిని తీసికొని పైకివచ్చి, బలభద్రునితోగూడి యముని పట్టణమైన సంయమని వెళ్లాడు. అక్కడ శంఖాన్ని పూరించగా, యముడు బైటకువచ్చి, బలరామకృష్ణులను చూచాడు. వారు, నారాయణావతార పురుషులని గుర్తించి, నమస్కరించి, ఏమిఆజ్ఞ అని అడిగాడు. శ్రీకృష్ణుడిలా అన్నాడు: "ఓధర్మప్రభూ! మాగురుపుత్రుడు నీవద్దనే ఉండవచ్చు. అతనిలోనేదో దోషముండటంచేత దండించడానికి ఇక్కడికి రప్పించియుండవచ్చు. అయినా అతడు మాకు పూర్వరూపములో కావలసియున్నది." అనిచెప్పగా స్వయంగానారాయణుడే కోరినందున ఆజీవియొక్క దోషాలన్నీ తొలగిపోయినట్టే అనిభావించి, యముడు ఆబాలునితెచ్చి ఒప్పజెప్పాడు.

రామకృష్ణులు బాలకుని తీసుకొనివెళ్లి గురుదంపతులకు సమర్పించి, ఇంకేమికావాలని అడిగారు. గురుదంపతులు అమితానందభరితులైనారు. గురువు వారితో ఇలా అన్నాడు: "కుమారులారా! ప్రపంచ చరిత్రలో ఇటువంటి గురుదక్షిణ ఇవ్వడం జరగలేదు. యమునివద్దకు వెళ్లిన జీవిని తిరిగి తీసుకురావడం ఎవ్వరికినీ సాధ్యపడని పని. ఇటువంటి గురుదక్షిణను ఇచ్చిన మీకీర్తి చిరస్థాయిగా నిలిచిపోతుంది. ఓమహానుభావులారా! మీరు సామాన్య మానవులుకారు. మీకు గురువునైనందుకు నేను చాలాధన్యుడనైనాను." అని, సాందీపనిగురువు, శిష్యులైన బలరామకృష్ణులకు నమస్కరించాడు.

రామకృష్ణులు మధురానగరంచేరి, శంఖాలు ఊదగా, పోయిన ధనము లభించినంతగా మధురావాసులంతా సంతసించారు. కాలము గడచిపోతున్నది. తానులేని గోకులము, యశోదానందులకే కాకుండా, గోప, గోపీ, గోప బాల, గోవత్స, గోవులకు కూడా నిరుత్సాహపూరితంగా నుంటుందని శ్రీకృష్ణుడు ఊహించాడు. తాను వారిని విడిచి వచ్చిన తరువాత మళ్లీవెళ్లలేదు సరికదా, ఏవిధమైన సందేశాన్నికూడ పంపించలేదు. గోకులవాసులందరూ, తనగురించి తపించిపోతుంటారని తెలిసిన ఆదయామయుడు తన ప్రతినిధిగా ఎవరినైనా గోకులానికి పంపించ సంకల్పించాడు.

## గోకులంలో ఉద్ధవుడు

వృష్ణి వంశీయులలో శ్రేష్ఠుడు ఉద్ధవుడు. చాలాబుద్ధిమంతుడు. దేవగురువైన బృహస్పతియొక్క శిష్యుడు. శ్రీకృష్ణుని ప్రేమించే ఉత్తమ భక్తుడు. ఒకనాడు శ్రీకృష్ణుడు ఉద్ధవుని చేతిని పట్టుకొని ఇలా అన్నాడు: "మిత్రమా, ఉద్ధవా! నీవు నాగురించి ఒక పని చేయవలసియున్నది. నేను గోకులంవిడిచి వచ్చినప్పటి నుంచీ 'మళ్లీ నేను ఎప్పుడుతిరిగి వస్తానో' అని రేయింబవళ్లు, నారాక గురించివిదురుచూస్తూ ఆర్తిజెందియున్న అమాయకపు గోపికలకు నాయొక్క సందేశాన్ని అందించాలి. నాగురించి ఆప్తబంధువులనూ, సర్వస్వాన్నీ త్యజించి, నాయందే మనస్సునిలిపి, అనుక్షణమూనన్నే స్మరిస్తుండే అనన్యభక్తులు వారు. నీవుపోయి నాగురించి వారికి తెలిపి, వారిమనస్సులకు కొంతప్రశాంతతను కలుగజెయ్యాలి. లౌకిక బంధాలను విడిచి, నాగురించే చింతించే ప్రపన్నులకు నేను వశుడనై నాకరుణాదృష్టులను వారిపైసారించి పోషిస్తాను. ఆశ్రితరక్షణమే నాసహజ స్వభావముకదా! నా సందేశాన్ని గోపికలకు తెలియజేయడానికి నీవే సమర్థుడువు." అని శ్రీకృష్ణుడు చెప్పగా ఉద్ధవుడు సంతోషముతో అంగీకరించాడు.

ఉద్ధవుడు శ్రీకృష్ణునిచిన్ననాటి ఆటస్థలాలను, పవిత్రమైన బృందావన, యమునాతీరాలను, అతని స్నేహితులను, గోపికలను, నందయశోదలను, దర్శించాలనే ఉత్సాహంతో వడివడిగా రథాన్ని నడుపుకొంటూ గోధూళి సమయానికి గోకులంచేరుకొన్నాడు. గృహాలన్నీ సంధ్యాదీపాలతో చక్కగా అలంకరించుకొని శ్రీకృష్ణలీలామృతగానాలాపనలు చేస్తుండే గోపికలతోను, పాలుపిదికే స్వరాలతోను, కడురమ్యముగా కనిపించినవి. ఉద్ధవుడు నందగృహానికి చేరుకొన్నాడు. నందుడు ఎదురుగావెళ్లి కౌగిలించుకొని కృష్ణుడే వచ్చినంతగా సంతోషించి, లోనికి తీసుకొనివెళ్లాడు. కుశలప్రశ్నలు, ప్రియాలాపాలు అయిన తరువాత మృష్టాన్న భోజనాదులు ముగిసిన తరువాత, సుఖాసీనులై ఇలాగ ముచ్చటించుకొన్నారు: నందుడు అడుగుతున్నాడు: "నాయనా, ఉద్ధవా! నామిత్రుడు, వసుదేవుడు క్షేమంగానున్నాడా? కంసునిభయముతీరి ఇప్పుడు పుత్రులతో సుఖముగానున్నాడుకదా? తక్కిన బంధువులందరూ కుశలమేనా? మాచిన్ని కృష్ణయ్య, ఇక్కడనుండి విడిచిపెట్టివెళ్లిన పిమ్మట తల్లినీ తండ్రినీ తలచుకొంటున్నాడా? ఈ బృందావనము, యమున, మిత్రులు, గోవులు, గోపికలు, అతనిస్మృతిలోనున్నారా? కృష్ణుడులేని ఈ స్థలమంతా ఒక శూన్యమండలమైపోయినది. బాలకులు గోవులను మేపడానికి శ్రద్ధచూపడంలేదు. గోపికల ఉత్సాహంనశించి, నిర్జీవులుగా కనిపిస్తున్నారు. గోవులు కృష్ణుని వేణునాదం గురించి చెవులు నిక్కబెడతాయిగాని వినలేవు. కృష్ణపాదస్పర్శతగలక పచ్చిక బయళ్లుకూడ శుష్కించిపోయినట్లున్నవి. ఉద్ధవా! ఆకృష్ణస్వామి గోకులవాసులను ఎన్ని ప్రమాదాలనుండి రక్షించాడోచెప్పలేము. నాయనా! మాకృష్ణయ్య ఇక్కడికి ఎప్పుడు వస్తాడో చెప్పాడా! ఆ మురళీ మోహనుని ముద్దుల ముఖారవిందాన్ని తిలకించే భాగ్యము మాకు ఈ జన్మలో మళ్లీ లభిస్తుందా?"అని పల్కుచుండగా అతనిగొంతు బొంగురుపోయినది. కన్నీరు కట్టలు తెంచుకొని ప్రవహించగా బావురుమన్నాడు నందుడు. లోపల తలుపువద్దనే వింటూ కూర్చొనియున్న యశోదామాత: హాకృష్ణా, కన్నయ్యా, తండ్రీ - అని ఆర్తనాదంచేసి, ప్రేమనిహ్వలయై పరవశించిపోయినది. కన్నులనుంచినీరు, చన్నులనుండి పాలు ప్రవహించాయి. కృష్ణ వియోగతాపముతో కృశించిపోయిన ఆ

తలిదండ్రులయొక్క మానసికస్థితిని చూచి, ఉద్ధవుడు అనునయంగా, ఇలా అన్నాడు: "కృష్ణుడు తలిదండ్రులైన మిమ్మల్నీ, మీయొక్క ప్రేమ, వాత్సల్యాలను ఎన్నటికీ మరచిపోలేడు. ఈ బృందావనము యమున, గోకులవాసులతో అతనికి ఏర్పడిన పన్నెండేళ్ల అనుబంధము, అతనికి చిరస్మరణీయములు. అతడు మీతోనే మీమనస్సులలోనే సదా ఉంటాడు. మీకు సకలసౌఖ్యాలను చేకూర్చుతాడు.

మ॥ బలుడుం గృష్ణుడుమర్త్యులే? వసుమతీభారంబు వారింప వా
రలరూపంబుల పుట్టినాడుహరి నిర్వాణ ప్రభుండెవ్వ డు
జ్జ్వలుడై ప్రాణవియోగ కాలమున తత్సర్వేశుచింతించువా
డలఘు శ్రేయము పొందు బ్రహ్మమయుడై యర్కాభుడై నిత్యుడై 1445

బలరామకృష్ణులు సామాన్య మానవులనుకొంటున్నారా? కాదు, భూభారాన్ని నివారించడానికి మోక్షప్రదుడైన శ్రీహరియే వీళ్లరూపాల్లో జన్మించాడు. ఎవడు ప్రాణప్రయాణ సమయమప్పుడు ఆ సర్వేశ్వరుని గురించి చింతిస్తాడో, అతడు అమితమైన శ్రేయస్సును పొంది, నిత్యుడై, తేజస్వియై బ్రహ్మమయుడవుతాడు. అటువంటి నారాయణుడు, సర్వాంతరాత్ముడు, కారణజన్ముడై మానవాకారంలో పుట్టినందున మీరంతా మీ మనస్సులను అతనియందుంచి కొలిచినారు. మీరు పరమధన్యులు. కట్టెలలో నిక్షిప్తమైయున్న నిప్పువలె అతడు ఎల్లప్పుడూ ప్రాణులందు ప్రకాశిస్తుంటాడు. అతనికి తల్లి తండ్రి బంధువు భార్య సఖుడు ఇష్టుడు అనిష్టుడు, శత్రువు అంటూ ఎవ్వరూలేరు. జనన మరణాలులేవు. కర్మలు లేవు. కర్మబంధాలు లేవు. అతడు సజ్జనులను రక్షించడానికి, గుణరూపాలులేని పరమేశ్వరుడు వచ్చిన, అతడు రూపాలను ధరించి, గుణాలను వహించి, సృష్టి స్థితి లయాలనే లీలలు సాగిస్తుంటాడు." అని చెప్పాడు. వారు ముగ్గురూ శ్రీకృష్ణుని లీలావిలాసవైభవాల గురించి ఆ రాత్రంతా ముచ్చటించుకొంటూ గడిపివేశారు.

ఉద్ధవుడు ఉదయాన్నే స్నానాదికములను, నిత్యఅనుష్ఠానాలను ముగించుకొని, ఒక ఏకాంతస్థలంలో కూర్చున్నాడు. దూరంనుండి గోపవనితలు అతనిని చూచి, కృష్ణుడే వచ్చియుంటాడనుకొని, పరుగు పరుగునవచ్చి, అతని చుట్టూమూగిపోయారు. అక్కడ కృష్ణుని బదులుగా ఉద్ధవుని చూచి, సిగ్గుపడి తలలు వంచుకొని, చిరునవ్వులతో ఇలా అన్నారు: "మహాశయా! నీవు కృష్ణుని కుశల వార్తలను నందయశోదలకు తెలియజెప్పడానికి వచ్చిన ఆ నల్లనయ్య మిత్రుడవని ఊహించుకొన్నాము. నయమే! తలిదండ్రులనైనా మరచిపోకుండా ఉన్నాడు నీమిత్రుడు. అవునులే! తలిదండ్రులు తప్పిస్తే అతనికి ఇంకెవ్వరున్నారులే ఇక్కడ? ఎవ్వరైనా అవసరం ఉన్నంతవరకే స్నేహాలుచేస్తారుకదా! అవసరంతీరగనే అక్కరచేయరు."అని, నిష్ఠురోక్తులాడారు. వారిలో ఒకామె చాలాచురుకైనది. ఒక తుమ్మెద అక్కడకు ఝుంకారంచేస్తూ వచ్చినది. దానిని చూడగనే ఆమెకు కవిత్వం పుట్టుకొనివచ్చినది. ఆ తుమ్మెదను తనప్రియునివద్దనుండి వచ్చిన దూతగా కల్పించుకొని, తనప్రియుడు తనవద్దకు, దూత ద్వారా సందేశంపంపి, వేడుకొనుమని పంపించినట్లు ఊహించుకొని, ఉద్ధవునికి అర్థమగునట్లుగా, ఇలా అన్నది:

"ఓ మధుపమా! ధూర్తుడైన నీ మిత్రుడు నిన్నిక్కడికి పంపించాడని మాకుతెలుసు. నీవు మా పాదాలను తాకవద్దు. నీకు మధురానగరిలోని అందగత్తెలు, నీమిత్రునికి అలంకరించే పుష్పమాలలోని మకరందమే రుచిగా నుంటుంది. ఇక్కడేమున్నదని? ఒక పువ్వులోని తేనెను పీల్చివేసి వేరొక పువ్వును పట్టుకొనే నీవంటివాడే నీమిత్రుడు. పాపం! అతనిని నమ్ముకొని, ఆ లక్ష్మీదేవియే మోసపోయినది. ఓ భృంగరాజా! నీ మిత్రుని చరిత్రను, నీవు మావద్ద ఎంతపొగిడినా, మేము నమ్ముతాం అనుకొంటున్నావా? అతనిని గురించి మాకు బాగా తెలుసులే! నీవుపోయి, ఆ మధురానగరి మగువల వద్ద వినిపించు. సంతోషించి, వారు నిన్ను సత్కరిస్తారు. ఓ మధుపమా! నీకు మాత్రము

తెలియదా! ఆ మనోహరుని మందహాసానికి కరిగిపోనికాంత, ఈ ముల్లోకాల్లోనూ ఒక్కత్తైనా ఉన్నదా? ఆ గొప్పఇల్లాలు కమలాదేవినియే అతనిపాదసేవ చెయ్యకుండా ఒక్కక్షణమైనా ఉండలేదే! మరి, మాలాంటి వాళ్లం బింకముగా ఎలాగ ఉండగలం? పోనీ, నీవైనాచెప్పు, ఇదేమైనా బాగున్నదా! మా భర్తలను, బంధువులను, సర్వమూ త్యాగంచేసి, నీమిత్రునికే, మా మనస్సులను అర్పించివేసిన మమ్ములను ఇలాగ పరిత్యజించి పారిపోవడం ఏమైనా న్యాయమేనా? ఇదిగో విను, నీమిత్రుని నమ్మి మాలాగ మోసపోయిన వారెందరో ఉన్నారు సుమా! ఆమాయావికి కూడ బాగాతెలుసు, మా యొక్క బలహీనత – మానవులేకాదు, పశు పక్ష్యాదులు కూడా, అతని వేణునాదం విన్నా, అతని దివ్యనామాన్ని చెవులారా ఒక్కసారి వినినా చాలు, అయిన వాళ్లనూ, ఇల్లూ సంసారం, సంపదా అన్నిటినీ విడిచి, అతని వెంట పడతారని అతనికి తెలుసు. ఓ భ్రమరమా! అవునులే మాదే పొరపాటు! మధురానగరిలో బంగారు రేకులతో తాపబడిన భవనాలు, సామంతరాజులు కొలుస్తుండే రాజరికమూ, సుగంధశృంగారాలతో వెలిసే ఉద్యానవనాలు, సకల విద్యాసంస్కార శోభితలైన సుందరీమణులూ, సర్వసుఖాలు ఉంటాయి. వాటన్నిటినీ విడిచి, ఇక్కడేమున్నదని ఇక్కడికి వస్తాడు? ప్రభువులెప్పుడూ నూతనప్రియులే కదా!" అని ఈ విధంగా తమయొక్క అనన్యప్రేమను, విరహాన్నీ, వ్యథనూ, వెలిబుచ్చుతున్న అమాయకగోపికల నిర్మల, నిష్కపట, ప్రేమను గ్రహించి, ఉద్ధవుడు ఆశ్చర్యపోయాడు. వారిప్రేమాతిశయానికి మురిసి పోతూ ఇలా అన్నాడు: "ఓ పుణ్యావతులారా! శ్రీకృష్ణునిపై మీకున్న నిర్మల నిరతిశయప్రేమ చరితార్థమైనట్టిది. జపతపాది అనేకమైన సాధనలుచేసిన యోగి పుంగవులుకూడ పొందలేనట్టిది మీ ధ్యాననిష్ఠ. శ్రీకృష్ణుడు మీతో చెప్పుమన్న మాటలను చెపుతానువినండి: ఇవి ఆ ప్రభువు చెప్పిన మాటలుగా తెలుసుకోండి:

"ఓ రమణులారా! ఎడబాటువలన కలిగిన వియోగ బాధనుమీరంతా అనుభవిస్తున్నారని నాకు తెలుసు. వ్యక్తియొక్క బాహ్యస్వరూపంపైన అనురాగంపెంచుకొంటే ఇలాంటి బాధలు తప్పవు. సమస్త కార్యాలకూ కారణమునేనే అయియుండి, అన్నింటి యందునేనే వ్యాపించియున్నందున మీకూనాకూ ఎడబాటులేదు. అంతరంగంలో నాతో నిత్య సాయుజ్యాన్ని అనుభవిస్తున్నమిమ్ము, బాహ్యవియోగము బాధించరాదు. దూరముగా నున్నప్పుడే ప్రేమ, ధ్యాస పెరుగుతాయి. నన్నే మీరు ఎల్లప్పుడూ స్మరిస్తుండాలని నేను మీకు ఈ ఎడబాటును కలిగించాను. నిరంతర ధ్యానంచే మీరునన్ను పొందగలరు" అని మనప్రభువైన శ్రీకృష్ణుడు మీతో చెప్పుమన్నాడు. గోపికలు ఉదాత్తమైన కృష్ణప్రేమ తత్త్వాన్ని కొద్దిగా గ్రహించినవారై ఊరటజెందారు. "మహాశయా ఉద్ధవా! కృష్ణుడు ఇక్కడికి ఎప్పుడైనా వస్తాడా? మా పరితాపం తీర్చుతాడా! ఆమధురానగరకాంతలు అతనిని రానిస్తారా? మాకూ అతనికీ మధ్యనున్న రహస్యాలను నీతో చెపుతుంటాడా! మేము కాళిందీ నదిలో స్నానంచేస్తుంటే, మా వస్త్రాలను అపహరించినట్లు చెప్పాడా? మాతోరాసక్రీడలు ఆడినట్లుచెప్పాడా? ఓపుణ్యాత్ముడా! మాప్రభువునకు మామాటలుగా ఇలాచెప్పు:

"ప్రాణేశ్వరా! నిన్ను విడిచి ఇకమీదట మా శరీరాలు ఈ భూమిపై నుండలేవు. మా మనోధైర్యాలూ, మనస్సులూ, ప్రాణాలూ ఒక్కొక్కటిగా మమ్మల్ని విడిచిపెట్టేస్తాయి. మాప్రాణాలుపోయిన తరువాత నీవువచ్చి ఏమిలాభము? జీవరక్షకుడవైననిన్ను, మా జీవాలనుహరించినవాడవని అందరూ నిందించరా? స్త్రీలు పురుషులను ప్రేమించడం దోషమా? లక్ష్మీదేవి నిన్ను ప్రేమించలేదా? నీవులేని దు:ఖంలో మునిగియున్న గోకులాన్ని ఉద్ధరించుప్రభో!" అని మా మాటలుగా చెప్పు", అనిన గోపికలతో ఉద్ధవుడిలా అన్నాడు: "సుందరీమణులారా! శ్రీకృష్ణుడు ఎప్పటికీ మీవాడే. మధురలో అతనికి స్త్రీలెవ్వరితోనూ సాంగత్యంలేదు. అక్కడ అతడు చక్కబెట్టవలసిన రాచకార్యాలు అనేకమున్నవి. వీలైనంత త్వరలో ఇక్కడికి వస్తాడు." అనిచెప్పి, శ్రీకృష్ణగాథలనూ, మధురలో అతడు గావించిన గొప్పకార్యాలనూ వారికి వినిపిస్తూ అక్కడ కొద్దిరోజులుండి, ఉద్ధవుడు మధురకు మరలి వచ్చాడు.

గోకులంలోని విషయాలన్నీ శ్రీకృష్ణునకు వివరించి, నందాదులిచ్చిన కానుకలను బలరామకృష్ణులకు, వసుదేవ ఉగ్రసేనులకు సమర్పించాడు.

కుబ్జ :- త్రివక్రయైనకుబ్జ శ్రీకృష్ణుని అనుగ్రహంచేత సర్వాంగసుందరియై అప్సరసలాగ తయారయినది. కృష్ణుడు ఎప్పుడూ వస్తాడా అని గృహాన్ని శోభాయమానంగా అలంకరించి, నిరీక్షిస్తుండేది. ఒకనాడు కృష్ణుడు, ఉద్ధవునితోసహా ఆమె ఇంటికి వెళ్లాడు. ఆనందసంభ్రమాలతో, ఆమె ఉబ్బితబ్బిబ్బు అయిపోయినది. ఉచితాసనాలిచ్చి పూజించి సత్కరించినది. ఇంట్లో గుబాళిస్తున్న సుగంధాలు ఉన్మత్తం కలిగిస్తుండగా ఆమె కామపరవశ అయినది. చిరకాల కామవాంఛ విజృంభించినది. శ్రీకృష్ణుని ఏకాంత గదిలోనికి తీసుకొనివెళ్లి పాన్పుపై కూర్చుండబెట్టి హావభావాలు ప్రదర్శించగా, అంతర్యాన్ని గ్రహించిన స్వామి ఆమె మనోవాంఛను తీర్చాడు. హృదయపూర్వకంగా భక్తులు కోరిన కోరికలను అనుగ్రహించే స్వామినుండి కుబ్జ కామతృప్తినే కోరుకొని, సాయుజ్యానందాన్ని అనుభవించినది.

## మథురా విజయము - అక్రూరుడు

మాట ఇచ్చిన ప్రకారం శ్రీకృష్ణుడు ఉద్ధవబలరాములను తోడ్కొని, అక్రూరుని ఇంటికి వెళ్లాడు. అక్రూరుడు ఎదురేగి ఆహ్వానించి కౌగలించుకొని, ఆసనాలిచ్చి సత్కరించాడు. శ్రీకృష్ణబలరాముల పాదాలను కడిగి, ఆజలాన్ని శిరస్సుపై జల్లుకొన్నాడు. శ్రీకృష్ణుని పాదాలను తన ఒడిలోపెట్టుకొని తుడిచాడు. ఇలా అన్నాడు: "పరమ పురుషులారా! మీరు కారణజన్ములు. మీశౌర్యబలంచేత కంసుడు, వాని అనుచరులూ నశించి, యాదవకులము ఉద్ధరింపబడినది. ఓ కృష్ణా! వాసుదేవా! నీవెవరివో నాకుతెలుసు. నీపాదస్పర్శచే మాగృహము పావనమైనది. నాజన్మ ధన్యమైనది. స్వామీ! నాకు గృహ విత్త దారా సుతులయందు మోహము కలుగకుండా అనుగ్రహించు" అని, వేడుకొన్న అక్రూరునితో స్వామి ఇలా అన్నాడు: "మహాశయా! నీవు సజ్జనుడవు. మాకు బంధుడవుకూడాను. మానవులు విగ్రహారాధనలు, తీర్థస్నానాలూ కోరికలు తీరడానికి చేస్తుంటారు. కాని నీవంటి ఉత్తమభక్తుల సేవా సాంగత్యాల వలన శీఘ్రంగా చిత్తశుద్ధిని పొంది ఆశయ సిద్ధిని పొందగలరు. మహాత్మా! నీవలన ఒక కార్యము జరగవలసియున్నది. అదిఏమిటంటే – మామేనత్త అయిన కుంతీదేవి తనభర్త అయిన పాండురాజు గతించిన తరువాత పుత్రులతో ధృతరాష్ట్రుని పోషణలో హస్తినాపురంలోనుంటున్నది. మితిమీరిన పుత్రవ్యామోహంతో ధృతరాష్ట్రుడు వారిపట్ల సమబుద్ధితో మెలగటంలేదు. అందుచేత నీవు హస్తినాపురం వెళ్లి, రెండు పక్షాలవారూ మనకు ఆప్తులేగనుక, ఉభయులూ సంతోషించేటట్టుగా ఏదైనా మార్గము చూడాలి." అని చెప్పి ఉద్ధవ బలరాములతో నిష్క్రమించాడు.

శ్రీకృష్ణుని కోరిక ప్రకారము అక్రూరుడు హస్తినాపురంవెళ్లి, కుంతీదేవిని, పాండవులను, భీష్మద్రోణ విదుర ధృతరాష్ట్రకృప అశ్వత్థామకర్ణ దుర్యోధనాదులను, ఇతర బంధువులను కలుసుకొన్నాడు. అందరూ అతనిని సగౌరవంగా ఆదరించారు. అక్కడ కొన్నివారాలుండి అందరి ప్రవర్తనలూ, పరిస్థితులూ అర్థంచేసుకొన్నాడు. ఒకనాడు విదురుడు అక్కడ ఉండగా, కుంతీదేవి అక్రూరునితో ఇలా అన్నది: "అన్నా అక్రూరా! మథురలో నాతలిదండ్రులూ, తమ్ముళ్లూ, అందరూ క్షేమంగానున్నారా? మందభాగ్యులమైన మాగురించి ఎప్పుడైనా తలుస్తున్నారా? నాతోచెప్పమని ఏమైన చెప్పారా? మేమిక్కడ దుష్టులైన కౌరవుల మధ్య తోడేళ్ల గుంపులోనున్న జింకలలాగ భయంతో బ్రతుకుతున్నాము. పరమ దుర్మార్గుడైన దుర్యోధనుడు నాపుత్రులను చంపించడానికి అనేక ప్రయత్నాలు చేశాడు. వానికి అదే వ్యాసకము. బలరామ కృష్ణులకు మాగురించి ఏమైనా తెలుసా? శ్రీకృష్ణుడు కంసాదులనుచంపి యాదవులను రక్షించిన దేవుడు. మా కష్టాలను ఎప్పుడు తీర్చుతాడోమరి! మాకు ఎప్పుడు న్యాయము జరుగుతుందో". అని కంటనీరుపెట్టుకొన్నది. శ్రీకృష్ణుని స్మరించి, మమ్మల్ని రక్షించు ప్రభూ! అని ప్రార్థించినది. అక్రూరుడు అక్కడినుండి సెలవుతీసుకొని, బంధుమిత్ర పరివారములతో సుఖంగా కాలంగడుపుతున్న ధృతరాష్ట్రుని వద్దకు వెళ్లాడు. ఇలా అన్నాడు "మహారాజా! నీతమ్ముడైన పాండురాజు గతించిన తరువాత నీవు ఈభూమిని ఏలుతున్నావు. ప్రజలను ధర్మబుద్ధితో, సమదృష్టితో పరిపాలించే రాజు యశస్సునూ, శ్రేయస్సునూ పొందుతాడు. అలాగ చెయ్యనినాడు దుర్గతి పాలవుతాడు. నీకు

తెలియని ధర్మాలు లేవుకదా! రాజా! నీతమ్ముని పుత్రులైన పాండవులు, తల్లితోసహా దిక్కులేనివారై బ్రతుకుతున్నారు. నీవు నీకుమారులయందూ, తమ్ముని కుమారులయందూ సమవర్తనుడవై, వారిని ఆదరించడం అందరికీ క్షేమకరంకదా! ఈలోకములో ఏ ఒక్కరి ఉనికీ శాశ్వతం కాదుకదా! పుత్రకళత్ర సంపదలపైన వ్యామోహము అంత శ్రేయస్కరం కాదు. బుద్ధిలేని తండ్రియొక్క ధనసంపదలను అతని పుత్రులే శత్రువులై హరిస్తారు. అందుచేత అధర్మార్జన వలన ఇహలోకంలో నిందింపబడడమే కాకుండా పరలోకంలో పాపఫలం అనుభవించాలి. ఈ శరీరము, పరివారము, ధనసంపద మొదలైనవన్నీ స్వప్నంలోని సుఖాలవంటివి. నీకు దృష్టిలోపం ఉన్నదిగాని బుద్ధిమాంద్యంలేదుకదా? నీబుద్ధి జ్ఞానాలను సద్వినియోగం చేసి, ఆ తండ్రిలేని పిల్లలకు చెందవలసిన భాగాన్ని వారికిచ్చివేసి, రాజుగా నీవు చెయ్యవలసిన ధర్మయుక్తమైన కర్తవ్యాన్ని నిర్వహించు." అనిచెప్పగా, ధృతరాష్ట్రుడు ఇలాబదులు చెప్పారు. "అక్రూరా! నీవు చెప్పినదంతా నిజమే కావచ్చు. నేను మంచి సలహాలను పాటించలేని అసహాయుడను. భగవదిచ్ఛ ఎలాగుంటే అలాగే జరుగుతుంది. ఎవరు తప్పించగలరు? భూభారాన్ని తగ్గించడానికి జన్మించిన శ్రీకృష్ణుడు తన దివ్యసంకల్పం ఎలాగుంటే అలాగే జరిపిస్తాడు: మనం చెయ్యగలిగినదేమీలేదు." అని చెప్పారు.

ధృతరాష్ట్రుని మనస్సును గ్రహించిన అక్రూరుడు మథురకు మరలివచ్చి, శ్రీకృష్ణబలరాములకు సర్వమూ నివేదించాడు.

## మథురావిజయము - జరాసంధ కాలయవనులు

కంసుని భార్యలైన అస్తి, ప్రాప్తి అనేవారు జరాసంధుని పుత్రికలు. వారు తమకు కృష్ణుని వలననే వైధవ్యం సంభవించిందని మొరపెట్టుకొంటే జరాసంధుడు మండిపడి, రోషంతో ఇలాగ అన్నాడు."ఏమీ! ఈ గొల్లకుర్రడు కంసునే సంహరించాడా! నాప్రతాపం ఇప్పుడు చూస్తాడు. భూగర్భంలో దాక్కున్నా, సముద్ర మధ్యంలో దాక్కున్నా, ఆకాశంలోకి ఎగిరిపోయినా, హరిహరబ్రహ్మాదులెవరు అడ్డం వచ్చినా, ఈ యాదవవంశం యావత్తునూ నిర్మూలిస్తాను."అని ప్రతిజ్ఞచేశాడు. జరాసంధుడు మగధేశపురాజు. అతడు కంసునివలె రాక్షసాంశతో జన్మించినవాడు. మిక్కిలి బలశాలి, క్రూరుడు. అతడు యుద్ధసన్నద్ధుడై ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యాన్ని సమీకరించి, మథురను ముట్టడించడానికి బయలుదేరాడు. నగరాన్ని చుట్టుముట్టాడు. శ్రీకృష్ణుడు ఇలాగ యోచించాడు. "ఈజరాసంధునిపట్ల సామ, దాన, భేద ఉపాయాలు పనిచెయ్యవు. దండోపాయమే సరియైనది. భూభారమును తగ్గించడమే ప్రస్తుత కర్తవ్యము. కనుక రాజును చంపకుండా సేనలను హతమార్చితే వాడు మళ్లీమళ్లీ సేనలను సేకరించి తెచ్చి, మా ఆయుధాలకు ఆహుతి చేస్తుంటాడు. చిట్టచివరకు వాని పనిపట్టవచ్చు." అని తలపోస్తుండగా దైవయోగమువలన దివినుండి రెండు దివ్యరథాలు దిగినవి. (ఇదే ఈశ్వరసంకల్పము). ఆ రథాలలో, సారథులుండిరి. నానాప్రకార ఆయుధాలు, వాటియందు కవచాలు, యుద్ధసామగ్రి ఉండెను. వాటినిచూచి బలరామునితో శ్రీకృష్ణుడిలా అన్నాడు. "అన్నా, బలరామా! చూచావా! నీయొక్క అవతార కార్యం ప్రారంభించడానికి, అన్నీసమకూడాయి. ఇకమనం సిద్ధపడాలి?" అని చెప్పి, అతిశూరులైన యాదవులను సమీకరించి, సేనలను ఏర్పాటుచేశాడు. దివ్యకవచాలను, దివ్యఆయుధాలను ధరించి, దివ్యరథారూఢులై బలరామకృష్ణులు బయలుదేరారు. శ్రీకృష్ణుడు పాంచజన్యశంఖాన్ని పూరించగా, మగధసైన్యంలోని సైనికులు, ఏనుగులు, గుర్రాలు, చెల్లాచెదురై వెనక్కి జరిగిపోయినవి. జరాసంధుడు రోషావేశపరుడై కృష్ణుని ఉద్దేశించి, ఇలా అరిచాడు. "ఓరీ, గొల్లకుర్రడా! అదిలించి రొప్పడానికి ఇవి ఆలమందలనుకొన్నావా? మత్తగజాలు. వీరంతా నీకబుర్లువింటూ కూర్చొనే గొల్లమూకలనుకొన్నావా! కాదు యమునికైనా భయపడని వీరాధివీరులు. ఇది బృందావనం కాదు రణరంగ వ్యూహము. గోపికలతో కుప్పిగంతులు వెయ్యడానికిది యమునా తీరముకాదు, కదనరంగము. అందుచేత నీకెందుకులేరా యుద్ధము? పోపోవెళ్లిపో! ఇదేమన్నా

ఆడుదాన్నీ, కొంగను, గాడిదను చంపడమా? పాములతో ఆడుకొనడమా? భీకరయుద్ధమురా ఇది. మగధాధీశుని శరజ్వాలలకు మాడిపోతావు. త్వరగా వెళ్లిపో." అని ఈ విధంగా వాగుతున్న జరాసంధునితో కృష్ణుడు ఇలా అన్నాడు. "ఓయీ మగధుడా! ఎందుకు వదరుతున్నావు? వీరులెప్పుడూ డాంబికాలు పలుకరు. చేసిచూపిస్తారు. నీవుప్రయోగించే ప్రళయాగ్నిలాంటి శరాలనుకూడ నేనుహరించి వేస్తాను. చివరకు విజయంనాదే అవుతుంది. నేను పశువుల కాపరినే కావచ్చు. గోపాలురకూ, భూపాలురకూ భేదమేమిటో ఇప్పుడే నీకు తెలుస్తుందిలే." అనేసరికి జరాసంధుడు క్రోధావిష్టుడై ఇలా అన్నాడు: "కృష్ణా! నీవు కుర్రవాడివి. రాజశేఖరుడైన మగధాధీశుడు గొల్లపిల్లలతో యుద్ధంచేశాడనిపించుకోవడం మాకు తలవంపులు. నువ్వు అవతలికిపో. మీఇద్దరిలో పెద్దవాడైన మీ అన్నబలరాముని యుద్ధంచేయుమను." అనిచెప్పిన జరాసంధునితో కృష్ణుడిలా అన్నాడు. "నిజమైన వీరులు తమశౌర్యాన్ని చూపుతారుగాని, నీలాగ ఆత్మస్తుతి చేసుకోరయ్యా మగధుడా." అనేసరికి పౌరుషం వచ్చేసి, యాదవసైన్యాన్ని ముట్టడింపుడని తనసేనలకు ఆజ్ఞాపించాడు. ప్రచండుడైన ఆ జరాసంధుడు. ఏనుగులఘీంకారాలు, గుర్రాల సకలింపులు, రథచక్రాల ధ్వనులు, ఆయుధాల మోతలు, రెండువైపులా చెలరేగాయి. ఘోరమైన యుద్ధము కొనసాగినది. యాదవసేన బాగాదెబ్బతిన్నది. పరిస్థితిని గమనించి, బలరామకృష్ణులు విజృంభించారు. శ్రీకృష్ణుడు పాంచజన్యశంఖాన్ని పూరించాడు. బాణాలవర్షాన్ని నిర్విరామంగా కురిపించాడు. శార్ఙ్గచాపం మెరుపు తీగవలె శత్రువులను ఛేదించినది. వలయాకారంగా ఎటుచూచినా శ్రీకృష్ణుని శరపరంపరలే. రథంతో రణభూమి అంతటా వీరవిహారం చేస్తున్నాడు. ఏనుగులు, గుర్రాలు, సైనికులు గుట్టలు గుట్టలుగా పీనుగులై పడియున్నవి. బలరాముడు తన రోకలివంటి ఆయుధాన్ని గిరగిరా త్రిప్పుతూ శత్రుభయంకరుడై విజృంభించాడు. తననాగలి ఆయుధంతో రణరంగాన్ని దున్నివేసినట్లు శత్రువులను పడగొట్టి నేలపాలుచేశాడు. శత్రుసేనలు బలభద్రుని చూడగానే పారిపోసాగినవి. ఈ విధంగా అన్నదమ్ములిద్దరూ యుద్ధభూమిని స్మశానభూమిగా మార్చివేశారు. బలరాముడు జరాసంధుని పట్టుకొన్నాడు. ఒక్కపిడికిలిపోటుతో వానిని హతమార్చే ప్రయత్నాన్ని చేసియు, శ్రీకృష్ణుడు వారించి, ముందుకార్యక్రమాన్ని గుర్తుచేయగా విడిచిపెట్టాడు. అప్పుడు శ్రీకృష్ణుడు జరాసంధునితో ఇలాఅన్నాడు: "ఓయీ మగధవీరుడా! నీవు భయపడకు. నిన్నిప్పుడు చంపివేయములే. నీవుపోయి సేనలను కూర్చుకొని, మళ్లీవచ్చి నీ కక్షతీర్చుకొనుము. అలాగచెయ్యలేకపోతే, నీదేహాన్ని విడిచిపెట్టు. అప్పుడు అందరూ మెచ్చుకొంటారు."అని పరిహాసోక్తులాడగా ఆ మగధరాజు అవమానంతోకుమిలిపోయి, కోపంతో కుతకుతలాడిపోయాడు. ఘోరతపస్సుచేసి అయినా వీళ్లను జయించాలి అని నిశ్చయించుకొని, రాజధానికి మరలిపోయాడు. మధురానగర ప్రజలందరూ బలరామకృష్ణుల ఘనవిజయానికి ఉత్సవాలు జరుపుకొన్నారు. జరాసంధుడు కృష్ణునిపై నానాటికీ ద్వేషాన్ని పెంచుకొంటూ, దుష్టరాజులందరినీ కూడగట్టుకొని, పదిహేడుసార్లు మధురపైదండెత్తి, సైన్యాలను పోగొట్టుకొని, పదిహేడుసార్లూ ఓడిపోయాడు. పద్దెనిమిదవసారియుద్ధ సన్నాహం ప్రారంభించాడు.

కాలయవనుడు అనబడేవాడు ఒకమ్లేచ్ఛప్రభువు. అతడు ఆనాటికి ప్రసిద్ధులైన కంస జరాసంధాదులందరికంటే మహాబలశాలి, ముష్కరుడు. ఒకనాడు నారదుడు అతనివద్దకువెళ్లి ఇలా కవ్వించాడు. "ఓ యవనశ్రేష్ఠుడా! నీవు ఈ రాజులందరి గర్వమణచిన నాడవట కదా! నీకుసాటి అయిన వారెవరా అనిచూస్తున్నావటకదా! మరి ఆమధురలోని యాదవులగురించి వినలేదా? వాళ్లలో ఒక యువకుడు మహాబలశాలి, పరాక్రమవంతుడు. ఏ ఆయుధాలు ధరించకుండా కంసుని చంపినవాడు. జరాసంధుని పదిహేడుసార్లు ఓడించినవాడు. అతనిని గురించి నీవు వినలేదా, లేక ధైర్యంచాలక ఊరుకొన్నావా?" అని అడిగేసరికి రోషంతో కాలయవనుడు ఇలా అన్నాడు: "ఏమేమీ నారదా! అలాంటి వీరుడొకడున్నాడా? అతడెక్కడుంటాడు? ఎలాంటివాడు? అతని మిత్రులెవరు? మా బాహుబలానికి తట్టుకొని ఎదుర్కొనగలడా?"అని అడుగగా నారదుడిలా చెప్పాడు: "యవనేశ్వరా! చెపుతానువిను. ఆయాదవశ్రేష్ఠుడు నీలమేఘశ్యాముడు, పూర్ణచంద్రబింబమువంటి మోముకలవాడు. పట్టుపీతాంబరము, కౌస్తుభమణి,

మకరకుండలాలను ధరించువాడు, ఇంతవాడంతవాడని చెప్పనలవికానివాడు, తాను ప్రకాశిస్తూ దిక్కులను ప్రకాశింపజేసేవాడు, అన్నిచోట్లా సంచరించగలవాడు, పట్టుకొనడం తెలిస్తేగాని పట్టుపడనివాడు..."అని ఇంకా చెపుతున్న నారదుని మాటలను వినిపించుకొనకుండా యవనుడిలా అంటాడు: "ఓయీ! నారదా! చాలుచాలు. ఇంతేనా! ఈయాదవుడేపాటివాడు? ప్రళయంకరుడైనా నావిదుటపడితే, నాఅస్త్రాలకు ఆహుతిఅయి, భస్మము కావలసినదే! ఈయాదవుని నేను అంతము చేస్తానుచూడు."అని విర్రవీగుతూ నారదుని పంపించివేశాడు. మూడుకోట్లమ్లేచ్ఛ సైనికులతో మథురనుచుట్టుముట్టాడు.

శ్రీకృష్ణుడు బలరామునితో ఇలా అన్నాడు: "సోదరా! ఇప్పుడు యాదవులకు మహాఆపదరానున్నది. కాలయవనుడు చాలా పెద్దమ్లేచ్ఛసైన్యాన్నితెచ్చి మథురను చుట్టివేశాడు. నేడోరేపో జరాసంధుడుకూడ వచ్చిచేరుతాడు. మనము యవనునితో యుద్ధం చేస్తుంటే, జరాసంధుడు దొంగచాటుగా నగరంలో ప్రవేశించి, మనవాళ్లను చంపవచ్చు, లేదా, బందీలుగా కొనిపోవచ్చు. అందుచేత శత్రువులుచొరలేనట్టి సురక్షిత స్థలానికి మనవారందరినీ తరలించాలి. దీనికి నేనొక మార్గం ఆలోచించాను."అని చెప్పి, సాగరుని స్మరించి, సముద్రములో పన్నెండు యోజనాల విస్తీర్ణంగల స్థలాన్ని అడిగితీసుకొని, విశ్వకర్మను స్మరించి, అక్కడ ఒక మహానగరాన్ని, నిర్మింపుమన్నాడు. సర్వేశ్వరుని సంకల్పానికి అసంభవమైనదేమున్నది? విశ్వకర్మ తన నైపుణ్యాన్నంతా వినియోగించి, ఇంద్ర, వరుణ, కుబేరాది దేవతల నగరాలకుమించిన నగరాన్ని నిర్మించాడు. బంగారుగోపురాలతో భవనాలు, రాజబాటలు, ఉద్యానవనాలు, మొదలైన సకలవసతులతో విలసిల్లుతున్నది ఆ నగరము. ఇంద్రుడు సుధర్మ అనే సభాభవనాన్ని పారిజాతవృక్షాన్ని బహూకరించాడు. వరుణుడు తెల్లని గుర్రాలను, కుబేరుడు నిధులను, దిక్పాలకులు తమతమ ఐశ్వర్య విభూతులను అర్పించారు. వీటి ప్రభావముచేత అక్కడి ప్రజలకు ఆకలిదప్పులవలన శోకమోహాల వలన బాధలు ఉండవు. వారు తేజస్సుతోనుంటారు. ఆ నగరం పేరు ద్వారక. భగవంతుడు తన మాయాశక్తిచే మధురాపురవాసులందరినీ ద్వారకానగరికి రాత్రికిరాత్రి తరలించివేశాడు. అక్కడ వారి సంరక్షణ గురించి బలరాముని నియోగించాడు. ఈ మార్పు గురించి, కాలయవనునకుగాని, జరాసంధునకుగాని, మధురాపుర వాసులకుగాని ఏమీ తెలియదు. అంతా స్వప్నంలోలాగ జరిగిపోయినది.

కాలయవనుడు మధురాపురిపై దాడిచేసే విషయమునుగురించి పొద్దున్నే ఆలోచిస్తూ, తమ శిబిరాలనుదాటి, ఒక్కడే నిరాయుధుడై నడచుకొంటూ వెళ్తుంటే, అల్లంతదూరాన ఒక యువకుడు ఒంటరిగా, మెల్లమెల్లగా అడుగులు వేసుకొంటూ, మధురాపురి ద్వారము నుండి ఇటూఅటూ చూసికొంటూ వస్తుండడం కంటబడినది. యవనుడు ఆలోచించసాగాడు: "ఈ యువకుడెవడు? ఇలాగ ఒంటరిగా ఆయుధాలూ, వాహనము లేకుండా నగరం విడిచి ఎక్కడికి వెళ్తున్నాడు? గూఢచారియా? పలాయనుడా? రాయబారియా? యాచకుడా? తెలుసుకోవాలని యవనుడు వడివడిగా అడుగులువేశాడు. కొంచెందగ్గర పడగానే ఆ యువకుని ముఖంచూచి ఒక్క క్షణం నిశ్చేష్టుడై నిల్చుండిపోయాడు. ఏమీ? ఆ తేజస్సు, ఏమీ ఆ ఆకర్షణ? నీలమేఘచ్ఛాయ, సుందరవదనం, పీతాంబరం, మెడలో మణిహారము, అంతా నారదుడు చెప్పినట్లే కనిపిస్తున్నాడు. నిశ్చయంగా ఇతడే ఆ యాదవవీరుడై యుంటాడు." అనుకొన్నాడు. నాచేతికి చిక్కాడులే అనుకొని పట్టుకుందామని ముందుకు వెళ్లగా, అతడు తప్పించుకొని పరుగెత్తసాగాడు. యవనుడు వెంటబడ్తూ, పరుగెత్తలేక వెనకబడిపోతూ, ఇలాగకేకవేశాడు: "నిలునిలు, ఓయదువీరా! పారిపోకు. కంసచాణూరులను చంపినవీరుడవని తెలిసి, నీతో పోరాడుదామని నేనువస్తే, అయ్యో! నీవునా ప్రతాపం అయినా చూడకుండా, ఇలాగ పారిపోవడం బాగుందా? నీకు అపకీర్తికరంకాదా! అయినా, ఎక్కడికి పోగలవులే! నానుండి ఎలాగ తప్పించుకొనగలవు?" అంటూ జోరుగా పరుగెడ్తూ వెంబడించాడు. కృష్ణుడు దొరికినట్టే దగ్గరపడి,

దొరక్కుండా పరుగెత్తేవాడు. నన్ను పట్టుకొనలేనివాడవు. నీవేంగెలువగలవు? అంటున్నట్లు నవ్వేవాడు. కొండలూ, అడవులూ, నదులూ అన్నీ దాటించి, చాలాదూరం తీసుకొనివచ్చేశాడు. యవనునికి విసుగెత్తి, వెనుకకు వెళ్లలేక, ముందుకిపోలేక ఏమిచెయ్యాలో తోచనిస్థితిలో ఉండగా కృష్ణుడు అదృశ్యమైనాడు. యవనుడు వెతకగా అక్కడొక చీకటిమయమైన పెద్దగుహ కనిపించినది. కృష్ణుడు ఆ గుహలోనే దాక్కొన్నాడనీ, ఇంకెక్కడికీ పోలేడనీ, తనకుచిక్కిపోతాడనీ, భావించి, యవనుడు అందులో ప్రవేశించాడు. కృష్ణుడు కనిపించలేదు. ఆ చీకటిలో తేరిపారిచూస్తే అక్కడొక వ్యక్తి ముసుగుతన్ని గురకపెడ్తూ నిద్రిస్తున్నట్టు కనిపించినది. అతడు కృష్ణుడే అనుకొని యవనుడిలా అన్నాడు: "ఏమిరా కుర్రకుంకా! నాతోయుద్ధం చేయడానికి భయపడి, పారిపోతూ, నన్నురాళ్లూ రప్పలపైనా ముళ్లమీదా పరుగెత్తించి తెచ్చి, ఇప్పుడీవేషంవేసి తప్పించుకోవాలనుకొంటున్నావా? లెమ్ములెమ్ము. నీవు ఎవ్వరికీ చిక్కవని నారదుడు చెప్పాడులే. ఇప్పుడు నాచేతచిక్కావు కదా! ఇక దీర్ఘనిద్దుర పోదువులే!" అంటూ వికారంగా నవ్వి, ఆనిద్రిస్తున్న వ్యక్తిని తన్నినాడు. అతడు మేల్కొని, నాలుగువైపులా చూచి, కాలయవనునిపై దృష్టి సారించగానే వాడు భస్మమైపోయాడు అనిచెప్పగా, ఆ నిద్రపోతున్న వ్యక్తిని గురించి, చెప్పుమని పరీక్షిత్తు కోరగా శ్రీశుకమహర్షి ఇలాచెప్పాడు:

**ముచుకుందుడు:-** ఇక్ష్వాకువంశములోని మాంధాతమహారాజుతనయుడు ముచుకుందుడు. అతడు సత్యధర్మపరుడు, మహానుభావుడు. తమ్ము రాక్షసులబారినుండి రక్షించవలసినదని ఇంద్రాదిదేవతలు అతనిని కోరగా అతడు భూలోకంవదలి, చాలాకాలము దేవతల రక్షణకార్యంలో నిమగ్నుడైయుండి, కుమారస్వామి దేవతలసేనాధిపతిగా రాగానే భూలోకానికి తిరిగివెళ్లడానికి దేవతల అనుజ్ఞనుపొందాడు. అతని నిస్వార్థసేవకు సంతసించిన దేవతలు అతనితో ఇలా అన్నారు: "ఓ రాజశ్రేష్ఠా! మానవ లోకములో శత్రువులే లేని నీవు నీయొక్క రాజ్యాన్నీ, స్వజనులనూ వదలివచ్చి, చిరకాలంనుండి రేయింబవళ్లు మాయొక్క రక్షణ కార్యంలోనే నిమగ్నుడవైయుంటివి. అనివార్యమైన కాలప్రభావంచేత భూలోకంలో నీవారందరూ ఎప్పుడో మరణించారు. మోక్షాన్ని తప్ప నీవేదైనా వరంకోరుకొనుము ఇస్తాము. మోక్షాన్ని ఒక్క శ్రీహరియే ప్రసాదించగలడు." అనగా చాలాకాలంనుండి నిద్రయే తెలియని ఆ రాజుకు నిద్రముంచుకొనివస్తుండగా, బాగా అలిసియుండటంచేత ఏమీ ఆలోచించలేక అతడు తనకు ఏవిధమైన అంతరాయమూలేని నిద్రను ప్రసాదించుమన్నాడు. వారు తథాస్తు అని, అతనికి ఈ గుహలో నిద్రపొమ్మని అతని నిద్రను భంగముచేసిన వ్యక్తి అతని దృష్టిపడగానే భస్మమైపోతాడు అని అన్నారు. ఆ విధంగా, ఈముచుకుందుడు, కృతయుగంలో నిద్రపోయి, త్రేతాయుగంగడిచి, ద్వాపరయుగాంతానికి కాలయవనుని వలన నిద్రాభంగమైలేచాడు. కాలయవనుడు భస్మముకాగానే శ్రీకృష్ణుడు ముచుకుందునకు దర్శనమిచ్చాడు. నిద్రనుంచి పూర్తిగామేల్కొన్న ముచుకుందుడు నీలమేఘశ్యామ శరీరమూ, పీతాంబరాలు, కౌస్తుభమణి, వైజయంతీమాల, చతుర్బాహువులు, శంఖచక్రగదాపద్మాలు, మకరకుండలాలు, ప్రసన్నవదనము, ముల్లోకాలనూ మోహింపజేసే మందహాసముతో భాసిల్లుతున్న దివ్యసుందరరూపాన్ని తిలకించాడు. సంభ్రమాశ్చర్యాలతో చలించిపోయాడు. చివరకు ఇలా అన్నాడు:

**మ॥ శశివో? ఇంద్రుడవో? విభావసుడవో? చండప్రభారాశివో?**
**శశిచూడామణివో? పితామహుడవో? చక్రాంకహస్తుండవో?**
**దిశలున్? భూమియుర్వశమై? మిన్ను నిండెనిదె నీతేజంబుచూడంగడు**
**యెవ్వడవేలవచ్చి తిచటన్ వర్తించెదేకాకివై 1647**

ఓ దేవా! నీవు చంద్రుడవో, ఇంద్రుడవో, అగ్నివో, సూర్యుడవో, చంద్రశేఖరుడవో, బ్రహ్మదేవుడవో, చక్రపాణివో తెలియుటంలేదు. నీతేజస్సు చూడశక్యముకాకున్నది. దిక్కులు, భూమి, ఆకాశము, అంతా నీ దివ్యతేజస్సుతో

నిండిపోయినవి. నీవెవడవు? ఒంటరివాడవై ఇక్కడికి ఎందుకువచ్చావు? ఈ అడవి కఠిన శిలాకంటకమయము, క్రూరమృగాలకునిలయము నీపాదాలు చూస్తే పద్మదళాలలాగ కోమలంగా కనిపిస్తున్నవి. నీవు ఇక్కడికి ఎలాగ రాగలిగావు? అయ్యో! నీ పాదాలు కందిపోయినొప్పిపెడుతుంటాయి. నన్ను నీపాదశుశ్రూషచెయ్యనిస్తావా. నీవెవ్వరవో నాకు తెలియదు. ఇష్టమైతే చెప్పు. నేను ఇక్ష్వాకువంశములోని మాంధాతపుత్రుడను. నన్ను ముచుకుందుడంటారు. దేవతలసేవలో చాలాకాలము మేల్కొనియుండటంచేత అలసిపోయి, ఇక్కడ నిద్రలోమునిగి ఇంద్రియ వ్యాపారాలను మరచిపోయియున్నాను. నేను నిద్రిస్తుండగా ఎవ్వడో ఒక వ్యక్తి నన్ను అనేకమార్లు తన్ని నాకు నిద్రాభంగంచేశాడు. అతడు పాపాత్ముడైయుంటాడు. నేను చూస్తుండగనే భస్మమైనాడు. ఇప్పుడు నారాయణస్వరూపుడవైన నిన్నుచూచాను. నాకెంతో ఆనందం కలుగుతున్నది. నీ దివ్యతేజస్సును చూడలేకున్నాను. దయతో నిన్ను కన్నులపండువుగా చూడగలశక్తినిమ్ము" అనివేడుకొన్న ముచుకుందునితో గోవిందుడిలా అన్నాడు: "ఓ పుణ్యశీలుడా! నాజన్మలు, నామాలు, గుణాలు, కర్మలు, అసంఖ్యాకాలు. వాటిని గురించి నేనుకూడ వివరించలేను. భూభారం తగ్గించడానికి, ధర్మాన్ని స్థాపించడానికి, పూర్వము బ్రహ్మచేసిన ప్రార్థనను పురస్కరించుకొని నేను యాదవ వంశములో వసుదేవుని పుత్రునిగా అవతరించాను. నన్ను కృష్ణుడని, వాసుదేవుడనికూడ అంటారు. కంసనామంతో పుట్టినకాలనేమిని సంహరించాను. ఇతర లోకకంటకులను అంతముచేస్తాను. నీ దృష్టి తగిలి దగ్ధుడైనవాడు కాలయవనుడు. పూర్వము నీవు నన్ను బాగుగ ఆరాధించావు. కనుక నిన్ను అనుగ్రహించడానికి వచ్చాను. ఏవైనా వరాలు కోరుకొనుము. నా భక్తులకు శోకకారణ ముండరాదు" అని శ్రీహరి చెప్పగా ఆనందభరితుడైన ముచుకుందుడు పూర్వము గర్గమహర్షి చెప్పినట్లు ఇరవై ఎనిమిదవ మహాయుగంలో భూమిపై శ్రీమన్నారాయణుడు అవతరించినట్లు గ్రహించి, నందనందనునకు ఈ విధంగా స్తోత్రంచెయ్యనారంభించాడు.

"సర్వేశ్వరా! నీమాయచే మోహితులైన మనుజులు ఇల్లు, పరివారము సంపదా అనే ప్రలోభాల్లో చిక్కుకొని, బహుదుర్లభమైన మానవజన్మను దుర్వినియోగపరచుకొంటున్నారు. శాశ్వతమైన నీ పదభక్తికి దూరమై క్షణిక సుఖాలను వెంబడిస్తూ, గడ్డిమేయాలనే ఆశతో గడ్డిమొలిచిన నూతిలో పడిపోయిన గోవువలె, సంసారకూపంలో కూరుకొనిపోతున్నారు. పరమేశ్వరా! నేనుకూడా రాజ్యభోగాలతోనూ - భార్యాబంధువర్గాలయందు వ్యామోహంతోనూ కాలం వ్యర్థపుచ్చానేగాని నిన్ను స్మరించనైతిని. కాని, నీయొక్క అపారమైన కరుణచేత నాకు దేవతల సేవచేసే భాగ్యము లభించడంచేత రాజ్యము, సంపదలు, భార్యలు, సర్వమూ, వాటంతట అవి తొలగిపోయినవి. ప్రభూ! నేనుమళ్లీ ఆ విషవలయంలో చిక్కుకొనకుండా కాపాడు. నిన్ను మరచిపోయిన విషయలాలసులను నీవు జననమరణసుడిగుండములలో పడవేస్తావు. సకలభోగాలతో పోషింపబడిన శరీరముకూడ చివరకు పురుగులపాలు. మట్టిపాలు కావలసినదేకదా? ఈశ్వరా! భోగాలను త్యజించి, మనస్సునిగ్రహించి తపస్సు చేసేయోగులు కూడ స్వర్గాన్నీ, ఇంద్రపదవినీ, ఆపేక్షిస్తారేగాని, అమృతత్వాన్నికోరరు, ఎంతదౌర్భాగ్యము! ఈ స్వర్గమూ ఇంద్రపదవీ కూడా అశాశ్వతమేనని గుర్తించరుకదా! అచ్యుతా! నీ అనుగ్రహం కలిగినప్పుడే సంసారమందు అసంగముకలుగుతుంది. నిస్సంగముచే సజ్జనసాంగత్యము లభిస్తుంది. సత్సంగమువలన నీయందు భక్తిసిద్ధిస్తుంది. భక్తిద్వారానే ముక్తి లభిస్తుంది. కృష్ణా! నీకృపచేత నాకిప్పుడు లౌకిక బంధాలన్నీతొలగిపోయినవి. నీపాదసేవతప్ప నాకింకేమీవద్దు. ప్రభూ! శరణువేడుతున్నాను. పూర్వవాసనల ప్రభావంచేత ఆశామోహాలు వదలక ఇంద్రియములకు వశుడనైయున్న నాయందుకరుణజూపి నన్ను కాపాడుము". అనివేడుకొన్న ముచుకుందునితో, ముకుందుడు ఇలా అన్నాడు. "ఓమహనీయుడా! నీబుద్ధి ఉత్తమమైనది. పరోపకారంచేస్తూకూడ నీవు ఎలాంటి కోరికలకూలోనుగాలేదు. నీకునాయందు దృఢమైన భక్తిని అనుగ్రహిస్తున్నాను. నాయందు మనస్సునిలిపి, నీవు సకలకార్యాలనూ చేస్తున్నా, కర్మలచేబంధింపబడవు. నీవు రాజుగానున్నప్పుడు వేటలలో చేసిన జంతువధయొక్క పాపము ఇంకా మిగిలియున్నది.

దానిని తపస్సుచేసి తొలగించుకొంటే రాబోవుజన్మలో సద్బ్రాహ్మణుడవై పుట్టి సకల ప్రాణులయెడల కరుణ, మైత్రి ప్రేమలను పెంపొందించుకొని నన్ను పొందగలవు." అని స్వామి చెప్పగా ముచుకుందుడు స్వామికి ప్రణామాలు, ప్రదక్షిణలుచేసి వెళ్లిపోయాడు. గుహనుండి బైటకు వచ్చేసరికి చెట్లూ పశుపక్షులూ అతిచిన్నవిగాకనిపించాయి. ఇది యుగధర్మం అనుకొని, ఉత్తరదిశగా పయనించి, బదరికాశ్రమంచేరుకొని, నారాయణునికై తపస్సు ప్రారంభించాడు. శ్రీకృష్ణుడు మధురవచ్చి యవనసేనలను హతమార్చి, వారు విడిచిన ధనాన్ని సంగ్రహించాడు.

కాలయవనుడు మూడుకోట్ల సైన్యముతో వచ్చి మధురను ముట్టడించినట్లు తెలుసుకొని, ఇదే అదనుఅని జరాసంధుడు ఇరవైమూడు అక్షౌహిణుల సేనతో బయలుదేరాడు. తనను గత పదునేడుసార్లు ఓడించిన ఆ ఇద్దరు గొల్లపిల్లలపని ఈ సారితో ముగుస్తుందిలే అని ఉత్సాహంగా వస్తున్నాడు. కాని కాలయవనుడు భస్మమైపోయాడనిగాని, అతని సైన్యమంతా బలరామ కృష్ణులచేత హతమయినదని గాని జరాసంధునికి తెలియదు. యాదవుల ఆస్తులతోపాటు యుద్ధభూమిలో యవనులు విడిచిపెట్టిన ధనరాసులను, బండ్లలోపెట్టించి ద్వారకకు తరలించడానికి బలరామకృష్ణులు సిద్ధముగా నుండిరి. అంతలో జరాసంధుడు సేనలతోజోరుగా వస్తుండడంచూచి, బండ్లను పంపించివేసి, తామిద్దరూ ప్రాణభయంతో పారిపోతున్న వారివలె పరుగెత్తనారంభించారు. జరాసంధుడుచూచి విస్తుపోయాడు. తనంతటి వీరాధివీరునే పదునేడుసార్లు ఓడించిన ఈ అన్నదమ్ములు ఇప్పుడు రణభీరువుల్లాగ ఇలా పారిపోతున్నారెందుకో అని ఆశ్చర్యపోయాడు. కాలయవనుడేడీ? వాని సేనావాహినులేవి? ఆ గుట్టలు గుట్టలుగా పడియున్నకళేబరాలెవరివి? ఏమీతెలియటంలేదు. ప్రస్తుతకర్తవ్యం ఈ కుర్రలిద్దరినీ పట్టుకొనడం అని భావించి, వారిని వెంబడించాడు. సేనలనుకూడ తనవెంటరమ్మన్నాడు. రామకృష్ణులు వడివడిగా అడవిమార్గాలలో అడ్డదారులలో పరుగెత్తసాగారు. కనిపిస్తున్నారుగాని పట్టుబడరు. జరాసంధుడు ఇలాకేకలు వేశాడు: "కుర్రలారా! మీరు యాదవుల్లో మహావీరులటకదా! ఇలాగ పారిపోతున్నారేమి? ఈ జరాసంధుని నుండి తప్పించుకొనగలరా? భూమిలో దాగినా, సాగరంలో చొచ్చినా, ఆకాశంలోనికెగిరినా మిమ్మల్ని పట్టుకొని హతమార్చుతాను. ఆగిపొండి, పరుగెత్తడం వృథా అవుతుంది." అని అట్టహాసంగా నవ్వాడు. వారుపోయిపోయి ఒక పెద్ద పర్వతశిఖరమెక్కారు. అక్కడ ఎల్లప్పుడూ వర్షాలు కురుస్తాయి. కనుక దానిని ప్రవర్షణగిరి అంటారు. అడవిదట్టంగానుంటుంది. జరాసంధుడు సేనలను పర్వతంచుట్టూ కాపలా ఉంచి కొందరిని కొండమీదవెదకడానికి పంపించి, తానుకూడ వెతికాడు. వాళ్లు ఎక్కడాకానరానందున పర్వతంచుట్టూ కట్టెలనుపేర్చి నిప్పంటించాడు. అరణ్యమంతా మంటలతోనిండి, కాలిపోయినది. "వీళ్లు ఎక్కడదాక్కొన్నా బూడిదఅయిపోయియుంటారు. ఈశుభవార్తనువిని నా పుత్రికలైన కంసపత్నులు సంతోషిస్తారు" అనుకొని సేనలను మరలించుకొనివెళ్లిపోయాడు. రామకృష్ణులు నిప్పంటించడంలో నిమగ్నులైయున్న సైనికులను కనుమరుగుచేసి, కుప్పించి వెలుపలకుదుమికి, తప్పించుకొని పారిపోయారు. ద్వారకానగరమునకు చేరుకొన్నారు.

## ద్వారకావిలాసము - రుక్మిణి

ఆనర్తదేశపురాజైన రైవతుడు బ్రహ్మదేవుని సలహా ప్రకారము తనకుమార్తె అయిన రేవతిని బలరామునకిచ్చి వివాహము చేశాడు.

విదర్భదేశపు రాజైన భీష్మకునకు ఐదుగురు పుత్రులు, ఒకపుత్రిక ఉండేవారు. పెద్దకుమారుని పేరు రుక్మి. కుమార్తె పేరు రుక్మిణి. చెల్లెలంటే అన్నలకు అత్యంతప్రేమ. రుక్మిణి తండ్రికీ, అన్నలకూ అతిప్రీతి పాత్రంగా పెరిగినది. చెలికత్తెలతో వయస్సునకు సరిపోయినట్లుగా ఆటలాడేది. రుక్మిణిని తండ్రి తనతోపాటు రాజ్యసభలలోను, పండితుల గోష్ఠులలోను, వేదాంతచర్చలలోను కూర్చుండబెట్టుకొనడంచేత ఆమెకు అన్ని విషయాలూ అవగతమయ్యేవి.

భీష్మకుని వద్దకు నారద మహర్షి తరచుగా వస్తుండేవాడు. శ్రీకృష్ణునియొక్క లీలాగుణ వైభవాలగురించి చెప్పడానికి నారదునకుగాని, వినడానికి భీష్మకునకుగాని విసుగూ విరామమూ ఉండేవికావు. నారదుని రాకకై రాజు ఎల్లప్పుడు ఎదురుచూస్తుండేవాడు. సర్వమూ వింటున్న రుక్మిణికి శ్రీకృష్ణునియందు మనస్సు లగ్నమయినది. రుక్మిణి యౌవనవతి అయి అసమానసౌందర్య లావణ్యతేజో రాశిగా వెలసినది. భీష్మకుడు ఆమెకు వివాహం చేయదలచుకొని, దేశదేశాల రాజకుమారుల గురించి తెలుసుకొని, చివరకు కృష్ణుడే ఆమెకు తగిన వరుడని నిశ్చయించుకొన్నాడు. రుక్మిణి కూడా కృష్ణునియందే ఆశలు పెంచుకొని అతడే తన భర్త కావాలని మనస్సులో నిశ్చయించుకొన్నది. శ్రీకృష్ణుడు కూడ నారదాదుల వలనవిని, రూప లావణ్య శుభలక్షణ సద్గుణ భూషణ అయిన రుక్మిణియే తన ధర్మపత్ని కాగలదని నిశ్చయించుకొన్నాడు.

ఒకనాడు భీష్మకుడు రుక్మిణివివాహవిషయాన్ని పెద్దకుమారుడైన రుక్మితో ప్రస్తావించి, కృష్ణుడే ఆమెకు తగిన వరుడు గనుక అతనికిచ్చి వివాహం చేద్దామన్నాడు. జరాసంధ, శిశుపాల, సాళ్వ, పౌండ్రకాది దుష్టులకు రుక్మి ప్రియమిత్రుడు. వారి ప్రభావము వలన బలరామకృష్ణులను తన శత్రువులనుగా భావించేవాడు. అందుచేత రుక్మిణిని కృష్ణుని కివ్వరాదనీ, తన మిత్రుడైన శిశుపాలునకే ఇవ్వాలనే పట్టుపట్టాడు. వృద్ధుడూ, సాత్త్వికుడూ, బలహీనుడూ అయిన భీష్మకుడు, మూర్ఖుడూ తామసికుడూ అయిన రుక్మియొక్కమొండి పట్టుదలకు తలఒగ్గి ఏమీచెయ్యలేక ఊరుకొన్నాడు. చెల్లెలి వివాహం శిశుపాలునితో చెయ్యడానికి నిశ్చయించి, రుక్మి వివాహప్రయత్నాలు ప్రారంభించాడు.

బుద్ధి తెలిసినప్పటినుండి రుక్మిణీకన్య కృష్ణుని తప్ప ఇంకెవ్వరినీ వివాహం చేసుకొనరాదనుకొన్నది. తన మనస్సును తెలుసుకొనకుండా తన అన్న ఈ విధంగా ప్రవర్తించడం అనుచితం అనుకొన్నది. "భగవంతుడైన కృష్ణునకు, తన ప్రేమ తెలియదా? తెలిస్తే ఇలాగా ఉపేక్షచేస్తాడా! ఏమో! అతని మనస్సు ఇంకెవ్వరిపైన ఉన్నదో! ఏమైనాసరే అతడు నన్ను స్వీకరించకపోతే దేహత్యాగమైనా చేస్తానుగాని, ఇంకొకరి చేతిని స్వీకరించను. నాయొక్క జీవన్మరణ సమస్యను తీర్చగలవాడు కృష్ణుడొక్కడే. రక్షించుమని శరణువేడిన వారిని భగవంతుడు ఆదుకొంటాడుకదా, మరి నన్ను కాపాడడా! ఇప్పుడేం చెయ్యాలి? సమయం మించిపోతున్నది. నా మనస్సును కృష్ణునికి తెలియజేయడం ఎలాగ? (అని తీవ్రంగాయోచించి, మెరుపులాంటి ఆలోచనరాగా) నా యొక్క సందేశాన్ని అతనికి పంపిస్తాను. అతడు తప్పకుండా నన్ను రక్షిస్తాడు." అని ఈ విధంగా యోచించి, తనకు చిన్నప్పటి నుండీ తెలిసియున్న అగ్నిద్యోతనుడనే సజ్జనుడైన బ్రాహ్మణుని రావించి, ఇలా చెప్పినది. "ఓ విప్రశ్రేష్ఠా! అహంకారగర్వాంధుడైన మా అన్న నన్ను శిశుపాలునకిచ్చి వివాహంచేయనున్నాడు. మాతండ్రి, అతని నెదిరించే శక్తిలేక నిస్సహాయుడై ఊరకున్నాడు. నీవువెంటనే ద్వారకవెళ్లి శ్రీకృష్ణునకు నాప్రేమను తెలియజేసి, అతనిని ఇక్కడికి పిలుచుకొనిరావాలి." అని మరికొన్ని మాటలు చెప్పి పంపినది. అగ్నిద్యోతనుడు వెంటనే బయలుదేరి, ద్వారకానగరమునకుచేరి, తనరాకనెరిగించి శ్రీకృష్ణభవనంలో ప్రవేశించాడు.

శ్రీకృష్ణుడు ఎదురుగావెళ్లి, ఆహ్వానించి, కాళ్లుకడిగి, భోజనంపెట్టించి కుశలమడిగాడు. ఇలా అన్నాడు: "విప్రోత్తమా! ఈ వయస్సులో నీవింత శ్రమతీసుకొని వచ్చావంటే ఏదో ముఖ్యమైన కార్యార్థమైయుంటుంది. నీవంటి సద్బ్రాహ్మణులు అందరిహితము కోరేవారు. అల్పసంతుష్టులు. వారి సర్వవాంఛలూ సఫలమవుతాయి. తృప్తిలేనివాడు ఇంద్రునియంతటివాడైనా పతనమవుతాడు. నీకు నమస్కారము." అనగానే విప్రుడు, "శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు" అని దీవించి, ఇలాచెప్పాడు:

"దేవా! నేను విదర్భదేశములోని కుండిన పురవాసిని, అగ్నిద్యోతనుడను. మారాజు భీష్మకుడు. ఆయనకొక పుత్రికారత్నమున్నది. ఆమె రుక్మిణి. ఆమె అతిలోకసుందరి, అసమాన సుగుణవతి. ఆమె నీయొక్క దివ్యలీలా

వైభవాలగురించి వినియున్నదై, నీపాదసేవచేయదలచి, నీకు ఇట్లు మనవి చేయుమన్నది. తనతండ్రియైన భీష్మకునకు ఇతరులకు ఆమెను నీకిచ్చి వివాహము జరిపించడం చాలా ఇష్టమే అయినను ఆమెయొక్క పెద్దన్న రుక్మి, అడ్డుతగిలి, ఆమెను శిశుపాలునకిచ్చి వివాహంచెయ్యడానికి అన్నిఏర్పాట్లు చేస్తున్నాడు. సమయంమించిపోతున్నదనే ఆర్తితో ఆరాకుమారి నన్ను ఈ సందేశాన్ని నీకు తెలుపుమని పంపించినది. ఆమె సందేశమిది:

సీ॥ ఏనీ గుణములు కర్ణేంద్రియంబులు సోక దేహతాపంబులు తీరిపోవు
ఏనీ శుభాకారమీక్షింప కన్నుల కఖిలార్థలాభంబు కలుగుచుండు
ఏనీచరణ సేవలే ప్రొద్దు చేసిన భువనోన్నతత్వంబు పొందగలుగు
ఏనీ లసన్నామమే ప్రొద్దు భక్తితో తడవిన బంధసంతతులువాయు
తే॥ అట్టినీయందు నా చిత్త మనవరతము నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణజూడుము కంసారి! ఖలవిదారి! శ్రీయుతాకార! మానినీచిత్తచోర! 1701

ఓ కంసాంతకా! నీగుణగణాలు చెవులకు సోకగానే శరీరతాపాలన్నీ తీరిపోతాయి. మంగళకరమైన నీ శుభాకారాన్ని చూడగానే కన్నులకుపండుగగా ఉంటుంది. ఓ దుష్టసంహారీ! నీపాదసేవచేసినంతనే ఉత్తమలోకాలు లభిస్తాయి. లక్ష్మీకరమైన రూపముకలవాడా! నీ దివ్యనామాన్ని భక్తితో స్మరిస్తేచాలు, బంధాలన్నీవీడిపోతాయి. అటువంటి నీయందే నా చిత్తమెల్లప్పుడూ నిలిచియున్నది. ఇది నీసాక్షిగా నిజముసుమా! ఓ మానినీ మానసచోరా! నాపైకరుణజూపవా? ధన్యుడవూ, లోకమనోభిరాముడవూ, వంశ, విద్యా, రూప, యౌవన, సౌజన్య, సంపద, బల, దాన, శౌర్య, కరుణాసంశోభితుడవూ అయిన నిన్ను ఏ కన్యలు మాత్రము వరించకుండా ఉండగలరా? ఆనాడు ఆ లక్ష్మీదేవియే నిన్ను వరించలేదా? నేనొక్కతెనే నిన్ను ప్రేమించానా ఏమిటి? నీకుచెందవలసియున్న నన్ను నీచుడైన ఆచేదిరాజు శిశుపాలుడు హరించుకొనిపోడానికి సిద్ధముగానున్నాడు కదా! ప్రాణేశా!

మ॥ వ్రతముల్ దేవ గురు ద్విజన్మబుధసేవల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిన్ వసుదేవనందనుడు నా చిత్తేశుడౌగాక ని
ర్జితులై పోదురుగాక సంగరములో చేదీశముఖ్యాధముల్ 1706

ఓ పద్మనాభా! రేపే చతురంగబలాలతో నచ్చి శిశుపాల జరాసంధులను ఓడించి, రాక్షసవివాహ పద్ధతిని నన్ను తీసుకొనిపోవాలి. అంతఃపురంలో నున్న నన్ను కొనిపోవడం ఎలాగ అని అనుకొంటావేమో! ఏరభసాలేకుండా తీసుకొనివెళ్లే మార్గమొకటి ఉన్నది. మంగళగౌరిని కొలవడానికి పెండ్లికుమార్తెను, ఊరువెలుపలనున్న దుర్గామందిరానికి పంపించే ఆనవాయితీ ఉన్నది. నేను అక్కడికి రాగానే నిరాటంకంగా నీవు నన్ను కొనిపోవచ్చును. నీఅనుగ్రహానికి నేను అర్హురాలిని కాకపోతే, బ్రహ్మచర్యనిష్ఠవహించి, నూరుజన్మలకైనా నీవేనాపతివి కావాలని నిన్నే ధ్యానిస్తూ ఆత్మార్పణం చేసుకొంటాను.

సీ॥ ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని, కర్ణరంధ్రంబుల కలిమియేల?
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని, తనులతవలని సౌందర్యమేల?
భువనమోహన! నిన్నుపొడగానగాలేని, చక్షురింద్రియముల సత్త్వమేల?
దయిత! నీయధరామృతంబానగాలేని, జిహ్వకు ఫలరస సిద్ధియేల?
ఆ॥ నీరజాతనయన! నీవనమాలికాగంధమబ్బలేని ఘ్రాణమేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు చేయని జన్మమేల? యెన్నిజన్మములకు 1708

ప్రాణేశా! నీయొక్క మృదుమధుర భాషలు విననోచుకొనని కర్ణములుండీ ఎందుకు? నీవు అనుభవింపలేని సుకుమార శరీరముయొక్క సౌందర్యమెందుకు? భువనమోహనా! నిన్ను సందర్శించలేని కన్నులుండీ ఏమిప్రయోజనం? దేవా! నీ అధర సుధారసాన్ని ఆస్వాదించలేని నాలుక ఉండీ ఏమిలాభము? కమలాక్షా! నీవు ధరించే వనమాలయొక్క సువాసనను ఆఘ్రాణించలేని ముక్కు ఎందుకు? ధన్యచరితా! నీకు సేవలుచేయలేనప్పుడు ఎన్ని జన్మలెత్తినా వృథాయేకదా!" స్వామీ! ఇదే మా విదర్భరాజపుత్రికయైన రుక్మిణీకన్యయొక్క ఆంతరంగిక సందేశము. నీకు విన్నవించాను. ఆమె పుట్టినప్పటినుండీ ఎరిగియున్న బ్రాహ్మణుని గనుక నామాటగాకూడ మనవి చేస్తున్నాను. మాచిన్నారి రుక్మిణివంటి రూపవతి, సకల సద్గుణరాశియైన కన్య ఈ భూమండలంలో నెక్కడాలేదు. మహావిష్ణువునకు లక్ష్మీదేవిలాగ ఆమెనీకు అన్నివిధాలా సరిపోయిన సహధర్మచారిణి అవుతుంది. మీఇద్దరూ, పతీపత్నులుకావడానికే పుట్టారనడానికెలాంటి సందేహమూలేదు. నీవు వెంటనేవెళ్లి ఆమెను ఆదుష్టులనుండి రక్షించి, ఇక్కడికి తోడ్కొని రావలసిందని మనవి చేసుకొంటున్నాను." అన్నాడు.

(రుక్మిణీకన్య లక్ష్మీదేవి అంశంతో జన్మించినది. ఆమె ఏనాటికైనా నారాయణునే చేరవలసియున్నది. ఆమెకావిషయం తెలియకపోయినా, శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుని అవతారపురుషుడని వినియున్నది. కనుక సహజంగా ఆకర్షింపబడి, అతనికి మానసికంగా అంకితమైపోయినది. ఇదిలౌకికంగా అనుకొనే సన్నివేశము. కాని ఈ సందేశాన్ని ఆధ్యాత్మిక దృష్టితో పరిశీలిస్తే ఇది పరమాత్మతో సాయుజ్యంకావడానికి తపనబడే జీవాత్మ సందేశము. భగవంతుని అనుగ్రహాన్ని అర్థించే భక్తుని ఆంతరంగిక ఆవేదనాసందేశమనికూడ అనవచ్చును ఇది సాగరంలో లీనముకావడానికి నది ప్రదర్శించే తహతహలాంటిది. మధ్యమధ్యను రుక్మిలాంటి అవరోధాలెదురైనా, వాటిని త్రోసివేసి నదివలె గమ్యాన్ని చేరాలి. రుక్మం అంటే బంగారము. అది లౌకిక సంపదలకు ప్రతీకము. రుక్మి వ్యక్తిగా మూర్తీభవించిన అహంకారము. అహంకారముకారాలే రుక్మిరూపంలో పరమేశ్వర సాయుజ్యానికి అవరోధము. శిశుపాలుడు చేదిరాజకుమారుడు. చంచల మనస్సునకు ప్రతీకము. ఈ చైద్యుడు జీవుని మనోబుద్ధులతో తాదాత్మ్యపరచి, భ్రమలోముంచి పరమాత్మ సాయుజ్యం కాకుండా అడ్డుపడేది అహంకారము. అలాగే ఈ రుక్మి, రుక్మిణిని కృష్ణుని చెంతకు చేరనివ్వకుండా చైద్యునిపరంచేయడానికై అడ్డుకొంటున్నాడు. పరమాత్మ సర్వజ్ఞుడు. ఏనాటికైనా జీవి తన్నుచేరవలసినదే అని అతనికి తెలుసు. ఆ పరమాత్మయే జీవునికి తోడ్పడాలి. అడ్డంకులను తొలగించాలి. ఇదే భగవదనుగ్రహము. ఉత్తమభక్తుడు తన ఆరాధ్యదైవాన్నివినా మరిదేనినీ కోరడు. శ్రీకృష్ణుడే పరమపురుషుడని రుక్మిణి అతనినే ఆరాధిస్తున్నది. అన్యులకు ఆమె మనస్సులోస్థానం లేదు. రుక్మిణీ సందేశమంతా భక్తుడు భగవంతుని అనేకవిధాల స్తుతించడం ద్వారా, తనప్రేమను (భక్తిని) తెలిపి, ఆత్మార్పణంచేసుకొని, భగవంతుని ప్రసన్నునిగా చేసుకొని, భగవదనుగ్రహాన్ని అర్థించడమే. అనేకమంది భక్తులు భగవంతుని పురుషునిగాను, తాము స్త్రీ, (ప్రకృతిమాత)గాను భావించుకొని సేవించడాన్ని మధురభక్తి అంటారు. ఆ మధుర భక్తియొక్క ప్రకాశమే ఈ రుక్మిణీ సందేశము.

యజ్ఞయాగాదులలో కర్తసమర్పించే నైవేద్యాలనూ (ఆహుతులనూ), అభ్యర్థనలనూ అగ్నిదేవుడు యజ్ఞదేవతల వద్దకుకొనిపోయి సమర్పిస్తాడు. అలాగే దేవాదిదేవునకు తన అభ్యర్థనను సమర్పించడానికి రుక్మిణి అగ్నిద్యోతనుని ఎన్నుకొన్నట్టున్నది.)

బ్రాహ్మణుడు తెచ్చిన సందేశానికి శ్రీకృష్ణుడు సంతసించి, రుక్మిణియొక్క అభ్యర్థనను స్వీకరించాడు. సర్వసన్నాహాలతో నాలుగు గుర్రాల రథాన్ని దారుకుడు తోలుతుంటే, అగ్నిద్యోతనునితోసహా స్వామి కుండిన పురానికి బయలుదేరాడు. శ్రీకృష్ణునకు అండగా నుండాలని, బలరాముడు పెద్దసైన్యముతో, వెంటవెళ్లాడు. తెల్లవారేసరికి వారు విదర్భ రాజధానిని చేరుకొన్నారు.

శిశుపాలునితో వివాహంచెయ్యడానికి అన్ని ఏర్పాట్లూ జరుగుతున్నవి. నగరమంతా పతాకాలు, తోరణాలు, పువ్వులు, ముగ్గులు, పన్నీరుజల్లులతో అలంకరించారు. భీష్మకుడు యథావిధిగా పితృ దేవతార్చనలు, వేదపఠనాలూ, మంగళాచరణాలు, బ్రాహ్మణ ఆశీర్వాదాలూ, హోమాలు, దానాలు అన్నీ జరిపిస్తున్నాడు. రుక్మిణీకన్యను సర్వాలంకార శోభితగా నలంకరించారు. ఆ మరునాడే పెండ్లిముహూర్తం.

శిశుపాలుడు అనేక రథాలు, గుర్రాలు, ఏనుగులు మొదలగు వాటితో, భటులతో బంధువర్గాలతో మహాటోపముగా తరలివచ్చాడు. రుక్మియొక్క ఆప్తమిత్రులైన జరాసంధ, సాళ్వ, దంతవక్త్ర, విదూరక, పౌండ్రకులు చతురంగ బలాలతో వచ్చారు.

ముహూర్తం దగ్గరపడుతున్నకొద్దీ రుక్మిణి మనస్సు ఆందోళన చెందుతున్నది. బ్రాహ్మణుడు ఇంకాతిరిగి రాకపోవడానికి కారణమేమో! ఆ ఇందీవరశ్యామునకు నా సందేశము అందినదా? ఈ భూసురుడు సకాలములో ద్వారక చేరుకొనగలిగాడా? నా కోరిక ఫలిస్తుందా? దైవనిర్ణయం ఎలాగున్నదో!

మ॥ **ఘనుడా భూసురుడేగెనో? నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో?**
**విని కృష్ణుండిది తప్పుగాఁదలచెనో? విచ్చేసెనో? ఈశ్వరుం**
**డను కూలింప దలంచునో తలపడో? ఆర్యామహాదేవియున్**
**నను రక్షింపనెరుంగునో యెరుగదో నా భాగ్యమెట్లున్నదో?** 1726

"ఆ భూసురోత్తముడు ద్వారక చేరుకొన్నాడో? లేక దారిలో ప్రయాణబడలికచేత ఎక్కడైనా చిక్కుకొన్నాడో? అతడు క్షేమంగా చేరుకొని, కృష్ణునకు నా సందేశాన్ని వినిపించియుంటాడు. దానిని విని నేను అలాగ సందేశంపంపించడం సంప్రదాయంకాదని తప్పుగా తలచాడో లేక కరుణామయుడు గనుక నా సంకటస్థితిని సరిగా అర్థంచేసుకొని, నన్ను రక్షించడానికి, బయలుదేరి వచ్చాడేమో! పరమేశ్వరుడు నా సంకల్పానికి అనుకూలిస్తాడోలేదో! గౌరీమహాదేవి నన్నుకాపాడదలచుకొంటున్నదో లేదో! ఇంతకూ నా అదృష్టం ఎలాగున్నదో, ఏమో?" అనుకొంటూ అనేకభయసందేహాల మధ్య చిక్కుకొని, ఆ కన్య తల్లికైనా చెప్పుకోదు, కన్నీరుతుడుచుకోదు, జుట్టు సవరించుకోదు, చిరునవ్వునవ్వదు, సఖులతో ముచ్చటించదు. అన్నము తినదు. చూపులను కృష్ణుడు రాబోవు మార్గముపైనిలిపి కూర్చునేది. అంతట శుభసూచికంగా తన ఎడమకన్ను, ఎడమభుజము అదిరాయి. అగ్నిద్యోతనుడు కనిపించాడు. ఆమె ప్రాణంలేచి వచ్చినది. బ్రాహ్మణుడు లోనికి వచ్చాడు. ఆమె దిగ్గున లేచి, ఎదురేగి, చిరునవ్వుతో ప్రశ్నార్థకంగా అతనివైపు చూచినది. అతని ముఖంలో ఆనందరేఖల్ని గమనించినది. అతడు చిరునవ్వుతో ఇలా చెప్పాడు: "రాకుమారీ!

ఉ॥ **మెచ్చెభవద్గుణోన్నతికమేయధనావళులిచ్చె నాకు తా**
**వచ్చె సుదర్శనాయుధుడు వాడె సురాసురులెల్లనడ్డమై**
**వచ్చిననైన రాక్షసవివాహమునంగొనిపోవు నిన్ను నీ**
**సచ్చరితంబు భాగ్యమును సర్వమును నేడు ఫలించెకన్యకా!** 1735

సుదర్శనాయుధుడు నీయొక్క ఉత్తమ గుణాలకు మెచ్చుకొన్నాడు. నేను తీసుకొనివెళ్లిన నీయొక్క సందేశానికి సంతోషించినవాడై, నాకు అనేక ధనరాసులనిచ్చాడు. అతడు వచ్చేశాడు. ఇక నీకు భయంలేదు. దేవదానవులేకమై వచ్చి అడ్డగించినా, అతడు నిన్ను రాక్షసవివాహ పద్ధతిలో తీసుకొనివెళ్లిపోతాడు. నీసచ్చరిత్రము, అదృష్టము అన్నీనేడు ఫలించాయి కదమ్మా!" అనినవిని, రుక్మిణి, మిక్కిలి సంతసించి ఇలా అన్నది!

మ॥ జలజాతేక్షణుఁదోడితెచ్చితివి నా సందేశముంజెప్పి నన్
నిలువంబెట్టితి నీకృపన్ బ్రతికితిన్ నీయట్టి పుణ్యాత్మకుల్
కలరే! దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ కావింపగా నేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ! 1735

"ఓ భూసురరత్నమా! నా సందేశాన్నెరిగించి, నళినదళేక్షుని తోడ్కొని వచ్చి నా ప్రాణాలను నిలబెట్టావు. నీయొక్క కృపచే నేను బ్రతికిపోయాను. నీవంటి పుణ్యాత్ములింకెవ్వరైనా ఉన్నారా? దీనికి నేను నీకు ఎలాంటి ప్రత్యుపకారము చెయ్యగలను? ఏమీచెయ్యలేని నిస్సహాయను. ఓసద్బంధుచింతామణీ! నీకు దోసిలొగ్గి నమస్కరిస్తాను." అని చెప్పి, నమస్కరించినది. అతడు నిష్క్రమించాడు.

తనకుమార్తె వివాహానికి బలరామకృష్ణులు అతిథులుగా వచ్చారనే సంతోషంతో భీష్మకుడు వారిని తగురీతిని సత్కరించి కానుకలిచ్చి వసతులేర్పరచినాడు. ఇతర అతిథులనూ రాజులను వారివారి స్థాయులకు అనుగుణంగా సత్కరించి గౌరవించాడు. శ్రీకృష్ణుడు వచ్చినట్లు తెలుసుకొన్న విదర్భవాసులు తండోపతండాలుగా వచ్చి, అతనిని దర్శించి, ఆ సుందర వదనారవిందశోభకు సమ్మోహితులై, తనివితీరని దృక్కులతో తిలకిస్తూ, తమలోతాము ఇలాగ ముచ్చటించుకొనసాగారు: "ఈ నవమన్మథుడే మన రుక్మిణీ రాకుమారికి తగినవరుడు. ఇతనికొరకే బ్రహ్మ ఆమెను సృష్టించాడేమో! అయినా ఈ రుక్మి ఎందుకు మధ్యలో అడ్డుతగిలి, ఇలాగ తారుమారు చేస్తున్నాడు? ఈ దుష్టుల పన్నాగాన్ని పడగొట్టి, కృష్ణుడే రుక్మిణిని పెండ్లాడితే ఎంత బాగుండును?" అని అనుకొన్నారు.

పెండ్లిరోజు ఉదయం రుక్మిణీ రాకుమారి, గౌరీపూజ చెయ్యడానికి దేవీమందిరానికి కాలినడకను బయలుదేరినది. ఆమె తనచుట్టూ ఆమె తల్లులు, చెలికత్తెలు, పుణ్యస్త్రీలు, బ్రాహ్మణముత్తైదువలూ, దాసదాసీజనులు, రక్షకభటులూ ఉండగా గజగమనంతో వెళ్లినది. వేదపండితులు మంత్రాలు చదివారు. పురోహితులు, ముత్తైదువలూ గౌరీపూజ చేయించారు. పార్వతీదేవిని స్తుతించారు. ఆమె పూజా విధిలో పరమశివునీ గౌరీమాతనూ భక్తితో పూజించినది. తన మనస్సులోనున్న కోర్కెను ఈ విధంగా మననం చేసుకొన్నది.

ఉ॥ నమ్మితి నామనంబున సనాతనులైన ఉమామహేశులన్
మిమ్ము పురాణదంపతుల మేలు భజింతుగదమ్మ మేటి పె
ద్దమ్మ, దయాంబురాశివి గదమ్మ, హరింబతిసేయుమమ్మ నిన్
నమ్మిన వారి కెన్నడును నాశములేదు గదమ్మ యీశ్వరీ! 1743

అని మొక్కుకొని, బ్రాహ్మణ దంపతులకు తాంబూలములు కానుకలిచ్చి వారి ఆశీస్సులను పొంది, గుడినుండి నెమ్మదిగ బైటకు వచ్చినది. అతిలోకసౌందర్యవతిగా ప్రసిద్ధిగాంచిన ఆ రాకుమారిని ఒక్కసారి అయినా కన్నుల పండువుగా చూడాలనే ఆశతో పెండ్లికి అతిథులుగా వచ్చిన రాజకుమారులందరూ ఆమె నడిచివెళ్లే మార్గాన చేరినారు. శ్రీకృష్ణుడు ఆ దారిలోనే ఎక్కడో ఉంటాడని ఆమెకు తెలుసు. నెమ్మదిగా రాజహంసలాగ నడుస్తూ, క్రీగంటి చూపులతో రెండువైపులా పరికించిచూస్తూ అడుగులు వేస్తున్నది. ఆమె అందాన్నీ, కదిలకలనూ సోయగాన్నీ తిలకిస్తున్న రాజకుమారులకు మతులు చలించాయి. గతులు తప్పాయి. చేతులలోని ఆయుధాలు జారిపడ్డాయి. ఈమెను పొందలేని జన్మనిరర్థకమనుకొన్నారు. శిశుపాలుడు ఎంతటి భాగ్యశాలి! అని ఈర్ష్యజెందారు. రుక్మిణి ముందుకు సాగిపోతున్నది. గాలికి చెదురుతున్న ముంగురులను సవరించుకొంటున్నట్లు నటిస్తూ అంతా కలయజూస్తున్నది. అల్లడుగో కనిపించాడు నీలమేఘశ్యాముడు. అచ్చంగా నారదుడు, అగ్నిద్యోతనుడు వర్ణించినట్లే ఉన్నాడు.

పీతాంబరధారియైన ఆ దివ్యమోహనాకారుడు రథముపై నిల్చున్నాడు. ఆమెవైపే చూస్తూ చిరునవ్వు చిందిస్తున్నాడు. చేతులుచాచి ఆహ్వానిస్తున్నాడు. సందేహంలేదు అతడే నాహృదయాధినాథుడైన శ్రీకృష్ణుడు. ఆమె హృదయస్పందన ఒక్కసారి ఆగిపోయినట్లయినది. మేను పులకించినది. సంతోషంకట్టలు తెంచుకొన్నది. మందగమనం వీడి, అడుగులు వడివడిగా వేసుకొంటూ రథాన్ని సమీపించినది. శ్రీకృష్ణుడు రథమునుంచి వంగి కుడిచేతిని చాచి, ఆమె కుడిచేతిని అందుకొని, మీదికిలాగి ఆమెను రథంలో కూర్చుండబెట్టుకొన్నాడు. ఏమి జరుగుతుందో, చూపరులు గ్రహించేలోగా మెరుపులాగ రథం దౌడు తీసినది. బలరాముడు సైన్యాన్ని తీసుకొని వెంటవెళ్లాడు. దిగ్భ్రమచెందిన రాజులు తేరుకొని, విషయాన్ని గ్రహించి, శౌర్యము తెచ్చుకొని అవమానంతో ఉడికిపోయారు. "క్షత్రియునకు చెందవలసిన రాజకుమారిని, ఒక గొల్లవాడు ఎత్తుకొనిపోతుంటే చూస్తూ చేతకానివారివలె ఇలాగ ఉండిపోవడం క్షత్రియులకు సిగ్గుచేటు" అనుకొంటూ అందరూ వెంబడించారు. వారిని బలరాముడు యాదవసైన్యంతో అడ్డుకొన్నాడు. శత్రువులు శరపరంపరలతో యాదవ సేనలను కప్పివేయడం చూచిన రుక్మిణి ఆందోళనచెందగా, శ్రీకృష్ణుడు ఆమెకు ధైర్యమిచ్చి ఇలా చెప్పాడు: "ఓ ఇందువదనా! చూస్తూ ఉండు, మనవీరులు శత్రువులను ఎలాగ చెండాడుతారో?" అన్నాడు. బలరాముడు శత్రుభయంకరుడై శత్రువుల చతురంగ బలాలను నేలపాలుచేశాడు. జరాసంధుడూ మొదలైన రాజులు ప్రాణభయంతో వెనుదిరిగి కుండినపురికి చేరుకొన్నారు. తనకు భార్యకావలసిన రుక్మిణిని కృష్ణుడు ఎత్తుకొనిపోయినందుకు అవమానంతోను, తీవ్రమైన సంతాపంతోనూ రోదిస్తున్న శిశుపాలునివద్దకుపోయి వారు ఊరడింపసాగారు: జరాసంధుడిలా అన్నాడు: "మిత్రమా! శాంతించు. కొంచెము ఓర్చుకో. విచారించకు. ఒకందుకు సంతోషించాలి మనం ఆ యాదవులచేత చిక్కి చావలేదుకదా. బ్రతికిఉంటే భార్యయే దొరక్కపోతుందా! ఇంతకన్న మంచిదే దొరుకుతుంది. ఒక్కటిమాత్రం నిజం. మనచేతిలో ఏమీలేదు. అంతా మనల్ని కీలుబొమ్మల్లాగ ఆడించే ఆ ఈశ్వరునిమాయ. నా విషయమేచూడు, నేను మధురపై పదునేడుసార్లు దండెత్తి విఫలుడనైనా పట్టువిడువకుండా పద్దెనిమిదవసారి దండెత్తితే యాదవులు పిరికి పందలై మధురనే విడిచి పారిపోలేదా? దేనికైనా కాలం కలిసిరావాలికదా! ఇప్పుడు మన అందరిసైన్యములూ ఎంతో పెద్దవే అయినా కొద్దిమంది మాత్రమే ఉన్న యాదవులు చిత్తుచెయ్యలేదా? కాలం అనుకూలించినప్పుడు మనం కక్ష తీర్చుకొందాం. చింతించకు." అని హితవుపలికాడు. అందరూ తమతమదేశాలకు మరలిపోయారు.

తీవ్రమైన అవమానంతో, రోషావిష్టుడైన రుక్మి ఒక అక్షౌహిణీ సైన్యాన్ని తీసుకొనివెళ్లి, శ్రీకృష్ణుని వెంబడించాడు. "కృష్ణుని చంపి, చెల్లెల్ని తిరిగి తీసుకొని రాలేకపోతే నేను ఈ నగరంలో కాలుపెట్టను" అని ప్రతిజ్ఞచేసి వెళ్లాడు. సారథిని తొందరబెట్టి, కృష్ణుని రథాన్ని కలుసుకొనుమని చెప్పాడు. కృష్ణుడు అది గ్రహించి, తన రథాన్ని నెమ్మదిగ నడవనిచ్చాడు. "ఈగొల్లవానికి నా బాహుబలం సంగతి తెలియదు. నా చెల్లెలినే ఎత్తుకొపోవడానికి వీడికెంతసాహసం!" అనుకొంటూ ఇలాకేకలువేశాడు: "నిలునిలు, యాదవా! దొంగా! మాచెల్లెల్ని తీసుకొనివెళ్లడానికి నీవేపాటివాడవు? నీ వంశమేమిటి? నీప్రవర్తన ఏమిటి? అంతా మాయతోనే ఆడిస్తావు. నీనిజతత్త్వం ఎవ్వరికీ తెలియనివ్వని మాయగాడివి. మాచెల్లెల్ని విడువకపోతే నీ మదం అణచి, నేనే ఆమెను తీసుకొనిపోతాను." అని బాణాలు సంధించగా, నల్లనయ్య ముసిముసి నవ్వులు నవ్వుతూ వాటిని ముక్కలు చేశాడు. తన బాణాలతో రుక్మియొక్క గుర్రాలను సారథిని హతమార్చి, రుక్మిని గాయపరచాడు. రుక్మిరథందిగి కత్తిపట్టుకొని కృష్ణుని పైబడితే కృష్ణుడు ఆఖడ్గాన్ని ముక్కలుచేసి రుక్మిని చంపబోయాడు. అప్పుడు రుక్మిణి కృష్ణుని ఇలాగవేడుకొన్నది: "ప్రాణేశ్వరా! అహంకారంచే మాఅన్న నీపట్ల ఘోరమైనఅపచారమే చేశాడు. శిక్షార్హుడే, కాని స్వయంగాభగవానుడే మా అల్లుడైనాడని సంతోషిస్తున్న మా తల్లిదండ్రులను పుత్రశోకం నుండి రక్షించు. కరుణాసాగరుడవైన నీవు మాఅన్న అపరాధాలను మన్నించుమని

వేడుకొంటున్నాను" అని ప్రార్థించినది. కృష్ణుడు రుక్మిని చంపకుండా, బావమరిది కదాఅని, కొంచెం పరిహాసం చెయ్యదలచుకొని, తల, మీసము, గడ్డము, వికృతంగా గొరిగివదిలి పెట్టాడు. అప్పుడే రుక్మియొక్క సేనలను హతమార్చివచ్చిన బలరాముడు కృష్ణుడు చేసిన పనికి ఖిన్నుడై ఇలా అన్నాడు: "తమ్ముడా! ఇతనిని దూరంగా పొమ్మనకుండా ఇలాగ అవమానం చెయ్యడంనీకు తగదు. ఇతడిప్పుడు మన బంధువుకూడాను. అభిమానవంతునకు తలగొరగడం తలతీయడం కంటే దుర్భరంకదా!" అని రుక్మిణితో బలరాముడు ఇలా అంటాడు: "అమ్మా! మీ అన్న అవమానింపబడ్డాడని మా తమ్ముణ్ణి నిందించకు. దండనీతిని ప్రభువులు పాటించాలికదా! మీ అన్న, ఇప్పుడు బంధువైనాడు. కనుక మరణదండనకు బదులుగా స్వల్పమైన అహంకారదమనదండన విధించాడు కృష్ణుడు. ఇవి అన్నీ కర్మవశాన జరుగుతుంటాయి. దైవమాయచే దేహాభిమానమేర్పడి, శత్రుమిత్రులు, మానావమానాలు, స్వపరభేదాలు కల్పించుకొంటాడు మానవుడు. వాస్తవానికి ఆత్మఒక్కటే, దైవానికి అందరూ సమానులే. నీవు జ్ఞానవంతురాలవు గనుక అంతాఅర్థం చేసుకొనగలవు. దేనికీ నీవుశోకింపవలదు." అని బలరాముడు చేసిన జ్ఞానబోధకు రుక్మిణి ప్రసన్నురాలయినది.

ప్రతిజ్ఞ పూనిన రుక్మి, కుండినగరం ప్రవేశించకుండా, నగరమునకు బయట నివసించసాగాడు. తరువాత అక్కడొక పట్టణం తయారయినది. బలరామకృష్ణులు రుక్మిణిని తోడ్కొని ద్వారకానగరిని చేరుకొన్నారు. రుక్మిణీ కృష్ణులవివాహం ద్వారకలో అత్యంత వైభవోపేతముగా జరిగినది. కృష్ణద్వేషులు తప్ప రాజులందరూ వచ్చారు. ద్వారక ప్రజలు నగరాన్ని వైకుంఠంలాగ అలంకరించారు. ఆదిలక్ష్మీమహావిష్ణువుల వివాహం జరిపించే భాగ్యముతమకే దక్కిందని ద్వారకవాసులు ఉప్పొంగిపోయారు. వధూవరుల సౌందర్యశోభను తిలకించి దేవతలతో సహా స్త్రీపురుషులందరూ సమ్మోహితులయ్యారు. సకలజనులూ ఆనందభరితులయ్యారు.

పరీక్షిన్మహారాజా! లక్ష్మీనారాయణులు, తమలీలా నాటకప్రదర్శనానికి, మళ్లీ భూలోకంలో ఆవిధంగా కలుసుకొన్నారు: అని శ్రీశుకుడు చెప్పాడు.

హరిః ఓంతత్ సత్

దశమస్కంధము పూర్వభాగము సమాప్తము

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

* * *

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# దశమస్కంధము

## ఉత్తరభాగము

### ద్వారకావిలాసము - ప్రద్యుమ్నుడు

దేవతలరక్షణగురించి కుమారస్వామి పరమశివుని పుత్రుడై జన్మించవలసియున్నది. కాని సతీదేవి దేహత్యాగము తరువాత శివుడు ఏకాకియై తపోనిష్ఠుడైయుండెను. అతనినే పతిగా వరించి, అతనికి తెలియకుండా అతని పరిచర్యచేస్తున్న హిమగిరినందినియైన పార్వతియందు అతని మనస్సులగ్నమై వారు దంపతులైతేనే తప్ప దేవతల కోరిక ఫలించదు. కనుక దేవతలు మన్మథుని ఆశ్రయించి, శివునిపై తన కామాస్త్రాలను ప్రయోగింపుమంటారు. మన్మథుని చర్యలవలన ధ్యానవిక్షేపము కలిగిన శివునియొక్క మూడవనేత్రజ్వాలకు అతడు భస్మమైపోయాడు. అయితే మన్మథబాణ ప్రభావంచేత శివుని మనస్సు చలించి పార్వతియందు లగ్నముకాగా, ఆమెను వివాహం చేసుకొన్నాడు. మన్మథునిభార్యయైన రతీదేవి యొక్క మొరనాలకించిన శివుడు ఆమెను కనికరించి, మన్మథుడు అనంగుడై (అశరీరుడై) ఆమెతో సంచరించగలడని చెప్పాడు. కాని, "సౌందర్యానికే" ప్రతీకం అయిన మన్మథునకు రూపంలేకపోవడమేమిటని ఆమెకు సంతుష్టి కలుగలేదు. అప్పుడు శివుడు ద్వాపరయుగములో అవతరించనున్న నారాయణునకు మన్మథుడు, సుందరరూపములో పుత్రుడై జన్మిస్తాడనీ, అప్పుడామె అతనితో కలిసి జీవించవచ్చనీ చెపుతాడు.

రుక్మిణీకృష్ణులకు మన్మథుడు పుత్రుడై జన్మించి, ప్రద్యుమ్నుడని పిలువబడ్డాడు. ద్వారకప్రజలందరూ, అమితమైన ఆనందోత్సాహాలతో ఉత్సవం జరుపుకొన్నారు. శంబరాసురుడనే రాక్షసుడు తన మృత్యువు కృష్ణుని పుత్రునిచే సంభవిస్తుందని తెలుసుకొని, అందరూ వేడుకలలో నిమగ్నులైయున్న సమయంలో, ప్రద్యుమ్నుడు పుట్టిన ఏడవరోజునే ఆయనను ఎత్తుకొనిపోయాడు. బిడ్డడిని ఎలాగచంపాలి, ఎక్కడ చంపాలి, అని యోచించాడు. ముద్దులు గొలిపే ఆ ముగ్ధమోహనాకారుని చంపడానికి ఆ అసురునకు కూడ చేతులురాలేదు. చివరకు వానిని సముద్రంలో పారేస్తే, సముద్రుడే తన గర్భంలో కలుపుకొంటాడు అని నిశ్చయించి, ఆ బిడ్డను సముద్రంలో పారవేసి, తనమృత్యుభయం తొలగిపోయిందని సంతోషించాడు. సముద్రంలో పడిన బాలుని ఒక పెద్ద చేపమింగివేసినది. అతిపెద్దదైన ఆ చేపను జాలరులు పట్టుకొని, రాజైన శంబరుని వద్దకు తీసుకెళ్ళగా నతడు సంతసించి జాలరులకు ధనమిచ్చి చేపను పాకశాలకు పంపించాడు. వంటవాళ్ళు ఆచేపను కొయ్యగా, దానిపొట్టలో నున్న దివ్యసుందర బాలుని చూచి, ఆశ్చర్యపోయి ఆ బిడ్డను ఆ పాకశాలను నిర్వహిస్తున్న మాయావతి అనే ఆమెకు చూపించారు. ఆ బిడ్డను చూడగానే ఆమెకు వానిపై అకారణమైన మోహము పుట్టుకొనివచ్చినది. వానిని ప్రేమతో పెంచసాగినది. బాలుడు పెరిగి పెద్దవాడయ్యాడు. ఒకనాడు నారదుడు వచ్చి, ఆమె పెంచుతున్న బాలుడు పూర్వము మన్మథుడు అనీ, అతడు రుక్మిణీ కృష్ణుల పుత్రుడై పుట్టి, ప్రద్యుమ్నుడని పిలువబడ్డాడనీ, అతని చేత శంబరాసుడు చావవలసియున్నదనీ ఆ విషయం తెలుసుకొని, శంబరుడు ఏడురోజుల పురిటి బిడ్డను ఎత్తుకుపోయి సముద్రంలో పడవేస్తే, వాడు చేప కడుపులో పడి, శంబరుని వంటింటికే వచ్చిచేరాడనీ, అదృశ్యమైన బిడ్డను గురించి అలమటించి రుక్మిణీదేవి

కృశించిపోతున్నదనీ చెప్పినాడు. మళ్లీ మాయావతి అని పిలువబడే ఆమె నిజానికి మన్మథుని భార్య అయిన రతీదేవియనీ, మహాదేవుని మాట ప్రకారం తన పతిని కలుసుకోవచ్చునని భూలోకంలో సంచరిస్తూ శంబరునిచే చెరపట్టబడి అక్కడ ఉన్నదనీ త్వరలోనే శంబరాసురవధ జరిగిన పిమ్మట వారిద్దరూ ద్వారకకు వెళ్లిపోవచ్చుననీ చెప్పి నారదుడు నిష్క్రమించాడు. ప్రద్యుమ్నుడు నవయౌవనవంతుడైన సుందరరూపుడయ్యాడు. నారదమహర్షి చెప్పినతరువాత, ఆబాలుడు తనభర్తయే అని తెలుసుకొన్న మాయావతికి అతనిపై ప్రేమానురాగాలు కట్టలుతెంచుకొన్నవి. ఆమెయొక్క దృక్పథమే మారిపోయినది. ఆమెప్రవర్తనలోని మార్పును గమనించి, ఒకనాడు ప్రద్యుమ్నుడిలా అడిగాడు. "తల్లీ! కొద్దిరోజులుగా నీలో మాతృత్వం కనబడటంలేదు. పుత్రుడనైన నాపట్ల నీకు వాత్సల్యానికి బదులుగా కామతృష్ణయే కనిపిస్తున్నది. నాఊహయే నిజమైతే ఇది ధర్మవిరుద్ధము. ఘోరపాపము, నీమనస్సును సరిదిద్దుకో" అని మందలించాడు. అప్పుడామె నారదమహర్షి వలన తెలుసుకొన్న తమయొక్క పూర్వజన్మల వృత్తాంతాలనూ, వెంటనే శంబరాసురుని వధించవలసిన ఆవశ్యకతను, పుత్రవియోగ దుఃఖము నుండి రుక్మిణీదేవిని కాపాడవలసిన ఆవశ్యకతనూ వివరించిచెప్పి, మళ్లీ ఇలాగ అన్నది: "ఈ శంబరుడు గొప్ప మాయలమారి. మహాక్రూరుడు. దేవతలను కూడ జయించిన బలశాలి. వీనిని హతమార్చడం అంత సులువేమీకాదు. వీనిమాయలను అరికట్టగల మహామాయా విద్యను నీకు నేర్పుతాను" అని చెప్పి మాయావతి ఆ విద్యను ఉపదేశించినది.

యుద్ధానికి సర్వసన్నద్ధుడై వెళ్లిన ప్రద్యుమ్నకుమారుడు శంబరుని యుద్ధానికి కవ్వించి, ఇలా అన్నాడు: "ఓరీ! రాక్షసాధమా! నన్ను సముద్రములో పడవేసి, నీ చావును తప్పించుకొందామనుకొన్నావా? చావునెవ్వరైనా తప్పించుకొనగలరా! ఎలాగ తప్పించుకొనగలవో చూద్దాం బయటకు రా." అని కేకవేయగా శంబరుడు రోషముతో భయంకరంగా గర్జించి, గదనెత్తి ప్రద్యుమ్నుని తలకు గురిపెట్టి కొట్టాడు. ప్రద్యుమ్నుడు మెరుపుతీగలాగ తప్పించుకొని, తన గదతో అసురుని గదను ముక్కలుచేసి, వానిని మొత్తాడు. ఆదెబ్బలకు శంబరుడు భయపడిపోయి, మాయాప్రయోగంచేసి ఆకాశంనుండి బాణాల వర్షం కురిపించాడు. ప్రద్యుమ్నుడు సాత్త్విక మాయను ప్రయోగించి, శరవర్షాన్ని ఆపివేశాడు. ఆవిధంగా శంబరుడు ప్రయోగించిన మాయలన్నిటినీ త్రిప్పికొట్టేసరికి వాడు ఇక చేసేదేమీలేక ముష్టియుద్ధానికి దిగగా ప్రద్యుమ్నుడు వాని శిరస్సును ఖండించాడు. దేవతలు సంతసించి పుష్పవృష్టి కురిపించారు.

ప్రద్యుమ్నుని తీసుకొని, మాయావతి అయిన రతీదేవి ఆకాశమార్గాన ద్వారకా నగరంచేరి, రుక్మిణీ భవనంలో వెలసినది. ప్రద్యుమ్నుని చూచి, అక్కడి అంతఃపురాంగనలు, పరిచారికలు, అతడు శ్రీకృష్ణుడే అని భ్రమపడ్డారు. అయితే ఆ ప్రక్కనున్న స్త్రీ ఎవరు? అని తికమకచెందారు. ముమ్మూర్తులా శ్రీకృష్ణుని పోలిన ఆ యువకుడెవరు? ఆమె ఎవరు? అనే కుతూహలంతో స్త్రీలంతా వారి చుట్టూ మూగారు. ఏమిటీ సందోహం అని రుక్మిణీదేవికూడ? వచ్చిచూచినది. తన కన్నులను తానే నమ్మలేకపోయినది. ముమ్మూర్తులా తన భర్తలాగే కనిపిస్తున్న ఈ యువకుడెవ్వడు? అతనిని చూడగానే ఆమె కన్నులనుండి అశ్రువులు, చన్నులనుండి పాలుకార నారంభించాయి. ఆమె తన చెలికత్తెతో నిలా అన్నది: "చెలీ! ఈ సుకుమార సుందర యువకుడెవ్వడోకదా! ఎక్కడినుండి, ఎందుకు వచ్చాడో! ఇతనిని కన్న భాగ్యవతి ఎన్నినోములునోచి కన్నదో కదా? నాతొలిచూలి బాలుని నా ప్రక్కనుండి ఏపాపాత్ముడు దూరము చేశాడో? వాడు ఏ చల్లని తల్లి వద్ద పెరుగుతున్నాడో! ఈపరికి వాడుకూడ ఇంతవాడే అయియుంటాడు. ఇతడు నా పుత్రుడే అయియుండవచ్చునేమో! కాకపోతే ఇతనిలో నా పతిపోలికలెందుకు ఉంటాయి? ఇతనిని చూస్తుంటే ప్రేమ పొంగివస్తున్నది, హృదయం ఆనందంతో నిండిపోతున్నది. ఆనందాశ్రువులు కారుతున్నవి. పాలు పొంగారుతున్నవి." అని, ఆ తల్లి తల్లడిల్లిపోతున్నది. అంతఃపురంలో జరుగుతున్న సందడి గురించి తెలుసుకొని, శ్రీకృష్ణుడు దేవకీవసుదేవులను తోడ్కొని అక్కడికి వచ్చాడు. అన్నీ తెలిసియుండియు

ఏమీ తెలియనట్లు అంతా గమనిస్తున్నాడు. అందరిలో కుతూహలము పతాకస్థాయికి చేరుకొనే సరికి నారదమహర్షి ప్రత్యక్షమయ్యాడు. శంబరుడు పసికందును ఎత్తుకొపోయినప్పటినుండి, ప్రద్యుమ్నునిచే సంహరింపబడినంత వరకు జరిగిన వృత్తాంతమంతా వివరించి చెప్పాడు. మాయావతి ఎవరోకూడ చెప్పాడు.

మరణించిన బాలుడు బ్రతికివచ్చినంత ఆనందం కలిగినది అక్కడివారందరికీ. దేవకీవసుదేవులు, బలరామకృష్ణులు, రుక్మిణీసమేతలైన అంతఃపురకాంతలు అందరూ రతీప్రద్యుమ్నులను ప్రేమతో ఆశీర్వదించారు. రుక్మిణీదేవి కొడుకును కౌగలించుకొని మృత్యుముఖంనుండి తప్పించుకొని, దుష్టరాక్షసుని సంహరించి, భార్యతోసహా వచ్చినందుకు ఆనందబాష్పాలురాల్చినది. నిత్యనూతనయౌవనవతియైన ఆదివ్యసుందరి తనకోడలు అయినందుకు ఆమెపరవశించిపోయి ఆలింగనం చేసుకొన్నది. ద్వారకానగరవాసులందరూ ప్రద్యుమ్నకుమారుని గాథను చెప్పుకొని ఆనందించేవారు. ఆ దివ్య దంపతులను చూచి సమ్మోహితులయ్యేవారు.

## సత్యభామ, శమంతకమణి, జాంబవతి

ద్వారకానగరవాసియైన సత్రాజిత్తు గొప్ప సూర్యభక్తుడు. అతని భక్తికి మెచ్చి, సూర్యుడు అతనికి శ్యమంతకమణిని ఇచ్చాడు. దానిని ధరించి, సత్రాజిత్తు ద్వారకలో ప్రవేశిస్తుంటే, అక్కడి పామరులు శ్రీకృష్ణ దర్శనార్థం సాక్షాత్తు సూర్యుడే నడచి వస్తున్నాడని భావించి, కృష్ణుని వద్దకు వెళ్లి ఇలా అన్నారు: " నారాయణా! వాసుదేవా! గోవిందా! దామోదరా! యదునందనా! నీదర్శనానికి ఆ సూర్యభగవానుడే వస్తున్నాడు" అని ఉత్సాహంతో చెప్పారు. శ్రీకృష్ణుడు మందహాసంచేసి ఇలా అన్నాడు: "ఆ వస్తున్నది సూర్యుడు కాడు, అతడిచ్చిన శ్యమంతకమణిని ధరించిన సత్రాజిత్తు." అని చెప్పాడు. సత్రాజిత్తు ఆ మణికి పూజలు చేయించి, దానిని తన పూజగదిలో ప్రతిష్ఠింప జేశాడు. అది ఎక్కడ ఆరాధింపబడుతుందో, అక్కడ ఆ మణిప్రభావంచేత ప్రతిదినమూ ఎనిమిది బారువల బంగారము ఉద్భవిస్తుంది. అక్కడ అరిష్టాలు, అకాలమృత్యువు, రోగాలు, వంచన, దొంగతనము, దుర్భిక్షము సంభవించవు, కనుక ఆ మణి ఉగ్రసేనమహారాజు వద్దనుంటే లోకకల్యాణం జరిగి, ప్రజలందరూ సుఖిస్తారని, శ్రీకృష్ణుడు దానిని మహారాజునకిమ్మని సత్రాజిత్తుతో చెప్పాడు. సత్రాజిత్తు అలాగ చెయ్యడానికి నిరాకరించాడు.

ఒకనాడు సత్రాజిత్తుతమ్ముడైన ప్రసేనుడు శ్యమంతకమణిని కంఠాన ధరించి, వేటకై అడవికి వెళ్లాడు. అడవిలో నొక సింహము వానినీ, వాని గుర్రాన్నీ చంపి, ఆ మణినినోట కరుచుకొనిపోతుంటే, జాంబవంతుడనే మహాబలశాలియైన భల్లూకరాజు ఆ సింహాన్నిచంపి, మణిని తీసుకొనిపోయి, గుహలోనున్న తన బిడ్డకు ఆటవస్తువుగాజేశాడు.

మణిని ధరించి వేటకువెళ్లిన ప్రసేనుడు తిరిగిరానందున సత్రాజిత్తు ఆందోళనచెందాడు. మణిని సంగ్రహించాలని తన తమ్ముని ఎవ్వరో సంహరించియుంటారని తలపోశాడు. ఆ పనిని కృష్ణుడే చేయించి యుండవచ్చని అనుమానించి, తన ఊహను వ్యక్తపరచాడు. ఆ మాట అంతటావ్యాపించి శ్రీకృష్ణుని చెవిలోపడినది. ఈ అపనిందను తొలగించుకోవాలని కొందరు అనుచరులతో శ్రీకృష్ణుడు అడవికివెళ్లిఅంతా గాలించగా, ఒకచోట చచ్చిపడియున్న గుర్రాన్నీ, ఇంకకొంతదూరంలో ప్రసేనుని కళేబరాన్నీ, తరువాత చచ్చిన సింహాన్నీ, అక్కడినుండి ఎలుగుబంటి అడుగుల జాడలను పిదప ఒక కొండగుహనూ కనుగొన్నాడు. అనుచరులను గుహద్వారం వద్ద నుండుడని చెప్పి, తాను గాఢాంధకారంగా నున్న గుహలోనికి ప్రవేశించాడు. ఆ లోపల దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఒక బాలబాలికను చూచాడు. ఆమెకు ఎదురుగా వ్రేలాడగట్టబడిన ఆ దివ్యమణిని చూచాడు. శ్రీకృష్ణుడు ఆ మణిని తీసుకొనబోవగా ఆ బాలిక అరచినది. అదివిని లోపలినుండి జాంబవంతుడు వచ్చి కృష్ణుని ఎదిరించాడు. ఇద్దరికీ రాత్రింబవళ్లూ నిర్విరామంగా ఇరవై ఎనిమిదిరోజులు ఘోరయుద్ధం జరిగినది. కత్తులతోను, చెట్లతోనూ, పిడికిళ్లతోను కొట్టుకొన్నారు.

శ్రీకృష్ణుని పిడికిటిపోట్లకు జాంబవంతుని అవయవాలన్నీ హీనమైనవి. శక్తి సన్నగిల్లినది. ఓటమితెలియని జాంబవంతుడు ఓడిపోయాడు. తనతో ఇన్నిరోజులు పోట్లాడి, తననుఓడించినవాడు మానవమాత్రుడు కాడని గ్రహించాడు. నారాయణుడే ఈ రూపములో వచ్చినట్లు భావించాడు. తనకు పూర్వం ఇచ్చినమాట ప్రకారం తన ఆరాధ్యదైవమైన రఘురాముడే ఈ విధంగా దర్శనమిచ్చాడని భావించి, ఇలాగ స్తుతించాడు:

"దేవాధిదేవా! నీవు పురాణపురుషుడవు. పరమేశ్వరుడవు, మహావిష్ణుడవు అనితెలుసుకొన్నాను. సర్వభూతాలకూ నీవే ప్రాణమూ, ప్రతాపమూ, ధైర్యమూ, బలమున్నూ. ఈ విశ్వానికి సృష్టి స్థితి లయాలకు ఎవరుకారకులో, వారియొక్క సృష్టిస్థితి లయాలను నియమించు ఈశ్వరుడవు నీవు; సర్వాత్ముడవు. శ్రీరామచంద్రుడుగా నీబాణాగ్నిచే సముద్రాన్నే ఇంకింపజేయగలశక్తి నీది. సాగరుడు నీకు దారినిచ్చి, సేతువును కట్టనిచ్చాడు. నీవు రావణాది రాక్షసులను అంతంచేసి, సజ్జనుడైన విభీషణునకు లంకాధిపత్యమిచ్చావు. నా ప్రభునైన నిన్నెదిరించి, అపచారం చేశాను. నన్ను మన్నించుప్రభూ!" అని శ్రీకృష్ణుని పాదాలపైబడిన పరమభక్తుడైన జాంబవంతుని శరీరాన్నినిమిరి అతని బాధలను నివారించి, స్వామి, ఇలా అన్నాడు.

"జాంబవంతా! నీకు తెలిసిన త్రేతాయుగములోని రఘురాముడను నేనే. ద్వాపరయుగములోని వసుదేవ నందనుడనైన కృష్ణుడను నేను. మాలో భేదమేమీ లేదు. 'ఈ శమంతకమణిని నేనే అపహరించితిని' - అనే అపనిందను తొలగించుకోవాలని, దానిని వెతుక్కొంటూ నేనిక్కడికి వచ్చాను. సత్రాజిత్తునకు చెందిన ఈ మణిని అతనికిచ్చివేయాలి." అని చెప్పగా, జాంబవంతుడు సంతోషముతో శమంతకమణినీ, దానితోపాటు మరికొన్ని మణులను అర్పించి ఇలాగ విన్నవించుకొన్నాడు. "స్వామీ! ఈమె నా బిడ్డ జాంబవతీకన్య. ఈమెనుకూడానీకే సమర్పించితే, నా జన్మధన్యమవుతుంది. ఈమెను స్వీకరించి, నన్ను బంధవిముక్తుని చేయుమని ప్రార్థిస్తున్నాను." అని చెప్పగా స్వామి అందులకు అంగీకరించాడు. తరువాత జాంబవంతుడు ముక్తినిపొందాడు.

గుహాద్వారమువద్ద కాచుకొనియున్న కృష్ణుని అనుచరులు పన్నెండుదినాలు శ్రీకృష్ణుని గురించిచూచి, చూచి, నిరాశజెంది, దుఃఖిస్తూ మరలిపోయారు. దేవకీవసుదేవులు, రుక్మిణి మొదలైన అంతఃపురవాసులు, ద్వారకప్రజలు, శ్రీకృష్ణుడు క్షేమంగా తిరిగిరావాలని దుర్గాదేవిని ప్రార్థించారు.

శ్రీకృష్ణుడు విజయంసాధించి, శమంతకమణితోపాటు బాలామణిని కూడా తీసుకొనివచ్చినందులకు ప్రజలు పండుగచేసుకొన్నారు. శ్రీకృష్ణుడు జాంబవతీ కన్యను వివాహం చేసుకొన్నాడు. ఉగ్రసేనుడు కొలువుతీర్చగా సత్రాజిత్తును రప్పించి, అందరి సమక్షంలో శ్రీకృష్ణుడు శమంతకమణిని సత్రాజిత్తునకు అప్పగించాడు. సత్రాజిత్తు సిగ్గుపడి, పశ్చాత్తాపంచెందాడు. తనకుతాను దూషించుకొన్నాడు. తనపాప పరిహారం చేసుకోవడం ఎలాగ? అనీ, శ్రీకృష్ణుని సంతోషపెట్టి అతని అనుగ్రహం సంపాదించడం ఎలాగ అనీ, బాగుగా యోచించి, ఒక నిర్ణయానికి వచ్చాడు. తనపుత్రిక అయిన సత్యభామ జగత్ప్రసిద్ధిచెందిన సౌందర్యరాశి. ఆమెను వివాహమాడాలని ఎందరో యువకులు ఉవ్విళ్లూరుతుండేవారు. అందరినీకాదని ఆమెను శ్రీకృష్ణునికే ఇవ్వ నిశ్చయించుకొన్నాడు. ఆమెతోపాటు శమంతకమణినికూడ కృష్ణునకే ఇవ్వదలచుకొన్నాడు. సత్యభామను స్వీకరించడానికి శ్రీకృష్ణుడు అంగీకరించాడు. వారిద్దరి వివాహం వైభవోపేతంగా జరిగింది. శ్రీకృష్ణుడు సత్రాజిత్తుతో ఇలా అన్నాడు:

"ఈ శమంతకమణిని సూర్యభగవానుడు నీకు ప్రసాదించాడు. కనుక ఇది నీవద్దనే ఉండనీ. మాకు మణులకు కొదువలేదు. నీవు సమర్పించిన ఈ భామామణి మాకుచాలు" అని శమంతకమణిని సత్రాజిత్తునకు తిరిగి ఇచ్చివేశాడు.

సత్రాజిత్తు తనకు సూర్యుడిచ్చిన శమంతకమణి వలన దేవుడిచ్చిన సుందరీమణి (సత్యభామ) వలన, కొందరికి శత్రువైనాడు. ద్వారకలోని కొందరు సత్యభామపై ఆశలుపెంచుకొని యుండిరి. సత్రాజిత్తు వారి ఆశలను మొదటిలోనే త్రుంచివేయలేదు. కనుక ఆమెను శ్రీకృష్ణునకిచ్చి వేయడంతో వాళ్లకు క్రోధము వచ్చేసినది. శమంతకమణి తెచ్చిన సౌభాగ్యముతో సత్రాజిత్తు అనేకుల అసూయకుగురి అయ్యాడు. ఇటువంటి శత్రువులలో శతధన్వుడు, కృతవర్మ ముఖ్యులు. శ్రీకృష్ణునిపై మొదట అపనింద మోపినందుకు అక్రూరునకు కూడ సత్రాజిత్తుపై క్రోధమున్నది. సత్యభామను తనకిస్తానని మొదటచెప్పి, తరువాత మనసు మార్చుకొని కృష్ణునకిచ్చినందుకు శతధన్వునకు సత్రాజిత్తుపై ఎక్కువ కక్ష ఏర్పడినది. దానికి కృతవర్మ, అక్రూరుడు అతనిని ప్రోత్సహించారు. అతడు సమయం గురించివేచి యున్నాడు.

కుంతీసమేతంగా పాండవులు లక్కఇంట్లో దగ్ధమయ్యారని తెలిసి, బలరామకృష్ణులు హస్తినాపురం వెళ్లారు. భీష్మ, ద్రోణ, కృప, విదుర, గాంధారిమున్నగువారిని కలుసుకొని, కొద్దిరోజులు గడిపి వెళ్దామనుకొన్నారు. వారు ద్వారకలో లేనప్పుడు, ఇదేమంచిఅదను అని శతధన్వుడు ఇంట్లో నిద్రిస్తున్న సత్రాజిత్తును చంపి, ఇంట్లోని స్త్రీలు ఎంత మొరపెట్టినా జాలిలేనివాడై శమంతకమణిని తీసుకొని పారిపోయాడు. తండ్రి మరణానికి మిక్కిలి శోకించి, సత్యభామ ఆ శరీరాన్ని నూనెతొట్టెలో భద్రపరచిఉంచి, తాను స్వయంగా హస్తినాపురికి వెళ్లి శ్రీకృష్ణునితో అంతావివరించి చెప్పినది. బలరామకృష్ణులు సత్యభామనుతోడ్కొని ద్వారకకు తిరిగి వచ్చారు. హంతకుడైన శతధన్వుని సంహరించాలని నిశ్చయించుకొన్నారు. శతధన్వుడు ప్రాణభయంతో పోయి, తన్ను రక్షించుమని కృతవర్మను కోరాడు. "బలరామకృష్ణులను ఎదిరించిన వాడెవ్వడూ బ్రతికి బయటపడలేదు. కంసుని గతి ఏమయినది? జరాసంధుడు ఎన్నిసార్లు ఓడిపోలేదు? ఇక ఇతరుల విషయం వేరే చెప్పాలా?" అంటూ కృతవర్మ తప్పుకొన్నాడు. అప్పుడు శతధన్వుడు అక్రూరుని వద్దకుపోయి రక్షింపుమన్నాడు. "అయ్యో శతధన్వా! బలరామకృష్ణులతో వైరమా? వాళ్లెవరనుకొంటున్నావు? విష్ణుమూర్తి అంశంతో పుట్టినవారు. శ్రీకృష్ణుడైతే సాక్షాత్తు భగవంతుడే. అతడు సమస్త విశ్వానికీ సృష్టిస్థితిలయకర్త. అతనియొక్క మాయామోహంలో సమస్తసృష్టీ మునిగియుంటుంది. దానిని తెలుసుకొనడం ఎవ్వరితరమూ కాదు. అతడు మాకు సదాపూజనీయుడే. అతనిని కలలోకూడ ఎదిరించడం జరుగదు." అని అక్రూరుడు చెప్పగా, ఇక గత్యంతరం లేక శతధన్వుడు, శమంతకమణిని భద్రంగా నుంచుమనిచెప్పి దానిని అక్రూరునికి అప్పజెప్పి గుర్రమెక్కి పారిపోయాడు. బలరామకృష్ణులు వానిని రథంలో వెంబడించారు. మిథిలానగర సమీపంలో శతధన్వుని గుర్రము ఇక పరుగెత్తలేక పడిపోయినది. అప్పుడు శతధన్వుడు అడ్డదారులలో పరుగెత్తనారంభించాడు. శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని ప్రయోగించగా వాడు హతుడైనాడు. కృష్ణుడు వెళ్లి వాని శరీరమంతా వెదికినా శ్యమంతకమణి కనపడలేదు. అప్పుడు బలరాముడు కృష్ణునితో ఇలా అన్నాడు: "కృష్ణా! ఈ శతధన్వుడు ద్వారకలోనే ఆ మణిని ఎవరివద్దనో దాచియుంటాడు. నీవు తిరిగివెళ్లి అక్కడే అన్వేషించు. మనం మిథిలవరకూ వచ్చినాము గనుక, నేను నా ప్రియమిత్రుడైన జనకుని వద్ద కొన్నాళ్లుండి వస్తాను." అని చెప్పి బలరాముడు మిథిలా నగరములో ప్రవేశించాడు. జనక మహారాజు బలరామునికి సకల సత్కారాలూ చేసి గౌరవించాడు. అతనిని చాలా రోజులు మిథిలలోనే ఉంచివేశాడు. ఆ కాలములోనే దుర్యోధనుడు మిథిలకువచ్చి బలరామునివద్ద గదాయుద్ధ కౌశలాన్ని బాగా నేర్చుకున్నాడు.

ద్వారకకు తిరిగివచ్చిన శ్రీకృష్ణుడు సత్రాజిత్తునకు అంత్యక్రియలు చేయించాడు. శతధన్వుడు శ్రీకృష్ణుని చేత సంహరింపబడినట్టు తెలుసుకొని, అతడు చేసిన నేరానికి తమప్రోత్సాహము కూడ ఉన్నది గనుక, కృతవర్మ అక్రూరులు భయపడి, చాలదూర ప్రదేశాలకు వెళ్లిపోయారు. అక్రూరుడు లేని కారణాన ద్వారకలో వర్షాలు

కురియడంలేదు. ప్రజలకు అనేకమైన మానసిక శారీరిక బాధలు కలుగనారంభించాయి. అక్కడి వృద్ధులు శ్రీకృష్ణునితో ఇలా అన్నారు: "వాసుదేవా! పూర్వము కాశీరాజు తనరాజ్యములో వర్షాలు చాలాకాలం కురియకపోతే శ్వఫల్కుడనే మహనీయుని తీసుకొనివెళ్లి తనకుమార్తెయైన గాందినిని అతనికిచ్చి వివాహంచేసి సత్కరించగా వర్షాలు కురిసినవి. ఆ గాందినీశ్వఫల్కుల పుత్రుడే ఈ అక్రూరుడు. ఇతడు కూడ అలాంటి మాహాత్మ్యము కలవాడే గనుక, అక్రూరుని తిరిగి ద్వారకకు రప్పించడం క్షేమకరం." అని చెప్పగా అక్రూరుడు కాశీ రాజ్యంలో నున్నట్టు తెలుసుకొని, అక్కడికి దూతలను పంపించి అక్రూరుని రప్పించాడు శ్రీకృష్ణుడు.

శమంతకమణిని తీసుకొని దూరదేశాలకువెళ్లిపోయిన అక్రూరుడు, కాశీపట్టణంలో స్థిరపడి, ఆ మణి ప్రభావంవలన లభ్యమైన ధనముతో, లోకకల్యాణం గురించి యజ్ఞాలు చేయిస్తూ అన్నదానాలు చేయిస్తూ ఇతర ధర్మకార్యాలలో ఆ ధనాన్ని సద్వినియోగం చేసేవాడు. శ్రీకృష్ణునిచే ద్వారకకు మరలి రమ్మని ఆహ్వానందాగానే, ద్వారక వెళ్లాడు. శ్రీకృష్ణుడు ఒక సభను ఏర్పాటుచేసి, అక్రూరుని ఆదరముతో నాహ్వానించి, ఇలా అన్నాడు: "అక్రూరా! సత్రాజిత్తును సంహరించి, శతధన్వుడు పారిపోతూ శ్యమంతకమణిని నీవద్ద విడిచి వెళ్లినాడని నాకుతెలుసు. భయముచే నీవుకూడ మణిని తీసుకొని ద్వారకనుండి వెళ్లిపోయినా, మణివలన వచ్చిన ధనముతో సత్కర్మలు చేస్తున్నావని నేను దానిని నీనుండి తీసుకొనలేదు. సత్రాజిత్తునకు పుత్రులు లేరుగనుక అతని ఆస్తి పుత్రికలకు చెందుతుంది. మనుమలు అతని శ్రాద్ధకర్మలు చెయ్యాలి, ఆ ఆస్తిని పొందాలి. నాకు ఆ మణితో ప్రమేయములేదు. దానిని నేనే దక్కించుకొన్నానేమో అనే అనుమానము ఎవ్వరికీ రాకుండునట్లుగా నీవు ఆ మణిని సభలోని వారందరికీ చూపించు." అని శ్రీకృష్ణుడు చెప్పగా అక్రూరుడు సిగ్గుతో కన్నీరుపెట్టుకొని, క్షమించుమని స్వామిపాదాలపైబడి, గుడ్డమూటనువిప్పి ఆ శమంతకమణిని స్వామికి సమర్పించుకొన్నాడు. స్వామి దానిని సభాసదులందరికీ చూపించి, అందరూ చూస్తుండగా, మళ్లీ అక్రూరునకే ఇచ్చివేసి ఇలా అన్నాడు:

"అక్రూరా! ఈ శమంతకమణిని నీవే ఉంచుకొని, దానివలన వచ్చిన ధనముతో, సత్రాజిత్తుకూడ సద్గతిని పొందునట్లుగా, సత్కర్మలుచేస్తూఉండు" అని చెప్పాడు. అక్రూరుడు భయముతీరి, ద్వారకలోనే ఉండిపోయాడు.

ఈ శమంతకోపాఖ్యానాన్ని చదివినవారికీ, విన్నవారికీ మంగళము, జయము కలిగి, పాపము, అపకీర్తి తొలగిపోతాయి అని శ్రీశుకుడు పరీక్షిత్తుతో చెప్పాడు.

## శ్రీకృష్ణుని ఇతర భార్యలు

ద్రోణాచార్యుని చంపగల పుత్రుడూ, అర్జునునికి భార్యకాగల పుత్రిక కావాలని పాంచాలరాజైన ద్రుపదుడు యజ్ఞము చేయించగా, ఆ యాగాగ్నినుండి ఒక బాలుడు, ఒక బాలిక ఉద్భవించారు. వారే ధృష్టద్యుమ్నుడు, కృష్ణ (ద్రౌపది). కాని పాండవులందరూ లక్క ఇంట్లో కాలిపోయి నశించారని విని, చాలా దుఃఖించి, ద్రుపదుడు ద్రౌపదీ స్వయంవరాన్ని ఏర్పాటు చేశాడు. అర్జునునితో సమానమైన ధనుర్విద్యానిపుణుడే కావాలని, మత్స్యయంత్ర పరీక్షను పెట్టాడు. సాత్యకి, ప్రద్యుమ్నాదులతోగూడి శ్రీకృష్ణుడు ద్రుపదుని ఆహ్వానంపై అక్కడకు వెళ్లాడు. పాండవులు లక్క ఇంటి జ్వాలలకు ఆహుతి కాలేదని కృష్ణునకు తెలుసు. వారు ఎక్కడున్నా ఈ స్వయంవరం విషయం తెలిస్తే రాగలరని ఊహించాడు. బ్రాహ్మణుల వేషములో వచ్చిన ఐదుగురు యువకులూ పంచపాండవులే అని ఊహించాడు. మత్స్యయంత్రాన్ని అర్జునుడే కొట్టాలనే ఉద్దేశముతో ప్రద్యుమ్నునీ, సాత్యకినీ ఆ పరీక్షలో పాల్గొనవద్దని చెప్పాడు శ్రీకృష్ణుడు. ఆ పరీక్షలో బ్రాహ్మణవేషంలోనున్న అర్జునుడే నెగ్గాడు. తానుకోరినట్లు నిజంగా అర్జునుడే నెగ్గినాడని తెలుసుకొన్న ద్రుపదుడు మిక్కిలి సంతసించాడు. బలరామకృష్ణులు మేనత్తఅయిన కుంతీమాతను,

పాండవసోదరులను చూడడానికి వారు ఉంటున్న ఇంటికి వెళ్లారు. అప్పుడే మొట్టమొదటిసారిగా వాళ్లు కలుసుకోవడం జరిగినది. కృష్ణునకు అర్జునునియందు బాగా ఇష్టం ఏర్పడినది. పాండవులు పడుతున్న కష్టాలనుచూచి, కృష్ణుడు వాళ్లకు సహాయపడాలని నిశ్చయించుకొన్నాడు. ఇప్పుడు శక్తిమంతుడైన ద్రుపదునితో బాంధవ్యం ఏర్పడినది గనుక పాండవులు హస్తినాపురం వెళ్లిపోయి, నిర్భయంగా బ్రతుకవచ్చునని కృష్ణుడు సూచించాడు.

కొంతకాలం తరువాత పాండవులు ఎలాగున్నారో చూచిరావాలని సంకల్పించి, శ్రీకృష్ణుడు, సాత్యకి మొదలైన యాదవులతో ఇంద్రప్రస్థనగరానికి వెళ్లాడు. చైతన్యం వచ్చిన ఇంద్రియాలలాగ పాండునందనులు శ్రీకృష్ణుని చూడగానే ఆనందభరితులై ఆలింగనం చేసుకొన్నారు. సర్వేశ్వరుని పాదస్పర్శతో వాళ్ల కష్టాలన్నీ కరిగిపోయాయి. శ్రీకృష్ణుడు ధర్మజునకు, భీమునికి పాదాభివందనాలు చేశాడు. అర్జునుని ఆలింగనం చేసుకొన్నాడు. తనకు నమస్కరించిన నకులసహదేవులను ప్రేమతో దీవించాడు. కొత్తపెండ్లికూతురైన ద్రౌపది సిగ్గుపడుతూ శ్రీకృష్ణునికి మ్రొక్కినది. సాత్యకి మొదలైన యాదవులను ధర్మజుడు మిక్కిలి గౌరవించి ఆదరించాడు. శ్రీకృష్ణుడు కుంతీదేవి వద్దకు వెళ్లి నమస్కరించి, ఇలా అడిగాడు: "అత్తా! నీకు కుశలమేనా! కొడుకులూ, కోడలూ నీహృదయానికి ఆనందం కలిగిస్తుంటే సుఖంగా జీవితం గడిచిపోతున్నది కదా!" అని పలుకరించగా, కుంతీదేవి దుష్ట దుర్యోధనాదుల వలన పడుతున్న కష్టాలు గుర్తురాగా కంటతడిపెట్టుకొని, గద్గద స్వరముతో నిలాగ చెప్పినది: "కృష్ణా! నీవుండగా ఎవ్వరైనా ఎలాంటి కష్టాలనైనా దాటివేయగలరు. నీవు బంధువులను మరచిపోకుండా ఆదరిస్తావు. నీవు పంపగా అక్రూరుడు వచ్చి, మాయొక్క యోగక్షేమాలను తెలుసుకొని వెళ్లినాడుకదా! నీ అండవల్లనే మేము జీవించి యున్నాము. మాకు నీవే దిక్కు. ఇదంతా నీ భాగ్యమే కదా! కృష్ణా!" అని చెప్పగా, యుధిష్ఠిరుడు ఇలా అన్నాడు: "మహానుభావా! సనక సనందనాది మహర్షులే నిన్నుగాంచలేరు. అలాంటి మేటి ప్రభువైన నీవు మాకు బాంధవుడవు కావడం మాయొక్క పూర్వజన్మల సుకృతఫలమేకదా!" అని తన ఆనందాన్ని వ్యక్తపరిచాడు. పాండవుల అభ్యర్థనను మన్నించి పరమపురుషుడు వాళ్లతో కొన్నాళ్లు ఉండదలచుకొన్నాడు.

ఒకనాడు కృష్ణార్జునులు వేటకై అడవికి వెళ్లి, యమునా నదిలో నీరు త్రాగి, ఇసుకతిన్నెపై కూర్చొనియుండగా, అక్కడ సంచరిస్తున్న ఒక దివ్యసుందరి కనిపించినది. ఆమె ఎవరో, ఎందుకు అలాగ సంచరిస్తుందో తెలుసుకొని రమ్మన్నాడు శ్రీకృష్ణుడు. అర్జునుడామెను సమీపించి, ఆమె వృత్తాంతమేమిటో తెలుపుమనగా ఆమె ఇలాగ చెప్పినది: "మహాశయా, నేను సూర్యతనూజనైన కాళిందిని. నేను విష్ణువునే వివాహం చేసుకొనదలచుకొన్నందున, నా తండ్రి ఈ నదిలో నొక భవనం నిర్మించి, అందులోనుంటూ తపస్సు చేసుకొనుమన్నాడు. ఒకనాడు విష్ణువుయొక్క అవతారపురుషుడైన కృష్ణుడు ఇక్కడికి రాగలడని చెప్పడంచేత నేను శ్రీకృష్ణుడే నాకు భర్త కావాలని తపస్సు చేస్తున్నాను" అని చెప్పినది. ఈ మాటలను అర్జునుడు శ్రీకృష్ణునకు నివేదించగా, అతడు సంతసించి, ఆమెతపస్సునకు మెచ్చి ఆమెను స్వీకరించి, రథముపై కూర్చుండబెట్టుకొని పాండవగృహానికి తీసుకొనివెళ్లాడు.

శ్రీకృష్ణుని కోరికపై విశ్వకర్మ పాండవులగురించి ఇంద్రప్రస్థపురిని నిర్మించాడు. అందులో పాండవులతో సహా శ్రీకృష్ణుడు కొన్నాళ్లున్నాడు.

ఒకనాడు అగ్నిదేవుడు కృష్ణార్జునుల వద్దకువచ్చి, తాను తలపెట్టిన ఖాండవవన దహనంలో ఇంద్రుడు అడ్డుపెట్టకుండా సహాయపడుడని కోరినాడు. ఇంద్రుని ఎదుర్కొవలసియున్నది గనుక అగ్నిదేవుడు వరుణుని అడిగి, నాలుగు శ్వేతాశ్వములతోనున్న రథాన్ని, కవచాన్ని, అక్షయతూణీరముతో గాండీవమనే శక్తిమంతమైన ధనుస్సును అర్జునునకు ఇచ్చాడు. శ్రీకృష్ణుడు సారథిగానుండగా అర్జునుడు అగ్నికి సహాయపడి, అతనిని తృప్తి పరచాడు. ఆ మంటలలో కాలిపోకుండా, మయుడనే రాక్షసులశిల్పి తన్ను కాపాడుమని అర్జునుని వేడుకొన్నాడు. అర్జునుడు

మయుని మంటలనుండి రక్షించగా, మయుడు కృతజ్ఞతతో పాండవుల గురించి ఇంద్రప్రస్థములో ఒక విచిత్రమైన సభాభవనాన్ని కట్టి ఇచ్చాడు. అదే మయసభ అని ప్రసిద్ధిగాంచినది. ఈ మయ సభలోనే దుర్యోధనుడు, నేల ఉన్నచోట నీరు ఉన్నట్లుగాను, నీరు ఉన్నచోట నేల ఉన్నట్లుగాను తికమకపడి, తాను అవమానింపబడినట్లు బాధపడ్డాడు.

శ్రీకృష్ణుడు పాండవులఅనుమతినిపొంది, సాత్యకిమొదలైన యాదవులతో కలిసి, ద్వారకకు మరలివచ్చాడు. ఒక శుభముహూర్తాన కాళిందిని వివాహమాడి అందరికీ ఆనందంకలుగజేశాడు.

శ్రీకృష్ణునకు రాజాధిదేవి అనే మేనత్త ఉన్నది. ఆమెకు విందుడూ, అనువిందుడూ అనే కుమారులు, మిత్రవింద అనే కుమార్తె ఉన్నారు. విందానువిందులు అవంతీ పరిపాలకులై, దుర్యోధనునకు విధేయులైయున్నారు. వారు చెల్లెలికి స్వయంవరంచాటించారు. కాని ఆమె మనస్సు కృష్ణునిపైననే లగ్నమైయున్నది. అన్నలు ఆమె అభీష్టానికి అడ్డుతగిలి, అతనితో వివాహం పనికిరాదన్నారు. శ్రీకృష్ణుడు ఆమె కోరికను తెలుసుకొని, స్వయంవరంలో రాజకుమారులను ఓడించి, మిత్రవిందను తీసుకొనిపోయి వివాహం చేసుకొన్నాడు.

కోసలదేశాధిపతి అయిన నగ్నజిత్తు ధర్మపరుడు, సద్గుణ సంపన్నుడు. అతనికి సత్య అనే కుమార్తె ఉన్నది. ఆమెను నాగ్నజితి అనికూడ అంటారు. ఆ రాజు వద్ద వాడియైన కొమ్ములున్న మదించిన ఏడు వృషభ రాజాలున్నవి. వాటిని ఒక్కసారిగా తన బాహుబలంతో బంధించివేయ గలిగిన వీరాధివీరునకే తన కుమార్తెనివ్వాలని ఆ రాజు నిశ్చయించాడు. ఎందరో రాజకుమారులు ప్రయత్నించి పరాజయం పొందారు. శ్రీకృష్ణుడు అనుచరులతోను, సైన్యముతోను వచ్చాడు. కోసలరాజు అందరినీ తగురీతిని ఆదరించాడు. నాగ్నజితి కృష్ణుని చూచి ఇతడే నాకు భర్త అగుగాక అని సంకల్పించుకొన్నది. రాజు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు: "జగన్నాథా! వాసుదేవా! నారాయణా! నీ రాకచే మా గృహము, రాజ్యము పావనమైనవి. ధర్మరక్షణకు అవతరించిన ఈశ్వరుడవు నీవు. నిన్ను ఏ విధంగా సేవించి సంతుష్టుని చెయ్యాలో ఆజ్ఞాపించు" అనగా కృష్ణుడు "రాజా! నీ పుత్రికను భార్యగా స్వీకరింపదలచి వచ్చితిని" అని చెప్పాడు. అప్పుడా రాజు ఇలా అన్నాడు: "ప్రభూ! ఈ విధంగా నీ అనుగ్రహంపొందడానికి మేమెంతటి సుకృతంచేసియుంటిమో కదా! నాకుమార్తెను వివాహమాడడానికి ఈ ముల్లోకాల్లోనూ నీకంటేఘనుడెవ్వడున్నాడు? ఆ లక్ష్మీదేవియే నీ వక్షస్థలంలో స్థానం సంపాదించి ధన్యురాలయినదికదా! నా పుత్రికకు అలాంటి సౌభాగ్యం కలుగుతుంటే, నా కింకేమికావాలి? కాని ఆమె వివాహంగురించి నాయొక్క ఏడువృషభాలనులొంగదీసి బంధించగల వీరుడే వరుడు అవుతాడనే ఒక నియమం పెట్టుకొన్నాను. ఆ ప్రయత్నంలో కొంతమంది ప్రాణాలు పోగొట్టుకొన్నారు కూడాను. నీ విషయంలో నేను ఆ నియమాన్ని ఉల్లంఘించితే లోకులు నన్ను నిందించడమే కాకుండా నీయొక్క సామర్థ్యాన్ని కూడ శంకిస్తారు. అనేకమైన అద్భుతకార్యాలుచేసియున్న నీకు ఈ వృషభాలను బంధించడం ఒక కార్యమా? కష్టమా?" అని సవినయంగా మనవిచేసుకొనగా, శ్రీకృష్ణుడు సరేనని ఆ ఆబోతులను చూచాడు. పైవస్త్రాన్ని నడుముకి బిగించాడు. ఒక్కడూ ఏడుగురు అయి, ఏడు ఆబోతులను ఒక్కొక్క గుద్దుతో లొంగదీసుకొని తాళ్లకట్టి బాలుడు ఆట బొమ్మలను లాగుకొనివచ్చినట్లుగా వాటిని ఈడ్చుకొనిరాగా ప్రేక్షకులు సంతోషించి జయజయధ్వానాలు చేశారు. బ్రాహ్మణులు ఆశీర్వదించారు. రాజు శ్రీకృష్ణునకు సత్యనిచ్చి వైభవోపేతముగా వివాహంచేశాడు. పెండ్లికూతురుతో వేలసంఖ్యలలో దాసీలను గోవులను గుర్రాలను ఏనుగులను, రథాలను, కానుకగా ఇచ్చి పంపించాడు. వృషభాలను కట్టలేక పరాజితులైన రాజకుమారులు నాగ్నజితిని తీసుకెళ్తున్న శ్రీకృష్ణుని దారిలో అడ్డగించి ఎదిరించారు. వారినందరినీ కృష్ణుని అనుసరిస్తున్న అర్జునుడు ఓడించాడు. శ్రీకృష్ణుడు నూతన వధువుతో ద్వారకచేరి, ప్రజలపూజలనందుకొని నిజధామంలో సుఖంగా ఉండసాగాడు.

శ్రీకృష్ణుని మేనత్తలలో నొకామె శ్రుతకీర్తి. ఆమె కేకయదేశపు రాజపత్ని. ఆమె కుమార్తెయగు భద్రనుకూడ శ్రీకృష్ణుడు వివాహమాడినాడు.

మద్రదేశపు రాకుమారి లక్షణ. ఆమె రుక్మిణివలెనే శ్రీకృష్ణుని యొక్క అద్భుత చరిత్రగురించి విని, అతనినే పతిగానెన్నుకొని యున్నది. కాని తండ్రియైన బృహత్సేనునకు కృష్ణుడంటే ఇష్టమే అయినప్పటికీ, ఇతర రాజులు శత్రువులై పోతారనే భయముచేత ఒక పరీక్షపెట్టాడు. అది మత్స్యయంత్రముకంటె కొంచెము జటిలమైన పరీక్ష. అర్జునుడు తప్ప కౌరవ పాండవులతో సహా అందరు రాజకుమారులూ ప్రయత్నించి విఫలులైనారు. శ్రీకృష్ణుడు విల్లెక్కుపెట్టి, సునాయాసముగ దానిని పడగొట్టగా, రాకుమారి లక్షణ వచ్చి వరమాలను ఆయన మెడలోవేసినది. ఆమెను కృష్ణుడు రథంలో తీసుకొనివెళ్లుతుంటే, ఇతర రాజపుత్రులు అడ్డగించి ఎదిరించగా కృష్ణుడు శార్ఙ్గ ధనుస్సును చేత పట్టే సరికి వారంతా పారిపోయారు. నూతన వధువుతో వచ్చిన శ్రీకృష్ణునికి ప్రజలు స్వాగతం చెప్పారు.

రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే అష్టమహిషులతో స్వామి సుఖసంసారం సాగిస్తున్నాడు. తరువాత నరకాసురుని వధించి, అతనిచే బంధింపబడిన పదహారువేలమంది రాజకన్యలను విడుదలచేయించాడు. ఆ కన్యలందరూ తమ ఇళ్లకుపోలేము, నీవే మమ్ము ఆదుకోవాలి అని వేడుకొంటే ఆకరుణామయుడు వారందరినీ ద్వారకకు పంపించి, అక్కడ వివాహం చేసుకొన్నాడు.

## నరకాసురుడు

నరకాసురుడు భూదేవి పుత్రుడు. అతడు మహాబలశాలి. బలగర్వమదాంధుడై అతడు దేవమాత అయిన అదితియొక్క కుండలాలను, వరుణుని యొక్క ఛత్రాన్నీ లాక్కొన్నాడు. దేవతలకు చెందిన మణిపర్వతాన్ని తన వశము చేసుకొన్నాడు. దేవతలను అనేకవిధాల వేధించసాగాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు సత్యభామ భవనంలోనుండగా ఇంద్రుడు ఆర్తుడైవచ్చి, దేవతలు నరకునివలన పడుతున్న కష్టాలను ఏకరువు పెట్టాడు. దయామయుడైన శ్రీకృష్ణుడు దేవతల బాధలను బాపడానికి నరకుని దండిస్తానని అభయమిచ్చాడు.

శ్రీకృష్ణుడు గరుడారూఢుడై నరకుని రాజధానియైన ప్రాగ్జ్యోతిషపురానికి బయలుదేరడానికి సిద్ధంగా నుండగా, తననుకూడ తీసుకొనివెళ్లుమని ప్రాధేయపడుతూ సత్యభామ ఇలా అన్నది: "దేవా! నీవు రాక్షసుల మూకను చెండాడుతుంటే నీ ప్రావీణ్యాన్ని తిలకించాలని నాకు మిక్కిలికోరికగా నున్నది. నీ ప్రతాపాన్నిచూచి, నేనిక్కడ నా సోదరీమణులందరికీ తెలియజెపుతాను. నా కోరికను మన్నించి నీతోపాటు తీసుకొనిపోవా?" అని వేడుకొన్నది. శ్రీకృష్ణుడు మందహాసంతో ఇలా అన్నాడు: "బాలా! కుసుమకోమలసుకుమారివైన నీవెక్కడ, ఆ భయంకర రణరంగమెక్కడ? అక్కడ వినిపించేవి తుమ్మెదల ఝంకారాలు కావు, ఏనుగులఘీంకారాలు. అక్కడున్నవి రాజహంసలతోనున్న సరోవరాలు కావు రాక్షసకృత్యాలు, రక్తపు మడుగులున్నూ! అక్కడ కమలాలతో ఆడుకోరు కత్తులతో పొడుచుకొంటారు. అలాంటి చోటికి నీవు వచ్చి ఏమి ఆనందించగలవు? నీవు రావద్దు. నేనే వెళ్లి కార్యంముగించుకొని, త్వరగా వచ్చేస్తాను" అని చెప్పిన కృష్ణునితో ఆమె ఇలా అన్నది: "నాథా! కోటగోడలవంటి నీ బాహువులు నాకు రక్షణగా నుండగా, రాక్షసులే కాదు, ఇంకెవ్వరు ఎదురు వచ్చినా, నాకేం భయం? నేను నీతో వస్తాను. అనుగ్రహించు." అని బ్రతిమాలినది. శ్రీకృష్ణుడు ఆమె ధైర్యానికి సంతసించి, గరుడునిపై ఆమెనెక్కించుకొని ఆకాశమార్గాన ప్రాగ్జ్యోతిషపురానికి వెళ్లాడు. దుర్గాలు, జలదుర్గాలు, అగ్నిదుర్గాలు అనబడే అయిదు ఆవరణ దుర్గాలు అమర్చబడియున్నవి. వాటిని దాటి లోనికి ప్రవేశించడం సామాన్యులకు సాధ్యపడదు. ఇవి కాకుండ మురాసురుడనే ఐదుతలల భయంకరమైన రాక్షసుడు నగరంచుట్టూ పాశాలతో అల్లివేసి నగర రక్షణ చేస్తుంటాడు. శ్రీకృష్ణుడు

తన గదతో పర్వత వలయాన్ని ఛేదించాడు. తరువాత తన ధనుస్సుతో శస్త్రాలను వర్షముగా వేసి, జలదుర్గాన్ని చక్రంతో శుష్కింపజేసి, అగ్నిదుర్గాన్ని ఆర్పివేసి, వాయుదుర్గాన్ని శాంతింపజేసి, పాశదుర్గాన్ని ఛేదించివేశాడు. పాంచజన్య శంఖాన్ని పూరించగా జలగర్భంలో గాఢసుషుప్తిలోనున్న మురాసురుడు త్రుళ్లిపడి లేచి నీటిపైకి వచ్చి చూచాడు. వీళ్లిలోపలకు ఎలాగ రాగలిగారని ఆశ్చర్యపోయాడు. ప్రచండాగ్ని జ్వాలలను క్రక్కుతూ, ప్రపంచాన్నే మ్రింగివేసేట్లు అయిదు నోళ్లనూ తెరిచి, భయంకరంగా అరుస్తూ మంటలు క్రక్కుతున్న శూలాన్ని గరుడుని పైకి విసిరాడు. శ్రీకృష్ణుడాశూలాన్ని ఒక్క బాణంవేసి ముక్కలు చేశాడు. అసురుడు తనగదను శ్రీకృష్ణునిపైకి విసరగా కృష్ణుడు తన గదతో దానిని ముక్కలుచేశాడు. అసురుడు తన మీదకు ఉరికి పడబోతుంటే శ్రీకృష్ణుడు వాని అయిదు తలలనూ చక్రాయుధంతో ఖండించగా, వాడు చచ్చి నీటిలో పడ్డాడు. మురాసురుని ఏడుగురు కొడుకులూ శ్రీకృష్ణునితో యుద్ధానికి వచ్చారు. అందరూ స్వామి బాణాలకు ఆహుతి అయిపోయారు. సాటిలేని శక్తిమంతులైన మురాసురుడు, వాని ఏడుగురు కొడుకులూ, సేనాధిపతి అయిన పీఠుడూ హతులైనారని తెలుసుకొని, ఈ శత్రువెవడోగాని సామాన్యుడుకాడని గ్రహించి, సర్వసేనతో సిద్ధపడి వచ్చాడు నరకుడు. గరుడునిపై కూర్చున్న శ్రీకృష్ణుని, సత్యభామనూ చూచి వాళ్లెవ్వరో తెలుసుకొన్నాడు. సత్యభామకు సంగ్రామరహస్యాలను నేర్పుతున్నాడు శ్రీకృష్ణుడు. యుద్ధసన్నద్ధుడై వచ్చిన నరకాసురుని చూచి, సత్యభామ ఉత్సాహంతో జుట్టుముడి వేసుకొన్నది. చీరచెంగు నడుమునకు బిగించినది. ఆభరణాలు అడ్డుతగలకుండా సర్దుకొన్నది. రాక్షసులు ఎందరు వచ్చినా ఎదుర్కొనడానికి సిద్ధపడినది. ఆమెయొక్క రణోత్సాహాన్ని చూచి, రమణుడు ముసిముసిగా నవ్వుకొంటూ మురిసిపోతూ ఇలా అన్నాడు: "సుందరీ! నీవెందుకు యుద్ధానికి సిద్ధపడుతున్నావు? నేను ఈ రాక్షసుల్ని రూపుమాపలేనా? సరేలే! ఇదిగో, ఈ విల్లునుపట్టుకో. విజయం నీదే అవుతుంది." అని తన ధనుస్సును ఆమెకిచ్చాడు. దానిని పట్టుకొనగానే, ఆమెకు అంతులేని శక్తి వచ్చేసినది. వింటినారిని బిగించి ధనుష్టంకారం చేసినది. ఆశబ్దం ఆకాశమంతా ప్రతిధ్వనించినది. రాక్షసస్త్రీలు తమ మంగళసూత్రాలను కళ్లకద్దుకొన్నారు. ఆమె బంగారు కంకణాల ఝణఝణలతో చెవికమ్మల మణుల తళతళలతో, ఆమె స్వేదబిందువులపై మెరిసే ఇంద్రధనుస్సులతో "చూచావా నాప్రతాపం" అన్నట్టుగా తన స్వామివైపు సంధించే క్రీగంటి చూపుల బాణాల మెరుపులతో, శరపరంపరల గమనం చేసే ఝుంకార ధ్వనులతో, అది రణరంగమా సౌందర్య శోభను ప్రదర్శించే నాట్యరంగమా అనిపించినది. శౌర్యమూ, శృంగారమూ, రౌద్రమూ, విస్మయమూ, విన్యాసమూ అన్నీకలిసి మూర్తీభవించినట్లుగా, సత్యభామ బాణాలను సంధించడం లాగడం, ప్రయోగించడం అంతా మెరుపుతీగల వేగముతో నిర్వహించి యుద్ధము చెయ్యసాగినది. ఒకవైపు చెండాడే బాణాలతో శత్రువును నొప్పిస్తూ, ఇంకొకవైపు శృంగారపు చూపుల బాణాలువేస్తూ తనస్వామిని మెప్పిస్తున్నది. ఆమెధాటికి తట్టుకొనలేని అసురసైన్యము వెనుకకు తగ్గినది, నిర్జీవమయినది. శ్రీకృష్ణుడు తన ప్రియురాలియందు విజృంభించిన వీరావేశాన్ని ఉపశమింప జేయునుద్దేశముతో ఇలాగ ప్రియాలాపనం చేశాడు: "సత్యా! నీధాటికి తట్టుకొనలేక రాక్షససైన్యము పారిపోయినది. విజయలక్ష్మి నిన్ను వరించినది. నీధైర్యసాహసాలకు మిక్కిలి సంతసించాను. నీవు కోరిన ఆభరణాలను ఇస్తాను." అని చెప్పి, ధనుస్సును ఆమెచేతినుండి తీసుకొన్నాడు. అప్పుడు నరకాసురుడు హేళనగా శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు: "కృష్ణా! పురుషుల ఎదుట ఒక స్త్రీ పౌరుషం ప్రదర్శించుచుంటే, ఊరికే కూర్చోవడం ఘనతకాదు. రాక్షసవీరులు స్త్రీలతో పోరాడడానికి ఇష్టపడరు." అనగా నందనందనుడు ఇలా అన్నాడు: "ఓ అసురుడా! తొందరపడకు. నీ శిరస్సు నా శరాలకు ఆహుతి అయ్యే సమయం వచ్చినదిలెమ్ము." అని బాణాలను సంధించాడు. ఐరావతంలాంటి నాలుగు దంతాల తెల్లని ఏనుగులను నరకాసురుడు పాలసముద్రంనుండి సంపాదించి, వందల సంఖ్యలో తెచ్చి ఉంచుకొన్నాడు. వాటిని యుద్ధభూమికి తీసుకొనివచ్చాడు. వాటిని గరుత్మంతుడు ముక్కుతోనూ, గోళ్లతోనూ ఖండఖండాలుగా పీకి బలమైన తనరెక్కలతో కొట్టికొట్టి చంపాడు. చచ్చినవి చావగా మిగిలియున్నవి పారిపోయాయి.

శ్రీకృష్ణుని బాణాలకు శత్రుసైన్యమంతా నశించగా, నరకాసురుడొక్కడే మిగిలియున్నాడు. వాడు శతఘ్ని అనే శక్తిమంతమైన శూలాన్ని శ్రీకృష్ణునిపై ప్రయోగించగా, కృష్ణుడు దానిని వమ్ము చేశాడు. అసురుడు, తనశక్తిమంతమైన త్రిశూలాన్ని కృష్ణునిపై విసిరేలోగా శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని ప్రయోగించి అసురుని అంతమొందించాడు.

నరకాసురుని తల్లియైన భూదేవి వాసుదేవుని వద్దకువచ్చి, నరకుడు అపహరించుకొనిపోయిన కుండలాలను, వరుణుని ఛత్రాన్నీ మణిమయమాలను కూడ ఆయనకు సమర్పించినది.

భూదేవి స్వామిని ఇలాగస్తుతించినది: "ఓ పరమేశ్వరా! అనంతలీలావిలాసా! మహానుభావా! సకలభూతస్వరూపా! పద్మనాభా! పద్మదళనేత్రా! పద్మమాలా విభూషితా! వాసుదేవా! నీకు వందనములు. నీవు ఆదిపురుషుడవు, పుట్టుకలేని వాడవు. అయిననూ భక్తులు కోరిన రూపాలను ధరిస్తావు: బ్రహ్మాదులనూ సమస్త విశ్వాన్నీ సృష్టించినవాడవు, పరమాత్మవు: నీకు వందనములు. ఓ భక్తమందారా! దీనజనరక్షకా! ఈ బాలుడు, నీ చక్రాయుధానికి బలి అయిన నరకుని కుమారుడు, భగదత్తుడు. తండ్రివంటివాడు కాడు. నిన్నాశ్రయించినవాడు, దిక్కులేనివాడు. వీనిని అనుగ్రహింపుము." అని వేడుకొన్నది. భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు భగదత్తునకు అభయమిచ్చి, సకల సంపదలూ అనుగ్రహించాడు.

తరువాత నరకాసురుని సౌధములో ప్రవేశించి, నరకునిచే బంధింపబడిన పదహారువేలమంది రాజకన్యలను చూచాడు. శ్రీకృష్ణుని దర్శించగనే వారిచీకటి బ్రతుకులకు దివ్యజ్యోతి లభించినంత ఆనందము కలిగినది. వారందరూ సమ్మోహితలై, ఈ దివ్యసుందరమూర్తి ఎవరోగాని, ఇతడే నాకు పతి అయ్యేటట్లు అనుగ్రహించుమని, ప్రతికన్యా తన ఇష్టదైవానికి మ్రొక్కుకొన్నది. నరకాసురుడు దుష్టుడైతే అయినాడుగాని, తమను ఇలాగబంధించి తేవడంచేతనేకదా తమకు ఈ పురుషోత్తముని యొక్క దర్శనం లభించిందని వారు తమ అదృష్టానికి సంతోషించారు. వారి అందరి హృదయాలూ ఆ చిత్తచోరుని చూడగనే పట్టరాని ప్రేమతో స్పందించాయి. అతడే తన రక్షకుడు, పతీ, గతీ, సర్వస్వమూ అని ప్రతికన్యా నిశ్చయించుకొన్నది. ఆ మానినీమానసచోరుడు, మందహాసంతో అంగీకరించాడు. అందరికీ చక్కని వస్త్రాలు ఆభరణాలు, సుగంధద్రవ్యాలూ పంపించి అలంకరింపజేశాడు. ఈ కన్యలలో మానవరాజకన్యలే కాకుండా అందమైన సుర, అసుర, సిద్ధ కన్యలు కూడ ఉన్నారు. అసురునిచే అపహరింపబడియున్న ఈ కన్యలను తమతల్లిదండ్రులుకూడ స్వీకరించరు గనుక వారు అనాథలై రక్షణలేక నశిస్తారని, వారి మనోగతాన్ని ఎరిగిన సర్వజ్ఞుడైన స్వామి, వారియోగక్షేమాలను వహించదలచినవాడై అందరినీ ద్వారకకు పంపించాడు. వారితోపాటు, ఐరావతసంతతికి చెందిన అరవైనాలుగు, నాలుగుదంతాల తెల్ల ఏనుగులను, రథాలను గుర్రాలను, ధనరాసులను పంపించాడు.

తరువాత సత్యభామతో కలిసి, శ్రీకృష్ణుడు దేవలోకంవెళ్ళి, దేవమాత అయిన అదితికి నరకుడపహరించిన మణికుండలాలను తెచ్చిఇచ్చాడు. ఇంద్రుడు, శచీదేవి శ్రీకృష్ణసత్యభామలను సత్కరించారు. సత్యభామా శ్రీకృష్ణులు నందనవనం సందర్శించారు. సత్యభామ కోరికపై శ్రీకృష్ణుడు పారిజాతంమొక్కను పెకలించి తీసుకొని, గరుడుని వీపుపైనుంచాడు. శ్రీకృష్ణుడు పారిజాతంమొక్కను తీసుకొనివెళ్తున్నట్టు తెలుసుకొని, ఇంద్రుడు దేవతలతో సహావచ్చి ఎదిరించాడు, అయినా ఓడిపోయాడు. నరకాసురుని బాధలనుండి రక్షింపుమని శ్రీకృష్ణుని పాదాలపైపడిన ఇంద్రుడు తనపనినెరవేరగానే, ఆ స్వామినే ఎదిరించడానికి వెనుదీయలేదు. అతనికి స్వామి అనుగ్రహంకంటే, కోరికలను తీర్చే ఆ పారిజాతమే గొప్పదిగా అనిపించినది. అతని స్వార్థానికీ అహంకారానికీ అవధులులేవు. పారిజాతవృక్షమును తీసుకొనివెళ్ళి సత్యభామ ఉద్యానవనంలో నాటించాడు శ్రీకృష్ణుడు.

నందనందనుడు ద్వారకకు తరలింపబడిన పదహారువేలమంది కన్యలందరికీ సకలసౌకర్యాలతో వేరువేరు గృహాలనేర్పాటు చేశాడు. ఒక శుభముహూర్తాన పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు పదహారువేల కృష్ణస్వరూపాలు ధరించి, పదహారువేల కన్యలనూ వారివారి గృహాలలోనే ఒకే ముహూర్తంలో శాస్త్రోక్తంగా వివాహమాడాడు. అందరికీ ఒకేలాగున కనిపించి, ఒకేలాగ లాలించి, పాలించి, ప్రేమించి, ప్రతీ ఒక్కరికీ, "కృష్ణుడు కేవలం నావాడే" అనిపింపజేసి, అపూర్వమైన అద్భుతరీతిని అందరితో సంసారాలు సాగించాడు. ఆ సుందరీమణుల భాగ్యమే భాగ్యము కదా! వేలాది సంవత్సరాల తపస్సుచేసిన యోగులకుకూడా లభించని అపూర్వసౌభాగ్యము ఈ కాంతలకు లభించినది. సాక్షాత్తూ పరమేశ్వరునియొక్క దర్శన స్పర్శన సంభాషణమే కాకుండా నిరంతర పాదసేవా భాగ్యముకూడా వాళ్లకు దక్కినది. ఎందరు పరిచారకులున్నా తమస్వామికి తామే సకలసేవలూ స్వయంగా చేసేవారు. స్వామికూడ సామాన్య గృహస్థునివలె వారితో మెలగుతూ, వారికోర్కెలను తీర్చుతూ, మాయామమతలు చూపుతూ వినోదించేవాడు. విశ్వమంతటా నిండియున్న ఆ పరమేశ్వరునకు ఈ పదహారువేలమంది కాంతలతోనూ అన్నివేళలలోనూ కలిసియుండడం అబ్బురమేమీ కాదు.

## శ్రీకృష్ణుని విరసోక్తులవినోదము

ఒకనాడు శ్రీకృష్ణునకు ఒకచిన్న చిలిపి ఆలోచన వచ్చినది. రుక్మిణీదేవితో కొన్నిచలోక్తులాడి, ఆమె ఉడికిపోతుంటే వినోదించాలనుకొన్నాడు. ఆమెయొక్క అంతఃపురంలో ఆయన పాన్పుపై కూర్చొనియుండగా, ఆమె వింజామరంతో విసురుతూ సేవచేస్తున్నది. సౌందర్యవతీ, సద్గుణవతీ, సౌభాగ్యవతీ, సౌమ్యవతీ, వివేకవతీ అయిన ఆమెనుచూచి, శ్రీకృష్ణుడు చిరునవ్వుతో చమత్కారంగా ఇలా అన్నాడు: "సుందరీ! కులములోనూ, బలములోనూ, భాగ్యములోనూ అన్నింటిలోనూ శిశుపాలాదులు ఎంతో ఘనులు, నీ అన్నగారూ తలిదండ్రులూ అలాంటి శిశుపాలునకు నిన్నిచ్చి వివాహం చేద్దామనుకొంటే, ఒప్పుకొనకుండా, సముద్రగర్భంలో తలదాచుకొంటున్న పిరికివాడినైన నన్నెందుకు వివాహమాడినావు? మేము ధనహీనులము, గుణహీనులము, లోకరీతికి భిన్నమైనవారము, మాచెలిమి ఎప్పుడూ పేదలూ, దీనులతోనే, మాకు సింహాసనాలు లేవు. బలవంతులూ, ధనవంతులూ మాతో స్నేహము చెయ్యరు. ఇలాంటి విడ్డూరపు వ్యక్తినైన నన్నెందుకు నీవు వరించావు? సమానమైన వియ్యము, సమానమైన నెయ్యము చెయ్యాలంటారు కదా! మరిమనకు అలాగ కుదరలేదే! నీవు చాలా పొరపాటే చేశావు. ఇప్పుడైనా దానిని సరిదిద్దుకొనవచ్చు. నీకు అన్నివిధాలా తగినవానిని ఇప్పుడు ఎన్నుకొని, వివాహంచేసుకొనుము." అని అంటున్న స్వామిమాటలు విని, సాధుశీల, సరళస్వభావ అయిన రుక్మిణీదేవియొక్క మనస్సు గతుక్కుమన్నది. తనప్రాణనాథుడు ఇంతవరకు ఇటువంటి అప్రియవాక్యాలు ఎన్నడూ పలుకలేదు. ఇప్పుడు ఇలాగ ఎందుకు అంటున్నాడు! తనయొక్క సేవాశుశ్రూషలలో ఏమైనా లోపము జరిగినదా? అని ఆలోచిస్తూ, ఆ మానవతి అంతులేని ఆవేదనతో బాధపడినది. కన్నీటి ధారలతో వక్షస్థలం తడిసిపోయినది. ముఖం వాడిపోయినది. నిశ్చేష్ట అయి, ఆమెనేలపై ఒరిగిపోయినది.

సద్వంశసంజాత, శోకసంతప్త, సాధ్వీశిరోమణి, సహధర్మచారిణి, అయిన రుక్మిణీదేవిని శ్రీకృష్ణుడు లేవనెత్తాడు. పాన్పుపై పవ్వళింప జేశాడు. మంచిగంధము పూసాడు. పన్నీటితో కన్నులూ ముఖమూ తుడిచాడు; జుట్టు సవరించాడు. వింజామరముతో వీచాడు. మధుర వాక్కులతో బుజ్జగించాడు. మనోహరమైన చిరునవ్వుతో మత్తెకించాడు. కొంటెచూపులతో కవ్వించాడు.

శ్రీకృష్ణుడు తనప్రియపత్నియొక్క ప్రేమావేశానికి సంతసించాడు. తనయొక్క హాస్యాలాపానికే ఆమె నిజంగా చలించిపోయినందుకు జాలిపడ్డాడు ఇలా అన్నాడు: "ప్రియతమా! నీకు కోపం తెప్పించి కోపములో నీముఖం ఎలాగుంటుందో చూచి, ఆనందించాలని అలాగహాస్యమాడానుగాని నీవు ఆ మాటలను నిజంగా తీసుకొని, ఇలాగ

బాధపడతావనుకొనలేదు. పతీపత్నుల మధ్య అప్పుడప్పుడు అలాంటి ప్రణయకలహాలు వస్తుంటేనే, అనురాగం పెరుగుతుంది కదా! మరి నీవు ఇలాగ మనస్సు కష్టపెట్టుకొనడంచేత, నాకుచాలా బాధగా నున్నది." అని స్వామి, అనునయించాడు. రుక్మిణీదేవి కొంత ఊరటజెంది ఇలాగ జవాబు చెప్పినది: "స్వామీ! ఇతరులతో నీకు సామ్యము లేదనే మాట చాలా నిజము. నీ సౌందర్యము, నయనముల సోయగము ఈ ముల్లోకాలలోనూ ఎవ్వరికీ లేవుకదా! ఓ సర్వేశ్వరా! మన ఇద్దరిమధ్యా సమానవియ్యము కుదరలేదని నీవన్నమాట వాస్తమే! అనంతతేజోమూర్తివీ, సచ్చిదానందస్వరూపుడవూ, సర్వలోకేశ్వరుడవూ అయిన నీవెక్కడ, త్రిగుణాలతోకూడి శరీరంలో బంధింపబడి, జ్ఞానహీనవైయున్న నేనెక్కడ? సకలసద్గుణాలూ, సకల ఐశ్వర్యబలసంపదలూ నీలోనే నిక్షిప్తమైయున్నందున మానవమాత్రులు అదికావాలి, ఇదికావాలి అని నిన్ను చికాకు పరుస్తారని ఎవ్వరికీ అందుబాటులో లేకుండా పాలసముద్రంలో శేషతల్పముపై పవ్వళిస్తున్నావు. పరమేశ్వరా! నీవు ధనహీనుడనన్నావు. అవును. జగత్తంతా నీదే అయియుండగా, నీదికానిదేమున్నది, నీకు కావలసియున్నదేమిటి? గుణహీనుడనన్నావు. నిజమేకదా మరి! త్రిగుణాతీతుడవైన నీయందు ఏగుణముంటుంది. లోకాలన్నీ నీనుండే ఉద్భవించడం చేత నీవు లోకులకు భిన్నమైన వాడివేగాని, స్వామీ! సర్వవ్యాపకుడవైన నీనుండి భిన్నమైయున్నదేమున్నది? దీనులూ నిరుపేదలూ నీకు కావలసినవారు అన్నావు. అదికూడా సత్యమే. మరి నీవు దీనబాంధవుడవూ. అనాథనాథుడవూ కదా? బలవంతులు, ధనవంతులు, నీ చెలిమిచెయ్యరు, నిజమే! ధన, జన, బల, ఆభిజాత్య గర్వ మదాంధులైన అజ్ఞానులకు ఇంద్రియతృప్తే ఏకైక లక్ష్యము, కాని వారు సకలపురుషార్థప్రదాతవైన నిన్ను ఆశ్రయించరు. తామే సర్వశక్తిమంతులమనుకొంటారు ఆ అహంకారులు. నీకు రాజరికపు సింహాసనాలు లేవు అన్నావు. నీవు రాజాధిరాజువు. సర్వలోకమహేశ్వరుడవు. ఈక్షణమాత్రముచే రాజులనూ రాజ్యాలనూ సృష్టించగలవు, నశింపజేయగలవు. నీకు సింహాసనాలతో ఏమిపని, భక్తుల హృదయాలే నీ సింహాసనాలు కదా! సర్వమూత్యజించి, నీపాదార విందధ్యానములోనే జీవితమంతా గడిపిన యోగీంద్రులకే నీవు అగోచరుడవు. ఇక సామాన్యుల ఊహకు నీవు అందగలవా? వారు కర్మఫలాలను అనుభవిస్తూ, కర్మలుచేస్తూ, సంసార చక్రంలో పరిభ్రమిస్తుంటారు. ఇక నావిషయం చెపుతాను: చిన్నప్పటి నుండీ నామనస్సు నీయందేలగ్నమైయున్నది. నేను నీకోసమే జన్మించాననీ నాదృఢవిశ్వాసము. శివుడు, బ్రహ్మ, ఇంద్రాది దేవతలుకూడ, నాదృష్టిని ఆకర్షించలేకపోయారు. ఇక ఈ దురహంకారులైన మానవాధీశులకు నా హృదయంలో చోటెలాగుంటుంది? నీయొక్క పాదపద్మాల సౌభాగ్యమెట్టిదో నాకు తెలుసు. రాజాధిరాజులూ, రాజర్షులూ తమ సమస్త రాజ్యసంపదలనూ త్యజించి, ఆహారనిద్రలుమాని, సతతమూ ధ్యానించే ఆపాదపద్మాలను నేను స్వయంగా పూజించి, సేవించే భాగ్యాన్ని కాదని క్షుద్రమైన రాజరికపు సుఖసంపదలను కోరుకొంటానా?" అనిచెప్పిన రుక్మిణి వాక్కులకు శ్రీకృష్ణుడు సంతోషించి, ఇలా అన్నాడు:

"దేవీ! రుక్మిణీ! నీకు నాయందున్న ప్రేమగురించి నాకుతెలియదా? నేను పరిహాసానికి అన్న మాటలకు నీవింతగా మనస్సుకష్టపెట్టుకొంటావనుకొనలేదు. వేటలోను, దెబ్బలాటలోను, రతిక్రీడలోను ఇలాంటి చమత్కారపు మాటలు వస్తాయి. వాటిని పట్టించుకొనరాదు. చిన్నచిన్న అలుకలు, హాస్యాలు, మురిపాలు, విదిలింపులు, వలపులు, దాంపత్య జీవితాన్ని ఉత్తేజపరుస్తాయి కదా! నీవు మహాపతివ్రతవు, సుశీలవు, బాల్యమునుండీ అన్యచింతలేకుండా నా సేవలోనే ఉన్నావు. అన్నీతెలిసీ, నిన్ను బాధపెట్టాను. నన్ను మన్నించు. నీమాటలు నాకు శ్రవణానందం కలిగించాయి. నీవు కోరినవన్నీ నాయందేఉన్నవి. అవిఅన్నీ నీకు లభిస్తాయి. నీ పాతివ్రత్యమూ, నీకు నాయందున్న ప్రేమానురాగాలు స్పష్టమయ్యాయి. నా విరసోక్తులకు నీమనస్సు విరక్తిచెందలేదు సరికదా, నీప్రేమ ఇంకా దృఢమవుతుంది. నాగురించి నీవు చెప్పిన వాక్కులన్నీ నిజమే, అయినప్పటికీ నేను మాత్రము, మీ అందరితోనూ, అతిసామాన్యమైన గృహస్థునిలాగ ప్రవర్తిస్తాను. నీపైనాకు ప్రత్యేకమైన అనురాగం ఉన్నది. అది నీ సౌభాగ్యము, మోక్షప్రదాతనైన నన్ను కామవాంఛలతో

పొందాలని కొందరు అల్పబుద్ధులు పూజలు, వ్రతాలు, తపస్సులు చేస్తుంటారు. వారి వాంఛలు తీరవచ్చునేమోగాని వారియొక్క ఇంద్రియలోలత్వము వారిని నానుండి దూరముచేసి, నరకమువైపుకు తీసుకుపోతుంది. ఇంద్రియలోలురు నన్ను పొందలేరు. మానవతీ! నీతో సమానమైన కాంతారత్నము ఎక్కడాలేదు. నీయొక్క సద్గుణాలు నన్ను ముగ్ధుని చేసినవి." అని చెప్పిన శ్రీకాంతుని చూచి, ప్రఫుల్ల వదనంతో ఆమెవందన మాచరించినది. ఆమె జన్మధన్యతగాంచినది.

శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవితో ఉద్యానవనాల్లో విహరిస్తూ ఆమెకు సకలసౌఖ్యాలూ చేకూర్చాడు. వారికి ప్రద్యుమ్నుడు మొదలైన పదిమంది పుత్రులు, చారుమతి అనే పుత్రిక కలిగారు. మిగిలిన ఏడుగురు భార్యలకుకూడ ఒక్కొక్కరికీ పదేసిమంది పుత్రులను, ఒక్కొక్క పుత్రికను స్వామి ప్రసాదించాడు. అలాగే పదహారువేలమంది ఇతర భార్యలకుకూడ ఒక్కొక్కరికీ పదేసిమంది పుత్రులను, ఒక్కొక్క పుత్రికను, అనుగ్రహించాడు. ఈ ఒక లక్ష అరవైవేల ఎనభై మంది పుత్రులకూ పుత్రులు కలిగారు. ఈ విధంగా శ్రీకృష్ణుని వంశము, తామరతంపరగా కోట్లసంఖ్యలో అభివృద్ధి చెందినది. వీళ్లందరూ, యాదవ, వృష్ణి, భోజ, అంధక మొదలైన నూట ఒక్క తెగలుగా వర్ధిల్లారు.

## అనిరుద్ధుడు

రుక్మి తన ముద్దుల కుమార్తెయైన రుక్మవతియొక్క స్వయంవరం ఏర్పాటు చేశాడు. రుక్మిణి పుత్రుడైన ప్రద్యుమ్నుడు మేనమామ ఇంటికి వెళ్లాడు. స్వయంవరానికి ప్రసిద్ధులైన రాజకుమారులందరూ వచ్చారు. రుక్మవతి మన్మథుడే అయిన ప్రద్యుమ్నుని వరించినది. శ్రీకృష్ణుని యందుండే ద్వేషమువలన రుక్మికి ఇదినచ్చలేదు. అడ్డుపెట్టడానికి ప్రయత్నించాడు. పరిస్థితిని గ్రహించిన ప్రద్యుమ్నుడు రుక్మవతిని తోడుకొని, ఎదిరించిన రాజకుమారులను ఓడించి, ద్వారకా నగరానికి వెళ్లిపోయాడు. అక్కడ వివాహము అతివైభవోపేతముగా జరిపింపబడినది. రుక్మి తన చెల్లెలు అయిన రుక్మిణియందున్న ప్రేమచేత కుమార్తె రుక్మవతి యందున్న మమకారంచేత ఎలాగో సమాధానపడ్డాడు. వారిద్దరి సంతోషమే తన సంతోషంగా భావించాడు. రుక్మిణి కుమార్తెయైన చారుమతిని కృతవర్మ కుమారుడైన విశాలాక్షుడు (బలి) వివాహమాడినాడు.

రుక్మి క్రమంగా శ్రీకృష్ణుని యందున్న ద్వేషాన్ని మరచిపోసాగెను. రుక్మవతీ ప్రద్యుమ్నులకు అనిరుద్ధుడనే పుత్రుడు జన్మించాడు. అతడు తండ్రివలె సుందరరూపుడు. రుక్మియొక్క మనుమరాలు (పుత్రుని పుత్రిక) అయిన రోచన (రుక్మలోచన)ను అనిరుద్ధునకిచ్చి, రుక్మి తన రాజధానియైన భోజకటకములో వివాహము చేశాడు. ఆ వివాహసందర్భంలో రుక్మిణీ కృష్ణులు, బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలైన బంధుజనులు వచ్చియున్నారు. వివాహవేడుకల్లో అందరూ ఆనందంగా పాల్గొన్నారు. వివాహానికి వచ్చిన ఇతర రాజులుకూడ ఆనందించారు. కాని జోరుగా పెరుగుతున్న యాదవుల కీర్తి, శక్తి, ఐశ్వర్యాలను చూచి ఓర్వలేని రాజులు కొందరున్నారు. వారిలో కళింగరాజొకడు. అతడు రుక్మితో ఇలా అన్నాడు:

"రాజా! కొత్తగా ఏర్పడిన ఈ బంధుత్వాల మమకారాల్లోబడి, ఈ యాదవుల చేతిలో నీకు లోగడ జరిగిన అవమానాన్ని దిగమ్రింగివేశావా? ప్రతీకారం చెయ్యాలంటే ఇదే తగిన సమయం. బలరామునకు జూదమంటే ప్రీతి, కాని ఆటలో నేర్పరితనం మాత్రము లేదు. నీకే విజయం తథ్యము." అని పురికొల్పాడు. రుక్మిలో అణగియున్న అహంకారం బుసలుకొడుతూ లేచినది. కక్ష, కుటిలత్వమూ విజృంభించాయి. అతడు వివేకాన్ని కోల్పోయి మూఢుడై, బలరాముని జూదానికి రమ్మన్నాడు. జూదం మొదలైనది. ఆటసాగుతున్న కొద్దీ పట్టుదలలు పెరిగినవి. పందెములు కూడ పెరిగినవి. ప్రతి ఆటలోనూ బలరాముడే ఓడిపోతుంటే, కళింగరాజు రాజులందరిమధ్యా, ఎగతాళిచేస్తూ పళ్లికిలించడం, అందరూ నవ్వడం, జరుగుతున్నది. బలరామునికి రోషము వచ్చేసి, ఒక లక్ష బంగారు నాణాలకు

పందెము కట్టాడు. ఈ సారి రుక్మిఓడిపోయినా, అతడు ఓటమిని ఒప్పుకొనకుండా తగువుపెట్టాడు. బలరాముడు, ప్రేక్షకులైన రాజులను నిజంచెప్పుడని కోరినాడు. వాళ్లంతా రుక్మికి భయపడి, పక్షపాతబుద్ధితో నిజంచెప్పకుండా ఊరుకొన్నారు. క్రోధావేశపరుడైన బలరాముడు మళ్లీ ఆడుదామన్నాడు. ఈ సారికూడ గెలుపు బలరామునిదే అయినది. "ఇప్పుడు చెప్పండి గెలుపెవ్వరిదో" అని అడిగాడు బలరాముడు. 'గెలుపునాదే" అని మొండిగా రుక్మి అన్నాడు. ప్రేక్షకులెవ్వరూ మాట్లాడలేదు. అప్పుడు ఈ అన్యాయానికి స్పందించి, ఆకాశవాణి ఇలాగ వినిపింపజేసినది. "ఈ ఆటలోకూడ గెలుపు బలరామునిదే, రుక్మి రెండుసార్లూ ఓడిపోయాడు" అని వినిపించినా, "అశరీరవాణిని నేను నమ్మను, గెలుపునాదే" అని మొండికెత్తి దుష్టుల ప్రేరేపణచే ఇలాగ వాగాడు రుక్మి:

"ముమ్మాటికీ గెలుపునాదే. జూదము రాజులు ఆడుకొనే ఆట. గోవులను తోలుకొనే గొల్లలకు ఈ ఆటలో నైపుణ్యం ఎక్కడినుండి వస్తుంది? రాజులతో ఆడి, గొల్లలు గెలిచామని అరిచినా చెల్లదు." అని దర్పముతో వదిరేసరికి అక్కడున్న రాజులందరూ హేళనగా నవ్వగానే బలరామునికి పట్టరాని ఆగ్రహం వచ్చేసినది. అక్కడే చేతికిదొరికిన ఒక ఇనుప గుదియను పట్టుకొని రుక్మిని చావబాదినాడు. తరువాత, పళ్లికిలించి అవహేళనచేసిన కళింగరాజుయొక్క పండ్లూడగొట్టాడు. మిగిలిన రాజులందరూ ప్రాణభయంతో పారిపోయారు. అంతా సాక్షివలె నిర్లిప్తతతో తిలకిస్తున్న శ్రీకృష్ణుడు, మౌనంగా ఉండిపోయాడు. తరువాత నూతనవధూవరులను తీసుకొని, రుక్మిణీ బలరామాదులతోపాటు, ద్వారకానగరము చేరుకొన్నాడు.

**ఉషాసుందరి**

బలిచక్రవర్తి యొక్క నూర్గురు కుమారులలో పెద్దవాడు బాణుడు. అతడు కీర్తిమంతుడు, ధీమంతుడు, సత్యసంధుడు, ఉదారుడు, దీక్షగలవాడు. దేవతలను వశపరచుకొన్నవాడు. అతనికి వెయ్యిచేతులున్నాయి. వాటితో నతడు ఐదువందల వాయిద్యాలను వాయిస్తూ నటరాజుని మెప్పించేవాడు. పరమశివుడు బాణుని భక్తికిమెచ్చి, వాని రాజధానీనగరమైన శోణితమునకు రక్షకునిగా నుండడానికి సమ్మతించాడు. పార్వతీసమేతుడై భూతగణాలతోసహా శోణపురములో బాణుని కోటగుమ్మం వద్ద కాపలా ఉన్నాడు భోలాశంకరుడు. ఒకనాడు బాణాసురుడు తన భుజబలమదము అతిశయించగా, పరమశివుని ఇలాగ స్తుతించాడు:

**సీ॥ దేవ! జగన్నాథ! దేవేంద్ర వందిత వితతచారిత్ర సంతతపవిత్ర**
**హాలాహలాహార! యహిరాజకేయూర భాలేందుభూష సద్భక్తపోష!**
**సర్వలోకాతీత! సద్గుణసంభూత పార్వతీహృదయేశ భవవినాశ!**
**రజతాచలస్థాన! గజచర్మపరిధాన! సురవైరివిధ్వస్త! శూలహస్త!**
**తే॥ లోకనాయక! సద్భక్తలోకవరద సురుచిరాకార మునిజనస్తుతవిహార**
**భక్తజనమందిరాంగణపారిజాత నిన్నునెవ్వడు నుతిచేయ నేర్చునభవ!** 320

ఓ దేవదేవా! నీవు జగన్నాథుడవు, దేవేంద్రవందితుడవు, పరిశుద్ధచరిత్రుడవు, పరమపవిత్రుడవు, హాలాహలహరుడవు, నాగభూషణుడవు, చంద్రశేఖరుడవు, భక్తసంరక్షకుడవు, సర్వలోకేశ్వరుడవు, పార్వతీవల్లభుడవు, కైలాసవాసుడవు, గజచర్మధారివి, రాక్షసాంతకుడవు, త్రిశూలధారివి, భక్తజనులవాకిట పారిజాతానివి. అటువంటి నిన్ను ఎవడు స్తుతించగలడు పరమేశ్వరా! ఈ భూమండలంలో నన్ను ఎదిరించగల వీరుడు ఒక్కడైననూ కనిపించలేదు స్వామి! నీవు ప్రసాదించిన ఈ వెయ్యిచేతులూ పనిలేక రణకండూతితో నన్ను చికాకు పఱుస్తున్నవి. భీకరమైన యుద్ధరంగములో తమప్రతాపాన్ని ప్రదర్శింపలేని ఈ చేతులు బరువుచేటేగాని నాకెందుకు? ఈ ప్రపంచంలో

నీవు తప్ప నన్ను ఎదిరించి పోరగల వారెవ్వరూలేరు గనుక నీవే నాతో యుద్ధముచేసి, నా కోర్కెను తీర్చాలి." అని చెప్పిన మాటలకు శంకరుడు అసహ్యించుకొని ఇలా అన్నాడు: "ఓయీ దానవేశ్వరా! తొందరపడకు. నీ కోరికతీరగల సమయం త్వరలోనే రానున్నది. నీ ధ్వజము అకారణంగా నేలపై పడిపోయినప్పుడు నాతో సముడైన ఒక వీరునితో నీకు యుద్ధము జరుగుతుందిలే." అనగా విని, బాణుడు తనకోరిక తీరనున్నదని సంతోషించాడు.

బాణాసురునకు ఉష అనే ఒక ముద్దుల కూతురున్నది. ఆమె అతిలోక సౌందర్యవతి, సద్గుణవతి. ఒకనాడు ఆమె స్వప్నంలో త్రిలోక సుందర విగ్రహుడైన ఒక యువకునితో సుఖించినట్లు కలగన్నది. అతడెవ్వడోగాని, అతని గురించి ఎన్నడూ వినియుండనైనా లేదు. ఆ క్షణంనుండి ఆమె ఆ స్వప్నసుందరునియందే మనస్సు నిలుపుకొని, ఇతర ప్రపంచాన్ని విస్మరించినది. విరహవేదనతో మథనపడేది. ఏకాంతంగా కూర్చొని కన్నీరు కార్చేది. దిక్కులుచూచేది. స్వప్నంలోని అనుభూతులను స్మరించుకొంటూ, పిచ్చినవ్వులు నవ్వేది.

బాణాసురుని మంత్రి కుంభాండుడు. అతనికుమార్తె చిత్రలేఖ. ఆమె ఉషాబాలకు అతిప్రియమైన చెలికత్తె. ఆమె ఉషాసుందరియొక్క చేష్టలన్నీ కనిపెట్టి, తప్పకుండా ఆమె ప్రేమరోగపీడిత అయినదని గ్రహించి, ఆమెను ఏకాంతంగా కలుసుకొని, ఆమెయొక్క స్వప్నశృంగారం గురించి తెలుసుకొన్నది. చిత్రలేఖ సౌందర్యవతియే కాకుండా అసమాన ప్రజ్ఞగల చిత్రలేఖిని కూడాను. అనేక యోగశక్తులు గల శక్తిశాలిని కూడాను. తన నెచ్చెలి బాధను నివారించదలచుకొని, ఆమెతో ఇలా అన్నది:

"ప్రియసఖీ! నీ బాధనాకు అర్థమయినది. స్వప్నంలో నిన్ను అంతగా అలరింపజేసిన ఆ మోహనాంగుడెవ్వడో తెలుసుకొనడానికి నాకు ఒక ఉపాయం తట్టినది. నా చిత్రలేఖా నైపుణ్యముతో, శక్తిసామర్థ్యాలతో, ముల్లోకాల్లోనున్న దేవ, మానవ, యక్ష, రాక్షస, కిన్నర మొదలైన జాతులలోని సుందర పురుషులందరి రూపాలను చిత్రించి నీకు చూపుతాను. నీ స్వప్నసుందరుడు వాస్తవంగా ఉండియుంటే, ఆ చిత్రాలనుచూచి నీవు గుర్తించగలవు. నీ మనోహరుడు ఎక్కడున్నా సరే నేను అతనిని నీ చెంతకు తీసుకొనివస్తాను. విచారించకు." అని అభయమిచ్చినది. ముల్లోకాల్లోనూ ప్రసిద్ధిగాంచిన సుందర విగ్రహుల చిత్రపటాలను చిత్రించ నారంభించినది. చిత్రలేఖనం పూర్తిచేసి, అందరి గోత్రనామాలను వ్రాసి, తీసుకొనివచ్చినది. ఒక్కొక్క చిత్రాన్నీ చూపిస్తూ ఆ వ్యక్తియొక్క చరిత్ర, గుణగణాలను వర్ణించిచెప్పినది. భూలోకంలోని అనేకమంది రాజులు, రాజపుత్రుల చిత్రాలను చూపించినది. ప్రద్యుమ్నుని చిత్రంచూస్తుండగా ఆమెచూపు నిలిచిపోయినది. అయినా ఆమె సంశయించినది. ఆ తరువాత చిత్రలేఖ అనిరుద్ధుని పటము చూపించగా, ఆమె సంభ్రమాశ్చర్యాలతో ఇలా అన్నది: "ఆఁ ఆఁ ఇతడే నా మానసచోరుడు. ఇతడెవరో వివరించి చెప్పు" అని ఉషాకన్య తొందరపెట్టినది. చిత్రలేఖ ఇలా చెప్పినది: "ఇతడు అనిరుద్ధుడు. ఇతడు యాదవవంశచంద్రుడైన శ్రీకృష్ణునియొక్క పుత్రుడైన ప్రద్యుమ్నుని కుమారుడు." అనిచెప్పి, మాట ఇచ్చిన ప్రకారం ఆ యువకుని తీసుకొని రావడానికి ఆకాశమార్గాన వెళ్లినది చిత్రలేఖ. వైకుంఠానికి మించిన శోభతో వెలిగిపోతున్న ద్వారకా నగరాన్ని చూచి, ఆమె ఆశ్చర్యపోయినది. అంతఃపురంలో ప్రవేశించి, గాఢనిద్రలో మునిగియున్న అనిరుద్ధుని తన యోగమహిమచే తీసుకొనిపోయి, శోణపురంలో ఉషాసుందరి యొక్కపాన్పుపై పరుండబెట్టి, తన నెచ్చెలితో ఇలా అన్నది: "ప్రాణసఖీ! ఇతడే నీ మనోహరుడు, మన్మథపుత్రుడైన అనిరుద్ధుడు, అసమానశూరుడు. ఇతనితో నీవు సర్వసుఖాలనూ అనుభవించవచ్చు." అని చెప్పిన చిత్రలేఖను చూస్తూ, ఆమె ఆనందం పట్టలేక, నోటమాటరాక, తన ప్రియతమ చెలికత్తెకు ఎలాగ కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియక, ఇలా అన్నది: "చెలీ! నా కలలో కనిపించిన సుందరుని నీ ఊహతో చిత్రించి చూపి, తృటిలో అతనిని నా వద్దకు తీసుకురాగలిగిన శక్తిమంతురాలు ఈ ముల్లోకాల్లో నెక్కడైనా ఉన్నదా? నీ స్నేహాన్ని పొందగలగడం నా యొక్క పూర్వజన్మల సుకృతమేకదా!" అని వేనోళ్ల పొగిడినది.

పురుషుని ఛాయకూడ ప్రవేశించలేని ఆ అంతఃపురములో ఉషా-అనిరుద్ధులు అంతులేని ఆనందంలో తేలియాడుతున్నారు. వారికి పగలూ రాత్రీగాని, రోజులూ వారాలూ నెలలుగా మారుతున్న కాలగమనంగానీ ఏమీతెలియటంలేదు. ఉషాసుందరికి గర్భిణిచిహ్నాలు కనిపించడంతో హడలిపోయిన అంతఃపురపరిచారికలు బాణాసురునికి తెలియజేశారు. అసురేంద్రుడు ఆగ్రహోదగ్రుడై, కళ్లనుండి నిప్పులు కురిపిస్తూ ఖడ్గాన్నిధరించి, అంతఃపురంలో ప్రవేశించాడు. అక్కడ అపరమన్మథునిలాగ మెరిసిపోతూ ఉషాబాలతో ఆడుకొంటున్న అనిరుద్ధుని చూచి మండిపడ్డాడు. "ఈ మానవాధముని బంధించండి" అని భటులను ఆజ్ఞాపించాడు. వాళ్లు బంధించడానికి సమీపించగానే ఇనుపగుదియలాంటి (పరిఘ అనబడే) ఆయుధముతో వాళ్లను ఎదుర్కొని, కొందరి కాళ్లూ, కొందరినడుములూ విరగ్గొట్టి, కొందరిని చావగొట్టి, అందరినీ పారద్రోలినాడు అనిరుద్ధుడు. బాణాసురుడు అనిరుద్ధునిపైకి దూకి భీకరయుద్ధంచేసి, అతనిని జయించడం కష్టమనుకొని, నాగపాశంతో బంధించాడు. సరిగ్గా అదే సమయానికి సుడిగాలివీచి, బాణాసురుని కోటపైనున్న జెండా నేలకూలినది. తనతో యుద్ధము చేయగల సమఉజ్జీ అయిన వీరుడు త్వరలో రానున్నాడని గ్రహించిన బాణాసురుడు సంతసించాడు.

ద్వారకానగరంలో అనిరుద్ధుడు అంతర్ధానమైనందుకు అందరూ విచారసాగరంలో మునిగియున్నారు. ఎంత వెదకించినా ఆ చూకీ ఏమీ తెలియలేదు. నాలుగు నెలలు గడిచిపోయాయి. ఒకనాడు నారదుడు ద్వారకకువచ్చి అనిరుద్ధుని వృత్తాంతం తెలియజేశాడు. శ్రీకృష్ణుడు బాణాసురునిపై దండయాత్రకు పన్నెండు అక్షౌహిణుల సైన్యంతో బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నాది యాదవ వీరులతో సహా బయలుదేరాడు. వాళ్లందరూ శోణపురం ప్రవేశించారు. యాదవులు శోణపురంలోని సౌధాలు, ప్రాకారాలు, కోటలూ, అగడ్తలు, యంత్రాలు అన్నీ నాశనంచేశారు. బాణాసురుడు వెయ్యిచేతులలోనూ తళతళమెరిసే ఆయుధాలను ధరించి, మేరుపర్వతంలాంటి ఎత్తైన రథాన్నెక్కి, రెండువైపులా రాక్షససైన్యాలు నడుస్తుండగా యుద్ధరంగానికి బయలుదేరాడు.

భక్తవత్సలుడైన శివుడు బాణుని పక్షములో యుద్ధము చెయ్యడానికి, నందివాహనుడై, ప్రమథగణాలతోసహా వచ్చాడు. ఇరుపక్షాలవాళ్లూ ద్వంద్వయుద్ధాలకు తలపడ్డారు. ఈ యుద్ధాన్ని తిలకించడానికి బ్రహ్మాదిదేవతలూ, మునులూ, సిద్ధులూ మొదలైన వారంతా విమానాలపై ఆకాశంలో గుమిగూడారు. శివ, కేశవులూ, కుమార, ప్రద్యుమ్నులూ, కూపకర్ణ కుంభాండకులతో బలరాముడూ, బలునితో సాంబుడు, బాణునితో సాత్యకీ తలబడ్డారు. అలాగే రథికులతో రథికులు, అశ్వికులతో అశ్వికులు, పదాతులతో పదాతులూ, ఘోరయుద్ధము చేశారు. శ్రీకృష్ణుడు శార్ఙ్గమును ప్రయోగించి, శివునియొక్క భూతపిశాచ గణాలను తరిమివేశాడు. శివుడు పాశుపతాస్త్రాన్ని ప్రయోగిస్తే, శ్రీకృష్ణుడు నారాయణాస్త్రాన్ని వేసి, దానిని వ్యర్థం చేశాడు. శ్రీకృష్ణుడు, శివునిపై జృంభణాస్త్రం వేసి భ్రమింపజేశాడు. ప్రద్యుమ్నుని బాణాలకు కుమారస్వామి తట్టుకోలేక పారిపోయాడు. బలరాముని దెబ్బలకు భయపడి, కుంభాండ కూపకర్ణులు పారిపోయారు. సాత్యకితో యుద్ధంచేస్తున్న బాణుడు, శ్రీకృష్ణుని ఎదిరింపబూనుకొన్నాడు. తనయొక్క వెయ్యిచేతులతో ఐదువందల బాణాలను ఒక్కసారిగా విడిచిపెట్టగా, వాటిని శ్రీకృష్ణుడు ఖండించి, బాణుని రథాన్నీ సారథిని, గుర్రాలను పడగొట్టాడు. బాణుని తల్లియైన కోటర దిగంబరగా జుట్టువిరబోసుకొని, తన పుత్రుని చంపవద్దని శ్రీకృష్ణుని కోరడానికి వచ్చినది. నగ్నస్త్రీని చూడడానికి ఇష్టపడని శ్రీకృష్ణుడు ముఖము త్రిప్పుకొన్నాడు. ఇదే అదను అనుకొని, బాణుడు కోటలోనికి పారిపోయాడు. భూతగణాలూ పారిపోయాయి. శ్రీకృష్ణుని జృంభణాస్త్రంనుండి తేరుకొన్న శివుడు, "జ్వర" మనే శక్తిని కృష్ణునిపైకి ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు, "వైష్ణవజ్వరం" అనే శక్తిని ప్రయోగించగా శివజ్వరం శ్రీకృష్ణుని శరణుజొచ్చినది. బాణాసురుడు శక్తిపుంజుకొని, ఆయుధాలు ధరించి, మళ్లీ యుద్ధానికి వచ్చాడు. శ్రీకృష్ణునిపై పరిఘమనే అస్త్రాన్ని ప్రయోగించగా శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని ప్రయోగించాడు. తిరుగులేని సుదర్శనము

బాణుని వెయ్యి బాహువులను ఖండింపసాగినది. భక్తవశంకరుడైన శంకరుడు బాణుని రక్షింపదలచి, శ్రీకృష్ణుని స్తుతించాడు: "దేవదేవా! నీవు పరబ్రహ్మవు, జ్యోతిర్మయుడవు, వేదాంతనిగూఢుడవు. నిర్మలుడవు, సర్వసముడవు. సర్వవ్యాపకుడవు, జగద్రక్షణకొరకు అవతరించువాడవు, ఆద్యుడవు, అద్వితీయుడవు, అనంతుడవు, పురాణపురుషుడవు, సకల సృష్టికీ కారణుడవు, ఈశ్వరుడవు, గుణాతీతుడవు, మాయాతీతుడవు, అవ్యయుడవు, అచ్యుతుడవు, విశ్వంభరుడవు, నీకు నా వందనములు." అని స్తుతించిన శివునిపై శ్రీహరి ప్రసన్నుడై ఇలా అంటాడు: "పరమశివా! నీ వాక్కులు నాకు సంతోషం కలిగించినవి. నీ మనోగతం నాకు తెలుసు. ఈ బాణుడు నాచే చంపదగినవాడుకాడు. ఏలనన "నీ వంశస్థులను నేను సంహరించను" అని నేను ప్రహ్లాదునికి వరమిచ్చాను. ఇతడు ఆ వంశస్థుడే గనుక నాచే చంపబడడుగాని ఇతని భుజబల గర్వాన్ని అణచాలిఅని, నాలుగు చేతులను మాత్రమే ఉంచి, మిగిలిన బాహువులను ఖండింపజేశాను. ఇతడు నీ భక్తులలో ప్రముఖుడై, జరామరణ భయాలు లేకుండా జీవిస్తాడు." అని అనుగ్రహించాడు. శివుడు పరమానందభరితుడయ్యాడు. బాణాసురుని భుజబలగర్వం అణిగిపోయినది. అహంకారం తొలగిపోగానే అజ్ఞానం నశించినది. అతడు గోవిందుని పాదారవిందాలకు అభివందనాలు చేశాడు.

తరువాత బాణాసురుడు పరమానందముతో, ఉషా-అనిరుద్ధులకు అనేక కానుకలిచ్చి, దాసదాసీజనాలనిచ్చి, బంగారురథముపైనెక్కించి, మిక్కిలి వైభవోపేతముగా తీసుకొనివచ్చి వారిని శ్రీకృష్ణునకు అప్పగించాడు. యాదవులను సగౌరవముగ ఆదరించాడు. బాణుని యందుకలిగిన పరివర్తనకు, అతని సత్ప్రవర్తనకు శ్రీకృష్ణుడు సంతృప్తిజెందాడు. ఉషా అనిరుద్ధులను చూచి శ్రీకృష్ణుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు మొదలైన వారందరూ మిక్కిలి సంతోషించారు. పిమ్మట అందరూ ద్వారకా నగరానికి తరలివెళ్లారు. అని శ్రీశుకుడు, పరీక్షిత్తుకు చెప్పాడు.

## నృగమహారాజు

ఒకనాడు శ్రీకృష్ణపుత్రులైన ప్రద్యుమ్న, సాంబ, గదాదులూ ఇతర యాదవయువకులూ ఉపవనంలో చాలాసేపు విహరించి, అలసిపోయి, నీటిగురించి వెదకివెదకి ఒకనూతి వద్దకు వచ్చారు. నూతిలోనికి చూడగా, దానినిండుగా పర్వతాకారంలో నున్న ఒక ఊసరవెల్లి (పెద్దతొండ) పడియున్నది. దానిని బైటకుతీసి రక్షించాలని ఈ యువకులందరూ పెద్దపెద్దతాళ్లూ పలలూ తెచ్చి ఎంతప్రయత్నించినా బైటకు లాగలేకపోయారు. ఈ వింతను శ్రీకృష్ణునకు తెలియజేశారు. శ్రీకృష్ణుడు సభలోనున్న సామంతులూ, ప్రజలూనెంటరాగా, ఆపాడుపడిన నూతి వద్దకు వెళ్లిచూచాడు. గడ్డిపరకను తీసిపారవేసినంత సులువుగా, తన ఎడమచేత్తో, పర్వతంలాగ ఉన్న ఆ తొండను తీసి బైటపడవేశాడు. అందరూ చూస్తుండగా, ఆ ఊసరవెల్లి, బంగారు శోభతో ఒక దివ్యపురుషునిగా మారినది. ఆ పురుషునిచూచి శ్రీకృష్ణుడు ఇలా అడిగాడు: "ఓ పుణ్యాత్ముడా! నీవెవరివోగాని మహాత్ముని లాగనున్నావు. మరినీకు ఈ ఊసరవెల్లి రూపమెలాగ వచ్చినదో తెలుసుకోవాలని ఉన్నది. వీలైతే చెప్పు." అని కోరగానే ఆ పురుషుడు, పురుషోత్తముని పాదాలకు తన కిరీటమణులు స్పృశించగా నమస్కరించి, ఇలా చెప్పాడు: "ఓ విశ్వవంద్యా! ఈ విశ్వములో నీకు తెలియని విషయమేదైనా ఉంటుందా? అయినా, ఆనతిచ్చావు గనుక, ఇతరులు కూడ తెలుసుకోవాలని విన్నవిస్తున్నాను. నేను ఇక్ష్వాకుమహారాజుయొక్క పుత్రుడనైన నృగుడను. అనేకులైన రాజులు నాకు సామంతులైయుండగా రాజ్యము చేశాను. ఇప్పుడు నేను చెప్పబోవు విషయాలు నన్నునేను గొప్పగా పొగడుకొంటున్నట్టుంటాయి, కాని అవి అన్నీ యథార్థాలు. నా చరిత్రకు సంబంధించిన సత్యాలను తెలియజేయాలని చెపుతున్నాను. నేను లెక్కలేనన్ని దానధర్మాలు చేసేవాడను. దీనజనుల సహాయార్థమై అనేకమైన ధార్మికకర్మలు చేయించేవాడను. తారలను లెక్కించవచ్చునేమోగాని, నేను బ్రాహ్మణులకు దానమిచ్చిన గోవులసంఖ్యను లెక్కించడం

పూర్తిగాదు. న్యాయార్జితమైన ధనముతోనే గోదాన, భూదాన, స్వర్ణదాన, గృహదాన, విద్యాదాన, కన్యాదానాది అనేకమైన దానాలుచేశాను. లోకులగురించి నీటి వసతులు ఏర్పరిచాను. ఆ రోజుల్లో దాతలగురించి ప్రస్తావించేటప్పుడు, నాపేరునే మొట్టమొదట చెప్పేవారట.

ఒకరోజు ఒక విశేషం జరిగినది. ఇద్దరు బ్రాహ్మణులు తగువులాడుకొని, ఒక గోవుతో నా వద్దకు వచ్చారు. కశ్యపుడనే విప్రుడు తనగోవును రెండవ బ్రాహ్మణుడు తోలుకొనిపోతున్నట్లు అభియోగంచేశాడు. కాని ఆ రెండవ బ్రాహ్మణుడు ఆగోవు తనకు రాజుగారిచే దానమివ్వబడినది గనుక తనదేనని చెప్పుకొన్నాడు. ఈ విషయాన్ని తరచి పరిశీలించగా, తెలిసినదేమిటంటే - నేను, మొదట కశ్యపునకు దానమిచ్చిన గోవులలో నొకటి తప్పించుకొని వచ్చి మామందలో కలిసిపోయినది. మళ్లీ రెండవ బ్రాహ్మణునికి దానమివ్వబడిన గోవులతో కలిసిపోవడంచేత రెండవసారి దానమివ్వబడినది. తెలియక జరిగిన ఈ పొరపాటువలన కశ్యపుని సొత్తును నేను స్వంతంచేసుకొని, మళ్లీ ఇంకొకనికి దానం ఇచ్చినట్లయినది. తెలియకచేసినా, అది చాలాపాపకృత్యము గనుక, నేను కశ్యపుని అనేక విధాలుగా బ్రతిమాలాను, నా అపరాధం మన్నించి, పరిహారంగా ఒక లక్ష గోవులను స్వీకరింపుమన్నాను గాని, అతడు సమ్మతించలేదు. ఆ గోవే కావాలన్నాడు. ఆ గోవును ఇచ్చివేస్తే, దాని బదులుగా ఎన్ని గోవులు కావాలన్నా ఇస్తాను అని ఆ రెండవ బ్రాహ్మణుని బ్రతిమాలినాను. అతడుకూడ దానికి సమ్మతించకుండా, గోవును తోలుకొని వెళ్లిపోయాడు. కశ్యపుడు అసంతృప్తుడై కోపముతో వెళ్లిపోయాడు. నేనింక చేసేదేమీలేక, విధినిర్ణయం ఎలాగుంటే, అలాగే జరుగుతుందని ఊరుకొన్నాను.

నాకాలము తీరిపోగానే, యముని నిర్ణయంప్రకారం, ముందుగా పాపఫలమునునుభవించిన తరువాత పుణ్యఫలం పొందవచ్చునని ఈ విధంగా ఊసరవిల్లిఅయి పడియున్నాను. ఇలాగ ఎంతకాలము గడిచినదో నాకు తెలియదు. కృష్ణా! వాసుదేవా, కేశవా, పరమాత్మా, అప్రమేయా, వరదా, శ్రీహరీ, ముకుందా! నీయొక్క అపారకృపచేత, నీయొక్క దివ్యస్పర్శచేత నాపాపశేషము నశించి, నీయొక్క దివ్యదర్శనాన్ని పొందగలిగాను." అని నృగుడు, గోవిందచరణారవిందాలకు నమస్కరించాడు. అతని గురించి ఒక దివ్యవిమానమురాగా శ్రీకృష్ణుని వద్ద సెలవు తీసుకొని, అందరూచూస్తుండగా, విమానములో స్వర్గానికి వెళ్లిపోయాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు అక్కడ ఉన్న రాజులను, ప్రజలను ఉద్దేశించి ఇలా అన్నాడు: "ఈ నృగమహారాజు చరిత్రనుండి అందరూ ఒక విషయం తెలుసుకోవాలి - బ్రాహ్మణులసొత్తును ఎవ్వరూ ఎంతకొంచెమైననూ స్వంతము చేసుకొనరాదు. అది విషముకంటె ప్రమాదకరము. బ్రాహ్మణుని హింసించరాదు. కంటనీరు పెట్టించరాదు. గౌరవించాలి. నమస్కరించాలి. బ్రాహ్మణుడు తప్పుచేస్తే అతని పాపకర్మయే అతన్ని శిక్షిస్తుంది అని తెలుసుకోవాలి." అని శ్రీకృష్ణుడు చెప్పాడు. శ్రీకృష్ణుడు కూడ బ్రాహ్మణులను గౌరవించి, పూజిస్తుండేవాడు. అని శ్రీశుకుడు చెప్పెను.

## బలరాముడు

నందవ్రజాగమనము: ఒకనాడు బంధుమిత్రులను చూచిరావాలనే కోరిక కలుగగా, బలరాముడు రథాన్ని తీసుకొని నందవ్రజానికి వెళ్లాడు. నందయశోదలు పరమానందభరితులయ్యారు. బాలకృష్ణుడే వచ్చినంత సంబర పడిపోయారు. అతనిని ఆలింగనం చేసుకొని, ఒడిలో కూర్చుండ బెట్టుకొని, ప్రేమతో శిరస్సుదువ్వి, ఆశీర్వదించి ఆనందించారు. అందరి కుశలం అడిగారు. కన్నయ్య ఎప్పుడు వస్తాడని అడిగారు.

తరువాత బలరాముడు పాతమిత్రులను కలుసుకొనడానికి వెళ్లాడు. అందరూ అతని చుట్టుముట్టారు. నమస్కరించారు. బలరాముడు కొందరికి నమస్కరించాడు, కొందరిని కౌగలించుకొన్నాడు, కొందరితో సరసాలాడాడు. ఈ విధంగా అందరినీ ఆనందింపజేశాడు.

గోపికలు బలరాముని తీసుకొనిపోయి, చుట్టూ కూర్చున్నారు. కృష్ణదర్శన స్పర్శలకు తహతహలాడుతున్న వారియొక్క తనువులకు బలరామదర్శనం కొంత ఊరట నిచ్చినది. వాళ్లంతా, తమ ప్రియతముడైన కృష్ణుని గురించి అనేక ప్రశ్నలు వేశారు. తమ పన్నెండవఏటనే బృందావనము విడిచి, అక్రూరునితో మథురకు వెళ్లిన బలరామకృష్ణులు మళ్లీ నందవ్రజానికి రానేలేదు. మధ్యలోనొకసారి కృష్ణుడు గోపికలనూరడించడానికి ఉద్ధవుని పంపించాడు. మళ్లీ ఇప్పుడు బలరాముడువచ్చాడు. ఈసరికి బలరామకృష్ణులూ, గోపగోపీజనులూ పెద్దవాళ్లయి పెండ్లిండ్లు చేసుకొని, పిల్లల్నికన్నారు. ఇన్ని సంవత్సరాలు గడిచినా గోపికలకు శ్రీకృష్ణునియందున్న అనన్యప్రేమ సడలలేదు. శ్రీకృష్ణునిగురించి అడిగిన ప్రశ్నల పరంపరలే వారి అమాయకపు ప్రేమను తెలియజేస్తాయి. బలరాముని ఇలా అడిగారు. "రామా! మా కృష్ణయ్య బాగున్నాడా? భార్యలతోను, బిడ్డలతోనూ సుఖంగానున్నాడు కదా! మమ్మల్ని ఎప్పుడైనా తలచుకొంటాడా? కనీసం తలిదండ్రులైన యశోదానందులనైనా తలచుకొంటాడా? పోనీలే, నీవైనా మాయందు దయయుంచి మమ్మల్ని చూడడానికి వచ్చావు, సంతోషమే! గాని ఆ మాయలమారి మేమిక్కడ ఎలాగపడియున్నామో చూడడానికి ఒక్కసారి అయినా వచ్చాడా? అయినా అతనికి మేమెవ్వరములే! పిచ్చివాళ్లమై అతని గురించి మేమే భర్తలను, బిడ్డలను, గృహాలనూ, సర్వమూ, వదలుకొని అతనియందే మా తలపులన్నీ నిలుపుకొన్నాంకదా! మరి అలాంటి మమ్మల్నే విడిచిపెట్టేసి వెళ్లిపోయాడే, మళ్లీ ఒక్కసారైనా వచ్చి మమ్మల్ని చూచాడా ఆ కఠినాత్ముడు? మంచిమాటలాడి మోసగించుతాడు. అవును మేమంటే కల్లాకపటంతెలియని వెర్రిగొల్లలం, సులువుగా మోసగింపబడుతాము, కాని పాపం చతురలైన ఆ నగరకాంతలుకూడ అతని తియ్యని మాటలకు మోసపోతారేమోకదా! అయినా ముల్లోకాలనూ మోహంలో ముంచివేయగల ఆ ముగ్ధమోహనుని చిరునవ్వుబాణాలకు ఎవరు మాత్రము తట్టుకొనగలరులే. మమ్మల్ని నట్టేట విడిచిపెట్టేసి, నగరంలో కులుకుతూ మరచిపోయిన ఆ మోసగాని గురించి మేమెందుకు ఇంతగా ఆరాటపడాలి? మేములేకుండా అతడుహాయిగా కాలక్షేపం చేసేస్తుంటే, అతడు లేకుండా మేము ఇంకాహాయిగా ఉండలేమా ఏమిటి? ఏమనుకొంటున్నాడో మరి! ఆ గోపికాచిత్తచోరుడు!" అంటూ ఈ విధంగా గోపికలు తమ కృష్ణప్రేమను వియోగబాధను, అలుకను వ్యక్తపరచుకొన్నారు. బలరాముడు వారితో అనునయిస్తూమెలగి, కృష్ణుడు వారిని మరచిపోలేదనీ, చిన్ననాటి చేష్టలూ, గోకులంలో తాను వాళ్లతో గడిపిన మధురక్షణాలూ అన్నీ తరచూ తలచుకొంటాడని చెప్పి, వారిని ఊరడించాడు. వారందరూ బలరాముని యందు తమ కృష్ణయ్యనుచూస్తూ కాలంగడిపేవారు.

బలరాముడు ఆగ్రామములో చైత్రవైశాఖమాసాలు గడిపాడు. గోపగోపికలతో అనేక విధాల లీలావినోదాలలో ఆనందించాడు. ఉద్యానవనాలలో, యమునానదిఇసుక తిన్నెలలో అందరూ కాలంతెలియకుండా విహరించి వినోదించారు. చెట్లతొర్రలలో చేరిన వారుణీ రసాన్ని త్రాగిమత్తెక్కి ఆడుకొనేవారు. ఒకనాడు బలరాముడు బాగా మత్తెక్కి జలక్రీడలాడదలచుకొని, యమునా నదినే తనవైపునకు ప్రవహించుమని ఆజ్ఞాపించాడు. మైకంలో ఉండి అన్నాడులే అనుకొని, యమున ఆ మాటను పట్టించుకొనలేదు. బలరాముడు ఆగ్రహావేశములో - " నా ఆజ్ఞను అలక్ష్యం చేసిన నిన్ను వందపాయలుగా చీల్చి, నీ అసలు రూపము లేకుండా చేస్తానుచూడు" - అని, తన నాగలితో, యమున ఒడ్డును పెకలించనారంభించాడు. అప్పుడు, ఆ నదీమతల్లి భయపడి వచ్చి, బలరాముని పాదాలపై బడి, ఇలా విన్నవించుకొన్నది: "ప్రభూ! నీవు సాక్షాత్తు, ఆ సంకర్షణదేవుడవు. నీ అంశతోనే ఆదిశేషువు ఈ భూభారాన్ని మోస్తున్నాడు అనే విషయాన్ని విస్మరించి, నేను అపచారం చేశాను. నన్ను రక్షించు. నా తప్పిదాన్ని మన్నించి, నా ప్రవాహాన్ని మళ్లించకు." అని వేడుకొని, వస్త్రాలు, ఆభరణాలు, పుష్పమాలలూ కానుకలుగా సమర్పించినది. బలరాముడు సంతృప్తుడై అందరితో యమునలో జలక్రీడలాడి, యమున ఇచ్చిన వస్త్రాలు, ఆభరణాలు ధరించి, మనోహరరూపుడై శోభిల్లాడు. తరువాత బలరాముడు అందరివద్ద సెలవుతీసుకొని ద్వారకకు మరలివెళ్లాడు. బలరాముని నాగలిచే చేయబడిన జాడ ఇప్పటికీ ఉన్నది.

**ద్వివిదుని వధించుట :** ద్వివిదుడు పదివేల ఏనుగుల శక్తిగల ఒక పొగరుబోతు వానరుడు. అతడు సుగ్రీవుని మంత్రియైన మైందుని తమ్ముడు. ఈ దుష్టవానరుడు నరకాసురుని మిత్రుడు. నరకాసురుడు శ్రీకృష్ణునిచే చంపబడినందున ద్వివిదుడు, కక్షబూని, ఆనర్త దేశములోని యాదవుల పల్లెలను, పట్టణాలను, తగలబెట్టడం, ఆలమందలను బెదిరించి తరిమివేయడం, చెట్లను విరిచివేయడం, ఇళ్లను పడగొట్టడం, స్త్రీ పురుషులను పట్టుకొనిపోయి, గుహలలో దాచివేయడం మొదలైన ఘాతుకచర్యలతో బాధిస్తుండేవాడు.

ఒకనాడు రైవత పర్వతంనుండి మనోహరమైన వాద్యాలతో సంగీతం వినవస్తుంటే, ద్వివిదుడు అక్కడికిపోయి, చెట్టెక్కి చూచాడు. అక్కడ ఆజానుబాహుడు, సుందరవిగ్రహుడూ అయిన బలరాముడు, కొందరు సుందరీమణులతో కూడి చుక్కలమధ్య చంద్రునివలె మెరిసిపోతూ, వారుణీరసాన్ని త్రాగుతూ, పాడుకొంటూ ఆడుకొంటూ విహరించడం చూచాడు. తనజాతి సహజమైన చేష్టలను చెయ్యాలనిపించి, బలరామునికి దగ్గరగానున్న ఒక చెట్టెక్కి, తనతోకతో బలరాముని మెడను తాకుతూ, కొరికినపండ్లను అతనిపైన వేస్తూ, పళ్లికిలిస్తూ, వెక్కిరిస్తూ, కిచకిచలాడసాగాడు. బలరాముడు చిరాకుతో ఒకరాయి విసిరాడు. దానిని తప్పించుకొని, వానరుడు క్రిందికిగెంతి, బలరాముచేతిలోనున్న మద్యపాత్రను లాక్కొని, నేలకేసి కొట్టాడు. స్త్రీల వస్త్రాలను లాగి, చించనారంభించాడు. బలరామునకు పట్టరాని ఆగ్రహం వచ్చేసినది. తన ఆయుధాలైన నాగలిని, రోకలిని సిద్ధంచేసుకొని, వానరుని తరిమికొట్టాలనుకొన్నాడు. అతడు సామాన్యమైన వానరుడుకాడు. మహాబలశాలియైన హనుమంతుని వంటివాడు. ద్వివిదుడు ఒక వృక్షాన్ని పెరికి, దానితో బలరాముని మొత్తాడు. బలరాముడు లక్ష్యపెట్టకుండా, తన ఇనుపరోకలితో వానరుని తలబ్రద్దలు చేసినా, వాడు లక్ష్యపెట్టకుండా ఇంకొకవృక్షాన్ని పెరికి కొట్టబోయాడు. బలరాముడు దానిని ముక్కలు చేసి పారవేశాడు. ఈ విధంగా వానరుడు పెరికి, విసురుతున్న చెట్లనన్నిటినీ బలరాముడు ముక్కలు చేసివేస్తూనే ఉన్నాడు. తరువాత వానరుడు బండరాళ్లను విసరనారంభించాడు. వాటినికూడ, రాముడు ముక్కలు చేశాడు. చివరకు తాటిచెట్లవంటి తన బాహువులతో వానరుడు ముష్టియుద్ధానికి దిగాడు. పిడుగురాళ్లవంటి తనపిడికిళ్లతో, వాడు బలరాముని వక్షస్థలంపై గుద్దగా, రాముడు లక్ష్యపెట్టకుండా, వానరుని కంఠాన్ని పట్టుకొని బిగించసాగాడు. వాడు శక్తిహీనుడై నాలుక వెళ్లబెట్టాడు. నేలమీద చచ్చిపడ్డాడు. ఒక లోకకంటకుని హతమార్చి, బలరాముడు పరివారముతో మరలిపోయాడు.

**హస్తినాపురాన్ని పెకిలించుట :** దుర్యోధనుని పుత్రికయైన లక్షణ, సకలసద్గుణ శుభలక్షణ సంపన్న. ఆమెను, స్వయంవరములో రాజులందరి సమక్షములో, జాంబవతీశ్రీకృష్ణుల పుత్రుడైన సాంబుడు ఎత్తుకొనిపోయాడు. కౌరవులంతా అతని దుస్సాహసానికి నివ్వెరపోయి, భీష్మాదులైన పెద్దల అనుమతిని పొంది, అతన్ని పట్టుకొని, బంధించాలని నిశ్చయించుకొన్నారు. యాదవులు అతన్ని విడిపించడానికి వచ్చి ఎదిరిస్తే వారికి తగినశాస్తిచేసి పంపిద్దాం అని అనుకొన్నారు. కర్ణ, శల్య, భూరిశ్రవస, యజ్ఞకేతు దుర్యోధనాదులు యుద్ధసన్నద్ధులై రథాలెక్కి, సాంబుని వెంబడించారు. సాంబుడు, మహాయోధునిగా ప్రసిద్ధికెక్కినవాడు. కౌరవముఖ్యులూ, మహావీరులూ అయిన ఈ ఆరుగురినీ, సాంబుడు ఒక్కడే ఎదుర్కొని, తనచుట్టూ మేఘాలవలె క్రమ్మివేసిన శత్రువులబాణాలను, తనయొక్క శరపరంపరలతో ధ్వంసంచేశాడు. మెరుపుతీగలాగ, అందరినీ ఎదుర్కొంటూ, వారి రథాలను, గుర్రాలను, సారథులను, జండాలనూ నేలగూల్చాడు. కౌరవయోధుల కవచాలను ఛేదించి, వారిని గాయపరిచాడు. వాళ్లు అవమానభారంతో, తలలు వంచుకొని, వెనుకకుతగ్గినా, మళ్లీసర్దుకొని, ఉమ్మడిగా ఒంటరివాడైన యాదవకుమారునిపై విరుచుకొనిపడి, అతని రథాన్నీ ధనుస్సునూ భగ్నంచేశారు. గత్యంతరంలేక, వలలో చిక్కుకొన్న సింహంలాగ, సాంబుడు పట్టుపడ్డాడు. కన్యాసహితంగా అతనిని వెనక్కుతీసుకొనివెళ్ళిపోయారు. నారదమహర్షి వలన సాంబుడు కౌరవుల బందీ అయిన

వార్తనువిని, ద్వారకలోని యాదవ వీరులందరూ మండిపడి, యుద్ధానికి సిద్ధపడి, ఉగ్రసేన మహారాజుయొక్క అనుమతిని పొందారు. కౌరవ అభిమాని అయిన బలరాముడు, బంధువులైన కౌరవులతో యుద్ధంచెయ్యడం తగదనీ, తానే స్వయంగా వెళ్లి సాంబుని సగౌరవంగా తీసుకువస్తాననీ చెప్పి, కొందరు యాదవ పెద్దలనూ, బ్రాహ్మణులనూ తీసుకొని రథంపై హస్తినాపురం వెళ్లాడు. ఊరు బయట ఆగి, తనరాకను కౌరవపెద్దలకు తెలియజేయవలసినదిగా ఉద్ధవుని పంపించాడు. దుర్యోధనాదులు మిక్కిలి సంతసించి, సన్నాహాలతో ఎదురు వెళ్లి, బలరామునికి స్వాగతం పలికి నమస్కారాలు చేశారు. బలరాముడు కుశలం అడిగి ఇలా అన్నాడు. "ఓ కురువంశ శ్రేష్ఠులారా! బాలకుడూ, ఒంటరివాడూ అయిన సాంబుని వీరాధివీరులైన మీరందరూ కలిసి బంధించడం ధర్మముకాదు. బంధువులైన మనలోమనకు వైరము తగదని మా ఉగ్రసేన మహారాజు, ఉభయులక్షేమమూ కోరి శాంతియుతంగా, సగౌరవంగా, సాంబుని తీసుకొనిరమ్మని నన్ను పంపించాడు" అనగా విని, దుర్యోధనుడు మండిపడ్డాడు. అహంకార బలగర్వంతో ఇలా అన్నాడు: "చాలుచాలు. ఏమి, ఈ కాలవైపరీత్యము! కాళ్లకు తొడిగేచెప్పులు, తలమీద కిరీటాలు కాదలచుకొన్నట్లున్నదే ఈ యాదవుల వ్యవహారము! కుంతీదేవి మా వంశములోకి రావడం చేత ఈ యాదవులకు మాతో బంధుత్వం ఏర్పడి గుర్తింపువచ్చినది. పోనీలే అనిమేము ఉపేక్షచేయడంచేతనే, అర్హత లేకపోయినా, వారు సింహాసనంపై కూర్చొని రాజులమని విర్రవీగుతున్నారు. మాతో సమానులమనుకొంటున్నారు. వాళ్లతో నిక, ఈ స్నేహ సంబంధాలు చాలు. భీష్మద్రోణ కర్ణాది వీరులనుండి సాంబుని విడిపించడం దేవేంద్రునికైనా సాధ్యంకాదు. ఈ యాదవులు ఎలాగ విడిపిస్తారో నేనూ చూస్తాను." అని, రోషముతో దుర్యోధనుడు అనుచరులను తీసుకొని, విసవిసా వెళ్లిపోయాడు. కౌరవుల పట్ల సద్భావనతో వచ్చిన బలరాముడు ఖిన్నుడైనాడు. దుర్యోధనుని పరుషవాక్కులకు బలరాముని హృదయము తీవ్రముగా గాయపడినది. అవమానం భరించలేకపోయాడు. అక్కడున్న యాదవ పెద్దలతో ఇలా అన్నాడు: "రాజ్యమదాంధుడైన ఈ దుర్యోధనుని మాటలు విన్నారు కదా! కౌరవుల గర్వమణచడానికి, కృష్ణుడూ, ఇతర యాదవులూ సిద్ధపడుతుంటే నేనే వారిని వారించి, మంచిగానే కార్యము సాధించాలనుకొన్నాను కాని, వీళ్లకు మంచి రుచించలేదు. బ్రహ్మాది దేవతలంతా ఎవరిని నిత్యమూ సేవిస్తుంటారో, ఆ దేవదేవుడైన శ్రీకృష్ణుని అనుగ్రహంతో ఉగ్రసేనుని రాజ్యసంపదలన్నీ విలసిల్లుతుంటే, ఈ వదరుబోతు సుయోధనుడు, తమ చలవవలననే యాదవులు బ్రతుకుతున్నారని అంటున్నాడు. విన్నారా! ఈ దుర్మార్గునీ కౌరవవంశాన్నీ నాశనం చేయవలసిన రోజు వచ్చినట్లున్నది" అని, బలరాముడు, తన నాగలిని పట్టుకొని, హస్తినాపుర చివరిభాగాన్నీ నాగలికొనను గుచ్చి తన బాహుబలంతో, ఆ పట్టణాన్ని పెకలించి, యమునా నదిలోనికి త్రోసివెయ్యాలని ప్రయత్నించాడు. పట్టణం ఒక ప్రక్కకు ఒరిగినది. ఇంకకొద్దిసేపటిలో నగరమంతా నదిలో పడగలదని గ్రహించి, ఇది బలభద్రుని ఆగ్రహఫలితమేనని ఊహించి, దుర్యోధనుడు భీష్మపితామహుని తోడ్కొని పరుగెత్తుకొంటూ వచ్చి బలరాముని శరణువేడాడు. లక్షణకన్యను సాంబునకు సమర్పించుకొన్నాడు. అనేకమణిమయభూషణాదులు, ఏనుగులు, రథాలు, గుర్రాలు, పరిచారకులు మొదలైన కానుకలను సమర్పించుకొన్నాడు. ఇలాగ స్తుతించాడు: "బలరామా! జగదభిరామా! మమ్మ రక్షించు. నీ మహిమను తెలిసియుండికూడ అహంకారముచే నీతో అవమానకరంగా మాట్లాడినందుకు సిగ్గుపడ్తున్నాము. మమ్మ మన్నించు. నీవు సంకర్షణ దేవుడవు, అనంతుడవు, సర్వశక్తి స్వరూపుడవు. నిన్ను వర్ణింపనెవ్వరికీ శక్యము కాదు." అని స్తుతించగా, బలరాముడు ప్రసన్నుడై, అభయమిచ్చాడు. దుర్యోధనుడు అల్లునీ, కూతురునీ దీవించి, బలరామాదులతో ద్వారకకు పంపించాడు.

## పౌండ్రక వాసుదేవుడు

బలరాముడు వ్రేపల్లెలో నున్నప్పుడు కరూశదేశపు రాజైన పౌండ్రక వాసుదేవుడు శ్రీకృష్ణుని వద్దకు ఒక దూతను పంపించాడు. ఆ రాజు మూర్ఖుడే కాకుండా అహంకారి కూడాను. అతనికి వాసుదేవనామము ఉండడంచేత, తానే ఆ వాసుదేవపరమాత్మనని నమ్మసాగాడు. అతని చుట్టూచేరియున్న స్వార్థపరులు, అతని భ్రమను ఇంకా ఎక్కువచేస్తూ,

అతనిచేత విష్ణుమూర్తి వేషాన్ని ధరింపజేసి, పొగడ్తలతో, స్తుతులతో, ముంచెత్తేవారు. అతని పిచ్చి తలకెక్కిపోయి, ఇంకెవ్వరికీ వాసుదేవనామం ఉండరాదనీ ఇంకెవ్వరూ తనలాగ విష్ణుమూర్తి వేషధారణ చెయ్యరాదనీ నమ్మేవాడు. అందుచేత అతడు శ్రీకృష్ణుని వద్దకు ఒక సందేశాన్ని పంపించాడు. శ్రీకృష్ణుడు యాదవ ముఖ్యులతో సభలోనుండగా, దూతవచ్చి, తమ ప్రభువుయొక్క మాటలుగా ఇలాగ చెప్పాడు: "ఓయీ కృష్ణా! యాదవా! భూమిని రక్షించడానికీ, ప్రజలను అనుగ్రహించడానికీ, వాసుదేవుడనై నేను వచ్చియుంటే, నీవు నా నామాన్నీ, చిహ్నాలనూ ధరించి సంచరిస్తున్నావని నాకు తెలిసినది. ఇదినీకుతగదు. అలాగ చెయ్యరాదని నీకు తెలియదేమో! ఇకనైనా నీవు వాటిని విసర్జించి, నా శరణువేడుకొనుము. లేకుంటే నాతో యుద్ధానికి రా, నిన్ను యముని వద్దకు పంపిస్తాను." అని చెప్పిన దూతమాటలు విని, సభాసదులందరూ "పిచ్చివాడు" అని నవ్వుకొన్నారు. "ఇలాంటి మూర్ఖుడుకూడ ఒకడున్నాడా" అని ఆశ్చర్యపోయారు. శ్రీకృష్ణుడు ఆ దూతతో ఇలా చెప్పాడు: "మీరాజుతో చెప్పు: ఏ చిహ్నాలనైతే నన్ను విసర్జింపుమన్నాడో, ఆ చిహ్నాలైన గదా చక్రాలతోనే అతన్నీ అతని అనుచరుల్నీ యుద్ధభూమిపై అంతం చేస్తాను. సిద్ధంగానుండుమని చెప్పు" అని అన్నాడు. దూతవెళ్లి శ్రీకృష్ణుని వాక్కులను తన ప్రభువుతో చెప్పాడు. వాని గుండెలదిరిపోయినవి.

శ్రీకృష్ణుడు పౌండ్రకునితో యుద్ధము చేయడానికి వెళ్లాడు. పౌండ్రకుడు అతిశయించిన రణోత్సాహముతో రెండు అక్షౌహిణుల సైన్యముతో వచ్చాడు. అతని మిత్రుడైన కాశీరాజు, మూడు అక్షౌహిణుల సైన్యముతో వచ్చిచేరాడు. పౌండ్రకుడు ముమ్మూర్తులా శ్రీకృష్ణునివలె వస్త్రాలను, అలంకరణలను, ఆయుధాలను, కిరీటకుండలాలను ధరించి రంగస్థలనటునివలె తయారయివచ్చాడు. ఆ పగటివేషధారిని చూచి, శ్రీకృష్ణుడు నవ్వాడు. ఆ పరిహాసానికి పౌండ్రకుడు మండిపడ్డాడు. శ్రీకృష్ణునిపై పదహారు రకాల ఆయుధాలను ప్రయోగించాడు. వాటినన్నిటినీ శ్రీకృష్ణుడు వమ్ముచేశాడు. పాంచజన్యశంఖాన్ని పూరించగా శత్రుసేనలు దద్దరిల్లిపోయాయి. వాటిని తన శరపరంపరలతో నంతము చేసినాడు శ్రీకృష్ణుడు. పౌండ్రకునితో నిలాగ అన్నాడు: "ఓయీ రాజశేఖరా! ఇప్పుడు చూస్తావు నిజమైన వాసుదేవుడెవరో! నన్ను ధరించకుండా విసర్జించుమన్నావే, ఆ గదా, చక్ర, ఆయుధాలే నీ ప్రాణాన్ని హరిస్తాయి, కాచుకో!" అంటూ, శ్రీకృష్ణుడు తన బాణాలను వేసి పౌండ్రకుని సారథిని చంపి, రథాన్ని కూల్చాడు. అయినా పౌండ్రకుడు పోరు మానలేదు. శ్రీకృష్ణుడు చివరకు చక్రాయుధాన్ని ప్రయోగించి, అతని శిరస్సును ఖండించాడు. కాశీరాజు ఇంకాయుద్ధం కొనసాగిస్తుంటే వాని శిరస్సును కూడ చక్రాయుధంతో ఖండించి, ఆ శిరస్సును కాశీరాజుకోటలో పడేటట్లు బాణముతో కొట్టాడు. విజయంసాధించి ద్వారకానగరమునకు తరలిపోయాడు. నిరంతరమూ శ్రీకృష్ణద్వేషముతో, శ్రీకృష్ణ వేషములోనుంటూ, శ్రీకృష్ణరూపస్మరణలోనే జీవితం గడిపిన పౌండ్రకుడు శ్రీకృష్ణసాయుజ్యాన్ని పొందినాడు.

కాశీరాజు సౌధంలో వచ్చి పడిన ఆ రాజు శిరస్సును చూచి అందరూ దుఃఖించారు. అతనికి అంత్యక్రియలు జరిపించారు. అతని పుత్రుడైన సుదక్షిణుడు శ్రీకృష్ణునిపై కక్ష సాధించాలని పరమేశ్వరుని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షముకాగా శ్రీకృష్ణుని అంతము చేసే వరమిమ్మంటాడు. పరమశివుడు అలాంటివరమివ్వకుండా అభిచారయాగాన్ని చేసి, ప్రయత్నింపుమని సలహాఇచ్చాడు. సుదక్షిణుడు నిష్ఠతో ఆయాగాన్ని నిర్వహించాడు. హోమకుండమునుండి భయంకరాకారముతో తాటిచెట్లవంటి కాళ్లతో, మూడు శిఖలతో అగ్నిరూపంలో ఒక జ్వాలామూర్తి బైటకువచ్చినది. అది ద్వారక ప్రవేశించి ఒక్కొక్కటిగా అన్నీ దహించివేస్తుంటే, ప్రజలందరూ భయభ్రాంతులై ఆర్తనాదాలు చేసుకొంటూ శ్రీకృష్ణుని వద్దకు వెళ్లారు. శ్రీకృష్ణుడు అభయమిచ్చి, తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ చక్రము సూర్యునివలె ప్రకాశిస్తూ, ప్రళయాగ్నివలె ప్రజ్వరిల్లుతూ "కృత్య" అనబడే హోమాగ్నిని తరిమితరిమి, హోమకుండమువద్ద దానిని అంతము చేసినది. తరువాత సుదక్షిణుని, అతని నగరాన్నీ ధ్వంసంచేసి, తిరిగి శ్రీకృష్ణుని చెంతకుచేరినది.

# శ్రీకృష్ణుని గృహస్థ జీవనం

నరకాసురునిచెరనుండి విడిపింప బడిన పదహారువేలమంది స్త్రీలను వివాహమాడిన శ్రీకృష్ణుని గృహస్థజీవనం ఎలాగుంటుందో చూడాలని ఒకనాడు నారద మహర్షికి కోరిక కలిగినది. వెంటనే ద్వారకకు చేరుకొన్నాడు.

ఆ నగరము ఉద్యాన వనాలతోనూ, సరస్సులతోనూ, నానావిధ పుష్పఫలవృక్షాలతోనూ, దివ్యభవనాలతోనూ, వైకుంఠాన్ని మించిన శోభతో వెలిగిపోతున్నది. దేవశిల్పి అయిన విశ్వకర్మ తన ప్రతిభనంతా చూపి నిర్మించిన భవనాల్లోని గోడలు, గచ్చులు, ద్వారాలు, బంగారు, వెండిరేకులతో తాపబడి, నవరత్నాలతో పొదగబడి, చీకటిలో కాంతులు వెదజల్లుతున్నాయి. శ్రీకృష్ణుని భార్యలందరూ, ఒక్కొక్కరూ ఒక్కొక్క ప్రత్యేకభవనంలోనున్నారు. ప్రతిభవనంలోనూ మంగళవాద్యాలు, పండితుల వేదఘోషలూ వినిపిస్తున్నాయి వాకిట పన్నీరు జల్లులు, ముత్యాలముగ్గులు, మామిడితోరణాలు శోభిల్లుతున్నాయి. నగరిలో ప్రవేశించిన త్రిలోకసంచారి కన్నులపండువుగా ఆ నగరశోభను తిలకిస్తూ, ఇన్నివేల భవనాల్లో శ్రీకృష్ణుడు ఏ భవనంలోనుంటాడని వెదకాలి అని ఆలోచిస్తూ, ముందుగా రుక్మిణీదేవి గృహంలో ప్రవేశించాడు. తన అదృష్టం కొద్దీ కృష్ణుడు ఆ ఇంట్లోనే ఉన్నట్లుగమనించి, సంతసించి, లోనికి వెళ్ళాడు. రుక్మిణీదేవి వింజామరంతో వీచుతుండగా కూర్చున్నస్వామి దేవర్షిని చూచి, ఎదురువెళ్ళి, నారదునిపాదాలకు శిరస్సుతో నమస్కరించి, కూర్చుండబెట్టి, పాదాలు కడిగి, ఆ నీటిని శిరస్సుపై జల్లుకొని – "మహాశయా! మీరాకతో మా గృహముపావనమైనది. నావలన జరుగవలసిన సేవ ఏమిటో సెలవివ్వండి." అని అతివినయంగా ప్రశ్నించాడు. పరమాత్ముడైన శ్రీకృష్ణుడు మానవుడై జన్మించి, మానవులు బ్రాహ్మణులనూ, సద్గురువులనూ ఋషులను ఎలాగ సత్కరించాలో స్వయంగా చేస్తూ ఆదర్శంగా ఉన్నాడు. నారదుడు ఇలా అన్నాడు: "స్వామీ! దుష్టశిక్షణ, శిష్టరక్షణకు అవతరించిన నీవు చెయ్యలేనిదీ, ఇవ్వలేనిదీ, ఏదీలేదు. కాని నాకేమీవద్దు. నీపదద్వయ ధ్యానము నా మదిలో నిరంతరం నిలిచేటట్లు అనుగ్రహించు." అనగా స్వామి తథాస్తు అన్నాడు.

నారదుడు శ్రీకృష్ణుని వద్ద సెలవుతీసుకొని, అతనియొక్క ఇతర భార్యలనుకూడ చూచిపోదామని ఇంకొక భవనంలోనికి ప్రవేశించాడు. ఆశ్చర్యం! రుక్మిణి ఇంట్లో నుండే స్వామి ఈ ఇంట్లో ఎలాగున్నాడు? ఇక్కడ ఉద్ధవునితోను, భార్యతోను పాచికలాట ఆడుతున్నాడు. నారదునిచూచి, ఎదురేగి, కుశలమడిగి, పాదాలుకడిగి, నానుండి ఏమికావాలి అని అడిగేసరికి నారదునికేమీతోచలేదు. సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. కుతూహలం ఎక్కువకాగా, ఇంకొక భవనంలో ప్రవేశించాడు. అక్కడ శ్రీకృష్ణుడు కొడుకులతో ఆడుకొంటూ ఆనందిస్తున్నాడు. నారదుని ఆశ్చర్యానికి అంతులేదు. ఇంకా చూద్దామని ఇతర భవనాల్లో కూడ ప్రవేశించాడు. ప్రతిఇంట్లోనూ శ్రీకృష్ణుడు ఏదోఒక కార్యకలాపంలో ఉన్నాడు. స్నానానికి వెళ్తూనో, హోమంచేస్తూనో, సంధ్యావందనం చేస్తూనో, ధ్యానంచేస్తూనో, సామును అభ్యసిస్తూనో, జలక్రీడలాడుతూనో, పురాణశ్రవణం చేస్తూనో, బ్రాహ్మణులకు దానాలిస్తూనో, గురువులసేవ చేస్తూనో, సత్పురుషులతో గోష్ఠిచేస్తూనో, పిల్లలకు వివాహప్రయత్నాలు చేస్తూనో, కుమార్తెలకు అత్తవారింటికి పంపుతూనో, ఇంటికి వస్తున్న బంధువులను ఆహ్వానిస్తూనో, భోజనంచేస్తూనో ఈ విధంగా ప్రతి ఇంట్లోనూ ఏదో ఒక వ్యాపకంలో, అతిసామాన్య గృహస్థునివలె నిమగ్నుడైయుండడం చూచాడు నారదుడు. ఆలీలామానుష విగ్రహుని అద్భుత చేష్టితాలను ఊహించలేక నారదుడు నిశ్చేష్టుడైనాడు. ఒకే కృష్ణుడు పదహారువేలమంది కృష్ణులుగా వేర్వేరు గృహాలలో వేర్వేరు కార్యకలాపాలను ఒకే సమయంలో చేస్తుండే అద్భుతలీలను ప్రత్యక్షంగా తిలకించే అపూర్వభాగ్యము తనకే లభించినదని పరమానందభరితుడయ్యాడు నారదుడు. శ్రీకృష్ణుడు భగవానుడే అనడానికీ, భగవానుడు సర్వవ్యాపి అనడానికీ ఇంతకంటే నిదర్శనమింకేమి కావాలి అనుకొన్నాడు. "చేతనః చేతనానాం, ఏకో బహూనాం యో విదధాతి కామాన్" చైతన్యంగల అశేషజీవరాసులలో, ఏకైక చైతన్యస్వరూపుడే, అనేకములో అనేకుడై, ఆ జ్ఞాన స్వరూపుడొక్కడే,

అందరి కోర్కెలనూ సిద్ధింపజేస్తాడు" అనే ఉపనిషద్వాక్యనకు ప్రత్యక్ష ప్రమాణంగా ఈ శ్రీకృష్ణలీలను దర్శించాడు నారదుడు.

శ్రీకృష్ణుడు అష్టమహిషులతోనూ, పదహారువేలమంది భార్యలతోనూ, అందరినీ సమానంగా ఆనందింపజేస్తూ ఉండేవాడు. బ్రాహ్మీముహూర్తానలేచి, పరమాత్మ అయిన తన్నుతానే ధ్యానము చేసుకొనేవాడు. తానే స్వయంపరబ్రహ్మ అయినప్పటికీ, లోకులకు ఆదర్శంచూపడానికి, సంధ్యావందన, గాయత్రీజప, బ్రాహ్మణ పూజ, హోమాది నిత్య కర్మలను నిష్ఠతో నాచరించే వాడు. ప్రతిదినమూ బ్రాహ్మణులకు దీనులకు గోదాన, హిరణ్యదాన, వస్త్రదాదులను చేసేవాడు. పౌరులకు, పనివారలకు, ఆశ్రితులకు, బంధుజనాలకు విరివిగా కానుకలిచ్చేవాడు. ఉద్ధవసాత్యకులతో సభకు వెళ్లేవాడు. ఆ సుధర్మసభాభవనంలో నుండేవారికి ఆకలిదప్పులు, శోకమోహాలు ఉండేవికావు. సభలో బ్రాహ్మణులు, కవులు, పండితులు, అనేకమైన శాస్త్రాలనూ, ఇతిహాసాలనూ, వేదాంతరహస్యాలను వినిపిస్తుండేవారు. నాట్యాచార్యులు నృత్యకళను ప్రదర్శించేవారు. గానకోవిదులు అనేక రకాలగానమాధుర్యాలను వెదజల్లేవారు. ఈ విధంగా శ్రీకృష్ణుని దినచర్య జరుగుతుండేది.

## జరాసంధుని అంతము

**బందీలైన రాజుల విన్నపము :** ఒకనాడు శ్రీకృష్ణుడు సభలో నుండగా ఒక దూతవచ్చి శ్రీకృష్ణునితో ఇలా చెప్పాడు: "ప్రభూ! జరాసంధుడు చాలామంది రాజులను బందీలుగా తీసుకొనివెళ్లి, వారిని తనరాజధానియైన గిరివ్రజపురములో బంధించియుంచి, నానా బాధలకు గురిచేస్తున్నాడు. వారు నన్ను దూతగా తమ కడకు పంపించి, నీకు ఇలాగ విన్నవింపుమన్నారు: "కృష్ణా! ఆపదలోనున్న మమ్ము రక్షించు. నీశరణు జొచ్చినాము. జరాసంధుడు మమ్మల్ని అకారణంగా బంధించి, శారీరక మానసిక బాధలకు గురిచేస్తున్నాడు. శిష్టరక్షణకు నీవు అవతరించావని అంటారు. నీవేమమ్ము రక్షించాలి ప్రభూ." అని వారు నీకు మనవి చేయుమన్నారు." అని చెప్పిన దూత స్వామి జవాబునకు వేచియున్నాడు.

ఇంతలో నారదమహర్షి అక్కడకువచ్చి శ్రీకృష్ణలీలాగాథలను సుమనోహరంగా గానంచేయగా అందరూ ఆనందంతో మైమరిచారు. శ్రీకృష్ణుడు, సభాసదులు లేచినిల్చొని మహర్షిని సగౌరవంగా ఆహ్వానించారు. శ్రీకృష్ణుడు ఇలా అడిగాడు: "నారదా! విశేషాలేమిటి? త్రిలోకసంచారివైన నీకు తెలియనిదేమీ ఉండదు. అందరూ కుశలమేనా? పాండవులు బాగున్నారా?" అని అడిగిన కృష్ణునితో దేవర్షి ఇలా చెప్పాడు: "స్వామీ! ఈ విశ్వములో నీకు తెలియని విషయమేదైనా ఉంటుందా? అయినా అడిగావు గనుక చెప్తాను చిత్తగించు. యుధిష్ఠిరుడు రాజసూయయాగాన్ని చేయతలపెట్టి, నిన్ను ఆరాధించాలనే తలంపుతోనున్నాడు. నీవు ఆ కోర్కెనుతీర్చి, అనుగ్రహించాలి. ఆ యాగానికి వచ్చినవారందరూ నీయొక్క దివ్యదర్శన భాగ్యాన్ని పొందినవారై పునీతులై తరిస్తారు. నీకీర్తి ఇప్పటికే సర్వలోకాలయందూ వ్యాపించియున్నది. నీ పాదజలము పైలోకాల్లో మందాకినిగను, భూలోకంలో గంగానదిగను, పాతాళంలో భోగావతిగనూ ప్రసిద్ధిజెందినది." అని చెప్పగా శ్రీకృష్ణుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు: "ఉద్ధవా! నీ ఆలోచనాశక్తి నిశితమైనట్టిది. మొదట జరాసంధుని జయించి, బందీలైన రాజులను విడిపించాలా? లేదా? యుధిష్ఠిరుని రాజసూయాగానికి మొదటవెళ్లడమా? ఏది శ్రేయస్కరమో బాగా ఆలోచించి చెప్పు" అని కోరినాడు. ఉద్ధవుడు యోచించి, మొదట రాజసూయయాగానికి వెళ్లి, తరువాత జరాసంధుని జయించడం మంచిది, అని చెప్పాడు. మళ్లీ ఇలా అన్నాడు: "అమిత బలపరాక్రమశాలియైన జరాసంధుని చంపడం ఒక్క భీమసేనునికే తప్ప ఇంకెవ్వరికీ సాధ్యపడదు. అతనికి వంద అక్షౌహిణుల సైన్యం ఉన్నది గనుక సేనలతో ఎదిరించి గెలవడం కష్టము. ద్వంద్వయుద్ధములోనే అతన్ని ఓడించాలి. జరాసంధుడు బ్రాహ్మణులు దేనిని అడిగినా ఇచ్చేస్తాడు. భీముడు బ్రాహ్మణ వేషంలో వెళ్ళి, అతనితో

ద్వంద్వయుద్ధం చెయ్యడానికి ఒక్క అవకాశాన్ని ఇమ్మని యాచిస్తే, అతడు తప్పకుండా ఒప్పుకొంటాడు. అప్పుడు మనయొక్క అన్ని ప్రయోజనాలు నెరవేరుతాయి." అని చెప్పిన ఉద్ధవుని ఆలోచనకు అందరూ మెచ్చుకొన్నారు. బందీలైన రాజులయొక్క దూతకు అచిరకాలములోనే వారి యొక్క బాధలు నివారింప బడగలవని అభయమిచ్చి పంపించివేశారు.

మేఘపుష్పము, వలాహకము, శైబ్యము, సుగ్రీవము, అనబడే గుర్రాలనుపూన్చి, దారుకుడు రథాన్ని సిద్ధము చెయ్యగా, శ్రీకృష్ణుడు ఉగ్రసేనునకూ, బలరామునకూ, గురువులకూ వందనం చేసి, రథమెక్కి వెళ్ళాడు. అతనివెంట చతురంగ బలాలు వెళ్ళాయి. బంగారు పల్లకీలలో భార్యలుకూడా వెళ్ళారు. నదులూ వనాలూ పట్టణాలూ దాటి, ఆనర్త, సౌవీర, కురుదేశాలనుదాటి, ఇందుమతీ, దృషద్వతి, సరస్వతీ నదులనుదాటి, పాంచాల, మత్స్యదేశాలను దాటి ఇంద్రప్రస్థ నగరానికి చేరుకొని, ఒక ఉపవనంలో విడిదిచేశారు.

శ్రీకృష్ణుని రాకను తెలుసుకొని, యుధిష్ఠిరుడు తమ్ములతోను, గురువులతోను, బ్రాహ్మణులతోను, మంత్రులతోను వెళ్ళి, శ్రీకృష్ణుని గాఢాలింగనం చేసుకొన్నాడు. అతని సకల దుఃఖాలూ తొలగిపోయినవి. భీమార్జున నకులసహదేవులు కూడ తమ ప్రియబాంధవుని గౌరవ పూర్వకంగా కౌగలించుకొన్నారు. శ్రీకృష్ణుడు యుధిష్ఠిరుని, భీముని, పెద్దలను, గురువులను పాదాభి వందనాలతో గౌరవించాడు. బ్రాహ్మణులు పుణ్యశ్లోకాలను వల్లించారు. దారిపొడుగునా తోరణాలు, పుష్పమాలికలు, పూర్ణకుంభాలు, ముగ్గులు, దీపాలు, పూలబాటలు మొదలైన వాటితో కన్నుల పండువుగా అలంకరించారు. ఆ బాలగోపాలమూ బారులు తీర్చి నిల్చొని జయజయ ధ్వానాలు చేశారు. ఆ నీలమేఘశ్యాముని కన్నులార దర్శించి, తమజన్మ ధన్యమయినదని ఆనందించారు. ప్రజలందరినీ కరుణాపూరిత దృక్కులతోనూ, మనోహరమైన మందహాసముతోనూ వీక్షిస్తూ, స్వామి నగరవీధులగుండా రాజప్రాసాదానికి పరివారసహితంగా విచ్చేశాడు.

కుంతీదేవి కృష్ణుని చూచి, కౌగలించుకొని ఆనందబాష్పాలు రాల్చినది. కృష్ణుడు ఆమెకు పాదాభివందనం చేశాడు. ద్రౌపది శ్రీకృష్ణునికివందనముచేసి, రుక్మిణి మొదలైన శ్రీకృష్ణసతులను సాదరంగా గౌరవించి, కానుకలు సమర్పించినది. ధర్మరాజు అందరికీ తగిన వసతులేర్పాటు చేశాడు. శ్రీకృష్ణుడు అర్జునునిచెలిమితో అనేకమైన సరస వినోద కర్యక్రమాల్లోపాల్గొంటూ, కొన్ని నెలలు ఆనందంగా గడిపాడు.

## రాజసూయ యాగము

ఒకనాడు యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునితో ఇలా విన్నవించాడు: "ప్రభూ! గోవిందా! రాజసూయ యాగము చేసి, దేవతల నారాధించాలని కోరికగా నున్నది. దానికి నీ ఆశీస్సులూ అనుగ్రహమూ కోరుతున్నాను. నిన్నాశ్రయించి, నీ పాదపద్మాలను నిత్యమూ కొలిచే వారి అభీష్టాలు నెరవేరకుండా ఉండవు కదా!" అనగా శ్రీకృష్ణుడిలా అన్నాడు: "ధర్మనందనా! నీ సంకల్పము ప్రశంసింప దగినది. ఈ రాజసూయయాగము దేవతలకు, పితరులకు, ఋషులకు, సర్వభూతములకు శ్రేయోదాయకము, ప్రీతికరము, కనుక తప్పకుండా చేయదగినది. ఇది నీకు కీర్తిని, విజయాన్నీ, పుణ్యాన్నీ సిద్ధింపజేస్తుంది గనుక నీవు ఈ యాగాన్ని చేపట్టు. సాటిలేని అస్త్రవిద్యావిశారదులైన నీతమ్ముళ్ళు నీకు అండగానుంటారు. నీ శత్రురాజులను జయించి, భూమండలంలో నీకీర్తినీ, శాసనాన్నీ స్థాపించు. నీవు ఏకార్యాన్ని చేయుమన్నా చెయ్యడానికి సిద్ధంగా నున్నాను." అని పలికిన శ్రీకృష్ణునకు ధర్మజుడు కృతజ్ఞతతో ప్రణమిల్లాడు. నలుగురు తమ్ముళ్ళనూ 'నాలుగు దిక్కులకు వెళ్ళి, మిత్రరాజుల సహాయంతో, రాజులను జయించి రండు'- అని పంపించాడు. ఆ ప్రకారమే వెళ్ళిన తమ్ముళ్ళు రాజులను జయించి, వారిచేత కప్పాలు కట్టించుకొని, సువర్ణ

రత్నరాసులను, గజతురగాది సంపదలను ప్రోవుచేసుకొని తెచ్చారు. వారు తమ దిగ్విజయయాత్రా విశేషాలను ధర్మజానకు నివేదిస్తూ, ఒక్క జరాసంధుడు మాత్రము లొంగలేదు, కప్పము కట్టలేదని చెప్పారు. యుధిష్ఠిరుడు ఖిన్నుడైనాడు. అప్పుడు శ్రీకృష్ణుడిలా చెప్పాడు: "ధర్మరాజా! జరాసంధుని జయించడానికి ఉద్ధవుడు చెప్పిన ఉపాయమొకటి ఉన్నది. అతనికి బ్రాహ్మణ భక్తి మెండుగానున్నది. బ్రాహ్మణులు అడిగిన దానిని అతడు లేదనకుండా ఇచ్చేస్తాడు. భీముడూ, అర్జునుడూ, నేనూ, బ్రాహ్మణ వేషాలతో వెళ్లి, అతడు మాతో ద్వంద్వయుద్ధము చెయ్యడానికి అతనిని వరము కోరుతాము. అతడు ఆ కోరికను తీర్చడానికి సిద్ధపడి వస్తాడు. అప్పుడు భీమసేనుడు అతనిని ద్వంద్వయుద్ధంలో ఓడించగలడు." అని చెప్పగా అందరూ బాగుబాగు అన్నారు.

## ద్వంద్వయుద్ధము

శ్రీకృష్ణభీమార్జునులు బ్రాహ్మణవేషధారులై గిరివ్రజానికి వెళ్లారు. జరాసంధుడు వారిని ఆహ్వానించి, మిక్కిలి భక్తిశ్రద్ధలతో అతిథి సత్కారాలు చేశాడు. ఆ కపట బ్రాహ్మణులు జరాసంధునితో ఇలా అన్నారు: "ఓ మగధరాజా! బ్రాహ్మణ - అతిథిదేవులను పూజించి, వారి కోర్కెలను వెనుకాడకుండా తీర్చే ఉదారమైన దాతవని తెలిసి, ఒక కోర్కెతో నీవద్దకు వచ్చాము. దానశీలురకు ఇవ్వదగనిదేదీ లేదు. కోరిన వెంటనే బ్రతికియుండగానే తనశరీరాన్ని దానముచేసిన దధీచీ, బోయవాని ఆకలితీర్చడానికి తన శరీరాన్ని అర్పించిన కపోతము, తనదేహంలోని మాంసాన్నికోసి ఇచ్చిన శిబిచక్రవర్తీ, బలిచక్రవర్తి, రంతిదేవుడు, హరిశ్చంద్రుడు, బ్రాహ్మణుడైన సక్తుప్రస్థుడు మహాదాతలుగా పురాణపురుషులైనారు కదా! ఇప్పటికీ వారు ప్రజలమానసములలో సజీవులైయున్నారు కదా!" అని చెప్పిన వారిమాటలను విన్న జరాసంధుడు వారియొక్క వాగ్ధోరణీ, ఠీవీ, వారిభుజాలపై ఏర్పడిన వింటినారి గుర్తులు చూచి, వారు యాచకులై వచ్చిన బ్రాహ్మణులు కారనీ, బ్రాహ్మణ వేషధారులైన క్షత్రియులనీ గ్రహించాడు. వాళ్లు ఈ విధంగా తననుండి ఏమికోరడానికి వచ్చారో, వాళ్ల ఆంతర్యమేమిటో అని ఒక్కక్షణం ఆలోచించి, బలి చక్రవర్తి వద్దకు యాచించడానికి బ్రాహ్మణ వేషంలో వెళ్లిన విష్ణువులా వీరు తన వద్దకు వచ్చియుంటారనీ, బలిచక్రవర్తిలాగానే తానుకూడ వీళ్లేమడిగినా ఇవ్వాలనీ, అనుకొని, ఇలా అంటాడు: "ధీమంతులారా! మీరేమి కోరినా ఇవ్వడానికి సిద్ధముగా నున్నాను, అడగండి." అనగా, శ్రీకృష్ణుడు జరాసంధునితో ఇలా అంటాడు: " ఓ మగధీశ్వరా! నీ సత్యవాక్పరిపాలన, దానశీలత యందు మాకు విశ్వాసం కలిగినది. మేము సంతోషించాము, మేము నీతో మల్లయుద్ధము చేయగోరి వచ్చాము. మాకు ఆ అవకాశ మిప్పించు. ఇంతే మా కోరిక. మేము బ్రాహ్మణులము కాము. ఇతడు కుంతీపుత్రుడైన భీముడు. ఇతడు అతని తమ్ముడైన అర్జునుడు. నేను వసుదేవ పుత్రుడను, కృష్ణుడను. నీవు మాలో ఎవ్వరితోనైనా మల్లయుద్ధం చెయ్యవచ్చును." అనగానే జరాసంధుడు అట్టహాసంగా నవ్వి, ఇలా అన్నాడు: "ఆహా! ఎంత ఆశ్చర్యము! నన్ను ఎదుర్కొనలేక మధురను విడిచి, సముద్రంలో తలదాచుకున్న పారుబోతుతో ఈ మగధాధీశ్వరుడు యుద్ధము చెయ్యడమా! సిగ్గు సిగ్గు, నీవు ప్రక్కకు తప్పుకొనుము. ఈ అర్జునుడు చురుకైన వాడేగాని చిన్నవాడు. ఈ భీముడే బాహుబలంలో నాకు సమానుడు కాగలడేమో చూద్దాం. వీడితోనే నేను యుద్ధం చేస్తాను." అని చెప్పి, రెండు గదలను తెప్పించి, ఊరిబయట నున్న బయలు ప్రదేశానికి అందరినీ తీసుకొనివెళ్లాడు.

జరాసంధుడూ భీముడూ గదలతో భూమిదద్దరిల్లేటట్టు కొట్టుకొన్నారు. వారి యుద్ధము రెండు పర్వతాలూ, రెండు మదపుటేనుగులూ, రెండు సింహాలూ ఢీకొన్నట్లుగా సాగినది. గదలు విరిగిపోయినవి. మల్లయుద్ధం మొదలుపెట్టారు. ప్రచండమైన బాహుదండాలతో ముష్టియుద్ధం చేశారు. గుద్దుకొన్నారు. ఎత్తిపడవేసుకొన్నారు, తన్నుకొన్నారు. యుద్ధము ఘోరముగా సాగుతున్నది. ఒక్కరూ అలసిపోలేదు. ఇలాగ ఎంతసేపుకొనసాగుతుందో తెలియదు. జరాసంధునకు ఇలాంటి దెబ్బలవలన చావు సంభవించదని శ్రీకృష్ణునకు తెలుసు. అప్పుడప్పుడు

భీమునిపై అతనిదే పైచెయ్యి అనిపించినప్పుడు శ్రీకృష్ణుడు తన దివ్యశక్తిని భీమునియందు ప్రవేశపెట్టేవాడు. ఇక ఈ యుద్ధమును ముగించాలని భావించిన శ్రీకృష్ణుడు భీమునకు ఒక సంకేతాన్నివ్వదలచుకొని, ఒక చెట్టుకొమ్మను పట్టుకొని నిలువునా చీల్చి చూపించాడు. భీముడు ఆ సూచనను గ్రహించి, జరాసంధుని నేలపై పడవేసి వానియొక్క ఒక కాలును తన కాలితో తొక్కిపెట్టి ఉంచి, రెండవకాలిని తన రెండుచేతులతోనూ అరటిబోదెను నిలువునా చీల్చినట్లుగా చీల్చి, ఆ ముక్కలను దూరంగా అటూఇటూ పారవేశాడు. అంతటితో వెయ్యి ఏనుగుల బలం ఉన్న అజేయుడైన జరాసంధుడు శాశ్వతంగా కన్నుమూశాడు. శ్రీకృష్ణుడూ, అర్జునుడూ ఘనవిజయం సాధించిన భీమసేనుని కౌగలించుకొని, అతనిని ప్రస్తుతించారు.

శ్రీకృష్ణుడు జరాసంధుని పుత్రుడైన సహదేవుని మగధరాజ సింహాసనం ఎక్కించి, అతనికి పట్టంగట్టాడు. బందీలైపడియున్న రాజులందరినీ విడుదలచేశాడు. చాలాకాలంగా చెరసాలల్లో మ్రగ్గుతూ, చిక్కిశల్యాలై, జడలు కట్టిన జుట్టులతో, హీనంగా దీనంగా పడియున్న రాజులందరూ తమ బంధవిమోచనుడైన భగవానుని దర్శించి, పరమానందభరితులైనారు. వారి శారీరిక మానసిక బాధలన్నీ తొలగిపోయినవి. ముక్తసంగులైన మునులవలె, తేలికపడిన హృదయాలతో భగవానుని ఇలాగ స్తుతించారు: "ఓ పరమకారుణ్యనిధీ! పాపహరణా! పద్మనాభా! వరదా! వాసుదేవా! సజ్జనార్తిహరణా! వివేకశీలా! ఆశ్రితరక్షకా! శ్రీకృష్ణా! శ్రీహరీ! గోవిందా! దాసదుఃఖనాశా! అవ్యయా, అప్రమేయా! ఇందిరావల్లభా! నీకు నిరంతరం వందనాలర్పిస్తాము. ఓయాదవ వంశచంద్రమా! దుష్టశిక్షణ సజ్జనరక్షణ చేసే ఓ పరమేశ్వరా! నీయొక్క కరుణాకటాక్షముచేత మేము ఈ నరకకూపమునుండి విముక్తులమయ్యాము. స్వామీ! మేము నీ అనుగ్రహంచేత ఈ జరాసంధుని చెరనుండి విడుదలపొందినాముగాని, భయంకరమైన ఈ సంసార బంధములనుండి విముక్తి చెందవలసియున్నది. ఐశ్వర్యమదముచే మేము ఇంతవరకును విచ్చలవిడిగా సంచరించి, నిరంకుశముగ రాజ్యపాలనచేసి, ఐహిక సంపదలే శాశ్వతం అని భ్రమపడి, పరులసొత్తునూ రాజ్యాలనూ అపహరిస్తూ పరమార్థాన్ని విస్మరించి, కాలంగడిపి వేశాము. నీయొక్క లీలావిలాసముచేత ఈ జరాసంధుని చెరలో క్రుంగి, కృశించి, రాజరికపు గర్వ, మద, అహంకారాలను పోగొట్టుకొని, నీవే శరణ్యమని తెలుసుకొన్నాము. ప్రభూ! మా రాజ్యాలను అపహరించి, మమ్మల్ని బంధించిన ఈ జరాసంధునిపైన మాకిప్పుడు కోపమేమీలేదు. అతడు అలాగ చేసినందువల్లనేకదా, మాకు ఇప్పుడు నీ యొక్కదర్శన భాగ్యము, అనుగ్రహము లభించినవి. మాకు ఇప్పుడు ఈ శరీరసౌఖ్యాలూ, రాజ్యభోగాలూ, తృణప్రాయాలుగా కనిపిస్తున్నవి. కోరవలసినవి శాశ్వత సుఖదాయకాలైన నీయొక్క పాదపద్మాలే అని తెలుసుకొన్నాము.

శ్లో॥ కృష్ణాయ వాసుదేవాయ, హరయే పరమాత్మనే ।
ప్రణతక్లేశనాశాయ, గోవిందాయ నమో నమః ॥

దామోదరా! నీపాదపద్మాలు మా హృదయాల్లో ఎల్లప్పుడూ నిలిచియుండేటట్లు అనుగ్రహించు." అని వేడుకొన్న రాజులతో శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు: "రాజేంద్రులారా! రాజ్యమదముతో బ్రాహ్మణులను, ప్రజలను, బాధించిన వేనుడు, నహుషుడు, రావణుడు, కార్తవీర్యార్జునుడు మొదలైన రాజులు నశించారు. ధర్మమార్గాన ప్రవర్తించే వారియొక్క కీర్తి, ఔన్నత్యమూ వృద్ధిచెందుతాయి. ఈ శరీరము శాశ్వతం కాదని గుర్తించండి. నీతి, న్యాయము, ధర్మమూ తప్పకుండా ప్రజలను పాలించి, వారిని సుఖపెడుతూ, యజ్ఞయాగాదులను నిర్వహిస్తూ, నాయందు భక్తికలిగియుండండి. మీకు భక్తి కుదురుతుంది. సుఖదుఃఖ, జయాపజయాలవంటి ద్వంద్వాలయందు సమభావముతో, నాయందే బుద్ధినిలిపి మీ స్వధర్మపాలనచేస్తే నన్నుచేరగలరు." అని బోధించి, అందరికీ మంగళస్నానాలు చేయించి, వస్త్రాలు, కానుకలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు వారికి ఇప్పించి, అందరినీ ఆనందంతో సాగనంపాడు.

శ్రీకృష్ణుడు భీమార్జునులతోగూడి, ఇంద్రప్రస్థం మరలివచ్చి, యుధిష్ఠిరునికి మగధ విజయవృత్తాంతమంతానివేదించాడు. ధర్మరాజు శ్రీకృష్ణునకు అభివందనములుచేసి, తమ్ముళ్లను కౌగలించుకొని, భీముని ప్రశంసించాడు.

## శిశుపాలుడు

శ్రీకృష్ణుని అనుమతితో ధర్మజుడు వేదవిదులైన బ్రాహ్మణులను యజ్ఞకర్మనిర్వహణకు నియోగించాడు. వేదవ్యాసుడు, కశ్యపుడు, భరద్వాజుడు మొదలైన మునీశ్వరులనూ, ద్రోణకృపాది గురువులను, భీష్మ ధృతరాష్ట్ర విదురాది కురువృద్ధులను, దుర్యోధనాది బంధుజనులను, సమస్తరాజులను, బ్రాహ్మణులను, ప్రజలలోని ప్రముఖులనూ ధర్మజుడు ఆహ్వానించాడు. యజ్ఞభూమిని బంగారునాగళ్లతో దున్నించి, బంగారుపాత్రలు, పరికరాలను ఏర్పాటుచేశారు. యుధిష్ఠిరుని యజ్ఞదీక్షితునిగా చేసి, శాస్త్రవిధానం ప్రకారము సకల కార్యకలాపాలనూ నిర్వహిస్తున్నారు.

ధర్మజుడు భూపతులు తెచ్చి ఇచ్చే కానుకలను స్వీకరించడానికి దుర్యోధనుని నియోగించాడు. బీదలకు, యాచకులకు, దానాలిచ్చే పనిని కర్ణునికి అప్పజెప్పాడు. వంటల పర్యవేక్షణను భీమసేనునకు అప్పగించినాడు. శ్రీకృష్ణుని పరిచర్యలనూ, అతిథి సత్కారాల పర్యవేక్షణనూ అర్జునుని చూచుకొనుమన్నాడు. యజ్ఞసామగ్రిని సమకూర్చడానికి నకులుని నియమించాడు. దేవబ్రాహ్మణులనూ, గురువులను, పెద్దలను పూజించడానికి సహదేవుని నియోగించాడు. సమస్తప్రజలకూ మృష్టాన్నభోజనాదులు సంతృప్తికరంగా అందేటట్లు చూడుమని ద్రౌపదిని నియమించాడు. దేవేంద్రుడు, దిక్పాలకులు, బ్రహ్మాదిదేవతలు, సిద్ధసాధ్యాది ఊర్ధ్వలోకవాసులూ ధర్మజుడు చేస్తున్న యాగాన్నిచూచి, అంతవరకూ ఏరాజుకూడ ఇంతగొప్పగా చెయ్యలేదని మెచ్చుకొన్నారు. "స్వయంగా భగవానుడైన శ్రీకృష్ణుని పాదపూజ చేస్తుండే భాగ్యం కలిగినవారికి సాధించలేనిదీ, పొందలేనిదీ ఏదీ ఉండదు," అని బ్రహ్మదేవుడు ప్రశంసించాడు. దేవతా సమానులైన ఋత్విజులు నిర్వహించిన యజ్ఞము చివరిరోజునకు వచ్చినది. ధర్మజుడు ఋత్విజులను, బ్రాహ్మణులను, పెద్దలను, సభాసదులను, ఉచితరీతిని పూజించి సన్మానించాలని సంకల్పించాడు. అగ్రపూజకు అర్హుడెవరు అనే విషయంమీద సభలో అనేకులు అనేకవిధాలుగా అభిప్రాయపడ్డారు. బుద్ధిమంతుడైన సహదేవుడు భగవంతుడైన శ్రీకృష్ణుని చూపిస్తూ ఇలా అన్నాడు: "ఈ మహాత్ముని సంతుష్టునిగాచేస్తే భువనాలన్నీ సంతుష్టిని పొందుతాయి. ఎందుకంటే-ఇతడే,

**ఉ॥ కాలము దేశమున్ క్రతువు కర్మము కర్తయు భోక్తయున్ జగ**
**జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రము నగ్ని యాహుతుల్**
**వేళలు విప్రులున్ జనన వృద్ధి లయంబుల హేతుభూతముల్**
**లీలల తానయై తగవెలింగెడి నెక్కటి తేజమీశుడున్** 774

**చ॥ ఇతడె యితండు కన్నులొక యించుక మోడ్చిన నీచరాచర**
**స్థిత భువనంబు లన్నియు నశించు నితండవి విచ్చిచూచినన్**
**వితతములై జనించు ప్రభవిష్ణుడు విష్ణుడునైనయట్టి యీ**
**క్రతుఫలదుండుగాకొరుడొకండెటు లర్హుడు శిష్టపూజకున్** 775

**ఉ॥ ఈ పురుషోత్తమున్ జగదధీశు ననంతుని సర్వశక్తు జి**
**ద్రూపకు నగ్రపూజ బరితోషితు జేయ సమస్తలోకముల్**
**వేపరితుష్టి పొందు పృథివీవర! కావున నీవు కృష్ణునిన్**
**శ్రీపతి బూజసేయు మెడసేయక మాటలు వేయునేటికిన్** 776

కాలము, దేశము, యజ్ఞము, కర్మము, కర్తయు, భోక్తయు, విశ్వము, దైవము, గురువు, జ్ఞానము, మంత్రము, అగ్ని, ఆహుతులు, వేళలు, విప్రులు, సృష్టి, స్థితి, లయ, కారణము, సర్వమూ తానేయై ప్రకాశించే ఏకైకదివ్య స్వరూపుడు, ఈశుడు, ఇతడొక్కడే. ఇతడు కొంచెం కన్నులు మూసుకొంటే, ఈ చరాచర భువనాలన్నీ నశిస్తాయి. కన్నులు విచ్చిచూస్తే మళ్లీ అవి అన్నీ జనిస్తాయి. ప్రభవిష్ణువూ, మహావిష్ణువూ అయినట్టి ఈ యజ్ఞఫలదాత కాకుండా, ఈ అగ్రపూజ నందుకొనడానికి ఇంకెవ్వరికి అర్హత ఉన్నది? ఈ పురుషోత్తముని, జగదీశుని, అనంతుని, సర్వశక్తుని, చిద్రూపిని అగ్రపూజతో సంతోషింపజేస్తే భువనాలన్నీ పరితుష్టిని పొందుతాయి. అందుచేత ఓ మహారాజా! ఆలస్యము చెయ్యకుండా నీవు శ్రీపతి అయిన శ్రీకృష్ణునే పూజించు. ఇంక ఇన్నిమాటలెందుకు." అని చెప్పగా మునులూ, సభాసదులూ, హర్షధ్వానాలుచేసి, బాగుబాగు అని మెచ్చుకొన్నారు. తన ఆంతర్యములోని మాటనే తమ్ముడు చెప్పినందుకూ, సభాసదులందరూ ఆమోదించినందుకూ, ధర్మనందనుడు మిక్కిలి ఆనందించాడు. శ్రీకృష్ణుని పాదాలను భక్తితో కడిగాడు. కుంతీమాత, పాండవులూ, ద్రౌపదీ, ఆ పాదతీర్థాన్ని శిరస్సుపై జల్లుకొన్నారు. బంగారు వస్త్రాలతోను, రత్నకనక రాసుల కానుకలతోను శ్రీకృష్ణుని సన్మానించారు. దేవదేవుని దివ్యశోభను, అక్కడ చేరియున్న మునులూ రాజులూ, పుణ్యాత్ములూ, ప్రజలూ కన్నుల పండువుగా వీక్షించారు. వైకుంఠం ఎలాగుంటుందో ఎవ్వరికీ తెలియనందున, ఇక్కడే వైకుంఠదర్శనాన్ని అనుగ్రహించిన శ్రీకృష్ణపరమాత్మను హృదయంలో నింపుకొని, పూజించి, ధ్యానించి, నాజన్మ ధన్యమైందని ప్రతి ఒక్కరూ బ్రహ్మానందాన్ని అనుభవించారు. దేవతలు ఈ అపూర్వదృశ్యాన్ని తిలకించి జయజయధ్వానాలు చేశారు. గంధర్వులు గానంచేశారు.

ఇంతటి శుభసంతోషసమయంలో ఆ దివ్యవైభవశోభను చూచి, ఓర్వలేక దమఘోషపుత్రుడైన చేదిరాజు, శిశుపాలుడు లేచి సభాసదులందరూ వినేటట్లుగా, ఇలా దురుసుగా మాట్లాడినారు. "ఆహా! ఏమి ఈ వైపరీత్యము! ఇంతమంది జ్ఞానవృద్ధులున్న ఈ సభలో ఏమీ తెలియని పసివాడైన ఈ సహదేవుడేదో చెప్పాడని మహామహులు, లోకపూజ్యులూ, పరమయోగీంద్రులూ, శక్తి సంపన్నులూ, రాజులు ఇందరు ఈ సభలోనుండగా వివేకహీనుడైన ఈ గొల్లవానిని అగ్రపూజకు అర్హుడని ఎలాగ నిర్ణయించారు? ఇతడెలాంటివాడో మీకు తెలియదు గాబోలు. తలిదండ్రులెవ్వరో తెలియనివాడు. వంశమూ, కులమూ, గోత్రమూ, వావివరుసలూ, సంబంధ బాంధవ్యాలూ లేనివాడు. దేవుడూ గురువూలేనివాడు. ఇల్లులేక నీటి మీదనిద్రపోయేవాడు. తుదీ మొదలూ లేనివాడు. రంగస్థల నటునివలె అనేక వేషాలు వేసేవాడు. అనేక రూపాల్లో అనేకరీతులలో ప్రవర్తించేవాడు. గుణహీనుడు. అన్నిచోట్లా చొరబడియుంటాడు. మాయగాడు, పుట్టినప్పటినుంచీచోరుడు, జారుడు. ఇలాంటి దిక్కులేనివాడు, బ్రహ్మర్షులచే పూజింపబడడానికి అర్హుడెలాగ అవుతాడు?" అని సభామర్యాదలన్నిటినీ ధిక్కరించి, దుర్భాషలాడుతున్న శిశుపాలుని మాటలను శ్రీకృష్ణుడు కొంచెమైనా లక్ష్యపెట్టకుండా, చిరునవ్వు విడువకుండా వింటూ కూర్చున్నాడు. దైవదూషణం వినలేక, ఖిన్నులై, మునులూ, కొందరు రాజులూ, శిశుపాలుని నిందిస్తూ, సభను విడిచి వెళ్లిపోయారు. పాండవులకు పట్టలేనంత ఆగ్రహావేశం వచ్చేసినది. కొందరు మిత్రరాజులు ఆయుధాలు ధరించి, శిశుపాలుని అదలించారు. శిశుపాలుడు డాలు, ఖడ్గము పట్టుకొని, అందరినీ తిట్టుకొంటూ యుద్ధానికి సిద్ధపడ్డాడు. సభాస్థలి ఒక రణరంగమయ్యేటట్లున్నది. ఏమీ పట్టించుకొనకుండా, కూర్చొని చూస్తున్న శ్రీకృష్ణునిపైకి శిశుపాలుడు కత్తిదూసి మీదపడబోతుంటే, సమయ మాసన్నమైనదని శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని శిశుపాలుని మీదికి ప్రయోగించగా, వాని శిరస్సుతెగి వాడునేలకూలాడు. వాని స్నేహితులు, సైనికులు, ప్రాణభయంతో పారిపోయారు. సభలో హాహాకారాలు చెలరేగాయి. అందరూ చూస్తుండగా, శిశుపాలుని శరీరంనుండి ఒక దివ్యతేజస్సు వెలువడి శ్రీకృష్ణునియందు

ప్రవేశించినది. దైవనిందా పాపముచేత నరక కూపములో పడవలసిన శిశుపాలుడు భగవంతుడైన శ్రీకృష్ణునియందు ఎలాగ ప్రవేశించగలిగాడు అని అడిగిన పరీక్షిత్తునకు శ్రీశుకుడు ఇలా చెప్పాడు: "రాజా! మూడు జన్మలనుండీ ముకుందునిపై ద్వేషముంచుకొని, అహర్నిశలూ ఆయనయొక్క రూప, నామ, గుణాలనే స్మరిస్తుండటం చేత శిశుపాలుడు సమస్త పాపాలనుండి విముక్తుడై బ్రహ్మ రుద్రాదులకు కూడ అందని పదాన్ని పొందాడు" అని చెప్పాడు.

ధర్మరాజు, ఋత్విజులను, సదస్యులను, బ్రాహ్మణులను, దక్షిణలతో, కానుకలతో గౌరవించి, పూజించి, ఆనందింపజేసి, అవభృథ స్నానానికి నదికి బయలుదేరాడు. సోదరులూ, పురోహితులూ, మిత్రులూ, మంగళవాద్యాలతో అనుసరించగా, ధర్మజుడు ద్రౌపదీసమేతుడై వెళ్లి అవభృథస్నానం చేశాడు. అనంతరం అందరూ ఇంద్రప్రస్థం చేరుకొన్నారు. కొన్నాళ్లుండి వెళ్లవలసినదిగా ధర్మరాజు కోరినందున శ్రీకృష్ణుడు అందుకు సమ్మతించాడు. కొంతమంది భార్యలను మాత్రమే ఉంచి, మిగిలిన వారినందరినీ ద్వారకకు పంపించి వేశాడు.

రాజసూయయాగవైభవానికి సమస్తజనులూ సంతోషించగా ఒక్క దుర్యోధనుడు మాత్రము తీవ్రమైన అసూయాజ్వాలలతో దహించుకొనిపోతున్నాడు. అతిలోకసౌందర్యవతులైన శ్రీకృష్ణుని పత్నులమధ్యను మెరుపుతీగవలె మెరిసిపోతూ, అంతటా వెలుగులను వెదజల్లుతున్న ద్రౌపదిని చూచి, రాజసూయయాగ శోభతో వెలిగిపోతున్న యుధిష్ఠిరుని చూచి, అతని ఓర్వలేనితనం హద్దులు మీరినది. ఒకనాడు మయసభలో ధర్మజుడు కొలువు తీరియుండగా, దుర్యోధనుడు ప్రవేశించాడు. నీరులేనిచోట్ల నీరు ఉన్నట్టుగనూ, నీరున్నచోట్ల పొడిగానున్నట్లుగనూ, భ్రమలు కల్పించే ఆ మయసభా భవనంలో దుర్యోధనుడు భ్రమలకులోనై వస్త్రాలను తడుపుకొని తికమకపడుతుంటే, భీముడూ, ఇతర రాజులూ, ద్రౌపదీ, ఆమెతోనున్న స్త్రీలూ, పకపకా నవ్వడంతో, అతనిలోనిండియున్న అసూయకుతోడుగా, అవమానమూ, ఆగ్రహము పెల్లుబికాయి. పరివారముతో హస్తినాపురం మరలివెళ్లాడు.

తరువాత కొన్నాళ్లకు శ్రీకృష్ణుడు పాండవులయొద్ద సెలవు తీసుకొని, పరివారసహితంగా ద్వారకానగరికి తరలివెళ్లాడు.

## సాళ్వదంతవక్త్రులు

### సాళ్వుని వధ:

రుక్మిణీ స్వయంవరములో శ్రీకృష్ణుని ఎదిరించి, ఓడిపోయి, పగపట్టి, పట్టుదలతో యాదవులను నాశనం చేస్తానని ప్రతిజ్ఞచేసిన వాడు సాళ్వభూపతి. అతడు ఒక సంవత్సరం ప్రతిదినమూ ఒక్క పిడికెడు ధూళిని మాత్రము ఆహారంగా తీసుకొంటూ, పరమశివుని గురించి ఘోరంగా తపస్సు చేశాడు. శివుడు సంతసించి, వరమిస్తాననగా – "నాకు నివసించడానికి ఒక చిన్న పట్టణాన్నిచ్చి, దానితో సహా ఎక్కడికి వెళ్లదలచుకుంటే అక్కడికి ఎగిరివెళ్లేటట్టు, ఇతరులకు కనిపించకుండునట్లు, ఉండాలని కోరుకొన్నాడు. శివుడు మయునితో అలాంటి పట్టణాన్ని నిర్మించి ఇమ్మన్నాడు. మయుడు పూర్తిగా లోహముతో 'సౌభకం' అనే ఒక పట్టణాన్ని నిర్మించిఇచ్చాడు. సాళ్వుడు మిక్కిలి సంతోషించి, సైన్యసమేతుడై ఆ విమానసహాయంతో శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థంలోనున్న సమయంలో ద్వారకానగరిపై దండెత్తాడు. కోటగోడలూ, గోపురాలు, భవనాలూ పడగొట్టించాడు. సరస్సులూ ఉద్యానవనాలూ పాడుచేశాడు. బంగారు ధనరాసులను కొల్లగొట్టాడు. పెద్దపెద్ద బండరాళ్లనూ, చెట్లనూ తెచ్చి, విమానంనుండి పడవేయించేవాడు. మహావీరుడైన ప్రద్యుమ్నుడు సేనతో వెళ్లి ఎదిరించాడు. అతనికి సహాయముగా, తమ్ములైన గదుడు, భానువిందుడు, సాంబుడు మొదలైనవారు వెళ్లారు. అక్రూరుడూ కృతవర్మాదులైన యాదవవీరులుకూడ వెళ్లారు. రెండుసైన్యాలూ దేవదానవుల వలె ఘోరముగా పోరాడాయి. యాదవులు సాళ్వునిసేనకు బాగా నష్టం కలిగించారు. ఇరవైయేడు అహోరాత్రాలు

యుద్ధము కొనసాగినది. సాళ్వుడు, సౌభక విమానంతో అనేక మాయా ప్రయోగాలు చేసి, యాదవ వీరులను తికమకపెట్టాడు. ఒకే విమానం అనేకచోట్ల కనిపించేది, అసలు కనిపించకుండా దగ్గరకు వచ్చి అస్త్రాలను వర్షించేది. యాదవవీరులు సాటిలేని శౌర్యముతో పోరాడినా, సాళ్వుని మాయలు వారిని చికాకు పెట్టేవి. శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థమునుండి తిరిగివస్తూ, పరిస్థితిని గ్రహించాడు. బలరాముని ద్వారకానగర రక్షణకు పంపించి, తాను రంగములోనికి దిగాడు. శ్రీకృష్ణుని చూచిన వెంటనే యాదవ సైన్యాలకు విపరీతమైన శక్తి వచ్చేసినది. సాళ్వుని సైన్యాలు శక్తిహీనమయ్యాయి, సాళ్వునికి రౌద్రావేశం వచ్చేసినది. అతడు భయంకరమైన శక్తి అనే ఆయుధాన్ని శ్రీకృష్ణుని రథసారథిమీద ప్రయోగించగా, దానిని శ్రీకృష్ణుడు మధ్యలోనే ముక్కలు చేశాడు. సాళ్వుడు ఈసారి ఇంకా శక్తివంతమైన అస్త్రాన్ని వెయ్యగా అది శ్రీకృష్ణుని ఎడమచేతిని గాయపరచినది. అతనిచేతినుండి శార్ఙ్గధనుస్సు జారిపడినది. అదిచూచి సాళ్వుడు గర్వోత్సాహంతో ఇలా అరిచాడు: "ఓరీ మూఢుడా! యాదవా! నీతినియమంలేనివాడవై శిశుపాలునకు కాబోయే భార్యను ఎత్తుకొని పోవడమే కాకుండా నిండు సభలో అతనిని చంపివేశావు. ఇదిగో ఇప్పుడే నిన్ను హతమార్చి, నా మిత్రుని ఆత్మకు ఆనందం కలుగజేస్తాను. నా మిత్రునిఋణం తీర్చుకొంటాను." అని అనగా శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు: ఓరీ మూర్ఖుడా! నీ అంతము సమీపించినదని తెలుసుకొనలేక వదరుతున్నావు" అని తనగదను ప్రయోగించగా, అది సాళ్వుని మెడను గాయపరచినది. సాళ్వుడు సౌభకంతో సహా మాయమైనాడు. అప్పుడొక వ్యక్తి శ్రీకృష్ణుని వద్దకు వచ్చి "ప్రభూ! నీతండ్రిని సాళ్వుడు బంధించాడు ఈ విషయం నీకు తెలియజేసి, తండ్రిని రక్షించుమని దేవకీదేవి నీతో చెప్పమన్నది." అని చెప్పాడు. శ్రీకృష్ణునికి ఆశ్చర్యంవేసినది. బలరాముని రక్షణలోనున్న ద్వారకనుండి వసుదేవుని అపహరించడం ఎలాగ జరిగినది – అని యోచిస్తుండగా, సాళ్వుడు మాయా వసుదేవుణ్ని కృష్ణునకు చూపుతూ – "ఇదుగో నీతండ్రి నీఎదుటే వీడి శిరస్సును ఖండిస్తాను. శక్తి ఉంటే రక్షించుకొనుము." అంటూ వెంటనే ఆ వసుదేవుని శిరస్సుఖండించి, విమానమెక్కి మాయమయ్యాడు. శ్రీకృష్ణుడు మానవావతారమెత్తినందున మానవసహజమైన మమకారానికి ఒక్క క్షణంపాటు లోనైనవాడై దుఃఖిస్తుండగా, పైనుండి ఋషులు స్వామికి గుర్తుతేవడానికి, ఇలాగ స్తుతించారు: "స్వామీ! నీయొక్క మాయామోహితులై, జీవులు దుఃఖములో చిక్కుకొని, నీ నామస్మరణ చేసి మోహాన్నిపోగొట్టుకొంటారు కదా! అటువంటినిన్నే నీమాయ మోహపెట్టగలదా స్వామీ!" అని వినబడగానే శ్రీకృష్ణుడు సత్యాన్ని గుర్తించి, ఇటూఅటూచూడగా దేవకి పంపిన దూతగాని, వసుదేవుని శరీరముగాని కనపడలేదు. ఇది సాళ్వమాయ యని గ్రహించి, తనగదను సౌభకం మీదికి విసరగా, అది ముక్కలుముక్కలై సముద్రంలో పడినది. సాళ్వుడు నిరాశ్రయుడై శక్తిహీనుడై నేలపడ్డాడు. అయినా, లేచి, వజ్రాయుధంలాంటి తన గదను పైకెత్తి శ్రీకృష్ణుని మీదికి రాబోయాడు. శ్రీకృష్ణుడు వానిచేతిని ఖండించి, చక్రాయుధంతో శిరస్సును ఖండించాడు.

**దంతవక్త్రుని వధ :** దంతవక్త్రుడు మునిశాపంవలన రాక్షసుడై శ్రుతదేవకు పుట్టాడు. శిశుపాలుడు శ్రుతశ్రవస కుమారుడు. శ్రుతశ్రవస, శ్రుతదేవ, ఇద్దరూ కుంతీదేవి చెల్లెళ్లు, శ్రీకృష్ణుని మేనత్తలు. తన బంధువులూ, ప్రియమిత్రులూ అయిన శిశుపాల, పౌండ్రక, సాళ్వులను చంపిన శ్రీకృష్ణునిపై కక్షకట్టి, దంతవక్త్రుడు, కృష్ణుని చంపి, మిత్రునిఋణం తీర్చుకోవాలని తొందరపడుతున్నాడు. ఒకనాడు రథాన్నీ సైన్యాన్నీ తెచ్చుకొనకుండా, తన గదను పట్టుకొని, శ్రీకృష్ణుని ఎదుర్కొని, ఇలా అన్నాడు: "ఒరే కృష్ణా! నీవు నా మేనమామ కొడుకువే అయినా, నాకు పరమశత్రువువు. చిన్ననాటినుండీ నీ దుండగాలను వింటూ, నీకు తగినశాస్తి చెయ్యాలని నేను రోజూ దేయింబవళ్లు నీగురించే ఆలోచిస్తుంటాను. నా బంధుమిత్రులైన శిశుపాలపౌండ్రకసాళ్వులను హతమార్చిన నిన్ను ఇక విడిచిపెట్టరాదని నిశ్చయించుకొని వచ్చాను. నా భాగ్యవశాన నీవు ఒంటరిగా దొరికావు. ఇదిగో నా గదాదండానికి నిన్ను ఆహుతిచేసి, నా మిత్రుల ఆత్మలకు సంతోషం కలిగిస్తాను. కాచుకొనుము!" అని గదను ఎత్తి గట్టిగా కృష్ణుని

కొట్టాడు. కృష్ణుడు దానిని లక్ష్యపెట్టకుండా తన కౌమోదకీ గదతో ఆ రాక్షసుని కొట్టగా, వానిగుండె బ్రద్దలై వాడు రక్తంగ్రక్కుకొని చచ్చిపడ్డాడు. వాని శరీరంనుండి ఒక దివ్యజ్యోతి వచ్చి శ్రీకృష్ణునియందు ప్రవేశించినది. శిశుపాలునివలె దంతవక్త్రుడుకూడ భగవంతునియెడల శత్రుత్వముచే మూడు జన్మలు ముగిసి వైకుంఠం చేరినాడు. దంతవక్త్రుని తమ్ముడు, విదూరథుడుకూడ కృష్ణుని ఎదిరించి అంతమయ్యారు. శ్రీకృష్ణుడు ఈ విధంగా దుష్టసంహారం సమాప్తంచేసి, ద్వారకకుచేరి సుఖంగా నున్నాడు.

## బలరాముని తీర్థయాత్ర

కౌరవులకు పాండవులకు యుద్ధము జరుగనున్నదని తెలుసుకొన్న బలరాముడు ఉభయుల పట్ల తటస్థునిగా నుండదలచుకొని, తీర్థయాత్రచేయడానికి బయలుదేరాడు. ప్రభాసతీర్థంలో స్నానంచేసి తర్పణములు వదిలాడు. బిందుసరోవరం, సరస్వతీ, వజ్రతీర్థం, విశాలానది, యమున, సరయు, గంగ మొదలైన పుణ్యతీర్థాలలో స్నానాలు చేసి, తర్పణము వదిలాడు. బ్రాహ్మణసంతర్పణలు చేయించాడు. తరువాత లోకప్రసిద్ధమైన నైమిశారణ్యమునకు వెళ్లాడు. అక్కడ మునులు దీర్ఘ సత్రయాగం చేస్తున్నారు. వారు ఎదురేగి బలరాముని సత్కరించి, స్వాగతం పలికారు. ఆ సమయంలో పురాణప్రవచనం చేస్తున్న సూతుడు(రోమహర్షణుడు) అందరిలాగ తన ఆసనం వదిలి, ఎదురేగి ఆహ్వానించలేదని బలరామునికి సూతునిపైన పట్టరాని ఆగ్రహం వచ్చేసినది. అక్కడి ఋషులతో ఇలా అన్నాడు: " ఈ సూతుడు వ్యాసునివద్ద ఏవోకొన్ని పురాణాలు, కథలూ చెప్పడం నేర్చుకొని, తానొక గొప్ప విద్వాంసుడనని అనుకొంటున్నట్టున్నది. ఈ అహంకారమును మేము సహించేదిలేదు. ధర్మరక్షణకోసం పుట్టినమేము ఇతనిని శిక్షించాలి" అంటూ తన చేతిలోనున్న కుశాగ్రమును (దర్భగడ్డికొనను) సూతునిపైకి విసరగా అది బాణమువలె తగిలి సూతుని ప్రాణముపోయినది. మునులంతా హాహాకారాలు చేసి ఇలా అన్నారు: "మహానుభావా! మేము ఇతనికి బ్రహ్మాసనాన్నిచ్చి పురాణప్రవచనంలో నియోగించాము. అతడు తన ఆసనాన్ని విడువరాని నియమంలోనుండి లేవలేదుగాని నీయందు గౌరవంలేకకాదు. నీకు తెలియని ధర్మములేదుకదా! నీ విప్పుడు చేసినది బ్రహ్మహత్య అనబడుతుంది. ఈ పాపానికి నీవు నిష్కృతి చేసుకోవాలి." అని చెప్పగా బలరాముడు తన తొందరపాటు పనికి పశ్చాత్తాపంచెంది, ప్రాయశ్చిత్త విధిని తెలుపుమని ఋషులను వేడుకొని ఇలాగ అన్నాడు: "మహర్షులారా! ఈ సూతుని బ్రతికించి అతడు మళ్లీ అతని ఆయువూ, ఆత్మశక్తీ, ఆరోగ్యమూ, విద్యాదక్షతా అన్నీపొంది ప్రకాశించేటట్లు చేస్తాను. ఇంకా మీరు ఏమిచేయాలంటే అది చేస్తాను." అని చెప్పగా మునులు సంతోషించారు. ప్రాయశ్చిత్తానికి ఏమిచెయ్యాలో ఇలాగ చెప్పారు: "బలదేవా! ఇల్వలుడనే రాక్షసుని కొడుకు పల్వలుడు ప్రతి పర్వమునాడువచ్చి యజ్ఞశాలలలో రక్తమాంసమలమూత్రాదులను కురిపించి, అపవిత్రంచేస్తున్నాడు. మాకు వాని పీడను వదిలించి, నీవు పన్నెండు నెలలపాటు దేశంలోని పుణ్యతీర్థాలలో స్నానంచేసి సేవిస్తే, నీ పాపప్రక్షాళనం అవుతుంది." అని చెప్పారు. పర్వదినం వచ్చినది. అలవాటు ప్రకారం పల్వలుడు యజ్ఞాన్ని పాడుచేయడానికి పూనుకొన్నాడు. వానిచేతిలో రక్తసిక్తమైన శూలం ఉన్నది. వాడు బలరాముని చూచి, మీద పడబోయాడు. బలరాముడు తన దివ్యాయుధాలైన నాగలిని, ఇనుపరోకలిని స్మరించాడు. అవి చేతిలోనికిరాగానే బలరాముడు నాగలితో పల్వలుని మెడను గ్రుచ్చి క్రిందికి లాగి, రోకలితోవాని శిరస్సును చితుకగొట్టాడు. రాక్షసుడు చచ్చి పర్వతంలాగ నేలకూలాడు. మునులు బలరాముని స్తుతించారు, అభిషేకం చేశారు. కానుకలిచ్చారు. అనంతరం బలరాముడు మునులవద్ద సెలవు తీసుకొని, కొందరు బ్రాహ్మణులతో బయలుదేరాడు.

బలరాముడు కౌశికీ, సరయూ, ప్రయాగ, గోమతీ మొదలైన నదులలోను, గంగాసాగర సంగమంలోనూ స్నానాదుల నాచరించి, మహేంద్రపర్వతం చేరాడు. అక్కడ పరశురాముని దర్శించాడు. సప్తగోదావరిలో స్నానం చేశాడు. కృష్ణవేణి,

పంపా, భీమా, కావేరి నదులలో స్నానం చేశాడు. శ్రీశైలము, తిరుమల, కాంచీపురం, శ్రీరంగం, మధుర, సేతుబంధం, రామేశ్వరం, మలయాచలం, కన్యాకుమారి, గోకర్ణం నిర్వింధ్యము సందర్శించి, ప్రభాసతీర్థం చేరాడు.

కౌరవపాండవ సంగ్రామంలో సమస్త రాజులూ హతులయ్యారనీ, భీమదుర్యోధనులు గదాయుద్ధానికి సన్నద్ధులవుతున్నారనీ తెలుసుకొని కురుక్షేత్రం వెళ్లాడు. ధర్మజుడు, శ్రీకృష్ణుడు, అర్జునుడు, బలరాముని సగౌరవంగా ఆరాధించి ఆదరించారు. దుర్యోధనుడూ, భీముడూ గదాయుద్ధం చేయడానికి సిద్ధంగా నుండగా బలరాముడు వారిని సమీపించి, ఇలా అన్నాడు: "మీరిద్దరూ నాకు అత్యంత ప్రీతిపాత్రులు. ఇద్దరూ సమానయోధులు, ఒకరినొకరు ఓడించలేరు. కనుక ఈ యుద్ధానికి పూనుకొనవద్దు." అని హితవు పలికాడు. కాని, కర్మప్రేరితులైన వారిద్దరూ ఆ హితవాక్కులను పాటించలేదు. బలరాముడు ద్వారకకు మరలివెళ్లాడు. యాదవ ముఖ్యులు అతనికి స్వాగతం పలికారు. అక్కడ కొన్నాళ్లుండి బలరాముడు మళ్లీ నైమిశారణ్యం వెళ్లాడు. అక్కడ యజ్ఞం చేయించి, దానాలిచ్చి, భార్య అయిన రేవతితో బంధువులతో కలసి అవభృథస్నానం చేశాడు. తరువాత, ద్వారకకు వెళ్లి సుఖంగా కాలం గడిపాడు.

## సుదాముడు (కుచేలుడు)

శ్రీహరిగాథలను ఎన్నివిన్నా తనివితీరని పరీక్షిత్తు ఇంకా ఏమైనా చెప్పుమని వేడుకొంటే, శ్రీశుకుడు సంతసించి, ఇలా చెప్తాడు:

శ్రీకృష్ణబలరాములు సాందీపని గురుకులంలో విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు సుదాముడనే బ్రాహ్మణ బాలుడు వారికి సహాధ్యాయిగా నున్నాడు. శ్రీకృష్ణ సుదాములు మిక్కిలి సన్నిహితులైన మిత్రులుగా మెలగేవారు. విద్యాభ్యాసం ముగిసిన తరువాత వారు విడిపోయారు. సుదాముడు గృహస్థుడై బహుకుటుంబీకుడై పేదరికంలో రోజులు వెళ్లబుచ్చుతున్నాడు. అతడు బ్రహ్మవేత్త, మానధనుడు, రాగద్వేష రహితుడైన సాత్త్వికుడు, శాంతుడు, ధర్మతత్పరుడు, జితేంద్రియుడు. ఇంటిలో దారిద్ర్యం తాండవిస్తున్నా ఎవ్వరినీ ఏదీ యాచించనివాడు. ప్రాప్తించినదే పదివేలుగా భావించి సంతుష్టుడైయుండేవాడు. పేదరికంవలన బక్కచిక్కి, సరియైన వస్త్రాలు లేక చినిగిన వస్త్రాలను ధరించే ఈ బ్రాహ్మణోత్తముడు కుచేలుడని పిలువబడేవాడు. కుచేలుని భార్య మిగుల ఉత్తమురాలు, పతివ్రత, సద్వంశజాత. లభించిన కొద్ది పైకముతోనే పిల్లలకు ఆహారము పెట్టగా మిగిలితే ఆమెయు, ఆమెభర్తయు తినేవారు. కొద్దిరోజులుగా ఏమీ లభించనందున బిడ్డలు ఆకలితో అలమటించిపోతుంటే, దారిద్ర్యం దుర్భరమైపోతుంటే, ఆ మహాసాధ్వి భర్తతో ఇలా అన్నది: "స్వామీ! నానాటికీ దుస్సహమైపోతున్న మన పేదరికాన్నుండి బైటపడగల మార్గమాలోచించండి. బిడ్డల ఆకలి బాధను నేను చూడలేకున్నాను. నాకొక ఆలోచన వచ్చినది. మీ బాల్య స్నేహితుడైన శ్రీకృష్ణుని దర్శించితే, ఆయన కృపాకటాక్షవీక్షణం మనపై పడితే మనకు శుభం కలుగుతుంది.

**చ॥ వరదుడు సాధుభక్తజనవత్సలుడార్త శరణ్యుడిందిరా**
**వరుడు దయాపయోధి భగవంతుడు కృష్ణుడు తా(గుశస్థ లీ**
**పురమున యాదవ ప్రకరముల్ భజియింపగ నున్నవాడు నీ**
**వరిగిన నిన్ను జూచి విభుడప్పుడ యిచ్చు ననూన సంపదల్** 966

కలలోనైనా, ఎన్నడైనా, ఆయనను స్మరించనట్టి కఠినాత్ముడు అయినా ఆపదలో ఆయనను మనసారా స్మరిస్తేచాలు ఆ దయామయుడు అన్నివిధాలా అనుగ్రహిస్తాడు కదా, మరి ఆయననే నిరంతరమూ సేవిస్తున్న నిన్ను అనుగ్రహించకుండా ఉంటాడా?" అని చెప్పిన ఇల్లాలి మాటలకు యోచించినవాడై, శ్రీకృష్ణ సందర్శనమే శ్రేయస్కరమని భావించి, ఆమెతో ఇలా అన్నాడు: "మానవతీ! నీ ఆలోచన ఆచరింపదగ్గదే. ఆయన దర్శనమే కల్యాణప్రదము.

మరి ఆయనకు ఏదైనా ఇవ్వడం బాగుంటుంది కదా!" అనగా ఆమె ఇంట్లో ఏమీలేనందున నాలుగిళ్లకు వెళ్లి నాలుగు పిడికిళ్ల అటుకులను యాచించితెచ్చి, అతని చినిగిన వస్త్రములో కట్టిచ్చినది. శ్రీకృష్ణసందర్శనోత్సాహముతో బయలుదేరిన కుచేలుడు దారిలో ఇలాగ తలపోశాడు: "ద్వారకా నగరిలోనికి ఎలాగ ప్రవేశించగలను? నా బీదరికాన్నిచూచి నన్నులోనికి పోనివ్వరేమో! అంతఃపురంలోనున్న శ్రీకృష్ణుని నేనెలాగ సమీపించగలను! ద్వారపాలకులడ్డగిస్తే ఏమని చెప్పగలను? నా అదృష్టమెలాగున్నదో! ఆ శ్రీకృష్ణుని అనుగ్రహముంటే ఏ ఆటంకమూ కలుగదు." అని అనుకొంటూ నగరంలో ప్రవేశించాడు. పదహారువేల మణిమయ సువర్ణసౌధాలను చూచి ఆశ్చర్యపోయాడు. వాటిలో ప్రత్యేక శోభతో ప్రకాశిస్తున్న ఒకపెద్ద సౌధాన్నిచూచి, శ్రీకృష్ణుడు ఇందులో నుండవచ్చునని భావించి, అందు ప్రవేశించాడు. వైకుంఠము స్మరణకురాగా, వైకుంఠం ఇలాగే ఉండవచ్చుననుకొన్నాడు. అతనినెవ్వరూ అడ్డగించలేదు. అతడునేరుగాలోనికి ప్రవేశించాడు. ఆ భవనాంతఃపురంలో, హంసతూలికా తల్పముపై సుందరీమణుల సేవలను పొందుతూ మహితలావణ్యమన్మథమన్మథుడైన స్వామి, రుక్మిణీ సతీమణితో వినోదిస్తుండడం ఆ భూసురోత్తముడు కాంచినాడు.

**సీ॥ ఇందీవరశ్యాము వందిత సుత్రాము కరుణాలవాలు భాసురకపోలు**
**కౌస్తుభాలంకారు కామితమందారు సురుచిర లావణ్యు సురశరణ్యు**
**హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు**
**ఖగకులాధిపయాను కౌశేయపరిధాను పన్నగశయును నబ్జాతనయను**
**తే॥ మకరకుండలసద్భాషు మంజుభాషు నిరుపమాకారు దుగ్ధసాగర విహారు**
**భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణు కృష్ణు.** 975

నీలోత్పలశరీరుడూ, దేవేంద్రుని వందనాలు పొందేవాడు, కరుణానిలయుడు, మెరిసేచెక్కిళ్లుగలవాడు, కౌస్తుభమణిని ధరించేవాడు, కోరికలను తీర్చే కల్పవృక్షమువంటివాడు, సుందరరూపుడు, దేవతలకు శరణమిచ్చువాడు, సింహమువంటినడుముగలవాడు, అఖిలలోకారాధ్యుడు, చక్రహస్తుడు, గరుడవాహనుడు, శేషశయనుడు, పీతాంబరధారి, అరవిందాక్షుడు, మృదుమధురభాషణుడు, క్షీరసాగరవిహారి, సకలసద్గుణరాశి, యాదవకుల చంద్రుడు, విష్ణువు, తేజోమయుడు, శాంతసహనశీలి అయిన శ్రీకృష్ణుని ఆ బ్రాహ్మణోత్తముడు దర్శించాడు. అతని జన్మధన్యమయినది. నెమ్మదిగా పురుషోత్తముని వైపునకు సంకోచముతో కాళ్లీడ్చుకొంటూ నడుస్తున్నాడు, నిత్యదారిద్ర్యపీడితుడూ, బక్కచిక్కి చినిగినవస్త్రాలు ధరించినవాడు కుచేలుడు. చిన్ననాటి సహాధ్యాయుని అల్లంత దూరంనుండి చూచినస్వామి వడివడిగా ఎదురు వెళ్లి కౌగలించుకొన్నాడు. ఆప్యాయంగా స్వాగతం పలికాడు. చేతిని పట్టుకొని తోడ్కొనివచ్చి, తన పాన్పుపై కూర్చుండబెట్టి, కాళ్లుకడిగి, ఆ జలాన్ని శిరస్సుపై జల్లుకొని, చందనం ఒంటికిపూసి, విసనకర్రతో వీచాడు. మణిమయదీపంతో నివాళులర్పించి, కర్పూరతాంబూలమిచ్చి, సిగలో పువ్వుతురిమి, ఆనందబాష్పాలు రాల్చి, ముగ్ధమోహనమందహాసముతో సుదాముని మేనుపులకింపజేశాడు. రుక్మిణీదేవి వింజామరంతో వీచినది. కుచేలుని కన్నులనుండి ఆనందబాష్పాలు ఎడతెగక కురిశాయి. గొంతుమూగపోయినది. సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువైన ఈ శ్రీకృష్ణుడెక్కడ, బక్కచిక్కిన బీదబ్రాహ్మణుడైన తానెక్కడ? అనుకొన్నాడు. ఈ విచిత్ర దృశ్యాన్నిచూచి, అంతఃపురకాంతలు విస్మయంచెందారు. "ఓహో! ఈ భూసురోత్తముడు పూర్వజన్మలో నెలాంటి తపస్సు చేసియుండెనో కదా! యోగిజనవంద్యుడైన ఈ జగన్నాథుని పాన్పుపై ఆసీనుడైయున్న ఈ మహనీయమూర్తికి ఎంతటిగొప్ప మునిపుంగవులైననూ సాటిరారుకదా! ఆ స్వామిపైనా ఆ తల్పముపైనా అన్నిహక్కులూ తనవే అనుకొంటున్న ఆ రుక్మిణీదేవిని అలక్ష్యముచేసి, ఆమె ఏమనుకొంటుందో అనే సంకోచమైనా లేకుండా

శ్రీకృష్ణుడు ఈ బ్రాహ్మణునకు ఎదురువెళ్లి కౌగలించుకొని, సకల మర్యాదలతో గౌరవించి, తన పాన్పుపైననే కూర్చుండబెట్టి, వినయంగా పూజించాడంటే, ఈతడు ఎంత భాగ్యవంతుడో కదా!" అని అనుకొంటుండగా, శ్రీకృష్ణుడు కుచేలుని చేతిని తన చేతిలోనికి తీసుకొని తాము గురుకుల వాసము చేస్తుండే రోజులలోని విశేషాలను జ్ఞాపకంచేస్తూ ఇలా అన్నాడు: "మిత్రమా! వేదాధ్యయనపండితుల వంశమునుంచి వచ్చిన నీపత్ని సుశీలవతియై నీకు అనుకూలవతియై యుంటున్నదికదా! నీ మనస్సు ఇంతవరకూ దారాపుత్ర గృహక్షేత్రాదుల సంక్షేమమందు ఆసక్తి కలిగియున్నట్లు లేదే! నేను లోక కల్యాణం కోసము కర్మ నాచరిస్తున్నట్లే కొందరు ఉత్తములు దేనియందూ తగుల్కొనకుండా తమ ధర్మాలను నిర్వహిస్తుంటారు. మన గురుకులవాసము జ్ఞాపకమున్నదా? మన గురువు బ్రాహ్మణశ్రేష్ఠుడూ, సత్కర్మపరాయణుడూ, బ్రహ్మజ్ఞానీ కదా! భక్తితో గురువులను సేవించేవారు నాకు ఇష్టులు. ఒకనాడు మనము కట్టెలను తేవడానికి అడవికి వెళ్లాము గుర్తున్నదా? అప్పుడు కుంభవృష్టి కురిసినది. మనం తడుస్తూ అలాగే ఉండిపోయాము. తెల్లవారుతుండగా వర్షంతగ్గితే, మనల్ని వెదుక్కొంటూ గురువుగారైన సాందీపని వచ్చి, మనగురించి చాలా విచారించి ఇలాగ అన్నారుకదా! "నాయనలారా! మాకోసము మీరు అడవికి వచ్చి, ఇంతగా బాధపడ్డారు, మీరు గురుఋణము తీర్చుకొన్నారు. మీకు ధన, దార, పుత్ర సంపదలూ, దీర్ఘాయువూ, ఉన్నతీ, విజయశ్రీ అన్నీచేకూరగలవు" అని దీవించి, ఇంటికి తీసుకొనివెళ్లారుకదా! మనం చదువుకొనే రోజుల్లో అన్యోన్యస్నేహానుబంధాలతో ఎలాగ మెలగేవారమో గుర్తున్నదా?" ఈ విధమైన అరమరికలులేని ప్రియవచనాలకు సుదాముడు ఉప్పొంగిపోయాడు. వినడమేగాని, నోటమాటరానంత సంభ్రమంలో మునిగియున్నాడు. చివరకు ఇలాగ అనగలిగాడు: "ప్రభూ! నీవు దేవదేవుడవు, జగద్గురుడవు. వేదమే నీశరీరము. అటువంటి నీవు గురుకుల వాసము చెయ్యడం లోకానికి ఆదర్శం చూపడానికే కాక నావంటి వారికి నీయొక్కసాంగత్య భాగ్యాన్ని అనుగ్రహించడానికే కదా! లేకుంటే నీవు గురువు వద్ద నేర్చుకోవలసినదేముంటుంది?" అని చెప్పిన మాటలకు సంతసించి శ్రీకృష్ణుడిలా అన్నాడు: "మిత్రమా! నాకోసం నీవు ఏమి తీసుకొనివచ్చావు?" అని మందస్మితముఖార విందము వికసించగా అన్నాడు. కుచేలుడు ఖిన్నుడై ఊరుకొనడంచూచి, మళ్లీ అన్నాడు: "అది ఎంత స్వల్పమైనది అయినా ప్రేమతో ఇవ్వబడినదానిని నేను ప్రీతితో స్వీకరిస్తాను, కాని భక్తిలేని వాడు మేరువును తెచ్చిఇచ్చినా స్వీకరించను.

క॥ దళమైన పుష్పమైనను ఫలమైనను సలిలమైన పాయని భక్తిం
గొలచినజనులర్పించిన నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్ 1010

పత్రమైనా, పుష్పమైనా, ఫలమైనా జలమైనా నిశ్చలభక్తి కలిగియున్నవారు నాకు సమర్పిస్తే, దానిని రుచిగల మధురాన్నముగ భావించి నేను ఆరగిస్తాను." అని చెప్పిన మాధవుని మధురోక్తులకు ముదముజెంది, కుచేలుడు తానుతెచ్చిన అటుకులను బైటపెట్టడానికి సిగ్గుపడి ఊరుకొన్నాడు. సర్వాంతర్యామియైన సర్వేశ్వరునకు తెలియనిదేమున్నది? "ఈ మహాత్ముడు పూర్వజన్మలోనేమీ కోరకుండా నన్ను సేవించాడు. ఇప్పుడు కూడ దారిద్ర్యబాధను భరించలేని భార్య ప్రేరణచే వచ్చాడుగాని ఏమీకోరడు. ఇతడు బహువిధాలైన సంపదల నివ్వదగినవాడు" అని భావించాడు ఆ దయామయుడైన స్వామి. కుచేలుడు తన చినిగిన ఉత్తరీయములో కట్టబడిన అటుకుల మూటను తడుముకొంటూ దీనిని సకల దివ్యభోగాలను అనుభవిస్తున్న ఆ లక్ష్మీపతికి ఇవ్వడమెలాగ అని సంకోచిస్తుండగా శ్రీకృష్ణుడే ఆ మూటను విప్పిచూచి: "ఓహో! ఈ అటుకులంటే నాకు ఎంతో ఇష్టమని నీకు తెలుసుకదా!" అంటూ ఒక పిడికెడు అటుకులను తీసుకొని నోటిలో వేసుకొన్నాడు. వాటిని ఆరగించి, "ఈ అటుకులు చాలు, నన్నూ సమస్తలోకాలనూ సంతృప్తి పరచడానికి." అంటూ ఇంకొక పిడికెడు అటుకులు తీసుకొనబోతుంటే, రుక్మిణీదేవి వారించినది. ఆమె చూపులతో "స్వామీ ఈ సుదాముడు, ఇహలోక, పరలోక – ఐశ్వర్యాలన్నిటినీ

పొందడానికి మీరు ఆరగించిన ఆ పిడికెడు అటుకులే చాలును. మీరు ఇంకా తీసుకొని తింటే, ఐశ్వర్యముతోపాటు, మన ఇద్దరమూ కూడ అతనికి సొంతం అయిపోతాము" అని సూచించినది.

ఆనాటి రాత్రి కుచేలుడు వివిధరకాల భోజ్యాలనారగించాడు. మెత్తని పాన్పుపై పవ్వళించాడు. తెల్లవారగనే నిత్యకృత్యాలను ముగించుకొని శ్రీకృష్ణుని వద్ద సెలవు తీసుకొనాలని వెళ్లాడు. పరమాత్ముని సన్నిధిలోతాను అనుభవించిన పరమానందాన్ని విడిచి వెళ్లలేని కుచేలుడు తన లౌకికస్థితిని గుర్తుచేసికొని, స్వామివద్ద సెలవు తీసుకొన్నాడు. స్వామికొంతదూరం వచ్చిసాగనంపాడు. కుచేలుడు కృష్ణుని ఏమీ అడుగలేదు. కృష్ణుడు ఏమీ ఇవ్వలేదు. కుచేలుడు మనస్సునిండా శ్రీకృష్ణుని ఆలోచనలతోనే వచ్చాడు. మళ్లీ శ్రీకృష్ణుని ఆలోచనలనే మనస్సునిండా నింపుకొని ఇంటికి వెళ్లుతున్నాడు. సుదాముడు జ్ఞానవైరాగ్య సంపన్నుడు. గర్భదరిద్రుడైయుండి కూడ సాక్షాత్తూలక్ష్మీపతియైన తనచిన్ననాటి ప్రియమిత్రుడేది కావాలంటే దాని నిస్తాడని తెలిసియుండి కూడ క్షుద్రమైన లౌకిక సంపదలను కోరాలనుకొనలేదు. దారిలో ఇలాగ అనుకొంటూ వెళ్లాడు: "ఆహా! నాపూర్వపుణ్య విశేషముచేత అనంతుడూ, అచ్యుతుడూ, చిన్మయరూపుడూ అయిన శ్రీకృష్ణ పరమాత్మను దర్శించాను. లక్ష్మీపతీ, సర్వైశ్వర్య సంశోభితుడూ అయిన వాసుదేవుడు బక్కచిక్కి చినిగిన వస్త్రాలతో నున్న దరిద్రుడనైన నన్ను ఒకసోదరునివలె ఆలింగనం చేసుకొని, ఆదరించి, పూజించి సత్కరించడం ఆ కరుణాసాగరుని యొక్క లీలావిలాసమే కదా! నా జన్మధన్యమైనది. ఇంతకన్నా నాకు కావలసినది ఇంకేమున్నది. ఓహో! నా భాగ్యమే భాగ్యము కదా! ఇంత అలౌకికమైన బ్రహ్మానందాన్ని నాకు ప్రసాదించిన నా మిత్రుడు నా మేలుకోరియే నాకులౌకిక సంపదలేవీ ఇవ్వలేదు. సర్వజ్ఞుడైన ఆ సర్వేశ్వరునికి నా పరిస్థితి తెలియక కాదు! అపారకృపాసాగరుడూ, ఆశ్రితవత్సలుడు, ఆర్తజన రక్షకుడూ అయిన ఆ స్వామి, తలచుకొంటే ఏమైనా చెయ్యగలడు, కాని దరిద్రుడు ధనవంతుడైతే దైవాన్నే ఉపేక్ష చేస్తాడని, అలాంటిదుర్గతి నాకు పట్టకూడదని, నా ప్రియమితుని శ్రేయోభిలాష. ఆహా! ఎంతటి మహత్తరమైన ప్రేమ!" అని తలపోస్తూ ద్వారకలో తాను అనుభవించిన ఆనందమధురస్మృతులను నెమరువేసుకొంటూ తన గ్రామం చేరుకొన్నాడు.

తన కుటీరం ఉండేచోట ఒక భవనం వెలసియున్నది. ఉద్యానవనంతో, తామరపువ్వుల కొలనుతో పాలరాతి గచ్చు గోడలతో నున్న ఒక మహాసౌధం అది. తానింకా ద్వారకలోనే ఉన్ననా అనే భ్రమకలిగినది కుచేలునకు. కళ్లు నులుముకొని చూచాడు. ఇంటినుండి సర్వాలంకార భూషితలైన అందమైన దాసీస్త్రీలు ఎదురు వచ్చి, "దయ చేయండి" అని ఆహ్వానించారు. సంగీత వాద్యాలతో లోనికి తీసుకొనివెళ్లారు. మానవరూపం ధరించిన మహాలక్ష్మిలాగ నున్న అతని సతీమణి ఆనందబాష్పాలతో ఎదురేగి, భర్త పాదాలకు నమస్కరించినది. సుదాముని సంభ్రమాశ్చర్యాలకు అవధులు లేవు. "ఓహో! ఇదంతా ఆ లీలామానుష విగ్రహుని అద్భుత లీలయేకదా! తానేమీ అడుగకపోయినా, సమస్త ఐశ్వర్యాభోగాలను అనుగ్రహించాడు." అనుకొంటూ భార్యతోగూడి భవనమంతా తిలకించాడు. సతీపతులు ఆ సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుని అనేక విధాల స్తుతించారు, పూజించారు. గర్భదరిద్రుడైన కుచేలుడు విశిష్ట శ్రీమంతుడైనప్పటికీ ఎలాంటి మనోవికారాలకూ లోనుగాలేదు. "ఆహా! శ్రీకృష్ణభగవానుడు ఎంతటి దయామయుడు!" మూర్తీభవించిన దారిద్ర్యమే అయియున్న నన్ను ఏవగించుకొనకుండా, సత్కరించి, పూజించి, పిడికెడు అటుకులను ప్రీతితో ఆరగించి, నాకు అమితమైన సిరి సంపదలను ప్రసాదించాడు కదా! నా వృత్తాంతమే చాలు, గోవిందుని భక్తవత్సలతను చాటి చెప్పడానికి. ప్రభూ! జన్మజన్మలకూ నాకు నీ పాదారవిందాలపైన నిండైన భక్తి నిలిచియుండుగాక!" అని, ఈ విధంగా మననం చేసుకొంటూ, భార్యాబిడ్డలతో నిశ్చింతుడై జీవించాడు. భోగాలపై ఆసక్తిలేకుండా, రాగద్వేషాది ద్వంద్వాలను జయించినవాడై, అరిషడ్వర్గాలను అదుపులో నుంచుకొని, నిరంతర హరిచింతనలో నిమగ్నుడైయుంటూ, హరిస్మరణానందాన్ని అనుభవిస్తూ, భవబంధనాలను వదిలించుకొని, ముక్తుడయ్యాడు మహాత్ముడైన సుదాముడు.

# శమంతపంచక తీర్థము

పూర్వము పరశురాముడు క్షత్రియసంహారం చేసినప్పుడు వాళ్ల రక్తమంతా కురుక్షేత్రమువద్ద ఐదుమడుగులుగా ఏర్పడి శమంతపంచకమనబడినది. అది ఒక పుణ్యక్షేత్రముగా వెలసినది. ఒక అపూర్వమైన సూర్యగ్రహణం రానున్నందున దేశములోని అన్ని ప్రాంతాల ప్రజలూ ఆ తీర్థానికి వెళ్లడానికి బయలుదేరారు. ద్వారకనుండి బలరామకృష్ణులు, వసుదేవ, ఉగ్రసేన, అక్రూరాది యాదవ ప్రముఖులు, తమతమ కుటుంబాలతోను, ఇంద్రప్రస్థంనుండి పాండవులు, వ్రేపల్లెనుండి నందాది గోపాలురూ, గోపికలు, హస్తినాపురినుండి భీష్మద్రోణ విదుర ధృతరాష్ట్ర దుర్యోధనాది కౌరవ ముఖ్యులూ కుటుంబ పరివారాలతో వెళ్లారు. పర్ణశాలలవంటి విడుదులను ఏర్పాటు చేసుకొన్నారు. ఇంకా మత్స్య, కోసల, విదర్భాది - అనేక దేశాలనుండి రాజులు, ప్రముఖులూ, పరివారాలూ వెళ్లారు. ద్వారకలో నగర సంరక్షణ గురించి, ప్రద్యుమ్న, గద, సాంబాది వీరులను ఉంచి వచ్చారు. బలరామకృష్ణాది యాదవులు తీర్థంలో స్నానాలు చేసి, ఉపవాసముండి, సువర్ణ రత్నగోదానాది దానాలనిచ్చి, భోజనాదులను ముగించి, చెట్లక్రింద ఆకులను మెత్తగా పరుచుకొని విశ్రమించారు.

భీష్మ ద్రోణ సంజయ విదురాది కౌరవముఖ్యులూ నందగోపాది గోపాలముఖ్యులు యాదవుల బసకువెళ్లి, ఉగ్రసేన వసుదేవాదులకు నమస్కరించారు. స్త్రీలు ద్రౌపదినీ, కృష్ణ పత్నులను కలుసుకొన్నారు. స్త్రీ పురుషులందరూ బలరామకృష్ణులను దర్శించుకొన్నారు. ఆ వచ్చిన వారందరూ, ఉగ్రసేనునితో శ్రీకృష్ణుని గురించి ఇలాగ ముచ్చటించుకొనేవారు: "ఏ మహాత్ముని పాదస్పర్శను పొందిన భూమి పుణ్యక్షేత్రం అవుతుందో, ఏ మహాత్ముని వేదాలూ, యోగులూ, పద్మాసనుడు కూడా సంపూర్ణంగా వర్ణింపలేరో, ఏ మహాత్ముని పాదాలను కడిగిన జలము పవిత్రగంగ అవుతుందో, సనక సనందాదులు సతతమూ ఏ మహాత్ముని దర్శింపగోరి దర్శించలేరో, ఏ మహాత్ముని మంగళమూర్తియైన ఆ శ్రీకృష్ణుని మీరందరూ (ఉగ్రసేనాది యాదవులు) రేయింబవళ్లూ దర్శించగలుగుతున్నారు. ఎంత ధన్యులో! పూర్వజన్మలలో నెంత తపస్సు చేసియుంటిరో, కదా! మీకు శ్రీకృష్ణునితో బంధుత్వ, మిత్రత్వ, భాగ్యము ఎలాగ కలిగినదో!" అని అనేవారు.

నందయశోదలు, గోపాలురూ, గోపికలు కలసి, శ్రీకృష్ణదర్శనకాంక్షతో ఎంతో ఉత్సాహంగా వచ్చారు. యాదవప్రముఖులు వారికి ఎదురుగావెళ్లి ఆదరంతో స్వాగతం పలికారు. వసుదేవుడు మహానందముతో వారిని సత్కరించాడు. బలరామకృష్ణులు నందయశోదలకు నమస్కరించగా, వారి ఆనందబాష్పాలు కట్టలు తెంచుకొని ప్రవహించాయి. యశోదమ్మ బలరామకృష్ణులను తన ఒడిలో కూర్చుండబెట్టుకొని, గుండెలకు హత్తుకొని, ముద్దాడినది. చాలా సంవత్సరాలకు చూచుకొన్నందుకు మురిసిపోయినది. దేవకీదేవి, రోహిణి, యశోదాదేవిని ప్రేమతో కౌగిలించుకొన్నారు. యశోదానందులు చూపిన బంధుప్రేమకు, చేసిన సత్కారములకూ వేనోళ్లకొనియాడారు: "సోదరీ! పుట్టినప్పటినుంచి బలరామకృష్ణులను మీరు కంటికి రెప్పలాగ కాపాడుతూ, అపారమైన ప్రేమానురాగాలతో పెంచి పెద్దచేశారు. అందుకే వాళ్లు మిమ్మల్నే జననీ జనకులుగా ప్రేమిస్తున్నారు. మీరెంత అదృష్టవంతులమ్మా!" అని ఆప్యాయంగా ప్రశంసించారు.

గోపవనితలు శ్రీకృష్ణుని రెప్పలార్పకుండా చూస్తూ ఆ జగన్మోహనరూపాన్ని హృదయంలో ముద్రించుకొని, బ్రహ్మసాక్షాత్కారము పొంది పరవశించిపోయిన యోగులవలె సమ్మోహితలైయుండిపోయారు. వారి మనోగతాన్ని గ్రహించిన మాధవుడు వారిని నేరుగానున్న స్థలానికి తీసుకుకొనివెళ్లి, వాళ్లకుశలమడిగి ఇలా అన్నాడు: "సుందరీమణులారా! నేను మీనుండి వెళ్లిపోయి, మళ్లీమీవద్దకు రానందుకు మీరు బాధపడుతుంటారని నాకు తెలుసు. ఉద్ధవుడు, అన్నగారు కూడ మీకు చెప్పే ఉంటారు. నేను మధుర వెళ్లిన నాటినుండి కొందరు దుష్టులను

శిక్షించవలసిన కార్యములోనూ, ద్వారకలో చక్కబెట్టవలసిన కొన్ని రాజరికపు పనులలోనూ ఉండిపోవలసి వచ్చినది. నేనెక్కడనున్నా మీరందరూ నా మనస్సులోనే ఉంటారు. మీహృదయాలు నా మీది ప్రేమచే తహతహ లాడుతుంటాయని నాకు తెలుసు. భగవంతునియందు అలాంటి అనన్య ప్రేమను కలిగియుండడమే భక్తి. శివ, బ్రహ్మ, సనక సనందాదుల హృదయాల్లో కూడ అంకురించని భక్తి మీలో వికసించినది. నాయందు భక్తిగల వారికి ఆనందముతోపాటు మోక్షముగూడ సులభసాధ్యమవుతుంది. మీయొక్క పూర్వ సుకృతాలవలన మీకు ఈ ఉన్నతపదము లభించినది. మీకు ఇక జన్మలుండవు. సర్వావస్థల్లోనూ, సమస్త భూతాల బహిరంతరాల్లోనూ, నేను వ్యాపించియున్నాను. నాకు స్వపర భేదాలు లేవు. నా భక్తులు నన్ను అన్ని వేళలలోనూ, అన్ని దేహాలలోనూ అంతటా చూడగలరు. కనుక వారు ఎల్లప్పుడూ నాయందే ఉంటారు. నా నుండి ఎడబాటును అనుభవించరు." అని పలికి, ఆ పరమేశ్వరుడు గోపికలందరికీ ఒక్కసారి తన ఆలింగన సుఖానుభూతిని కలిగించాడు. అప్పుడు ఆ గోపాంగనలు వివేకవతులై తమదేహాభిమానాన్ని విడిచి పెట్టారు. అచ్యుతుని అనంత గుణగణాలను ప్రస్తుతించారు. "మాకు ఇంకేమీ వద్దు, నీ పాద పద్మచింతన మా మనస్సులలో నిరంతరం నిలిచి యుండేటట్టు వరాన్నివ్వు" అని వేడుకొన్నారు. భక్తవత్సలుడు ఆ భక్తచూడామణుల అభీష్టాన్ని అనుగ్రహించాడు.

తరువాత శ్రీకృష్ణుడు ధర్మజుని సందర్శించి, అతని పాదాలకు నమస్కరించి, కుశల మడుగగా యుధిష్ఠిరుడు ఇలా అన్నాడు. "పద్మనాభా! భక్తవత్సలుడవైన నీ పాదాల నాశ్రయించిన వారు నిత్యసౌఖ్యాలతోనుంటారు కదా! సర్వలోకైక నాథా! జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలకు అతీతుడవు, సర్వవ్యాపివి. విశ్వమే నీవు, నీవే విశ్వము. ఈ విశ్వము నీయందే నిలిచియున్నది. సృష్టి స్థితిలయాలు నీ యొక్క సంకల్పాధీనాలు. నీవు అఖండ జ్ఞాన స్వరూపుడవు, యోగమాయ నీ అధీనములో నుంటుంది. పాపదూరులూ, నిత్యముక్తులూ అయిన యోగులకు నీవు గోచరిస్తావు. నీకు నేను నమస్కరిస్తున్నాను. నీరజాక్షుడవూ, నిఖిలలోకాధినాథుడవూ, నిర్వికారుడవూ, నిరతిశయ కృపాసాగరుడవూ అయిన నీకు అనేక వందనాలు." అని, ధర్మజుడు చేసిన స్తుతిని విని, అందరూ సంతోషించారు.

శ్రీకృష్ణుని అష్టమహిషులను చూచి, వారి అందచందాలను చూచి ద్రౌపదీదేవి మురిసిపోయినది. వాళ్లందరూ ఆ మహనీయుని ఏ విధంగా పొందగలిగారో తెలుసుకోవాలని అందరూ ఒక చోట కూర్చొనియుండగా, ఆమె తన కోరికను వెలిబుచ్చినది. ద్రౌపదికి ఇంత చక్కని ఆలోచన వచ్చినందుకు అందరూ సంతసించారు. రసవత్తరమైన ఆ సుందరఘట్టాన్ని ఇంకొకసారి మననం చేసుకొని అందరికీ తెలియజేసే అవకాశం వచ్చినందుకు మురిసిపోయారు. వారు ఆనాటి కన్యలుగా మానసికంగా మారిపోయి, ఆ పరమపురుషుని ఎలాగ పొందగలిగారో, ఒక్కొక్కరూ ఆనందపరవశలై వర్ణించి చెప్పారు. రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, భద్ర, మిత్రవింద, నాగ్నజితి(సత్య), లక్షణ తమతమ అనుభవాలను చెప్పారు. పదహారువేలమంది రాజకన్యల తరపున రోహిణి అనే ఆమె చెప్పినది. "మా స్వామి భగవంతుడే గనుక ఈ పదహారు వేల ఎనిమిది మంది భార్యలనందరినీ సమాన ప్రేమాదరాలతో నలరింప జేస్తూ, ఒకే సమయంలో నందరితోనుంటూ, సంసారం సాగించడం సంభవమయినది." అని చెప్పినది.

ఈ విధంగా శ్రీకృష్ణసతులు తమతమ పరిణయగాథలను చెపుతుంటే వింటున్న ద్రౌపది, కుంతి, గాంధారి, ఇతర రాజపత్నులు, గోపికలూ పరవశించిపోయి ఆనందబాష్పాలు రాల్చారు. తమతమ హృదయాల్లో ఆ దివ్యసుందర లీలామానుషరూపుని పాదపద్మాలను స్మరిస్తూ కూర్చున్నారు. పురుష సమూహాల్లో కూడ శ్రీకృష్ణుని అద్భుతలీలా గాథలనే ముచ్చటించుకొనేవారు.

బలరామకృష్ణులు శమంతపంచక క్షేత్రానికి వెళ్లియున్నారని తెలుసుకొని, వారి దర్శనం చేసుకోవాలని, వ్యాసుడు, నారదుడు, వాల్మీకి, వసిష్ఠుడు, కశ్యపుడు, మార్కండేయుడు, యాజ్ఞ్యవల్క్యుడు, ఋష్యశృంగుడు, గౌతముడు,

గార్గ్యుడు, అంగిరసుడు, అగస్త్యుడు మొదలైన అనేకమంది తాపసశ్రేష్ఠులంతా అక్కడికి వచ్చిచేరారు. శ్రీకృష్ణుడు వారికి ఎదురువెళ్ళి, నమస్కరించి, యథావిధిగా పూజలుచేసి, ఇలా అన్నాడు: "మహామునీశ్వరులారా! మీ వంటి పరమయోగీంద్రులందరి దర్శనం ఒక్కసారిగా లభించడం మా అదృష్టము. మీ దర్శనమేచాలు, వేరే పుణ్యతీర్థయాత్రల అవసరం లేదు. పుణ్యజలాలతో ఏర్పడిన తీర్థాలకంటే, మృత్తికా శిలలతో చేయబడిన విగ్రహాలకంటే, మీ వంటి మహాత్ముల దర్శనాలే శీఘ్ర ఫలితాలనిస్తాయి. సూర్య చంద్ర - ఇంద్రాది దేవతలనూ, పంచభూతాలనూ పూజించేకంటే, సర్వశాస్త్రవేత్తలూ, విజ్ఞానధనులూ అయిన మీవంటి మహనీయుల సేవచెయ్యడం శ్రేష్ఠతరము." అని ఈ విధంగా చెప్పిన శ్రీకృష్ణుని మాటలకు మహర్షులంతా విస్మయంచెంది, ఒక్క క్షణంలో తేరుకొని ఇలా అన్నారు: "దేవాదిదేవా! బ్రహ్మాది దేవతలతో సహా మేమూ ఈ ముల్లోకవాసులూ, అందరమూ నీ యొక్క మాయకు లోబడి యున్నవారము. నీ లీలా వినోదాలు ఎవ్వరికీ అంతుచిక్కవు. పరమేశ్వరుడవైన నీవు మమ్మల్ని ఇలా స్తుతిస్తున్నావంటే అది మా గొప్పతనమేమీ కాదు. మానవరూపం ధరించిన నీవు మానవాళికి తెలియజెప్పడం అని మా నమ్మకం. నీవు ఒక్కడవే అయినా అనేకంగా రూపొందుతావు. సృష్టి, స్థితి, లయ కార్యాలను రచిస్తావు. దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తావు. వర్ణాశ్రమ ధర్మాలను పాటిస్తావు. నిగూఢమైన వేదరహస్యాలను స్పష్టపరుచుతావు. దేవజ్ఞానాన్ని తమలో పదిలపరచుకొని, ముందు తరాలవారికి అందించే మునులనూ, బ్రాహ్మణులనూ ప్రత్యేకంగా అభిమానిస్తావు. వేదాలలో నివసించేవాడవు, వేదస్వరూపుడవు. పరబ్రహ్మవు. మాయ అనే అడ్డుతెర చాటున నున్నమేము మా చక్షువులతో నీయొక్క మానవరూపాన్నే తిలకిస్తున్నా, నీ యొక్క పరబ్రహ్మస్వరూపాన్ని మా బుద్ధికి గోచరింపజేసిన మాయొక్క విద్య, సాధన, జన్మమూ సార్థకమైనవి. నీకు మా ప్రణామాలను అర్పిస్తున్నాము." అని, అనేక విధాల స్తుతించి, ఆశీస్సులనుపొంది, నిష్క్రమిస్తున్న ఋషులతో వసుదేవుడిలా అన్నాడు: "మునిశ్రేష్ఠులారా! పూర్వజన్మల కర్మలను ఎలాంటి సత్కర్మల నాచరించి పోగొట్టుకొనవచ్చునో సెలవివ్వవలసినదిగా ప్రార్థిస్తున్నాను." అని కోరగా, ఆ మునీశ్వరులు ఇలాగ అనుకొన్నారు: "ఈ వసుదేవుడు ఎంతటి అవివేకియో కదా! సాక్షాత్తూ పరమేశ్వరుడే తన పుత్రుడై తన ఎదుటనే ఉండగా, ఆయనను సేవించి తరించకుండా, మాయలోపడి ఆయనను తన పుత్రునిగానే భావించి, ఇతరత్రా మోక్షమార్గాలను అన్వేషిస్తున్నాడు పాపం!" అనుకొని, అతనితో ఇలా అన్నారు: "వసుదేవా! మోక్షకామి మొదట మూడు ఋణాలను తీర్చుకోవాలి: యజ్ఞయాగాలుచేసి దేవఋణాన్నీ, వేదశాస్త్రాధ్యయనం ద్వారా ఋషిఋణాన్నీ, శ్రాద్ధతర్పణములు చేసే పుత్రులను కని పితృఋణాన్నీ తీర్చుకోవాలి. నీవు ఇంకా దేవఋణాన్ని తీర్చుకోవలసియున్నది. సర్వయజ్ఞాలకూ అధిదైవమైన శ్రీమన్నారాయణుని గూర్చి యాగముచేసి, దేవఋణము తీర్చుకొనుము. శుద్ధవర్తనముచే ఆర్జించిన ధనమును యజ్ఞదానకర్మలలో వెచ్చించి విత్తేషణను తగ్గించుకోవాలి. భగవదనుగ్రహముచే లభించిన గృహస్థోచిత భోగాలను భగవదర్పితంగా అనుభవించి, దార, సుతేషణలను విడవాలి. స్వర్గలోకముకూడ అశాశ్వతమైనదే అనే ఎరుకలో లోకేషణను విడనాడాలి. లౌకిక వ్యాపారాలయందు నిస్సంగత్వం అలవరచుకోవాలి. శ్రీమన్నారాయణుడే శ్రీకృష్ణుడై అవతరించాడు గనుక ఆయన గురించి నీవు యజ్ఞముచేసి దేవ ఋణాన్ని తీర్చుకొనుము." అని చెప్పగా వసుదేవుడు యజ్ఞంచేయ నిశ్చయించుకొని, ఆ మునీశ్వరులను మీరే ఋత్విజులుగానుండి నిర్వహింపుడని ప్రార్థించాడు.

శమంతపంచక తీర్థంలో వసుదేవుడు భార్యలతో సహాదీక్ష పూనాడు. యాగం చేశాడు. యజ్ఞంశాస్త్రోక్తంగా సమాప్తమయినది. అవభృథ స్నానంచేసి ఋత్విక్కులకు, మునులకు, బ్రాహ్మణులకు, అతిథులకు, బంధువులకు ఘనసత్కారాలుచేసి సంతృప్తిపరచాడు. యాగసందర్శకులంతా వెళ్ళిపోయారు.

ఉగ్రసేనుడు, వసుదేవుడు, బలరామకృష్ణులు బలవంతంచేసి, నందయశోదా గోపీగోపకులను, ఇంకకొన్నాళ్లు అక్కడే ఉంచివేశారు. నందాది గోకులవాసులు తమ ప్రియతముడైన కృష్ణయ్యతో ప్రియాలాపాలతో, మధురప్రసంగాలతో,

మనోహరలీలా వినోదాలతో అక్కడ ఆనందంగా మూడునెలలు గడపివేశారు. ఇక విడిపోవలసిన రోజు వచ్చినది. ముకుందచరణారవింద మకరంద పానముతో మత్తిల్లిన చిత్తాలను మరలించలేక, ముందుకుపోలేక, వెనక్కుచూసుకొంటూ ఎలాగో నెమ్మదిగా సాగిపోయారు.

వర్షకాల సూచనలు కనిపించగానే బలరామకృష్ణాది యాదవులందరూ ద్వారకకు తిరుగు ప్రయాణమయ్యారు.

## దేవకీపుత్రులు

ఒకనాడు బలరామకృష్ణులు తమ తలిదండ్రులైన దేవకీవసుదేవులతో ఇష్టాగోష్ఠిలోనుండగా శమంతపంచకంలో శ్రీకృష్ణుని గురించి మునులు చెప్పిన మాటలు గుర్తునకువచ్చి వసుదేవుడిలా అన్నాడు: "నాయనలారా! మీరు మమ్మల్ని తరింపజెయ్యడానికి మా బిడ్డలుగా పుట్టిన సంకర్షణ వాసుదేవులు కదా! ఈ జగత్తుకు కారణమైన వారు. సృష్టి స్థితి లయాలను నియమించే ప్రభువులు. భూభారాన్ని తగ్గించాలనే దివ్యసంకల్పంతో దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడానికి ఈ భూమిపైన అవతరించిన వారు మీరు. కృష్ణా! నీవు పుట్టిన నాడే నాకు నీ నిజరూపాన్ని చూపించినా, నీ యొక్క మాయచేత అజ్ఞానంలో పడి నీవు నా పుత్రుడవే అనే భ్రమలోనుండేవాడను. ప్రభూ! నన్ను ఈ మాయామోహ రూపమైన సంసారం నుండి ఉద్ధరించు". అని కోరిన తండ్రితో శ్రీకృష్ణుడు తన పరమాత్మ తత్త్వాన్ని గుప్తముగా నుంచదలచుకొని మరుగు పరచుతూ, వినయంగా నమస్కరిస్తూ, ఇలాగ సర్దిచెప్పాడు: "తండ్రీ! సత్య మేమిటంటే మీరూ, అన్నయ్యా, నేనూ, ద్వారకావాసులూ, ఈ చరాచర విశ్వమంతా ఆ పరమాత్మయొక్క అంశయే. పరమాత్మ ఒక్కడే. ఆ పరమాత్మ చేతనే సర్వమూ నడిపింపబడుతున్నది. ఆ పరమాత్మనుండే సర్వమూ ఆవిర్భవించినది. మనకూ పరమాత్మకూ భిన్నత్వంలేదు." అని వేదాంత సూక్ష్మాన్ని చెప్పగా వసుదేవుని భేదభావము తొలగినది.

పూర్వము బలరామకృష్ణులు, తమ గురువైన సాందీపనియొక్క కుమారుని యముని వద్దనుండి తీసుకొనివచ్చి గురుపత్నియొక్కపుత్ర శోకాన్ని బాపిన ఉదంతాన్ని వినియున్న దేవకీదేవిలో మాతృమనుకారం పెల్లుబికినది. భగవదంశసంభూతులైన తన బలరామ కృష్ణులు కంసునిచే చంపబడిన తమయొక్క ఆరుగురు సుతులను తప్పకుండా తీసుకొని రాగలరనే ఆశతో ఆమె ఒకనాడు బలరామ కృష్ణులతో ఇలా అన్నది. "నాయనలారా! పాపాత్ములైన కంస, శిశుపాల, పౌండ్రక, నరక, జరాసంధ, కాలయవనాది దుష్టులను తొలగించి భూభారాన్ని బాపిన అసమాన శక్తి సంపన్నులు మీరు. సృష్టి స్థితి లయాలను నియమించే ప్రభువులు మీరు. మృతుడైన గురు పుత్రుని యముని వద్దనుండి తెచ్చి గురుదక్షిణగా సమర్పించిన అద్భుత వ్యక్తులు మీరు. మీరు చేయజాలని దేమీ ఉండదు, కనుక నేనొక కోరికను కోరదలచుకొన్నాను. తప్పకుండా తీర్చగలరని ఆశిస్తున్నాను. కంసునిచే చంపబడిన మీయొక్క ఆరుగురు అన్నలనూ తీసుకొనివచ్చి, నా పుత్రశోకాన్ని నివారించండి." అని చెప్పిన తల్లియొక్క కోర్కెను తీర్చదలచుకొని, రామకృష్ణులు సుతల లోకానికి వెళ్లారు. సుతల లోకాధిపతి అయిన బలిచక్రవర్తి స్వామిరాకను తెలుసుకొని, పరమానంద భరితుడై తన ఆప్తులతో సహా ఎదురుగావెళ్లి, స్వాగతం పలికి, పాదాభివందనం చేసి, ఉచిత ఆసనాలపై కూర్చుండబెట్టి, పాదాలు కడిగి, ఆ జలాన్ని శిరస్సుపై జల్లుకొన్నాడు. నైవేద్యాలు ఆరగింపు అయిన తరువాత శ్రీకృష్ణుని పాదాలు ఒత్తుతూ ఆనందబాష్పాలు రాల్చుతూ ఆ దానవేంద్రుడు శ్రీహరిని ఇలా స్తుతించాడు:

**ఉ॥ ధీయుతుడై 'నమో భగవతే హరయే పరమాత్మనే ముకుం**
**దాయ, సమస్తభక్తవరదాయ, నమఃపురుషోత్తమాయ కృ**
**ష్ణాయ, మునీంద్రవంద్యచరణాయ, సురారిహరాయ సాంఖ్య యో**
**గాయ, వినీలభాస్వదలకాయ రథాంగధరాయవేధసే' 1145**

పద్మలోచనా! సదాశివ బ్రహ్మ - ఇంద్రాదులకూ, యోగిపుంగవులకు సైతమూ నీ యొక్క నిజతత్త్వము పూర్తిగా తెలియదు కదా! తామసజన్ములమైన మావంటి దానవులకు ఎలా అంతుచిక్కుతుంది? అయిననూ దానవ, మానవ, జంతు, జీవభేదము లేకుండా నీయందు నిరంతరం చిత్తాన్ని నిలిపే వారిని తరింపజేస్తావు. భక్తిచేగాని, ప్రేమచేగాని, సఖ్యముచేగాని, శత్రుత్వముచేగాని నీ గురించి చింతిస్తేచాలు ధన్యులవుతారు. దేవా! నేను నీ పాదదాసుడను. నీ అపారకరుణాకటాక్షానికి పాత్రుడనయ్యాను, నీవు నా ఇంటికి విచ్చేశావు. బ్రహ్మాదులకు కూడ లభించని ఈ భాగ్యాన్ని నాకు ప్రసాదించావు. ధన్యుడనయ్యాను." అని చేతులు జోడించి, ఈ దాసుని వలన కాగలకార్యాన్ని సెలవిమ్మన్నాడు. శ్రీకృష్ణుడు సంతోషించి, ఇలా అన్నాడు: "బలిదైత్యేంద్రా! పూర్వము ఆదియుగంలో మరీచి ప్రజాపతీ వర్ణలకు ఆరుగురు పుత్రులు కలిగారు. బ్రహ్మదేవుడు తనచే సృష్టింపబడిన (తనకు కూతురు అనదగిన) సరస్వతిని మోహించాడు. దానికి మరీచి పుత్రులు ఆక్షేపణగా నవ్వారు. బ్రహ్మకు కోపమువచ్చి, మీరు రాక్షసులై పుడతారు అనిశపించాడు. వాళ్లు హిరణ్యకశిపుని పుత్రులుగా పుడుతుంటే ఒక్కొక్కరినీ, యోగమాయ హరించివేసి, తరువాత దేవకీ గర్భములో ప్రవేశపెట్టేది. వాళ్లు దేవకీ పుత్రులై జన్మించి, కంసునిచే చంపబడి, నీ లోకంలో సుఖంగానున్నారు. దేవకీ దేవి పుత్రశోకంతో కుమిలిపోతున్నది. వీళ్లను చూడాలని అంటున్నది. నీ వద్దనున్న ఈ ఆరుగురినీ తీసుకొనివెళ్లి, ఆమెశోకాన్ని తొలగించాలి. అంతటితో వీరుకూడ శాపవిముక్తులౌతారు." అని చెప్పగా బలిచక్రవర్తి ఆ ఆరుగురినీ శ్రీకృష్ణునకు ఒప్పజెప్పాడు. శ్రీకృష్ణుడు బలరామునితోనూ, ఇతర సోదరులైన స్మర, ఉద్గీథ, పరిష్వంగ, పతంగ, క్షుద్రభృత్, ఘృణి అనువారితోనూ ద్వారకకు మరలి వచ్చి, ఆ ఆరుగురినీ దేవకీదేవికి అప్పగించాడు. ఆ మాతృమూర్తి పట్టరాని ఆనందంతో పరవశించిపోయినది. పుత్రవాత్సల్యం పొంగిపొరలగా, స్తన్యము ఉప్పొంగగా ఆనందబాష్పాలతో వారిని కౌగలించుకొని, ఒడిలో కూర్చుండబెట్టుకొని, శిరస్సులు ఆఘ్రాణించి, ప్రేమతో పాలిచ్చినది. శ్రీకృష్ణుని మాయాప్రభావముచే వారు పాలుత్రాగారు. శ్రీకృష్ణ స్పర్శచే వారి పాపాలు, శాపాలు తొలగిపోయాయి. వారు నిజరూపాలను పొంది, దేవతలై దేవకీవసుదేవులకు శ్రీకృష్ణ బలరాములకు నమస్కరించి, అందరూ చూస్తుండగానే దేవలోకానికి వెళ్లిపోయారు. దేవకీదేవియొక్క శోకమూ, పుత్రవ్యామోహమూ అదృశ్యమైనవి. ఎప్పుడో మరణించిన బిడ్డలను తీసుకొనిరావడం, వారి శాపాన్ని తొలగించడం శ్రీకృష్ణుని యొక్క మహత్త్వమూ మున్నగు దివ్య శక్తులకు అందరూ ఆశ్చర్యపోయారు. దేవకీదేవి ఆ దేవదేవునకు హృదయపూర్వకంగా నమస్కరించినది.

## సుభద్రార్జునులు

సుభద్రార్జునుల పరిణయం గురించి వినదలచిన పరీక్షిత్తుతో శ్రీశుకుడు ఇలాగ చెప్పాడు:

తీర్థయాత్రలు చేస్తూ, అర్జునుడు ప్రభాసతీర్థం చేరుకొన్నాడు. అతనికి బలరామ కృష్ణుల చెల్లెలైన సుభద్రపైన చిన్నప్పటినుండీ ప్రీతి ఉండేది. ద్వారకకువెళ్లి ఆమెను చూడాలని అతని మనస్సు తహతహ లాడినది. ఆమెను దుర్యోధనునికిచ్చి వివాహం చెయ్యాలని బలరాముడు పట్టుబట్టాడని తెలిసి, అర్జునునకు ఆమెపై కోరిక మరింత బలపడినది. ఆమెనెలాగైనా తనదానిగా చేసుకోవాలని నిశ్చయించుకొని, ఒక సన్న్యాసి వేషం వేసుకొని ద్వారకలో ప్రవేశించాడు. అతడు చాతుర్మాస్యం అక్కడే పాలించదలచుకొన్నట్లు ప్రజలకు తెలియజేశాడు. పౌరులు అతనిని భక్తిశ్రద్ధలతో సేవిస్తుండగా, బలరాముడతన్ని తమ గృహ ప్రాంగణంలోని ఉద్యానవనంలో నుండేటట్లు ఏర్పాటుచేసి, అతనికి కావలసిన వసతులు చేకూర్చడానికి చెల్లెలు సుభద్రను నియోగించాడు. తన ఎదుటనే సంచరిస్తూ, సేవలు చేస్తున్న తన మనోహారిణి అయిన సుభద్రను చూస్తూ కపటసన్న్యాసియైన అర్జునుడు ఆమెయొక్క సుందర సుకుమార వయోరూప విలాస లావణ్యాలకు ముగ్ధుడై మన్మథ బాణాఘాత పీడితుడయ్యాడు. ఆ అర్జునుని చూచిన సుభద్రకూడ విశాలయశోవిరాజితుడూ, విమల హృదయుడూ, మానినీ మనోహరుడూ అయిన ఆ

సుందరునియందు ప్రణయభావాలు చెలరేగగా, సిగ్గూ, మోహమూ మురిపెమూ ఎక్కువ కాగా పరవశించిపోయినది. వారిద్దరి పరస్పర ప్రేమావేశాలూ, అభిలాషలూ, అనురాగాలూ అతిశయించాయి. ఈ కపటసన్న్యాసి ఎవ్వడో, ఎందుకు వచ్చాడో శ్రీకృష్ణుడు మొదట్లోనే గ్రహించి, తన ప్రియసోదరికి దుర్యోధనుని కంటే అర్జునుడే అన్ని విధాలా తగిన వరుడని భావించియున్నవాడు. ఏమీ తెలియనివానివలె ఊరుకొన్నాడు.

ఒకనాడు ఒక దేవతా మహోత్సవానికి సుభద్ర రాజప్రాసాదానికి వెలుపలకు వెళ్లినది. అర్జునుడు శ్రీకృష్ణునితోనూ, దేవకీ వసుదేవులతోనూ చెప్పి, వారి అనుమతినిపొంది, సుభద్రను అనుసరించాడు. శరత్కాల పున్నమి రాత్రిలోని చంద్రునిలాగ చంద్రమండలంనుండి దిగివచ్చిన లేడిపిల్లలాగ, మేఘమండలాన్ని విడిచివచ్చిన మెరుపుతీగెలాగ, నవరత్నాలు పొదగబడిన అపరంజి బొమ్మలాగ, మూర్తీభవించిన శృంగార రస శోభితయైన అప్సరసలాగ ఉన్న ఆ సుభద్రాకన్యను, అర్జునుడు రథంమీద ఎక్కించుకొని వెళ్లిపోతుంటే, యాదవవీరులు ఎదిరించారు. వారిని ఓడించి, ఆమెను ఇంద్రప్రస్థం తీసుకొనివెళ్లి పోయాడు. ఈ వార్త విని బలరాముడు తీవ్రమైన అవమానము, ఆగ్రహము, ఆవేశాలతో మండిపడ్డాడు. పాండవుల అంతుచూస్తానన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు, ఇతర ఆత్మీయులూ అతని పాదాలపైపడి, తొందరపడవద్దని బ్రతిమిలాడారు. శ్రీకృష్ణుడు సముదాయిస్తూ నచ్చజెప్పాడు: "సోదరా! అర్జునుడు పరాయివాడేమీ కాడు, మన మేనత్త కొడుకే. సాటిలేని విలుకాడు, వీరుడు. అందగాడు కూడాను. ఒక మహావీరుని సోదరి, ఇంకొక మహావీరుని వివాహమాడడం సమంజసమే కదా! మన ప్రియసోదరి కూడ అతనిని మనసారా కోరుకొన్నట్లున్నది. అందుచేత మనం వారి వివాహానికి ఆశీస్సులనివ్వడం అందరికీ శ్రేయస్కరం". అని చెప్పగా బలభద్రుడు శాంతించాడు. చెల్లెలికి అనేకమైన కానుకలను పంపించాడు.

## మిథిలలోని ఇద్దరు భక్తులు

మిథిలానగరంలో శ్రుతదేవుడనే సద్బ్రాహ్మణుడుండేవాడు. అతడు హరిభక్తుడు, నిర్మల చరిత్రుడు, శాంత స్వభావుడు. తనకు ప్రాప్తించినది ఎంత స్వల్పమైనదైనా మేరు పర్వతం లభించినంతగా సంతోషించి, తన విధ్యుక్త ధర్మాలను నిర్వహిస్తూ గృహస్థ జీవనం గడిపేవాడు.

ఆ విదేహదేశానికి బహుళాశ్వుడనే నామాంతరంగల జనకుడు రాజుగానుండెను. అతడు నిర్మలచరిత్రుడు. ధర్మనిరతితో పరిపాలిస్తుండేవాడు. వీరిద్దరిపైనా శ్రీకృష్ణునకు అనుగ్రహం కలిగినది. వారిని చూడాలని మిథిలకు ప్రయాణమై, తనతోపాటు అత్రి, వామదేవ, అసిత, అరుణ, కణ్వ, మైత్రేయ, బృహస్పతి, చ్యవన మొదలైన మహామునులను తీసుకొని వెళ్లాడు. నేను (శుకుడు) కూడ వారితో నుంటిని. శ్రీకృష్ణుడు వస్తున్నట్లు తెలుసుకొని, బహుళాశ్వుడూ, శ్రుతదేవుడూ మిథిలానగరవాసులూ ఆహ్వానించడానికి ఎదురుగావచ్చారు. శ్రీకృష్ణునీ, మునీశ్వరులనూ అనేక ఉపచారాలతో పూజించారు. రాజైన బహుళాశ్వుడు, శ్రుతదేవుడూ ఇద్దరూ శ్రీకృష్ణునీ మునీశ్వరులనూ తమ గృహాలకు విచ్చేయుమని ప్రార్థించారు. శ్రీకృష్ణుడు సంతసించి, వారి అభీష్టాన్ని నెరవేర్చాలనుకొన్నాడు. ఒకే సమయంలో ఒకరికి తెలియకుండా వేరొకరి ఇంటికి మునులతోపాటు వెళ్లాడు.

బహుళాశ్వుడు శ్రీకృష్ణునీ, మునులనూ కనక సింహాసనాలపై కూర్చుండబెట్టాడు. పాదాలను కడిగి ఆ జలాన్ని అతడూ అతని భార్య శిరస్సున చల్లుకొన్నారు. అందరినీ శాస్త్రోక్తంగా పూజించాడు. షడ్రసోపేతమైన భోజనాదులను పెట్టించాడు. స్వామిపాదాలను తన ఒడిలో పెట్టుకొని మెత్తగా నొత్తుతూ ఇలా అన్నాడు: "పురుషోత్తమా! సమస్త జీవులలో సాక్షిభూతుడవై వెలసియున్న నీకు నీభక్తులే బ్రహ్మరుద్రులుకంటే సన్నిహితులు అనే సత్యాన్ని నిరూపించడానికి ఈ దీనుని ఇంటికి విచ్చేశావు కదా! ఆహా! నాది, ఎంతటి అదృష్టము?

తే॥ కృష్ణ పరమాత్మ యదుకుల క్షీరవార్ధిపూర్ణచంద్రమ! దేవకీపుత్ర సుజన
వినుత! నారాయణాచ్యుత వేదవేద్య భక్తజనపోష పరితోష పరమపురుష 1187

ఓ పురుషోత్తమా! నందకిశోరా! భక్తరక్షణపరాయణా! నీవూ, ఈ ముని శ్రేష్ఠులూ కొన్నాళ్లు ఇక్కడే ఉండాలని నా విన్నపము" అని ప్రార్థించగా, శ్రీకృష్ణుడూ, ఆ మునివర్యులూ ఆ మిథిలానగరవాసులను తరింపజేయడానికి కొన్నాళ్లుండదలచుకొన్నారు.

ఇక్కడ శ్రుతదేవునింట స్వామి ఋషీశ్వరులతో అదే సమయానికి విచ్చేశాడు. శ్రుతదేవుడు, అతని భార్య, శ్రీకృష్ణునకు, ఋషులకూ పాదాలు కడిగి, దర్భాసనాలిచ్చి సకలపూజలు చేశారు. పత్రపుష్పఫలజలాలను సమర్పించారు. "విశ్వానికే మూలకారణమైన శ్రీకృష్ణుడు నా యింట ఆతిథ్యం స్వీకరించాడు. నా జన్మ తరించినది." అనుకొంటూ శ్రుతదేవుడు ఉత్తరీయాన్ని జాడించుకొంటూ పరవశుడై గంతులువేశాడు. అతడు తన భార్యాపుత్రులతో కలసి స్వామిని స్తుతించాడు. శ్రీకృష్ణుని పాదాలను తన ఒడిలో పెట్టుకొని, ఒత్తుతూ, ఆనందబాష్పాలు రాల్చుతూ ఇలా అన్నాడు: "ఓ సర్వాంతర్యామీ! యోగీంద్రుల చిత్తములలో నివసించు నీ దివ్యమంగళస్వరూపము నా ఇంట ప్రత్యక్షముకావడం నా భాగ్యమే కదా! వాసుదేవా! నీ దివ్య గాథలనువింటూ, నిన్ను పూజిస్తూ, నీ దివ్యనామం జపిస్తూ, నీకు ఆత్మార్పణం చేసుకొన్న భక్తుల హృదయాలలో నీవు దర్శనమిస్తావు. వేదవేద్యా! నీకు వందనాలు. నీసేవ ఎలాగ చేస్తే నీకు సంతోషకరమో నాకు ఆనతిమ్ము." అనిన బ్రాహ్మణుని వాక్కులకు సంతోషించిన వాడైన శ్రీకృష్ణుడు ఇలాగ చెప్పాడు: "ఓ భూసురోత్తమా! తపోధనులైన ఈ మునిశ్రేష్ఠులు తమ పాదధూళితో లోకాలను పవిత్రంచేస్తారు. వారు నాతో పాటు తాము కోరిన చోటికి వస్తుంటారు. నీ అదృష్టము పండి, నేడు నావెంట నీఇంటికి విచ్చేశారు. పుణ్యస్థలాలూ, బ్రాహ్మణులూ, దేవతల యొక్క దర్శన స్పర్శన అర్చనల ద్వారా ప్రాణులు తమతమ పాపాలను పోగొట్టుకొంటారు. బ్రాహ్మణుడు, అధ్యయన, జప, తపో ధ్యానాదుల వలన పునీతుడై ప్రకాశిస్తుంటాడు గనుక గొప్ప వానిగా పూజింపబడుతాడు. నాకు బ్రాహ్మణులంటే చాలా అభిమానము. వారిని పూజిస్తే నన్ను ఎక్కువగా పూజించినట్లు భావించి సంతోషిస్తాను." అని చెప్పాడు. శ్రుతదేవుడు మునీశ్వరులను మిక్కిలి శ్రద్ధతో పూజించాడు.

శ్రీకృష్ణుడు బహుళాశ్వునకు, శ్రుతదేవునకు సకలశుభాలూ ప్రసాదించి, మునులతో సహా నిష్క్రమించాడు.

## శ్రుతి గీతలు

పరీక్షిత్తు మహారాజునకు శ్రీశుకయోగీంద్రుడిలా చెప్పాడు: సర్వాంతర్యామియైన భగవంతుడు సమస్త చేతన జీవరాసులకు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. వేదాలు ఆయనయొక్క స్వరూప, గుణ వైభవాలను ప్రస్తుతిస్తుంటాయి. ఈ శ్రుతి స్తోత్రాలు ఉపనిషత్తులతో సమానమైనట్టివి, కనుక వీటిని శ్రద్ధాభక్తులతో అనుసంధిస్తే, మోక్షము సులభతరం అవుతుంది.

కల్పాంతములో ప్రళయం సంభవించినప్పుడు సమస్త (ప్రకృతి) సృష్టియు, జీవులతో సహా సూక్ష్మరూపంలో పరమాత్మలో లయించిపోతుంది. మళ్లీ కల్పాదియందు పరమేశ్వరుని యొక్క నిశ్వాసలే, వేదరూపములో వెలికి వచ్చి, ప్రాణులుగా మూర్తీభవించుతాయి. యోగనిద్రలో రమిస్తున్న పరమేశ్వరుని యొక్క యథార్థతత్త్వాన్ని వివరిస్తూ ఆశ్రుతులు స్తుతిస్తాయి. ఈ వేదస్తుతినే పూర్వము ఒక బ్రహ్మసత్రములో శ్వేతద్వీపవాసులైన మునులు తెలుసుకొనగోరగా, సనందనముని వారికి చెప్పాడు. దానిని బదరికాశ్రమంలో నారాయణఋషి నారదమహర్షికి చెప్పగా, అతడు నా తండ్రి అయిన వేదవ్యాసునకు చెప్పాడు. అతని నుండి నేను విని, నీకు చెప్తున్నాను. వేదాలు భగవంతుని ఇలా స్తుతించాయి.

"ఓ పరమేశ్వరా! జయము, జయము. నీవు సకల జీవులకూ జ్ఞానాన్ని ప్రసాదించి, వాటిలో నాత్మవైయుంటూ, కార్యకారణాత్మకుడవై వర్తిస్తావు. నీలోనే సకల వేదాలూ ప్రవర్తిస్తాయి. నానావిధవిషయవస్తు సముదాయంతో నిండియున్న ఈ ప్రపంచమంతా బ్రహ్మ స్వరూపంగానే యోగీశ్వరులు భావిస్తారు. అవి అన్నీ ప్రళయకాలంలో నీయందే లయించి, నీవు ఒక్కడవే మిగిలియుంటావు. ఈ సమస్త విశ్వానికీ కారణభూతుడవైన నీవల్లనే సృష్టి స్థితి లయాలు సంభవిస్తాయి. జన్మించడమే పతన కారణమని తెలుసుకొన్న జ్ఞానులు త్రికరణశుద్ధిగా నిన్నే సేవిస్తే కృతార్థులౌతారు. అజ్ఞానులకు నిలయమైయుండి, నశించే ఈ ప్రపంచంలో సంభవించే పాపాలను నివారించగలిగే ఏకైక సాధనము నీ యొక్క దివ్యగాథా శ్రవణమే, అని జ్ఞానులు గ్రహించి, నీయొక్క చరితామృతాన్నే గ్రోలుతూ ధన్యులవుతారు. నిన్ను సేవించే వారికి జరామరణ సంసారతాపం తొలగిపోతుంది. ఇహపరసౌఖ్యాలు సిద్ధిస్తాయి. నిన్ను సేవించలేని అజ్ఞానులు శరీరంమీద మమకారం పెంచుకొని, ఆదేహాన్నే ఆత్మగా పూజిస్తారు. నీవు అన్ని శరీరాల్లోనూ, అంతర్యామివైయున్నా ఆయా శరీరధారుల యొక్క పాపపుణ్యాలు నీకు సోకవు. నిష్కాములై ఫలాపేక్షలేక, రజోగుణ తమోగుణాలనువీడి, నిన్ను సేవిస్తూ, నీపాదపద్మాలను ధ్యానిస్తూ, మహాత్ములు భవరోగంనుండి విముక్తులవుతారు. నీ దివ్య చరితామృతాన్ని ఆస్వాదిస్తూ, వారు మోక్షాన్ని కూడ కోరరు. జితేంద్రియులూ శాంతమూర్తులూ అయిన యోగులేకాక, నిన్ను ప్రేమతో ఆరాధించిన వారు, భక్తితో కొలిచినవారు, శత్రుభావంతో నిన్ను స్మరించే వారుకూడా నీ యొక్క అపారకృపకు సమానంగా పాత్రులే కదా! అచ్యుతా! నీ యొక్క నిజస్వరూపాన్ని చూడడానికి ఎవ్వరికీ సాధ్యంకాదు. బ్రహ్మాదిదేవతలు కూడ నిన్ను తెలుసుకొనలేరు. నీవు భక్తశాస్త్రగోచరుడవుగా కుతర్క వాదులకు అగోచరుడవు సకలచరాచర ప్రపంచమందంతటనూ, అన్నింటనూ వ్యాపించియున్న నిన్ను పరమయోగులు, ఏకైక పరబ్రహ్మముగానే తెలుసుకొంటారు. ఓ పరమాత్మా! నిన్ను భక్తితో కొలువని మూఢులు నామరూపగుణ కర్మల సంసారంలోనే పరిభ్రమిస్తుంటారు. నీవు భక్తులపాలిట పారిజాతానివి. మనస్సు నిగ్రహించుకొనలేని వాడు నిన్ను తెలుసుకొనలేడు. గురువును సేవించని వారు నడిపేవాడులేని నావలాగ గమ్యంతెలియక కొట్టుకొంటారు. సతీసుతులమీద, గృహక్షేత్రాలమీద అనురక్తిని పెంచుకొన్నవాడు సంసారసాగరాన్ని ఎన్నటికీ దాటలేడు. భాగవతోత్తములు, పుణ్యవర్తనులు, తీర్థసదృశులు నిన్ను నిరంతరమూ సేవిస్తూ, సమచిత్తులై, సంతుష్టులై సంగముక్తులైనట్టి పరమభాగవతులను సేవించువాడు, ఆనందమయుడై మోక్షపదవికి యోగ్యుడౌతాడు. ఓ పరమేశ్వరా! నీవు "ఇట్టివాడవు" అని చెప్పడానికి సాధ్యము కాదు కనుక మేము (శ్రుతులము) కూడ "బ్రహ్మము ఇదికాదు" అని తెలిసిన వాటితో పోల్చిచూపిస్తాము. నీతో పోల్చదగినదేదీ ఈ సృష్టిలోలేదుకదా! సర్వాంతర్యామివైన నీవు పరిశుద్ధాంతఃకరణం గలవారి హృదయకమలాలలోనే ప్రకాశిస్తుంటావు." అని శ్రుతులు స్తుతించినవి అని, సనందనుడు మునులకు చెప్పినట్లు నారదుడు చెప్పాడు.

ఈ నారాయణోపాఖ్యానము సకల వేదశాస్త్ర పురాణసారము. ఉపనిషత్తులకు సమానము. దీనిని పఠించినా, వినినా పాపాలు నశించి, ఇహపరసౌఖ్యాలు కలుగుతాయి అని శ్రీశుకుడు చెప్పాడు.

## విష్ణువే సర్వోత్తముడు

శివుని సేవించేవారు శీఘ్రమే సుఖసంపదలను పొందగలరు, కాని లక్ష్మీపతి అయిన విష్ణువును ఆశ్రయించినవారు నిరుపేదలుగా, చాలా కష్టాలు పడుతుండడం కనిపిస్తుంది, ఎందుచేత? అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శ్రీశుకుడిలా చెప్పాడు: "రాజా! శివుడు, సత్త్వరజ స్తమో గుణ సహితుడే అయినప్పటికీ, సర్వ సుఖ భోగాలనూ త్యజించి, కఠినమైన జీవన విధానాన్ని ఎన్నుకొనియున్నప్పటికీ, ఆశుతోషుడు (అల్పసంతోషి), భోలాశంకరుడు గనుక భక్తులకు సులువుగా వశుడై, వరాలనిచ్చేస్తాడు. శివుని ఆరాధించేవారు తమ పూర్వజన్మల సంస్కార ప్రభావంచే రాజసిక,

తామసిక భక్తులైయుంటారు. అట్టి వారు లౌకికమైన సుఖభోగ సంపదలనూ, క్షుద్రశక్తులనూ కోరుతారు, వాటిని శివుని నుండి పొందుతారు.

విష్ణుమూర్తి త్రిగుణాతీతుడు. విష్ణువు నారాధించేవారు సాత్త్వికభక్తులు. వారికి లౌకిక సిరి సంపదలపై కాంక్ష ఉండదు. వారికి కావలసినది భగవదనుగ్రహమూ, బంధమోచనము. ఇలాంటి ప్రశ్ననే రాజసూయయాగం చేసిన తరువాత యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని అడిగితే ఆయన ఇలాగ చెప్పాడు: "ధర్మనందనా! ఎవనిపై నాకు అనుగ్రహం కలుగుతుందో, అతని సమస్త సంపదలనూ నేను హరిస్తాను. అతడు ధనహీనుడై శోకిస్తాడు. బంధువులు అతనిని వదలివేస్తారు. అతడు నిస్పృహాయుడై, అన్నిటినీ త్యజించి, నా భక్తులతో స్నేహం చేస్తాడు. క్రమంగా విజ్ఞానాన్ని పొంది, తుదకు అవ్యయానంద భరితుడై, వైకుంఠప్రాప్తికి అర్హుడౌతాడు. నన్ను సేవించడం చాలా కష్టమని తలచి కొందరు వేరేదేవతలను ఆరాధించి, ఐశ్వర్యాలనూ, కామితాలనూ పొంది, వాటినే నిత్యమూ, నిజమూ అని భావించి, అహంకరించి, చివరికి ఆ దేవతలను కూడ వారు అలక్ష్యంచేసి మరచిపోతారు. దీనికి ఉదాహరణగా ఒక కథ ఉన్నది, వినుము.

## వృకాసురుడు

ఒకనాడు వృకాసురుడనే రాక్షసుడు నారదుడు కనిపిస్తే ఇలా అడిగాడు: "మునీంద్రా! త్రిలోక సంచారివైన నీకు బాగా తెలుస్తుంది. త్రిమూర్తులలో శీఘ్రంగా ఎవరు వరాలిస్తారో దయచేసి, చెప్పు." అనగా నారదమహర్షి ఇలా చెప్పాడు. "దుర్గుణవంతుల మీద ఆగ్రహమూ, సద్గుణవంతుల మీద అనుగ్రహమూ శీఘ్రముగా చూపేవాడు ఒక్క పరమశివుడే. రావణాసురుడూ, బాణాసురుడూ మొదలైనవారు అనేకులు శివుని ఆరాధించి వరాలను పొందారు" అని చెప్పగా ఆ అసురుడు వెంటనే కేదారక్షేత్రానికి వెళ్లి, ఘోరమైన తపస్సు చేశాడు. తన శరీరం నుండి, మాంసఖండాలను తీసి అగ్నిలో ఆహుతి చేశాడు. అయినా శివుడు ప్రత్యక్షముకాలేదు. రాక్షసునికి పట్టుదల ఎక్కువై, తన శిరస్సునే ఖండించి అగ్నిగుండంలో వేయడానికి పూనుకొన్నాడు. పరమశివుడు ప్రత్యక్షమై, "ఆగు ఆగు, అంత సాహసం చెయ్యకు. నీకేమి కావాలో కోరుకొనుము" అని వారించాడు. దానవుడు శివుని పాదాలకు నమస్కరించి, ఇలా అన్నాడు: "పరమేశ్వరా! నా చేతిని ఎవరితలపై ముంచుతానో అది వందముక్కలయ్యేటట్టు వరమిమ్ము." అనగా శంకరుడు, 'తథాస్తు' అన్నాడు. రాక్షసుడు సంతోషంతో గంతులు వేశాడు. వెంటనే ఆ వరంయొక్క శక్తిని పరీక్షించాలనుకొన్నాడు. ఎదురుగా కనిపించిన శివుని శిరస్సుమీదనే చెయ్యివేసి చూడాలనుకొని ముందుకు వచ్చాడు. దానవుని ఇంగితం తెలుసుకొని, ఇందుశేఖరుడు పరుగెత్తసాగాడు. ఎక్కడికి వెళ్లినా ఆ అసురుడు వెంబడిస్తూనేయున్నాడు. మునులూ, దేవతలూ భయకంపితులై, హాహాకారాలు చేశారు. శివుడుపోయి పోయి, వైకుంఠంలోనికి ప్రవేశించాడు. అన్నీ తెలిసియున్న శ్రీమన్నారాయణుడు మందహాసంచేస్తూ, శివునికి సంభవించిన ప్రమాదాన్ని నివారించాలనుకొని, ఒక వటువువేషం ధరించాడు. పరుగెత్తుకుంటూ వస్తున్న వృకాసురునికి ఎదురు వెళ్లి, "దానవోత్తమా! ఏమిటి విశేషం? ఎక్కడికీ పరుగు? బాగా అలసిపోయావే! చాలా దూరం వచ్చేశావు కూడాను. సకల సుఖాలూ సమకూర్చవలసిన ఈ శరీరమును ఇంతగా హింసిస్తున్నావు దేనికి? ఈ వైకుంఠంలో కాసేపు విశ్రాంతి తీసుకొంటే నీ బాధలన్నీ తీరుతాయి." అని చెప్తున్న వటుని మధుర వాక్కులకు అసురుడు సంతసించాడు. తాను సంకల్పించిన కార్యాన్ని వివరించాడు. అంతావిని వటుడు గట్టిగా నవ్వాడు. "అయ్యో అసురేంద్రా! నీవు మోసపోయావు. ఈ శివుడు, పూర్వపు శివుడు కాడు. దక్షునిచే ఇదివరలో శపింపబడినప్పటి నుండీ అతని పవిత్రతా, సత్యసంధతా అన్నీ తొలగిపోయి, వరాలిచ్చే శక్తికూడ క్షీణించిపోయినది. ఆయనగారి సంగతి మా అందరికీ బాగా తెలుసులే! పనిచెయ్యని వరమిచ్చినందుకు, నీ వద్దనుండి భయపడి పారిపోతున్నాడు చూచావా!" అనగానే

విష్ణుమాయలో పడ్డాడు ఆ అసురుడు. మళ్లీ వటుడు అందుకొన్నాడు: "చూడు, నీకు శివునిపై కోపం వచ్చేసినది కదూ! అవునులే మరి కోపం ఎందుకు రాదు? అతనిని శిక్షించవలసిందే! పాపం, ఇప్పటికే చాలా అలసిపోయావే. ఈ కొలనులో కాస్త కాళ్లూ చేతులూ ముఖమూ కడుక్కొని కొంచెం మంచినీరు త్రాగితే కొంచెం సేదదీరి, నీకు ఇంకా శక్తి వస్తుంది. అప్పుడు అతని పని పట్టవచ్చు." అనగా విని, "నిజమే, అలాగేచేస్తానే, మంచిది", అనుకొన్నాడు ఆ తామసికుడు. కొలనులో దిగి ముఖం కడుక్కొని ఆ చల్లని తీర్థాన్ని తలకు పట్టించాలనుకొని, నెత్తిమీద చెయ్యివేసుకొని, తలపగిలి చచ్చిపడ్డాడు. గండము తప్పినందుకు సంతోషించిన శంకరునితో విష్ణువు ఇలా అన్నాడు: "మహేశ్వరా! నీకు కీడు తలపెట్టిన ఈ మూఢుడు నశించాడు, కాని దుష్టులకు అంతసులువుగా వరాలివ్వరాదు కదా!" అనగా శివుడు శ్రీహరికి నమస్కరించి, నిష్క్రమించాడు అని శ్రీకృష్ణుడు ధర్మజునితో చెప్పి, అందుచేతనే శ్రీహరి ఎవ్వరికి అంతసులువుగా వరాలివ్వడు అన్నాడు. అని శ్రీశుకుడు, పరీక్షిత్తుతో చెప్పాడు.

**త్రిమూర్తులలో నుత్తము డెవరు?**

పూర్వము ఒకనాడు మహర్షులందరూ చేరి, సరస్వతీ నదీతీరాన ఒక సత్రయాగం చేయనారంభించారు. ఆధ్యాత్మిక విషయ చర్చలలో త్రిమూర్తులలో శ్రేష్ఠుడెవరు అనే ప్రశ్నవచ్చినది. వారు ఎటూ నిర్ణయించలేక, స్వయంగా తెలుసుకొని రావలసిందిగా భృగుమహర్షిని పంపించారు. ఇదిజటిలమైన కార్యమే! శ్రేష్ఠతను నిర్ణయించడమెట్లా? బాగా ఆలోచించి, త్రిగుణాల ప్రభావానికిలోను-కానివాడే (త్రిగుణాతీతుడే) సర్వశ్రేష్ఠుడని నిర్ణయించాలనుకొన్నాడు భృగువు. అతడు బ్రహ్మదేవుని కొలువులో ప్రవేశించి, బ్రహ్మకు వందన మాచరించకుండా, స్తుతించకుండా నిర్లక్ష్యంగా నిల్చున్నాడు. అతని సంస్కారహీనమైన ప్రవర్తనకు ఆగ్రహావేశపరుడై ఎర్రబడిపోయాడు బ్రహ్మయ్య. "నా ఎదుటినుంచి పో" అన్నట్టున్నాయి అతని చూపులు. మళ్లీ అంతలోనే తప్పుచేసినవాడు తన పుత్రుడే కదా! అని, తమాయించుకొన్నాడు. అంతా కనిపెట్టిన భృగువు మాటాడకుండా సత్యలోకాన్ని విడిచి, కైలాసం వెళ్లాడు. పార్వతీ పరమేశ్వరులు సంతోషంగా ఆహ్వానించారు. శివుడు సోదరుడైన భృగువును ఆప్యాయంగా కౌగలించుకోవాలని చేతులు చాచాడు. శివునికి కోపం తెప్పించాలనే ఉద్దేశంతో భృగువు ఇలా అన్నాడు: "ఆగు! నన్ను తాకవద్దు. నీవు, వేదభ్రష్టుడవు." అనగానే శివునికి కోపం వచ్చేసి త్రిశూలం ఎత్తగా పార్వతీదేవి అడ్డుకొన్నది. భృగువు అక్కడినుండి వైకుంఠం వెళ్లాడు. విష్ణువు లక్ష్మీదేవి ఒడిలో తలపెట్టుకొని, కండ్లు మూసుకొనియున్నాడు. ఋషిరాకను గమనించలేదు. ఋషి నేరుగావెళ్లి విష్ణువు వక్షస్థలం మీద తన్నాడు. నారాయణుడు వెంటనే పాన్పుదిగి, ముఖములో ఎటువంటి ద్వేషభావములేనివాడై, చిరునవ్వుతో మునిని ఆహ్వానించి, ఉన్నతాసనమిచ్చి ఇలా అన్నాడు: "మహాత్మా! నీరాకను గమనించలేక నీకు స్వాగతం పలుకలేకపోతిని. నా అపరాధాన్ని మన్నించు. నీపాదానికి నొప్పికలుగలేదు కదా! (పాదాలను ఒత్తుతూ) నీ పాదస్పర్శచే ఈ లోకము పావన మయినది. నీ పాదతాడనం నా యొక్క వక్షానికే అలంకారమయినది. నేను ధన్యుడనైనాను. నా వలన కావలసిన కార్యమేదైనా ఉంటే చెప్పు." అని మధురంగా చెప్పిన మాటలకు మహర్షి మురిసిపోయాడు. ఆనందబాష్పాలతో అచ్యుతుని క్షమింపుమని వేడుకొన్నాడు, స్తుతించాడు. సెలవు తీసుకొని మునుల సభకు వచ్చి, అంతా నివేదించాడు. అఖిల కల్యాణ గుణాకరుడైన శ్రీమన్నారాయణుడే పరమదైవమని మునులు నిర్ణయించారు.

## మృతులైన బ్రాహ్మణ పుత్రులు

శ్రీకృష్ణుడు కుశస్థలిలో సుఖంగా కాలంగడుపుతున్న రోజులలో ఒక బ్రాహ్మణ స్త్రీకి పుత్రుడు పుట్టీ పుట్టగానే చనిపోయాడు. ఆ బ్రాహ్మణుడు శోకముతో ఆ మృతబాలుని ఎత్తుకొని శ్రీకృష్ణుని రాజగృహం వద్దకు వచ్చాడు. మృతదేహాన్ని రాజద్వారం వద్ద నుంచి, విధిని నిందిస్తూ, తన్నుతాను తిట్టుకొంటూ దుఃఖిస్తున్నాడు. అక్కడ చేరిన ప్రజలతో ఇలా అనసాగాడు: "రాజు బ్రాహ్మణ ద్వేషియై శాస్త్రాచారాలను పట్టించుకొనని పాపాత్ముడైతే ప్రజలకు

ఇలాంటి దుర్దశ కలుగుతుంది." అంటూ నిందాలాపనలు చేశాడు. పాపం, ఆ బ్రాహ్మణుని దురదృష్టమేమో గాని, వరుసగా ఎనమండుగురు పుత్రులూ అలాగే చనిపోవడమూ జరిగినది. తొమ్మిదవసారి అర్జునుడు అక్కడ ఉండడం జరిగినది. అతడు బ్రాహ్మణుని శోకాలాపాలు విన్నాడు. అతని హృదయం ద్రవించిపోయినది. అతడు ఇలా అన్నాడు: "బ్రాహ్మణుల కష్టాల్లను తీర్చలేని రాజు రాజుకాడు. ఈ సారి నేను నీ బిడ్డను చనిపోకుండా కాపాడుతాను, అలాగ చెయ్యలేకపోతే అగ్ని ప్రవేశంచేస్తాను" అని ప్రతిజ్ఞ చేసిన అర్జునునితో ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు. "అయ్యా! ఇలాంటి ప్రగల్భాలను పలకడం మంచిదికాదు. బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, అనిరుద్ధుడూ మొదలైన అసమాన శక్తి సంపన్నులున్నారిక్కడ. ఏమైనా చేయగలిగియుంటే, వారే చేసియుండేవారు. వారు చెయ్యలేని దానిని నీవు చేస్తాననడం ఏమియు ఉచితంగా లేదు. దయచేసి, నీ దారిని నీవు వెళ్లు." అన్నాడు. ఈ మాటలకు అర్జునునిలో అహంకారం పెరిగినది. అందరూ వింటుండగా ఇలాగ అన్నాడు: "నేను బలరాముని కాను. కృష్ణున్నీ కాను: ప్రద్యుమ్నుడను కాను, అనిరుద్ధుడనూ కాను. పరమశివుని మెప్పించి, పాశుపతాస్త్రాన్ని పొందిన గాండీవధారి అర్జునుడను. మృత్యుదేవత నెదిరించి, నీ బిడ్డను రక్షిస్తాను." అని చెప్పిన అర్జునుని వాక్కులకు ఊరటజెంది, విప్రుడు వెళ్లిపోయాడు. పదియవసారి బ్రాహ్మణపత్ని ప్రసవవేదన పడుతుంటే బ్రాహ్మణుడు అర్జునునితో చెప్పగా అర్జునుడు వచ్చి, గంగాజలంతో ఆచమనంచేసి, శివునకు నమస్కరించాడు. మంత్రదేవతలను స్మరిస్తూ గాండీవాన్ని ఎక్కుపెట్టి, ప్రసవగృహాన్ని దట్టంగా బాణాలతో అన్ని వైపులనుండి కప్పివేశాడు. భూత, ప్రేత, పిశాచ, నిశాచర గణాలేవీ అక్కడ చేరకుండా కావలి కాచాడు. కట్టుదిట్టమైన రక్షణ ఏర్పడిందని తృప్తిజెందాడు. బ్రాహ్మణసతికి పదియవ బిడ్డడు జన్మించాడు: వెంటనే అదృశ్యమైనాడు. బ్రాహ్మణుడు అర్జునునితో సహా కృష్ణుని వద్దకు పోయి, ఇలాగ విలపించాడు: "కృష్ణా, వాసుదేవా, నందనందనా! సర్వసమర్థుడవైన నీవే ఏమీ చెయ్యలేని పరిస్థితిలో మానవ మాత్రుడైన ఈ అర్జునుడు డాంబికాలు పలికి, నా బిడ్డడు నాకు దక్కకుండా మోసము చేశాడు. ఇతడూ ఒక విలుకాడేనా! ఇతని గాండీవమూ ఒక ధనుస్సేనా? వీని మాటా ఒక మాటేనా?" అని పరుషంగా దూషిస్తుంటే, పౌరుషం వచ్చేసిన అర్జునుడు యముని వద్దకు వెళ్లాడు. అక్కడ బ్రాహ్మణ పుత్రుడు లేకపోతే, ఇంద్ర, వరుణ, కుబేర, అగ్ని, నిర్‌ఋతి, వాయు, ఈశానుల వద్దకు పోయి చూచాడు. మూడు లోకాల్లోనూ బాలుడెక్కడా కానరాలేదు. నిస్పృహతో ఏమి చెయ్యాలో తోచక, తన ప్రతిజ్ఞను నెరవేర్చడానికి తిరిగివచ్చాడు. అర్జునుడు అగ్నిలో ఆత్మార్పణం చేసుకొనడానికి సిద్ధపడగా, కృష్ణుడు వారించి తన్ను తాను ఆ విధంగా అవమానించుకోరాదనీ, విధివిలాసానికి ఎదురేగి, ఎవ్వరూ ఏమీ చెయ్యలేరనీ, అర్జునుడు గ్రహించేటట్టు చేశాడు. అతని అహంకారము దిగిపోయినది. బ్రాహ్మణపుత్రులుండే చోటికి తీసుకెళ్తానని శ్రీకృష్ణుడు చెప్పాడు.

కృష్ణార్జునులు మనోవేగాన్ని మించిన వేగముగల రథాన్నెక్కి సప్తసముద్రాలను దాటి, మేరు పర్వతాన్నతిక్రమించి, చీకటి మండలంలోనికి ప్రవేశించారు. గాఢాంధకారములో దారికానక, ముందుకుపోలేక గుర్రాలు ఆగిపోయాయి. వెయ్యి సూర్యుల తేజస్సును వెదజల్లే సుదర్శన చక్రాన్ని శ్రీకృష్ణుడు విడిచి పెట్టగా, అది అంధకారాన్ని ఛేదిస్తూ, దారి చూపుతుంటే, రథము, దాన్ని అనుసరిస్తూపోతున్నది. పెంజీకటి దాటగానే మిరుమిట్లుకొలిపే మహా తేజస్సు కనిపించినది. దానిని చూడలేక అర్జునుడు కన్నులు మూసుకొన్నాడు. తరువాత మిగుల ఉధృతమైన వాయువేగానికి కల్లోలితమైన ఒక మహాసముద్రంలోనికి రథము ప్రవేశించినది. ఆ సముద్రం అడుగున, దివ్యతేజస్సుతో, మనోహరమైన మణిమయ స్తంభాలతో శోభిస్తున్న ఒక దివ్య భవనం ఉన్నది. ఆ భవనంలో వెయ్యిపడగలు గల ఆదిశేషువు చుట్టుకొని, ఒక పెద్ద వెండికొండలాగున్నది. ఆ పడగలలో నున్న మణుల కాంతి సూర్యతేజస్సును మించియున్నది. ఆ అద్భుతమైన శేషతల్పముపైన విశ్రమించియున్న పరమ పురుషుని చూచారు కృష్ణార్జునులు.

అష్టభుజాలతోను, కౌస్తుభ, శ్రీవత్స, వనమాలాలంకృతుడై, శంఖ, చక్ర, గదా, శారాజ్ఞది ఆయుధాలతోనూ, సునందాది పార్షదులు సేవిస్తుండగా, ఆ మహనీయుడు ప్రకాశిస్తున్నాడు. ఆయనను చూచి, కృష్ణార్జునులు భక్తితో సాష్టాంగ నమస్కారాలు చేశారు, సంస్తుతించారు. ఆ ఆదిదేవుడు వారిని అనుగ్రహంతో చూచి, మందహాసంతో ఇలా అన్నాడు: "భూభారాన్ని తగ్గించి, ధర్మరక్షణ చెయ్యడానికి మీరు నా యొక్క అంశతో అవతరించిన వారు. మిమ్మల్ని దర్శించాలని మునీశ్వరులు కోరడం చేత, మిమ్మల్నిక్కడికి రప్పించే నిమిత్తమై, ఈ బ్రాహ్మణ బాలకులను ఇక్కడ ఉంచడమైనది. నా దర్శనాన్నిపొందిన నరనారాయణులైన మీరు ఈ బాలకులను, కొనిపోవచ్చును." అని చెప్పి వారికి వీడ్కోలు చెప్పాడు. శ్రీకృష్ణార్జునులు ఆ పదిమంది బాలకులను తీసుకొని ద్వారకకు తిరిగివచ్చి వారి తండ్రికి ఒప్పజెప్పారు. ఆ బ్రాహ్మణుని ఆనందానికి అవధులు లేవు. అర్జునుడు శ్రీకృష్ణుని అనేక విధాల ప్రస్తుతించి, ఆనందభరితుడయ్యాడు. తనకున్న శక్తి సామర్థ్యాలన్నీ ఆ శ్రీకృష్ణుని అనుగ్రహంవల్ల వచ్చినవే అని ఇంకొకసారి గుర్తుతెచ్చుకొన్నాడు.

## శ్రీకృష్ణుని సంతతి

శ్రీశుకుడు చెప్తున్నాడు : ఓ పరీక్షిత్తు మహారాజా! సర్వేశుడూ, అనంతుడూ, వేదవేద్యుడూ అయిన శ్రీకృష్ణుడు బ్రాహ్మణులాదిగా గల సమస్త ప్రజలనూ సకల ధన వస్తు సంపన్నులను చేసి, సంరక్షిస్తూ, దుర్మార్గులను సంహరిస్తూ, ధర్మాన్ని స్థాపించుతూ, ద్వారకలో సుఖ సంతోషాలతో ప్రకాశించాడు. ప్రజలు మెచ్చుకొనేటట్లు, శాస్త్రోక్తంగా, అనేక యజ్ఞాలను అమితోత్సాహంతో జరిపించాడు. శ్రియఃపతియైన శ్రీకృష్ణుడు సకలసంపదలతోను, సౌఖ్యాలతోనూ ద్వారకలో ఆనందంగా గడుపుతున్నాడు. ద్వారకలో బంగారుమయమైన భవనాలూ, సుందరమైన ఉద్యానాలు, కొలనులు ఎంతో రమణీయంగానుంటాయి. శ్రీకృష్ణుడు తన పదహారువేలమంది భార్యలతో అందరినీ అన్నిరూపాల్లో ఆనందింపజేశాడు. వీణా, వేణు, మృదంగ, వాద్యాలను వింటూ, మధురగానాల నాలకిస్తూ, సుందరీమణుల నృత్యాలను తిలకిస్తూ, కవి, గాయక, పండితుల ప్రజ్ఞలను పరికిస్తూ ఆనందరస ప్రవాహాల్లో ఓలలాడుతున్నాడు.

శ్రీకృష్ణుని పాదపద్మాలను భక్తితో సేవిస్తూ, ధ్యానిస్తూ, అతనితో సరస సల్లాపాలను సాగిస్తూ, ఆ దివ్యమంగళరూపాన్ని దర్శిస్తూ పదహారువేల ఒకవందమంది సుందరీమణులు పరవశించిపోయి, మరిదేనినిగురించి తలపులేకుండా ఉన్నారు. మూఢాత్ములైనా ఒక్కసారి హరినామ సంకీర్తనం వింటే ముక్తిని పొందుతారు కదా, మరి ఆ మహనీయుని వీక్షిస్తూ, కౌగలించుకొంటూ, అతనితో నవ్వుతూ సంభాషిస్తూ ఉండే ఆ అంగనలు ఆనందపరవశలు కావడంలో ఆశ్చర్యమేమున్నది?

శ్రీకృష్ణుడు వేదోక్తమైన గృహస్థధర్మాలను పాటిస్తూ, ధర్మార్థకామాలను సాధిస్తూ, లోకములో ఉత్తమ ఆదర్శాన్ని నెలకొల్పడానికి, తానూ ఒక మామూలు గృహస్థునిలాగ నటించేవాడు. పదహారు వేల ఒక వందమంది భార్యలకూ ఒక్కొక్కరికీ పది మందేసి పుత్రులు కలిగారు. రుక్మిణి మొదలైన అష్ట మహిషులకు పుట్టిన పుత్రులలో ప్రద్యుమ్నుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, బృహద్భానుడు, శ్రుతదేవుడు, మొదలైన పద్దెనిమిదిమంది బాహుబలపరాక్రమవైభవాలతో ప్రసిద్ధులైనారు. త్రివక్ర అనే స్త్రీకి జన్మించిన ఉపశ్లోకుడనేవాడు కృష్ణభక్తుడై, నారదునికి శిష్యుడై, సాత్వతతంత్రాన్ని స్థాపించాడు. వైష్ణవస్మృతి గ్రంథాన్ని రచించాడు. ఈ సాత్వతము ప్రకారము, స్త్రీ, శూద్ర, దాసజనులుకూడ స్మరణమాత్రాన ముక్తిని పొందగలరు. వీరు కృష్ణభక్తులైన వైష్ణవులు.

శ్రీకృష్ణుని తనయులూ, మనుమలూ, వారి సంతతివారూ, అసంఖ్యాకులై మహాబలశాలురై వెలశారు. వారికి విద్యలను నేర్పడానికి నియమింపబడిన గురువుల సంఖ్యకూడ అసంఖ్యాకమే అయియుండెను.

దేవదానవ సంగ్రామాలలో మరణించిన రాక్షసులందరూ ద్వాపరయుగములో రాజులుగా పుట్టి, ప్రజలను

హింసిస్తుండేవారు. వారిని సంహరించడానికి విష్ణుమూర్తి దేవతలను యదుకులంలో జన్మించేలాగ చేశాడు. యాదవులు నూటా ఒక్కకులాల వారిగా వర్ధిల్లారు. వారి సంతతులు అసంఖ్యాకాలు.

శ్రీకృష్ణునకు రుక్మిణియందు ప్రద్యుమ్నుడు పుట్టాడు. అతని భార్య, రుక్మికుమార్తెయైన శుభాంగి. ఆమెకు అనిరుద్ధుడు, అనిరుద్ధునకు వ్రజుడూ జన్మించారు. ఈ విధంగా వృష్ణి, భోజ, అంధక, వంశాలు పవిత్రాలయినవి. శ్రీకృష్ణుని సహవాసం వలన యాదవులు అనేకమైన యాగాలను చేసి, దేవతలకు ప్రీతి కలిగించి, తాము ఆనందించేవారు.

శ్రీకృష్ణుని నామాన్ని చింతించేవారూ, వినేవారూ, ధన్యాత్ములు. వారు సంసారబాధలనుండి విముక్తులవుతారు.

**మ॥ మనుజేంద్రోత్తమ! యేమనీకు త్రిజగన్మాంగల్యమైయొప్పజె**
**ప్పిన యీకృష్ణ కథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో**
**లిన పుణ్యాత్ములు గాంతురిందు సుఖముల్ నిర్ధూత సర్వాఘులై**
**అనయంబుం దుది గాంతురచ్యుత పదంబైనట్టి కైవల్యమున్ 1332**

ఓ రాజశ్రేష్ఠమా! ముల్లోకాలకూ శుభదాయకమైన కృష్ణకథాసుధారసాన్ని భక్తితో పానముచేసిన పుణ్యాత్ములు, ఈ లోకంలో సుఖాలను పొందుతారు. వారి సమస్త పాపాలూ తొలగిపోతాయి. తుదకు వారు శాశ్వతముక్తిని పొందుతారు.

అని శ్రీశుకుడు, పరీక్షిత్తునకు, శ్రీకృష్ణగాథామృతాన్ని చవిచూపించాడని శౌనకాది మునులకు సూతుడు చెప్పగా వారు శ్రీకృష్ణ భక్తియందు తేలియాడారు.

**హరిః ఓం తత్ సత్**

**దశమ స్కంధము సమాప్తము.**

**ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః**

***

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# ఏకాదశస్కంధము

## నిమి, ఆర్షభేయము - ఋషులు ద్వారకకు వచ్చుట

శ్రీశుకుడు చెపుతున్నాడు: పరీక్షిన్మహారాజా! శ్రీమన్నారాయణచరితామృతం త్రాగితే జన్మ కర్మ వ్యాధులనుండి విమోచనం కలుగుతుంది.

శ్రీకృష్ణుడు వసుదేవ బలరామాది ఆప్తులతోనూ, భార్యాపుత్రపౌత్రాది ఆత్మీయులతోనూ ద్వారకలో సకల సౌఖ్యాలతో గడుపుతుండగా, అవతారకార్యమైన భూభారమోచనం ఇంకా కొంత జరగవలసియున్నదని ఆయనకు గుర్తుకు వచ్చినది. ఇంతవరకూ కంసునిచే పంపబడిన అనేకమంది అసురులనూ, కంసునితో సహా జరాసంధ శిశుపాలాది - అనేకులైన దుష్టులనూ, కురుక్షేత్ర రణరంగంలో వేలాది సైనికులతో సహా చాలామంది రాజులనూ అంతము చేయించి, సజ్జనులనూ భక్తులనూ, ఆశ్రితులనూ, యాదవులనూ అనేక విధాలుగా కాపాడుతూ వచ్చాడు శ్రీకృష్ణుడు. యాదవులు అమితమైన శక్తి శౌర్యాలుగల వారై అజేయులుగా తయారయ్యారు. శ్రీకృష్ణుని అనుగ్రహాన్నీ ఆశీస్సులనూ పొందియున్న వారుగనుక యాదవులను ఎవ్వరూ జయించలేరు. అందుచేత పరస్పర రాపిడివల్ల రెండువెదురు కఱ్ఱలలో నిప్పుపుట్టి, అడవినంతటినీ దగ్ధంచేసినట్లు, వారిలో వారికి కలహంపుట్టి, యాదవులందరూ నశించే ఉపాయం గురించి యోచించాడు. ఈ కార్యము ముగిసిన తరువాత తాను వైకుంఠధామానికి వెళ్లిపోవాలనుకొన్నాడు ఆ మహాత్ముడు.

ఈ సమయంలో పరమపూజ్యులైన విశ్వామిత్ర, దూర్వాస, భృగు, అంగిరస, కశ్యప, అత్రి, వసిష్ఠ, నారద, అసిత, వామదేవ, వాలఖిల్యాది మహామునులు పిండారకమనే పుణ్యతీర్థానికి వెళ్తూ ద్వారకకు వచ్చారు. పరమేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుని దర్శించారు. శ్రీకృష్ణుడు వారికి అర్ఘ్యపాద్యాది స్వాగత సత్కారాలు గావించి, కుశలమడిగాడు. ఋషులు భగవానుని ఈ విధంగా స్తుతించారు. "సర్వేశ్వరా! శరణాగతవత్సలా! నీకు ప్రణామాలు, జన్మజన్మల కర్మలను నశింపజేయడానికి నీ దర్శనమే చాలు నీనామమే భవసాగరతారకము. నీదివ్యచరణాలే మాకు పరమధామాలు. అణువుకంటే సూక్ష్మతముడవు. మహత్తుకంటే మహత్తరుడవు. నిన్ను మేము తెలుసుకొనగలమా, స్తుతించగలమా ప్రభూ?" అంటూ ఇంకా ఎన్నో విధాల స్తుతించి పిండారక క్షేత్రానికి వెళ్లారు. అక్కడ కొందరు యాదవయువకులు కేళీవినోదాల్లో ఆడుకొంటూ గంతులేస్తున్నారు. మహర్షుల బృందాన్ని చూడగానే, ఆ మదోన్మత్తులకు ఒక దుష్ట ఆలోచన వచ్చినది. వాళ్లనొక ఆటపట్టించి, వినోదిద్దాం అనుకొన్నారు. సాంబునికి స్త్రీవేషం వేసి, ఒక గర్భవతి లాగ తయారుచేసి, అతివినయంతో ఆ మునులకు నమస్కారంచేసి, ఇలా అడిగారు: "మహాత్ములారా! మీరు సర్వజ్ఞులు కదా! ఈమె గర్భంలో నున్నది ఆడబిడ్డా, మగబిడ్డడా చెప్పండి. ఈమె మిమ్మల్ని అడగడానికి సిగ్గుపడుతున్నది" అని అడుగగా, వాళ్ల దుర్బుద్ధిని మునులు గ్రహించి, పట్టరాని ఆగ్రహంతో ఇలాగఅన్నారు: "మూర్ఖులారా! మాతో పరిహాసమా! ఈగర్భంలో ఆడబిడ్డాలేదు, మగబిడ్డడూలేడు. ఆమూటవిప్పితే మీ వంశాలను నాశనంచేసే ముసలంబైటపడుతుంది." అని చెప్పివెళ్లిపోయారు. యువకులు సాంబుని పొట్టకు చుట్టబడిన గుడ్డలు విప్పగా, ఒక ముసలము (రోకలి) జారిపడినది. వాళ్లు భయపడి, దానిని సభలోకొలువు తీర్చియున్న ఉగ్రసేనునికి చూపించి, అంతా నివేదించారు. సభలోనున్న శ్రీకృష్ణుడు ఏమీ తెలియనట్లు ఇలాగ అన్నాడు: "అహంకారంతో బుద్ధిచెడి, పరమ పూజ్యులైన మహాత్ములతో మీరు దుష్టంగా ప్రవర్తించి, వంశాన్నే నశింపజేసే

శాపాన్ని తెచ్చిపెట్టారు. బ్రాహ్మణశాపాన్ని త్రిమూర్తులు కూడ తప్పించలేరు. కర్మఫలం అనుభవించకతప్పదు.'' అనగా, ఆముసలాన్నే రూపుమాపితే ప్రమాదం తప్పిపోవచ్చునేమోయని భావించెనేమో మరి, ఉగ్రసేనుడు దానిని అరగదీసి, పొడిచేసి, ఆపొడిని సముద్రంలో పారవేసి రండి అని ఆజ్ఞాపించాడు. ఆయువకులు ఆముసలాన్ని అరగదీసి, చూర్ణముచేసి, చివరకు ఒక చిన్న త్రికోణాకారపు ముక్క మిగిలిపోతే, దానినికూడ ఆచూర్ణముతోపాటు సముద్రంలో పారవేసి వచ్చారు. ఆత్రికోణపు ఇనుపముక్కను ఒకచేప మ్రింగివేసింది. ఆచేప ఒక బోయవాని వలలో చిక్కినది. వాడు దానిని కోయగా దొరికిన ఆఇనుపముక్కను తనబాణానికి మొనగా అమర్చుకొన్నాడు. ఆముసలపు చూర్ణము సముద్రపు అలలతోకొట్టుకువచ్చి, తీరమంతా వ్యాపించి, పొడవైన, వాడియైన, రెల్లుగడ్డి వంటి దట్టమైన గడ్డివనంగా తయారయినది.

శ్రీకృష్ణ భగవానుడు తాను సంకల్పించిన విధంగానే అంతా జరుగుతున్నది గనుక ఋషులశాపాన్ని నివారించడానికి ప్రయత్నించలేదు.

## విదేహరాజైన నిమికి ఋషభపుత్రులబోధ

నారదమహర్షి శ్రీకృష్ణ సందర్శనానంద కాంక్షియై తరచుగా ద్వారక వస్తుండేవాడు. ఒకనాడు వసుదేవుడు నారదునితో ఇలా అన్నాడు. "మహాత్మా! భగవంతునిగాథలను వినిపించే నీరాకవలన సంసారతాపత్రయంలో మ్రగ్గిపోతున్న మావంటివారికి పరమానందం కలుగుతుంది. భాగవతధర్మాన్ని తెలుసుకొని, ఆచరించే వారికి మృత్యుభయముండదు. మోక్షాన్ని కూడా ఇవ్వగల భగవానుడే నాకు పుత్రుడైయుండగా, మాయామోహ ప్రభావితుడనై నేను అతనిని భగవానునిగా ఆరాధించలేకున్నాను. అందుచేత నాకు బంధము వీడి, మోక్షము ప్రాప్తించే మార్గాన్ని బోధించుమని కోరుతున్నాను." అనగా నారదుడు సంతసించి, ఇలా అన్నాడు: "వసుదేవా! నీ ప్రశ్న ఉత్తమమైనది. భాగవతధర్మాన్ని, వినినా, చదివినా, మననంచేసినా, బాగున్నదని అనుకున్నా పాపాత్ముడు కూడ పవిత్రుడౌతాడు. పూర్వము విదేహరాజు జనకునకూ ఋషభదేవుని పుత్రులకూ జరిగిన సంవాదాన్ని వింటే నీ సందేహాలన్నీ తీరిపోగలవు. చెప్తాను విను.

"స్వాయంభువమనుపుత్రుడు ప్రియవ్రతుడు. అతని మనుమడు నాభి. నాభికి మహావిష్ణువు అంశతో, ఋషభుడు జన్మించాడు. ఋషభదేవుడు గొప్ప రాజర్షిగా వెలసినాడు. అతనికి నూరుమందిపుత్రులు. పెద్దవాడు భరతుడు. అతని పేరు మీదనే భారతవర్షం ప్రసిద్ధిగాంచినది. ఈతని తరువాత తొమ్మిదిమంది తొమ్మిది భూఖండాలకు సంస్థాపకులైరి. తరువాతి ఎనుబదియొక్కమందీ బ్రాహ్మణత్వాన్ని స్వీకరించి, నిత్యకర్మానుష్ఠాన పరులైనారు. ఆఖరి తొమ్మండుగురూ బ్రహ్మవిద్యావిశారదులై జీవన్ముక్తులై, సుర, సిద్ధ, గంధర్వ, యక్ష, కిన్నర, నాగాది లోకాలలో స్వేచ్ఛావిహారులై యుండేవారు. వారు ఒకనాడు నిమి అనబడే జనక(విదేహ) మహారాజు చేసిన యాగము సమాప్తమయ్యేసరికి అక్కడికి వెళ్లారు. వారిని సకల సంప్రదాయాలతో పూజించాడు విదేహరాజు. వారు సుఖాసీనులైయున్నప్పుడు, ఋత్విక్కులు, సదస్యులు అందరూ వింటుండగా ఇలాగ అన్నాడు: "మహాత్ములారా! మీవంటి పరమభాగవతులు, సాటిలేని జ్ఞానధనులు, విశ్వమంతా శ్రీహరిమయమే అని చూడగలిగిన ఆత్మదర్శనులు ఇక్కడికి విచ్చేయడం మాభాగ్యము. నాయొక్క అజ్ఞానాన్ని బాపగల మహనీయులు మీరేయని, నా విశ్వాసము, నాయొక్క సందేహాలను తీర్చి, నన్ను అనుగ్రహింపుడని ప్రార్థిస్తున్నాను:

మానవజన్మ లభించడమే చాలాకష్టము. శ్రీమన్నారాయణుని పాదపద్మాలయందు అనురక్తి కలగడం మరీకష్టం. ఇంత అమూల్యమైన మానవజన్మను సద్వినియోగపరచుకోకుండా, సంసార పంకిలంలోనికే చొచ్చుకుపోతాడు మానవుడు. ఈ సంసారసాగరాన్ని దాటడానికి ఏదైనా మార్గం ఉన్నదా? శాశ్వతమైన శ్రేయస్సు ఎలాగ కలుగుతుంది? భక్తిప్రపత్తులు గలవారికి విష్ణుసారూప్యమెలాగ కలుగుతుంది? సెలవివ్వండి" అని ప్రార్థించగా, తొమ్మిదిమంది ఋషభపుత్రులలో (నవ - ఆర్షభులలో) కవి అనేవాడు ఇలాగ చెప్పాడు:

1) కవి : రాజా! కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను అరిషడ్వర్గమంటారు. దారేషణ, ధనేషణ, పుత్రేషణలను ఈషణత్రయం అంటారు. వీటిలో చిక్కుకొన్న మానవునకు మాధవుని పాదపద్మాల నాశ్రయించే ఆసక్తి కలుగనేరదు. విజ్ఞానముతో కూడిన నిర్మలహృదయంతో భక్తి భావనావేశము లేకపోతే పరమపదము లభించదు. మనో, వాక్, కాయాలతో చేసే ప్రతికర్మనూ, "కృష్ణార్పణము"గా చెయ్యడమే సుజ్ఞానమని పరమ మునీంద్రులు చెప్పారు. జ్ఞాన, అజ్ఞానాలలో కలత చెందుతుంటే స్మృతి చెడుతుంది. కావున సద్గురుదేవుని ఆశ్రయించి, బుద్ధిమంతుడు పురుషోత్తమునే చిత్తమందు నిలిపి, సేవించాలి. ఇచ్ఛలూ, మనోరథాలూ, స్వప్నసదృశభోగవాంఛలూ, మానవునియందున్న సత్సంకల్పాలను చెదరగొట్టి, దైవచింతనను నశింపజేస్తాయి కనుక కోరికలను రేకెత్తించే సంకల్పాలను అదుపులోనుంచి, నిరంతర హరి ధ్యానంలో నుండే వ్యక్తికి కైవల్యము సులభసాధ్యమవుతుంది. ఓ రాజా! భక్తుడెల్లప్పుడూ, శ్రీకృష్ణసంకీర్తనలను వీనులవిందుగా వినాలి. శ్రీహరి గాథలను, హర్షముతో ఆడుతూపాడుతూ వినాలి, వినిపించాలి. శ్రీమన్నారాయణుని దివ్యనామాలను ఎల్లప్పుడూ స్మరిస్తుండాలి. పద్మలోచనుని లీలలను అడవులలో సంచరిస్తున్నా భక్తియుక్తంగా గానము చెయ్యాలి. విశ్వమయుని కీర్తిస్తూ, వెర్రివానివలె, లోకాతీతుడైయుండాలి. ఈ విశ్వమంతా విష్ణుమయమే అని తెలుసుకోవాలి." అని చెప్పిన "కవి" మాటలకు, విదేహరాజు భాగవత ధర్మమంటే ఏమిటి, భాగవతులు ఎలా ఉంటారు-అని అడిగాడు. దానికి "హరి" అనే ఆర్షభుడు ఇలా చెప్పాడు:

2) హరి : రాజా! భగవానుడే కొన్ని భాగవత ధర్మాలను పంచరాత్రాది గ్రంథాలలో వివరించాడు. భగవంతుని యందు సంపూర్ణ విశ్వాసము, శరణాగతి కలిగియుండడం దేనిని గురించికూడ భయము లేని ఆత్యంతిక క్షేమ భావాన్ని కలిగియుండడం, సర్వమూ ఆనారాయణమయమే, నారాయణుని వినా ఇంకేదీలేదనీ విశ్వసించడం, భాగవతధర్మంలోని కొన్ని అంశాలు. తత్త్వజ్ఞానము, భక్తి, వైరాగ్యము, భాగవతధర్మం వలన కలుగుతాయి.

ఉత్తమ భాగవతుడు చతుర్వర్ణాలూ చతురాశ్రమాలూ, వాటి ధర్మాలూ, వాటి కర్మలూ, అనువానియందు తగుల్కొనక, భక్తి మార్గాన్నాశ్రయించి, శ్రీహరి తనయందే కాక, సమస్త జగత్తు అంతటా నిండియున్నవాడు అని, స్థిరవిశ్వాసం కలిగియుంటాడు. అతడు ఇతర భక్తులందరి యెడల మైత్రినీ, అల్పజ్ఞుల పట్ల సానుభూతినీ, విపరీతపు వ్యక్తులపట్ల ఉపేక్షనూ కలిగియుంటాడు. పరిపక్వత చెందని భక్తుడు తాను నమ్మిన ఒకే ఒకమూర్తియందే భగవంతుడున్నట్లునూ, ఇంకెక్కడా లేనట్లునూ భావిస్తూ ఆ మూర్తినే పూజిస్తాడు. భాగవతోత్తముడు ప్రియాప్రియాలయందు మోదఖేదాలను, రాగద్వేషాలనూ పొందడు. సర్వమూ విష్ణుమయమనీ, విష్ణుఅధీనమనీ నమ్ముతాడు. జననమరణాలు, ఆకలిదప్పికలు, భయము, కోరిక, శ్రమ లాంటివన్నీ దేహేంద్రియ మనోబుద్ధుల సహజ లక్షణాలుగా తెలుసుకొన్నవాడై, వాటియెడల మోహము చెందడు. అతనికి ఆ భగవానుని పాదపద్మాలు తప్ప కోరవలసినదింకేమీ ఉండదు. జన్మచేగాని, కర్మచేగాని, పాండిత్య సంస్కారాలచేగాని, తాను అధికుడననే భావమే అతనికి రాదు. నాదీ, ఇతరులదీ అనే బేధభావమే ఉండదు. అతడెల్లప్పుడూ శాంతముగాను సమచిత్తముతోనూ ఉంటాడు. మూడులోకాల ఐశ్వర్య సంపదలూ, భోగభాగ్యాలూ లభించినా అతడు లోభ పడడు. భగవత్పాదారవింద చింతన తప్ప అతనికి ఇంకేమీ అక్కరలేదు. అట్టివాడే భాగవతోత్తముడు.

విదేహరాజైననిమి అడిగాడు: "మహాత్ములారా! శ్రీహరి వైష్ణవమాయాప్రభావంచే ముల్లోకాలనూ పాలిస్తున్నాడు కదా, అమాయఅంటే ఏమిటో నాకు తెలియజేయండి అని అడుగగా అంతరిక్షుడనే ఋషి ఇలా చెప్పాడు:

3) అంతరిక్షుడు : రాజా! పరబ్రహ్మమనీ, పరతత్త్వమనీ పరమపదమనీ, పరమేశ్వరుడనీ, శ్రీకృష్ణుడనీ వేరువేరు పేర్లతో శ్రీమన్నారాయణుడే ప్రపంచమంతా నిండి, ప్రకాశిస్తుంటాడు. ఆ అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మము నుండి ఉద్భవించిన సృజనశక్తినే ప్రకృతి అనీ, మాయఅనీ అంటారు. ఆ మాయాశక్తినే సృష్టికార్యంలో నియోగించి, భగవంతుడు సాక్షిగానుంటాడు. ప్రకృతితోనే త్రిగుణాలైన సత్త్వరజస్తమో గుణాలు పుట్టాయి. ఈ త్రిగుణాలతో కూడిన ప్రకృతి విశ్వసృష్టినంతా కొనసాగిస్తుంది. ఈసృష్టియావత్తూ ప్రళయమప్పుడు భగవంతునిలో లయిస్తుంది. సృష్టికి పూర్వమూ

లయముతరువాతనూ పరమాత్మ ఒక్కడే ఉంటాడు. ఈ సృష్టి స్థితి లయకార్యక్రమం నిర్వహించడం, లేనిది ఉన్నట్టుగను, ఉన్నది లేనట్టుగను కనిపింపజేసి, భ్రమను కల్పించడమే మాయయొక్క ధర్మము. పృథివి, జలము అగ్ని, వాయువు, ఆకాశము, అనబడే పంచభూతములతోను, త్రిగుణములతోను, ఈ సకల చరాచర విశ్వమూ, అందలి వస్తువులూ సృష్టింపబడుతాయి. పరమాత్మ, వాటియందు జీవుడై ప్రవేశించి, వాటిని ప్రవర్తింపజేసి, కర్మలు చేయించి, కర్మఫలాలను అనుభవింపజేసి, చివరికు జీవులను కర్మ బంధాలనుండి విముక్తులను చేసి, తనలో చేర్చుకొంటాడు. పరమేశ్వరుడు జీవుడై పంచభూతాలతో ఏర్పడిన దేహాలలో ప్రవేశించి, దశేంద్రియమనోబుద్ధులతో విషయాలననుభవించి, కర్మలతోనూ, కర్మఫలాలతోనూ సంగము పెంచుకొని, కర్మబద్ధుడై జనన మరణ చక్రంలో తిరుగుతుంటాడు.

ప్రళయకాలం సమీపించునప్పుడు ఒక వంద సంవత్సరాలు వర్షాలు కురియవు. పైనుండి సూర్యతాపం వలనా, క్రిందినుండి సంకర్షణుని ముఖజ్వాలల తాపం వలన భూమి మాడిపోతుంది. తరువాత ఒక వంద సంవత్సరాలు కుంభవృష్టి కురుస్తుంది. భూమి పూర్తిగా కరిగిపోయి, నీటిలో కలిసిపోతుంది. నీరు అగ్నిలో శుష్కించిపోతుంది. అగ్ని వాయువులో లీనమవుతుంది. వాయువు ఆకాశంలో అదృశ్యమవుతుంది. దాని స్పర్శగుణం పోతుంది. ఆకాశము శబ్దగుణాన్ని పోగొట్టుకొని, తామసాహంకారంలో కలిసిపోతుంది. ఇంద్రియాలూ, బుద్ధీ, రాజసాహంకారంలో కలిసిపోతాయి మనస్సూ, అధిష్ఠానదేవతలూ, సాత్త్వికాహంకారంలో కలిసిపోతాయి. అహంకారం మహత్ తత్త్వంలోనూ, మహత్తత్త్వం ప్రకృతిలోనూ, ప్రకృతి పరబ్రహ్మంలోనూ లీనమైపోతాయి. ఇది అంతా వైష్ణవమాయ అనబడుతుంది" అని చెప్పగా, నిమి ఇలా అడుగుతాడు: "అవిద్యలో మునిగియున్న మానవులు కనిపించని మాయనుండి ఎలాగ బైటపడగలరు?" అని అడుగగా, ప్రబుద్ధుడనే ఋషి, ఇలాగ చెపుతాడు:

**4)** ప్రబుద్ధుడు : రాజా! మానవుడు జీవించినన్నాళ్లూ దుఃఖనివృత్తికి, సుఖప్రాప్తికీ, ఏదో ఒక కర్మ చేస్తూనే ఉంటాడు. ఈ కర్మల ద్వారా ధనమార్జించి, దాని ద్వారా భార్యాపుత్రగృహ క్షేత్రాది సంపదలను పొంది ఇహలోక సౌఖ్యాలను అనుభవించాలనుకొంటాడు. అలాగే యజ్ఞ జపతపాదుల ద్వారా పుణ్యాన్ని ఆర్జించి, ఆ పుణ్యఫలముచే పరలోక సౌఖ్యాలను పొందాలనుకొంటాడు. కాని తాను ఆశించినట్లు సుఖాలను పొందగలుగుతున్నాడా? సుఖరూపములోనున్న దుఃఖాన్నే పొందుతున్నాడు. ఎందుచేతనంటే కర్మలచే ఆర్జింపబడే ఫలాలన్నీ అనిత్యాలు, దుఃఖప్రదాలు, నశ్వరాలు, అయితే నిత్యము సుఖప్రదము శ్రేయస్కరమూ అయిన సాధన ఏమిటి? ఒక సద్గురువు నాశ్రయించి, భాగవత ధర్మాలనాచరించడం. ప్రతిదినమూ సూర్యోదయాస్తమయాలతో ఆయువు క్షీణిస్తుండగా, దేహమూ, భార్యా, బంధు, సంపదలపై మమకారాన్ని వీడలేక, సంసారాంధకారంలోపడి కొట్టుకొంటూ, జన్మ, జరా, రోగ, మరణభయాలను సైతము లెక్కచేయక, దేహమే దేవుడని, దాన్నే పూజిస్తూ, సుఖపెట్టాలనే యాతనపడుతూ, దైవాన్నే విస్మరించి, కాలక్షేపం చేసేవారు మూఢులు. అట్టివారితో సంపర్కం పెట్టుకొనరాదు.

భాగవతధర్మాలివి : 1. సత్త్వగుణము, 2. భూతదయ, 3. హరికథామృతపానపిపాస,

4. బ్రహ్మచర్యము, 5. విషయవిరక్తి, 6. సజ్జనమైత్రి, 7. సాధుసాంగత్యము, 8. వినయశీలము, 9. అంతర్బహిశ్శుద్ధి, శుచిత్వము, 10. తపస్సు, 11. క్షమ, 12. మౌనము 13. వేదశాస్త్రాధ్యయనము 14. శాస్త్రానుష్ఠానము, 15. అహింస, 16. సుఖదుఃఖాది ద్వంద్వసహిష్ణుత, 17. భగవంతుడు సర్వవ్యాపియనినమ్ముట, 18. ముముక్షుత్వము,

19. జనసందోహవర్జనము, 20. వల్కలాలను ధరించడం, 21. అప్రయత్నంగా లభించిన దానితో సంతుష్టి చెందడం, 22. వేదాంతశాస్త్రార్థజిజ్ఞాస, 23. ఇతర దేవతానింద చెయ్యకుండడం, 24. త్రికరణశుద్ధి,

25. సత్యవచననిష్ఠ, 26. శమదమాదిగుణసాధన, 27. గృహారామక్షేత్ర కళత్ర పుత్ర విత్తాదులు హరి దత్తాలు గనుక, హరికే అర్పించడం, 28. భక్తులు కానివారి చెంత చేరకుండడం మొదలైనవి భాగవతధర్మాలు. హరి భక్తులతో చెలిమి చేస్తూ, హరి లీలలను తలచుకొంటూ ఆనంద బాష్పాలతో ఒళ్లు పులకితమవుతుండగా, మానవుడు విష్ణుమాయను దాటగలడు" అనగా విని, నిమి, ఇలా అడిగాడు:

"ఋషీశ్వరులారా! పరబ్రహ్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుని గురించి కొంచెము వివరించి చెప్పండి", అనగా, పిప్పలాయనుడనే ఆర్షభుడు ఇలా చెప్పాడు:

5. పిప్పలాయనుడు : ఈ సమస్తచరాచరాత్మక విశ్వము సృష్టింపబడడానికి, పోషింపబడడానికి, లయింపబడడానికి మూలకారణము ఆ పరమాత్మయే. అదేబ్రహ్మము, నారాయణుడూ అనబడుతుంది. ఈ బ్రహ్మమే సకల జీవరాసులయొక్క, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే మూడు అవస్థల్లోనూ, వీటి తరువాతిదైన (తురీయ) నాలుగవ అవస్థలోనూ వ్యాపించి, అంతరాత్మగ ఉంటూ వాటి యొక్క దేహేంద్రియ మనఃప్రాణాలను ప్రవర్తింపజేస్తుంది. పరమాత్మను వాక్కుచే వర్ణించడానికిగాని, మనస్సుచే ఊహించడానికిగాని శక్యము కాదు. అది పంచేంద్రియాలకు గోచరింపదు. అది స్వయంప్రకాశము గనుక దానిని ఇంకేదీ ప్రకాశింపజేయలేదు. దానిని ప్రత్యక్ష ప్రమాణాలచేగాని, పరోక్ష అనుమానాల (అంచనాల) చేగాని గ్రహించడం అసాధ్యము. పంచేంద్రియాలకు గోచరించే సమస్త దృశ్యాదృశ్య వస్తు విషయాలనన్నిటినీ పరిశీలించి, (న+ఇతి=నేతి) నేతి, నేతి, (ఇదికాదు, ఇది బ్రహ్మముకాదు) అని ఒక్కొక్క దాన్నీ తిరస్కరిస్తే, మిగిలియున్నదే బ్రహ్మము అని గ్రహించాలి. బ్రహ్మము సర్వవ్యాపకము గనుక చేతనమూ, అచేతనము కూడా బ్రహ్మమయమే. చేతనము, సత్ అనీ, అచేతనము అసత్ అనీ అనబడుతాయి. మార్పుచెందని జీవాత్మ సత్ అనీ, పరిణామ శీలమైన ప్రకృతి అసత్ అనీ తెలుసుకోవాలి. ఆత్మకు పుట్టుక, ఉనికి, పెరుగుట, మారుట, కృశించుట, మరణించుట అనే ఆరు దేహధర్మాలు సంభవించవు. ఆత్మ నిత్యమూ, చైతన్యవంతమూ, సర్వవ్యాపకమూ అయినట్టిది, చైతన్య స్వరూపమైన ఆత్మ జడ స్వరూపములో కలిగే మార్పులను గుర్తిస్తుంది. దేహాభిమానము, నేను, నేను, అంటూ ఉండే "అహం" వలన కలుగుతుంది. ఈ అహంకారమే, జీవునికి "ఈ దేహమే నేను" అనే భ్రమను కల్పిస్తుంది. ఈ దేహాభిమానమే అడ్డుతెర. దీనిని తొలగించుకోవాలంటే-నారాయణుని చరణార విందాలయందు నిశ్చలమైన ఆసక్తి కలిగియుండి, దారాపుత్ర విత్తాదులందు ఆసక్తిని తగ్గించుకొని, భక్తిని పెంచుకొని, రాగద్వేషాదులను తొలగించుకొని, చిత్తశుద్ధితో కొలిస్తే, శ్రీహరిని చేరవచ్చు." అని చెప్పగా నిమి మహారాజు, ఇలా అడిగాడు: "పూజనీయులారా! మానవుడు ఎటువంటి కర్మనాచరిస్తే పాపాలను పోగొట్టుకొని, శ్రీహరిని చేరగలడు? కర్మయోగమంటే ఏమిటి?" అని అడుగగా అవిర్హోత్రుడనే ఋషి ఇలా చెప్పాడు.

6. అవిర్హోత్రుడు : భగవంతుని యొక్క జ్ఞానమూ, అభిప్రాయాలూ వేదరూపంలో భగవంతుని నుండియే వెలువడినవి. కర్మ, అకర్మ, వికర్మలు వేదములో చెప్పబడినవి. ఈ కర్మలరహస్యము అతిగహనము. సామాన్యులకు అర్థము కాదు. కర్మ, మూడు రకాలు. నిత్యకర్మ ఎప్పుడూ చేయవలసియున్న సంధ్యావందనాది కర్మలు. నైమిత్తిక కర్మ ఏదైనా ఒక ప్రతేకమైన నిమిత్తము కొరకు చేసేది-శ్రాద్ధ, ఉపనయనాది కర్మలు. కామ్యకర్మ ఏదైనా ఒక కోరిక సిద్ధించాలని చేసేది-పుత్రప్రాప్తి-మొదలైన-కర్మలు. శాస్త్ర నిషిద్ధ కర్మలు వికర్మలనబడుతాయి. అకర్మ అంటే కర్మను చేయకుండడం, లేదా నైష్కర్మ్యస్థితి. మనిషి ఏ కర్మనూ చెయ్యకుండా ఉండడం కుదరదు గనుక కర్మలు చేస్తున్నా, కర్మబంధ మేర్పడని రీతిగా చేయబడిన కర్మలు, అకర్మలనిపించుకొంటాయి, అనగా ఎలాంటి ప్రతిఫలాన్నీ ఆశించకుండా చేసిన కర్మలనూ, వాటి ఫలాలనూ, పరమేశ్వరార్పణ బుద్ధితో పరహితార్థము పనులు చేస్తే, అది అకర్మ అవుతుంది. ఇదే కర్మయోగ రహస్యము. వేదాలలో అనేక కర్మలు, అనేకమైన ఫలాల గురించి చెయ్యాలని నిర్దేశింపబడినది. ఇవి కామ్యకర్మలు. వీటివలన భగవంతుని యందు అచంచల విశ్వాసమూ, మనుగడకు, భగవదనుగ్రహం అత్యంతావశ్యకం అనే ఆశ్రితభావమూ ఏర్పడుతాయి. క్రమంగా భగవత్తత్త్వం అర్థమవుతున్న కొద్దీ కోరికలయందు ఆసక్తి తగ్గి, నిష్కామంగానూ, దైవప్రీత్యర్థంగానూ, లోక కల్యాణార్థంగానూ కర్మలను చేపట్టడానికి ఉత్సాహం కలుగుతుంది. చిన్నపిల్లలకు చేదుమందును తినిపించడానికి, తేనెలో కలిపిపెట్టే విధంగా ముందుగా కోర్కెలు తీరడానికి కర్మలను చెయ్యవలెనని వేదాలు చెప్పినా, రాను రాను పరహితార్థం పనులు చెయ్యడానికి ప్రేరణ కలిగిస్తాయి. నిష్కామకర్మయే భగవదర్పిత కర్మలను చేయించడానికి దారితీస్తుంది. ఇదే కర్మ యోగము. భగవంతుని ఆరాధించడానికి వేదమంత్రాలతోనూ, తంత్ర పద్ధతులతోనూ చేయబడే కర్మలనుకూడ,

కర్మయోగమంటారు. ప్రారంభదశలో భక్తులు విగ్రహాలనూ, ప్రతీకాలనూ, పూజిస్తూ భగవంతుడు వాటియందే ఉన్నట్టు భావిస్తారు. రానురాను భగవంతుడు సర్వజీవులయందూ ఉన్నట్టు తెలుసుకొంటారు. చివరకు తమ హృదయకమలంలోనే ఆత్మానుభూతిని పొందుతారు. అప్పుడు వారి కర్మబంధము వీడుతుంది." అని చెప్పగా నిమి ఇలాగ అన్నాడు: "మునీంద్రులారా! శ్రీహరి ఏయే అవతారాలెత్తి ఏయే కార్యాలు చేశాడో చెప్పగోరుతున్నాను" అనగా ద్రమిళుడనే ఋషి ఇలా చెప్పాడు:

7) ద్రమిళుడు : రాజా! భగవంతుని అవతార విశేషాలను ఆ బ్రహ్మరుద్రులు కూడ చెప్పలేరు. నేను నీకు కొన్నింటిని గురించి చెపుతాను. భగవంతుని మొట్టమొదటి అవతారము విరాట్-పురుషుడు. తరువాతి అవతారాలు, సృష్టి స్థితి లయ కర్మలను నిర్వహించే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. ఆ తరువాత అవతారాలు ధర్మునకూ, దక్షపుత్రిక అయిన మూర్తికీ జన్మించిన నరనారాయణ ఋషులు. వారిలో నారాయణుడు బదరి కాశ్రమంలో తపస్సు చేసుకొంటుంటే ఇంద్రుడు భయపడి, మన్మథుని, అప్సరసలనూ పంపించి, అతని తపస్సును భంగం చెయ్యాలనన్నాడు. మన్మథుని బాణాలకు చలించని నారాయణ ఋషి, అంతా గ్రహించినవాడై, వాళ్లను దగ్గరగా రమ్మని ఇలా అన్నాడు: "ఓ కామదేవా! దేవకన్యలారా! మీ చర్యలు నన్ను చలింపజేయలేవు. నేను శపిస్తానని భయపడవద్దు. మా ఆతిథ్యాన్ని స్వీకరించి, వెళ్లండి" అనేసరికి, వాళ్లంతా సిగ్గుపడి, నారాయణుని స్తుతించారు. అక్కడ ఆ ఋషీశ్వరునకు పరిచర్యలు చేస్తున్న అనేకమంది సుందరీమణులను చూచి, మన్మథుడు, అప్సరసలు ఆశ్చర్యపోయారు. నారాయణుడు వారితో ఇలా అన్నాడు: "మా ఆశ్రమంలో నున్న ఈ సుందరీమణులలో మీకు నచ్చిన ఒకామెను ఎంచుకొని, మీతో తీసుకొనిళ్లి ఇంద్రునకు మా కానుకగా ఇవ్వండి. ఆమె ఇంద్రసభకు శిరోభూషణంగా నుండగలదు" అనగా వారు ఊర్వశిని ఎన్నుకొని తీసుకెళ్లారు. ఇంద్రుడు తనకుత్సితానికి సిగ్గుపడ్డాడు. ఇతర ముఖ్యమైన అవతారాలివి: హంసావతారము, దత్తాత్రేయావతారము, సనక, సనందన, సనాతన, సనత్ కుమారులు, ఋషభ(మా తండ్రి), హయగ్రీవ, మత్స్య, వరాహ, కూర్మ, అవతారాలు, హరి అనే అవతారంతో గజేంద్రుని రక్షించాడు, నరసింహావతారమెత్తి హిరణ్య కశిపుని చంపి, ప్రహ్లాదుని రక్షించాడు, వామనావతారమెత్తి బలిని అణచి, ఇంద్రుని ఆదుకొన్నాడు, పరశురాముడై దుష్ట క్షత్రియుల్ని సంహరించాడు, శ్రీరామచంద్రుడై రావణాది రాక్షసులను అంతమొందించాడు, శ్రీకృష్ణుడై దుష్టసంహారం చేసి, భూభారాన్ని తగ్గించాడు. తరువాతకూడ, అనేక అవతారాలెత్తి లోకకల్యాణం చేకూర్చుతాడు." అని చెప్పగా విదేహరాజు, ఇలా అడిగాడు: "ఓ పుణ్యమూర్తులారా! లోకంలో కొందరు ఇంద్రియలోలులై సంసారబద్ధులై శ్రీహరిని ఆశ్రయించడానికి ఇష్టపడరు. వారిగతి ఏమిటి?" అనగా చమసఋషి ఇలా చెప్పాడు:

8) చమసుడు : రాజా! సృష్టి ప్రారంభంలో ఆదిపురుషుడై అవతరించిన పరమాత్మ యొక్క ముఖమునుండి, బాహువుల నుండి, తొడలనుండి, పాదాలనుండి మానవులు ఉద్భవించారు. ముఖము నుండి పుట్టినవారు సత్త్వగుణప్రధానులై వేదాధ్యయన పరులై బ్రాహ్మణులన బడ్డారు. బాహువులనుండి పుట్టినవారు రజోగుణ ప్రధానులై బలపరాక్రమ శాలురై క్షత్రియులనబడ్డారు. ఊరువులనుండి పుట్టినవారు రజోగుణ తమోగుణ సహితులై ఉత్పాదన, వినిమయ శీలురై వైశ్యులనబడ్డారు. పాదాలనుండి పుట్టినవారు తమోగుణ ప్రధానులై శారీరక సేవాతత్పరులై శూద్రులనబడ్డారు. వీటిని చతుర్వర్ణాలుగా పేర్కొన్నారు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము అనబడే నాలుగు ఆశ్రమ ధర్మాలేర్పడినవి. మానవులు తమతమ వర్ణాశ్రమ ధర్మాలను పాటిస్తూ, తమ ఆదిపిత అయిన ఆ పరమేశ్వరుని ఆరాధించాలి. అలాగ చేయని వారిపై దయతలచి, వారిని సరియైన మార్గంలో పెట్టించే బాధ్యత ఆ దేశపు ప్రభువుపైన ఉంటుంది. వేదవాక్కుల యొక్క యథార్థ భావాన్ని గ్రహించ లేని కొందరు విద్యావేత్తలు కూడ విషయ, వస్తు, విత్త, సంగ్రహంలోనే జీవితం వెళ్లబుచ్చుతారు. అలాంటి వారు భగవద్భక్తులను చూచి అపహసిస్తారు. సంభోగాది విషయ లోలత్వంలో మునిగి, తమతమ ధన, జన, యౌవన, విద్యా, వంశ, ఆధిక్యతలకు గర్వ, మద, అహంకారాలతో కన్నుగానక, సాధు సజ్జనులనూ, దైవాన్నీ కూడా అలక్ష్యంచేస్తూ అవమానిస్తూ ద్వేషిస్తారు. కేవలం తమ సౌఖ్యమును గురించే ధనసంపాదన చేసేవారూ, తామే గొప్పవారమని ఇతరులను

అసహ్యించుకొనేవారూ, ఘోరపాపము చేసిన వారవుతారు. వాసుదేవుని యందు భక్తిలేనివారు సర్వమునూ కోల్పోయినవారవుతారు. ప్రత్యక్షముగా కంటికి కనిపించని మోక్షప్రాప్తికోసం, చెంతనున్న సుఖభోగాలను వదులుకోవడం వెర్రితనం అని భావించి, హరీ గిరీ పూకక్కరలేదు, సుఖంగా కాలక్షేపం అయిపోతే చాలు అనుకొనేవారు నిశ్చయంగా నరకానికి చేరుతారు." అని చెప్పగా నిమి ఇలా అడుగుతాడు: "జగన్నాథుడు, ఏయే యుగాలలో ఏయే నామ రూప వర్ణాలలో వెలశాడో, ఏయే రీతులలో పూజింపబడ్డాడో తెలియజేయండి" అంటే-కరభాజన ఋషి ఇలా చెప్పాడు:

9) కరభాజనుడు : కృతయుగములో భగవానుడు తెల్లనివర్ణముగలవాడై చతుర్బాహుడై జడలు దాల్చి, నారవస్త్రాలు ధరించి, కృష్ణాజినము, యజ్ఞోపవీతము, అక్షమాల, దండము కమండలవులతో బ్రాహ్మణవేషాన ఉంటాడు. ఈ యుగములో మనుష్యులు, శాంత స్వభావులై, వైరములేనివారై, సర్వభూతాలయందు ప్రేమగలవారై, సమదర్శులై యుంటారు. శమదమములు పాటిస్తూ ధ్యాన యోగముచే భగవానుని ఆరాధిస్తారు. మునులు భగవానుని హంసుడు, సువర్ణుడు, వైకుంఠుడు, యోగీశ్వరుడు, ధర్ముడు, అమరుడు, అవ్యక్తుడు అని స్తుతిస్తారు.

త్రేతాయుగములో భగవానుడు ఎఱ్ఱని మేనిఛాయతో చతుర్బాహుడై, సువర్ణ వర్ణ కేశాలతో, మేఖలను ధరించి, యజ్ఞమూర్తియై వేదశరీరుడై స్రుక్కు, స్రువము (యజ్ఞ పరికరాలు) ధరించిన వాడై శోభిల్లుతూ, బ్రహ్మాదులచే యజ్ఞుడు, పృశ్నిగర్భుడు, సర్వదేవుడు, ఉరుక్రముడు, వృషాకపి, జయంతుడు, ఉరుగాయుడు, అనే వివిధ నామాలతో స్తుతింపబడ్డాడు.

ద్వాపరయుగములో భగవానుడు శ్యామలవర్ణుడై పీతాంబర ధారియై, రెండుబాహువులతో, దివ్యాయుధధారియై శ్రీవత్సచిహ్నముతో, కౌస్తుభవనమాలధారియై, ఛత్రచామరాది మహారాజ లాంఛనాలతో సేవింపబడినవాడై శోభిల్లుతుంటాడు. ఆయన చక్రవర్తులచేత జనార్దన, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ, విశ్వరూప, విశ్వాత్మక, పరమపురుష, సర్వభూతాత్మక అని వివిధ నామాలతో ఆరాధింపబడ్డాడు.

కలియుగములో భగవానుడు, ఇంద్రనీలవర్ణుడై, కృష్ణనాముడై, ద్విబాహువై, దివ్యాయుధుడై, వెలసియుంటాడు. ఈ యుగములో భక్తులు ఆయనను హరి, రామ, నృసింహ, పద్మనాభ మొదలైన నామాలతో స్తుతిస్తారు. ఈ యుగములో కేవలం భగవన్నామ సంకీర్తనం చేతనే మానవుడు మోక్షము పొందగలడు. కనుక ఇతర యుగాల్లో జన్మించి యుండిన వారు కూడ కలియుగంలోనే మళ్లీ జన్మించి నామసంకీర్తన ద్వారా సులువుగా మోక్షపదాన్ని పొందగోరుతుంటారు. నారాయణపాదసేవాతత్పరులు, పుణ్యనదులలో స్నానాదికాలను చేసి, దానాది పుణ్యకర్మలు చేస్తూ, శ్రీహరికథాగానామృత రసాస్వాదన అనుభూతిని పొంది, విష్ణుధ్యానంలో నిష్ణాతులై పరమపదాన్ని పొందుతారు." అని చెప్పెను.

ఈ విధంగా ఋషభపుత్రులు నిమికి బోధించి, అతనిచే పూజింపబడి నిష్క్రమించారు - అని వసుదేవునితో నారద మహర్షిచెప్పి, "ఈ ఆర్షభుల బోధనువిని, మిథిలేశ్వరుడైన నిమి, భాగవతధర్మాన్ని అవగతం చేసుకొని, ఆచరించి, నిర్వాణ పదాన్ని పొందాడు. వసుదేవా! శ్రీహరి చరిత్రలను విన్నావు గనుక నీ యొక్క పాపాలు తొలగిపోతాయి. శ్రీకృష్ణుడు నీ పుత్రుడే అనే మోహాన్ని తొలగించుకొని, అతడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే యని గ్రహించి, ఆరాధించు. అతడు మీ కుమారుడై జన్మించి, మీతో కలిసిమెలసియుంటూ, మీకు దర్శన స్పర్శన సంభాషణ, ప్రేమ, సరససల్లాపాల భాగ్యాన్ని ప్రసాదించినందుకు మీ జన్మలు ధన్యమైనవి. మీరు పవిత్రులైనారు. శత్రువులైన శిశుపాలాదులే అతని అనుగ్రహం పొందారు కదా, మరి మీయెడల ఆ స్వామి, అనుగ్రహం ప్రసాదించడా!" అని నారదుడు చెప్పగా దేవకీ వసుదేవులు పరమానంద భరితులై శ్రీకృష్ణుడు పరమాత్ముడే అని పరిపూర్ణ విశ్వాసం పొందారు.

## వైకుంఠానికి ఆహ్వానము

శ్రీశుకయోగీంద్రుడు పరీక్షిత్తుతో చెప్పుతున్నాడు: బ్రహ్మదేవుడు రుద్ర - ఇంద్రాది దేవతలను, ప్రజాపతులను, సనకాది మునివర్యులను తోడ్కొని, శ్రీకృష్ణసందర్శనాభిలాషియై ద్వారకకు వచ్చాడు. త్రిజగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుని దర్శించినంతనే వారందరికీ మేనులు పులకించగా, ఆనందాశ్రువులతో కన్నులు చెమర్చగా, వారు ఆ దేవదేవుని

స్తుతించి, ఇలా విన్నవించారు: "సర్వేశ్వరా! సృష్టి, స్థితి, లయాలను రచించి, నిర్వహించి వినోదించే జగన్నాటకసూత్రధారీ! నీలీలలు అద్భుతాలు మాకెవ్వరికీ, అంతుచిక్కనివి. వైష్ణవ మాయకూ, ప్రకృతి చేష్టితాలకూ, త్రిగుణాలకూ, కర్మబంధాలకూ, అసంగుడవూ, అతీతుడవూ, అప్రమేయుడవూ అయిన నీవు సామాన్య మానవునిలాగ ఈ లోకములో పదహారువేల మంది భార్యలతో సంసారములో చిక్కుకొన్నట్లు నటిస్తున్న నటవర చక్రవర్తివి. మా అందరి కోరిక ప్రకారము, భూభారాన్ని నివారించడానికి దుష్టులను శిక్షించడానికీ, శిష్టులను రక్షించడానికీ పూనుకొని, నీవు వైకుంఠం విడిచి ఈ లోకానికి వచ్చి ఇప్పటికి నూట ఇరవై మానవ సంవత్సరాలు గడిచినవి. నీ అవతార కార్యము విజయవంతముగ ముగిసినది. స్వామీ! ఇక ఈ అవతారాన్ని చాలించి, తిరిగి, వైకుంఠానికి రావలసిందిగా వేడుకొంటున్నాము." అని ప్రార్థించగా, "త్వరలోనే యాదవ కులాంతము జరుగనున్నది గనుక ఆ కార్యం ముగిసిన తరువాత నేను వైకుంఠానికి మరలి వస్తాను"- అని మాట ఇచ్చిన స్వామికి వాళ్లంతా నమస్కరించి నిష్క్రమించారు.

బ్రహ్మాది దేవతలకు మాట ఇచ్చిన స్వామి ఒకనాడు యాదవ ముఖ్యులందరినీ సమావేశపరచి, ఇలా చెప్పాడు: "యాదవ శ్రేష్ఠులారా! కొద్ది రోజులుగా కొన్ని అశుభశకునాలూ, ఉత్పాతాలూ సంభవిస్తున్నవి. బ్రాహ్మణ శాపం పని చెయ్యనారంభించినట్లున్నది. ఇక్కడ మనం ఉండడం క్షేమకరం కాదు. అందుచేత మన మందరమూ, పరమపవిత్రమైన ప్రభాసక్షేత్రానికి వెళ్లి స్నానాదులు చేసుకొని, దేవతలకు, పితరులకు తర్పణములు చేసి, బ్రాహ్మణులకు దానాలిచ్చి భోజనాలు పెట్టినస్తే పాపాలు తొలగగలవు" అని చెప్పగా, అందరూ సరే అని భార్యాపుత్ర బంధు మిత్ర పరివార సామగ్రులతో ద్వారకను విడిచి, ప్రభాస తీర్థానికి తరలిపోయారు.

## ఉద్ధవ గీత : ఉద్ధవుడు

ద్వారకను విడిచి వెళ్ళుడని శ్రీకృష్ణుడు యాదవులకు చేసిన హెచ్చరికను వినిన ఉద్ధవుడు శ్రీకృష్ణుని సమీపించి ఇలా అన్నాడు: "ప్రభూ! దేవాదిదేవా! నీ దివ్య సంకల్పం నాకు కొద్దిగా అర్థమయినది. ఋషిశాపం వలన జరుగనున్న యాదవకుల నిర్మూలనం తరువాత, నీవు నీ దివ్య ధామానికి మరలిపో సంకల్పించుకొన్నట్లున్నది. నా ఊహయే నిజమైతే, నీ నుండి ఎడబాటును నేను సహించగలనా స్వామీ! నన్ను కూడ నీతోనే తీసుకొనిపోతే నేను నీ పాదసేవ చేసుకొంటూ ఉంటాను. అనుగ్రహించు." అని కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న ఉద్ధవునితో శ్రీకృష్ణుడిలా అన్నాడు. "ఉద్ధవా! నీ ఊహ సరియైనదే. నా అవతారకార్యం సమాప్తమైనది. బ్రహ్మాదులు వచ్చి వైకుంఠానికి మరలి రమ్మని వేడుకొన్నారు. నేటికి ఏడవదినాన ద్వారకా నగరాన్ని సముద్రుడు ఆక్రమించుకొంటాడు. యాదవకులనాశనము కూడ ఆ నాటికి ముగుస్తుంది. అప్పటినుండి కలియుగం ఆరంభమవుతుంది. ఈ కలియుగంలో మానవులు ధర్మాన్ని విడిచినవారూ, ఆచారములేనివారూ, అన్యాయపరులూ, మిక్కిలి రోషావేశపరులూ, మందమతులూ, అల్పాయుష్కులూ, బహురోగ పీడితులూ, నిష్ఫలమైన పనులు చేసేవారూ, నాస్తికులూ అయి ఒకరినొకరు మెచ్చక నచ్చని వారై యుంటారు. కాబట్టి నీవు బంధుమిత్రులయందు అనుబంధాలను వదిలించుకొని, ఇంద్రియభోగాలలో తగుల్కొనక అన్ని పుణ్యతీర్థాలనూ సందర్శించి, పవిత్ర అనుభూతులను పొంది, పంచేంద్రియాలు గ్రహించే విషయ వస్తువులన్నీ నశించేవే అని తెలుసుకొని, వాటిని దరిజేరనీయకుము. ఇంద్రియమనోవికారాలను నిగ్రహించి, ఈషణత్రయాన్ని వర్జించి, మోదఖేదాదులయందు సమభావముతో మెలగి, ఈ జగమంతా పరమాత్మచే అధిష్ఠింపబడినదిగా తెలుసుకొని, మాయ అతని వశముందున్నదని తెలుసుకొని, జ్ఞాన విజ్ఞాన యుక్తుడవై, ఆత్మానుభవ సంతుష్టుడవై, విశ్వమంతా నేనే అని ఎరిగి వర్తించాలి." అని శ్రీకృష్ణుడు బోధించాడు. ఉద్ధవుడు భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లి, ఇలా అన్నాడు: "ప్రభూ! నీ మాయకులోనైన నావంటి పామరులైన సాంసారికులకు వైరాగ్యము, సన్న్యాసము అంత సులువుగా అబ్బవు కదా! అట్టివారికి గత్యంతరమేమిటి? బ్రహ్మాదిదేవతలు కూడా భ్రాంతులైపోతుంటారు. నీ భక్తులైన పరమభాగవతులు మాత్రము నీమాయకు లోబడరు. యోగీంద్రులకైనా, గృహస్థులైన స్త్రీ పురుషులకైనా నీనామస్మరణమే మోక్షప్రదము, కనుక ఓ పరమేశ్వరా! నీ చరణాలశరణమే నేను ఆశ్రయిస్తున్నాను. నాపై కృపతో

నన్ను అనుగ్రహించు." అని, ప్రియభృత్యుడైన ఉద్ధవుడు వేడుకొనగా, స్వామి కరుణతో ఇలా అన్నాడు: "ఉద్ధవా! ఆత్మకు ఆత్మయే గురువు. కుతర్కాలలో చొరక, సన్మార్గవర్తివై నాపరంధామానికి చేరగలవు. యోగులు నన్ను ఎల్లప్పుడూ పరమ పురుషునిగా ధ్యానిస్తుంటారు. జీవజంతువులలో మానవులు ఉత్తములు. మానవులలో నిరంతర ధ్యాన నిష్ఠులైన యోగులు ఉత్తములు. సంశయగ్రస్తులు నన్ను తెలుసుకొనలేరు. నేను సత్త్వగుణము గలవారిచేత గ్రహింపబడగలను, అని తెలుసుకొని తమ చిత్తమునందు జీవాత్మను పరమాత్మతోనైక్య పరచుకొనగలుగువారు పరమయోగీంద్రులు, పరమజ్ఞానులు." అని చెప్పి, భగవానుడు ఉద్ధవునకు అవధూత, యదు, సంవాదాన్ని ఇలా చెప్పాడు:

## అవధూత యొక్క గురువులు

ఒకనాడు యదుమహారాజు సంచరిస్తుండగా, వర్ణాశ్రమ ధర్మాలను, దేహసంస్కారాలనూ విడిచి, నిశ్చింతగా, నిర్లిప్తతతో, ఆనందంగా తిరుగుతున్న ఒక దివ్యపురుషుని వంటి అవధూతను. (దత్తాత్రేయుని) చూచాడు. రాజు ఆశ్చర్య చకితుడై ఇలా అడిగాడు: "ఓ మహాత్మా! మా వంటి సంసారులం, ఇంద్రియభోగాలూ, భార్యాపుత్ర గృహ వస్తు వాహనాది సంపదలూ ఉంటేనే సుఖించగలం అని అనుకొంటాము. కాని నిన్ను చూస్తుంటే, ఇవి ఏవీలేకపోయినా, నీ ముఖ వర్చస్సు ఆనందంతో వెలిగిపోతున్నట్టు కనిపిస్తుంది. మేము మా జీవితమంతా అర్థకామాలను పొందడానికే శ్రమించుతాము. నీవు మాత్రము ఏమీ కోరకుండా, ఎలాంటి కర్మ చెయ్యకుండా, సర్వమూ త్యజించి, పసివానివలె, జడునివలె, జ్ఞాననిధివైనా, అజ్ఞానివలె సంచరిస్తున్నావు. ఆనందమే నీ ఆహారమేమో అనిపిస్తుంది. ఇలాంటి అద్భుత స్థితి నీకు ఎలాగ ప్రాప్తించినదో తెలుసుకోవాలని ఉన్నది. దయచేసి చెప్పవలసినదని ప్రార్థిస్తున్నాను." అనగా అవధూత, ఇలాగ ప్రారంభించాడు: "రాజా! నా బుద్ధి అనేకులైన గురుతుల్యులనుండి, అనేకమైన విషయాలను సేకరించి, జ్ఞానాన్ని సంపాదించినది. వాటిని, వరుసగా వివరిస్తాను విను:-

1. భూమినుండి సహిష్ణుత, భూజాతాలైన పర్వతాలూ వృక్షాలనుండి స్థిరత్వమూ, ఆత్మార్పణము, లోకోపకార పరత్వమూ, ప్రారబ్ధ కర్మలను తితీక్షతో అనుభవించడం నేర్చుకొన్నాను.

2. వాయువు ప్రాణవాయువూ, బహిర్వాయువూ అయిసంచరిస్తుంది. ప్రాణవాయువు శరీరానికి ఎంత అవసరమో అంతే స్వీకరింపబడునట్లు, అన్న పానాదులు శరీరానికి ఎంత అవసరమో అంతే తీసుకొనాలనీ, బహిర్వాయువు సుగంధ దుర్గంధాలను సమభావంతో గ్రహించి, తీసుకొని పోవునట్లు, శీతోష్ణ సుఖదుఃఖాదులను సమభావంతో గ్రహించాలనీ నేర్చుకొన్నాను.

3. ఆకాశము లోపలా, బయటా, అంతటా, వ్యాపించియుండి, దేని చేతనూ మార్పుచెందకుండా, దేనికీ అంటకుండా, నిరాకార నిర్గుణమైయుండునట్లు, పరమాత్మ కూడ, సర్వవ్యాపి, నిర్వికార, నిరంజన, నిర్గుణుడై యుంటాడని తెలుసుకొన్నాను.

4. జలము మాలిన్యాలను పరిశుద్ధ పఱచి, పవిత్రీకరించునట్లు, మహాత్ములు తమ సంపర్కంలోనికి వచ్చిన వారియొక్క అజ్ఞాన మలినాన్ని తొలగించి, తమ ఉపదేశాలతో వారిని పవిత్రులను చెయ్యాలని తెలుసుకొన్నాను.

5. ఇదిమంచిది, అది మంచిదికాదు, అనే విచక్షణ చూపకుండా అగ్ని అన్నింటినీ ఆరగించేటట్లు, యోగి తనకు సంక్రమించే అనుభవాలను సమదృష్టితో స్వీకరించాలి. అగ్నికి ప్రత్యేకమైన ఆకారమేదీ ఉండదు. అది ఏ వస్తువులో ప్రవేశిస్తుందో దాని ఆకారాన్నే వహిస్తుంది. అలాగే ఆత్మకు ఆకారం ఉండదు. అది, జీవునిగా ఏ శరీరాన్ని ధరిస్తుందో, ఆ ఆకారమే దానిది అనిపిస్తుంది. అగ్నినుండి, ఈ సత్యాన్ని తెలుసుకొన్నాను.

6. చంద్రుని యొక్క కళలు తరుగుట, పెరుగుట, లాగానే, శరీరం పెరగడం క్షీణించడం జరుగుతుందని తెలుసుకొన్నాను.

7. సూర్యుడు లోకాలకు వెలుగూ, వేడీ ఇస్తాడు నీటి నుండి ఆవిరిని తీసుకొని, వర్షరూపంలో లోకాలకు ప్రసాదిస్తాడు. ఇంతగా లోకకల్యాణం చేస్తున్నా, కర్తృత్వ భావం లేనివాడై యుంటాడు. అలాగే యోగి లోకకల్యాణ కర్మలు చేస్తుండాలని తెలుసుకొన్నాను. సూర్యుడు తన వెలుగులో జరుగుతున్న సకల కర్మలకూ సాక్షిభూతుడైయుండీ, ఆ కర్మఫలాలకు

బాధ్యుడు కానట్లు, ఆత్మ ఉపాధిచే చేయబడిన కర్మల పాపపుణ్యాలచే అంటబడదని గ్రహించాను. ఒకే సూర్యుడు అనేక పాత్రలలో నున్న నీటిలో అనేక సూర్యులుగా ప్రతిబింబిస్తున్నట్లు, ఒకే పరమాత్మ, వేర్వేరు ఉపాధులలో అనేక-ఆత్మలైయున్నట్లు భ్రమను కల్పిస్తుందని తెలుసుకొన్నాను.

8. ఒక పావురము ఒక చెట్టుపై నొక గూడు కట్టుకొని ఒక ఆడుపావురాన్ని జత చేసుకొన్నది. ఆ రెండు పక్షులూ అన్యోన్యంగా నుంటూ విడివడకుండా జీవించసాగాయి. కొన్నాళ్లకు గ్రుడ్లుపెట్టి పొదిగి, పిల్లల్ని చేసుకొన్నాయి. ఆ పిల్లల గురించి ఆహారంకోసం అవి రోజంతా శ్రమించి, ఆహారంతెచ్చి, వాటిన్ని పోషించి పెద్దచేశాయి. పక్షి పిల్లలు చెట్టుక్రిందికి వచ్చి ఆడుకొంటూ ఒక బోయవాని వలలో చిక్కుకొన్నవి. పిల్లల్ని విడిపింపబోయి, తల్లిపక్షికూడ వలలో చిక్కుకొన్నది. మగపావురం వచ్చి, గూడు శూన్యంగా నుండడం చూచి, భార్యాబిడ్డల వియోగ బాధను భరించలేక, వలలో నున్న పరివారాన్ని చూచి, విడిచి వెళ్లలేక, వాటిని విడిపించాలని ప్రయత్నించి, తానుకూడ వలలో చిక్కుకొన్నది. ఇలాగ విలపించినది - "ఓహో! పుట్టినప్పటినుంచీ, స్వేచ్ఛావిహారినైయున్న నేను, స్త్రీ వ్యామోహంలో పడి, ఈ వలలో చిక్కుకొన్నాను. ఇప్పుడు నన్ను రక్షించేదెవ్వరు?" అని. ఈ పావురం నుండి నేను నేర్చుకొన్నదేమిటంటే - మానవుడు భార్యా గృహ పుత్రాదులయందు మమకారాన్ని పెంచుకొని సంసారపువలలో చిక్కుకొని తన జీవితలక్ష్యమైన మోక్షసాధనను విస్మరిస్తాడు. అలాగ చెయ్యరాదని.

9. కొండచిలువనుండి నేను తెలుసుకొన్నదేమిటంటే, యోగి ఆహారం గురించి వెదుక్కొంటూ నానాయాతనా పడకుండా, లభించిన ఆహారం ఎటువంటిదైనా, దాని బాగోగుల గురించి విమర్శించకుండా ఆరగించాలి. ఆహారం లభించకపోతే, సహనంతో నిరాహారంగా ఉండిపోవాలి.

10. సముద్రము గంభీరముగనూ, సముద్రగర్భంలో నిశ్చలంగాను ఉంటుంది. అలాగే యోగి గంభీరుడై, నిశ్చలమనస్కుడై, ప్రశాంత చిత్తుడై యుండాలి. నదులనుండి ఎంతనీరు వచ్చినా సముద్రం పొంగి పొరలదు. నదులు ఎండిపోయినా సముద్రం శుష్కించిపోదు. అలాగే మోద ఖేదాలలో యోగి, సమవర్తనుడై యుండాలి. నదీ ప్రవాహాల వల్ల పొంగిపొరలని సముద్రం లాగ పైనుండి దండెత్తే ఇంద్రియ విషయాలకు యోగి పొంగడు, చలించడు.

11. మిడుత దీపపు కాంతియొక్క ఆకర్షణకు పరవశించిపోయి నశించునట్లు, మానవుడు సుందర రూపాలయొక్క ఆకర్షణలో పడి నశించుతాడని తెలుసుకొన్నాను.

12. తేనెటీగ నుండి తెలుసుకొన్న దేమిటంటే, అది పుష్పాల నుండి తేనెను సంగ్రహించి, తేనె పట్టులో దాచి, దానిని విడిచి పెట్టలేక, అందులోనే నశిస్తుంది, కనుక ఆ విధంగా సంగ్రహించబడి దాచబడినవి పరులపాలు కావడమే కాకుండా, తానే నశిస్తాడు అనీ. అందుచేత, యోగి ఎప్పటికి ఏది లభిస్తే దానితోనే కాలంగడపాలి గాని, సంగ్రహించి, దాచుకొనరాదు, అని తెలుసుకొన్నాను.

13. ఏనుగు నుండి నేర్చుకొన్న పాఠం ఏమిటంటే - ఏనుగులను పట్టేవారు, ఒక పెద్ద గోతిని త్రవ్వి, దాని పైపైన కొమ్మలు పరిచి, అక్కడే ఒక ఆడు ఏనుగును ఉంచుతారు. మగ ఏనుగులు వ్యామోహంలోపడి, కన్నుగానక, గోతిలో పడి, పట్టుబడతాయి, లేదా ఆ ఆడు ఏనుగు గురించి అవి పోట్లాడుకొని, చంపు కోవడమో గోతిలో పడడమో చేస్తాయి. అన్ని వ్యామోహాలకంటే స్త్రీ వ్యామోహం అత్యంత ప్రమాదకరం గనుక, యోగి స్త్రీ యొక్క బొమ్మను కూడ చూడరాదని తెలుసుకొన్నాను.

14. తేనెపట్టును తీసేవాని నుండి నేర్చుకొన్నదేమిటంటే సద్వినియోగము చెయ్యక దాచిపెట్టబడిన ధనము తస్కరులను ఆకర్షించి, ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది, కనుక సంగ్రహాసక్తినీ, లోభ ప్రవృత్తినీ దరిజేర నివ్వరాదని తెలుసుకొన్నాను.

15. లేడి నేర్పిన పాఠమేమిటంటే - అడవిలో స్వేచ్ఛగా విహరించే లేడి వేటగాని వాద్యాలకు పరవశించిపోయి, పట్టుబడునట్లుగా యోగి ముఖ్యముగా స్త్రీలు ప్రదర్శించే నృత్యగానాలచే ఆకర్షింపబడరాదు అని. మహాయోగియైన ఋష్యశృంగుడే,స్త్రీల యొక్క నృత్య, గానాదికములైన ఆటపాటలకు పరవశుడై, తండ్రిని విడిచి వాళ్లతో దూరప్రదేశానికి వెళ్లిపోయాడు కదా!

16. చేప జిహ్వాచాపల్యానికి లోనై గాలానికి ఉన్న ఎరను మ్రింగి, ప్రాణం పోగొట్టుకొనడం తెలుసుకొన్నయోగి దుర్జయమైన జిహ్వేంద్రియాన్ని జయించడం నేర్చుకోవాలని తెలుసుకున్నాను.

17. పింగళ అనే వేశ్య నుండి ఒక పాఠం నేర్చుకొన్నాను. మిథిలానగర వాసిని అయిన ఆవేశ్య ఒకనాటి రాత్రి బాగా అలంకరించుకొని, వీధిగుమ్మం వద్ద నిల్చొని విటుల గురించి నిరీక్షిస్తుండేది. ఒకనాడు ధనాశచే ఇంకా గొప్ప ధనవంతుడు అయిన విటుడు కావాలని వచ్చిన వారినందరినీ తిరస్కరించి పంపివేసినది. అర్ధరాత్రి దాటినా తనకు నచ్చిన ధనిక విటుడెవ్వడూ రాలేదు. ఆమె నిరాశజెంది, ఆలోచించసాగినది. ధనాశచే తానుచేస్తున్న పని ఏమిటి? అసలు తనకు ధనమెందుకు? ఈ పురుషులందరూ తమ సుఖంకోసం ఇచ్చే ఈ ధనంయొక్క విలువేమిటి? ఈ విధంగా ఆలోచించగా ఆమెకు వైరాగ్యం వచ్చేసినది. "ఈ సుఖసంపదలన్నీ తాత్కాలికమైనట్టివే. శాశ్వత ఆనందాన్నిచ్చేవాడు ఆ సర్వేశ్వరుడే! ఇప్పటికే కాలసర్పం నాఆయుస్సులోని చాలా భాగం కబళించివేసినది కదా! మిగిలిన అవకాశంలోనే జీవితాన్ని చక్కబెట్టుకోవాలి." అని నిశ్చయించుకొని, సర్వమూ త్యజించివేసి, ఆ సర్వేశుని పాదాల నాశ్రయించినది. ఆమె జీవితం నుండి - ఆశా హి పరమం దుఃఖం, నైరాశ్యం పరమం సుఖం - అని తెలుసుకొన్నాను.

18. కురరము అనేపక్షి కొన్ని మాంసపు ముక్కలను తెచ్చుకొని, తన గూటిలో దాచుకొన్నది. వాటిని కాపాడుకొనడానికి నిద్రాహారాలను మాని కూర్చునేది. ఒకనాడు ఆ చెట్టుపైనున్న ఇతర పక్షులు ఎక్కడా ఆహారం దొరకక ఈ కురరం గూటిలో దూరి, దానితో పోట్లాడి, ఆ మాంసం ముక్కలను ఎత్తుకొనిపోయినవి. అప్పటి నుంచీ ఆ కురరము నిశ్చింతగా నుండసాగినది. లభించిన దానినే తింటూ, ఏమీ దాచుకొనకుండా పరమశాంతిని పొందినది. సంగ్రహించుకొని - దాచుకోవడం దుఃఖహేతువు కనుక నాది అంటూ ఏమీ లేని నేను పరమసుఖ శాంతులతో సంతోషంగా నుండగలుగుతున్నట్లు తెలుసుకొన్నాను.

19. ఏ విధమైన మాయామర్మమూ తెలియని వాడై ఆనందంగా నవ్వుకొంటూ ఆడుకొనే పసిబిడ్డడు నాకు ఆదర్శప్రాయుడు.

20. ఒక కన్య తన తలిదండ్రులు గ్రామాంతరం వెళ్లియున్న సమయంలో, ఒంటరిగా నున్నప్పుడు ఇంటికి అతిథులు వచ్చారు. వంటకు బియ్యము సిద్ధముగా లేనందున, ఆమె కొంచెము ధాన్యము దంపవలసి వచ్చినది. పరిస్థితిని అతిథులు తెలుసుకొనరాదని ఆమె పెరటిలో ధ్యానము చేయసాగినది. గాజుల గలగల శబ్దం వినిపించరాదని, ఆమె రెండేసి గాజులు చేతులకు ఉంచి మిగిలిన వాటిని తీసివేసినది. ఆ రెండేసి గాజులుకూడ చిరుశబ్దాలు చేస్తుంటే, ఒక్కొక్క గాజునే చేతులకు ఉంచుకొని, పనిని ప్రశాంతంగా ముగించుకొన్నది. ఈ కన్య నుండి నేను తెలుసుకొన్నదేమిటంటే - ఎక్కువ మంది జనులున్నచోట ధ్యానము కుదరదనీ, ఇద్దరున్నా, మాట్లాడుకోవడం వలన ఏకాగ్రతకుదరదనీ, ఏకాంతమే ధ్యానసిద్ధికి ఏకైక మార్గమనీ తెలుసుకొన్నాను.

21. ఒక బోయవాడు ఒక బాణాన్ని తయారు చేసుకొంటూ, దానియొక్క ములుకు సరిగా బిగింపబడినదో లేదో అని, తన మనస్సూ, దృష్టి ఏకాగ్రపరచి చూస్తుండగా, ఆప్రక్కనుండి ఆ దేశపు రాజుగారు వెళ్తున్నా, వాడు దృష్టి మరల్చకుండా తన పనిలో నిమగ్నమైయుండడం చూచి, ఏకాంతమే కాదు ఏకాగ్రతకూడా చాలా అవసరం అని తెలుసుకొన్నాను.

22. సర్పము తనకోసం నివాసం తయారు చేసుకొనదు, ఇతర జీవాలు చేసిన పుట్టలలోనూ, రంధ్రాలలోనూ, తలదాచుకొంటుంది. జనసంచారాన్ని వర్జించి, ఏకాంతంగా సంచరిస్తుంది. అలాగే యోగి జన సమ్మర్దమున్నచోట్ల నుండరాదనీ, స్వగృహ నిర్మాణం చేసుకొనరాదనీ, "గృహారంభో-తి దుఃఖాయ" (గృహం కట్టుకొంటే దుఃఖం దాపురిస్తుంది) అనీ, సర్పము నుండి తెలుసుకొన్నాను.

23. సాలీడు తనదేహమునుండే జిగురు పదార్థాన్ని వెలిగక్కి సన్నని దారాలుగా తీసి సుందరమైన పట్లుగానేసి, మళ్లీకొంత సేపటికి ఆదారాలను తినివేస్తుంది. ఈ సాలీడులాగానే పరమేశ్వరుడు తన నుండే విశ్వాన్ని వెలికి తీసి, మళ్లీ కొంతకాలానికి, దాన్ని తనలోనికే ఉపసంహరించుకొంటాడని తెలుసుకొన్నాను.

24. కందిరీగ గోడమీద మట్టిగూడును కట్టి, దానిలో ఒక చిన్న పురుగును పెట్టి, దానిని, తనముెనతో కుడుతూ, నిరంతరం ఝుంకారంచేస్తుడడం వలన ఆ మట్టిగూడులోనున్న పురుగు భయంచేత కందిరీగగా మారిపోవునట్లు (భ్రమర కీటక న్యాయము), ప్రేమచేగాని, ద్వేషముచేగాని, భయముచేగాని, నిరంతరం భగవంతుని గురించి స్మరిస్తూ ఉంటే, భగవంతుని సారూప్యం పొందవచ్చని తెలుసుకొన్నాను.

ఇంతేకాక నా శరీరమునుండికూడ కొన్ని పాఠాలను నేర్చుకొన్నాను. "నాది" అనుకొన్న ఈ శరీరము అగ్నికి ఆహుతి అవుతుంది, లేదా ఇతర జీవాలకు ఆహారం అవుతుంది. సృష్టి కర్త అనేక రకాల జీవరాసులను సృష్టించి, సంతుష్టి జెందక, ఈ మానవజాతిని సృషించి, జ్ఞానసముపార్జన చెయ్యడానికీ, తనను తెలుసుకోడానికీ, వారికి బుద్ధిని ప్రసాదించాడు. కాని, బహుకొద్దిమందిమాత్రమే బుద్ధిని సద్వినియోగపరచుకొనుచున్నారు. అధిక సంఖ్యాకులు శరీరానికీ, ఇంద్రియాలకూ మనస్సుకూ సంబంధించిన వ్యక్తుల గురించీ, వస్తువుల గురించీ, విషయాల గురించీ, తమ అమూల్యమైన మానవ జన్మను దుర్వ్యయపరచుతున్నారు. వృక్షాలు తమ జీవితకాలంలోనే అనేకమైన బీజాలను ఉత్పత్తి చేసి మళ్లీ వృక్షాలై పుట్టునట్లు, మానవుడు కర్మ బీజాలను ఉత్పత్తి చేస్తూ ఆ కర్మ ఫలానుభవం గురించి జన్మలెత్తుతుంటాడు. అందుచేత ఇంద్రియాలను తృప్తిపరచే కర్మలను చెయ్యకుండా, ఏ పవిత్రకార్యం చెయ్యడానికి ఈ శరీరం ఇవ్వబడినదో, ఆ శరీరం పతనం కాకముందే ఆ పవిత్ర కార్యాన్ని నెరవేర్చి, దేహాభిమానాన్నివీడి, వివేక వైరాగ్యాలను సాధించి, పరిపూర్ణ జ్ఞానంతో ఆ పరమాత్మ సాయుజ్యాన్ని పొందాలని తెలుసుకొన్నాను. రాజా! నేనిప్పుడు చెప్పిన గురువులనుండి నా శరీరము నుండి నేర్చుకొన్న పాఠాలను నిజ జీవితంలో నవలంబిస్తున్నాను. నాకు ఇప్పుడు సంపూర్ణవైరాగ్య మబ్బినది. "నేను" అనే భావము ఇప్పుడు నా మనస్సులో లేదు. "నాది" అనే ప్రసక్తే లేదు. ఎలాంటి కోరికలూ లేవు. అందుచేతనే నేను ప్రశాంతముగా, ఆనందముగా ప్రకాశిస్తున్నట్టు మీకు కనిపిస్తున్నాను" అని చెప్పిన దత్తాత్రేయ అవధూత సంగరహితుడై సమచిత్తాన్ని సాధించాడు - అని శ్రీకృష్ణుడు ఉద్ధవునకు చెప్పాడు:

## బద్ధులు, ముక్తులు, భక్తులు

శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవునితో ఇలా చెప్పున్నాడు: "ఉద్ధవా! నన్నాశ్రయించి నాచే నిర్దేశింపబడిన వర్ణాశ్రమ కులాచార ధర్మాలను బాగుగా అనుసరించే మానవుడు కామ ప్రేరిత కర్మలను విసర్జించి, యమనియమాదులను పాటిస్తూ, తన నిత్య నైమిత్తిక కర్మలను ఆచరిస్తుండాలి. కామ్యకర్మలను చేసేవారికి చివరకు దుఃఖమే కలుగుతుందని గ్రహించాలి. స్వప్నంలోని అనుభవాలు సత్యముకానట్లు ఇహలోకం లోని వ్యవహారాలన్నీ ఆత్మ దృష్టితో చూస్తే స్వప్నతుల్యాలే అని తెలుసుకోవాలి. కనిపించే విభిన్నతలన్నీ దేహాదులలోనే గాని, అంతటా వ్యాపించియున్న ఆత్మలో లేవు. కట్టెలు వేరువేరుగా నున్ననూ వాటియందు నిక్షిప్తమైయున్న అగ్ని ఒక్కటే. కట్టెలు కాలి, బొగ్గులయి బూడిద అయినప్పుడు, ఆ అగ్ని అనంతాగ్నిలో కలిసిపోయినట్లు, శరీర పతనముతో పాటు, జీవుడు నిష్క్రమిస్తాడు. కాలుతున్న కట్టెలయొక్క ఆకారాన్ని అగ్ని తాత్కాలికంగా ధరించినట్లు కనిపించినా, అగ్నికి ఆకారము లేనట్లే, ఆత్మకు అనేకత్వముగాని, ఆకారముగాని లేవు. దేహమేతాను, అనే భ్రమను కలిగియుండటం చేత, దేహానికి కలిగే దుఃఖాలన్నీ తనవిగానే భావించి, మానవుడు అనేక బాధలకు గురి అవుతాడు. జనన మరణ సంసార చక్రంలో చిక్కుకొంటాడు. సద్గురువు నాశ్రయించి, తత్త్వవిచారణచే అవిద్యను బాపుకొని, జ్ఞానాగ్నిచే కర్మలను నశింపజేసుకొని, నన్ను ఉపాసించిన వ్యక్తి, నన్ను చేరుతాడు. ఇహలోకపు ఇంద్రియ సుఖాలుగాని, పరలోకపు స్వర్గసుఖాలుగాని, తాత్కాలికమైనట్టివే కాకుండా, చివరకు సంసార రూపమైన అంతులేని దుఃఖాలనే తెచ్చిపెడ్తాయి. బ్రహ్మాది దేవతలకు కూడ త్రిగుణాల ప్రేరణచే చేయబడిన కర్మల వలన కలుగునట్టి దుఃఖాలను అనుభవింపక తప్పదు. స్వర్గలోకవాసులుకూడ పుణ్యము క్షీణించగానే పతనమై, పునర్జన్మలనుపొంది. కర్మవలయంలో చేరుతారు. నన్ను చేరేవరకూ ప్రతిజీవీ ఈ భయంకరమైన సంసారచక్రంలో చిక్కుకొని, తిరుగుతుండవలసినదే. అని శ్రీకృష్ణుడు చెప్పగా ఉద్ధవుడు ఇలా అడిగాడు: "ప్రభూ! జీవుడు ఎల్లప్పుడూ బంధములోనుంటాడనీ, ఈశ్వరుడు ఎలాంటి బంధాలూ లేనివాడనీ నేను అనుకొంటున్నాను. మరి జీవాత్మ పరమాత్మల ఐక్యత ఎప్పుడు, ఎలాగ సంభవిస్తుంది? అని అడుగగా శ్రీభగవానుడు ఇలాగ చెపుతున్నాడు.

ఉద్ధవా! త్రిగుణాల ప్రేరణచేచేయబడిన కర్మలు అన్నియు బంధాలనే కలుగజేస్తాయి. కర్మఫలాన్ని అనుభవించడానికి ఒక శరీరం అవసరం గనుక జన్మ కలుగుతుంది. కర్మక్షయం కాగానే ఇక శరీరం అవసరం ఉండదు గనుక బంధము వీడి ముక్తి కలుగుతుంది. జీవుడు సహజంగా ముక్తుడే కాని, త్రిగుణాల ప్రభావానికిలోనై బద్ధుడౌతాడు. మాయ అనబడే ప్రకృతి నా అధీనంలోనున్నది గనుక దాని ప్రభావం నా పైన ఉండదు. నేనెల్లప్పుడూ బంధమోక్షాలకు అతీతుడనై యుంటాను. అవిద్య, విద్య నాసంకల్పం చేతనే ప్రవర్తిస్తుంటాయి. అవిద్యచే కలిగిన బంధము విద్యచే తొలగినంతనే ముక్తి సిద్ధిస్తుంది. జీవుడు నాయొక్క అంశభూతుడు. దేహమే తాను అని అవిద్యవలన భావించి, బద్ధుడౌతాడు. తనతోపాటు నేనూ ఆత్మగా వెలసియున్నాను అని జ్ఞానము ద్వారా జీవి తెలుసుకోగానే, నాతో ఐక్యము పొందుతాడు. జీవేశ్వరుల యథార్థ తత్త్వాన్ని తెలుసుకొన్న జ్ఞాని కర్మల నాచరిస్తున్నా, వాటియందు ఆసక్తీ, ఫలాపేక్షాలేనివాడై యుంటాడు గనుక బద్ధుడుకాడు, సూర్యకాంతి అన్నింటిపైనా సమానంగా ప్రసరించినా, ఆ వస్తువుల యొక్క సుగుణాలూ, దోషాలూ సూర్యునకు అంటనట్లు, వాయువు దుర్గంధముపైన వీచినా సుగంధముపైన వీచినా, ఆగంధము వాయువునకు చెందనట్లు, తాను చేసే కర్మలను నియమించేవాడు ఈశ్వరుడే అని తెలుసుకొని ప్రవర్తించే జ్ఞానికి ఎలాంటి గుణదోషాలూ అంటవు. నిత్య జీవితములో ఆచరింపబడే లౌకికశాస్త్రజ్ఞానము వ్యర్థము. అధ్యయన అభ్యాసాల ద్వారా నన్ను తెలుసుకొనే మార్గాన్ని చూపించేదే సార్థకమైన జ్ఞానము. జ్ఞాని నా యొక్క పవిత్రమైన సృష్టి స్థితి, లయ విలాసాల గురించి నిరంతరం వింటూ, వినిపిస్తూ, ఆనందిస్తుంటాడు. నా యొక్క లీలా చరిత్రగాథలను స్మరిస్తూ, ముచ్చటిస్తూ, గానము చేస్తూ, అందరినీ ఆనందింపజేస్తాడు. అట్టి పుణ్యాత్ముడు నన్ను చేరగలడు." అని చెప్పగా ఉద్ధవుడు ఇలా అడుగుతాడు: "దేవా! అలాంటి పుణ్యాత్ములైన భక్తుల లక్షణాలు ఎలాగుంటాయో నాకు తెలియజెప్ప వలసినదని ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

శ్రీభగవానుడిలా చెప్పాడు: "ఉద్ధవా! సాధువైన సత్పురుషునకు ఈ ఉత్తమలక్షణాలుంటాయి: సర్వభూతదయ, అహింస, సుఖదుఃఖాలయందు సహనము, సత్యభాషణము, ద్వేషాసూయలు లేకుండడం, స్వపర భేదాలు లేకుండడం, పరోపకారిత్వము, కోరికలు లేకుండడం, ఇంద్రియనిగ్రహము, బాహ్యశుచి, అంతఃశుద్ధి కలిగియుండడం, స్వప్రయోజనాభిలాష లేకుండడం, లౌకికవ్యాపారాలను విడిచియుండడం, శరీరపోషణకు అవసరమైనంతయే ఆహారం స్వీకరించడం, ఇంద్రియవిషయాలయందు ఆసక్తి లేకుండడం, భగవంతుడే రక్షకుడని దృఢవిశ్వాసం కలిగియుండడం, భగవానుని రూపగుణవైభవాలనే సదాస్మరిస్తూ మననం చెయ్యడం, కష్ట నష్టాలూ, శోకమోహాలూ, ఆకలిదప్పులూ, ఆపదలూ, జరామృత్యువులూ, ఎదురైనప్పుడు ధీరతతోనుండడం, ఇతరులనుండి సత్కారాలను ఆశించకుండడం, ఇతరులను సత్కరించడం, అందరిపట్ల కరుణ, మైత్రీభావము కలిగియుండడం, ఆత్మ పరమాత్మల యథార్థతత్త్వాన్ని తెలిసియుండడం - ఇలాంటివాడే నాకు ప్రియమైన సత్పురుషుడు. తన స్వధర్మాలను ఆచరిస్తూ, సంగములేకుండా, కర్తృత్వభావాన్నీ ఫలాన్నీ విడిచి, నన్ను భజించువాడు, నా భక్తులలో నుత్తముడు. ఇలాంటి సాధుసత్తముల సహవాసంచేసి, వారి సాహచర్యంతో నన్ను భక్తితో నారాధించాలి. నామూర్తులను అర్చించుట, నా భక్తులను సేవించుట, నా లీలలను కీర్తించుట, నా కథలను వినుట, నన్ను ధ్యానించుట, సర్వమూ నాకే అర్పించుట, ఆత్మ సమర్పణ చేయుట, నాగురించి ఉత్సవాలను చేయుట, నా ఆలయాలలో నాయొక్క లీలా గాథలను గానము చేయుట, పుణ్యస్థలాలను దర్శించుట, శాస్త్రోక్త వ్రతాలను చేయుట మొదలైన వివిధ సేవలను, నా భక్తులు చెయ్యాలి. కొందరు ఆలయాలూ, తటాకాలూ, ఉద్యానాలూ మండపాలూ నిర్మిస్తారు. కొందరు నా దాసానుదాసులై ఆలయసేవలూ, నా భక్తులసేవలూ చేస్తుంటారు. తమకు అత్యంత ప్రియమైన వాటినే నా భక్తులు నాకు అర్పిస్తారు.

సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు, గోవులు, వైష్ణవులు, ఆకాశము, వాయువు, జలము, భూమి, ఆత్మ, సర్వభూతాలు అనే ఈ పదకొండు స్థానాలలో నన్ను ఆరాధించాలి. యజ్ఞయాగాదులచే కూడ నన్ను ఆరాధిస్తారు. సత్పురుషుల సాంగత్యము భక్తులకు ఎంతో అవసరం. వారి సాంగత్యసేవలలో భక్తిని పెంపొందించుకోవాలి. భక్తి కుదరడం చాలా కష్టము. నీవు నా భృత్యుడవూ, మిత్రుడవూ గనుక నీకు ఈ భక్తి రహస్యాన్ని చెప్పాను. భక్తి ద్వారా నన్ను చేరడం అన్ని వర్గాల వారికీ సుగమము అవుతుందని తెలుసుకోవాలి.

## సత్సంగము

### శ్రీభగవానుడు చెప్పెను.

"ఉద్ధవా! భక్తునకు నాయందు దృఢ విశ్వాసాన్ని కలిగించడంలో యోగసాధనలూ, వేద శాస్త్రాధ్యయనాలూ, తపస్సులూ, వైరాగ్యమూ, యజ్ఞయాగాలూ, దానధర్మాలూ, తీర్థయాత్రలూ మొదలగు వీటన్నిటికంటే సాధుసజ్జన సాంగత్యమే (సత్సంగమే) ఎక్కువ ఫలప్రదమని తెలుసుకో. మనస్సునకు ఇతర విషయాలయందుండే సంగమును తొలగించడానికి సత్సంగమే ప్రధానసాధనము. విషయాలయందు సంగము తగ్గుతుంటే, నాయందు విశ్వాసము స్థిరమవుతూ ఉంటుంది. సత్పురుషుల సాంగత్యమేకాదు, వారి స్పర్శకలిగినా సంగముక్తులౌతారు. రాక్షసులైన వృత్రాసురుడు, బలిచక్రవర్తి, ప్రహ్లాదుడు, బాణాసురుడు, విభీషణుడు, జంతువులైన సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, గజేంద్రుడు, పక్షియైన జటాయువు, పాండిత్యమూ సంస్కారమూలేని ధర్మవ్యాధుడు, కుబ్జ, గోపకులూ, పశువులైన గోవులు, పామైన కాళియుడు, అర్జునవృక్షాలూ నాయొక్క దర్శన స్పర్శన సంభాషణ, స్మరణలచే తరించారు. ఉద్ధవా! నీవే చూచావు కదా! నా నుండి వియోగాన్ని భరించలేక గోపికలు ఎలాగ రాత్రింబవళ్లు నా గురించి అలమటించిపోయేవారో! యోగ సమాధిలోనున్న తపస్వినులకంటె వారు నా గురించి ఎక్కువగా ధ్యానంచేసేవారు. వాళ్లు, కామతృష్ణతోనే నన్ను స్మరించినా, పరబ్రహ్మమైన నన్నే స్మరించుతారు. కనుక సద్గతినే పొందుతారు. కావున ఉద్ధవా! నేనే సర్వమూ అని విశ్వసించే వారికి చేయదగినవి, చేయవలసినవీ ఏవీ ఉండవు. నేనే పొందదగిన వాడను, పొందించే వాడనూ అని నీవు గ్రహించి, నిశ్చింతుడవై ఎలాంటి భయమూ లేకుండా ఉండు." అని భగవానుడు చెప్పగా ఉద్ధవుడు ఇలా అడిగాడు:

## జీవుడు, సంసారనివృత్తి

### ఉద్ధవుడు అడుగుతున్నాడు

"యోగేశ్వరా! ఇంద్రియాలకు ఆధారము శరీరమా, జీవుడా? పాపపుణ్యాలను చేసేవాడెవడు? వాటివలన కలిగే సుఖదుఃఖాలను అనుభవించేవాడెవడు? సంసారాన్ని నివారించే ఉపాయమేమిటి? నాకు వివరించి చెప్పవలసినదిగా ప్రార్థిస్తున్నాను." అని అడుగగా శ్రీభగవానుడు ఇలా చెప్పాడు: "జీవుడు శరీరములోని హృదయగుహలో ప్రకాశిస్తుంటాడు. ప్రాణముతో కూడియుంటాడు. చెవులు మూసుకొని విన్నప్పుడు ప్రాణచలనము యొక్క ఒక సూక్ష్మశబ్దము మనస్సుకు గోచరిస్తుంది. ఆ సూక్ష్మశబ్దమే వృద్ధియై స్థూల రూపాన్నిపొంది, శబ్ద స్వర రూపములో కంఠధ్వనియై, వాక్కుగా వెలువడుతుంది. హృదయాంతరాళమునుండి వచ్చే ఈ ధ్వని పరమాత్ముడనైన నానుండియే కలుగుతున్నది.

సకలసృష్టికీ జీవముపోసిన పరమాత్మదేహములోని షట్చక్రాలలో వ్యక్తమై ప్రకాశిస్తుంటాడు. (ఆషట్ చక్రాలు, ఇవి) (గుదస్థానంలో మూలాధార, లింగస్థానాన - స్వాధిష్ఠాన, నాభిస్థానాన మణిపూరక, హృదయస్థానంలో అనాహత, కంఠస్థానాన విశుద్ధ, భ్రుకుటిస్థానంలో ఆజ్ఞాచక్రాలుంటాయి. పరమాత్మస్థానమైన కపాలంలో సహస్రారం ఉంటుంది.) మూలాధారంలో ప్రాణసహితంగా ప్రవేశించి, మణిపూరకంలో పశ్యంతిగాను, విశుద్ధిలో మధ్యమగాను, తరువాత (వైఖరీ) వాక్కుగానూ నోటినుండి వ్యక్తమౌతాడు. ఆ విధంగానే, ఇతర కర్మేంద్రియాలైన, పాణి, పాద, పాయు, ఉపస్థలూ నాయొక్క శక్తిని సంతరించుకొన్న జీవుని యొక్క ప్రేరణచే పని చేస్తాయి. అలాగే జ్ఞానేంద్రియాలైన శ్రోత్రము, చక్షువు, రసనము, ఘ్రాణము, త్వక్కులూ, మనస్సూ, బుద్ధీ, పరమాత్మ యొక్క అధీనంలో నున్నవే అయినా జీవుని ప్రేరణచే పని చేస్తాయి. జీవుడు (దేవ, మానవ - మొదలైన) శరీరాలతో ఉంచుకొన్న సంబంధమే సంసార మనబడుతుంది. జీవుడు సత్త్వ రజ స్తమోగుణాలకు అధీనమైయుంటాడు. జీవాత్మ జలములో వృద్ధిచెందిన బ్రహ్మాండము నుండి ఉద్భవించి, మళ్లీ అక్కడనే అంతమవుతుంది. జీవునకు పుట్టుట, గిట్టుట ఉండవు. జీవునకు దేహముతో (దేహబీజముతో) సంపర్కం ఏర్పడితే ఆ శరీరం పుడుతుంది. ఆ సంపర్కమే తొలగిపోతే శరీరం మరణిస్తుంది. జీవుని నుండి లభించిన చైతన్య శక్తిచే శరీరము ప్రవర్తిస్తుంది.

జీవునితోసహా దశేంద్రియ మనోబుద్ధ్యాదులతో కూడియున్న శరీరమే సంసారవృక్షము. ఇది అనాదిగా వస్తుంది. రాగద్వేషాది వందలాది భావాలే దీనికి వేళ్లు. ఆధిభౌతిక - ఆధిదైవిక - ఆధ్యాత్మిక తాపత్రయాలు దీని మొదలు. వాతపిత్త శ్లేష్మాలు దీని బెరడులు. పంచభూతాలు దీని భుజాలు. త్రిగుణాలు దీని జీవనాడులు. శబ్ద స్పర్శ రూప రస గంధాలనే రసాలు ఊరుతుంటాయి. మనస్సూ, దశేంద్రియాలూ దీని కొమ్మలు. ప్రవృత్తి (కోరికలతో చేయబడిన కర్మలు) నివృత్తి (కోరికలు లేకుండా చేయబడిన కర్మలు) దీని ఫలాలు. పాప పుణ్య కర్మలు దీని బీజాలు. ఈ వృక్షములో హృదయగుహ అనే గూడులో దేవుడూ, జీవుడూ అనే రెండు పక్షులుంటాయి. ఈ వృక్షము సూర్యుని వరకూ వ్యాపించి యుంటుంది. కర్మ ఫలాసక్తులైన లౌకిక మానవులు దుఃఖకారకమైన ప్రవృత్తి మార్గపు ఫలాన్ని ఆరగిస్తారు. హంసలవంటి జ్ఞానులు నిత్యానంద దాయకమైన నివృత్తి మార్గపు ఫలాన్ని తీసుకొంటారు. ఈ సంసారతత్త్వాన్ని తెలుసుకొన్న జ్ఞాని అభ్యాసముచే భగవద్భక్తిని, శరణాగతిని తనలో పండించుకొని, ఆ సంసారవృక్షాన్ని జ్ఞాన ఖడ్గంచేత ఖండించి వెయ్యాలి.

సాధనచే రజస్తమోగుణాలను తగ్గించుకొని, సత్త్వగుణాన్ని వృద్ధిచేసుకొంటే భగవద్భక్తి పెరుగుతుంది, పుణ్యపాపాలు తొలగిపోతాయి. సత్త్వగుణం వృద్ధి చెందాలంటే వేద శాస్త్రాధ్యయనంతోపాటు భగవద్వైభవాన్ని ప్రకాశింప జేసే పురాణాలను వినాలి. పుణ్యతీర్థాలను సేవించాలి, సాధుసత్తములను సేవించాలి. స్త్రీ సంపర్కమూ, దుర్జనసహవాసమూ లేని ఏకాంత ప్రదేశాల్లో నివసించాలి. భగవద్ధ్యానం చేస్తుండాలి. నిష్కామ కర్మల నాచరిస్తుండాలి. గురుసేవచేస్తూ గురుబోధను పాటించాలి. మంత్రదీక్షను పొంది, భావసహిత జపం చేస్తుండాలి. ఆహార, ఆచార, వ్యవహారాలు, సాత్త్వికంగానుండాలి. ఈ విధంగా పెంపొందిన భక్తిద్వారా భగవత్స్వరూపలక్ష్యమూ, నిరంతరధ్యానమూ సుగమం అవుతాయి. ఇతర విషయాలయందు ఆసక్తి క్షీణిస్తుంది. రజ స్తమోగుణములు కూడా క్రమంగా అదృశ్యమై, గుణాతీతస్థితి వస్తాయి. దేహధ్యాస నశిస్తుంది, సంసారం క్షీణిస్తుంది." అని శ్రీభగవానుడు చెప్పాడు:

## హంసగీత

### ఉద్ధవుడు ఇలా అడిగాడు

"దేవా! విషయ భోగలాలస, స్త్రీవ్యామోహమూ దుఃఖహేతువులే అని తెలిసికూడ, జ్ఞానమున్న మనుష్యులు, జ్ఞానంలేని జంతువుల్లాగ మళ్లీమళ్లీ ఆ దుఃఖకూపంలోనే మునుగుతుంటారెందుచేత? అని అడుగగా, భగవానుడిలా చెప్పాడు: "ఉద్ధవా! నిప్పును ఆర్పివేయగల శక్తి నీటికి ఉన్నప్పటికీ, ఆ రెండింటికీ మధ్యను ఒక పాత్ర ప్రవేశించగానే, నిప్పును ఆర్పివేయడానికి బదులుగా నీరే వేడెక్కిపోతుంది. (నిప్పుయొక్క వేడెక్కించే గుణాన్ని వహిస్తుంది). అలాగే శరీరంతో సంపర్కం కలుగగానే, నిర్మలమైన జీవాత్మకూడ కొన్ని దేహధర్మాలను సంతరించుకొని, తానేదేహాన్ని అనే భ్రమను చెందుతుంది, అహంకారానికి లోనవుతుంది, రజోగుణంతోకూడి, విషయభోగాలను అనుభవించాలని కాంక్షిస్తుంది. వివేకం కలవాడు విషయలాలసలోనూ, ప్రలోభాల్లోనూ పడకుండా నిగ్రహించుకొని, చిత్తాన్ని పరమాత్మయందు లగ్నంచేసుకొని ధ్యానిస్తాడు. కాని అవివేకి మాత్రము రజోగుణ తమోగుణ ప్రభావాలకులోనై, విషయభోగలాలసలోనూ, స్త్రీవ్యామోహంలోనూ సుఖంగురించి అన్వేషిస్తుంటాడు.

ఉద్ధవా! మనస్సును మళ్లించి, నాయందే నిలిపియుంచే యోగాన్ని తొల్లి నేనే బ్రహ్మకూ, సనక సనందనాదులకూ హంసరూపం ధరించి, ఇలా చెప్పాను. "ఓ హిరణ్యగర్భా! కుమారులారా! ఈ హంసరూపములో వచ్చిన నేనెవరినో తెలుపుమని మీరడిగారు. ఈ ప్రశ్నకు అర్థములేదు. అడిగిన మీరూ, చెప్పుతున్న నేనూ, చెప్పబడేవీ, వేరు వేరు అనిమీరు భావించడం చేత ఈ ప్రశ్న వచ్చినది. అంతా ఒక్కటే గాని, రెండవది ఏదీలేదు కదా! జీవాత్మ పరమాత్మ అవినాభావమైనట్టివి. జీవునితో కూడియున్న పరమాత్మ, ప్రకృతిలోకూడి సమస్త చరాచర సృష్టి అంతటా వ్యాపించియున్నది. పరమాత్మ లేని వస్తువేదీ ఈ విశ్వంలో నెక్కడాలేదు. అందుచేత మీలోనూ, నాలోనూ అంతటా వ్యాపించియున్నది ఆ పరమాత్మయే అయినప్పుడు నేనెవరిని అనే ప్రశ్నకు తావులేదు. ఇంద్రియ మనస్సులకు

గోచరించే ప్రతి వస్తువూ ప్రకృతియే, జడమైనట్టిదే! పరిశుద్ధమైన మనస్సుచే ధ్యానావస్థలో గ్రహింపబడేది ఆత్మ. జీవాత్మ, ప్రకృతి, రెండూ పరమాత్మయొక్క అంశలే. సర్వమూ ఆపరమాత్మయే. పరమాత్మ లేనిది ఏదీలేదు.

జీవునికి దేహసంబంధం కలుగగనే మనస్సు విషయాలను అనుభవించడానికి సిద్ధపడుతుంది. విషయాలూ, మనస్సూ పరస్పరం సంగమేర్పరచుకొంటాయి. పూర్వసంస్కారాలు రజోగుణం వలన తీవ్రమైన కోరికలై, అనుభవాల ద్వారా తృప్తిని కోరుతాయి. ఈ అనుభవాలు మళ్లీ కొత్త సంస్కారాలుగా రూపొంది, చిత్తములో చేరుతుంటాయి. ఈ విధంగా సంస్కారాలూ, కర్మలూ, అనుభవాలూ, మళ్లీ కొత్త సంస్కారాలూ నిరంతరం కొనసాగుతుంటాయి. ఈ చక్రగమనంనుండి బయటపడాలంటే మనస్సును భగవత్స్వరూపస్మరణంలోనూ, ధ్యానంలోనూ నియోగించాలి. అప్పుడు, మనస్సు విషయాలయందు చరించడం తగ్గించుకొంటుంది. దానితోపాటు ఆత్మ, అనాత్మల యథార్థతత్త్వాన్ని గురుబోధద్వారా, అధ్యయనం ద్వారా తెలుసుకోవాలి.

జీవుడు జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలను సాక్షిగా దర్శిస్తుంటాడు. ఈ మూడు అవస్థలను దాటి, నాలుగవ (తురీయ) అవస్థలో జీవుడు పరమాత్మతో కలుస్తాడు. ఈ స్థితిలో శరీరానికి సంబంధించిన ఇంద్రియ మనోబుద్ధుల ప్రవృత్తులూ, త్రిగుణాల ప్రభావమూ అన్నీలయించి యుంటాయి. సుషుప్తివంటి స్థితిని సాధనద్వారా జాగ్రదవస్థలో అనుభూతిని చెంది, తురీయావస్థకు చేరడం సమాధి అనబడుతుంది. దీనికి దైవానుగ్రహం చాలా అవసరం. సమాధిస్థితిని పొందినవాడు దేహధ్యాసలేనివాడై యుంటాడు. శరీరం ఏ స్థితిలోనున్నా వానికి తెలియదు. అది ఏమి చేస్తున్నా గుర్తించలేడు. ఈవిధంగా దేహపతనం గురించి ఎదురు చూస్తుంటాడు. అతనికి భగవద్ధ్యానం తప్ప ఇంక ఏ వ్యాపకమూ ఉండదు. అతనికి పునర్జన్మ ఉండదు, అతడు నాయందే ఉంటాడు. అతనియొక్క అన్ని లౌకిక బంధాలూ తొలగిపోతాయి.

మనస్సు పనిచేస్తుంటేనే జగత్తు ఉంటుంది. సుషుప్తిలో మనస్సు లయిస్తుంది గనుక జగత్తు ఉండదు. జాగ్రదవస్థలో కూడ మనస్సును ధ్యానంలో లయింపజేస్తే, ఈ దృశ్యమానప్రపంచం ఇక గోచరించదు. ఆత్మానాత్మవివేచనచే బ్రహ్మమే జీవుని యొక్క ఆత్మ అనీ, అది ప్రకృతినికూడ ప్రవర్తింపజేసే ఆత్మయనీ, తెలుసుకోవడం సాంఖ్యము, భగవంతుని ఉపాసించడం యోగము అనబడుతుంది. కుమారులారా! నేను హంసరూపములో వచ్చిన యజ్ఞస్వరూపుడనైన విష్ణువును. నా భక్తులయందు సర్వభూతహితము, సత్యమూ, పుణ్యశీలమూ, వైరాగ్యమూ, అంతఃకరణశుద్ధీ మొదలైన సత్సంపదలను పెంపొందిస్తాను. నాకు ఎవ్వరియందూ రాగద్వేషాలు గాని, పక్షపాతాలుగాని ఉండవు. నిత్యానందమే నా గుణము." అని చెప్పగా సనకాదుల సందేహాలు తీరినవి. బ్రహ్మదేవునితో పాటు వారు హంసావతారియైన విష్ణుమూర్తిని పూజించారు. అందరూచూస్తుండగా హంస వైకుంఠానికి వెళ్లిపోయినది. అని శ్రీభగవానుడు చెప్పాడు.

## భక్తి, ధ్యానము

ఉద్ధవుడు అడిగాడు: "భగవన్! వేదవేత్తలైన ఋషులు ధర్మార్థ కామములైన శ్రేయస్సులను పొందడానికి కొన్ని వైదిక కర్మలను చెయ్యాలంటారు. మరి నీ యొక్క బోధప్రకారము, నీ పాదపద్మాలయందు భక్తి కలిగియుంటే చాలు, మోక్షము సిద్ధిస్తుంది కదా! మరి కర్మమార్గము, భక్తిమార్గము వేర్వేరు ఫలాలనిస్తాయా?" అని అడిగిన ఉద్ధవునకు శ్రీభగవానుడిలా చెప్పాడు: "ఉద్ధవా! ప్రళయమప్పుడు అన్నింటితోపాటు వేదాలుకూడ లయిస్తాయి. పునఃసృష్టిలో నేను బ్రహ్మను సృష్టించి, అతనికి వేదాలను ఉపదేశిస్తాను. వేదాలలో సనాతన ధర్మమున్నది. ఆ ధర్మము నా స్వరూపమే! బ్రహ్మ వేదాలను సప్తఋషులకు, స్వాయంభువమనువుకు చెప్పాడు. వారినుండి వారి పుత్రులూ, దేవ, దానవ, మానవ, గుహ్యకాదులు గ్రహించారు. త్రిగుణాల ప్రభావము బ్రహ్మాది దేవతలనుండి క్రిమికీటాదుల వరకూ సకల జీవరాసులపైనా ఉంటుంది కనుక వారివారి స్వభావాలూ, కోరికలూ, కూడ విభిన్నరీతులలో ఏర్పడుతాయి. వారి ఉపాసనా పద్ధతులు, లక్ష్యాలు, కామితార్థాలు కూడ వేరువేరుగా నుంటాయి. వారివారి సంస్కారాలకు అనుగుణంగా వారు వేదార్థాలను నిర్వచించి తమకు అనుకూలంగా అన్వయించుకొంటారు. కొందరు స్వర్గభోగాల గురించి కర్మక్రతువులు చేస్తారు, కొందరు ఇహలోకపు అర్థకామాల నాశించి కర్మల నాచరిస్తారు.

కొందరు జ్ఞానం ద్వారా ఆత్మదర్శనం కావాలనుకొంటారు. కొందరు తామే శక్తిమంతులము, వేరే దైవశక్తి ఏదీలేదు అంటూ నాస్తికులూ, పాషండులూ అవుతారు. చార్వాకులు "ఈశరీరమే సర్వస్వము. దానిని సుఖపెట్టడమే శ్రేయస్కరం" అంటారు. వీరందరికీ కర్మలనాచరిస్తూ, వాటి ఫలాలను అనుభవించడమే ధ్యేయము.

భక్తి : కానీ ఉద్ధవా! నేను చెప్పిన భక్తి మార్గాన్ని అనుసరించే వారు పొందగల ఆనందము నిత్యానందము, దుఃఖమిశ్రితము కానట్టిది. నన్నే స్మరిస్తూ, నాయందే మనస్సు నిలిపి, ఇతర విషయాలపై ఆలోచనలేక నన్ను ఆరాధించేవారు నిరతిశయ-ఆనందాన్ని అనుభవిస్తారు. అలాంటివారికి ఇంద్రపదవీ, బ్రహ్మపదవీ, చివరకు మోక్షపదము కూడ అక్కరలేదు. వారేనాకు అత్యంత ప్రియులు. నా భక్తులు ఎక్కడ ఉంటే ఆ ప్రదేశము పవిత్రమవుతుంది. వారు నన్నే అందరియందూ అన్నిటియందు చూడగలరు. భక్తి క్రమంగా పెరిగేది. నాయందు ప్రేమతో నన్నే స్మరిస్తుంటే, నాగాథలూ, గుణగణాలూ గానం చేస్తుంటే, ఇతర భక్తులతో ముచ్చటిస్తుంటే భక్తి వృద్ధి చెందుతుంది. సకల శాస్త్రాలూ చదివీ, ఉత్తమ సంస్కారాలున్న వారి వంశంలో పుట్టీ కూడ నాయందు భక్తి లేనట్టి వానికంటే, హీనస్థితిలోనుండి చదువు సంస్కారాలు లేకపోయినా, నాయందు అచంచలభక్తి విశ్వాసాలున్న వాడే శ్రేష్ఠుడు. నిజమైన భక్తునకు భగవన్నామం వినబడగానే, భగవత్స్వరూపం కనబడగానే ఒళ్లు పులకిస్తుంది, ఆనందబాష్పాలు కురుస్తాయి, గొంతుగద్గదం అవుతుంది, హృదయం ద్రవించి పొంగిపోతుంది, నవ్వూ ఏడ్పూ వస్తాయి. అతడుగొంతెత్తి పాడుతాడు, గంతులు వేస్తాడు, మైమరచిపోతాడు, అతని కర్మలు కాలిపోతాయి, అజ్ఞానం తొలగిపోతుంది, అంతఃకరణం పరిశుద్ధమవుతుంది. అతడు ఇంద్రియ విషయలాలస ప్రలోభాలకు లోనుకాడు. నిప్పులాగ పవిత్రుడైయుంటాడు. ఉద్ధవా! నీవు అలాంటి భక్తుడవు గనుక, నాకు ప్రియతముడవు. నాకు బ్రహ్మరుద్రులకంటెను, లక్ష్మీదేవికంటెను ఉత్తమభక్తుడే, అత్యంత ప్రియతముడని తెలుసుకొనుము." అని శ్రీభగవానుడు చెప్పగా, భగవంతుని ధ్యానము చేసే పద్ధతిని తెలియజేయుమని ఉద్ధవుడు వేడుకొంటాడు.

**శ్రీభగవానుడు ధ్యానమును గురించి ఉద్ధవునకు చెప్తున్నాడు**

ధ్యానము చేసేవాడు, అతిఎత్తుగాగాని, అతిపల్లముగాగాని లేనట్టి సమతల ప్రదేశమున ఎక్కువసేపు సుఖంగా కూర్చొనగలిగిన ఆసనంలో కూర్చోవాలి. శరీరము, మెడ, తల, నిటారుగానున్నట్లు కూర్చొని చేతులను తొడలపైనుంచుకొని, నాసికాగ్రంపై దృష్టిని కేంద్రీకరించాలి. ప్రాణవాయువు సంచరించే మార్గాలైన ఇడ పింగళ అనే నాడులను, రేచక, పూరక, కుంభకాలతో శోధించాలి. ప్రాణవాయువును నియమించడం అలవాటైన తరువాత ఇంద్రియాలు, మనస్సూ అదుపులోకి వస్తాయి. ప్రాణాయామముచే నాడీశుద్ధి చేసుకొని, ఓంకారాన్ని మంత్రముగా ఉచ్చరించాలి. ఓంకారనాదము శరీరమంతా నిండి, ఉత్తేజపరుస్తున్నట్లు భావించాలి. ఈ విధంగా ప్రతిదినం మూడుసార్లు చెయ్యాలి. ప్రతిసారీ ఓంకారంతో పాటు పదేసి ప్రాణాయామాలు చెయ్యాలి. ఓంకారం ఉచ్చరించేటప్పుడు, ఘంటానాదంలాగ నాడీమార్గంలో ధ్వని వినిపిస్తుంది. ఆ ధ్వని లోన లయించి పోతుంది. తామరకాడలోని చిన్న నాళంగుండా వచ్చినట్లు ఆ ధ్వని ఇడాపింగళనాడులగుండా ప్రవహిస్తున్నట్లు గుర్తించాలి. ఈ విధంగా అభ్యసించిన ఒక నెలరోజుల్లో శ్వాసవాయువు అదుపులోకి వస్తుంది. హృదయ కమలంలో ధ్యానము చెయ్యాలి. వికసించడానికి సిద్ధముగా నున్న కమలముమొగ్గ (అరటిపువ్వులాగ అధోముఖంగా) తలక్రిందులుగా నున్నట్లు హృదయం ఉంటుంది. అది తలపైకెత్తి పూర్తిగా వికసించి ఎనిమిది రేకులతోనూ, మధ్యను బంగారు ఛాయగల దుద్దు (కర్ణిక)తోనూ ఉన్నట్లు భావించాలి. ఆ హృదయకమలమందు సూర్యుడూ, చంద్రుడూ, అగ్నీ ఒకదాని ముందు నొకటి దొంతుగా నుండి నిల్చున్నట్లు భావించాలి. ఆ అగ్ని తేజస్సులో దివ్యమంగళ స్వరూపుడైన భగవానుడు కర్ణికపై నిల్చొని యున్నట్లు చూడాలి, ఆ మూర్తి శ్యామల వర్ణముగను, ప్రశాంతమైన దివ్య సుందర వదనము కలదిగను, చక్కని కంఠము, కపోలాలూ కలిగి, చతుర్బాహువులతోను, శంఖచక్రగదా పద్మాలను ధరించి, పట్టు పీతాంబరము ధరించి యున్నట్లుగాను దర్శించాలి. దివ్యకాంతులను వెదజల్లే మకరకుండలాలూ, కౌస్తుభమణీ, మణులు పొదగబడిన కంకణాలూ, బంగారు మొలత్రాడు, కాలిఅందెలూ, భుజకీర్తులూ, కిరీటమూ, ధరించియున్న స్వామిని దర్శించాలి,

వక్షస్థలంపై శ్రీదేవి, శ్రీవత్సచిహ్నము, ఎన్నడూ వాడని వనమాల ఉన్నట్లుగా చూడాలి. సర్వాంగ సుందర సుకుమార మనోహర రూపముతోనూ, మందస్మిత ప్రసన్నవదనం, కరుణార్ద్రపూర్ణమైన కన్నులతోనూ ఉండే భగవానుని, కన్నుల పండువుగా తిలకించాలి. పాదాలనుండి కిరీటంవరకూ పరిశీలనతో పరికించి, మళ్లీ కిరీటమునుండి పాదాలవరకూ ప్రతి అంగమును, ఆభరణాన్నీ మాటిమాటికి తిలకిస్తూ ఆ దివ్యమోహన రూపాన్ని మనఃఫలకం మీద ముద్రించుకొని, కన్నుమూసినా, కన్నుతెరచినా చూడగలుగునట్లు అభ్యసించాలి.

ఇంద్రియాలను విషయాలపై చరించకుండా అరికట్టి, బుద్ధిని పరమాత్మయందు నిలపాలి. మనస్సును స్వేచ్ఛాసంచారం చెయ్యకుండా నిగ్రహించాలి. ఈ విధంగా ధ్యానము చేస్తూ, సుందరవదనంపైన చివరకు మందహాసంపైన ధ్యానాన్ని కేంద్రీకరించాలి. ఇలాగ మనస్సులో నిండియున్న ఆ దివ్యస్వరూపమే విశ్వమంతటా వ్యాపించియున్నట్లుగా దర్శించాలి. అప్పుడు ఇంద్రియ మనోబుద్ధులతోనున్న తన శరీరముగానీ, ధ్యానము చేస్తున్న తానుగాని, చేయబడుతున్న ధ్యానముగాని స్పృహలో నుండవు. తన హృదయంలో ఆవిర్భవింప జేసుకొన్న తేజస్స్వరూపుడైన ధ్యేయమూర్తి యొక్క తేజస్సులో ఐక్యమౌతాడు ఇదే సమాధిస్థితి. ఈ సాధన ద్వారా జీవునకు దేహేంద్రియ మనోబుద్ధులతోనున్న తాదాత్మ్యము తొలగిపోతుంది. ఈ సమాధిస్థితిని అభ్యాసము ద్వారా పొడిగించాలి. ఇదే ధ్యాన సాఫల్యము అని భగవానుడు చెప్పాడు.

## సిద్ధులు

### శ్రీభగవానుడు చెప్పెను

"ఉద్ధవా! నిరంతరధ్యానముచే ఇంద్రియ మనఃప్రాణాలను జయించిన యోగికి ఎలాంటి సిద్ధులు కలుగుతాయని నీవు అడిగావు కదా! విను ముఖ్యమైనవి పద్దెనిమిది సిద్ధులు. వాటిలో ఎనిమిది సిద్ధులు భగవానుని పొందడానికి సహాయపడేవి. మిగిలిన పది సిద్ధులూ స్వార్థప్రయోజనాలకు సహాయపడుతాయి గనుక, వాటివలన బంధమేర్పడుతుంది.

పరమార్థము పొందడానికి ఉపకరించే సిద్ధులు ఇవి:-

1) అణిమ : ఈ సిద్ధిచే దేహాన్ని అణుపరిమాణానికి తగ్గించ వచ్చును.

2) మహిమ : ఈ సిద్ధిద్వారా దేహాన్ని మహాద్భుతపరిమాణానికి పెంచవచ్చును.

3) లఘిమ : ఈ సిద్ధిచే అతితేలిక అయిపోవచ్చును.

4) గరిమ : ఈ సిద్ధిద్వారా చాలా బరువు అయిపోవచ్చును.

5) ప్రాప్తి : ఈ సిద్ధిద్వారా ఇతర జీవులు పొందే అనుభవాలతో సంబంధం ఏర్పరచుకొనవచ్చును.

6) ప్రాకామ్యము : పైలోకాలలో లభించే సుఖాలను అనుభవించగలిగే శక్తిని ఈ సిద్ధి ద్వారా పొందవచ్చును.

7) ఈశిత్వము : తన సంకల్పానికి అనుగుణంగా ఇతరులను ప్రవర్తింప జేయగలగడం ఈ సిద్ధి ద్వారా చేయవచ్చును.

8) వశిత్వము : విషయభోగాల మధ్యను ఉంటూకూడ వాటియందు ఆసక్తి లేకుండటాన్ని సాధించవచ్చును ఈ సిద్ధి ద్వారా.

ఈ సిద్ధులు యోగసాధన చేసేవారికి సహజంగా వస్తాయి. పరమాత్మను పొందడానికే యోగులు వీటిని ప్రయోగిస్తారు. సంసార బంధాన్ని కలిగించే పది సిద్ధులు, ఇవి:

1. అనూర్మిత్వము: శరీరానికి ముసలితనం రాకుండా, ఆకలిదప్పులు లేకుండా చేస్తుంది ఈ సిద్ధి.

2. దూరశ్రవణము, 3. దూరదర్శనము, 4. మనోజవం, మనోవేగముతో గమనించడం, 5. కామరూపము కోరిన రూపాన్ని ధరించడం 6. పరకాయ ప్రవేశము: చనిపోయిన వాని దేహములో ప్రవేశించి ప్రవర్తించడం.

7. స్వచ్ఛందమరణం: కావాలనుకొన్నప్పుడు దేహాన్ని విడిచిపెట్టడం 8. రమణశక్తి:- దేవతలు అనుభవించే క్రీడలను అనుభవించగలగడం. 9. సంకల్పసిద్ధి: తాను సంకల్పించుకొన్న వాటిని సిద్ధింపజేసుకొనడం 10. అప్రతిహతగమనం: కోరినచోటికి అడ్డులేకుండా వెళ్లగలగడం.

ఇవికాక ఇంకను కొన్ని సిద్ధులుకూడ ఉన్నవి: అవి 1. త్రికాలజ్ఞానము, 2. అద్వంద్వము: శీతోష్ణాది ద్వంద్వాలకు చలించకుండడం 3. పరచిత్తాభిజ్ఞత: ఇతరుల మనస్సులోని విషయాలను గ్రహించడం 4. స్తంభనము: అగ్ని, జలము, విషము మొదలైన వాటి యొక్క ప్రభావం లేకుండా ఉండగలగడం. 5. అపరాజయము: ఎవరి చేతనూ, ఓడింపబడకుండడం.

భగవద్ధ్యానమందు స్థిరత్వం నెలకొన్నయోగులకు ఈ సిద్ధులు సంక్రమిస్తాయి. కాని ఈ సిద్ధుల ఆకర్షణలో చిక్కుకొని, మాయామోహితుడై గమ్యము చేరకుండా దారితప్పే ప్రమాదం నుండి యోగి జాగ్రత్త పడాలి అని శ్రీ భగవానుడు చెప్పాడు.

## భగవద్విభూతులు

ఉద్ధవుడు శ్రీభగవానుని ఇలా అడిగాడు: "భగవన్! నీవు సర్వలోకమహేశ్వరుడవు. అంతటా అన్నింటా లోపలా, బయటా నిండియున్న నిన్ను ఏ ప్రత్యేకమైన గుణాలతో వర్ణించాలి? ఏ రూపములో నారాధించాలి? ఏ దివ్యవిభూతులను సంస్తుతించాలి? నీయందు అచంచలమైన భక్తి ఏవిధంగా వృద్ధి చెందుతుంది? చెప్పవలసిందిగా ప్రార్థిస్తున్నాను." అన్నాడు.

ఉద్ధవా! పూర్వము కురుక్షేత్ర రణరంగములో అర్జునుని సందేహాలను తీర్చడానికి నేను చెప్పిన విషయాలనే నీ సందేహాలను తీర్చడానికి కూడ ఇప్పుడు మళ్లీ చెప్తాను విను నేను ఈ విశ్వములోని సకలచరాచరజీవరాసుల్లో ప్రవేశించి, వాటిని ధరించి, నియమించేవాడను. వాటియొక్క సృష్టి, స్థితి, లయాలను నిర్వహించేవాడను నేనే. జీవులనావేశించే సత్త్వరజస్తమోగుణాలు నానుండే ఉద్భవించినవి. గొప్పవాటిలోని గొప్పతనాన్నీ, సూక్ష్మ వస్తువులందలి సూక్ష్మతనూ నేనే. హిరణ్యగర్భుడైన బ్రహ్మ నా యొక్క విభూతి ప్రకాశమే! ప్రణవము (ఓంకారము) నానుండే వెలువడినది. దేవతలలో ఇంద్రుడను నేను, హోమము చేయబడిన ఆహుతులయొక్క వాహకుడైన పావకుడను (అగ్నిని) నేను. ద్వాదశాదిత్యులలో విష్ణువును నేను, ఏకాదశరుద్రులలో నీలలోహితుడైన శివుడను నేను, ఉద్ధవా! నేను, బ్రహ్మర్షులలో భృగువును, రాజర్షులలో మనువును, దేవర్షులలో నారదుడను, సిద్ధులలో కపిలుడను, ప్రజాపతులలో దక్షుడను, పితృదేవతలలో అర్యముడను, దైత్యులలో ప్రహ్లాదుడను, గోవులలో కామధేనువును, పక్షులలో గరుత్మంతుడను. అంతేకాదు, ప్రతి వస్తువునందూ వ్యాపించియుండే భగవత్తత్త్వమును నేనే. ఓషధులకు, నక్షత్రాలకు అధిపతియైన చంద్రుడను నేను. యక్షరాక్షసులలో కుబేరుడను నేను. గజేంద్రాలలో ఐరావతాన్ని నేను. జలజీవాలకు ప్రభువైన వరుణుడను నేను. కాంతి, తాపములను ఇచ్చే సూర్యుడను నేను. మనుష్యులలో రాజును, దండించే వారిలో యముడను, ఒక శిరస్సుగల సర్పాలలో వాసుకిని, అనేక శిరస్సులు గల నాగులలో అనంతుడను నేను. జంతువులలో సింహాన్ని నేనే అని తెలుసుకొనుము.

ఇంకా ఆశ్రమధర్మాలలో సన్న్యాసాశ్రమాన్ని నేను. వర్ణాలలో బ్రాహ్మణ వర్ణాన్ని నేను. పవిత్రజలప్రవాహాలలో గంగానదిని నేను. గంభీరజలాల్లో సముద్రాన్ని నేను. నేను ఆయుధాలలో ధనుస్సును. ధనుర్ధరులలో త్రిపురాంతకుడైన రుద్రుడను. దుర్గమ స్థానాలలో మేరువును, పర్వతాలలో హిమాలయాన్ని, వృక్షాలలో అశ్వత్థాన్ని, ఓషధులలో యవసధాన్యాన్ని, వేదార్థాన్ని ఎరిగిన పురోహితులలో వశిష్ఠుడను నేను, సేనానాయకులలో కుమార స్వామిని, సన్మార్గ ప్రవర్తకులలో చతుర్ముఖ బ్రహ్మను నేను. యజ్ఞాలలో బ్రహ్మయజ్ఞాన్ని (వేదాధ్యయనమును) నేను. వ్రతాలలో అహింసావ్రతాన్ని నేను, విద్యలలో ఆత్మవిద్యను నేను.

ఉద్ధవా! నేను, స్త్రీలలో స్వాయంభువుని పత్నియైన శతరూపను, పురుషులలో స్వాయంభువమనువును, మునులలో బదరికాశ్రమంలో నుండే నారాయణుడను, బ్రహ్మచారులలో సనత్కుమారుడను, ఋతువులలో వసంతాన్నీ, మాసములలో మార్గశీర్షాన్నీ, నక్షత్రాలలో అభిజిత్తును (ఉత్తరాషాడయొక్క చివరిభాగము, శ్రవణనక్షత్రం యొక్క మొదటిభాగము) యుగాల్లో కృతయుగాన్నీ అయియున్నాను. శీతోష్ణాది ద్వంద్వాలను సహించేవారిలో అసితుడు, దేవలుడూ నేనే. కవులలో శుక్రుడను, భగవదైశ్వర్య వ్యక్తస్వరూపులలో వాసుదేవుడను, నిష్కామభక్తులలో ఉద్ధవుడను, విద్యాధరులలో సుదర్శనుడను, కింపురుషులలో హనుమంతుడనూ, రత్నాలలో పద్మరాగాన్నీ నేనే అనితెలుసుకొనుము.

ఉద్ధవా! నేను గంధర్వులలో విశ్వావసువును, సాధువులలో బలిని, అప్సరసలలో పూర్వచిత్తిని, వీరులలో అర్జునుడను, తిథులలో ఏకాదశిని, దానాలలో అన్నదానాన్ని, నరులలో వైష్ణవుడైన భాగవతోత్తముని, పర్వతాలలోని స్థిరత్వమూ, భూమియొక్క గంధము, నీటియొక్క రుచి, అగ్నియొక్క తేజస్సు, సూర్యచంద్రతారకల యొక్క దివ్యప్రభ, ఆకాశంలోని శబ్దము అన్నీ నా యొక్క విభూతులే.

ఉద్ధవా! నా విభూతులను లెక్కించి చెప్పడానికి నాకే సాధ్యపడదు. సూక్ష్మంగా చెప్పాలంటే, ఎక్కడెక్కడ తేజస్సు, ధైర్యము, కీర్తి, ఐశ్వర్యము, త్యాగము, సౌందర్యము, వీర్యము, ఓర్మి, విజ్ఞానము భాసిస్తుంటాయో ఆ వస్తువులు (వ్యక్తులు, విషయాలు అన్నీ) నాయొక్క అంశలో సహస్రాంశము కలవి అనితెలుసుకొనుము. ఇంద్రియ మనోబుద్ధులను నియంత్రించుకొని, నా విభూతులను స్మరిస్తూ నన్ను ఉపాసన చేస్తే మోక్షము సుగమం అవుతుంది. నాయందు భక్తి కలిగి, నేనే ఉపాయమని గుర్తుంచుకొని, నా యందలి ప్రేమతో నన్ను ధ్యానించడమే మోక్షోపాయము." అని భగవానుడు చెప్పెను.

## వర్ణాశ్రమ ధర్మాలు

### ఉద్ధవుడు ఇలా అడిగాడు

"స్వామీ! వర్ణాశ్రమ ధర్మాలను ఆచరిస్తూ, నిన్ను ఆరాధించేవారు సద్గతిని పొందుతారని చెప్పావు కదా, ఆ వర్ణాశ్రమ ధర్మాల గురించి కొంచెము వివరించి చెప్పవలసినదని ప్రార్థిస్తున్నాను." అన్నాడు. శ్రీభగవానుడు ఇలా చెప్పాడు:

ఉద్ధవా! మొదట కృతయుగంలో "హంస" అనే వర్ణం ఒక్కటే ఉండేది. వారికి ఆచరించవలసిన ధర్మాలేవీ ఉండేవి కావు. బ్రహ్మజ్ఞానంతోనే వారు జన్మించేవారు. ఆ యుగంలో అందరూ కృతకృత్యులే గనుక, ఆ యుగాన్ని కృతయుగం అన్నారు. అప్పుడు, ప్రణవము (ఓంకారము) ఒక్కటే వేదమైయుండేది.

చతుర్వర్ణాలు : తరువాత త్రేతాయుగంలో నా హృదయంలో నున్న ప్రణవమే ఋక్, యజుః, సామ, వేదాలై ఆవిర్భవించినది. అప్పుడే హోత, అధ్వర్యువు, ఉద్గాత అనబడే ముగ్గురు ఋత్విక్కులచే నిర్వహించబడే యజ్ఞకర్మ ఆరంభమైనది. ఆ వేదాలూ, యజ్ఞమూ కూడ నాయొక్క ప్రకాశమే. అనిరుద్ధమనబడే నాయొక్క విరాడ్రూపము నుండి చతుర్ముఖబ్రహ్మ ఉద్భవించాడు. విరాట్పురుషుని వదనమునుండి ఉద్భవించిన మనుష్యులు జ్ఞానసంపన్నులై అధ్యయన, ప్రవచన, విద్యావ్యాప్తి శీలురైనారు. వారిని విప్రులు (బ్రాహ్మణులు) అన్నారు. బాహుబల శౌర్య సంపన్నులైన మనుష్యులు బాహువుల నుండి ఉద్భవించి, శక్తిసామర్థ్యాలూ, రక్షణాసక్తి గలవారైనారు. వారు క్షత్రియులనబడ్డారు. ఊరువులనుండి ఉద్భవించినవారు గమనశీలురై, ఉత్పత్తి, వినిమయకార్యాసక్తులై వైశ్యులనబడ్డారు. శరీరమంతటికీ ఆధారమై, సకల కార్యకలాపాలకూ దోహదపడే పాదాలనుండి ఉద్భవించిన వారు సేవాభావ సంపన్నులై, మిగిలిన మూడువర్ణాలకూ, శారీరిక శ్రమలో తోడ్పడ్డారు. వారు శూద్రులు అనబడ్డారు.

చతురాశ్రమాలు : ఆ విరాట్పురుషుని శరీరపు జఘనభాగం నుండి గృహస్థాశ్రమము, హృదయస్థానమునుండి బ్రహ్మచర్యము, వక్షఃస్థలంనుండి వానప్రస్థము, శిరఃస్థానం నుండి సన్న్యాసాశ్రమము, కలిగినవి.

వర్ణధర్మాలు : విప్రవర్ణస్థులు వ్యక్త పరచే స్వభావాలు ముఖ్యముగా ఇలా ఉంటాయి: శమము, దమము, తపస్సు, శౌచము, సంతోషము, క్షమ, ఆర్జవము, భగవద్భక్తి, దయ, సత్యము మొదలైనవి. సత్త్వగుణ ప్రధానమైన ప్రవర్తన ఉంటుంది.

క్షత్రియ వర్ణస్థులు వ్యక్తపరచే స్వభావాలు ముఖ్యముగా ఇలా ఉంటాయి: వీరు తేజస్సు, బలము, ధైర్యము, శౌర్యము, ఓరిమి, ఔదార్యము, ఉద్యమము, స్థైర్యము, ఐశ్వర్యము కలిగియుంటారు. వీరు రజోగుణ ప్రధానమైన ప్రవర్తన చూపుతారు.

వైశ్యవర్ణస్థులు వ్యక్తపరచే స్వభావాలు ముఖ్యముగా ఇలా ఉంటాయి: ధనార్జనాసక్తి, దేవ, బ్రాహ్మణ సేవాసక్తి, ఆస్తికత, దానశీలత, ఉత్పత్తి చెయ్యాలనే పట్టుదల, దంభము లేకుండడం మొదలైనవి. వీరిలో తమోగుణముతోపాటు, రజోగుణ సత్త్వగుణాలు కూడ మిశ్రితమైయుంటాయి.

శూద్రవర్ణస్థులు ముఖ్యముగా వ్యక్తపరచే స్వభావాలు ఇలా ఉంటాయి: సేవాభావము, సహనము, అల్పసంతుష్టి, పరోపకారత, శారీరిక శ్రమను ఓర్చుకొనడం, గో, బ్రాహ్మణాదైవ సేవాతత్పరత మొదలైనవి. వీరిలో తమోగుణ ప్రకాశమే ఎక్కువగా నుంటుంది.

అన్నివర్ణాలవారూ పాటించవలసిన సామాన్యధర్మాలివి: అహింస, సత్యవచనము, చౌర్యము లేకుండడం, సర్వభూతహితాభిలాష, కామక్రోధాలు లేకుండడం మొదలైనవి.

ఆశ్రమధర్మాలు : బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవర్ణజులు బాల్యములో ఉపనయన కర్మతో, గురూపదేశాన్ని పొందాలి. అక్కడినుండి బ్రహ్మచర్య జీవితం ప్రారంభమవుతుంది, అనగా వేదములో చెప్పిన ప్రకారము ఆచరించడం నేర్చుకోవాలి. బ్రహ్మచారి గురుకులములోనుంటూ, గురువునొద్ద విద్యనభ్యసించాలి. ఇంద్రియనిగ్రహము, నియమవర్తనము పాటించాలి. జింకచర్మము, మేఖల, దండము, జపమాల, బ్రహ్మసూత్రము, కమండలువు ధరించాలి, దేహధ్యాసను తగ్గించుకొనడానికి గోళ్లు పెరిగినా, జుట్టు జడలు కట్టినా ఏమీ పట్టించుకొనరాదు. స్త్రీలతో ఏ విధమైన సంబంధమూ ఉంచుకొనరాదు. పవిత్రుడై రెండు సంధ్యలలోను అగ్ని, సూర్య, గో, బ్రాహ్మణ, ఆచార్య, వృద్ధ, దేవ, శక్తులకు నమస్కరించి సేవించాలి. గురుకులాశ్రమ నియమాలను పాటిస్తూ, గురుసేవా శుశ్రూషలను చేస్తూ విద్యనభ్యసించాలి. జీవితాంతం బ్రహ్మచర్య దీక్షతో గురుకులంలోనే ఉంటూ గురుసేవాతత్పరుడైయుండే వానిని నైష్ఠిక బ్రహ్మచారి అంటారు. అనంతరం అతడు బ్రహ్మలోకాన్ని పొంది, ముక్తిని పొందుతాడు. లేదా విద్యాపూర్తి అయిన తరువాత గురుదక్షిణ సమర్పించి, గురువు అనుమతిని పొంది, వివాహం చేసుకొని, గృహస్థాశ్రమంలో ప్రవేశించవచ్చును, లేదా వానప్రస్థాశ్రమాన్నిగాని, సన్న్యాసాశ్రమాన్నిగాని స్వీకరించవచ్చును.

గార్హస్థ్యం : బ్రహ్మచర్యమునుండి గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, అనుకూల వతియైన కన్యను వివాహమాడి, గృహస్థధర్మాలను చేపట్టాలి. వేదాధ్యయనము, యజ్ఞము, దానము, బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు చేయవచ్చును. యజ్ఞము చేయించడం, వేదము చదివించడం, దానము స్వీకరించడం బ్రాహ్మణులే చేయదగిన కర్మలు. దానము తీసుకోవడం ఇష్టము లేకపోతే యజ్ఞము చేయడం, విద్య నేర్పడం ద్వారా జీవించవచ్చును. ఈ విధంగా కూడ చేయడం ఇష్టములేకపోతే శిలావృత్తి, ఉంఛవృత్తి ద్వారా జీవించవచ్చు. (పొలములో రాలిన గింజలను ఏరుకొనడం శిలావృత్తి. గ్రామంలో ధాన్యపు అంగడుల వద్ద నేలపడిన గింజలను అడిగి తెచ్చుకొనడం ఉంఛవృత్తి). బ్రాహ్మణునకు శరీరపోషణమే ముఖ్యవృత్తికారాదు. అతడు సుఖభోగాల గురించి జీవించరాదు. స్వధర్మాన్ని ఆచరిస్తూ తపస్సు చెయ్యాలి. గృహస్థుడైనా తన వర్ణాశ్రమ ధర్మాలను పాటిస్తూ, లభించిన దానితో సంతుష్టిని చెందుతూ, నాయందే మనస్సు నిలిపి చరించువాడు సంసారక్లేశమునుండి విడువడి మోక్షము పొందగలడు. వేదవేత్తలను, బీదబ్రాహ్మణులను దేశప్రభువు రక్షించాలి. బ్రాహ్మణుడు అవసరార్థం క్షాత్ర, వైశ్య వృత్తులను చేపట్టవచ్చు గాని సేవక వృత్తి నవలంబించరాదు. క్షత్రియుడు వైశ్యవృత్తిని చేపట్టవచ్చు. ఇది ఆపద్ధర్మము మాత్రమే. ఆపదతొలగి, అవసరం

తీరిన తరువాత మళ్లీ స్వధర్మాలలోనికి మారిపోవాలి. ఆలుబిడ్డలయందు ప్రేమ ఉండాలిగాని, వ్యామోహమూ సంగమూ పెంచుకొనరాదు. అన్నీ ప్రయాణములో ఏర్పడిన తాత్కాలికమైన బాటసారి బాంధవ్యాలే అని ఎల్లప్పుడూ గుర్తుంచుకొనవలెను. గృహస్థులు తమకు నిర్దేశింపబడిన నిత్యనైమిత్తిక కర్మలూ, పితృదేవతార్చన, దేవతార్చన, బ్రాహ్మణసేవ, దాన ధర్మాదికాలను నిర్వహిస్తుండాలి. ఫలాపేక్షలేకుండా నన్ను ఆరాధించాలి. సర్వమూ నాకే అర్పించాలి.అతిథులను నన్నుగా భావించి సత్కరించాలి. ఇంద్రియ విషయభోగాలయందు ఆసక్తిచూపరాదు. పంచయజ్ఞాల నాచరించాలి. 1.వేద శాస్త్రాధ్యయనం ద్వారా, ఋషియజ్ఞము, 2. శ్రాద్ధ కర్మల ద్వారా పితృయజ్ఞము, 3. హోమాలద్వారా దేవయజ్ఞము, 4. అతిథిసత్కార అన్నదానాలద్వారా మానవ యజ్ఞము 5. ఆహారమూ నీరు పెట్టి, జంతు, కీటక, వృక్ష, భూతయజ్ఞము చెయ్యాలి. ఇంటిలో సేవచేసే వాళ్లను అన్ని విధాలా ఆదరించాలి. తన గృహంలోనే తాను అతిథిగానున్నట్లు, దేనియందూ సంగము లేకుండా మెలగాలి. భార్యాబిడ్డలతో కూడి నన్ను పూజిస్తుండాలి, దేనియందూ మోహంపెంచుకొనరాదు. వైరాగ్యాన్ని పెంచుకొనవలెను.

వానప్రస్థము : గృహస్థ బాధ్యతలను తీర్చుకొని, విషయభోగాలయందు విరక్తిజెంది గృహస్థుడు వాన ప్రస్థాశ్రమాన్ని స్వీకరించాలి. భార్యతోగాని, లేదా ఆమెకు సరియైన రక్షణ కల్పించి, ఒంటరిగా గాని, అతడు అరణ్యానికి వెళ్లాలి. అక్కడ కోరికలు లేనివాడై దుంపలు, పండ్లు, ఆకులు తింటూ జీవించాలి. నారబట్టలుగాని, ఆకులుగాని, చర్మముగాని ధరించాలి. శరీరాన్ని అలంకరించుకొనరాదు. మూడుకాలాల్లోనూ, మూడుపూటలా స్నానము చెయ్యాలి. నేలపై నిద్రపోవాలి. వేసవిలో అగ్నిహోత్రాలచెంత, ఎండలోనూ ఉండాలి. వర్షాలలో తడుస్తుండాలి. చలికాలంలో కంఠము వరకు నీటమునిగియుండాలి. ఈ విధంగా శరీరాన్ని కృశింపజేస్తూ తపస్సు చెయ్యాలి. తన ఆహారం తానే సంపాదించుకోవాలి, కాని ఇతరులు తెచ్చి ఇచ్చినదాన్ని తీసుకొనరాదు. దొరికిన సామగ్రితోనే యాగాలు చెయ్యాలి. పశువధ చెయ్యరాదు. ఏ విధమైన కోరికలూ లేకుండా భగవదారాధన చెయ్యాలి. కోరికలు పెట్టుకొని, క్షుద్రదేవతారాధన చెయ్యరాదు. శరీరము బాగా కృశించిపోయి, ఏకర్మలనూ చెయ్యలేని స్థితి కలిగినప్పుడు అగ్నిని తన హృదయంలో ఆరోపించుకొని, లోనున్న నన్నే అగ్నిగా భావించి ఆరాధించాలి. ఆహుతికావాలి. శరీరస్వస్థత, శక్తీ ఉంటే సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించాలి.

సన్న్యాసము : బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాశ్రమాలలో ఏ దశనుండి అయినా సన్న్యాసాశ్రమం స్వీకరించవచ్చును. దీనికి ఇహలోక, పరలోక భోగాలయందు తీవ్రమైన వైరాగ్యం ఉండాలి. ప్రాజాపత్యేష్టి యాగాన్ని ఆచరించి, తనకున్న సంపదనంతా దానం చేసేసి, దేనియందూ కోరికలు లేకుండా, నన్నే హృదయంలో నింపుకొని, సన్న్యసించాలి. భార్యాపుత్ర బంధుమిత్రాదులు కలుగజేసే బంధాలనూ, అవరోధాలనూ, అతిక్రమించాలి. కౌపీనమూ దానిపై మొలచుట్టూ ఒక గుడ్డను మాత్రముంచుకోవాలి. ఉత్తరీయముంచుకొనరాదు. దండమూ, పాత్ర, తప్ప ఇంకేమీ ఉంచుకొనరాదు. నేలను చూస్తూ నడవాలి. నీటిని వస్త్రములో వడబోసుకొని త్రాగాలి. సత్యవాక్కునే పలకాలి. మనస్ఫూర్తిగా నమ్మినదానినే అనాలి, ఆచరించాలి. మౌనముద్వారా వాక్కును నియమించాలి. కామ్యకర్మలను చెయ్యాలనే ఆలోచననే రానీయరాదు. ఏడు ఇళ్లలో భిక్షను అర్థించి, లభించిన దానితో సంతుష్టి చెందాలి. ఊరిబయటనున్న నదిలోగాని, చెరువులో గాని, స్నానము, ఆచమనము చేసి, తాను తెచ్చుకొన్న భిక్షలో కొంతభాగాన్ని ఇతర భూతాలకు అర్పించి, మిగిలిన దానితో జీవించాలి.

సన్న్యాసి ఏకాకిగా సంచరించాలి. ఇంద్రియాలను వశపరచుకొని, ఆత్మవినా ఇంకేదీ లేదనే ఎరుకతో ఎల్లప్పుడూ ఉండాలి. భిక్షకోసమే సన్న్యాసి గ్రామంలోకి వెళ్లాలి. వానప్రస్థులిచ్చే భిక్షయే శ్రేష్ఠమైనది. ఈ దృశ్యజగత్తు అంతా అశాశ్వతము, అసత్యము, మాయామయము అని ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉంచుకోవాలి, దానియందే మాత్రమూ ఆసక్తిని ఉంచుకొనరాదు. మోక్షాపేక్షను కూడ విడిచిపెట్టి, జ్ఞానయోగసాధనలో నుండాలి. బాలునివలె, మందమతి వలె, ఉన్మత్తుని వలె, పరిసరాలచే ప్రభావితం కాకుండా, తన ప్రపంచంలోనే ఉంటూ, నిర్మలానందాన్ని అనుభవించాలి.

వైదిక ధర్మాలను పాటిస్తున్నా, వైదిక కర్మ కాండలయందు మాత్రము ఆసక్తి చూపరాదు. తాను ఎవ్వరికీ, దేనికీ భయపడరాదు, భయాన్ని కలిగించరాదు. ఇతరులు తనను అవమానించినా, తాను మాత్రము, ఇతరులకు మనోవాక్కర్మలచే ఎలాంటి బాధనూ కలిగించరాదు. సర్వజీవులయందూ ఆ సర్వేశ్వరుడే ఉన్నాడని మరువరాదు. శరీరమును గురించి చెయ్యబడిన సకల కర్మలూ సంతాపాన్నే కలుగజేస్తాయి. సన్న్యాసి ఆత్మజ్ఞానం కలిగే వరకు గురువు నాశ్రయించాలి. గురువు పైకి మానవునిగా కనిపించినా పరబ్రహ్మ స్వరూపమే అని నమ్మాలి. సంపూర్ణవైరాగ్యం ఉంటేనే సన్న్యాసాశ్రమంలో ప్రవేశించాలి. లేకపోతే పరమార్థం సిద్ధింపకపోగా, ఇహలోక సుఖాలను కూడ కోల్పోతాడు.

అన్ని ఆశ్రమాలవారూ, బ్రహ్మచర్యము, తపస్సు, శౌచము, సంతృప్తి, సర్వభూతప్రేమ ఆచరించాలి. తమతమ వర్ణాశ్రమధర్మాలను పాటిస్తూ, సర్వభూతాలయందు భగవద్భావాన్ని కలిగియుండి, నాయందే చిత్తము నిల్పుకొన్నవారై నన్ను చేరగలరు. భక్తిమార్గాన్ని అనుసరించలేనివారు భగవంతుని యందు సంపూర్ణశరణాగతులై తరించవచ్చు. తనను రక్షించే భారము ఆ భగవంతునిదే అని నమ్మడం న్యాసము (సన్న్యాసము) అనబడుతుంది." అని శ్రీభగవానుడు ఉద్ధవునికి చెప్పాడు.

భగవత్తత్త్వము : శ్రీభగవానుడు చెపుతున్నాడు: ఉద్ధవా! ఈ విశ్వమంతా నాయందు ఆరోపితమై యున్నట్టునూ, ప్రకృతీ, జీవుడూ, ఈశ్వరుడూ అభేదమైయున్నట్టునూ తెలుసుకొన్న జ్ఞాని నాకు ఇష్టుడు. ఈ శరీరము పుట్టక ముందునూ, చనిపోయిన తరువాతనూ కూడ జీవుడు ఉంటాడు. జ్ఞానముచే పరిశుద్ధమైన మనస్సుగల జ్ఞానులు నన్ను పరమేశ్వరునిగా తెలుసుకొని ఆరాధిస్తారు.

ఉద్ధవా! నా నిజతత్త్వాన్ని నీవు తెలుసుకొనగోరుతున్నావు. పూర్వము ఇలాంటి ప్రశ్ననే యుధిష్ఠిరుడు, కురుక్షేత్రంలో అంపశయ్యపైనున్న భీష్ముని అడుగగా, భీష్ముడు చెప్పిన ముక్తి మార్గాన్ని నీకు చెపుతాను విను. నాచే నిర్ణయింపబడిన ఇరవైఎనిమిది తత్త్వాల గురించి తెలియజేసేదే జ్ఞానము. ప్రకృతి, పురుషుడు, మహత్‌తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు, (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు) ఈ తొమ్మిది భావాలూ, దశేంద్రియాలూ, మనస్సు (పదకొండు) పంచమహాభూతాలు (భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము), ఈ మొత్తము ఇరవైఐదు తత్త్వాలు శరీరంలోనుంటాయి. వాటిని ఆశ్రయించుకొని, త్రిగుణాలు (సత్త్వ రజ స్తమోగుణాలు) ఉంటాయి. బ్రహ్మదేవునినుండి తృణమువరకు అన్నీ ఈ ఇరవైఎనిమిది తత్త్వాలతో కూడియున్నవే. వీటిని తెలుసుకొనే వివేకము జ్ఞానమనబడుతుంది. నన్నాశ్రయించి, నన్నుపొందడమే పురుషార్థమని తెలుసుకొని, దేహము పుట్టుక, స్థితి, వినాశాలను పొందునట్టిదనీ, ఆత్మనశించనట్టిదనీ తెలుసుకొనడం విజ్ఞానము. అన్ని కార్యాలకూ మూలకారణము పరబ్రహ్మము. విశ్వసృష్టికి ఆది, మధ్య అంతములలో నుండేది పరబ్రహ్మమే. ఏ విషయం గురించి అయినా నాలుగు ప్రమాణాల ద్వారా తెలుసుకొనవచ్చును. 1. శ్రుతి (వేదము, గ్రంథము) 2. ప్రత్యక్షానుభవము, 3. ఐతిహ్యము (పూర్వము మహానుభావులు అనుభవించి, పరంపరగా తరువాతి తరాల వారికి తెలియజెప్పడం) 4. అనుమానము (తర్కసిద్ధాంతాలచే ఊహించి గ్రహించడం) ఈ నాలుగు ప్రమాణాల ద్వారా ఏకైక బ్రహ్మమే సత్యము, నానాత్వముతో కూడిన జగత్తు మిథ్య అని తెలియవస్తుంది. మిథ్యారూపమైన విషయవస్తువులు, నశ్వరమైనట్టివీ, అశాశ్వతాలూ అని తెలుసుకొని, వాటియందు వైరాగ్యాన్ని పెంచుకొంటూ, నిత్యానందదాయకమైన పరమేశ్వర పాదానురక్తిని పెంపొందించుకోవాలి.

ఉద్ధవా! నీకు భక్తిని గురించి చెప్పియుంటిని. ఇప్పుడు ఆ భక్తి ఎలాగ ఉదయిస్తుందో చెపుతాను వినుము:

భక్తి : అమృతతుల్యమైన భగవత్కథాశ్రవణము భక్తికలగడానికి మొదటి సాధనము. భగవంతుని రూపగుణ వైభవాలను కీర్తించడం, నామవిశేషాలతో స్తుతించడం, కథలను పదేపదే ఇతర భక్తులతో ముచ్చటించడం ముఖ్యసాధనాలు. షోడశోపచారాలతో సేవించడం, మంత్రస్తోత్రాలతో అర్చించడం, సర్వాంగ నమస్కారాలు చెయ్యడం,

సర్వభూతాలూ, భగవత్స్వరూపాలే అని గుర్తించి ప్రేమించడం, భగవద్భక్తులను సేవించడం, దశేంద్రియ మనోబుద్ధులతో జరిగే సకలవ్యాపారాలనూ భగవంతుని ప్రీత్యర్థం అర్పణచేయడం, మనోవాక్ కర్మలచే భగవంతునికే అంకితమవడం భాగవతుల యొక్క ముఖ్యలక్షణాలు. తనకున్న ధనద్రవ్యాది సంపదలను భగవంతుని కార్యాలలోను, భాగవతుల సేవలోను దీనజనులను ఆదరించడంలోనూ, దేవాలయాది సేవలలోనూ వినియోగించాలి గాని, కామోపభోగాల గురించి వెచ్చించరాదు. విషయలాలసను త్యజించి, అన్ని సుఖసంతోషాలనూ ప్రసాదించే పరమేశ్వరుడే సర్వస్వం అని ఆరాధించాలి. హోమ, యాగాది కర్మలను, జపతపాదిసాధనలను, ఉపవాస తీర్థయాత్రాది వ్రతాలను, అతిథి సంతుల సపర్యలనూ చేస్తుండాలి. ఈ సాధనలన్నీ నా యొక్క ప్రీతికోసమే చేస్తున్నట్టు భావించాలి. భగవంతుడే అన్నిటి కంటే ఏకైక ప్రేమపాత్రుడని, ఆయనను ప్రేమించాలి. ఇవన్నీ భక్తిసాధనలు. ఉద్ధవా! ఈ విధంగా, నాయందు అనన్యభక్తి విశ్వాసాలతో వర్తించే వానికి, ఇక కోరదగినదేదీ ఉండదు. అతనికి ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, అప్రయత్నముగ లభిస్తాయి. నన్నే సర్వాత్మగ అంతటా, అన్నిటియందూ చూడగలడు. ఇదే భక్తికి పరాకాష్ఠ" అని శ్రీభగవానుడు చెప్పగా, భక్తికి యమనియమాలు కూడ దోహదపడతాయని అంటారు. కనుక వాటిగురించి వివరింపుమని వేడుకొని, ఉద్ధవుడు, శమము, దమము, తితిక్ష, ఋతము, దక్షిణ, విద్య, శ్రీ, హ్రీ, మొదలైన అనేక విషయాల గురించి కూడ చెప్పుమని ప్రార్థిస్తాడు. భక్తమందారుడైన భగవానుడు అత్యంత కరుణతో ఇలాగ చెప్తాడు:-

## యమ నియమాలు

ఉద్ధవా! ప్రతి సాధకుడూ, ప్రతి భక్తుడూ, పాటించవలసిన కొన్ని ముఖ్యమైన సాధనాంగాలున్నవి. వాటిని పన్నెండు యమములూ పన్నెండు నియమాలుగా పేర్కొన్నారు. అవి, ఇవి:-

యమములు : అహింస, సత్యము, అస్తేయము, అసంగము, హ్రీ, అసంచయము, ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, క్షమ, అభయము, అని ఈ పన్నెండూ యమములు. మనోవాక్కాయ కర్మలచే ఏ జీవికీ ఎటువంటి బాధనూ కలిగించకుండడం అహింస. అప్రియవాక్కులు లేని సత్యవచనము, సత్యము. ఇతరులసొత్తును మానసికంగానైనా, "కావాలి" అని అనుకొనకుండా ఉండడం అస్తేయము. దేనియందూ అనురక్తి లేకుండా ఉండడం అసంగము. చేయరాని పనిని చెయ్యడానికీ, ఇవ్వగలిఉండీ ఇవ్వనందుకు సిగ్గుపడడం హ్రీ. కూడబెట్టే కాంక్ష లేకుండడం అసంచయం. (ఏవస్తువునూ తనదిగా స్వీకరించకుండడం అని కూడ చెప్పవచ్చు.) వేదశాస్త్రనిరూపిత విషయాలయందు విశ్వాసముంచడం ఆస్తిక్యము. స్త్రీ పురుష సాంగత్యాన్నీ, విషయభోగలాలసనూ వర్జించడం బ్రహ్మచర్యము. వాఙ్మానస శాంతిని పాటించడం మౌనము. మానసిక స్థిరత్వాన్ని కలిగియుండడం స్థైర్యము. ఇతరుల పొరపాట్లయందు సహనం చూపడం క్షమ. ఏ విషయంలోనూ, దేనికీ, ఎవ్వరికీ భయపడకుండడం అభయము.

నియమములు : జపము, తపము, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, భగవదర్చనము, తీర్థాటనము, పరోపకారము, సంతుష్టి, ఆచార్యసేవనము, అంతఃశౌచము, బాహ్యశౌచము. మనస్సును రాగద్వేషాది భావాలతో కలుషితం కాకుండా ఉంచుకొనడం, అంతఃశౌచము. దేహాన్నీ, పరిసరాలనూ, స్నాన మార్జనాదులచే శుభ్రముగా నుంచుకోవడం బాహ్యశౌచము. మంత్రము తనకు మాత్రమే వినబడేటట్టు ఆవృత్తి చెయ్యడం జపము. శారీరిక సుఖాలనూ, అవసరాలనూ విడిచిపెట్టి, ఏకైక లక్ష్యముపై ధ్యానించడం తపస్సు. అగ్నిలో ఆహుతులను అర్పించి, మంత్రాలతో ఆరాధించడం హోమము, శాస్త్ర, గురు వాక్యములయందు విశ్వాసముంచి, చేయదగిన కార్యాన్ని దీక్షతో చెయ్యడం శ్రద్ధ. భగవంతుడే అతిథి రూపంలో వచ్చినట్లు భావించి, ఆదరించి, సత్కరించడం ఆతిథ్యం. షోడశోపచారాలతో భగవంతుని సేవించడం భగవదర్చన. పుణ్యస్థలాలను భక్తిశ్రద్ధలతో సందర్శించడం తీర్థాటనము. స్వార్థరహితంగా ఎలాంటి భేదభావాలూ లేకుండా మేలు చెయ్యడం పరోపకారము. తనకు లభించినదే భగవత్ప్రసాదమని భావించి, సంతృప్తితో స్వీకరించడమే సంతుష్టి. జ్ఞానదాతలైన గురువులను భక్తిశ్రద్ధలతో సేవించడం ఆచార్యసేవనము.

ఉద్ధవా! నీవడిగిన ఇతర విషయాలగురించి చెప్తాను విను:

శమము:- మనస్సును నిగ్రహించి, భగవానుని యందే బుద్ధిని లగ్నము చేసియుంచడం శమము.

దమము:- ఇంద్రియాలు స్వేచ్ఛగా చరించకుండా అదుపులో నుంచడం.

తితిక్ష:- శారీరిక మానసిక బాధలను ఓరిమితో సహించడం.

ధృతి:- జిహ్వాచాపల్యానికీ, స్త్రీ పురుష సంపర్కాభిలాషకూ లొంగిపోకుండా దృఢచిత్తము కలిగియుండడం.

దానము:- ఏ ప్రాణినీ ద్వేషించకుండా, ఏ ప్రాణికీ ద్రోహము తలపెట్టకుండా ఉండడం దానము. ధనమిచ్చినంతనే దానం అనిపించుకోదు.

తపస్సు:- సకల భోగాలనూ త్యజించడం తపస్సు

శౌర్యము:- ఆకలి దప్పులను, స్వభావాన్నీ జయించడం శౌర్యము.

సత్యము:- ఆత్మయే అంతటా నిండియున్నదని చూడగలిగేది సమదర్శనము.

ఋతము:- ఉన్నది ఉన్నట్లు సత్యవచనమును పలకడం ఋతము

శౌచము:- తాను చేసే కర్మలయందు, కర్తృత్వభావము, సంగము లేకుండడం శౌచమనబడుతుంది.

త్యాగము:- (సన్న్యాసము):- కర్మనాచరించి, కర్మఫలాన్ని విడవడం.

ధనము:- ధర్మమే ప్రియమైన ధనము. భగవద్భక్తిని కలిగించునదే ధర్మము.

యజ్ఞము:- కల్యాణగుణాలతో నున్న నేనే యజ్ఞమును.

దక్షిణ:- జ్ఞానదాత అయిన గురువునకు శిష్యుడు సమర్పించేది దక్షిణ.

బలము:- ప్రాణాయామమే బలము.

ఈశ్వరభావము:- భగవానుని యొక్క "భగము" గురించి తెలుసుకోవడం.

భగము:- ఐశ్వర్యము, శౌర్యము, యశస్సు, సిరి, వైరాగ్యము, సమగ్రత కలిగియున్న భగవత్తత్త్వము.

లాభము:- ఏకోరికాలేక, భగవద్భక్తిని కలిగియుండడం లాభము.

దయ:- నిస్స్వార్థముగ ఇతరుల బాధలకు స్పందించి, వానిని నివారించాలనుకోవడం దయ.

విద్య:- దేవ, మానవ, తిర్యక్స్థావర శరీరాలన్నింటిలోనూ ఒకే ఆత్మ ఉన్నదని తెలుసుకోవడం విద్య.

హ్రీ:- చేయరాని పనిని చెయ్యడానికి సిగ్గుపడి, సంకోచించడం.

అలంకారము:- శ్రీ:- దేనియందూ అపేక్షలేక లభించిన దానితో సంతుష్టిని చెందియుండడమే మానవునకు శ్రీ.

సుఖము:- సుఖదుఃఖాదులకు అతీతముగా నుండడమే సుఖము.

దుఃఖము:- విషయసుఖాపేక్షయే దుఃఖము.

పండితుడు:- బంధమోక్షాలకు కారణం తెలిసినవాడు పండితుడు.

మూర్ఖుడు:- దేహమేనేను, దేహానికి చెందినవి నావి అని అహంకార మమకారాలున్నవాడు.

సన్మార్గము:- భగవత్ప్రాప్తికి దారిజూపే వైరాగ్యమార్గమే సన్మార్గము.

చెడుమార్గము:- మనస్సును ఇంద్రియ విషయాల వైపు మళ్లించేది.

స్వర్గము:- మనస్సులో రజస్తమోగుణాలు క్షీణించి, సత్త్వగుణము వృద్ధిచెందియున్న స్థితియే స్వర్గము.

నరకము:- మనస్సులో తమోగుణము నిండియున్న స్థితి.

బంధువు:- జ్ఞాన ప్రదుడైన గురువే బంధువు. ఆ గురువును నేనే.

గృహము:- మనుష్యునకు శరీరమే గృహము.

ధనవంతుడు:- సద్గుణ సంపన్నుడే ధనాఢ్యుడు.

దరిద్రుడు:- సంతుష్టిలేనివాడే దరిద్రుడు.

కృపణుడు:- (దీనుడు, హీనుడు) ఇంద్రియాలను అదుపులో నుంచుకొన లేనివాడే హీనుడు.

ప్రభువు:- ఇంద్రియవిషయాలవెంట పరువులెత్తక, ఇంద్రియాలను అదుపులో నుంచుకొన్నవాడే ప్రభువు.

బానిస:- ఇంద్రియాలు ఆడించినట్లు ఆడువాడే బానిస.

ఉద్ధవా! నీవడిగిన అన్నివిషయాలకూ సమాధానం దొరికిందా? సంగ్రహంగా చెప్పాలంటే, ఏ వస్తువునందైనా గుణదోషాలను వెతికిచూడడమే ఒక దోషము. గుణదోషాల గురించి చూడకుండా, సర్వమూ సర్వేశ్వరమయం అనే సమభావంతో నుండడమే శ్రేష్ఠము. అని శ్రీభగవానుడు చెప్పాడు. అప్పుడు ఉద్ధవుడు ఇలా అడిగాడు: "భగవన్! గుణదోషాలను కనిపెట్టే దృష్టిని విడువుమని చెప్పితివి కదా! మరి నీ నుండియే వెలువడిన వేదాలలోనూ, శాస్త్రాలలోనూ, అనేకమైన విధులూ, నిషేధాలూ శాసింపబడ్డాయి కదా! నిషిద్ధాలు వర్జింపవలసినట్టివి, కనుక చెడ్డవిగనూ, విధులు నిర్వహింపవలసినవి గనుక మంచివిగనూ పరిగణింపబడాలి. అప్పుడు ఈ గుణదోష విచక్షణ చేయవలసియుంటుంది కదా! ఈ విషయంలో నాకు స్పష్టపరచి చెప్పవలసిందని ప్రార్థిస్తున్నాను" అన్నాడు. శ్రీభగవానుడు ఇలా సమాధానం చెప్పాడు.

ఉద్ధవా! నీ సందేహాలను తీర్చడానికి నేను మరికొన్ని విషయాలను చెప్పాలి. ఈ ప్రపంచంలో అనేక విధాలైన వ్యక్తులుంటారు. వారి యొక్క గుణకర్మ స్వభావాలను బట్టి వారి వారి పురుషార్థాన్వేషణమార్గాలు కూడ వేరు వేరుగానుంటాయి. అవి కర్మ మార్గము, జ్ఞానమార్గము భక్తిమార్గము, అనబడే మూడు ప్రముఖ మార్గాలుగా నా చేత నిర్దేశింపబడినవి. వాటి గురించి చెపుతాను విను:" అన్నాడు.

## కర్మ, జ్ఞాన, భక్తి తత్త్వములు

### శ్రీభగవానుడు ఇలా చెప్పాడు

ఉద్ధవా! వివిధ వర్గాల సాధకులకు సరిపడే విధంగా వేరువేరు మార్గాలు నాచే నిర్దేశింపబడినవి. అవి కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము. ఈ మూడు మార్గాలూ శ్రేయస్కరములే. వేద శాస్త్రాలలో చెప్పబడిన కర్మలనాచరిస్తూ, ఇహలోకపు కోరికలను స్వర్గలోకసుఖాలనూ కాంక్షిస్తూ వాటి ప్రాప్తి కోసం పాటుపడే కర్మజీవులకు కర్మమార్గము సరిపడుతుంది. స్వభావసిద్ధమైన కర్మల నాచరిస్తూ వాటి ఫలముల గురించి ఆశించకుండా నిష్కామనిస్స్వార్థ భావములతో కర్మలను చెయ్యడం కర్మయోగమనబడుతుంది. ఇహలోక పరలోక సుఖాలయందు కాంక్షలేకుండా దేహేంద్రియ మనోబుద్ధులతోపాటు, ప్రపంచమంతా నశించునట్టిదే అని గ్రహించి, నిత్య సత్య, అవినాశియైన ఆత్మను పొందగోరు వారికి జ్ఞానయోగము నిర్దేశింపబడినది. నా యొక్క అనుగ్రహం చేత వారి అదృష్టవశాత్తూ, నాయొక్క లీలావైభవ గాథలను వినాలనే ఆసక్తీ, నా దివ్య నామాలను ఉచ్చరించడానికి ప్రీతి కలిగియున్న మానవులు సుఖాలను పొందాలనే కాంక్షలేనివారై, నా పాదాల నాశ్రయించే ఆసక్తిగలవారి గురించి భక్తియోగము చెప్పబడినది. ఈ మూడు మార్గాలు తప్ప వేరొక పరార్థసాధన లేదు.

కామ్యకర్మల నాచరిస్తూ, మనుజుడు కొన్నాళ్లకు కర్మ ఫలాలయందు ఆసక్తి సన్నగిల్లగా నిష్కామ కర్మలను నా ప్రీతికొరకే ఆచరిస్తూ, నా యందు భక్తి కలిగిన వాడవుతాడు. లేదా విరక్తుడై, జిజ్ఞాసువై జ్ఞానసాధన వైపు మొగ్గుతాడు.

మానవశరీరమే మోక్షసాధనకు ఏకైక క్షేత్రము. మోక్షాన్ని కోరే స్వర్గవాసులు కూడ మానవజన్మనే కోరుకొంటారు. మానవశరీరమే సంసారసాగరాన్ని దాటడానికి నావవంటి సాధనము. దానిని సద్వినియోగ పరుచుకోవాలి గాని భంగపరచుకోరాదు. సద్గురువే ఆ నావను సురక్షితంగా ఒడ్డునకు చేర్చగల నావికుడు. పొగరుబోతు గుఱ్ఱాన్ని నయానా భయానా లొంగదీసుకొని అదుపులో నుంచునట్లు, చంచలమైన మనస్సును మెల్లమెల్లగా వశపరచుకోవాలి. దానిని తత్త్వవిచారమందూ, నా సేవలయందూ నియమించితే ఇతర చింతల వైపుకు పోకుండా నిలుస్తుంది. భగవత్ప్రాప్తిని కాంక్షించే వారు కోరికలతో కర్మలు చేయడంగాని, ఫలాన్ని బట్టి ఇది మంచిది అని స్వీకరించడం గాని, ఇది చెడుది అని తిరస్కరించడంగాని చెయ్యరాదు. బ్రహ్మచారి గృహస్థధర్మాల నాచరించరాదు. గృహస్థుడు సన్న్యాసిలాగ ప్రవర్తించరాదు. మంచి చెడు విచక్షణను లౌకిక ఫలాల నాశించి పనిచేసేవారు పాటిస్తారు గాని భగవంతుడే కావాలనుకొనేవారికి రెండూ సమానమే. వారికి భగవత్సంబంధమున్నవన్నీ మంచిగాను, భగవత్సంబంధం లేనివి మంచివి కానివిగాను కనిపిస్తాయి. వారికి ప్రత్యేకమైన మంచీ చెడుల భావముండదు.

నన్ను పొందగోరువానికి నా కథలయందు రుచి ఏర్పడుతుంది. నన్ను మనస్సులోనికి ప్రవేశపెట్టగానే, చిన్నచిన్న కోరికలన్నీ తప్పుకొంటాయి. కొత్త కోరికలు ప్రవేశించవు. క్రమంగా కోరికలను తీర్చుకోవాలనే అభిలాష సన్నగిల్లి, వాటియందు విరక్తి పుడుతుంది. నాయందు భక్తి, అనురక్తి వృద్ధి చెందుతాయి. సర్వభూతాంత రాత్మను అయిన నన్ను సదా తన హృదయంలోనే చూడడానికి సాధన చేస్తాడు. నా దర్శనంతో అతనిలోనున్న సంశయాలూ కర్మలూ అన్నీ తొలగిపోతాయి. అందుకే కర్మయోగ జ్ఞానయోగాలకంటే భక్తి యోగమే శ్రేష్ఠమైనది. యజ్ఞయాగాలూ, తీర్థయాత్రలూ, జపతపాలూ, జ్ఞానవైరాగ్యాలూ ఇచ్చే ఫలాలన్నీ నా యందు అనన్య భక్తి కలిగినంతనే లభిస్తాయి. నా భక్తులకు నేను ఇస్తానన్నా ఏదీ అక్కర ఉండదు. వారు దేనినీ స్వీకరించరు. వారికి నా యందు ఏకాంత భక్తివినా ఏలాంటి కోరికలూ ఉండవు. మోక్షము కావాలనుకోవడం కూడా ఒక కోరికే గనుక, దానిని కూడ కోరరు. అలాంటి భక్తులకు ఇది మంచిది, ఇదికాదు అనే ఎంపిక ఉండదు. వారు అంతటా, అన్నింటా నా రూపాన్నే దర్శించి, ప్రేమించి, ఆనందిస్తారు.

ఉద్ధవా! నేను చెప్పిన ఈ భక్తి తత్త్వాన్ని తెలుసుకొని ఆచరించే వారు పరమానందాన్నీ, పరబ్రహ్మస్థానాన్నీ పొందగలవారవుతారు." అని, శ్రీభగవానుడు చెప్పాడు.

## వేదాల అంతరార్థము

ఉద్ధవా! నన్ను చేరే మార్గాలను నిర్దేశించే కర్మయోగ జ్ఞానయోగ భక్తి యోగాలలో తమకు సరిపోయిన దానిని అనుసరించకుండా, ఇంద్రియ విషయ భోగాలను కోరుకొంటూ పోయేవారు జనన మరణ సంసార మను సుడిగుండంలో చిక్కుకొంటారు. నాచే నిర్దేశింపబడిన ఈ మార్గాలలో ఉత్తమ, మధ్యమ అనే తారతమ్యాలు లేవు. అనుసరించేవారి స్వభావానుగుణంగా నున్న మార్గమే వారికి నచ్చుతుంది. కొందరికి సరిపోయిన కర్మ మార్గము కొందరికి సరిపోదు. కొందరికి భక్తిమార్గము నచ్చితే కొందరికి జ్ఞానమార్గం సరిపోతుంది. కొందరికి గుణమైనది కొందరికి దోషముకావచ్చు. గుణదోషాలు ఆ వస్తువులో, ఆ మార్గములో లేవు. అలాగే నా సృష్టిలోని వస్తువులలో గుణ దోషాలుండవు. కొందరికి సుఖాన్నిచ్చే ఆ వస్తువులే, కొందరికి కష్టాన్ని కలుగజేస్తాయి. భార్యవలన గృహస్థునకు సకల ధర్మాచరణలూ సిద్ధించగా, భార్యవలన సన్న్యాసి భ్రష్టుడౌతాడు. అన్ని వస్తువులూ, పంచభూతాల కలయికచే ఏర్పడినవే. అన్నీ నాచేతనే సృష్టింపబడి, నా అంశను కలిగియున్నవే. కనుక వాటిలో మంచిచెడూ అనే గుణదోషాలుండవు. వాటిని వినియోగించే జీవియొక్క అర్హత, అధికారము, ప్రయోజనమును బట్టి తాత్కాలికంగా, అవి మంచి అని గాని, చెడ్డ అని గాని అనిపిస్తాయి. దేశ, కాల, ద్రవ్య, కర్త, కర్మలనుబట్టి ఫలితాలు మారుతుంటాయి. వేదశాస్త్రాలలో చెప్పబడిన మంచీ చెడుల వివరణ, పామరుల ప్రవర్తనాభావాలను తీర్చిదిద్దడానికే గాని జ్ఞానులు వాటికి అతీతులు. వారి దృష్టిలో అంతా సమానమే. కామ్యకర్మలు చేస్తూ, కర్మఫలాలను అపేక్షించే పామరులు,

సత్ఫలితాలకోసం చెడును వర్జించాలని ఈ సూచనలు చేయబడినవి. జ్ఞాని చేసే కర్మలు, ఫలాసక్తి రహితాలు గనుక అతడు చేసే కర్మలన్నీ లోకకల్యాణం కోసం చేసేవే. కనుక మంచీచెడూ అనే విచక్షణ భావమే అతనికి రాదు. అతని కర్మలూ, కర్మఫలాలూ భగవదర్పితాలే. అతడు అంతటా భగవంతునే చూస్తాడు, వేద శాస్త్రాలలోని విధులూ, నిషేధాలూ, మానవుని క్షుద్రమైన వాంఛలనుండి ఉత్తమ సాధనకు ఎదిగేటట్టు చెయ్యడానికే ఉద్దేశింపబడినవి. చేదుమందును తేనెతో కలిపి తినిపించునట్లు, కర్మకాండలతో ప్రారంభించి, వేదాలు మహోన్నతమైన ఆత్మతత్త్వాన్ని బోధించాయి. అందుచేత వేదాలు జ్ఞానులకు మాత్రమే అర్థమౌతాయి. సముద్రంలాగ గంభీరంగా నుంటాయి.

అనంతశక్తిసంపన్నుడనూ, పరబ్రహ్మనూ అయిన నేను సకల సృష్టియందూ, తామరకాడలోని సూక్ష్మనాళములాగ అనాహతనాదమై వెలసియున్నాను. వేదము నాయొక్క శబ్దబ్రహ్మస్వరూపము. దాని యథార్థతను గ్రహించడం చాలా కష్టము. ప్రాణవాయువూ, మనస్సూ, బుద్ధీ, వాగింద్రియమూ (నాలుక, పెదవులూ, దంతాలూ) కూడి నాదమును ఉత్పన్నం చేస్తాయి. ప్రాణవాయువులోనున్న అనాహత నాదము, మూలాధారము వద్ద పరాశబ్ద అనీ, అనాహతచక్రం వద్ద పశ్యంతి అనీ, మణిపూరచక్రం వద్ద మధ్యమ అనీ, వాగింద్రియం వద్ద వైఖరి అనీ అనబడుతుంది. ఈ అనాహతనాదసముదాయమే సమష్టిగా శబ్ద బ్రహ్మము అనబడుతుంది. శబ్దానికి చెందిన రూపాన్ని మనస్సు ఊహించుకొనగలదు. శబ్ద బ్రహ్మము యొక్క సంక్షిప్త స్వరమే, ఓంకారనాదము. ఈ ఓంకారమే వేదాలయొక్క సూక్ష్మరూపము, ఈ ఓంకారమే అ నుండి హ వరకు ఉన్న అన్ని శబ్దాలకూ ఉత్పత్తి స్థానము. ఈ శబ్దాలనుండే గాయత్రీ మొదలైన పదనిర్మాణ ఛందస్సులు ఏర్పడినవి. వేదములో నిమిడియున్న గూఢార్థము నాకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. వేదములోని కర్మకాండలలో నన్నే అనేక దేవతా స్వరూపాలలోనూ, ఉపాసనా కాండలలో అనేకమైన మంత్రాధి దేవతలగానూ, జ్ఞానకాండలో విశ్వమంతటికీ ఆధార భూతమైన ఏకైక పరబ్రహ్మముగాను ఆరాధించడమైనది. ప్రారంభములో వర్ణింపబడిన వైవిధ్యమంతా, ఏకైక పరబ్రహ్మపై ఆరోపింపబడిన ఆభాసస్సృష్టి అనీ మిథ్య అనీ వేదాంతములో నిరూపింపబడినది," అని, శ్రీభగవానుడు చెప్పాడు.

## తత్త్వములు

### ఉద్ధవుడు ఇలా అడిగాడు

"యోగీశ్వరా! మొత్తము 28 తత్త్వాలున్నవని నీవు చెప్పితివి కదా! కొందరు ఋషులు, అవి 25 ఉన్నవనీ, ఇంకకొందరు, ఏడు, తొమ్మిదీ లాంటి వేరువేరు సంఖ్యలని చెప్పారు. ఇలాగ విభిన్నసంఖ్యలు ఎందుకు వినవస్తున్నవో వివరించ ప్రార్థిస్తున్నాను." అని కోరగా శ్రీభగవానుడు, ఇలా చెప్పాడు:

"ఉద్ధవా! ఋషులు చెప్పిన సంఖ్యలన్నీ సరియైనవే, కొందరు కొన్నితత్త్వాలను తమ లెక్కలలో కలుపుకొనలేదు. అంతే! దశేంద్రియాలూ, పంచతన్మాత్రలు, పంచభూతాలూ, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము కలసి 24 తత్త్వాలైనవి. కొందరు జీవుని, ఈశ్వరుని కలిపి, 26 అని చెప్తారు. కాలముతో కూడి, 27 అవుతుంది. కొందరు జీవుడూ ఈశ్వరుడూ ఒక్కటే అని, 25గా చెప్తారు. పురుషుడూ, ప్రకృతీ, మహత్తత్త్వమూ, అహంతత్త్వమూ ఈ 24తో జతచేసి, 28 అనినేను చెప్పాను. దశేంద్రియాలూ మనస్సూ కలిసి 11 మాత్రమే అని కొందరి లెక్క.

ప్రకృతీ, పురుషుడూ ఒక్కటి కాదు. జీవుడు అణువు. ఈశ్వరుడు విభువు (అంతటా వ్యాపించియున్నవాడు) జీవుడు అవిద్యచే సంకుచితమైనవాడు. అవిద్య వీడగానే ఈశ్వరైక్యాన్ని పొందుతాడు. మూడుగుణాలూ హెచ్చుతగ్గులుగా నుంటేనే సృష్టి సంభవమవుతుంది. మూడూ సమతూకంగా నుంటే సృష్టి జరుగదు. కాలము వలన త్రిగుణాలలో సమతూకము చెదిరి, గుణాలలో హెచ్చుతగ్గులేర్పడి, సృష్టికి ప్రేరణ కలుగుతుంది. కాలాన్ని సూత్రమనీ, స్వభావమనీ కూడ అంటారు. పురుషుడంటే జీవుడు. పరమ పురుషుడంటే పరమాత్మ, పరమాత్మయే సర్వలోకాలనూ సృష్టించాలని సంకల్పించుతాడు. సృష్టికి మూలము నామాయ. అది త్రిగుణాలు కలది. ఆ మాయయే త్రిగుణాలను మేళవించి, వివిధ రకాలైన శరీరాలను తయారుచేస్తుంది. భేదభావాలను కలుగజేస్తుంది. ఈ విశ్వము

ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక మనబడే మూడుశక్తులకు లోనైయున్నది. ఉదాహరణకు - చక్షురింద్రియం (కన్ను) ఆధ్యాత్మికం (అంటే, దేహము ఆ కంటిని తనదిగా భావించేది). అయితే, దృశ్యము, ఆధిభౌతికము (తనకు భిన్నముగా నున్నట్టిది.) మరి, ఆ కంటికి చూడగలిగే శక్తినిచ్చే అధిష్ఠాన దైవము (కాంతి) అయిన సూర్యుడు అధిదైవము అనబడుతాడు. ఈ మూడునూ సాత్త్విక రాజసిక తామసిక అహంకారముల వలన ఏర్పడినవి కనుక వీటిని వైకారికములు అంటారు. ఈ మూడూ ఉన్నా, ఆత్మచైతన్యం ప్రసరించకపోతే చూడడం అనే కర్మ జరుగదు. అదే విధంగా అన్ని ఇంద్రియాలూ ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక శక్తులతోనూ, ఆత్మచైతన్యం వలననూ పనిచేస్తాయి. ఆత్మ వీటన్నిటియొక్క ఆది, మధ్య, అంతాలలోనుంటూ, అవి (ఇంద్రియాలూ, అధిశక్తులూ) లేనప్పుడు కూడ ఎల్లప్పుడునూ ఉండేది. ప్రకృతికి భిన్నమైనది. ప్రకృతియే ఆత్మపైన ఆధారపడియుండేది.

## జనన మరణ వలయము

### శ్రీభగవానుడు చెపుతున్నాడు

ఉద్ధవా! నిత్యమైయుండే ఆత్మ ప్రకృతిస్థమై, క్షణక్షణమూ మారుతూ చివరకు నశించే శరీరములో జీవుడైయుంటుంది. ఈ సత్యాన్ని జ్ఞానులు మాత్రమే గ్రహించగలరు. ఆత్మతత్త్వాన్ని తెలుసుకొనలేని అజ్ఞులు శరీరమే సర్వస్వము అనే భ్రమలో పడి, తాము చేసే సకల వ్యాపారాలనూ దానికోసమే చేస్తూ దేహధ్యాసతోనే మరణించి, మళ్లీ మళ్లీ దేహాలనే ఆపేక్షిస్తూ, వాటినే నిర్విరామంగా పొందుతుంటారు. అది ఎలాగ జరుగుతుందంటే పదహారు తత్త్వాలతో కూడియున్న లింగ (సూక్ష్మ) శరీరము, ఒక స్థూలశరీరాన్ని విడిచి, బీజరూపంలో వేరొక మాతృగర్భంలో ప్రవేశించి, దేహాన్ని ధరిస్తుంది. అవసరమైతే ఒక లోకమునుండి వేరొకలోకానికి కూడ పయనిస్తుంది. జీవుడు సూక్ష్మ శరీరముతో తాదాత్మ్యం చెందడంచేత దానిని అంటిపెట్టుకొని పయనిస్తాడు. పూర్వవాసనలతో కూడియున్న మనస్సు (చిత్తము), వెనుకటి శరీరములోని అనుభవాలకు అనుకూలమైనట్టివి ఈ శరీరంలో లభిస్తే సంతోషించడం, ప్రతికూలమైనట్టివి వస్తే క్లేశపడడమూ జరుగుతుంది. మరణముతో ఆ జన్మయొక్క స్మృతులు అదృశ్యమైనా, గాఢమైన అనుభవాల యొక్క వాసనలు మాత్రము మనస్సుకు అంటిపెట్టుకొని, మరుజన్మకు వెళ్లుతాయి. మరణ సమయంలో కర్మానుసారముగ మనస్సు దేనిని స్మరిస్తుందో, దానికి సరిపడిన దేహాన్నే పొందుతుంది. ప్రకృతితోపాటు సృష్టింపబడినవన్నీ క్షణక్షణం మారుతూనే ఉంటాయి. స్థూలదృష్టికి ఈ మార్పులు గోచరించవు.

వెలుగుతున్న దీపములోని జ్యోతి కణాలు పుట్టీ, ఆరిపోతూ ఉంటాయి. అయినప్పటికీ ఒకే జ్యోతి నిలకడగా వెలుగుతున్నట్లు కనబడుతుంది. ప్రవహిస్తున్న నదీ జలములోని బిందువులు పుట్టిన చోటనే ఉండక ముందుకు సాగిపోతూనే ఉంటాయి. అయినా స్థూల దృష్టితో చూస్తే నది నిశ్చలంగానే ఉన్నట్టు కనిపిస్తుంది. అలాగే వృక్షాలూ, జీవరాసులూ, జంతువులూ, మానవులూ, ప్రతి క్షణమూ కాలప్రభావానికి లోనై మారుతూఉన్నా, స్థూలదృష్టికి ఆ మార్పులు కనబడవు. మానవ శరీరానికి తొమ్మిది దశల మార్పులు జరుగుతుంటాయి: నిషేకము (బీజప్రదానము), గర్భములో పెరగడం, పుట్టడం, బాల్యావస్థ (5 సంవత్సరాలవరకు), కుమారావస్థ (పదేళ్లవరకు), యౌవనము (24 ఏళ్లవరకు), నడివయస్సు (55 ఏళ్ల వరకు) తరువాత వార్ధక్యమును చివరకు మరణమును జనన మరణాలను ఇతరులు చూస్తారు.

వాస్తవానికి ఆత్మకు జననమరణాలు లేవు. అవి దేహానికే సంభవిస్తాయి. ఆత్మవేరు, దేహమువేరు అని తెలుసుకొనలేని వారు సంసారంలోనుండి పోతారు. సత్త్వగుణాధిక్యతలో నుండగా దేహత్యాగము జరిగితే దేవ, ఋషి, సాధు, సచ్ఛరీరం లభిస్తుంది. రజోగుణాధిక్యతలో శరీరం విడిచితే, మానవ, అసుర శరీరం లభిస్తుంది. తమోగుణాధిక్యతలో దేహం విడిచితే మృగ, పశు, పక్షి, పిశాచాది జన్మలు లభిస్తాయి. మనస్సులో ఊహింపబడిన వాటియందైనా సరే, సంగము ఏర్పడితే చాలు, బుద్ధిభ్రంశము కలిగి, వాసన లేర్పడుతాయి. దేహముతో తాదాత్మ్యాన్ని వీడనంత వరకూ సంసారము వీడదు. ఎందరు వ్యతిరేకించినా పరమాత్మ అంశయైన జీవాత్మ, దేహానికి భిన్నమైనదని, స్థిరంగా నమ్మాలి" అని శ్రీభగవానుడు చెప్పాడు.

## భిక్షుగీత

### శ్రీభగవానుడు చెపుతున్నాడు

ఉద్ధవా! నీవు చెప్పినట్లు, దుష్టులే ఏదో ఒక విధముగా సజ్జనులనూ, జ్ఞానులనూ మాటలతోనూ, చేతలతోనూ హింసిస్తుంటారు. సజ్జనులైన వారు వాటిని ఎలాగ సహిస్తారో, ఒక సంపన్నుడైన అవంతీ బ్రాహ్మణుని ఉదంతం నుండి తెలుసుకొనవచ్చు. చెపుతాను వినుము: అన్నాడు.

అవంతీ దేశములో సంపన్నుడైన ఒక బ్రాహ్మణుడు కృషి, వాణిజ్యము చేస్తూ, అపరిమితమైన ధనాన్ని సంపాదించాడు. పరమలోభి కావడంచేత, అతిథుల్నీ, బంధుమిత్రులల్నీ, దీనుల్నీ ఎవ్వరినీ ఆదరించక, తాను అనుభవించక, భార్యాబిడ్డల్ని కూడ సరిగా చూడక, అందరికీ శత్రువయ్యాడు. ధన వ్యామోహంలో పడి, నిత్యనైమిత్తిక కర్మలను విడిచి, బ్రాహ్మణ ధర్మాలను విస్మరించి, ధన పిశాచిలాగ బ్రతికేవాడు. అతని ధన సంపదలు చోరులను ఆకర్షించాయి. ప్రభువుల దృష్టిలో పడ్డాయి, దాయాదులలో ఆశలను రేకెత్తించాయి. అందరూ కొంతకొంత అపహరించగా మిగిలిన ఆస్తిని కొడుకులు కైవసం చేసుకొన్నారు. అతడు దరిద్రుడైనాడు. దీనుడై, మానసిక రోగియై వీధులలో తిరుగ నారంభించాడు. ఒకనాడు అతని బుద్ధి సక్రమంగా పనిచేసి, ఇలాగ ఆలోచించసాగాడు: "అహో! నేనెంతటి మూర్ఖుడను! ధనార్జన తృష్ణలోపడి నేను సర్వమునూ పోగొట్టుకొని, ఈ దుర్దశను తెచ్చుకొన్నాను. ధనలాలస చేత ఇహలోక భోగాలను అనుభవించక, దానధర్మాలనూ చెయ్యనందుకూ, స్వధర్మాచరణను విడిచిపెట్టినందుకూ, పరలోక సుఖాలకు కూడ దూరమయ్యాను. నాకు నరక ప్రాప్తి తప్పదు. ధనార్జనాకాంక్ష, దొంగతనం చెయ్యడం, అసత్యమాడడం, మోసగించడం, హింసించడం, కామ క్రోధాలు చూపడం మొదలైన ఆరు దుష్ట కార్యాలను చెయ్యరాదు. ధనం వచ్చిన తరువాత తొమ్మిది అనర్థాలు సంభవిస్తాయి. అవి: గర్వము, మదము, లోభము, బంధువిరోధము, అనుమానము, కలహము, స్వార్థము, ఇతరులతో విభేదాలు, స్త్రీవ్యసనము, ద్యూతవ్యసనము, మద్యపానము, మొదలైనవి. అందుకే అర్థము, అనర్థదాయకమన్నారు. పాపిష్టి ధనంకోసం అయినవాళ్లంతా దూరముకావడమే కాక శత్రువులౌతారు. ప్రేమలుపోయి, పగలు ఏర్పడుతాయి. అర్థము నాలుగుపురుషార్థాలలో నొక్కటి అయినా అది లోకహితార్థము వినియోగింపబడితేనే పురుషార్థం అవుతుంది. స్వార్థానికే ఉంచుకొంటే, అది అనర్థాన్నే తెచ్చిపెడ్తుందని తెలుసుకొన్నాను. ధనము నన్ను చెడగొట్టి, విడిచి వెళ్లిపోయినది. భగవానుడు నాయందు కరుణించాడు. ఆధనాన్ని నానుండి తొలగించి, నన్ను విముక్తుని చేశాడు. నా భాగ్యమే భాగ్యము కదా! ఈ నిర్వేదమూ, వైరాగ్యమూ ఎన్నిజన్మలు సాధనచేసినా సిద్ధించనట్టివి, నాకు సులువుగా అబ్బినవి కదా! నాశేష జీవితాన్ని శ్రేయస్కరమార్గములో గడుపుతాను. ఖట్వాంగుడు విరక్తుడై, రెండుఘడియలలో మోక్షము పొందలేదా?" అని భావించి, అతడు రాగ ద్వేషాలను, కోరికలను విడిచి, దృఢనిశ్చయుడై, సన్న్యసించి, భిక్షువై, సంచరించసాగాడు. దేహధ్యాసను వీడి, సంస్కారహీనుడై, అవధూతయై తిరుగుతున్న అతనిని చూచి, తుంటరులూ, అల్లరి మూకలూ గేలిచేస్తూ, కేకలువేస్తూ, తిడుతూ, రాళ్లు రువ్వుతూ, అతనిపై ఉమ్మివేస్తూ, అతని దండమూ, కమండలమూ, పాత్ర, దుప్పటీ లాక్కొని, అతడు భిక్షాన్నం తింటుంటే మూత్రము చేసినా, అన్నిటినీ సహిస్తూ, అతడు మౌనముగా నుంటుంటే – "మాట్లాడవేమిరా, దొంగసన్న్యాసీ"అని కొట్టుతూ, చురకలు పెడ్తూ, అనేక విధాలుగా హింసిస్తున్నా చలించకుండా, ఇవి అన్నీ కర్మఫలాలు, అనుభవించితీరాలి, అనుకొంటూ, ఈ విధంగా పాటలు పాడుకొనేవాడు:

"మనకు సంభవించే అన్ని కష్టసుఖాలకూ, ఇతరులెవ్వరూ కారకులు కారు. మన మనస్సే అన్నిటికీ మూలకారణము. త్రిగుణాలతో కూడియున్న మనస్సే సంసారబంధాలనూ, జన్మ పరంపరలనూ కలుగజేసేది. జీవుడు దేహమే నేను అని భ్రమించి, సకలకర్మలకూ నేనే కర్తను, సకల కర్మఫలాలకు నేనే భోక్తను అని అనుకొంటాడు. నేనూ, నాదీ అనే అహంకార మమకారాలే జీవునకు సుఖదుఃఖాలను కలుగజేస్తాయి. మూలకారణమైన మనస్సును నిగ్రహించుకొంటే, సుఖదుఃఖాలు సోకవు. యమనియమ, స్వధర్మాచరణ, అధ్యయన, కర్మానుష్ఠాన, దాన, ధర్మ, వ్రతపాలనాది సాధనల

ద్వారా మనోనిగ్రహాన్ని సాధించవచ్చు. ఇలాగ నిగ్రహింపబడిన మనస్సును భగవంతునియందు లగ్నము చెయ్యాలి. మనస్సు అతిశక్తిమంతమైనది. తీవ్రవేగము కలది. అనేక శారీరిక, మానసిక సంకటాలను కలిగించగలది. అనేక రకాలైన భ్రమలను కల్పిస్తుంది. ఇతర మానవ, జంతు, జీవ, వస్తు, విషయాల యందు రాగద్వేష శత్రు మిత్రాది భావాలను కలుగజేస్తుంది. నిగ్రహింపబడిన మనస్సు మిత్రుని వలెను, అదుపుచేయబడని మనస్సు శత్రువుగాను ప్రవర్తిస్తుంది. నిలకడలేని మనస్సే కష్టాలను తెచ్చిపెడుతుంది. జీవుడు సహజంగా నిర్వికారుడు, నిరంజనుడు. మనస్సువల్ల కలిగే సుఖదుఃఖాలు, జీవునకు చెందవు. నేను ఈ సత్యాన్ని గుర్తించి, ముకుంద చరణారవిందాలనే ఆశ్రయించాను. నా కిప్పుడు ధనము పోయినదని విచారములేదు. వీధుల్లో బిచ్చ మెత్తుకొంటున్నానను దుఃఖము లేదు. అందరూ నన్ను అవమానించి, హింసిస్తున్నారనే బాధేలేదు. భగవత్సేవానందమే నాకు పెన్నిధి. ఇతరములేల?" అని, ఆ విప్రభిక్షువు, ఆనందాతిశయముతో పాడుకొనే గీతలోని తత్త్వాన్ని గ్రహించావా, ఉద్ధవా! బంధాన్నీ మోక్షాన్నీ కలిగించేది ఆ మనస్సే. సుఖదుఃఖాలకూ, సకల అనుభవాలకూ కారణము ఆ మనస్సేగాని, ఏవ్యక్తీ, ఏ ఇతర శక్తీ, కాదు. అందుచేత, ఆ మనస్సునే మంచి చేసుకొని, నా యందే లగ్నముచేసి, నేనే గమ్యమూ, సర్వమూ, అని తెలుసుకొని ఆరాధించుము. ఇదే యోగ సంగ్రహము.

ఈ భిక్షుగీతను విని, వినిపించి, మననము చేసుకొనేవారు, సుఖదుఃఖాలను అధిగమించి, అత్యంతానందాన్ని పొందగలరు." అని శ్రీభగవానుడు చెప్పాడు.

## సాంఖ్య యోగము

### శ్రీభగవానుడు చెప్తున్నాడు

"ఉద్ధవా! ఇప్పుడు నీకు సాంఖ్యయోగము గురించి చెపుతాను విను. దీనిని గ్రహించిన వ్యక్తికి దేహమే ఆత్మ అనే భ్రమ తొలగి, ఆత్మయొక్క సర్వవ్యాపకత్వము అవగతవవుతుంది.

నామ, రూప, గుణాలేవీ లేనట్టిదీ, వర్ణింపనలవి కాని ఒకే ఒక అద్వితీయమైన మహత్తరశక్తి అయినట్టిదీ, ఎలాంటి వికారాలకూ లోను కానట్టిదీ అయినట్టి తత్త్వాన్ని బ్రహ్మము అంటారు. బ్రహ్మము రెండుగా రూపొందినది. ఒకటి మాయ, రెండవది పురుషుడు లేదా ప్రత్యగాత్మ లేదా జీవుడు. ఈ మాయయే త్రిగుణాత్మకమూ, క్రియాత్మకమూ అయిన శక్తియై ప్రకృతి అనబడినది. ప్రకృతి అంటే అద్భుత కార్యాలను చెయ్యగలశక్తి. ఇదే జగత్తుగా రూపొందినది. పురుషుడు (ప్రత్యగాత్మ), పరమాత్మయొక్క చిత్(జ్ఞాన) శక్తిగా వెలసిన, స్వయంప్రకాశంగల జ్ఞాన స్వరూపుడు. ఆనంద స్వరూపుడు. కాలము కూడ భగవంతుని నుండి ప్రకృతితో, పాటు ఉద్భవించిన ఒక శక్తి.

కాలము ప్రకృతియొక్క త్రిగుణాల సమతౌల్యమును సంక్షోభింప జేస్తుంది. దానివలన సూత్రము లేదా క్రియాశక్తి అనేతత్త్వము పుట్టినది. జ్ఞాన శక్తిని మహత్తత్త్వ మంటారు. క్రియాశక్తి, జ్ఞానశక్తి జంటగా పనిచేస్తాయి. మహత్తత్త్వమునుండి, అహంతత్త్వము పుట్టినది. ఈ అహంకారమే జీవునకు, 'దేహమే నేను' అనే భ్రమను కలుగజేస్తుంది. అహంకారము వైకారికమనబడే సాత్త్వికాహంకారముగాను, తైజసమనబడే రాజసిక - అహంకారముగాను, తామసమనబడే తామసాహంకారముగాను ఏర్పడుతుంది. సాత్త్వికాహంకారమునుండి, దశేంద్రియాలకూ మనస్సుకూ అధిదేవతలైన సూర్య, చంద్ర, వరుణ, అగ్ని మొదలైన పదుకొండుగురు దేవతలు ఉద్భవించారు, రాజసికాహంకారమునుండి, దశేంద్రియాలూ మనస్సూ ఉద్భవించినవి, తామసికాహంకారంనుండి, పంచతన్మాత్రలూ పంచభూతాలూ ఉద్భవించినవి.

విడివిడిగా నున్న ఈ తత్త్వాలలో నేను నా చైతన్యశక్తిని ప్రవేశింపజేసి, వాటిని సంఘాతపరచగా, అవి ఒక అండాకారమై, ఆ అండము గర్భోదకమనే జలములో నుంటూ పెరుగసాగినది. నేను అందులోనుంటూ, నారాయణునిగా వెలశాను. ఆ నారాయణుని నాభినుండి విశ్వము పద్మాకారంగా ఉద్భవించినది. ఆ పద్మమునుండి చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించాడు. అతడు నా అనుగ్రహంపొంది, భూఃభువః, సువః అనేలోకాలనూ, లోకాధిపతులనూ,

దిక్పాలకులనూ సృష్టించాడు. భూలోకముతోపాటు, అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళ లోకాలు కూడ పుట్టినవి. భూలోకంలో మానవులూ, క్రింది లోకాల్లో అసుర, నాగాదులూ ఉంటారు. స్వర్లోకంతో పాటు, మహర్లోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకం కూడ పుట్టాయి. ఈలోకాల్లో, దేవతలు, యోగులు, తపస్వులు, ధ్యానపరులూ ఉంటారు. స్వర్లోకానికీ, భూలోకానికీ మధ్యనున్న భువర్లోకం (అంతరిక్షం)లో భూతప్రేత పిశాచాలు ఉంటాయి. నాయొక్క లోకమైన వైకుంఠానికి నాయందు అనన్య భక్తి కలిగియున్న భక్తులు మాత్రమే చేరగలరు. నన్నుపొందిన వారికి ఇక జనన మరణాలుండవు. ఈ సత్యాన్ని గ్రహించిన వారికి ప్రాపంచిక విషయాలపై వైరాగ్యం శీఘ్రముగా అబ్బుతుంది. ఒక్క బ్రహ్మదేవుడూ, సత్యలోకవాసులూ తప్ప, తక్కిన లోకాల్లో మున్నవారంతా మళ్లీమళ్లీ పుట్టుతూ గిట్టుతూ ఉంటారు. బ్రహ్మదేవునితోపాటు సత్యలోకవాసులు, మహాప్రళయం వరకు వేచియుండి, అప్పుడు నాలో లీనమైపోతారు. మహాప్రళయంలో ఈ విశ్వమంతా, సూక్ష్మరూపంలో నాయందు లయించిపోతుంది. మళ్లీ పునః సృష్టిలో ఇంతవరకు చెప్పిన విధంగా ఉద్భవిస్తుంది.

అణువునుండి మహత్తువరకూ సృష్టియావత్తూ ప్రకృతి పురుషుల సంయోగము చేతనే కలుగుతుంది. నేను సృష్టికి పూర్వమూ, స్థితికాలమందూ, సృష్టి అంతా లయించిన తరువాతనూ నిలిచియుంటాను. నాకు ఆదీ, అంతమూలేవు. ఆది, మధ్య, అంతాలు లేనిదే నిత్యసత్యము. ఈ సృష్టి స్థితి లయాలు ఈశ్వరేచ్ఛ ఉన్నంత వరకూ, సాగుతూనే ఉంటాయి.

ఈ బ్రహ్మాండమంతా ఆవిర్భవించి, కల్పాంతంలో లయిస్తుంది. లయమప్పుడు శరీరము అన్నమందునూ, అన్నము పంటలయందునూ, పంటలు భూమియందునూ నశిస్తాయి (అనగా అన్నములేక శరీరమూ, పంటలులేక అన్నమూ, భూమికి ఉత్పాదన శక్తిలేక పంటలు నశిస్తాయి.) భూమి భస్మమై తన యొక్క గంధ తన్మాత్రయందునూ, గంధము జలమందునూ జలము రసతన్మాత్రయుందునూ, రసము తేజస్సునందునూ, తేజస్సు రూపతన్మాత్రయందూ, రూపము వాయువునందునూ, వాయువు స్పర్శతన్మాత్రయందూ, స్పర్శ ఆకాశమందునూ, ఆకాశము శబ్దతన్మాత్రయందును శబ్దము తామసాహంకారమందునూ లయిస్తాయి. ఇంద్రియాలు రాజసాహంకారములోనూ, ఇంద్రియాదిదేవతలు మనస్సులోనూ, మనస్సు సాత్త్వికాహంకారములోనూ లయిస్తాయి.ఈ మూడు అహంకారాలూ మహత్తత్త్వంలోనూ, మహత్తత్త్వం త్రిగుణాల్లోనూ లయిస్తాయి. కాలము జీవుని (పురుషుని) యందునూ, మాయను వశపరచుకొన్న పురుషుడు పరబ్రహ్మమైన నాయందునూ లీనమవుతారు. పరమాత్మనైన నేను నిత్యుడను. సృష్టి స్థితి లయకారకుడనైన నాయొక్క ఈ యథార్థతత్త్వాన్ని ఈ విధంగా గ్రహించుకొన్న వానికి, ఆత్మయొక్క ఏకత్వము అవగాహనమయి, భ్రమలు తొలుగుతాయి. ఉద్ధవా! ప్రకృతి, పురుషుడు, సృష్టి, లయములు, వ్యష్టి సమష్టితత్త్వాల గురించి నీకు నేను చెప్పిన విషయాలను సాంఖ్యమంటారు. వీటిని నీవు బాగుగా యోచించి, గ్రహించాలి." అని, శ్రీభగవానుడు చెప్పాడు.

## త్రిగుణములు

### శ్రీభగవానుడు చెపుతున్నాడు

"ఉద్ధవా! ప్రకృతి పురుషుల గురించి తెలుసుకొన్ననూ, త్రిగుణాల ప్రభావంనుండి బైటపడకపోతే దుఃఖం తొలగదు. సత్త్వగుణమువలన సిద్ధించేవి ఇవి: ఇంద్రియ, మనోనిగ్రహాలు, తితిక్ష, తత్త్వ వివేచనము, స్వధర్మాచరణ, తపశ్చర్యలపట్ల శ్రద్ధాసక్తులు, సత్యనిష్ఠ, కరుణ, స్మృతి, సంతృప్తి, దానశీలత, భోగలాలస లేకుండడం, భగవంతునియుందూ, మరణాంతర దశయందూ విశ్వాసము కలిగియుండడం, సహజలజ్జ, అధర్మాచరణపట్ల విముఖత, ఉదారత, ఆత్మజ్ఞానరతి కలుగుతాయి.

రజోగుణంవలన విషయసుఖాపేక్ష, స్వార్థము, అహంకారము, గర్వము, చంచలత్వము, మొండితనము, కోరికలతో కూడిన దేవతార్చన, స్వాతిశయము, భేదభావము, స్వానురక్తి, బల, గర్వ ప్రదర్శన, ఇతరులనుండి స్తుతిని ఆపేక్షించడం, కీర్తికాంక్ష, ఇతరులను అపహసించడం, పోట్లాడడం, శక్తిని చూపి, సాధించాలనే పట్టుదల మొదలైనవన్నీ కలుగుతాయి.

తమోగుణం వలన ప్రతీకార వాంఛ, కృపణత్వము (లోభము) అసత్యవచనాసక్తి, హింసాభిలాష, యాచకబుద్ధి, కపటము, అలసత్వము, కలహప్రియత్వం, శోకము, మోహము, దిగులుచెందడం, దైన్యము, నిద్రమత్తు, అత్యాశ, భయము, సోమరితనము, ఈర్ష్య, అసూయ, పగ, క్రోధము మొదలైనవి కలుగుతాయి.

ఈ మూడుగుణాలూ ప్రతీజీవిలోనూ వివిధపాళ్లలో మిశ్రితం అయియుంటాయి. అహంకార మమకారాలకు రాజసిక తామసిక గుణాలే పుట్టినిల్లు, ప్రాణేంద్రియ మనోబుద్ధులూ, మానవుడాచరించే ధర్మార్థ కామ్యకర్మలూ, గృహస్థధర్మాచరణాలూ, ఈ గుణాలయొక్క ప్రేరణచేతనే జరుగుతుంటాయి. మనిషి ప్రవర్తనను పరిశీలిస్తే అతడు సాత్త్వికుడా, రాజసికుడా, తామసికుడా అనేది తెలియవస్తుంది. ఎలాంటి కోరికలూ లేకుండా నన్నారాధించేవాడు సాత్త్వికుడు. సుఖభోగాలను కోరుకొంటూ ఆరాధించేవాడు రాజసికుడు. ఇతరులను అణచివేసి, ఆధిక్యతను పొందాలనే కోరికతో ఆరాధించేవాడు తామసికుడు. ఈ గుణాలు స్త్రీలయందూ, జంతుజీవాలయందుకూడ ఉంటాయి. ఒకే వ్యక్తియందు వివిధ సమయాల్లో ఈ గుణాలు హెచ్చుతగ్గులవుతుంటాయి. సత్త్వగుణం అధికంగా నున్నప్పుడు చిత్తము ప్రశాంతముగాను, సమత్వంతో ప్రసన్నముగనూ ఉంటుంది. రజోగుణం అధికంగా నున్నప్పుడు మనసుచంచలంగాను, సుఖదుఃఖాలలో తీవ్రమైన ఉద్రేకాలతోనూ, రాగద్వేషాలూ, కామక్రోధాలూ అధికంగానూ ఉంటుంది. తమోగుణం అధికంగా నున్నప్పుడు బుద్ధి మందముగానూ, నిద్రమత్తుతోనూ, పగ, హింసలతోనూ నిండియుంటుంది. ఈ మూడు గుణాలవలననే జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు కలుగుతాయి. అతీతమైన నాల్గవ అవస్థను తురీయావస్థ అంటారు. ఈ తురీయావస్థలో జీవాత్మ సాక్షి భూతంగా అన్ని అవస్థలనూ గమనిస్తుంటుంది. సత్త్వగుణాధిక్యతలో నున్నప్పుడు దేహత్యాగం సంభవిస్తే, జీవి ఊర్ధ్వలోకాలకూ, రజోగుణాధిక్యతలో మరణిస్తే, మరల భూలోకంలోనికీ, తమోగుణాధిక్యతలో మరణిస్తే నరకలోకానికి వెళ్తుంది. గుణాతీతులూ రజస్తమోగుణాలను పోగొట్టుకొని, కేవల సత్త్వగుణంలోనే ఉన్నవారు నన్నే చేరుతారు. సాత్త్వికులు జనసందోహం లేని అరణ్యాలలో ఉండడానికి అభిలషిస్తారు. రాజసికులు తెంపులేని కార్యకలాపాలు జరిగే పట్టణాల్లోనూ, తామసికులు పానశాలల్లోనూ, పందెములూ జూదాలూ జరిగే స్థలాలలోనూ ఉండడానికి ఇష్టపడతారు. గుణాతీతులు దైవమందిరాల్లో నుండదలచుకొంటారు.

ఉద్ధవా! ఈ విధంగా సృష్టిలోని ప్రతి అంశమందునూ ఈ త్రిగుణాల ప్రభావం వ్యక్తమౌతుంది. కర్మలలోనూ, జ్ఞానములోనూ, సాధనలలోనూ, అభిరుచులలోనూ, విద్యలలోనూ, ఆరాధనలలోనూ, శ్రద్ధలలోనూ, సుఖాలలోనూ, ఆహారాలలోనూ, ద్రవ్యాలలోనూ, శాస్త్రాధ్యయనాల్లోనూ, ఇంద్రియవిషయాల్లోనూ, మానసిక భావాల్లోనూ, శారీరక కర్మలలోనూ, ప్రతి వస్తు విషయ విశేషాలలోనూ ఈ త్రిగుణాలు కలిసియుంటాయి.

తమోగుణాన్నీ రజోగుణాన్నీ తగ్గించుకొని, ప్రయత్నపూర్వకంగా సత్త్వగుణాన్ని, పెంచుకొని, క్రమంగా గుణాతీతుడైన వ్యక్తి నన్నే మనస్సునిండా నిలుపుకొన్నవాడై, బంధాలనుండి విముక్తుడై నన్ను చేరగలడు". అని, శ్రీభగవానుడు చెప్పాడు.

## పురూరవునిపశ్చాత్తాపము

### శ్రీభగవానుడు చెపుతున్నాడు

"ఉద్ధవా! నన్ను జేరడానికి ఏకైక సాధనమైన ఈ మానవదేహాన్ని పొందిన వ్యక్తి దానిని విషయభోగాలయందు దుర్వినియోగం చేసి, వినాశాన్ని తెచ్చుకొనరాదు. దీనికి పురూరవుని కథయే ఒక మంచి ఉదాహరణ. చెప్తాను వినుము:

పూర్వము పురూరవుడనే ఒక చక్రవర్తి ఉండేవాడు. అతడు సకల సుద్గుణ సంపన్నుడు, కీర్తి ప్రఖ్యాతులు గలవాడు. అతడు విధివశాన ఒకనాడు ఊర్వశి అనే ఒక అప్సరసను చూచి, ఆమె సౌందర్యానికి సమ్మోహితుడై,

మతిచెడగొట్టుకొని, ఆమెను భార్యగా స్వీకరించి, (9-7) అనేక సంవత్సరాలు సూర్యోదయం, సూర్యాస్తమయం తెలియకుండా, తనివి తీరని కామభోగాల ననుభవిస్తూ ఉండగా, ఒకనాడు అతడు ఏదో నియమభంగం చేశాడనే సాకుతో ఆమె అతనిని విడిచిపెట్టి, ఇంద్రలోకానికి వెళ్ళిపోయినది. పూరూరవుడు పిచ్చివానిలాగ కొన్ని సంవత్సరాలు తిరిగి తిరిగి, ఒకనాడు ఆమెను కురుక్షేత్రంలో కలుసుకున్నాడు. తరువాత గంధర్వులు చెప్పిన ఒక యాగాన్ని చేసి, ఊర్వశి ఉన్న లోకాన్ని చేరుకొని, ఆమెతో స్వర్గ సుఖాలను అనుభవించసాగాడు. నిర్విరామ కామ కేళితోనూ, స్వర్గలోకపు భోగాలతోనూ, మొహంమొత్తి, విసుగెత్తి, సర్వనాశనం అయిన తన జీవితం పట్ల రోత పుట్టి, వైరాగ్యం కలిగి ఇలాగ గానం చెయ్యసాగాడు:-

"అహో! సకల శాస్త్రాలూ చదివీ, భూమండలానికే సార్వభౌముడనైన నేను ఒక మూఢునిలాగ కాముకుడనై, స్త్రీ వ్యామోహములో పడి, ఎంత హీనస్థితికి దిగ జారిపోయాను! ఊర్వశి అలింగనంలో బందీనై రాత్రింబగళ్ల తేడాయే తెలియక ఎన్ని దశాబ్దాలూ శతాబ్దాలూ గడిపి వేశానో కదా! నా విలువైన ఆయుర్దాయంలో నెంతభాగం ఈ మైకములో గడిచిపోయిందో తెలియదు. పెంపుడు జంతువులాగ ఆమె ఆడించినట్లల్లా ఆడుతూ, ఆడుగాడిద తన్నుతున్నా అనుసరించి వెంట పడే మగగాడిదలాగ, ఈ స్త్రీ వెంట పిచ్చివానిలాగ దిగంబరుడనై ఏడుస్తూ పరువులెత్తాను. నా యొక్క విద్య, తపస్సు, త్యాగము, తేజస్సు, మహత్తూ, సార్వభౌమత్వమూ ఎందుకూ కొరగాకుండా పోయాయి కదా! కోర్కెలను తీర్చుకొన్న కొద్దీ రగుల్కొనే కామాగ్నికి ఆహుతి అయి, నా యొక్క సర్వస్వాన్నీ మంటగలిపేసుకొన్నాను. ఊర్వశిలాంటి స్వేచ్ఛాజీవియైన స్త్రీలవెంటపడిన నాలాంటి కామాంధులను ఆశ్రీహరియే రక్షించాలి. అయినా ఆమెను నిందించి ఏమి ప్రయోజనము? రక్తమాంస మలమూత్రాదులతో నిండియున్న శరీరాల యొక్క పైపైమెరుగులకు భ్రమించిపోయిన మూర్ఖులిద్దరు ఒక చోట చేరి, స్వర్గసుఖాలను అనుభవిస్తున్నాం అనుకునే అజ్ఞానినైన నేను నన్నే నిందించుకోవాలి. ఈ శరీరమెవ్వరిది? బీజమునుంచిన తల్లిదండ్రులదా, అనుభవించిన భాగస్వామిదా, బిడ్డలదా, మిత్రులదా? దహించే అగ్నిదా? నక్కలదా, కుక్కలదా, గ్రద్దలదా, క్రిమి కీట కాదులదా? ఇలాంటి జుగుప్సాకరమైన దేహాలపై వ్యామోహం పెంచుకొని, మానవుడు ఎంతటి హేయమైన రొంపిలోకి దిగజారి పోతున్నాడు? ఆత్మహితాన్ని కోరేవాడు స్త్రీసంపర్కం గాని, స్త్రీలోలుర సంపర్కంగాని పెట్టుకొనకుండా ఉండడం శ్రేయస్కరము." అని, ఈ విధంగా యోచించి, పురూరవ చక్రవర్తి, ఊర్వశి సాంగత్యాన్ని విడిచిపెట్టి, శ్రీహరి పాదపద్మాల నాశ్రయించి, కొన్నాళ్లకు ముక్తుడయ్యాడు.

అందుచేత ఉద్ధవా! బుద్ధిమంతు డెల్లప్పుడూ సాధుసజ్జన సాంగత్యాన్నే కలిగియుండాలి. సజ్జన సాంగత్యం వలన విషయవస్తువులపై సంగము తొలగిపోతుంది. ఇంద్రియభోగాలాలస లేని మనస్సును నాయందు లగ్నముచేసి, ద్వంద్వాలను అధిగమించి, సంపదలయందు ఆసక్తిని వీడి, సమత్వాన్ని అలవరచుకొని, అంతటా నన్నే చూడగల ధన్యాత్ముడు నన్ను చేరుతాడు. సాధుసంతులు ఎల్లప్పుడూ నాచరిత్రను చెప్పుకొంటూ, నా గుణగణాలను గానం చేసుకొంటూ ఉంటారు. నా గాథలను విన్నవారికి నా యందు భక్తివిశ్వాసాలు వృద్ధి చెందుతాయి. పుణ్యాత్ములకు నాయందు భక్తి కలగడం వినా ఇంక కోరదగిన దేదీలేదు. సాధుసజ్జనసత్పురుషులే నాకు ఇష్టులు." అని శ్రీభగవానుడు చెప్పాడు.

## పూజావిధానము

### శ్రీభగవానుడు చెప్తున్నాడు

"ఉద్ధవా! క్రియాయోగమనబడే భగవదారాధనా విధానాన్ని నీవు వినగోరుతున్నావు గనుక చెపుతున్నాను విను:

భగవదారాధనము ముఖ్యముగా మూడు విధాలు: అవి వైదికము, పాంచరాత్రతాంత్రికము, ఈ రెండింటి మిశ్రమము అని ఉన్నవి. వైదిక విధానములో, గాయత్రీ ఉపదేశాన్ని పొందినవారు ఒక ప్రతిమయందుగాని, ఒక(వేదిక) మండపము నందుగాని, అగ్నియందుగాని, సూర్యునియందుగాని, జలములోగాని, హృదయమునందుగాని,

జగద్గురువునైన నేను ఉన్నట్టుగా భావించి, కోరికలు లేకుండా ఆరాధించాలి. దంతధావనం, స్నానమాచరించాలి. స్నానం చేసేటప్పుడు వైదిక, లేదా తాంత్రిక మంత్రాలనుచ్చరిస్తూ, గంగకు అర్ఘ్యమిచ్చి, స్నానం చెయ్యాలి. సంధ్యావందనం చెయ్యాలి. ఆరాధ్యదేవతాప్రతిమను శిలతోగాని, కర్రతోగాని, లోహముతో గాని చేయించి, ప్రతిష్ఠించుకోవాలి. మట్టితో, చందనములతో కూడ చేయించవచ్చు, లేదా సాలగ్రామాన్నిగాని, చిత్రపటాన్నిగాని పెట్టుకోవచ్చు, లేదా, హృదయంలోనే, దేవతామూర్తిని నిలుపుకొని ఆరాధించవచ్చు. విగ్రహాలు స్థిరంగా ప్రతిష్ఠింపబడినవీ, తాత్కాలికంగా పెట్టబడినవీ ఉండవచ్చు, తాత్కాలిక ప్రతిమలకు ఆహ్వానమూ, విసర్జనమూ చెయ్యాలి. ఆవాహనం చెయ్యగానే ప్రతిమయందు ఆ దైవము ప్రవేశించినట్టు గ్రహించాలి. సాలగ్రామమందు దైవము ఎల్లప్పుడూ ఉంటాడు గనుక ఆవాహనం చేయనవసరంలేదు. మట్టి, ఇసుక, చందనంతో చెయ్యబడిన ప్రతిమలకూ చిత్రపటాలకూ అభిషేకము చేయరాదు. ప్రోక్షణము చేస్తే చాలు. శుభ్రమైన మంచి సామగ్రితో పూజించాలి. హృదయంలో నున్న దేవత నారాధిస్తే, పూజా సామగ్రితో పనిలేదు. భక్తితోజలం అర్పించినా చాలు. భక్తిలేనిదే ఏమిపెట్టినా ఎంతపెట్టినా వ్యర్థము. కేవలం ఆ దేవుని యందు ప్రేమ ఉంటే చాలు.

పూజాసామగ్రిని చేకూర్చుకొని, దర్భాసనం వేసుకొని, తూర్పుముఖంగా గాని, ఉత్తరముఖంగాగాని, ఆరాధ్య విగ్రహానికి ఎదురుగా కూర్చోవాలి. ముందుగా గురువును స్మరించి, అంగన్యాస కరన్యాసములను బీజాక్షరాలతో ఆచరించి, పవిత్రం చేసుకోవాలి. విగ్రహాన్ని చందన పుష్పాలతో అలంకరించాలి. (అర్ఘ్యం = దేవతా హస్తాలను కడిగేజలము. దీనిలో చందనము, పుష్పాలు, అక్షతలు, యవలు (బార్లీగింజలు) కుశదర్భలూ, నువ్వులు, ఆవాలు, దూర్వాలు (పచ్చిగడ్డి) కలుపుతారు, పాద్యము = దేవతా పాదాలను కడిగే జలము. దీనిలో శ్యామక బియ్యము, దూర్వాలు, పద్మ పుష్పాలు విష్ణుక్రాంత పుష్పాలు, కలుపుతారు. ఆచమనీయం = దేవతల నోటిని కడిగే జలము. దీనిలో, జాజికాయ, లవంగాలు, కంకోలం మొక్కలు, కలుపుతారు) కలశముతో జలాన్ని ఉంచి, మంత్రాలతో ఆ జలాన్ని పవిత్రం చెయ్యాలి. ఆ జలముతో దేవతా మందిరాన్నీ పూజాద్రవ్యాలనూ, తన శిరస్సును ప్రోక్షించాలి. అర్ఘ్య పాద్య ఆచమనీయ జలపాత్రలను నింపి ప్రోక్షించాలి. హృదయాయనమః అంటూ అర్ఘ్య పాత్రలోనికీ, శిరసేస్వాహా అంటూ పాద్య పాత్రలోనికి, శిఖాయైవౌషట్ అంటూ ఆచమనీయ పాత్రలోనికీ, గాయత్రీమంత్రంతో, మూడుపాత్రల లోనికీ, మంత్రం పఠించి వినిపించాలి. తరువాత ప్రాణాయామం చెయ్యాలి. హృదయస్థానం లోని పద్మమందు జీవుడు ఉంటాడు. ఉదాత్త స్వరంతో ఉచ్చరింపబడిన ఓంకారముతో (అ, ఉ, మ, లలోని "మ"కారం అయిన) జీవుని ధ్యానించాలి. ఆ జీవుడే శరీరమంతా చైతన్యరూపంలో నిండియున్నట్టు భావించి, ధ్యానము చెయ్యాలి. ఎలాంటి ఆవరణలూ లేని నిర్మల జీవాత్మయే పరమాత్మ అని భావించి పూజించాలి. మానసికమైన ఉపచారాలతో హృదయస్థమైన పరమాత్మను ఆరాధించి, ఎదురుగా నిలుపబడిన ప్రతిమయందు భగవానుని ఆవాహనం చెయ్యాలి. ఆ యా ముద్రలతోనూ, మంత్రాలతోనూ ఆవాహనం చేసి, పాద్యమూ, అర్ఘ్యమూ, ఆచమనీయమూ సమర్పించాలి. ధర్మమూ, జ్ఞానమూ, వైరాగ్యమూ, ఐశ్వర్యమూ అనే నాలుగుపాదాలూ, త్రిగుణాలు అనే మూడు పలకలూ గల పీఠాన్ని నిలపాలి. ఆ పీఠముపై, విమల, ఉత్కర్షిణి, జ్ఞాన, క్రియ, యోగ, ప్రహ్వా, సత్య, ఈశాన, అనుగ్రహ(అనుపల) అనే తొమ్మిది శక్తులను చుట్టూ స్థాపించాలి. పీఠ మధ్యములో ఎనిమిది రేకులతో, పద్మాకారంగా, మధ్యను మెత్తని కర్ణికతో, కేసరాలతో ఒక ఆసనాన్ని ఉంచినట్లుగా భావించాలి. ప్రతిమ వెనుకను గోళాకారంలో అగ్ని, దానివెనుకను చంద్రుడు, దాని వెనుకను సూర్యబింబమూ తేజరిల్లుతున్నట్లు భావించాలి. పద్మం మధ్యనున్న కర్ణికపై నున్న ఆసనం మీద భగవానుడు ప్రతిష్ఠింపబడియుంటాడు. ఆయనను అర్ఘ్యపాద్యాది ఉపచారాలతో పూజించాలి. తరువాత ఆయనయొక్క హస్తభూషణాలైన సుదర్శన చక్రము, పాంచజన్య శంఖము, కౌమోదకీగద, నందక ఖడ్గము, శార్‌ఙ్గధనుస్సు, నాగలి, రోకలిలాంటి ఆయుధము లనూ, అలంకారాలైన కౌస్తుభమణి, వైజయంతీమాల, శ్రీవత్సచిహ్నమూ మొదలైన వాటిని పూజించాలి. తరువాత అష్టపార్షదులైన నంద, సునంద, ప్రచండ, చండ, మహాబల, బల, కుముద, కుముదేక్షణులను స్వామిచుట్టూ నిల్చున్నట్టు భావించి పూజించాలి. స్వామివైపు చూస్తూ

నిల్చొని యుండే గరుత్మంతుని పూజించాలి. తరువాత దుర్గ, గణేశ, వ్యాస, విష్వక్సేనులు స్వామియొక్క నాలుగువైపులా ఉన్నట్టు పూజించాలి. స్వామికి కుడివైపుగా, నిజగురువు నిల్చున్నట్లుగా భావించి పూజించాలి. అష్టదిక్పాలకులైన ఇంద్రుని తూర్పునను, అగ్నిని ఆగ్నేయదిశలోను, యముని దక్షిణంలోను, నిర్ఋతిని, నైరుతి లోనూ, వరుణుని పశ్చిమాన, వాయువును వాయవ్య దిశలోనూ, కుబేరుని ఉత్తరాన, ఈశానుని ఈశాన్యంలోనూ స్థాపించి పూజించాలి. పరిమళ మంత్ర జలాలతో భగవానునకు స్నానము చేయించాలి. (అభిషేకము చెయ్యాలి). స్నాన సమయంలో సువర్ణ ఘర్మం అనబడే అనువాకాన్నీ, పురుషసూక్తాన్నీ, మహాపురుష విద్యనూ (జితం తే పుండరీకాక్ష, నమస్తే విశ్వభావన, సుబ్రహ్మణ్యా నమస్తేస్తు, మహాపురుష పూర్వజ) పఠించాలి. ఇంద్రోమహాషోణే మొదలైన ఋక్కులను చదవాలి. తరువాత వస్త్రమూ, ఉపవీతమూ, ఆభరణాలూ సమర్పించాలి. తులసీదళాలూ, పుష్పమాలలూ, చందనాది సుగంధద్రవ్యాలూ భక్తితో అర్పించాలి. తరువాత అర్ఘ్య పాద్య - ఆచమనీయ ధూపదీప నైవేద్యాలను ప్రేమతో నర్పించాలి. ఆ యా పర్వదినాల్లో పంచామృతస్నానం చేయించాలి. ప్రతిదినముగాని, పర్వదినాల్లోగాని, పాయసము, నెయ్యి, అపూపాలూ, భక్ష్యాలూ, పప్పు,పెరుగు మొదలైనవి ప్రీతితో నైవేద్యం చెయ్యాలి. ఏకాదశి, పౌర్ణమి మొదలైన పుణ్యదినాలలో అధికంగా అన్నాదులను నివేదించి పంచిపెట్టాలి. నృత్య, గీత, సంకీర్తనలను చెయ్యాలి.

అగ్నిని ఆరాధించేటప్పుడు శాస్త్రోక్తముగా కుండము, వేదిక, గర్తము ఏర్పాటు చేసి, అగ్నినిపెట్టి, ప్రజ్వలింపజేసి ప్రోక్షణం చెయ్యాలి. అగ్ని మధ్యస్థంగా బంగారు కాంతులతోనూ, శంఖచక్రగదాపద్మధారియై, కిరీట, కుండల, భుజకీర్తులూ, కౌస్తుభ, వైజయంతి, పట్టు పీతాంబరధారియై ప్రకాశించే భగవానుని ధ్యానించాలి. సమిధలను నేతితో తడిపి, హవిస్సులను అర్పించాలి. ప్రజాపతయే స్వాహా, ఇంద్రాయస్వాహా, అగ్నయేస్వాహా, సోమాయస్వాహా అంటూ హోమం చెయ్యాలి. ఓంనమోనారాయణాయ మంత్రాన్ని స్వాహాతోను, పురుష సూక్తాన్ని పఠిస్తూ నేతితో హోమం చెయ్యాలి. తరువాత అగ్నిని స్విష్టకృతే స్వాహా అంటూ పూజించాలి. తరువాత పీఠదేవతలకు, అంగదేవతలకు, ఆవరణ దేవతలకు, అస్త్రాలకూ, ఆభరణాలకూ, పార్షదులకూ ఆరాధన చెయ్యాలి. తరువాత మూలమంత్రమైన, ఓంనమోనారాయణాయ, అనే అష్టాక్షరీ మంత్రాన్ని జపిస్తూ ధ్యానం చెయ్యాలి. భగవంతునకు ఆచమనీయం సమర్పించి, ఆసనంపైన ఆసీనునిగా చేసి, విష్వక్సేనునకు ఆచమనీయం చేయించి, భగవన్నివేదితమైన పదార్థాన్ని ఇవ్వాలి. తరువాత స్వామికి కర్పూర తాంబూలాలిచ్చి, పుష్పాంజలి సమర్పించి, అనంతరం నృత్యగానాదులను దర్శింపజేయాలి. భగవత్కథలను చెప్పి వినిపించాలి. మంత్రాలతో స్తుతించాలి. "పరమేశ్వరుడు ప్రీతిజెందుగాక, ఈ సంసార సాగరములోని కామక్రోధాదులైన ఘోర మకరాలనుండి నన్ను రక్షించుగాక!" అని ప్రార్థించి, స్వామి పాదాల చెంతనున్న పుష్పాన్ని నాప్రసాదంగా గ్రహించి, శిరస్సున ధరించాలి.

తాత్కాలికమైన విగ్రహాలనుండి, ఆవాహనచెయ్యబడిన శక్తిని ఉపసంహరించుకొని, హృదయకమలంలోనికి తీసుకోవాలి. విగ్రహాలను నదిలోనో, తటాకంలోనో విసర్జించాలి. జీవుడూ, ఈశ్వరుడూ ఒక్కడే అని గ్రహించాలి. భగవద్భక్తుడు, భగవంతుని తన హృదయమందూ, సర్వభూతాలయందూ గుర్తించి, ఆరాధించాలి. ధనవంతులు, మందిరాలను నిర్మించి, విగ్రహాలను ప్రతిష్ఠింపజేసి, నిత్యపూజలూ, ఉత్సవాలూ జరిపిస్తుండాలి. ఆలయ నిర్వహణకు ఆదాయం వచ్చే ఆస్తులను సమకూర్చాలి. ఈ విధంగా భగవానుని ఆరాధించే వారే కాకుండా, వారి దివ్య కార్యక్రమాల్లో సహాయం చేసినవారంతా భగవానునితో నైక్యమవుతారు." అని, శ్రీభగవానుడు చెప్పాడు.

## జ్ఞానయోగము

### శ్రీభగవానుడు చెపుతున్నాడు

"ఉద్ధవా! ఈ విశ్వమంతా భగవన్మయము. ప్రతిజీవిలోనూ, దృశ్యాదృశ్య వస్తువులలోనూ భగవంతుడు వ్యాపించియుండడంచేత, ఏ జీవిని నిందించినా హింసించినా, భగవానునే నిందించడం, హింసించడం అవుతుంది. భగవంతుడు వేరు, జీవులూ, ప్రపంచమూ వేరువేరు అనుకొనే వ్యక్తి ఆత్మతత్త్వాన్ని గ్రహించలేనివాడై అజ్ఞానంలోనే ఉండిపోతాడు.

ఈ దృశ్యాదృశ్య ప్రపంచములోని సకల జీవరాసులూ, సకల వస్తు విషయ సముదాయాలు, అన్నీ, ప్రకృతియొక్క వికారాలూ, ప్రతిరూపాలూను. ప్రకృతి పరమాత్ముని యొక్క మాయా జనితమే గనుక, ప్రకృతితోపాటు దాని ప్రతిరూపాలన్నీ మిథ్యాస్వరూపాలే. అంతవరకూ అంతానిజమే అనిపించే స్వప్నంలోని అనుభవాలన్నీ మెలకువరాగానే అంతామిథ్యయే అని తెలిసినట్లే, జ్ఞానోదయం కాగానే, అంతవరకూ వాస్తవాలే అనిపిస్తుండేవన్నీ మిథ్యయే అని తెలియవస్తుంది. మిథ్యకానిదీ నిత్యమూ ఉండేదీ ఆత్మ ఒక్కటే అని గ్రహించడమే జ్ఞానము. ఆత్మ సహజంగా శుద్ధమైనదే, కాని దేహేంద్రియ ప్రాణాలతో కూడియుండడంచేత వాటితో తాదాత్మ్యాన్ని ఏర్పరచుకొని, వాటియొక్క మాయాస్వరూపాన్ని స్వీకరించి, అజ్ఞానియై సంసారి అవుతుంది. దేహేంద్రియమనస్సులకు కలిగే సుఖదుఃఖ - అనుభవాలన్నీ తనవిగానే భావించి భరిస్తుంది. దేహమేతాను అనే భ్రమలో నుండడంచేత దేహవియోగాన్ని సహించలేక మళ్లీ అనుకూలమైన వేరొక దేహాన్ని పొంది, ఈ లోకంలో ప్రవేశిస్తుంది. ఈ విధంగా జన్మపరంపరలు కలుగుతుంటాయి. గాని పునర్జన్మలు జడపదార్థమైన దేహానికి కలుగవు. జీవాత్మ నిత్యమైనది గనుక దానికి చావుపుట్టుకలుండవు. సుఖదుఃఖ జనన మరణాది అనుభవాలన్నీ జీవుని ఆశ్రయించి, ఆవరించియున్న అహంకారానికి చెందినట్టివి. ఈ ఆవరణ తొలగిపోవడమే జీవునికి ముక్తికలగడం. సద్గురు కృపచే పొందబడిన జ్ఞానముచేతనే ఈ ఆవరణతొలగగలదు. వేదాధ్యయనమూ, తపస్సూ, మహాత్ముల బోధలయందు భక్తి విశ్వాసాలూ, ఆత్మానుభూతీ, ఆదిమధ్యాంతర్గతుడై యుండేది ఒక్క పరబ్రహ్మమే అనే దృఢవిశ్వాసమూ ఉంటే ఈ జ్ఞానము కలుగుతుంది. పరబ్రహ్మము ప్రకృతియొక్క వింత పోకడలకు ఏవిధంగానూ చలించదు, మార్పుచెందదు. సాధకుడు ఈ పరబ్రహ్మతత్త్వాన్ని గ్రహించి, చిత్తాన్ని నాయందునిలిపి, సాధుసజ్జనుల సాంగత్యము చేస్తూ, పుణ్యస్థలాలను సందర్శిస్తూ, సర్వభూతాలయందు నన్నూ, నాయందు సర్వభూతాలనూ చూస్తూ, సమదర్శనులై, అనన్య భక్తితో నన్నుకొలవాలి. ఉద్ధవా! ఈ భాగవత ధర్మముచే తప్ప వేరొక మార్గముచే, నన్ను పొందడానికి సాధ్యపడదు. నాకంటే ఇతరమైన వేరొక పురుషార్థము లేదు. దీనిని స్త్రీ పురుషులూ, అన్ని వర్ణాలవారూ పాటించి తరించవచ్చు."అని చెప్పాడు.

## అంతిమ సందేశము

చివరకు శ్రీభగవానుడు ఇలా చెప్పాడు: "ఉద్ధవా! నీకు చెప్పవలసినదంతా చెప్పాను. చివరకు సంక్షిప్తముగా మళ్లీ నేను చెప్పే సందేశాన్ని శ్రద్ధగా విను: నీమనోబుద్ధులను నాకే అంకితము చేయుము. నన్ను సంతోషపెట్టే విధంగా ప్రవర్తించు. నీ కర్మలన్నీ నా గురించే చేయుము. నన్నే ఎల్లప్పుడూ స్మరిస్తుండు. ఎలాంటి భేదభావమూ లేకుండా నాచే సృష్టింపబడిన జీవరాసులయందు నా యొక్క ఉనికిని గుర్తించి గౌరవించాలి. ఎటువంటి సంకోచమూ, సిగ్గూ లేకుండా, కుక్క, గాడిద, చండాలుడు, గోవు యొక్క పాదాలకు సాష్టాంగ ప్రణామము చేసి, వాటియందున్న నాకు నమస్కరించాలి. విశ్వాసం ఉన్నవాళ్లకే నా ఉపదేశాన్ని వినిపించు. నాస్తికులకూ నమ్మకం లేనివారికీ చెప్పవద్దు. బదరికాశ్రమానికి వెళ్లి, అలకనందలో స్నానము చేసి, వృక్షబెరడులను ధరించి, కందమూలాలను భుజిస్తూ, దేనియందునూ ఆసక్తిలేనివాడవై, శీతోష్ణాదులను సహిస్తూ నేను చెప్పిన విషయాలను గుర్తుంచుకొని, నన్నే నిరంతరమూ స్మరిస్తూ ఉండు. ప్రకృతి పరిధిని దాటి, నన్ను చేరగలవు" అని చెప్పగా, ఉద్ధవుడు భగవానునకు నమస్కరించి, ప్రదక్షిణంచేసి, ఆనందబాష్పాలతో రుద్ధకంఠంతో ఇలా అన్నాడు: "స్వామీ! యోగీశ్వరా! శ్రీకృష్ణపరమాత్మా! నాయందు అత్యంత కరుణతో నీవు అనుగ్రహించిన జ్ఞానముతో నా మోహము నశించినది. నాకు బంధుజనులయందుండే మోహము తొలగిపోయినది. నీ ఆదేశము ప్రకారమే చేస్తాను." అని, స్వామి పాదాలకు శిరస్సును తాకించి, ఆ పాదాలను విడువలేకనూ, స్వామినుండి దృష్టిని మరల్చలేకనూ, స్వామి పాదుకలను నెత్తిపై పెట్టుకొని, ముందుకు నడవని తన పాదాలను నెట్టుకొంటూ, స్వామి వద్ద సెలవు తీసుకొని, కన్నీరు మున్నీరు కాగా ముందుకు సాగిపోయాడు మహాత్ముడైన ఉద్ధవుడు.

బదరీవిశాలధామాన్ని చేరి, శ్రీకృష్ణుని ఆదేశానుసారముగా ధ్యానముచేసి పరమపదాన్ని పొందాడు: అని శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పి, ఇలా అన్నాడు: "రాజా! శ్రీకృష్ణునిచే ఉద్ధవునకు చెప్పబడిన ఈ భాగవత రహస్యాన్ని గ్రహించి

అనుసరించిన వారూ, భాగవతోత్తముల యొక్క సేవా సత్సంగము చేసినవారూ, మోహము తొలగినవారై, మోక్షపదాన్ని పొందగలరు. ఇందుకు సందేహము లేదు." అని చెప్పాడు.

## యాదవకులాంతము - శ్రీకృష్ణ వైకుంఠ గమనము

### శ్రీశుకయోగి చెప్తున్నాడు

శ్రీకృష్ణుడు యాదవముఖ్యులతో సభచేసి ఇలా చెప్పాడు: ద్వారకలో కొన్ని ఉపద్రవాలు సంభవించే సూచనలు కనిపిస్తున్నవి. ఇక్కడ ఉండడం క్షేమకరం కాదు. స్త్రీలూ, వృద్ధులూ, బాలబాలికలు, ఈ దగ్గరలో నున్న శంఖోద్ధార క్షేత్రానికి వెళ్లుతారు. పురుషులందరమూ ప్రభాసతీర్థానికి వెళ్లుదాము. అక్కడ సరస్వతీనది, పశ్చిమ సముద్రంలో కలుస్తుంది. అక్కడ మనమంతా స్నానాలు చేసి, తర్పణములు చేసి, బ్రాహ్మణులకు భూరిదక్షిణలిచ్చి, దేవతలనారాధించి, రాబోయే ప్రమాదాలనుండి రక్షించుడని ప్రార్థిద్దాము." అని చెప్పగా అందరూ సరేఅన్నారు. అందరూ, తిరునాళ్ల సంబరంతో బయలుదేరి వెళ్లారు. అనుకొన్న ప్రకారము, స్త్రీ బాలవృద్ధులు, శంఖోద్ధారక్షేత్రానికి వెళ్లి తీర్థయాత్ర ముగించుకొని ద్వారకకు మరలిపోయారు. పురుషులందరూ ప్రభాసతీర్థం వెళ్లి స్నానాదికాలు, తర్పణములు, దేవతార్చనలూ, దానాది సత్కర్మలూ ముగించుకొన్నారు. దైవమాయచేత వాళ్ల బుద్ధి వక్రించి, అందరూ మితిమీరిన మద్యపానము చేశారు. మత్తెక్కి, ఒళ్లుమరచి, పొగరెక్కి, చిన్నచిన్న వాదులాటలతో ప్రారంభించి, పరస్పరం కలహించుకొనసాగారు. అది చిలికి, చిలికి, ఘోరయుద్ధముగా మారినది. గదలతోనూ, బల్లెములతోనూ, ఖడ్గాలతోను, ధనుస్సులతోనూ కొట్టుకొన్నారు. శ్రీకృష్ణుని పుత్రులు కూడ పరస్పరం కొట్టుకొనసాగారు. వృష్ణులు, భోజులు, అంధకులు, సాత్వతులు, మధువులు, కుకురులు, మొదలైన అన్ని వర్గాలవారూ పోరాడుకొన్నారు. ఆయుధాలన్నీ విరిగిపోయాయి. చేతులు తప్ప ఇంకేమీ మిగలలేదు. ఇటూ అటూ చూడగా దగ్గరలో వృక్షాలేవీ కనపడలేదుగాని, ఏపుగా పెరిగిన రెల్లు గడ్డి కనిపించినది. ఆ గడ్డి వాడియైన వజ్రపు ఖడ్గాలు లాగ ఉన్నట్లు తెలుసుకొని, వాటిని పీకి, కొట్టుకొనసాగారు. పొడుచుకొనసాగారు. గతంలో ముసులశాపముచే పుట్టి, చూర్ణము చేయబడి, సముద్రంలో పడవేయబడిన ఆముసలము యొక్క చూర్ణమే ఈ రెల్లుగడ్డిగా మొలిచి, తీరమంతా వ్యాపించి, యాదవులను అంతము చేసే ఆయుధాలుగా పరిణమించినది. యాదవులపై మాయపూర్తిగా ఆవేశించడం చేత వారించడానికి అడ్డం వెళ్లిన బలరామకృష్ణులనుకూడ వారు లెక్కచెయ్యకుండా కొట్టనారంభించారు. ఈ విధంగా విధివశాన యాదవులందరూ, ఒకరినొకరు చంపుకొని, నశించిపోయారు. బలరాముడు సముద్రతీరాన కూర్చొని, స్వస్వరూపాన్ని ధ్యానించుకొంటూ, మానవ దేహాన్ని విడిచిపెట్టి, సంకర్షణ మూర్తియందు లీనమైపోయాడు.

బలరాముని నిష్క్రమణతో భూభారము పూర్తిగా తొలగిపోయి, తన అవతార కార్యము ముగియడంతో, శ్రీకృష్ణభగవానుడు ఒకరావి చెట్టు మొదలుకడ కూర్చొని, వీపును చెట్టుకు ఆన్చి, తన ఎర్రని అరవిందంలాంటి ఎడమ పాదాన్ని కుడి తొడపైననుంచుకొని, చతుర్బాహుడై చీకటిని పారద్రోలే సూర్యునివలె తేజస్వియై విరాజిల్లుతున్నాడు. మకరకుండలాలూ, కౌస్తుభమణి, శ్రీవత్సచిహ్నమూ, వైజయంతీమాల, పట్టుపీతాంబరమూ ధరించిన స్వామి నిజరూపంతో చిన్మయహాసం చేస్తున్నాడు. శంఖము, గద, చక్రాది - ఆయుధాలు తమ దివ్య స్వరూపాలను దాల్చి, స్వామికి రెండు ప్రక్కల నిల్చున్నాయి. కుడితొడపై కదులుతున్న ఎర్రని పాదాన్ని దూరం నుండి చూచిన జర అనే ఒక బోయవాడు, దానిని ఒక లేడియొక్క ముఖమని భావించి, బాణము వెయ్యగా అది స్వామియొక్క పాదానికి గుచ్చుకొన్నది. ముసలాన్ని అరగదీయగా మిగిలిపోయిన త్రికోణాకారపు ముక్క, జర విడిచిపెట్టిన బాణానికి ములుకుగా అమర్చబడియుండెను. (సముద్రములో పారవేయబడిన ఆ ముసలపు ముక్కను ఒక చేపమింగి వేయగా, ఆ చేప ఈ బోయవానిచే పట్టుబడి, దానిగర్భంలో దొరికిన ఆ త్రికోణాకారపు ముక్క బోయవాని బాణానికి అమర్చబడినది) ఈ విధంగా, ఋషుల శాపప్రభావము శ్రీకృష్ణునిపైన కూడ పనిచేసినది. బోయవాడు స్వామి చెంతకు వచ్చి తాను చేసిన ఘోరకృత్యానికి, భయపడి, ఏడుస్తూ, స్వామి పాదాలపైబడి, తన్ను

శిక్షింపుమని వేడుకొన్నాడు. కరుణాసాగరుడైన స్వామి చిరునవ్వుతో బోయవానిని లేవనెత్తి, స్వామి కార్యాన్ని నెరవేర్చినందుకు వాణ్ని వైకుంఠానికి పంపించివేశాడు. శ్రీకృష్ణ సారథియైన దారుకుడు, స్వామిని వెదుక్కొంటూ వచ్చి, రథముదిగి, పరిస్థితిని చూచి, స్వామి పాదాలపైబడి బోరున ఏడ్చాడు. అతడు చూస్తుండగనే రథము ఆకాశంమీదికి లేచిపోయినది. స్వామియొక్క ఆయుధాలుకూడ రథాన్ని అనుసరిస్తూ వెళ్లిపోయాయి. శ్రీకృష్ణుడు దారుకునితో ఇలా చెప్పాడు: "నీవు ద్వారకకు పోయి. యాదవపురుషులందరూ నశించారనీ, బలరాముడు దేహత్యాగము చేశాడనీ, నేనుకూడ నిష్క్రమించనున్నాననీ, నేను వెళ్లినవెంటనే ద్వారకను సముద్రం ముంచివేస్తుందనీ, ద్వారకలో మిగిలియున్న స్త్రీ బాలవృద్ధులందరూ అర్జునుని రక్షణలో, అతని సహాయంతో ద్వారకను విడిచి, ఇంద్రప్రస్థానికి వెంటనే వెళ్లిపోవాలని చెప్పు. దారుకా! నీవు నిశ్చల చిత్తుడవై, అంతా నా సంకల్పము చేతనే జరుగుతుందని గ్రహించి, నా యందే మనస్సు నిలిపి, విషయాలయందు సంగము వీడి. రాగద్వేషాలను తొలగించుకొని, నన్ను చేరగలవు." అని, భగవానుడు చెప్పగా, దారుకుడు స్వామికి ప్రదక్షిణపూర్వకముగా నమస్కారాలు చేసి, విడువలేక విడువలేక వెళ్లిపోయాడు.

దారుకుడు వెళ్లిన తరువాత చతుర్ముఖబ్రహ్మ, పార్వతీ పరమేశ్వరులూ, ఇంద్రాదిదేవతలూ, మరీచాది ప్రజాపతులూ, సిద్ధులూ, గంధర్వులూ మొదలైన వారందరూ, స్వామివద్దకువచ్చారు. పుష్పవర్షాలు కురిపించారు. స్వామియొక్క లీలా గుణవైభవాలను గానంచేశారు. స్వామి అందరినీ అవలోకించి, కన్నులు మూసుకొని, నిజశరీరంతోనే, అంతర్ధానమై, వైకుంఠధామానికి వెళ్లిపోయాడు. ॥ ఓంనమో భగవతే వాసుదేవాయ, ఓంశ్రీకృష్ణపరమాత్మనే నమః, హరిఃఓం తత్సత్ ॥ స్వామితోపాటు, భూమినుండి, సత్యము, ధర్మము, ధైర్యము, కీర్తి, శ్రీ కూడ అదృశ్యమైనాయి. బ్రహ్మాదిదేవతలు, తమ తమ లోకాలకు మరలిపోయారు. స్వామియొక్క లీలావిలాసాలను, బ్రహ్మాదులుకూడ తెలుసుకొనలేరు.

ద్వారకకుచేరిన దారుకుడు, ఉగ్రసేన వసుదేవులకు శ్రీకృష్ణుని సందేశం తెలియజేశాడు. ద్వారక అంతా శోకంలో మునిగిపోయినది. అందరూ ప్రభాసానికి వెళ్లి, తమతమ ప్రియతముల శరీరాలపైబడి విలపించారు. వసుదేవుడు, దేవకి, రోహిణి, తమ బలరామకృష్ణులులేని బ్రతుకు నిరర్థకమని ప్రాణాలు విడిచారు. శ్రీకృష్ణబలరాముల భార్యలు చాలామంది చితులలోపడి తనువులు చాలించారు. పతుల వియోగాన్ని భరించలేని యాదవుల పత్నులు సహగమనంచేశారు. అర్జునుడు అందరికీ అంత్యక్రియలు జరిపించాడు. భగవానుడు కురుక్షేత్రరణరంగంలో చేసిన ఉపదేశాన్ని మననంచేసుకొని, తనప్రియసఖుడూ, స్వామీ అయిన శ్రీకృష్ణుని వియోగజ్వాలలకు తట్టుకొని, తనపై నిర్ధించబడిన కర్తవ్యాన్ని నిర్వహించడానికి పూనుకొన్నాడు. ద్వారకలో మిగిలియున్న స్త్రీ బాలవృద్ధులను తోడుకొని, ఇంద్రప్రస్థానికి బయలుదేరాడు. వాళ్లు వెళ్లగానే ద్వారకను సముద్రం ముంచివేసినది. ఒక్క శ్రీకృష్ణభవనంతప్ప అన్నీ నశించాయి. మిగిలియున్న వజ్రుడు అనే అనిరుద్ధపుత్రునకు యాదవ రాజ్యపట్టంగట్టారు.

ఓపరీక్షిన్మహారాజా! నీతాతగార్లు నీకుపట్టంగట్టి హిమాలయాలకు వెళ్లిపోయారు. అక్కడినుండి పరంధామానికి చేరుకొన్నారు. రాజా! ఈదివ్యమంగళ చరిత్రను, ఎవ్వరైతే విని, వినిపించి, మననంచేసుకొంటారో, శ్రీకృష్ణునియందు భక్తినిపొంది, పరమానందాన్నీ, ఇహపర సౌఖ్యాలను పొందుతారు అని శ్రీశుకుడు పరీక్షిత్తునకు చెప్పాడు.

శ్రీమద్భాగవత సంగ్రహము
హరిః ఓం తత్ సత్
ఏకాదశస్కంధము సమాప్తం
ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

***

॥ శ్రీహరిః ॥

# శ్రీమద్భాగవత సంగ్రహము

# ద్వాదశస్కంధము

## కలియుగ ప్రభావము

### శ్రీశుకుడు ఇలా చెప్పాడు

"ఓపరీక్షిన్మహారాజా! చంద్రవంశపు రాజులలో చివరివాడైన పురంజయుని అతని మంత్రి చంపివేసి, మంత్రిపుత్రుడైన ప్రద్యోతుని రాజు చేశాడు. ప్రద్యోతనుని సంతతివారు 108 ఏండ్లు పాలించారు. తరువాత శిశునాగుడు మొదలైనవారు 360 సంవత్సరాలు పాలిస్తారు. ఆతరువాత నందివర్ధనుడు, మహానంది, మహాపద్మడు అనబడే నందులు రాజులౌతారు. అక్కడినుండి క్షత్రియులపాలన అంతమై శూద్రులపాలన మొదలౌతుంది. నందులు ఒకవంద సంవత్సరాలు పాలిస్తారు. కౌటిల్యుడనే బ్రాహ్మణుడునందులను నశింపజేస్తాడు. తరువాత చంద్రగుప్తుడు అశోకవర్ధనుడు మొదలైన మౌర్యులు 137 సంవత్సరాలు పాలిస్తారు. తరువాత పుష్యమిత్రుడు, అగ్నిమిత్రుడు మొదలైన శుంగ వంశీయులు 112 సంవత్సరాలు పాలిస్తారు. తరువాత వసుదేవుడు మొదలైన కాణ్వులు 345 సంవత్సరాలుపాలిస్తారు. తరువాత బలీకులు అనబడే ఆంధ్రజాతివారు 486 సంవత్సరాలు పాలిస్తారు. తరువాత అభీరులు, అవధ్యులు, గర్దభులు కంకులు పాలిస్తారు. తరువాత యవనులు, తురుష్కులు, మురుండులు, మౌనులు, 1099 సంవత్సరాలు పాలిస్తారు. తరువాత బాహ్లికులు అనబడే భూతనందాదులు 106 సంవత్సరాలు పాలిస్తారు. ఆతరువాత బాహ్లికుల సంతతివారే ఆంధ్రులు, కోసలులు, వైదూరులు, నిషాదులు, అనే తెగలుగా విడిపోయి, వేరువేరు రాజ్యాలను స్థాపించుకొని ఏలుతారు. తరువాత విశ్వస్ఫూర్తి అనే మగధ వంశీయుడు రాజవుతాడు. ఇతని కాలములోనే పుళిందయదు, మద్రక అనుపేర్లతో మ్లేచ్ఛ సమానులైన తెగలు వ్యాప్తిజెందుతాయి.

వర్ణ వ్యవస్థ నశిస్తుంది. రాజరికంచే క్షత్రియులు నశిస్తారు. సౌరాష్ట్ర, అవంతి, అభీర, దేశాలలో ఉపనయనాది సంస్కారాలులేని బ్రాహ్మణులు శూద్రప్రాయులై వెలుస్తారు. వారు మ్లేచ్ఛప్రాయులై సింధూనదీచంద్రభాగానదీ తీరాలలోనూ, కుంతీ కాశ్మీర దేశాలలోనూ పాలన సాగిస్తారు. అప్పుడు దేశంలో అధర్మము, అనృతము, బాగా వ్యాపిస్తాయి. దానబుద్ధి లోపిస్తుంది. పరధనము, పరస్త్రీలూ అపహరింపబడుతారు. అవినీతి, నిలకడలేనితనమూ పెరుగుతాయి. బలము, శక్తి, ధీరత్వము, ఆయుర్దాయము తరుగుతాయి. మ్లేచ్ఛులు పాలకులౌతారు. తమోగుణము, రజోగుణమూ, ప్రజాపీడనము విజృంభిస్తాయి. ప్రజలలో స్వార్థము, పరస్పరద్వేషము, కలహాలు పెరుగుతాయి. అప్పటినుండీ నానాటికీ ధర్మము, సత్యము, బాహ్య-అంత: శౌచమూ, క్షమ, కరుణ, జ్ఞాపకశక్తి, శరీరశక్తి, ఆయుర్దాయమూ అన్నీ క్షీణిస్తుంటాయి.

కలియుగంలో ధనవంతులే ఉత్తమ వంశీయులుగ, శీలవంతులుగ, గుణవంతులుగ, శక్తిమంతులుగ భావింపబడుతారు. బలమున్నవారు చెప్పినదే న్యాయమూ ధర్మమూ అనబడుతుంది. యువతీయువకులు స్వేచ్ఛగా తామే ఎన్నుకొని, పెండ్లిచేసుకొంటారు. వ్యాపారంలో వంచనయే ముఖ్యసూత్రం అవుతుంది. ఎక్కువ రతి సుఖాన్నివ్వగలవారే ఉత్తమ స్త్రీ పురుషులుగా మెప్పుపొందుతారు. బాహ్యచిహ్నాలను ప్రదర్శించుకొని బ్రాహ్మణులూ, సన్న్యాసులూ తిరుగుతుంటారు. ధనహీనులకు న్యాయము లభించదు. దంభవాచాలత్వము చూపేవారు పండితులనిపించుకొంటారు. ఉదరపోషణమే ఉత్తమపురుషార్థ మనుకొంటారు. డాంబికాలు పలకడం సత్యవచన మనిపించుకొంటుంది. కుటుంబపోషణమే నైపుణ్యంగా భావిస్తారు. కీర్తికోసమే పుణ్యాకర్మలు చేస్తారు.

భూమండలమంతా దుష్టుల విహారభూమిగా నుంటుంది. దుష్టులలోని బలవంతులే భూమిని పాలిస్తారు. శక్తిలేని ప్రజలు కొండలు, అడవుల నాశ్రయించి, దుంపలు, ఆకులు తిని బ్రతుకుతారు. పాలకులు విధించే పన్నులూ, దుర్భిక్షమూ పీడిస్తుండగా ఆకలి, చలి, వేడి, వర్షాలకు తట్టుకొనలేక, ప్రజలు తనులో తాము కొట్టుకొని నశిస్తారు. ఆయుర్దాయం, 30, 20 ఏళ్లకు దిగిపోతుంది. నాస్తికులు ఎక్కువౌతారు. రాజులు(పాలకులు) దోపిడీ దొంగల్లాగ తయారవుతారు. మనుష్యులు అకారణంగా ఒకరినొకరు హింసించుకొంటారు. ఆస్తులు తగలబెట్టుకొంటారు. భార్యయొక్క బంధువులే ఎక్కువగా ఆదరింపబడుతారు. ఆవులు మేకలంత చిన్నవిగాను, అల్పపాడి ఇచ్చేవిగాను అవుతాయి. ఆశ్రమాలు గృహస్థుల ఇళ్లలాగ తయారవుతాయి. అతిథులను ఆదరించడం ఉండదు. వర్షాలు కురియవు. ఇండ్లు వాకిళ్లు పాడుపడతాయి. భూమి సారహీనమవుతుంది.

కలియుగాంతములో భగవానుడు శంబల గ్రామంలో విష్ణుయశుడనే బ్రాహ్మణునకు కల్కిగా పుట్టి, దేవదత్తమనే గుఱ్ఱాన్నెక్కి, తన ఖడ్గంతో కోట్లకొలదిగా ఉన్న దుష్టులను, చోరులను హతమార్చుతాడు. వాసుదేవుని అవతారమైన కల్కిభగవానుని స్పృశించిన వాయువువలన మిగిలియున్న ప్రజలూ, వారికి కలుగబోవు సంతానమూ, సర్వులూ, శుద్ధ సాత్త్వికులౌతారు. అప్పుడు కృతయుగం ప్రవేశిస్తుంది.

శ్రీకృష్ణుడు ఈ భూమిపై నున్నంతవరకూ కలిప్రవేశించ లేకపోయినది. శ్రీకృష్ణుడు నిష్క్రమించిన వెంటనే కలి ప్రవేశించి, భూమండలాన్ని ఆవరించినది. ఈ కలియుగాంతమున ప్రస్తుతం కలాపి గ్రామములోనున్న చంద్రవంశపు శంతనుని సోదరుడైన దేవాపి, ఇక్ష్వాకు వంశానికి చెందిన సూర్యవంశపు రాజైన మరువు వాసుదేవుని అనుగ్రహంచేత ఈ భూమండలానికి వచ్చి, వర్ణాశ్రమాది సకల ధర్మాలనూ పునఃప్రతిష్ఠింపజేస్తారు. కృతయుగం, తరువాత త్రేతాయుగ, ద్వాపరయుగ కలియుగాలు పునరావృతమవుతాయి.

ఈ భూమిని పాలించే రాజులు ఇదినాది, అదినాది అని భూమి గురించి పోట్లాడుకొనడం, చంపుకొనడం చూచి, భూమాత ఇలాగ అనుకొంటుంది: "ఆహా! ఈ రాజులెంతటి అవివేకులు! మృత్యువు నీడలాగ వెంటాడుతుంటుందని గుర్తించక తామేదో శాశ్వతంగా నుండి పోతామనుకొని ఇతర రాజుల నోడించి, వారి రాజ్యాలను ఆక్రమిస్తారు. వారి తండ్రులు గాని, తాతలుగాని, చివరకు మనువులూ ప్రజాపతులూ, ఎవ్వరైనాగాని చిరకాలమూ ఉండిపోగలిగారా? ఇంద్రియాలనే జయించలేని ఈ రాజులు తనుదేహాలనే శాశ్వతంగా ఉంచుకొనలేమని తెలుసుకొనకుండా, నన్ను శాశ్వతంగా ఉంచుకొందామనుకొంటున్నారు. శ్రీహరి నాశ్రయించి, శాశ్వతమైన మోక్షసామ్రాజ్యాన్ని పొందాలనుకొనకుండా, నశ్వరమైన ఈ భూలోక సంపదలకోసం తమ అమూల్యమైన జీవితాన్నే వ్యర్థంచేసుకొంటున్నారు." అని జాలిపడుతుంది. ఓ పరీక్షిన్మహారాజా! నేను నీకు అనేకమంది రాజుల చరిత్రలను చెప్పాను కదా! వారిలో నెవ్వరూ ఉండిపోలేదు. ఏ కొద్దిమందినోతప్ప వారి కథలైనా ఈ భూమిమీద నిలువలేదు. కేవలం ఆ శ్రీకృష్ణ భగవానుని కథలనే వింటూ, స్మరిస్తూ ఉంటే, ఆయనయందు భక్తి పెరుగుతుంది.

కృతయుగంలో సత్యము, దయ, తపస్సు, దానము, అనే నాలుగు పాదాలపై ధర్మము నడిచేది. త్రేతాయుగంలో ఈ నాలుగు ధర్మాలలో నుండి ఒక్కొక్క పావుభాగము తరిగిపోయి, వాటిస్థానే అనృతము, హింస, అసంతుష్టి, కలహము చేరుతాయి. ద్వాపరయుగంలో సత్యము, దయ, తపస్సు, దానమూ సగం సగం తరిగిపోయి, వాటి స్థానే అనృతము, హింస, అసంతుష్టి, కలహమూ చేరుతాయి. కలియుగములో సత్యము, దయ, తపస్సు, దానమూ, ఒక్కొక్క పావు భాగమే మిగిలియుండి మూడేసి పావుల అనృతము, హింస, అసంతుష్టి, కలహమూ వచ్చి వాటితో చేరుతాయి.

కలియుగములో సద్గుణాలు చాలా వరకు నశించి, దురాచారము, లోభము, నిర్దయ, పగ, ఆశ, అర్థకామతృష్ణ, దంభము, బుద్ధిమాంద్యము, తిండిబోతుతనము, మందభాగ్యము, జారత్వము, కలహకాంక్ష, చోరబుద్ధి, ప్రబలమైపోతాయి. పాలకులు పీడిస్తారు. బ్రాహ్మణులు జ్ఞానహీనులై ఉదరపోషణకు నీచవృత్తులను చేపడతారు.

పాలు ఇవ్వని గోవులు పోషింపబడవు. సాధుసన్న్యాసులు గ్రామాల్లోనే నివసిస్తారు, ధనాసక్తులౌతారు. స్త్రీలు అధికసంతానవతులై, భోజనప్రియులై, విషయసుఖాలనెక్కువగా వాంఛిస్తూ, సిగ్గు విడిచినవారై, కఠినాత్ములై, మోసము, సాహసము, చౌర్యమూ చేయడానికి వెనుదీయని వారైయుంటారు. వర్తకులు వంచననే ఆశ్రయిస్తారు. పురుషులు కామవశులై, స్త్రీలకు లొంగియుంటారు. క్షుద్రవ్యక్తులు సన్న్యాసివేషముతో జీవనోపాధిని ఆర్జిస్తారు. స్త్రీ పురుషులు, స్నానాదికాలను మానివేసి, విలువలేని వస్తువుల గురించి కూడ పోట్లాడుకొంటారు, హింసించుకొంటారు. పురుషులు, తలిదండ్రులను, తోబుట్టువులను అలక్ష్యంచేసి, భార్యతోబుట్టువులను ఎక్కువగా ఆదరిస్తారు. రానురాను ప్రతివ్యక్తీ, తన సౌఖ్యాన్నే చూచుకొని, సమాజక్షేమాన్నీ, తలిదండ్రులను, చివరకు భార్యాబిడ్డల్నీ కూడ విసర్జించడానికి వెనుదీయడు. నాస్తికత్వం ప్రబలిపోతుంది. అతివృష్టి, అనావృష్టి, దుర్భిక్షము, దారిద్ర్యము, ఆకలిమంటలూ, అరాచకాలూ, తాండవిస్తాయి.

అయితే, కలికాలంలో ఒక్క సుగుణం మాత్రము ఉన్నది. కలిదోషభయము తొలగాలంటే, ఇంక ఏయుగములోనూ లేని తరణోపాయము ఈ యుగములోనే ఉన్నది. అది - ఆ పరమేశ్వరుని యొక్క నామాన్ని నిరంతరం ప్రేమ పూర్వకంగా స్మరిస్తుంటే, సమస్త పాపాలూ తొలగిపోయి, ఆయన యొక్క సాయుజ్యము లభించడమే ఆ విశిష్టత. శాస్త్రాధ్యయనము, తపస్సు, యోగాభ్యాసము, తీర్థయాత్రలు, వ్రతాలు, దానాలు మున్నగువాని ద్వారా లభించిన ఫలముకంటే, భగవానుని మనస్సులో స్మరించి, ఆయన కథలను విని, కీర్తించి, ఆయనను పూజించి, ధ్యానించితే ఇంకా ఉత్తమ ఫలితం లభిస్తుంది. కృతయుగంలో ధ్యాన సాధన ద్వారాను, త్రేతాయుగంలో యజ్ఞయాగాదుల ద్వారాను, ద్వాపరయుగంలో భగవదారాధన, అర్చన, పూజల ద్వారాను లభ్యమయ్యే మోక్షము కలియుగంలో దివ్యనామ సంకీర్తనం ద్వారా లభిస్తుంది.

## ప్రళయములు

### శ్రీశుకుడు చెపుతున్నాడు

"రాజా! కాలమానమును గురించి పరమాణువు నుండి కల్పము వరకు ఇదివరకు నీకు చెప్పాను కదా(3-5). నాలుగు యుగాలూ, వెయ్యిసార్లు పునరావృతం అయితే బ్రహ్మదేవునకు ఒకనాటి పగలు అవుతుంది. దీనినే ఒక కల్పం అంటారు. ఈ ఒక కల్పకాలములో పధ్నాలుగు మన్వంతరాలు గడుస్తాయి. బ్రహ్మదేవునకు విశ్రాంతి సమయం(రాత్రి) ప్రవేశించగానే ప్రళయం సంభవిస్తుంది. దీనినే నైమిత్తిక (దైనందిన-అవాంతర) ప్రళయం అంటారు. (బ్రహ్మ నిద్రించే నిమిత్తమై జరిగినది) ఈకాలము పగటి కాలమంత ఉంటుంది. ఈ సమయంలో, (బ్రహ్మ నిద్రించేటప్పుడు) పద్మముతో పాటు సమస్త విశ్వాన్నీ ఉపసంహరించుకొని, పద్మనాభుడు శేషశయనంపై విశ్రమిస్తాడు. బ్రహ్మయొక్క కాలమానములో 360 దినములు ఒక సంవత్సరము. అలాంటి ఒక వంద సంవత్సరాలు ఒక బ్రహ్మ ఆయుర్దాయము. అతని ఆయుర్దాయములో 50 ఏళ్లకొక పరార్థమంటారు. ఇప్పటికి అతని ఆయుర్దాయంలో మొదటి పరార్థం గడిచి, రెండవ పరార్థంలో మొదటి కల్పం జరుగుతున్నది.

బ్రహ్మయొక్క ఆయుర్దాయం ముగిస్తే మహాప్రళయం సంభవిస్తుంది. దానినే ప్రాకృతిక ప్రళయం అని కూడ అంటారు. ఈ ప్రళయానికి ముందుగా భూమి మీద ఒక వంద (మానవ) సంవత్సరాల పాటు వర్షాలు కురియవు. పంటలు పండవు. ఆకలితో ఒకరినొకరు భక్షించుకొంటారు. సముద్రాలు ఇంకిపోతాయి. పైనుండి సూర్యతాపము క్రిందినుండి సంకర్షణాగ్ని తాపము చేత భూమి కాల్చిన పేడముద్దలాగ బూడిద గుట్ట అయిపోతుంది. తరువాత ఒక వంద సంవత్సరాల పాటు పెనుగాలులు వీచుతాయి. ఆ తరువాత ఒక వంద సంవత్సరాలు కుంభవృష్టి కురిసి, అంతాజలమయం అవుతుంది. అప్పుడు నీటిలో (బూడిద అయిన) భూమి కరిగి, దాని సహజ గంధాన్ని కోల్పోతుంది. నీరు రుచిని కోల్పోయి, అగ్నిచే శుష్కింపజేయబడుతుంది. అగ్ని తేజస్సునుకోల్పోయి, వాయువులో

లీనమవుతుంది. వాయువు స్పర్శగుణాన్ని పోగొట్టుకొని, ఆకాశంలో కలిసిపోతుంది. ఆకాశము శబ్దగుణాన్ని కోల్పోయి, తామసాహంకారములో కలిసిపోతుంది. త్రిగుణాలతో కూడియున్న మూడు అహంకారాలూ మహత్తత్త్వంలో కలుస్తాయి. ప్రకృతి మహత్తత్త్వమును తనలోనికి తీసుకొంటుంది. ఈ స్థితిని, అవ్యాకృత ప్రకృతి అనీ, ప్రధానమనీ అంటారు. జగత్కారణమైన ఈ ప్రధానము, అనాది, నిత్యము, అవ్యక్తము అయియుండి, ఎల్లప్పుడూ పరమాత్మని ఆశ్రయించియుంటుంది.

జీవుడు, మాయ అనబడే ఈ ప్రధానమును (ప్రకృతిని) జ్ఞానము ద్వారా అధిగమించి, పరమాత్మలో లయించడాన్ని ఆత్యంతికప్రళయమంటారు. జీవరాసులన్నీ అనుక్షణమూ పూర్వావస్థను వీడి, మారుతునే ఉంటాయి. ఆ మార్పు పైకి కనిపించకపోయినా, జీవియొక్క శరీరము నిత్యమూ, పూర్వావస్థను విడిచి, మార్పుచెందడాన్ని నిత్యప్రళయం అంటారు: లేదా జీవరాసులు, నిత్యమూ నశిస్తూ క్రొత్తవి సృష్టింపబడుతుండడం కూడ నిత్యప్రళయమే.

రాజా! నిత్య, నైమిత్తిక, ప్రాకృతిక, ఆత్యంతిక ప్రళయాల గురించి తెలుసుకొన్నావు కదా! శ్రీమన్నారాయణుని లీలాగాథా వైభవాల గురించి విన్నావు కదా! ఇక నేను చెప్పవలసినదేదీ లేదు. ఈ సంసారసాగరము అపారము, దుస్తరము, దుఃఖమయము. దీనిని దాటాలంటే భగవత్కథాశ్రవణమే ఏకైక తరణోపాయము. ఈ భాగవతాన్ని అనిరుద్ధరూపుడైన నారాయణుడు, బ్రహ్మకు చెప్పగా, బ్రహ్మ నారదునకు నారదుడు నా తండ్రియైన కృష్ణద్వైపాయనునకు, ఆయన నాకు వినిపించారు. నేను నీకు వినిపిస్తుండగా ఈ సూతుడు కూడా విని, నైమిశారణ్యములో శౌనకాది ఋషులకు వినిపిస్తాడు: అని శ్రీశుకుడు చెప్పాడు.

## బ్రహ్మోపదేశము

శ్రీశుకుడు చెపుతున్నాడు: "రాజా! నీకు బ్రహ్మజ్ఞానాన్ని చెపుతున్నాను విను: 1. శ్రీమద్భాగవతములో భగవానుని పరమాత్మ తత్త్వము చెప్పబడినది. అతడే జగత్కారణుడు. బ్రహ్మరుద్రులు కూడ అతనినుండే ఉద్భవించారు. 2. జనన మరణాలు దేహానికే కలుగుతాయి. ఆత్మస్వరూపుడవైన నీకు చావు పుట్టుకలుండవు. 'నేను చనిపోతాను అనే భావము జ్ఞానము లేని జంతువులకుంటుంది, కాని, నీకు ఉండరాదు. 3. దేహము వేరు, ఆత్మవేరు. కట్టెవేరు, దానిలో నుండే అగ్నివేరు. 4. స్వప్నంలో నీయొక్క తల నరకబడినట్లు నీవు చూడగలవు. అలాగే నీలోనున్న ఆత్మ నీయొక్క శరీరానికి కలిగే అనుభవాలను ఒక సాక్షిగా చూస్తుంటుంది. స్వప్నంలో చంపబడిన నీవు నిజంగా చావనట్లే, శరీరం చనిపోయినా దానిలోనుండే ఆత్మ చావదు. 5. కుండవిరిగిపోయినప్పుడూ, గదిగోడలు పడిపోయినప్పుడూ, కుండలోని ఆకాశమూ (ఖాళీస్థలము), గదిలోని ఆకాశమూ, (నశించకుండా) బయటనున్న అనంతాకాశంతో కలిసిపోయి ఒక్కటే అయిపోయినట్లు, ఉపాధి (శరీరము) పతనమైనా అందలి ఆత్మ నశించక, అంతటా ఉన్న ఆత్మతో కలిసిపోతుంది. 6. జీవునకు దేహేంద్రియాలతో సంపర్కము మనస్సువలన కలుగుతుంది. మనస్సు మాయనుండి పుడుతుంది. ఆ మాయ(ప్రకృతిసంబంధం) వల్లనే జీవుడు వేరొక దేహాన్ని ధరిస్తుండడం జరుగుతుంది. 7. ఒక ప్రమిద, వత్తి, నూనె కలిసియున్ననూ అగ్నిలేనిదే జ్యోతి వెలుగనట్లు, ఆత్మలేనిదే దేహేంద్రియాలు పనిచెయ్యవు. కాని, దేహేంద్రియాలు లేకపోయినా ఆత్మ నిత్యమైయుంటుంది. 8. అగ్నిలేనిదే మంట ఉండదు. కాని మంట సమసిపోయినా అగ్ని నిలిచియుండునట్లు, అగ్నియే మంటలకు ఆధారమైనట్లు, ఆత్మయే దేహేంద్రియాల వ్యాపారాలకు ఆధారము. 9. ఈ విధంగా ఆత్మ విచారం చేసుకొని, అనంతుడు, అవినాశి, అయిన వాసుదేవునియందు పరిపూర్ణమైన భక్తి విశ్వాసాలను కలిగియుండుము. 10. బ్రాహ్మణశాప వశాన తక్షకుడు వచ్చి, నీ శరీరానికి కాటువేసి, దహింపజేయగలడు గాని నిన్ను చంపలేడు. ఏలనన నీవు ఉపాధిని విడిచిపెట్టి బంధాలను తొలగించుకొన్న ఈశ్వరుడవు. చావులేని వాడవు. నిన్ను ఏదీ చలింపజేయలేదు. 11. "అహం బ్రహ్మ, పరంధామ, బ్రహ్మో-హం పరమం పదం" (నేనే పరబ్రహ్మమును, పరంధాముడను, ఆపరమపదాన్ని అధిష్ఠించిన బ్రహ్మమును.) అని ధ్యాన నిష్ఠుడవైయుండగా, ఆ తక్షకుడువచ్చి, నీ దేహాన్ని కరచినా నీకు తెలియదు, నీవు ఆ బ్రహ్మముతో తాదాత్మ్యాన్ని

చెందియుంటావు 12. కనుక రాజా! నీవు తెలుసుకొనగోరినదంతా నీకు చెప్పాను. ఇంకా ఏమైనా తెలుసుకోవాలంటే అడుగుము చెప్తాను." అనగా పరీక్షిత్తు ఇలా అన్నాడు: "మహాత్మా! నేనెంతో ధన్యుడనైనాను. నీ యొక్క అనుగ్రహంచేత ఆది అంతాలు లేని శ్రీహరితత్త్వాన్ని వినిన నా అంతరంగం పరిశుద్ధమయినది. నేను పరిపూర్ణమైన ఆనందాన్ని అనుభవిస్తున్నాను. నా కోరికలు మాయమైనవి, దేహభ్రాంతి తొలగిపోయినది. ఇప్పుడు ఆ తక్షకుడే కాదు, స్వయంగా ఆ మృత్యుదేవతయే వచ్చి ఎదురైనా నాకు భయం లేదు. ఆ పరమేశ్వరుని పాదాలయందు నా మనస్సు లగ్నమయేవిధముగా నన్నాశీర్వదింప ప్రార్థిస్తున్నాను." అని, శ్రీశుకదేవుని పాదాలపై బడిన పరీక్షిత్తును శ్రీశుకుడు ఆశీర్వదించి, సెలవు తీసుకొన్నాడు. అక్కడ సమావేశమైన మునులందరూ నిష్క్రమించారు.

## పరీక్షిత్తు విముక్తి

పరీక్షిత్తు అన్యచింతలను వీడి, పరమాత్మయందు ధ్యానమగ్నుడయ్యాడు. ప్రాణచలనం లేకుండా, వృక్షములాగ స్తబ్దుడై మహాసమాధిని చెందాడు." అని చెప్పి సూతుడు ఇంకా ఇలా చెప్పాడు: బ్రాహ్మణబాలుని శాపం ప్రకారం కాటువెయ్యడానికి వస్తున్న తక్షకునికి, కశ్యపుడనే బ్రాహ్మణుడు ఎదురుపడ్డాడు. అతడు విషహరణ మంత్రవేత్త. రాజును రక్షించి, భూరికానుకలను పొందాలనే ఆశతో వెళ్తున్నాడు. తక్షకుడు అతనికి అడిగినంత ధనమిచ్చి, వెనుకకు పంపించివేశాడు. తక్షకుడు ఒక బ్రాహ్మణ వేషాన్ని ధరించి, రాజు వద్దకు వెళ్లి, కాటు వేశాడు. అప్పటికే పరీక్షిత్తు ముక్తావస్థను పొందియున్నాడు. తక్షకుని విషజ్వాలలకు అతని శరీరం భస్మమయినది. అతడు పరమేశ్వర సాయుజ్యాన్ని పొందాడు. దేవతలు పుష్పవృష్టిని కురిపించి, దుందుభులు మ్రోయించారు. గంధర్వులు గానం చేశారు.

జనమేజయుడు పరీక్షిత్తుయొక్క పుత్రుడు. అతడు తన తండ్రిని చంపిన తక్షకునిపై పగబూని, సర్పయాగం ప్రారంభించాడు. ఆ యాగంచే లోకంలోని సర్పాలన్నీ ఆహుతి కావాలని సంకల్పించాడు. తక్షకుడు భయపడి ఇంద్రుని శరణువేడుతాడు. చాలా సర్పాలు యాగాగ్నిలోనికి వచ్చి పడినా తక్షకుడింకా రాడేమి అని జనమేజయుడు బ్రాహ్మణులనడిగాడు. ఇంద్రుడు తక్షకునికి అభయమిచ్చాడని తెలుసుకొని, తక్షకునితో సహా ఇంద్రుడు కూడ వచ్చి అగ్నిలో పడేటట్టు మంత్రాలు పఠింపుడని బ్రాహ్మణులను ఆదేశించాడు. తక్షకునితో కూడ విమానంలో సంచరిస్తున్న ఇంద్రుడు, రథంతో సహా హోమకుండం వైపుకు ఆకర్షింపబడుతుండడం చూచిన దేవగురువైన బృహస్పతి జనమేజయుని వద్దకు వచ్చి వారించాడు: ఇలా అన్నాడు: "రాజా! ఈ తక్షకుడు అమృతపానం చేసిన వాడు గనుక చంపబడడు. నీ తండ్రిని చంపడానికి తక్షకుడు నిమిత్తమాత్రుడే సుమా! ప్రాణులు కర్మాధీనులు. ప్రారబ్ధకర్మయే శత్రువులు, చోరులు, అగ్ని, జలము, రోగము, దుర్ఘటనల రూపంలో వచ్చి, ప్రాణం తీస్తుంది. నీ తండ్రి మరణానికి ఈ కర్మయే కారణము. నిర్దోషులైన ఈ సర్పాలను ఈ విధంగా అగ్నికి ఆహుతి చెయ్యడం మహాపాపం అవుతుంది. దీనిని వెంటనే నిలుపుచేయించు" అని చెప్పగా, జనమేజయుడు తన తప్పిదాన్ని తెలుసుకొని, సర్పయాగాన్ని ఆపివేసి, బృహస్పతికి నమస్కరించాడు." అని, సూతుడు, మళ్లీ ఇలాగ చెప్పాడు: "ఈ విశ్వమంతా విష్ణుమాయచే ప్రవర్తిస్తుంది. విద్యావంతుడూ, ఉత్తమగుణ సంపన్నుడూ అయిన పరీక్షిత్తు ఒక దుష్టుని లాగ ప్రవర్తించి, ఒక మృత సర్పాన్ని ముని మెడలో వెయ్యడానికి కారణం విష్ణుమాయయే. ఆపరమేశ్వరుని యందు అచంచల భక్తివిశ్వాసం కలవారు మాత్రమే ఆ మాయను అధిగమించగలరు. జ్ఞానులు ఆత్మయందే రమిస్తారు. ఆత్మకానిదాన్ని- ఇదికాదు, ఇది ఆత్మకాదు - అని తిరస్కరిస్తూ, ఆత్మనే తెలుసుకొనగోరుతారు. వారికి అహంకారమమకారాలు, రాగద్వేషాలూ, శత్రుత్వ, మిత్రత్వాలు, మానావమానాలూ ఉండవు." అని, సూతుడు చెప్పగా, శౌనకముని ఇలా ప్రశ్నించాడు:

## ప్రణవము, వేదాలు, పురాణాలు

"ఓ సూతమహాశయా! వేదాలు ఎలాగ విభజింప బడినవో తెలియజేయుమని కోరుతున్నాము" అని అనగా, సూతుడిలా చెప్పాడు: "ఓ బ్రాహ్మణోత్తమా! ప్రణవము గురించి చెప్తాను విను. తొల్లి బ్రహ్మయొక్క

హృదయగుహనుండి, అతడు తీవ్రమైన ధ్యానమందు ఉండగా, ఒక అనాహత శబ్దం వెలువడినది. ఆ శబ్దము చెవులు మూసుకొని (బాహ్యశబ్దాలు సోకనివ్వకుండా) ధ్యానము చేసే వారందరికీ వినిపిస్తుంది. ఈనాదము మీద ధ్యానాన్ని కేంద్రీకరించి, యోగులు, బంధముక్తులై మోక్షాన్ని పొందుతారు. ఈ నాదము నుండియే అకార ఉకార మకారాలతో కూడియున్న ఓంకార శబ్దం వెలువడినది. ఈ ఓంకారమే నామరూప గుణరహితమైన పరమాత్మను, ఇంద్రియాలనరికట్టితే, హృదయమందు వ్యక్తపరుస్తుంది. ఈ ఓంకారమే, శబ్ద రూపములో వేదమై వెలసినది. ఇదే అన్ని మంత్రాలలోని బీజాక్షరము. ఈ ఓంకారము నుండే బ్రహ్మ అ నుండి హ వరకుగల అక్షర శబ్దాలనూ, వాటినుండి నాలుగు వేదాలనూ వెలువరించాడు. ఓంకారము యొక్క అకార ఉకార మకారాలు, మూడు గుణాలను (సత్త్వ రజ స్తమోగుణాలను), ఋక్, యజుఃసామ వేదాలను, భూఃభువఃసువః మూడు లోకాలను, జాగ్రత్ స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థలను, సూచిస్తాయి.

బ్రహ్మ తన చతుర్ముఖాలనుండి నాలుగు వేదాలను వెలువరించి, తన పుత్రులైన మరీచాది మహర్షులకు చెప్పాడు. వారు, తమ పుత్రులైన కశ్యపాదులకు చెప్పగా, అవి పరంపరగా వచ్చినవి. యజ్ఞాలలో నాలుగు వేదాలను నలుగురు ఋత్విక్కులు చదువుతారు. అధ్వర్యుు యజుర్వేదాన్నీ, ఉద్గాతసామవేదాన్నీ, హోత ఋగ్వేదాన్నీ చదువుతారు. బ్రహ్మ అనబడే ఋత్విజుడు, సమగ్ర నిర్వహణ చేస్తాడు. ద్వాపరయుగంలో పరాశరముని సత్యవతులకు నారాయణాంశతో జన్మించిన కృష్ణ ద్వైపాయనుడు (బాదరాయణుడు) అంతవరకూ స్పష్టమైన విభజనలేని వేదాలను వర్గీకరించి తీర్చిదిద్ది, వేద వ్యాసునిగా ప్రసిద్ధి గాంచాడు. అతడు తన శిష్యులైన పైలునకు ఋగ్వేదాన్నీ, జైమినికి సామవేదాన్నీ, సుమంతునకు అథర్వవేదాన్నీ అప్పజెప్పి, భద్రపరచి వ్యాపింపజేయుమన్నాడు. వాళ్లు తమకివ్వబడిన వేదాలను శాఖోపశాఖలుగా తమ శిష్యులచే అధ్యయనం, అభ్యాసము చేయించారు.

వైశంపాయనుని శిష్యులందరిలోనూ యాజ్ఞవల్క్యుడు అతిసూక్ష్మ గ్రాహీ, మేధావీను. గురువుగారికి ఎలాగో సంక్రమించిన బ్రహ్మహత్యా పాపాన్ని పరిహరింప జేయడానికి, అతని శిష్యులు కొందరు ఒక వ్రతాన్ని చేయపూనుకొన్నారు. తాత్కాలిక ఫలితాన్నిచ్చే ఇలాంటి వ్రతం చెయ్యడానికి బదులుగ తానే ఒక కఠిన వ్రతాన్ని ఆచరించి, శాశ్వత ఫలితాన్ని తెచ్చిపెట్టగలనని యాజ్ఞవల్క్యుడు గురువుగారితో చెప్పగా, అది వానియొక్క అహంకారమని భావించి, గురువు కోపగించి తన వద్ద నేర్చుకొన్న విద్యను కక్కివేసి పొమ్మన్నాడు. యాజ్ఞవల్క్యుడు ఆ విద్యనంతా అలాగే కక్కివేశాడు. అంతటి విలువైన విద్య నేలపాలు కారాదని, ఇతర శిష్యులు తిత్తిరి పక్షులై దానిని స్వీకరించారు. ఆవేద భాగానికితైత్తిరీయమనేపేరు వచ్చినది. అదే కృష్ణయజుర్వేదము. యాజ్ఞవల్క్యుడు మళ్లీ వేదజ్ఞానం పొందాలనే కాంక్షతో గాయత్రీ మంత్రార్థాలు వచ్చే స్తోత్రాలతో సూర్య భగవానుని ఆరాధించాడు. సూర్యుడు సంతసించి, అశ్వరూపంలో ప్రత్యక్షమై, అంతవరకూ ఎవ్వరికీ తెలియని మంత్రాలతో, అతనికి యజుర్వేదాన్ని అనుగ్రహించాడు. దీనినే శుక్లయజుర్వేదమంటారు.

వేదవ్యాసుడు అష్టాదశపురాణాలను రచించి, తన శిష్యుడైన రోమహర్షణునకు అప్పజెప్పాడు. ఆ పురాణ సంహితలను అతడు త్రైయారుణి, కశ్యప, సావర్ణి మొదలైన ఆరుగురు శిష్యులచే అధ్యయనం చేయించాడు. నేనూ (రోమహర్షణుని పుత్రుడైన సూతుడు) శిష్యులైన సావర్ణీ, అకృతవర్ణుడూ, వ్యాసపుత్రుడైన శుకుని నుండి నాలుగు మూలసంహితలను అధ్యయనం చేశాము. పురాణాల్లో సృష్టి, ప్రళయము, స్థితి, పోషణము, మన్వంతరాలు, వంశాలు, రాజుల చరిత్రలు, మోక్షము, శుభాశ్రయము వివరింపబడ్డాయి: అష్టాదశ పురాణాలు, వాటిలోని శ్లోకాల సంఖ్యలు ఇవి: 1. బ్రహ్మపురాణము (పదివేలశ్లోకాలు), 2. పద్మపురాణము (55వేలు) 3. విష్ణుపురాణము (23వేలు) 4. శివపురాణము (34వేలు) 5. భాగవత పురాణము (18 వేలు) 6. నారద పురాణము (25 వేలు) 7. మార్కండేయ పురాణము (9 వేలు) 8. అగ్ని పురాణము (15,400) 9. బ్రహ్మవైవర్తపురాణము (18 వేలు) 10. భవిష్య పురాణము (14,500) 11. లింగ పురాణము (11 వేలు), 12. వరాహ పురాణము (24 వేలు) 13. వామన పురాణము (10 వేలు)

14. కూర్మ పురాణము (17 వేలు) 15. మత్స్య పురాణము (14 వేలు) 16. గరుడ పురాణము (19 వేలు) 17. బ్రహ్మాండ పురాణము (12 వేలు) 18. స్కంద పురాణము (81,100) మొత్తము శ్లోకముల సంఖ్య నాలుగు లక్షలు.

## మార్కండేయుని అద్భుత అనుభూతి

**శౌనకుడు సూతుని ఇలా అడిగాడు**

"ఓ సూతమహాశయా! మా సందేహాలను తీర్చగల మహానుభావుడవు నీవే గనుక అడుగుతున్నాను. చిరంజీవియైన మార్కండేయ మహర్షి కల్పాంతంలో, వటపత్రశాయి అయిన పరమేశ్వరుని దర్శించాడంటారు కదా! అది ఎలాగ సంభవమైనది? ఇంకా కల్పాంతం కాలేదు కదా! పోనీ, అతడు గతకల్పంలో జన్మించియుంటే, కల్పాంత ప్రళయంలో సర్వమూ లయించిపోగా, అతడొక్కడే ఎలాగ మిగిలిపోయి ప్రళయాన్నీ వటపత్రశాయినీ చూడగలిగాడు? ఈ రహస్యమేమిటో మాకు తెలియజేయగోరుతున్నాము." అనగా సూతుడిలా చెప్పాడు. "ఓ మహర్షీ! మృకండుని పుత్రుడైన మార్కండేయ మహర్షి పొందిన దివ్యానుభూతి అతి అద్భుతమైనట్టిది. అతడు, ఉపనయనాది సంస్కారాలు, వేదశాస్త్రాది అధ్యయనాలు ముగిసిన తరువాత, ఆజన్మ బ్రహ్మచర్య దీక్షను పూని, సన్న్యాసియై, తపఃస్వాధ్యాయ నిష్ఠుడై, ఇంద్రియమనస్సులను జయించిన వాడై, ద్వంద్వాతీతుడై, సమాధిలో భగవంతునియందు మనస్సును లగ్నంచేసి, అనేకవేల సంవత్సరాలు ధ్యానమగ్నుడై యుండగా, వర్తమాన కల్పంలోని, ఆరుమన్వంతరాలు గడిచి, ఏడవమన్వంతరం ప్రవేశించినా, అతడు తన తపస్సును ముగించలేదు. ఇంద్రపదవిని ఆశించి అతడు ఇలాగ తపస్సు చేస్తున్నాడని అనుమానించిన ఇంద్రుడు మన్మథునితో సహా పుంజకస్థలి అనే అప్సరసను, ఇతర సుందరీ మణులను, గంధర్వులను, వసంత ఋతువునూ పంపించి, మార్కండేయుని తపస్సును భగ్నంచెయ్యవలెనన్నాడు. మార్కండేయుడు మూర్తీభవించిన అగ్నిలాగ తేజరిల్లుతున్నాడు. మన్మథుడూ, అతని అనుచరులూ కూడి తమ శక్తియుక్తులన్నిటినీ ఆ ఋషిపై ప్రయోగించారు. అప్సరసలు తమకు తెలిసిన హావభావచేష్టలన్నిటినీ ప్రదర్శించారు. అన్నీ వ్యర్థమైపోయాయి. అందరూ అలసిపోయారు. విసిగిపోయి, తమ ఓటమిని గ్రహించి, సిగ్గుపడి, ఖిన్నులై, వెనుకకు మరలిపోయి, ఇంద్రునకు తమ ఓటమిని, చెప్పుకొన్నారు. ఆ ఋషి ఇంద్రపదవిని ఆశించిన వాడైతే తప్పకుండా మన్మథుని బాణాలకూ అప్సరసల అస్త్రాలకూ ఆహుతి అయిపోయేవాడే. వాటికి చలించకుండా తన తపస్సును కొనసాగించుకొంటున్నాడు గనుక అతనికి ఇంద్రపదవిపై ఆసక్తి ఉండదు అని ఇంద్రుడు ఊరుకొన్నాడు.

మార్కండేయుని తపస్సునకు మెచ్చి, భగవంతుడు నరనారాయణుల రూపంలో దర్శనమిచ్చాడు. మార్కండేయుడు వారికి సాష్టాంగదండ ప్రణామాలు చేసి, వారిని సత్కరించి, ఆనందబాష్పాలతోను, గద్గద స్వరముతోను, నోటమాటరాక, తొట్రుపాటుతో వారిపాదాలను కడిగి, బ్రహ్మానందముతో - ఇలా స్తుతించాడు: "హే ప్రభో! ఈ నరనారాయణుల రూపములో, నీ దర్శన భాగ్యాన్ని నాకు కలిగించిన నీయొక్క అపార కృపా విశేషాన్ని, మానవమాత్రుడనైన నేనెలాగ వర్ణించగలను? బ్రహ్మరుద్రాది దేవతలు కూడ నిన్ను పూర్తిగా తెలుసుకొనలేరు, వర్ణించలేరు కదా! బ్రహ్మ రుద్రాదులతో సహా అందరూ నీచేతనే సృష్టింపబడిన వారైనప్పటికీ, నిన్ను ఆరాధించే నీయొక్క భక్తులకే నీవు ఆత్మబంధుడవై అనుగ్రహిస్తావు. నీ భక్తులైన సాధుసజ్జనులను రక్షించడానికీ, సంసార పంకిలంనుండి ఉద్ధరించడానికీ, నీవు ఎలాంటి అవతారాన్నయినా ధరించడానికి వెనుదీయని కరుణాసాగరుడవు. నీ పాదారవిందాలను ఆశ్రయించిన వారు మాయా మోహాలతో కూడిన ఈ సంసారసాగరాన్ని అవలీలగా దాటి, ఆనంద సాగరంలో తేలియాడగలరు. సర్వేశ్వరా! నీ పాదపద్మాలు తప్ప, మానవులు కోరదగిన ఉత్తమ పురుషార్థమింకేమున్నది. బ్రహ్మలోక ప్రాప్తికూడ అంతమొందేదే కదా! వేదవేదాంతాల్లో చెప్పబడిన పరబ్రహ్మవు నీవు. ఆది అంతములు లేని అనంతుడవు. ఏకైక పరమాత్మవైన నీకు నేను నమస్కరిస్తున్నాను." అని స్తుతించిన మార్కండేయుని యెడల ప్రసన్నుడైన నారాయణుడు సంతసించి, ఏదైనా వరము కోరుకొనుమన్నాడు.

అప్పుడు మార్కండేయుడు ఇలా అన్నాడు: "దేవదేవా! నీయొక్క దర్శన భాగ్యము లభించిన నాకు ఇంకా ఏ కోరికలుంటాయి? కాని, ఓ పరమేశ్వరా! అనంతశక్తి సంపన్నుడవైన నీవు కొనసాగించే సృష్టి స్థితి లయ కార్యక్రమానికి, ఆధార భూతమైన నీ యొక్క అద్భుతమైన మాయాశక్తిని ఒకసారి చూడాలనే కోరికగానున్నది." అని విన్నవించగా, సరే అని నరనారాయణులు బదరికాశ్రమానికి వెళ్లి పోయారు.

మార్కండేయుడు అగ్నియందు, ఆకాశమందు, సూర్యునియందు, చంద్రునియందు, నీటియందు, వాయువునందు, భూమియందు, తన హృదయమునందూ సర్వత్రా ఆ పర్మేశ్వరునే దర్శిస్తుండేవాడు. ఆ స్థితిలో తన్ను తాను మరచిపోవడమే కాకుండా, ధ్యానము చేస్తున్నట్టు కూడ ధ్యాస లేకుండా ఉండేవాడు. ఒకనాడు ఆ ఋషి పుష్పభద్రానదీ తీరాన ధ్యానము చేస్తుండగా ఒక భయంకరమైన పెనుగాలి వీచినది. దానితో ఆకాశం బ్రద్దలైనట్లు శబ్దం వచ్చిఉరుములు మెరుపులతో కుంభవృష్టి కురియ నారంభించినది. చూస్తుండగనే నాలుగు వైపులనుండి సముద్ర జలాలు ముంచుకొస్తున్నాయి. అంతా అంధకారమయం. జీవరాసులన్నీ, మునిగిపోయాయి. అంతా జలమయం. జలము అంతరిక్షాన్నీ దానిపైలోకాల్లోనూ ప్రవేశిస్తున్నది. విశ్వమంతటికీ తానొక్కడు మాత్రము తేలుతూ, ఇటూ అటూ కొట్టుకొనిపోతూ, చేపలూ, మొసళ్లూ కరుస్తుండగా, ఆకలి దప్పికలతో అలమటించిపోతూ, ఎన్నివేల సంవత్సరాలు అలాగ గడిపాడో తెలియదు. ఆగాథాంధకారంలో దూరంగా ఒక దివ్యతేజోకిరణం కనిపించినది. అలలు అతనిని ఆ వెలుగు వైపుకు నెట్టివేయగా, అక్కడ ఒక చిన్న ద్వీపము దానిమీద ఒకే ఒక చిన్న, లేత వటవృక్షము, దానికి ఈశాన్యంవైపున ఉన్న కొమ్మపై ఒక దొప్పలాంటి ఆకులో ఒక చిన్నారి శిశువు తన కాలి బొటనవ్రేలును నోటనుంచుకొని, ఆడుకొంటూ ఉండడం చూశాడు. ఆ శిశువు వెదజల్లే ఆ దివ్యకాంతియే అక్కడి గాఢాంధకారాన్ని తొలగిస్తున్నది. దివ్యమోహనాకారుడైన ఆ బాలుని చూడగనే మార్కండేయుడు ఇన్నివేల సంవత్సరాలుగా అనుభవిస్తున్న బాధల్ని మరచిపోయి, ఆనంద పరవశుడయ్యాడు. ఆ బాలుని దగ్గరకు వెళ్లి చూడాలనే కోరిక కలుగగా, మార్కండేయుడు సూక్ష్మరూపము ధరించి బాలుని వద్దకు వెళ్లాడు. వెళ్లిన వెంటనే అతడు ఆ బాలుని ఊపిరితో, అతని కుక్షిలోనికి పీల్చబడ్డాడు. ఆ బాలుని కుక్షిలో, మూడులోకాలూ, నదులూ, పర్వతాలూ, నగరాలూ, జీవరాసులూ అన్నీ ఆ జలప్రళయం రాకముందు ఎలాగుండేవో అలాగే కనిపించాయి. పుష్పభద్రానదీ తీరాన నున్న తన యొక్క ఆశ్రమం కూడా కనిపించినది. అంతలో అతడు, ఆ బాలుని ఊపిరితో మళ్లీ బైటకు వచ్చేసి, ఆ వటపత్రశాయిని దర్శించాడు. ఆ బాలుడు చిరునవ్వుతో క్రీగంట చూస్తూ, ఆహ్వానిస్తున్నట్టు కనిపించగా, అతనిని ఆలింగనం చేసుకొని ముద్దాడాలని మార్కండేయునికి ప్రగాఢమైన కోరిక కలిగినది. అతడు సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడే అని గ్రహించిన ఋషి, అతనిని ఎత్తుకోవాలని చేయిచాచి, ముట్టుకొనే సరికి, బాలుడు అదృశ్యమై, మార్కండేయుని హృదయంలో ఆసీనుడైనాడు. బాలునితోపాటు ఆ వటవృక్షం, జలప్రవాహం, అన్నీ మాయమైపోయి, ఋషి, యథాతథంగా తన ఆశ్రమంలోనే ఉన్నాడు. ఈ విధంగా, మార్కండేయుడు, మహావిష్ణువు యొక్క మహావైభవాన్నీ, ఎప్పుడో కల్పాంతంలో జరుగనున్న ప్రళయాన్నీ, శ్రీహరి అనుగ్రహంచేత తిలకించగలిగాడు.

మార్కండేయుని నిశ్చలతత్త్వప్రకాశాన్నీ, గొప్పతనాన్నీ చూచిన శివపార్వతులు సంతసించి, అతనికి వరాలనివ్వాలని వచ్చారు. మార్కండేయుడు, తన దేహముపైనను, పరిసరాలపైననూ ఏ మాత్రమూ ధ్యాసలేకుండా ధ్యానమగ్నుడై యుండటంచేత జగన్మాతా పితలరాకను తెలుసుకొనలేకపోయాడు. అతని స్థితిని గ్రహించిన శివుడు అత్యంత ప్రేమతో ఋషి యొక్క హృదయంలో ప్రవేశించి, దశహస్తాలతోను, ఆయుధాలతోను, దివ్యతేజస్సుతోనూ, దర్శనమివ్వగానే, అతడు కన్నులుతెరచి, ప్రత్యక్షముగా పార్వతీ పరమేశ్వరులనూ, ప్రమథగణాలనూ చూచి, ఆశ్చర్యచకితుడయ్యాడు. శివపార్వతులకు ప్రణమిల్లి అర్ఘ్యపాద్యాలతో సేవించి, వారిని స్తుతించి, తనవలన కాగల సేవ ఏమిటో సెలవిమ్మన్నాడు. మహేశ్వరుడు మిక్కిలి సంతసించి ఇలా అన్నాడు: "తాపసోత్తమా! నీ చరిత్ర అద్వితీయమైనట్టిది. నీవు శ్రీహరి యొక్క సంపూర్ణమైన అనుగ్రహాన్ని పొందియున్నవాడవు. సద్బ్రాహ్మణులు

త్రిమూర్తులమైన మాకునూ పూజనీయులే. జపతపాదిసాధనల కంటే పుణ్యమూర్తులైన సాత్త్వికులూ, గుణాతీతులూ అయిన బ్రాహ్మణులను పూజిస్తే పాపాలు నశిస్తాయి. అట్టివారి దర్శనమాత్రముచేత ప్రజలు పవిత్రులౌతారు. మార్కండేయా! నీవేదైనా వరం కోరుకొనుము." అని చెప్పిన మహేశ్వరునితో మార్కండేయుడిలా అన్నాడు: "హేమహేశ్వరా! నీదయ అపారము, దేవదేవుడవైన నీవు పాంచభౌతికమైన ఒక దేహధారిని గురించి చెప్పిన ఈ అమృతవాక్కులు, నీ యొక్క భక్త వత్సలతను నిరూపిస్తున్నాయి. జగత్పిత, జగన్మాతలైన మీయొక్క దర్శన భాగ్యము కంటె నాకు ఇంకేమి కావాలి? నీయందునూ, శ్రీహరి యందునూ, భగవద్భక్తులయందునూ నాకు అచంచలమైన భక్తి ఎల్లప్పుడూ ఉండేటట్టు అనుగ్రహించు." అనగా, పరమేశ్వరుడు సంతసించి, ఇలా అన్నాడు: "ఓ మహర్షీ! నీవు, శ్రీహరియందు నిశ్చల భక్తి కలవాడవై, కల్పాంతము వరకూ జరామరణాలు లేనివాడవై, సత్కీర్తితో ప్రకాశిస్తుంటావు. వైరాగ్యమూ, త్రికాలజ్ఞానమూ కలవాడవై, బ్రహ్మ వర్చస్సుతో శోభిల్లుతావు. నీపేరుతో ఒక పురాణాన్ని ప్రవచించే ఆచార్యుడవు అవుతావు." అని, ఆశీర్వదించి, పరమశివుడు పార్వతీదేవితోను అనుచరులతోను, నిష్క్రమించాడు. మార్కండేయుడు శ్రీహరియందు ఏకాంతభక్తియుక్తుడై, మహాజ్ఞాన యోగియై, ఇప్పటికీ స్వేచ్ఛా విహారియై యున్నాడు.

ఈ మార్కండేయుని సచ్చరిత్రనూ, మహావిష్ణువు యొక్క మాయా విశేషాన్నీ చదివిన వారూ, వినిపించిన వారూ, విన్నవారూ విష్ణుమాయను దాటి వేయగలరు." అని సూతుడు శౌనకాది ఋషులకు చెప్పాడు.

## భగవంతుడు

ఓ సూతమహాశయా! తంత్రశాస్త్రానుసారముగ క్రియాయోగ పద్ధతిలో భగవదారాధన గురించి, మాకు తెలియజేయుము." అని శౌనకుడు కోరగా, సూతుడు ఇలాగ చెప్పాడు:

"ఈ బ్రహ్మాండము, భగవన్మాయ యొక్క క్రియారూపమైన ప్రకృతి యొక్క వికారము (మార్పులతో ఏర్పడిన ఆకారము). ఈ బ్రహ్మాండము, మహత్తత్త్వము, అహంతత్త్వము, పంచభూతాలు, కాలము, వికారములు, అనే వాటితో ఏర్పడినది. (వికారములు=దశేంద్రియాలు, మనస్సు, పంచతన్మాత్రలు)

ఇదే భగవానుని విరాట్ స్వరూపము, నారాయణుని దివ్యరూపము. ఈ విరాట్ పురుషుని పాదములు-భూమి, శిరస్సు-అంతరిక్షము, నాభి-ఆకాశము, నేత్రాలు-సూర్యుడు, నాసిక-వాయువు, బాహువులు-దిక్కులు, జననేంద్రియం-ప్రజాపతి, అపానము-మృత్యువు, భుజాలు-లోకపాలురు, మనస్సు-చంద్రుడు, రోమాలు-వృక్షాలు, సమస్త జీవరాసులయొక్క చైతన్యమే కౌస్తుభమణియై ప్రకాశిస్తున్నది. శ్రీవత్సచిహ్నమే-సమిష్టి జ్ఞానము. వనమాలయే-గుణాలతో కూడియున్న మాయ, ఆయన యొక్క పట్టు పీతాంబరాలే-గాయత్రీఛందస్సు, వేదాలు ఆయన బ్రహ్మసూత్రము (జందెమే)-అకార ఉకార మకారాలతో కూడిన ఓంకారము. ఆయనయొక్క మకరకుండలాలు-సాంఖ్యమూ, యోగమూ. ఆయన కిరీటము-బ్రహ్మలోకము, ఆయన యొక్క ఆసనమే-(అనంతుడే)-మూలప్రకృతి, ధర్మము, జ్ఞానము, ఐశ్వర్యము, యశస్సు, శ్రీ, వైరాగ్యము అనే ఆరు దివ్యగుణాలూ, విమల, ఉత్కర్షిణి, జ్ఞాన, క్రియ, యోగ, ప్రాహ్వి, సత్య, ఈశాన, అనుగ్రహ, అనే తొమ్మిది దివ్యశక్తులూ కలిసియున్న శుద్ధ సత్త్వమే ఆయన ఆసీనుడైయుండే పద్మము. ఓజస్సు (ఇంద్రియశక్తి), సహస్సు (మనశ్శక్తి), ప్రాణశక్తులతో కూడియున్న శక్తియే ఆయన యొక్క కౌమోదకీ గద. జలతత్త్వమే శంఖము, తేజస్తత్త్వమే సుదర్శన చక్రము. ఆకాశతత్త్వమే ఖడ్గముగా భాసిస్తుంటాయి. ఆయనయొక్క దేహవర్ణము-నీలము, డాలు-తమస్సు, ధనుస్సు-కాలము, అమ్ములపొది-కర్మరాశి, బాణాలు-ఇంద్రియాలు, రథము-సంకల్పము. రథముయొక్క అలంకరణలు-పంచతన్మాత్రలు. భగవంతుడు అనే పేరుకు అర్థము-జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సు లనబడే షడైశ్వర్యాలున్న వాడు అని. భగవంతుని చేతిలోని పద్మము, ఈ ఆరు లక్షణాలకు ప్రతీకము, వైకుంఠము, ఆయనయొక్క స్థానము, గరుడుడు-ఋుక్యజుఃసామాలు,

లక్ష్మి భాస్కరుని ఎన్నడూ విడిచియుండని తేజస్సులాగ భగవంతుని ఎల్లప్పుడూ అంటిపెట్టుకొనియుండే శక్తి. నందాదులైన అష్టపార్షదులు-అణిమాది అష్టసిద్ధులు. సేనానియైన విష్వక్సేనుడు-తంత్రము. నారాయణుడే-వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనబడే నాలుగు మూర్తులై వ్యక్తమౌతాడు. భగవానుడే జాగ్రత్ స్వప్న సుషుప్తి, ముక్త, అవస్థలలో, విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, తురీయుడు అనబడుతాడు. జాగ్రదవస్థాభిమానియైన వైశ్వానరుడే అనిరుద్ధుడు, స్వప్నావస్థాభిమానియైన తైజసుడే సంకర్షణుడు, సుషుప్తి అవస్థాభిమానియైన ప్రాజ్ఞడే ప్రద్యుమ్నుడు, ముక్తావస్థాభిమానియైన తురీయుడే వాసుదేవుడు. భగవంతునియొక్క అనిరుద్ధశక్తి సృజిస్తుంది. ప్రద్యుమ్నశక్తి పాలిస్తుంది. సంకర్షణశక్తి సంహరిస్తుంది, వాసుదేవశక్తి ముక్తినిస్తుంది. భగవానుడే బ్రహ్మయందు అంతర్యామియై సృష్టినీ, రుద్రుని యందు అంతర్యామియై సంహారము చేస్తూ, తానే స్వయంగా రక్షణ పోషణ చేస్తాడు.

సర్వస్వానికీ ఆ భగవానుడే కారణమైన వాడు, సర్వసాక్షి, స్వయం ప్రకాశుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, పరిశుద్ధాంతరాత్ములైన యోగులకు, భక్తులకు తప్ప, ఇంకెవ్వరి దేహేంద్రియ మనోబుద్ధులకును గోచరింపని వాడు. ఆనందానికి నిధి. అందరినీ ఆనందింపజేసేవాడు. ఈ లక్షణాలన్నీ ఉన్న శ్రీకృష్ణుడే భగవంతుడు. అతని నామమును, సత్కీర్తి గాథలనూ, వినినంత మాత్రము చేతనే సర్వపాపపరిహారమూ, సకల మంగళాలూ, పుణ్యఫలాలూ కలుగుతాయి. శ్రీకృష్ణ భగవానుడు మానవ మాత్రులమైన మనల్ని కాపాడుగాక!" అని సూతుడు చెప్పగా, శౌనకుడు ఇలా అర్థించాడు:

## సౌరవ్యూహము

శౌనకుడు:- "ఓ పుణ్యశీలుడా! శ్రీహరి సూర్యరూపములో ఏడుగురు అనువర్తులతో నెలకొక నామముతో ఉపాసింపబడుతుంటాడు కదా! ఆ సూర్య వ్యూహము గురించి చెప్పగోరుతున్నాను." అనగా సూతుడు ఇలా చెప్పాడు:

"అనాది, అవిద్యయైన విష్ణుమాయచే సృజింపబడిన సూర్యుడు, విష్ణువు యొక్క తేజస్సుతో పుంజుకొని, లోకాలను ఉత్తేజపరచి, పరిభ్రమిస్తుంటాడు. కాలవిభజనకు, వైదిక కర్మలకు సూర్యరూపుడైన భగవానుడే ఆధారభూతుడు. అతడే తొమ్మిది విధాలుగా ప్రవర్తిస్తాడు: కాలము, దేశము, క్రియ, సాధనము, యజమానుడు, అపూర్వము, ఆగమము, ద్రవ్యము, ఫలము. పన్నెండు మాసాలలో పన్నెండు గణాలతో కూడి, సంచరిస్తుంటాడు. ప్రతి గణములో ఒక్కొక్క ఋషీ, గంధర్వుడూ, అప్సరస, నాగుడు, యక్షుడు, రాక్షసుడూ, ఉంటూ, సూర్యునితో సంచరిస్తుంటారు. నెలకొక నామమును వహించి, వ్యవహరించే సూర్యునితో సహా ఏడుగురు (సౌరగణసప్తకం) నెలకొక గణంగా ఏర్పడి (ఈ క్రింది విధంగా మారుతూ) భ్రమణం చేస్తుంటారు.

**నెలనెలా మారుతుండే సౌరగణ సప్తకం పేర్లు : -**

చైత్రములో : - సూర్యుడు ధాత, అప్సరస - కృతస్థలి, రాక్షసుడు - హేతి, నాగుడు - వాసుకి, యక్షుడు - రథకృత్తు, ఋషి - పులస్త్యుడు, గంధర్వుడు - తుంబురుడు.

వైశాఖములో - సూర్యుడు - అర్యముడు, అప్సరస - పుంజికస్థలి, రాక్షసుడు - ప్రహేతి, నాగుడు - కచ్ఛనీర, యక్షుడు - అథౌజ, ఋషి - పులహుడు, గంధర్వుడు - నారదుడు.

జ్యేష్ఠములో : - సూర్యుడు - మిత్రుడు, అప్సరస - మేనక, రాక్షసుడు - పరుషేయుడు, నాగుడు - తక్షకుడు, యక్షుడు - రథస్వన, ఋషి - అత్రి, గంధర్వుడు - హాహా.

ఆషాఢములో - సూర్యుడు - వరుణుడు, అప్సరస - రంభ, రాక్షసుడు - చిత్రస్వనుడు, నాగుడు - శుక్ర, యక్షుడు - సహజన్య, ఋషి - వసిష్ఠుడు, గంధర్వుడు - హూ హూ.

శ్రావణములో :- సూర్యుడు - ఇంద్రుడు, అప్సరస - ప్రమ్లోచన, రాక్షసుడు - వర్యుడు, నాగుడు - ఏలాపుత్ర, యక్షుడు - శ్రోత, ఋషి - అంగిరస, గంధర్వుడు - విశ్వావసువు.

భాద్రపదములో :- సూర్యుడు - వివస్వంతుడు, అప్సరస - అనుంలోచ, రాక్షసుడు - వ్యాఘ్ర, నాగుడు - శంఖపాల, యక్షుడు - అసారణ, ఋషి - భృగు, గంధర్వుడు - ఉగ్రసేన.

ఆశ్వయుజములో :- సూర్యుడు - త్వష్ట, అప్సరస- తిలోత్తమ, రాక్షసుడు - బ్రహ్మాపేత, నాగుడు - కంబల, యక్షుడు - శతజిత్, ఋషి - జమదగ్ని, గంధర్వుడు - ధృతరాష్ట్ర.

కార్తీకములో :- సూర్యుడు - విష్ణు, అప్సరస - రంభ, రాక్షసుడు - మఖాపేత, నాగుడు - అశ్వతార, యక్షుడు - సత్యజిత్, ఋషి - విశ్వామిత్ర, గంధర్వుడు - సూర్యవర్చ.

మార్గశీర్షములో :- సూర్యుడు - అంశుడు, అప్సరస - ఊర్వశి, రాక్షసుడు - విద్యుచ్ఛత్ర, నాగుడు - మహాశంఖ, యక్షుడు - తార్క్ష్య, ఋషి - కశ్యప, గంధర్వుడు - ఋతసేన.

పుష్యములో :- సూర్యుడు - భగుడు, అప్సరస - పూర్వచిత్తి, రాక్షసుడు - స్ఫూర్జ, నాగుడు - కర్కోటకుడు, యక్షుడు - ఊర్ణ, ఋషి - ఆయువు, గంధర్వుడు - అరిష్టనేమి.

మాఘములో :- సూర్యుడు - పూషుడు, అప్సరస - ఘృతాచి, రాక్షసుడు - వాత, నాగుడు - ధనంజయ, యక్షుడు - సురుచి, ఋషి - గౌతమ, గంధర్వుడు - సుషేణ.

ఫాల్గుణములో :- సూర్యుడు - పర్జన్య, అప్సరస - సేనజిత్తు, రాక్షసుడు - వర్చ, నాగుడు - ఐరావత, యక్షుడు - క్రతు, ఋషి - భరద్వాజ, గంధర్వుడు - విశ్వ.

భగవానుడే సూర్యరూపములో, ప్రతిదినమూ, లోకులకు దర్శనమిస్తుంటాడు. సూర్యభగవానుని దివ్య విభూతులను ప్రతిదినమూ ఉభయ సంధ్యలలో స్మరించే వారివద్దకు పాపతిమిరాలు చేరలేవు. సౌరగణ సప్తకాలలోని ఋషులు, భగవానుని ఋగ్యజుఃసామాలతో స్తుతిస్తుంటారు. గంధర్వులు తమగాన సంకీర్తనలతోనూ, అప్సరసలు నృత్యములతోనూ అతనిని రంజింపజేస్తారు. నాగులు, సూర్యరథాన్ని సడలిపోకుండా గట్టిగా బంధించి ఉంచుతారు. యక్షులు రథాన్ని పూన్చి సిద్ధపరచి ఉంచుతారు. రాక్షసులు రథాన్ని వెనుకనుండి తోస్తారు. వాలఖిల్యులు అనబడే అరవైవేలమంది బ్రహ్మజ్ఞానులైన ఋషులు, సూర్యభగవానుని స్తుతిస్తూ, సూర్యునికి అభిముఖంగా నిల్చొని, సూర్యునితో పాటే ముందుకు సాగిపోతుంటారు. ఈ విధంగా ఆద్యంతాలు లేని భగవానుడు సూర్యరూపంలో, అహరహం లోకాలను అనుగ్రహిస్తూ కాపాడుతుంటాడు. అని చెప్పి సూతుడు, సర్వమయుడైన వాసుదేవుని స్మరించి ముగించాడు.

## శ్రీమద్భాగవత సంక్షిప్త విషయసూచిక

శ్రీమద్భాగవత పురాణ ప్రవచనాన్ని సమాప్తం చేయసంకల్పించి, మహాత్ముడైన సూతుడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని, భాగవతాన్ని, లోకానికి అందించిన చతుర్ముఖ బ్రహ్మనూ, నారద మహర్షినీ, వ్యాసభగవానునీ, శుకయోగీంద్రునీ స్మరించి, నమస్కరించి, శౌనకాది ఋషులతో ఇలా చెప్పాడు:

"మునీంద్రులారా! ఈ భాగవతపురాణము పరమాద్భుతమైనది. శ్రవణమాత్రాన పాపాలు హరించిపోతాయి, బంధాలు తొలగిపోతాయి. ఇందు, జగత్సృష్టి స్థితిలయాలకు కారకుడైన పరమేశ్వరుని గురించిన జ్ఞానము చెప్పబడినది. ప్రకృతిపురుషజనితమైన సృష్టి రహస్యమును భగవంతుని రూపగుణ విశేషాలనూ, పరమభాగవతుల చరిత్రలనూ, జ్ఞాన వైరాగ్యాలతో కూడిన భక్తియోగమునూ, ఇందు, వివరించుట జరిగినది.

పాండవ పౌత్రుడైన పరీక్షిత్తు జననము, విప్రశాపము, శ్రీశుకుడు భాగవతగాథను పరీక్షిత్తుకు చెప్పనారంభించడం, నారదుని జన్మము, నారద బ్రహ్మ సంవాదము, భగవంతుని అవతార వివరణ, విదుర ఉద్ధవ సంభాషణం, విదురమైత్రేయుల సంభాషణ, సృష్టి క్రమము, ప్రళయముల వివరణ, విరాట్ పురుషుని ఆవిర్భావము, కాలగతి, ఆదివరాహ రూపంలో విష్ణువు హిరణ్యాక్షుని వధించడం, స్వాయంభువమనువు, శతరూపలు, ఆదిదంపతులుగ ఉద్భవించడం చెప్పబడినది.

కర్దమ ప్రజాపతి, దేవహూతులకు శ్రీహరి, కపిలునిగా జన్మించడం, కపిలుడు తల్లియైన దేవహూతికి యోగమునుపదేశించడం, దక్షయజ్ఞ ధ్వంసము, ధ్రువచరిత్ర, ప్రియవ్రతుని చరిత్ర, భరతుని చరిత్ర, వృత్రాసురుని చరిత్ర, ప్రహ్లాదుని చరిత్ర, గజేంద్రమోక్ష గాథ, కూర్మావతారము, క్షీరసాగర మథనము, రాజుల వంశవర్ణన, సుకన్య చరిత్ర, మాంధాత, శౌభరి, సగరుడు, భగీరథుడు, మొదలైన రాజుల చరిత్రలు, గంగావతరణము, శ్రీరామచంద్రుని చరిత్ర, పరశురాముడు, యయాతి, నహుషుడు, దుష్యంతుడు, శంతనుడు, యదువు, మొదలైన వారి చరిత్రలూ వర్ణింపబడినవి.

యదువంశ చంద్రుడైన శ్రీకృష్ణ భగవానుడు జన్మించడం, దివ్యలీలలను ప్రదర్శించడం, పూతన, శకటాసురాది రాక్షసులను సంహరించడం, కాళియమర్దనం, గోవర్ధనోద్ధరణం, నందగోకులాన్ని విడిచి, బలరామునితో సహా, మథురకు వెళ్లడం, కువలయా పీడమనే ఏనుగునూ, కంసచాణూర ముష్టికాది దుష్టులనూ వధించడం, కాలయవన జరాసంధులను అంతము చేయడం, రుక్మిణీ కల్యాణము, నరకాసురవధ, శిశుపాల దంతవక్త్రాది దుష్టులను శిక్షించడం, కురుక్షేత్ర రణరంగములో అనేకులైన రాజులను అంతము చేయించి, భూభారాన్ని తగ్గించడం, చివరకు బ్రాహ్మణ శాపాన్ని నిమిత్తంగా పెట్టుకొని, తన యాదవ వంశాన్నే నిర్మూలించడం మొదలైన ఘట్టాలెన్నో వర్ణింపబడినవి.

శ్రీకృష్ణుడు అవతారాన్ని చాలించేముందు ఉద్ధవునికి చేసిన తత్త్వబోధ అమూల్యమైనది. వేదాంతసారమంతా నిండియున్న ఆ బోధను ఉద్ధవ గీత అంటారు. మార్కండేయుని దివ్యానుభూతి గురించి చెప్పబడినది. భగవంతుని యొక్క ప్రతి అంగాన్నీ, ఆయుధాన్నీ, ఆశ్రయించిన దేవతల ఆరాధనలు చెప్పబడినవి. భగవానుడు సూర్యరూపంలో నెలకొక సౌరగణముతో లోకాలను సంచరించడం చెప్పబడినది.

ఓ బ్రహ్మవేత్తలారా! శ్రీశుకదేవుని నుండి, నేను విని, స్మరణచేయ గలిగినదంతా మీకు చెప్పాను. భాగవత సారమంతా ఒక్క మాటలో చెప్పాలంటే, కాలు జారినప్పుడు గాని, స్పృహతప్పిగాని, కలలోగాని, ఆపదవచ్చినప్పుడు గాని "హరయేనమః" అని, ఆ పవిత్ర నామాన్ని గట్టిగా ఉచ్చరిస్తే చాలు సకల పాపాలు నశిస్తాయి. ఆ దివ్యనామ మహిమ అలాంటిది. వాసుదేవుని కథలు, గుణగణాలూ ముచ్చటించుకొనే మాటలే మధురమూ మనోహరమూ నిత్యనూతనమూ అయినట్టివి. మిగిలిన మాటలన్నీ వ్యర్థ ప్రలాపాలే. భగవన్నామాన్ని పాడుకొంటూ, వింటూ, వినిపిస్తూ ఉండే సమయమే జీవితమంతటిలోనూ సద్వినియోగంచేయబడిన సమయము. భగవంతుని గురించి తెలియజేయని జ్ఞానము మిణుగురుపురుగులిచ్చే కాంతివంటిది. శ్రీకృష్ణ పదారవిందాల స్మరణయే అమంగళాలను అజ్ఞానాన్నీ సంగదోషాన్నీ తొలగించి, అంతఃకరణశుద్ధినీ, పరమశాంతినీ ప్రసాదించే పవిత్ర సాధనం.

ఈ దివ్యభాగవత పురాణాన్ని భగవానుడు బ్రహ్మకు నాలుగు శ్లోకాల్లో చెప్పాడు. సర్వవేదాంత సారమైన బ్రహ్మస్వరూపమూ, ఆత్మస్వరూపమూ ఇందు చెప్పబడినవి. భగవంతుని ఏ విషయంలోనూ మించిన వారువెవ్వరూ లేరు గనుక అతడు బ్రహ్మము అనబడ్డాడు. అతడే సకల చరాచర వస్తుప్రపంచమంతటా వ్యాపించి యుండడం చేత పరమాత్మ అనబడుతాడు. ఈ రెండు సర్వోత్తమ లక్షణాలు ఇంకెవ్వరియందూ లేనందున, అతడు అద్వితీయుడు. ఆ పరబ్రహ్మతత్త్వాన్ని ఆరాధించి, కైవల్యపదాన్ని పొందడమే ఈ భాగవత పురాణము యొక్క ప్రయోజనము.

భగవంతునియొక్క లీలావైభవ విలాసాలను విస్తారంగా కీర్తించడం, పురాణశ్రేష్ఠమైన ఈ భాగవతములోనే జరిగినది. ఆద్యంతములు లేనివాడును, బ్రహ్మ రుద్రేంద్రాదులచేత ఆరాధింపబడుడును, సర్వమూ తానే అయినవాడూ అయిన, ఆ వాసుదేవునకు నమస్కరిస్తున్నాను.

శ్లో॥ యంబ్రహ్మా వరుణేంద్ర రుద్రమరుతః స్తున్వంతిదివ్యైఃస్తవైః
వేదైఃసాంగపదక్రమోపనిషదైర్గాయంతి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యంయోగినో
యస్యాం తం న విదుః సురాసురగణా దేవాయ తస్మైనమః

సీ॥ సకల గుణాతీతు సర్వజ్ఞు సర్వేశు సకల లోకాధారు నాదిదేవు
పరమ దయారసోద్భాసితు త్రిదశాభి వందిత పాదాబ్జు వనధిశయను
నాశ్రిత మందారు నాద్యంతశూన్యుని వేదాంత వేద్యుని విశ్వమయుని
కౌస్తుభ శ్రీవత్స కమనీయ వక్షుని శంఖచక్ర గదాసి శార్ఙ్గధరుని

ఆ॥ శోభనాకారు పీతాంబరాభిరాము రత్నరాజిత మకుట విభ్రాజమాను
పుండరీకాక్షు మహనీయ పుణ్యదేహు తలతు మతియింతు దేవకీ తనయునెపుడు 50

సకల శాస్త్రార్థ పారంగతుడూ, నిష్కళంకచరితుడూ, దేవతలచే కూడ నమస్కరింపబడువాడూ అయిన శ్రీశుకయోగికి నమస్కరిస్తున్నాను.

హరిః ఓం తత్సత్
ద్వాదశస్కంధము సమాప్తము
శ్రీమద్భాగవత సంగ్రహము సంపూర్ణము
ఓంనమో భగవతే వాసుదేవాయ
ఓం శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

* * *

# ఫలశ్రుతి

శ్రీమద్భాగవతము సర్వోపనిషత్సారము. నదులలో గంగ పవిత్రమైనది. దేవతలలో శ్రీమహావిష్ణువు ఉత్తముడు. విష్ణు భక్తులలో శంకరుడు అగ్రగణ్యుడు. పురాణాలలో శ్రీమద్భాగవతము పవిత్రమైనది. వైష్ణవుల ధనమూ, ధర్మమూ, పరమహంసలైన యతీశ్వరులచే పొందదగిన జ్ఞానమంతా ఈ పురాణములో నున్నది. భగవదారాధనా రూపముగ, భక్తి జ్ఞాన వైరాగ్యాలతో చేయబడే నైష్కర్మ్య మనబడే కర్మలే, ఈ భాగవతంలో చెప్పబడినివి. దీనిని భక్తితో పఠించినవారూ, చర్చించినవారూ, వినినవారూ ముక్తిని పొందుతారు. ఈ గ్రంథాన్ని భక్తితో, ఆదివారంనాడుగాని, ఏకాదశి, ద్వాదశినాడుగాని, మధుర ద్వారక, పుష్కర క్షేత్రములలోగాని. చదివినా, వినినా, సర్వపాపాలు తొలుగుతాయి. దీనిని ఒక బంగారు పీఠం మీద పెట్టి. ఒక యోగ్యునికి దానమిచ్చిననాడు పరమగతిని పొందుతాడు.

శ్లో॥ శ్రీమద్భాగవతం పురాణమమలం యద్వైష్ణవానాం ప్రియం
యస్మిన్ పారమహంస్యమేక మమలం, జ్ఞానం పరం గీయతే ।
యత్రజ్ఞాన విరాగ భక్తి సహితం నైష్కర్మ్యమావిష్కృతం
తచ్ఛృణ్వన్, సుపఠన్, విచారణపరో భక్త్యా విముచ్యేన్నరః ॥

శ్లో॥ కస్మై యేన విభాసితోఽయమతులోజ్ఞాన ప్రదీపఃపురా
తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయ తద్రూపిణా ।
యోగీంద్రాయ తదాత్మనాథ భగవద్రాతాయ కారుణ్యతః
తచ్ఛుద్ధం విమలం విశోకమమృతం సత్యం పరం ధీమహి ॥

పూర్వము కల్పాదియందు బ్రహ్మకు అతులమైన జ్ఞానప్రదీపాన్ని ఏ పరబ్రహ్మ ప్రకాశింపజేశాడో, ఆ పరబ్రహ్మ స్వరూపుడైన నారాయణునిచే నారదమునికి ఏ పురాణ ప్రదీపము అందింపబడినదో ఆ నారదమునిచే ఏది ఉపదేశింపబడినదో, భగవదాత్మకుడైన ఆ వ్యాసునిచే యోగీంద్రుడైన శుకునికి, ఏ పురాణము అనుగ్రహింపబడినదో అట్టి శుద్ధమూ, విమలమూ విశోకమూ, అమృతమూ, పరమసత్యమూ, అయిన శ్రీమన్నారాయణతత్త్వాన్ని ధ్యానము చేయుదము. భాగవతము. గాయత్రియనెడి బ్రహ్మవిద్య. పరమేశ్వరుడైన వాసుదేవునకు నమస్కారములు. సంసార సర్పగ్రస్తుడైన విష్ణురాతుడైన పరీక్షిత్తునకు, భాగవతామృతాన్ని పోసి, ముక్తిని పొందేటట్టు అనుగ్రహించిన శ్రీశుకయోగీంద్రున నమస్కారములు" అని, సూతుడు చెప్పగా. మునులందరూ, పరమానందభరిత మనస్కులై, ఆ పురుషోత్తముని దివ్యచరణారవిందాలను చిత్తమునందు నిలుపుకొని, తమతమ తావులకు నిష్క్రమించారు.

హరిఃఓంతత్సత్. ఓం నమోనారాయణాయ.
ఓంసర్వం శ్రీకృష్ణార్పణమస్తు.
* * *

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00

64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....

65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....

66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం

2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00

3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00

4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00

5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి 63-00

6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00

7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00

8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00

9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00

10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00

11. లలితా సహస్రనామములు 24-00

12. లక్ష్మీ సహస్రనామములు 24-00

13. దుర్గా సహస్రనామములు 24-00

14. ఆంజనేయ సహస్రనామములు 24-00

15. శివ సహస్రనామములు 24-00

16. విష్ణు సహస్రనామములు 24-00

17. గణపతి సహస్రనామములు 24-00

18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00

19. గాయత్రి సహస్రనామములు 24-00

20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00

21. శ్రీరామా సహస్రనామములు 24-00

22. సరస్వతి సహస్రనామములు 24-00

23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00

24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00

25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00

26. సంధ్యావందనం 24-00

27. మంత్రపుష్పమ్ ....

28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00

29. హనుమాన్ చాలీసా 10-00

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | | |
|---|---|---|
| 95. | శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. | రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. | ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. | ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. | లఘుజాతకం | 63-00 |
| 100. | జాతకాలంకారము | 63-00 |
| 101. | మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. | వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. | మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. | కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. | సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. | కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. | తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. | వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. | ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. | మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. | కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. | మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. | నారద సంహిత | 200-00 |
| 114. | పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. | తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. | సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. | రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. | ఛాయాగ్రహములు | 99-00 |
| 119. | జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | | |
|---|---|---|
| 120. | జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 | గ్రహభావ బలములు | 50-00 |
| 122. | కాలచక్రదశ | 50-00 |
| 123. | అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. | జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. | పురోగామి జాతకం | 50-00 |
| 126. | భావార్థరత్నాకరం | 75-00 |
| 127. | భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. | అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | | |
|---|---|---|
| 129. | జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. | ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. | ముహూర్తం | 75-00 |
| 132. | విశిష్ట జాతకములు | 125-00 |
| 133. | భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. | 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. | జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

**రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి**
**శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు**

| | | |
|---|---|---|
| 136. | బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. | బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. | బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. | బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. | భావార్థరత్నాకరము | 100-00 |
| 141. | ముహూర్త చింతామణి | 100-00 |
| 142. | ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. | స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. | శతయోగమంజరి | 50-00 |
| 145. | వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. | దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. | వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. | వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. | వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. | వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. | వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. | అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. | అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. | పంచాంగ వివేకము | 99-00 |
| 155. | వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. | పంచపక్షి శాస్త్రం (కేస్బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | | |
|---|---|---|
| 1. | 40 రోజుల్లో “వాస్తువిద్య” నేర్చుకొనండి | 180-00 |
| 2. | వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. | వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. | మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

| | | |
|---|---|---|
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |
| 54. | దేవుళ్ళు డాట్ కామ్ | 99-00 |
| 55. | గణపతిభాష్యం | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. | నవయోగులు | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | 99-00 |
| 67. | మార్షల్‌ఆర్ట్స్ (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. | చదరంగం | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. | గరుడపురాణం | 40-00 |
| 72. | మాఘపురాణం | 36-00 |
| 73. | శివపురాణం | 36-00 |
| 74. | వైశాఖపురాణం | 36-00 |
| 75. | కార్తీక పురాణం | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | 36-00 |
| 80. | వృక్షదేవతలు | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. | చతుర్వేదములు | 120-00 |
| 84. | నవగ్రహారాధన | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |

| | | |
|---|---|---|
| 87. మానవధర్మములు | | 120-00 |
| 88. వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. సహస్రలింగార్చన | | 120-00 |
| 90. శ్రీ శివగీత | | 120-00 |
| 91. ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 96. కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | | 63-00 |
| 97. దక్షిణావృత శంఖములు | | 63-00 |
| 98. 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | | 36-00 |
| 99. ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | | 270-00 |
| 100. భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | | 99-00 |
| 101. చిలుకూరి బాలాజీచరిత్ర | | 36-00 |
| 102. భగవత్‌స్తుతి | | 63-00 |
| 103. సూర్యోపాసన | | 36-00 |
| 104. కాశీఖండం | | 250-00 |
| 105. దేవీభాగవతం | | 360-00 |
| 106. శ్రీ ఆంజనేయం | | 216-00 |
| 107. ధర్మసందేహాలు | | 216-00 |
| 108. ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | | 250-00 |
| 109. రామాయణం | | 600-00 |
| 110. పోతన భాగవతం | | 900-00 |
| 111. శివమంత్రములు | | 63-00 |

## 8. వైద్య గ్రంథాలు

| | |
|---|---|
| 1. ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. గృహవైద్యసారం | 36-00 |
| 6. హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. ప్రకృతివైద్యం | 36-00 |
| 8. ఆహారం-వైద్యం | 99-00 |

| | | |
|---|---|---|
| 9. | సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. | ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. | ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. | దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. | ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. | అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. | రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. | ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. | ఒబెసిటి | 99-00 |
| 18. | హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. | ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. | ఫుడ్‌థెరపి | 63-00 |
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |

## 9. అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |

